
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజి
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస
అమ్మ శారదా దేవి
గురు వివేకానంద
గురు సాయిబాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళ స్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

Free Gurukul

"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో భాగంగా ఈ పుస్తకాన్ని ద్వారకాధీష్ వాస్తు వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో భాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ద్వారకాధీష్ వాస్తు వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీకృష్ణచంద్రపరబ్రహ్మణే నమః

# గరుడ పురాణం

## పురాణ పరిచయం

గరుడ పురాణం భారతీయ విజ్ఞాన సర్వస్వం. అమరకోశంతో సహా ఎన్నో గ్రంథాలలో 'పురాణం పంచలక్షణం' అనే కనిపిస్తుంది. భాగవతంలో మాత్రం పురాణం దశలక్షణ సమన్వితమని ఇలా చెప్పబడింది :

**సర్గో உస్యాథ విసర్గశ్చ వృత్తి రక్షాంతరాణి చ।**
**వంశో వంశానుచరితం సంఖ్యాహేతు రపాశ్రయః॥**
**దశభిర్ల క్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః ।**
**కేచిత్పంచ విధం బ్రహ్మన్ మహదల్ప వ్యవస్థయా ॥** ***(భాగవతం : 12,7-9,10)***

నిజానికి, ప్రతి పురాణంలోనూ, సర్గ ప్రతిసర్గవంశమన్వంతర వంశానుచరితలనే పంచలక్షణాలంటే ఎక్కువ లక్షణాలే వుంటాయి. ఇక 'గరుడ పురాణం'లో 'భాగవత' కారులు చెప్పిన పదింటి కంటే కూడా ఎక్కువ లక్షణాలున్నాయి.

ఈ పురాణంలో మూడు భాగాలున్నాయి.

**ఆచారకాండ (కర్మకాండ)**
**ప్రేతకాండ (ధర్మకాండ)**
**బ్రహ్మ కాండ (మోక్షకాండ)**

మొదటికాండను పూర్వఖండమనీ చివరి రెండు కాండలనూ కలిపి ఉత్తర ఖండమనీ వ్యవహరిస్తారు. ఈ కాండలొక దాని నుండి మరొకటి విస్తారంగా విభిన్నాంశాలతో వుంటాయి. అధ్యాయాల సంఖ్యలో కూడ పోలిక లేదు.

**ఆచారకాండ - 240 అధ్యాయాలు**
**ప్రేతకాండ - 50 అధ్యాయాలు**
**బ్రహ్మకాండ - 30 అధ్యాయాలు**

ఇక ఆచారకాండలోని అధ్యాయాలలో 14 పురాణ లక్షణాలపై, 48 వైద్యంపై, 61 ధర్మశాస్త్రాలపై, 8 నీతులపై, 13 రత్నశాస్త్రంపై, 43 ఖగోళ, పదార్థతత్త్వ, వ్యాకరణాది విభిన్న విషయాలపై విజ్ఞానాన్ని ప్రసాదిస్తాయి.

ధర్మ లేదా ప్రేతకాండలోని మృతి, జీవాత్మ మరణానంతర ప్రయాణం, కర్మ, కర్మ నుండి విడుదల – అనే విషయాలు కూలంకషంగా చర్చించబడ్డాయి. ఇందులో మరణానికి ముందు కనిపించే శకునాలూ, నరకానికి మార్గమూ, ప్రేత జీవనమూ, నారకీయ శిక్షలూ, స్వప్న శకునాలూ, అపరకర్మకాండాదులూ మరే పురాణంలోనూ లేనంతగా వర్ణింపబడ్డాయి. కర్మకాండ విధింప బడింది. ప్రేతాలు చెప్పిన స్వీయకథలూ ఉన్నాయి. బౌద్ధుల ప్రేతకథ కూడా చెప్పబడడం విశేషం. సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువే పరమశివాదులకు ఈ విషయాలను వివరించడం వల్ల ఇది పరమ పవిత్రత నాపాదించుకున్నది.

శ్రీకృష్ణ గరుడ సంవాదరూపంలోనున్న బ్రహ్మలేదా మోక్షకాండ ఉపాధి, మాయ, అవిద్యలను ఖండించి నిజమైన జ్ఞానాన్ని ప్రతిపాదిస్తుంది. మధ్వాచార్యుల ద్వైతసిద్ధాంతి బలపరుస్తుంది. గయాక్షేత్రం వర్ణనను అనిదంపూర్వంగా ఈ పురాణం చేసింది. తిరుపతి – తిరుమల అనే మాటలనైతే వాడలేదు గాని శ్రీనివాసునీ ఆయన కొలువైన కొండలన్నిటినీ కోనేటి పరంపరతో సహా ఈ పురాణం వర్ణించింది. ఇంకా ఎన్నో ఇతర క్లేశాలకు సంబంధించిన జ్ఞానాన్ని ఈ కాండలు కలిగిస్తాయి.

## గరుడ పురాణంలోని సామాన్య లక్షణాలు :

మిగతా పురాణాల్లో ఎలాగూ వున్నాయి కదా అనో యేమోగాని పురాణ సహజ లక్షణాలపై ఇందులో పెద్దగా శ్రద్ధ కనబఱుపబడినట్లు తోస్తుంది. పూర్వఖండంలోని 240 అధ్యాయాలున్నా ఈ పంచ లక్షణాలు 14 అధ్యాయాలల్లోనే కనిపిస్తాయి. 4,5 అధ్యాయాల్లో సర్గ, ప్రతిసర్గలూ, ఆరవ అధ్యాయాలో దేవతల, ఋషుల వంశాలూ, 87–90 అధ్యాయాల్లో రాజవంశాలూ అదీ మరీ సంక్షిప్తంగా, 54–58 అధ్యాయాల్లో సర్గ, 224వ అధ్యాయంలో సృష్ట్యంతమూ చర్చింపబడ్డాయి. మిగతా అంతా ఈ పురాణానికే ప్రత్యేకమైన సామాజిక లక్షణమే.

గరుడపురాణం వైష్ణవ పురాణమే. విష్ణు సహస్రనామం మరొకటి (అంటే భారతంలో భీష్ముడు చెప్పింది కాక) ఇందులో కనిపిస్తుంది. విష్ణు పంజర స్తోత్రం కనిపిస్తుంది. పాంచరాత్ర సూత్రాలనూ వైష్ణవ సంప్రదాయాన్నీ అనుసరించే ఈ పురాణం కూడా చెప్పబడింది. అయితే పాంచరాత్రాలలో విష్ణువుకి నాలుగు వ్యూహాలే వుండగా ఇందులో తొమ్మిది వ్యూహాలు పేర్కొనబడ్డాయి. అలాగే ఇతర వైష్ణవ పురాణాల్లో విష్ణు రూపాలయిదే వుండగా గరుడ పురాణంలో తొమ్మిది పేర్కొనబడ్డాయి. ***(1–12, 13,14)***

సహజంగానే ఈ పురాణంలో మహావిష్ణువుకే పెద్ద పీట వేయబడింది. ఆయన యొక్క పన్నెండు అవతారాలొకచోటా, ఇరవై రెండు అవతారాలు మరొకచోటా వర్ణింప

బడ్డాయి. ప్రత్యేకంగా మార్కండేయ మహాముని విష్ణువుని పదునాల్గు నామాలతో స్తుతించినట్లు చెప్పబడింది. శ్రవణ కీర్తన స్మరణాది భక్తి మార్గాలను, ఈ పురాణం వర్ణించడం చూస్తే దీనికి భాగవత ప్రభావం గట్టిగానే పడినట్లు తెలుస్తుంది.

ఇది వైష్ణవ పురాణమే గాని ఆ ఒక్క శాఖకే పూర్తిగా అంకితమై పోలేదు. ఇతర దైవాల పూజా విధానాలు కూడా ఇందులో వివరింపబడ్డాయి. పరమశివునిగూర్చి గరుడ పురాణం ఎక్కువగానే చెప్పింది. అలాగే వినాయక, స్కంధ, విశాఖ, దుర్గ సప్తమాతృకల పూజావిధానమూ బోధింపబడినది. బ్రహ్మ, ఇంద్ర, సూర్య, అగ్ని, చంద్ర, వాయుదేవతటల పూజలెలా చేయాలో ఇందు పొందుపరుపబడింది. భైరవ, సూర్య, కృష్ణ, శివ, బ్రహ్మలే అంశాలుగా గల అమృతేశ్వరస్వామి అర్చన గరుడపురాణంలో ప్రతిపాదింపబడింది.

తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి, ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మ బ్రహ్మమున్నగు బ్రహ్మపదార్థ వాక్యాలు కూడా ఈ పురాణంలో వ్యాఖ్యానింపబడ్డాయి.

గరుత్మంతుని పేరనే ఒక పురాణముండాలని విష్ణువు అనుకున్నాడంటే ఆయన అనుగ్రహం మాత్రమే కాక ఈయన గొప్పతనం కూడా వుండాలి కదా! అది చాల వఱకు పురాణంలోనే చెప్పబడింది. ఏవో రెండు మూడు విషయాలను మాత్రం యిక్కడ ప్రస్తావిస్తాను.

హిందూమతానికి మహాశ్రయం కోవెళ్ళు. అటు వున్నది ఇటు లేదు అన్నట్టుగా విష్ణు కోవెలలో వుండేవేవీ శివ కోవెలలో నుండవు. (ఒక్క క్షేత్రపాలకులైన త్రిమూర్తులు తప్ప) కాని గరుడుడు అన్ని కోవెళ్ళలోనూ వుంటాడు. శివాలయాలలోనే అధికంగా కనిపించే నవగ్రహ మంటపం గరుడచిహ్నంపైనే నిర్మింపబడుతుంది. అమ్మవారి గుడులలో కనిపించే పోతురాజు కూడా గరుత్మంతుడి అంశయేనని పెద్దలంటారు. కలియుగంలో హిందూమతానికి పరమాశ్రయమైన తిరుమల క్షేత్రంలో ఆయన పేరనొక కొండయే వుంది. (గరుడాద్రి). గరుడధ్వజం పరమపుణ్యప్రదం. సాగరమధ్యంలో, ఆకాశదేశాన ప్రయాణిస్తున్నవారికి గరుడధ్వజమొక ప్రాణాధారం. అంతవఱకెందుకు స్వామివారి బ్రహ్మోత్సవాలలో గరుడవాహన సంబారానిదే అగ్రతాంబూలం. ఆ రోజు పంచభూతాలు పరవశిస్తాయి. ఇది యాత్రికులకు తెలుస్తుంది. ఆ రోజే ఆకాశంలో గరుడపక్షులు గిరికీలు, ఆకాశంలో సప్తవర్ణాలు గోచరిస్తాయి. ఇది అందరికీ కనిపిస్తుంది. ఇదీ గరుత్మంతుని మాహాత్మ్యం. ఇందుకే వైష్ణవులంతా ఆయనను 'గరుడాళ్వారు' అని మిక్కిలి భక్తితో కొలుస్తారు. అందుకే మహావిష్ణువు గరుడుని పేర ఒక మహాపురాణాన్ని సృష్టించి దానిని భారతీయ విజ్ఞాన సర్వస్వంగా మలచాడు.

కాబట్టే ఇదొక భారతీయ విజ్ఞాన సర్వస్వం. అక్షర జ్ఞానమున్నవారందరికీ ఆవశ్య పఠనీయం.

★



డా॥ యళ్ళాయి నారాయణరావు

# ఇది నా ఊహ మాత్రమే....

*గరుడ పురాణమును ఇంట్లో నిరభ్యంతరంగా ఉంచవచ్చు. పితృకర్మలు జరుపు దినాలలో గరుడ పురాణ శ్రవణము చాలా ప్రశస్తము. ఇంట్లో ఆ గ్రంథముండ కూడదని మాత్రము కాదు....*

అని ఆంధ్ర పౌరాణికులకు ఆరాధ్య దైవం. పౌరాణిక సార్వభౌమ, పురాణోపన్యాస కేసరి, తెలుగువాడికి తెలిసిన ఏకైకక అభినవసూతమహర్షి బ్రహ్మశ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రిగారు తన స్వంత లెటర్ హెడ్‌పై 1-7-2006న పేర్కొంటూ పలువురి సంశయాలకు తెర దించారు.

ఇక ఏ పురాణానికీ ఇలాటి ప్రమాణ పత్రాన్నివ్వవలసి రాలేదే! మిగతా భాషల పౌరాణికసత్తములెవరికీ కూడా ఈ గరుడ పురాణానికి ఇటువంటి వివరణ పత్రమునివ్వవలసి రాలేదేందుకని?

ఎందుకంటే ఒక్క తెలుగువారి ఇళ్ళల్లోనే గరుడ పురాణం చదవకూడదని, ఇంట్లో ఉంచుకోకూడదని పెద్దలు అంటున్నారు. ఈ అప్రకటిత నిషేధానికి ప్రమాణం లేదు. తండ్రులు, తాతలు, ముత్తాతలు అన్నారని అనేసుకోవడమే. ఇలా ఎందుకు జరిగింది? వ్యాస మహర్షి పట్ల అసూయ వల్లనో కోపం వల్లనో ఆయన కూర్చిన గ్రంథాన్ని అప్రతిష్టపాలు చేశారనుకోలేము కదా! ఎందుకంటే ఆయన మనకు దైవసమానుడే. మన మత గ్రంథాలలో సింహభాగం ఆయన ప్రసాదాలే.

ప్రేతఖండం వుంది కాబట్టి 'ఆ' పన్నెండు రోజుల్లో తప్ప ఇంకెప్పుడూ ఈ పురాణాన్ని చదవకూడదు అని చెప్పే పెద్దలు గరుడ పురాణంలో పొందుపరపబడిన మిగతా విషయాలను పట్టించుకోరేమి? మొత్తం పురాణంలో 320 అధ్యాయాలుంటే ఈ 'అందరినీ భయపెట్టిన' ప్రేతఖండం లేదా ప్రేతకాండ 50 అధ్యాయాలలోనే వుంది కదా! మరి మిగతా 270 అధ్యాయాలలో నున్న మహా విషయాన్నెందుకు చదవకూడదు? అసలు ఆ అధ్యాయాలలో ఏముంది?

సర్గవర్ణనం, దేవార్చనం, తీర్థమాహాత్మ్యం, భువన వృత్తాంతము, మన్వంతరం, వర్ణధర్మాలు, ఆశ్రమ ధర్మాలు, దానధర్మం, రాజధర్మం, వ్యవహారం, వంశానుచరితం, వ్రతం, నిదానపూర్వక అష్టాంగ ఆయుర్వేదం, సంస్కృత వ్యాకరణం, ప్రళయం, ధర్మం, కర్మం, కామం, అర్థం, ఉత్తమ జ్ఞానం, విష్ణుదేవుని మాయామయ, సహజ లీలల విస్తార వర్ణనం ఇవన్నీ ఈ పురాణంలో వున్నాయి. వీటిని తెలుగువారికి దూరం చేసి గరుడపురాణమంటే ప్రేతఖండమొక్కటే అనే అపప్రథను ప్రజల హృదయాలలో ముద్రించారు.

శివ, విష్ణు, సరస్వత్యాది రహస్య పూజలున్నాయి. ముఖ్యంగా 'ఖం ఠం ఫం షం గదాయై నమః' వంటి అరుదైన బీజ యుక్త గుప్తమంత్రాలున్నాయి. (1-7) 'హ్రా' గుణింతంలో షడంగన్యాసముంది. విశేషమేమిటంటే గరుడపురాణంలోని సాధనలకు కులగురువు లేదా పురోహితుడు మున్నగువారి అవసరమున్నట్లు చెప్పబడలేదు.

న్యాసానికీ, సంధ్యావందనానికీ అవసరమైన అన్ని మంత్రాలూ బీజక్షరాలతో సహా వున్నాయి. అజ్ఞానాన్నీ, అనైశ్వర్యాన్నీ కూడా పూజించగలిగే సంస్కారమిందులో వుంది.

ముద్రణలో చాలా అరుదుగా కనిపించే అంజలిబద్ధ, వందినీ, హృదయాసక్తాది ముద్రలనెలా ప్రదర్శించి ఆయా దేవతలను ఎలా వశం చేసుకోవాలో ఇందులో వుంది. (1-11)

భీష్ముడు చెప్పినది కాక స్వయంగా శ్రీ మహావిష్ణువు శివునికుపదేశించిన విష్ణుసహస్రనామం గరుడపురాణంలో కనిపిస్తుంది. (1-14). మన దురదృష్టం వల్ల ఈ మహా మంత్రం కూడా విష్ణు పంజరస్తోత్రం (1-13), మృత్యుంజయ మంత్ర జప మహిమ (1-16) వంటి మహా విషయాలతో సహా తెలుగువారికి తెలియకుండా పోయింది. **ఓంజుంసః** అనే మూడక్షరాలతో మృత్యువును జయించగలిగే గొప్ప మంత్రం మృత్యుంజయ మంత్రం. ఇతరత్ర దుర్లభమైన అమృతేశ్వరారాధన, షడంగ పూజా విధానం కలవు. ప్రాణేశ్వరీ విద్యా వుంది. విషానికి మంత్రః-ఔషధ విరుగుడు, గరుత్మంతుని మంత్రాలు ఉన్నాయి.

నిజానికి గరుడపురాణం ఒక మంత్రశాస్త్రం. అరుదైన మంత్రాల మంజూష.

పంచముఖ శివుని పూజా విధానం, త్రిపురేశ్వరీ సాధన, విషదూరక మంత్రలు కలవు. గోపాల మంత్రం దానితో బాటు సాంగోపాంగముగా మిక్కిలి కష్టసాధ్యమైన గోపాలదేవతారాధన విధి చెప్పబడింది. ఇలా వందలకొద్దీ మంత్రాలు, బీజాక్షరాలు, హయగ్రీవ మూలమంత్రం - పూజనావిధి, గాయత్రిమంత్రోపాసన, ఎక్కడా కనిపించని గాయత్రి మంత్ర చతుర్ధపాదం (1-35) వాస్తు నియమాలు, సాముద్రికం, నాడీ ప్రవాహం,

శాలగ్రామ, రత్నశాస్త్రాలు మున్నగు ఎన్నో విషయాలు గరుడపురాణంలో సంపూర్ణంగా చర్చించబడ్డాయి. గారుడీ విద్య గరుడపురాణానికి ప్రత్యేకం.

గరుడపురాణం వైష్ణవ పురాణమేయైనా ఇందులో శివరాత్రి మాహాత్మ్యముంది. (1-24) ఎవరికోగాని తెలియని శివుని అవతారాలున్నాయి. అనేక మంత్రయుక్త వైష్ణవ కవచం, సర్వకామప్రద విద్య, విష్ణు ధర్మాఖ్య విద్య గరుడపురాణంలో ఉపదేశింపబడ్డాయి. వీటిని ఉపాసించువారికి అపజయముండదు. గారుడీ విద్య (1-197) సకల శుభకారకము.

ఆయుర్వేద ప్రకరణంలో రోగాలకు మందులే కాక శృంగార సర్వస్వమే వుంది. మదనకేళిలో ఎంతమందినైనా సంతృప్తిపరచగలిగే మందులు (తయారీ, వినియోగ, అనుపాన విధానాలతో సహా) ఈ పురాణంలో చెప్పబడ్డాయి. అదృశ్య రూపానికీ, ప్రకృతిని స్వల్పంగా జయించడానికి, నిత్యయవ్వనానికీ, పునర్వ్యవనానికీ - ఇలా స్త్రీ, పురుషులు మనసారా కోరుకొనే మరియు చెప్పుకోలేని వాంఛలు తీర్చుకొనే సాధనాలెన్నో వున్నాయి.

దీనిని పురాణంగా పల్లెటూళ్ళలోగాని, పట్టణాలలో చెప్పి రక్తి కట్టించడం కష్టమనే ఒక దురభిప్రాయం ఈ పురాణ రావలసినంత ప్రాచుర్యం రాకపోవడానికి కారణం కావచ్చు. అందువల్ల ఈ పురాణమొకటుందనే విషయాన్నే ప్రజలు పట్టించుకోకపోవడం జరిగినపుడు వ్యాసమహర్షి వ్రాసిన పురాణం కనుమరుగైపోతుందనే భయంతో ప్రేతఖండాన్ని మాత్రమే బయటకు తెచ్చి దానిని అపరకర్మ జరిగే రోజులలో పఠించాలని విధించి వుండవచ్చు. కాలక్రమాన గరుడపురాణం గురించి ఎవరైనా "ఇది నాకు పూర్తిగా కావాలి" అని అడిగినా అలసత్వం కొద్దీగాని, దుర్వినియోగమవుతుందనే భయం కొద్దిగాని సంస్కృతంలో వున్న దానిని తెలుగులోకి మన పండితులు తీసుకొనిరాకపోయి వుండవచ్చు. అందుకే తెలుగులో సంపూర్ణ గరుడపురాణం కనబడుట లేదు. చివరికి ఈనాడు భగవంతుని పట్ల పూర్తి విశ్వాసం వున్నవాడు దేనికీ భయపడడు అనే ఋషి వాక్యాన్ని సార్థకం చేస్తూ ఒక పబ్లిషర్, ఒక అనువాదకుడు ఈ మహత్తరమైన పురాణాన్ని తెలుగువారికి అందింపచేసే ప్రయత్నం జరిగింది.

*ఆశీర్వదించండి. నా ఊహ పొరపాటైతే, మిమ్మల్ని బాధిస్తే క్షమించండి.*

డా॥ యళ్ళాయి నారాయణరావు

**అనువాదకుడు**

# విషయసూచిక

## ధర్మకాండ - ప్రేతకల్పం ............................ 567 - 730

శ్రీ

# గరుడ పురాణం

## పూర్వఖండం

## ఆచారకాండ

శ్రీకృష్ణచంద్ర పరబ్రహ్మణేనమః

## విష్ణుభగవానుని మహిమ అవతార వర్ణనం

**భా**రతీయము, వైదికమునగు సాంప్రదాయంలో 'జయ' శబ్దానికి గల ఆధ్యాత్మి కార్థము పురాణమని, మహాభారతమని విజ్ఞులంటారు. ఏ పురాణాన్ని వ్రాయడంగాని చదవడంగాని మొదలు పెట్టినా ముందీశ్లోకాలుండాలి.

*నారాయణం నమస్కృత్య*
*నరంచైవ నరోత్తమం ।*
*దేవీం సరస్వతీం వ్యాసం*
*తతో జయముదీరయేత్ ॥*

నారాయణునికీ, తపశ్శక్తిలో ఆయనతో సమానుడైన నరోత్తముడు నరమహర్షికీ చదువుల తల్లి సరస్వతీ దేవికీ వాఙ్మయాధీశుడు వ్యాసమహర్షికీ నమస్కరించి ఈ జయ గ్రంథమును ప్రారంభించాలి.

*అజమజరమనంతం జ్ఞానరూపం మహాంతం*
*శివమమలమనాదిం భూత దేహాది హీనం ।*
*సకల కరణ హీనం సర్వభూత స్థితం తం*
*హరిమమల మమాయం సర్వగం వంద ఏకం ॥*
*నమస్యామి హరిం రుద్రం బ్రహ్మాణంచ గణాధిపం ।*
*దేవీం సరస్వతీం చైవ మనోవాక్కర్మభిః సదా॥* *(ఆచార...1 /1,2)*

పుట్టుకగాని ముసలితనముగాని లేని కల్యాణ స్వరూపుడు, అనంతుడు, జ్ఞాన స్వరూపుడు, విశుద్ధచారిత్రుడు, అనాదియైన వాడు, పాంచభౌతికశరీరుడు కానివాడు, ఇంద్రియములు లేనివాడు, ప్రాణులలో స్థానముకలవాడు, మాయకు అతీతుడు, సర్వవ్యాపకుడు, పరమ పవిత్రుడు, మంగళమయుడు, అద్వయుడునగు శ్రీహరికి వందనం. మనస్సులో, మాటతో, చేతుల ద్వారా ఆ శ్రీ హరికీ, శివునికీ, బ్రహ్మకీ, గణేశునికీ, సరస్వతీ దేవికీ సర్వదా నమస్కరిస్తుంటాను.

ఇది పురాణ లేఖకుని వచనము.

ఇక గరుడ మహాపురాణ ప్రారంభము నైమిషారణ్యంలో జరిగింది. నిమిష నిమిషానికి పవిత్రత, జ్ఞానము ఏ అరణ్యంలో పెరుగుతాయో అదే నైమిషారణ్యము[1].

అక్కడ లోకకళ్యాణం కోసం వేలాదిమునులు శౌనకుని ఆధ్వర్యంలో సత్రయాగం చేస్తుంటారు. ఇది వెయ్యేళ్ళ పాటు సాగే యజ్ఞం. విశ్వంలోని మునులందరూ, ఆచార్యులందరూ, రాజగురువులందరూ, వ్యాసశిష్యులందరూ తీర్థయాత్రలకు వెళ్ళినపుడల్లా ఇక్కడికి వచ్చి వెళుతుంటారు. శౌనక మహర్షి అడగగానే కాదనకుండా తాము సంపాదించిన జ్ఞానాన్నంతటినీ మాట రూపంలో అక్కడ సమర్పించి వెళుతుంటారు. ఇతరుల ప్రసంగాలను కూడా వినడం వల్ల అక్కడి వారి, అక్కడికే తెంచిన వారిజ్ఞానం నిమిషనిమిషానికీ పెరిగి పోతుంటుంది. అందుకే అది నైమిషారణ్యం[2].

ఒకనాడక్కడికి సర్వశాస్త్రపారంగతుడు, పురాణ విద్యాకుశలుడు, శాంత చిత్తుడు, వ్యాసమహర్షి శిష్యుడు, మహాత్ముడునైన సూతమహర్షి తీర్థ యాత్రలు చేసుకుంటూవచ్చాడు. అక్కడ ఒక పవిత్రాసనంపై కూర్చుని విష్ణుధ్యానంలో మునిగిపోయాడు. క్రాంత దర్శియైన ఈ మహాపౌరాణికుడు తనపై కాలు మోపగానే నైమిషారణ్యమే పులకించిపోయింది. ఆ పులకింత శౌనకమహర్షికి చెప్పకనే చెప్పింది ఎవరో మహానుభావుడు వచ్చాడని. ఆయన వెంటనే కొందరు ఉత్తమ ఋషులను వెంటనిడుకొని సూతమహర్షిని కనుగొని ఆయన కనులు తెఱచునందాక అక్కడే వేచియుండి ఆయనను సగౌరవంగా యాగస్థలికి తోడ్కొని వచ్చాడు. మునులందరూ ఆయనను సేవించి ఆతిథ్యమిచ్చి తమ జన్మను చరితార్థం చేసుకున్నారు.

---

*[1] నైమిశారణ్యమనే మాట సరైనది కాదు.*

*[2] సంస్కృత వ్యాకరణంలో 'ఆదివృద్ధి' అని ఒక ప్రక్రియ వుంది. దీనిని బట్టి పదం మొదటిలో వుండే 'ఇ' 'ఆ పదానికి సంబంధించిన' అనే అర్థంలో 'ఐ' గా మారుతుంది.*
*శివ – శైవ, విష్ణు – వైష్ణవ, నిమిష – నైమిష*

తగిన విశ్రాంతి ఆయనకు లభించినాక శౌనకుడు మరొకమారు ప్రణామం చేసి ఇలా ప్రార్థించాడు: 'హే సూతదేవా! మీరు సర్వజ్ఞులు అందుకే మిమ్మల్ని ప్రార్థిస్తున్నాం. మాకు ఈ విషయాన్ని బోధించండి. దేవతలందరిలోకీ శ్రేష్ఠుడెవరు? సర్వేశ్వరుడెవరు? పూజ్యుడు ధ్యానయోగ్యుడు నెవరు? ఈ జగత్తుకి స్రష్ట, పాలనకర్త, సంహర్త ఎవరు? ఎవరి ద్వారా ఈ సనాతన ధర్మం ప్రవర్తితమగుతున్నది? దుష్ట వినాశకుడెవరు? ఆ దేవ దేవుని యొక్క స్వరూపమెట్టిది?ఈ సంపూర్ణ జగత్తు యొక్క సృష్టి ఏ విధంగాజరిగింది?ఆ దేవదేవుడు ఏ వ్రతాలకు సంతుష్టుడౌతాడు?ఏ యోగం ద్వారా మనిషి ఆయనను పొందగలడు? ఆయన అవతారాలెన్ని? వాటికి వంశపరంపర వుంటే ఎలా వుంటుంది? వర్ణాశ్రమ ధర్మాలను నిర్దేశించి రక్షించేవాడెవరు? హే మహామతీ! వీటినీ, అవసరమైన చోట అన్య విషయాలనూ బోధించి మమ్ము ధన్యులను, జ్ఞానులను చేసి మా జీవితాలను సార్థకాలను చేయండి."

ఒక్క నిముషంపాటు కనులు మూసుకొని ధ్యానం చేసి కనులుతెఱచి చెప్పసాగాడు సూతమహర్షి :

"శౌనకదేవా! ఇతర మునీంద్రులారా! మీరడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానంగా గరుడ పురాణాన్ని వినిపించి నేనూ ధన్యుడనౌతాను.

ఈ గరుడ మహాపురాణము సారభూతము. విష్ణుకథా పరిపూర్ణము. మహాత్ముడు, మహానుభావుడు, తన తపోబలంతో భాగ్యవిశేషంతో విష్ణు భగవానుని వాహనమై ఆయన సామీప్యాన్ని పొందినవాడైన గరుత్మంతుడు కశ్యపమహర్షికి ఈ పురాణాన్ని వినిపించాడు. మా గురుదేవులైన వ్యాసమహర్షి నాకు వినిపించి అనుగ్రహించారు.

దేవతా శ్రేష్ఠుడు శ్రీమన్నారాయణుడే. ఆయనే పరబ్రహ్మ; ఆయనే పరమాత్మ. ఆయన ద్వారానే ఈ జగత్తు ఉత్పత్తి, స్థితి, సంహారాలు జరుగుతున్నాయి. ఆయన జరామరణ రహితుడు. భగవంతుడైన ఆ వాసుదేవుడు జన్మ అనగా పుట్టుకలేని వాడైనా జగద్రక్షకై సనత్కుమారాదిగా ఎన్నో రూపాల్లో అవతరిస్తుంటాడు.

మునులారా! ఆ పరమాత్మ మొట్టమొదట కౌమార సర్గులుగా★ అవతరించాడు. అప్పుడే కఠోర బ్రహ్మచర్య వ్రతాన్నవలంబించి దాని గొప్పదనాన్ని వేదాలతో సహాలోకానికి చాటి చెప్పాడు. రెండవ అవతారంలో యజ్ఞేశ్వరుడైన ఆ శ్రీహరియే వరాహ శరీరాన్ని ధరించి హిరణ్యాక్షునిచే రసాతలంలో ముంచి వేయబడ్డ పృథ్విని ఉద్ధరించి స్థితి కారకుడైనాడు. మూడవ అవతారం ఋషి. నారదుడను పేరుతో జన్మించి 'సాత్వతతంత్ర'

---

★ *సనక, సనందన సనత్కుమార, సనత్సుజాతులు కౌమారసర్గులు*

(నారద పాంచరాత్ర) బోధనను చేశాడు. ఇందులో నిష్కామకర్మను గూర్చి చెప్పబడింది. నాలుగవది 'నరనారాయణ' అవతారం. ఇందులో శ్రీహరి ధర్మరక్షకోసం కఠోరతపస్సు చేశాడు. దేవతలూ దానవులూకూడా నరనారాయణ మహర్షులను ఆరాధించారు. అయిదవ అవతారంలో శ్రీహరి కపిలనామంతో సిద్ధులలో సర్వశ్రేష్ఠునిగా జనించి కాలగర్భంలో కలిసి పోయిందనుకున్న సంఖ్యాశాస్త్రాన్ని సముద్ధరించి ప్రపంచానికి ప్రసాదించాడు.

ఆరవ అవతారం దత్తాత్రేయుడు అత్రి మహర్షి అనసూయ దంపతులకు ఒకప్పుడిచ్చిన వరాన్ని పురస్కరించుకొని శ్రీహరి వారికి పుత్రునిగా జన్మించి కొన్నివందల మందికి జ్ఞానోపదేశాన్నిచ్చాడు. ముఖ్యంగా అలర్కమహారాజుకీ, ప్రహ్లాదునికీ బ్రహ్మ విద్యను పదేశించాడు. ఏడవ అవతారం యజ్ఞదేవనామకం. శ్రీమన్నారాయణుడు రుచి ప్రజాపతి ఆకూతి దంపతులకు మన స్వాయంభువ మన్వంతరంలోనే జన్మించి ఇంద్రాది దేవగణాలచే అద్భుతమైన యజ్ఞాలను చేయించి,అందరికీ వాటి పద్ధతిని బోధించి యజ్ఞదేవుడను పేర పూజలందుకున్నాడు. ఎనిమిదవ అవతారంబుషభదేవుడు.కేశవుడే నాభి,మేరుదేవి దంపతుల పుత్రునిగా జనించి స్త్రీలకు పరమాదర్శంగా గృహస్థాశ్రమాన్ని నిర్దేశించి, నియమాల నేర్పఱచి సర్వాశ్రమాలచేత నమస్కరింపబడేటంత శ్రేష్ఠంగా గృహస్థాశ్రమన్ని సిద్ధముచేశాడు.

ఋషులు ప్రార్థించగా లక్ష్మీనాథుడు పృథు మహారాజుగా పుట్టి గోరూపంలో నున్న పృథ్వినుండి దుగ్ధమునువలె అన్నాదికములనూ ఔషధరాశులను పిండి, పితికి మానవ జాతికి ప్రసాదించాడు. ఇది ఆయన తొమ్మిదవ అవతారమయింది.

భగవంతుని పదవ అవతారము మత్స్యావతారం. చాక్షుష మన్వంతరం చివర్లో ప్రళయం వచ్చినపుడు విష్ణువొక బ్రహ్మాండమైన చేపరూపమును ధరించి భూమినే నావగా మార్చి వైవస్వతమనువును ప్రాతినిధ్య జీవరాశులతో సహా అందులోకి రమ్మని ఆదేశించి ఆ పడవ మునిగిపోకుండా కాపాడి సృష్టిని రక్షించాడు.

కూర్మావతారం మహావిష్ణువుయొక్క పదకొండవ అవతారం. క్షీరసాగర మథనవేళ మందర పర్వతం మునిగిపోకుండా కాపాడి అమృతాన్ని తేవడం కోసం వైద్యశాస్త్రాన్ని ప్రపంచానికి ప్రసాదించడం కోసం, దేవతలను తన్ని అమృతాన్ని లాక్కున్న దానవులను మురిపించి, మరిపించి అమృతాన్ని సన్మార్గులైన దేవతలకీయడం కోసం క్రమంగా ఆదికూర్మ, ధన్వంతరి, మోహినీ అవతారాలను మహావిష్ణువే ఎత్తవలసి వచ్చింది.

పదునాల్గవదైన నృసింహావతారంలో శ్రీ మహావిష్ణువు హిరణ్యకశిపుని బారినుండి ప్రహ్లాదునీ, సకల లోకాలనూ రక్షించాడు. పదిహేనవదైన వామనా★వతరణంలో బలిచక్ర

★ *అవతరణమనగా దిగుట. కాబట్టి 'వామనావతరణ' పద ప్రయోగం దోషం కాదు.*

వర్తిని పాతాళానికి పంపించి అంతవఱకు అతని ఆక్రమణలోనున్న ముల్లోకాలనూ దేవేంద్రుని న్యాయ, సక్రమ, వైదిక పాలనలోనికి తెచ్చాడు. పదహారవదైన పరశురామనామక అవతారంలో శ్రీ మహావిష్ణువు బ్రాహ్మణద్రోహులై లోకకంటకులుగా దాపురించిన క్షత్రియులను సంహరించాడు. ఆపై పదిహేడవదైన వ్యాసనామక అవతారంలో ఆయన పరాశరునికి సత్యవతి ద్వారా జన్మించి వేదాలను సంస్కరించి, పరిష్కరించి, బోధించి జనంలోకి తెచ్చాడు. శ్రీమహావిష్ణువు దానవసంహారానికై కౌసల్యా దశరథుల పుత్రుడై శ్రీరాముడను పేర అవతరించి రావణ సంహారం దేవతల ఉద్ధరణ గావించాడు. ఆయన యొక్క పందొమ్మిదవ, ఇరువదవ అవతారాలు బలరామ, శ్రీకృష్ణులు. ఈ అవతారాలలో స్వామి దుష్టశిక్షణ, శిష్టరక్షణ తాను చేయడమే కాక తన వారిచేత దగ్గరుండి చేయించాడు. దానవాంశతో పుట్టిన మానవులు లక్షల సంఖ్యలో మడిసిపోగా భూ భారం తగ్గింది. త్వరలోనే శ్రీహరి కీకట దేశంలో జినపుత్రునిగా 'బుద్ధ' నామంతో జనించి దేవద్రోహులను మోహంలో ముంచెత్తి లోకాలను రక్షిస్తాడు. ఇది ఆయన ఇరవై ఒకటవ అవతారం. ఇరవైరెండవ అవతారం కలియుగం ఎనిమిదవ సంధ్యలో రాబోతోంది. రాజవర్గం సమాప్తమై అరాచకం చెలరేగినపుడు శ్రీహరి విష్ణుయశుడను బ్రాహ్మణునింట 'కల్కి' అనే పేరుతో అవతరించి లోకాన్ని చక్కబరుస్తాడు.

ఇవికాక ఇంకా అసంఖ్యాక సందర్భాలలో శ్రీమహా విష్ణువు భూమిపై అవతరించాడు. మనువులుగా జాతిచరిత్రగతిని మార్చగలిగే మహర్షులుగా ఆయనే ఉద్భవించాడు. విష్ణు విభూతులుగా పేరొందిన ఈ అంశాలనే మా గురువుగారు వేదవ్యాస భగవానులు మాతో గరుడ మహాపురాణమను పేరిట అధ్యయనం చేయించారు." ***(అధ్యాయం - 1)***

# గరుడ పురాణ వక్తృ -శ్రోతృ పరంపర విష్ణు స్వరూపవర్ణన, గరుడునికి పురాణసంహిత వరదానం

**శౌ**నకాది మహామునులు ఈ గరుడ మహాపురాణమును ఆమూలాగ్రము వినాలని వుందని అత్యంత ఉత్సుకతతో వేడుకోగా పరమపౌరాణికుడైన సూతమహర్షి ఇలా ప్రవచించసాగాడు.

"బదరికాశ్రమంలో నొకనాడు వ్యాసమునీంద్రులు పరమాత్మ ధ్యానంలో వుండగా గమనించి నేనక్కడే ఆయన ఆసన సమీపంలోనే నేలపై కూర్చుండి పోయాను. ఆయన కనులు తెరువగానే ప్రణామం చేసి ఇలా ప్రార్థించాను.

'గురుదేవా! మీరు పరమేశ్వరుడు భగవానుడునైన శ్రీహరి స్వరూపాన్ని జగత్ సృష్ట్యాదులనీ నాకు బోధించండి. మీరింతసేపూ ఆ పరమపురుషుని ధ్యానంలోనే ఆయనను దర్శించగలిగారనీ కూడ నాకు అవగతమైనది. అన్నాను. ఈలోగా మిగతా శిష్యులు కొందరు మునీంద్రులు అక్కడకు చేరారు. వ్యాసమహర్షి మాతో 'నాయనలారా' నాకు ధ్యానంలో గోచరించేది శ్రీమహావిష్ణువే. ఆయన గూర్చి చెప్పగలవాడు చతురాననుడు బ్రహ్మదేవుడే. ఆయన మాకు అనుగ్రహించిన గరుడమహాపురాణాన్ని మీకు చెప్పడానికి ప్రయత్నిస్తాను.

ఒకమారు నారదుడు, దక్షప్రజాపతి, భృగుమహర్షి, [1] నేనూ సత్యలోకానికి వెళ్ళాము ఆదిబ్రాహ్మణుడు, గురువులకే గురువు, సృష్టికర్తయైన ఆ దేవదేవునికి ప్రణామం చేసి హే దేవ దేవేశ! సర్వ వేదసారము, సర్వజ్ఞాన పారమూ మీరే! మాకు సారతత్త్వాన్ని అనుగ్రహించండి' అని ప్రార్థించాం.

'సర్వశాస్త్రసారభూతము గరుడ మహాపురాణము. ప్రాచీన కాలంలో శ్రీ మహావిష్ణువు [2] నాకూ, శివునికీ, అన్యదేవతలకూ దీనిని వినిపించాడు, అంటూ బ్రహ్మ ఆ సందర్భాన్ని ఇలా వివరించాడు.

ఒకమారు ఇంద్రాది దేవతలతో కలిసి శివదర్శనానికై నేను కైలాసానికి వెళ్ళాను. అక్కడ పరమశివుడు పరమభక్తితో ఎవరినో ధ్యానించడం చూసి ఆశ్చర్యపోయాను. ఆయన కనులు తెఱచి మమ్ము చూడగానే ప్రణామం చేసి 'హే సదాశివా! మీరు ఇంకొక దేవుని ధ్యానిస్తున్నట్లు మాకు అనిపించింది. మీ కంటె గొప్ప దేవుడు వేరొకరున్నారని మాకింత వరకూ ఎవరూ చెప్పలేదు. మీరే ధ్యానించదగ్గ పరమ దేవతా స్వరూపముంటే, మమ్ము కరుణించి ఆ పరమసారతత్త్వాన్ని మాకూ అనుగ్రహించండి' అని అడిగాను.

'బ్రహ్మాది దేవతలారా! నేను సర్వఫలదాయకుడూ, సర్వవ్యాపీ, సర్వరూపుడూ, సర్వ ప్రాణి హృదయవాసీ, పరమాత్మా, సర్వేశ్వరుడూనగు విష్ణుభగవానుని సదా ధ్యానిస్తుంటాను. బ్రహ్మదేవా!ఆ స్వామి ఆరాధనలో భాగంగానే ఎల్లవేళలా భస్మాన్నీ, జటా జూటాన్నీ ధరించి నిరంతర వ్రతాచరణ నిరతుడనైవుంటాను. ఎవరైతే సర్వవ్యాపకుడూ,అద్వైతుడూ, జయశీలుడూ, నిరాకారుడూ, సాకారుడూ, పద్మనాభుడూ, నిర్మల విశుద్ధ పరమహంస స్వరూపుడూ అయి వుండి తాను వెలుగుతూ విశ్వాన్ని వెలిగిస్తూన్నాడో ఆ పరమ పదపర మేశ్వర భగవానుడైన శ్రీహరిని నేను ధ్యానిస్తున్నాను. ఈ విష్ణు సారతత్త్వాన్ని ఆయన వద్దకే పోయి తెలుసుకోవాలి పదండి'అన్నాడు పరమేశ్వరుడు. ఆయన ఇంకా ఇలా చెప్పాడు.

---

[1]వ్యాసమహర్షి ; [2] బ్రహ్మకీ

'సంపూర్ణ జగత్తంతా ఆయనలోనే ప్రళయ కాలంలో ప్రవేశిస్తుంది. అందుకే మీతో నాతో సహా అందరికీ శరణ్యుడాయనే. నేను ఆయన చింతనలోనే మగ్నుడనై వుంటాను కాబట్టి మీకు జ్ఞానిగా గోచరిస్తున్నాను. ఒకే సూత్రంలో గ్రుచ్చబడిన మణులలాగ మనమంతా సత్త్వరజస్తమోగుణములతో సహా ఆ సర్వేశ్వరుని యందే ఉన్నాము. సహస్రముఖుడు, సహస్రాధి కభుజుడు, సూక్ష్మత కన్నా సూక్ష్ముడు, స్థూలత కన్నా స్థూలుడు, గురువులలో ఉత్తముడు, పూజ్యులలో పూజ్యతముడు, శ్రేష్ఠులకే శ్రేష్ఠుడు, సత్యాలలో పరమ సత్యము, సత్యకర్ముడు, పురాణాలలో స్తుతింపబడు పురాణపురుషుడు, ద్విజాతీయులలో బ్రాహ్మణోత్తముడు, ప్రళయ కాలంలో సంకర్షణునిగా కీర్తింపబడ్డ వాడునగు ఆ పరమ ఉపాస్యునే నేను ఉపాసిస్తున్నాను.

సత్ అసత్ రూపాలకు ఆవల, సత్య స్వరూపుడై,* ఏకాక్షర ప్రణవానికి మూలమై దేవ, యక్ష, రాక్షస, నాగ గణాలచే అర్చింపబడు విష్ణువునే నేనూ అర్చిస్తాను.

కొలనిలో చిన్న చిన్న చేపలు కదలాడుతున్నట్లు ఈ జగాలన్నీ మనతో సహా ఆ విశ్వరూపునిలోనే కదలాడుతుంటాయి. ముఖంలో అగ్ని, మస్తకంలో ద్యులోకం, నాభిలో ఆకాశం, చరణాలపై భూమి, కన్నులలో సూర్య చంద్రులూ గల విశ్వరూపం ఆయనది. ఉదరంలో స్వర్గం, మర్త్యలోకం, పాతాళం, భుజాలలో సమస్త దిశలు, ఉచ్ఛ్వాసంలో వాయువు, కేశపుంజంలో మేఘాలు,అంగ సంధులలో నదులు, కుక్షిలో సముద్రాలు ఎవరికైతే నిలచి వుంటాయో ఆ విశ్వరూపుడే నాకు దేవుడు. జగత్తునకు ఆదియైన అనాది తత్త్వమాయనది. అట్టి నారాయణునికి నమస్కారము. ఏ పురాణ పురుషుని నుండి సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితలు ప్రవర్తితాలయినవో ఆ పరమాత్మ వద్దకేపోయి పరమ సారతత్త్వజ్ఞానమును పొందవలసివున్నది' అంటూ పరమశివుడు కూడా మాతో విష్ణువు వద్దకు బయలుదేరాడు.

వ్యాసమునీంద్రా! ఆ రోజు పరమశివునితో కలిసి మేమంతా శ్వేత ద్వీపం చేరుకొని అక్కడనున్న విష్ణు భగవానుని దర్శించి ప్రణామంచేసి స్తుతులొనర్చాం. పరమసారతత్త్వ స్వరూపుడగు విష్ణువు ద్వారానే ఆ పరమతత్త్వముయొక్క సారాన్ని వినడానికి మేమంతా వేచివుండగా పరమేశ్వరుడు మా అందరి తరఫునా మహా విష్ణువునిలా ప్రార్థించాడు. హే దేవేశ్వరా! హరే! దేవాధిదేవుడెవరో పరమేశ్వరుడెవరో, ధ్యేయుడెవరో, పూజ్యుడెవరో, ఈ పరమతత్త్వాన్ని ఏ వ్రతాల ద్వారా సంతుష్టపఱచగలమో, ఏ ధర్మం ద్వారా ఏ నియమాన్ని పాటించి ఏ పూజలు చేసి ఏయే ఆచరణలను అనుసంధించి ఆ పరమాత్మను ప్రసన్నం

* ఓంకారం

చేసుకోగలమో తెలిస్తే అదే నిజమైన జ్ఞానం. ఆయన స్వరూపమెట్టిది, ఏ దేవుని ద్వారా ఈ జగత్తు సృష్టింపబడింది, దీనిని పాలించేదెవరు, ఆయన ఏయే అవతారాలనుధరించి ఈ పనిని చేస్తాడు, ప్రళయ కాలంలో ఈ విశ్వం ఎవరిలో కలసి పోతుంది, సర్గలు, ప్రతిసర్గలు, వంశాలు, మన్వంతరాలు ఏ దేవుని ద్వారా ప్రవర్తిత మవుతాయి. ఈ దృశ్యమాన జగత్తంతా ఏ దేవునిలో ప్రతిష్ఠితమై వుంది,– ఈ విషయాలన్నిటినీ తెలిపేదే నిజమైన జ్ఞానం, సత్యమైన సారతత్త్వం. నేను ఆ జ్ఞానానికి జిజ్ఞాసువుని. వీరంతా ఆ తత్త్వానికి అన్వేషకులు. మా అందరికీ పరమేశ్వర మాహాత్మ్యాన్నీ ధ్యానయోగాన్నీ కూడా విని తరించాలని వుంది. దయచేసి మమ్ము కృతార్థులను చేయండి'.

అప్పుడు భగవానుడైన విష్ణువు శివునికి పరమాత్మ మాహాత్మ్యాన్నీ, ఆయన ప్రాప్తికి సాధన భూతమైన ధ్యానాన్నీ, యోగాదిక నియమాలనూ, అష్టాదశ విద్యలలో విరాజమాన మైన జ్ఞానాన్నీ ఈ విధంగా ప్రసాదించాడు.

రుద్రదేవా, బ్రహ్మాది దేవతలారా! నేనే అందరు దేవతలకూ ఆరాధ్యదైవాన్ని. సర్వలోకాలకీ స్వామినీ నేనే. దేవమానవాది జాతులన్నిటికీ ధ్యేయాన్ని, పూజ్యాన్నీ, స్తుతియోగ్యుడనూ నేనే. రుద్రదేవా! మనుష్యులచేత పూజలందుకొని వారికి పరమగతిని ప్రాప్తింపజేసేదీ, వ్రత నియమ, సదాచార, సదాచరణలచే సంతుష్టుడనై వారి మనోరథాలను నెరవేర్చేదీ నేనే. నేనే ఈ సృష్టికి మూలాన్ని, స్థితికి కారకుణ్ణి, దుష్ట నాశకుణ్ణి, శిష్టరక్షకుణ్ణి. నేనే మత్స్యాది రూపాలతో అవతరించి అఖిల భూమండలాన్నీ పాలిస్తుంటాను. మంత్రాన్నీ నేనే, దాని అర్థాన్నీ నేనే. పూజవల్ల, ధ్యానం ద్వారా ప్రాప్తించే పరమతత్త్వాన్ని నేనే. స్వర్గాదులను సృష్టించినది నేనే – ఆ స్వర్గాదులూ నేనే. యోగినీ యోగాన్నీ ఆద్యయోగాన్నీ పురాణాన్నీ నేనే. జ్ఞాతను, శ్రోతనూ, మనన కర్తనూ కూడా నేనే. సంభాషింపబడు విషయాన్నీ, సంభాషించే వ్యక్తినీ నేనే. ఈ జగత్తును నేనే. అందులోని సమస్త పదార్థాలూ నా స్వరూపాలే. భోగ, మోక్షప్రదాయకమైన పరమ దైవాన్ని నేనే. ధ్యానం, పూజ, వాటి ఉపచారాలు, సర్వతోభద్రాది మండలాలు నేనే. హే శివాది దైవతములారా! నేనే వేదాన్ని. ఇతిహాసస్వరూపుడను, సర్వజ్ఞానమయుడను, సర్వలోకమయుడను, బ్రహ్మాది దేవతల ఆత్మ స్వరూపుడను నేనే. సాక్షాత్ సదాచారాన్నీ, ధర్మాన్నీ, వైష్ణవాన్నీ, వర్ణాశ్రమాన్ని వాటి వెనుక నున్న సనాతన ధర్మాన్నీ నేనే. యమ నియమాలూ, వ్రతాలూ, సూర్య చంద్ర మంగళాది గ్రహాలూ నేనే.

ప్రాచీన కాలంలో పక్షిరాజైన గరుత్మంతుడు గొప్పతపస్సు ద్వారా నన్నారాధించాడు. అతని తపస్సువల్ల సంతుష్టుడనై సాక్షాత్కరించి 'నీకేం కావాలో కోరుకో' అన్నాను.

'దేవదేవా! నాగులు నా తల్లిని దాసిగా చేసుకున్నారు. ఆమెను ఆ దాసీత్వగ్రహణం నుండి విడిపించడానికి అమృతం కావాలి. మీరు నాకు వరమిస్తే నేను అవసరమైన వారిని గెలిచి నా తల్లికి దాస్య విముక్తిని గావించి వచ్చి మీ వాహనంగా శాశ్వతంగా నిలచిపోతాను. మీరు వరమిస్తే మహాబలశాలిగా, మహాశక్తిశాలిగా, సర్వజ్ఞునిగా, పురాణ సంహిత రచనాకారునిగా మీ సన్నిధిలోనే వుంటూ మిమ్మల్ని సేవించుకుంటూ ప్రపంచానికీ మేలు చేయగలుగుతాను ఇదే నా ప్రార్థన' అని వరంకోరుకున్నాడు గరుత్మంతుడు.

అప్పుడు ★నేను ఇలా ఆశీర్వదించాను. 'ఓ పక్షిరాజా! నీవడిగిన వరం నీకు సంపూర్ణంగా లభిస్తుంది. నాగదాస్యం నుండి నీ తల్లి వినతకు విముక్తి లభిస్తుంది. దేవతల నందరినీ ఓడించి అమృతాన్ని అవలీలగా సాధించి తేగలవు. అత్యంత శక్తిసంపన్నతను కూడా సాధించి నా వాహనానివి కాగలవు. అన్ని రకాల విషాలనూ విరిచి వేసే శక్తి కూడా నీకుంటుంది. నా కృప వల్ల నీవు నా గాథలనే సంహితరూపంలో ప్రవచనం చేస్తావు. నా స్వరూప మాహాత్మ్యాలే నీవి కూడా అవుతాయి. నా గురించి నీవు ప్రవచించే పురాణ సంహిత నీ పేరిటనే 'గరుడ పురాణ' మను పేరుతో లోకంలో ప్రసిద్ధమవుతుంది.

ఓయి వినతాసుతా! దేవగణాలలో ఐశ్వర్యానికీ శ్రీరూపానికీ నాకున్న విఖ్యాతియే పురాణాలలో నీ యీ గరుడపురాణాని కుంటుంది. విశ్వంలో నా సంకీర్తనజరిగేప్రతి చోటా నీ కీర్తన కూడా జరుగుతుంది. ఇక నీవు నన్ను ధ్యానించిఆ పురాణ ప్రణయనాన్ని గావించు'

ఇంతవఱకూ చెప్పి మహావిష్ణువు ఇంకా ఇలా అన్నాడు. 'పరమశివా! నా ద్వారా గ్రహించినగరుడ పురాణాన్ని గరుడుడు కశ్యప మహర్షికి వినిపించాడు. కశ్యపుడీ పురాణాన్ని వినడం వల్లఅబ్బిన గారుడీవిద్యా బలం వల్ల ఒక కాలిపోయిన చెట్టునుతిరిగి బ్రతికించ గలిగాడు. గరుడుడు కూడా ఈ విద్య ద్వారా అనేక ప్రాణులను పునర్జీవితు లను చేశాడు.

★***యక్షి ఓం ఉం స్వాహా*** అనే మంత్రాన్ని జపిస్తే గారుడీ పరావిద్యను పొందే యోగ్యత లభిస్తుంది. రుద్రదేవా! నా స్వరూపంచే పరిపూర్ణమైన, గరుడుని జ్ఞానముఖం ద్వారా వెలువడిన గరుడ మహాపురాణాన్ని మీరూ వినండి. ***(అధ్యాయం - 2)***

---

★ *'నేను' అనగా విష్ణువు*

★ *'యక్షి ఓc ఉం స్వాహా' గానే దీన్ని పఠించాలి. అంటే ఓ తరువాత గల 'సున్న'ని సగమే పలకాలి.*

# గరుడ పురాణంలో ప్రతిపాదించబడిన విషయాలు

"శౌనక మునీంద్రా! సాక్షాత్తు మహావిష్ణువు నుండి శివ, బ్రహ్మ దేవాది దేవులు, బ్రహ్మ ద్వారా మా గురువుగారు వ్యాసమహర్షి, ఆయన అవ్యాజానుగ్రహం వల్ల నేను వినగలిగిన గరుడ పురాణాన్ని నా భాగ్యంగా భావించి ఈ పవిత్ర నైమిషారణ్యంలో మీకు వినిపిస్తున్నాను.

ఇందులోని వివిధ అంశాలేవనగా సర్గ వర్ణనం, దేవార్చనం, తీర్థమాహాత్మ్యం, భువన వృత్తాంతము, మన్వంతరం, వర్ణ ధర్మాలు, ఆశ్రమధర్మాలు, దానధర్మం, రాజధర్మం, వ్యవహారము, వంశానుచరితము, వ్రతం, నిదానపూర్వక అష్టాంగ ఆయుర్వేదం, ప్రళయం, ధర్మం, కర్మం, కామం, అర్థము, ఉత్తమజ్ఞానం, ముఖ్యంగా విష్ణుభగవానుని మాయామయ, సహజలీలల విస్తార వర్ణనం.

వాసుదేవుని కరుణచే గరుత్మంతుడు ఈ గరుడమహాపురాణోపదేష్టగా అత్యంత సామర్థ్యాన్ని చూపించాడు. విష్ణు వాహనంగా ఈ సృష్టి, స్థితి, ప్రళయకార్యాలలో కూడా పాలుపంచుకొంటున్నాడు. దేవతలను జయించి, అమృతాన్ని తెచ్చి యిచ్చి తన తల్లి దాస్య విముక్తి కార్యాన్ని కూడా సఫలం చేసుకోగలిగాడు.

విష్ణు భగవానుని ఉదరంలోనే అన్ని భువనాలూ ఉంటాయి. అయినా ఆయనకు ఆకలి వేస్తే గరుడుడే దానిని తీర్చాలి. హరి శివాదులకూ, హరిరూపుడైన గరుడుడు కశ్యపమహర్షికీ చెప్పిన ఈ పవిత్రపురాణం తనను ఆదరంగా చదివే వారికి అన్నిటినీ ప్రసాదించగలదు. వ్యాసదేవునికి మరొక్కమారు నమస్కరించి పురాణాన్ని ప్రారంభిస్తున్నాను.

*(అధ్యాయం - 3)*

# సృష్టి - వర్ణనం

'హే జనార్దనా! సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితములన్నిటినీ విస్తారపూర్వకంగా వర్ణించండి' అని పరమేశ్వరుడు ప్రార్థించాడు.

ఖగవాహనుడు కాల కంఠాదుల కిలా చెప్పసాగాడు :

'పరమేశ్వరా! ★సర్గాదులతో బాటు సర్వపాపాలనూ నశింపజేయు సృష్టి, స్థితి, ప్రళయ స్వరూపమైన విష్ణు భగవానుని సనాతన క్రీడను కూడా వర్ణిస్తాను, వినండి.

★ *సర్గయనగా సృష్టిలో నొక దశ. ఒక మెట్టు.*

నారాయణ రూపంలో ఉపాసింపబడుతున్న ఆ వాసుదేవుడే ప్రకాశస్వరూపుడైన, అనగా కనబడుతున్న, పరమాత్మ, పరబ్రహ్మ, దేవాధిదేవుడు. సృష్టి స్థితిలయాలకు కర్త ఆయనే. ఈ దృష్టాదృష్టమైన జగత్తంతా ఆయన వ్యక్తావ్యక్తమైన స్వరూపమే. ఆయనే కాలరూపుడు, పురుషుడు. బాలురు బొమ్మలతో క్రీడించినట్లాయన లోకంతో క్రీడిస్తాడు. ఆ లీలలను వర్ణిస్తాను వినండి. అంటే ఇవన్నీ నా లీలలే.

జగత్తుని ధరించే పురుషోత్తమునికి జగత్తుకున్న ఆద్యంతాలు లేవు. ఆయన నుండి ముందుగా అవ్యక్తమైనవి జనించగా వాటి ఆత్మ[1] ఉత్పత్తి అవుతుంది. అవ్యక్త ప్రకృతి నుండి బుద్ధి, బుద్ధి నుండి మనస్సు, మనస్సు నుండి ఆకాశం, ఆకాశం నుండి వాయువు, వాయువు నుండి తేజం, తేజం నుండి జలం, జలం నుండి పృథ్వి పుట్టాయి.

పరమేశ్వరా! దీని తరువాత నొక బంగారు గుడ్డు పుట్టింది. పరమాత్మ స్వయంగా అందులో ప్రవేశించి సర్వ ప్రథమంగా తానొక శరీరాన్ని ధరిస్తాడు. [2] ఆయనే చతుర్ముఖ బ్రహ్మరూపాన్ని ధరించి రజోగుణ ప్రధానమైన ప్రవృత్తితో బయటికి వచ్చి ఈ చరాచర విశ్వాన్ని సృష్టిచేశాడు.

దేవ, అసుర, మనుష్య సహితమైన ఈ సంపూర్ణ జగత్తు ఆ అండంలోనే వుంటుంది. ఆ పరమాత్మయే స్వయం స్రష్టయగు బ్రహ్మరూపంలో ప్రపంచాన్ని సృష్టిస్తాడు, విష్ణు రూపంలో దాని ఆలనా, పాలనా చూసుకుంటాడు, కల్పాంత కాలంలో రుద్ర రూపంలో దానిని సంపూర్ణంగా లయింపజేస్తాడు. సృష్టి సమయంలో ఆ పరమాత్మయే వరాహరూపాన్ని ధరించి జలమగ్నయైన భూమిని తన కొమ్ముతో తేల్చి ఉద్ధరిస్తాడు. శంకరదేవా! ఇక దేవాదుల సృష్టి యొక్క వర్ణనను సంక్షిప్తంగా తెలియజేస్తాను.

అన్నిటికన్నముందు ఆ పరమాత్మనుండి మహత్తత్త్వం సృష్టింపబడుతుంది. రెండవ సర్గలో పంచతన్మాత్రల – అనగా – రూప, రస, గంధ, స్పర్శ, శబ్దముల – ఉత్పత్తి జరుగుతుంది. దీన్నే భూతసర్గ అంటారు. వీటి ద్వారానే పంచమహాభూతములైన నేల, నీరు, ★నిప్పు, గాలి, నింగి సృష్టింపబడతాయి. మూడవది వైకారిక సర్గ. కర్మేంద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ ఈ దశలోనే పుడతాయి కాబట్టి దీనిని ఐంద్రిక సర్గయని, బుద్ధి దశ కూడా ఇదే అవుతుంది. కాబట్టి దీన్ని ప్రాకృత సర్గయని కూడా అంటారు. నాలుగవది

---

*[1] తరువాత ఆయన నుండియే, [2] ధరించాడు.*

*★ నిప్పులో అగ్ని, తేజస్సు అంతర్భాగాలు. మండించేదీ కాంతినిచ్చేదీ కూడా నిప్పే.*

ముఖ్య సర్గ పర్వతాలూ, వృక్షాలూ మానవ జీవనంలో ముఖ్య పాత్రను పోషించాలి. అవి సృష్టింపబడే సర్గ కాబట్టి దీనికాపేరు వచ్చింది. అయిదవది *తిర్యక్ సర్గ పశుపక్ష్యాదులు ఈ సర్గలో పుడతాయి. తరువాత ఆరవ సర్గలో దేవతలూ, ఏడవ సర్గలో మానవులూ సృష్టింపబడతారు. వీటిని క్రమముగా ఊర్ధ్వ స్రోతా, అర్వాక్ స్రోతా సర్గలంటారు. దేవతల కడుపులో పడిన ఆహారం పైకీ, మానవులది క్రిందికీ చరిస్తాయి. ఏడవ సర్గ మానుష సర్గ. ఎనిమిదవది అనుగ్రహ నామకమైన సర్గ. ఇది సాత్త్విక తామసిక గుణ సంయుక్తం. ఈ యెనిమిది సర్గలలో అయిదు వైకృతాలనీ, మూడు ప్రాకృత సర్గలనీ చెప్పబడుతున్నాయి. అయితే, తొమ్మిదవదైన కౌమారనామక సర్గలో ప్రాకృత, వైకృత సృష్టులు రెండూ చేయబడతాయి.

రుద్రాది దేవతలారా! దేవతల నుండి స్థావరాల వఱకూ నాలుగు ప్రకారాల సృష్టి జరుగుతుంది. సృష్టి చేసేటప్పుడు బ్రహ్మనుండి ముందుగా మానసపుత్రులు ఉత్పన్ను లయ్యారు. తరువాత దేవ, అసుర, పితృ, మనుష్య సర్గచతుష్టయం వచ్చింది. అపుడు పరమాత్మ జలసృష్టి కార్యంలో సంలగ్నుడైనాడు. సృష్టి కర్మలో మునిగియున్న ప్రజాపతి బ్రహ్మనుండి తమోగుణం పుట్టుకొచ్చింది. కాబట్టి ఆయన జంఘలనుండి రాక్షసులు పుట్టుకొచ్చారు. శంకరా! అప్పుడాయన తమోగుణ యుక్తమైన శరీరాన్ని విడచిపెట్టగా ఆ తమోగుణపు ముద్ద రాత్రిగా మారి నిలబడిపోయింది. యక్షులకీ రాక్షసులకీ అందుకే రాత్రి అంటే చాల ప్రీతి.

తరువాత బ్రహ్మయొక్క సత్త్వగుణ మాత్రవల్ల ఆయన ముఖంనుండి దేవతలుద్భ వించారు. తరువాత ఆయన సత్త్వగుణ యుక్తమైన శరీరాన్ని కూడా విడనాడగా దానినుండి పగలు పుట్టింది. దేవతలకు పగలు ప్రీతి పాత్రం. తరువాత బ్రహ్మయొక్క సాత్త్విక శరీరం నుండి పితృగణాలుద్భవించాయి. బ్రహ్మ ఆ సాత్త్విక శరీరాన్ని వదలిపోయినపుడు అది సంధ్యగా మారింది. ఈ సంధ్య పగటికీ రాత్రికీ మధ్య వచ్చే సమయం. తదనంతరం బ్రహ్మ యొక్క రజోమయ శరీరం నుండి మానవులు పుట్టారు. ఆయన ఆ శరీరాన్ని పరిత్యజించినపుడది జ్యోత్స్న - అనగా ప్రభాత కాలంగా మారింది. అదే ఉదయ సంధ్య. ఈ రకంగా జ్యోత్స్న, పగలు, సంధ్య, రాత్రి అనేవి బ్రహ్మ శరీర సంభూతాలు.

---

** తిర్యక్ అంటే వక్రత. ఏ జీవుల ఆహార సంచారాలు వక్రంగా వుంటాయో అవి తిర్యక్కులు. ఇవి తిని తాగే అన్న జలాలు వీటి కడుపులో వంకరగా తిరుగుతాయి.*

తరువాత బ్రహ్మ రజోగుణమయ శరీరం నుండి క్షుధ, క్రోధం జనించాయి. పిమ్మట బ్రహ్మ నుండియే ఆకలి దప్పులు అతిగా కలవారు, రక్త మాంస సేవనులు నగు రాక్షసులు, యక్షులు పుట్టుకొచ్చారు. ఎవరినుండి సామాన్య జీవునికి రక్షణ అవసరమో వారు రాక్షసులు. యక్షశబ్దానికి తినుటయని అర్థము. యక్షులు ధనదేవతలు. ధనం కోసం వీరిని పూజిస్తారు. ఈ పూజలో భక్షణ కూడా ఒక భాగం. ఈ భక్షణ వల్ల వీరిని యక్షు లంటారు. అటుపిమ్మట బ్రహ్మకేశాల నుండి సర్పాలు, క్రోధం నుండి భూతాలు పుట్టినవి. చురుకైన కదలికను సర్పణమంటారు. అది కలవి సర్పాలు. తరువాత బ్రహ్మలో కలిగిన క్రోధ గుణవాసనపాములకూ తగిలింది. అందుకే వాటికి క్రోధ మెక్కువ. తరువాత బ్రహ్మనుండి పాటపాడుతూ, నాట్యమాడుతూ కొన్ని ప్రాణులు నిర్గమించాయి. పాడే వారు గంధర్వులు కాగా ఆడేవారు అచ్చరలయ్యారు.

తరువాత ప్రజాపతియైన బ్రహ్మవక్షస్థలం నుండి స్వర్గము, ద్యులోకము పుట్టాయి. ఆయన ముఖము నుండి అజము (మేక), ఉదరమునుండి గోవు, పార్శ్వాలనుండి ఏనుగు, గుఱ్ఱము, మహిషము, ఒంటె, తోడేలు జాతులు పుట్టినవి. ఆయన రోమాలనుండి ఫల, పుష్ప, ఔషధ జాతి వృక్షాలుద్భవించాయి. తరువాత ఏడు రకాల జంతువులు పుట్టాయి. అవి క్రమంగా పులివంటి హింస్రకాలు, పశువులు (ఇది ఒకదశ), రెండు గోళ్ళ (గిట్టల) జంతువులు, నీటిక్షీరదాలు, కోతి జాతి, పక్షులు, ఉభయచరాలు, సరీసృపాలు.

బ్రహ్మయొక్క పూర్వాది నాల్గు ముఖాలనుండి క్రమంగా ఋగ్యజుస్సామాథర్వ వేదాలు జనించాయి. ఆయన ముఖం నుండి బ్రాహ్మణులు, భుజాల నుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదాల నుండి శూద్రులూ ఉత్పన్నులైనారు. వెంటనే బ్రహ్మవారిలో ఉత్తములైన బ్రాహ్మణులకు బ్రహ్మలోకాన్నీ, క్షత్రియులకు ఇంద్రలోకాన్ని, వైశ్యులకు వాయులోకాన్నీ శూద్రులకు గంధర్వలోకాన్నీ నివాసాలుగా నిర్ధారణ చేశాడు. ఆయనే బ్రహ్మచారులకు బ్రహ్మలోకాన్నీ, స్వధర్మనిరతులై గృహస్థాశ్రమాన్ని నిర్వహించిన వారికి ప్రాజాపత్యలోకాన్నీ, వానప్రస్థులకు సప్తర్షిలోకాన్నీ, సన్యాసులకూ పరమతపో నిధులకూ అక్షయలోకాన్నీ ప్రాప్యలోకాలుగా నిర్ధారణ చేశాడు. ***(అధ్యాయం – 4)***

# మానస సృష్టి వర్ణన దక్షప్రజాపతి - సృష్టి విస్తారం

**శం**కరా! ప్రజాపతి బ్రహ్మ పరలోకంలో నివసించే మానస - ప్రజాసృష్టి తరువాత నరలోక సృష్టి విస్తారాన్ని గావించే మానసపుత్రులవైపు దృష్టి సారించాడు. ఆయన నుండియే యములు, రుద్రులు, మనువులు, సనకుడు, సనాతనుడు, భృగువు, సనత్కుమారుడు, రుచి, శ్రద్ధ, మరీచి, అత్రి,అంగిరుడు, పులస్త్యుడు, పులహుడు,క్రతువు,వసిష్ఠుడు, నారదుడు జనించారు. అలాగే పితృగణాలవారు ఏడుగురు అనగా బర్హిషద, అగ్నిష్వాత్త, క్రవ్యాద, ఆజ్యప, సుకాలిన, ఉపహూత, దీప్య నామకులు కూడ ఉద్భవించారు. వీరిలో మొదటి ముగ్గురూ అమూర్త రూపులు. చివరి నలుగురూ మూర్త రూపులు, అంటే కళ్ళకు కనిపిస్తారు.

కమల గర్భుడైన బ్రహ్మ దక్షిణ అంగుష్ఠం (కుడి బొటనవ్రేలు) నుండి ఐశ్వర్య సంపన్నుడైన దక్ష ప్రజాపతీ, ఎడమ బొటనవ్రేలి నుండి ఆయన భార్యా పుట్టారు. వీరికి శుభ లక్షణలైన ఎందరో కన్యలు పుట్టగా వారిని బ్రహ్మమానస పుత్రులకు దక్ష ప్రజాపతి సమర్పించాడు. సతీదేవియను పుత్రికను రుద్రునకిచ్చి పెండ్లి చేయగా వారికి పెద్ద సంఖ్యలో మహాపరాక్రమశాలురైన పుత్రులు పుట్టారు.

దక్షుడు ఒక అసాధారణ రూపవతీ, సుందర సులక్షణ లక్షిత జాతాయగు (తన) ఖ్యాతియను కూతురిని భృగుమహర్షికిచ్చి పెండ్లి చేశాడు. వారికి ధాత, విధాతలను కొడుకులూ, శ్రీయను కూతురు కలిగారు. ఈ శ్రీనే హరి వరించి శ్రీహరియైనాడు. వారికి బల, ఉన్మాదులను కొడుకులు గలిగారు.

మహాత్ముడైన మనువుకి ఆయతి నియతి అను ఇద్దరు కన్యలు పుట్టగా వారిని భృగు పుత్రులైన ధాత, విధాతలకిచ్చి పెండ్లి చేశాడు. వారికి ప్రాణుడు, మృకండుడు పుట్టారు. నియతి పుత్రుడైన మృకండుని కొడుకే మహానుభావుడు మహర్షియైన మార్కండేయుడు.

మరీచి - సంభూతిలకు పౌర్ణమాసుడను పుత్రుడు జనించాడు. ఆ మహాత్ముని పుత్రులు విరజుడు, సర్వగుడు. అంగిరామునికి దక్ష కన్య స్మృతి ద్వారా ఎందరో పుత్రులు, సినీవాలీ, కుహూ, రాకా అనుమతీ నామక కన్యలు కలిగారు.

అనసూయకు అత్రి ద్వారా చంద్రుడు దుర్వాసుడు, దత్తాత్రేయుడు కలిగారు. పులస్త్యునికి ప్రీతి ద్వారా దత్తోలుడను పుత్రుడు పుట్టాడు. పులహప్రజాపతికి క్షమయను పత్ని ద్వారా కర్మశుడు, అర్థవీరుడు, సహిష్ణువు అను పుత్రులుద్భవించారు. క్రతువుకి

పత్ని సుమతి ద్వారా ఆరువేలమంది వాలఖిల్య ఋషులుద్భవించారు. వీరంతా ఊర్ధ్వరేతస్కులు, బొటనవ్రేలి పరిమాణం వారు, సూర్యునంత తేజస్సంపన్నులు.

*వసిష్ఠునికి పత్ని ఊర్జాద్వారా రజుడు, గాత్రుడు, ఊర్ధ్వబాహుడు, శరణుడు, అనఘుడు, సుతపుడు, శుక్రుడు అను మహర్షులుదయించారు. వీరిని సప్తమహర్షులంటారు. (*ఈయన శ్రీరామగురువు వశిష్టుడు కాదు)

శివశంకరా! దక్షప్రజాపతి తన కూతురైన స్వాహాను అగ్ని దేవునికిచ్చి వివాహం చేయగా వారికి * పావక, పవమాన, శుచులను పుత్రులు పుట్టారు. వీరే త్రేతాగ్నులు. పరమఓజస్వులు.

దక్ష కన్యయైన స్వధకుమేనా, వైతరణియను కూతుళ్ళు పుట్టారు. వారు 'బ్రహ్మవాదినులు' మేనాకు హిమవంతుని ద్వారా మైనాకుడను పుత్రుడూ, గౌరీ నామంతో ప్రసిద్ధి చెందిన పార్వతీదేవియను కన్యా జన్మించారు. ఈమెయే పూర్వజన్మలో సతీదేవి.

అప్పుడు బ్రహ్మయే స్వయంగా తనంతటి వాడైన స్వాయంభువమనువుకు జన్మనిచ్చి అతనిని ప్రజాపాలన కార్యంలో నియోగించాడు. సర్వవైభవ సంపన్నుడైన స్వాయంభువ మను మహారాజు తన అఖండ తపః ఫలంగా పరమశుద్ధతేజస్వినీ, తపస్వినీయైన శతరూపాదేవిని భార్యగా పొందాడు. వారికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను కొడుకులు, ప్రసూతి, ఆకూతి, దేవహూతియను కూతుళ్ళు కలిగారు. ఆడపిల్లలు ముగ్గుర్నీ క్రమంగా రుచి ప్రజాపతికీ, దక్ష ప్రజాపతికీ, కర్దమమునికీ ఇచ్చి వివాహం జరిపించారు. రుచికి యజ్ఞుడనే కొడుకూ దక్షిణయను కూతురూ జన్మించారు. యజ్ఞునికి పన్నెండు మంది మహాబలశాలులైన పుత్రులు పుట్టారు. వారే 'యామ' అను దేవగణానికి మూలపురుషులుగా ప్రఖ్యాతి నందారు.

దక్షప్రజాపతికి ప్రసూతి ద్వారా ఇరవై నలుగురు కూతుళ్ళు పుట్టారు. వారిలో శ్రద్ధ, లక్ష్మి, ధృతి, తుష్టి, పుష్టి, మేధ, క్రియ, బుద్ధి, లజ్జ, వపు, శాంతి, బుద్ధి, కీర్తి నామకలైన పదముగ్గురు కన్యలను దక్షిణా పుత్రుడయిన ధర్ముడు పత్నులుగా స్వీకరించాడు. తరువాత ఖ్యాతి, సతి, సంభూతి, స్మృతి, ప్రీతి, క్షమ, సన్నతి, అనసూయ, ఊర్జ, స్వాహ, స్వధ అను పేర్లు గల పదకొండుగురు కన్యలనూ దక్ష ప్రజాపతి క్రమంగా భృగుమహర్షి,

---

*ఈ త్రేతాగ్నులలో విద్యుత్సంబంధియైన అగ్ని పావకం. ఘర్షణ ద్వారా వచ్చేది పవమానం. సూర్యుని లోనిది శుచి. కూర్మ పురాణంలో ఇలా చెప్పబడింది.

*పావకః పవమానశ్చ శుచి రగ్నిశ్చ తే్రతయః ।*
*నిర్మథ్యః పవమానః స్యాద్ వైద్యుత పావకః స్మృతః ॥*
*యశ్చాసౌ తపతే సూర్యః శుచిరగ్ని స్త్వ సౌ స్మృతః ।* **(1-12/25,26)**

పరమశివుడు, మరీచి, అంగిరా మహర్షి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అత్రి, వసిష్ఠుడు, అగ్ని, పితరుడు – అను ప్రసిద్ధులకిచ్చి వివాహం చేశాడు.

వీరిలో శ్రద్ధకు కాముడు, లక్ష్మికి దర్పుడు, ధృతికి నియముడు, తుష్టికి సంతోషి, పుష్టికి లోభుడు, మేధకు శ్రుతుడు, క్రియకు దండలయ, వినయులూ, బుద్ధికి బోధుడూ, లజ్జకు వినయుడూ, వపుకి వ్యవసాయ, శాంతికి క్షేమా, బుద్ధికి సుఖ, కీర్తికి యశ అనువారలు పుట్టారు. కామదేవునికి రతి పత్నికాగా వారికి హర్షుడుద్భవించాడు.

కొంతకాలానికి దక్ష ప్రజాపతి అశ్వమేధయాగాన్ని చేసి శివునీ, సతినీ తప్ప ఇతర బంధువుల నందరినీ ఆహ్వానించాడు. తండ్రి పిలువకపోయినా ఆ యజ్ఞానికి విచ్చేసిన సతి తన తండ్రి తిరస్కారాన్నీ తనకు జరిగిన అవమానాన్నీ తట్టుకోలేక ఆ దక్షయజ్ఞ వాటికలోనే ప్రాణ త్యాగం చేసింది. ఆ సతియే మరుసటి జన్మలో హిమవత్ పుత్రిగా పుట్టి పరమశివుని చేపట్టి గణేశునికీ దేవసేనానికీ తల్లియై లోకారాధ్య అయింది.

అక్కడ దక్షయజ్ఞంలో తన సతి బలియై పోయినందుకు క్రుద్ధుడైన భృంగీశ్వర పినాక పాణి శంకరభగవానుడు దిగివచ్చి ఆ యజ్ఞాన్ని ధ్వంసం చేసి దక్షుని మానవునిగా ధ్రువ వంశంలో పుట్టుమని శపించాడు. ***(అధ్యాయం – 5)***

# ధ్రువ వంశం - దక్ష సంతతి

**శి**వాది దేవతలారా! ఉత్తానపాదునికి ఇద్దరు భార్యలు; సురుచి, సునీతి. వారిలో సురుచికి ఉత్తముడు సునీతికి ధ్రువుడు పుట్టారు. వారిలో ధ్రువుడు చిన్నతనంలోనే నారద మహర్షి కృప వల్ల ప్రాప్తించిన ఉపదేశానుసారం దేవాధి దేవుడైన జనార్దను నారాధించి ఆయన దర్శనభాగ్యాన్ని పొందాడు. ఆ తరువాత పెద్దకాలం పాటు మహారాజుగా, మనిషిగా బాధ్యతలను నిర్వర్తించి దేహాంతంలో విశ్వంలోనే కాంతివంతమైన నక్షత్రంగా ఉత్తమ స్థానంలో నిలిచాడు.

ధ్రువుని కొడుకు శ్లిష్టుడు. ఆ తరువాత ఆ వంశంలో పరంపరగా ప్రాచీన బర్హి, ఉదారధి, దివంజయుడు, రిపుడు, చాక్షుషుడు, రురు, అంగుడు, వేనుడు రాజ్యం చేశారు. ఈ వేనుడు నాస్తికుడు, ధర్మభ్రష్టుడు, పొగరుబోతు. మహర్షులను, పూజ్యులను దారుణంగా అవమానించేవాడు. దేశంపాడైపోతుండడంతో మరో దారిలేక మహర్షులంతా కుశాఘాతా లతో వానిని చంపివేశారు! రాజ్యం అరాచకం కాకుండానూ, విష్ణుమానస పుత్రుని కోసమూ ప్రయత్నాలు చేయసాగారు.ముందు వేనుని శరీరం కాస్త వెచ్చగా వుండగానే అతని ఊరు

భాగాన్ని మంత్ర సహితంగా మంథనం చేయగా ఒక పుత్రుడు దయించాడు. అతడు నల్లగా, అతిచిన్న పరిమాణంలో వుండడంతో, అతనిని 'ఇక్కడే వుండు' అనే భావంతో 'నిషీద' అన్నారు. ఈ శబ్దం వల్ల అతని పేరు నిషాదుడుగా స్థిరపడిపోయింది. అనంతర కాలంలో అతడు కొండల మీదికి వెళ్ళిపోయాడు. తరువాత మునులంతా కలిసి తమ తపశ్శక్తిని వినియోగించి శ్రీహరిని జపిస్తూ వేనుని కుడిచేతిని మథించగాఅందునుండి విష్ణువే పృథు నామంతో అవతరించాడు. ఆయన ప్రజాను రంజకమైన పరిపాలనను చేయడమే కాక వారికోసం పృథ్విని పితికి సమస్త ద్రవ్యాలనూ రాబట్టి ప్రజలను ఐశ్వర్యవంతులను చేశాడు*.

పృథువు తరువాత వంశానుగతంగా అంతర్ధానుడు, హవిర్ధానుడు, ప్రాచీన బర్హి రాజులయ్యారు. ఈ ప్రాచీన బర్హిలవణ సముద్ర పుత్రియైన సాముద్రిని పెండ్లాడి పదిమంది పుత్రులను కన్నాడు. వారందరూ ప్రాచేతస నామంతో ప్రసిద్ధులై ధనుర్వేదంలో నిష్ణాతులై లోకంలో ధనుర్ధారులను తయారు చేశారు. ధర్మాచరణ నిరతులై ప్రజలను కాపాడారు. తరువాత పదివేల సంవత్సరాల పాటు నీటి అడుగున కఠోరతపస్సు చేసి తత్ఫలితంగా ప్రజాపతి పదవినీ, వరప్రసాదియైన మారిషయను దివ్యస్త్రీని భార్యగానూ పొందారు. శివుని చేత శపింపబడిన దక్షుడు ఈ మారిషకే కొడుకుగా పుట్టాడు.

దక్షుడు ముందు నాలుగు రకాల మానస పుత్రులను సృష్టించాడు కానీ శివుని శాపం వల్ల వారు అభివృద్ధి చెందలేదు. అప్పుడు దక్ష ప్రజాపతి స్త్రీ, పురుష సంయోగంపై ఎక్కువగా దృష్టిని పెట్టి సృష్టిని పెంచవలసి వచ్చింది. ఆయన వీరణ ప్రజాపతి కూతురైన ఆసక్తి అను సుందరిని పెండ్లాడి వేయి మంది పుత్రులను కన్నాడు కానీ వారంతా నారదమహర్షి ఉపదేశం మేరకు గృహస్థ జీవన విముఖులై పృథ్వి యొక్క హద్దులను చూసివస్తామని పోయి మరి రాలేదు.

దక్షుడు మరల వేయి మంది పుత్రులను కని సృష్టిని కొనసాగించాడు. వారు 'శబలాశ్వ' నామంతో ప్రసిద్ధులయ్యారు. కాని వారు నారదుని బోధనలను విని సన్యాసులయిపోయారు. ఈ మారు దక్షుడిక కోపం పట్టలేక నారదుని మర్త్యలోకంలో జనించాలని శపించాడు. అందువల్ల నారదుడు కశ్యపపుత్రునిగా పుట్టవలసివచ్చింది.

---

** వేన చరిత్రలో మనం గమనించ వలసినదేంటంటే అప్పట్లో మేధావులు, విద్యావంతులు, తపోధనులైన మహర్షులు రాజెలాగుంటే మనకేం, దేశమేమైపోతే మనకేం అని ఊరుకోలేదు. విపరీతంగా శ్రమించి, తపశ్శక్తిని ధారవోసి విష్ణువునే క్రిందికి రప్పించారు. ఇప్పటి మేధావులు, బ్రాహ్మణ శబ్దానికి అర్హులైనవారు అలా చేస్తే స్వర్ణయుగం తప్పక వస్తుంది.*

ఈ మారు దక్ష ప్రజాపతి అసిక్నియను భార్య ద్వారా అరవైమంది అందమైన కన్యలను ఉత్పన్నం చేసి వారిలో నిద్దరిని అంగిరామహర్షికి, ఇద్దరు కన్యలను కృశాశ్వునికీ పది మందిని ధర్మునికీ, పదునాల్గురిని కశ్యపునికీ, ఇరవై ఎనమండుగురిని చంద్రునికీ ఇచ్చి వివాహం చేశాడు. ఓ మహాదేవా! ఆ తరువాత దక్షుడు మనోరమ, భానుమతి, విశాల, బహుద అను నలుగురు కన్యలను అరిష్టనేమి కిచ్చి వివాహముగావించాడు.

ధర్ముని పత్ని విశ్వ ద్వారా విశ్వేదేవులూ, కశ్యపపత్ని సాధ్య ద్వారా సాధ్యగణాల వారూ జన్మించారు. మరుద్వతి ద్వారా మరుత్వంతుడూ, వసుద్వారా అష్టవసువులూ ఆవిర్భవించారు. శంకరదేవా! భానుకి పన్నెండుగురు భానులూ, ముహూర్తకు ముహూర్తులూ జన్మించారు. లంబనుండి ఘోషులు, యామీ ద్వారా నాగవీథి జన్మించారు. ధర్ముని పత్నులలో చివరిదైన సంకల్ప ద్వారా సర్వాత్మకు డైన సంకల్పుడు రూపాన్ని ధరించాడు.

ఆపసుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు, అష్టవసువులు, వీరిలో మొదటి దేవతకు వేతుండి, శ్రమ, శ్రాంత, ధ్వని అనే కొడుకులు పుట్టారు. భగవంతుడైన కాల పురుషుడు ధ్రువపుత్రునిగా అవతరించాడు. వర్చమహర్షి సోమపుత్రుడు ఆ దేవుని దయ వల్లనే మనిషి వర్చస్వికాగలడు. ధరుడను వసువు కుమనోహరయను దేవకన్య ద్వారా ద్రుహిణ హుత, హవ్యవహ, శిశిర, ప్రాణ, రమణ నామకులైన పుత్రులు కలిగారు. అనిల పత్ని పేరు శివ. వారికి పులోమజుడు, అవిజ్ఞాతగతి నామకపుత్రులు జనించారు. అనల (అగ్ని) పుత్రుని పేరు కుమారుడు. ఇతడే రెల్లు వనంలో అవతరించిన కుమారస్వామి; కృత్తి కలచే పాలింపబడి కార్తికేయుడై నాడు. ఈయన తరువాత శాఖ, విశాఖ, నైగమేయులు అనలునికి కలిగారు.

దేవల మహర్షి ప్రత్యూష వసువు పుత్రుడు. విఖ్యాత దేవశిల్పి విశ్వకర్మ ప్రభాస వసునందనుడు. విశ్వకర్మకు నలుగురు మహాబల పరాక్రమవంతులైన కొడుకులు పుట్టారు. వారే అజైకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు. త్వష్ట పుత్రుడే మహా తపస్వియైన విశ్వరూప మహర్షి. రుద్ర నందనులైన హర, బహురూప, త్ర్యంబక, అపరాజిత, వృషాకపి, శంభు, కపర్ది, రైవత, మృగవ్యాధ, శర్వ, కపాలి నామకులు ఏకాదశ రుద్రులుగా శంకరాంశ సంభూతులై మూడులోకాలకూ అధిపతులైనారు.

కశ్యపపత్ని అదితి పుత్రులు విష్ణు, శక్ర, అర్యమ, ధాత, త్వష్ట, పూష, వివస్వాన్,సవిత, మిత్ర, వరుణ, అంశుమాన్, భగనామధేయులై ద్వాదశాదిత్యులుగా వెలిగి లోకాలను వెలిగిస్తున్నారు.

రోహిణి మున్నగు ఇరువదేడు నక్షత్రకన్యలను దక్షుడు చంద్రునికిచ్చి వివాహం చేశాడు. దితికడుపున హిరణ్యాక్ష, హిరణ్యకశిపులూ, సింహికయను కూతురూ పుట్టారు. ఆమె పెండ్లి విప్రచిత్తితో జరిగింది. హిరణ్యకశిపునికి అనుహ్రాద, హ్రాద, ప్రహ్లాద, సంహ్రాద నామకులైన పుత్రులు జనించి 'హ్లాదు' లుగా ప్రసిద్ధి చెందారు; ముఖ్యంగా విష్ణుభక్తుడు ప్రహ్లాదుడు. సంహ్లా(హ్రా)దునికి ఆయుష్మాన్, శిబి, వాష్కలులు పుత్రులుగా జన్మించారు. ప్రహ్లాదపుత్రుడు విరోచని. అతని పుత్రుడే బలిచక్రవర్తి. బలికి నూర్గురు కొడుకులు. వారిలో పెద్దవాడు బాణుడు.

హిరణ్యాక్ష పుత్రులైన ఉత్కురుడు, శకుని, భూత సంతాపనుడు, మహానాభుడు, మహాబాహు, కాలనాభులు మహా బలశాలులు.

దనువు తనయులైన ద్విమూర్ధ, అయోముఖ, శంకర, శంకుశిర, కపిల, శంబర, ఏక చక్ర, మహాబాహు, తారక, మహాబల, స్వర్భాను, వృషపర్వ, పులోమ, మహాసుర, విప్రచిత్తులు విఖ్యాతవీరులు.

స్వర్భానుని కన్య సుప్రభ. వృష పర్వుని కూతురు శర్మిష్ఠ. అతని కింకా ఉపదానవి. హయశిర అను మరో ఇద్దరు శ్రేష్ఠకన్యలున్నారు.

పులోమా, కాలకా వైశ్వానరకన్యలు. ఈ పరమ సౌభాగ్య శాలినుల వివాహం మరీచి పుత్రుడైన కశ్యపునితో జరిగింది. వారికి అర్వై వేల మంది శ్రేష్ఠులైన దానవులు పుట్టారు. కశ్యపుడు వీరిని పౌలోములనీ కాలకంజులనీ వ్యవహరించాడు.

విప్రచిత్తి, సింహికలకు వ్యంశ, శల్య, బలవాన్, నభ, మహాబల, వాతాపి, నముచి, ఇల్వల, ఖస్రుమాన్, అంజక, నరక కాలనాభులు పుట్టారు.

ప్రహ్లాదుని వంశంలో నివాతకవచ నామధారులైన దైత్యులు రెండు వందలమంది ఉదయించారు. తామ్రాకు సత్త్వ గుణ సంపన్నులైన ఆరుగురు కన్యలు పుట్టారు. వారి పేర్లు :శుకి, శ్యేని, భాసి, సుగ్రీవి, శుచి, గృధ్రిక. వీరికి క్రమంగా 1. చిలుకలు, గుడ్లగూబలు, కాకాదులు 2. శ్యేనాలు 3. భాసాలు 4. అశ్వాలు, ఒంటెలు 5. నీటి పక్షులు 6. గ్రద్దలు పుట్టగా వీటిని తామ్రావంశమన్నారు.

(**క్రమతలో తేడా :** సుగ్రీవునికి గుఱ్ఱాలూ, గృధ్రికు గ్రద్దలు పుట్టాయి.)

వినతాగర్భాండముల నుండి విశ్వవిఖ్యాతులైన అరుణుడు గరుడుడు ఉదయించారు.

సురసాగర్భము నుండి అపరిమిత తేజస్సంపన్నములైన సర్పాలు సహస్ర సంఖ్యలో జనించగా, కద్రువకు కూడా నాగులే జన్మించారు. వీరిలో ప్రముఖులు శేషుడు, వాసుకి,

తక్షకుడు, శంఖుడు, శ్వేతుడు, మహాపద్ముడు, కంబలుడు, అశ్వతరుడు, ఏలాపత్రుడు, నాగుడు, కర్కోటకుడు, ధనంజయుడు.

క్రోధాదేవికి మహాబలవంతమైన పిశాచగణము, సురభికి గోవులూ, ఎద్దులూ, ఇరావతికి వృక్షకుటుంబమూ జన్మించాయి.

ఖగా యను నామెకు యక్ష రాక్షస గణాలూ, మునియను నామెకు ఆటపాటలతో అలరించే అచ్చరలూ, అరిష్టకు పరమసత్త్వసంపన్నులైన గంధర్వులూ పుట్టారు. నలభై తొమ్మిది మరుత్తులను దేవతలు (రాక్షస మాతయైన) దితి కడుపున పుట్టారు.

ఈ మరుద్గణాల్లో ఏకజ్యోతి, ద్విజ్యోతి, త్రిజ్యోతి, చతుర్జ్యోతి, ఏకశుక్ర, ద్విశుక్ర, త్రిశుక్రులు ఏడుగురూ ఒక గణం. ఈదృక, సదృక, అన్యాదృక, ప్రతిసదృక, మిత, సమిత, సుమిత నామధారులంతా మరొకగణం. ఋతజిత్, సత్యజిత్, సుషేణ, సేనజిత్, అతిమిత్ర, అమిత్ర, దూరమిత్ర నామక మరుత్తులది ఇంకొక గణం ఋత, ఋతధర్మ, విహర్త, వరుణ, ధ్రువ, విధారణ, దుర్మేధ నామధారులది నాలుగవ మరుద్గణం. ఇక ఈదృశ, సదృశ, ఏతాదృశ, మితాశన, ఏతేన, ప్రసదృక్ష, సురత నామక మహాతపస్వులు. అయిదవ గణానికి చెందిన మరుత్తులు. హేతుమాన్, ప్రసవ, సురభ, నాదిరుగ్ర, ధ్వనిర్భాస, విక్షిప, సహనామధేయులది ఆరవమరుద్గణం. ద్యుతి, వసు, అనాధృష్య, లాభ, కామ, జయీ, విరాట్టు, ఉద్వేషణులది ఏడవ మరుద్గణం. వీటిని వాయుగణాలనీ, స్కంధాలనీ కూడా అంటారు.

ఈ నలభై తొమ్మండుగురు మరుత్తులూ విష్ణురూపాలే. మనువుతో సహా దేవదానవ రాజులు, సూర్యాదిగ్రహాలు వీరినే పూజిస్తారు. ***(అధ్యాయం-6)***

## దేవపూజా విధానం - వజ్రనాభ మండలం విష్ణు దీక్ష, లక్ష్మీపూజ

**రు**ద్రదేవా! ధర్మార్థకామమోక్షాలను ప్రసాదించే సూర్యాది దేవతల పూజను వర్ణిస్తాను. వృషభధ్వజా! గ్రహదేవతల మంత్రాలివి :

***ఓం నమః సూర్యమూర్తయే ।***

***ఓం హ్రాం హ్రీం సః సూర్యాయనమః ।***

***ఓం సోమాయ నమః ।***

*ఓం మంగలాయ నమః ।*

*ఓం బుధాయ నమః ।*

*ఓం బృహస్పతయే నమః ।*

*ఓం శుక్రాయ నమః ।*

*ఓం శనైశ్చరాయ నమః ।*

*ఓం రాహవే నమః ।*

*ఓం కేతవే నమః ।*

*ఓం తేజశ్చండాయ నమః ।*

ఈ మంత్రాలను చదువుతూ ఆసన, ఆవాహన, పాద్య, అర్ఘ్య. ఆచమన, స్నాన, వస్త్ర, యజ్ఞోపవీత, గంధ, పుష్ప ధూప, దీప, నమస్కార, ప్రదక్షిణ, విసర్జనాది ఉపచారాలను సమర్పిస్తూ గ్రహాలను పూజించాలి.

**శివపూజను ఇలా చేయాలి :**

***ఓం హ్రాం శివాయనమః*** అనే మంత్రంతో ఆసనాన్ని పూజించాలి. ***ఓం హ్రాం శివమూర్తయే శివాయ నమః*** మంత్రంతో నమస్కారం చేసి ***ఓం హ్రాం హృదయాయ నమః!, ఓం హ్రీం శిరయే స్వాహా! ఓం హ్రూం శిఖాయై వషట్ । ఓం హ్రైం కవచాయ హుం । ఓం హ్రౌం నేత్రత్రయాయ వౌషట్ । ఓం హ్రః అస్త్రాయ నమః ।*** అనే మంత్రాలతో షడంగన్యాసం చేయాలి. తరువాత

*ఓం హ్రాం సద్యోజాతాయ నమః ।*

*ఓం హ్రీం వామదేవాయ నమః ।*

*ఓం హ్రూం అఘోరాయ నమః ।*

*ఓం హ్రైం తత్పురుషాయ నమః ।*

*ఓం హ్రౌం ఈశానాయ నమః ।*

అనే మంత్రాలతో ఆయన పంచముఖాలనూ పూజించాలి.

ఇలాగే విష్ణుదేవుని పూజించునపుడు ***ఓం వాసుదేవాసనాయ నమః*** మంత్రంతో విష్ణుని ఆసనాన్ని పూజించాలి. ఆ తరువాత

*ఓం వాసుదేవమూర్తయే నమః।*

*ఓం అం ఓం నమోభగవతే వాసుదేవాయ నమః ।*

*ఓం ఆం ఓం నమోభగవతే సంకర్షణాయ నమః।*

*ఓం అం ఓం నమోభగవతే ప్రద్యుమ్నాయ నమః ।*

*ఓం అః ఓం నమో భగవతే అనిరుద్ధాయ నమః ।*

అనే మంత్రాల ద్వారా సాధకుడు విష్ణు చతుర్వ్యూహాన్ని నమనం చేయాలి. అప్పుడు

*ఓం నారాయణాయ నమః ।*

*ఓం తత్సద్ బ్రహ్మణే నమః ।*

*ఓం హ్రూం విష్ణవే నమః ।*

*ఓం క్ష్రౌం నమోభగవతే నృసింహాయనమః ।*

*ఓం భూః ఓం నమోభగవతే వరాహాయ నమః ।*

*ఓం కంటం పంశం వైన తేయాయ నమః ।*

*ఓం జం ఖం రం సుదర్శనాయ నమః ।*

*ఓం ఖంఠంఫంషం గదాయై నమః ।*

*ఓం వం లం మం క్షం పాంచజన్యాయ నమః ।*

*ఓం ఘం ఢం భం హం శ్రియై నమః ।*

*ఓం గండం వంసం పుష్ట్యై నమః ।*

*ఓం ధం షం వంసం వనమాలాయై నమః ।*

*ఓం సం దం లం శ్రీ వత్సాయ నమః ।*

*ఓం ఠం చం భం యం కౌస్తుభాయ నమః ।*

*ఓం గురుభ్యో నమః ।*

*ఓం ఇంద్రాది భ్యోనమః ।*

*ఓం విష్వక్సేనాయ నమః ।* అనే మంత్రాలతో భగవంతుడైన శ్రీహరి అవతారాలనూ, ఆయుధాలనూ, వాహనాదులనూ నమస్కారం చేస్తూ పూజించి శివపూజలో వలెనే ఆసనాది ఉపచారాలను సమర్పించాలి.

శంకర దేవా! విష్ణు భగవానుని శక్తులలో సరస్వతీ దేవి ప్రముఖమైనది. ఆమెనూ మంగళకారిణిగా సంబోధిస్తూ ***ఓం సరస్వత్యై నమః*** అనే మంత్రం ద్వారా నమస్కారం చేసి ఈ క్రింది మంత్రాలతో షడంగన్యాసం చేయాలి.

*ఓం హ్రాం హృదయాయ నమః ।*

*ఓం హ్రీం శిరసే నమః ।*

*ఓం ప్రూం శిఖాయై నమః ।*

*ఓం ప్రైం కవచాయ నమః ।*

*ఓం ప్రౌం నేత్రత్రయాయనమః ।*

*ఓం ప్రః అస్త్రాయ నమః ।*

సరస్వతీ దేవి యొక్క యెనిమిది శక్తులైన శ్రద్ధాదులను ఈ క్రింది మంత్రాలతో అర్చించాలి.

*ఓం హ్రీం శ్రద్ధాయై నమః ।*

*ఓం హ్రీం బుద్ధ్యై నమః ।*

*ఓం హ్రీం కలాయై నమః ।*

*ఓం హ్రీం మేధాయై నమః ।*

*ఓం హ్రీం తుష్ట్యై నమః ।*

*ఓం హ్రీం పుష్ట్యై నమః ।*

*ఓం హ్రీం ప్రభాయై నమః ।*

*ఓం హ్రీం మత్యై నమః ।*

తరువాత క్షేత్రపాలునికీ, గురువుకీ,పరమ గురునికీ ఈ మంత్రాలతోపూజలు చేయాలి.

*ఓం క్షేత్రపాలాయ నమః ।*

*ఓం గురుభ్యో నమః ।*

*ఓం పరమ గురుభ్యో నమః ।*

తరువాత సరస్వతీదేవికి కమలవాసినీ రూపంలో ఆసనాది ఉపచారాలను సమర్పించాలి. పూజల తరువాత సూర్యాది దేవతలను వారి వారి మంత్రాలను చదువుతూ పవిత్రారోహణం చేయించాలి.

సదాశివాదులారా! విష్ణుభగవానుని విశేషపూజకై అయిదు ప్రకారాల రంగులు కలిపిన చూర్ణంతో వజ్రనాభమండలాన్ని నిర్మించాలి. దీనికి సమాన పరిమాణంలో పదహారు కోష్ఠకాలతో నిర్మించాలి.

వజ్రనాభ మండలం తయారు కాగానే న్యాసం చేసుకొని శ్రీహరిని పూజించాలి. హృదయ మధ్యంలో విష్ణుభగవానుని, కంఠంలో సంకర్షణుని, శిరంపై ప్రద్యుమ్నుని, శిఖాభాగంలో అనిరుద్ధుని, సంపూర్ణ శరీరంలో బ్రహ్మనీ, రెండు చేతులలో శ్రీధరునీ

భావించుకొని న్యాసం చేసుకోవాలి. తరువాత **అహం విష్ణుః** అని ధ్యానం చేస్తూ పద్మంలో (మండలంలో నిర్మింపబడిన పద్మంలో) కర్ణిక భాగంలో శ్రీహరిని స్థాపించాలి. మండలానికి తూర్పులో సంకర్షణునీ, దక్షిణంలో ప్రద్యుమ్నునీ, పశ్చిమంలో అనిరుద్ధునీ, ఉత్తరంలో బ్రహ్మదేవునీ స్థాపించాలి. ఈశాన్యంలో ముందు శ్రీహరిని స్థాపించి ఆ తరువాత దిక్పాలకులను వారి వారి మంత్రాలతో ఈ దిగువ నిచ్చిన దిక్కులలో నిలపాలి.

| | | | |
|---|---|---|---|
| *ఓం ఇంద్రాయ నమః* | **ఇంద్రుని** | - | **తూర్పులో** |
| *ఓం అగ్నయే నమః* | **అగ్నిని** | - | **ఆగ్నేయంలో** |
| *ఓం యమాయనమః* | **యముని** | - | **దక్షిణంలో** |
| *ఓం నిరృతయే నమః* | **నిరృతిని** | - | **నైఋతిలో** |
| *ఓం వరుణాయ నమః* | **వరుణుని** | - | **పశ్చిమంలో** |
| *ఓం వాయవే నమః* | **వాయువుని** | - | **వాయవ్యంలో** |
| *ఓం కుబేరాయ నమః* | **కుబేరుని** | - | **ఉత్తరంలో** |
| *ఓం ఈశానాయ నమః* | **ఈశ్వరుని** | - | **ఈశాన్యంలో** |

స్థాపించిన తరువాత అందరు దేవతలనూ గంధాది ఉపచారాల ద్వారా పూజించాలి. దీని వలన సాధకునికి దేహాంతంలో పరమపదం ప్రాప్తిస్తుంది.

దేవగణములారా! దీక్షితుడైన శిష్యుడు వస్త్రంతో తన రెండు కన్నులనూ మూసుకొని దేవతల మూలమంత్రాలను పఠిస్తూ నూట యెనిమిది ఆహుతులను అగ్నిలోనివ్వాలి. పుత్ర లాభమును కోరుకొనేవారు దానికి ద్విగుణంగా అంటే రెండు వందల పదహారు ఆహుతులను అగ్నికి సమర్పించాలి. సాధనాసిద్ధికైతే మూడు రెట్లు (మూడు వందల ఇరవై నాలుగు) మోక్షప్రాప్తి కోసం చేసే దేశికునికైతే నాలుగు రెట్లు అనగా నాలుగు వందల ముప్పది రెండు ఆహుతులు అవసరం. (దేశికుడనగా ఉపదేశమిచ్చే ఆచార్యుడు)

విద్వాంసుడైన దేశికుడు అన్నిటికన్న ముందు భగవంతుని ధ్యానించాలి. తరువాత వాయవ్యం వైపు తిరిగి ***'యం'*** అనే బీజమంత్రాన్ని చదువుతూ శిష్యుల క్షేమాన్ని ఆలోచించాలి. ఆగ్నేయం వైపు తిరిగి ***'రం'*** అనే బీజమంత్రం ద్వారా తమ మనస్తాపాలను తొలగించే విధానాన్ని ఆలోచించాలి. వారుణీ దిశగా తిరిగి ***'వం'*** అనే బీజ మంత్రం ద్వారా హృదయస్థితినీ ధర్మాభిరుచినీ విచారించుకోవాలి. తరువాత దేశికుడు అభేద చింతనాన్ని చేయాలి. అభేద జ్ఞానమనగా ఆత్మతేజాన్ని పరమాత్మ తేజంతో ఏకం చేసే సాధనను చేయగలిగే తెలివి. అపుడు ఓంకారాన్ని జపిస్తూ వాయు, అగ్ని, జల, పృథ్వీ

తత్త్వాలను ధ్యానం చేయాలి. అలా చేయగా చేయగా సాధకునికి వాటిపై విజయం ప్రాప్తిస్తుంది. తరువాత శరీరమంతా జ్ఞానంతో నిండిపోయి క్షేత్రజ్ఞుడవుతాడు.

మండలాదికములను నిర్మించుకోవడం సాధ్యం కానపుడు సాధకుడు తన మానస మండలాన్ని తానే కల్పించుకొని ఆ శ్రీహరిని పూజించుకోవచ్చును. శరీరంలోనే బ్రహ్మాది తీర్థాలుంటాయని శాస్త్రాల్లో చెప్పబడింది. మనిషి మానసమండలానికి కూడ నాలుగు ద్వారా లుంటాయి. చేతిని పద్మంగానూ వ్రేళ్ళనుపద్మపత్రాలుగానూ,హస్తమధ్యాన్ని కర్ణిక గానూ, గోళ్లను కేసరాలుగానూ భావించుకొనే సాధకుడు తన హస్తరూపియైన కమలంలోనే సూర్య, చంద్ర, ఇంద్ర, అగ్ని, యమాది పరివేష్టితుడైన శ్రీహరిని కల్పించుకొని పూజించుకోవచ్చును.

ఇక పూజానంతరము గురువు లేదా దేశికుడు తన చేతిని శిష్యుని తలపై పెట్టాలి. ఈ చేతిలోనే విష్ణువుంటాడు కాబట్టి ఆ హస్త స్పర్శ మాత్రాననే శిష్యుని పాపాలూ, అజ్ఞానమూ కూడా పటాపంచలై పోతాయి. అపుడు గురువు శిష్యుని పూజించి నూతన నామకరణం చేసి తనతో బాటు శిష్యుని కూడా ఆధ్యాత్మిక సాధనల దారిలో గొనిపోవాలి.

శక్తిస్వరూపులైన ఓ శివాదిదేవతలారా! ఇక శ్రీలక్ష్మీ సిద్ధిప్రాప్తి విధివిధానాలు చూద్దాం. దీనిని స్థండిలాదులపై చేస్తారు. ఏదైనా పుణ్యకార్యానికై ప్రత్యేకంగా నేలకి కాస్త ఎత్తులో నిర్మింపబడి చదును చేయబడి పవిత్రీకరింపడిన ప్రత్యేక ప్రదేశాన్ని స్థండిలమంటారు.

ముందుగా *ఓం శ్రీం హ్రీం మహాలక్ష్మై నమః* అని జపించి *శ్రాం శ్రీం శ్రూం శ్రైం శ్రౌం శ్రః*

అనే బీజాక్షరాలను మంత్రానికి జోడిస్తూ క్రమంగా హృదయ, శిర, శిఖ, కవచ, నేత్ర, అస్త్రాలలో ఈ ప్రకారంగా షడంగన్యాసం చేసుకోవాలి.

*ఓం శ్రాం హృదయాయ నమః ।*
*ఓం శ్రీం శిరసే స్వాహా ।*
*ఓం శ్రూం శిఖాయై వషట్ ।*
*ఓం శ్రైం కవచాయ హుం ।*
*ఓం శ్రౌం నేత్రత్రయాయ వౌషట్ ।*
*ఓం శ్రః ★అస్త్రాయ ఫట్ ।*

సాధనారతుడైన భక్తుడు అంగన్యాసం తరువాత శ్రీమహాలక్ష్మిని పూజించాలి.

★ *సమస్త శరీరాన్నీ రక్షిస్తూ, ప్రతి భక్తుని చుట్టూ ఒక ఆవరక శక్తి వుంటుంది. దాన్ని 'అస్త్ర' అంటారు. న్యాసం చేసినపుడు ఈ శక్తిని రెండు చేతులలో కల్పన చేసుకోవాలి.*

తరువాత ఒక మండలాన్ని నిర్మించి నాలుగు రంగులు అద్ది గర్భస్థానంలో పద్మాన్ని నిర్మించాలి. దానికి అరవై నాలుగు రేకులను కల్పించాలి. మధ్యలో లక్ష్మిని చిత్రించి ఒక వైపు దుర్గ నుంచి మిగతా అందరు దేవతలనూ విష్ణుపూజలో వలెనే స్థాపించాలి. హవనమూ చేయాలి. తరువాత

***ఓం ఘం టం డం హం శ్రీ మహాలక్ష్మ్యై నమః***

అనే మహామంత్రంతో లక్ష్మీదేవిని పూజించాలి.

అటు పిమ్మట సాధకుడు – ***'ఓం సౌం సరస్వత్యై నమః ।' ఓంహ్రీం సౌం సరస్వత్యై నమః । 'ఓం హ్రీం వద వద వాగ్వాదిని స్వాహా।' ఓం హ్రీం సరస్వత్యై నమః ।'*** అను మంత్రాలనుచ్చరించి సరస్వతీ దేవికి నమస్కరించాలి. ***(అధ్యాయాలు 6-10)***

# నవవ్యూహార్చన విధి పూజానుక్రమ నిరూపణం

"పరంధామా! నవ వ్యూహార్చన విధిని గూర్చి తెలుసుకొనగోరుతున్నాము" అని ప్రార్థించాడు ఇంద్రుడు. చెప్పసాగాడు ఇందిరానాథుడు.

"మహా పురుషులారా! ఒకప్పుడు మా గరుత్మంతుడిదే విషయాన్ని గూర్చి కశ్యపునికి చెప్పాడు. అదే మీకు నేను వర్ణిస్తాను.

సాధకుడు ముందుగా యోగక్రియ ద్వారా మస్తక, నాభి, హృదయతత్త్వములను ఆకాశనామకతత్వంలో ప్రవేశింపజేయాలి. తరువాత ***'రం'*** అనే అగ్ని బీజ మంత్రంతో పాంచభౌతిక శరీరాన్ని శోధించుకోవాలి. తరువాత ***'యం'*** అనే వాయు బీజమంత్రంతో సంపూర్ణ శరీరాన్ని లయింపజేస్తున్న భావన చేయాలి. తరువాత ***'లం'*** అనే బీజమంత్రంతో ఈ శరీరాన్ని చరాచర జగత్తుతో సంప్లావితం చేస్తున్నట్లు భావించుకోవాలి. అటుపిమ్మట ***'వం'*** అనే బీజమంత్రంతో తనలోనే అమరత్వాన్ని భావించుకోవాలి. అమృతాన్ని ధ్యానిస్తూ 'పీతాంబరధారియు చతుర్భుజుడునునగు శ్రీహరిని నేనే' అని భావించుకుంటూ ఆత్మతత్త్వ ధ్యానంలో నిమగ్నం కావాలి.

తరువాత శరీరంలో, చేతుల్లో మూడు ప్రకారాల మంత్రన్యాసం చేయాలి. ముందు పన్నెండక్షరాల బీజమంత్రంతో, తరువాత మరో మంత్రంతో, న్యాసం, షడంగన్యాసం చేస్తే సాధకుడు తానే సాక్షాత్ నారాయణ స్వరూపుడైపోతాడు. దక్షిణాంగుష్ఠంతో ప్రారంభించి మధ్య వేలి దాకా న్యాసం చేసి మరల ఆ మధ్య వేలిపైనే రెండు బీజమంత్రాలతో న్యాసం

చేసి మరల శరీర విభిన్నాంగాలపై న్యాసం చేయాలి. క్రమంగా గుండె తల, పిలక, టెంకి, మోము, కనులు, కడుపు, వీపు, అంగన్యాసం చేస్తూ రెండు భుజాలు, చేతులు, మోకాళ్ళు, కాళ్ళలోన కూడా న్యాసం చేయాలి. (చేతుల తరువాత మోకాళ్ళు)

తరువాత రెండు చేతులనూ కమలాకారంలో పెట్టుకొని దాని మధ్య భాగంలో బొటన వ్రేళ్ళను కలిపి నిలపాలి. ఈ ముద్రలోనే కొంతసేపుండి పరమతత్త్వ స్వరూపుడు, అనామయుడు, సర్వేశ్వరుడు, భగవానుడునగు నారాయణ చింతనం గావించాలి.

తరువాత ఇవే బీజమంత్రాలతో క్రమంగా చూపుడు వేలితో మొదలెట్టి అన్ని వేళ్ళతో న్యాసం చేసి యథాక్రమంగా తల, కనులు, మోము, గొంతు, గుండె, బొడ్డు. వెనుక భాగము, రెండు మోకాళ్ళు, కాళ్ళలో కూడా న్యాసం చేయాలి.

బీజమంత్రాలతో సంపూర్ణ శరీరంలో న్యాసం చేయాలి. బొటనవ్రేలి నుండి చిటికెన వేలి దాకా అయిదు బీజమంత్రాలతో న్యాసం చేయాలి. ఏ అంగానికి సంబంధించిన బీజ మంత్రాన్ని ఆ అంగన్యాసం చేస్తున్నపుడు మననం చేయాలి.

తరువాత సాధకుడు అవే బీజ మంత్రాలతో దిక్కులను ప్రతిబద్ధం చేసుకొని పూజన క్రియ నారంభించాలి. ముందుగా ఏకాగ్రచిత్తంలో తన హృదయంలో యోగ పీఠాన్ని ధ్యానించాలి. వివిధ దిశలలో ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యాలను కల్పించుకొని పూజించి పూర్వాది దిశలలో అధర్మాదులను న్యాసం చేయాలి ఇలా :

| | |
|---|---|
| ***అగ్ని కోణంలో*** | ***ఓం ధర్మాయ నమః*** |
| ***నైరృత్య కోణంలో*** | ***ఓం జ్ఞానాయ నమః*** |
| ***వాయు కోణంలో*** | ***ఓం వైరాగ్యాయ నమః*** |
| ***ఈశాన కోణంలో*** | ***ఓం ఐశ్వర్యాయ నమః*** |
| ***తూర్పు దిక్కులో*** | ***ఓం అధర్మాయ నమః*** |
| ***దక్షిణ దిక్కులో*** | ***ఓం అజ్ఞానాయ నమః*** |
| ***పడమటి దిక్కులో*** | ***ఓం అవైరాగ్యాయ నమః*** |
| ***ఉత్తర దిక్కులో*** | ***ఓం అనైశ్వర్యాయ నమః*** |

అని అంటూ న్యాసం చేయాలి.

సాధకుడీ విధంగా న్యాసవిధులతో ఆచ్ఛాదింపబడిన తన శరీరాన్ని ఆరాధన పీఠంగానూ తనను తాను దాని స్వరూపంగానూ భావించుకొని తూర్పు వైపు తిరిగి

తలను బాగా ఎత్తి స్థిరుడై అనంత భగవానుడైన విష్ణువును తనలో ప్రతిష్ఠితుని చేసుకోవాలి. తరువాత జ్ఞానరూప సరోవరంలో వికసించిన అష్టదళ కమలాన్ని ధ్యానించాలి.

తరువాత ఋగ్వేదాదులలోని మంత్రాలతో సూర్య, చంద్ర, అగ్న్యాదులను ధ్యానించుకోవాలి. తరువాత అష్టదళకమలంపై ఎనిమిది దెసలలో భగవంతుడైన కేశవుని వద్దనే అవస్థితములై వుండు విమలాది శక్తులను విన్యస్తం చేసి తొమ్మిదవ శక్తిని కర్ణికపై స్థాపించాలి.

వాటిని ధ్యానించిన పిమ్మట యోగపీఠానికి విధ్యుక్తంగా పూజ చేయాలి. తరువాత మరల మనస్సు ద్వారా విష్ణుభగవానుని అంగసహితంగా ఆవాహనం చేసి ఆ యోగపీఠంపై ప్రతిష్ఠించాలి. అపుడు తూర్పు మొదలుగా నాలుగు దిక్కులలో నున్న కమలదళాలపై హృదయాది న్యాసాన్ని చేయాలి. కమలము యొక్క మధ్య భాగంలోనూ కోణాలపైననూ ఈ క్రింది విధంగా అస్త్రమంత్ర న్యాసాన్ని గావించాలి.

| | |
|---|---|
| ***తూర్పువైపు దళంలో*** | ***హృదయాయ నమః*** |
| ***దక్షిణం వైపు దళంలో*** | ***శిరసే స్వాహా*** |
| ***పశ్చిమం వైపు దళంలో*** | ***శిఖాయై వషట్*** |
| ***ఉత్తరం వైపు దళంలో*** | ***కవచాయ హుం*** |
| ***మధ్యంలో*** | ***నేత్రత్రయాయవైషట్*** |
| ***కోణంలో*** | ***అస్త్రాయఫట్*** |

అంటూ న్యాసం చేయాలి.

తరువాత పూర్వాది దిశల్లో యథాక్రమంగా సంకర్షణాదులను స్థాపించాలి. తరువాత తూర్పు, పడమటి ద్వారాలలో ***ఓం వైనతేయాయ నమః*** అంటూ గరుత్మంతుని స్థాపించాలి. దక్షిణ ద్వారంలో ***'ఓం సుదర్శనాయ నమః, ఓం సహస్రారాయనమః'*** అని ఉచ్ఛరిస్తూ వేయి అర్రలున్న సుదర్శన చక్రమును స్థాపించాలి. దక్షిణ ద్వారంలోనే ***ఓం శ్రియైనమః*** మంత్రంతో శ్రీ అనే అక్షరాన్ని న్యాసం చేసి ఉత్తర ద్వారంలో ***ఓం లక్ష్మ్యై నమః*** అనే మంత్రంతో లక్ష్మీదేవిని ప్రతిష్ఠించాలి. తరువాత ఉత్తర దిశలో ***ఓం గదాయై నమః*** అంటూ గదనీ, కోణాలలో ***ఓం శంఖాయై నమః*** అంటూ శంఖాన్నీ న్యాసం చేయాలి.

పిమ్మట విష్ణుదేవునికి రెండు వైపులా ఆయుధాల నుంచాలి. దక్షిణం వైపు ధనుస్సు (శారంగము) నీ ఎడమ వైపు బాణములను అలాగే కుడి యెడమలలో కత్తినీ కవచాన్నీ వుంచాలి.

ఆపై సాధకుడు మండలమధ్యంలో దిశాభేదాను సారము తూర్పుతో మొదలెట్టి ఇంద్రాది దిక్పాలకులను వారి ఆయుధాలతో సహా స్థాపించాలి. అలాగే పైకి ***ఓం బ్రహ్మణే నమః*** అనే మంత్రంతో బ్రహ్మదేవునీ ***ఓం అనంతాయ నమః*** అనే మంత్రం ద్వారా అనంతునీ న్యాసం చేయాలి.

ఈ ప్రకారంగా అందరు దేవతల న్యాస, ధ్యాన, పూజనాలను చేస్తూ ఆయా దేవతల కెదురుగా వారి వారి ముద్రలను ప్రదర్శించాలి. అంజలి బద్ధ ముద్ర మొదటి ముద్ర. దీన్ని ప్రదర్శించడం వల్ల దేవసిద్ధి తొందరగా లభిస్తుంది. రెండవది వందినీ ముద్ర. మూడవదైన హృదయాసక్త ముద్రను ఎలా ప్రదర్శించాలంటే ఎడమ పిడికిటిలో కుడిబొటనవ్రేలిని బంధించి ఎడమ బొటన వేలిని పైకెత్తి గుండెకు తగల్చాలి. వ్యూహ పూజలో ఈ మూడిటినీ సాధారణ ముద్రలుగా పరిగణిస్తారు. రెండు చేతుల వేళ్ళనూ ఒకదానికొకటి తగిలించి వుంచి ఒక్కొక్క వ్రేలినీ వదులుకుంటూ పోవడం ద్వారా ఎనిమిది ముద్రలు ఏర్పడతాయి.

రెండు చేతుల బొటనవ్రేళ్ళనూ వాటి మధ్యమ, అనామిక, చిటికెన వ్రేళ్ళకు తగిలించి క్రిందికి వంచి చూపే ముద్రను 'నరసింహ' ముద్ర అంటారు. కుడిచేతిపై ఎడమ చేతిని ఉత్తానస్థితిలో పెట్టి ప్రతిమపై మెల్ల మెల్లగా తిప్పడాన్ని 'వారాహీ' ముద్ర అంటారు. ఆయా దేవుళ్ళకివి ప్రియమైన ముద్రలు. రెండు పిడికిళ్ళను బిగించి ఒకదానిపై నొకటిగా వుంచి ఒక్కొక్క వ్రేలినే మెలమెల్లగా విడిపించి మరల పిడికిళ్ళను బిగించడాన్ని 'అంగముద్ర' అంటారు. పది దిక్కుల పాలకులకూ సాధకుడు ఈ విధంగా ముద్రలను చూపించాలి.

భగవంతుడైన వాసుదేవుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు క్రమంగా ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ దేవస్థానములకు అధికారులైన దేవతలు. కాబట్టి సాధకుడు క్రమంగా ***'ఓం అం వాసుదేవాయనమః, ఓం ఆం బలాయ నమః, ఓం అం ప్రద్యుమ్నాయ నమః, ఓం అః అనిరుద్ధాయ నమః*** అనే మంత్రాలతో పూజించాలి.

ఓంకారం, తత్సత్, హుం, క్షౌం, భూః ఈ అయిదూ క్రమంగా, నారాయణ, బ్రహ్మ విష్ణు, ★ నరసింహ మహావరాహ భగవానుల బీజమంత్రాలు.

కాబట్టి సాధకుడు ***ఓం నారాయణాయ నమః*** మంత్రంతో భగవంతుడైన నారాయణునీ ***ఓం తత్సత్ బ్రహ్మణే నమః*** అనే మంత్రంతో బ్రహ్మదేవునీ, ***ఓం హుం విష్ణవే నమః*** అనే మంత్రంతో విష్ణుదేవునీ, ***ఓం క్షౌం నరసింహాయ నమః*** అనే మంత్రంతో నరసింహునీ, ***ఓం భూః మహా వరాహాయ నమః*** అనే మంత్రంతో ఆదివరాహాన్నీ పూజించాలి.

---

★ *'నరసింహ' అనే శబ్దం సరికాదనీ 'నృసింహ' అనియే ఉండాలనీ కొందరు పండితులంటారు. బీజమంత్రాలు అనే మాట కన్న బీజాక్షరాలు అనే మాట తెలుగు ప్రాంతంలో ఎక్కువగా వాడబడుతోంది.*

పైన చెప్పబడిన తొమ్మండుగురు దేవతలూ (వాసుదేవ, బలరామ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారాయణ, బ్రహ్మ, విష్ణు, నరసింహ, మహావరాహ) నవవ్యూహాధినాథులు. వీరి యొక్క వర్ణాలు క్రమంగా తెలుపు, ఎరుపు, హరిద్ర పీతం, నీలం, నలుపు, ఎరుపు, మబ్బు వంటి నలుపు, అగ్ని వంటి పసుపు, తేనెరంగు (రెండవ ఎరుపు గులాబీ రంగు) ఈ దేవతలంతా ఈయా రంగుల తేజస్సును వెలార్చుతూ వెలిగిపోతుంటారని అర్థము.

ఓంకారం ప్రతి మంత్రానికీ ముందు వాడుతూ విష్ణువు అంగాలుగా ప్రసిద్ధికెక్కిన ఈ క్రింది దేవతలకి ఈయా బీజ మంత్రాలను (బీజాక్షరాలను) వాడాలి. ***ఓం***

| | |
|---|---|
| ***కం టం పం శం*** | ***గరుడుడు*** |
| ***ఝఖం వం*** | ***సుదర్శనం*** |
| ***షం చం ఫం షం*** | ***గద*** |
| ***వం లం మం క్షం*** | ***శంఖ*** |
| ***ఘం ధం భం హం*** | ***లక్ష్మి*** |
| ***గం జం వం శం*** | ***పుష్టి*** |
| ***ఘం వం*** | ***వనమాల*** |
| ***దం సం*** | ***శ్రీవత్సం*** |
| ***ఛం డం పం యం*** | ***కౌస్తుభం*** |

గరుడుడు కమలం వలె ఎఱ్ఱనివాడు. గద నల్లనిది. పుష్టి శిరీష పుష్ప వర్ణంలో, లక్ష్మి బంగారం వలె పచ్చని కాంతులతో వుంటారు. శంఖానిది పూర్ణచంద్రుని వర్ణకాంతి. కౌస్తుభమణి అప్పుడే వికసించిన సూర్యుని అరుణ వర్ణంలో వుంటుంది. సుదర్శునునిది సహస్ర సూర్యకాంతి. శ్రీ వత్సం కుందపుష్పసమాన వర్ణితం, అనగా శ్వేతం. వనమాల పంచవర్ణశోభితం. అనంత భగవానుడు నీలమేఘశ్యాముడు. అస్త్రాలది విద్యుత్కాంతి 'పుండరీకాక్ష' విద్య సహాయంతో పద్ధతిని తెలుసుకొని విష్ణువు యొక్క ఈ సమస్తాంగాలకీ అర్ఘ్య పాద్యాదులను సమర్పించాలి. ***(అధ్యాయం 11)***

## పూజానుక్రమ - నిరూపణం

**రు**ద్రదేవా! ఏ పూజకైనా ఒక క్రమ విధానముంటుంది. దానిని వివరిస్తాను వినండి. సాధకుడు ముందుగా ***ఓం నమః*** మంత్రంతో పరమాత్మను స్మరించాలి. తరువాత ***యం రం వం లమ్*** అనే బీజాక్షరాల ద్వారా శరీరాన్ని శుద్ధి చేసుకొని భగవానుడు చతుర్భుజుడునైన విష్ణువుని తనలోనే ఊహించుకోవాలి.

తరువాత కరన్యాస, దేహన్యాసాలను చేసుకొని ఈ క్రింది మంత్రాల ద్వారా హృదయంలోనే యోగపీఠాన్ని పూజించాలి.

ముందుగా నొక కమలాన్ని స్థాపించి అందులోని భాగాలలో దేవతలనూహించుకొని ఈ మంత్రాలను పఠించాలి.

*ఓం అనంతాయ నమః ।*
*ఓం ధర్మాయ నమః ।*
*ఓం జ్ఞానాయ నమః ।*
*ఓం వైరాగ్యాయ నమః ।*
*ఓం ఐశ్వర్యాయ నమః ।*
*ఓం అధర్మాయ నమః ।*
*ఓం అజ్ఞానాయ నమః ।*
*ఓం అవైరాగ్యాయ నమః ।*
*ఓం అనైశ్వర్యాయ నమః ।*
*ఓం పద్మాయ నమః ।*
*ఓం ఆదిత్య మండలాయ నమః ।*
*ఓం చంద్ర మండలాయ నమః ।*
*ఓం వహ్ని మండలాయ నమః ।*
*ఓం విమలాయై నమః ।*
*ఓం ఉత్కర్షిణ్యై నమః ।*
*ఓం జ్ఞానాయై నమః ।*
*ఓం క్రియాయై నమః ।*
*ఓం యోగాయై నమః ।*
*ఓం ప్రహ్వ్యై నమః ।*
*ఓం సత్యాయై నమః ।*
*ఓం ఈశానాయై నమః ।*
*ఓం సర్వతోముఖ్యై నమః ।*
*ఓం సాంగోపాంగాయ హరేరాసనాయ నమః ।*

తరువాత సాధకుడు కర్ణిక మధ్యలో **అం వాసుదేవాయ నమః** అంటూ వాసుదేవునికి నమస్కరించి ఈ క్రింది మంత్రాలతో హృదయాది న్యాసం చేయాలి.

*'ఆం హృదయాయ నమః ।*
*ఈం శిరసే నమః ।*
*ఊః శిఖాయై నమః ।*
*ఐం కవచాయ నమః ।*
*ఔం నేత్రత్రయాయ నమః ।*
*అః ఫట్ అస్త్రాయ నమః ।*

తరువాత ఈ క్రింది మంత్రాలతో సంకర్షణాది వ్యూహదేవులకు నమస్కారం చేయాలి.

*ఆం సంకర్షణాయ నమః ।*
*అం ప్రద్యుమ్నాయ నమః ।*

*అః అనిరుద్ధాయనమః ।*

*ఓం అః నారాయణాయ నమః ।*

*ఓం తత్సద్ బ్రహ్మణే నమః*

*ఓం హుం విష్ణవే నమః ।*

*క్షౌం నరసింహాయ నమః ।*

*భూర్వరాహాయ నమః ।*

పిమ్మట స్వామి వారి పరివారాన్నీ ఆయుధాలనూ ఇలా కొలుచుకోవాలి.

*కం టం జం శం వైనతేయాయ నమః ।*

*జం ఖం వం సుదర్శనాయ నమః ।*

*ఖం చం ఫం షం గదాయై నమః ।*

*వం లం మం క్షం పాంచజన్యాయ నమః ।*

*ఘం ధం భం హం శ్రియై నమః ।*

*గం డం వం శం పుష్ట్యై నమః ।*

*ధం వం వనమాలాయై నమః ।*

*దం శం శ్రీ వత్సాయ నమః ।*

*ఛం డం యం కౌస్తుభాయ నమః ।*

*శం శారంగాయ నమః ।*

*ఇం ఇషుధిభ్యాం నమః ।*

*చం చర్మణే నమః ।*

*ఖం ఖడ్గాయ నమః ।*

అనంతరం ఈ క్రింది బీజాక్షర సహిత మంత్రాలతో ఇంద్రాది దిక్పాలకులకు నమస్కారం చేయాలి. ప్రతి మంత్రానికీ ముందు 'ఓం' కారాన్ని ఉచ్ఛరించాలి.

*లం ఇంద్రాయ సురాధిపతయే నమః ।*

*రం అగ్నయే తేజోఽధిపతయే నమః ।*

*యమాయ ధర్మాధిపతయే నమః ।*

*క్షం నైరృతాయ రక్షోఽధిపతయే నమః ।*

*వం వరుణాయ జలాధిపతయే నమః ।*

*యోం వాయవే ప్రాణాధిపతయే నమః ।*

*ధాం ధనదాయ ధనాధిపతయే నమః ।*

*హాం ఈశానాయ విద్యాధిపతయే నమః ।*

తరువాత దిక్పాలుర క్రమంలోనే వారి ఆయుధాలను కూడా ఈ క్రింది పద్ధతిలో జపించాలి.

*ఓం వజ్రాయనమః । ఓం శక్త్యై నమః ।*

*ఓం దండాయ నమః । ఓం ఖడ్గాయ నమః ।*

*ఓం పాశాయ నమః । ఓం ధ్వజాయ నమః ।*

*ఓం గదాయై నమః । ఓం త్రిశూలాయ నమః ।*

పిమ్మట అనంతునికీ, బ్రహ్మ దేవునికీ ఈ మంత్రాలతో ప్రణామం చేయాలి.

*ఓం లం అనంతాయ పాతాలాధిపతయే నమః ।*

*ఓం ఖం బ్రహ్మణే సర్వలోకాధిపతయే నమః ।*

అనంతరం సాధకుడు వాసుదేవ భగవానునికి నమస్కరించడానికి ద్వాదశాక్షర మంత్రాన్ని ప్రయోగించాలి.దానితో బాటే పన్నెండక్షరాల బీజయుక్త శబ్దాలనూ, దశాక్షర మంత్రంలోని పదక్షరాల బీజయుక్త శబ్దాలనూ జపించాలి. ఇలా :

*ఓం నమో భగవతే వాసుదేవాయ నమః ।*

*ఓం ఓం నమః । ఓం నం నమః । ఓం మోం నమః ।*

*ఓం ఓం భం నమః । ఓం గం నమః । ఓం వం నమః ।*

*ఓం తేం నమః । ఓం వం నమః । ఓం సుం నమః ।*

*ఓం దేం నమః । ఓం వాం నమః । ఓం యం నమః ।*

*ఓం ఓం నమః । ఓం నం నమః । ఓం మోం నమః ।*

*ఓం నాం నమః । ఓం రాం నమః । ఓం యం నమః ।*

*ఓం ణాం నమః । ఓం యం నమః ।*

ద్వాదశాక్షర మంత్రం – ***ఓం నమోభగవతే వాసుదేవాయ***

దశాక్షర మంత్రం – ***ఓం నమో నారాయణాయ నమః***

అష్టాక్షర మంత్రం – ***ఓం పురుషోత్తమాయ నమః ।***

ఈ మూడు మంత్రాలనూ వీలైనంతగా జపించి ఈ క్రింది మంత్రంతో పుండరీకాక్ష భగవానునికి నమస్కారం చేయాలి.

*నమస్తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన ।*

*సుబ్రహ్మణ్య నమస్తేఽస్తు మహాపురుష పూర్వజ ॥*

ఈ విధంగా విష్ణుదేవుని స్తుతించి అప్పుడు హవనం చేయాలి. తరువాత మహా పురుష విద్యానామక మంత్రాన్ని పద్ధతి ప్రకారం నూటయెనిమిది మార్లు జపించాలి. తదనంతరం ***జితంతేన***తో మొదలగు మహాపురుష విద్యాస్తోత్రాన్ని జప, అర్ఘ్యముల తరువాత పఠించి నారాయణునికి పలుమార్లు ప్రణామం చేయాలి.

తరువాత అగ్నిదేవుని స్థాపించి పూజించి హవనం చేయాలి. విష్ణు దేవునికీ, అచ్యుతాది ఆంగిక దేవతలకీ బీజాక్షర యుక్త మంత్రాలతో ఆహుతులివ్వాలి. మనస్సులోనే సాంగోపాంగంగా బ్రహ్మదేవునీ ఇతర దేవతలనూ పూజించుకొని వారందరినీ మండలంలో స్థాపించాలి. అప్పుడు వాసుదేవ మంత్రంతో నూట యెనిమిది ఆహుతులివ్వాలి. తరువాత సంకర్షణాది ఆరుగురు అంగదేవతలకు మూడేసి ఆహుతులనూ, దిక్పాలకుల కొక్కొక్క ఆహుతినీ ప్రదానం చేయాలి. హవనం పూర్తయినాక ఏకాగ్ర చిత్తంతో పూర్ణాహుతి నివ్వాలి.

తరువాత మన మనోవాక్కాయ కర్మలకు అతీతుడైన పరమాత్మతో సాధకుడు ఆత్మను లీనం చేస్తున్నట్లుగా భావించుకొని దేవతలందరికీ ఈ మంత్రం ద్వారా వీడ్కోలు చెప్పాలి.

***గచ్ఛ గచ్ఛ పరంస్థానం యత్రదేవో నిరంజనః ।***
***గచ్ఛంతు దేవతాః సర్వాః స్వస్థానస్థితహేతవే ॥***

దేవతలారా! సుదర్శన, శ్రీహరి, అచ్యుత, త్రివిక్రమ, చతుర్భుజ, వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, పురుష – ఈ దేవ సమూహాన్నే నవవ్యూహమంటారు. పరమాత్మను కలుపుకుంటే దశాత్మకమవుతుంది. అలాకాకుండా అనిరుద్ధునీ, అనంతునీ కలుపుకుంటే ఇదే ఏకాదశ వ్యూహమవుతుంది. నవవ్యూహానికి పరమతత్త్వాన్నీ, అనిరుద్ధునీ, అనంతునీ కలుపుకుంటే అది ద్వాదశాత్మక వ్యూహంగా చెప్పబడుతుంది.

చక్రాంకిత మంత్రాలను చదివి వాటిని అనగా చక్రరూపాలను ఈ విధంగా బీజాక్షరాలతో పూజించాలి.

***ఓం చక్రాయ స్వాహా । ఓం విచక్రాయ***
***స్వాహా । ఓం సుచక్రాయ స్వాహా ।***
***ఓం మహాచక్రాయ స్వాహా । ఓం అసురాంత***
***కృత్ హుం ఫట్ । ఓం హుం సహస్రార హుం ఫట్ ।***

గృహాన్ని సంరక్షించే పై మంత్రాలతో చేసే పూజకు 'ద్వారకా చక్రపూజ' అని పేరు. ఇది సర్వమంగళదాయిని" ***(అధ్యాయం –12)***

# విష్ణు *పంజర స్తోత్రం

శ్రీహరి ఇంకా ఇలా చెప్పసాగాడు "హే రుద్రదేవా! పరమకల్యాణకారియైన విష్ణు పంజర స్తోత్రాన్ని వచిస్తాను, వినండి.

*ప్రవక్ష్యామ్యధునా హ్యేత ద్వైష్ణవం పంజరం శుభం ॥*
*నమో నమస్తే గోవింద చక్రం గృహ్యా సుదర్శనం ॥*
*ప్రాచ్యాం రక్షస్వమాం విష్ణోత్వామహం శరణం గతః*
*గదాం కౌమోదకీం గృహ్యా పద్మనాభ నమోऽస్తుతే ॥*
*యామ్యాం రక్షస్వమాం విష్ణోత్వా మహం శరణం గతః*
*హలమాదాయ సౌనందం నమస్తే పురుషోత్తమ ॥*
*ప్రతీచ్యాం రక్షమాం విష్ణోత్వామహం శరణం గతః*
*ముసలం శాతనం గృహ్యా పుండరీకాక్షరక్షమాం ॥*
*ఉత్తరస్యాం జగన్నాథ భవంతం శరణం గతః ।*
*ఖడ్గమాదాయ చర్మాథ అస్త్రశస్త్రాదికం హరే ॥*
*నమస్తే రక్ష రక్షోఘ్న ఐశాన్యాం శరణం గతః ।*
*పాంచజన్యం మహాశంఖమనుఘోష్యంచ పంకజం ॥*
*ప్రగృహ్యా రక్షమాం విష్ణో ఆగ్నేయ్యాం యజ్ఞశూకర ।*
*చంద్రసూర్యం సమాగృహ్యా ఖడ్గం చాంద్రమసం తథా ॥*
*నైరృత్యాం మాంచ రక్షస్వ దివ్యమూర్తే నృకేసరిన్ ।*
*వైజయంతీం సంప్రగృహ్యా శ్రీ వత్సంకంఠ భూషణం ॥*
*వాయవ్యాం రక్షమాం దేవ హయగ్రీవ నమోऽస్తుతే ।*
*వైనతేయం సమారూహ్యా త్వంతరిక్షే జనార్దన ।*
*మాం రక్ష స్వాజిత సదా నమస్తేऽస్త్వ పరాజిత ।*
*విశాలాక్ష సమారూహ్యా రక్ష మాంత్వం రసాతలే ।*
*అకూపార నమస్తుభ్యం మహామీన నమోऽస్తుతే ।*
*కరశీర్షాద్యంగులీషు సత్యత్వం బాహు పంజరం ॥*

---

★ *పంజరమనగా "రక్షించునది' అని అర్థము. విష్ణువను పేరు గల రక్షకుడు మనం ఈ స్తోత్రం చేస్తే మనను రక్షిస్తాడు.*

కృత్వారక్ష స్వమాం విష్ణో నమస్తే పురుషోత్తమ ।
ఏతదుక్తం శంకరాయ వైష్ణవం పంజరం మహత్
పురారక్షార్థ మీశాన్యాః కాత్యాయన్యా వృషధ్వజ ।
నాశయామాస సాయేన చామరం మహిషాసురం ॥
దానవం రక్తబీజంచ అన్యాంశ్చ సురకంటకాన్ ।
ఏతజ్జపన్నరో భక్త్యా శత్రూన్ విజయతే సదా ॥ **(ఆచార కాండ 13/1-14)**

*(ఈ స్తోత్రంలో యజ్ఞశూకర శబ్దం వాడబడింది. వామన పురాణం 17వ అధ్యాయంలో కూడ ఇదే పదం వరాహస్వామిపరంగా వాడబడింది. విశాలాక్షశబ్దం గరుడవంశ విశేషమని శబ్దకల్పద్రుమంలో కనిపిస్తోంది. అలాగే ఆకూపారమనగా మేదినీకోశం ప్రకారం కూర్మావతారం)*

పరమశివా! ప్రాచీన కాలంలో సర్వ ప్రథమముగా నేనీ విష్ణు పంజర నామక స్తోత్రాన్ని భగవతి కాత్యాయని దేవికి ఉపదేశించాను. దీనిని పఠించిన ఫలితంగా ఆమెలోని శక్తులన్నీ జాగృతమై అమరులనే ఒక ఆట ఆడించి గెలిచి నిలిచిన మహిషాసురుడు, రక్తబీజుడు వంటి రాక్షస వీరులను నిర్మూలించగలిగింది. దీనిని అనగా ఈ విష్ణు పంజర నామక స్తుతిని మంత్రం వలె శ్రద్ధాభక్తులతో జపించు మానవులు జీవితంలో ప్రతి దశలోనూ విజయాన్నే పొందుతారు. **(అధ్యాయం - 13)**

# ధ్యాన - యోగవర్ణన

పరమేశ్వరా! భోగాన్నీ మోక్షాన్నీ ఇచ్చే శక్తి యోగానికుంటుంది. యోగులు ధ్యానం ద్వారా పరమాత్మను పొందగలరు. యోగానికీ ధ్యానానికీ గమ్యమైనవాడు పరమాత్మయే. అట్టి యోగాన్ని తత్త్వసారంలో భాగంగా మీకు వినిపిస్తాను. ఇది సమస్త పాపనాశకరం. దీనిని యోగి ఇటువంటి భావనతో సంకల్పంతో ప్రారంభిస్తాడు. ఇలా :

'నేను విష్ణువును. నేనే అందరికీ ఈశ్వరుడను. నేనే అనంతుడను. ★షడూర్మ రహితుడనూ నేనే. నేను వాసుదేవుడను. నేనే జగన్నాథుడను. బ్రహ్మరూపమూ నాదే. సమస్త ప్రాణుల శరీరాలలోనుండు ఆత్మనూ, సర్వదేహ విముక్తుడైన పరమాత్మనూ నేనే.

---

★ 'షడూర్మ - శోకమోహౌ జరా మృత్యూ క్షుత్పిపాసే షడూర్మయః - అని శబ్ద కల్పద్రుమంలో చెప్పబడింది. శోకం, మోహం, ముసలితనం, మరణం, ఆకలి, దప్పిక అనే ఆరు ఊర్ములు మనిషిని బాధిస్తాయి. యోగిని బాధించలేవు.

క్షరానికీ (ప్రపంచం) అక్షరానికీ (చేతన) అతీతుడను, శరీరధర్మరహితుడను, ఇంద్రియాలకు లొంగని అతీంద్రి యుడను, హోతను, ద్రష్టను, శ్రోతను, ఘ్రాత (గంధాన్ని గ్రహించు వాడు)నూ నేనే.

అందరి మనసులలో నేనుంటాను గాని నాకు మనసు లేదు. విజ్ఞానినీ జ్ఞాన స్వరూపాన్నీ నేనే. ★దృగ్రూపుడను నేనే. ప్రాణులలో ప్రాణస్వరూపుడను, అహంకారాది రహితుడను, అహంకార జన్య వికారాల నుండి కూడ ముక్తుడను నేనే.

ఈ జగత్తుకి సాక్షినీ, నియంతనూ నేనే. పరమానంద స్వరూపమూ నాదే. జగత్తు యొక్క జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలకు సాక్షీభూతుడనైన నాకు ఏ అవస్థలూ వుండవు. తురీయ బ్రహ్మనూ విధాతనూ నేనే. ★దృగ్రూప పరమాత్మనూ నేనే. ***(సమస్త ప్రపంచానికీ ద్రష్టం, దృశ్యం, దృష్టి అనేవి ఉంటాయి. ఈ మూడూ పరమాత్మే. ఆయనే దృగ్రూపుడు)*** నిర్గుణ, ముక్త, బుద్ధ, శుద్ధ, ప్రబుద్ధ, అజర, సర్వవ్యాపి, సత్యస్వరూప, శివస్వరూప పరమాత్మను నేనే'.

ఈ ప్రకారం విద్వాంసుడైన యోగి పరమాత్మను పూర్తిగా తెలుసుకొని, తానే పరమాత్మననే ధ్యానంలోకి సంపూర్ణంగా నిష్క్రమించి, ఆయన సారూప్యాన్ని పొందుతాడు. ఇదే ధ్యానయోగము. సువ్రతులలో నుత్తముడవగు శంకరదేవా! నీవు మాత్రమే నిజమైన సంపూర్ణ ధ్యానయోగివి కాగలిగావు. ఇకపై ఈ ధ్యాన యోగమును పఠించిన వారికి చింతన, మననాలను చేసేవారికీ విష్ణులోకం ప్రాప్తిస్తుంది." ***(అధ్యాయం - 14)***

# విష్ణు సహస్రనామం

***(విశ్వం విష్ణుర్వషట్కారో... అని ప్రారంభమయ్యే విష్ణు సహస్రనామం మరొకటుంది. దానిని శ్రీ కృష్ణుని సమ్ముఖంలో భీష్ముడు ధర్మరాజునకుపదేశించాడు. అది వేరు)***

"హే ప్రభో! అగాధమగు జలనిధి వంటి ఈ సంసారాన్ని సురక్షితంగా దాటించి నీ వద్దకు గొని తేగల నావ వంటి మహామంత్రాన్నుపదేశించండి" అని ప్రార్థించాడు శివుడు.

జగదానందకారకులలో తనంతటి వాడైన పరమేశ్వరుడీ ప్రార్థనను లోక కల్యాణం కోసమే చేశాడని గ్రహించిన మహావిష్ణువు ఆనందంగా ఇలా బోధించసాగాడు.

---

*★ దృగ్రూపుడనగా సమస్త ప్రపంచానికీ ద్రష్ట. దృశ్యము, దృష్టి అయినవాడు*
*★ దృగ్రూప*

“పరమేశా! పరమబ్రహ్మ, పరమాత్మ, నిత్యుడు, పరమేశ్వరుడునైన విష్ణుభగవానుని సహస్రనామాలతో స్తుతిస్తే మానవులు భవసాగరాన్ని దాటగలరు. ఆ పవిత్ర, శ్రేష్ఠతమ, జపయోగ్య, సమస్త పాప వినాశకర మహా స్తోత్రాన్ని వినిపిస్తాను, ఆకర్ణించండి.

**ఓం**

*వాసుదేవోమహావిష్ణుర్వామనో వాసవో వసుః ।*
*బాలచంద్ర నిభోబాలో బలభద్రో బలాధిపః ॥*

*బలిబంధన కృద్వేధా వరేణ్యో వేదవిత్ కవిః ।*
*వేదకర్తా వేదరూపో వేద్యో వేద పరిప్లుతః ॥*

*వేదాంగ వేత్తా వేదేశో బలాధారో బలార్దనః ।*
*అవికారో వరేశశ్చ వరుణో వరుణాధిపః ॥*

*వీరహాచ బృహద్వీరో వందితః పరమేశ్వరః ।*
*ఆత్మాచ పరమాత్మాచ ప్రత్యగాత్మా వియత్పరః ॥*

*పద్మనాభః పద్మనిధిః పద్మహస్తో గదాధరః ।*
*పరమః పరభూతశ్చ పురుషోత్తమ ఈశ్వరః ॥*
*పద్మ జంఘః పుండరీకః పద్మమాలాధరః ప్రియః ।*
*పద్మాక్షః పద్మగర్భశ్చ పర్జన్యః పద్మసంస్థితః ॥*

*అపారః పరమార్థశ్చ పరాణాంచ పరః ప్రభుః ।*
*పండితః పండితే ద్యశ్చ పవిత్రః పాపమర్దకః ॥*

*శుద్ధః ప్రకాశరూపశ్చ పవిత్రః పరిరక్షకః ।*
*పిపాసావర్జితః పాద్యః పురుషః ప్రకృతి స్తథా ॥*

*ప్రధానం పృథివీ పద్మం పద్మనాభః ప్రియంవదః ।*
*సర్వేశః సర్వగః సర్వః సర్వవిత్ సర్వదః సురః ॥*

*సర్వస్య జగతోధామ సర్వదర్శీచ సర్వభృత్ ।*
*సర్వానుగ్రహకృద్దేవః సర్వభూత హృదిః స్థితః ॥*

*సర్వపూజ్యశ్చ సర్వాద్యః సర్వదేవనమస్కృతః ।*
*సర్వస్య జగతో మూలం సకలో నిష్కలోఽ నలః ॥*

సర్వగోప్తా సర్వ నిష్ఠః సర్వకారణ కారణం ।
సర్వధ్యేయః సర్వమిత్రః సర్వదేవ స్వరూప ధృక్ ॥

సర్వాధ్యక్షః సురాధ్యక్షః సురాసుర నమస్కృతః ।
దుష్టానాం చాసురాణాంచ సర్వదా ఘాతుకోఽంతక ॥

సత్యపాలశ్చ సన్నాభః సిద్ధేశః సిద్ధ వందితః ।
సిద్ధి సాధ్యః సిద్ధి సిద్ధః సాధ్యసిద్ధో హృదీశ్వరః ॥

శరణం జగతశ్చైవ శ్రేయః క్షేమస్త థైవచ ।
శుభకృచ్ఛోభనః సౌమ్యః సత్యః సత్య పరాక్రమః ॥

సత్యస్థః సత్యసంకల్పః సత్యవిత్ సత్యదస్తథా ।
ధర్మో ధర్మీచ కర్మీచ సర్వకర్మ వివర్జితః ॥

కర్మ కర్తాచ కర్మైవ క్రియా కార్యం తథైవచ ।
శ్రీపతిర్ నృపతిః శ్రీమాన్ సర్వస్య పతిరూర్జితః ॥

సదేవానాం పతిశ్చైవ వృష్ణీనాం పతిరీడితః ।
పతిర్ హిరణ్యగర్భస్య త్రిపురాంత పతి స్తథా ॥
పశూనాంచ పతిః ప్రాయోవసూనాం పతి రేవచ ।
పతిరాఖండల స్యైవ వరుణస్యపతిస్తథా ॥

వనస్పతీ నాంచ పతిర నిలస్య పతిస్తథా ।
అనలశ్చ పతిశ్చైవ యమస్య పతిరేవచ ॥

కుబేరస్యపతిశ్చైవ నక్షత్రాణాం పతిస్తథా ।
ఓషధీనాం పతిశ్చైవ వృక్షాణాంచ పతిస్తథా ॥

నాగానం పతిరర్కస్య దక్షస్య పతిరేవచ ।
సుహృదాంచ పతిశ్చైవ నృపాణాంచ పతిస్తథా ॥

గంధర్వాణాం పతిశ్చైవ అసూనాం పతిరుత్తమః ।
పర్వతానం పతిశ్చైవ నిమ్నగానాం పతిస్తథా ॥

సురాణాంచ పతిఃశ్రేష్టః కపిలస్య పతిస్తథా ।
లతానాంచ పతిశ్చైవ వీరుధాం చ పతి స్తథా ॥

మునీనాంచ పతిశ్చైవ సూర్యస్య పతిరుత్తమః ।
పతిశ్చంద్రమసః శ్రేష్ఠఃశుక్రస్య పతిరేవచ ॥

గ్రహాణాంచ పతిశ్చైవ రాక్షసానాం పతి స్తథా ।
కిన్నరాణాం పతిశ్చైవ ద్విజానాం పతిరుత్తమః ॥

సరితాంచ పతిశ్చైవ సముద్రాణాం పతి స్తథా ।
సరసాంచ పతిశ్చైవ భూతానాం చ పతిస్తథా ॥

వేతాలానాం పతిశ్చైవ కూష్మాండానాం పతిస్తథా ।
పక్షిణాంచ పతిః శ్రేష్ఠః పశూనాం పతి రేవచ ॥

మహాత్మా మంగలో ఽమేయో మందరో మందరేశ్వరః ।
మేరుర్మాతా ప్రమాణంచ మాధవో మల వర్జితః ॥

మాలాధరో మహాదేవో మహాదేవేన పూజితః ।
మహాశాంతో మహాభాగో మధుసూదన ఏవచ ॥

మహావీర్యో మహాప్రాణో మార్కండేయర్షి వందితః ।
మాయాత్మామాయయా బద్ధో మాయయా తు వివర్జితః ॥

మునిస్తుతో మునిర్మైత్రో మహానాసో మహాహనుః ।
మహాబాహుర్మహాదంతో మరణేన వివర్జితః ॥

మహావక్త్రో మహాత్మాచ మహాకాయో మహోదరః ।
మహా పాదో మహాగ్రీవో మహామానీ మహామనాః ॥

మహాగతిర్మహా కీర్తిర్మహారూపో మహాసురః ।
మధుశ్చ మాధవశ్చైవ మహాదేవో మహేశ్వరః ॥

మఖేజ్యో మఖ రూపీచ మాననీయో మఖేశ్వరః ।
మహావాతో మహాభాగో మహేశో ఽ తీత మానుషః ॥

మానవో మనుజశ్చైవ మానవానాం ప్రియంకరః ।
మృగశ్చ మృగ పూజ్యశ్చ మృగాణాంచ పతిస్తథా ॥

బుధస్యచ పతిశ్చైవ పతిశ్చైవ బృహస్పతేః ।
పతిః శనైశ్చరస్యైవ రాహోః కేతోః పతిస్తథా ॥

లక్ష్మణో లక్షణశ్చైవ లంబౌష్ఠో లలితస్తథా ।
నానాలంకార సంయుక్తో నానాచందన చర్చితః ॥

నానారసోజ్జ్వల ద్వక్త్రో నానాపుష్పోపశోభితః ।
రామో రమాపతిశ్చైవ త్రాతార్యః పరమేశ్వరః ॥

రత్నదో రత్నహర్తాచ రూపీ రూప వివర్జితః ।
మహారూపో(గ్రరూపశ్చ సౌమ్య రూపస్తథైవచ ॥

నీలమేఘ నిభఃశుద్ధః కాలమేఘనిభస్తథా ।
ధూమవర్ణః పీతవర్ణో నానావర్ణో హ్యవర్ణకః ॥

విరూపోరూప దశ్చైవ శుక్లవర్ణస్తథైవచ ।
సర్వవర్ణోమహాయోగీ యజ్ఞోయజ్ఞకృదేవచ ॥

సువర్ణ వర్ణ వాంశ్చైవ సువర్ణాఖ్యస్తథైవచ ।
సువర్ణావయవశ్చైవ సువర్ణః స్వర్ణమేఖలః ॥

సువర్ణస్య(ప్రదాతాచ సువర్ణేశస్తథైవచ ।
సువర్ణస్య (ప్రియశ్చైవ సువర్ణాఢ్య స్తథైవచ ॥

సువర్ణీచ మహాపర్ణీ సువర్ణస్యచ కారణం ।
వైనతేయస్తథాదిత్య ఆదిరాదికరః శివః ॥

కారణం మహతశ్చైవ (ప్రధానస్య చ కారణం ।
బుద్ధీ నాం కారణం చైవ కారణం మనసస్తథా ॥

కారణం చేత సశ్చైవ అహంకారస్యకారణం ।
భూతానాం కారణం తద్వత్ కారణం చ విభావసోః ॥

ఆకాశకారణం తద్వత్ పృథివ్యాః కారణం పరం ।
అండస్య కారణం చైవ (ప్రకృతేః కారణం తథా ॥

దేహస్య కారణం చైవ చక్షుషశ్చైవ కారణం ।
క్షే(త్రస్య కారణం తద్వత్ కారణం చ త్వచస్తథా ॥

జిహ్వాయాః కారణం చైవ (ప్రాణ స్యైవచ కారణం ।
హస్తయోః కారణం తద్వత్ పాదయోః కారణం తథా ॥

వాచశ్చ కారణం తద్వత్ పాయో శ్చైవతు కారణం ।
ఇం(ద్రస్య కారణం చైవ కుబేరస్య చ కారణం ॥

యమస్య కారణం చైవ ఈశానస్య చ కారణం ।
యక్షాణాం కారణం చైవ రక్షసాం కారణం పరం ॥

నృపాణాం కారణం (శ్రేష్ఠం ధర్మస్యైవతుకారణం ।
జంతూనాం కారణంచైవ వసూనాంకారణం పరం ॥

మనూనాం కారణం చైవ పక్షిణాం కారణం పరం ।
మునీనాం కారణం శ్రేష్ఠం యోగినాం కారణం పరం ॥

సిద్ధానాం కారణం చైవ యక్షాణాం కారణం పరం ।
కారణం కిన్నరాణాంచ గంధర్వాణాంచ కారణం ॥

నదానాం కారణం చైవ నదీనాం కారణం పరం ।
కారణం చ సముద్రాణాం వృక్షాణాం కారణం తథా ॥

కారణం వీరుధాం చైవలోకానాం కారణం తథా ।
పాతాళ కారణం చైవ దేవానాం కారణం తథా ॥
సర్పాణాం కారణం చైవ శ్రేయసాం కారణం తథా ।
పశూనాం కారణం చైవ సర్వేషాం కారణం తథా ॥

దేహాత్మా చేంద్రియాత్మాచ ఆత్మాబుద్ధిస్త థైవచ ।
మనసశ్చత థైవాత్మా చాత్మాహం కార చేతసః ॥

జాగ్రతః స్వపత శ్చాత్మామహదాత్మా పరస్తథా ।
ప్రధానస్య పరాత్మా చ ఆకాశాత్మా హ్యపాం తథా ॥

పృథివ్యాః పరమాత్మాచ రసస్యాత్మా తథైవచ ।
గంధస్య పరమాత్మా చ రూపస్యాత్మా పరస్తథా ॥

శబ్దాత్మాచైవ వాగాత్మా స్పర్శాత్మా పురుషస్తథా ।
శ్రోతాత్మాచ త్వగాత్మాచ జిహ్వాత్మా పరమస్తథా ॥

ఘ్రాణాత్మా చైవ హస్తాత్మా పాదాత్మా పరమస్తథా ।
ఉపస్థస్య తదైవాత్మా పాధ్వాత్మా పరమస్తథా ॥

ఇంద్రాత్మా చైవ బ్రహ్మాత్మా రుద్రాత్మా చ మనోస్తథా ।
దక్షప్రజాపతేరాత్మా సత్యాత్మా పరమస్తథా ॥

ఈశాత్మా పరమాత్మాచ రౌద్రాత్మామోక్ష విద్యతిః ।
యత్నవాంశ్చయత్నశ్చర్మీ తథా ఖడ్గీ మురాంతకః ॥

ప్రీప్రవర్తన శీలశ్చయతీనాంచ హితే రతః ।
యతిరూపీ చ యోగీచయోగిధ్యేయో హరిఃశితి ॥

సంవిన్మేధాచ కాలశ్చ ఊష్మావర్షామతిస్తథా ।
సంవత్సరో మోక్షకారో మోహప్రధ్వంసక స్తథా ॥

మోహకర్తాచ దుష్టానాం మాండవ్యో వడవాముఖః ।
సంవర్తః కాలకర్తాచ గౌతమో భృగురంగిరాః ॥

అత్రిర్వసిష్ఠః పులహః పులస్త్యః కుత్స ఏవచ ।
యాజ్ఞవల్క్యో దేవలశ్చవ్యాస శ్చైవ పరాశరః ॥

శర్మదశ్చైవ గాంగేయో హృషీకేశో బృహచ్ఛ్రవాః ।
కేశవః క్లేశహంతాచ సుకర్ణః కర్ణవర్జితః ॥
నారాయణో మహాభాగః ప్రాణస్య పతిరేవచ ।
అపానస్య పతిశ్చైవ వ్యానస్య పతిరేవచ ॥

ఉదానస్య పతిః శ్రేష్ఠః సమానస్య పతిస్తథా ।
శబ్దశ్య చ పతిః శ్రేష్ఠః స్పర్శశ్చ పతిరేవచ ॥

రూపాణాంచ పతిశ్చాద్యః ఖడ్గపాణిర్హలాయుధః ।
చక్రపాణిః కుండలీచ శ్రీవత్సాంక స్తథైవచ ।

ప్రకృతిః కౌస్తుభగ్రీవః పీతాంబరధరస్తథా ।
సుముఖో దుర్ముఖశ్చైవ ముఖేన తు వివర్జితః ॥

అనంతోఽనంత రూపశ్చ సునఖః సురమందరః ।
సుకపోలో విభుర్జిష్ణుర్భ్రాజిష్ణు శ్చేషు ధీస్తథా ॥

హిరణ్యకశిపోర్హంతా హిరణ్యాక్ష విమర్దకః ।
నిహంతా పూతనాయాశ్చ భాస్కరాంత వినాశనః ॥

కేశినోదలనశ్చైవ ముష్టికస్య విమర్దకః ।
కంసదానవభేత్తాచ చాణూరస్య ప్రమర్దకః ॥

అరిష్టస్య నిహంతాచ అక్రూరప్రియ ఏవచ ।
అక్రూరః క్రూరరూపశ్చ అక్రూరప్రియ వందితః ॥

భగహా భగవాన్ భానుస్తథా భాగవతః స్వయం ।
ఉద్ధవశ్చోద్ధవ స్యేశో హ్యుద్ధవేన విచింతితః ॥

చక్రధృక్ చంచలశ్చైవ చలాచల వివర్జితః ।
అహంకారో పమశ్చిత్తం గగనం పృథివీ జలం ॥

వాయుశ్చక్షుస్తథా శ్రోత్రం జిహ్వాచఘ్రాణమేవచ ।
వాక్పాణి పాదజ వనః పాయూపస్థస్త థైవచ ॥

శంకరశ్చైవ సర్వశ్చ క్షాంతిదః క్షాంతి కృన్నరః ।
భక్తప్రియస్తథా భర్తా భక్తిమాన్ భక్తి వర్ధనః ॥

భక్తస్తుతో భక్తపరః కీర్తిదః కీర్తి వర్ధనః ।
కీర్తిర్దీప్తిః క్షమాకాంతి ర్భక్తశ్చైవ దయాపరా ॥
దానందాతాచ కర్తాచ దేవ దేవ ప్రియః శుచిః ।
శుచిమాన్ సుఖదోమోక్షః కామశ్చార్థః సహస్రపాత్ ॥

సహస్రశీర్షా వైద్యశ్చ మోక్ష ద్వారంతథైవచ ।
ప్రజాద్వారం సహస్రాక్షః సహస్రకర ఏవచ ॥

శుక్రశ్చ సుకిరీటీచ సుగ్రీవః కౌస్తుభస్తథా ।
ప్రద్యుమ్న శ్చాని రుద్ధశ్చ హయగ్రీవశ్చ సూకరః ॥

మత్స్యః పరశురామశ్చ ప్రహ్లాదో బలిరేవచ ।
శరణ్యశ్చైవ నిత్యశ్చ బుద్ధో ముక్తః శరీరభృత్ ॥

ఖరదూషణ హంతాచ  రావణస్య ప్రమర్దనః ।
సీతాపతిశ్చ వర్ధిష్ణుర్ భరతశ్చ తథైవచ ॥

కుంభేంద్రజిన్నిహంతా చ కుంభకర్ణ ప్రమర్దనః ।
నరాంత కాంత కశ్చైవ దేవాంతక వినాశనః ॥

దుష్టాసుర నిహంతాచ శంబరారి స్తథైవచ ।
నరకస్య నిహంతాచ త్రిశీర్షస్య వినాశనః ॥

యమలార్జున భేత్తాచ తపోహిత కరస్తథా ।
వాదిత్రం చైవ వాద్యం చ బుద్ధశ్చైవ వరప్రదః ॥

సారః సారప్రియః సౌరః కాలహంతృ నికృంతనః ।
అగస్త్యో దేవలశ్చైవ నారదో నారదప్రియః ॥

ప్రాణోఽ పాన స్తథా వ్యానో రజః సత్త్వం తమః శరత్ ।
ఉదానశ్చ సమానశ్చ భేషజం చ భిషక్తథా ॥

కూటస్థః స్వచ్ఛరూపశ్చ సర్వదేహ వివర్జితః ।
చక్షురింద్రియ హీనశ్చ వాగింద్రియ వివర్జితః ॥

హస్తేంద్రియ విహీనశ్చ పాదాభ్యాం చ వివర్జితః ।
పాయూపస్థ విహీనశ్చ మహాతాప వివర్జితః ॥

ప్రబోధేన విహీనశ్చ బుద్ధ్యాచైవ వివర్జితః ।
చేతసాపి గతశ్చైవ ప్రాణేన చ వివర్జితః ॥
అపానేన విహీనశ్చ వ్యానేన చ వివర్జితః ।
ఉదానేన విహీనశ్చ సమానేన వివర్జితః ॥

ఆకాశేన విహీనశ్చ వాయునా పరివర్జితః ।
అగ్నినా చ విహీనశ్చ ఉదకేన వివర్జితః ॥

పృథివ్యాచ విహీనశ్చ శబ్దేనచ వివర్జితః ।
స్పర్శేనచ విహీనశ్చ సర్వరూప వివర్జితః ॥

రాగేణ విగతశ్చైవ అఘేన పరివర్జితః ।
శోకేన రహితశ్చైవ వచసా పరివర్జితః ॥

రజో వివర్జితశ్చైవ వికారైః షడ్భిరేవచ ।
కామేన వర్జితశ్చైవ క్రోధేన పరివర్జితః ॥

లోభేన విగతశ్చైవ దంభేన చ వివర్జితః ।
సూక్ష్మశ్చైవ సుసూక్ష్మశ్చ స్థూలాస్థూలతరస్తథా ॥

విశారదో బలాధ్యక్షః సర్వస్యక్షోభకస్తథా ।
ప్రకృతేః క్షోభకశ్చైవ మహతః క్షోభకస్తథా ॥

భూతానాం క్షోభకశ్చైవ బుద్ధేశ్చ క్షోభకస్తథా ।
బ్రహ్మణః క్షోభకశ్చైవ రుద్రస్యక్షోభక స్తథా ॥

ఇంద్రియాణాం క్షోభకశ్చ విషయక్షోభక స్తథా ।
అగమ్యశ్చక్షు రాదేశ్చ శ్రోత్రాగమ్య స్త థైవచ ॥

అగమ్యశ్చైవ పాణిభ్యాం పదాగమ్యస్తథైవచ ।
అగ్రాహ్యోమనస శ్చైవ బుద్ధ్యాఽ గ్రాహ్యోహరిస్తథా ॥

అహంబుద్ధ్యా తథాగ్రాహ్య శ్చేతసాగ్రాహ్య ఏవచ ।
శంఖపాణి శ్చావ్యయశ్చగదాపాణి స్తథైవచ ॥

శారంగపాణిశ్చ కృష్ణశ్చజ్ఞానమూర్తిః పరంతపః ।
తపస్వీ జ్ఞానగమ్యోహిజ్ఞానీ జ్ఞాన విదేవచ ॥

జ్ఞేయశ్చజ్ఞేయ హీనశ్చ జ్ఞప్తిశ్చైతన్య రూపకః ।
భావోభావ్యో భవ కరోభావనోభవ నాశనః ॥

గోవిందో గోపతిర్గోపః సర్వగోపీ సుఖప్రదః ।
గోపాలో గోగతి శ్చైవ గోమతిర్గోధర స్తథా ॥

ఉపేంద్రశ్చ నృసింహశ్చ శౌరిశ్చైవ జనార్దనః ।
ఆరణేయో బృహద్భానుర్ బృహదీప్తిస్తథైవచ ॥

దామోదరస్త్రి కాలశ్చ కాలజ్ఞః కాలవర్జితః ।
త్రిసంధ్యో ద్వాపరం త్రేతాప్రజాద్వారం త్రివిక్రమః ॥

విక్రమోదండ హస్తశ్చ హ్యేకదండీ త్రిదండధృక్ ।
సామభేదస్తథోపాయః సామరూపీచ సామగః ॥

సామవేదో హ్యథర్వశ్చ సుకృతః సుతరూపణః ।
అథర్వవేద విచ్చైవ హ్యథర్వాచార్య ఏవచ ॥

ఋగ్రూపీ చైవ ఋగ్వేద ఋగ్వేదేషు ప్రతిష్ఠితః ।
యజుర్వేత్తా యజుర్వేదో యజుర్వేద విదేకపాత్ ॥

బహుపాచ్య సుపాచ్చైవ తథైవచ సహస్రపాత్ ।
చతుష్పాచ్య ద్విపాచ్చైవ స్మృతిర్న్యాయోయమోబలీ ॥

సన్యాసీ చైవ సన్యాసశ్చతు రాశ్రమ ఏవచ ।
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః ॥

బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రో వర్ణస్తథైవచ ।
శీలదః శీల సంపన్నో దుః శీలపరివర్జితః ॥

మోక్షోఽ ధ్యాత్మ సమావిష్టః స్తుతిః స్తోతాచ పూజకః ।
పూజ్యో వాక్కరణం చైవ వాచ్యం చైవతువాచకః ॥

వేత్తా వ్యాకరణం చైవ వాక్యం చైవచ వాక్యవిత్ ।
వాక్యగమ్య స్తీర్థవాసీ తీర్థస్తీర్థీచ తీర్థవిత్ ॥

తీర్థాదిభూతః సాంఖ్యశ్చ నిరుక్తం త్వధిదైవతం ।
ప్రణవః ప్రణవేశశ్చ ప్రణవేన ప్రవందితః ॥

ప్రణవేన చలక్ష్యో వై గాయత్రీచ గదాధరః ।
శాలగ్రామ నివాసీ చ శాలగ్రామ స్త థైవచ ॥

జలశాయీ యోగశాయీ శేషశాయీ కుశేశయః ।
మహీభర్తా చ కార్యంచ కారణం పృథివీధరః ॥

ప్రజాపతిః శాశ్వతశ్చ కామ్యః కామయితా విరాట్ ।
సమ్రాట్ పూషాతథా స్వర్గోరథస్థః సారథిర్బలం ॥

ధనీ ధనప్రదో ధన్యోయాదవానాం హితేరతః ।
అర్జునస్య ప్రియశ్చైవ హ్యర్జునో భీమ ఏవచ ॥

పరాక్రమోదుర్విషహః సర్వశాస్త్ర విశారదః ।
సారస్వతో మహాభీష్మః పారిజాత హరస్తథా ॥

అమృతస్య ప్రదాతాచ క్షీరోదః క్షీరమేవచ ।
ఇంద్రాత్మజ స్తస్య గోప్తా గోవర్ధనధరస్తథా ॥

కంసస్య నాశనస్త ద్వద్ధస్తి పో హస్తినాశనః ।
శిపివిష్టః ప్రసన్నశ్చ సర్వలోకార్తి నాశనః ॥

ముద్రోముద్రాకరశ్చైవ సర్వ ముద్రా వివర్జితః ।
దేహీ దేహస్థితశ్చైవ దేహస్యచ నియామకః ॥

శ్రోతాశ్రోతృ నియంతాచ శ్రోతవ్యః శ్రవణం తథా ।
త్వక్ స్థితశ్చ స్పర్శయిత్వా స్పృశ్యంచ స్పర్శనం తథా ॥

రూపద్రష్టా చ చక్షుః స్థోనియంతా చక్షుషస్తథా ।
దృశ్యం చైవ తు జిహ్వాస్థో రసజ్ఞశ్చ నియామకః ॥

ఘ్రాణాస్థోఘ్రాణ కృద్ఘ్రాతా ఘ్రాణేంద్రియ నియామకః ।
వాక్స్థో వక్తాచ వక్తవ్యో వచనం వాఙ్మియా మకః ॥

ప్రాణిస్థః శిల్పకృచ్ఛిల్పీ హస్తయో శ్చ నియామకః ।
పదవ్యశ్చైవ గంతాచ గంతవ్యం గమనం తథా ॥

నియంతా పాదయోశ్చైవ పద్మభాక్ చ విసర్గ కృత్ ।
విసర్గస్య నియంతాచ హ్యుపస్థస్థః సుఖం తథా ॥

ఉపస్థస్య నియంతాచ తదానంద కరశ్చహ ।
శత్రుఘ్నః కార్తవీర్యశ్చ దత్తాత్రేయ స్తథైవచ ॥

అలర్కస్య హితశ్చైవ కార్తవీర్య నికృంతనః ।
కాలనేమిర్మహానేమి ర్మేఘోమేఘ పతిస్తథా ॥

అన్నప్రదోఽన్న రూపీచ హ్యన్నాదోఽన్న ప్రవర్తకః ।
ధూమకృద్ధూ మరూపశ్చ దేవకీ పుత్ర ఉత్తమః ॥

దేవక్యానందనో నందో రోహిణ్యాః ప్రియ ఏవచ ।
వసుదేవ ప్రియశ్చైవ వసుదేవ సుత స్తథా ॥

దుందుభిర్హా సరూపశ్చ పుష్పహాసస్తథైవచ ।
అట్టహాస ప్రియశ్చైవ సర్వాధ్యక్షః క్షరోఽక్షరః ॥

అచ్యుతశ్చైవ సత్యేశః సత్యాయాశ్చ ప్రియోవరః ।
రుక్మిణ్యాశ్చపతి శ్చైవ రుక్మిణ్యా వల్లభస్తథా ॥

గోపీనాం వల్లభశ్చైవ పుణ్యశ్లోకశ్చ విశ్రుతః ।
వృషాక పిర్య మోగుహ్యో మకులశ్చ బుధస్తథా ॥

రాహుః కేతుర్గ్రహోగ్రాహో గజేంద్రముఖ మేలకః ।
గ్రాహస్య వినిహంతాచ గ్రామణీ రక్షక స్తథా ॥

కిన్నరశ్చైవ సిద్ధశ్చ ఛందః స్వచ్ఛంద ఏవచ ।
విశ్వరూపో విశాలాక్షో దైత్య సూదన ఏవ చ ॥

అనంత రూపో భూతస్థో దేవ దానవ సంస్థితః ।
సుషుప్తి స్థః సుషుప్తిశ్చస్థానం స్థానాంత ఏవచ ॥

జగత్‌స్థశ్చైవ జాగర్తా స్థానం జాగరితం తథా ।
స్వప్నస్థః స్వప్నవిత్ స్వప్నస్థానం స్వప్నస్తథైవచ ॥

జాగ్రత్‌స్వప్న సుషుప్తైశ్చ విహీనో వై చతుర్థకః ।
విజ్ఞానం వేద్యరూపం చ జీవోజీవయితా తథా ॥

భువనాధిపతిశ్చైవ భువనానాం నియామకః ।
పాతాలవాసీ పాతాలం సర్వజ్వర వినాశనః ॥

పరమానంద రూపీచ ధర్మాణాంచ ప్రవర్తకః ।
సులభోదుర్లభశ్చైవ ప్రాణాయామ పరస్తథా ॥

ప్రత్యాహారో ధారకశ్చ ప్రత్యాహార కరస్తథా ।
ప్రభాకాంతి స్తథాహ్యర్చిః శుద్ధ స్ఫటిక సన్నిభః ॥

అగ్రాహ్యశ్చైవ గౌరశ్చ సర్వః శుచిరభిష్టుతః ।
వషట్కారో వషడ్ వౌషట్ స్వధాస్వాహా రతిస్తథా ॥

పక్తానంద యితాభోక్తా బోద్ధా భావయితా తథా ।
జ్ఞానాత్మాచైవ దేహాత్మా భూ మా సర్వేశ్వరేశ్వరః ॥

*నదీనందీ చ నందీశో భారతస్తరు నాశనః ।*
*చక్రపః శ్రీపతిశ్చైవ నృపాణాం చక్రవర్తి నాం ॥*

*ఈశశ్చ సర్వదేవానాం ద్వారకా సంస్థి తస్తథా ।*
*పుష్కరః పుష్కరాధ్యక్షః పుష్కర ద్వీప ఏవ చ ॥*

*భరతోజనకో జన్యః సర్వాకార వివర్జితః ।*
*నిరాకారో నిర్నిమిత్తో నిరాతంకో నిరాశ్రయః ॥*

*ఇతినామ సహస్రం తే వృషభధ్వజ కీర్తితం ।*
*దేవస్య విష్ణోరీశస్య సర్వపాప వినాశనం ॥*

*పఠన్ ద్విజశ్చ విష్ణుత్వం క్షత్రియో జయమాప్నుయాత్ ।*
*వైశ్యోధనం సుఖం శూద్రో విష్ణుభక్తి సమన్వితః ॥*

పరమశివా! దేవతలారా! ఇపుడు నేనుపదేశించిన ఈ విష్ణు సహస్రం సర్వపాప వినాశకుడు, జగదీశ్వరుడు, దేవాధిదేవుడునగు విష్ణుదేవునికి ప్రీతి పాత్రము. దీనిని పఠించిన బ్రాహ్మణునికి విష్ణు స్వరూపం లభిస్తుంది. అలాగే క్షత్రియునికి విజయమూ, వైశ్యునికి ధన, సుఖాలూ, శూద్రునికి విష్ణుభక్తీ ప్రాప్తిస్తాయి" అని బోధించాడు శ్రీ మహా విష్ణువు.

***(అధ్యాయం -15)***

# విష్ణుధ్యానం - సూర్యార్చన

"**శం**ఖ చక్రగదాధారీ! భగవాన్ శ్రీహరీ! మేమంతా దేవదేవేశ్వరుడు, శుద్ధ రూపుడు, పరమాత్మయగు విష్ణుదేవులు మీరేనన్న జ్ఞానాన్ని పొందియున్నాము. విష్ణు సహస్రనామాలను విని పరమానందభరితులమైనాము. విష్ణు ధ్యానవర్ణనను విని ధన్యులము కాగోరుచున్నాము" అన్నాడు కాలకంఠుడు.

చెప్పసాగాడు ఖగవాహనుడు.

"జ్ఞానరూపుడు, అనంతుడు సర్వవ్యాపి, అజన్ముడు, అవ్యయుడునగు హరియే సర్వ దుఃఖాలనూ హరిస్తాడు. ఆయన అవినాశి, సర్వత్రగామి, నిత్యుడు, అద్వితీయ బ్రహ్మ. సంపూర్ణ సంసారానికి మూలకారణం, సమస్త చరాచర జగత్పాలకుడైన పరమేశ్వరుడు ఆయనే సంపూర్ణ జగత్తుకు ఆధారం అయనే అయినా, స్వయంగా నిరాధారుడు.

పరమాత్మ ప్రాపంచిక ఆసక్తులకు అతీతుడు, నిర్ముక్తుడు. ముక్తయోగులకు ధ్యేయమైనవాడు. మీరడిగిన ధ్యాన వర్ణనను సూర్యపూజతో మొదలుపెడతాను. ఒకప్పుడిది భృగుమహర్షికి బోధింపబడింది.

***ఓం ఖఖోల్కాయ నమః*** – ఇది

సూర్య భగవానుని మూలమంత్రం. సాధకునికి భోగాన్నీ మోక్షాన్నీ ప్రసాదించే మంత్రమిది. సూర్యదేవుని ఈ క్రింది మంత్రాలతో అంగన్యాసం చేసి ఆయనను పూజించాలి.

***ఓం ఖఖోల్కాయ త్రిదశాయ నమః ।***

***ఓం విచిఠఠ శిరసే నమః ।***

***ఓంజ్ఞానినేఠఠ శిఖాయై నమః ।***

***ఓం సహస్రరశ్మయేఠఠ కవచాయ నమః ।***

***ఓం సర్వతేజోధిౖపతయే ఠఠ అస్త్రాయ నమః ।***

***ఓం జ్వల జ్వల ప్రజ్వలప్రజ్వల ఠఠ నమః ।***

సాధకుని యొక్క సర్వపాపాలనూ నశింపజేసే ఈ సూర్యమంత్రాలను అగ్నిప్రాకార మంత్రాలని కూడా అంటారు.

సూర్యుని ప్రసన్నం చేసుకోవడానికి సూర్యగాయత్రిని కూడా పఠించి పూజ చేయవచ్చును. ఆ మంత్రాలను జపించిన తరువాత సూర్య మరియు గాయత్రి మంత్రాలను సకలీకరణం చేయాలి.

***ఓం ఆదిత్యాయ విద్మహే,***<br>
***విశ్వభావాయ ధీమహి,***<br>
***తన్నః సూర్యః ప్రచోదయాత్ ॥***

తరువాత సాధకుడు దిక్కుల్లో మూలల్లో వాటి అధిపతులనూహించుకొని వారికి ఈ మంత్రాలను చదువుతూ నమస్కరించాలి.

***ఓం ధర్మాత్మనే నమః,*** తూర్పు<br>
***ఓం యమాయ నమః,*** దక్షిణం<br>
***ఓం దండనాయకాయ నమః,*** పశ్చిమం<br>
***ఓం దైవతాయ నమః,*** ఉత్తరం

*ఓం శ్యామపింగలాయ నమః,* ఈశాన్యం

*ఓం దీక్షితాయ నమః,* అగ్ని కోణం

*ఓం వజ్రపాణయే నమః,* నైరృత్యం

*ఓం భూర్భువః స్వః నమః,* వాయుకోణం

మహేశా! ఆ తరువాత సాధకుడు చంద్రాదిగ్రహాలను కూడా తూర్పు దిక్కుతో మొదలుపెట్టి క్రమంగా ఈశాన్యం దాకా తిరుగుతూ ఈ క్రింది మంత్రాలు చదువుతూ నమస్కారసహితంగా పూజించాలి.

*ఓం చంద్రాయ నక్షత్రాధిపతయే నమః ।*

*ఓం అంగారకాయ క్షితిసుతాయ నమః ।*

*ఓం బుధాయ సోమ సుతాయ నమః ।*

*ఓం వాగీశ్వరాయ సర్వవిద్యాధిపతయే నమః ।*

*ఓం శుక్రాయ మహర్షయే భృగుసుతాయ నమః ।*

*ఓం శనైశ్చరాయ సూర్యాత్మ జాయ నమః ।*

*ఓం రాహవే నమః ।*

*ఓం కేతవే నమః ।*

అనంతరం ఈ క్రింది మంత్రాలతో సూర్యదేవుని పూజించి అర్ఘ్యాది ప్రదానానికై ఆవాహన చేయాలి.

*ఓం అనూరుకాయ నమః ।*

*ఓం ప్రమథనాథాయ నమః ।*

*ఓం బుధాయ నమః ।*

*'ఓం భగవన్నపరిమితమయూఖమాలిన్ సకల జగత్పతే సప్తాశ్వవాహన చతుర్భుజ పరమసిద్ధి ప్రద విస్ఫులింగ పింగలతత్ ఏహ్యేహి ఇదమర్ఘ్యం మమ శిరసిగతం గృహ్ణ గృహ్ణ గృహ్ణ తేజోగ్రరూపం అనగ్న జ్వలజ్వల ఠఠ నమః'*

ఆవాహన తరువాత

*ఓం నమో భగవతే ఆదిత్యాయ సహస్ర కిరణాయ గచ్ఛసుఖం పునరాగమనాయ* అనే మంత్రాలతో విసర్జనం చేయాలి".

హరి ఇంకా ఇలా చెప్పాడు, “రుద్ర దేవా! సూర్య పూజన విధానాన్ని ఒకప్పుడు కుబేరునికి చెప్పాను. ఇపుడు మీకు వినిపిస్తున్నాను.

సూర్యుని పూజించడానికి ముందు సాధకుడు ఏకాగ్రచిత్తుడై ఒక పవిత్ర స్థానంలో కర్ణికాయుక్తమైన అష్టదళకమలాన్ని నిర్మించాలి. అపుడు సూర్యదేవుని ఆవాహనం చేయాలి. తరువాత భూమిపై నిర్మితమైన కమలదళాల మధ్యలోఖఖోల్కభగవానుడైన సూర్యయంత్రాన్ని ఆయన పరికరాలతో సహా స్థాపించి స్నానం చేయించాలి.

ఆ తరువాత ఆగ్నేయంలో సాధకుని ఇష్టదైవ హృదయాన్ని స్థాపించాలి. ఈశాన్యంలో శిరస్సునీ, నైరృత్యంలో శిఖనీ విన్యాసం చెయ్యాలి (అంటే పెట్టాలి). మరల ఏకాగ్రచిత్తంతో తూర్పు వైపు ధర్మాన్నీ, వాయవ్యంలో నేత్రాలనూ, పశ్చిమ దిశలో తన ఇష్టదైవం యొక్క అస్త్రాలనూ వుంచాలి.

మరల ఈశాన్యంలో చంద్రుడనీ, తూర్పున మంగళునీ, ఆగ్నేయంలో బుధునీ, దక్షిణ దిశలో బృహస్పతినీ, నైరృతిలో శుక్రునీ, పడమటి దెసలో శనినీ, వ్యాయవ్యంలో కేతువునీ ఉత్తర దిక్కులో రాహువునీ స్థాపించి పూజించాలి.

ద్వాదశాదిత్యులను అనగా భగ, సూర్య, అర్యమ, మిత్ర, వరుణ, సవిత, ధాతా, వివస్వాన్, త్వష్ట, పూష, ఇంద్ర, విష్ణు – అను సూర్యుని పన్నెండు రూపాలనూ రెండవ వరుసలో పెట్టి పూజించాలి.

తరువాత పూర్వాది దిశలలో నున్న ఇంద్రాదులను అర్చించి, జయా, విజయా, జయంతి, అపరాజిత అను శక్తులనూ వాసుకి, శేషాదినాగులనూ కూడా పూజించాలి. ఇది సూర్య పూజావిధానం.” ***(అధ్యాయాలు – 16,17)***

# మృత్యుంజయ మంత్ర జప మహిమ

సూతమహర్షి శౌనకాదులకు ప్రసాదిస్తున్న ప్రవచనం ఇలా కొనసాగింది.

“మునులారా! గరుత్మంతుడు కశ్యప మహర్షికుపదేశించిన మృత్యుంజయ మంత్రాదిక విషయాలను వినండి. ఇవి సాధకుని గొప్పగా ఉద్ధరిస్తాయి. పుణ్యప్రదానం చేస్తాయి. ఈ మృత్యుంజయ పూజలోనే సర్వదేవమయ పూజ వున్నదని విజ్ఞులు చెప్తారు.

***‘ఓం జుం సః’*** అనే మూడక్షరాల మంత్రం మృత్యుంజయ మంత్రం. ఇది మృత్యువునూ దారిద్ర్యాన్నీ మర్దించే మంత్రం. శివ, విష్ణు, సూర్యాది దేవతలంతా దీన్ని పఠించే వారి

పట్ల ప్రసన్నులౌతారు. *'ఓం జుం సః'* అనే ఈ మహామంత్రాన్ని అమృతేశ నామంతో కూడా వ్యవహరిస్తారు. ఈ మంత్రాన్ని జపించేవారి పాపాలన్నీ నశిస్తాయి. మృత్యువు వలె బాధించు కష్టాలన్నీ దూరమవుతాయి.

ఈ మంత్రాన్ని నూరుమార్లు అనితర ధ్యాన తత్పరతతో జపిస్తే వేదాధ్యయనం వల్ల వచ్చే సుకృతం, యజ్ఞఫలం, తీర్థ స్నాన దాన పుణ్యం లభిస్తాయి. మూడు సంధ్యలలోనూ నూట యెనిమిదేసి మార్లు ఈ మంత్రాన్ని జపించేవారికి అలా జపిస్తున్నంత కాలం మృత్యువు దూరంగానే వుంటుంది. కఠినాతికఠినములైన విఘ్న బాధలన్నీ తొలగిపోతాయి. శత్రువులపై విజయం లభిస్తుంది.

భగవానుడైన మృత్యుంజయుడు లేదా అమృతేశ్వరుడు శ్వేతకమలంపై కూర్చుని వుంటాడు. ఆయన చతుర్భుజుడు ఒక చేతిని అభయముద్రలో మరొక చేతిని వరద ముద్రలో వుంచి మిగతా రెండు చేతులలో అమృత భాండాన్ని పెట్టుకొని నిత్యం మనను శారీరక మానసిక ప్రాణాంతక బాధల నుండి రక్షించడానికి సిద్ధంగా, సర్వసన్నద్ధుడై వుంటాడు ఈ అమృతేశ్వర దేవుడు. ఆయన వామాంకస్థితయై అమృతభాషిణి అమృతాదేవి నిత్యమూ కొలువుంటుంది. ఆమెను ధ్యానించాలి. ఆమె ఒక చేతిలో కలశాన్నీ మరొక చేతిలో కమలాన్నీ ధరించి వుంటుంది. కలశం కుడిచేతిలో వుండాలి.

*ఓం జుం సః* అనే ఈ మంత్రం పరమశక్తిప్రదాయకం, అతులిత శాంతిదాయకం కూడ. అమృతాదేవీ సహిత అమృతేశ్వర స్వామిని ధ్యానిస్తూ ఈ మహా మంత్రాన్ని మూడు సంధ్యలలో జపిస్తూ అలా రోజుకి ఎనిమిదివేల మార్లు ఒక నెలదాకా చేయగలిగిన వారికి జర, మృత్యు, మహావ్యాధి బాధలుండవు. శత్రువులపై స్పష్టమైన శాశ్వతమైన విజయాన్ని సాధించగలుగుతారు. మహాశాంతినీ పొందగలుగుతారు.

అమృతేశ్వర భగవానుని పూజలో కూడా ఆవాహన, స్థాపన, రోదన (ప్రతిష్ఠ), సన్నిధానం, నివేశనం, పాద్యం, ఆచమన, స్నానం, అర్ఘ్యం, మాల, అనులేపనం, దీపము, వస్త్రం, ఆభూషణాలు, నైవేద్యం, పానం, వీవనలు, ముద్రాప్రదర్శన, మంత్రజపం, ధ్యానం, దక్షిణ, ఆహుతి, స్తుతి, వాద్య గీత నృత్యాలు, న్యాసయోగ ప్రదక్షిణలు, సాష్టాంగ ప్రణతి, మంత్ర శయ్య, వందనాది ఉపచారాలన్నీ వుంటాయి. పూజానంతరము దీక్షా విసర్జన చేయాలి.

ఋషులారా! ఈ సందర్భంలోనే పరమాత్మ షడంగ పూజనుపదేశించాడు. అది ఇలా వుంటుంది.

సాధకుడు ప్రారంభంలో దేవునికి అర్ఘ్యమిచ్చే పాత్రను పూజించి అస్త్ర మంత్రాన్నుచ్చ రించాలి. అనగా కుడిచేతితో ఎడమచేతిపై శబ్దంచేస్తూ 'ఫట్' అనే మంత్రాన్ని చదవాలి.

తరువాత కవచమంత్రం (**హుం**) తో శోధనచేసి అమృతకరణ క్రియను పూర్తి చేయాలి. అప్పుడు ఆధారశక్తి మున్నగువాటిని పూజించి ప్రాణాయామం, ఆసనోపవేశనం, దేహశుద్ధి కావించి అమృతేశ భగవానుని ధ్యానించాలి. తరువాత తన ఆత్మను దేవ స్వరూపంగా స్వీకరిస్తూ (***అహం బ్రహ్మాస్మి*** అని మననం చేసుకుంటూ) అంగన్యాస, కరన్యాసం చేసి సాధకుడు తన హృదయ కమలస్థితుడైన జ్యోతిర్మయ ఆత్మదేవుని పూజించాలి. (అంటే కన్నులు సగం మూసి అమృతేశ మంత్రాన్ని పఠిస్తూ తన బొమముడిలోనే జ్యోతిశ్చక్రాన్ని చూడగలగాలి).

అనంతరం దేవునిమూర్తిపైగాని, యజ్ఞ వేదిపై చిత్రింపబడిన దేవునికి గాని సుందరపుష్పాలను సమర్పించాలి. ఆధారశక్తిని పూజించడం ద్వారా ద్వారం వద్దనుండు దేవతలు ఆవాహన చేయబడి పూజింపబడాలి. అందుకే ముందుగా ఆధారశక్తి పూజన ముంటుంది. ఆ పై దేవప్రతిష్ఠా, పరివార సమేతంగా ఆ దేవుని ఆరాధించడం జరుగుతాయి. పరివారంతో బాటు ఆయుధాలనూ, ధర్మాన్నీ కూడా పూజిస్తే దేవతలు సంతోషిస్తారు. ఇంద్రాదిదేవతలనూ వేదాలనూ ఏ వ్రతంలో పూజించినా భుక్తి, ముక్తి లభిస్తాయి. కాబట్టి ఈ షడంగ పూజను విద్వాంసులు విధించారు.

దేవమండలాన్ని పూజించడానికి ముందే మాతృక, గణదేవత, నంది, గంగలనూ దేవస్థానం కుడిభాగంలో మహాకాలునీ, యమునను పూజించాలి. పూజలో ప్రతిదశలోనూ

***ఓం అమృతేశ్వర భైరవాయ నమః, ఓం జుం హం సః***
***సూర్యాయ నమః*** అంటూనే వుండాలి.

అలాగే శివ, కృష్ణ, బ్రహ్మ, చండిక, సరస్వతి, మహాలక్ష్మి దైవతాలను కూడా వారి నామాలకు ముందు 'ఓం' కారమును, చివర నమః ను(దానికి ముందు 'య' లేక 'యై') నూ పెట్టి పూజించాలి. ***(అధ్యాయం - 18)***

# ప్రాణేశ్వరీ విద్య

***(సర్పవిష, దుష్ట ఉపద్రవ హారం)***

**సూ**త మహర్షి అనుగ్రహ భాషణం నైమిషారణ్యంలో ఇలా కొనసాగింది.

"ఋషులారా! ఇపుడు మీకు పరమ శివుని ద్వారా గరుత్మంతుని కుపదేశింపడిన ప్రాణేశ్వర మహా మంత్రాన్ని విన్నవిస్తాను. ఐతే, దానికి ముందు ఏయే స్థానాల్లో, సమయాల్లో పాము కాటేస్తే చావు తప్పదో తెలుసుకుందాం.

శ్మశానం, పుట్ట, పర్వతం, నుయ్యి, చెట్టు తొఱ్ఱ– వీటిలో నివసించే పాము కాటువేసిన పుడు ఆపేసిన చోట మూడు ప్రచ్ఛన్నరేఖలు ఏర్పడితే మాత్రం ఆ కాటు వేయబడిన ప్రాణులు మిగలరు. మూల, ఆశ్లేష, మఘ మరియు షష్టి రోజున, కర్కాటక, మేషరాశుల్లో వచ్చే నక్షత్రాల్లో పాము కాటుకు గురైనవారు బ్రతకరు. కటి, కణత, సంధిభాగాలు, ముఖము, గొంతులపై పాము కాటు వేస్తే ఇక ఆ ప్రాణి బ్రతకడం జరగదు. **(అనుబంధం–1 చూడండి).** దినంలో మొదటి భాగంలో మొదటి అర్ధయామ భాగం సూర్యునిచే భోగింపబడుతుంది. ఆ దివాకర – భోగం తరువాత గణనాక్రమం ప్రకారం ఇతర గ్రహాల భోగం వుంటుంది. అలాగే రాత్రి కాలంలో జ్యోతిష్కులు కాల చక్రాధారంగా గ్రహాలను కాలసర్పాలను ఈ విధంగా జోడించారు.

శేషుడు – సూర్యుడు, వాసుకి–చంద్రుడు, తక్షకుడు–మంగళుడు, కర్కోటకుడు – బుధుడు,పద్ముడు –గురుడు, మహాపద్ముడు–శుక్రుడు,శంఖుడు –శని,కులికుడు – రాహువు.

రాత్రయినా పగలైనా బృహస్పతి (గురుడు) భోగకాలం వచ్చినపుడు సర్పాలు దేవతలనైనా అంతం చేయగలవు. కాబట్టి ఈ కాలంలో పాముకాటుకి విరుగుడు లేదు, చావు తప్పదు. పగలు శని భోగమూ అంతే.

రాత్రి, పగళ్ళ గణన ముప్పది – ముప్పది ఘటికలలో వుంటుంది. ఈ లెక్కను అనుసరించి నిర్మింపబడిన కాలచక్రములో చంద్రుడు పాడ్యమినాడు కాళ్ళ బొటన వ్రేళ్ళలోనూ, విదియనాడు కాళ్ళపైనా, తదియనాడు మోకాళ్ళలోనూ, చవితినాడు వాటికి పైనా, పంచమినాడు తొడల మధ్యలోనూ, షష్ఠినాట నాభిలోనూ, సప్తమినాడు ఛాతీపైనా, అష్టమినాడు స్తనాలలోనూ, నవమినాడు గొంతుపైనా, దశమినాడు ముక్కుపైనా, ఏకాదశినాడు కన్నులలోనూ, ద్వాదశినాడు చెవుల వద్దనూ, త్రయోదశినాడు కనుబొమ్మల మధ్యలోనూ, చతుర్దశినాడు కణతలపైనా, పున్నమి అమావాస్యలలో మస్తకంపైననూ మానవులలో నివాసముంటాడు. చంద్రుడున్న చోట ప్రాణి అంగంపై పాము కాటేసినా ఆ ప్రాణిని బ్రతికించవచ్చును. మూర్ఛ నుండి మెలకువ రావడం ఆలస్యం కావచ్చు కానీ సాధకుడు శరీర మర్దన ద్వారా ఆ ప్రాణిని బ్రతికించగలడు.

***ఓం హంసంః*** అనే నిర్మల స్ఫటికం లాంటి బీజయుక్త మంత్ర సాధకునికి పరమ మంత్రం. విషరూపంలో నున్న పాపాన్ని నశింపజేసే శక్తి గల ఈ మంత్రాన్ని పాము కాటు వల్ల మూర్ఛిత ప్రాణిపై ప్రయోగించాలి. ఇందులో నాలుగు ప్రకారాలున్నాయి. మొదటిది బీజబిందువుతో, రెండవది అయిదు స్వరాలతో, మూడవది ఆరు స్వరాలతో, నాలుగవది విసర్గతో కూడి వుంటాయి.

ప్రాచీన కాలంలో పక్షిరాజైన గరుత్మంతుడు లోకాలను సర్పాల నుండి రక్షించడం కోసం ***ఓం కురుకులేస్వాహా*** అనే మంత్రాన్ని ప్రసాదించాడు. ఈ మహా మంత్ర ద్రష్ట గరుత్మంతుడే. సర్పవిషాలను విరిచి ప్రాణులను కాపాడదలచుకున్న సాధకుడు ముఖంలో ***'ఓం'***నూ కంఠంలో ***'కురు'***ను ఇరుగుల్ఫాలలో ***'కులే'*** నీ రెండు పాదాలపై ***'స్వాహా'*** మంత్రాన్నీ శాశ్వతంగా న్యాసం చేయించుకొని వుండాలి. పై మంత్రాన్ని వీలైనన్ని చోట్ల వ్రాయించిన గృహాలలో పాములు నిలువలేవు. ఒక సూత్రాన్ని ఈ మంత్రంతో వేయిమార్లు అభిమంత్రించి చెవిపై ధరించిన వారికి సర్పభయముండదు. అలాగే ఈ మంత్రంతో అభిమంత్రించిన పంచదార పలుకులను విరజిల్లిన ఇంటిలో పాములు నిలవలేవు. దేవతలూ, అసురులూ ఈ మంత్రాన్ని ఏడు లక్షల మార్లు జపించి మంత్రసిద్ధులైనారు.

ఒక అష్టదళపద్మాన్ని చిత్రించి ***ఓం సువర్ణరేఖే కుక్కుట విగ్రహరూపిణి స్వాహా*** అనే మంత్రములోని రెండేసి అక్షరాలను ఆ పద్మం యొక్క ఒక్కొక్క దళంపై వ్రాయాలి. ఆ తరువాత ***ఓం పక్షి స్వాహా*** అనే మంత్రంతో అభిమంత్రించబడిన జలంతో పాముకుట్టిన వానికి స్నానం చేయిస్తే విషం దూరమౌతుంది.

***ఓం పక్షి స్వాహా*** అనేది కూడా సాధకుల పాలిటి కల్పవృక్షము. ఈ మంత్రం ద్వారా బొటనవ్రేలి నుండి చిటికెన వేలి దాకా కరన్యాసమూ,ముఖ, హృదయ, లింగ, పాదభాగాలపై అంగన్యాసమూ చేసియున్న వ్యక్తి యొక్క నీడనైనా, కలలో కూడా తాకడానికి పాములు భయపడతాయి. ఈ మంత్రాన్ని ఒక లక్షమార్లు జపించి సిద్ధిని పొందిన సాధకుడు పాము కాటుకు గురైన వ్యక్తిని తేరిపార చూస్తే చాలు; ఆ వ్యక్తిలోని కెక్కిన విషం దిగిపోతుంది.

***'ఓం హ్రీం హ్రౌం హ్రీం భి (భీ) రుండాయై స్వాహా'*** – ఈ మంత్ర సాధకుడు దీనిని సర్పదష్టులైన వ్యక్తుల చెవిలో జపిస్తే విషప్రభావం క్షీణిస్తుంది.

మరొక సాధన ఇది. సాధకుడు తన రెండు పాదాగ్రాలలోనూ 'అ ఆ'లనూ, (చీలమండల్లో) గుల్ఫాలలో 'ఇఈ'లనూ, జానువులలో 'ఉఊ'లనూ, కటిలో 'ఏఐ'లనూ, నాభిలో 'ఓ'నూ, ఛాతీ పై 'ఔ'నీ, ముఖంలో 'అం'నీ, మస్తకంలో 'అః' నూ స్థాపించుకొని ***'ఓం హంసః'*** అను బీజమంత్రసహితంగా న్యాసం చేసుకొని నిత్యం జప పూజనాలనూ చేస్తూ వుంటే అతనికి సర్పవిషాన్ని నిర్వీర్యం చేసే శక్తి లభిస్తుంది.

సాధకుడు 'నేను స్వయంగా గరుత్మంతుడను' అను భావనతో ధ్యానంలోకి వెడలి పోయి ఈ మంత్రసాధనను చేయాలి. విషానికి వ్యతిరేకంగా ప్రయోగం చేస్తున్నంత సేపూ అతనిలో 'తాను గరుడుడను' అనే ధ్యాసయే వుండాలి. ***'హం'*** అనే బీజాక్షరం శరీరంలో ప్రవేశించిన విషాదులను హరించే శక్తినికలిగి వుంటుంది. ***'హంసః'*** మంత్రాన్నిఎడమచేతిలో

న్యాసం చేసుకొనియున్న సాధకుడు ధ్యాన, పూజన,నిత్య జప శక్తుల సహాయంతో విషాన్ని విరిచివేయడానికి సమర్థుడవుతాడు. ఎందుకంటే ఈ మంత్రం విషధర నాగుల నాసికా భాగాన్నీ,శ్వాస నాళికనీ అదుపు చేసే శక్తినీ, సంపూర్ణ సామర్థ్యాన్నీ కలిగి వుంటుంది. ఈ మంత్రం బాధిత శరీరంలోకీ మాంసంలోకీ దూసుకొని పోయి సర్ప విషాన్ని నశింపజేస్తుంది.

పాము కాటుచే మూర్ఛితుడైన ప్రాణి శరీరంపై *'ఓం హంసః'* మంత్రాన్ని న్యాసం చేసి భగవంతుడైన నీలకంఠస్వామినీ ఇతరదేవతలనీ కూడా ధ్యానించాలి. దీని వల్ల మంత్రానికి వాయుశక్తి తోడై శీఘ్రంగా సంపూర్ణంగా విషాన్ని హరించగలదు.

ప్రత్యంగిరా జడాన్ని బియ్యం కడిగిన నీళ్ళలో నానబెట్టి పిండితే, రోగి నోటిలోకి, పిండితే విష ప్రభావం తగ్గుతుంది. [1] పునర్నవ, [2] ప్రియంగు, [3] వక్త్రజ (బ్రాహ్మి), [4] శ్వేత బృహతి, [5] కూష్మాండ, [6] అపరాజిత జడం, [7] గేరు, కమల గట్టఫలం – వీటన్నిటినీ నీటిలోవేసి బాగా పిండి నేతితో కలిపి ఒక లేపనాన్ని తయారు చేసి దానిని పాము కాటు బాధితుని శరీరంపై పూస్తే విషం ప్రభావం తగ్గుతుంది. పాము కాటేయగానే ఆ వ్యక్తి చేత వేడి నేతిని త్రాగిస్తే విషప్రభావం మందగిస్తుంది. అలాగే శిరీష వృక్ష పంచాంగాలను (ఆకు, పువ్వు, పండు,వేరు, బెరడు)[8] గాజరబీజాలతో కలిపి నూరి కషాయం చేసి కొంత త్రాగించి, కొంత శరీరానికి పూస్తే సర్పదష్టులకు విషము నుండి విడుదల లభించవచ్చు.

***ఓం హ్రీం అః*** ను ఉచ్చరిస్తూ హృదయ లలాటాదులలో విన్యాసం చేసే సాధకుడికి సర్పాలు వశీభూతాలవుతాయి. ఈ మంత్రాన్ని విధ్యుక్తముగా పదిహేను వేలమార్లు జపించిన వారు గరుడుని వలె సర్వగామి, కవి,విద్వాన్, వేదవిదులు కాగలరు.దీర్ఘాయువులూకాగలరు.

ఋషులారా! బలవంతులైన శత్రువులపై విజయ సాధకమైన మంత్రమొకటుంది. ఆ మంత్ర జప విధానాన్ని శివుడుపదేశించాడు. ఇది గోపనీయమైనా మీకు వినిపిస్తాను. దీనితో అభిమంత్రితాలైన ఆయుధాలకు అపజయమనేది వుండదు.

ఈ మంత్రం ద్వారా ఉద్ధరింపబడదలచుకొన్నవారు కమలపత్రంపై అష్టవర్గాలను నిర్మించి వాటిపై తూర్పుతో మొదలెట్టి ఈశాన్యం దాకా వరుసగా ***ఓం హ్రీం హ్రీం*** అనే బీజమంత్రాలను వ్రాసుకుంటూ పోవాలి. ఓం కారం బ్రహ్మబీజమైతే శివకేశవ బీజం హ్రీంకారం. త్రిశూలమును గీసి దాని మూడు తలలపై ***హ్రీం*** కారాన్ని లిఖించాలి.

---

*[1]గలిజేరు చెట్టు, [2]పిప్పలి, [3]బారంగి, [4]తెల్లవాకుడు లేదా ములక, [5]గుమ్మడి, [6] తక్కిలి, [7]ఎఱ్ఱిచెట్టు, [8]ముల్లంగి వంటి దుంప.*

సాధకుడు త్రిశూలాన్ని ధరించి దానిని ఆకాశం వైపు గిరగిరా త్రిప్పగానే సర్వదుష్ట శక్తులు భయపడి పారిపోతాయి. సాధకుడు ధనుర్ధారియై ఆకాశంవైపు నారి సారించి ఈ మంత్రాన్ని మననం చేయగానే దుష్ట విషసర్పాలూ, కుత్సిత గ్రహాలూ, వినాశకర మేఘాలూ, రాక్షసశక్తులూ భయపడి పారిపోతాయి. ***ఆ ధనుస్సు ధూమ్రవర్ణంలో వుండాలి.***

ఈ మంత్రం ముల్లోకాలనూ రక్షించగల సామర్థ్యం గలది. ఇక మృత్యులోకం సంగతి చెప్పనక్కర లేదు కదా!

***ఓం జూం సూం హూం ఫట్*** అనేది మరొక మంత్రం. సాధకుడు ఎనిమిది కాచు కర్రలను దీనితో అభిమంత్రించి ఎనిమిది దిక్కులలో పాతి వుంచితే ఆ కీలాంకిత క్షేత్రంలో పిడుగుపడకుండా, విద్యుజ్జ్వాలలు రగలకుండా ఆ భూమి రక్షింపబడుతుంది. ఇదీ గరుత్మంతుని మంత్రమే. రాత్రి ఎక్కడైనా ఈ మంత్రంతో ఎనిమిది కర్రలను ఇరువది యొక్క మార్లు అభిమంత్రించి ఎనిమిది దిక్కుల్లో పాతి వుంచితే ఆ మధ్య భాగంలో వున్న వారికి సర్వోపద్రవముల నుండీ రక్షణ లభిస్తుంది.

***'ఓం హ్రాం సదాశివాయనమః*** అనే మంత్రాన్ని జపిస్తూ చూపుడు వేలు, చిటికెన వేలు వాడుతూ అనార్ పుష్పం వలె కాంతులు వెదజల్లు ఒక పిండమును నిర్మించాలి. దానిని చూడగానే దుష్టజనులు, దుష్టమేఘాలు, విషాలు, రాక్షసులు, డాకిన్యాదులు భయపడి పారిపోతాయి.

***'ఓం హ్రీం గణేశాయ నమః ।***

***ఓం హ్రీం స్తంభనాది చక్రాయ నమః ।***

***ఓం ఐం బ్రాహ్మ్యై త్రైలోక్య డామరాయ నమః ।*** ***(డామరాయ)***

– ఈ మంత్ర సంగ్రహాన్ని 'భైరవ పిండ' మంటారు. ఇది విషాన్నీ, పాపిష్టి గ్రహాల దుష్ట ప్రభావాన్నీ సమాప్తం చేయడంలో కడు సమర్థము. ఇది సాధకుని కార్యక్షేత్ర రక్షణనీ, భూత–రాక్షసాది గణాల ఉపద్రశక్తుల నుండి రక్షణనీ కల్పించగలదు.

***'ఓం నమః'*** అంటూ సాధకుడు తన చేతిలోనే ఇంద్ర వజ్రాయుధాన్ని భావించుకొని ధ్యానం చేయడాన్ని 'వజ్రముద్ర' అంటారు. ఇది విష, శత్రు, భూతగణాలను నశింపజేయ గలదు. ***'ఓం క్షుం*** (లేదా ***క్ష*** ) ***నమః'*** అనే మంత్రాన్ని జపిస్తూ ఎడమ చేతిలో పాశాన్ని భావించుకొని స్మరణ చేసినా అదే ఫలముంటుంది. ***ఓం హ్రాం*** (లేదా ***హ్రోం***) ***నమః*** అనే మంత్రోచ్చాటన వల్ల ఉపద్రవకారకులైన మేఘ, పాప గ్రహాల ప్రభావం నశిస్తుంది. ***ఓం క్ష (క్ష్మ) నమః*** అనే మంత్రంతో కాలభైరవుని ధ్యానిస్తే కూడా అదే ఫలితముంటుంది.

*'ఓం లసద్ ద్విజిహ్వాక్ష స్వాహా'* అనే మంత్రాన్నుచ్చరిస్తూ దైవ ధ్యానం చేయడం వల్ల పంట పొలాలు గ్రహ, భూత, విష, పక్షి పీడల నుండి రక్షింపబడతాయి.

*ఓం క్ష్వ (క్ష్ణం) నమః* అనే మంత్రాన్ని నగారాపై ఎఱ్ఱని సిరాతో రాసి చదువుతూ కఱ్రతో కొడితే ఆ శబ్దాలను వినగానే పాప గ్రహాది ఉపద్రవకారక తత్త్వాలన్నీ భయభీతాలై పారిపోతాయి. *(అధ్యాయాలు 19, 20)*

# పంచవక్త్ర పూజనం - శివార్చన విధి

**ఋ**షులారా! ఇపుడు పంచముఖ శివుని పూజా విధానాన్ని విన్నవిస్తాను. ఇది సాధకునికి భుక్తినీ ముక్తినీ ప్రసాదిస్తుంది. ముందుగా ఈ క్రింది మంత్రంతో పరమాత్మను ఆవాహనం చేయాలి.

*'ఓం భూర్విష్ణవే ఆది భూతాయ*
*సర్వాధారయ మూర్తయే స్వాహా'*

తరువాత సద్యోజాత విశేషణధారియైన పరమాత్మ కళను ఈ క్రింది మంత్రంతో ఆవాహనం చేయాలి.

*'ఓం హాం సద్యోజాతాయ నమః'*

ఈ సద్యోజాత శక్తిలో ఎనిమిది కళలుంటాయి. అవి సిద్ధి, బుద్ధి, ధృతి, లక్ష్మి, మేధ, కాంతి స్వధ, స్థితి. వీటన్నిటినీ, ఓంకార ప్రతిసర్గతో షష్ఠీ విభక్తితో 'నమః' ను చేర్చి పూజించాలి. (ఉదా॥ సిద్ధిని 'ఓం సిద్ధ్యై నమః' అనే మంత్రంతో పూజించాలి.)

తరువాత సాధకుడు

*ఓం హీం వామదేవాయ నమః*
*(కొన్నిచోట్ల హ్రీంకి బదులు హీం వుంది)*

అంటూ వామదేవుని పూజించాలి. ఈ శివ స్వరూపానికి పదమూడు కళలు. అవి రజ, రక్ష, రతి, పాల్య, కాంతి తృష్ణ, మతి,క్రియ,కామ,బుద్ధి,రాత్రి,త్రాసని,మోహిని అనేవి.

అలాగే అఘోర స్వామికీ ఒక మంత్రమూ ఎనిమిది కళలూ వుంటాయి. (ఎందుచేతనో గాని మంత్రమూ బీజాక్షరమూ చెప్పబడలేదు) ఆ కళలు ఇవి : మనోన్మనీ, అఘోర, మోహా, క్షుధ, నిద్ర, మృత్యు, మాయ, భయంకర.

ఈ కళలను కూడ ఓం, నమః ఆదులను చేర్చి పూజించాక శివుని నాలుగవ వక్త్ర రూపమైన తత్పురుషుని ***ఓం హైం తత్పురుషాయ నమః*** అనే మంత్రంతో ఆరాధించాలి. ఈ స్వామి కళలు అయిదు. అవి నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, సంపూర్ణ. ఈ కళలను కూడా పూజించాక సాధకుడు పంచముఖేశుని ఈశాన దేవరూపాన్ని ***ఓం హౌం ఈశానాయ నమః*** అనే మంత్రంతో పూజించాలి. ఈ స్వామి కళలు ఆరు. అవి నిశ్చల, నిరంజన, శశిని, అంగన, మరీచి, జ్వాలిని. అన్ని కళలనూ 'ఓం, షష్ఠి, నమః' లను చేర్చి పూజించాలి. అప్పుడే పూజ పూర్ణమౌతుంది.

ఋషులారా! ఇపుడు శివార్చన విధిని వినిపిస్తాను. పన్నెండం గుళాల మేర శివమూర్తిని, బిందు ద్వారా నిర్మించాలి. అది శాంత, సర్వగత, నిరాకార చింతన చేయడానికి దోహదం చేసేలా వుండాలి. శివుని ముఖం వైపు అయిదు బిందువులుండాలి. మూర్తికి దిగువ భాగంలో ప్రతి ఆరవబిందువూ విసర్గ వుండాలి. అది అస్త్ర (హస్తన్యాస)ము. దానితో బాటు ***'హౌం'*** అనే బీజాక్షరాన్ని కూడా వ్రాయాలి. ఇది మహామంత్ర బీజం. సంపూర్ణార్థ ప్రదాయకం. తరువాత సాధకుడు శివమూర్తి ఊర్ధ్వ భాగం నుండి చరణ పర్యంతమూ చేతులతో స్పృశిస్తూ మహాముద్రను చూపిస్తూ తదుపరి సంపూర్ణాంగ కరన్యాసం చేయాలి.

అపుడు అస్త్రమంత్రం ***ఓం ఫట్*** నుచ్చరిస్తూ కుడి పిడికిలితో స్పర్శ, శోధనలను గావించాలి. తరువాత చిటికెన వేలితో మొదలెట్టి మహామంత్ర బీజంతో చూపుడు వేలి దాకా న్యాసం చేయాలి.

ఇక బాహ్యపూజ, మానసిక పూజలు రెండూ ఒకేసారి చేయబడతాయి. హృదయమును కమలంగా అందులోని మధ్యభాగాన్ని కర్ణికగా భావించుకొని ఆ కర్ణికలో ధర్మ,జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యాలను అర్చించాలి. ఆవాహన, స్థాపన, పాద్య, ఆచమన, అర్ఘ్య, స్నానము లను అర్పించి అన్య వివిధ మానస ఉపచారాలను గావించాలి. తరువాత అగ్నిలో ఆహుతుల నివ్వాలి. అదెలాగంటే సాధకుడు పూజాస్థలంలోనే అగ్నిని రగిల్చి వుంచడానికి ముందే ***'ఓం ఫట్'*** అనే అస్త్ర మంత్రంతో ఒక కుండాన్ని నిర్మించాలి. ఆపై ***'ఓం హూం'*** అనే కవచ మంత్రంతో ఆ కుండంపై అభ్యుక్షణ చేయాలి. అనగా నీళ్ళు చిలకరించాలి. అప్పుడు మానసిక రూపంతో దానిలో శక్తిని విన్యాసం చేయాలి. తరువాత సాధకుడు ముందు తన హృదయంలో, ఆపై ఈ శక్తి కుండంలో జ్ఞానరూపియైన తేజాన్నీ అగ్నినీ విన్యాసం చేయాలి. (అంటే వుంచాలి) ఈ అగ్నిలో నిష్కృతి-సంస్కారాన్ని తప్ప మిగతా అన్ని సంస్కారాలనూ చేసుకోవాలి. అన్నిటి తరువాత సమస్త ఆంగిక దేవులతో సహా మానసిక రూపంతో శివునికి ఆహుతులివ్వాలి.

తరువాత కమలాంకిత గర్భయైన ఆ మండలంలో నీలకంఠుని పూజించాలి. దాని అగ్ని కోణంలో అర్ధచంద్రాకారయుక్తమైన ఒక మంగళమయ అగ్ని కుండాన్ని నిర్మించాలి. అప్పుడు అగ్నిదేవుని అస్త్రయుక్తంగా హృదయాదులలో న్యాసం చేయాలి. తరువాత మండలంలో నున్న కమల కర్ణికపై సదాశివునికీ దిశలలో అస్త్రాలకీ పూజచేయాలి. అంతట పంచతత్త్వాలలో నుండు పృథ్వీ, జల తత్త్వ శక్తులకు విడివిడిగా వంద వంద ఆహుతులను అయిదేసిమార్లు అర్పించి ప్రసన్నతాపూర్వకంగా త్రిశూలధారియైన శివుని ధ్యానించాలి.

అనంతరం ప్రాయశ్చిత్తశుద్ధికై ఎనిమిదిమార్లు ఆహుతులివ్వాలి. ఈ ఆహుతులను అస్త్రబీజమైన 'హుంఫట్' అనే మంత్రంతో అర్పించడం శ్రేష్ఠం. ఈ ప్రకారంగా సంస్కారాన్ని శుద్ధిని సాధించిన సాధకుడు సాక్షాత్తు శివస్వరూపుడే కాగలడు.

శివుని యొక్క విశేషపూజలో సాధకుడు మొదట

***ఓం హాం ఆత్మ తత్త్వాయ స్వాహా***
***ఓం హీం విద్యాతత్త్వాయ స్వాహా***
***ఓం హూం శివతత్త్వాయ స్వాహా***

అని ఉచ్చరిస్తూ ఆచమనం చేయాలి. తరువాత మానసిక రూపంతో కర్ణేంద్రియాలను స్పర్శించాలి. భస్మధారణ చేసి తర్పణాది క్రియలను ఈ మంత్రాలతో చేయాలి.

***'ఓం హాం ప్రపితా మహేభ్యః స్వధా,***
***'ఓం హాం మాతా మహేభ్యః స్వధా'***
***ఓం హాం నమః సర్వ మాతృభ్యః స్వధా'***

ఇలాగే తన పితరులందరికీ తర్పణాలిచ్చుకొని సాధకుడు ప్రాణాయామం చేసి ఆచమన, మార్జనలనాచరించి ఈ క్రింది శివగాయత్రి మంత్రాన్ని జపించాలి.

***'ఓం హాం తన్మహేశాయ విద్మహే,***
***వాగ్విశుద్ధాయ ధీమహి***
***తన్నోరుద్రః ప్రచోదయాత్ ।'***

**(అనుబంధం - 2 చూడండి)**

పిమ్మట ఈ క్రింది మంత్రాలను జపించాలి.

***ఓం హాం హీం హూం హైం హౌం హః***
***శివ సూర్యాయ నమః ।***

*ఓం హం ఖఖోల్కాయ సూర్యమూర్తయే నమః ।*

*ఓం హ్రాం హ్రీం సః సూర్యాయ నమః ।*

ఈ మంత్రాలను సూర్యోపస్థానం చేసి, సూర్య మంత్రాలతోనే సూర్యరూపుడైన మహేశ్వరుని పూజించడంలో భాగంగా జపించాలి.

తరువాత దండీ, పింగళాది భూత నాయకులను ***ఓం దండినే నమః, ఓం పింగలాయ నమః*** మున్నగు మంత్రాల ద్వారానూ, అనంతరం ఆగ్నేయాది కోణాలలో ***ఓం విమలాయై నమః, ఓం ఈశానాయై నమః*** అంటూ శక్తి స్వరూపాలను వారి వారి మంత్రాల ద్వారానూ స్థాపించి, స్మరించుకోవాలి. ఇలా చేయడం వల్ల ఉపాసకులకు సకల సుఖాలూ ప్రాప్తిస్తాయి.

మహాశక్తులను బీజమంత్ర యుక్తంగా ఆయా దిశల్లో ఇలా జపించాలి.

| | | |
|---|---|---|
| *ఓం రాం పద్మాయై నమః* | – | ఆగ్నేయం |
| *ఓం రీం దీప్తాయై నమః* | – | నైరృత్యం |
| *ఓం రూం సూక్ష్మాయై నమః* | – | వాయవ్యం |
| *ఓం రేం జయాయై నమః* | – | ఈశాన్యం |
| *ఓం రైం భద్రాయై నమః* | – | తూర్పు |
| *ఓం రోం విభూత్యై నమః* | – | దక్షిణం |
| *ఓం రౌం విమలాయై నమః* | – | పశ్చిమం |
| *ఓం రం అమోఘికాయై నమః* | – | ఉత్తరం |
| *ఓం రం విద్యుతాయై నమః* | – | ఉత్తరం |
| *ఓం రం సర్వతోముఖ్యై నమః* | – | మండలమధ్యం |

తరువాత శివస్వరూపమున్న సూర్య ప్రతిమను సూర్యాసనంపై స్థాపించి***హ్రాం హ్రూం (లేదా హ్రీం)సః*** అనే మంత్రంతో ఆ దేవుని అర్చించి క్రింది మంత్రాలతో న్యాసం చేయాలి.

*'ఓం ఆం హృదర్కాయ నమః '*

*'ఓం భూర్భువః స్వః శిరసే స్వాహా'*

*'ఓం భూర్భువః స్వః శిఖాయై వౌషట్'*

*'ఓం హ్రాం జ్వాలిన్యై నమః '*

*'ఓం హ్రుం కవచాయ హుం'*

*'ఓం హ్రూం అస్త్రాయ ఫట్'*

*'ఓం హ్రాం ఫట్ రాజ్ఞ్యై నమః '*

*'ఓం హ్రాం ఫట్ దీక్షితాయై నమః '*

అంగన్యాసానంతరము సాధకుడు ఈ దిగువ నీయబడిన మంత్రాలతో సూర్యాది నవగ్రహాలకు 'మానసీపూజ'ను సంపన్నం గావించాలి.

*ఓం సః సూర్యాయ నమః*

*ఓం సోం సోమాయ నమః*

*ఓం మం మంగలాయ నమః*

*ఓం బుం బుధాయ నమః*

*ఓం బృం బృహస్పతయే నమః,*

*ఓం భం భార్గవాయ నమః,*

*ఓం శం శనైశ్చరాయ నమః,*

*ఓం రం రాహవే నమః,*

*ఓం కం కేతవే నమః,*

*ఓం తేజశ్చండాయ నమః ।*

ఈ విధంగా సూర్య దేవాదులను పూజించి ఆచమనం చేసి ఆపై ఈ క్రింది మంత్రాలతో చిటికెన వ్రేలితో మొదలెట్టి అన్ని వేళ్ళతో కరన్యాస, అంగన్యాసాలను చేయాలి.

*ఓం హాం హృదయాయ నమః,*

*ఓం హీం శిరసే స్వాహా,*

*ఓం హూం శిఖాయై వౌషట్,*

*ఓం హైం కవచాయ హుం,*

*ఓం హౌం నేత్రత్రయాయ వౌషట్,*

*ఓం హః అస్త్రాయ ఫట్ ।*

తరువాత భూతశుద్ధి గావించి మరల న్యాసం చేయాలి. అర్ఘ్యస్థాపన చేసి ఆ జలాన్ని తన శరీరంపై జల్లుకోవాలి. తరువాత శివునితో పాటు నందీశ్వరాదులను పూజించాలి. **'ఓం హౌం శివాయ నమః'** అనే మంత్రంతో పద్మస్థితుడైన పరమశివుని పూజించిన పిమ్మట నంది, మహాకాల, గంగ, యమున, సరస్వతి, శ్రీవత్స, వాస్తుదేవత, బ్రహ్మ, గణపతిలనూ తదుపరి తన గురుదేవునీ సాధకుడు అర్చించాలి.

తరువాత పద్మమధ్యంలో నున్న శక్తి అనంతదేవులనూ, పద్మ పూర్వ దళంలో ధర్మాన్నీ, దక్షిణంలో జ్ఞానాన్నీ, పశ్చిమంలో వైరాగ్యాన్నీ, ఉత్తరంలో ఐశ్వర్యాన్నీ, ఆగ్నేయంలో అధర్మాన్నీ, నైరృత్యంలో అజ్ఞానాన్నీ, వాయవ్యంలో అవైరాగ్యాన్నీ, ఈశాన్యంలో అనైశ్వర్యాన్నీ పద్మకర్ణికపై వామా, జ్యేష్ఠాశక్తులనూ మరల తూర్పుతో మొదలుపెట్టి రౌద్రీ, కాలీ, శివా, అసితాది శక్తులనూ పూజించాలి.

తరువాత శివుని కెదురుగా నున్న పీఠంపై ప్రతిష్ఠింపబడిన కలవికరిణీ, బలవికరిణీ, బలప్రమథినీ, సర్వభూతదమనీ, మనోన్మనీ అనే మహాశక్తులను ఈ దిగువ నీయబడిన మంత్రాలతో పూజించాలి.

***ఓం హౌం కలవికరిణ్యై నమః,***

***ఓం హౌం, బలవికరిణ్యై నమః,***

***ఓం హౌం బల ప్రమథిన్యై నమః,***

***ఓం సర్వభూత దమన్యై నమః,***

***ఓం మనోన్మన్యై నమః ।***

తరువాత సాధకుడు ఒక ఆసనం పైకి శివునాహ్వానించి ఆయన మహామూర్తిని స్థాపించాలి. అప్పుడు శివునుద్దేశించి ఆవాహన, స్థాపన, సన్నిధాన, సన్నిరోధ, సకలీకరణాది ముద్రలను చూపించి అర్ఘ్య, పాద్య, ఆచమన, అభ్యంగ, ఉద్వర్తన, స్నానీయ జలాలను సమర్పించాలి. పిమ్మట అరణి– మంథనం చేసి ఆ మహాదేవునికి వస్త్ర, గంధ, పుష్ప, దీప, [1]చరు నైవేద్యాలను సమర్పించాలి. నైవేద్యానంతరము ఆచమనం చేసి ముఖశుద్ధికై (ముఖమనగా నోరు) తాంబూలము, కరోద్వర్తనం, ఛత్రం, చామరం యజ్ఞోపవీతం, ప్రదానం చేసి [2]పరమీకరణ చేయాలి.

పిమ్మట సాధకుడు ఆరాధ్య దైవం ఆకారాన్ని ధరించి ఆయనను జపించి వినమ్రతతో స్తుతించాలి. హృదయాదిన్యాసాలను చేసి సంపూర్ణం గావించు ఈ పూజనే 'షడంగ పూజ' అని వ్యవహరిస్తారు.

తరువాత దిక్పాలకులనూ, వారి మధ్యలో చండేశ్వరీ దేవిని పూజించాలి.

చివర మరల శివుని ఇలా స్తుతించాలి. క్షమాయాచన చేసి కంకణాన్ని విసర్జించాలి.

---

*[1]చరు' అనగా హోమయోగ్యమైన, పక్వం చేయబడిన అన్నము.*

*[2]పరమీకరణమనగా అర్చనీయదేవునిలో సర్వోత్కృష్టత యను భావము గట్టి పఱచుట.*

*గుహ్యాతిగుహ్యగోప్తాత్వం*
*గృహాణా స్మత్కృతం జపం ।*
*సిద్ధిర్భవతు మేదేవ త్వత్ప్రసాదాత్ త్వయి స్థితిః ॥*
*యత్కించిత్ క్రియతే కర్మ సదా సుకృత దుష్కృతం ।*
*తన్మే శివ పదస్థస్య రుద్ర క్షపయ శంకరః ॥*
*శివోదాతా శివోభోక్తా శివః సర్వమిదంజగత్ ।*
*శివోజయతి సర్వత్రయః శివః సోఽహమేవచ ॥*
*యత్కృతం యత్ కరిష్యామి తత్సర్వం సుకృతం తవ ।*
*త్వం త్రాతా విశ్వనేతాచనాన్యో నాథోఽస్తి మే శివ ॥(ఆచార కాండం 23/26-29)*

'హే ప్రభో! నీవు గుహ్యాతిగుహ్యమైన తత్త్వాలకు సంరక్షకుడవు. నేను చేసిన జపాన్ని స్వీకరించు. నాకు సిద్ధిని ప్రాప్తింపజేయి. నీ కృపవల్ల నాకు నీ పట్ల గల ఈ నిష్ఠ శాశ్వతంగా వుండేలా వరమియ్యి. రుద్రదేవా! శంకరా! నా పాపాలను నశింపజెయ్యి. పుణ్యాన్ని కూడా హరింపజేసి నన్ను నీ పాదాల చెంత పడవేసుకో. భక్తులకు సర్వస్వాన్నీ వరంగా ఇచ్చే నీవే సర్వవ్యాపకుడవు. సర్వభర్తవు. నా భవిష్యత్కర్మలన్నీ నీ వైపే పయనించే లాగ నన్ను దీవించు. రక్షకుడవు నీవే. విశ్వనాయకుడవు నీవే. హే పరమశివా! నాకు వేరే దిక్కు గాని దైవంగాని లేదు' అని ఈ స్తుతి సారము.

ఈ రకంగా శివోపాసనచేయగలిగిన సాధకుడు అకాల మృత్యువాతపడడు. అతి శీతోష్ణాలకూ అతీతుడవుతాడు.

భగవానుడైన సదాశివుని మంగళమయధ్యాన స్వరూపాన్ని ***(అనుబంధం-3లో చూడండి.)***

# త్రిపురాదేవి గణేశాదుల పూజ

**ఋ**షులారా! ఇష్టకామ్యార్థ సిద్ధిని కలిగించే ఈ పూజలో ముందు శ్రీ గణేశుని ఆసనానికీ, మూర్తికీ పూజలు చేసి ఆసనంపై ఆయనను స్థాపించి మరల న్యాసపూర్వకంగా ఈ మంత్రాలతో పూజించాలి.

*ఓం గాం హృదయాయ నమః,*
*ఓం గీం శిరసే స్వాహా,*

*ఓం గూం శిఖాయై వషట్,*

*ఓం గైం కవచాయ హుం,*

*ఓం గౌం నేత్రత్రయాయ వౌషట్,*

*ఓం గః అస్త్రాయ ఫట్ ।*

తరువాత సాధకుడు. ***ఓం దుర్గాయాః పాదుకాభ్యాం నమః*** అంటూ దుర్గమ్మ యొక్కయూ, ***ఓం గురుపాదుకాభ్యాం నమః*** అంటూ గురువు గారి యొక్కయు పాదుకలకు నమస్కారం చేసి త్రిపురాదేవికీ, ఆమె ఆసనానికి నమస్కారం చేసి ***'ఓం హ్రీం దుర్గే రక్షిణి'*** అనే మంత్రంతో హృదయాదిన్యాసాన్ని గావించి మరల ఇదే మంత్రంతో రుద్రచండ, ప్రచండ దుర్గ, చండోగ్ర, చండనాయిక, చండ, చండవతి, చండరూప, చండిక, దుర్గ అనే తొమ్మిది శక్తులనూ పూజించాలి. తరువాత వజ్ర, ఖడ్గాది ముద్రలను ప్రదర్శించి దేవికి ఆగ్నేయంలో సదాశివాది దేవతలకు పూజ చేయాలి. దానికై సాధకుడు ముందుగా ***ఓం సదాశివ మహాప్రేత పద్మాసనాయ నమః*** అనే మంత్రాన్ని చదువుతూ ప్రణామం చేసి ఆ తరువాత ***ఓం ఐం క్లీం (హ్రీం) సౌంత్రిపురాయై నమః*** అనే మంత్రంతో త్రిపురాశక్తికి నమస్కారం చేయాలి.

తరువాత త్రిపురాదేవి యొక్క ఆసనానికీ (పద్మానికి), మూర్తికీ, హృదయాది అంగాలకీ నమస్కారం చేసి ఆ పద్మపీఠంపై మాహేశ్వరి, బ్రాహ్మణి, కౌమారి, వైష్ణవి, వారిహి, ఇంద్రాణి, చాముండ, చండిక – అను ఎనమండుగురు దేవతలనూ పూజించాలి. పిమ్మట ఎనమండుగురు భైరవులనూ అర్చించాలి. అసితాంగుడు, రురుడు, చండుడు, క్రోధి, ఉన్మత్తుడు, కపాలి, భీషణుడు, సంహారి అనువారలు అష్టభైరవులు. భైరవ పూజానంతరము రతి, ప్రీతి, కామదేవ, పంచబాణ, యోగిని, బటుక, దుర్గ, విఘ్నరాజాదులనూ, గురువునూ, క్షేత్రపాల దేవతలనూ పూజించాలి.

సాధకుడిపుడు ఒక పంచగర్భ మండలాన్నిగానీ త్రికోణ పీఠాన్నిగానీ వేసి దానిపై శుక్లవర్ణ సుశోభితా, వరదాయినీ, వీణాపుస్తక ధారిణీ, అక్షమాల, అభయముద్ర హస్తాలంకృతా యగు సరస్వతీ దేవి మూర్తిని స్థాతిపించి మనసా ధ్యానించి పూజించాలి. ***చివరగా త్రిపురేశ్వరీ దేవి మంత్రాన్ని లక్షమార్లు జపించాలి.*** హవనం కూడా చేయాలి. అపుడా తల్లి సాధకునికి సిద్ధిధాత్రి కాగలదు. ఇక అతని శక్తికి తిరుగుండదు.

***(అధ్యాయాలు 24–26)***

# విషదూరక మంత్రం

ఋషులారా! ఇపుడు మీకు సర్పాది విషజంతువుల వల్ల కలిగే కష్టాలను తొలగించే మంత్రాన్నుపదేశిస్తాను వినండి.

*'ఓం కణిచికీణి కక్వాణీ చర్వాణీ*
*భూతహారిణి ఫణి విషిణి విరథ*
*నారాయణి ఉమే దహదహ హస్తే*
*చండేరౌద్రే మాహేశ్వరి మహాముఖి*
*జ్వాలాముఖి శంకుకర్ణి శుకముండే*
*శత్రుం హనహన సర్వనాశిని స్వేదయ*
*సర్వాంగశోణితం తన్నిరీక్షసి మనసాదేవి*
*సమ్మోహయ సమ్మోహయ రుద్రస్య*
*హృదయే జాతా రుద్రస్య హృదయే స్థితా ।*
*రుద్రో రౌద్రేణ రూపేణ త్వం దేవి రక్ష రక్ష*
*మాం హ్రూం మాం హ్రూం ఫ ఫ ఫ ఠఠ*
*స్కందమేఖలా బాలగ్రహ శత్రు విషహారీ*
*ఓం శాలే మాలే హర హర విషోంకార*
*రహి విషవేగే హాంహాం శవరిహుం*
*శవరి ఆ కౌలవేగేశే సర్వే వించమేఘమాలే*
*సర్వనాగాది విషహరణం !'*

ఈ మంత్రాన్ని ప్రయోగిస్తున్నపుడు దీని భావాన్నే మనసు నిండా అమ్మ స్వరూపంతో సహా నిలుపుకుంటూ వుండాలి. దీని భావం ఇది :

'అమ్మా ఉమాదేవీ! నీవు రుద్రుని హృదయం నుండి పుట్టి అక్కడే నివసించగలిగిన పరాశక్తివి. నీది రౌద్రరూపము. నీ ముఖం జ్వాల వలె జాజ్వల్యమానం. నీ కటికి వున్న ఘంటికారవం దుష్టశక్తుల పాలిటి శరాఘాతం. అందుకే దానిని క్షుద్ర ఘంటిక అంటారు. నీవు భూతప్రియవైనా విషసర్పాలకే విషరూపిణివి. విరథనారాయణిగా, శుకముండగా పిలువబడే నీవు దుష్టశక్తుల పాలిటి విశాల, భయంకరముఖివి; ప్రచండ స్వభావురాలివి. నీ చెవి కుండల శంకువుల కాంతులే వాటిని నయన విహీనులను గావిస్తాయి. చేతి

నుండి జ్వలన శక్తిని పుట్టించి మా శత్రువులను కాల్చివేయి. కాల్చివేయి. విషనాశినివైన ఓ దేవీ! ఈ నరుని (లేదా నారి)లో వ్యాపించిన విషప్రభావాన్ని నశింపజేయి. ఆ విష జంతువును సమ్మోహితంగా గావించు, సమ్మోహితం గావించు. దేవీ మమ్ము రక్షించు, రక్షించు' అనుకుంటూ మంత్రాన్ని మరల చదివి దేవిని మరల ప్రార్థించి ***ప్రూం మాం ప్రూం ఫఘఫరర*** అనే బీజాక్షరాలను పలుకుతుండాలి. తరువాత ***హాంహాం శవరిహుం*** అని కూడా ఉచ్చరిస్తూ రోగి శరీరాన్ని స్పృజించాలి. ఇలా రోగికి స్పృహవచ్చేదాకా మంత్ర పఠన, భావచింతన, బీజాక్షరోచ్చాటన, శవర్యుచ్చారణ చేస్తుండాలి. ***(అధ్యాయం - 27)***

# శ్రీ గోపాలదేవుని పూజ-శ్రీధరపూజ త్రైలోక్యమోహన మంత్రం

**ఋ**షులారా! నేనిపుడు భోగమోక్షదాయకాలైన విష్ణురూప దైవతములు గోపాల, శ్రీధరుల పూజా విధానాన్ని వినిపిస్తాను. ముందుగా పూజ కొఱకొక మండలాన్నేర్పాటు చేసి దాని ద్వార ప్రదేశంలో గంగాయమునలనూ, బ్రహ్మ యొక్క శక్తులైన ధాత, విధాతలనూ పూజించాలి. తరువాత లక్ష్మి, శంఖం, పద్మనిధి, శారంగధనువు, శరభాలను పూజించాలి. ఆ తరువాత తూర్పు దెసలో భద్ర, సుభద్రలకూ, దక్షిణ దిశలో చండ ప్రచండులకూ, పడమటి దిక్కున బల, ప్రబలులకూ, ఉత్తరం వైపున జయ విజయులకూ పూజలు చేయాలి. పిమ్మట నాలుగు ద్వారాలలో క్రమంగా లక్ష్మి, గణపతి, దుర్గ, సరస్వతమ్మలను పూజించాలి.

మండలం ఆగ్నేయాది కోణాల్లో పరమ భాగవతోత్తముడైన నారదునీ, సిద్ధులనూ, గురుగ్రహాన్నీ, నలకూబరునీ స్థాపించి పూజించాలి. తూర్పు వైపు విష్ణువునీ విష్ణుశక్తినీ అర్చించాలి. మండలంలో విష్ణు పరివారాన్ని స్థాపించి పూజించాలి. మండలమధ్యంలో శక్తి కూర్మ, అనంత, పృథ్వి, ధర్మ,జ్ఞాన, వైరాగ్య మూర్తులకు ఆగ్నేయాది కోణాల్లో పూజలు చేయాలి. వాయవ్య కోణంలోనూ ఉత్తర దిశలోనూ ప్రకాశ, ఐశ్వర్యాలను పూజించాలి.

***'గోపీజన వల్లభాయ స్వాహా'*** ఇది గోపాల మంత్రం. ఈ మంత్రాన్ని జపిస్తూ మండలంలో తూర్పుతో మొదలెట్టి క్రమంగా ఎనిమిది వైపులా కృష్ణపత్నులైన సుశీల, జాంబతి, రుక్మిణి, సత్యభామ, సునంద, నాగ్నజితి, లక్షణ, మిత్రవిందలను స్థాపించి ఆ తరువాత వారిని పూజించాలి. వెంటనే శ్రీ గోపాలదేవుని శంఖ, చక్ర, గద, పద్మ, ముసల, ఖడ్గ, పాశ, అంకుశ, శ్రీవత్స, కౌస్తుభ, ముకుట, వనమాలాది చిహ్నాలను పూజించాలి. పిమ్మట ఇంద్రాది ధ్వజపాలక దిక్పాలకునూ, విష్వక్సేనునీ, లక్ష్మీసహిత శ్రీకృష్ణ భగవానునీ అర్చించాలి.

గోపీ జన వల్లభమంత్రాన్ని జపించి, ధ్యానించి, సాంగోపాంగంగా ఆయన పూజను పై విధంగా చేసేవారికి సర్వాభీష్ట సిద్ధి కలుగుతుంది.

త్రైలోక్యమోహన శ్రీధరీయ మంత్రం :

***ఓం శ్రీం (లేదా శ్రీః) శ్రీధరాయ త్రైలోక్య మోహనాయ నమః ।***

***క్లీం పురుషోత్తమాయ త్రైలోక్య మోహనాయ నమః ।***

***ఓం విష్ణవే త్రైలోక్య మోహనాయ నమః ।***

***ఓం శ్రీం హ్రీం క్లీం త్రైలోక్యమోహనాయ విష్ణవే నమః ।***

ఈ మంత్రం సమస్త ప్రయోజనాలనూ సంపూర్ణంగా కలిగిస్తుంది.

మహర్షులారా! ఇపుడు శ్రీధరభగవానుని – అనగా విష్ణుదేవుని మంగళమయమైన పూజా విధానాన్ని వర్ణిస్తాను. సాధకుడు ముందుగా ఈ క్రింది మంత్రాలతో అంగన్యాసమును చేయాలి. ***ఓం శ్రాం హృదయాయ నమః, ఓం శ్రీం శిరసే స్వాహా, ఓం శ్రూం శిఖాయై వషట్, ఓం శ్రైం కవచాయ హుం, ఓం శ్రౌం, నేత్రత్రయాయ వౌషట్, ఓం శ్రః అస్త్రాయ ఫట్.***

అనంతరం శంఖ, చక్ర, గదాది స్వరూపిణీ ముద్రలను ప్రదర్శించి వాటిని ధరించి యున్న ఆత్మస్వరూపుడైన శ్రీధర భగవానుని ఇందాకటి మంత్రంతో ధ్యానించాలి. స్వస్తిక లేదా సర్వతో భద్రమండలాన్ని సిద్ధం చేసి శ్రీ భగవానుని ఆసనాన్ని పూజించి ఆ స్వామిని ***ఓం శ్రీధరాసన దేవతా ఆగచ్ఛత*** అని ఆవాహనం చేయాలి.

ఈ క్రింది మంత్రాలతో ఆసన పూజ చేయాలి.

***ఓం సమస్త పరివారాయాచ్యుతా సనాయ నమః*** ఆపై

***ఓం ధాత్రే నమః, ఓం విధాత్రే నమః*** లతో మొదలెట్టి ధాతా, విధాతా గంగాది దేవతలను ఈ క్రింది మంత్రాలతో పూజించాలి.

***ఓం గంగాయై నమః, ఓం యమునాయై నమః,***
***ఓం ఆధార శక్త్యై నమః, ఓం కూర్మాయ నమః,***
***ఓం అనంతాయ నమః, ఓం పృథివ్యై నమః,***
***ఓం ధర్మాయ నమః, ఓం జ్ఞానాయ నమః,***
***ఓం వైరాగ్యాయ నమః, ఓం ఐశ్వర్యాయ నమః,***
***ఓం అధర్మాయ నమః, ఓం అజ్ఞానాయ నమః,***

*ఓం అవైరాగ్యాయ నమః, ఓం అనైశ్వర్యాయ నమః,*

*ఓం కందాయ నమః, ఓం నాలాయ నమః,*

*ఓం పద్మాయ నమః, ఓం విమలాయై నమః,*

*ఓం ఉత్కర్షిణ్యై నమః, ఓం జ్ఞానాయై నమః,*

*ఓం క్రియాయై నమః, ఓం యోగాయై నమః,*

*ఓం ప్రహ్వ్యై నమః, ఓం సత్యాయై నమః,*

*ఓం ఈశానాయై నమః, ఓం అనుగ్రహాయై నమః,*

మరల శ్రీధర దేవుని ఇలా అంటూ ఆవాహన చేసి పూజ చేయాలి.

*ఓం హ్రీం శ్రీధరాయ త్రైలోక్య మోహనాయ విష్ణవే నమః ఆగచ్ఛ ।*

ఈ పూజానంతరము లక్ష్మీదేవిని *ఓం శ్రియై నమః* అంటూ పూజించాలి. ఆ తరువాత ఈ క్రింది మంత్రాలతో షడంగ న్యాసం చేయాలి.

*ఓం శ్రాం హృదయాయ నమః,*

*ఓం శ్రీం శిరసే నమః,*

*ఓం శ్రూం శిఖాయై నమః,*

*ఓం శ్రైం కవచాయ నమః,*

*ఓం శ్రౌం నేత్రత్రయాయ నమః,*

*ఓం శ్రః అస్త్రాయ నమః'* అనంతరము స్వామివారి ఆయుధాలనూ ఆభరణాలనూ అవరోధ వ్రాతము (పరివారము) నూ ఈ మంత్రాలతో అర్చించాలి.

*ఓం శంఖాయ నమః, ఓం పద్మాయ నమః,*

*ఓం చక్రాయ నమః, ఓం గదాయై నమః,*

*ఓం శ్రీవత్సాయ నమః, ఓం కౌస్తుభాయ నమః,*

*ఓం వనమాలాయై నమః, ఓం పీతాంబరాయ నమః,*

*ఓం బ్రహ్మణే నమః, ఓం నారదాయ నమః,*

*ఓం గురుభ్యో నమః, ఓం ఇంద్రాయ నమః,*

*ఓం అగ్నయే నమః, ఓం యమాయ నమః,*

*ఓం నిరృతయే నమః, ఓం వరుణాయ నమః,*

*ఓం వాయవే నమః, ఓం సోమాయ నమః,*

***ఓం ఈశానాయ నమః, ఓం అనంతాయ నమః,***
***ఓం బ్రహ్మణే నమః, ఓం సత్త్వాయ నమః,***
***ఓం రజసే నమః, ఓం తమసే నమః,***

***ఓం విష్వక్సేనాయ నమః !*** ఈ దేవస్వరూపాలను షడంగన్యాస, అస్త్రపూజలతో తృప్తిపఱచిన పిమ్మట విష్ణుభగవానుని మూర్తిని అభిషేకించి వస్త్ర యజ్ఞోపవీతాలతో సింగారించి గంధ పుష్ప ధూప దీపాలను నివేదించి ప్రదక్షిణ చేయాలి. నైవేద్యం పెట్టి, మూలమంత్రాన్ని నూట యెనిమిదిమార్లు జపించి దాని ఫలాన్ని కూడా శ్రీధరభగవానునికి సమర్పించి వేయాలి.

ఒక ముహూర్తం పాటు కనులు మూసుకొని సాధకుడు తన హృదయ దేశంలో పరిశుద్ధ స్ఫటిక మణి సమానకాంతులతో విరాజిల్లువాడు, కోట్ల సూర్యుల ప్రభలతో వెలుగొందువాడు, ప్రసన్నముఖుడు, సౌమ్యముద్రలోనుండువాడు, ధవళ మకర కుండలాలతో శోభిల్లువాడు, ముకుటధారి, శుభలక్షణ సంపన్నములైన అంగములు గలవాడు, వన మాలాలంకృతుడునగు శ్రీధర దేవుని పరబ్రహ్మ స్వరూపాన్ని ధ్యానించాలి. తరువాత ఈ క్రింది స్తోత్రాన్ని చదవాలి.

***శ్రీనివాసాయ దేవాయ నమః శ్రీపతయే నమః।***
***శ్రీధరాయ సశారంగాయ శ్రీప్రదాయ నమో నమః ॥***
***శ్రీవల్లభాయ శాంతాయ శ్రీమతే చనమో నమః।***
***శ్రీ పర్వత నివాసాయ నమః శ్రేయస్కరాయ చ ॥***
***శ్రేయసాం పతయే చైవ హ్యాశ్రయాయ నమో నమః ॥***
***శరణ్యాయ వరేణ్యాయ నమో భూయో నమో నమః ।***
***స్తోత్రం కృత్వా నమస్కృత్య దేవదేవం విసర్జయేత్ ॥***

విష్ణువు శివునికి ఈ విధంగా ఉపదేశించాక శివుడు అత్యంత దుస్తరమైన భవసాగరాన్ని సులువుగా దాటించే పూజావిధానమేదైనా వినిపించుమని అభ్యర్థించాడు. దానికి విష్ణువు ఇలా చెప్పాడు (అని సూతుడు శౌనకాది మహామునులకు చెప్పసాగాడు)

మరొక విష్ణు పూజ వుంది. ఇది భోగమోక్షాలను అలవోకగా అందిస్తుంది. ఈ పూజా విధానంలో సాధకుడు ముందుగా స్నానం చేసి సంధ్య వార్చుకొని యజ్ఞ మండపంలో ప్రవేశించాలి. కాళ్ళూ చేతులూ కడుక్కొని శాస్త్రోక్తంగా ఆచమనం చేసి న్యాస విధిననుసరిస్తూ రెండు చేతుల ద్వారా వ్యాపకరూపంలో మూల మంత్రము యొక్క కరన్యాసం చేయాలి. హే రుద్రదేవా! విష్ణు దేవుని మూలమంత్రం ఇది :

*'ఓం శ్రీ హ్రీం శ్రీధరాయ విష్ణవే నమః'*

ఇది దేవాధిదేవుడు, పరమేశ్వరుడునగు విష్ణువాచకం. ఇది సర్వరోగహర్త, సమస్త గ్రహశమకర్త, సర్వపాప వినాశకం, భక్తి, భుక్తి, ముక్తి ప్రదాయకం.

తరువాత 'ఓం హాం హృదయాయ నమః'తో మొదలెట్టి 'అస్త్రాయ ఫట్' దాకా గల మంత్రాలతో అంగన్యాసం చేసుకోవాలి.

తరువాత సంయమియై ఆత్మముద్రను ప్రదర్శించాలి. హృదయగుహలో అతులిత కాంతులతో విరాజిల్లుతున్న శంఖ చక్రధారి, కుందపుష్ప, చంద్రకాంతి శోభితుడు, శ్రీవత్స కౌస్తుభ సమన్వితుడు, వనమాల, రత్నహారాలంకృతుడునగు విష్ణుభగవానుని కనులు మూసుకొని, మనసులో మనసుతో చూసి మనసారా ధ్యానించాలి.

తరువాత 'విష్ణుమండలస్థితులైన దేవగణులారా, పార్షదులారా, శక్తులారా! మీ అందరినీ ఆదరంతో ఆవాహన చేస్తున్నాను. ఇక్కడికి దయచేయండి' అని ఈ మంత్రాల ద్వారా ఆవాహన చేయాలి.

*ఓం సమస్త పరివారాయాచ్యుతాయ నమః,*
*ఓం ధాత్రే నమః, ఓం విధాత్రే నమః,*
*ఓం గంగాయై నమః, ఓం యమునాయై నమః,*
*ఓం శంఖ నిధయే నమః ఓం పద్మనిధయే నమః,*
*ఓం చండాయ నమః, ఓం ప్రచండాయ నమః,*
*ఓం ద్వారిశ్రియై నమః, ఓం ఆధార శక్త్యై నమః,*
*ఓం కూర్మాయ నమః, ఓం అనంతాయ నమః,*
*ఓం శ్రియై నమః, ఓం ధర్మాయ నమః,*
*ఓం జ్ఞానాయ నమః, ఓం వైరాగ్యాయ నమః,*
*ఓం ఐశ్వర్యాయ నమః, ఓం అధర్మాయ నమః,*
*ఓం అజ్ఞానాయ నమః, ఓం అవైరాగ్యాయ నమః,*
*ఓం అనైశ్వర్యాయ నమః, ఓం సం సత్త్వాయ నమః,*
*ఓం రం రజసే నమః, ఓం తం తమసే నమః,*
*ఓం కం కందాయ నమః, ఓం నం నాలాయ నమః,*
*ఓం లాం పద్మాయ నమః, ఓం అం అర్క మండలాయ నమః,*

*ఓం సోం సోమమండలాయ నమః, ఓం వం వహ్నిమండలాయ నమః,*

*ఓం విమలాయై నమః, ఓం ఉత్కర్షిణ్యై నమః,*

*ఓం జ్ఞానాయై నమః, ఓం క్రియాయై నమః,*

*ఓం యోగాయై నమః, ఓం పద్మ్యై నమః,*

*ఓం సత్యాయై నమః, ఓం ఈశానాయై నమః,*

*ఓం అనుగ్రహాయై నమః* – ఈ నామ మంత్రాలతో, గంధ పుష్పాది ఉపచారాల ద్వారా పైన చెప్పబడిన దేవతలందరినీ నమస్కారపూర్వకంగా పూజించాలి.

తదనంతరం పాప వినాశకుడైన, పరమేశ్వరుడైన విష్ణుభగవానుని మండలంలోకి ఆవాహన చేసి ఈ విధంగా పూజించాలి. ముందు మన శరీరంతో న్యాసం చేసినట్లుగానే ఇప్పుడు ప్రతిమతో చేయాలి. ముద్రాప్రదర్శన, అర్ఘ్య పాద్యాది ఉపచారాలతో పూజ చేసి, ప్రతిమకు, స్నాన, వస్త్ర, ఆచమన, గంధ, పుష్ప, ధూప, దీపాదులను సమర్పించి నైవేద్యంగా 'చరు'ని పెట్టాలి. ఆ మహాదేవునికి భక్తిగా ప్రదక్షిణ చేయాలి. తరువాత ఆయన మూల మంత్రాన్ని నూటయెనిమిది మార్లు జపించి ఆ జపాన్ని కూడా ఆయనకు అర్పించాలి. మరల ఆయన హృదయాదులను (ఓం హాం హృదయాయ నమః నుండి హః అస్త్రాయ నమః దాకా) అలంకార, ఆయుధాదులను (శంఖం నుండి శారంగం దాకా)

*ఓం శంఖాయ నమః, ఓం పద్మాయ నమః,*

*ఓం చక్రాయ నమః, ఓం గదాయై నమః,*

*ఓం శ్రీవత్సాయ నమః, ఓం కౌస్తుభాయ నమః,*

*ఓం వనమాలాయై నమః, ఓం పీతాంబరాయ నమః,*

*ఓం బ్రహ్మణే నమః, ఓం నారదాయ నమః,*

*ఓం గురుభ్యో నమః, ఓం ఇంద్రాయ నమః,*

*ఓం అగ్నయే నమః, ఓం యమాయ నమః,*

*ఓం నిర్పతయే నమః, ఓం వరుణాయ నమః,*

*ఓం వాయవే నమః, ఓం సోమాయ నమః,*

*ఓం ఈశానాయ నమః, ఓం అనంతాయ నమః,*

*ఓం బ్రహ్మణే నమః, ఓం సత్త్వాయ నమః,*

*ఓం రజసే నమః, ఓం తమసే నమః,*

*ఓం విష్వక్సేనాయ నమః !* పూజించి ఇతర దేవతలను కూడా ఇలా పూజించాలి.

*ఓం శరాయ నమః, ఓం బ్రహ్మణే నమః,*

*ఓం నారదాయ నమః, ఓం పూర్వసిద్ధేభ్యో నమః,*

*ఓం భగవతేభ్యో నమః, ఓం గురుభ్యో నమః,*

*ఓం పరమ గురుభ్యో నమః* అనంతరం దిక్పాలకులనూ, అనంతునీ, బ్రహ్మనీ సపరివారంగా ఆహ్వానించి ఈ మంత్రాలతో అర్చించాలి.

*ఓం ఇంద్రాయ సురాధిపతే సవాహన పరివారాయ నమః,*

*ఓం అగ్నయే తేజోఽధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం యమాయ ప్రేతాధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం నిర్రుతయే రక్షోఽధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం వరుణాయ జలాధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం వాయవే ప్రాణాధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం సోమాయ నక్షత్రాధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం ఈశానాయ విద్యాధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం అనంతాయ నాగాధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం బ్రహ్మణే లోకాధిపతయే సవాహన పరివారాయ నమః,*

*ఓం వజ్రాయ హుం ఫట్ నమః,*

*ఓం శక్త్యై హుం ఫట్ నమః,*

*ఓం దండాయ హుం ఫట్ నమః,*

*ఓం ఖడ్గాయ హుం ఫట్ నమః,*

*ఓం పాశాయ హుం ఫట్ నమః,*

*ఓం ధ్వజాయ హుం ఫట్ నమః,*

*ఓం గదాయై హుం ఫట్ నమః,*

*ఓం త్రిశూలాయ హుం ఫట్ నమః,*

*ఓం చక్రాయ హుం ఫట్ నమః,*

*ఓం పద్మాయ హుం ఫట్ నమః,* మరియు

*ఓం వౌం విష్వక్సేనాయ నమః,*

ఓం మహాదేవా! ఈ విధంగా అందరినీ మంత్రాల ద్వారా పూజల ద్వారా సంతోష పెట్టిన తరువాత మరల అందరిలోనూ వ్యాపించియున్న వాసుదేవుడైన విష్ణుదేవుని ఇలా స్తుతించాలి.

*విష్ణవే దేవ దేవాయ నమో వైప్రభవిష్ణవే ॥*
*విష్ణవే వాసుదేవాయ నమః స్థితి కరాయచ ।*
*గ్రసిష్ణవే నమశ్చైవ నమః ప్రళయశాయినే ॥*
*దేవానాం ప్రభవే చైవ యజ్ఞానాం ప్రభవే నమః ।*
*మునీనాం ప్రభవే నిత్యం యక్షాణాం ప్రభవిష్ణవే ॥*
*జిష్ణవే సర్వ దేవానాం సర్వగాయ మహాత్మనే ।*
*బ్రహ్మేంద్ర రుద్ర వంద్యాయ సర్వేశాయ నమోనమః ॥*
*సర్వలోక హితార్థాయ లోకాధ్యక్షాయవై నమః ।*
*సర్వగోప్త్రే సర్వకర్త్రే సర్వదుష్ట వినాశినే ॥*
*వరప్రదాయ శాంతాయ వరేణ్యాయ నమోనమః ।*
*శరణ్యాయ సురూపాయ ధర్మకామార్థదాయినే ॥* ***(ఆచార 31/24-29)***

శంకరదేవా! ఏ విధంగా బ్రహ్మ స్వరూపుడు, అవ్యయుడు, పరాత్పరుడునైన విష్ణుభగవానుని స్తుతించి సాధకుడు తన హృదయంలో ఆయనను చూడగలిగి ధ్యానించాలి. తరువాత మూలమంత్ర జపాన్ని చేస్తూ ధ్యానించాలి. ఈ రకంగా చేయగలిగిన వానికి విష్ణువు వశుడౌతాడు. హే రుద్రదేవా! ఈ విధంగా ఒక రహస్య పూర్ణ పరమగుహ్య, భుక్తి ముక్తి ప్రద, ★ విష్ణు ఉత్తమ పూజా విధానాన్ని మీరు నాచే పలికించారు. విద్వాంసుడైన పురుషుడీ పూజను పఠించగానే విష్ణుభక్తశ్రేష్ఠుడై వెలుగొందుతాడు. దీనిని విన్నవారు, చెప్పినవారు విష్ణులోక ప్రాప్తి నొందుతారు. ***(అధ్యాయాలు 28-31)***

## పంచతత్త్వార్చన - విధి

'హే పరమాత్మా! తెలుసుకున్నంత మాత్రాననే సాధకునికి పరమపదాన్ని ప్రాప్తింపచేసే సారతత్త్వంలో భాగమైన పంచతత్త్వార్చన ఒకటున్నదని విన్నాను. మాపై దయవుంచి దానినుపదేశించండి' అని కోరాడు శివుడు.

లోక కల్యాణం కోసం శంకరభగవానుని ఆరాటాన్ని అర్థం చేసుకున్న ఆదిదేవుడు ఆనందభరితుడై ఇలా చెప్పసాగాడు.

---

★ *వైష్ణవోత్తమ అని ఉండాలి.*

'సువ్రతుడవైన శంకరదేవా! మీకా పంచతత్త్వ పూజావిధిని తప్పక వినిపిస్తాను. ఎందుకంటే ఇది దివ్యం, మంగళస్వరూపం, కల్యాణకారి, రహస్యపూర్ణం, శ్రేష్ఠం, అభీష్ట సిద్ధిప్రదం, కలిదోష వినాశకం, పరమపవిత్రం.

హే సదాశివా! పరమాత్మయు, వాసుదేవుడునైన శ్రీహరి అవినాశి, శాంతుడు, సత్త్వస్వరూపుడు, ★ధ్రువుడు, శుద్ధుడు, సర్వవ్యాపి, నిరంజనుడు. ఆ విష్ణుదేవుడే తన స్వీయమాయ యొక్క ప్రభావం ద్వారా అయిదు ప్రకారాలుగా కనిపిస్తున్నాడు. ఈ ప్రకారాలు అయిదు రూపాలుగా, తత్త్వముగా పూజింపబడుతున్నాయి. విష్ణువు యొక్క పంచరూపాల వాచక మంత్రాలు వారి పేర్లతోనే ఇలా వుంటాయి.

***ఓం అం వాసుదేవాయ నమః,***
***ఓం ఆం సంకర్షణాయ నమః,***
***ఓం అం ప్రద్యుమ్నాయ నమః,***
***ఓం అః అనిరుద్ధాయ నమః,***
***ఓంఓం నారాయణాయ నమః ।***

సర్వపాతకాలనూ, మహాపాతకాలనూ నశింపజేసి పుణ్యాన్ని ప్రదానం చేసి, సర్వ రోగాలనూ దూరం చేసే, అయిదుగురు మహా దైవతముల వాచకాలే ఈ పంచమంత్రాలు.

ఈ పంచదేవ పూజకై సాధకుడు ముందుగా స్నానం చేసి విధివత్తుగా సంధ్యవార్చి మరల కాలుసేతులు కడుగుకొని పూజామందిరలో ప్రవేశించి ఆచమనం చేసి తమ మనసుకు నచ్చిన ఆసనాన్ని వేసుకొని స్థిరంగా కూర్చుని ***అం క్షౌం రం*** అనే మంత్రాలను చ్ఛరిస్తూ శోషణాది క్రియలను చేయాలి. అనగా శరీరాన్ని పొడిగా చేసుకోవాలి.

శ్రీ వాసుదేవకృష్ణుడే ఈ జగత్తుకి స్వామి. పీతాంబర విభూషితుడు, సహస్ర సూర్య సమాన తేజఃసంన్నుడు, దేదీప్యమాన మకరాకృతిలో నున్న కుండల సుశోభితుడునగు ఆ శ్రీకృష్ణ భగవానుని ముందుగా ప్రతి హృదయ కమలంలో నిలుపుకొని ధ్యానించాలి. తరువాత సంకర్షణ భగవానుని అనగా బలరామదేవుని, ఆపై యథాక్రమంగా ప్రద్యుమ్న, అనిరుద్ధ, శ్రీమన్నారాయణులను ధ్యానించాలి. పిమ్మట ఆ దేవాధిదేవుని నుండి జనించిన ఇంద్రాది దేవతలను కూడా ధ్యానించాలి. మూలమంత్రం ద్వారా రెండు చేతులతో వ్యాపక రూపంలో కరన్యాసం అనంతరం అంగన్యాస మంత్రాలతో అంగన్యాసం నెరవేర్చి సర్వదేవత లనూ పూజించాలి. ఆ న్యాస మంత్రాలనూ, పూజా మంత్రాలనూ వినిపిస్తాను, వినండి:

---

***[1] నిత్యుడు, అచలుడు అని అర్థము***

తరువాత ***ఓం పద్మాయ నమః*** అంటూ స్వస్తిక, సర్వతోభద్రాది మండలాలను నిర్మించి ఆ మండలంలో ఇవే మంత్రాలతో దేవతలందరినీ పూజించాలి.

మూలమంత్రాలతో పాద్యాది నివేదనాన్ని గావించి స్నాన, వస్త్ర, ఆచమన, గంధ పుష్ప, ధూప, దీప, నైవేద్యాదుల నర్పించి, ఈ దేవతలకు నమస్కార ప్రదక్షిణలను గావించిన పిమ్మట యధాశక్తి పలుమార్లు మూలమంత్రాన్ని జపించి దాని ఫలాన్ని శ్రీకృష్ణ వాసుదేవ ప్రభునికి అర్పించాలి.

తరువాత వాసుదేవునికి నమస్కరిస్తూ ఈ క్రింది స్తోత్రాన్ని పఠించాలి.

*ఓం నమో వాసుదేవాయ నమః, సంకర్షణాయ చ ॥*
*ప్రద్యుమ్నాయాది దేవాయానిరుద్ధాయ నమోనమః*
*నమో నారాయణాయైవ నరాణాం పతయే నమః ॥*
*నరపూజ్యాయ కీర్త్యాయ స్తుత్యాయ వరదాయచ ॥*
*అనాదినిధనాయై వ పురాణాయ నమోనమః ॥*

*సృష్టి సంహారక కర్త్రేచ బ్రహ్మణః పతయే నమః ॥*
*నమో వైవేద వేద్యాయ శంఖచక్రధరాయ చ ॥*
*కలి కల్మష హర్త్రేచ సురేశాయ నమోనమః ॥*
*సంసార వృక్ష ఛేత్రేచ మాయా భేత్రే నమో నమః ॥*
*బహురూపాయ తీర్థాయ త్రిగుణాయ గుణాయచ ।*
*బ్రహ్మవిష్ణ్వీశరూపాయ మోక్షదాయ నమో నమః ॥*
*మోక్షద్వారాయ ధర్మాయ*
*నిర్వాణాయ నమోనమః ।*
*సర్వకామ ప్రదాయైవ*
*పరబ్రహ్మ స్వరూపిణే ॥*
*సంసార సాగరే ఘోరే*
*నిమగ్నం మాం సముద్ధర ।*
*త్వదన్యోనాస్తి దేవేశ*
*నాస్తిత్రాతా జగత్ప్రభో ॥*

*త్వామేవ సర్వగం విష్ణుం*
*గతోఽహం శరణం తతః ।*
*జ్ఞానదీప ప్రదానేన*
*తమోముక్తం ప్రకాశయ ॥* **(ఆచార 32/30-37)**

ఈ విధంగా సమస్త కష్టాలనూ దూరం చేసే దేవేశుడైన వాసుదేవ భగవానుని స్తుతించాలి. ఇతర వైదిక స్తుతులతో కూడా విష్ణు దేవుని హృదయంలో భావిస్తూ స్తుతించ వచ్చును. తరువాత విసర్జన చేసి మందిరంలో నుండి బయటికి రావాలి. ఈ పంచతత్త్వ యుక్తమైన విష్ణు పూజ సంపూర్ణకామనలను నెరవేర్చే వాసుదేవుని పూజలలో సర్వశ్రేష్ఠంగా వ్యవహరింపబడుతోంది.

నీలలోహిత శివ మహాదేవా! ఈ పూజనొక్క మారు చేసినా మనిషి కృతకృత్యుడవు తాడు. దీనిని చదివినవారూ, విన్నవారూ, ఇతరులకు వినిపించినవారూ దేహాంతంలో విష్ణులోకాన్ని చేరుకుంటారు". **(అధ్యాయం - 32)**

# సుదర్శన చక్ర పూజా విధి

**సూ**తుడు శౌనకాది మహామునులకు శివుడు విష్ణువుతో ఇలా అన్నాడని చెప్పసాగాడు. "ఓ శంఖ గదాధరా! గ్రహదోషాలూ, రోగాదులూ, సర్వకష్టాలూ వినష్టము లవ్వాలంటే ఏ పూజను చేయాలి?"

"పరమశివా! నీవడిగిన దానికి సమాధానం సుదర్శన పూజ. ఈ పూజకి ముందు సాధకుడు స్నానం చేసి హరిని పూజించాలి. తరువాత తన నిర్మల హృదయ కమలంలో ఆ సుదర్శనాయుధుని నిలుపుకొని ధ్యానించాలి. ఆ తరువాత ఒక మండలాన్ని నిర్మించి అందులో శంఖ, చక్ర, గదా పద్మ భూషణుడైన కిరీటి, భగవానుడైన విష్ణుదేవుని ఆవాహన చేసి గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాది వివిధోపచారాలతో పూజించాలి.

పూజ చివరల్లో మూలమంత్రాన్ని నూటయెనిమిది మార్లు జపించాలి. హే రుద్రదేవా! మూలమంత్రమిదివఅకే చెప్పబడింది కదా! ఆ మంత్ర జపం తరువాత సర్వవ్యాధి దోష, కష్ట వినష్టకమైన ఈ సుదర్శన స్తుతిని శ్రద్ధగా పఠించాలి :

*నమః సుదర్శనాయైవ సహస్రాదిత్యవర్చసే ॥*
*జ్వాలా మాలా ప్రదీప్తాయ సహస్రారాయ చక్షుషే ।*
*సర్వదుష్టవినాశాయ సర్వపాతక మర్దినే ॥*
*సుచక్రాయ విచక్రాయ సర్వమంత్ర విభేదినే*
*ప్రసవిత్రే జగద్ధాత్రే జగద్విధ్వంసినే నమః ।*
*పాలనార్థాయలోకానాందుష్టాసుర వినాశినే ।*
*ఉగ్రాయ చైవ సౌమ్యాయ చండాయచ నమోనమః ॥*
*నమశ్చక్షుః స్వరూపాయ సంసార భయభేదినే ।*
*మాయా పంజర భేత్రేచ శివాయచ నమోనమః ॥*
*గ్రహాతిగ్రహరూపాయ గ్రహాణాం పతయే నమః*
*కాలాయ మృత్యవేచైవ భీమాయ చ నమో నమః ॥*
*భక్తానుగ్రహదాత్రే చ భక్త గోప్త్రే నమో నమః ॥*
*విష్ణురూపాయ శాంతాయ చాయు ధానాంధరాయచ ॥*
*విష్ణుశస్త్రాయ చక్రాయ నమోభూయోనమోనమః ॥*

ఈ స్తోత్రాన్ని వేరేగా చదివినా వచ్చే ఫలం ఇలా వుంటుంది.

*ఇతిస్తోత్రం మహత్పుణ్యం*
*చక్రస్య తవ కీర్తితం ॥*
*యః పఠేత్ పరయాభక్త్యా*
*విష్ణులోకం సగచ్ఛతి ।*
*చక్రపూజా విధింయశ్చ*
*పఠేద్రుద్ర జితేంద్రియః ।*
*సపాపం భస్మసాత్కృత్వా*
*విష్ణులోకాయ కల్పతే ॥* **(ఆచార 33/7-16)**

ఈ విధంగా ఇది విష్ణులోక ప్రాపకం.

# హయగ్రీవ పూజనావిధి

**సూ**తుడు శౌనకాది మహామునులకు విష్ణువు శివునికీ ఇతర దేవతలకూ ఉపదేశించిన హయగ్రీవపూజను ఇలా వినిపించసాగాడు.

"హయగ్రీవ పూజకు మూలమంత్రం పరమ పుణ్యాశాలి, సకల విద్యలనూ ప్రసాదించేది. ఓంకార యుక్తం. అది ఇది :

***ఓం సౌం క్షౌం శిరసే నమః***

ముందుగా ఎప్పటి వలెనే మంత్రాలతో అంగన్యాసం కరన్యాసం చేయాలి. (ఈ మంత్రాలిది వఱకే ఇవ్వబడ్డాయి. అయినా **(అనుబంధం- 5లో చూడవచ్చు).**

హయగ్రీవుడు శంఖం వలె, కుంద పుష్పం వలె, చంద్రుని వలె శ్వేతవర్ణుడు. ఆయన దేహకాంతి కమలనాళతంతు, రజత ధాతుకాంతితో సమానంగా ప్రకాశిస్తుంటుంది. నాలుగు చేతులలో శంఖ, చక్ర, గదా పద్మాలు ఆవు పాలలాగ, కోటి సూర్యప్రభలను విరజిమ్ముతుంటాయి. ఈ సర్వవ్యాపియైన దేవత ముకుట, కుండల, వనమాలా సుశోభితుడై సుదర్శనయుక్తుడై, సుందరదరహా సవ్యాపిత కపోలాలను కలిగి పీతాంబరధారియై మంగళ స్వరూపుడై వుంటాడు.

ఈ స్వామిని, అన్ని దేవతలనూ తనలోనే కలిగిన ఈ విరాట్ దేవుని సాధకుడు తన మనసులో భావించుకొని అంగమంత్రాలతో మూలమంత్రంతో న్యాసం చేయాలి. తరువాత మూలమంత్రంతోనే శంఖ, పద్మాదుల మంగళమయ ముద్రలను ప్రదర్శించాలి. తరువాత హయగ్రీవాసనానికి దగ్గరలో వున్న ఇతర దేవతలను ఆవాహన చేయాలి. ఈ మంత్రంతో :

***ఓం హయ గ్రీవాసనస్య ఆగచ్ఛత చ దేవతాః ।***

తరువాత ఒక స్వస్తిక లేదా సర్వతోభద్ర మండలంలో ఆ దేవతలను పూజించి ద్వారంలో ధాతనూ విధాతనూ పూజించాలి. తదనంతరం ***సమస్త పరివారాయ అచ్యుతాయ నమః*** అనే మంత్రంతో మండల మధ్యంలో విష్ణు భగవానుని పూజించి ద్వారమందు గంగ, మహాదేవిలను, శంఖ, పద్మ, నామక నిధులనూ, అగ్రభాగంలో గరుడునీ, మధ్యభాగంలో ఆధారశక్తినీ పూజించాలి. (ఈ మంత్రాలన్నీ ఇదివఱకే చెప్పబడ్డాయి)

అపుడు కూర్మ,అనంత, పృథ్వీ దేవతలను పూజించి ఆగ్నేయంలోధర్మునీ, నైరృత్యంలో జ్ఞానాన్నీ, వాయవ్యంలో వైరాగ్యాన్నీ, ఈశాన్యంలో ఐశ్వర్యాన్నీ పూజించాలి. ఆ తరువాత

క్రమంగా పూర్వాది దిశల్లో అధర్మ, అజ్ఞాన, అవైరాగ్య, అనైశ్వర్యాలను కూడా అర్చించాలి. మండలమధ్యంలో సత్త్వ రజస్తమోగుణాలనూ, అక్కడే కంద[1], నాళ, పద్మాలనూ విధ్యుక్తంగా పూజించాలి. అక్కడే అర్క, సోమ, అగ్ని మండలాలను కూడా పూజించాలి.

విమలాది శక్తులు తొమ్మిదింటినీ తూర్పుతో మొదలుపెట్టి క్రమంగా అన్ని దిక్కుల్లో వారి వారి మంత్రాలతో (శ్రీధర పూజానావిధిలో వలెనే) పూజించాలి.

తరువాత ఒక మంగళమయ ఆసనాన్ని స్నాన, గంధ, పుష్ప, ధూప, ధీప, నైవేద్యాదులతో పూజించి దేవాధిదేవుడు, భగవానుడునైన హయగ్రీవుని ఆవాహనం చేసి న్యాసం కూడా చేయాలి. ధ్యానం చేసుకొని శంఖచక్రాది మంగళముద్రలను ప్రదర్శించాలి. తరువాత పాద్య, అర్ఘ్య, ఆచమన, స్నానాలను ప్రదానం చేయాలి. వస్త్రప్రదానం ఆచమనానికి ముందు చేయాలి. సుందరయజ్ఞోపవీతాన్నివ్వాలి. తరువాత భైరవదేవుని మూలమంత్రంతో ఆహ్వానించి పాద్యాదులను సమర్పించి విధివత్తుగా పూజించాలి.

తరువాత శుభదాయినీ, ఐశ్వర్యప్రదాత్రీయైన లక్ష్మీదేవిని పూజించాలి.

తరువాత నలుదిక్కులలో ఇలా

తూర్పులో ***ఓం శంఖాయ నమః***

దక్షిణంలో ***ఓం పద్మాయ నమః***

పడమట ***ఓం చక్రాయ నమః***

ఉత్తరంలో ***ఓం గదాయై నమః*** అని ఉచ్చరిస్తూ ఆయా వస్తువులను అర్చించాలి. తరువాత అదే దిక్క్రమంలో ***ఓం ఖడ్గాయ నమః, ఓం ముసలాయ నమః, ఓం పాశాయ నమః, ఓం అంకుశాయ నమః*** అనే మంత్రాలతో ఆయా ఆయుధాలనీ వాటి మధ్యలో ***ఓం సశరాయ ధనుషే నమః*** అనే మంత్రంలో విల్లమ్ములనూ స్థాపించి పూజించాలి. అదే క్రమంలో ఓంకారమును, యను, నమఃను పెట్టి శ్రీవత్స, కౌస్తుభ, వనమాలా(యై) పీతాంబరాలనూ పూజించి మరల శంఖాదిధారియైన హయగ్రీవస్వామిని అర్చించాలి.

అనంతరం బ్రహ్మ, నారద, సిద్ధ, గురు, పరగురు, గురు పాదుకలను క్రమంగా ఈ విధంగా ***ఓం బ్రహ్మణే నమః, ఓం నారదాయ నమః,ఓం సిద్ధాయ నమః,ఓం గురుభ్యో నమః, ఓం పరగురుభ్యో నమః,ఓం గురుపాదుకాభ్యాం నమః*** అనే మంత్రాలతో పూజించాలి.

---

*[1] కందగడ్డ, హారతి కర్పూరం అనే అర్థాలున్నాయి.*

ఇపుడు తూర్పు దిక్కుతో మొదలెట్టి ఇంద్రాది దిక్పాలకులనూ, ఊర్ధ్వ అధో దిశలలో బ్రహ్మనూ అనంతునీ ఈ మంత్రాలతో పూజించాలి. **ఓం సవాహనాయ సపరివారాయ** అనే ఉపసర్గను అందరికీ చేరుస్తూ **ఇంద్రాయ నమః, అగ్నయే నమః, యమాయ నమః, నిరృతయే నమః, వరుణాయ నమః, వాయవే నమః, సోమాయ నమః, ఈశానాయ నమః,బ్రహ్మణే నమః, అనంతాయ నమః**లతో ఆయా దేవతలందరినీ పూజించాలి. పిమ్మట

***ఓం వజ్రాయ నమః, ఓం శక్తయే నమః,***

***ఓం దండాయ నమః, ఓం ఖడ్గాయ నమః,***

***ఓం పాశాయ నమః, ఓం ధ్వజాయ నమః,***

***ఓం గదాయై నమః, ఓం చక్రాయ నమః,***

అనే మంత్రాలతో ఆయుధాలనూ ***ఓం పద్మాయ నమః***

అనే మంత్రంతో పద్మాన్నీ, ఈశానకోణంలో ***ఓం విష్వక్సేనాయ నమః*** అనే మంత్రంతో ఆయననీ పూజించి అనంతరం అనంతుని మరల అర్చించాలి. పిమ్మట హయగ్రీవుని మూలమంత్రంతో సర్వోపచారాలతో మరల పూజించి ప్రదక్షిణ మరల యథాశక్తి మూలమంత్ర జపాన్నిచేసి దానిని ఆయనకే అర్పించి ఇలా స్తుతించాలి :

***ఓం నమో హయశిరసే విద్యాధ్యక్షాయవై నమః***
***నమో విద్యాస్వరూపాయ విద్యాదాత్రే నమో నమః ।***
***నమః శాంతాయ దేవాయ త్రిగుణాయాత్మనే నమః ॥***
***సురాసుర నిహంత్రేచ సర్వదుష్ట వినాశినే ।***
***సర్వలోకాధిపతయే బ్రహ్మరూపాయ వై నమః ॥***
***నమశ్చేశ్వర వంద్యాయ శంఖచక్రధరాయ చ ॥***
***నమ ఆద్యాయ దాంతాయ సర్వసత్త్వ హితాయ చ ॥***
***త్రిగుణాయా గుణాయైవ బ్రహ్మవిష్ణు స్వరూపిణే ।***
***కర్త్రే హర్త్రే సురేశాయ సర్వగాయ నమోనమః ॥*** ***(ఆచార - 34/50-54)***

ఈ విధంగా స్తుతించి సాధకుడు తన మనః కమలమధ్యంలో శంఖచక్రగదాధారి, కోటి సూర్యకాంతి ప్రభుడైన ప్రభువు, సర్వాంగసుందరుడు, అవినాశియగు మహేశునికే ఈశుడు, దేవాధిదేవుడు, పరమాత్మయగు హయగ్రీవుని నిలుపుకొని ధ్యానం చేయాలి.

హే ఫాలలోచనా! ఈ పూజను గూర్చి చదివినవారికి పరమపదం ప్రాప్తిస్తుంది.

***(అధ్యాయం - 34)***

# గాయత్రి న్యాసం - సంధ్యావిధి

**శం**కరాది దేవతలారా! విశ్వామిత్ర మహర్షి ప్రపంచానికి ప్రసాదించిన అద్భుత మంత్రం గాయత్రి. మిగతా మంత్రాలతో దేవతలను పూజిస్తారు. ఈ మంత్రాన్ని మాత్రమే ఒక స్వరూపాన్నూహించి న్యాసాదులతో పూజిస్తారు. ఈ మంత్రానికి ఋషి విశ్వమిత్రుడైన విశ్వామిత్రుడు. మంత్రాధిదేవత సూర్యుడు. దీనికి మస్తకం బ్రహ్మ, శిఖ శివుడు. విష్ణు హృదయమే నివాసము. ఈ మంత్రరూపాన్ని విశ్వరూపంగానే ఊహించాలి. మూడు లోకాలూ ఈ మంత్రానికి చరణాలు. కాబట్టి పుడమిని పాదంగానూ విష్ణువును మొండెం గానూ బ్రహ్మను తలగానూ శివుని శిఖగానూ ఒక స్వరూపాన్ని మనసులో పెట్టుకొని కనులు మూసుకొని గాయత్రి మంత్రాన్ని పన్నెండు లక్షలమార్లు జపించాలి.

ఈ మంత్రానికి మూడు పాదాలుంటాయనేది సర్వవిదితం. కాని, నాలుగో పాదము కూడా ఉంది. జపం చేసుకున్నపుడు మూడు పాదాలనూ, గాయత్రినీ సూర్యునీ పూజించి నపుడు నాలుగు పాదాలనూ వాడాలి.

***పరో రజసే஽సావదోం*** అనేది గాయత్రి మంత్రానికి నాలుగవపాదం. సూర్య పూజలోనే కాక ఇతర పూజలలో కూడా ఈ పాదాన్ని ప్రస్తుతం చదవడం కనిపిస్తోంది. జప, ధ్యాన యజ్ఞాది కృత్యాలలోనూ పూజలలోనూ నిత్యం ఈ సర్వపాప వినాశినియైన మంత్రానికి విధ్యుక్తంగా సాధకుడు అంగన్యాసం చేసుకోవాలి.

పాదాలబొటన వ్రేళ్ళు, చీలమండల మధ్యాలు, పిక్కలు, మోకాళ్ళు, తొడలు, వెనుకభాగము, అండకోశం, నాడి, నాభి, ఉదరం, ఛాతీ రెండు వైపులు, గుండె, కంఠం, పెదవులు, నోరు, తాలువు, రెండు భుజాగ్రాలు, నుదురు, కనులు, కనుబొమ్మలు, కణతలు, తల – ఈ భాగాలన్నింటిని ఈ మంత్ర న్యాసానికి వినియోగించాలి. తూర్పు మొదలుగా నాలుగు దిక్కులలోనూ ఈ మంత్ర న్యాసాన్ని చేయాలి.

గాయత్రి మంత్రంలోని 24 అక్షరాలనూ 24 రంగులలో వర్ణానికొక వర్ణంగా భావించి పూజించాలి. ఒకవేళ గాయత్రికి రూపాన్ని ఆవిష్కరిస్తే ఆ రూపానికి ఈ రంగులుండాలి. ఇంద్రనీలమణి రంగు, అగ్నివర్ణం, పసుపు, నలుపు, కపిల వర్ణం, అగ్ని వర్ణం, పసుపు, నలుపు, కపిల వర్ణం, తెలుపు. మెరుపు తీగ రంగు, ముత్యపు రంగు, కృష్ణ వర్ణం, ఎరుపు, చామనచాయ, వెన్నెల తెలుపు, శుక్ల వర్ణం, లేత పసుపు, పద్మరాగ వర్ణం, శంఖ వర్ణం, పాండుర వర్ణం, ద్రాక్ష ఎరుపు, తేనె రంగు, నలుపు ఎరుపు కలిసిన రంగు, సూర్య వర్ణం, సౌమ్య శ్వేతం, శంఖపు రంగు – ఇలా పంచరంగుల (పంచ వర్ణాల) కళల భేదాలతో ఇరవై నాలుగు అక్షరాలనూ ఒక ఫలకంపై వ్రాసి కూడా పూజించవచ్చు.

గాయత్రి మంత్రాన్ని చదువుతూ ముట్టుకునే వస్తువులూ, చూసే పదార్థాలూ కూడా పవిత్రాలై పోతాయి.

*యద్యత్ స్పృశతి హస్తేన*
*యచ్చ పశ్యతి చక్షుషా ।*
*పూతం భవతి తత్ సర్వం*
*గాయత్ర్యా న పరం విదుః ॥*

దేవతలారా! వేయిమాటలేల? గాయత్రికంటె శ్రేష్ఠమైన మంత్రం లేదు. ***(ఆచార-35/11)***

మహాదేవా! ఇక సర్వపాపనాశినియగు సంధ్యావందన విధిని వినిపిస్తాను. ముందుగా మూడుమార్లు ★ప్రాణాయామం చేసి సంధ్యాస్నానానికి ఉపక్రమించాలి.

ప్రాణవాయువును సంయతం చేసుకొని (అదుపులో నుంచుకొని) ఓంకారంతో, సప్తవ్యాహృతులతో యుక్తమైన **ఆపోజ్యోతీ రసోఽమృతం భూర్భువః స్వరోం** అనే మంత్రాన్ని మూడుమార్లు పలకడాన్నే ప్రాణాయామమంటారు. ద్విజుడు ప్రాణాయామాల ద్వారా మానసిక, వాచిక, కాయిక దోషాలను భస్మం చేయగలడు. కాబట్టి మనం యథావిధి, యథానియతి అన్ని కాలాల్లో ప్రాణాయామ పరాయణులమై వుండాలి.

ప్రొద్దున్న **సూర్యశ్చ** అనే మంత్రంతోనూ, మధ్యాహ్నం **ఆపఃపునంతు** అనే మంత్రం తోనూ, సాయంకాలం **అగ్నిశ్చమామన్యుశ్చ** అనే మంత్రంతోనూ యధావిధి ఆచమనం చేసి ప్రణవమంత్ర యుక్తమైన **ఆపోహి** అనే ఋచాతో కుశోదకం ద్వారా మార్జనం చేసుకుంటూ మంత్ర ప్రతిపాదానికి ఒక మారు తలపై నీళ్ళు చిలకరించు కుంటుండాలి.

***(సంధ్యావందన సమయంలో తప్పనిసరిగా పఠించవలసిన సప్తమంత్రాలూ అనుబంధం- 6 లో పూర్తిగా ఇవ్వబడ్డాయి)***

రజస్తమోగుణాల వల్లనూ, అజ్ఞానం వల్లనూ, జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే అవస్థలలోనూ మనం చేసుకున్న పాపాలూ, కాయిక, వాచిక, మానసిక పాపాలూ ఈ మంత్రాల వల్ల నశిస్తాయి.

కుడిచేతిలో నీటిని తీసుకొని దానిని ***ద్రుపదాం*** అనే మంత్రం ద్వారా అభిమంత్రితం చేసి తలపై పోసుకోవాలి. అఘమర్షణ మంత్రాలతో మూడు, ఆరు, ఎనిమిది లేదా పన్నెండు ఆవృతులను చేసి అఘమర్షణం చేసుకోవాలి. ఈ మంత్రాలేవనగా

---

★ *ప్రాణాయామాత్పూర్వమే సంధ్యోపాసనలో మాలాధారణ, పవిత్రీకరణ, శిఖాబంధన, భస్మధారణ, ఆచమన, మార్జన, భూమిశోధన, సంకల్పం, 'ఋతశ్చం' మంత్రపూత ఆచమనం వుంటాయని 'నిత్యకర్మ-పూజా ప్రకాశ్' మను ప్రామాణిక గ్రంథంలో చెప్పబడింది.*

*ఋతుంచ చాభీద్ధాత్త పసోఽ ధ్యజాయత ।*
*తతో రాత్ర్య జాయత । తతః సముద్రో*
*అర్ణవః సముద్రాదర్ణ వాదధి సంవత్సరో*
*అజాయత। అహోరాత్రాణి విదధద్విశ్వస్య*
*మిషతోవశీ । సూర్యచంద్ర మసౌధాతా*
*యథాపూర్వమకల్పయత్ । దివంచ*
*పృథివీం చాంతరిక్ష మథో స్వః ॥* *(ఋగ్వేదం 10/190/1)*

వీటిని పఠించిన తరువాత చేతులను కడుక్కొని తుడుచుకొని మరల **ఉదుత్యం, చిత్రమ్** అనే మంత్రాలను చదివి సూర్యోపస్థానం చేయాలి. దాని వల్ల దిన, రాత్రులలో చేసే పాపాలన్నీ నాశనమైపోతాయి.

ప్రాతఃకాలీనసంధ్యను నిలబడి వార్చాలి. ఇతర సంధ్యావందనాలను కూర్చుని చేయాలి. గాయత్రీమంత్రాన్ని పదిమార్లు జపిస్తే ఈ జన్మలో చేసిన పాపాలూ, వందమార్లు జపిస్తే పూర్వ జన్మపాపాలూ, వెయ్యిమార్లు జపిస్తే యుగంలో చేసిన పాపాలూ నశిస్తాయి.

*(ఆచార 36/10)*

గాయత్రి, సావిత్రి, సరస్వతి అనే మూడు మహాశక్తులు ఈ మంత్రం ద్వారా లభిస్తాయి. అవి క్రమంగా పొద్దున్న రక్తవర్ణంలోనూ, మధ్యాహ్నం శుక్లవర్ణంలోనూ, సాయంత్రం కృష్ణ వర్ణంలోనూ వుంటాయని పెద్దలు చెప్తారు.

ఇక వ్యాహృతి పూర్వక అంగన్యాసం ఇలా చేయాలి. గాయత్రి మంత్ర ప్రథమ వ్యాహృతియైన ***భూః*** ను ***'ఓం భూః హృదయాయ నమః*** అంటూ గుండెలోనూ, ద్వితీయ వ్యాహృతియైన ***భువః*** ను ***ఓం భువః శిరసే స్వాహా*** అంటూ తలపైనా, తృతీయ వ్యాహృతి ***స్వః*** ను ***ఓం స్వః శిఖాయైవషట్*** అంటూ శిఖలోనూ న్యాసము చేయాలి.

గాయత్రి మంత్ర ప్రథమ పాదాన్ని, అనగా, **తత్సవితుర్వరేణ్యం**ను కవచంలోనూ, రెండవ పాదం ***భర్గోదేవస్య ధీమహి***ని నేత్రాలలోనూ, మూడవ పాదం ***ధియోయోనః ప్రచోదయాత్***ను చేతులలోనూ, నాలుగవ పాదమైన ***పరోరజసేఽసావదోమ్***ను సర్వాంగాల లోనూ న్యాసంచేయాలి. ఈ విధంగా సంధ్యావందనముచేసేవారికి సర్వశుభాలూ ప్రాప్తిస్తాయి.

గాయత్రి యొక్క మొదటి మూడు పాదాలూ బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపాలు. ఋషినీ, ఛందాన్నీ స్మరిస్తూ మంత్రజపం చేసేవారికి బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది.

***'పరోరజసేఽసావదోమ్'***ని గాయత్రి తురీయ (శ్రేష్ఠ) పాదమంటారు. దీనికి ఋషి నిర్మలుడు, ఛందం గాయత్రి, దేవత పరమాత్మ.

ప్రాతః, మధ్యాహ్న, సాయంకాలాలలో 1008 లేదా 108 మార్లు గాయత్రి మంత్రాన్ని పఠించేవారు బ్రహ్మలోకానికి వెళ్ళే అధికారాన్ని పొందుతారు. ***(అధ్యాయాలు 35-37)***

## దుర్గాదేవి స్వరూపం సూర్యధ్యానం మరియు మాహేశ్వరీ పూజన విధి

**మ**హాదేవా! నవమి మున్నగు తిథులలో ***'ఓం హ్రీం దుర్గే రక్షిణి'*** అనే మంత్రంతో పూజించాలి. మార్గశిర తదియనాడు మొదలుపెట్టి క్రమగా ఈ నామాలతో రోజుకొక్క స్వరూపంతో అమ్మవారిని పూజించాలి. ఆ నామరూపాలేవనగా గౌరీ, కాళీ, ఉమా, దుర్గా, భద్రా, కాంతీ, సరస్వతీ, మంగళా, విజయా, లక్ష్మీ, శివా, నారాయణీశక్తులు. ఈ నామ, రూప, శక్తులు గల దేవిని పూజించువానికి ఇష్టవస్తు, ప్రియజన వియోగముండదు.

దుర్గాదేవికి పదునెనిమిది హస్తాలుంటాయి. వాటిలో ఖేటక,ఘంట,దర్పణ,ధను, ధ్వజ, డమరు, పరశు, పాశ, శక్తి, ముద్గర, శూల, కపాల, బాణ, అంకుశ, వజ్ర, చక్ర, శలాకలుండగా ఒకే చేయి తర్జనీ ముద్రలో వుంటుంది. అష్టాదశ భుజియైన దేవి స్వరూపాన్ని స్మరించిన వారికి అష్టైశ్వర్యాలూ అబ్బుతాయి. మహిషాసుర మర్దినియైన ఈ దేవి సింహంపై వుంటుంది.

శివదేవా! **సూర్యార్చన** విధిలో సూర్యభగవానుని తేజః స్వరూపాన్ని, రక్త వర్ణ కాంతి రూపాన్ని, శ్వేతపద్మంపై స్థితుని, ఏకచక్ర రథంపై ఆసీనుని, ద్విభుజయుక్తుని, కమలధరుని ధ్యానించాలి. ***(అనుబంధం-7లో చూడండి)*** **మాహేశ్వరి** పూజను వర్ణిస్తాను వినండి. ముందుగా స్నానం, ఆచమనం నిర్వర్తించి ఆసనంపై కూర్చుని న్యాసం చేసి ఒక మండలంలో మహేశ్వరుని చిత్రించి పూజించాలి. ఈ హరపూజను వీలైనంత ఎక్కువగా హరుని పరివారమంతటితో సహా చేయాలి.

***'ఓం హాం శివాసనదేవతా ఆగచ్ఛత'*** అనే మంత్రంతో ఆసన దేవతలందరినీ ఆవాహనం చేసి, మండల ముఖ్యద్వారంలో స్నాన, గంధాదులతో ఈ క్రింది మంత్రాల ద్వారా ఆయా మంత్రాధి దేవతలను పూజించాలి.

***ఓం హాం గణపతయే నమః,***

***ఓం హాం సరస్వత్యై నమః,***

***ఓం హాం నందినే నమః,***

***ఓం హాం మహాకాలాయ నమః,***

***ఓం హాం గంగాయై నమః,***

***ఓం హాం లక్ష్మ్యైనమః,***

*ఓం హాం మహాకాలాయై నమః,*
*ఓం హాం అస్త్రాయ నమః,*
*ఓం హాం బ్రహ్మాణే వాస్త్వధిపతయే నమః,*
*ఓం హాం గురుభ్యో నమః,*

ఆధారశక్తి నుండి అనైశ్వర్య శక్తి దాకా గల అన్ని మంత్రాలనూ (కూర్మ, పృథ్వీ తప్ప) పంచతత్త్వ పూజలోలాగే చదివి, తరువాత

*ఓం హాం ఊర్ధ్వచ్ఛందాయ నమః,*
*ఓం హాం అధశ్ఛందాయ నమః,*
*ఓం హాం పద్మాయ నమః,*
*ఓం హాం కర్ణికాయై నమః,*
*ఓం హాం వామాయై నమః,*
*ఓం హాం జ్యేష్ఠాయై నమః,*
*ఓం హాం రౌద్ర్యై నమః,*
*ఓం హాం కాల్యై నమః,*
*ఓం హాం కలవికరణ్యై నమః,*
*ఓం హాం బలప్రమథిన్యై నమః,*
*ఓం హాం సర్వభూతదమన్యై నమః,*
*ఓం హాం మనోన్మన్యై నమః,*
*ఓం హాం మండలత్రితయాయ నమః,*
*ఓం హాం హౌంహం శివమూర్తయే నమః,*
*ఓం హాం విద్యాధిపతయే నమః,*
*ఓం హాం హీం హౌం శివాయ నమః,*
*ఓం హాం హృదయాయ నమః,*
*ఓం హీం శిరసే నమః,*
*ఓం హూం శిఖాయై నమః,*
*ఓం హైం కవచాయ నమః,*
*ఓం హౌం  నేత్రత్రయాయ నమః,*
*ఓం హం అస్త్రాయ నమః,*
*ఓం హాం సద్యోజాతాయ నమః*

సద్యోజాత భగవానునికి ఎనిమిది కళలుంటాయి. వాటిని పూర్వాది దిశలో, క్రమంగా గంధాదులతో ఈ క్రింది మంత్రాలతో పూజించాలి.

***ఓం హాం సిద్ధ్యై నమః, ఓం హాం బుద్ధ్యై నమః,***
***ఓం హాం విద్యుతాయై నమః, ఓం హాం లక్ష్మ్యై నమః,***
***ఓం హాం బోధాయై నమః, ఓం హాం కాల్యై నమః***
***ఓం హాం స్వధాయ నమః, ఓం హాం ప్రభాయై నమః***

ఫాలలోచనా! వామదేవునికి పదమూడు కళలుంటాయి. వాటిని కూడా గంధ పుష్పాదులతో ***ఓం హాం వామదేవాయ నమః*** అనే మంత్రంతో వామదేవుని అన్ని ఉపచారాలతో అర్చించిన తరువాత ఈ క్రింది మంత్రాలతో పూజించాలి. (కళల మంత్రాలివి) :

***ఓం హాం రజసే నమః, ఓం హాం రక్షాయై నమః,***
***ఓం హాం రత్యై నమః, ఓం హాం కన్యాయై నమః,***
***ఓం హాం కామాయై నమః, ఓం హాం జనన్యై నమః,***
***ఓం హాం క్రియాయై నమః, ఓం హాం వృద్ధ్యై నమః,***
***ఓం హాం కార్యాయై నమః, ఓం హాం ★రాత్ర్యై నమః,***
***ఓం హాం భ్రామణ్యై నమః, ఓం హాం మోహిన్యై నమః,***
***ఓం హాం ★క్షరాయై నమః***

హే మహేశ్వరాదులారా! తత్పురుష దైవతానికి నాలుగు కళలుంటాయి. ముందు ***ఓం హాం తత్పురుషాయ నమః*** అనే మంత్రం ద్వారా ఆ దేవతను పూజించి ఆ తరువాత ఈ క్రింది మంత్రాల ద్వారా ఆ కళలనర్చించాలి. ***ఓం హాం నివృత్యై నమః, ఓం హాం ప్రతిష్ఠాయై నమః, ఓం హాం విద్యాయై నమః, ఓం హాం శాంత్యై నమః.***

పిమ్మట అఘోర భైరవ సంబంధి కళలారింటినీ ముందుగా ***ఓం హాం అఘోరాయ నమః*** అనే మంత్రంతో ఆయనను పూజించిన పిమ్మట ఈ క్రింది మంత్రాలతో పూజించాలి. ***ఓం హాం ఉమాయై నమః, ఓం హాం క్షమాయై నమః, ఓం హాం నిద్రాయై నమః, ఓం హాం వ్యాధ్యై నమః, ఓం హాం క్షుధాయై నమః, ఓం హాం తృష్ణాయై నమః.***

మహేశా! ఈశానదేవునికి కూడా అయిదు కళలుంటాయి. ముందుగా ఆ స్వామిని ***ఓం ఈశానాయ నమః*** అనే మంత్రంతో పూజించిన అనంతరం ఆ కళలను ఈ క్రింది మంత్రాలతో పూజించాలి.

---

★ *కొన్ని ప్రాచీన గ్రంథాలలో రాత్రికి బదులు 'ధాత్రి', క్షరకి బదులు 'త్వర' అనేవి వామదేవ కళలుగా చెప్పబడినవి. వాటినైతే 'ఓం హాం ధాత్ర్యై నమః', 'ఓం హాం త్వరాయై నమః' అనే మంత్రాలతో పూజించాలి.*

*ఓం హాం సమిత్యై నమః*

*ఓం హాం అంగదాయై నమః*

*ఓం హాం కృష్ణాయై నమః*

*ఓం హాం మరీచ్యై నమః*

*ఓం హాం జ్వాలాయై నమః*

శంకరా! ఆ తరువాత ***ఓం హాం శివపరివారేభ్యో నమః*** అంటూ పరమశివుని పరివారాన్నీ ఆ తరువాత ఈ క్రింది మంత్రాలతో దిక్పాలకులనూ, అనంతునీ, బ్రహ్మనీ, చండేశ్వరునీ ఆవాహన చేసి స్థాపన, సన్నిధాన, సంనిరోధ, సకలీకరణాలను గావించాలి.

***ఓం హాం ఇంద్రాయ సురాధిపతయే నమః,***

***ఓం హాం అగ్నయే తేజోధిపతయే నమః,***

***ఓం హాం యమాయ ప్రేతాధిపతయే నమః,***

***ఓం హాం నిర్ఋతయే రక్షోఽధిపతయే నమః,***

***ఓం హాం వరుణాయ జలాధిపతయే నమః,***

***ఓం హాం వాయవే ప్రాణాధిపతయే నమః,***

***ఓం హాం సోమాయ నేత్రాధిపతయే నమః,***

***ఓం హాం ఈశానాయ సర్వవిద్యాధిపతయే నమః,***

***ఓం హాం అనంతాయ నాగాధిపతయే నమః,***

***ఓం హాం బ్రహ్మణే సర్వలోకాధిపతయే నమః,***

***ఓం హాం ధూలి చండేశ్వరాయ నమః,***

అనంతరము తత్త్వ న్యాస, ముద్రాప్రదర్శన, ధ్యానాలను నిర్వర్తించి పాద్య, ఆసన, అర్ఘ్య, పుష్ప, అభ్యంగ, ఉద్వర్తన, స్నాన, సుగంధానులేపన, వస్త్ర అలంకార, భోగ, అంగన్యాస, ధూప, దీప, నైవేద్యార్పణ, తాంబూల నివేదనల ద్వారానూ, నృత్య, వాద్య, గీతాలతోనూ మహేశ్వరుని సంతుష్టపఱచాలి. దేవదేవుని రూపాన్ని మనసులో ధ్యానిస్తూ జపం చేయాలి. పూజనూ, జపాన్నీ ఆయనకే సమర్పించి వేయాలి.

ఈ ప్రకారంగానే వివిధ కామనల సిద్ధికై విశ్వావసు అను గంధర్వునీ కాళరాత్రీ దేవినీ కూడా ఉపాసిస్తారు. ***(అధ్యాయాలు 38-41)***

# శివ పవిత్రారోపణ విధి

శివపవిత్రారోపణ సర్వఅమంగళాలనూ నశింపజేస్తుంది. జందెపు దారములను విగ్రహానికి చుట్టడాన్నే పవిత్రారోపణమని అంటారు. ఈ పూజను ఆషాఢ, శ్రావణ, మాఘ లేదా భాద్రపద మాసంలో చేస్తారు. సత్యయుగంలో స్వర్ణంతో, త్రేతాయుగంలో వెండితో, ద్వాపరయుగంలో తామ్రంతో ఈ దారాలను తయారు చేసేవారు. కలియుగంలో పత్తిని కన్య చేత దారాలుగా పేనించి ఈ పూజకు వాడాలి. మూడు పోగులను తయారుచేసి మరల వాటిని బలంగా చుట్టి మూడు పోగులుగా దళంగా చేయాలి. ఈ రకమైన నవగుణిత సూత్రాన్ని వామదేవ మంత్రం చదువుతూ ముడులు వేయాలి. దీనినే పవిత్రకమంటారు. తరువాత సద్యోజాత మంత్రం ద్వారా వాటిని కడిగి అఘోరమంత్రం తో తుడిచి, తత్పురుష మంత్రంతో చిక్కులు విడదీసి, ఈశాన మంత్రం చదువుతూ దానికి సుగంధిత ధూపాన్ని వేయాలి.

ఇప్పుడివి తొమ్మిది దారపు పోగులు కదా! ఈ నవతంతువులలో క్రమంగా ఓంకార, చంద్ర, అగ్ని, బ్రహ్మ, నాగ, శిఖి,ధ్వజ, సూర్య, విష్ణు, శివ – ఈ దేవతలు నివాసముంటారు. ఇటువంటి పవిత్రకాలను నూట ఎనిమిది, యాభై, లేదా పాతిక సంఖ్యలో ఒక పూజకు వాడాలి. పవిత్రకంలో పదేసి ముడులు వుండాలి. నాలుగేసి, రెండేసి, లేదా ఒక్కొక్క అంగుళం దూరంలో ముడివేస్తూ పోవాలి. ఈ గ్రంథులలో నివసించి తమ పేర్లను ప్రసాదించి వాటిని పవిత్రం చేసే దేవతలు – ప్రకృతి, పౌరుషి, వీర, అపరాజిత, జహ్యాయ, విజయ, రుద్ర, అజిత, మనోన్మనీ, సర్వముఖి.

దేవతలారా! గ్రంథి బంధనానంతరం ఆ పవిత్రకాలను కుంకుమతో, చందనాది సుగంధాది పదార్థాలతో రంజితం చేయాలి. దానిని మహాదేవునికి సమర్పించి సర్వోపచారా లతో పూజించి 'హే దేవేశా! హే మహేశ్వరా! తమరు తమ గణాలతోసహా ఇక్కడ వేంచేసి వుండండి. ప్రాతర్వేళనే మీకు మరొక పూజను సమర్పించుకుంటాను' అని ఆహ్వానించాలి. ఆ రాత్రంతా నృత్య, గీత, వాద్యాలతో ఉత్సవాన్ని నడిపి జాగరం చేయాలి. తెల్లవారగానే ఆ పవిత్రకాలను మహేశ్వర సన్నిధిని స్థాపించి చతుర్దశి తిథి రాగానే స్నానం చేసి ముందుగా సూర్యునీ, తరువాత శివునీ పూజించాలి. తరువాత సాధకుడు ధ్యానంలోకి పోయి లలాటంలో విశ్వరూపుని చూసుకొని తన ఆత్మ స్వరూపాన్ని పూజించుకోవాలి.

అప్పుడు పవిత్రకాలను అస్త్రమంత్రాలతో కడిగి, హృదయ మంత్రంతో అర్చించి, సంహితా మంత్రాలతో ధూపం వేసి, భగవంతునికి సమర్పించాలి. ఈ క్రింది మంత్రాల ద్వారా ఈయీ తత్త్వాలను ప్రార్థించాలి.

***ఓం హౌం హౌం శివతత్త్వాయ నమః,***

***ఓం హీం (హీః) విద్యాతత్త్వాయ నమః***

***ఓం హాం (హౌః) ఆత్మతత్త్వాయ నమః,***

***ఓం హాం హీం హూం క్షౌః సర్వతత్త్వాయ నమః ।***

పిమ్మట మహేశ్వరునికి విధిపూర్వకంగా పవిత్రకాన్ని సమర్పించి కాసేపుంచి దానిని తీసి కనులకద్దుకొని వ్రతి ధరించాలి. ***(అధ్యాయం - 42)***

# విష్ణు పవిత్రారోపణ విధి

భోగ, మోక్షాలు రెండింటినీ ప్రసాదిస్తూ విజయాన్ని కూడా కలిగించేది విష్ణు పవిత్రారోపణ. ఒకప్పుడు దానవులతో పోరాడి పరాజితులైన దేవతలు బ్రహ్మతో సహా వచ్చి విష్ణువును శరణు వేడగా ఆయన(చెప్తున్నది విష్ణువే అయినా ఈ పురాణంలో నన్ను, నేను అనే పదాలను వాడకపోవడానికి కారణం సూతుడు శౌనకాదులకు వివరిస్తుండడం. సర్వనామాలు వాడితే అర్థం బోధపడకపోవచ్చు - అను) వారి కడగండ్లను చూసి, విని కరిగిపోయి తన మెడలోని హారాన్నీ, పవిత్రయను పేరు గల గ్రీవాభరణాన్నీ, ఒక ధ్వజాన్నీ, వారికి ప్రసాదించి 'దానిని చూస్తూనే దానవులు ధైర్యాన్ని కోల్పోవాల'ని దీవించాడు. ఆ తరువాత దేవతలు ఘనవిజయాన్ని సాధించారు. అప్పటినుండి ఈ పవిత్రకాలను అందరూ పూజిస్తున్నారు.

సదాశివా! పాడ్యమి నుండి పున్నమ దాకా ఒక్కొక్క తిథి ఒక్కొక్క దేవత పూజకు నిర్దేశింపబడింది. ఆయా దేవతలకు ఆయా తిథులలో పవిత్రారోపణ పూజను గావింపవలసి యుంటుంది. విష్ణువుకు ద్వాదశినాడు చేయాలి. వ్యతీపాతయోగ, ఉత్తరాయణ, దక్షిణాయన, చంద్ర సూర్యగ్రహణ, వివాహ, వృద్ధికార్య, గురుజన ఆగమన సందర్భాలలో కూడా ఈ పూజను చేయవచ్చును.

బ్రాహ్మణులకు పట్టుదారాలనూ, పత్తినీ, లతలనూ, క్షత్రియులకు పట్టునూ వైశ్యులకు క్షౌమ, భోజపత్రదారాలనూ పవిత్రక నిర్మాణాలకై ఋషులు నిర్దేశించారు. పత్తి లేదా కమల నిర్మిత పవిత్రకాన్ని అన్ని వర్ణాల వారూ వాడవచ్చును.

ఈ పవిత్రక నవతంతువులలో ఓంకార, శివ, చంద్ర, అగ్ని, బ్రహ్మ, శేష, సూర్య, గణేశ, విష్ణు దేవతలుంటారు.

బ్రహ్మ, విష్ణు,మహేశ్వరులు ఈ పవిత్రకంలోని మూడు సూత్రాలకూఅధిష్ఠాన దేవతలు. ఈ సూత్రాలను బంగారం, వెండి, రాగి, వెదురు లేదా మట్టిపాత్రలలో వుంచాలి. నూట యెనిమిది,యాభై ఒకటి, లేదా ఇరవై యేడు తంతువులతో పవిత్రకాన్ని నిర్మించవచ్చు.

ఉపవాసం చేసి ఈ సూత్రాలను కుంకుమ, పసుపు, చందనాలతో చర్చితం చేసి అధివసితం గావించాలి. ప్రతి పవిత్రకాన్నీ వేరు వేరుగా అభిమంత్రితం చేసి పూజించాలి. తరువాత, అప్పటికే మండలంలో స్థాపించి వుంచిన దేవ ప్రతిమకెదురుగా పవిత్రకాన్ని పెట్టాలి.

బ్రహ్మాది అన్య దేవతలను కూడా మండలంలో స్థాపించి పూజించాలి. సూత్రాలను సిద్ధం చేసుకొని మూడు నుండి తొమ్మిది మార్లు వాటిని తిప్పివేది చుట్టూ కట్టాలి. తరువాత కలశ, నెయ్యి. అగ్నికుండం, విమానం, మండపం, గృహాలను సూత్రాలతో కట్టి తనను కూడా సూత్రంతో నుదుట చుట్టుకొని, ఒక పవిత్రకాన్ని దేవత మస్తకంపై వుంచాలి.

సంపూర్ణ సామగ్రిని విష్ణుదేవునికి నివేదించి, పూజించి ఈ మంత్రాన్ని పఠించాలి.

*ఆవాహితోఽసి దేవేశ పూజార్థం పరమేశ్వర ॥*
*తత్ప్రభాతేఽర్చయిష్యామి సామగ్ర్యాః సన్నిధోభవ ।* (ఆచార 43/28,29)

ఇలా 'ప్రాతఃకాలమే నీకు పూజ చేస్తాను స్వామీ' అన్ని విన్నపం చేసి ఆ రాత్రంతా జాగరం చేసి తెల్లారగానే కేశవస్వామిని పూజించి పవిత్రకాలను ఆయన కర్పించాలి. తరువాత స్వామికీ పవిత్రకాలకూ సుగంధిత ఆహ్లాదక ధూపాన్ని వేసి మంత్రాన్ని చదవాలి. (ఇలాటపుడే నాలుగు పాదాల గాయత్రిని పఠిస్తారు)

అనంతరం పవిత్రకాలతో దేవుని పూజించి వాటిని ఆయన ఎదుట పెట్టి ఇలా ప్రార్థించాలి.

*విశుద్ధ గ్రంథికంరమ్యం మహాపాతక నాశనం ।*
*సర్వపాప క్షయం దేవతవాగ్రే ధారయామ్యహం ॥* (ఆచార 43/33)

తరువాత ఈ మంత్రం చదువుతూ సాధకుడు పవిత్రకాన్ని ధరించాలి.

*పవిత్రం వైష్ణవం తేజః*
*సర్వపాతక నాశనం ॥*
*ధర్మకామార్థ సిద్ధ్యర్థం*
*స్వకంఠే ధారయామ్యహం ॥* (ఆచార 43/34,35)

త్రివర్గ సిద్ధికై తానీ పవిత్రకాన్ని ధరిస్తున్నాని దేవునికి విన్నవించిన సాధకుడు ఆయనను ఇలా ప్రార్థించాలి.

*వనమాలా యథాదేవ*
*కౌస్తుభం సతతం హృది ।*
*తద్వత్ పవిత్రం తంతూనాం*
*మాలాం త్వం హృదయే ధర ॥* *(ఆచార 43/41)*

అనంతరం బ్రాహ్మణులకు భోజనాలు పెట్టి దక్షిణలిచ్చి సాయంకాలంగానీ మరునాడుగానీ మరల ఇలాగే పూజనొనర్చి ఈ క్రింది మంత్రాన్ని చదువుతూ దీక్షను విరమించాలి.

*సాంవత్సరీ మిమాం పూజాం*
*సంపాద్య విధి వన్మయా ।*
*వ్రజపవిత్రకే దానీం*
*విష్ణులోకం విసర్జితః ॥* *(ఆచార 43/43)*

తన వల్ల విసర్జింపబడుతున్న పవిత్రకం తనకన్న ముందే విష్ణులోకం చేరాలని సాధకుని ఉద్దేశ్యం. *(అధ్యాయం -43)*

# బ్రహ్మమూర్తి ధ్యాన నిరూపణం

**ప**విత్రకంతో భగవానుని పూజించి, ఆ పై శాస్త్రోక్తంగా బ్రహ్మను ధ్యానించిన సాధకుడు హరి సమానుడవుతాడు. (అంటే నా స్వరూపమే వానికీ వస్తుంది). మాయా జాలాన్ని ముక్కలు చేసే బ్రహ్మధ్యానాన్ని వినిపిస్తాను.

ప్రాజ్ఞుడు-అనగా విశేషసాధకుడు తన వాణినీ, మనసునీ అదుపులో పెట్టుకొని తన ఆత్మలో జ్ఞాన స్వరూపుడైన బ్రహ్మ కోసం యజ్ఞం చెయ్యాలి. జీవ-బ్రహ్మల అభేద దర్శనాన్ని వాంఛించి, దానికోసం తపము చేసి మహద్ బ్రహ్మజ్ఞాన భావనను కొంతకాలం పాటు భావించాలి.

బ్రహ్మధ్యానమే సమాధి. **'అహం బ్రహ్మాస్మి'** అనే స్థాయికి చేరుకోవడం సమాధి ద్వారానే సాధ్యం. తనకంటె భిన్నుడు కాని బ్రహ్మను తురీయ రూపుడని కూటస్థ నిరంజన పరబ్రహ్మయని వేదాలు వర్ణించాయి. ఈ స్థితిని చేరుకోగలిగిన సాధకుడు దేహ, ఇంద్రియ, మనోబుద్ధ్యహంకారాలు, పంచమహాభూతాలు, పంచతన్మాత్రలు, (గంధ, రస, రూప, స్పర్శ, శబ్దాలు) వివిధ గుణ, జన్మ, భోజన శయనాది భోగాలు- వీటన్నిటికీ అతీతుడవుతాడు.

మానవుడు తన శరీరాన్ని రథంగానూ, ఆత్మను రథిగానూ ఊహించుకోవాలి. బుద్ధి సారథి, మనస్సు త్రాడు; ఇంద్రియాలు గుఱ్ఱాలు.

ఇంద్రియాలు, మనసు, ఆత్మలను కలిపి 'భోక్త' అనే మాటతో గుర్తించారు మనీషులు. ఇంద్రియాలను జ్ఞానసహాయంతో అదుపులో పెట్టుకొనేవారే పరమపదాన్ని చేరుకోగలరు. స్వర్ధుని (అజ్ఞాన ప్రవాహం)ని దాటి విష్ణువు లేదా పరబ్రహ్మానందుకోగలరు★.

అహింసాది ధర్మాలూ, యమ శౌచాది కర్మ నియమాలూ ఈ పరమ యోగ సాధనానికి సోపానాలు. పద్మాసనం వేసుకొని కూర్చోవాలి. ప్రాణాయామం చేయాలి. ప్రాణ, అపానాది వాయువులపై విజయాన్ని పొందడమే ప్రాణాయామమనబడుతుంది. ధారణ చేయాలి. మనస్సును నియంత్రితం చేసుకోవడమే ధారణమనబడుతుంది. సమాధిగతులు కావాలి. మనస్సును బ్రహ్మపై లగ్నం చేయడమే కాక ఆయనలో కేంద్రీకృతం చేయాలి. ఇది సమాధి అనబడుతుంది. ఈ సమాధి కుదరకపోతే బ్రహ్మమూర్తి (ఆకారం)ని ఈ రకంగా ఊహించుకొని ప్రార్థించాలి.

హృదయకమల కర్ణికా మధ్యంలో వెలిగేవాడు, శంఖ, చక్ర, గదా, పద్మములచే సుశోభితుడు, శ్రీవత్స చిహ్నుడు, కౌస్తుభ, వనమాల,లక్ష్మీ(కళ)లచే అలంకృతుడు, నిత్య శుద్ధుడు, ఐశ్వర్య సంపన్నుడు, సత్య, పరమానంద స్వరూపుడు, ఆత్మ, జ్యోతి స్స్వరూపుడు, ఇరవై నాలుగు విభిన్న ఆకారాలలో అవతరించినవాడు, శాలగ్రామాలలో ద్వారకా శిలలలో నివసించేవాడు, పరమేశ్వరుడు అయిన పరమాత్మయే ధ్యాన యోగ్యుడు. బ్రహ్మ నేనూ బ్రహ్మనే. అహం బ్రహ్మోస్మి.

ఈ రకంగా సర్వయమనియమాలనూ పాటిస్తూ ఏకాగ్రచిత్తంతో యోగసాధనతో ధ్యానం చేసి పరమాత్మను తనలోనే చూడగలిగేవాడు కోరుకుంటే ఏదైనా దొరుకుతుంది. అతడు★వైమానిక దేవుడై పోతాడు. నిష్కాముడై ఈ బ్రహ్మమూర్తిని ధ్యానిస్తూ ముక్తినొందుతాడు.

***(అధ్యాయం -44)***

---

*★'శబ్దకల్పద్రుమంలో ఈ పదానికి' విగతంమానం ఉపమాయస్య' అనియూ 'విమాన ఏనేవ వైమానికః' అనియూ వ్యుత్పత్తులీయబడ్డాయి. అనగా నిరుపమేయుడు, ఉపమారహితుడు, సాటిలేనివాడు, మొత్తంగా సర్వోత్కృష్టుడు అని భావం.*

*★ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ ।*
*బుద్ధించ సారథిం విద్ధి మనం ప్రగ్రహమేవచ ॥*
*.................... తద్విష్ణోః పరమం పదం ॥ (ఆచార 44/6-9)*

## వివిధ *శాలగ్రామ శిలల లక్షణాలు

కైలాసవాసా! ఇపుడు శాలగ్రామ లక్షణాలను వినండి. శాలగ్రామ శిలలను స్పృశించినంత మాత్రముననే కోటిజన్మల పాపాలు కడుక్కుపోతాయి. కేశవ, నారాయణ, గోవింద, మధుసూదనాది పేర్లు గల విభిన్న శాలగ్రామాలుంటాయి. ఇవి శంఖచక్రాది చిహ్నాలతో సుశోభితాలై వుంటాయి. ఇలా :

కేశవ శాలగ్రామానికి శంఖ, చక్ర, కౌమోదకి (విష్ణుగద) పద్మాలుంటాయి. ఇవే చిహ్నాలు వేర్వేరు క్రమాల్లో ఇతర శాలగ్రామాలకుంటాయి.

అవి ఒక వరుసలో ఇలా వుంటాయి.

పద్మ, గద, చక్ర, శంఖ – **నారాయణ**
చక్ర, శంఖ, పద్మ, గద – **మాధవ**
గద, పద్మ, శంఖ, చక్ర – **గోవింద**
పద్మ, శంఖ, చక్ర, గద – **విష్ణు**
శంఖ, పద్మ, గద, చక్ర – **మధుసూదన**
గద, శంఖ, చక్ర, పద్మ – **త్రివిక్రమ**
చక్ర, గద, పద్మ, శంఖ – **వామన**
చక్ర, పద్మ, శంఖ, గద – **శ్రీధర**
పద్మ, గద, శంఖ, చక్ర – **హృషీకేశ**
పద్మ, చక్ర, గద, శంఖ – **పద్మనాభ**
శంఖ, చక్ర, గద, పద్మ – **దామోదర**
చక్ర, శంఖ, గద, పద్మ – **వాసుదేవ**
శంఖ, పద్మ, చక్ర, గద – **సంకర్షణ**
శంఖ, గద, పద్మ, చక్ర – **ప్రద్యుమ్న**
గద, శంఖ, పద్మ, చక్ర – **అనిరుద్ధ**
పద్మ, శంఖ, గద, చక్ర – **పురుషోత్తమ**

*సాలగ్రామమనే పదం సరైనది కాదు.

| | | |
|---|---|---|
| గద, శంఖ, చక్ర, పద్మ | – | **అధోక్షజ** |
| పద్మ, గద, శంఖ, చక్ర | – | **నృసింహ** |
| పద్మ, శంఖ, చక్ర, గద | – | **అచ్యుత** |
| శంఖ, చక్ర, పద్మ, గద | – | **జనార్దన** |
| గద, చక్ర, పద్మ, శంఖ | – | **ఉపేంద్ర** |
| చక్ర, పద్మ, గద, శంఖ | – | **హరి** |
| గద, పద్మ, చక్ర, శంఖ | – | **శ్రీకృష్ణ** |

ద్వారంపై శ్వేతవర్ణంలో రెండు చక్రాలు ధరించియున్న వాసుదేవభగవానుని శాలగ్రామాలు కూడా వుంటాయి. అలాగే రక్తవర్ణం, రెండు చక్రాలు, తూర్పు భాగంలోనొక పద్మచిహ్నము గల సంకర్షణ నామకమైన శాలగ్రామశిల వుంది. పీతవర్ణంలో ప్రద్యుమ్ననికీ ఛిద్రశిలలలో అనిరుద్ధునికీ శాలగ్రామాలున్నవి. ద్వారముఖంపై నీలవర్ణంలో మూడు రేఖలూ, శేషభాగమంతా శ్యామలవర్ణంలో కల్పింపబడిన నారాయణ శిలలున్నాయి. మరికొన్ని లక్షణాలతో ఇతర దేవతల శాలగ్రామాల వివరాలు ఈ దిగువనీయ బడుతున్నాయి.

| | |
|---|---|
| మధ్యంలో గదవంటి రేఖ | |
| విస్తృత వక్షస్థలం | |
| యథాస్థానంలో నాభిచక్రం | **నృసింహ** |
| పైవాటితో బాటు మూడు లేదా అయిదు బిందువులు | **కపిల**★ |
| విషమ పరిణామాల రెండు చక్రాలు, శక్తి చిహ్నం | **వారాహ** |
| నీలవర్ణం, మూడు రేఖలు, స్థూలము, బిందుయుక్తము | **కూర్మమూర్తి** |
| పై లక్షణాలతో గుండ్రంగా వుండి వెనుకభాగంలో వంపు | **కృష్ణ** |
| అయిదు రేఖలు | **శ్రీధర** |
| అదనంగా గద | **వనమాలి** |
| గోళాకారం, తక్కువ పరిమాణం | **వామన** |
| ఎడమభాగంలో చక్రం | **సురేశ్వర** |

★*దీనిని బ్రహ్మచారులు తప్పనిసరిగా ఆరాధించాలి.*

| | |
|---|---|
| రకరకాల రంగులు, బహు రూపాలు, పడగల ముద్రలు | **అనంతక** |
| స్థూలం, నీలవర్ణం, మధ్యలో కూడా | |
| నీలవర్ణంలోనే చక్రం | **దామోదర** |
| సంకుచిత ద్వారం, రక్తవర్ణం | |
| పొడవైన రేఖలు, ఛిద్రాలు, చక్రం, కమలం,విశాలం | **బ్రహ్మశిల** |
| విస్తృత ఛిద్రాలు, చిన్న చక్రం | **కృష్ణశిల** |
| బిల్వాకార శిల | **విష్ణుశిల** |
| అంకుశం, ఆకారం, అయిదు రేఖలూ, | |
| కౌస్తుభ చిహ్నం | **హయగ్రీవ శిల** |
| చక్ర కమలాంకితం, మణుల రత్నాల కాంతి, | |
| నల్లరంగు | **వైకుంఠశిల** |
| ద్వారంపై రేఖ, విస్తృత కమల | |
| సదృశ శిల | **మత్స్యశిల** |
| కుడివైపు రేఖ, నల్లరంగు రామచక్రాంకితం | **త్రివిక్రమ శిల** |
| ఒకద్వారం, నాలుగు చక్రాలు, వనమాల, | |
| స్వర్ణరేఖ, గోపద సుశోభితం, కదంబ పుష్పాకృతి | **లక్ష్మీనారాయణశిల** |

**చక్రాలు మాత్రమే ఉండేవి ఇవి :**

| | | |
|---|---|---|
| ఏకచక్రం | – | **సుదర్శన శాలగ్రామం** |
| రెండు చక్రాలు | – | **లక్ష్మీనారాయణ** |
| మూడు చక్రాలు | – | **త్రివిక్రమ** |
| నాలుగు చక్రాలు | – | **చతుర్వ్యూహ** |
| అయిదు చక్రాలు | – | **వాసుదేవ** |
| ఆరు చక్రాలు | – | **ప్రద్యుమ్న** |
| ఏడు చక్రాలు | – | **సంకర్షణ** |
| ఎనిమిది చక్రాలు | – | **పురుషోత్తమ** |
| తొమ్మిది చక్రాలు | – | **నవవ్యూహ** |

| | | | |
|---|---|---|---|
| పది చక్రాలు | – | **దశావతార** | |
| పదకొండు చక్రాలు | – | **అనిరుద్ధ** | |
| పన్నెండు చక్రాలు | – | **ద్వాదశాత్మ** | |
| పన్నెండు కన్ననెక్కువ | – | **అనంత** | ***(అధ్యాయం - 45)*** |

# వాస్తు మండల పూజావిధి

గృహనిర్మాణ ప్రారంభంలో విఘ్నమేదీ రాకుండా కాపాడుమని వాస్తు పురుషుని వేడుకుంటూ చేసే పూజ ఇది. ఈ వాస్తుపూజకై ఎనుబది యొక్క అడుగుల మండపాన్ని నిర్మించి దానిలోని ఈశాన్య కోణంలో పూజను మొదలెట్టి మండపమంతటా సంపూర్ణంగా వ్యాపింపజేయాలి.

ఈ మండల (లేదా మండప) ఈశాన్య కోణంలో వాస్తుదేవత మస్తకాన్ని నిర్మించాలి. నైరృతిలో రెండు పాదాలూ, మిగతా రెండు మూలల్లో చేతులూ వుండాలి. ఏ నిర్మాణాన్ని చేపట్టినా ముందుగా ఈ వాస్తు దేవతను స్థాపించి పూజించాలి. తరువాత ఇరువది యొక్కమంది దేవతలను మండల బాహ్యాభాగంలోనూ పదముగ్గురు దేవతలను అంతర్భాగములోనూ ఉంచాలి.

బాహ్య దేవతలు వీరు : ఈశ, శిఖి, పర్జన్య, జయంత, కులిశాయుధ, సూర్య, సత్య, భృగు, ఆకాశ, వాయు, పూష, వితథ, గ్రహక్షేత్ర, యమ, గంధర్వ, భృగురాజ, మృగ, పితృగణ, దౌవారిక, సుగ్రీవ, పుష్పదంత, గణాధిప, అసుర, శేష, పాప, రోగ, అహిముఖ, భల్లాట, సోమ, సర్ప, దితి, అదితి – వీరిని పూజించిన తరువాత ఈశాన్యంలో జలాన్నీ, ఆగ్నేయంలో సావిత్రినీ, నైరృత్యంలో జయనీ, వాయవ్యంలో రుద్రదేవునీ పూజించాలి. తరువాత తొమ్మిదడుగుల జాగాలో బ్రహ్మనీ ఆయనకు ఎనిమిది వైపులా తూర్పున మొదలెట్టి అర్యమ, సవిత, వివస్వాన్, విబుధాధిప, మిత్ర, రాజయక్ష్మ, పృథ్వీధర, అపవత్స అనే దేవతలను మండలం లోపల స్థాపించి పూజించాలి.

లోపలి భాగంలో పూజించవలసిన దేవతలు వీరు – వీరందరినీ రేఖలను జాగ్రత్తగా గీసి వాటి బిందువులపై పూజించాలి. ఈశాన్యం నుండి నైరృత్యం దాకా సూత్రం ద్వారా గీయబడిన రేఖను 'వంశ' అంటారు. అలాగే ఆగ్నేయం నుండి వాయవ్యానికున్న రేఖను 'దుర్ధర' అంటారు. వంశరేఖపై ఈశాన్య కోణంలో అదితినీ, దుర్ధరయోగ బిందువుపై హిమవంతునీ, నైరృత్య కోణాంతిమ బిందువుపై జయంతునీ పూజించాలి. తరువాత

దుర్ధర రేఖ మొదట్లో అగ్నికోణంపై 'నాయిక' నీ చివరల్లో కాళికాదేవినీ పూజించాలి. తరువాత ఇంద్రాది దిక్పాలకులను పూజించి ఇతర దేవతలందరినీ మరల పూజించిన పిమ్మటనే భవన నిర్మాణ కార్యాన్ని ప్రారంభించాలి.

భవనానికెదురు భాగంలో దేవాలయం, ఆగ్నేయంలో పాకశాల, తూర్పులో యజ్ఞ మండపం, ఈశాన్యంలో సుగంధ ద్రవ్యాలనూ, పూలనూ దాచుకొనే చోటు, ఉత్తరంలో భాండాగారం, వాయవ్యంలో గోశాల, పశ్చిమం వైపు కిటికీలూ, జలాశయం, నైరృత్య కోణంలో సమిధ, కుశ, ఇంధన, అస్త్ర శస్త్రాదులకు చోటు, దక్షిణం వైపు సుందరమైన శయ్య, ఆసనం, పాదుకలు, జల, అగ్ని, దీపములు, భృత్యులు, అతిథి గృహం వుండాలి.

ఇంటిమధ్యలో, అంటే నడివాకిట్లో గల ఖాళీ జాగా నిత్యం నీటితో చెమ్మగా వుండాలి. అందులో నొక నుయ్యి, అరటి చెట్టు, అయిదు రకాలు పూల చెట్లు వుండాలి. భవన బాహ్యభాగంలో నాలుగు వైపులా అయిదేసి హస్తాల పిట్టగోడలను కట్టి వీలైనంత ఎక్కువ స్థలంలో వన, ఉపవనాల మధ్య విష్ణుమందిరాన్ని నిర్మించాలి.

ఈ మందిర నిర్మాణ ప్రారంభంలో అరవై నాలుగు అడుగుల వాస్తు మండలాన్ని నిర్మింపజేసి అందులో వాస్తు దేవతను విధ్యుక్తంగా పూజించాలి. అందులో మధ్యభాగంలో నాలుగడగుల మేర బ్రహ్మనూ ఆయన సమీపంలో రెండడుగుల జాగాలో ప్రత్యేకంగా అర్యమాది ఎనమండుగురు దేవులను పూజించాలి.

తరువాత కర్ణ భాగంపై కార్తికేయాదులకు పూజను గావించి, రెండు వైపులా పార్శ్వ బిందువులపై రెండేసి అడుగుల దూరంలో అన్య పార్శ్వ దేవతలనూ అర్చించాలి. తరువాత వాస్తుమండల ఈశానాది కోణాలలో క్రమంగా చరకీ, విదారీ, పూతనా, పాపరాక్షసీ అను పేళ్ళు గల దేవశక్తులను పూజించాలి. పిమ్మట వెలుపలి భాగంలో హైతుకాది దేవతలను పూజించాలి. హేతుక, త్రిపురాంతక, అగ్ని, వైతాల, యమ, అగ్నిజిహ్వ, కాలక, కరాల, ఏకపాదులను దేవతలనే హైతుకాది దేవతలంటారు. ఆపై ఈశాన కోణంలో భీమరూప, పాతాళం వైపు ప్రేతనాయక, ఆకాశం వైపు గంధమాలి ఆపై క్షేత్ర పాల దేవతలకూ పూజ చేయాలి. పొడవును వెడల్పు చేత భాగిస్తే వచ్చే సంఖ్యని వాస్తురాశి అంటారు. ఎనిమది చేత వాస్తురాశిని భాగిస్తే వచ్చేది 'ఆయ'. ఎనిమిదితో దీన్ని గుణించి ఏడుతో భాగిస్తే వచ్చేది ఋక్షభాగం. దీనిని నాలుగు చేత గుణించి తొమ్మిదితో భాగిస్తే మిగిలేది 'వ్యయం'. దీనిని ఎనిమిదితో గుణిస్తే వచ్చేదాన్ని 'పిండ' అంటారు. దాన్ని అరవై చేత భాగిస్తే 'జీవ' మిగులుతుంది. శేషాన్ని 'మరణ'మంటారు.

వాస్తు మండల మధ్యంలోనే ఇల్లు కట్టాలి. దాని వెనుక భాగంలో కట్టకూడదు. మండలానికి ఎడమవైపు కూడా కట్టరాదు. అక్కడ వాస్తుదేవతలు నిద్రిస్తారు.

సింహ, కన్య లేదా తులారాశిలో పుట్టినవారు గృహద్వారాన్ని ఉత్తరంలో పెట్టించుకోవాలి. ఇతర రాశుల వారు ఇతర దిక్కులలో పెట్టించుకోవచ్చు. ఎందుకంటే భాద్రపద, అశ్వయుజ, కార్తిక మాసాలలో తూర్పు దిక్కున మస్తకాన్నీ, ఉత్తరంలో తోకనీ, దక్షిణ దిశలో క్రోడాన్నీ, పశ్చిమంలో చరణాలనీ విస్తరింపజేసుకొని వాస్తునాగాలు శయనిస్తాయి. కాబట్టి ఉత్తరదిశలో ద్వారం ఈ కాలంలో ప్రశస్తం. వృశ్చిక, ధను, మకరరాశుల వారు అనగా మార్గశిర, పుష్య, మాఘమాసాలలో ఈ నాగముల పృష్ఠభాగం తూర్పుదిక్కులో వుంటుంది. కాబట్టి ఆ దిక్కులో ద్వారం పెట్టుకోవలి. కుంభ,మీన, మేష రాశుల్లో అనగా ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసాల్లో వాస్తు నాగముల మస్తకం పశ్చిమంలోనూ, పృష్ఠం దక్షిణంలోనూ చరణాలు ఉత్తర పూర్వాలలోనూ వుంటాయి కాబట్టి ఆయా రాశులలో జన్మించినవారు దక్షిణ దిశలో ద్వారాన్ని పెట్టుకోవాలి. అలాగే వృషభ, మిథున, కర్కాటక రాశుల వారు జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ మాసాల్లో వాస్తు నాగశిరము ఉత్తరంలోనూ, పృష్ఠం పశ్చిమంలోనూ, వుంటాయి కాబట్టి పశ్చిమ దిశలో ద్వారమును పెట్టుకోవడం శ్రేయస్కరం.

భవనం పూర్తయినాక ఏ దిక్కున ఏ చెట్టు వుండాలో కూడా వాస్తు శాస్త్రం నిర్దేశించింది. తూర్పు – పీపల, దక్షిణ – పాకడ, పశ్చిమ – బరగద, ఉత్తర – గూలర, ఈశాన్య – సేమలక. ఈ వృక్షాలు శుభప్రదాలని శాస్త్రం చెప్పింది. ***(అధ్యాయం 46)***

*వృక్షో రక్షతి రక్షితః*

# ప్రాసాద లక్షణాలు

దేవాలయ నిర్మాణానికి ముందు వాస్తువిదుని పర్యవేక్షణలో అరవై నాలుగడుగుల పొడవు, అంతే వెడల్పు గల ఒక చతుష్కోణ భూఖండాన్ని తయారుచేయాలి. దానిలో నలభై ఎనిమిది అడుగుల మేరను పిట్టగోడలను కట్టి వుంచాలి. నలుదిక్కులలోనూ మొత్తం పన్నెండు ద్వారాలనేర్పాటు చేయాలి.

మనిషికిలాగే దేవాలయానికీ జంఘ వుంటుంది. ఇది మనిషి తొడకి రెండున్నర రెట్ల పరిమాణంలో వుంటుంది. దీనిపైనే గర్భగుడి నిర్మింపబడుతుంది. దీనిని నిర్మించి మూడు లేదా అయిదు భాగాలు చెయ్యాలి. జంఘపై నిర్మింపబడు గర్భగుడి భాగ విస్తార పరిమాపము అనగా కట్టడమును 'శుక్రాంఘ్రి' అంటారు. దీని ద్వారపు యెత్తు శిఖరపు యెత్తులో సగముండాలి. నాలుగు శిఖరాలను తయారు చేసి వాటిలో మూడవభాగపు కొలతలో వేదిబంధనం చేయాలి. నాలుగవ భాగంలో మరల ప్రాసాదం కంఠభాగాన్ని నిర్మించాలి. నాలుగు శిఖరాల మధ్యంలో పైకి వుండే భాగాన్ని కంఠభాగమంటారు.

మరోలా కూడా చేయవచ్చు. భవన నిర్మాణానికి సిద్ధం చేసిన భూమి ఖండాన్ని పదహారు సమాన భాగాలుగా చేసి వాటిలో నాలుగవ ముక్కలో గర్భగుడిని నిర్మించి, మిగిలిన పన్నెండు భాగాలనూ పిట్టగోడచే ఆవృతం చేయించాలి. ఈ చతుర్థభాగం ఎత్తును అనుసరించే మిగతా అన్ని భాగాల కొలతలూ నిర్ణయింపబడతాయి. భిత్తి (గోడ)కి శిఖరం రెండింతల ఎత్తు. ప్రదక్షిణభాగం విస్తృతి శిఖరం ఎత్తులో చతుర్థాంశం.

దేవప్రాసాదానికి నాలుగు దిక్కులలోనూ బయటికి పోడానికి ద్వారాలుండాలి. ద్వారం గర్భగుడి గోడలో అయిదవ వంతు కొలతలతో నుండాలి. గర్భగుడిలో ప్రతి అంశము యొక్క కొలతలూ వాస్తు శాస్త్రాన్ని అనుసరించే వుండాలి. ఎక్కడా ఏ మాత్రమూ తేడా ఉండరాదు.

ఇక లింగ నిర్మాణ పరిమాణం.

లింగపు కొలతలను బట్టే దాని పీఠం కొలతలుండాలి. పీఠభాగానికి రెండింతల పరిమాణంలో దానికి నలువైపులా గర్భభాగం వుండాలి. పీఠగర్భాన్ని అనుసరించి దాని గోడ, ఆ గోడ విస్తీర్ణంలో అర్ధభాగం కొలతలో లింగపీఠము యొక్క జంఘభాగము కట్టబడాలి. దానికి రెండింతల ఎత్తు శిఖరానికుండాలి. ద్వారాలు నాలుగు హస్తాల (ఆరడుగుల) పొడవుండాలి. (ఇదే వాస్తు చెప్పే అష్టభాగం)

ద్వారంలాగే పీఠమధ్యభాగం కూడా ఛిద్రయుక్తంగానే వుండాలి. పాదిక, శేషిక, భిత్తి, ద్వార పరిమాణాలను అనుసరించియే అర్ధ-అర్ధ పరిమాణ దూరాల్లో అన్నిటినీ నిర్మించాలి. ఆ గర్భ భాగ విస్తృతికి సమానంగా మండప జంఘా భాగాన్ని నిర్మించి దానికి రెండింతల పరిమాణంలో ఉన్నత శిఖరభాగాన్ని కట్టాలి. శుక్రాంఘ్రి భాగాన్ని ఇదివఱకటిలాగే కట్టి పై ద్వారాన్ని ఎత్తులోనే వుంచాలి.

ప్రాసాదానికి నాలుగు వైపులా ఒక అడుగు పరిమాణంలో పునాదిని నిర్మించి వుంచాలి. దీనిని 'నేమి' అని కూడా అంటారు. గర్భగుడికి ఈ నేమి రెండింతలుండాలి. ప్రహరీ గోడకి రెండింతల ఎత్తులో శిఖరముండాలి.

లక్షణాలను బట్టి ప్రాసాదాలనేక ప్రకారాలుగా వుంటాయి. ఇలా : వైరాజ, పుష్పక, కైలాస, మాలిక (మాణిక), త్రివిష్టప. ఇవి క్రమంగా చతురస్ర, ఆయత, వృత్త, వృత్తాయత, అష్టకోణాకారాలలో వుంటాయి.

వైరాజ నామక ప్రాసాదంలో మరల తొమ్మిది ప్రకారాల చౌకోర ప్రాసాదాలు నిర్మింప బడుతున్నాయి. అవి మేరు, మందర, విమాన, భద్రక, సర్వతోభద్ర, రూచక, నందన, నందివర్ధన, శ్రీవత్సములు.

పుష్పక నామక ప్రాసాద నిర్మాణ కళలో ఈ క్రింది తొమ్మిది రకాలున్నాయి. వలభి, గృహరాజ, శాలగృహ, మందిర, విమాన, బ్రహ్మమందిర, భవన, ఉత్తంభ, శివికావేశ్మ.

కైలాస ప్రాసాద నిర్మాణ కళ నుండి వలయ, దుంధుభి, పద్మ, మహాపద్మ, ముకులీ, ఉష్ణీషీ, శంఖ, కలశ, గువావృక్ష మున్నగు ప్రకారాలుద్భవించాయి. అలాగే గజ, వృషభ, హంస, గరుడ, సింహ, సమ్ముఖ, భూముఖ, భూదర, శ్రీజయ, పృథివీధర – ఇవి మాలికా నామక వృత్తాయత ప్రాసాద కళా ప్రాదుర్భూతములు.

అలాగే త్రివిష్టప శిల్పకళ నుండి వజ్ర, చక్ర, ముష్టికవభ్రు, వక్రస్వస్తిక, ఖడ్గ, గదా, శ్రీవృక్ష, విజయ, శ్వేత ప్రకారాల ప్రాసాదాలు నిర్మింపబడుతున్నాయి. ఇవేకాక త్రికోణ, పద్మాకార, అర్ధచంద్రాకార, చతుష్కోణ, షోడశకోణీయ ప్రకారాల ప్రాసాదాలను ఒక నిర్దిష్ట ఫలం కోసం, క్రమంగా, రాజ్య, ఐశ్వర్య. ఆ యువర్ధన, పుత్ర, లాభ, స్త్రీ ప్రాప్తిల కోసం ప్రత్యేక మండపాలతో నిర్మిస్తారు.

ముఖ్యద్వార స్థానంలోనే ధ్వజాదులనూ గర్భగృహాన్నీ నిర్మించాలి. సూత్రంతో జాగ్రత్తగా కొలిచి సరిసంఖ్యల గుణింతాలలో మండపాన్ని నిర్మిచంచి అందులో నాలుగవ వంతు కొలతలతో నొక భద్రగృహాన్ని నిర్మించాలి. భద్రగృహంలో కిటికీలుండవు. ప్రాసాదంలో ఏర్పాటు చేసే లతా మండపానికి భూమిని, విషమంగానూ అనేక రంగులతోనూ చేయాలి. పరిమాణపు లెక్కలు అవసరం లేదు. విషమరేఖలతో అలంకరించాలి.

ప్రాసాదము యొక్క ఆధారభూమి నాలుగు దిక్కులలో నాలుగు ద్వారాలతో నాలుగు మండపాలతో సుశోభితమై వుండాలి. నూరు శృంగాల (బురుజు స్తంభాల)తో వుండే ప్రాసాదాన్ని మేరు ప్రాసాదమంటారు. ఇది ఉత్తమం. ఇందులో ప్రతిమండపానికీ మూడేసి భద్రగృహాలుండాలి.

ఇవేకాక ఎన్నో రకాల దేవ ప్రాసాదాలున్నాయి. స్వయంభూదేవతల కోసం నిర్మించే ప్రాసాదాలకు పెద్దగా నియమాలుండవు.

చతురస్ర ఆలయాలలో చంద్రశాలయుక్తాలైన అరుగులుండాలి. వాటికెదురుగా ఆయా దేవతల వాహనాలకై లఘు మండపాలను నిర్మించాలి.

దేవప్రాసాదాలలో ద్వారానికి దగ్గరగా నాట్యశాల వుండాలి. ద్వారపాలుర విగ్రహాలు శాస్త్రోక్తంగా నిర్మింపబడాలి. ఆలయానికి దగ్గర్లోనే అందులోనే పని చేసేవారికి ఇళ్ళు కట్టించాలి.

మన దేవాలయాలు కళలకు కాణాచులు. నాట్యం, సంగీతం నిరంతరం పిల్లలకు చెప్పబడుతూ వుండాలి. సంస్కృత వ్యాకరణం, ఇతర భాషల వ్యాకరణాలు కూడా గురువులు అక్కడ ఉచితంగా బోధించి దైవానికి ఆత్మబంధువులగా ఎదగాలి. విద్యాలయాలలో జీతం పుచ్చుకొని పనిచేయడం విద్యాదానం కాదు. కోవెలలో కోటి విద్యలను కాకున్నా తమకి వచ్చిన కొన్ని విద్యలను విద్యార్తులైన విద్యార్థులకు నేర్పడం ద్వారా గురువులు (టీచర్లు, లెక్చరర్లు, ప్రొఫెసర్లు) సార్థక జన్మలౌతారు. దేవాలయాన్ని నిర్మించినపుడే విద్యాలయానికి అవసరమైన స్థలాన్నీ కేటాయించి, ఆ వాతావరణాన్ని కల్పిస్తుంది హిందూమతం.

***(అధ్యాయం - 47)***

# దేవప్రతిష్ఠ - సామాన్య విధి

విష్ణువు శివాది దేవతలకూ, సూతుడు శౌనకాది మహామునులకూ విగ్రహప్రతిష్ఠనెలా చేయాలో చెప్పసాగారు.

ప్రశస్తమైన తిథులనూ నక్షత్రాలనూ ఎంచుకొని ఈ పుణ్యకార్యాన్ని మొదలుపెట్టాలి. ముందుగా యజమాని తన వైదిక శాఖలో విధించబడిన బీజాక్షరాన్ని గానీ ఓంకారాన్ని గానీ వీలైనంత సేపు ఉచ్చరించి అయిదుగురు లేదా అంతకంటే ఎక్కువమంది ఋత్విజులను ఎంచుకొని తెచ్చి ఆదరంగా ఆసీనులను చేసి వేరొక మహానుభావుని ఆచార్యునిగా వరించి తెచ్చి వారి మధ్యలో కూర్చుండబెట్టాలి. తరువాత పాద్య, అర్ఘ్య, ముద్రిక, వస్త్ర, గంధ, మాల్య, అనులేపనీయద్రవ్యాలతో వారందరినీ సాదరంగా పూజించాలి. అప్పుడు ఆచార్యదేవులు మంత్రన్యాసపూర్వకంగా ప్రతిష్ఠాకర్మను సమారంభం గావించాలి.

మందిరం (లేదా దేవప్రాసాదం) అగ్రభాగంలో (అనగా ముందుభాగంలో) పది లేదా పన్నెండు హస్తాల పరిమాణంలో నొక మండపాన్ని నిర్మించి దానిపై పదహారు స్తంభాలను ఏర్పాటు చేసి వాటిలో ఎనిమిది మూలల్లో ఎనిమిది (నాలుగు దిక్కులు, నాలుగు మూలలు అని అర్థము) ధ్వజాలను ప్రతిష్ఠించాలి. తరువాత ఆ మండప మధ్యంలో నాలుగు హస్తాల పరిమాణంలోనొక వేదిని నిర్మించాలి. ఆ వేదిపై నదుల సంగమస్థానం తీరం నుండి తెచ్చిన ఇసుకను నెఱపాలి. ప్రధానకుండాన్ని నిర్మింపజేసి దానికి తూర్పున చతురస్రాకారంలోనూ, దక్షిణంలోనూ ధనురాకారంలోనూ, పశ్చిమంలో గుండ్రంగానూ, ఉత్తరంలో పద్మాకారంలోనూ మొత్తం నాలుగు కుండాలను నిర్మించాలి.

కుండనిర్మాణం తరువాత ఇష్టసిద్ధికై ఆచార్యుని చేతా, శాంతి కర్మకై ఇతరుల చేతా హవనం చేయించాలి. సాధారణంగా దీనికి ఈశానకోణంలోనున్న భూమిని ఆవుపేడతో అలికిన స్థలాన్ని వాడతారు.

మండపం పూర్వాది దిశలలో నాలుగు ద్వారాలతో శోభిల్లాలి. తోరణ స్తంభాలను ఏర్పాటు చేయాలి. ఇవి అయిదేసి హస్తాల పరిమాణంలో వుండాలి. న్యగ్రోధ (మఱ్ఱి) ఉదుంబర, అశ్వత్థ (రావి) బిల్వ, పలాశ, ఖదిర చెట్లలో ఒక్కొక్క చెట్టు నుండి ఒక్కొక్క కఱ్ఱను తయారు చేసి వాటిని వస్త్రపుష్పాదులతో అలంకరించి తోరణ స్తంభాలుగా మార్చి భూమిలోకి, ఒక హస్తం మేర లోతుకు పాతాలి. ఈ స్తంభాలు మండపము యొక్క అన్ని దిశల్లోనూ కనబడాలి.

మండపానికి తూర్పువైపు ద్వారంపై మృగేంద్ర, దక్షిణంపై హయరాజ, పశ్చిమంపై గోపతి, ఉత్తరీ ద్వారంపై దేవశార్దూల ప్రతిరూపాలనుంచాలి. క్రమంగా ***అగ్నిమీలే... ఈషేత్వేతి... అగ్న ఆయాహి..., శంనోదేవీ...*** అనే మంత్రాలతో ఆయా దిక్కుల్లో ఈయీ సింహ, గజ, వృషభ, శార్దూల మూర్తులను న్యాసం చేయాలి.

ఇక పతాకల వర్ణాలీ విధంగా వుండాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తూర్పు | – | ***మేఘ*** | పశ్చిమ | – | ***పాండుర*** |
| ఆగ్నేయ | – | ***ధూమ్ర*** | వాయవ్య | – | ***పీత*** |
| దక్షిణ | – | ***శ్యామల*** | ఉత్తర | – | ***రక్త*** |
| నైరృత్య | – | ***ధూసర****★ | ఈశాన్య | – | ***శుక్ల*** |

మండప మధ్యభాగంలో అన్ని రంగులు జెండాలూ రెపరెపలాడుతుండాలి.

***ఇంద్రవిద్యోతి...*** అనే మంత్రంతో తూర్పులో ఇంద్రునీ

***సంసుప్తి....*** అనే మంత్రంతో ఆగ్నేయంలో అగ్నినీ,

***యమోనాగ...*** అనే మంత్రంతో దక్షిణంలో యమునీ

***రక్షోహణావేతి....*** అనే మంత్రంతో పశ్చిమంలో వరుణునీ,

***ఓం వాతేతి...*** అనే మంత్రంతో వాయవ్యంలో వాయుదేవునీ అభిషేకించి ఉత్తర దిశలో ***ఓం ఆప్యాయస్వేతి....*** అనే మంత్రంతో కుబేరుని పూజించాలి. తరువాత ***ఓం***

★ *పసుపునీ తెలుపునీ కలిపి పాండురవర్ణ మంటారు. అందులో పసుపు పాలు కాస్త తగ్గిస్తే ధూసర వర్ణమవుతంది.*

***తమీశాన...*** అనే మంత్రంతో ఈశాన్యంలో ఈశానునీ, మండప మధ్యభాగంలో ***ఓం విష్ణోర్లోకేతి...*** అనే మంత్రంతో విష్ణు దేవునీ పూజించాలి.

ప్రతి తోరణ సమీపంలోనూ రెండేసి కలశలను స్థాపించి, వస్త్ర, ఉపవస్త్రాలతో వాటిని కప్పి, చందనాది సుగంధిత పదార్థాలతో అలంకరించి ఈ క్రింది మంత్రాలతో వాటిపై పుష్ప వితానాది ఉపచారాల నుంచుతూ దిక్పాలకులను పూజించాలి.

***ఓం త్రాతార మింద్ర....***తో ఇంద్రునీ

***ఓం అగ్నిర్మూర్ధా....***తో అగ్నినీ,

***ఓం అస్మిన్ వృక్ష....***తో నిరృతినీ,

***ఓం కిం చే దధాతు....***తో వరుణునీ,

***ఓం ఆచత్వా...***తో కుబేరునీ,

***ఓం ఇమారుద్రేతి....***తో రుద్రునీ,

ఇతర దిక్పతులనూ పూజించి ఆచార్య దేవుడు హోమద్రవ్యాలనూ, అన్య పూజా సామాగ్రినీ వాయవ్యకోణంలో స్థాపించి వుంచాలి. తరువాత అక్కడున్న శ్వేత శంఖాది శాస్త్రవిహిత సమస్త వస్తువులనూ ఆయనొకమారు దీక్షగా చూడాలి. వెంటనే ఆ నిశ్చిత ద్రవ్యాలన్నీ సంపూర్ణంగాశుద్ధాలయిపోతాయి.

అప్పుడు షడంగ న్యాసాన్నీ ప్రణవ, వ్యాహృతి సంయుక్తంగా ఇలా చేయాలి.

***ఓం హృదయాయ నమః,***

***ఓం భూః శిరసే స్వాహా,***

***ఓం భువః శిఖాయై వషట్,***

***ఓం స్వః కవచాయ హుం,***

***ఓం భూర్భువః స్వః నేత్రత్రయాయ వౌషట్,***

***ఓం భూర్భువః స్వః కరతల కరపృష్ఠాభ్యాం ఫట్*** – అనే మంత్రాలను చదువుతూ క్రమంగా గుండె, తల, పిలక, కవచం, కనులు, అరచేయి, మండ–లను స్పృశించాలి. తరువాత ***ఓం అస్త్రాయఫట్*** మంత్రంతో అస్త్రాలను (అంటే చేతులనే) న్యాసం చేసుకోవాలి. ఈ మొత్తం న్యాసకర్మ సమస్త వాంఛలనూ తీర్చగలదు.

అస్త్రమంత్రం ద్వారా అక్షతలనూ, విష్టరాలనూ (విష్టరాన్నీ) అభిమంత్రితము చేసి ఆ విష్టర ద్వారా యజ్ఞమండలంలోనొక చోట నుంచబడిన సమస్త ద్రవ్యాలనూ

స్పృశించాలి. తరువాత అస్త్రమంత్రపూత అక్షతలను మండపమంతటా వెదజల్లాలి. తరువాత తూర్పుతో మొదలెట్టి అష్టదిక్కులలోనూ ఈ అక్షతలను నిక్షేపించి సంపూర్ణ యజ్ఞమండలాన్నీ లేపనంతో తుడవాలి.

తరువాత యజ్ఞగురువు ఒక అర్ఘ్యపాత్రలో గంధాదియుక్త జలాన్ని నింపి దాన్ని మంత్ర సమూహంతో అభిమంత్రించి ఆ జలాన్ని యజ్ఞమండపమంతటా జల్లాలి. తరువాత ఆ రోజు ప్రతిష్ఠితమవుతున్న దేవతామూర్తి పేర మండప ఈశాన కోణంలో నొక కలశను స్థాపించి దాని దక్షిణభాగంలో అస్త్రమంత్రాలతో అభిమంత్రింపబడిన*'వర్ద్ధిని'ని స్థాపించాలి. తరువాత దానినీ, కలశనూ, గ్రహాలనూ, వాస్తోష్పత్తినీ ఆచార్యులు యథావిహిత ఆసనాలపై ప్రతిష్ఠించి పూజించి పలుమార్లు ప్రణవమంత్రాన్ని జపించాలి. తరువాత ఆ కలశను పంచరత్నాలు అద్దబడిన రెండు వస్త్రాలతో ఆచ్ఛాదించి,అన్ని ప్రకారాల సుగంధాల పొడినీ, ఔషధాల ముద్దనీ దానికి పూసి మరల ఆ కలశను ఆ రోజు ప్రతిష్ఠింపబడు దేవత యొక్క చిన్న ప్రతిమను అందులో స్థాపించి ఆ మూర్తినీ పూజించాలి.

తరువాత వర్ద్ధినిని వస్త్రాలతో కప్పి దానిని కలశతో బాటు అటూ ఇటూ తిప్పాలి. తరువాత దానిలోని నీటితో కలశను తడిపి ఆ కలశకు ముందలి జాగాలో దానిని స్థాపించాలి. స్థండిలముపై వీటిని పెట్టి మూలదేవతను కూడా వుంచి పూజించాలి.

వాయవ్యకోణంలోనొక కుండను స్థాపించి గణపతినందులోకి ఆవాహన చేసి ***ఓం గణానాం త్వేతి...***అనే మంత్రంతో ఆయనను పూజించాలి. ఈశాన కోణంలోమరొకఘటాన్ని పెట్టి అందులో ***ఓం వాస్తోష్పతే...*** అనే మంత్రంతో ఆయనను రావించి పూజించాలి. కుంభానికి (కలశ మొదలగు వాటికి)తూర్పువైపున భూతాలకూ గణదేవులకూ బలులిచ్చి వేదిని 'ఆలంభనం' చేయాలి. ఆకుపచ్చని దర్భలను ***ఓం యోగేయోగేతి...*** అనే మంత్రంతో సిద్ధం చేసి ఒక స్నానపీఠంపై నుంచి ఆచార్యుడూ, ఋత్విజులూ, యజమానీ కలిసి ప్రతిష్ఠింపబోయే దేవమూర్తిని దానిపై ప్రతిష్ఠించాలి. ఆ సమయంలో ఆ ప్రాంతం వైదిక మంత్రోచ్చాటనలతో జయ జయధ్వానాలతో, వైదికమంత్ర ధ్వనులతో మార్మోగిపోవాలి.

స్నానార్థం ఆ దేవతామూర్తిని పీఠసహితంగా బ్రహ్మరథంపై మండపానికి ఈశాన్య కోణంలో అవస్థితం చేయాలి. తరువాత ***ఓం భద్రం కర్ణేతి...*** అనే మంత్రం పూర్తిగా పఠిస్తూ స్నానం చేయించి ఆ మూర్తిని యజ్ఞీయ సూత్రంతోగాని వల్కల వస్త్రంతోగాని శుభ్రంగా తుడిచి తూర్యాది వాద్యయంత్రాలను మ్రోయిస్తూ ఆ దేవతామూర్తికి 'లక్షణోద్ధారం' అనగా నామకరణం చేయాలి.

---

** ఒకలాంటి కమండులువు. కలశ వలె పెద్దది. దేవ ప్రతిష్ఠలలోనే ఎక్కువగా వాడతారు.*

ఒక కంచు లేదా రాగిపాత్రలో తేనె, నెయ్యిల మిశ్రమాన్ని తయారుచేయించి అంజనంగా చేసి దానిని బంగారు ముక్క (రేకు)తో తెచ్చి ఆ ప్రతిమ కనులకు పలుమార్లు అంజనమును పూయాలి. ఇలా కాటుక నిడుతున్నపుడు ***ఓం అగ్నిర్జ్యోతీతి...*** అనే మంత్రంతో దేవుని లేదా దేవత నేత్రాలను తుడుస్తుండాలి.

నామకరణాన్ని యజమానియే చేయాలి. ***ఓం ఇమంమేగాంగేతి...*** అనే మంత్రంతో మూర్తి నేత్రాలను చల్లబఱచి, ***ఓం అగ్నిర్మూర్ ద్ధతి...*** అనే మంత్రంతో పుట్ట వంటి శాస్త్రోక్త ప్రదేశాల నుండి తెచ్చి కలిపి వుంచిన మట్టిని దేవతామూర్తికి సమర్పించి మారేడు, చెఱకు, రావి, మఱ్ఱి, మోదుగల నుండి తయారుచేయబడిన పంచకషాయమును తెచ్చి దానితో ***ఓం యజ్ఞా యజ్ఞేతి....*** అనే మంత్రం ద్వారా స్నానం చేయించాలి. పిమ్మట పంచగవ్యాలతో స్నానం చేయించి సహదేవీ, బలా, శతమూలీ, శతావరీ, ఘృత కుమారీ, గుడూచీ, సింహీ, వ్యాఘ్రీ- అను పేళ్ళు గల ఔషధులను కలిపిన నీటితో ***ఓం యా ఓషధీతి...*** అనే మంత్రం ద్వారా స్నానం చేయించాలి. ఆపై ***ఓం యాః ఫలినీతి...*** అనే మంత్రం ద్వారా ఫలస్నానం చేయించాలి.

తరువాత ***ఓం ద్రుపదాదివేతి..***అనే మంత్రంతో విద్వాంసులకు అభ్యంగన చేయించాలి. ఉత్తరాది దిశలలోనాలుగు కలశల నుంచి వాటిలో వివిధ రత్నాలను, సప్తధాన్యాలను, శతపుష్పిక (సోంపు వంటిది) యను పేరు గల ఔషధినీ నిక్షేపించాలి. ఆ పై నాలుగు సముద్రాలనూ, నలుదిక్కుల అధిష్ఠాన దేవతలనూ వాటిలోకి ఆవాహనం చేయాలి. నాలుగు కలశలనూ విడివిడిగా, పాలు, పెరుగు, నీళ్ళపాలు, నెయ్యిలో కాస్త జలములతో నింపి ఆ కుంభాలను క్రమంగా ***ఆప్యాయస్వ... ధధిక్రాప్ణో..., యా ఓషధీ..., తేజోసి...*** అనే మంత్రాలతో అభిమంత్రితం చేసి ఇవే చతుస్సముద్రాలని భావించి వాటితో దేవప్రతిమకు స్నానం చేయించాలి.

తరువాత దేవ ప్రతిమను బహుసు దర వేషభూషలతో అలంకరించి గుగ్గిల ధూపం వేయాలి. తరువాత ఇందాకటి కుంభాలను మంత్రించి వాటిలోకి భూమిపైనున్న సమస్త తీర్థ, నదీ, సముద్ర జలాలను ఆవాహన చేసి ***ఓం యా ఓషధీతి...*** ద్వారా అభిమంత్రించి మరల దేవప్రతిమను అభిషేకించాలి. ఈ అభిషేకావశిష్ట (మిగిలిన) జలాలతో స్నానం చేసిన వారికి సర్వపాప విముక్తి లభిస్తుంది.

సర్వసాగరస్నానాన్ని ప్రతిమకుగావించిన తరువాత అర్ఘ్య ప్రదానం చేసి ***ఓం గంధద్వారేతి...*** అనే మంత్రం ద్వారా సుగంధిత చందనాది పదార్థాలతో ప్రతిమను అనులేపితం చేయాలి. శాస్త్రవిహితంగా దేవమూర్తిని న్యాసం చేయాలి. ***ఓం ఇమం వస్త్రేతి...***

అనే మంత్రం చదువుతూ మూర్తికి బట్టలు కట్టి ***ఓం కవి హావితి...*** అనే మంత్రాన్నుచ్చరిస్తూ దానిని మండపం మీదికి గొని వచ్చి ***ఓం శంభవాయేతి...*** మంత్రంతో శయ్యపై స్థాపించాలి. ***ఓం విశ్వతశ్చక్షు...*** మంత్రాన్నుచ్చరిస్తూ మొత్తం పూజా విధానాన్ని పరీక్షించుకొని సరి చూసుకోవాలి. మూల దేవత శిరోభాగంలో రెండు వస్త్రాలచే కప్పబడిన, స్వర్ణయుక్తమైన, ఓంకారముచే పవిత్రీకరింపబడిన కలశ ను స్థాపించాలి.

తరువాత కలశకు దగ్గరలోనే కూర్చుని, ఆచార్యుడు, వేదమంత్రోచ్చారణ గావిస్తూ అగ్నిని స్థాపించాలి. ఋగ్వేదవేత్త యగు ఆచార్యానుచరుడొకడు (ఋత్విక్కు) తూర్పు వైపున్న కుండ సమీపంలో కూర్చుని శ్రీసూక్తం, పవమానసూక్తం చదవాలి.

కుండం దక్షిణం వైపున్న అధ్వర్యుడు, యజుర్వేదవేత్త, ఆచార్యుడు రుద్రసూక్తాన్నీ పురుషసూక్తాన్నీ పారాయణం చేయాలి. కుండానికి పశ్చిమ వైపున్న సామవేదీయాచార్యుడు వేదవ్రత, వామదేవ్య జ్యేష్ఠ సామ, రథంతర, భేరుండ నామాలను పఠించాలి. అలాగే కుండానికుత్తరం వైపున్న అథర్వవేదవేత్త, అథర్వశిరస్, కుంభసూక్త, నీలరుద్రసూక్త, మైత్ర సూక్తాలను పారాయణం చేయాలి.

అప్పుడాచార్యుడు అస్త్రమంత్రం ద్వారా కుండాన్ని బాగా ప్రోక్షించి స్వశక్తి మేరకు రాగి లేదా ఏ ఇతర ధాతు నిర్మిత పాత్రలో అగ్నిని గ్రహించి దేవతామూర్తి కెదురుగా వుంచాలి. ఆపై అమృతీకరణం చేయాలి. అనగా కవచమంత్రాలతో అగ్నిని రగుల్కొల్పాలి. తరువాత దానిని వేదమంత్రాలు చదువుతూ పాత్రతో సహా కుండానికి నాలుగు వైపులా తిప్పి ఈ మారు వైష్ణవ యోగంతో మరింత రగుల్కొల్పి ఆ పాత్రతో సహా అగ్నిని కుండం మధ్యలో స్థాపించాలి. దక్షిణం వైపు బ్రహ్మనీ, ఉత్తరంలో ప్రణీతాన్నీ స్థాపించి నాలుగు దిక్కులలోనూ కుశవిష్టరాలను వెదజల్లి ఒక పరిధి నేర్పాటు చేయాలి.

అప్పుడు గురువు త్రిమూర్తులను పూజించి దర్భలపై అగ్నిని కొంతవుంచి, దర్భజలం తోనే ప్రోక్షణం చేయాలి. ఎందుకంటే దర్భలతో, మంత్ర సహాయం అవసరం లేకుండానే దేనినైనా పవిత్రీకరించవచ్చు. అగ్నిలో వుంచి తీసిపెట్టిన దర్భలపై దేవతలు స్వయంగా వచ్చి కూర్చుంటారు. అగ్నిని ఈలాగున పవిత్రీకరించిన పిమ్మట ఆచార్యుడు ఆజ్య సంస్కారాన్ని చేపట్టాలి. ముందుగా నేతిని ఆహవయోగ్యం చేసుకోవాలి. అనగా దశల వారీగా ఆవేక్షణ, నిరీక్షణ, నీరాజన, అభిమంత్రణలను చేసి హవనానికి ముందే 'అభిఘారం' అనే యజ్ఞకార్యాన్ని ముగించాలి. తరువాత నేతితో అయిదేసి ఆహుతులను రెండు మార్లివ్వాలి. ఇపుడు అన్ని అగ్ని సంస్కారాలనూ, గర్భాదానం నుండి గోదాన పర్యంతమూ, చేసి ఆచార్యుడు తన వేదశాఖా విహితమంత్రాలతో గాని ప్రణవంతోగాని

ఆహుతి ప్రదానం చేయాలి. చివరగా ఆచార్యుడే పూర్ణాహుతిని కూడా ఇవ్వాలి. పూర్ణాహుతి వల్లనే యజమాని కోరికలన్నీ ఈడేరుతాయి.

ఈ విధంగా వేదవిహితంగా ఉత్పన్నమైన అగ్ని అన్ని కార్యాలనూ సిద్ధింపజేయగలదు. అందువల్ల దానిని మరల పూజించి అన్ని కుండాలలోనూ ప్రతిష్ఠితంచేయాలి. ప్రతి కుండము వద్ద ఋత్విక్కులు వారి వారి శాఖా మంత్రాలతో ఇంద్రాది దేవతలందరికీ నూరేసి ఆహుతులను ప్రదానం చేయాలి. పూర్ణాహుతిని సమర్పించి మరల ఆ దేవతలందరికీ ఒక్కొక్క ఆహుతినివ్వాలి.

ప్రతిహోత తాను అనుష్టించిన ఆజ్యాహుతుల శేషభాగాన్ని యథావిధిగా కలశలలో సమర్పించాలి. అప్పుడు ఆచార్యుడు దేవతా, మంత్ర, అగ్నిసహితంగా తాదాత్మ్య భావనా పూర్తిగా మరల పూర్ణాహుతినిప్పించాలి.

ఆచార్యుడు యజ్ఞమండలము నుండి పైకి వచ్చి సర్వదేవతలకూ బలులివ్వాలి. భూతాలకూ నాగులకూ కూడా బలులివ్వాలి. నిజానికి తిలలూ, సమిధలూ – ఈ రెండింటినే విహిత హోమపదార్థాలంటారు. నెయ్యి ఆ రెండిటికీ సహయోగం చేస్తుంది. దాని ప్రాముఖ్యానికి కారణం అది లేనిదే హవనీయ ద్రవ్యం అక్షయం (సంపూర్ణం) కాలేకపోవడం.

ఈ హవనకృత్యంలో పురుష సూక్తం, రుద్రసూక్తం, జ్యేష్ఠసామం, 'తన్నయామి' మంత్రయుక్త భరుండ సూక్తం, మహామంత్ర రూపంగా ప్రసిద్ధమైన నీలరుద్ర సూక్తం, అథర్వకుంభ సూక్తం యథాక్రమంగా తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, తూర్పు, దక్షిణ దిక్కులలో ఆసీనులైన ఋత్విజుల చేత పారాయణం చేయబడాలి. ఈ హవనకర్మలో ఒక్కొక్కదానికి సహస్రాహుతులనివ్వాలి. ఈ ఆహుతులలో వేదమంత్రాలు, దేవతా మంత్రాలు, వేదశాఖల మంత్రాలు, గాయత్రీమంత్రం అన్ని వ్యాహృతులతో ప్రణవ సహితంగా ఘోషింప బడాలి. ఆయా దేవతల యొక్క శిరో, మధ్య, పాద భాగాలకు ఈ ఆహుతులు చేరుతున్నట్టు, కనిపిస్తున్నట్టే భావించుకొని మిక్కిలి ఉత్సాహంతో ఈ కర్మను గావించాలి. చివరగా హోత తానే దేవుడననుకోవాలి.

ఆచార్యుడీ క్రింది మంత్రాలతో దేవ విగ్రహన్యాసాన్ని చేయాలి.

| | |
|---|---|
| ***ఓం అగ్నిమీలే (డే)....*** | ఇరుపాదాలు |
| ***ఓం ఇషేత్వోతి ....*** | చీలమండలు |
| ***ఓం అగ్నఆయాహి ....*** | జంఘలు |
| ***ఓం శం నో దేవీ ....*** | మోకాళ్ళు |

*ఓం బృహద్రథంతర ....* తొడలు
*ఓం దీర్ఘాయుష్ట్వాయ ....* హృదయం
*ఓం శ్రీశ్చతే ....* కంఠము
*ఓం త్రాతారమింద్ర ....* వక్షస్థలం
*ఓం త్ర్యంబక ....* కన్నులు

*ఓం మూర్ద్ధాభవ ....* మస్తకం– ఆ మంత్రాలను పూర్తిగా చదువుతున్నంత సేపూ భగవానుని ఈ అంగాలను న్యాసం చేయాలని అర్ధము. ఇక లగ్న ముహూర్తంలో హవనంచేయాలి. తరువాత ***ఓం ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే...*** అనే మంత్రం చదువుతూ విగ్రహాన్ని లేపి మంత్రవేత్తయైన ఆచార్యుడు **దేవస్యత్వా...** అనే మంత్రాన్ని పఠిస్తూ దేవతామూర్తిని పట్టుకొని వేదోక్త పుణ్యాహవాచనాలను ఘోషిస్తూ దేవప్రాసాదానికి అంటే కోవెల చుట్టూ ప్రదక్షిణ చేయాలి. అపుడు వివిధ రత్న, వివిధ ధాతు, తాలౌహద్రవ్య, యథావిధానంగా అనేక ప్రకారాల సిద్ధబీజములతో దిక్పాలురకూ అనేక ఇతర దేవతలకూ (ఈ సామగ్రిని చేత బట్టుకొని) ప్రదక్షిణ చేయాలి. అంతట దేవ విగ్రహాన్ని యథాస్థానంలో ప్రతిష్ఠించాలి.

విగ్రహాన్ని ఎప్పుడూ కూడా గర్భగుడి మధ్యలో అనగా గర్భంలోనే పూర్తిగా ప్రతిష్ఠించ కూడదు. అలాగని గర్భానికి దూరంగానూ కారాదు. నువ్వుగింజంత మొగ్గు ఉత్తరం వైపుండాలి.

***ఓం స్థిరోభవ, శివోభవ, ప్రజాభ్యశ్చనమో నమః, దేవస్యత్వా సవితుః...***

మున్నగు మంత్రాలతో ఆచార్యుడు యథావిధిగా విన్యాసాలనూ అభిమంత్రణాన్నీ చేయాలి. శాస్త్ర ప్రకారం సంపాత కలశనేర్పాటు చేసి దాని నుండి పడే జలాలతోనే దేవ ప్రతిమకు నిత్య స్నానం చేయించాలి. ప్రతిష్ఠ జరిగిన వెంటనే స్నానం చేయించి ధూప దీపాలతో పరిమళ భరిత సుగంధిత ద్రవ్యాలతో ఆ విగ్రహాన్ని పూజించి అర్ఘ్య ప్రదానం చేసి ప్రణామం చేసి నైవేద్యాన్ని పెట్టి క్షమాపన కోరుకోవాలి.

యజమానుడప్పుడు తన శక్తి మేరకు ఋత్విజులందరికీ పాత్రలను, వస్త్రాలను, ఉపవస్త్రాలను, గొడుగులను, విలువైన అందమైన ఉంగరాలను, దక్షిణలను ఇచ్చి సంతుష్ట పఱచాలి. తరువాత సావధానంగా చతుర్థీహోమాన్ని చేయాలి. నూరు ఆహుతులనిచ్చి ఆపై పూర్ణాహుతిని కూడా సమర్పించాలి.

అంతట ఆచార్యుడు మండపం నుండి వెలుపలికి వచ్చి దిక్పాలకులకు బలులిచ్చి పుష్పాలను చేత ధరించి **క్షమస్వ** అని దేవతలకు విన్నవించుకుంటూ దీక్షా విసర్జన చేయాలి.

ఈ విధంగా యజ్ఞం పూర్తి కాగానే ఆచార్యునికి కపిలధేనువు, ముకుటం, కుండలం, ఛత్రం, కేయూరం, కటి సూత్రం, వ్యజనం(పంఖా), వస్త్రాది వస్తువులు, గ్రామం, అలంకృత భవనం – వీటన్నిటినీ దానం చేయాలి. ఆనాడు అక్కడున్న వారందరికీ మంచి భోజనాలు పెట్టాలి. ఇలా చేసిన యజమాని కృతార్థుడౌతాడు. వాస్తుదేవుని ప్రసన్నత వల్ల ఆయనకు ముక్తి కూడా ప్రాప్తిస్తుంది. ***(అధ్యాయం 48)***

# వర్ణాశ్రమధర్మాలు

వర్ణమంటే కులం కాదు. నాడు పురాణ కాలంలో సమాజాన్ని నడిపించిన వర్ణానికీ నేడు కలికాలంలో రాజకీయాలను శాసిస్తున్న కులానికీ పోలిక లేదు. ఎవరైనా పేర్లను బట్టి భ్రమపడినా అది హస్తిమశకాంతరమే. వర్ణమనగా వృత్తి. అంతే. **– అనువాదకుడు**

వృత్తులను బట్టి ఆర్యావర్తంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలేర్పడినాయి. సృష్టి స్థితి లయ కారకులైన దేవతల భక్తి విషయంలో భేదాలు లేవు. ఎవరి పూజలు వారు చేసుకోవచ్చు. హరి అన్ని వర్ణాలకీ హరియే. ధర్మాలు వేరు.

యజన, యాజన, దాన, ప్రతిగ్రహ, అధ్యయన, అధ్యాపన– ఈ ఆరుకర్మలూ బ్రాహ్మణ ధర్మాలు. దానము, అధ్యయనము, యజ్ఞము– ఇవి క్షత్రియులకూ వైశ్యులకూ కూడా సమాన ధర్మాలు, సాధారణ కర్తవ్యాలు. ఇవికాక పరిపాలన, దండన క్షత్రియులకూ, వ్యవసాయం (అంటే పొలాల సేద్యం మాత్రమే కాదు, వ్యాపారం కూడా) వైశ్యులకూ విధ్యుక్త ధర్మాలు. పై మూడు వర్ణాల వారినీ సేవించుట [1]శూద్రుల ధర్మము.

---

*[1] ఈ సేవించుట అనే మాటనే పట్టుకొని పెడర్థాలు తీసి అపార్థాలు సృష్టించి, వర్ణం అనే మాటను అర్థంతో సహా మరుగున పడేసి, 'కులం' అనే మాటను సృష్టించి, అనర్థం చేశారు పాశ్చాత్యులు. ఆ విధంగా వారు హిందూ సంఘాన్ని విభజించి పాలిస్తే వారి మానసపుత్రులైన కొందరు భారతీయ మేధావులు ఈ కులతత్త్వాన్ని మరింత ముందుకి సాగదీసుకొనిపోయి ముందుబడిపోయిన వారనీ, వెనుకబడి పోయిన వారని రెండు జాతులను సృష్టించి వారు కలవకుండా జాగ్రత్తపడుతూ రాజకీయ లాభాన్ని పొందుతున్నారు.*

*భారతీయ సమాజంలో ఆదియుగంలో కులాలు లేవు. శూద్రులు ఇతర వర్ణాలను సేవించాలి అంటే నౌకరీ చాకిరీ వారికి చేస్తూ బతకాలని కాదు. వివిధ కర్మల్లో సాయపడాలని మాత్రమే.*

*శూద్రులు తపస్సు చేసి, వేదం చదివి బ్రాహ్మణులగుట బ్రాహ్మణుల చేతనే పూజలందుట పురాణాల్లో కనిపిస్తుంది. నిజానికి ఈ పురాణాన్ని మునులకు చెప్పున్నదెవరు?*

*అలాగే శూద్రులు రాజ్యాలేలుట వస్తు విక్రయము చేయుట కూడా పురాణాల్లో కనిపిస్తుంది. అనగా శూద్రులే ఆయా వర్ణాల పనులలో సాయపడి ఆ పనిని బ్రహ్మాండంగా చేయడంతో వారికి 'వర్ణోన్నతి' ని కల్పించి వారిని ఆ వర్ణము వారినిగా గుర్తించి వుంటారు. కాబట్టి హిందువుల్లో కులాల్లేవు. ఇప్పటి కులపు లెక్కలే 'అప్పట్లో' వుండుంటే మహాపద్మనందుడూ, చంద్రగుప్తుడూ మగధ రాజులూ, భారత సమ్రాట్టులూ కాకూడదు కదా! శ్రీకృష్ణుడు భగవంతుడే కాకపోనేమో! వర్ణాలు వర్ణాలే. కులాలు కులాలే.*

శిల్ప రచన, పాకయజ్ఞ, సంస్థల నిర్వహణ కూడా శూద్రులు చేయాల్సిన పనులే.

ఇవి వర్ణధర్మాలు. ఇక ఆశ్రమ ధర్మాలలో బ్రహ్మచర్యాశ్రమాన్ని జీవితపు తొలినాళ్ళలో అందరూ పాటించాలి.

భిక్షాచరణ, గురు శుశ్రూష, స్వాధ్యాయము, సంధ్యావందనము, అగ్ని కార్యము. ఇవి బ్రహ్మచారుల ధర్మములు. బ్రహ్మచారులలో రెండు రకాల వారుంటారు. మొదటి రకం ఉపకుర్వాణులు. అంటే శాస్త్రోక్తంగా వేదాదులను ఇతర విద్యలను అధ్యయనం చేసి స్నాతకులై గురుకులాన్ని వీడి జనారణ్యంలోకి పోయి గృహస్థులయ్యేవారు.

రెండవ విధం నైష్ఠికులు – అంటే స్నాతకులైన తరువాత కూడా గురుకులంలోనే వుండి చదువుతూ, ఆ చదువునే బోధిస్తూ, బ్రహ్మజ్ఞానతత్పరులై, సాధకులై మృత్యుపర్యంతము గురుకులంలో వుండిపోయేవారు.

అగ్నికార్యము, అతిధిసేవ, యజ్ఞ, దాన, దేవతార్చనలు – ఇవి గృహస్థుల సంక్షిప్త ధర్మాలు. గృహస్థులలో సాధకులనీ, ఉదాసీనులనీ రెండు ప్రకారాల వారుంటారు. తన పరివారం యొక్క భరణ పోషణలలోనే మగ్నుడై వుండేవాడు సాధకుడు. పితృ,దేవ,ఋషి, ఋణాలను తీర్చుకొని, ఏకాకిగా ధర్మాచరణ చేస్తూ గృహస్థుగా జీవించేవాడు ఉదాసీన గృహస్థు. వీనిని మౌక్షికుడంటారు.

ఇక వానప్రస్థం. బాధ్యతలన్నీ తీరిన వారి స్థాయి ఇది. ఈ దశలో భూశయనం, ఫల – మూల ఆహారం, వేదాధ్యయనం, తపస్సు, తన సంపత్తిని తన వారికి యథోచితంగా పంచి యిచ్చుట ధర్మాలు. అరణ్యంలో తపస్సు చేసుకుంటూ, దేవార్చన, ఆహుతి ప్రదానం గావిస్తూ, స్వాధ్యాయాన్ని ఇష్టంగా చేస్తూ వుండే వానప్రస్థి తాపసోత్తమునిగా పరిగణింప బడతాడు. తపస్సుద్వారా, శరీరాన్ని శుష్కింపజేసి నిరంతరం భగవత్ధ్యానంలో వుండే వానప్రస్థి చివరికాలంలో సన్యాసిగా గౌరవింపబడతాడు.

వానప్రస్థి సన్యాసిగా మారి తనువు చాలిస్తాడు. సన్యాసాశ్రమం వేరు.

భిక్షుక వృత్తి ద్వారానే జీవిస్తూ నిత్యం యోగాభ్యాసానురక్తుడై బ్రహ్మప్రాప్తి కోసమే ప్రయాసపడుతూ, జితేంద్రియుడై జీవించువానిని ★ 'పారమేష్ఠిక సన్యాసి' అంటారు.

ఎల్లప్పుడూ ఆత్మతత్త్వానుసంధానం పైననే ప్రేమను చూపిస్తూ, నిత్యతృప్తులై సంయమ నియమాలతో జీవిస్తూ, మహామునులుగా, యోగులుగా, ప్రతిష్ఠితులైన సన్యాసులను 'భిక్షు' శబ్దంతో గౌరవిస్తారు.

---

★ పరమేష్ఠి అనగా బ్రహ్మ

భిక్షాచరణము, వేదాధ్యయనం, మౌనావలంబనము, తపము, ధ్యానము, సమ్యక్‌జ్ఞానము, వైరాగ్యము – ఇవి సన్యాసాశ్రమి యొక్క సామాన్యధర్మాలు.

జ్ఞాన సన్యాసులనీ, వేద సన్యాసులనీ, కర్మసన్యాసులనీ పారమేష్ఠిక సన్యాసులు ముప్విధాలు. అలాగే యోగులలో కూడ ప్రారంభీ, భౌతిక, అంత్యాశ్రమీ స్థాయిలున్నాయి. వీరందరికీ ఆరాధ్యమూ, ఆశ్రయమూ ఒకటే – యోగమూర్తి స్వరూపుడైన పరమాత్మ.

మానవులకు ధర్మం ద్వారానే మోక్షం ప్రాప్తిస్తుంది. అర్థం వల్ల కామమనే పురుషార్థం సిద్ధిస్తుంది. ప్రవృత్తి, నివృత్తి, యని రెండు విధాల కర్మలు వేదంలో చెప్పబడ్డాయి. వేద, శాస్త్రానుసారము అగ్ని మున్నగు దేవతలనూ, గురు, విప్రాదులను ప్రసన్నం చేసుకోవడానికి చేయబడు కర్మలు ప్రవృత్తి కర్మలు కాగా, విధిపూర్వక కర్మానుష్ఠానం ద్వారా చిత్తశుద్ధినీ, ఆత్మజ్ఞానాన్నీ కలిగింపజేసేవి నివృత్తి కర్మలు. క్షమ, దమ, దయ, దాన, నిర్లోభత, స్వాధ్యాయ సరలత, అనసూయత, తీర్థానుసరణ, సత్య, సంతోష, ఆస్తిక్య, ఇంద్రియనిగ్రహ, దేవార్చనలూ, మరీ ముఖ్యంగా బ్రాహ్మణ పూజనం, అహింస, ప్రియవాదిత, అరూక్షత, అపైశున్యం, (దర్జా)– ఈ గుణాలన్నీ అన్ని ఆశ్రమాలలోనూ అందరికీ సామాన్య ధర్మాలు.

*క్షమాదమో దయా దాన*
*మలోభోఽ భ్యాస ఏవచ ॥*
*ఆర్జవంచాన సూయాచ*
*తీర్థాను సరణం తథా ।*
*సత్యం సంతోష ఆస్తిక్యం*
*తథా చేంద్రియ నిగ్రహః ॥*
*దేవతాభ్యర్చనం పూజా*
*బ్రాహ్మణానాం విశేషతః ।*
*అహింసా ప్రియవాదిత్య*
*మపై శున్య మరూక్షతా ॥*
*ఏతే ఆశ్రమికా ధర్మా*
*శ్చాతుర్వర్ణ్య బ్రవీమ్యతః ॥* *(ఆచార 49/21–24)*

ఇపుడు ఈ చతుర్వర్ణాలవారూ చేరుకొనే ఉత్తమ గతులను వినండి. వేద విహిత కర్మలన్నిటినీ ఆచరిస్తూ జీవించిన బ్రాహ్మణులు ప్రాజాపాత్య లోకప్రాప్తి నొందుతారు. యుద్ధంలో పారిపోకుండా,తమ ధర్మాలను పాటించిన క్షత్రియులు ఇంద్రస్థానాన్ని పొంద

గలరు. నిత్యమూ తమ ధర్మంలో రతులై జీవించిన వైశ్యులు మరుద్ దేవతల లోకాన్ని పొందుతారు. తమ వృత్తిని ప్రాణ సమానంగా ప్రేమించి జీవించిన శూద్రులకు గంధర్వలోకం ప్రాప్తిస్తుంది.

ఊర్ధ్వ రేతస్కులై, బ్రహ్మనిష్ఠలోనే మొత్తం జీవితాన్ని గడిపి వందల యేళ్ళ తపస్సు ద్వారా బ్రహ్మలోకంలో నొక ఉత్తమ స్థానాన్ని పొందిన ఋషులు ఎనభై ఎనిమిది వేలమంది మన భారతీయ పరంపరలో వున్నారు. ఆ స్థానమే గురుకుల నివాసియైన బ్రహ్మచారికి లభిస్తుంది. వానప్రస్థి దేహాంతంలో సప్తర్షిలోకాన్ని చేరుకుంటాడు. సన్యాసికి మోక్షం లభిస్తుంది. పునర్జన్మవుండదు. ఆమోక్ష పదం పరబ్రహ్మ వ్యోమమనీ, ఈశ్వర సంబంధి పరమానంద నిలయమనీ, అమృతస్థానమనీ చెప్పబడింది. ఇదే ముక్తిపదం అష్టాంగమార్గ సమ్యక్ జ్ఞానానుష్ఠానాల వల్ల కూడా ప్రాప్తిస్తుంది. వాటిని గూర్చి వినండి.

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము– ఈ అయిదింటి ని'యమ' (సునియమ)ములంటారు. ప్రాణులను బాధింపకుండుట అహింస, ప్రాణుల హితమునకే వాడబడు వాక్కు (సత్యము), ఇతరుల వస్తువులను కోరకుండుట, వాడకుండుట అస్తేయము, లైంగిక సంబంధము లేకుండ జీవించుట బ్రహ్మచర్యము, తనకున్నదంతా త్యాగం చేయడం అపరిగ్రహం★.

శౌచ, సంతోష, తప, స్వాధ్యాయ, ప్రణిధానములనబడు అయిదింటినీ నియమము లంటారు. శౌచమనగా శరీరాన్నీ పరిసరాలనూ మనస్సునూ పరిశుభ్రంగా వుంచుకొనుట. సంతోషమనగా తుష్టి, ఇంద్రియ నిగ్రహమే తపము, మంత్రజపమే స్వాధ్యాయము. భగవత్ పూజ నాదికములు ప్రణిధానము.

పద్మాది ఆసనములను భక్తితో వేసి జపము చేయుట ఆసనసాధనము.

వాయువును నిరోధించి క్రమబద్ధీకరించడం ప్రాణాయామం. మంత్రోచ్ఛారణ చేస్తూ దేవధ్యానంలో వుండి చేసే ప్రాణాయామాన్ని సగర్భ ప్రాణాయామమంటారు. అమంత్రక ప్రాణాయామాన్ని అగర్భప్రాణాయామమంటారు. వీటిలో మరల వాయువును లోపలికి పీల్చి అలాగే వుండి పోవడాన్ని పూరకమనీ, వాయువును పీల్చుట నాపి దేహాన్నీ ఇంద్రియాలనూ స్థిరంగా వుంచడం కుంభకమనీ, అంతవఱకు లోపల ఆపిన వాయువును మెలమెల్లగా బయటకు వదలుట రేచకమనీ వ్యవహరింపబడుతున్నాయి.

---

★ ***ఈ పదాలకు ఈ అర్థాలున్నది శాస్త్ర పరిభాషలో మాత్రమే. వీటి రూఢ్యర్థాలు – అంటే – లోకంలో స్థిరపడిన అర్థాలు వేరు.***

ప్రణవ (ఓంకార) జప ప్రక్రియలో 'మాత్ర' (అంటే రెప్పపాటు కాలం)కి విశేష మాహాత్మ్యముంది. ఆ మాత్రానుసారము పన్నెండుమార్లు ప్రణవ-జపంతో చేసే ప్రాణాయామాన్ని ద్వాదశమాత్రిక (లఘు) అనీ, ఇరవై నాలుగు మార్లు చేస్తే చతుర్వింశతి మాత్రిక (మధ్యమ) అనీ, అదే ముప్పదియారు పర్యాయములైతే 'షట్' త్రింశన్మాత్రిక (ఉత్తమ) అనీ అంటారు.

ఈ యామాల్లోనే నిరోధం ప్రత్యాహారం, బ్రహ్మచింతన ధ్యానం, మనోధైర్యం ధారణ. ఇవి పారిభాషిక పదాలు.

**అహంబ్రహ్మ** నేను బ్రహ్మను అను అభేదజ్ఞానంతో బ్రహ్మరూపంలో ప్రవేశించి నిలిచి పోవడమే సమాధి. తరువాత ఆనంద స్వరూపుడైన పరమాత్మను **తత్త్వమసి** అను శ్రుతి ద్వారా తెలుసుకోవడమే బ్రహ్మానందము.

'నేను అశరీరిని, ఇంద్రియాతీతుడను. మనోబుద్ధ్యహంకారాల నుండి జాగృతుడను, జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది అవస్థల నుండి ముక్తుడను, బ్రహ్మ యొక్క తేజః స్వరూపమేదైతే వుందో అదే నేను. నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, సత్య, ఆనందస్వరూప, అద్వయ అనే లక్షణాలున్న ఆదిత్య పురుషుడు, పూర్ణ పురుషుడు నేనే' అని భావించుకుంటూ సమాధి నుండి ఆత్మ విడివడి ఊర్ధ్వలోకాలకు పోయి బ్రహ్మలోకంలో నిలిచిపోతుంది. ఆ వ్యక్తి ముక్తిని పొందాడని అర్థం. ఇది తపస్సు. ***(అధ్యాయం 49)***

## నిత్యకర్మలు - అశౌచాలు

**శా**స్త్రవిహితమైన ప్రతి దినకర్మలను శ్రద్ధగా చేయువారికి దివ్యజ్ఞానం ప్రాప్తిస్తుంది. కాబట్టి ప్రతి మానవుడూ బ్రాహ్మీ ముహూర్తంలోనే మేలుకొని ధర్మార్థ చింతన చేయాలి.

విద్వాంసుడైన పురుషుడు ఉషఃకాలం కాగానే సర్వప్రథమంగా తన హృదయ కమలం లోనే నెలకొనియున్న ఆనంద స్వరూపి, అజరామరుడు, సనాతన పురుషుడునగు విష్ణు భగవానుని ధ్యానించాలి. తరువాత యథావిధిగా శౌచాదిక్రియలను చేసుకొని పవిత్ర నదిలో స్నానం చేయాలి. ప్రాతఃకాలంలో పవిత్ర స్నానం చేసేవారి పాపాలన్నీ నశిస్తాయి. ఈ స్నానము లౌకిక, పారలౌకిక ఫలాలు రెండింటినీ ప్రాప్తింపజేస్తుంది.

రాత్రి సుఖంగా నిద్రించేవారికి తెలియకుండానే కొన్ని అపవిత్రతలు, అశుచులూ కలుగుతాయి. అందుచేత పొద్దున్నే స్నానం చేశాకనే సంధ్యావందనాది ధార్మిక కృత్యాలను మొదలుపెట్టాలి.

స్నానం ప్రాతఃకాలంలోనే చేయడం వల్ల అలక్ష్మి, సమస్త విఘ్న, అనిష్టకారిణియైన కాలకర్ణియను శక్తి, దుఃస్వప్న కారణంగా కలిగే చింతలూ, పాపాలూ కడుక్కుపోతాయి. నిజానికి, స్నానం లేని కార్యమేదీ ప్రశస్తం కాదు. అశక్తులు తలపై నీరు పోసుకోకుండానే స్నానం చేయవచ్చు. లేదా తడిగుడ్డతో శరీరాన్ని తుడుచుకోవచ్చు. దీనిని కాయిక స్నానమంటారు.

బ్రాహ్మ, ఆగ్నేయ, వాయవ్య, దివ్య, వారుణ, యౌగిక భేదములతో స్నానములారు రకములు. ఏది చేయడానికి తన కధికారముందో దాన్ని మానవులుచేయాలి. మంత్ర సహితంగా చేసి కుశదర్భల ద్వారా నీటి బిందువులను తొలగించుకొనేది బ్రాహ్మస్నానము. శిరసు నుండి సిరిపాదము దాకా యథావిధానంగా భస్మంతో అన్ని అంగాలనూ మెత్తుకొనేది ఆగ్నేయస్నానం. ఇలాగే గోధూళిచే మొత్తం శరీరాన్ని పవిత్రం చేసుకొనేది వాయవ్య స్నానం. ఇది ఉత్తమ స్నానంగా పరిగణింపబడుతోంది. ఎండ వుండగానే వర్షం కురిస్తే ఆ నీటిలో చేయగలిగే అరుదైన స్నానం దివ్యస్నానం. సాధారణ జలాలతో చేసేది వారుణ స్నానం. యోగం ద్వారా హరి యొక్క చింతనం చేయడం యౌగిక స్నానం. దీనినే మానస– ఆత్మ వేదనమంటారు. బ్రహ్మాకార అఖండ చిత్త వృత్తి అని బ్రహ్మవాదులందరిచేతా సేవింప బడేది కావున దీనినే ఆత్మతీర్థమని కూడా అంటారు. (తీర్థమంటే స్నానమని అర్థముంది)

స్నానానికి పూర్వం పాలుగారే చెట్టునుండి గానీ, మాలతి, ఉత్తరేను, మారేడు గన్నేరు కర్ర నుండిగాని తీసిన పలుదోముపుల్లతో ఉత్తరం వైపుగానీ తూర్పువైపు గానీ తిరిగి పవిత్ర స్థలంలో కూర్చొని పళ్ళు తోముకోవాలి.

ఆ తరువాత ఆ పుల్లను శుభ్రంగా కడిగి పవిత్రస్థానంలో పారవేయాలి.

తరువాత స్నానం చేసి దేవతలకూ, ఋషులకూ, పితృగణాలకూ విధ్యుక్తంగా తర్పణాలివ్వాలి. శాస్త్ర ప్రకారం స్నానానికి కూడా సంధ్యోపాసనకులాగే అంగభూత ఆచమనం చేయాలి. సంధ్యోపాసనలో అంగరూపంలోనే కుశోదక బిందువులతో, ***ఆపోహిష్ఠా...*** మున్నగు వారుణ మంత్రాలనూ, సావిత్రీ మంత్రాన్నీ జపిస్తూ ఒళ్ళు తుడుచుకోవాలి. ఇదే క్రమంలో ఓంకారాన్నీ ***భూఃభువఃస్వః*** అనెడి వ్యాహృతులనూ జోడించి గాయత్రిని జపించి సూర్యభగవానునికి అర్ఘ్యమివ్వాలి★.

సంధ్య వార్చని ద్విజుడు అపవిత్రుడి క్రిందే లెక్క.

---

★ *సంధ్యోపాసన సంపూర్ణంగా ఈ కాండ లోనే 35వ అధ్యాయంలో విశదీకరింపబడింది.*

*ప్రాంగ్ముఖం సతతం విప్రః సంధ్యోపాసన మాచరేత్ ।*
*సంధ్యాహీనోఽ శుచిర్నిత్య మనర్హః సర్వకర్మసు ॥*
*యదన్యత్కురుతే కించి న్నతస్య ఫలభాగ్భవేత్ ।*
*అనన్య చేతసః సంతో బ్రాహ్మణా వేదపారగాః ॥*
*ఉపాస్య విధి వత్సంధ్యాం ప్రాప్తాః పూర్వపరాంగతిం ।*
*యోఽ న్యత్ర కురుతే యత్నం ధర్మకార్యే ద్విజోత్తమః ॥*
*విహాయ సంధ్యా ప్రణతిం సయాతి నరకాయుతం ।*
*తస్మాత్ సర్వప్రయత్నేన సంధ్యోపాసనమాచరేత్ ॥* **(ఆచార 50/21-25)**

సంధ్యోపాసన ద్వారా యోగమూర్తి, పరమాత్మ, భగవంతుడునైన నారాయణుడు పూజితుడవుతాడు. కాబట్టి ద్విజుడు పవిత్రుడై తూర్పు వైపు తిరిగి కూర్చుని నిత్య సంయత భావంతో పది లేదా వంద లేదా వేయిమార్లు, వీలును బట్టి, గాయత్రి మంత్ర జపాన్ని చేయాలి. తప్పనిసరిగా రోజూ వేయిమార్లు గాయత్రి మంత్రజపాన్ని చేయడం సర్వోత్కృష్టమైన దైవకార్యంగా సర్వ వైదిక వాఙ్మయంలోనూ ప్రశంసింపబడుతోంది. గాయత్రి లేక ద్విజుడు లేడు.

ఏకాగ్రచిత్తంతో, ఉదయమే, భాస్కర భగవానుని ధ్యానించాలి. ఋగ్యజుస్సామ వేదాలలో కనుపించు వివిధ సౌరమంత్రాల ద్వారా ఆయనను ధ్యానించి, తలను నేలపై ఆనించి ఈ క్రింది మంత్రాలతో నమస్కరించాలి.

*ఓం ఖఖోల్కాయ శాంతాయ కారణత్రయ హేతవే ॥*
*నివేదయామి చాత్మానం నమస్తే జ్ఞానరూపిణే ।*
*త్వమేవ బ్రహ్మ పరమమాపోజ్యోతీ రసోఽ మృతం ॥*
*భూర్భువః స్వస్త్వ మోంకారః సర్వోరుద్రః సనాతనః ।* **(ఆచార 50/28-30)**

ఈ ఉత్తమ శ్లోకాన్నీ, ఆదిత్య హృదయాన్నీ త్రిసంధ్యలలోనూ చదివాకనే ఇంటికి రావాలి. ఇంటికి వచ్చాక మరల శాస్త్రోక్తంగా ఆచమనం చేయాలి.

తరువాత అగ్నిని ప్రజ్వలింపజేసి విధివత్తుగా అగ్నిదేవునికి ఆహుతులను ప్రదానం చేయాలి. ఇంటి యజమాని అశక్తుడైనపుడు అతని ఆజ్ఞ మేరకు పుత్ర పత్ని, శిష్య, సహోదరులలో నెవరో ఒకరు ఈ ఆహుతులనివ్వాలి. మంత్రం లేకుండా ఈ కర్మలకు ఫలం ఎక్కడా దక్కదు. అలాగే పద్ధతి లేకుండా చేసినా దక్కదు.

తరువాత దేవతలకు నమస్కరించి అర్ఘ్య, పాద్య, చందన, సుగంధ ద్రవ్యానులేపన, వస్త్ర, నైవేద్యాది ఉపచారాలతో పూజించి, తన గురువుగారిని కూడా పూజించాలి. తరువాత తన శక్తి సమయాల మేరకు కొంతసేపు వేదాధ్యయనం, వేదాభ్యాసం, ఇష్టమంత్రజపం చేసి అపుడు శిష్యులకు చదువు చెప్పాలి. ఈ చదువులో భాగములే వేదార్థ ధారణ కలిగించుట. వేదార్థ విచారమును చేయించుట. ధర్మశాస్త్రాదులను ముందు చదివించి తరువాత చర్చలను చేపట్టుట, ఉపనిషత్ వ్యాకరణాది వేదాంగాలలో తాను ముందుగా నిష్ణాతుడై శిష్యుల చేత అధ్యయనం చేయించుట మున్నగునవి. ఇదీ ఒక సద్బ్రాహ్మణుని ద్వారా సమాజం ఆశించే వరదానం. తరువాత అవసరం మేరకు రాజు వద్దకు గానీ శ్రీమంతుల గృహాలకు గానీ పోయి వారి చేత దైవ, ఇతర కార్యాలను చేయించి ధనార్జన చేయాలి.

మధ్యాహ్నకాలంలో మరల స్నానం చేయాలి. ముందుగానే శుద్ధి చేయబడిన మట్టినీ, పూలనూ, అక్షతలనూ, తిలలనూ, కుశలనూ, ఆవుపేడనూ ఒకచోట పెట్టి సిద్ధం చేసుకోవాలి. నది, చెఱువు, తటాకము, సరోవరము వంటి చోటికి పోయి స్నానం చేయాలి. ఇందాక సిద్ధం చేసిన మట్టితో తలనూ శరీరాన్నీ తోముకొని స్నానం చేయాలి. ఆవుపేడను కూడా ఇలాగే వినియోగించాలి. (అయిదు ముద్దలను ఉసిరికాయలంతేసి తయారు చేసుకోవాలనీ ఈ పంచమృత్తికాపిండాలు లేకుండా స్నానానికి బయలుదేరడమే దోషమనీ శాస్త్రం చెప్పింది).

జలాశయం తీరంలోనే మృత్తికా గోమయాదులను వంటికి పూసుకొని వరుణదేవతకు సంబంధించిన మంత్రాలతో జలాశయంలోని నీటిని అభిమంత్రించి మరల సంపూర్ణ స్నానం చేయాలి. జలంపై భక్తి గౌరవాలను కలిగియుండాలి. ఎందుకంటే అది విష్ణు స్వరూపం. ప్రణవస్వరూపుడైన సూర్యుని దర్శిస్తూ మూడుమార్లు జలంలో మునకలు వేయడంతో స్నానం సంపూర్ణమవుతుంది. తదనంతరం ఆచమనం చేసి మిగతా మంత్రాలను చదవాలి. ముందుగా ఆచమనం చేస్తూ ఈ మంత్రాన్ని చదవాలి.

***అంతశ్చరసి భూతేషు గృహాయాం***
***విశ్వతోముఖః ॥***
***త్వం యజ్ఞస్త్వం వషట్కార ఆపోజ్యోతీ రసోఽమృతం ।*** ***(ఆచార 50/45, 46)***

***ద్రుపదాదివ...***అనే మంత్రాన్ని పూర్తిగా మూడుమార్లు జపించి,ప్రణవ, వ్యాహృతులతో సావిత్రీ మంత్రాన్ని మూడుమార్లు ఉచ్చరించాలి. విద్వాంసులు అఘమర్షణ మంత్రాలను కూడా చదవాలి. అనంతరం

***ఓం ఆపోహిష్ఠా మయోభువః,***

***ఇదమాపః ప్రవహత,*** అనే మంత్రాలనూ వ్యాహృతులనూ పఠిస్తూ శరీరాన్ని తుడుచుకోవాలి. మరల **ఆపోహిష్ఠా...** ఇత్యాది మంత్రాలనూ అఘమర్షణ మంత్రాలనూ మూడేసి మార్లు జపించడం ద్వారా అఘమర్షణ విధిని పూర్తిచేయాలి. పిమ్మట ***ద్రుపదాదివ...*** లేదా గాయత్రి లేదా ***'తద్విష్ణోః పరమం పదం'*** మున్నగు మంత్రాలను చదవాలి. ఓంకారాన్ని పలుమార్లుచ్చరిస్తూ శ్రీహరిని స్మరించాలి. అఘమర్షణ మంత్రాలను చదువుతున్నప్పుడు దోసిట్లో నీటి నుంచుకొని చివర్లో దానిని తలపై జల్లుకొంటే పాతకాలన్నీ పారిపోతాయి. సంధ్యోపాసన ముగియగానే ఆచమనం చేసి పరమేశ్వరుని స్తుతించాలి. పుష్పాంజలిని తలపై పెట్టుకొని సూర్యభగవానుని తలచుకొంటూ మంత్రం చదివి నీటిలో వదలివేయాలి.

ఉదయిస్తున్న సూర్యుని చూడరాదు. విశేష ముద్ర ద్వారానే ఆయనను దర్శించాలి.

***ఓం ఉదుత్యం..., చిత్రం... తశ్చక్షు.... ఓం హం సః శుచిషద్...*** అనే మంత్రాలనూ, సావిత్రి మంత్రాన్నీ, సూర్య సంబంధి వైదిక మంత్రాలనూ సూర్యునుద్దేశించి చదవాలి. తరువాత పూర్వాగ్రకుశాసనంపై కూర్చుని సూర్యుని దర్శిస్తూ స్ఫటిక, రుద్రాక్ష లేదా పుత్ర జీవ రుండమాలను తిప్పుతూ విధిహితంగా మంత్రం జపించాలి.

శక్తిగలవారు తడిబట్టలతో జలాశయ మధ్యంలో మొల లోతుననిలబడి ఈ మంత్ర జపాలన్నీ చేసుకోవాలి. లేనివారు పొడిబట్టలు కట్టుకొని పవిత్ర స్థలంలో కుశాసనంపై కూర్చుని చేసుకోవచ్చు. జపానంతరం ప్రదక్షిణ చేసి భూమిపై సాష్టాంగపడి సూర్యునికి నమస్కరించి లేచి ఆచమనం చేసి తన శాఖానుసారము, స్వాధ్యాయం చేసుకోవాలి. తరువాత దేవతలకు, ఋషులకు, పితరులకు తర్పణలివ్వాలి. మంత్రప్రారంభంలో **ఓం** కారాన్నీ, చివర్లో **నమః**ను ప్రయోగిస్తూ ప్రత్యేక దేవ, ఋషి, పితృగణాలకు 'తర్పణలిస్తున్నాను' అని శబ్దిస్తూ ఇవ్వాలి. క్రమంగా జంధ్యాన్ని ఉపవీతీ, నివీతీ, ప్రాచీనవీతీ దశలలోకి మార్చుకోవడం మరచిపోరాదు. క్రోధాదులను మనసులోకి రానీయకుండా పుష్పాలను పట్టుకొని పురుషసూక్తాన్ని చదివి వాటిని భగవంతునికి సమర్పించాలి. సమస్త దేవతలూ జలంలో వ్యాపించి వుంటారు. కాబట్టి జలం ద్వారా వారందరూ పూజింపబడతారు. ఈ పూజను చేసేవానికి అనగా పూజకునికి సమాహితచిత్తము అత్యంతావశ్యకము. దేవతలందరినీ తలచుకొని ఒక్కొక్కరికీ వేరువేరుగా పుష్పాంజలులను సమర్పించడం ప్రశస్తమైన పూజావిధి.

మునులారా!★ దేవతారాధన లేకుండా ఏ వైదిక కర్మయు పుణ్యప్రదంకానేరదు. కాబట్టి సమస్త కార్యాల ఆదిమధ్యాంతాలలో హృదయంలో హరిని ధ్యానించుకోవాలి.

---

*★ ఇక్కడ భారతీయులారా! మానవులారా! అని పెట్టుకోవాలి. ఎందుకంటే విష్ణువు, బ్రహ్మ, సూతమహర్షి బోధించినది శివాదిదేవతలకు, వ్యాసునికి, శౌనకాది మహామునులకు కాదు; వారి ద్వారా మనకి)*

***ఓం తద్విష్ణోరితి...*** అనే మంత్రాన్నీ పురుషసూక్తాన్నీ మనసులో అనుకుంటూనే వుండాలి. శరణాగతి చేస్తూనే వుండాలి.

విష్ణువు పట్ల అనురక్తచిత్తుడు, శాంతస్వభావుడునైన భక్తుడు ***తద్విష్ణో..., అప్రేతే సశిరాః*** అనే మంత్రాలతో పూలనభిమంత్రించి విష్ణువుకి సమర్పించాలి. ★ పంచయజ్ఞాలను ఆ దేవదేవుని కంకితంగా నిర్వర్తించాలి.

వైశ్యదేవమే దేవయజ్ఞం. కాకి మున్నగు ప్రాణులకు బలులిచ్చేది భూతయజ్ఞం. బిచ్చగాళ్ళకు ఇంటి వెలుపల అన్నం పెట్టాలి. పితృదేవతలు ప్రీతి చెందాలంటే వారినుద్దేశించి ప్రతిరోజూ ఒక బ్రాహ్మణునికి భోజనం పెట్టాలి. పితరులకు నిత్యం చేసే శ్రాద్ధకర్మనే పితృయజ్ఞమంటారు. ఇది ఉత్తమ గతులను ప్రాప్తింపజేస్తుంది. తరువాత బంధువులతో కలసి మౌనంగా భోంచెయ్యాలి. ఎట్టి పరిస్థితిల్లోనూ అన్నాన్ని నిందించరాదు.

మునులారా! ఈ పంచయజ్ఞాలు చేయకుండా అన్నం తినేసే మూఢాత్ముడు వచ్చే జన్మలో పక్షి కడుపున పుడతాడు. ప్రతిదినమూ యథాశక్తి వేదాభ్యాసమూ, పంచయజ్ఞాలూ చేసే వారి పాపాలన్నీ శీఘ్రమే పటాపంచలయిపోతాయి. మోహం వల్ల గాని బద్ధకం చేత గానీ దేవతార్చన చేయకుండానే అన్నం తినేసేవాడు కష్టదాయకమైన నరకంలో పడి ఆ తరువాత పంది కడుపున పుడతాడు.

ఇక అశౌచమనగా అపవిత్రము. అపవిత్రము నిత్య పాపవర్ధకము. అపవిత్ర వ్యక్తుల సంసర్గం అశౌచాన్ని తెస్తుంది. వారిని త్యజిస్తే మానవుడు పవిత్రుడవుతాడు.

విద్వాంసులైన బ్రాహ్మణులు మైల పట్టిన పది దినాలనూ అశౌచంగానే పరిగణిస్తారు. ఇవి జనన, మృత్యువుల కారణంగా ఏర్పడతాయి.

మైల నుండి క్షత్రియులు పన్నెండు దినాలకూ వైశ్యులు పదిహేను రోజులకూ శూద్రులయితే ఒక నెలకి శుద్ధులౌతారు. ఎందుకంటే వారికి క్రమంగా అన్నేసి రోజులూ అశుచి వుంటుంది.

సన్యాసులకు మైల అంటదు. అశౌచముండదు. గర్భస్రావం జరిగిన ఇంట్లో అది ఎన్ని నెలలకు జరిగిందో అన్ని రాత్రుల పాటు అశౌచముంటుంది. ***(అధ్యాయం – 50)***

---

★ *దేవయజ్ఞ, భూత యజ్ఞ, పితృయజ్ఞ, మానుష యజ్ఞ, బ్రహ్మ యజ్ఞాలు పంచయజ్ఞాలు.*

# దానధర్మం - దేవతోపాసన

సత్పాత్రులకు శ్రద్ధాపూర్వకంగా సంతోషంగా వినియోగానికై ఇచ్చే ద్రవ్యం కర్త చేయు దానమనబడుతుంది. ఈ దానం 'ఇక్కడ' సుఖభోగాలనూ 'అక్కడ' మోక్షాన్నీ కర్తకు సంపాదించి పెడుతుంది. అయితే, ఎవరైనా, న్యాయపూర్వకంగా ఆర్జించిన దానిని దానం చేస్తేనే ఆ ఫలితం వుంటుంది.

అధ్యాపనం(చదువు చెప్పుట) యాజనం,ప్రతిగ్రహం–ఈ మూడూ బ్రాహ్మణుని వృత్తి ధర్మాలు. వీటి ద్వారా సంపాదించిన ద్రవ్యాన్నిగాని విద్యను గానీ సుపాత్రులకు బ్రాహ్మణులు కూడా దానం చెయ్యాలి. దానమనేది నాలుగు ప్రకారాలు.నిత్య, నైమిత్తిక, కామ్య, విమల.

ఫలాభిలాష లేకుండా ప్రత్యుపకార భావనారహితంగా బ్రాహ్మణునికి ప్రతిరోజూ చేసేది నిత్యదానం. తన పాపశాంతికై బ్రాహ్మణులకు చేయునది నైమిత్తిక దానం. సంతాన, విజయ, ఐశ్వర్య, స్వర్గప్రాప్తి - ఇటువంటి వానిపై ఇచ్ఛతో ఇచ్చే దానిని కామ్యదాన మంటారు. దైవప్రీతికై బ్రహ్మజ్ఞానులకు చేసేది విమలదానం. ఇది కల్యాణకారి.

చెఱకు లేదా యవ లేదా గోధుమ (లేదా వరి) పంటతోనిండి వుండి సస్యశ్యామలమైన భూమిని వేదవిదులైన బ్రాహ్మణులకు దానమిచ్చువానికి ఇక పునర్జన్మే వుండదు. భూదానాన్ని మించిన దానం లేదు, వుండదు.

బ్రాహ్మణునికి విద్యాదానం చేస్తే బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది. బ్రహ్మచారికి ప్రతిదినమూ శ్రద్ధగా చదువు చివరిదాకా నేర్పువానికి బ్రహ్మలోకంలో పరమపదం ప్రాప్తిస్తుంది.

వైశాఖ పున్నమినాడుపవాసముండి అయిదుగురుగాని ఏడుగురుగాని బ్రాహ్మణులను పద్ధతిగా పూజించి వారికి తేనె, నువ్వులు, నెయ్యి దానమిచ్చి సంతుష్టపఱచి గంధాదులతో అలంకరించి ఈ క్రింది మంత్రం ద్వారా పూజించినవారికి ఈ జన్మలో చేసిన పాపాలన్నీ తత్క్షణమే నశిస్తాయి.

***ప్రీయతాం ధర్మరాజేతి***
***యథామనసి వర్తతే ॥*** ***(ఆచార 51/13)***

***ఇక్కడ ధర్మరాజనగా యమధర్మరాజే.***

అలాగే కృష్ణమృగచర్మంపై బంగారంతో బాటు పై వస్తువుల నుంచి దానమిచ్చిన వారికి ఆ క్షణంలోనే అన్ని రకాల పాపాలూ నశిస్తాయి.

వైశాఖమాసంలో ఘృత, అన్న, జలాలను దానం చేస్తే విశేష ఫలితాలు లభిస్తాయి. కాబట్టి ఆ నెలలో బ్రాహ్మణులకు యమధర్మరాజును స్మరిస్తూ ఆ ద్రవ్యాలను దానమిచ్చిన

వారికి అన్ని రకాల భయాలు తొలగిపోతాయి. ద్వాదశి నాడు ఉపవాసం చేసి సకలపాప వినాశకుడైన విష్ణుభగవానుని పూజించాలి. ఆ మాసంలో ఏ దైవాన్ని నమ్ముకున్నవారైనా బ్రాహ్మణులలో ఆ దైవాన్ని భావించుకొని పూజించి దానం చేస్తే ఆ దేవతలు తప్పకుండా దాత పట్ల సుప్రసన్నులవుతారు. స్త్రీ దేవతలనుపాసించేవారు సౌభాగ్యవంతులైన స్త్రీలను రావించి పూజచే భోజనాదులచే దానంచే సంతృప్తిపరిస్తే ఆయా దేవీమతల్లులు ప్రసన్నులవు తారు.

సంతానాన్ని కోరుకొనేవారు ఇంద్రదేవుని పూజించాలి. బ్రహ్మ వర్చస్సు కావలసిన వారు బ్రాహ్మణులలో బ్రహ్మదేవునాపాదించుకొని వారిని పూజాదానాలతో తృప్తి పఱచాలి. ఆరోగ్యం కావాలనుకొనేవారు. ఇదే పద్ధతిలో సూర్యభగవానుని ఆరాధించాలి. అలాగే 'ధనానికి అగ్నినీ, కార్యసిద్ధికి వినాయకునీ, భోగానికి చంద్రునీ, బలప్రాప్తికి వాయుదేవునీ, మోక్షానికి హరినీ పూజించాలి.

ఇంకా ఏయే దానాల వల్ల ఏయే ఫలితాలు కలుగుతాయో బ్రహ్మ ఇలా విధించాడు.

***వారిదస్తృప్తి మా ప్నోతి***
***సుఖమక్షయ మన్నదః ।***
***తిలప్రదః ప్రజామిష్టాం***
***దీపదశ్చక్షురుత్తమం ॥***
***భూమిదః సర్వమాప్నోతి***
***దీర్ఘమాయు ర్హిరణ్యదః ।***
***గృహదోఽగ్ర్యాణి వేశ్మాని***
***రూప్యదోరూపముత్తమం ॥*** ***(ఆచార 51-22,23)***

మరికొన్ని దానాల ఫలాలిలా వుంటాయి.

| | | |
|---|---|---|
| **వస్త్రదానం** | - | చంద్రలోకం, |
| **అశ్వదానం** | - | అశ్వనీ కుమారలోకం, |
| **అనడుహదానం(ఎద్దు)** | - | విపులసంపత్తి |
| **గోదానం** | - | సూర్యలోకం, |
| **వాహనం,శయ్య** | - | భార్య, అభయం, |
| **ధాన్యదానం** | - | శాశ్వతసుఖం, |

| | | |
|---|---|---|
| **వేదదానం(చదివించడం)** | – | బ్రహ్మసాన్నిధ్యం, |
| **జ్ఞానోపదేశం** | – | స్వర్గలోకం, |
| **అగ్నికోసం కట్టెల దానం** | – | గొప్ప తేజస్సు |

రోగపీడితుడైన వ్యక్తికి ఆశ్రయం, ఔషధాలు, తైలాలు, భోజనము దానమిచ్చి ఆరోగ్యవంతుని చేసి పంపించిన వారికి శాశ్వతారోగ్యం, సుఖం, దీర్ఘాయువు లభిస్తాయి. అసిపత్రవనం నరకానికి వెళ్ళే మార్గంలో వున్న ముళ్ళ అడవి. ఈ లోకంలో అవసరమున్న వారికి చెప్పులూ, గొడుగులూ విరళంగా దానం చేసినవారికి దేహాంతమైనాక ఆ వనంలో ఏ బాధా కలగదు.

[1]ఉత్తరాయణం,[2] దక్షిణాయనం [3] మహావిషువత్కాలం, సూర్య చంద్ర గ్రహణాలు, కర్కాటక, మేష,మకరాది సంక్రాంతులు వచ్చినపుడు బ్రాహ్మణులకిచ్చే దానాలు ఆ దాతకు పరలోకంలో అక్షయ సుఖాలను ప్రాప్తింపజేస్తాయి. ఈ దానాలను ప్రయాగ, గయ మున్నగు క్షేత్రాలలో చేస్తే కొన్ని రెట్లు ఫలితం లభిస్తుంది.

దానధర్మము కంటే శ్రేష్ఠమైన ధర్మము లేదు. ఎవరైనా దానమిస్తుంటే అడ్డుకొనేవాడు మరుజన్మలో పక్షిగా పుడతాడు. కరవు దెబ్బతిని మరణానికి దగ్గరవుతున్న మనిషిని చూస్తూ, తన దగ్గర అన్నీ పుష్కలంగా వున్నా కూడా అన్నదానం చేయకుండా పోయేవానికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుంది. ***(అధ్యాయం 51)***

# ప్రాయశ్చిత్తాలు

బ్రాహ్మణుని చంపు బ్రహ్మహంతా, తాగుబోతూ,దొంతనంచేయు స్తేయీ, గురుపత్నితో రమించు, గురుపత్నీగామీ – ఈ నాలుగు రకాలవారూ మహాపాతకులు. వీరితో స్నేహం చేసి రాసుకు పూసుకు తిరిగేవాడు అయిదో రకం మహాపాపి. గోహత్యాది అన్య పాపాలు ఉపపాతకాలు. వీరికి ఈ పాపాల నుండి విముక్తి కలగాలంటే చేయవలసి కర్మకాండయే ప్రాయశ్చిత్తం.

బ్రహ్మహత్య చేసినవాడు అడవిలోకి పోయి ఒక కుటీరాన్ని నిర్మించుకొని ఉపవాస దీక్షతో అందులో పన్నెండు సంవత్సరాలుండాలి లేదా పర్వతంపై నుండి దూకి చనిపోవాలి.

*[1] సూర్యుడు మకర–మిధున రాశుల మధ్య వుండే కాలం మాఘం నుండి ఆషాఢ మాసం దాకా.*

*[2] సూర్యుడు కర్కాట–ధేనురాశుల మధ్య వుండే కాలం ఇది శ్రావణ మాసం ఉండి పుష్యమాసం దాకా వుంటుంది.*

*[3] పగలూ రాత్రీ సరిసమానంగా వుండే కాలం. ఇది తులా, మేష సూర్య సంక్రాంతులలో వస్తుంది.*

అలా కాకుంటే అగ్నిజ్వాలలలో ప్రవేశించి గానీ  అగాధ జలాల్లోకి దూకిగానీ ప్రాణ పరిత్యాగం చెయ్యాలి. గోవును గానీ బ్రాహ్మణుని గానీ రక్షించే క్రమంలో ప్రాణం పోగొట్టుకున్న వానికి కూడా బ్రహ్మహత్యా పాతకం నశిస్తుంది. ప్రాణత్యాగానికి ముందు బ్రాహ్మణులకు అన్నదానం చేయాలి.

అశ్వమేధయాగాంతంలో చేసెడి అవబృథ స్నానం కూడా బ్రహ్మహత్యా పాతకాన్ని నివారిస్తుంది. వేదవిదుడైన బ్రాహ్మణునికి తన సర్వస్వాన్నీ దానం చేసి వనవాసానికి పోవడం వల్లనూ, త్రివేణీ సంగమంలో మూడురాత్రులుపవాసముండి రోజుకి మూడుమార్లు స్నానం చేసే ద్విజునికి ఆ సంగమ మహిమ వల్లనూ, సేతుబంధ రామేశ్వరంలో కొన్నాళ్ళ పాటు రోజుకి ముమ్మారు స్నానం చేయడం వల్లనూ కూడా బ్రహ్మహత్యా పాతకం నివారింప బడుతుంది. అలాగే కపాలమోచన తీర్థంలోనూ వారణాసిలోకూడా.

మద్యపానం చేసే ద్విజుడు అగ్నివర్ణ సదృశ ద్రావకాన్ని గాని పాలు, నెయ్యి, గోమూత్రాలనుగాని సేవించి పుణ్యక్షేత్రంలో ఇక మద్యం ముట్టనని ప్రమాణం చేయడం, ఆ ప్రమాణాన్ని నిలబెట్టుకోవడం ద్వారా ఆపానసంబంధి పాపాన్ని పోగొట్టుకోవచ్చు.

రాజదండన వుంటే యమదండన వుండదంటారు కదా! ఈ నానుడి స్వర్ణచోరుని విషయంలో పూర్తిగా నిజమైంది. బంగారం దొంగిలించి దొరికి పోయినవాడికి రాజదండన ద్వారా ఆ పాపం నశిస్తుంది.

గురుపత్నీగమనం చేసినవాడు తనంత పొడవే వున్న ఒక ఇనుప స్త్రీమూర్తిని తయారు చేయించి దానిని అగ్నిలో వుంచి ఇక  కరిగిపోతుందనగా పైకి తీయించి దాని సర్వాంగాలూ తగిలేలాగా గాఢంగా కౌగలించుకోవాలి; లేదా బ్రహ్మహత్యా పాతకనాశక ప్రాయశ్చిత్తాన్ని చేసుకోవాలి; లేదా నాలుగైదుమార్లు చాంద్రాయణవ్రతాన్నాచరించాలి. అప్పుడే ఆ ద్విజుడు ఆ ఘోరపాపము నుండి విముక్తుడు కాగలడు.

మహాపాతకులతోడి సాంగత్యం వల్ల మహాపాతకుడైన వాడు దాని నుండి విముక్తి పొందాలంటే వాని సంగడికాడు చేసిన మహా పాతకానికి చెప్పబడిన సంగడికాడు చేసిన మహాపాతకానికి చెప్పబడిన ప్రాయశ్చిత్తాన్నే వాడూ చేసుకోవాలి; లేదా తనకున్న సర్వస్వాన్నీ దానమిచ్చేయాలి; లేదా చాంద్రాయణ, అతికృచ్ఛ్రవ్రతాలను చేయాలి.

గయ మున్నగు పుణ్యక్షేత్రాలకు యాత్రలు చేయడం, ప్రతి అమావాస్యనాడూ శంకర భగవానుని పూజించడం, బ్రాహ్మణులకి భోజనాలు పెట్టడం – ఈ పుణ్యకార్యాల ద్వారా కూడా పాపాలను నశింపజేసుకోవచ్చు.

ప్రతి కృష్ణ చతుర్దశినాడూ ఒక సంవత్సరం పాటు ఉపవాసముండి ప్రశాంతచిత్తులై పవిత్రనదిలో స్నానం చేసి ఓంకారయుక్తంగా యమ, ధర్మరాజ, మృత్యు, అంతక, వైవస్వత, కాల, సర్వభూతక్షయ నామమంత్రాలనుచ్చరిస్తూ ఒక్కొక్క మంత్రానికీ ఏడేసి తిలలతో జలాంజలులతో కూడిన తర్పణలివ్వడం వల్ల కూడా జనులు సమస్త పాప విముక్తులు కావచ్చు.

ఈ వ్రతాలను చేస్తున్నంత కాలం శాంతంగా ఇంద్రియ నిగ్రహంతో బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ ఉపవాసముంటూ బ్రాహ్మణులను పూజిస్తూవుండాలి.

కార్తీక శుద్ధషష్ఠినాడు ఉపవాసం చేసి సప్తమినాడు సూర్యభగవానుని పూజిస్తే ఎన్నో పాపాలూ నశిస్తాయి.

ప్రతిశుద్ధ ఏకాదశినాడూ, నిరాహారంగా వుండి ద్వాదశినాడు విష్ణుభగవానుని పూజ చేస్తే ఒక ఏడాదిలోపలే అన్ని మహాపాపాలూ నశిస్తాయి.

సూర్య,చంద్ర గ్రహణాది ప్రత్యేక సమయాల్లో మంత్రజపం, తపస్సు, తీర్థసేవనం, దేవార్చన, బ్రాహ్మణ పూజనంలలో ఏది జీవితాంతం చేసినా మహాపాతకాలన్నీ మరుగులోకి జారిపోతాయి. ఎన్ని పాపాలు చేసినవాడైనా పశ్చాత్తాపపడి పుణ్యతీర్థంలోకి పోయి నియమబద్ధంగా జీవిస్తూ ప్రాణత్యాగం చేస్తే వాని పాపాలన్నీ నశిస్తాయి.

(ఇక్కడ సతీసహగమనం గూర్చి చెప్పబడింది. పరిహరించబడింది)

పతివ్రతయై, పతిసేవ, శుశ్రూషలలో దత్తచిత్తయై వుండే స్త్రీని ఏ పాపమూ అంటదు. శ్రీరామపత్ని రావణునిపై విజయాన్ని సాధించినట్లు పతివ్రతయగు స్త్రీ సర్వపాపాలపై విజయాన్ని సాధిస్తుంది.

సంయతచిత్తులై తీర్థస్నానాలు చేస్తూ వ్రతాల నాచరిస్తూ, బ్రాహ్మణులకు దానాలిస్తూ జీవించేవారు సర్వపాప ముక్తులై ఉత్తమగతులను పొందుతారు." ***(అధ్యాయం 52)***

# నవనిధుల, ఐశ్వర్యవంతుల లక్షణ, స్వభావాలు

నైమిషారణ్యంలో సూతమహర్షి అనుగ్రహభాషణం (శివాది దేవతలకు విష్ణు భగవానుని పురాణోపదేశంలాగే) కొనసాగుతోంది.

"మునులారా! విష్ణుభగవానుని ద్వారా అష్టనిధులను గూర్చి తెలుసుకొన్న బ్రహ్మదేవుడు దేవతలకా విషయాన్ని గూర్చి చెప్పాడు. మేము మా గురుదేవుల ముఖతః విన్నాము.

పద్మ, మహాపద్మ, మకర, కచ్ఛప, ముకుంద, కుంద (నంద), నీల, శంఖ అనేవి అష్టనిధులు. మిశ్ర అను తొమ్మిదవ నిధితో కలసి ఇవి నవనిధులైనాయి.

మానవులలో కొందరి వద్ద ఈ నిధులుంటాయి. ఏ నిధి వున్న వానికెటువంటి లక్షణాలుంటాయో చూద్దాం.

పద్మనిధి లక్షణాలుండే మనిషి సాత్త్వికుడూ, దయగలవాడూ, అయివుంటాడు. ఈయన బంగారం, వెండి వంటి విలువ గల ధాతువులను సంపాదించి యతులకూ, దేవతలకూ, యాజ్ఞికులకూ వాటిని దానంగా ఇస్తుంటాడు. మహాపద్మ చిహ్నంతో లక్షితుడైన వ్యక్తి కూడా తాను సంపాదించిన ధనాదులను ధార్మికులైన జనులకు దానం చేస్తుంటాడు. మొత్తానికి పద్మ, మహాపద్మనిధి సంపన్నులు సాత్త్వికులు.

మకరనిధి సంపన్నులు ఖడ్గ, బాణ, కుంతాదులను సంపాదిస్తుంటారు. వారు రాజులతో స్నేహం చేస్తుంటారు. శ్రోత్రియ బ్రాహ్మణులకు దానాలిస్తుంటారు. ఎల్లపుడూ యుద్ధతత్పరులై వుంటారు. యుద్ధాల వల్ల ద్రవ్య సంపాదన చేస్తారు.

కచ్ఛపనిధి లక్షణాలున్న వ్యక్తి తామసగుణాలను కలిగివుంటాడు. ఎవరినీ నమ్మడు. సంపద బాగానే వున్నా తానూ అనుభవించడు. ఎవరికీ దానమూ చేయడు. ఏ రహస్య ప్రదేశంలోకో ఏకాంతంగా పోయి తన సంపదనంతటినీ భూమిలో పాతి వుంచుతాడు.

ముకుంద నిధి లక్షణాలున్నవాడు రజోగుణ సంపన్నుడై వుంటాడు. రాజ్య సంపాదన, విస్తరణేచ్ఛలను కలిగివుంటాడు. భోగాలను బ్రహ్మాండంగా అనుభవిస్తాడు. గాయకులనూ, వేశ్యాదులనూ పోషిస్తుంటాడు.

నందనిధీశునికి రాజస తామస గుణాలు రెండూ వుంటాయి. తన వర్ణం వారికి ఆధారభూతుడై వుంటాడు. ఎవరైనా పొగిడితే పొంగిపోతాడు. బహుపత్నీవ్రతుడై వుంటాడు. మిత్రులను మార్చేస్తూ వుంటాడు.

నీలనిధి చిహ్నాలతో సుశోభితుడైన నరుడు సాత్త్విక తేజంతో విరాజిల్లుతుంటాడు. వస్త్ర, ధాన్యాదులను బాగా సంపాదించి తటాకాది నిర్మాణాలను గావించి జాతికి అంకితం చేస్తుంటాడు. జనహితం కోరి మామిడి వంటి ఫలవృక్షాల తోటలను పెంచుతాడు. వీని సంపద మూడు తరాల వఱకూ నిలబడుతుంది. (నందనిధీశుని సంపద ఒక తరందాకానే వుంటుంది)

శంఖనిధి లక్షణాలున్నవాడు తాను అన్నిభోగాలనూ అనుభవిస్తాడు. కాని ఆశ్రితులకు ఏమీ పెట్టకుండా చిరుగుపాతల బరువు బ్రతుకుల వారిని చేసి పారేస్తాడు. తన స్వంత పోషణ, భోగాలే చూసుకుంటాడు. వీని సంపద ఒక తరమే నిలబడుతుంది.

మిశ్ర (కలగాపులగపు) నిధుల వారి లక్షణాలు వైవిధ్యభరితాలు.

మునులారా! విష్ణుభగవానుడు శంకరాది దేవతలకు నిధుల, అవి గల నరుల లక్షణాలను పై విధంగా ఉపదేశించాడు. ***(అధ్యాయం - 53)***

# భువనకోశ వర్ణన ప్రియవ్రత మహారాజు వంశం

**మ**నుపుత్రుడైన ప్రియవ్రతునకు పదిమంది కొడుకులు కలిగారు. వారు అగ్నీధ్రుడు, అగ్నిబాహువు, వపుష్మాన్, ద్యుతిమాన్, మేధ మేధానిధి, భవ్యుడు, శబలుడు, పుత్రుడు, జ్యోతిష్మాన్.

వీరిలో మేధ, అగ్నిబాహువు, పుత్రుడు అనువారు గొప్ప యోగీశ్వరులు. జాతిస్మరులు (అనగా పూర్వజన్మజ్ఞానం కలవారు), మహా సౌభాగ్య (అంటే ధనంకాదు) శీలురు. రాజ్యం పట్ల గానీ ఇతర సాంసారిక విషయాలపై గాని వారు ఏ మాత్రమూ ఆసక్తి చూపక పోవడంతో ప్రియవ్రతుడు మిగతా ఏడుగురికీ సప్తద్వీపసమన్వితమైన పృథ్విని పంచేశాడు.

యాభైకోట్ల యోజనాల్లో విశాలంగా పఱచుకొని వున్న ఈ పృథ్వి నదిలో తేలియాడే నౌకలాగా అశేషజలరాశిపై బంతి వలె తేలియాడుతున్నది.

జంబూ, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కర- అనునవి సప్తద్వీపాలు. ఇవి లవణ, ఇక్షు, సురా, ఘృత, దధి, దుగ్ధ, జల - అనే సప్తసముద్రాలచే చుట్టబడియున్నవి. ఈ ద్వీపాలు, సముద్రాలు మనం చెప్పుకుంటున్న క్రమములోనే ఒకదానికి తరువాతిది రెండింతల విస్తీర్ణంలో వున్నాయి.

జంబూ ద్వీపంలో మేరువను పేరు గల పర్వతమొకటుంది. అది ఒక లక్ష యోజనాల విస్తీర్ణంలో పఱచుకొనివున్నది. దాని యెత్తు ఎనభై నాలుగు వేల యోజనాలు. అది పదహారు వేల యోజనాల క్రిందికి భూమిలోకి పాతుకుపోయి వుంది. మేరు పర్వత శిఖర విస్తృతి ముప్పది రెండు వేల యోజనాలు.

(మేరు పర్వతం గూర్చి బాగా విపులంగా భవిష్యపురాణంలో చెప్పబడింది)

కర్ణిక పదహారు వేల యోజనాలు.

మేరువుకి దక్షిణంలో హిమాలయం,

హేమకూటం, నిషధం; ఉత్తరం

లో నీలం, శ్వేతం, శృంగి - అను వర్ష పర్వతాలున్నాయి.

హే నీలకంఠా! ప్లక్షాది ద్వీపాల్లో నివసించేవారికి మృత్యువుండదు. ఏ యుగం వచ్చినా ఏ యుగం పోయినా తేడా వుండదు.

జంబూ ద్వీపాన్ని పాలించిన అగ్నీధ్ర మహారాజుకి తొమ్మండుగురు కొడుకులు. వారుః నాభి, కింపురుష, హరివర్ష, ఇలావృత, రమ్య, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాల, నామధేయులు. తండ్రి వారికిచ్చిన రాజ్యభాగాలు వారి పేళ్ళతోనే ప్రసిద్ధమయ్యాయి. నాభి మహారాజుకి మేరుదేవి యను పత్నిద్వారా ఋషభుడను పుత్రుడు కలిగాడు. ఋషభ పుత్రుడైన (మొదటి) భరతుడు శాలగ్రామ తీర్థంలో నిత్యవ్రతరతుడై వుండేవాడు. అతని తరువాత వంశంలో తైజసుడు, ఇంద్రద్యుమ్నుడు, పరమేష్ఠి, ప్రతీహారుడు, ప్రతిహర్త, ప్రస్తారుడు, విభుడు, నక్తుడు, నరుడు, విరాటుడు, ధీమాన్, భౌవన్, త్వష్ట, విరజుడు, రజుడు, శతజితుడు, విష్వగ్జ్యోతి అనేవారు పితృపుత్ర పరంపరగా జనించారు.

*(అధ్యాయం -54)*

# భరతవర్ష వర్ణన

**శి**వశంకరా! జంబూ ద్వీప మధ్యభాగంలో ఇలావృత దేశముంది. దానికి తూర్పున అద్భుత భద్రాశ్వ వర్షం, దానికి ఆగ్నేయంలో హిరణ్వాన్ అను దేశమూ వున్నాయి.

మేరు పర్వత దక్షిణ భాగం కింపురుష వర్షమనబడుతోంది. దానికి దక్షిణంలో నున్న ప్రాంతం భరతవర్షం లేదా భారతవర్షంగా ప్రసిద్ధి చెందింది. ఈ భరతవర్షానికి తూర్పున కిరాత, పడమట యవన దేశాలున్నాయి. దక్షిణంలో ఆంధ్ర, ఉత్తరంలో తురుష్కాది దేశాలున్నాయి. ఈ భరతవర్షంలోనే నాలుగు వర్ణాల ప్రజలుంటారు.

ఇక్కడ మహేంద్ర, మలయ, సహ్య, శుక్తిమాన్, ఋక్ష, వింధ్య, పారియాత్రములనే ఏడు కులపర్వతాలున్నాయి. ఈ భరతవర్షంలోనే వేదస్మృతి, నర్మద, వరద, సురస, శివా, తాపి, పయోష్ణి,సరయు, కావేరి, గోమతి,గోదావరి, భీమరధి, కృష్ణవేణి,మహానది, కేతుమాల, తామ్రపర్ణి, చంద్రభాగ, సరస్వతి, ఋషికుల్య, మత్తగంగ, పయస్విని, విదర్భ, శతద్రు మున్నగు మంగళ ప్రదములూ పాపవినాశినులూ నగు నదులు నిత్యం ప్రవహిస్తుంటాయి.

పాంచాల, కురు, మత్స్య, యౌధేయ, పటచ్చర, కుంత, శూరసేన దేశాలలో నివసించే వారిని మధ్య దేశీయులంటారు. పాద్మ, సూత, మాగధ, చేది, కాశేయ, విదేహ ప్రాంతాలు తూర్పులో ఏర్పడ్డాయి. కోసల, వంగ, కళింగ, పుండ్ర, అంగ, విదర్భలు, వింధ్య ప్రాంతంలో నున్న ప్రదేశాలూ పూర్వ-దక్షిణాల తటవర్తి భూభాగంలో వున్నాయి.పుళింద,అశ్మక, జీమూత, నయ రాష్ట్రాలవారూ, కర్ణాటక, కంబోజ, ఘణ దేశాలవాసులూ దాక్షిణాత్యులన బడతారు. ఇక అంబష్ఠ, ద్రవిడ, లాట,కంభోజ, స్త్రీముఖ,శక,ఆనర్తవాసులు దక్షిణ-పశ్చిమ దేశీయులు.

స్త్రీ రాజ్య, సైంధవ, మ్లేచ్ఛ, నాస్తిక, యవన, మథుర, నిషధ ప్రాంత నివాసులంతా పడమటివారి క్రింద పరిగణింపబడుతున్నారు. మాండవ్య, తుషార, మూలిక, అశ్వముఖ, ఖశ, మహాకేశ, మహానాస దేశాలు ఉత్తర పశ్చిమాల్లో వున్నాయి.

లంబక, స్తననాగ, మాద్ర, గాంధార బాహ్లిక, మ్లేచ్ఛ దేశాలు హిమాలయానికి ఉత్తర తటంలో వున్నాయి. త్రిగర్త, నీల, కోలాత, బ్రహ్మపుత్ర, సటంకణ, అభీషాహ, కశ్మీరదేశాలు ఉత్తర పూర్వ దిశలలో వున్నాయి.

ఇదీ భరతవర్ష భౌగోళికత. ***(అధ్యాయం -55)***

## ప్లక్ష పుష్కరాది ద్వీపాలు, పాతాళం

**ప్ల**క్ష ద్వీపాధీశుడైన మేధాతిథికేడుగురుపుత్రులు. వారు క్రమంగా శాంతభవుడు, శిశిరుడు, సుఖోదయుడు, నందుడు, శివుడు, క్షేమకుడు, ధ్రువుడు. కాగా వారందరూ ఈ ద్వీపాన్ని పరిపాలించారు.

ఈ ద్వీపంలో గోమేద, చంద్ర, నారద, దుందుభి,సోమక, సుమనస, వైభ్రాజమను పేళ్ళు గల సప్త పర్వతాలున్నాయి. ఇక్కడ అనుతప్త శిఖి విపాశా, త్రిదివ, క్రము, అమృత, సుకృత నామకములైన నదులు ప్రవహిస్తున్నాయి.

వపుష్మాన్ (లేదా వపుష్మంతుడు) శాల్మక ద్వీపానికి రాజు. అతనికి ఏడుగురు కొడుకులు. శ్వేత, హరిత, జీమూత, రోహిత, వైద్యుత, మానస, సప్రభ అనే వారి పేర్లతోనే ఆ వర్షాలు -అంటే రాజ్యాలు కూడా ప్రసిద్ధి చెందాయి. ప్లక్ష ద్వీపంలో కుముద, ఉన్నత, ద్రోణ, మహిష, బలాహక, క్రౌంచ, కకుద్మాన అను పేళ్ళు గల ఏడు పర్వతాలున్నాయి. యోని, తోయ, వితృష్ణ, చంద్ర, శుక్ల, విమోచని, విధృతి నామకములైన సప్తనదులు కూడా వున్నాయి. ఇవన్నీ పాపనాశకాలే.

కుశద్వీపానికి స్వామి జ్యోతిష్మాన్ (జ్యోతిష్మంతుడు) ఆయనకూ ఏడుగురు కొడుకులే. వారు ఉద్భిద, వేణుమాన్, ద్వైరథ, లంబన, ధృతి, ప్రభాకర, కపిల నామధేయులు. వారి పేర్లతోనే వారు పాలించిన ఇక్కడి వర్షాలు ప్రసిద్ధికెక్కాయి. ఈ ద్వీపంలో విద్రుమ, హేమశైల, ద్యుమాన్, పుష్పవాన్, కుశేశయ, హరి, మందరాచలము అను పేర్లు గల యేడు వర్ష పర్వతాలున్నాయి. ఇక్కడ ధూతపాప, శివా, పవిత్ర, సన్మతి, విద్యుదభ్ర, మహీ, కాశాయను సప్త పాపనాశకాలైన నదులు ప్రవహిస్తున్నాయి.

మహాదేవా! క్రౌంచద్వీపానికి రాజు మహాత్ముడైన ద్యుతిమంతుడు. ఆయనకు కూడా ఏడుగురు కొడుకులే. వారి పేర్లు – కుశలుడు, మందగుడు, ఉష్ణుడు, పీవరుడు, అంధకారకుడు. ముని, దుందుభి. ఈ ద్వీపంలో క్రౌంచ, వామన, అంధకారక, దివావృత్, మహాశైల, దుందుభి, పుండరీకవాన్ నామక సప్త పర్వతాలున్నాయి. ఇక్కడ గౌరి, కుముద్వతి, సంధ్య, రాత్రి, మనోజవ, ఖ్యాతి పుండరీక నామములు గల నదులు ప్రవహిస్తున్నాయి.

శాకద్వీపరాజైన భవ్యునికి కూడా జలద, కుమార, సుకుమార, అరుణీబక, కుసుమోద, సమోదార్కి, మహాద్రుమ నామధేయులైన ఏడుగురు కొడుకులున్నారు. ఇక్కడ నలిని, సుకుమారి, కుమారి, ధేనుక, ఇక్షు, వేణుక, గభస్తి అను పేర్లుగల ప్రసిద్ధ నదులు ప్రవహిస్తున్నాయి.

పుష్కర ద్వీపపాలకుడైన శబల మహారాజుకి మహావీరులైన ఇద్దరుకొడుకులు పుట్టారు. వారి పేర్లు మహావీరుడు, ధాతకి. వారి పేర్లతోనే ఇక్కడ రెండు వర్షాలేర్పడ్డాయి. ఈ రెండిటి మధ్య మానసోత్తరమను పేరు గల మహాపర్వతముంది. ఇది యాభైవేల యోజనాల ఎత్తుతో, అంతే విస్తీర్ణంలో పఱచుకొని వుంది. ఈ పుష్కర ద్వీపానికి నలువైపులా స్వాదిష్ట జలాల సముద్రముంది. ఈ రుచికరమైన చల్లని జలాలలోనే ఈ ద్వీపానికి కాస్త దూరంలో ఒక నిర్జనమైన స్వర్ణమయమైన ప్రపంచం కనిపిస్తుంటుంది. అక్కడ పదివేల యోజనాల విస్తీర్ణంలో పఱచుకొని లోకాలోకమను పేరు గల పర్వతముంది. అది ఎల్లప్పుడూ చీకటి చేత కప్పబడి వుంటుంది. ఎంత కష్టపడి దానిని చూడడానికి ప్రయత్నించినా, సామాన్య మానవులకి అదేదో అండకటాహంచే ఆవరింపబడినట్లు అనగా నల్లటి గుడ్డు పెళ్ళ చేతనో తాబేటి చిప్పతోనో మూయబడినట్టు మాత్రమే కనిపిస్తుంది.

కపర్ద్యాది దేవతలారా! ఈ భూమి ఎత్తు డెబ్బది వేల యోజనాలు. ఇందులో పదేసి వేల యోజనాల దూరంలో పాతాళ లోకాలున్నాయి. వాటిని అతల, వితల, నితల, గభస్తిమాన్, మహాతల, సుతల, పాతాళ లోకాలని వ్యవహరిస్తారు. ఈ లోకాలలో భూమి

కృష్ణ, శుక్ల, అరుణ, పీత, శర్కర సదృశ, శైల, స్వర్ణ వర్ణాలలో వుంటుంది. అదే దైత్యుల, నాగుల నివాస భూమి దారుణ పుష్కర ద్వీపంలోనే నరకాలుంటాయి.

రౌరవ, సూకర, రోధ, తాళ, విశసన, మహాజ్వాల, తప్తకుంభ, లవణ, విమోహిత, రుధిర, కృమిశ, కృమిభోజన, అసిపత్రవన, కృష్ణ నానాభక్ష (లాలాభక్ష), దారుణ, పూయవశ, పాపవహ్నిజ్వాల, అధఃశిర, సందంశ, కృష్ణసూత్ర, తమస్, అవీచి, శ్వభోజన, అప్రతిష్ట, ఉష్ణవీచి అనేవి విభిన్న నరకాల పేర్లు.

ఈ లోకాలన్నిటికీ పైన జల, అగ్ని, వాయు, ఆకాశలోకాలున్నాయి. ఇంతవఱకు చెప్పబడిన దానిని బ్రహ్మాండమంటారు. దీనికి బాగా పైన దీనికి పదింతల పరిమాణంలో మరొక లోకముంది. అందులో శ్రీమన్నారాయణుడుంటాడు. ***(అధ్యాయాలు 56,57)***

# నవగ్రహాల రథాలు

దేవతలారా! సూర్యదేవుని రథం వైశాల్యము తొమ్మిది వేల యోజనాలు. దాని ఈషా దండానికీ అంటే కాడికీ రథ మధ్యానికీ మధ్య వుండే దూరం రథ వైశాల్యానికి రెట్టింపు వున్నది. ఇరుసు ఒక కోటీ ఎనభై యేడు లక్షల యోజనాల పొడవు ఉంటుంది. ఆ ఇరుసుకి గల చక్రమొకటే. దానికి మూడు నాభులు (పూర్వ, మధ్య, అపర అహ్ణాలు) అయిదు అరలు (పరివత్సరాదులు) ఆరునేములు (వసంతాది ఆరు ఋతువులు)

సంపూర్ణ కాలచక్రమే సూర్యదేవుని రథచక్రము.

ఇరుసులలో రెండవది నలభై వేల యోజనాల పొడవుంటుంది.

రథాక్షములు ఒక్కొక్కటీ అయిదున్నరవేల యోజనాల పొడవును కలిగియున్నవి.

గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి అనే ఏడు ఛందాలూ సూర్యభగవానుని సప్తాశ్వాలు.

సూర్యునికి పన్నెండుపేర్లు పన్నెండు తత్త్వాలు పన్నెండు ఆత్మలు. ఒక్కొక్క నెలలో ఒక్కొక్క నామంతో ఆయన రథంలో వుంటాడు. ఆ రథం వెనుకనొక అప్సర, ఒక మహాముని, ఒక యక్షుడు, ఒక నాగుడు, ఒక రాక్షసుడు, ఒక గంధర్వుడు వుంటారు. ***(అనుబంధం-8లో చూడండి).***

విష్ణుశక్తి వల్ల తేజోమయులైన మహామునులు సూర్యమండలాని కెదురుగా వుండి ఆయనను స్తుతిస్తుంటారు. గంధర్వులాయన యశోగానాన్ని కావిస్తుంటారు. అప్సరలు

నర్తిస్తుంటారు. వాలఖిల్యులను పేరు గల మునులు, యక్షరాక్షస నాగ ప్రతినిధులూ రథమును పరివేష్టించి వుండి అవసరమైన మేరకు రక్షణ కలిపించే ఉద్దేశ్యంతో వుంటారు.

చంద్రరథానికి మూడు చక్రాలుంటాయి. గుఱ్ఱాలు కుంద పుష్పం రంగులో తెల్లగా వుంటాయి. వాటి సంఖ్య పది. చంద్రపుత్రుడైన బుధుని రథం నీరూ, నిప్పూ కలిపిన ద్రవ్యంతో తయారు చేయబడుతుంది. గోధుమరంగులో వుండి వాయువేగంతో పోగలిగిన ఎనిమిది గుఱ్ఱాలుంటాయి.

శుక్రుని మహారథం సైన్య బలయుక్తమై, అనుకర్ణ (రథం కింద బలానికై పెట్టు మిక్కిలి దృఢమైన నిలువు, అడ్డకర్రలు) తో, ఎత్తయిన శిఖరంతో పతాకంతో, మిక్కిలి బలము, వేగము గల అశ్వాలతో శోభిస్తుంటుంది.

భూమి పుత్రుడైన మంగళుని రథం అగ్నిజ్వాలల్లోంచి అప్పుడే బయటికి తీసిన బంగారం రంగులో మెరిసిపోతుంటుంది. అగ్ని సంభవాలైన ఎనిమిది గుఱ్ఱాలుంటాయి. వాటి రంగు పద్మరాగమణుల అరుణ వర్ణం.

బృహస్పతి స్వర్ణరథంపై ఏడు పాండుర వర్ణం (తెలుపు పసుపు కలిసిన) లో ప్రకాశిస్తున్న గుఱ్ఱాలను పూన్చి ప్రయాణిస్తూ ఏడాదికొక రాశిలో నివసిస్తూ వుంటాడు.

శనిదేవుడు ఆకాశంలో పుట్టిన అనేక వర్ణములు గల అశ్వాలులాగే రథంపై తిరుగుతాడు. చాలా మెల్లగా కదులుతూ మందగామి అనే పేరును సార్థకం చేసుకుంటాడు.

రాహువు రథాశ్వాలు ఎనిమిది. ఇవి ధూసరవర్ణంలో – అంటే పాండుర వర్ణంలో పసుపు కాస్త తక్కువగా కలిసిన రంగులో వుంటాయి. అవి ఒకమారు కదిలాక ఆగవు.

కేతువు రథానికుండే ఎనిమిది గుఱ్ఱాలూ లాక్షారసం వలె అరుణకాంతులను వెదజల్లుతుంటాయి. వీటివేగం వాయువేగాన్ని మించి వుంటుంది.

ఈ విధంగా విష్ణువు యొక్క విశ్వరూపంలో భాగమైన భూమ్యాకాశాలలో ఆయన ఆదేశం మేరకు ఈ రథాలలో పరిభ్రమిస్తూ నవగ్రహాలు మానవుల, దేవతల జాతకాలను మారుస్తూ తిరుగుతుంటాయి. ***(అధ్యాయం – 58)***

# జ్యోతిశ్చక్రంలో వర్ణింపబడే నక్షత్రాలు, వాటి దేవతలు, శుభాశుభ యోగాలు, ముహూర్తాల వర్ణన

ముందుగా నక్షత్రాల కుండే దేవతల పేర్లను తెలుసుకుందాం.

కృత్తిక - అగ్ని,
రోహిణి - బ్రహ్మ
మృగశిర - చంద్రుడు
ఆర్ద్ర - రుద్రుడు
పునర్వసు - ఆదిత్య
పుష్య - తిష్యుడు
ఆశ్లేష - సర్పుడు
మఘ - పితృగణాలు
పూర్వఫల్గుని - భగుడు
ఉత్తరఫల్గుని - అర్యముడు
హస్త - సవిత
చిత్ర - త్వష్ట
స్వాతి - వాయువు
విశాఖ - ఇంద్రాగ్నులు
అనురాధ - మిత్రుడు
జ్యేష్ఠ - ఇంద్రుడు
మూల - నిరృతి
పూర్వాషాఢ - శివుడు
ఉత్తరాషాఢ - విశ్వేదేవులు
అభిజిత్ - బ్రహ్మ
శ్రావణ - విష్ణు
ధనిష్ఠ - వసువులు
శతభిష - వరుణుడు
పూర్వాభాద్ర - అజపాదుడు
ఉత్తరాభాద్ర - అహిర్బుధ్ని
రేవతి - పూష
అశ్వని - అశ్వనీకుమారులు
భరణి - యమధర్మరాజు

ఇక ఏయే తిథులలో ఏయే దిశలలో ఏయే యోగినులుంటారో వినండి.

| తిథులు | | యోగిని పేరు | | దిశ |
|---|---|---|---|---|
| పాడ్యమి, నవమి | - | బ్రహ్మాణి | - | తూర్పు |
| విదియ, దశమి | - | మాహేశ్వరి | - | ఉత్తరం |
| పంచమి, త్రయోదశి | - | వారాహి | - | దక్షిణం |

| తిథులు | | యోగిని పేరు | | దిశ |
|---|---|---|---|---|
| షష్ఠి, చతుర్దశి | – | ఇంద్రాణి | – | పశ్చిమం |
| సప్తమి, పున్నమ | – | చాముండ | – | వాయవ్యం |
| అష్టమి, అమావాస్య | – | మహాలక్ష్మి | – | ఈశాన్యం |
| ఏకాదశి, తదియ | – | వైష్ణవి | – | ఆగ్నేయం |
| ద్వాదశి, చవితి | – | కౌమారి | – | నైరృత్యం |

యోగిని నెదురుగా పెట్టుకొని యాత్రచేయరాదు. అనగా ఉదాహరణకి, దశమినాడు బయలుదేరేవారు ఉత్తరంలో లేదా ఉత్తరం వైపు బయలుదేరకూడదు. అంటే మాహేశ్వరి తప్ప మిగతా యోగినులున్న వైపు వెళ్ళవచ్చును.

అశ్వని, అనురాధ, రేవతి, మృగశిర, మూల, పునర్వసు, పుష్య, హస్త, జ్యేష్ఠ నక్షత్రాలున్న సమయాలు యాత్రకు ప్రశస్తాలు.

హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనురాధ నక్షత్రాలు నిత్యంగానూ, ఉత్తర ఫాల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర అశ్వని, రోహిణి, పుష్యమి, ధనిష్ఠ, పునర్వసు నక్షత్రాలు సామాన్యంగానూ నవీన వస్త్రధారణకు శ్రేష్ఠములు.

కృత్తిక, భరణి, ఆశ్లేష, మఘ, మూల, విశాఖ, పూర్వాభాద్ర, పూర్వాషాఢ, పూర్వఫల్గునీ నక్షత్రాలను అధోముఖీ నక్షత్రాలంటారు. ఈ నక్షత్రాల్లో వాపీకూప తటాకాలనూ, సరోవరాలనూ, దేవాలయాదుల నిర్మాణంలో పునాదులనూ తవ్వించుట మొదలుపెట్టాలి. అలాగే భూమిలో దాగియున్న స్వర్ణాది లోహాలకూ, ఖనిజాలకూ పాతిపెట్టబడిన నిధులకూ భూమిని త్రవ్వడానికి ఈ నక్షత్రాలు బహు ప్రశస్తమైనవి.

రేవతి, అశ్వని, చిత్ర, స్వాతి, హస్త, పునర్వసు, అనురాధ, మృగశిర, జ్యేష్ఠా నక్షత్రాలను పార్శ్వముఖి నక్షత్రాలంటారు. ఈ నక్షత్రాలున్నపుడే ఏనుగు, ఒంటె, గుఱ్ఱం, ఎద్దు వంటి పశువులను వశపఱచుకొనే ప్రయత్నం చేయాలి. అంటే తాళ్ళు కట్టుట, జీను వేయుట, మచ్చిక వంటివిచేయాలి.

పైన చెప్పబడిన పార్శ్వముఖి నక్షత్రాలలోనే పొలాలలో విత్తులు నాటడం, రాకపోకలు, చక్ర యంత్రాలు, రథాలు, నౌకాదుల క్రయాలు, నిర్మాణ ప్రారంభాలూ చేయడం శుభకరం.

రోహిణి, ఆర్ద్ర, పుష్య, ధనిష్ఠ, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిష (వారుణ) శ్రవణ – ఈ తొమ్మిది నక్షత్రాలనూ ఊర్ధ్వముఖీ నక్షత్రాలంటారు. వీటిలో రాజ్యాభిషేకం, అధికార స్వీకరణం వంటి కార్యాలనుచేయాలి. అభ్యుదయ ప్రదాయకము లైన కార్యాలను చేపట్టాలి.

చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, అమావాస్య, పున్నమ తిథులు అశుభకారకాలు. ఈ తిథులలో శుభకార్యాలను చేయరాదు.

కృష్ణపాడ్యమి, బుధవారంనాడు పడిన విదియ శుభదినాలు. మంగళునితో కలిసిన తదియ, శనితో కలిసిన చవితి, గురువారం నాడు పడిన పంచమి, శుక్రవారం షష్ఠి, షష్ఠి మంగళగ్రహం కలిసి పడిన రోజులు మంచి రోజులు. అలాగే బుధవారం సప్తమి, మంగళ లేదా ఆదివారాల్లో అష్టమి, సోమవారం – నవమి, గురువారం దశమి కలసి వచ్చిన రోజులు శుభదినాలు. ఏకాదశి రోజున గురు లేదా శుక్రవారాలు, బుధవారం ద్వాదశి, శుక్ర మంగళవారాల్లో త్రయోదశి, శనివారం చతుర్దశి, గురువారం నాడు పడిన అమావాస్య పున్నమి రోజులు కూడా శుభప్రదాలే.

ద్వాదశి – ఆదివారం, ఏకాదశి – సోమవారం, దశమి – మంగళవారం, నవమి – బుధవారం, అష్టమి – గురువారం, సప్తమి – శుక్రవారం, షష్ఠి – శనివారం యోగించిన వాటిని దగ్ధ దినాలంటారు. ఇటువంటి తిథి – దగ్ధ యోగ సమయాల్లో యాత్రల వంటి శుభకార్యాలను మొదలెట్టకూడదు. పాడ్యమి, నవమి, చతుర్దశి అష్టమి తిథులు బుధవారం నాడు పడితే మరీ ప్రమాదం. ఆ రోజుల్లో పక్క వూరికి కూడా బయలుదేరే ఆలోచనే చేయరాదు.

మేష–కర్కాటక సంక్రాంతి అష్టమితో గాని, కన్య–మిథున సంక్రాంతి అష్టమితో, వృష కుంభ సంక్రాంతి చవితితో, మకర – తుల సంక్రాంతి ద్వాదశితో, వృశ్చిక – సింహ సంక్రాంతి ద్వాదశితో, వృశ్చిక – సింహ సంక్రాంతి దశమితో, ధను– మీన సంక్రాంతి చతుర్దశితో కలసి పడిన రోజులు మహాదగ్ధ దినాలు. ఇవి కష్టదాయకాలు. ఈ తిథుల్లో నూతన ప్రయత్నాలు చేయరాదు.

మహాదేవాదులారా! రవివారంతో విశాఖ, అనురాధతో జ్యేష్టతిథి, సోమవారంతో పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణ నక్షత్రాలు, మంగళవారంతో ధనిష్ఠ, శతభిష, పూర్వాభాద్రలు, బుధవారంతో రేవతి, అశ్వని, భరణులు, గురువారంతో రోహిణి,మృగశిర,

ఆర్ద్రలు, శుక్రవారంతో పుష్య, ఆశ్లేష ముఖలూ, శనివారంతో ఉత్తరఫల్గుని, హస్త, చిత్రలూ యోగిస్తే ఆ దుర్యోగం ఉత్పాతాలను కలిగిస్తుంది. ఆయా కాలాల్లో యాత్రాదికార్యాలు ప్రారంభిస్తే ఉత్పాతాలు, మృత్యువు రోగాలు సంభవించవచ్చును.

ఆదివారంతో మూల, సోమవారముతో శ్రవణ, మంగళవారంతో ఉత్తరాభాద్ర, బుధవారంతో కృత్తిక, గురువారంతో పునర్వసు, శుక్రవారంతో పూర్వఫల్గుని, శనివారంతో స్వాతి కలిసొస్తే మాత్రం అది అద్భుత శుభయోగం. దాన్ని అమృత యోగమంటారు. ఆ రోజుల్లో చేపట్టే కార్యాలన్నీ సిద్ధిని పొందుతాయి.

విష్కంభయోగం అయిదు గడియలూ (120 నిముషాలు) శూలయోగం ఏడు గడియలూ, గండ, అతి గండయోగాల్లో ఆరేసి గడియలూ, వ్యాఘాత, వజ్ర యోగాల్లో తొమ్మిదేసి గడియలూ, వ్యతీపాత, వైధృతి, పరిఘ యోగాల్లో పూర్తికాలమూ మృత్యుతుల్య ములు. మిక్కిలి కష్టదాయకములు. సర్వకర్మలనూ పరిత్యజించవలసిన సమయాలివి.

ఆదివారంతో హస్త, గురువారంతో పుష్య, బుధవారంతో అనురాధా నక్షత్రాలు, శనివారంతో రోహిణి, సోమవారంతో మృగశిర, శుక్రవారంతో రేవతి, మంగళవారంతో అశ్వని, యోగించినవి ఉత్తమ, శుభదినాలు. ఈ దినాలలో చేసే పనులకు సిద్ధియోగమూ, పాపనాశనమూ కూడా వుంటాయి. ఇవి సర్వదోషహరములు.

హే వృషభధ్వజా! శుక్రవారంతో భరణి, సోమవారంతో చిత్ర, మంగళవారంతో ఉత్తరాషాఢ, బుధవారంతో ధనిష్ట, బృహస్పతితో శతభిష (అంటే గురువారంతో) శుక్రవారంతో రోహిణి, శనివారంతో రేవతి కలిసొచ్చే కాలాలు మానవులకు కలిసొచ్చే కాలాలు ఏ మాత్రమూ కావు. వీటికి విషయోగాలని పేరు. అవి దుష్కాలాలు.

పుష్య, పునర్వసు, రేవతి, చిత్ర, శ్రవణ ధనిష్ట, హస్త, అశ్వని, మృగశిర, శతభిష నక్షత్రాలు దుర్యోగాలను తప్పిస్తే సామాన్యంగా మంచివి. ఈ నక్షత్రాలలో జాతకర్మాది సంస్కారాలు చేయడం ఉత్తమం.

విశాఖ ఉత్తరఫల్గునీ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మఖ, ఆర్ద్ర, భరణి, ఆశ్లేష, కృత్తిక నక్షత్రాలు యాత్రలు చేయడానికి మంచివి కావు. మృత్యుభయముంటుంది.

***(అధ్యాయం -59)***

# గ్రహదశ, యాత్రాశకున, సూర్యచక్రాది నిరూపణం

***(ఈ** పురాణంలో నీయబడిన గ్రహాల మహాదశల యోగ్య సమయం, వాటి క్రమం పరాశర మహర్షి ద్వారా నిర్దిష్టమైన వింశోత్తరీ మహాదశతో అక్కడక్కడ ఏకీభవించడంలేదు. ఇందులో కేతుదశ కూడా కనబడుటలేదు)*

మహేశాదులారా! ఇపుడు గ్రహాల మహా దశలను వర్ణిస్తాను. సూర్యుని దశ ఆరేళ్ళు, చంద్రునిది పదిహేను, మంగళునిది ఎనిమిది, బుధునిది పదిహేడు, శనిది పది, గురువుది పందొమ్మిది, రాహువుది పన్నెండు, శుక్రునిది ఇరవై ఒక్కటి.

సూర్యదశ (అనగా ఒక వ్యక్తి జీవితంపై సూర్యగ్రహాధిపత్యం కొనసాగే కాలం) దుఃఖములనే ఎక్కువగా కలిగిస్తుంది. ఉద్వేగాలను రేకెత్తిస్తుంది. రాజుని నాశనం దాకా తీసుకుపోతుంది.

చంద్రదశ ఐశ్వర్యాన్నిస్తుంది, సుఖాలను సృష్టించ ప్రసాదిస్తుంది, ఇష్టమైన, మనసుకి అనుకూలమైన అన్నాదులనిస్తుంది.

మంగళుని దశ దుఃఖాన్నే ఎక్కువగా ఇస్తుంది. రాజ్యాదులు నశిస్తాయి. బుధ మహాదశ చాలా మంచిది. ఈ దశలో దివ్యమై స్త్రీ లాభము, రాజ్యప్రాప్తి, కోశవృద్ధి వంటివి ఒనగూడు తాయి. శని మహాదశలో రాజ్యనాశం, బంధు బాంధవాదికష్టం జరుగుతాయి. (అంటే బంధువులకూ బాంధవులకూ కష్టాలొస్తాయని తాత్పర్యం) గురు మహాదశలో రాజ్యలాభం, సుఖసమృద్ధీ కలుగుతాయి. ధర్మోద్ధరణ బుద్ధి కలుగుతుంది. రాహుదశలో రాజ్యనాశనము, రోగములు పెరుగుట, దుఃఖాలూ సృష్టింపబడుట జరుగుతాయి. శుక్రమహాదశలో రాజ్య, గజ, అశ్వ, స్త్రీ లాభాలుంటాయి.

మంగళుని యొక్క క్షేత్రం మేష నక్షత్రం. అలాగే శుక్ర, బుధ, చంద్రగ్రహాలకు వృషభ, మిథున కర్కాటకాలు క్షేత్రాలు.

ఈ క్షేత్రాలపై వాటి ప్రభావం ఉంటుంది. బుధునికి కన్యారాశి కూడా క్షేత్రమే.

సూర్య, శుక్రులకు సింహ తులారాశులు క్షేత్రాలు. మంగళునికి, వృశ్చిక రాశి కూడా క్షేత్రమే. బృహస్పతికి ధను, మీనాలు శనికి మకర, కుంభాలు క్షేత్రాలు. సూర్యగ్రహం కర్కాటక రాశిలోకి వెళ్ళినపుడు విష్ణువు శయనిస్తాడు.అశ్విని, రేవతి, చిత్ర, ధనిష్ఠ, నక్షత్రాలు ఆభూషణ ధారణకు ఉత్తమములు. అంటే ఈ నక్షత్రాలున్న సమయాల్లో కొత్త నగలనూ, ఉంగరాలు మున్నగు వాటినీ ధరిస్తే మంచిది.

యాత్రలో కుడివైపున లేడి, సర్పము, కోతి, గండుపిల్లి, కుక్క, పంది, నీలకంఠ, పక్షి, ముంగిస కనిపిస్తే మంచిదే. ఆ వ్యక్తికి ఆ యాత్ర మంగళప్రదమవుతుంది. బ్రాహ్మణ

కన్య ఎదురుగా వచ్చినా, శంఖ మృదంగ వాద్యాలు వినిపించినా, సదాచారి, శ్రీమంతుడు నగు వ్యక్తి కనిపించినా కూడా మంచిదే. వేణువు, మంచి స్త్రీ, నీటి కుండ ఎదురుగా రావడం శుభసూచకం.

యాత్రలో ఎడమవైపు నక్క, ఒంటె,గాడిద కనిపించడం మంగళప్రదమే.కాని పత్తి, మందులు, నూనె, రగులుతున్న అగ్ని జుట్టు విరబోసుకున్న మనిషి, పామును పట్టుకున్న వాడు, నగ్నంగా నున్న పెద్దవారు కనిపించడం అశుభసూచకం; మంచిది కాదు.

తుమ్ములు కూడా అన్నీ చెడ్డవి కావు. తూర్పు వైపు తుమ్ము వినిపిస్తే మంచిది. పడమటి నుండి తుమ్ము వినిపిస్తే తీపి పదార్థాలు లభిస్తాయి. వాయవ్యం నుండి వినిపిస్తే ధనప్రాప్తి వుంటుంది. ఉత్తరం వైపు నుండి వినిపిస్తే కలహం వస్తుంది.

ఆగ్నేయం నుండి తుమ్ము వినిపిస్తే శోక, సంతాపాలు కలుగుతాయి. దక్షిణం వైపు నుండైతే హాని వస్తుంది. నైరృత్యం ఆగ్నేయం వలెనే ఈశాన్యం వైపు నుండి వినిపించే తుమ్ము అత్యంత ప్రమాదకరం; మరణసమానమైన కష్టాలు కలుగుతాయి.

సూర్యభగవానుని ప్రతిమను మనిషి ఆకారంలోనే చేయాలి. సూర్య ప్రతిమను తయారు చేసిన రోజున ఆయన ఏ నక్షత్రంలో వున్నాడో చూసుకొని దాని నుండి మూడు తారలను లెక్కగట్టి వాటిని ఆ ప్రతిమ యొక్క మస్తకంపై నిర్మించాలి. ఆ రోజు వున్న నక్షత్రాన్ని ముఖంపై అంకితం చేయాలి. దానికి తరువాత వచ్చే నక్షత్రాలను భుజాలపై స్థాపించాలి. వాటి తరువాత రెండింటిని ఇరుహస్తాలపై చిత్రించాలి. అనంతరం వచ్చే అయిదు నక్షత్రాలనూ ప్రతిమ హృదయంపై లిఖించి, తరువాతి దానిని నాభి మండలం లోనూ, ఆ తరువాత నక్షత్రాన్ని పిరుదుల మధ్యా లిఖించాలి. తరువాత రెండు తారలను మోకాళ్ళపైనా, మిగిలిన వాటిని సూర్యదేవుని చరణాలపైననూ లిఖించాలి.

ఇక సూర్య చక్రం వివరాలను వినండి. దాని చరణాలపై జాతకుని జన్మ నక్షత్రం పడితే వాడు అల్పాయుష్కుడౌతాడు. మోకాళ్ళపై పడితే విదేశయానం చేస్తాడు. గుహ్యస్థానం పై పడితే స్త్రీలతో నెక్కువగా సుఖించేవాడవుతాడు. నాభిస్థానంపై పడితే అల్పసంతోషి అవుతాడు. జన్మనక్షత్రం సూర్యదేవుని హృదయస్థానంపై పడ్డవాడు. మహేశ్వరుని యంతవాడు కాగలడు. చేతులలోపడితే దొంగవుతాడు. భుజాలపై అయితే అస్థిరుడూ, కంధాలపైనైతే (కుబేరునంత) ధనికుడూ, ముఖంపైనేతే తీపి పదార్థాలు ప్రాప్తించేవాడూ కాగలరు.

మహేశా! ఏ మనిషి జన్మనక్షత్రమైతే సూర్యుని మస్తకంపై నున్న నక్షత్రమవుతుందో అతడు నిత్యం పట్టు వస్త్రాలే ధరించు ప్రధాన వ్యక్తి కాగలడు. ***(అధ్యాయం -60)***

## గ్రహాల శుభాశుభస్థానాలు తదనుసారంగా శుభాశుభ ఫలాల సంక్షిప్త వివేచన

మహేశాదులారా! ఒక జాతకుని యేడవ ఇంట్లో ఉపచయంలో వుండే చంద్రుడు మంగళకారి అవుతాడు. శుక్ల విదియనాడూ, పంచమ, నవమ గృహాల్లోవుండే చంద్రుడు ఆ జాతక చక్రమున్న వానిని గురువు వలె పూజ్యుని, గౌరవ్యుని చేస్తాడు.

చంద్రునికి పన్నెండు అవస్థలు అనగా దశలుంటాయి. నక్షత్రాలు మూడేసి ఒక బృందం లేదా మండలంగా వుంటాయి కదా. అశ్వనితో మొదలుపెట్టి మూడేసి నక్షత్రాల కలయికలతో చంద్రునికి ఈ అవస్థలేర్పడతాయి : ప్రవాసావస్థ, దృష్టావస్థ, మృతావస్థ, జయావస్థ, హాస్యావస్థ, నతావస్థ, ప్రమోదావస్థ, విషాదావస్థ, భోగావస్థ, జ్వరావస్థ, కంపావస్థ, సుభావస్థ.

ఫలితాలు కూడా అదే క్రమంలో ఇలా వుంటాయి : ప్రవాసం, హాని, మృత్యువు, జయం, హాసం, రతి, సుఖం, శోకం, భోగం, జ్వరం, కంపం, సుఖం.

జన్మలగ్నంలో చంద్రుడుంటే తుష్టి,అదే చంద్రుడు ద్వితీయ భావం(రెండింట) వుంటే సుఖ–హాని, మూడవ ఇంట వుంటే రాజ సన్మానం, చతర్థ భావంలో వుంటే కలహం, పంచమభావంలో వుంటే స్త్రీ లాభం కలుగుతాయి. ఆరవ ఇంట చంద్రుడుంటే ధన, ధాన్య ప్రాప్తి కలుగుతాయి. అష్టమభావంలో చంద్రుడు అరిష్టదాయకుడై ఆ జాతకునికి ప్రాణ సంకటాన్ని తెచ్చే అవకాశాలున్నాయి. నవమస్థానంలో వుంటే కోశంలో ధనంబాగా పెరుగు తుంది. దశమస్థానంలో కార్యసిద్ధి, ఏకాదశ స్థానంలో ఘన విజయం కలిగించే చంద్రుడు ఎవరికైనా పన్నెండవ ఇంటవుంటే మాత్రం మృత్యువు చేతిలోనికి పంపించి వేస్తాడు.

ఇక ఈ క్రింది నక్షత్రాలున్న గడియల్లో ఈ క్రింద సూచింపబడిన దిక్కుల వైపే యాత్రలకు బయలుదేరాలి. మరోలా కూడదు.

| నక్షత్రాలు | | దిక్కు |
|---|---|---|
| కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర<br>పునర్వసు, పుష్య, ఆశ్లేష | – | **తూర్పు** |
| మఖ, పూర్వఫల్గుని, ఉత్తర ఫల్గుని<br>హస్త, చిత్ర, స్వాతి, విశాఖ | – | **దక్షిణ** |
| అనురాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ<br>ఉత్తరాషాఢ, శ్రవణ, ధనిష్ఠ | – | **పశ్చిమ** |
| ధనిష్ఠ, శతభిష, పూర్వాభాద్ర,<br>ఉత్తరాభాద్ర, రేవతి, అశ్వని, భరణి | – | **ఉత్తర** |

అశ్వని, రేవతి, చిత్ర, ధనిష్ఠ నక్షత్రాలు కొత్త సొమ్ములు పెట్టుకోవడానికి ప్రశస్తాలు. మృగశిర, అశ్వని, చిత్ర, పుష్య, మూల, హస్త నక్షత్రాలు కన్యాదానానికీ, యాత్రలకూ, ప్రతిష్ఠాది కార్యాలకూ శుభప్రదాలు.

జన్మలగ్నంలో శుక్రుడూ, చంద్రగ్రహమూ గల వారికి శుభఫలాల ప్రాప్తి ఎక్కువగా వుంటుంది. ఈ రెండు గ్రహాలూ రెండవ ఇంట నున్న వారికీ శుభాలే వుంటాయి. తృతీయ భావంలో (అంటే మూడోయింట) చంద్ర, బుధ, శుక్ర, బృహస్పతులూ, చతుర్ధ భావంలో మంగళ, శని, చంద్ర, సూర్య, బుధులూ శ్రేష్ఠతను ప్రసాదిస్తారు. అలాగే పంచమభావంలో శుక్ర, బృహస్పతి, చంద్ర, కేతువులూ, ఆరోయింట శని, సూర్య, మంగళులూ, సప్తమ భావంలో బృహస్పతి, చంద్రులూ, అష్టమభావంలో బుధ, శుక్రులూ కూడా శుభాలనే ఇస్తారు. అదేవిధంగా నవమ స్థానంలో బృహస్పతీ, దశమ భావంలో సూర్యశనులూ, చంద్రుడూ, ద్వాదశ స్థానంలో బుధ, శుక్రులూ సర్వ విధాల సుఖాలనూ సమకూరుస్తారు. ఇక ఏకాదశ స్థానంలో ఏ గ్రహమున్నా శుభాన్నే ప్రదానిస్తుంది.

సింహంతో మకరం, కన్యతో మేషం, తులతో మీనం, కుంభంతో కర్కాటకం, ధనుస్సుతో వృషభం, మిథునంతో వృశ్చికరాశి యోగిస్తే మంచిది. దీన్ని షడష్టక యోగమంటారు. ఇది ప్రీతికారకం★. ***(అధ్యాయం - 61)***

## లగ్నఫలాలు, రాశుల చర-స్థిరాది భేదాలు గ్రహాల స్వభావాల, ఏడు వారాలలో చేయవలసిన యోగ్య ప్రశస్తకార్యాలు

**ఈ**శ్వరాదులారా! సూర్యుడు ఉదయకాలం నుండి మేషాది రాశులలో వుంటాడు. ఆయన దినంలో క్రమంగా ఆరురాశులను దాటుకొని పోయి రాత్రిలో కూడా ఆరురాశులను దాటి వస్తాడు.

మేషలగ్నంలో పుట్టిన ఆడది గౌద్రాలు అవుతుంది. వృషభలగ్నంలోనైతే కామిని, మిథున లగ్నంలో పుడితే సౌభాగ్యశాలినీ కర్కాటక లగ్నంలోనైతే ★వేశ్యా అవుతుంది.

---

*★ఒక్క గరుడ పురాణంలోనే షడష్టక యోగం మంచిదని చెప్పబడింది. వధూవరుల జాతకాలకు సంబంధించి మిగతా అన్ని శాస్త్ర గ్రంథాలలోనూ ఇది అశుభకారకంగానే పరిగణింపబడింది. వరుని లేదా వధువు యొక్క జన్మ రాశి ఒకరిది రెండవవారికి ఆరవదిగాని ఎనిమిదవది గాని అగుటనే షడష్టకయోగమంటారు.*

*★వేశ్య అనేది ఇప్పటి అర్థంలో వాడబడిన మాట కాదు. సూతుడు శౌనకాది మహామునులకు చెప్తున్న కాలంలో అదొక వృత్తి; కొన్ని సందర్భాలలో అదొక గౌరవప్రదమైన వ్యవస్థ కూడానూ. ఇప్పుడీ విషయాన్ని పట్టించుకోనక్కర్లేదు.*

సింహ లగ్నంలో పుట్టినామెకు పుత్రసంతానం అల్పం. కన్యాలగ్నంలో పుట్టిన కలికి రూపవతి; తులా లగ్నంలో పుట్టిన తెఅవ రూపవతీ, ఐశ్వర్యవంతురాలూ కూడా అవుతుంది. వృశ్చిక లగ్నంలో పుట్టిన వనితకి కర్కశ స్వభావముంటుంది. ధనుర్లగ్నంలోనైతే సౌభాగ్యవతీ, మకరలగ్నంలోనైతే తనకన్న తక్కువ స్థాయి పురుషుని పెండ్లి చేసుకొనేదీ అవుతుంది. కుంభలగ్నంలో పుట్టినామెకు మగ పిల్లలు తక్కువ. మీనలగ్నంలో పుట్టిన మీనాక్షి వైరాగ్యయుక్త అవుతుంది★.

ఇక రాశుల చర, స్థిర భేదాలు చూద్దాం.

తుల, కర్కాటక, మేష, మకరాలు, చరరాశులు. ఈ రాశులున్నపుడు యాత్రకు వెళ్ళవచ్చు. సింహ, వృషభ, కుంభ, వృశ్చిక రాశులు స్థిరరాశులు. ఇవి ఉన్నపుడు స్థిరమైన కార్యాలు చేపట్టాలి.

కన్య, ధను, మీన, మిథునాలు ద్విస్వభావమున్న రాశులు. చర, స్థిర-రెండు స్వభావాలూ గల కార్యాలను, విద్వాంసులు, ఈ రాశులున్న కాలంలో చేపడతారు.

యాత్రలను చరలగ్నాలలోనూన, గృహప్రవేశాది స్థిరకార్యాలను స్థిరలగ్నాలలోనూ చేయాలి. దేవతాదుల స్థాపనా, వైవాహిక సంస్కారాలూ ద్విస్వభావ లగ్నాలలో జరగడం అన్ని విధాలా శ్రేయస్కరం.

పాడ్యమి, షష్ఠి, ఏకాదశీ తిథులు మూడింటినీ, నందాతిథులంటారు. అలాగే విదియ, సప్తమి, ద్వాదశిలను భద్రా తిథులనీ, తదియ, అష్టమి, త్రయోదశులను జయాతిథులనీ అంటారు. ఇకపోతే చవితి, నవమి, చతుర్దశి – ఈ మూడిటినీ రిక్తాతిథులని వ్యవహరిస్తారు. రిక్తాతిథులలో ఎట్టి శుభకార్యమునూ చేయరాదు.

సౌమ్యస్వభావుడైన బుధుడు చర స్వభావం గల గ్రహం. గురుడు క్షిప్ర, శుక్రుడు మృదు, రవి ధ్రువ ప్రకృతులు గలవారు. శని దారుణ, మంగళుడు ఉగ్ర, చంద్రుడు సమ తత్త్వములు గలవారు.

చర, క్షిప్ర స్వభావాలున్న గ్రహాలు (అంటే బుధుడు, గురుడు) శాసించే వారాల్లో అంటే బుధ, గురు వారాల్లో యాత్రలు చేయాలి. శుక్ర, ఆది వారాల్లో గృహప్రవేశాది కార్యాలను చేపట్టాలి.

---

★*ఈ ఒక్క అంశాన్నే పట్టుకొని స్త్రీల విషయంలో ఒక నిర్ణయానికి వచ్చేయడం ప్రమాదం. ఇలాంటి అంశాలు కనీసం యాభై దాకా పరిశీలించి అప్పుడు ఆ స్త్రీ ఎలాంటిదో ఆలోచించాలి. కనీసం పది జ్యోతిశ్శాస్త్రగ్రంథాలైనా చదవకుండా జాతకాలు చెప్పెయ్యకూడదు.*

శని, మంగళవారాల్లో యుద్ధాలకు క్షత్రియవీరులు బయలుదేరవచ్చును.

రాజ్యాభిషేకాలకూ, అగ్ని కార్యాలకూ సోమవారం ప్రశస్తదినంగా పరిగణింప బడుతుంది. ఇల్లు కట్టడాన్ని, సున్నాలేయడాన్నీ కూడా ఈ రోజే మొదలెట్టవచ్చు.

గురువారంనాడు వేదపాఠాన్నీ, దేవపూజనీ, వస్త్రాలంకార ధారణనూ చేయవచ్చును. శుక్రవారం కన్యాదానానికీ, గజారోహణకీ, శనివారం గృహప్రవేశ, గజబంధనాలకీ మంచివి. ***(అధ్యాయం - 62)***

## సాముద్రికశాస్త్రానుసారం స్త్రీ పురుషుల శుభాశుభ లక్షణాలు, మస్తక, హస్త రేఖలాధారంగా వ్యక్తుల ఆయుః పరిజ్ఞానం

**మ**హేశా! ఇపుడు స్త్రీ పురుషుల అంగాలను బట్టి వారికుండే మంచి, చెడు బుద్ధులను సంక్షిప్తంగా వర్ణిస్తాను.

అరికాళ్ళు, అరిచేతులు కోమలంగా, మాంసపుష్టితో, రక్తవర్ణంలో వుండి, పాదాలు, చేతులు ఎత్తుగా, చెమట పట్టకుండా, రక్తనాళాలూ, ముడులూ కనబడకుండా ఎవనికైతే వుంటాయో అతడు రాజవుతాడు. అరికాలిలో అంకుశ చిహ్నమున్న వాడు సుఖి. అందమైన మడమ, తాబేటి రూపమున్న పాదము, వెచ్చటి శరీరము, రక్తవర్ణంలో, ముక్కలు కాకుండా, నల్లగీతలు లేకుండా వుండే గోళ్ళు కూడా రాజలక్షణాలే. కాలివేళ్ళొకదానికొకటి తగులుతూ వుండడం ఐశ్వర్యం లక్షణం. అలా తగలకుండా విడివిడిగా నున్నవాడు, తెల్లగా పాలల్లాటిగోళ్ళు, పాదంపై నరాలు, ముడులు కనిపించేవాడు దరిద్రుడు. నిప్పుల్లో కాల్చబడిన మట్టిరంగులో పాదాలున్న వాడు బ్రహ్మహత్య చేస్తాడు. పచ్చని పాదాలవాడు తిరుగుబోతు; నల్లనిపాదాల వారు తాగుబోతు; తెల్లని పాదాల వాడు తిండిపోతు.

కాలిబొటనవ్రేలు దిబ్బగా వుండేవాడు భాగ్యహీనుడు; వికృతంగా వుండేవాడు దుఃఖపీడితుడు. ఆ వేలు వంకరగా, చిన్నదిగా, విరిగినట్టు వుండేవాడు కష్టాలపాలవుతాడు.

కాలిచూపుడు వేలు బొటన వ్రేలికన్నా పెద్దది కలవానికి స్త్రీ సుఖం ఎక్కువగా ప్రాప్తిస్తుంది. చిటికెన వేలు సామాన్యంగా కంటే పెద్దది గలవాడు బంగారాన్ని పొందుతాడు. గోళ్ళు పాడైపోయినట్లుగా కనబడేవానికి శీలముండదు, అలాగని కామభోగమూ అనుభవంలోకి రాదు.

తొడలపై రోమాలుంటే ధనం నిలువదు. తొడలు చిన్నవిగా వుంటే ఐశ్వర్యం పడుతుంది. కాని, బంధనాల్లో వుండిపోతుంది. లేడితో సమానమైన జంఘలున్నవాడు

రాజ్యాన్ని సంపాదిస్తాడు. పొడవుగా దిబ్బగా వుండే తొడలున్నవాడు ఐశ్వర్యవంతుడవుతాడు. పులి లేదా సింహపు తొడలవాడు ధనికుడు కాగలడు. మోకాలు మాంసరహితంగా నున్న వానికి పరదేశ మరణం ప్రాప్తిస్తుంది. వికట జానువు దరిద్రహేతువు. మోకాళ్ళు కాస్త క్రిందికి వున్నవాడు ఏ ఆడదాన్నయినా గెలుచుకోగలడు. అక్కడ ఎక్కువ మాంసమున్నవాడు రాజవుతాడు. శ్రేష్ఠమైన పశు, పక్షి (సింహం, ఏనుగు, హంస) గమనము గలవాడు రాజుగాని గొప్ప ధనికుడు గాని కాగలడు.

కమలం రంగులో రక్తమున్నవాడు ధనవంతుడవుతాడు. ఎరుపు, నలుపు కలగలసిన రుధిర వర్ణమున్నవాడు అధముడు, పాపకర్ముడు కాగలడు. పగడపు రంగులో నుండి తేటగా మెరిసే రక్తము గలవాడు ఏడు ద్వీపాలకు అధిపతి కాగలడు. లేడి లేదా నెమలి పొట్ట ఉత్తమ పురుష లక్షణము. పులి, సింహము లేదా కప్ప (కడుపు వంటి) కడుపు రాజలక్షణము. పులి వంటి పీఠము సేనాపతి లక్షణము. సింహం పీఠం వలె పొడవుగా నుండే పీఠము గల వానికి బంధనాలెక్కువ. తాబేలు పీఠము సకలైశ్వర్య సంపన్న లక్షణము. విశాలంగా, ఎత్తుగా, పుష్టిగా రోమయుక్తమైయున్న వక్షఃస్థలము గల పురుషుడు శతాయువు, ధనవంతుడునై అన్ని భోగాలనూ అనుభవింపగల అదృష్టవంతుడు కాగలడు.

చేతిలో మీనరేఖ గలవాడు గొప్ప కార్యసాధకుడు, ధనవంతుడు, పుత్రవంతుడు కాగలడు. తుల, వేది చిహ్నామున్నవాడు వ్యాపారంలో లాభాన్నార్జించగలడు. చేతిలో సోమలతా చిహ్నామున్నవాడు ధనికుడై యజ్ఞం చేస్తాడు. పర్వత, వృక్ష చిహ్నాలున్న వాని వద్ద లక్ష్మి స్థిరంగా వుంటుంది. అనేక సేవకులకు స్వామి కాగలడు. శూలము, బరిసె, బాణము, తోమరము, ఖడ్గము లేదా ధనుస్సు వంటి చిహ్నామేదైనా అరచేతిలో గలవాడు యుద్ధ విజయుడు. ధ్వజం కాని శంఖంగాని వుండే సముద్ర, ఆకాశయానాలు చేసి వ్యాపారాల్లో బాగా గడిస్తాడు. శ్రీవత్స, కమల, వజ్ర, రథ లేదా కలశ చిహ్నామున్న పురుషుడు శత్రురహితు డైన రాజు కాగలడు. కుడిచేతి బొటన వ్రేలిలో యవధాన్యపు గుర్తున్నవాడు, అన్ని విద్యలలో ఆరితేరినవాడవుతాడు; ప్రవక్త కూడా కాగలడు. చిటికెన వేలిక్రింది నుండి చూపుడు వేలి మధ్యదాకా ఆగకుండా పయనించే రేఖగలవాడు వందేళ్ళ దాకా (ప్రస్తుతం కాలంలో) జీవిస్తాడు.

పాము పొట్టవలె పొట్ట ఉన్నవాడు అధిక భోజనుడు, దరిద్రుడు అవుతాడు. విశాలంగా వెడల్పుగా, గంభీరంగా, గుండ్రంగా నున్న బొడ్డు గల పురుషునికి ధనధాన్యాలూ సకల భోగాలూ వుంటాయి. పొట్టిగా నీచంగా వుండే నాభి గల వానికి ఎన్నో దుఃఖాలు సంక్రమిస్తాయి. బలికి (అనగా బొడ్డుకి పైన కడుపులోపడే సన్నటి మడత) క్రింద

విషమంగా వుండే బొడ్డు గలవానికి ధనహాని కలుగుతుంది. దక్షిణావర్త నాభి బుద్ధికీ, ఎడమవైపు వంగే బొడ్డు శాంతికీ సూచకాలు. నూరు దళాల కమలానికి వుండే కర్ణికలాంటి నాభి మహారాజు లక్షణం. పొట్టలో ఒక సన్నటి మడత వున్నవాడు శస్త్రంచే చంపబడతాడు. రెండున్నవాడు స్త్రీ భోగి, మూడున్నవాడు రాజు లేదా ఆచార్య పీఠము, నాలుగున్నవాడు అనేక పుత్రవంతుడు అవుతారు.

భుజాలు గట్టిగా, పుష్టిగా, సరిసమానంగా నున్న నరుడు రాజవుతాడు; సుఖపడతాడు. వక్షస్సు ఉన్నతంగా, సాపుగా, పుష్టిగా, విశాలంగా నున్నవాడు రాజ సమానుడవుతాడు. దట్టమైన రోమాలుండి, ఎగుడు దిగుళ్ళుగా, ఆర్చుకుపోయినట్లుండే వక్షం దరిద్రుడి కుంటుంది. వక్షం రెండు వైపులా సమానంగా ధనవంతుడికుంటుంది. పుష్టిగా వుండే వక్షఃస్థలం శూర వీర లక్షణం. గడ్డము వంకరగా వుండేవాడు ధనహీనుడు; ఉన్నతంగా సమానంగా వుండేవాడు భోగి. బలంగా లేకుండా అణగియున్నట్లుగా కనిపించే మెడ ధనహీనుని లక్షణం. ఎద్దు మెడలాగా పుష్టిగా వుండే మెడ శూర వీర లక్షణం. లేడి మెడవాడు దానిలాగే పిరికివాడుగా వుంటాడు. చిలుక, ఒంటె, ఏనుగు, కొంగల మెడల వలె పొడవుగా నుండి, శుష్కించినట్లుడే మెడ గలవాని వద్ద ధనం నిలువదు. చిన్న మెడవాడు ధనికుడు, భోగి కాగలడు. పుష్టి, దుర్వాసనలేమి, సమత, చిన్న రోమాల కలిమి బాహు మూలములకు మంచి లక్షణాలు. అవి ఐశ్వర్యవంతుని కుంటాయి.

భుజాలు పైకి లాగబడినట్లుండేవాడు బంధనాల్లో పడతాడు. చిన్న భుజాలు దాసుడికీ ఎగువ దిగువ భుజాలు దొంగకీ వుంటాయి. ఆజానుబాహువులు సర్వశుభ లక్షణం. చేతిపై భాగంలో గోతులున్నవాడికి పిత్రార్జితం లభించదు, పిరికితనం కూడా వుంటుంది. ఎత్తుగా వుండే కరతలమున్నవాడు దాని కాగలడు. కరతలం విషమంగా వుండే వాడి జీవితం కూడా కలిమి లేముల మయమవుతుంది. లక్క వలె ఎఱ్ఱనైన అరచేతులు కలవాడు రాజవుతాడు. పచ్చని కరతలం వాడికి జీవితంలో ఒక గమ్యముండదు. అదే నల్లగా, నీలంగా వుంటే మత్తు పదార్థాలు సేవించే వాడవుతాడు. గరుకుగా వుంటే నిర్ధనుడౌతాడు.

చంద్రమండలము వంటి ముఖమున్నవాడు ధర్మాత్ముడవుతాడు. తొండం ఆకారంలో ముఖమున్నవాడు భాగ్యహీనుడు. వంకరగా, ముక్కలనతికినట్లుగా, సింహం ముఖం వలె ముఖమున్నవాడు దొంగ కాగలడు. సుందరమై కాంతియుక్తమై, మంచి జాతికి చెందిన ఏనుగు వలె పరిపుష్టమైన వదనము రాజ లక్షణము. గొఱ్ఱె కోతి ముఖ కవళికలు ధనవంతునికుంటాయి. సాధారణం కంటె పెద్ద, చిన్న, పొడవైన ముఖాలు క్రమంగా దరిద్ర, మూర్ఖ, పాపాత్మ లక్షణాలు. పురుషుని ముఖం ఆడదాని ముఖంలా వుండకూడదు.

అలాగుండి, దింపుడు కనులు కూడా వుండేవానికి పుత్రసంతానం కలుగదు; కలిగినా మిగలదు. నాల్గు కోణముల ముఖమున్నవాడు ధూర్తుడు.

కమలదళాల వలె కోమలములై కాంతివంతములైన కపోలాలు కలవాడు. జీవితంలో కూడ శ్రేష్ఠ కాంతులతో ప్రకాశిస్తాడు; ధనవంతుడై స్వయంకృషితో పైకొస్తాడు. దానిమ్మపూవుతో సమానమైన నేత్రములున్నవాడు రాజు కాగలడు. పులి కన్నుల వాడు ముక్కోపి, ఎంౖడి కన్నులవాడు జగడాల మారి, పిల్లి లేదా హంస కన్నులున్నవాడు అధముడు అవుతారు. తేనెరంగు పింగలవర్ణము కలిసిన కనుల చాయగల వానిని లక్ష్మి ఎన్నడూ విడచి పెట్టదు. గోరోచనము, గురిగింజ, హరతాలము (వేషగాళ్ళు ముఖానికి పూసుకొనే పసుపు రంగు) కలిసిన పింగళవర్ణనేత్రుడు బలవంతుడు ధనవంతుడు.

నుదురు అర్ధచంద్రాకారంలో నున్నవాడు రాజు కాగలడు. పెద్ద నుదురు ధనసూచకం. చిన్న నుదురు ధర్మాత్మునికుంటుంది. లలాటమధ్యంలో అయిదు అడ్డరేఖలున్నవారు నూరేళ్ళు ఐశ్వర్యవంతులై జీవిస్తారు. నాలుగు రేఖలుంటే ఎనభై, మూడుంటే డెబ్బది, రెండుంటే అరవై, ఒకటుంటే నలభైయేళ్లు జీవిస్తారు. నుదుటిపై ఒక గీతా లేనివారికి పాతికేళ్ళే ఆయుర్దాయము. ఈ రేఖలు చిన్నవిగా ఉండే వ్యక్తికి ఆరోగ్యముండదు. లలాటంలో త్రిశూల చిహ్నంగాని, పట్టిసం గుర్తుగాని వున్నవాడు గొప్ప ప్రతాపవంతుడు, కీర్తి సంపన్నుడునైన రాజు కాగలడు.

శిరస్సు గొడుగులాగ వుండేవాడు రాజవుతాడు. పొడవు తలవాడు దరిద్రుడు, దుఃఖితుడు కాగలడు. గోళాకారంలో వుండి సమానమైన పొడవు వెడల్పులున్న తల గల గలవాడు సుఖపడతాడు. ఏనుగు తల ఆకారంలో శిరస్సు గలవాడు రాజసమానుడవుతాడు. విరలంగా, స్నిగ్ధమై, కోమలమై, తుమ్మెదల లేదా కాటుక రంగులో నున్న కేశములు గలవాడు అన్ని సుఖాలూ అనుభవిస్తాడు, రాజు కూడా కాగలడు. కఱకుగా బెరుకుగా వుండే కేశాలున్నవాడు, ముందు వైపు ముక్కలగు తల వెంట్రుకలున్నవాడు ఎక్కువగా దుఃఖాలనే అనుభవిస్తాడు. ***(అధ్యాయం 63)***

## స్త్రీల శుభాశుభ లక్షణాలు

**మె**డ మీద రేఖ వుండి, కనుకొలుకులలో ఎరుపు జీర గల స్త్రీ ఏ యింటికి వెళితే ఆ యిల్లు దినదిన ప్రవర్ధమానమవుతూనే వుంటుంది.

లలాటంపై త్రిశూలరేఖ వున్న లలన వేలాదిమంది దాసదాసీ జనానికి స్వామిని కాగలదు. రాజహంస గమనము, లేడికనులు, అదే శరీరవర్ణము, తెల్లనై సమముగానున్న

దంతాలు గల నారి ఉత్తమ స్త్రీ. కప్ప వంటి కడుపున్న కలికి ఒకే పుత్రుని కంటుంది. అతడే రాజవుతాడు.

హంస వలె మృదువచనము, తేనె వలె శరీర వర్ణము గల తెఅవ ధనధాన్య సమృద్ధిని కలిగియుంటూ ఎనిమిదిమంది పుత్రుల్ని కంటుంది. పొడవైన చెవులను, సుందరనాసికను, విల్లువలె వంపు తిరిగిన కనుబొమ్మలను కలిగిన కాంత అతిశయ సుఖాలననుభవిస్తుంది. మృదువుగా, నున్నగా, మెత్తగా నున్న తనువు, సన్నని రూపు, శ్యామల వర్ణం, మధుర భాషణం, శంఖ సమాన, కాంతులతో అతిశయ స్వచ్ఛత గల పలువరుస గల పడతి అన్ని రకాల ఐశ్వర్యాలనూ ప్రాప్తించుకోగలుగుతుంది.

విస్తారమైన జంఘులు, వేది వంటి మధ్యభాగము గల మగువ మహారాణి కాగలదు. ఎడమ స్తనంపై గానీ, చెవి, గుండె, చేతులపైగానీ ఉలిపిరి కాయైనా, అంతే పరిమాణం గల పుట్టుమచ్చయినా గానీ కల మహిళ తొలికాన్పులోనే సలక్షణుడైన పుత్రుని కంటుంది. రక్తవర్ణ పాదాలతో, ఎత్తు ఎక్కువగా లేని కాలిపై భాగంతో, చిన్న చీల మండలతో, సుందరములై కలిసియుండే వేళ్ళతో, లేత అరుణ నయనాలతో విలసిల్లే వనిత అదృష్టవంతు రాలై అన్ని సుఖభోగాలకూ అర్హురాలవుతుంది. పెద్ద పెద్ద పాదాలు, అన్ని అంగాలపై రోమాలు, లావుగా నున్న చేతులు గల చేడియ దాసీదౌతుంది. పెద్ద పాదములు, వికృతవ దనము, పైపెదవిపై రోమాలు వుండే పడతి పతి మరణానికి ప్రధాన కారణం కాగలదు.

ఉంగరాలు తిరిగే తలవెంద్రుకలు, కోలముఖం, దక్షిణావర్తమైన నాభి గల స్త్రీ తన పురుషుని వంశాన్ని అన్ని విధాల వృద్ధి పఱస్తుంది. బంగారుమేని వర్ణము, ఎఱ్ఱ కమలం రంగులో అరచేతులు గల అతివ శ్రేష్ఠురాలు, పతివ్రత అవుతుంది. వంకరులు పోవు కేశాలూ కోలకన్నులూ గల వనిత దుఃఖాలనే ఎక్కువగా అనుభవిస్తుంది. ఆమెకు భర్తృ వియోగం కలుగుతుంది.

పూర్ణచంద్రుని వంటి మొగమూ, బాల సూర్య సమానమైన అరుణకాంతులు గల మేనూ, విశాలనేత్రాలూ, బింబా ఫలము వంటి క్రింది పెదవీ గల కన్య చిరకాలం పాటు సర్వసుఖాలూ అనుభవిస్తుంది. అరచేతిలో ఎక్కువ రేఖలుండే స్త్రీకి కష్టాలెక్కువ. తక్కువ రేఖలుంటే ధనహీనతా, దుఃఖాలూ వుంటాయి. అలాగే రక్తవర్ణంలోవుండే రేఖలు సుఖజీవనాన్నీ నల్లగీతలు దాస్యవృత్తినీ, దూతిక బ్రతుకునీ సూచిస్తాయి.

అరచేతిలో అంకుశం, కుండలం లేదా చక్రచిహ్నంతో శోభిల్లే కన్యరాజపత్నీ, సత్పుత్ర జనయిత్రీ అవుతుంది. అలాగే ప్రాకార, తోరణ చిహ్నాలున్న తరుణి దాసి ఇంట పుట్టినా

రాజపత్ని అవుతుంది. బొడ్డు కాస్త పైకి వంగి వుండి, మండలాకారంలో కపిల వర్ణంలో అక్కడ రోమాలుండే స్త్రీ రాచయింట పుట్టినా దాసిగానే బ్రతుకీడుస్తుంది.

నడిచేటపుడు రెండు కాళ్ళ అనామికలూ, చిటికెన వ్రేళ్ళూ నేలకి తగలకుండా వుండే తరుణి భర్తృవినాశినీ స్వేచ్ఛావిహారిణీ కాగలదు.

సుందర, మనోహర నయనాలున్న నారి సౌభాగ్యశాలినీ, ఉజ్జ్వలంగా మెరిసే పలువరుస గల పడతి దంత సిరి గలదీ (రుచికరమైన భోజనాదులు జీవితాంతం లభించేది), కోమల, స్నిగ్ధచర కోణాలున్న కోమలి శ్రేష్ఠ వాహనాల యజమానురాలూ అవుతారు.

మృదువుగా మెరుస్తూ పైకి పెరుగుతూ రాగి రంగుకి దగ్గరగా నున్న ఎరుపు రంగు గోళ్ళు వుండి, మీన, అంకుశ, పద్మ, హల చిహ్నాలతో, స్వేదరహితంగా వుండే అరికాళ్ళతో శోభిల్లు సుందరి లక్ష్మీదేవి వలె సౌభాగ్యశాలి కాగలదు.

రోమరహిత, సుందరజంఘలూ, ఏనుగు తొండాల్లా వుండే ఊరువులూ, దక్షిణావర్త మైన గంభీరనాభి, రోమరహిత త్రివళులూ, రోమరహిత స్తన ప్రదేశం– ఇవి ఉత్తమ స్త్రీ లక్షణాలు. ***(అధ్యాయం - 64)***

## స్త్రీల, పురుషుల సామాన్య లక్షణాలు

పరమేశ్వరాదులారా! మీకిపుడు సాముద్రిక శాస్త్రంలో చెప్పబడిన స్త్రీ పురుషుల శుభాశుభ లక్షణాలను వివరిస్తాను. ఈ పరిజ్ఞానం భూత, భవిష్యత్కాలాలను తెలుపుతుంది.

నడిచేటప్పుడు పాదాలు నేలపై విషమంగా పడే లక్షణమున్నవారు, కాషాయరంగులో పాదాలున్నవారు, అసాధారణమైన రంగులో పాదాలున్నవారు వంశనాశకులౌతారు. పాదాలు శంకువు ఆకారంలో నున్నవాడు బ్రహ్మహత్య చేస్తాడుఅందరాని పొందును వాంఛిస్తుంటాడు.

తలవెంట్రుకలు కుంచితమై వుండేవారికి విదేశంలో మృత్యువు వస్తుంది. ఏనుగు తొండం వంటి తొడలు రాజు, రాణి లకుంటాయి. గుంటనక్క తొడలు దరిద్రులకుంటాయి.

మోకాళ్ళపై మాంసం ఉండకపోవడం మంచిలక్షణం. అల్పమైన, చిన్నమోకాళ్ళు ప్రేమికులకుంటే, విశాలంగా వికటాకారంలో దరిద్రులకుంటాయి. జానువులు మాంస పరిపూర్ణమై వున్నవారికి రాజ్యప్రాప్తి వుంటుంది. పెద్ద మోకాళ్ళున్న వారు దీర్ఘాయువు లౌతారు.

మాంసపుష్టి గల తుంటి ఎముక, పక్కటెముక ప్రదేశమున్నవారు సుఖపడతారు. సింహసమానమైన ప్రక్కటెముక గలవారు రాజ పురుషులౌతారు. (స్త్రీలకూ అదే స్థాయి

దక్కవచ్చు) సింహసదృశ కటి ప్రదేశమున్నవారు పాలకులౌతారు. కోతి కటి వంటి కటి గలవారు నిర్ధనులు.

సమానబాహు మూలములున్నవారు అత్యధిక భోగవిలాసులౌతారు. అవి క్రిందికి వుంటే ధనహీనులూ, ఉన్నతంగా కానీ విషమంగా కానీ వుంటే కుటిలురూ కాగలరు.

చేప కడుపువారు మిక్కిలి ధనవంతులుగా వుంటారు. విశాలమైన, సుశోభితమైన బొడ్డు గలవారు సుఖజీవనులు కాగా, లోతెక్కువున్న నాభి గలవారు కష్టాలనుభవిస్తారు.

త్రివళుల మధ్య భాగంలో క్రిందికి వంగియున్న బొడ్డుగలవారు శూల రోగగ్రస్తులవుతారు. ఎడమవైపు వంగిన నాభి శక్తి సంపన్నులకూ, కుడివైపు వంగిన బొడ్డ మేధావులకూ వుంటుంది. బొడ్డు ఒక వైపు విశాలంగావున్నవారు చిరంజీవులూ, ఎత్తుగా నున్నవారు ఐశ్వర్యవంతులూ, అధోముఖంగా వున్నవారు గోధనసంపన్నులూ, పద్మకర్ణిక సదృశనాభి గలవారు రాజత్వాధికారాలను పొందువారూ కాగలరు.

ఉదరభాగంలో నొక సన్నని మడత (వళి, బలి) గలవారు శతాయువులు, రెండున్నవారు మహాభోగులు. త్రివలీయుక్తులు మహారాజ ఆచార్యపదాధికారులూ, వక్రవళులవారు ఒక గమ్యం లేకుండా జీవించేవారూ కాగలరు.

పక్కలు (ఉదరపార్శ్వాలు) పుష్టిగా, మాంస యుక్తములై వుండుట రాజలక్షణము. కడుపుపై వుండే రోమాలు మృదువుగా కోమలంగా, సమదూరంలోనుండుట రాజలక్షణం. వీటికి విపరీతంగా దట్టంగా, గరుకుగా, విషమంగా రోమాలున్నవారు దూతకర్ములూ, నిర్ధనులూ, సుఖరహితులూ కాగలరు.

గూళ్ళలో (భుజసంధుల్లో) విషమత, ఎముకల కలయికా గలవాడు లేని వాడౌతాడు. అంటే నిర్ధనుడౌతాడు. అవే సంధులున్నతంగా వుంటే భోగీ నిమ్నంగా వుంటే దరిద్రులూ అవుతారు. స్థూలంగా వుంటే ధనికులౌతారు.

పలక వలె నుండు కంఠమున్నవారు నిర్ధనులూ, ఎత్తుగా రక్తనాళాలు కనిపిస్తూ వుండే కంఠం గలవారు సుఖజీవనులూ కాగలరు. మహిష సదృశ గ్రీవులు వీరులూ, లేడి వంటి మెడ గలవారు. శాస్త్ర పారంగతులూ అవుతారు. శంఖసమాన కంఠమున్నవారు రాజులూ, రాణులూ, పొడవు మెడవారు  సుఖులూ, భోజనప్రియులూ అవుతారు.

రోమరహితంగా నున్నగా వుండేపిరుదులుశుభలక్షణం.మరోలా వుంటేఅశుభ లక్షణం.

పుష్టిగా, తిన్నగా, విశాలంగా, బలంగా, వృత్తాకారంలో, పూర్తిగా చాచితే మోకాళ్ళందేటంత పొడవుగా భుజాలున్నవారు రాజులో తత్సమానులో అవుతారు. చిన్నభుజాలు నిర్ధనులకుంటాయి. ఏనుగు తొండం వలె నున్న భుజాలు శుభలక్షణం.

భవనంలో వాయు ప్రదేశం కోసమేర్పాటు చేసిన ద్వారాల ఆకారంలో వుండే వేళ్ళు శుభలక్షణం. చిన్నవేళ్ళు మేధావులకుంటాయి. బల్లపరుపుగా వుండే వేళ్ళు భృత్య లక్షణం. పెద్దవిగా వుండే వేళ్ళునిర్ధన లక్షణం. కృశించిన వేళ్ళుకలవాడు వినయసంపన్నుడై వుంటాడు. కోతి చేతుల వంటి చేతులు బలహీన లక్షణం,పులి పంజా లాంటి చేతులుబలీయ లక్షణం.

అరచేతి భాగాలు అణగిపోయినట్లుండేవారికి పిత్రార్జితం దక్కదు. మణికట్టు చక్కగా, బలంగా, సుగంధయుక్తగా వుండడం రాజ లక్షణం. ముక్కలుగా, భాగాలు కలిపినట్లుగా, శబ్దం చేస్తూ వుండే మణికట్టు గలవారు నిర్ధనులూ, నీచప్రవృత్తి గలవారూ కాగలరు.

గోళాకారంలో, లోతుగానున్న అరచేతులు ధనవంతులకుంటాయి. ఉన్నత కరతల మున్నవారు దాతలూ, విషమభాగాలున్నవారు కఠోర మనస్కులూ కాగలరు. లక్క రసం రంగులో అరచేతులున్నవారు రాజులవుతారు. పసుపు రంగు అరచేతులున్నవారిలో వ్యభిచరించే లక్షణముంటుంది. గరుకుగా అరచేతులున్నవారు నిర్ధనులవుతారు.

ఊక (పొట్టు) రంగులో గోళ్ళున్నవారు నపుంసకులౌతారు. కుటిలంగానూ, బద్దలుగానూ గోళ్ళున్నవారు ధనహీనులవుతారు. రంగు విరిగినట్లున్న గోళ్ళున్నవారు తర్కం చేస్తారు. రాగివర్ణంలో రక్తం కనిపిస్తూ వుండే గోళ్ళున్నవారు రాజులు కాగలరు.

బొటనవ్రేలిలో యవచిహ్నము అత్యధిక ధనప్రాప్తి గల వారికుంటుంది; వైభవం కూడా వుంటుంది. అంగుష్ఠ మూలభాగంలో యవచిహ్నమున్న వారికి అధిక పుత్రసంతానం ప్రాప్తిస్తుంది. వేళ్ళలోని పర్వాలు పొడవుగా నున్నవారు పుత్రపౌత్రాభివృద్ధిని చూస్తూ చాలా కాలం జీవిస్తారు. విరళాంగళులు దారిద్ర్య సూచకములు. సఘనాంగళులున్నవారు ధన సంపన్నులవుతారు. మణికట్టులో పుట్టిన మూడురేఖలు కరతల భాగాన్ని దాటుకొని పోయి వ్రేళ్ళదాకా వెళితే చాలా మంచిది. అది చక్రవర్తి లక్షణము.

అరచేతిలో రెండు మీనరేఖలున్నవారు యజ్ఞకర్తలూ, దాతలూ అవుతారు; వజ్రాకార ముంటే ధనవంతులు, చేపతోక వంటి గుర్తులుంటే విద్వాంసులూ కాగలరు.

మహారాజుల అరచేతుల్లో పరమశుభకరములైన శంఖ, ఛత్ర, శిబిక, గజ, పద్మాకార చిహ్నాలుంటాయి. కుంభ, అంకుశ, పతాక, మృణాళ చిహ్నాలు. అతులనీయ ఐశ్వర్యం గల మహారాజల కరతలంపై వుంటాయి. అరచేతిలో త్రాటిగుర్తున్న వారికి గోధనం మెండుగా వుంటుంది. స్వస్తిక చిహ్నమున్నవారు సమ్రాట్‌లవుతారు. చక్రం, కత్తి, తోమరం, విల్లు, బల్లెం ఆకారంలో గుర్తులు అరచేతిలో నున్నవారు కూడా రాజులవుతారు.

చేతిలో రోకలి గుర్తున్నవారు యజ్ఞాది కర్మకాండలు చేయించడంలో నిష్ణాతులవుతారు; వేదికాకారమున్నవారు 'అగ్నిహోత్రి' అనే పదానికర్హులౌతారు; నూయి, దేవకుల్యం, త్రికోణం వున్నవారు ధార్మికులు.

అంగుష్ఠమూలంలో దళసరి రేఖలున్నవారికి కొడుకులూ, పలచటి గీతలున్నవారికి కూతుళ్ళూ ఎక్కువగా పుడతారు. చిటికెన వేలి మూలంలో మొదలై చూపుడు వేలి మూలందాకా పయనించే రేఖ గలవారు నూరేళ్ళూ జీవిస్తారు. కాని, ఆ రేఖ ఎక్కడైనా విచ్ఛిన్నమైపోతే, చెట్టు మీది నుండి క్రిందపడి మరణిస్తారు. రేఖలు మరీ ఎక్కువగా నున్న మానవులు దరిద్రులౌతారు. చిబుకం కృశించిపోయినట్లుండుట ధనహైన్యానికీ, మాంస పుష్టితో నుండుట సంపన్నతకీ సూచనలు.

స్నిగ్ధంగా, దిట్టంగా సమానభాగాలలో వుండే సుందర, తీక్ష్ణదంతాలు శుభప్రదం. రక్తవర్ణంలో, సమతలంగా, నున్నగా, పొడుగ్గా వుండే నాలుక మంచి లక్షణం, ధనికుల ముఖాలు కొంచెం కోలగానూ, నిర్ధనుల వదనాలు పొడవుగానూ, రాజుల ముఖాలు, సౌమ్యంగా, బలంగా, నున్నగా, మలరహితంగానూ వుంటాయి. పాపకర్ముని మొగము భయాక్రాంతంగానూ, ధూర్తుని వదనం నలుపలకలుగానూ వుంటాయి. దింపుడు ముఖాలు పుత్రహీనులకూ, చిన్నముఖాలు పీనాసులకూ ఉంటాయి. భోగుల ముఖాలు, సుందరంగానూ, కాంతివంతంగానూ, కోమలంగానూ, మీసాలతోనూ వుంటాయి.

చోరవృత్తిని ఇష్టపడే పురుషుని ముఖం నిస్తేజంగా, ముడుచుకున్నట్లుండి, ఎఱ్ఱని మీసాలతో ఎఱ్ఱని గెడ్డంతో వుంటుంది; స్త్రీముఖంలో గెడ్డం, మీసాలు వుండవు. చిన్న చెవులూ, ఎఱ్ఱని, పెద్ద వెంట్రుకలూ గలవారు పాపకర్మం చేస్తూ మృతి చెందుతారు. శంకువు ఆకారంలో చెవులున్నవారు రాజులౌతారు గానీ చెవులలో ఎక్కువ వెంట్రుకలు మొలిస్తే శీఘ్రమరణముంటుంది. పెద్ద చెవులవారు ధనికులౌతారు. గండస్థలం క్రిందికున్నవారు భోగులౌతారు; పూర్ణంగా, సుందరంగానున్నవారు మంత్రులవుతారు.

సుందరమైన నాసిక గలవారు సుఖజీవనులవుతారు. శుష్కించినట్లున్న ముక్కు గలవారు దీర్ఘాయువులవుతారు. ముక్కు చివరి భాగం భిన్నంగా వుండి, నూతి ఆకారంలో నాసిక గలవారు అద్భుత లక్షణాలుండి, ఎవరికీ అందని వారి పొందును పొందగలుగు తారు. పొడవాటి ముక్కున్నవారు సౌభాగ్యసంపన్నులూ, కుంచించుకుపోయిన నాసిక గలవారు దొంగలూ కాగలరు. చప్పిడిగా అణగిపోయి వున్న ముక్కు అకాలమృత్యు సూచకము. కుడివైపు కాస్త వంగియున్న ముక్కు క్రూరత్వానికి చిహ్నము. చిన్న చిన్న గోళాలతో, సాపుగా, సొంపుగా వుండే నాసిక చక్రవర్తి కుంటుంది.

వక్ర ఉపాంతభాగాలతో నుండి, పద్మపత్రము వలె సుందరంగా మెరిసే నేత్రాలు సుఖజీవనులకుంటాయి. పిల్లి కళ్ళు పాపాత్ములకీ మధు పింగళవర్ణంలో నేత్రాలు దురాత్ములకీ వుంటాయి. ఎండ్రకాయ కనుల వంటి కనులున్న వాడు(రు) క్రూర కర్ముడౌ (లౌ)తారు. ఆకుపచ్చటి కనులున్నవారు పాపకర్మలంటే ఇష్టపడతారు. ఏనుగు కన్నులున్నవారు సేనలను నడుపగలరు. గంభీర నేత్రాలు రాజ లక్షణం. స్థూలనేత్రాల వారు మంత్రులవు తారు. నీలికమలముల వంటినయనాలున్నవారు విద్వాంసులూ, నల్లకనులవారు సౌభాగ్యశాలులూ అవుతారు. మండలాకార నేత్రాలున్నవారు పాపాత్ములూ, ఎప్పుడూ దీనభావమే గోచరించే కనులున్నవారు దరిద్రులూ కాగలరు. సుందర విశాల నేత్రాలున్న వారు రకరకాల సుఖాల ననుభవిస్తారు. కళ్ళు ఎక్కువగా పైకి లేపేవాళ్ళు అల్పాయుష్కులౌ తారు. విశాలంగా వుండి పైకి లేచే కనులున్నవారు సుఖపడతారు.

కనుబొమ్మలు విషమంగా వుండే వారు దరిద్రులవుతారు. పొడవుగా, దట్టంగా, పెద్దగా ఎడం లేకుండా, వక్రంగా, ఉన్నతంగా వంపు తిరిగియున్న కనుబొమ్మలు గలవారు గొప్ప ధనికులై మహాభోగములననుభవిస్తుంటారు. మధ్యలో తెగినట్లున్న, ఖాళీ గల కనుబొమ్మలు నిర్ధనులకూ, బాగా వంగియున్న కనుబొమలు – అందని వారి పొందునంద గలిగే వారికీ వుంటాయి. అయితే, వీరికి పుత్ర సంతానముండదు.

నుదురు అర్ధచంద్రాకారంలో వుంటే చాలా మంచిది. అది తరగని ధన సంపదని సూచిస్తుంది. మస్తకం ముత్యంలాగా నుదురు విశాలంగా మెరుస్తూ వుంటే ఆచార్య పీఠం లభిస్తుంది. నుదుటిపై రక్తనాళాలు కనిపించరాదు. అది పాపకర్ముల లక్షణము. అస్పష్టంగా కనిపిస్తూ ఉన్నతంగా ఉండే నాడులతో స్వస్తిక ముద్రతో ఎత్తయిన, సుందరమైన లలాటం గలవారు ధనవంతులవుతారు. కిందికీ, లోనికీ వంగిన నుదురున్నవారు చెఱసాల పాలౌతారు.

ఎవరైనా నవ్వినపుడు కంపనం లేకుండా నవ్వితే వారిని శ్రేష్టులుగా గౌరవించవచ్చు. కన్నులు మూసుకొని నవ్వేవారిలో పాపాత్ములెక్కువ. మాటిమాటికీ అనవసరంగా నవ్వేవారిలో దుష్టులెక్కువ.

నూరేళ్ళాయుర్దాయం గలవారి మస్తకంపై మూడు రేఖలుంటాయి. నాలుగు రేఖలు రాజలక్షణం, ఆయుర్దాయం తొంబదియైదు. రేఖారహితమైన లలాట మున్నవారు తొంబది యేళ్ళు జీవిస్తారు. నుదుటి నిండా ముక్కలైన రేఖలున్నవారిలో వ్యభచరించే వారెక్కువ. నుదుటిపై వుండే రేఖలు చివరికంటా పోయి కేశాలను తగులుతుంటే, ఆ విధమైన రేఖలున్నవారు ఎనభై యేళ్ళు బ్రతుకుతారు. అయిదు, ఆరు లేదా ఏడు రేఖలున్నవారు

యాభై యేళ్ళే జీవిస్తారు. ఏడు కన్న నెక్కువ గీతలున్న వారిలో నలభై సంవత్సరాలు బతికే వారే ఎక్కువ.

బల్లపరుపుగా, అణగినట్లుగా తల వుండే వారికి పితృవియోగం చాలా వేగంగా సంభవిస్తుంది. కుండ ఆకారంలో తల గలవారికి పాపం వైపే మనసు వెళుతుంటుంది. ఒక కన్నంలో నుంచి ఒక తలవెంట్రుకే మొలవడం మంచిది. తద్విపరీతం ధనక్షయకరం. అతిశయరూక్షత – అనగా మొరటుదనం ఏ అంగంలోనూ మంచిది కాదు. మరీ పేలవంగా, రక్తమాంసరహితంగా వుండే అంగాలన్నీ అశుభసూచకాలే. మానవశరీరంలో మూడంగాలు విశాలంగా, మరో మూడు గంభీరంగా ఒక అయిదు పొడవుగా చిన్నగా, ఆరు ఎత్తుగా నాలుగు పొట్టిగా, మరొకయేడు రక్తవర్ణంలో వుండడం శుభలక్షణాలు. ఈ లక్షణాలన్నీ కలవారు మహారాజులవుతారు.

నాభి, స్వరం స్వభావం – ఈ మూడూ గంభీరంగా వుండాలి. లలాటం, ముఖం, వక్షస్థలం విశాలంగా వుండాలి. నేత్రాలు, కక్షలు, నాసిక, మెడ, తల, దీర్ఘంగా ఎత్తుగా వుండాలి. జంఘలు, గొంతు, లింగము, పిరుదులు – పొట్టిగావుండాలి. నేత్రాంతాలు అనగా కనుకొలకులు, అరికాళ్ళు, నాలుక, పెదవులు – ఈ యేడూ రక్తవర్ణంలో వుండాలి. దంతాలు, వేళ్ళు, పర్వాలు, గోళ్ళు, కేశాలు – ఈ అయిదూ పొడవుగా వుండాలి. అలాగే స్తనాల మధ్యభాగమూ, రెండు భుజాలూ, దంతాలూ, నేత్రాలూ, నాసికా, దీర్ఘంగా వుండడం కూడా శుభలక్షణాలే."

స్త్రీల ప్రత్యేక లక్షణాలను సముద్రుడీ★ విధంగా తెలిపాడని విష్ణుభగవానుడూ సూతమహర్షి ప్రవచింపసాగారు.

"రెండు పాదాలూ నున్నగా, సమాన తలాలతో, రాగి రంగులో మెరుస్తూ వుండే గోళ్ళతో, చిక్కని వేళ్ళతో, ఉన్నత అగ్రభాగాలతో నుండుట మహారాజ్ఞీ లక్షణము. ఈ లక్షణమున్న స్త్రీని పెళ్ళాడినవాడు తప్పనిసరిగా రాజవుతాడు.

గూఢమైన చీలమండలూ, పద్మపత్ర సమానాలైన అరికాళ్లూ శుభలక్షణాలు. చెమట పట్టని అరికాళ్ళు శుభసూచకాలు. వాటిలో మీన, అంకుశ, ధ్వజ, వజ్ర, పద్మ, హల చిహ్నాలున్నామె రాణి అవుతుంది. రోమరహిత, సుందరశిరావిహీన, కోలజంఘలున్న స్త్రీ శుభలక్షణం.

---

★*ఈ శాస్త్రం సముద్రునిచే కొంత వ్రాయబడి మరింత క్రోడీకరింపబడి ఆయన చేతనే ప్రపంచానికి ప్రసాదింపబడిది కాబట్టి ఆయన పేరిటనే సాముద్రికశాస్త్రంగా ప్రసిద్ధి గాంచింది. అయితే దీనిని ప్రారంభించినవారు మాత్రం శివపుత్రుడైన కార్తికేయుడు. ఈ మహావిషయం భవిష్య పురాణంలో వివరంగా చెప్పబడింది.*

విస్తీర్ణ, పుష్టియుక్త, గంభీర, విశాల, దక్షిణావర్త, నాభీ,మధ్యభాగంలో త్రివళులూ ఉత్తమనారీ లక్షణాలు. రోమరహితంగా, విశాలంగా నిండుగా, పుష్టిగా, చిక్కగా, ఒకదాని కొకటి సర్వసమానంగా, గట్టిగా వుండే స్తనాలు ఉత్తమ జాతి స్త్రీకుంటాయి. గ్రీవం రోమరహితంగా, ఓష్టం, అధరం అరుణకాంతులమయంగా ముఖం గుండ్రంగా, పుష్టిగా, దంతాలు కుంద పుష్పసమంగా, గొంతు కోయిల గొంతులా, ముఖం దాక్షిణ్యభావ యుక్తంగా, కన్నులు కరుణ రసాన్ని చిప్పిలుతూ వుండే స్త్రీ సర్వజన పూజితకాగలదు. ఇతరుల సుఖాన్ని గుఱించే నిరంతరం ఆలోచిస్తూ, సాధింపులూ వేధింపులూ ఎలా చేయాలో, కనీసం, తెలియని స్త్రీని అంతా గౌరవిస్తారు.

నీలికమలాల వలె కళ్ళు, బాలచంద్రుని వలె వంపు తిరిగిన కనుబొమలు, అర్ధచంద్రాకారంలో నుదురు గల స్త్రీకి, సర్వసంపదలూ ముంగిట్లో వచ్చి వాలతాయి. సుందరంగా, సరిసమానంగా పుష్టిగా వుండే చెవులు శుభలక్షణాలు. దట్టంగా వుండే కనుబొమ్మలూ, ఎండినట్లుండే చెవులూ శుభలక్షణాలు కావు. సున్నగా, మృదువుగా, మెత్తగా, నల్లగా, ఉంగరాలు తిరిగేజుట్టు ప్రశస్త లక్షణం. అరచేతిలో గాని, అరికాలిలో గాని అశ్వ, హస్తి, శ్రీ, వృక్ష, యూప, బాణ యవ, తోమర, ధ్వజ, చామర, హార, పర్వత, కుండల, వేది, శంఖ, చక్ర, పద్మ, స్వస్తిక, రథ, అంకుశాది గుర్తులలో కొన్ని వున్న స్త్రీలు రాజపత్నులౌతారు★. ***(అధ్యాయము - 65)***

# చక్రాంకిత శాలగ్రామ శిలలు తీర్థమాహాత్మ్యాలు అరవైసంవత్సరాల పేర్లు

దేవతలారా! చక్రాంకిత శాలగ్రామ శిలని పూజిస్తే సర్వశుభాలూ, సౌఖ్యాలూ కలుగుతాయి.

| శాలగ్రామంలో చక్రాల సంఖ్య | దానిపేరు |
|---|---|
| ఒకటి | సుదర్శన |
| రెండు | లక్ష్మీనారాయణ |
| మూడు | అచ్యుత |
| నాలుగు | చతుర్భుజ |

★ *సాముద్రిక శాస్త్రంలో సంభోగ శృంగారానికి సంబంధించిన అంగాల పరిమాణ స్వరూపాదుల లక్షణాలూ, స్వేదాది ద్రవాల వాసనల ద్వారా నిర్ధారింపబడే శుభాశుభాది లక్షణాలూ కూడా చెప్పబడ్డాయి. వీటిని ఇవ్వడం వల్లన అపార్థాలెక్కువౌతాయనే భయం వల్ల ఈ గ్రంథంలో నివ్వబడుట లేదు.*

| | |
|---|---|
| అయిదు | వాసుదేవ |
| ఆరు | ప్రద్యుమ్న |
| ఏడు | సంకర్షణ |
| ఎనిమిది | పురుషోత్తమ |
| తొమ్మిది | నవవ్యూహ |
| పది | దశాత్మక |
| పదకొండు | అనిరుద్ధ |
| పన్నెండు | ద్వాదశాత్మక |

పన్నెండు కన్న నెక్కువగా ఎన్ని చక్రాలున్నా ఆ శిలామూర్తి నామము అనంత భగవానుడే. సుందరమైన ఈ శాలగ్రామాలను పూజించినవారికి కోరికలన్నీ తీరుతాయి.

శాలగ్రామ, ద్వారకాశిలల సంగమముండే చోట ముక్తి కూడా వుంటుందని ఇలా చెప్పబడింది.

*శాలగ్రామ శిలాయత్ర దేవోద్వారవతీ భవః ।*
*ఉభయోః సంగమోయత్ర తత్ర ముక్తిర్నసంశయః ॥* (ఆచార 66/5)

హే శంకరదేవా! శాలగ్రామం, నైమిషం, పుష్కరం, గయ, నర్మద, చంద్రభాగ, సరస్వతి, పురుషోత్తమ క్షేత్రం, మహాకాలుడధివసించియున్న ఉజ్జయని – ఈ తీర్థాలన్నీ అన్నిపాపాలనూ నశింపచేసి భక్తి, ముక్తి ప్రదాయకాలవుతున్నాయి★.

ఇక నామసార్థకాలైన మన అరవై సంవత్సరాల పేర్లను వినండి.

| | | | |
|---|---|---|---|
| ప్రభవ, | ప్రజాపతి, | యువ, | ప్రమాథి, |
| విభవ, | అంగిరా, | ధాత, | విక్రమ, |
| శుక్ల, | శ్రీముఖ, | ఈశ్వర, | విషు, |
| ప్రమోద, | భావ, | బహుధాన్య, | చిత్రభాను, |

★ *శాలగ్రామోద్వారకం చ నైమిషం పుష్కరం గయా ।*
*వారాణసీ ప్రయాగశ్చ కురుక్షేత్రం చ సూకరం ॥*
*గంగా చ నర్మదా చైవ చంద్రభాగా సరస్వతీ ।*
*పురుషోత్తమో మహాకాల స్తీర్థాన్యేతాని శంకర ॥*
*సర్వపాప హరాణ్యేవ భక్తి ముక్తి ప్రదానివై ।....* (ఆచార 66/6-8)

| | | | |
|---|---|---|---|
| స్వభాను, | జయ, | విశ్వావసు, | నల, |
| తారణ, | మన్మథ, | పరాభవ, | పింగల, |
| పార్థివ, | దుర్ముఖ, | ప్లవంగ, | కాల, |
| వ్యయ, | హేమలంబ, | కీలక, | సిద్ధార్థ, |
| సర్వజిత్, | విలంబ, | సౌమ్య, | రౌద్రి, |
| సర్వధారి, | వికార, | సాధారణ, | దుర్మతి, |
| విరోధి, | శర్వరి, | విరోధకృత్, | దుందుభి, |
| వికృతి, | ప్లవ, | పరిధావి, | రుధిరోద్గారి, |
| ఖర, | శుభకృత్, | ప్రమాది, | రక్తాక్షి, |
| నందన, | శోభన, | ఆనంద, | క్రోధన, |
| విజయ, | క్రోధి, | రాక్షస, | అక్షయ |

***(అధ్యాయం - 66)***

# స్వరోదయ విజ్ఞానం

మనిషి గొంతు ద్వారా చేసే కొన్ని కొన్ని శబ్దాలు, పలికే స్వరాలు కూడా కొన్ని కొన్ని కార్యాల శుభాశుభ ఫలితాలను సూచింపగలవు.

మానవ శరీరంలో వేల సంఖ్యలో నాడులుంటాయి. ఇవి నాభి ప్రదేశానికి దిగువగా వుండే కందస్థాన లేదా మూలాధారము నుండి బయలుదేరి శరీరమందంతటా విస్తరించి వుంటాయి. డెబ్బది రెండు వేల నాడులు నాభి మధ్య భాగంలోనే చక్రాకారంలో నిలచి వుంటాయి. వీటిలో వామ, దక్షిణ, మధ్యమ నామకాలైన మూడు శ్రేష్ఠ నాడులుంటాయి. వీటినే క్రమంగా ఇడా, పింగళా, సుషుమ్నా నాడులని వ్యవహరిస్తారు. వీటిలో వామ నాడి చంద్రుని వలెనూ దక్షిణ నాడి సూర్యుని వలెనూ, మధ్యమ నాడి అగ్ని వలెనూ ఫలాలనిస్తాయి. ఇవి కాలరూపిణులు.

వామనాడి అమృత రూప. ఇది జగత్తుని బ్రతికించే ప్రయత్నం చేస్తుంది. కాబట్టి దీనిని 'ఆప్యాయితా' అంటారు. దక్షిణ నాడి తన రౌద్రగుణం వల్ల జగత్తుని మాడ్చేస్తుంది.

అంటే శోషిల్లజేస్తుంది. శరీరంలో ఈ రెండు నాడులూ ఒకేసారి ప్రవహిస్తే అన్ని కార్యాలూ నాశనం కావచ్చు, మృత్యువే సంభవించవచ్చు.

యాత్రాదులకు బయలుదేరినప్పుడు వామనాడీ ప్రవాహమూ, ప్రవేశ సమయంలో దక్షిణ నాడీ ప్రవాహమూ శుభకారకములని గ్రహించాలి. చంద్రుని వలె జగత్తుకి కూడా ఆనందాన్ని కలిగించే కార్యాలను, సౌమ్యకార్యాలను ఇడా అనగా వామనాడి శ్వాసప్రవాహ కాలంలో జరపాలి. సూర్యసమాన, తేజస్వీ సమక్రూర కార్యాలను ప్రాణవాయువు పింగళ నాడి ద్వారా ప్రవహిస్తున్నపుడు చేపట్టాలి. యాత్రల్లో సర్వసామాన్య కార్యములందూ, విషాన్ని వదలగొట్ట వలసి వచ్చినపుడూ ఇడా నాడీ ప్రవాహం ప్రశస్తము. భోజనం, మైథునం, యుద్ధారంభాలలో పింగలనాడి సిద్ధిదాయకమవుతుంది. ఉచ్చాటన (మంత్ర) అభిచార కర్మలలోకూడా పింగల నాడి చలించాలి.

ముఖ్యంగా రాజులు మైథున, సంగ్రామ, భోజన సమయాల్లో శ్వాస కుడివైపున్న నాసికా రంధ్రంలోంచి బాగా ప్రవహిస్తోందో లేదో చూసుకోవాలి. అలాగే ఆయా అవసరాల్లో ఇడా నాడి ప్రవాహాన్నీ ఎప్పటికప్పుడు సరిచూసుకుంటూ వుండాలి. రెండు నాడులూ సమానంగా ప్రవహిస్తున్నపుడు ఏ ప్రముఖ కార్యాన్నీ మొదలెట్టకూడదు. విద్వాంసులైతే అటువంటి సమయాన్ని విషంతో సమానంగా పరిగణించి జాగ్రత్త పడాలి.

ప్రశ్నలు చెప్పేవారు అడిగేవారి నాడీ ప్రవాహస్థితిని గమనించాలి. తనకు శుభం కలుగుతుందా అశుభం కలుగుతుందా, లాభమొస్తుందా నష్టం వచ్చిపడుతుందా అని అడిగేవారికి అడుగుతున్నపుడు మధ్యమనాడి చలనంలో వుంటే అశుభమూ, నష్టమే కలుగుతాయి కాబట్టి జాగ్రత్తపడాలని చెప్పాలి. అదే, అదే సమయంలో ఇడా, పింగళనాడులు ప్రవహిస్తుంటే శుభం కలుగుతుందనీ, లాభమే వస్తుందనీ నిస్సందేహంగా చెప్పవచ్చును.

అలాగే అడిగేవారి గొంతుని బట్టి అది ఏ స్వరంలో వుందో ఆ స్వరం నాడీ మండలంలో ఎక్కడి నుండి వస్తోందో బాగా విచారించి సాధ్యాసాధ్యాలనూ, సిద్ధ్యసిద్ధులనూ పోల్చుకొనవచ్చును. దీనికి స్వరోదయ విజ్ఞానం తెలియాలి".

***(అధ్యాయం - 67)***

***(గరుడ పురాణంలో ఇటువంటి విజ్ఞానమొకటి కలదనే విషయం మాత్రమే సూచింప బడింది. ఈ అంశంపై కృషి చేయదలచుకున్న వారు నాడీగ్రంథాలను అవలోకించాలి)***

# రత్నాల పుట్టుక కథ వజ్ర పరీక్ష

"ప్రాచీన కాలంలో బలాసురుడను ఒక రాక్షసుడుండేవాడు. అతడు ఇంద్రాది దేవతలందరినీ యుద్ధంలో జయించి దేవతల అసమర్థతనీ తన త్రైలోక్యాధిపత్యాన్నీ లోకానికి చాటుకున్నాడు. బలాసురునికి ఇచ్చిన మాటను తప్పకూడదనే నియమం వుండేది. దేవతలు బ్రాహ్మణ వేషాలలో అతని వద్దకు పోయి తామొక యజ్ఞాన్ని తలపెట్టామనీ బలిపశువు కోసం ఆతనిని యాచించడానికి వచ్చామనీబలాసురుని బతిమాలుకున్నారు. అతడు వెంటనే వారికి కావలసిన బలిని తాను సమకూర్చగలనని మాట ఇచ్చాడు.వెనువెంటనే దేవతలు "నువ్వే కావాలి' అన్నారు. ఈ విధంగా తన వాగ్వ్రజానికి తానే బలి అయిపోయాడు బలాసురుడు.

బలాసురుని బలిదానం ఉత్తినేపోలేదు. లోకకల్యాణం జరిగింది. సామాన్యులు చేసే యజ్ఞానికే కీటకసంహారం,కాలుష్య నివారణం, నగరశాంతి వంటి లోకమంగళకర కార్యాలు జరుగుతాయి కదా, అలాంటిది ఇంద్రాదులంతటివారు ఒక మహాదాతను బలిపశువుగానే చేసిన యజ్ఞానికి సామాన్య ఫలితముంటుందా! ఒక లోకకల్యాణమేమి, త్రైలోక్య కల్యాణమే జరిగినది.బలాసురుని శరీరము ఈ విశుద్ధ కర్మ వలన పరమ విశుద్ధ శరీరముగా పరిణతి చెందినది. సత్త్వగుణ సంపన్నమై విరాజిల్లినది. అందలి అన్ని అంగములూ రత్నబీజములై ప్రపంచమునే సంపన్నము గావించినవి.

దేవతలు, యక్షులు, సిద్ధులు, నాగులు, ఆ బలాసురుని శరీరాన్ని ఆకాశమార్గంలో గొనిపోసాగినారు. ఆ యాత్రా వేగం వల్ల అతని శరీరం తనంతట తాను ముక్కలైపోయి పృథ్విపై అక్కడక్కడ పడినది.

సముద్రాల్లో, నదుల్లో, పర్వతాల్లో, వనాల్లో, మైదానాల్లో ఎక్కడెక్కడ రంచమాత్రమైనా (అత్యల్పపరిమాణం) ఆ మహాదాత శరీర శకలాలు పడ్డాయో, అక్కడక్కడ, రత్నాల గనులేర్పడ్డాయి.వాటి నుండి వెలికితీయబడిన రత్నాలకూ(వజ్రాలకూ) అద్భుత శక్తులున్నట్లు కనుగొనబడింది. రత్నాలలో వజ్రం, ముక్తిమణి, పద్మరాగం, మరకతం, ఇంద్రనీలం, వైదూర్యం, పుష్పరాగం, కర్కేతనం, పులకం, రుధిరం, స్ఫటికం, ప్రవాళం మొదలగు పేర్లతో ప్రత్యేక లక్షణాలతో ఇవి ప్రకాశిస్తున్నాయి. జ్ఞానపు ఆవలియొడ్డును చేరగలిగినంతగా తెలివిడి కలిగిన పారదర్శులు, విద్వజ్జనులు ఈ యా రత్నాలకు ఆయా పేళ్ళను వాటి వాటి లక్షణాలను, కలిమి ఫలాలను కూలంకషంగా విశ్లేషించి వివేచించి పెట్టారు.

ఈ విద్వాంసులు ముందుగా రత్నం యొక్క ఆకారం, రంగు, గుణం, దోషం, పరీక్ష, మూల్యాదుల జ్ఞానాన్ని తత్సంబంధిత సర్వశాస్త్రాలనూ అధ్యయనం చేసి దాని ఆధారంగా శుభాశుభాలను నిర్ణయిస్తారు. ఈ అధ్యయనం అరకొరగా వుంటే అశుభాలు కలుగుతాయి. ఇక్కడొక విచిత్రమేమిటంటే తప్పుడు రత్నాన్ని ధరించినవారికే గాక ఆ రత్నాన్ని పెట్టుకొమ్మని సలహా ఇచ్చిన వారికి కూడ దుష్ఫలితాలు కలుగుతుంటాయి. కాబట్టి శాస్త్రాన్ని క్షుణ్ణంగా చదివిన తరువాతనే రత్నశాస్త్రులయ్యే సాహసం చేయాలి.

ఐశ్వర్యాన్ని కోరుకొనేవారు గాని ఇతరులు గాని బాగా పరీక్ష చేయబడిన, అత్యంత శుద్ధమైనవిగా ధ్రువీకరింపబడిన రత్నాలనే ధరించాలి. రాజులైతే అట్టి రత్నాలను సంగ్రహించి వుంచాలి. కొన్నింటిని కాలానుగుణంగా ధరించాలి.

ఇక రత్న ప్రభావాల విషయానికొస్తే సర్వ ప్రథమంగా మహాప్రభావశాలిగా చెప్పబడుతున్న వజ్రం గురించి తెలుసుకోవాలి.

బలాసురుని ఎముకలు ఎక్కడెక్కడైతే పడ్డాయో అక్కడ అవి వజ్రాలుగా నానా రూపాలలో ఏర్పడ్డాయి. హిమాచల, మాతంగ, సౌరాష్ట్ర, పౌండ్ర, కళింగ, కోసల, వేణ్వాతట, సౌవీర - అను పేర్లు గల ఎనిమిది భూభాగాలు వజ్రక్షేత్రాలుగా విలసిల్లుతున్నాయి. హిమాలయంలో పుట్టిన వజ్రాలు తామ్రవర్ణంలోనూ వేణుకాతటంలో ప్రాప్తించినవి చంద్ర సమాన శ్వేతకాంతులలోనూ, సౌవీర దేశంలో లభిస్తున్నవి. నీలకమల, కృష్ణమేఘ వర్ణంలోనూ, సౌరాష్ట్ర ప్రాంతీయ వజ్రాలు తామ్రవర్ణంలోనూ, కళింగ దేశీయ వజ్రాలు బంగారు రంగులోనూ వెలుగులను విరజిమ్ముతూ వుంటాయి. ఈ కోవలోనే చెప్పుకోతగ్గ కోసల దేశీయ వజ్రాల వర్ణం పసుపు పచ్చ కాగా పుండ్ర దేశీయ వజ్రాలు శ్యామల వర్ణంలోనూ మతంగ క్షేత్రపు వజ్రాలు లేత పసుపు రంగులోనూ వుంటాయి.

ఒక కొన్ని ప్రత్యేక లక్షణాలున్న వజ్రంలో నిత్యం ఎవరో ఒక దేవత నివసిస్తుండడం జరుగుతుంది. అత్యంత క్షుద్ర వర్ణం - అంటే ఒక రంగు ఉందని అనిపిస్తుంటుంది గాని అది ఏ రంగో తెలియనంత లేత రంగు తొలి లక్షణం. ప్రక్కలలో స్పష్టంగా కనిపించే రేఖ, బిందు మాత్రం నలుపు[1] కాక పదక, త్రాసదోషరాహిత్యం, పరమాణువంత తీక్ష్ణమైన ధార - ఈ లక్షణాలు దేవవాస వజ్రానివి.

వజ్రం యొక్క రంగుని బట్టి అందులో ఏ దేవతలుంటారో శాస్త్రంలో వుంది. ఆకుపచ్చ తెల్ల, పచ్చ, పింగళ, నల్ల, రాగి రంగుల వజ్రాల్లో క్రమంగా విష్ణువు, వరుణుడు, ఇంద్రుడు, అగ్ని, యముడు, మరుత్తులు ప్రతిష్ఠితులై వుంటారు.

---

[1] కాకిపాదం

ఏయే వర్ణాల వారికేయే రంగుల వజ్రాలు (ధరించుటకు) ప్రశస్తమో కూడా శాస్త్రంలో చెప్పబడింది. బ్రాహ్మణులకు శంఖ, కుముద, లేదా స్ఫటిక సమానశుభ్ర వర్ణమున్న వజ్రాలు ప్రశస్తం. క్షత్రియులు శశ (చంద్ర) వర్ణం లేదా బభ్రు-భూర వర్ణాలు లేదా కనుపాపల రంగులో నుండు వజ్రాలను ధరించడం మంచిది. వైశ్యులు కుంకుమ లేదా లేత అరిటాకు రంగులో వున్న వజ్రాలను పెట్టుకోవాలి. శూద్రులకు వెండి రంగులో నున్న వజ్రాలు శ్రేష్ఠం.

విద్వాంసులు రాజులకు ముఖ్యంగా రెండు రంగుల వజ్రాలు మిక్కిలి ప్రశస్తమనీ ఇవి మిగతా వర్ణాలకు అంతగా మేలు చేయవనీ చెప్తారు. జవావర్ణం (ఎరుపులో ఒక రకం?), పగడ సమానరక్తవర్ణం కలిపి వున్న వజ్రం లేదా మామిడిపండు రసం వంటి పసుపు రంగు వజ్రం రాజులకు లాభదాయకం.

వర్ణసాంకర్యం రత్నాల విషయంలో కూడా మంచిది కాదు. పైగా దుఃఖదాయిని.

రంగును చూసి అంతమాత్రాననే తృప్తిపడిపోయి రత్న సంచయాన్ని చేయరాదు. అంటే ఆబగా ఇంటికి తెచ్చేసుకోకూడదు. ఎందుకంటే దోషయుక్త రత్నాలు ఇంటికి హానిని చేస్తాయి. మంచి గుణాలున్న రత్నాలైతేనే ఇంటికీ అందులోని వ్యక్తుల వంటికీ ఆరోగ్యాన్నీ ధనాన్నీ తేగలవు. వజ్రాన్ని జాగ్రత్తగా చూసి ఎక్కడా పగులుగాని, కొమ్ముల వద్ద విరుగుగానీ, బీటలుగాని లేకుండా వుంటేనే తేవాలనే ఆలోచన పెట్టుకొని తదుపరి గుణాలను పరీక్షించాలి.

కోణాలు సూదిగా మొనదేలినట్లుండాలి, అగ్గిలో పుటం పెట్టి అప్పుడే తీసినట్లే ఎప్పుడు చూసినా వుండాలి, మరకలుండకూడదు. ఒకవైపు గాని, మొనల్లో గాని దెబ్బతిని పోయి, పొడిరాలుతున్న వజ్రాన్ని ధరిస్తే స్వచ్ఛంద మరణాన్ని వరంగా పొందినవాడైనా సరే శీఘ్రం మృత్యువు నోట పడిపోతాడు. మధ్యలో బిందు చిహ్నాలు, నీటి చుక్కల వంటి ఆకారాలు కనబడే వజ్రాన్ని ధరిస్తే ఇంద్రుడంతటి వాడైనా దరిద్రుడైపోతాడు.

ఖానిక అనగా గని నుండి వచ్చిన షట్కోణ, అష్టకోణ, ద్వాదశకోణ, షట్పార్శ్వ, పార్శ్వ, ద్వాదశపార్శ్వ, షడ్ధారా, అష్టధారా, ద్వాదశధారా, ఉత్తుంగ, సమ, తీక్ష్ణాగ్ర- వంటి గుణాలు వజ్రాల సహజగుణాలు.

షట్కోణ, విశుద్ధ, నిర్మల, తీక్ష్ణ ధారగల, లఘు, సుందర పార్శ్వ భాగములున్న నిర్దోష (నిర్దుష్ట)మైన ఇంద్రుని వజ్రాయుధ లక్షణాలున్న వజ్రమొకటి అంతరిక్షంలో నున్నదని, అది సర్వోత్కృష్టమని దానిని భూమిపైకి తేవడం కష్టసాధ్యమని విద్వాంసులు చెబుతుంటారు.

తీక్ష్ణ, నిర్మల, దోషశూన్య వజ్రాన్ని ధరించేవాడు తన జీవనపర్యంతమూ ప్రతిదినమూ స్త్రీతో భోగించగలడు; సంపద, పుత్ర, ధన–ధాన్య, పశుసంపదలు నిత్యం వృద్ధి చెందు తుండగా బహుకాలం సుఖంగా జీవిస్తాడు. వానిపై ఎవరైనా సర్ప, విష, వ్యాధి, అగ్ని, జల, తస్కరాది ఆయుధాలను పంపినా, అభిచారమంత్రోచ్చాటనాది ప్రయోగాలను చేసినా అవి వానిని చూసి దూరం నుండే పారిపోతాయి. వానినేమీ చేయలేవు. కొన్ని ప్రత్యాగ మితాలై పోతాయి. అంటే ప్రయోగించిన వాని పని పడతాయి.

ఏ దోషమూ లేకుండా, ఇరవై బియ్యపుగింజల బరువుండే వజ్రం మిగతా వజ్రాల కంటె రెట్టింపు ధర పలుకుతుందని మణిశాస్త్ర పండితులంటారు. ఆ పరిమాణం, మూడోవంతు, సగభాగం, నాలుగోవంతు, పదమూడవ వంతు, ముప్పదవ, అరువదవ, నూరవ, వెయ్యవ వంతున్న వజ్రాలు – అలాగే పైన చెప్పిన వజ్రం కంటే అధిక భారమున్న వజ్రాలు కూడా వుంటాయి. వాటి విలువ వాటి బరువును బట్టే వుంటుంది. ఇక్కడ బియ్యపుగింజ కూడా ప్రత్యేకమైనది వుంటుంది. దాని బరువు ఎనిమిది ఎఱ్ఱ ఆవగింజల బరువుతో సమానమై వుండాలి.

ఏ దోషమూ లేని వజ్రాన్ని నీటిలో వేస్తే మునగదు, పైగా ఈతకొడుతున్నట్లుగా తేలుతూ ఆడుతుంది. అది రత్నాలన్నిటిలో సర్వశ్రేష్టము. దానిని ధరించుట శుభకరము.

దోషాలు దొరుకుతున్న కొద్దీ దానికి విలువ తగ్గిపోతుంటుంది. వాటిని కొని ధరించడం వల్ల నష్టం జరగవచ్చు. కొన్ని వజ్రాలు కాలక్రమాన దోషయుక్తాలవుతాయి. రాజు వాటిని వెంటనే ధరించడం మానివేయాలి. ఇతరులు ధరించవచ్చని కాదు కానీ ఆ వజ్రానికున్న శక్తి తగ్గిపోతుంది. రాజు అలాంటి వాటిని పెట్టుకోవడం కొనసాగిస్తే రాజ్యానికి మంచిది కాదు.

పుత్రాపేక్షతో వజ్రాన్ని ధరించే స్త్రీ ఇతరుల వలె రత్న శాస్త్రపారంగతుని మాత్రమే కాక తనకు అలవాటైన జాతకరత్నను కూడా సంప్రదించి ఆ పని చేయాలి. దోషయుక్తమైన రత్నాలను ధరించుటే దోషము. ఇక దాని వలన మంచి జరగాలనుకోవడం మృగతృష్ణలో నీరు త్రాగాలనుకోవడమే. వజ్రాల విషయంలో మోసం జరిగే అవకాశాలెక్కువ. కాబట్టి కూలంకష పరీక్ష మిక్కిలిగా అవసరమౌతుంది. నకిలీలు ఎక్కువ మెరుపును కలిగి వుంటాయి. కాని ఆ మెరుపు ఎంతో కాలముండదు కాని అప్పటికే ఆలస్యమైపోయి జరగవలసిన కీడు జరిగిపోతుంది.

క్షారద్రవ్యం ద్వారా, శాస్త్రోల్లేఖిత పద్ధతుల ద్వారా, శాణ ప్రయోగంతో వజ్రాలను పరీక్షించాలి. ఈ భూమిపై నున్న అన్ని రత్నాలపై లోహాది ఇతర ధాతువులపై వజ్రం గీత పెట్టగలదు. కాని వజ్రంపై గీతను పెట్టడం దేనికీ సాధ్యం కాదు, ఒక్క వజ్రానికి తప్ప.

పుష్పరాగాది జాతిరత్నాలు ఇతర జాతిరత్నాలపై గీతను గీయగలవు. కాని హీరకము, కురువిందము (మాణిక్యం) తమ జాతి రత్నాలనే గీయగలవు.

వజ్రాన్ని వజ్రమే కోయగలదు. స్వాభావిక వజ్రానికి మాత్రమే తన కాంతులను పైపైకి అనగా ఆకాశదిశగా ప్రసరింపజేసే శక్తి వుంటుంది.

ఇంద్రాయుధ చిహ్నాంకితములైన వజ్రాలు కొన్ని అరుదుగా వుంటాయి. వీటిపై ఆ గుర్తు స్పష్టంగానే కనిపిస్తుంటుంది. కేవలం ఇవి మాత్రమే... కోణాల వద్ద విరిగినా, బిందు, రేఖా చిహ్నాదూషితాలైనా తమ శ్రేష్ఠతను పూజ్యతను నిలబెట్టుకొనే వుంటాయి. అనగా వీటిని ధరిస్తే నష్టం జరుగకపోగా ఉద్దిష్ట ప్రయోజనాలన్నీ నెరవేరుతాయి.

మెరుపుతీగలలోని కాంతితో సముజ్జ్వలంగా వెలుగులను విరజిమ్మే వజ్రాలను ధరించే రాజు అతిశయ ప్రతాపవంతుడై జగదేకవీరుడై విలసిల్లగలడు. సమస్త సంతానాలతో వర్ధిల్లుతూ పెద్ద కాలముపాటు పుడమి నేలగలడు. ***(అధ్యాయం - 68)***

## ముత్యాలు - వాటిలో రకాలు
## లక్షణాలు - పరీక్షణ విధి

శ్రేష్ఠమైన ఏనుగు, మేఘం, వరాహం, శంఖం, చేప, పాము, వెదురు - వీటన్నిటి నుండీ ముత్యాలు వస్తాయి. అయినా శుక్తి అనగా ముత్యపు చిప్ప నుండి పుట్టు ముత్యాలే జగత్ప్రసిద్ధాలు.

రత్నమనిపించుకొనే స్థాయి ఒకే ఒక రకమైన ముత్యానికుంటుందని ముక్తాశాస్త్రం ఇది వివరిస్తోంది. అది ముత్యపు చిప్పలోనేపుడుతుంది. ఇదే సూదితో పొడిస్తే కన్నం పడుతుంది. మిగతావి పడవు.

వెదురు, ఏనుగు, చేప, శంఖం, వరాహాల నుండి వచ్చే ముత్యాలు మంగళకరమైన కార్యాలకు ప్రశస్తములని చెప్పబడింది. రత్ననిర్ణాయక విద్వాంసులు ఎనిమిది రకాల ముత్యాలను పేర్కొంటూ వాటిలో శంఖ, హస్తి ప్రభూతాలు అధమాలని వచించారు.

శంఖం నుండి పుట్టిన ముత్యం ఆ శంఖము యొక్క మధ్యభాగం రంగులోనే వుండి బృహల్లోల ఫలం పరిమాణంలో వుంటుంది. ఏనుగు కుంభస్థలం నుండి వచ్చే ముత్యం పసుపురంగులో వుంటుంది. వీటి ప్రభావం ఏమీ వుండదు. చేప నుండి పుట్టే ముత్యాలు ఆ చేపపై భాగం రంగులోనే వుంటాయి. అందంగా, గుండ్రంగా, చిన్నవిగా ఉంటాయి. సముద్రంలోనే ఎక్కువ భాగం జీవించే చేప యొక్క వదన భాగం ఈ ముత్యాల జనకస్థానం.

వరాహం నుండి వచ్చే ముత్యాలు ఆ వరాహం దంత మూలాల రంగులోనే వుంటాయి. అయితే ఈ వరాహాలు మనకెప్పుడూ దర్శనమిచ్చే నల్ల ఊరపందులు కావు. ముక్తాజనకమైనది ఎక్కడో ఎప్పుడో అరుదుగా దొరికే శ్వేతవరాహరాజము.

వెదురు కణుపుల నుండి పుట్టే ముత్యాలు వడగళ్ళలాగ స్వచ్ఛ సముజ్జ్వల తెలుపు మెరుపుల కాంతులతో శోభాయమానంగా వుంటాయి. ఈ ముత్యాలకు జన్మనిచ్చే వెదుళ్ళు ఎక్కడో దివ్య, జనులను సేవించుకోవడానికి వారున్నచోటనే పుడతాయి గాని సామాన్యులకు దొరకవు.

సర్పముత్యాలు కూడా చేప ముత్యాల వలెనే విశుద్ధంగా వృత్తాకారంలో వుంటాయి. కత్తుల చివరల కాంతుల వలె అద్భుతంగా మెరుస్తాయి. పాము పడగలపై, అదీ అత్యున్నత జాతి నాగుల వద్దనే, దొరికే ఈ ముత్యానికి గొప్ప శక్తి వుంటుంది. దీనిని ధరించేవాడు అతిశయ ప్రభాసంపన్నుడై, రాజ్యలక్ష్మీయుక్తుడై, దుస్సాధ్యమైన ఐశ్వర్యానికధిపతియై తేజస్విగా, పుణ్యవంతునిగా వెలుగొందుతాడు.

ఈ ముత్యాన్ని రత్నశాస్త్రంపై ప్రపంచంలోనే సంపూర్ణ అధికారమున్న విద్వాంసుని చేత పరీక్ష చేయించి ఆయన తలయూచిన పిమ్మట శుభముహూర్తంలో నొక సమస్త విధి పూర్వక సంపన్నమైన భవనంపై స్థాపిస్తే ఆకాశం నుండి దేవదుందుభి ధ్వని వినిపిస్తుంది. దేవతల సంతోషం, ఆశీర్వాదం స్పష్టంగా తెలుస్తాయి. ఎవని కోశాగారంలోనైతే ఈ సర్ప ముత్యంవుంటుందో వానికి సర్ప, రాక్షస, వ్యాధి, ప్రయోగాల ద్వారా మృత్యు భయముండదు.

మేఘంలో పుట్టే ముత్యాలు భూగోళం దాకా రానే రావు. ఖేచరులైన దేవతలే వాటిని ఒడిసి పట్టేసుకుంటారు. ఆ ముత్యాలకి దిక్కుల మూలల్లోని చీకట్లను కూడా పారద్రోలి అంతవఱకు మనకి కనిపించని చీకటి కోణాలని ఆవిష్కరించేటంత తేజస్సుంటుంది. సూర్య సమాన కాంతులతో ప్రకాశించే ఆ ముత్యం ఆకారం కూడా స్పష్టంగా ఆ వెలుగులో కనిపించడం కష్టం. ఈ మేఘమణి సర్వజన సామాన్యానికీ సమస్త శుభదాయకం. ఈ మణి వున్న చోటి నుండి నలుదిక్కులూ సహస్రయోజనాల దాకా విస్తరించిన క్షేత్రంలో ఏ అనర్థమూ జరగదు.

దైత్యరాజు, మహాదాని బలాసురుని ముఖము నుండి రాలినదంత పంక్తి నక్షత్ర మండలంలాగా ఆకాశంలో ప్రకాశిస్తూ విచిత్ర వివిధ వర్ణకాంతులను వెలారుస్తూ అలా అలా సముద్రంలో పడింది. ఈ సముద్రం అప్పటికే అశేష జలరాశికే గాక అమూల్య రత్న సంపత్ ప్రపంచాధిపతి. సోముని యొక్క షోడశ కళలతో నిండిన వెలుగులను, కాంతిని, శాంతిని తలదన్నే రత్నాలకు ఆకారము ఆ చంద్రునికే పుట్టినిల్లు, రత్నగర్భయైన

సముద్రము. సముద్రమే మహాగుణ సంపన్నాలైన సర్వరత్ననిధానము. అందులో పడిన బలాసురుని పలువరస ఒక కొత్త అమూల్య సంపదకు తెరతీసింది. ముత్యపు చిప్పగా అనంతర కాలంలో ప్రసిద్ధికెక్కిన శుక్తులలో ఈ పలువరుస వంశాభివృద్ధి జరుగుతోంది. ఈ ముత్యాలే సర్వశ్రేష్ఠములై మానవజాతిని సముద్ధరిస్తున్నవి. సాగర తీర దేశాలు, ద్వీపాలునైన సౌరాష్ట్ర, పరలోక, తామ్రపర్ణ, పారశవ, కుబేర, పాండ్య, హాటక, హేమక, సింహళ ప్రాంతాలు ముత్యాలకు కోశాగారాలు (ఖజానాలు)గా పరిణతిచెందాయి.

ముత్యమెక్కడ పుట్టినా ముత్యమే. ఇది సర్వత్ర సర్వాకృతులలోనూ లభిస్తుంది. పురాణ కాలంలో ఒక ముక్తాఫలం విలువ ఒక వేయీ మూడు వందల అయిదు ముద్రలు. అరతులం బరువున్న ముత్యం పైన చెప్పిన ధరలో అయిదింట రెండవ భాగము (2/5) తక్కువ. మూడు మాశలు అధికంగా బరువుండే ముత్యము. రెండువేల ముద్రలు. అనంతర కాలంలో విలువలు ఈ దిగువ కలవు.

(ఈ ధరవరుల పట్టిక క్రిందటి శతాబ్దిది. విష్ణువు గాని సూతుడు గాని చెప్పినది కాదు)

పూర్తిగా పెరిగిన పెద్ద పరిమాణంలో వున్న చిప్ప నుండి వచ్చిన ముత్యం పదమూడు వందల బంగారు కాసుల (సావెరిన్ల) ధర పలుకుతుంది. ఆరు బియ్యపు గింజల బరువున్నది 460 కాసులు చేస్తుంది. అత్యుత్తమ స్థాయికి చెంది, తొమ్మిది గింజల బరువున్న ముత్యం ధర రెండు వేల కాసులుంటుంది. రెండున్నర గింజల బరువున్నది 1300 కాసులు, రెండు గింజల బరువున్నది 800 కాసుల విలువ చేస్తాయి. అరగింజ బరువే వుండి మూడువందల కాసుల ఖరీదు చేసే ముత్యాలు కూడా వున్నాయి. ఉత్తమస్థాయికి చెంది, 720 మిల్లిగ్రాముల బరువుండే ముత్యం వెల రెండు వందల కాసులు. ద్రావిక అను పేరు గల శ్రేష్ట ముత్యమొకటుంది. దీని బరువు 50 మిల్లి గ్రాములు వెల 110 కాసులు. భావకమను పేరు గల ముత్యం 35 మిల్లిగ్రాములు, ధర 97 కాసులు. శిక్య అని చిన్న ముత్యాలుంటాయి. అవైతే ఒక్కొక్కటి పాతిక మిల్లిగ్రాముల బరువు, 40 కాసుల ధర. సోమ ముత్యము 15 మిల్లిగ్రాములు, 20 కాసులు. అలాగే కుప్యా అనే రకానికి చెందిన ముత్యం 8 లేక 9 మిల్లిగ్రాముల బరువుండి తొమ్మిది లేదా పదకొండు కాసుల ధర పలుకుతుంది. (కాసులనగా బంగారుకాసులైన సావెరిన్లే)

విశుద్ధత కోసం ముత్యాలను సాధారణ అన్నపుకుండలలో జంబీర రసం నింపి, అందులో వేసి ఉడికిస్తారు.తరువాత వాటి ఆకారాలను మలచి కన్నాలను కూడా వేసేస్తారు.

దీనికి ముందుగానే బాగా తడిపిన మట్టితో మత్స్య పుట పాకమును జోడించి, అందులో ముత్యాలను ఉడికించాలి. తరువాత మట్టికి బిడాల పుట పాకమును జోడించి

అందులో ముత్యాలను ఉడికించాలి. తరువాత వాటిని బయటికి తీసి పాలలో గాని నీటిలో గాని, మధు రసంలోగాని వేసి మరల వేడి చేస్తే అవి నున్నగా,మృదువుగా తయారవు తాయి. మంచి మెరుపు కూడా వస్తుంది. అపుడు స్వచ్ఛమైన వస్త్రంతో ప్రతి ముత్యాన్నీ గట్టిగా తోమాలి. చెప్పులను మెరుపు కోసం గుడ్డతో రాపిడి చేసేదాని కన్న నెక్కువగా వీటిని చేయాలి.(పాలిష్) వాటి మెరుపు రెండింతలు మూడింతలుగా పెరుగుతుంది. దోషాలన్నీ పోయి, గుణవంతమై సహజంగానే వుండే ముత్యం ఈ రకమైన శుద్ధి చర్యల వల్ల మరింత నయనానందకరమై పంకిలరహితమై శోభిస్తుంది. మహానుభావుడు, దయా మయుడు, లోకబాంధవుడునగు వ్యాడి అనే ఆచార్యుడు ఈ ముత్యాలపై జనులకు జ్ఞానాన్ని కలిగించాడు.

ఈ విధంగా రసశోధితమైన ముత్యం శుభ, సిద్ధి కారకమైన విశ్వాసపూర్ణాలంకారమై మానవశరీరాలపై అలంకారమై శోభిస్తుంది. సూర్యకాంతి సోకిన స్వచ్ఛమైన గాజులాగా మెరుస్తుంటుంది. స్వర్ణజటితమై వుంటే ఆ బంగారానికే ఒక కొత్త వెలుగునూ అందాన్నీ శోభన ప్రతిపత్తినీ ఇస్తుంది. ముత్యాన్ని బాగా శోధించి మంగళకారకం చేయడంలో సింహాళీయులదే సింహభాగం.

ఏదేనా ఒక ముత్యం మీద అనుమానము వస్తే దానిని స్నేహద్రవం (ముత్యానికి హాని చేయనిది) వేడిచేసి, దానిలో ఉప్పు కలపగా వచ్చిన ద్రావకంలో ఒక రాత్రంతా ఉంచివేయాలి. తెల్లవారినాక ఆ ముత్యాన్ని బయటికి తీసి పొడిగుడ్డలో చుట్టి శ్రద్ధగా మర్దన చేసినంత గట్టిగా తుడవాలి. అలా అరగంట పాటుచేసి తీసి చూస్తే ఆ ముత్యం ఏ మాత్రమూ వన్నె తగ్గకుండా నిన్నటిలాగే మెరుస్తుంటే అది మంచిముత్యమే.

ఇదివఱకు చెప్పబడిన ప్రమాణాలతో పెద్దదై, తెల్లగా, నున్నగా, స్వచ్ఛంగా, నిర్మలంగా, తేజస్సంపన్నంగా, సుందరంగా, గుండ్రంగా వుండే ముత్యం గుణసంపన్నమని శాస్త్రం వచిస్తోంది. ముత్యం అమ్ముడు పోయినా, పోకున్నా ఆనందాన్నే కలిగిస్తుంది. అమ్ముకుంటే డబ్బులొస్తాయి. అమ్ముకోకుండా వాడుకుంటుంటే దానికి గల అతీత శక్తుల వల్ల ఐశ్వర్యానందాలు కలుగుతూనే వుంటాయి.

సర్వసులక్షణ లక్షిత జాతయైన ముత్యము ఒక మారు ఒక మనిషి పూర్వజన్మ సుకృతం కొద్దీ అతన్ని చేరిందంటే అతనిని ఏ విధంగానూ చెడిపోనీయదు, బాధపడనివ్వదు, అనర్థోత్పాదక శక్తులనతని దరి చేరనివ్వదు, దోష సంపర్కం కలుగనివ్వదు. ఇదీ మంచి ముత్యము యొక్క మాహాత్మ్యము. ***(అధ్యాయం - 69)***

# పద్మరాగమణి - లక్షణాలు - పరీక్షావిధి

దేవతలపాలిటి మహాదాతయు, జగత్తికి సర్వరత్న ప్రదాతయునగు బలాసురుని రత్న బీజరూప శరీరం నుండి సూర్యభగవానుడు కొంత రక్తాన్ని తీసుకొని వెళుతుండగా వినీలాకాశమార్గంలో లంకపై నుండి పోతున్నపుడు లంకాధిపతియైన రావణుడు అడ్డగించాడు. వారి పెనగులాటలో ఆ రక్తం అలా క్రిందికి జారి లంకాదేశంలో ఒక నదిలో పడిపోయింది.

రావణగంగగా ప్రసిద్ధమైన ఆ నది బహు ప్రశస్తమైనది. అందలి జలాలు లంకలోని అద్భుత సౌందర్యవతుల నితంబాల నీడలతో నిత్య సంపర్కం గలగడం వల్లనో ఏమో గాని పరమ రమణీయాలుగా పేరు గాంచాయి. నారీరత్న సంచయసంగ్రాహకులలో రావణుని మించిన వారుండరేమో కదా! ఆ నది యొక్క రెండు తటాలూ పోకచెట్లతో సుశోభాత్ శోభితాలై వుంటాయి. ఆ నదిని అక్కడి వారు గంగతో సమాన పవిత్రంగా చూసుకుంటారు. ఉత్తమ ఫలాలనివ్వడంలో ఆ నది గంగకి తీసిపోదు.

అందులో బలాసురుని రుధిరగతాకర్షక శక్తి ఒక ఆకస్మిక ధనలాభం వలె చేరగానే ప్రతిరాత్రి రత్నాలెక్కడి నుండో వచ్చి ఆ నదీతటంపై స్థిరపడసాగినవి. వాటి యొక్క కాంతులు బంగారు బాణాల్లాగా నదిలో నుండి పైకీ వెలుపలి నుండి నదిలోకీ పరావర్తితం కాసాగినవి. ఆ నదిలో దొరికినవే పద్మరాగమణులు.

ఇవి సౌగంధికాలు కూడ. వీటిలో కురువిందజ రత్నాల, స్ఫటిక రత్నాల ఉత్తమ, ప్రధాన గుణాలన్నీ వుంటాయి. వాటి స్వరూపం ఎట్టిటి మెరుపుతో బంధూకపుష్పం, గుంజాఫలం, జపా కుసుమం, కుంకుమ, వీరబహూటి కీటవర్ణాలు, పలాశ పుష్పవర్ణం - ఇలా లేతగా కనీ కనిపించని ఎరుపు నుండి నలుపు కలిసిన చిక్కటి రక్తవర్ణం దాకా అన్ని ఎట్టని నీడలలోనూ అనగా చాయలలోనూ వుంటుంది. సిందూరం, నీలోత్పలం, రక్త కమలం, కుంకుమపూవు, లాక్షారసం రంగుల్లోనూ పద్మరాగం వుంటుంది. ఎంత చిక్కటి రంగులో నున్నా కాంతులు వెదజల్లుతూ వుంటుంది.

స్ఫటికం నుండి పుట్టిన పద్మరాగం సూర్య కిరణాలు సోకగానే ఎంత దూరం దాకానైనా అవిచ్ఛిన్నంగా అన్ని ప్రక్కలకూ తన కాంతులను విరజిమ్మగలదు. కొన్ని రత్నాల వర్ణాలు కుసుంభ నీల వర్ణాల మిశ్రితాల కలగలుపు కాంతులతో కంటికింపు గొలుపుతాయి. కొన్ని పద్మరాగాలు కొత్తగా వికసించిన కమలం వంటి శోభతో మెరుస్తాయి. కొన్ని భల్లంటక, కంటకారి పుష్ప సమానకాంతులను వెలారుస్తాయి. ఇంగువ చెట్టు పూల

రంగులో కొన్ని కళకళలాడగా, మరికొన్ని చకోర, పుంస్కోకిల, సారస పక్షుల కన్నుల కాంతులతో సమాన వర్ణాలలో వెలుగును వర్షిస్తుంటాయి. మొత్తానికి స్ఫటికోద్భూత పద్మ రాగాలలో కూడా గుణ ప్రభావాలు ఉత్తమంగానే వుంటాయి. రావణ గంగోత్పన్న మణులతో సమానంగానే వుంటాయి.

సౌగంధిక మణుల నుండి పుట్టిన పద్మరాగ మణులు నీలకమలాల రంగులోనూ ఎఱ్ఱ కలువల వర్ణంలోనూ వుంటాయి. కురువిందాల నుండి వచ్చిన వాటికి స్ఫటికోద్భూత పద్మరాగాలంత కాంతి వుండదు. అధికాంశ మణులలో కాంతి అంతర్నిహితమై అనగా లోపల్లోపలే వుంటుంది. అయినా ఆ రేఖా మాత్రపు బహిర్గత బహువర్ణ కాంతి బాహుళ్యమే మనుజులను మైమరపించగలుగుతోంది.

వర్ణాధిక్యం, గురుత, స్నిగ్ధత, సమత, నిర్మలత, పారదర్శత, తేజస్విత, మహత్త – ఇవన్నీ శ్రేష్టమణుల యొక్క గుణాలు. మణులు గరుకుగాను, పొడిపొడిగానూ, పరుషంగానూ, అక్కడక్కడ కన్నాలు పడి, వర్ణవిహీనంగా, ప్రభాహీనంగా, కడిగినా పోని మరకలతో వుంటే అవి దోషయుక్తాలని గ్రహించి వానిని కనీసం స్పృశించరాదు. ఎందుకంటే వాటిని ధరిస్తే వాటి దుష్ప్రభావం వల్ల ధరించిన వానిని శోకం,చింత, రోగం,మృత్యువు, ధననాశాది ఆపదలు చుట్టుముడతాయి.

అన్ని సద్గుణాలూ అబ్బిన పద్మరాగమణులు కూడా ఒక్కొక్కప్పుడు సర్వశ్రేష్ఠతా పదాన్ని అందుకోలేకపోవచ్చు. రత్నతులన చేయునపుడు కలాశపురం,సింహళం, తుంబరు, ముక్తపాణి, శ్రీపూర్ణక ప్రాంతాల నుండి వచ్చిన పద్మరాగమణులెంత జాజ్జ్వల్యమానాలైనప్పటికీ రావణగంగోత్పన్న పద్మరాగాలకంటె, తలవెంట్రుకవాసైనా, వాసి తక్కువగానే భావింపబడుతున్నాయి.

మలినవర్ణం వల్ల కలాశపుర పద్మరాగాలు, అల్పతామ్ర వర్ణ కారణంగా తుంబరు దేశీయాలు, కృష్ణ వర్ణపు కలిమిచే సింహళోత్పన్నాలూ, నీలవర్ణ, కాంతి విహీనతా వ్యాజానముక్త పాణి శ్రీ పూర్ణకీయ పద్మరాగాలూ స్వల్పంగా వాసి తక్కువ మణులుగా పేర్కొనబడుతున్నాయి.

వెలితి లేని ఎఱ్ఱదనం – అంటే గుంజబీజం (గురిగింజ)తో సమానమైన రంగుండే పద్మ రాగం అత్యుత్తమం. ఇది మెత్తగా వున్నట్లు చేతికి తగిలినపుడు అనిపిస్తుంది. కాని నొక్కి చూస్తే చాలా గట్టిగా వుంటుంది. నున్నదనంలో దీనికి సాటి లేదు. దానిని ఒక వైపు చేతితో నిమురుతుంటే రెండో వైపు రంగు మరింత చిక్కబడుతుంది. ఎక్కువసేపు వేళ్ళ మధ్య పెట్టుకొని రాపిడి చేస్తే కొంత రంగును కోల్పోయినట్లు కనిపిస్తుంది. రాపిడి

తీవ్రతరమైతే రంగును కొంతవఱకు కోల్పోవచ్చు. చేతబట్టుకొని పైకెగరేసి చూస్తే సూర్యకిరణాల చిక్కదనాన్ని బట్టి పద్మరాగం రంగులు మారుస్తుంది. ఒక్కొక్క ఎత్తులో ఒక్కొక్క రంగును ధరిస్తుంది. ఇవన్నీ ఉత్తమ రత్న లక్షణాలే కాని వీటిని గమనించేసి తొందరపడిపోకుండా రత్న పరీక్షకుని అభిప్రాయం తీసుకోవాలి. సాన కూడా పట్టించి చూడాలి. ఎందుకంటే ఉత్తమ రత్నాన్ని ధరించినవాడు ఏదో సరదాగా శత్రువుల మధ్యలోకి వెళ్ళినా ఆ రత్నము వానిని రక్షిస్తుంది. అదే దోషభూయిష్టమైన రత్నమైతే స్నేహితుల మధ్యలోనున్న వాడు కూడా ఆపదల పాలౌతాడు.

ఒకచోట పుట్టిన మణులన్నీ ఒకే ప్రభావాన్ని కలిగి వుంటాయనుకోరాదు. పోలికలుంటాయి; కాని భేదాలూ వుంటాయి. కాబట్టి రత్నాలను దేనికదిగానే కలివిడిగా కాకుండా విడివిడిగా రత్న పరీక్షకునికిచ్చి శోధన చేయించాలి. అత్యుత్తమ రత్నాన్ని అల్పప్రభావం గల రత్నాలతో కలిపి నిక్షేపించరాదు.

మహాగుణ సంపన్నములైన పద్మరాగాలను ఉడద ధాన్యపు గింజ పరిమాణాన్ని బట్టి పోల్చాలి. అనగా తులన, ఆకలన, చేయాలి. ***(అధ్యాయం - 70)***

# మరకతమణి - లక్షణాలు, పరీక్షా విధి

**నా**గరాజు వాసుకి బలాసురుని పిత్తాన్ని తీసుకొని ఆకాశాన్ని చీల్చేటంత వేగంతో దేవలోకం వైపు సాగి పోతుండగా అతని తలపై నున్న మణి ప్రకాశం క్రింద నున్న సముద్రంపై పడి సాగరానికి వెండి సేతువు అమరినట్లుగా కాంతులు పఱచుకొన్నాయి. సరిగ్గా అదే సమయానికి తన రెక్కల దెబ్బలతో భూమ్యాకాశాలను కలగుండు వఱచే వేగంతో పక్షిరాజు గరుత్మంతుడు వాసుకిపై దాడిచేశాడు.

వాసుకి భయపడిపారిపోతూ ఆ బలాసురుని పిత్తాన్ని ఒక పర్వత సానువు వద్ద నుంచి వెడలిపోయాడు. ఆ పర్వతంపై మధుర సుస్వాదజల స్రవంతులు ప్రవహిస్తున్నాయి. నవకలికలతో సాంద్రసుగంధ పరిమళాలను వెదజల్లుతున్న సౌగంధిక వృక్షాలు, ఎన్నో మాణిక్యాలు కూడా, తురుష్క దేశానికి దగ్గరల్లో నున్న ఆ పర్వతం కొండకోనల్లో కొలువున్నాయి. బలాసురుని పిత్తం ఆ నీటిలో కలసి సముద్రంలోకి ప్రస్థానించి మహాలక్ష్మి సమీపానికి★ దగ్గరగా పోగా, అది ప్రయాణించిన సరిత్తుల తీరాలలో నున్న భూమి మరకతమణులకు ఖజానా అయింది.

---

★ ***సముద్రం మహాలక్ష్మికి పుట్టిల్లు***

వాసుకి పరుగెడుతున్నపుడు అతని రక్షణలోనున్న బలాసురుని పిత్తం నుండి కొన్ని బిందువులు జారిపడుతుండగా గరుత్మంతుడు వాటిని అందుకొని పానం చేశాడు. వెంటనే ఆయనకి మైకం కమ్మేసినట్లుగా కావడంతో ఆయన దానిని వమనం (కక్కివేయుట) చేశాడు. ఆయన రెండు నాసికారంధ్రాల ద్వారా వెలువడి నేలపైబడిన ఆ పిత్తభాగము అద్భుత కాంతితో మెరిసే మరకతాలకు గనిగా మారింది. ఆ మహామణులు కోమలమైన చిలుక వన్నెలోనూ, శిరీష పుష్ప వర్ణంలోనూ, మిణుగుడు పురుగు వెనుకభాగం రంగులోనూ, హరిత తృణక్షేత్రంవలెనూ, నాచురంగులోనూ, సర్పభక్షిణి నెమలి కన్నుల వన్నెలలోనూ నవహరిత పత్రవర్ణంలోనూ మెరుస్తుంటాయి. ఇవి లోకకళ్యాణ కారకాలు. గరుత్మంతుని స్పర్శ వలనయోమో గాని ఇక్కడి మరకతమణులు సర్వవిషవ్యాధులనూ నశింపజేసే శక్తిని కలిగి వుంటాయి. అయితే ఇవి దుర్లభాలు; దొరకడం చాలా కష్టం. ఎన్నో మంత్రాలకూ, మరెన్నో ఔషధాలకూ లొంగని విషాలు కూడా గరుత్మంతుని మూలంగా వచ్చిన రత్నాలు తగలగానే పటాపంచలై పోతాయి.

గరుత్మంతునిచే, వాసుకిచే వదలబడిన బలాసురాత్మీయ భాగాలలో లభించునవే ఈ నాటికీ ప్రపంచంలో అత్యుత్తమ మణులుగా నెలకొనివున్నాయి. ఇవి చాలా చోట్ల నుండే వస్తున్నాయి గాని. ఏవైనా వాసుకి వదలిన, గరుత్మాన్ కదిలిన స్థానంలోపుట్టిన మణుల తరువాతనే.

రత్న విద్యా విశారదులైన విద్వజ్జనులు ఇలా వచిస్తారు. చిక్కటి ఆకుపచ్చని రంగులో కోమలకాంతులతో మెరుస్తూ, ముట్టుకొన్నా నొక్కినా గట్టిగా తగులుతూ, మధ్యభాగంలో బంగరుపొడి వున్నట్టుగా భ్రమింపజేస్తూ, సూర్యకిరణాలు గానీ వేరే ఉత్తమ కాంతులు గానీ సోకినపుడు మొత్తం మణి పచ్చగా మెరిసినా దాని మధ్య భాగం నుండి సూర్యసమాన కాంతులు ఉజ్జ్వలంగా వెలువడి తొలుతటి పచ్చదనాన్ని అధిగమించి వెలుగుతూ వుండే మరకతమణి గొప్ప ప్రభావం కలది. దానిని చూడగానే మన మనసులో ఏదో తెలియని ఆనందం ప్రవేశించి, వేళ్ళూనుకొని మనను పరవశింపజేస్తుంది. ఇంత అధికంగా మనకు ఆహ్లాదం కలిగించే శక్తి ఏ ఇతరమణికీ వుండదు. ఈ లక్షణాలున్న మరకత మణినే సకల సద్గుణవతిగా భావించాలి.

వర్ణం బాగా వ్యాపించడం వల్ల ఉత్తమమైన మరకతమణి అంతర్భాగం నిర్మల స్వచ్ఛకిరణాలతో కూడుకొని వుంటుంది; దాని ఉజ్జ్వలకాంతి చిక్కగా, శుభ్రంగా, కోమలంగా, స్నిగ్ధంగా వుంటుంది.

(పై లక్షణాలు, కాంతులు వుండి నీలకంఠం అంటే నెమలి కంఠం రంగులో మెత్తగా వుండే మరకతమణులు కూడా మంచివే)

చిత్రవర్ణంలో వుండి, కఠోరంగా, మలినంగా, రూక్షంగా, బండరాయిలాగా తగులుతూ శిలాజిత్తనే ఔషధంలాగా వేడిని నిర్గమింపజేస్తూ వుండే మరకతమణి దోషపూరితం. సంధి ప్రదేశంలో శుష్కంగా వుండి, మధ్యలో విరిగి మరొక మణిగా తయారైతే... అటువంటి మరకతాలను తెచ్చిపెట్టడంకాని పెట్టుకోవడం కాని చేయరాదు. భల్లాతకీ, పుత్రికాయని రెండు శైల విశేషాలున్నాయి. కొన్ని రత్నాలు వాటి రంగుల్లో గాని, వాటి కలగలుపు రంగుల్లో గాని వుంటాయి. అటువంటి మరకతమణులు మంచివి కావు. అయితే, పుత్రికా వర్ణం క్షౌమవస్త్రంతో గట్టిగా ప్రయత్నిస్తే తొలగిపోతుంది. కాని మణి చిన్నదై పోయి గాజులా సన్నగా వుంటుంది. అదీ మంచిది కాదు.

కొన్ని మణులకు ఔషధాలతో రంగును సృష్టించి తయారు చేయడం జరుగుతుంది. సహజ వర్ణాలున్న రత్నకాంతులు పైకి ప్రసరిస్తాయి. మందులు పూయబడ్డ రత్నాలను ఆభరణాలలో వాడడం వల్ల నష్టం లేదు కాని లాభం కూడా వుండదు. సహజత్వాన్ని నిర్ధారించే ఊర్ధ్వగామి కాంతులు కూడా ఒకే ఒక ఏటవాలుగా కోణంలో కనిపిస్తాయి. అవనత దృష్టికి అసలు కనిపించవు.

శుభఫలితాల కోసం మరకతాన్ని ధరించదలచుకున్నవారు స్నానం, ఆచమనం, రక్షామంత్ర విధివత్ జపం, గో-సువర్ణ దానాలు చేసి ధరించాలి. దోషాలు లేని గుణాలు కలిగిన బంగారు త్రాటిలో దీనిని పెట్టుకొని పెట్టుకోవచ్చు. అన్ని దేవ, పితృ కర్మలలో మరిన్ని మంచి ఫలాలకై మరకత మణిని ధరిస్తారు. విషపీడితులను ఆ పీడ నుండి రక్షించే శక్తీ, సంగ్రామంలో విజయాన్ని సమకూర్చే శక్తీ ఈ రత్నానికుంటాయి.

ఇది పద్మరాగమణికంటె అధికమూల్యాన్ని కలిగి వుంటుంది. ***(అధ్యాయం - 71)***

# ఇంద్రనీలమణి లక్షణాలు, పరీక్షా విధి

ఎక్కడ సింహళ దేశపు రమణులు లవలీ అనే సుగంధిత పుష్పాలతో వాటి వాసనలతో మనసును దోచే వృక్షాలనూ, పొగడలనూ తమ కరాగ్రాల స్పర్శచే కరుణిస్తుంటారో అక్కడ మహాదాత బలాసురుని వికసిత కమల సదృశ శోభలతో వెలిగే కన్నులు వచ్చి పడినవి. రత్న సమాన కాంతులీను ఆ నేత్రప్రభతో సముద్రతీరమంతా వెలుగులమయమై భాసించింది. అక్కడొక విశాలమైన క్షేత్ర మేర్పడింది. అక్కడే ఇంద్రనీలమణులకు గని కూడా ఏర్పడింది. అయితే అక్కడ అన్ని మణులూ లభిస్తాయి. ముఖ్యంగా అక్కడి మరకతమణులు అన్ని రంగుల్లోనూ వుంటాయి. - శ్రీ కృష్ణబలరాములు ధరించే పట్టుపంచెల

వలె పచ్చగా, నీలంగా, నల్ల తుమ్మెద రంగులోనూ, శారంగధనుర్యుక్తమైన విష్ణు భగవానుని భుజకాంతులతో, హాలాహలధరమైన శివుని కంఠం రంగులో కూడా వుంటాయి.

ఆ సాగర తీరానికీ అక్కడ పర్వతానికీ నడుమ నున్న క్షేత్రం ఎన్నో జాతి రత్నాలకు నెలవుగా మారింది. వాటిలో కొన్ని తేట నీటి తరంగాల తెలుపుతో ప్రకాశించగా కొన్ని మయూర వర్ణంలో దర్శనమిస్తాయి. మరికొన్ని నీటి బుడగల వలె నుండగా ఇంకొన్ని కోయిల గొంతు వలె నిగనిగలాడతాయి. వీటన్నిటిలోనూ సమానమైన నిర్మలతా, ప్రభాశక్తుల భాస్కరతా బలీయంగా వుంటాయి. అయితే, ఆ పర్వత రత్నగర్భంలో దొరికే అన్ని రకాల రత్నాలలోకీ పరమశ్రేష్ఠము, అత్యధిక గుణశాలియైనది ఇంద్రనీలమణి.

ఈ మణులలో మట్టిమరకలు, మలినాలు ఉండిపోయినవి, కరకరమని శబ్దం వచ్చేవీ, నీలాకాశాన్ని కప్పే నల్లమబ్బుల రంగున్నవి మంచివి కావు. అవి వర్ణదోషదూషితాలు. వీటి మధ్యలోనే రత్నశాస్త్ర కోవిదులు ప్రశంసలతో ముంచెత్తే ఇంద్రనీలమణులు ఎక్కువగా జన్మిస్తాయి.

పద్మరాగమణిని ధరిస్తే కలిగే సత్ఫలితాలన్నీ ఇంద్రనీలమణిని ధరించినవారికీ కలుగుతాయి. ఈ మణిలో కూడా మూడు జాతులు కనిపిస్తున్నాయి. మణి యొక్క రత్న పరీక్ష కూడా రెండింటికీ ఒక్కటే.

అగ్ని పరీక్ష మణి నిర్ధారణకి మాత్రమే చేయాలి గాని మణిని మరింత వన్నెచిన్నెలతో శోభిల్లేలా చేయడానికి అగ్నిలో పడవేయరాదు. దానివల్ల మొదటికే మోసం వస్తుంది. సద్గుణయుక్తమైన మణి దోషదూషితమై తనను అగ్నిలో అతిగా వేయించిన వానికీ వేసినవానికీ కీడును కలిగించవచ్చు.

గాజు, కలువ, గన్నేరు, స్ఫటిక, వైఢూర్యాది మణులు (ఇవన్నీ మణుల్లో రకాలే) ఇంద్రనీలమణి యొక్క పోలికలతో, గుణాలతో వున్నా కూడా రత్నశాస్త్రజ్ఞులు. ఇంద్రనీలమణి వైపే మొగ్గు చూపుతారు. అందుచేత వీటిని క్షుణ్ణంగా పరీక్షించాలి. ముఖ్యంగా గురుత్వ కఠినత్వాలను చూడాలి. ఇంద్రనీలమణికి మధ్యలో ఇంద్రాయుధమైన వజ్రాయుధం కనిపిస్తే ఇక దానిని మించిన రత్నమే లేదు.

ఒక ఇంద్రనీలమణిని తీసుకొని దానికి వందరెట్లు పరిమాణమున్న స్వచ్ఛమైన పాలలో పడేస్తే, ఆ పాలన్నీ నీలవర్ణంలోకి వచ్చివేస్తే అది అచ్చమైన మణి. దీనిని మహా నీలమణి అని కూడా అంటారు. ఎలాగైతే మాశాదులతో మహాగుణశాలియైన పద్మ రాగమణిని తూస్తారో అలాగే సువర్ణ పరిమాణ (ఎనభై రత్తీలు)ములతో మహా గుణశాలియైన ఇంద్రనీలమణిని తూస్తారు"

***(అధ్యాయం - 72)***

# వైదూర్యమణి - పరీక్షా విధి

*(వై'దూ'ర్యమనే మాటే తెలుగులో ఎక్కువగా వాడబడుతోంది. కాని సంస్కృత మూలం విదూర-జ, వైదూర్య)*

సూతుడిలా చెప్పసాగారు, "హే శౌనకాది మహామునులారా! వైదూర్యాది ఇతర మణులను అనగా వైదూర్య, పుష్ప, రాగ, కర్కేతన, భీష్మక మణులను గూర్చి బ్రహ్మదేవుడు మా గురువు గారికి చెప్పగా ఆయన నాకాజ్ఞానాన్ని ప్రసాదించారు.

బలాసురుని యొక్క నాదం ప్రళయకాల క్షుభిత సముద్ర ఘోషవలె నున్నపుడు దాని నుండి వివిధ వర్ణాలు గల, సౌందర్య సంపన్నములైన వైదూర్యాలుద్భవించాయి. బలాసురుని నుండి పుట్టిన మణి బీజము ఉత్తుంగ శిఖరాన్ని కలిగిన విదూరమను పేరు గల పర్వతానికానుకొనియున్న కామభూతిక సీమక్షేత్రంలో పడగా అదే రత్నగర్భగా మారింది.

ఈ వైదూర్యం మహాగుణసంపన్నం మూడు లోకాలలోనూ దీనికి పేరు ప్రతిష్ఠలున్నాయి. ఈ మణుల కాంతి ఎంత ఎక్కువగా వుంటుందంటే వాటి నుండి నిప్పురవ్వలు రాలుతున్నాయేమోననిపిస్తుంది.

పృథ్విపై పద్మరాగమణి ఎన్ని వర్ణాల్లో లభిస్తోందో వైదూర్యం కూడా అన్ని వర్ణాల్లోనూ దొరుకుతోంది. వీటిలో నెమలి కంఠం రంగూ, వెదురు పత్రం రంగూ వున్నవి శ్రేష్ఠాలుగా చెప్పబడ్డాయి. చషకనామక పక్షి వర్ణంలో వున్నవి ప్రశస్తం కావు.

గుణయుక్తమైన వైదూర్యం తన యజమానికి పరమ సౌభాగ్య సంపన్నునిగా చేయ గలదు. దోషయుక్తమణి తన యజమానిని కూడా దోష సంయుక్తుని గావిస్తుంది కాబట్టి ఈ మణి విషయంలో గట్టి పరీక్ష అవసరం.

కొండగాజు, శిశుపాల, గాజు, స్ఫటిక మణులు కూడా వైదూర్యం లాగే వుంటాయి. దాని వలెనే కాంతులను కూడా వెలారుస్తాయి. కానీ జాగ్రత్తగా పరీక్షిస్తే లేఖన సామర్థ్యం లేకపోవడం వల్ల గాజు, గురుత్వభావహీనత్వం వల్ల శిశుపాల, కాంతి భేదం వల్ల గిరిగాజు, సముజ్జ్వల వర్ణం వల్ల స్ఫటికమణీ వైదూర్యాలు కావని తేలిపోతుంది. ఎనభై రత్తీల బరువున్న ఇంద్రనీలమూ రెండు పలంల బరువున్న వైదూర్యమూ ఒకే ధర పలుకుతాయి.

కొన్ని రాళ్ళు రత్నాల కంటె అధికంగా మెరుస్తాయి కాని రత్నాలకుండే స్నిగ్ధత, మృదుత్వం లఘుత వాటికుండవు. పట్టిచూడాలే గాని ఇంకా ఎన్నో భేదాలు కనిపిస్తాయి.

మంచిమణులను సజాతీయమణులనీ, కాని వాటిని విజాతీయ మణులనీ రత్నశాస్త్ర పరిభాషలో వ్యవహరిస్తారు.

రత్నాల గూర్చి బాగా తెలిసిన వానిని ఉపయోగం ద్వారా తద్జ్ఞానాన్ని పొందిన వానిని మణిబంధకుడు, మణివేత్త అంటారు. వారు పరిశీలించి నిష్కర్షగా సజాతీయ మణి యేదో చెప్పగలరు. అటువంటి మణి సాధారణ మణి కంటే ఆరు రెట్లు ధర పలుకుతుంది. సముద్రతీరంలో ఆవిర్భూతమైన మణులకున్న విలువ భూమి నుండి ఇతర స్థానాల్లో తీయబడిన మణులు, సజాతీయాలైనా సరే, వాటికి వుండదు.

మనువు పదహారు మాశలు ఒక 'భారం'తో సమానమని నిర్ణయించాడు. దానిలో ఏడవ భాగమొక 'సంజ్ఞ'. నాలుగు మాశలు ఒక 'శాణ'. ఒక పలంలో పదోభాగం 'ధరణం'. అయిదు 'కృష్ణలాలు' ఒక 'మాశ' ***(అధ్యాయం - 73)***

# ఇతర మణులు

**(పుష్యరాగ, కర్కేతన, భీష్మక, పులక, రుధిరాక్ష, స్ఫటిక, విద్రుమ)**

**పు*ష్యరాగ (పుష్కరాగ) మణి*** బలాసురుని చర్మం హిమాలయ పర్వతంలో పడిన చోటినుండి ఉద్భవించింది. ఇది మహాగుణ సంపన్నం. సంపూర్ణ పీత, పాండుర వర్ణముల సుందరకాంతులను వెదజల్లు పుష్యరాగాన్నే పద్మరాగమణిగా వ్యవహరిస్తారు. అదే లోహిత, పీతవర్ణాల కాంతులను వెలారుస్తుంటే 'కౌకంటక'మని వ్యవహరిస్తారు. పూర్ణలోహిత వర్ణము, సామాన్య పీత వర్ణము సంయుక్తంగా వుండి మెరిసే పాషాణాలను 'కాషాయక' మణులంటారు. ఈ మణుల పూర్వరూపమైన పుష్పరాగమణి వైదూర్యముతో సమానమైన మూల్యాన్నే కలిగి వుంటుంది. ఫలితం కూడా పురుషుల విషయంలో సమాన ఉన్నత ఫలమే. స్త్రీలు పుష్యరాగాన్ని ధరిస్తే పుత్రప్రాప్తి నొందగలరు.

***కర్కేతనమణి*** పరమపూజ్యతమం. బలాసురుని రత్నబీజ స్వరూపాలైన గోళ్ళను వాయుదేవుడు అత్యంతాదరంతో గొనివచ్చి ప్రసన్నతాపూర్వంగా కమల వన ప్రాంతంలో వ్యాపింపజేశాడు. అవి పృథ్విపై కర్కేతన నామంతో జన్మించాయి. ఇవి రక్త, చంద్ర, మధు, తామ్ర,పీత, నీల, శ్వేత వర్ణాలలో లభిస్తున్నాయి. ఇన్ని రంగుల్లో దొరకడానికి కారణం రత్నవ్యాధి అనే దోషమని పెద్దల మాట. ఈ రత్నాలు కఠోరంగావుండడానికీ అదే కారణం.

సంతాప, వ్రణ వ్యాధులు రత్నాలకు కూడా వుంటాయి. ఆ వ్యాధి లేకుండా స్నిగ్ధ, స్వచ్ఛ, సమరాగ, అనురంజిత, పీత, గురుత్వ ధర్మాలతో నిండి, విచిత్ర వర్ణ కాంతులీను కర్కే తనమణి విశుద్ధ, పరమపవిత్ర మణిగా పూజలందుకుంటుంది.

స్వర్ణపాత్రలో సంపుటితం చేసి అగ్నిలో వేసి తీస్తే అత్యధిక దేదీప్యమాన కాంతులతో ప్రకాశించే మణి విశుద్ధకర్కేతనమణి. ఇది సర్వరోగాలనూ నశింపజేయగలదు; కలిదోషాన్ని నివారించగలదు; కులవృద్ధినీ కలుగజేయగలదు; సుఖమునూ ఇవ్వగలదు. ఈ కర్కేతనాలను ధరించినవారు పూజలందుకోగలరు; ధనాఢ్యులు కాగలరు; బంధు బాంధవ సంపన్నులు, ప్రసన్నులు కాగలరు. దూషిత కర్కేతనాన్ని ధరించరాదు. అలా చేస్తే, అంటే ధరిస్తే, సర్వ కష్టాలూ సంప్రాప్తిస్తాయి.

***భీష్మకమణి*** మహారత్నదాతయైన బలాసురుని వీర్యం హిమాలయ పర్వతప్రాంతాల్లో పడగా నేర్పడిన రత్నాకరంలో సముద్భవించింది. అక్కడి భీష్మకమణి శంఖ, పద్మ సమాన, సముజ్జ్వలములూ, మధ్యకాలీన సూర్య ప్రభాసమాన శోభలూ వెదజల్లుతూ వజ్రమంత తరుణంగా వుటుంది.

తమ కంఠంలో స్వర్ణసూత్రంలో ముడిపెట్టి ఈ విశుద్ధ భీష్మక మణిని ధరించినవారు సదా సుఖసమృద్ధితో సంపదల కలిమి కలుగగా జీవించగలరు. వీరు వనాలలో తిరుగుతున్నపుడు ఆ మణిని దూరం నుండే చూసి సింహ, వ్యాఘ్ర, శరభాది మహామృగాలూ, తోడేళ్ళవంటి హింస్రక జంతువులూ కూడా మరింత దూరం పారిపోతాయి. వారికి ఏ రకమైనా పీడా సోకదు; ఏ విధమైన భయమూ కలుగదు. మానవులు కూడా వారిని అపహాస్యం చేయడానికి గానీ నిందించడానికి గానీ జడుస్తారు.

ఈ భీష్మకమణినిపొదిగిన ఉంగరాన్ని ధరించి పితృకార్యం చేస్తే ఆ పితరులు కొన్నేళ్ళ దాకా గొప్ప సంతృప్తిని పొందుతారు. దీని ప్రభావం వల్ల సర్ప, వృశ్చికాదుల విషప్రభావం మణిధారి వంటికి ఎక్కదు. జల, శత్రు, చోర భయముండదు. నాచు మరియు మబ్బు రంగులోనుండి కఠోరమై, పచ్చటి కాంతులను వెదజల్లుతూ, మలినద్యుతినీ వికృతవర్ణాన్నీ కలిగియుండే భీష్మకమణిని దూరం నుండే చూసి మరింత దూరంగా తొలగిపోవాలి. అది అంత ప్రమాదకరం.

***పులకమణి*** కూడా వాయుదేవుని చలవే. ఆయన బలాసురుని గోళ్ళ నుండి భుజాల దాకా గల శరీరాన్ని విధ్యుక్తంగా పూజించి శ్రేష్ఠ పర్వతాలలో, నదుల్లో, ఉత్తర దేశంలోని కొన్ని ప్రసిద్ధ స్థానాల్లో స్థాపితం చేశాడు. దశార్ణ, వాగదర, మేకల, కళింగాది దేశాల్లో ఈ ప్రకాశరూపియైన బీజం నుండి వచ్చిన పులకమణులు గుంజాఫల, అంజన, మధు, కమలనాళ వర్ణాలలో వుంటాయి. గంధర్వ, అగ్ని దేశాలలో పుట్టిన పులకమణులు అరటి పండు రంగులో వుంటాయి. ఈ వర్ణమణులన్నీ ప్రశస్తాలే. కొన్ని పులకమణులు విచిత్ర భంగిమలతో శంఖ, పద్మ, భ్రమర, సూర్య ఆకారాలలో వుంటాయి. వీటిని ఒక పద్ధతి

ప్రకారం గుచ్చి మెడలో ధరిస్తే అసంఖ్యాకంగా సుఖాల్నీ, శుభాల్నీ కలుగజేస్తాయి. ఐశ్వర్యాభివృద్ధినీ ప్రాప్తింపజేస్తాయి. కొన్ని పులకమణులు మాత్రం మిక్కిలి భయంకరమైనవి. ముఖ్యంగా కాకి, గుఌం, గాడిద, తోడేలు, రూపాలతో నున్నవి, మాంసంతో రక్తంతో నున్న గ్రద్ద ముఖ సమాన వర్ణంలో నున్నవి మృత్యుదాయకాలే. శ్రేష్ఠ, ప్రశస్త ఏకపల మాత్ర భారమున్న పులకమణి ధర అయిదువందల ముద్రలు పలుకుతుంది.

**రుధిరాక్షరత్నం** అగ్నిదేవుని అనుకంప (దయ) వల్ల మనకు దక్కింది. దానవరాజు బలాసురుని శరీరంలోని కొన్ని అంశాలను నర్మదానదీ తీర ప్రాంతంలోనూ మరికొన్ని అంశాలను దానికి దిగువ భూములలోనూ స్థాపించిన అగ్నిదేవుడే మనకు రుధిరాక్షరత్నం లభించడానికి కారకుడు. ఎఱ్ఱగా చిలకముక్కు రంగులోనూ, ఇంద్రగోప కీటవర్ణంలోనూ ఈ మణులు దొరుకుతున్నాయి. కొన్ని తెల్లగా నుండి మధ్య భాగంలో పాండుర వర్ణంతో అత్యంత విశుద్ధంగా వుంటాయి. ఆ రుధిరాక్షలు ఇంద్రనీలమణితో సమానమైన శక్తులను కలిగి వుంటాయి. ఈ రత్నాలను ధరించేవారికి అన్ని ఐశ్వర్యాలూ, భృత్యాది అభివృద్ధులూ అబ్బుతాయి. దీనిని పాకక్రియ ద్వారా శోధన చేస్తే దేవ వజ్రంలా మెరుస్తుంది.

**స్ఫటికరత్నం** మనకు బలరాముడిచ్చిన వరం. ఈయన బలాసురుని మేధాభాగాన్నందు కొని కావేరి, వింధ్య, (నేటి చైనా), నేపాల ప్రాంతాల్లో ప్రయత్నపూర్వకంగా వెదజల్లాడు. ఆకాశ సమాన నీలవర్ణంలో తైల–స్ఫటిక అను పేరు గల రత్నాలు ఆయాప్రాంతాల్లో లభిస్తున్నాయి. ఇవి తెల్లకలువ, శంఖ వర్ణాల్లో వుంటాయి. ఈ ధవళ వర్ణమే కాక మరికొన్ని రంగుల్లో కూడా లభిస్తాయి. పాప వినాశనంలో ఈ మణికి సాటి లేదు. దీన్ని ధరిస్తే అన్ని పాపాలూ నశిస్తాయి. శిల్పకారులు దీనికి వెలకట్టగలరు.

***విద్రుమమణి*** ఆదిశేషునిచే భూలోకానికి ప్రసాదింపబడింది. ఈయన బలాసురుని అంత్రభాగాన్ని గ్రహించి కేరళాది దేశాలలో వదిలాడు. ఈ మహాగుణ సంపన్నమైన విద్రుమ మణుల్లో కుందేలు రక్తం రంగులోనూ, గుంజాఫల లేదా జపాకుసుమ సదృశ ఎఱ్ఱటి వర్ణంలోనూ వున్నవి. శ్రేష్ఠతమాలుగా పరిగణింపబడుతున్నాయి. నీల, దేవక, రోమక దేశాలు ఈ మణులకు జన్మభూములు. అక్కడి విద్రుమమణులు చిక్కటి ఎరుపులో ప్రకాశిస్తుంటాయి. అన్యస్థానాల్లో కూడా విద్రుమాలు దొరుకుతున్నాయి గాని అవి ప్రశస్తాలు కావు. శిల్పకళలో విశేషమైన నేర్పు గలవారే వీటికి వెల కట్టగలరు.

సుందరంగా, కోమలంగా, స్నిగ్ధంగా ఎఱ్ఱగా వుండే ఈ మణులను ధరించేవారికి ధనధాన్య సమృద్ధి కలుగుతుంది; అంతేకాక విషాదిక దుఃఖాలు దూరమవుతాయి" ఈ విధంగా వివిధ రత్నాలకు సంబంధించిన జ్ఞానాన్ని విష్ణువూ, బ్రహ్మ మనకు ప్రసాదించారు.

***(అధ్యాయాలు 74-80)***

# గంగాది తీర్థాల మహిమ

సూతుడు శౌనకాది మహామునులకు గరుడ పురాణాన్ని ఇంకా ఇలా చెప్పసాగాడు.

"శౌనకాచార్యాదులారా! ఇపుడు మీకు మన సమస్త తీర్థాలనూ వాటి మహిమనూ వినిపిస్తాను. అన్ని తీర్థాలలోనూ ఉత్తమము గంగ. గంగానది సర్వత్రా సులభమైనా హరిద్వార, ప్రయాగ, గంగా సాగర సంగమాల్లో దుర్లభం.

*సర్వత్రసులభాగంగా త్రిషుస్థానేషు దుర్లభా ॥*
*గంగాద్వారే ప్రయాగే చ గంగాసాగర సంగమే ।* **(ఆచార...81/1,2)**

మరణించేవానికి ముక్తినీ, బతికున్నవానికి భుక్తినీ కూడా ప్రసాదించే ప్రయాగ పరమశ్రేష్ఠ తీర్థం. ఈ మహాతీర్థంలో స్నానం చేసి తమ పితరులకు పిండ ప్రదానం చేసేవారు తమ తమ పాపాలన్నీ పూర్తిగా నశింపగా సర్వాభీష్ట సిద్ధిని పొందుతారు.

వారణాసి పరమతీర్థం. ఈ తీర్థంలో భగవంతులైన విశ్వనాథ, మాధవులు నిత్యం నివసించి వుంటారు. కురుక్షేత్రం కూడా గొప్పతీర్థం. ఇక్కడ దానాలు చేసినవారికి భోగమోక్షాలు రెండూ లభిస్తాయి. ప్రభాసం మరొక శ్రేష్ఠతీర్థం. ఇక్కడ భగవంతుడైన సోమనాథుడుంటాడు. ద్వారకాక్షేత్రమొక అత్యంత సుందరనగరం. ఇది భక్తిముక్తి ప్రదాయకం. తూర్పున నున్న సరస్వతీ తీర్థం సర్వపుణ్యదాయిని. ఇలాగే సప్తసారస్వతాలూ పరమతీర్థాలు.

కేదారతీర్థం సర్వపాప వినాశకం. సంభలగ్రామం మరొక ఉత్తమ తీర్థం. బదరి కాశ్రమం భగవానులైన నరనారాయణుల తీర్థం, ముక్తిదాయకం.

శ్వేతద్వీపం, మాయాపురి (హరిద్వార్) నైమిషారణ్యం, పుష్కరం, అయోధ్య, చిత్రకూటం, గోమతి, వైనాయకం, రామగిర్యాశ్రమం, కాంచీపురి, తుంగభద్ర, శ్రీశైలం, సేతుబంధరామేశ్వరం, కార్తికేయం, భృగుతుంగం, కామతీర్థం, అమరకంటకం, మహా కాళేశ్వరం (ఉజ్జయిని) కుబ్జకం (శ్రీధరహరి నివాసం) కుబ్జామ్రకం, కాలసర్పి, కామదం, మహాకేశి, కావేరి, చంద్రభాగ, విపాశ, ఏకామ్ర, బ్రహ్మేశ, దేవకోటకం, మధుర, మహానది (శోణం) జంబూసర నామకములైన మహాతీర్థాలలో సూర్య, శివ, గణపతి, మహాలక్ష్మి హరి మున్నగు దేవతలు నివసిస్తారు. ఇక్కడ గావించబడు స్నాన,దాన, జప, తప, పూజ, శ్రాద్ధ, పిండదానాది కర్మలు అక్షయ ఫలితాలనిస్తాయి. ఇలాగే శాలగ్రామ, పాశుపత తీర్థాలు కూడా భక్తుల అన్ని కోరికలనూ తీర్చే పవిత్ర స్థలాలు.

కోకాముఖ, వారాహ, భాండీర, స్వామి తీర్థాలను మహా తీర్థాలంటారు. లోహదండ తీర్థంలో మహావిష్ణువు, మందార తీర్థంలో మధుసూదనుడు నివసిస్తారు.

కామరూప మరొక మహాతీర్థం. ఇక్కడ కామాఖ్యాదేవి నిత్యం నివాసముంటుంది. పుండ్రవర్ధన తీర్థంలో కార్తికేయుడు ప్రతిష్ఠింపబడియున్నాడు. విరజ, శ్రీ పురుషోత్తమ, మహేంద్రపర్వతం, కావేరి, గోదావరి, పయోష్ణి, వరద, వింధ్య, నర్మదాభేద నామక మహాతీర్థాలు సర్వ పాపవినాశకాలు. గోకర్ణ, మాహిష్మతి, కలింజర, శుక్లతీర్థాలను కూడా మహాతీర్థాలుగానే సేవించాలి. ఇక్కడ స్నానం చేస్తే మోక్షం వస్తుంది. ఇక్కడ శంఖధారియైన హరి నివాసముంటాడు. స్వర్ణాక్ష మరొక ఉత్తమతీర్థం. ఇది భక్తులకు సర్వప్రదాయిని. నందితీర్థం ముక్తిదాయకం. కోటి తీర్థాల ఫలాన్ని ఇదొక్కటే ఇవ్వగలదు.

నాసిక, గోవర్ధన తీర్థాలు గొప్పవి.

కృష్ణవేణి, భీమరథి, గండకి, ఇరావతి, విందుసర, విష్ణు పాదోదకాలు పరమతీర్థాలు. ఇవన్నీ పరమ పుణ్యదాయకాలు. బ్రహ్మధ్యానం, ఇంద్రియ నిగ్రహం మహాతీర్థాలు. దమ, భావశుద్ధులు శ్రేష్ఠతీర్థాలు. జ్ఞానరూప సరోవరంలో ధ్యానరూప జలంలో, ప్రతి నిత్యం ప్రతిక్షణం మానస స్నానం చేయగలిగే వారి అజ్ఞానమనెడి, రాగద్వేషాదులనెడి మలం పూర్తిగా కడుక్కుపోతుంది. ఎవరి మటుకు వారే ఈ మనస్తీర్థాలను, ఈ మానసిక క్షేత్రాలను అభివృద్ధి చేసుకోవాలి.

తీర్థయాత్రలు చేయడం బహు పుణ్యప్రదం, మానసికానందకరం. పుణ్యమనేది తీర్థయాత్రలు వల్లనే రావాలని లేదు. 'సర్వం బ్రహ్మమయం' అనే భావనను స్వీకరించి నిత్యం అదే భావనలో వుండే వారెక్కడుంటే అదే తీర్థం. వారున్న చోటనే స్నాన, దాన, శ్రాద్ధ పిండప్రదానాది కర్మలకు మహాక్షేత్రాల్లో, తీర్థాల్లో చేసిన ఫలమే వస్తుంది. అక్షయ ఫలం కూడా ప్రాప్తిస్తుంది. సమస్త పర్వతాలూ, నదులూ, దేవతలూ, ఋషులూ, మునులూ, సంతులూ వుండే చోట్లు సర్వాలూ తీర్థాలే.

***ఇదం తీర్థమిదంనేతి యేనరా భేదదర్శినః ।***
***తేషాం విధీయతే తీర్థగమనం తత్ఫలం చయత్ ॥***
***సర్వం బ్రహ్మేతియోవేత్తి నా తీర్థం తస్య కించన ।***
***ఏతేషు స్నానదానాని శ్రాద్ధం పిండమథాక్షయం ॥***
***సర్వా నద్యః సర్వశైలాః తీర్థం దేవాదిసేవితం ।***

***(ఆచార...81/25-27)***

భగవంతుడైన హరి నివసించే చోటు శ్రీరంగ పట్టణం. తాప్తి ఒక శ్రేష్ఠమహానది. సప్తగోదావరి, కోణ గిరియు మహాతీర్థాలే. కోణగిరి తీర్థంలో స్వయంగా శ్రీ మహాలక్ష్మియే నదీరూపంలో విరాజిల్లుతున్నది. సహ్యాపర్వతంపై భగవానుడైన దేవదేవేశ్వరుడు ఏకవీర[1] రూపంలోనూ మహాదేవి సురేశ్వరి రూపంలోనూ నివసిస్తున్నారు.

గంగాద్వారం, కుశావర్తం, వింధ్య పర్వతం, నీలగిరి, కనఖల – ఈ పుణ్యతీర్థాలలో స్నానం చేసిన వారికి పునర్జన్మ వుండదు.

***గంగాద్వారే కుశావర్తే వింధ్యకే నీలపర్వతే ॥***
***స్నాత్వా కనఖలే తీర్థే (సభవేత్ న) *సభవేన్న పునర్భవే । (81/29,30)***

శ్రీహరి ద్వారా తీర్థ మాహాత్మ్యాన్ని తెలుసుకొని వచ్చిన బ్రహ్మ దక్ష ప్రజాపతి, వ్యాసమునీంద్రాదులకు గయ క్షేత్రాన్ని గూర్చి ఇలా వినిపించాడు. ***(అధ్యాయం – 81)***

# గయా మాహాత్మ్యము – శ్రాద్ధాది కర్మల ఫలము

గయా మాహాత్మ్యాన్ని వింటే చాలు 'ఇక్కడ' భుక్తికీ 'అక్కడ' ముక్తికీ లోటుండదు. ఇది పరమ సారస్వరూపం.

పూర్వకాలంలో గయ నామకుడగు అసురుడొకడు ఆ ప్రాంతంలో దేవతలను దగ్ధం చేయడానికేమో అన్నట్లుగా ఘోరతపము నాచరించసాగాడు. లోకాలు ఆ వేడికి భగభగ మండిపోసాగాయి. దేవతలు విష్ణువునాశ్రయించగా ఆయన ఆ దానవుడు తపస్సులో లేని విరామ సమయంలో గదాధరుడై వచ్చి వానిని సంహరించాడు. ఆ గయాసురుని అద్భుత తపశ్శక్తి వల్ల అది గొప్ప పుణ్యక్షేత్రమై విలసిల్లింది. స్వయంగా శ్రీ మహావిష్ణువే గదాధారియై అక్కడ నివసిస్తూ అక్కడికేతెంచిన వారికి ముక్తిని ప్రసాదిస్తూ వుంటాడు. గయాసురుని విశుద్ధ దేహంలోనికి త్రిమూర్తులు ప్రవేశించి అతని జన్మనీ, అతని పేరిట తామే వెలయించిన గయనీ మరింత పవిత్రం చేశారు. 'ఈతని దేహమే ఈ పుణ్యక్షేత్ర రూపంలో వుంటుంది. ఇక్కడ భక్తి పురస్సరంగా స్నాన, యజ్ఞ, శ్రాద్ధ, పిండ దానాది కర్మలను చేయువారు నరకానికి వెళ్ళరు. పైగా స్వర్గం గాని బ్రహ్మలోకం గానీ చేరుకుంటారు' అని శ్రీ మహా విష్ణువు కట్టడి చేశాడు.

సాక్షాత్తూ బ్రహ్మదేవుడే ఈ గయాతీర్థం సర్వశ్రేష్ఠమనే జ్ఞానం కలిగి, ఇక్కడొక యజ్ఞం చేశాడు. దాని నిర్వహణలో తనకు సాయపడిన ఋత్విక్కులైన బ్రాహ్మణులను

---

*సభవేత్ న

[1] ఏకవీరాదేవి పేరు

ఆయనే స్వయంగా పూజించాడు. అంతేకాక ఈ క్షేత్ర సందర్శకుల అవసరాలను తీర్చడానికి ఇక్కడ రసవతి యను తియ్యటి తేట నీటిని ప్రసాదించే నదినీ, లోతు దొరకని నూతినీ, మరిన్ని జలాశయాలను, భక్ష్య, భోజ్య, ఫలాదులనిచ్చే ప్రకృతినీ, మరొక కామధేనువునీ సృష్టించాడు. చివరగా తనచే పూజించబడిన విద్వద్ బ్రాహ్మణులకు అయిదు క్రోసుల వైశాల్యంలో వ్యాపించియున్న ఈ క్షేత్రాన్ని దానం చేసి వెళ్ళాడు. (అయిదు క్రోసులంటే నేటి లెక్కలో 15 కిలోమీటర్లు)

కాని ఆ బ్రాహ్మణులు అశ్రమగా వచ్చిన ధనాదుల వల్ల బద్ధకస్తులై పోయి కర్మలను తగ్గించారు బ్రహ్మకు కోపం వచ్చి ఇలా శపించాడు, బ్రాహ్మణులారా! మీరు మీ కర్తవ్యాన్ని మఱచారు కాబట్టి ఇకపై ఇక్కడ  కామధేనువుండదు. మీ నుండి మూడవతరం నాటికి మీ వైదిక పాండిత్యం, బ్రహ్మజ్ఞానం, ధనం ఇవేమీ మిగలవు. ఈ పర్వతాలు రాతి పర్వతాలుగానే మిగిలిపోతాయి; భక్ష్య భోజ్య ఫలదాయకాలు కాకుండా పోతాయి' అని శపించడంతో బ్రాహ్మణులు పశ్చాత్తప్తులై వేడుకోగా 'ఈ క్షేత్రంతోబాటు మీరూ అభివృద్ధి చెందుతారు. ఇక్కడి కర్మల వల్ల కర్తలకూ మీకూ కూడా శ్రద్ధాభక్తులు ప్రాతిపదికగా బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది. ఈ క్షేత్రం ముక్తి సాధనం అవుతుంది' అని దీవించాడు.

***బ్రహ్మజ్ఞానం గయాశ్రాద్ధం***
***గో గృహే మరణం తథా ।***
***వాసః పుంసాం కురుక్షేత్రే***
***ముక్తిరేషా చతుర్విధా ॥*** ***(ఆచార ...82/25)***

సముద్రం నుండీ చిన్న చెలమ దాకా అన్ని తీర్థాలూ అదృశ్యం రూపంలో వచ్చి ఈ గయా క్షేత్రంలో స్నానం చేసి వెళతాయి. ఇక్కడ శ్రాద్ధకర్మలను ఆచరించేవారికి బ్రహ్మహత్య, సురాపానం, స్వర్ణచౌర్యం, గురుపత్నీగమనం, పాపాత్మ సాంగత్యం వంటి మహాపాతకాలన్నీ నశిస్తాయి.

***బ్రహ్మహత్యా సురాపానం***
***స్తేయం గుర్వాంగనాగమః ।***
***పాపం తత్సంగజం సర్వం***
***గయాశ్రాద్ధా ద్వినశ్యతి ॥*** ***(ఆచార...82/17)***

మృత్యువు తరువాతి సంస్కారాలు సమంగా జరుగని వారికీ, పాముకాటు వలన మరణించినవారికీ, పశు, చోరాదుల ద్వారా బలవన్మరణం చెందినవారికీ సామాన్యంగానైతే ఉత్తమ గతులుండవు. కానీ వారి వారసులు వారికి గయలో శ్రాద్ధాది కర్మలు శాస్త్రోక్తంగా చేస్తే ఆ పుణ్యం వల్ల బంధన ముక్తి కలిగి స్వర్గం ప్రాప్తిస్తుంది.

గయలో పిండ ప్రదానం ద్వారా కలిగే సత్ఫలితాలు వందకోట్ల సంవత్సరాలు చెప్పినా తరగవు.

కీకటదేశంలో గయ పుణ్యశాలి. అలాగే వనాల్లో రాజగృహం, భూములలో నదీజలాలతో తడిసేనీ పరమశ్రేష్ఠాలు.

గయకు తూర్పున ముండపృష్ఠ తీర్థమున్నది. అది నలుదిక్కులూ విస్తరించియున్నది. దాని విస్తృతి ఒకటిన్నర కోసులు. (ప్రస్తుత భాషలో నాలుగున్నర కిలోమీటర్లు. గయాక్షేత్ర పరిమాణం అయిదు కోసులు) గయాశిరం ఒక కోసు పరిమాణంలో వున్నాయి. ఇక్కడ పిండ దానం చేసిన వాని పితరులు శాశ్వత తృప్తి నొందుతారు.

*పంచక్రోశం గయాక్షేత్రం క్రోశమేకం గయాశిరః ।*
*తత్రపిండ ప్రదానేన తృప్తిర్భవతి శాశ్వతీ ॥* **(ఆచార 83/3)**

విష్ణు పర్వతం నుండి ఉత్తరమానసం దాకా గల భాగాన్ని గయా శిరమంటారు. దానినే ఫల్గు తీర్థమనీ వ్యవహరిస్తారు. ఇక్కడ పింద ప్రదానం పొందిన పితరులకు పరమగతి ప్రాప్తిస్తుంది. గయకి వచ్చినంతనే వ్యక్తి పితౄణముక్తుడవుతాడు.

*గయాగమన మాత్రేణ*
*పితౄణా మనృణో భవేత్ ॥* **(ఆచార...83/5)**

ఈ పవిత్ర క్షేత్రంలో సాక్షాన్మహావిష్ణువే పితృదేవతల రూపంలో విహరిస్తుంటాడు. పుండరీకాక్షుడు, జనార్దనుడునైన ఆ భగవన్మూర్తిని దర్శించినంతనే వ్యక్తులు ఋణత్రయ (దేవ,భూత, ఋషి) విముక్తులౌతారు. గయ సింహద్వారానికి నమస్కరించినా, రుద్ర కాళేశ్వర, కేదారనాథులను సందర్శించినా మనిషి భూత, అతిథి ఋణ విముక్తుడవుతాడు.

అక్కడ పితామహుడైన బ్రహ్మని దర్శిస్తే పాపవిముక్తీ, ప్రపితామహుని *దర్శిస్తే అనామయలోక ప్రాప్తీ కలుగుతాయి. అలాగే గదాధరుడైన విష్ణుమూర్తికి ప్రణామం చేస్తే పునర్జన్మ లేకుండా మోక్షమే ప్రాప్తిస్తుంది.

అక్కడి మౌనాదిత్య, కనకార్క మహాత్ములను దర్శించి బ్రహ్మను పూజించిన వారికి బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది. మౌనధారణ ఇక్కడి పూజా నియమాలలో నొకటి.

ఇక్కడ ప్రాతఃకాలమే లేచి స్నానాదికములను ముగించి సూర్యునిలో గాయత్రిని దర్శించి విధివిధానాలతో పూర్వసంధ్యను సంపన్నం చేసిన వారికి అన్ని వేదాలనూ చదివిన

---

* ***దర్శించడమనగా శ్రాద్ధకర్మ చేయుటయే.***

పుణ్యం లభిస్తుంది. అలాగే మధ్యాహ్నం సావిత్రిని, సంధ్యను పద్ధతి ప్రకారం ఉపాసించిన వారికి యజ్ఞం చేసిన ఫలం వస్తుంది. సాయంత్రం సూర్యశక్తి సరస్వతిని జపించి దర్శించి సంధ్య వార్చిన వారికి ఉత్తమ దానాలిచ్చిన పుణ్యం లభిస్తుంది.

గయలో నొక పర్వతంపై పరమశివుడు వెలసియున్నాడు. ఆయనను దర్శించిన వారికి పితౄణ (పితృఋణ అనే మాట సరి కాదు) విముక్తి లభిస్తుంది. అక్కడి ధర్మారణ్యంలో కొలువు తీరిన యమధర్మరాజును దర్శిస్తే అన్ని ఋణాలూ తీరిపోతాయి. అలాగే గృధ్రేశ్వర మహాదేవుని దర్శించినవారికి అన్ని బంధనాలూ తొలగిపోతాయి.

ధేనువనం (గోప్రచార తీర్థం) అను పేరుగల మహా తీర్థంలో ధేను దర్శనంచేసిన వారి పితరులకు స్వర్గలోకం ప్రాప్తిస్తుంది. ప్రభాస తీర్థంలో ప్రభాసేశ్వర నామంతో వేంచేసి యున్న పరమశివుని దర్శించినవారు పరమగతిని పొందగలరు. కోటీశ్వర, అశ్వమేధ తీర్థాలను దర్శించినవారికి ఋణాలన్నీ తీరిపోతాయి. అలాగే స్వర్గద్వారేశ్వర దర్శనం సర్వబంధ విముక్తకం.

ఇక్కడి ధర్మారణ్యంలో నున్న గదాలోల తీర్థాన్నీ అక్కడ కొలువున్న రామేశ్వర స్వామినీ దర్శించిన వారికి స్వర్గప్రాప్తి వుంటుంది. ప్రక్కనే కొలువైన బ్రహ్మేశ్వర స్వామిని సేవించిన వారికి బ్రహ్మహత్యాపాతకం నుండి విముక్తి లభిస్తుంది.

గయలోనే ముండపృష్ఠ తీర్థంలో వెలసిన మహాచండీదేవిని దర్శించిన వారి అన్ని వాంఛలూ నెరవేరుతాయి.

ఫల్గు తీర్థంలో ఫల్గు స్వామి, చండి, గౌరి, మంగళ, గోమక, గోపతి, అంగారేశ్వర, సిద్ధేశ్వర, గజస్వామి, గయాదిత్య, మార్కండేయేశ్వర భగవానులు వెలసియున్నారు. వీరి దర్శనం పితౄణ భంజకం. అలాగే ఫల్గుతీర్థంలో స్నానం చేసి అక్కడున్న గదాధర స్వామిని దర్శించినవారు పితరుల ఋణం నుండి విడివడతారు. భూమిపై నున్న అన్ని తీర్థాలూ సముద్రాలూ, సరోవరాలూ ప్రతిదినమూ వచ్చి ఫల్గు తీర్థాన్ని దర్శించి వెళతాయి. మొత్తం భూలోకంలో గయ, గయలో గయాశిరం, ఆ శిరంలో ఫల్గు తీర్థం శ్రేష్ఠ భాగాలు.

*పృథివ్యాంయాని తీర్థాని యే సముద్రాః సరాంసిచ ।*
*ఫల్గు తీర్థం గమిష్యంతి వారమేకందినే దినే ॥*
*పృథివ్యాం చ గయా పుణ్యాగయాయాంచ గయాశిరః ।*
*శ్రేష్ఠం తథా ఫల్గు తీర్థం తన్ముఖంచ సురస్య హి ॥* ***(ఆచార... 83/22,23)***

దీనికుత్తరాన కనకానది పారుతోంది. దాని మధ్య భాగంలో నున్న నాభి తీర్థానికి దగ్గరగా బ్రహ్మ సదస్తీర్థం నెలకొనివుంది. అది తనలో భక్తిశ్రద్ధలతో స్నానం చేసిన వారిని

బ్రహ్మలోకానికి పంపగలదు. ఆ ప్రాంతంలోనే గల హంస తీర్థస్నానం సర్వపాప వినాశకరం. కోటి తీర్థం, గయాలోలం, వైతరణి ఇంకా గోమక తీర్థం – ఈ తీర్థాలలో పితరులకు తర్పణాలిచ్చి శ్రాద్ధాలు పెట్టినవాడు తనతో బాటు తన ఇరువది యొక్క తరాల వారికి బ్రహ్మలోక ప్రాప్తిని కలిగించగలడు. బ్రహ్మ తీర్థ, రామతీర్థ, అగ్నితీర్థ (సోమతీర్థ) రామప్రాదిదీ తీర్థాలలో శ్రాద్ధం పెట్టిన వాని పితరులు బ్రహ్మ లోకానికి వెళతారు. ఉత్తరమానసీ తీర్థంలో శ్రాద్ధ కర్మలు చేసిన వారికి పునర్జన్మ వుండదు. దక్షిణ మానసీ తీర్థం బ్రహ్మలోకప్రదాయకం. స్వర్గ ద్వారా తీర్థమూ అంతే. భీష్మ పర్వతంపై శ్రాద్ధ కర్మలను పొందినవారు నరకాన్ని సులభంగా దాటిపోతారు. గృధ్రేశ్వర తీర్థమునందు పెట్టబడు శ్రాద్ధం పితౄణ ముక్తిదం.

ధేనుకారణ్యంలో శ్రాద్ధం పెట్టి తిలధేనువును దానం చేసి మరల స్నానమాచరించి అక్కడ వెలసిన ధేనుమూర్తిని దర్శించినవాడు నిస్సందేహంగా తన పితృజనులను బ్రహ్మలోకానికి చేర్చగలడు. ఇంద్ర, వాసవ, రామ, వైష్ణవ, మహానదీ తీర్థాలలో శ్రాద్ధానికీ అదే ఫలము. సూర్యోత్పన్న శక్తులైన గాయత్రి, సావిత్రి, సరస్వతుల పేరిట వెలసిన తీర్థాలలో స్నానాలు, తర్పణాలు, శ్రాద్ధకర్మలు, సంధ్యావందనాలు చేసినవాడు తన నూటొక్క తరాల పితరులను బ్రహ్మ లోకానికి గొనిపోగలడు.

ఇక్కడి బ్రహ్మ యోని తీర్థం మిక్కిలి ప్రత్యేకత గలది. ప్రశాంతమనస్కులై పితరులనే ఏకాగ్రచిత్తంతో ధ్యానిస్తూ ఈ తీర్థాన్ని నియమానుసారం దాటి పితృగణాలకూ దేవతలకూ తర్పణలిచ్చిన వారికి పునర్జన్మ వుండదు.

కాకజంఘా తీర్థంలో తర్పణలందుకొన్న పితరులకు అక్షయ తృప్తి కలుగుతుంది. ధర్మారణ్య, మతంగవాపీ తీర్థాలలో శ్రాద్ధాలు పెట్టిన మనుష్యునికి స్వర్గలోకం ప్రాప్తిస్తుంది. ధర్మకూప, కూపతీర్థాలలో చేసే కర్మలకు పితౄణ విముక్తి కలుగుతుంది. ఇక్కడి శ్రాద్ధాది కృత్యాలను ఈ మంత్రం చదువుతూ చేయాలి.

*ప్రమాణం దేవతాః సంతు లోక పాలశ్చసాక్షిణః ।*
*మయాగత్య మతంగేఽస్మిన్ పితౄణాం నిష్కృతిః కృతా ॥* **(ఆచార...83/36)**

రామతీర్థంలో స్నానం చేసి ప్రభాస, ప్రేతశిలా తీర్థాలలో శ్రాద్ధకార్యాలు చేసిన వాని పితరులు పరమానందభరితులౌతారు. దీని వల్ల వాని నుండి ఇరువది యొక్క తరాలు ఉద్ధరింపబడతాయి. అలాగే ముండపృష్ఠాది తీర్థాల్లో కూడా ఈ కార్యక్రమాన్ని గావించినవారికి బ్రహ్మలోకమునకు తమ పితరులను గొనిపోయే శక్తి కలుగుతుంది.

గయాక్షేత్రంలో తీర్థంకాని చోటులేదు. అక్షయ ఫలాలూ బ్రహ్మలోక ప్రాప్తి అడుగడుగునా లభింపజేసే పుణ్యస్థాన సముదాయం గయ.

*గయాయాం నహి తత్స్థానం*
*యత్ర తీర్థం న విద్యతే ।*
*పంచక్రోశో గయాక్షేత్రే*
*యత్ర తత్ర తు పిండదః ॥*
*అక్షయం ఫల మాప్నోతి*
*బ్రహ్మ లోకం నయేత్ పితౄన్ ।* **(ఆచార...83/39,40)**

స్వపిండాన్ని జనార్దనుని చేతిలో పెడుతూ ఈ క్రింది మంత్రాన్ని పఠించాలి.

***ఏషపిండో మయా దత్త స్తవ హస్తే జనార్దన ।***
***పరలోకం గతే మోక్షమక్షయ్యముపతిష్ఠతాం ॥*** **(ఆచార...83/41)**

గయాక్షేత్రంలో నెలకొనియున్న ధర్మపృష్ఠ, బ్రహ్మసర, గయాశీర్ష, అక్షయ వట తీర్థాలలో పితరుల కోసం చేసే కర్మలన్నీ అక్షయ ఫలదాయకాలవుతాయి. ధర్మారణ్య, ధర్మపృష్ఠ, ధేనుకారణ్య తీర్థాలను దర్శించిన వ్యక్తి తన ఇరవై తరాలను ఉద్ధరించగలడు.

ఇక్కడి మహానది యొక్క పశ్చిమభాగాన్ని బ్రహ్మారణ్యమంటారు. దానికి తూర్పులో బ్రహ్మసదం, నాగాద్రి పర్వతం, భరతాశ్రమం వున్నాయి. భరతాశ్రమంలోనూ, మతంగ పర్వతం పైనా పితృకర్మలను చేయాలి.

గయాశీర్ష తీర్థానికి దక్షిణంలోనూ మహానదీ తీర్థానికి పశ్చిమంగానూ చంపక వనమొకటుంది. అందులో పాండుశిలయను తీర్థముంది. ఆ తీర్థంలో తదియనాడు పెట్టే శ్రాద్ధం పరమప్రశస్తం. ఆ తీర్థానికి దగ్గర్లో నిశ్చిరా మండల, మహాహ్రద, కౌశికీ ఆశ్రమాలున్నాయి. ఈ పవిత్ర తీర్థాల్లో చేయబడు శ్రాద్ధకర్మలు అక్షయఫలితాలనిస్తాయి.

వైతరణీ నదికి ఉత్తరంలో తృతీయా అను పేరుగల జలాశయమొకటుంది. అక్కడే క్రౌంచపక్షులు నివసిస్తాయి. ఇక్కడ శ్రాద్ధం పెట్టేవానికీ, పితరులకూ స్వర్గం లభిస్తుంది.

క్రౌంచపద తీర్థానికి ఉత్తరంలో నిశ్చిరా నామంతో ప్రసిద్ధమైన జలాశయముంది. అక్కడికి వెళ్ళి పిండ ప్రదానం ఒక్కమారు చేసిన వానికి జీవితంలో ఒక దుర్లభమైనదేదీ ఇక వుండదు. ఇక నిత్య నివాసం చేస్తూ అక్కడే వుండే వారెంత పుణ్యశాలులో కదా!

మహానది నీటిని స్పృశిస్తూ పితృదేవతలకి తర్పణాలిచ్చిన వానికి అక్షయలోకాల ప్రాప్తీ కలుగుతుంది; కుటుంబమూ ఉద్ధరింపబడుతుంది. ఇక సావిత్రి తీర్థంలో ఒకమారు సంధ్యావందనం చేసినవానికి పన్నెండేళ్ళు సంధ్యవార్చిన పుణ్యం దక్కుతుంది.

ఒక మాసం అనగా రెండు పక్షాలూ పూర్తిగా గయలో నివసించి పితృకార్యాలను సంపన్నంచేయువాడు తప్పక తనతో బాటు ఏడుతరాల వారినుద్ధరించగలడు. ఇక్కడి ముండపృష్ఠ, అరవిందపర్వత, క్రౌంచపాద తీర్థాలను సేవించిన వారి పాపాలన్నీ నశిస్తాయి.

గ్రహణాలలోనూ మకర సంక్రాంతినాడూ గయలో వుండి పిండప్రదానం చేస్తే వచ్చే ఫలితం ఎంత గొప్పదంటే దానిని మూడు లోకాల్లోనూ ఎవరూ ఎప్పుడూ పొంది వుండరు. అది అతి దుర్లభం.

మహాహ్రదం, కౌశికీ తీర్థం, మూలక్షేత్రం, గృధ్రకూట పర్వత గుహ – ఈ నాలుగు చోట్లా శ్రాద్ధ కర్మ చేసిన వారికి మహా ఫలాలబ్బుతాయి.

గయలోని మాహేశ్వరీలో మహేశ్వరుడైన శివుని యొక్క జటాజూటము నుండి బయలుదేరిన గంగ యొక్క ధార వచ్చి ప్రవహిస్తుంటుంది. ఆ పరమ పవిత్ర మాహేశ్వరీ ధార ప్రవహించే తీర్థంలో పితృకర్మ చేసినవారు ఋణ విముక్తులౌతారు. (విశాల గూర్చి తదుపరి అధ్యాయంలో వుంటుంది)

గయ వెళ్ళి తమకి పిండంపెడతాడనే ఆశయే మానవులను పుత్రసంతానం కోసం, అవసరమైతే యజ్ఞాలైనా చేసి, ప్రయత్నించేలా చేస్తుంది. గయకి వచ్చిన పుత్రుల వైపు లేదా పిండాధికారులవైపు పితరులు గొప్పగా మురిసి చూస్తుంటారు. 'ఇక మనకి నరకభయం లేద'నే ధీమా వారి మనసంతటా నిండి వుంటుంది.

*గయాప్రాప్తం సుతందృష్ట్వా పితౄణా ముత్సవోభవేత్ ।*
*పద్భ్యామపి జలం స్పృష్ట్వా అస్మభ్యం కిల దాస్యతి ॥* **(ఆచార...83/60)**

స్వంతపుత్రులూ, పిండాధికృతులైన వారే కాక అన్య వంశజులు కూడా మృతుల నామ గోత్రాలను చదివి శ్రాద్ధకర్మలను చేయవచ్చును. గయలోని గయాకూపమను పేరు గల పవిత్ర తీర్థంలో ఎవరి పేరిట పిండప్రదానము చేస్తే వారికే అందడమే గాక వారికి శాశ్వత బ్రహ్మగతిని కూడా ప్రాప్తింపజేస్తుంది.

*ఆత్మజోవా తథాన్యోవా గయాకూపే ।*
*యదాతదా ।*

*యన్నామ్నా పాతయేత్ పిండం తం*
*నయేద్ బ్రహ్మ శాశ్వతం ॥* **(ఆచార...83/61)**

గయలోని కోటితీర్థాన్ని దర్శించిన వానికి విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది. ఆ క్షేత్రంలోనే ముల్లోకాలలోనూ పేరున్న వైతరణి అను నది గలదు. అది గయలో పితరులకు

ఉత్తమ గతులను కలిగించడానికే బ్రహ్మచే భూమిపై అవతరించబడింది. శ్రద్ధగా పిండ ప్రదానాన్నీ, గోదానాన్నీ ఇక్కడ చేసినవారు తమతో సహా తమ ఇరువది యొక్క తరాలను ఉద్ధరించగలరు.

*యా సా వైతరణీనామ*
*త్రిషు లోకేషు విశ్రుతా ॥*
*సావతీర్ణా గయా క్షేత్రే*
*పితౄణాం తారణాయ హి ।* **(ఆచార...83/62,63)**

గయాతీర్థ యాత్రికులు బ్రాహ్మణులకు భోజనాలు పెట్టదలచుకున్నపుడు అక్కడ ఒకప్పుడు బ్రహ్మయజ్ఞం చేసినపుడు ఋత్విక్కులుగా వరించిన బ్రాహ్మణులకే అనగా, ఆ సంతతి వారికే భోజనాలు పెట్టాలి. ఆ బ్రాహ్మణులు గయలో బ్రహ్మపద, సోమపానక తీర్థాలలో వుంటారు. ఆ తీర్థాలు బ్రహ్మదేవునిచే నిర్మింపబడినవి. ఈ బ్రాహ్మణులను పూజిస్తే పితరులు స్వయంగా తామే పూజింపబడినట్లుగా భావించి తృప్తులౌతారు.

గయా తీర్థంలో హవ్యకవ్యాది పక్వాన్నాల ద్వారా అక్కడి బ్రాహ్మణులను విధ్యుక్తంగా సంతుష్టపఱచాలి. గయలో వృషోత్సర్గం (ఎద్దును స్వేచ్ఛగా వదలివేయుట) చేసిన వారికి నూరు అగ్నిష్టోమయజ్ఞాలు చేసిన ఫలం దక్కుతుంది. ఇక్కడ స్వపిండం వేసుకోవచ్చు. అది తిలరహితంగా వుండాలి. అన్యులకూ వేయవచ్చును.

*ఆత్మనోఽపి మహాబుద్ధిర్గయాయాంతు తిలైర్వినా ।*
*పిండ నిర్వాపణం కుర్యాదన్యేషామపి మానవః ॥* **(ఆచార... 83/69)**

ఒక వ్యక్తి తన జాతికి చెందిన ఎంతమంది పితరులకైనా బంధుబాంధవులకైనా, మిత్రులకైనా గయాభూమిలో విధిపూర్వకంగా పిండప్రదానాలను చేయవచ్చును.

ఇక్కడి రామతీర్థంలో స్నానం చేసిన మనుష్యునికి నూరుగోదానాల ఫలం దక్కుతుంది. మతంగ వాపిలోస్నానం చేస్తే సహస్ర గోదానాల ఫలం దక్కుతుంది. నిశ్చిరా సంగమంలో స్నానం చేసినవాడు తన పితరులను బ్రహ్మలోకానికి గొనిపోగలడు. వసిష్ఠాశ్రమంలో స్నానం చేసిన వానికి వాజపేయ యజ్ఞఫలం లభిస్తుంది. మహాకౌశికీ తీర్థంలో నివాసముంటే అశ్వమేధ యజ్ఞ ఫలం దక్కుతుంది.

బ్రహ్మ సరోవరానికి దగ్గర్లోనే అగ్నిధారానది ప్రవహిస్తోంది. ఈ ప్రసిద్ధ నది మొత్తం ప్రపంచాన్నే పవిత్రీకరించగలదు. దీనికి కపిలయని మరో పేరు కూడా వుంది. ఇక్కడ స్నానం చేసి, పితరులకు శ్రాద్ధ కర్మలు నిర్వర్తించినవానికి అగ్నిష్టోమయజ్ఞ ఫలం లభిస్తుంది.

కుమారధారలో శ్రాద్ధకర్మ చేసిన వానికి అశ్వమేధయాగ ఫలం దక్కుతుంది. అక్కడ వెలసిన కుమారదేవుని దర్శించి, పూజించి, ప్రణామ నివేదనలు చేసిన వారికి మోక్షం లభిస్తుంది.

సోమకుండ తీర్థంలోస్నానం చేస్తే సోమలోక నివాసం అబ్బుతుంది. సంవర్త వాపియను తీర్థంలో స్నానమాచరించి పిండదానాలు చేసినవారు సర్వసౌభాగ్య ప్రాప్తి నొందుతారు.

ప్రేతకుండ తీర్థంలో పిండప్రదానం చేసిన వారికి అన్ని పాపాల నుండీ విముక్తి కలుగుతుంది. దేవనది, లేలహాన, మథన, జానుగర్త కాది ఇతర గయాంతర్గత తీర్థాలలో పిండ ప్రదానం కూడ పితరులను ప్రీతులను చేస్తుంది. అలాగే ఇక్కడి వసిష్ఠేశ్వరాది దేవతలను శాస్త్రోక్తంగా పూజించి ప్రణామం చేసిన ప్రాణుల ఋణాలన్నీ తీరిపోతాయి."

***(అధ్యాయాలు 82,83)***

# గయ, గయా శీర్ష మహిమ విశాలుని కథ

**వ్యా**సునికి బ్రహ్మదేవుడు చెప్పిన దానిని సూతమహర్షి నైమిషారణ్యంలో శౌనకాది మహామునులకు ఇలా చెప్పసాగాడు.

"మహామునులారా! గయకు బయలుదేరదలచుకున్న వ్యక్తి ముందుగా తన గ్రామంలో శ్రాద్ధకర్మను గావించి సన్యాసి వేషాన్ని ధరించి గ్రామానికి ప్రదక్షిణచేయాలి. తరువాతపొరుగు గ్రామంలో కూడా సన్యాసిగానే తిరిగి శ్రాద్ధ ప్రసాదాన్ని మాత్రమే భుజించాలి. గయాక్షేత్రానికి వెళుతున్నారు కదా అని ఎవరైనా ఎటువంటి దానాన్నిచ్చినా పుచ్చుకోరాదు. గయ వైపు యాత్రికుడు వేసే అడుగూ వాని పితరుల స్వర్గారోహణకు మెట్టుగా ఉపయోగపడుతుంది.

*గృహాచ్చలిత మాత్రస్య గయాయాం గమనం ప్రతి ।*
*స్వర్గారోహణ సోపానం పితౄణాంతు పదే పదే ॥* ***(ఆచార...84/3)***

కురుక్షేత్రం, విశాల (బదరీక్షేత్రం), విరజా (జగన్నాథక్షేత్రం), గయాక్షేత్రాలలో తప్ప మిగతా అన్ని క్షేత్రాలలోనూ శిరోముండనం, ఉపవాస నియమాలు ఉంటాయి.

గయలో కనఖల నామక త్రైలోక్య ప్రసిద్ధి గాంచిన తీర్థమొకటుంది. ఇక్కడికి దేవతలు, మహర్షులు, సిద్ధులు వచ్చి సేవించుకుంటారు. మనసులోగాని స్వీయజీవిత చరిత్రలో గాని పాపమున్నవారు ఇక్కడ వుండలేరు. ఎందుకంటే పరమ విపరీత భయోత్పాదకములై

నాలుకలతో విషాగ్నిని వర్షించే మహాసర్పాలిక్కడ నిత్యమూ తిరుగుతుంటాయి. అవి పాపాత్ములను రానీయవు.

ఉదీచి తీర్థంలో దేవర్షి సేవితమైన ముండపృష్ఠ తీర్థముంది. అక్కడ స్నానం చేసిన వారికి స్వర్గ ప్రాప్తి ఉంటుంది. అక్కడ పెట్టబడే శ్రాద్ధం అక్షయఫలాలనిస్తుంది. అక్కడ సూర్యదేవునికి నమస్కరించి పిండదానాది సత్క్రియలను చేయాలి.

మన పితృగణాలు, కవ్యవాహ, సోమ, యమ, అర్యమ, అగ్నిష్వాత్త, బర్హిషత్, సోమప నామధేయులు. శ్రాద్ధం ఏ పేరిట పెట్టినా ఈ దేవతలందరినీ పేరు పేరునాఇలా ప్రార్థించాలి.

***కవ్యవాహస్తథా సోమో యమశ్చై వార్యమాతథా ।***
***అగ్నిష్వాత్తా బర్హిషదః సోమపాః పితృదేవతాః ॥***
***ఆగచ్ఛంతు మహాభాగా యుష్మాభీరక్షితా స్త్విహ ।***
***మదీయాః పితరోయే చకులే జాతాః సనాభయః ॥***
***తేషాం పిండ ప్రదానార్థమాగతోఽ స్మి గయా మిమాం । (ఆచార 84/12-14)***

ఇలా ప్రార్థించి ఫల్గుతీర్థంలో పిండం పెట్టి పితామహుడైన బ్రహ్మదేవునీ, గదాధరుడైన మహావిష్ణువునీ దర్శించిన వానికి పితౄణం పూర్తిగా తీరుతుంది. అలా చేసిన వ్యక్తి తరువాత ఫల్గు తీర్థంలో మరల స్నానం చేసి గదాధరుని దర్శనం చేసుకుంటే అతడు ఉద్ధరింపబడుటే గాక తన తండ్రితో తనతో సహా ఆపై పదితరాల వారిని కూడా సముద్ధరించగలడు. తన తరువాతి పది తరాల వారిని కూడా ఉద్ధరించగలడు.

భక్తుడు, సంప్రదాయ విధేయుడునైన మహావ్యక్తి గయాక్షేత్రాన్ని చేరుకున్నాక మొదటి రోజే చేయవలసినది పైన చెప్పబడింది.

ద్వితీయ దినం నాడు ధర్మారణ్యం చేరుకొని అక్కడి మతంగవాపిలో శ్రాద్ధకర్మం, పిండప్రదానం చేయాలి. ధర్మారణ్యంలోకి వెళ్లడం వల్ల మనుష్యునికి వాజపేయ యజ్ఞ ఫలమూ,ఆ తరువాత బ్రహ్మ తీర్థం వెళ్ళడం వల్ల రాజసూయ, అశ్వమేధ యజ్ఞాల ఫలాలూ దక్కుతాయి. తరువాత కూప, యూప నామక తీర్థాల మధ్య శ్రాద్ధ, పిండోదక కృత్యాలను గావించాలి. కూపోదకం ద్వారా చేసే శ్రాద్ధాది కార్యాలకు అక్షయ ఫలాలు లభిస్తాయి.

మూడవరోజు బ్రహ్మసద తీర్థానికి పోయి అక్కడస్నానం చేసి తర్పణాలిచ్చి వెంటనే యూప, కూప తీర్థాల మధ్య శ్రాద్ధాన్నీ పిండప్రదానాన్నీ చేయాలి. తరువాత గో ప్రచార తీర్థానికి పోవాలి. అక్కడ బ్రహ్మచేత కల్పింపబడిన బ్రాహ్మలుంటారు. వారిని పూజించి,

సేవించినంత మాత్రాన ఆ మనుజుని పితృజనులు మోక్షాన్ని పొందుతారు. యూపతీర్థానికి భక్తిగా ప్రదక్షిణ చేస్తే వాజపేయ యజ్ఞఫలం సిద్ధిస్తుంది.

నాలుగవ రోజు ఫల్గుతీర్థంలో స్నానం చేసి దేవతలకూ పితరులకూ తర్పణాలిచ్చి గయాశీర్షానికి పోయి అక్కడి రుద్రపదాది తీర్థాలలో పితరులకు శ్రాద్ధాలు పెట్టాలి. ఆ తరువాత వ్యాస, దేహిముఖ, పంచాగ్ని, పదత్రయ నామక తీర్థాలలో పిండదానాలనిచ్చి, సూర్య, సోమ, కార్తికేయ తీర్థాలకు పోయి అక్కడ చేయు శ్రాద్ధ కర్మలకు అక్షయ ఫలాలుంటాయి.

నవదైవత్య, ద్వాదశ దైవత్యములను పేర్లతో రెండు రకాల శ్రాద్ధాలున్నాయి. వీటిని గయలోనే పెట్టాలి. అన్వష్టక అనగా పుష్య, మాఘ, ఫాల్గున మాసాల్లో నవమీ తిథినాడు వృద్ధి చంద్ర నవమీ తిథులలోనూ లేదా తల్లి మృతి చెందిన తిథినాడు ఈ క్షేత్రంలో తల్లికి శ్రాద్ధకర్మను చేయవచ్చును. మిగతా చోట్ల తండ్రి కర్మతో కలిపే తల్లిది కూడా చేయాలి.

*శ్రాద్ధంతు నవదైవత్యం కుర్యాద్ ద్వాదశ దైవతం ।*
*అన్వష్టకాసు వృద్ధౌ చ గయా యాం మృతవాసరే ॥*
*అత్ర మాతుః పృథక్ శ్రాద్ధ మన్యత్ర పతినా సహ ।* **(ఆచార... 84/24,25)**

దశాశ్వమేధ తీర్థంలో స్నానం చేసి బ్రహ్మదేవుని దర్శనం చేసుకొని రుద్రపాదాలను స్పృశించిన వానికి పునర్జన్మ వుండదు.

గయాశిర తీర్థంలో శ్రాద్ధమును పెట్టడాన్ని మించిన పుణ్యకర్మలేదేమో! ఎందుకంటే విత్త పరిపూర్ణ సమస్త పృథ్విని మూడుమార్లు దానం చేస్తే వచ్చే పుణ్యం ఈ శ్రాద్ధకర్మ వల్ల లభిస్తుంది. ఇక్కడ శమీపత్ర పరిమాణంలో పిండాలను తయారుచేసి పెట్టాలి. దాని వల్ల పితృగణాల వారు దేవగణాల వారై పోతారు. ఈ విషయంలో ఎటువంటి అనుమానమూ అవసరం లేదు.

*త్రిర్విత్తపూర్ణ పృథివీం దత్త్వా యత్ ఫలమాప్నుయాత్ ।*
*సతత్ఫల మవాప్నోతి కృత్వాశ్రాద్ధం గయా శిరే ।*
*శమీపత్ర ప్రమాణేన పిండం దద్యాద్గయాశిరే ॥*
*పితరోయాంతి దేవత్వం నాత్ర కార్యా విచారణా ।* **(ఆచార... 84/26-28)**

ముండపృష్ఠ తీర్థంపై పరమేశ్వరుడు తన పాదాలను మోపి విశ్రమించాడు. అందుచేత ఈ తీర్థంలో స్వల్పమాత్రం చేసినా ఘన తపశ్శక్తీ, అత్యధిక ఫలాలూ కలుగుతాయి.

గయాశీర్ష తీర్థంలో పేరు పేరునా ఎవరెవరికైతే పిండాలు పెట్టబడతాయో వారిలో నరకంలో వున్నవారు స్వర్గానికి పోగా, స్వర్గంలో నున్నవారు మోక్షాన్ని పొందుతారు.

*ముండపృష్ఠే పదంన్యస్తం మహాదేవేన ధీమతా ॥*
*అల్పేన తపసాతత్ర మహాపుణ్యమవాప్నుయాత్ ।*
*గయాశీర్షేతుయః పిండాన్నామ్నా యేషాంతు నిర్వపేత్ ॥*
*నరకస్థా దివం యాంతి స్వర్గస్థా మోక్షమాప్నుయుః । (ఆచార... 84/28-30)*

అయిదవ రోజు గదాలోల తీర్థంలోస్నానం చేసి అక్కడి అక్షయవటం క్రింద పిండదానం చేసిన వారు తమ కుటుంబం సమస్తాన్నీ ఉద్ధరించగలరు. అక్షయ వట మూలం వద్ద శాక, ఉష్ణోదక సహితమైన భోజనాన్ని పెడితే కోటిమంది బ్రాహ్మణులకు అన్నదానం చేసిన ఫలం లభిస్తుంది. ఆ తరువాత బ్రహ్మదేవుని పూజించి, దర్శించి అక్షయ లోకాలను పొందవచ్చు. ఈ మొత్తం కార్యక్రమాన్ని వేరే ఆలోచన లేకుండా భక్తిశ్రద్ధలతో గావించిన వారి నూరుతరాలు ఉద్ధరింపబడతాయి.

*ఏష్టవ్యా బహవః పుత్రాయ ద్యేకోఽ పి గయాంవ్రజేత్ ॥ (ఆచార...84/33)*

ఒకనాడు గయాక్షేత్రానికి దగ్గరలో విశాలుడనే వణిజునికి ఒక ప్రేతం కనిపించి, 'ఓ వణిజుడా! నీవు గయాశీర్ష తీర్థంలో నా పేరిట పిండదానాన్ని చేసి పెట్టు. నేను ఈ ప్రేత యోని నుండి విముక్తుడనౌతాను. ఈ పుణ్యానికి ఫలంగా నీకు స్వర్గం ప్రాప్తిస్తుంది' అని చెప్పగా అతడలాగే చేశాడు. తరువాత విశాలుడు తన తమ్ములతో కలసి గయ అంతా కలయతిరిగి తన పితరులకు పిండప్రదానాలు చేయగా వారంతా, ప్రేతంతో సహా ముక్తులైనారు. గయ నుండి తన వూరికి వచ్చాక విశాలుడు పుత్రవంతుడై సుఖంగా జీవనం, అనాయాసంగా మరణం పొంది స్వర్గానికి చేరుకొని మరల పుడమిపై పుట్టినపుడు విశాలదేశానికి రాజపుత్రునిగా జన్మించాడు. అతడు పెరిగి పెద్దవాడై తన ఆస్థాన బ్రాహ్మణులకు 'ఏయే సత్కార్యాలు చేస్తే మంచి పుత్ర సంతానమూ, సుఖజీవనమూ లభిస్తాయి?' అని అడిగాడు. వారు 'విశాల రాకుమారా! గయాతీర్థంలో పిండ ప్రదానం చేస్తే అన్ని కోరికలూ తీరుతాయి' అని చెప్పారు.

విశాలుడు వెంటనే గయాక్షేత్రాన్ని సంపూర్ణంగా దర్శించి శాస్త్రోక్తంగా పిండ ప్రదానాలు గావించి వచ్చాడు. శీఘ్రమే పుత్రవంతుడైనాడు. ఒకరోజు అతనికి ఆకాశంలో ముగ్గురు పురుషులు దర్శనమిచ్చారు. అతడు వారికి నమస్కరించి 'మహాపురుషులారా! మీరెవరు?' అని అడిగాడు.

వారిలో శ్వేతవర్ణంలో నున్న పురుషుడు'నాయనా విశాలా!నేను నీ తండ్రిని. నీ పుణ్యం వల్ల నేను స్వర్గానికి వెళుతున్నాను. ఈ రక్తవర్ణ పురుషుడు నా తండ్రి. ఈయన బ్రహ్మహత్యను చేసి అవీచి నామక నరకంలో పడ్డాడు. ఆ శ్యామల వర్ణంలో నున్నవాడు నా తాత. ఆయన ఒక మహర్షిని చంపి అదే నరకంలో పడ్డాడు. నీవు గయా శీర్షతీర్థంలో చేసిన పిండప్రదానం వల్ల నేను ప్రేత రూపం నుండీ,వారు నరకకూపం నుండీ విముక్తులమై స్వర్గానికి వెళుతున్నాము. నీకు శుభమగు గాక' అని చెప్పి ఇతరులతోపాటు అంతర్ధానం చెందాడు.

విశాలుడు సమర్ధవంతంగా రాజ్య పాలనం చేసి సుఖంగా జీవించి దేహాంతంలో స్వర్గలోకాన్ని చేరుకున్నాడు.

గయాతీర్థంలో పిండప్రదానం చేసినపుడు ఈ క్రింది మంత్రాలను చదవాలి.

***యేఽ స్మత్కు లే తు పితరో లుప్తపిండోదక క్రియాః ॥***
***యే చాప్యకృత చూడాస్తు యేచ గర్భాద్విని స్సృతాః ।***
***యేషాం దాహో న క్రియా చ యేఽ గ్నిదగ్ధా స్తథా పరే ॥***
***భూమౌ దత్తేన తృప్యంతు తృప్తా యాంతు పరాంగతిం ।***
***పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః ॥***
***మాతా పితామహీ చైవ తథైవ ప్రపితా మహీ ।***
***తథామాతా మహశ్చైవ ప్రమాతా మహ ఏవచ ॥***
***వృద్ధ ప్రమాతా మహశ్చ తథా మాతా మహీపరం ।***
***ప్రమాతామహీ తథా వృద్ధా ప్రమాతా మహీతివై ॥***
***అన్యేషాం చైవ పిండో ఽయ మక్షయ్య ముపతిష్ఠతాం । (ఆచార...84/43-47)***

'మా వంశంలో సరైన సంస్కారాలు జరగకముందే మరణించిన వారికి, మరణానంతర సంస్కారాలు సరిగా జరగని వారికి, నా తండ్రికి ఆయన పితరులైన స్త్రీ పురుషులకి, నా తల్లికి ఆమె పితరులైన స్త్రీ పురుషులకి ఈ నాగయా క్షేత్ర కృత పిండప్రదానాలు అక్షయాలై అందాలి గాక! వారంతా తృప్తులై ముక్తి చెందాలి గాక' అని దీని భావము.

***(అధ్యాయం - 84)***

# గయా తీర్థంలో పిండ ప్రదాన మహిమ

గయలో పిండదాన మొనరించువారు ప్రేత శిలాది తీర్థాలలోస్నానం చేసి **అస్మత్కులే మృతాయేచ** ***(ఈ మంత్రాలు సంపూర్ణంగా అనుబంధం-9లో ఇవ్వబడ్డాయి).*** మున్నగు మంత్రాల ద్వారా తమ శ్రేష్ట పితరులను ఆవాహనంచేసి వరుణానది యొక్క అమృత మయ జలాలతో పిండదానం చేయాలి.

ఆ మంత్రాల భావం ఇలా వుంటుంది.

నా పితృ వంశంలో గాని మాతృవంశంలో గాని మరణానంతర సద్గతులు పొందని వారిని ఈ దర్భపృష్ఠంపై తిలోదకం ద్వారా ఆ నా పితరులందరినీ ఆవాహన చేస్తున్నాను. వారందరికీ సద్గతులు కలగడానికే నేనీ పిండ ప్రదానం చేస్తున్నాను. నా 'పై' రెండు వంశాలలో మృతి నొందిన సర్వులకూ సద్గతికై నేనిపుడు పిండప్రదానం చేస్తున్నాను. వీరంతా ఉద్ధరింపబడాలనేదే నా ఆశయము. సహజ మరణం పొందినవారికీ, బలవన్మరణం పొందినవారికీ కూడా నేనీ పరమ పుణ్యక్షేత్రమైన గయలో పిండప్రదానం చేస్తున్నాను. రౌరవ, అసిపత్ర, కుంభీపాక నరకాలలో... పడివున్న నా ఇరువంశాల మృతులనూ ఉద్ధరించి ఉత్తమగతులకు పంపడం కోసం నేను వారందరినీ ఆవాహన చేసి పిండప్రదానం చేస్తున్నాను. అలాగే అంధతామిస్ర, కాలసూత్ర నామక నరకాలలోనూ, ప్రేతలోకంలోనూ పడియున్న నా పితరులందరినీ ఉద్ధరించడానికి నేనిక్కడ పిండ ప్రదానం చేస్తున్నాను. మానవజన్మ దుర్లభమై, మానవేతర యోనుల్లో జనించి జీవిస్తున్న నా పితరులందరికీ నేనిక్కడ పిండప్రదానం చేస్తున్నాను.

పుత్ర, పత్నీ రహితులుగా మరణించిన నా ఈ జన్మ బాంధవులకూ, నా పూర్వజన్మ బంధువులకూ కూడా ముక్తి కలగడం కోసం నేనిక్కడ పిండప్రదానం చేస్తున్నాను.

నా పితరులలో ఇతర జంతు, వృక్షయోనులలో జనించిన వారికి ఉత్తమ గతులను కలిగించడం కోసం కూడా నేనిక్కడ పిండ ప్రదానం చేస్తున్నాను. ప్రేతరూపంలో శాపవశాత్తూ ఉండిపోయిన నా వారికి కూడా నేనీ అద్భుత పుణ్యక్షేత్రంలో పిండప్రదానం చేస్తున్నాను. ఇంకా గర్భస్రావితాత్మత లతో సహా నా పితరులందరికీ ఉత్తమగతులకై నేనిక్కడ పిండ ప్రదానాలను గావిస్తున్నాను.

బ్రహ్మేశానాది దేవతలారా! మీరంతా నా ప్రయత్నానికి సాక్షులుగా వుండాలని ప్రార్థిస్తున్నాను. నేను గయా క్షేత్రానికి వచ్చి నా వారందరికీ ఊర్ధ్వలోక ప్రాప్తి కలిగించే ప్రయత్నంలో భాగంగా శ్రాద్ధ కర్మలను నిర్వహించి పిండప్రదాలను సంపన్నం చేశాను.

హే భగవాన్! గదాధర విష్ణుదేవా! నేను పితృకార్యాలను సంపన్నం చేయడానికై గయాతీర్థాలకు వచ్చియున్నాను. నా ద్వారా జరిగిన ఈ కర్మలన్నిటికీ తమరే సాక్షి. మీ దయవల్ల నేను దేవ, గురు, పితృ అను మూడు రకాల ఋణాల నుండీ నేటితో విముక్తుడనైనాను' **(అధ్యాయం - 85)**

# ఆదిగదాధర మాహాత్మ్యం

గయలో మరికొన్ని తీర్థాలనూ వాటి మహిమలనూ వినిపిస్తాను. ఈ గయా తీర్థంలో ప్రేతశిలగా విఖ్యాతమైన క్షేత్రం ప్రభాస, ప్రేతకుండ, గయాసుర శీర్ష నామకములైన తీర్థాలతో విరాజిల్లుతోంది. ఈ శిల సర్వదేవమయి. దీనిని స్వయంగా యమధర్మరాజే ఐశ్వర్య ప్రాప్తి కోసం ధరించాడని విన్నాను. మానవుని మిత్ర, బంధు, బాంధవులలో నెవరికైనా ప్రేతయోని ప్రాప్తిస్తే అతడు ఈ ప్రేతశిలలో కర్మకాండ జరిపితే వారికీ అతనికీ కూడా గొప్ప శుభాలు కలుగుతాయి. ఇక పితృజనులకిది మరింత శుభదాయకం. అందుకే మునులు, రాజులు, రాజపత్నులు మున్నగు వారిటకు వచ్చి శ్రాద్ధాది కర్మలను నిర్వహించి బ్రహ్మలోకానికి తమ పితరులను పంపించగలుగుతారు. తామూ దేహాంతంలో బ్రహ్మ లోకాన్ని చేరుకుంటారు.

గయాసుర మండపానికి వెనుక నున్న శిలకు ముండపృష్ఠగిరి అని పేరు. ఇది సర్వదేవమయం. దీని పాద ప్రాంతంలో బ్రహ్మసరోవరాది అనేక తీర్థాలున్నాయి. వాటిలో అరవిందవనమను తీర్థమొకటి. దాని వలన ఆ పర్వతంలో నొక ప్రాంతానికి అరవింద గిరి అనే నామమేర్పడింది. అక్కడ క్రౌంచ పక్షుల పాదాల గుర్తులుంటాయి. ఆ పర్వతభాగాన్ని క్రౌంచ పాదగిరి అంటారు. శ్రాద్ధాది కర్మల ద్వారా పితరులకు బ్రహ్మలోకం ప్రాప్తింపజేసే ప్రాంతమిది.

ఆదికాలమునుండే విష్ణుభగవానుడిక్కడ అవ్యక్త రూపంలోనూ, గదాధర శిలరూపం లోనూ నెలకొనివున్నాడు. అందుచే ఈ శిల సర్వదేవమయమని చెప్పబడుతోంది. మత్స్య కూర్మాది విష్ణువు అవతార రూపాలకున్న ప్రాశస్త్యమే ఇక్కడి గదాధర రూపానికి వుంది. ఆదికాలం నుండే గదాధరరూపుడైన శ్రీ మహావిష్ణువు బ్రహ్మాది దేవతల పూజలందు కొంటున్నాడు. కాబట్టి మానవులంతా ఇక్కడికి వచ్చి, ఆగి, అర్ఘ్య, పాద్య, పుష్పాదిక ఉపహారాలతో ఆ స్వామిని పూజించాలి. ఈ తీర్థంలో గదాధరునీ, ఇతరదేవులనీ పూజించి సర్వోపచారాలనూ సమర్పించి ముకుట, వస్త్ర, ఘంట, చామర, దర్పణ, అలంకారాలను తీర్థానికి సమకూర్చి పెట్టి పిండ, అన్నదానాలను కూడా చేసినవానికి తాను జీవించి

యున్నంత కాలమూ ధన, ధాన్య, ఆరోగ్య, ఐశ్వర్య, పుత్ర పౌత్ర లాభాలు అక్షయంగా వుంటాయి. ఆయువు పెరుగుతుంది. శ్రేయ, విద్య, అర్థ, అభీష్ట కామనల సాకారతలలో లోటుండదు. దేహాంతంలో భార్యాసమేతంగా స్వర్గాన్ని చేరుకుంటాడు. మరుజన్మలో రాజ్యసుఖాన్నీ, శత్రుసంహారక పరాక్రమాన్నీ, జయపరంపరనీ పొందికూడ వధ, బంధనాదుల నుండి ముక్తుడై చివరలో మోక్షానొందుతాడు. ఇక్కడ పిండం పెట్టినవారికీ అందుకున్నవారికీ కూడా బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

*వధ బంధ వినిర్ముక్తశ్చాంతే*
*మోక్షమవాప్నుయాత్ ।*
*శ్రాద్ధ పిండాది కర్తారః*
*పితృభిః బ్రహ్మలోకగాః ॥* **(ఆచార...86/17)**

ఇక్కడి పురుషోత్తమ క్షేత్రానికి పోయి భగవాన్ జగన్నాథ, సుభద్రా, బలరాములను పూజించినవారికి జ్ఞానం, లక్ష్మి, పుత్రులు మున్నగునవన్నీ కలిగి సుఖంగా వుండే జీవనం, మరియు దేహాంతంలో విష్ణుసాన్నిధ్యం కలుగుతాయి. అలాగే పురుషోత్తముడను పేర ఇక్కడ వెలసిన జగన్నాథుని సమక్షంలోనూ, సూర్యదేవ విఘ్నేశ్వరుల సమక్షంలోనూ పితరులకు పిండ దానాదులను నిర్వర్తించిన వారికి బ్రహ్మలోక నివాసం లభిస్తుంది.

ఈ క్షేత్రంలోవినాయకునీ,కపర్ది నామంతో వేంచేసియున్నపరమశివునీ నమస్కారంతో పూజించినవానికి అన్ని విఘ్నాలూ తొలగిపోతాయి. ఇక్కడే వెలసిన కార్తికేయ భగవానుని పూజించిన వారికి బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది. ద్వాదశనామాలతో సూర్యదేవుని పూజించిన వారు సర్వరోగముక్తులవుతారు. వైశ్వానర భగవానుడైన అగ్నిదేవుని విధివత్తుగా పూజించి ఉత్తమ కాంతిని పొందడానికీ, రేవంతుని ఆరాధించి ఉత్తమాశ్వాలను సంపాదించడానికీ, ఇంద్రదేవునారాధించి మహా గొప్ప ఐశ్వర్యాన్ని పొందడానికీ, గౌరీ దేవికి పూజలు చేసి అతులిత సౌభాగ్యాన్నందడానికీ, సరస్వతమ్మను పూజించి విద్యనూ, లక్ష్మీదేవిని పూజించి సర్వసంపదలనూ ఈ ఒక్కక్షేత్రంలోనే పొందవచ్చును. ఈ పురాణాధి పతియైన గరుత్మంతుని ఈ తీర్థంలో పూజించిన వారికి అన్ని విఘ్నాలూ ఎగిరిపోగా, బలమూ, వేగమూ వస్తాయి.

ఈ క్షేత్రపాలకుని పూజిస్తే గ్రహసమూహాల దోషాలన్నీ పోతాయి. ముండపృష్ఠమును పూజించిన వారికి అన్ని అభిలాషలూ నెరవేరుతాయి. ఇక్కడి అష్ట నాగదేవులను అర్చించిన వారిని పాము కాటు బాధింపదు. ఇక్కడ బ్రహ్మదేవుని పూజించి బ్రహ్మలోక ప్రాప్తినొంద వచ్చును.

ఈ క్షేత్రంలో ఇంకా బలభద్రుని సమ్యక్ పూజ ద్వారా శక్తి, ఆరోగ్యాలనూ, సుభద్రా దేవ్యర్చన ద్వారా పరమ సౌభాగ్యాన్నీ, జగన్నాథ స్వామి పూజ ద్వారా ఇష్టకామ్యార్థ సిద్ధినీ, శ్రీమన్నారాయణ పూజ ద్వారా రాజ్యాధికారాన్నీ, నృసింహదేవుని చరణ స్పర్శ, నమస్కృతుల ద్వారా సంగ్రామ విజయాన్నీ, వరాహ స్వామి పూజద్వారా పృథ్విపై ఆధిపత్యాన్నీ, మాలాధర, విద్యాధరుల పూజ ద్వారా స్పర్శ ద్వారా విద్యాధర పదాన్నీ, ఆదిగదాధరుని ఆరాధన ద్వారా సమస్తాభీష్టసిద్ధినీ, సోమనాథుని పూజ ద్వారా శివలోక ప్రాప్తినీ, రుద్రదేవునికి నమస్కరించడం ద్వారా రుద్రలోకంలో ప్రతిష్ఠాపితులయ్యే భాగ్యాన్నీ భక్తులు పొందగలరు.

ఈ గయా క్షేత్రంలో వెలసిన ఆదిగదాధరస్వామి మహిమలను వర్ణించడం సామాన్యులకు అసాధ్యం. రామేశ్వర, కాళేశ్వర, బ్రహ్మేశ్వర, కేదారనాథ, సిద్ధేశ్వర రూపాలలో పరమశివుడే ఇక్కడ వెలసి భక్తులకు అన్నీ ఇస్తూ తాను మాత్రం ఆదిగదాధరుని దర్శించు కుంటూ వుంటాడు. రుద్రునితో బాటు ఆదిగదాధరుని ఒకే రోజు దర్శించిన వారికి బ్రహ్మలోకం ప్రాప్తించడమే గాక వారి వంశాల్లో వందతరాలు ఉద్ధరింపబడతాయి.

గదాధర భగవానుని పూజించిన ధర్మార్థికి ధర్మమూ, ధనార్థికి ధనమూ, కామార్థికి కామమూ, మోక్షార్థికి మోక్షమూ అలవోకగా దొరుకుతాయి. అలాగే స్త్రీ పురుషులకు సౌభాగ్యపుత్రాదులు కూడా.

గదాధర మాహాత్మ్యమింకా ఇలా చెప్పబడింది.

*శ్రాద్ధేన పిండ దానేన అన్నదానేన వారిదః ॥*
*బ్రహ్మలోక మవాప్నోతి సంపూజ్యాది గదాధరం*
*పృథివ్యాం సర్వతీర్థేభ్యో యథాశ్రేష్ఠా గయాపురీ ॥*
*తథాశిలాది రూపశ్చ శ్రేష్ఠ శ్చైవ గదాధరః ।*
*తస్మిన్ దృష్టే శిలాదృష్టా యతః సర్వం గదాధరః ॥* **(ఆచార...86/38-40)**

**(అధ్యాయం - 86)**

# పదునాలుగు మన్వంతరాలూ పదునెనిమిది విద్యలూనూ

**రు**ద్రాదిదేవతలారా! పూర్వకాలంలో సర్వప్రథమంగా స్వాయంభువ మనువుద్భ వించాడు. ఆయనకు అగ్నీధ్రాది పుత్రులు జనించారు. ఈ మన్వంతరంలో అనగా ఈ మనువు కాలంలోనే మరీచి, అత్రి, అంగిర, పులస్త్య, పులహ, క్రతు, వసిష్ఠులనే సప్తర్షులు దయించారు. తరువాత నేర్పడిన పన్నెండు దేవగణాలలో జయ, అమిత, శుక్ర, యామ

అను గణాలు సోమపాయులు. వీరి నుండి విశ్వభుక్, వామదేవులనే వారు ఇంద్రపదవిని సాధించారు. వాష్కలి అను రాక్షసుడు ఈ కాలంలోనే వీరిని పీడించి విష్ణువు చక్రాయుధం దెబ్బకు మరణించాడు.

తరువాత స్వారోచిషమనువు ఉద్భవించాడు. ఇతనికి చైతక, వినత, కర్ణాంత, విద్యుత్, రవి, బృహద్గుణ, నభులను పుత్రులు జనించారు. వీరిలో నభుడు మహాబలిగా, మండలేశ్వరునిగా, పరాక్రమశాలిగా ప్రసిద్ధుడైనాడు. ఈ మన్వంతరంలో ఊర్జ, స్తంభి, ప్రాణ, ఋషభ, నిశ్చల, దత్తోలి, అర్వరీవాన్ – అను పేరు గల ఏడుగురు మహామునులు సప్తర్షులుగా ప్రసిద్ధులైనారు. ఈ కాలంలోనే పన్నెండు తుషితగణాలూ, పారావత దేవగణాలూ ఏర్పడ్డాయి. విపశ్చిత్తుడను నాయకుడు ఇంద్ర పదవినధిష్ఠించాడు. అతని శత్రువైన పురుకుత్సర నామకుడగు దైత్యుని శ్రీ మధుసూదనదేవుడు ఏనుగు రూపంలో సంహరించాడు.

అనంతరం ఔత్తరమనువుద్భవించాడు. ఈయనకు అజ, పరశు, వినీత, సుకేతు, సుమిత్ర, సుబల, శుచి, దేవ, దేవావృధ, మహోత్సాహ, అజిత నామకులు పుత్రులుదయించారు. ఈ మన్వంతరంలో రథౌజ, ఊర్ధ్వబాహు, శరణ, అనఘ, ముని, సుతప, శంకువులనే మహామునులు సప్తర్షులైనారు. వశవర్తి, స్వధామ, శివ, సత్య, ప్రతర్దన అను పేర్లు గల అయిదు దేవగణాలు జనించాయి. ప్రతి గణంలోనూ పన్నెండుగురేసి దేవతలుండే వారు. స్వశాంతి నామధేయుడు ఇంద్రుడు కాగా అతని శత్రువైన ప్రలంబాసురుడనే రాక్షసుని విష్ణుదేవుడు మత్స్యావతారమును ధరించి సంహరించాడు.

తరువాతి మనువు పేరు తామసుడు. ఆయన పుత్రులు జానుజంఘ, నిర్భయ, నవఖ్యాతి, నయ, విప్రభృత్య, వివిక్షిప, దృఢేషుధి, ప్రస్తలాక్ష, కృతబంధు, కృత, జ్యోతిర్ధామ, పృథు, కావ్య, చైత్ర, చేతాగ్ని, హేమక నామకులు కాగా జ్యోతిర్ధార, దృష్టకావ్య, చైత్ర, చేతాగ్ని, హేమక, సురాగ, స్వధీయులు సప్తర్షులు. హర్యాది నాలుగు దేవతాగణాలుండగా శిబి చక్రవర్తి ఇంద్రుడైనాడు. ఆతని శత్రువైన భీమరథ దైత్యుని శ్రీ మహావిష్ణువు కూర్మావతార మెత్తి సంహరించాడు.

అయిదవ మనువైన రైవతుని పుత్రులు మహాప్రాణ, సాధక, వనబంధు, నిరమిత్ర, ప్రత్యంగ, పరహ, శుచి, దృఢవ్రత, కేతుశృంగులు. ఇతని కాలంలోని సప్తర్షులు వేదశ్రీ, వేదబాహు, ఊర్ధ్వబాహు, హిరణ్యరోమ, పర్జన్య, సత్యనామ స్వధామనామధేయులు. ఈ మన్వంతరంలో అభూతరజ, దేవాశ్వమేధ, వైకుంఠ, అమృత నామక దేవగణాలు విలసిల్లగా విభుడను మహావీరుడు ఇంద్రుడైనాడు. ఆతని శత్రువైన శాంతశత్రుడను దైత్యుని శ్రీ మహావిష్ణువు హంస రూపంలో వచ్చి వధించాడు.

ఆరవ మనువు చాక్షుషుడు. ఆతని పుత్రులు ఊరు, పురు, సత్యద్యుమ్న, సత్యబాహు, కృతి, అగ్నిష్ణ, అతిరాత్ర, నర, సుద్యుమ్నులు. నాటి సప్తర్షులు హవిష్మాన్, సుతను, స్వధామ, విరజ, అభిమాన, సహిష్ణు, మధుశ్రీ మహామునులు. ఈ చాక్షుష మన్వంతరంలో ఆర్య, ప్రసూత, భవ్య, లేఖ, పృథుక నామక దేవగణాలు విలసిల్లినాయి. మనోజవుడు ఇంద్రునిగా ఎన్నుకోబడినాడు. దేవశత్రువు, దీర్ఘబాహుడునగు మహాకాలాసురుని శ్రీ మహా విష్ణువు హయరూపుడై వధించాడు.

ఏడవ మనువైన వైవస్వతుని పుత్రులు మహావిష్ణుభక్తులైన ఇక్ష్వాకు, నాభ, విష్టి, శర్యాతి, హవిష్యంతి, పాంశు, నభ, నేదిష్ఠ, కరూశ, పృశాధ్ర, సుద్యుమ్నులు. మహాతపస్సం పన్నులైన అత్రి, వశిష్ట, జమదగ్ని, కశ్యప, గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర మహర్షులు వైవస్వత మన్వంతరపు సప్తర్షులు. నలభైతొమ్మిది మరుద్గణాలు, ఆదిత్య, వసు, సాధ్య మున్నగు ద్వాదశ దేవగణాలు వర్ధిల్లుతున్నాయి. పదకొండుగురు రుద్రులు, ఎనమండుగురు వసువులు, పదిమంది విశ్వేదేవులు, ఇద్దరశ్వనీ కుమారులు, పదిమంది ఆంగిరులు దేవగణాల్లోవున్నారు. ఇంద్రుని పేరు తేజస్వి. హిరణ్యాక్షుడను దేవశత్రువుని శ్రీ మహావిష్ణువు వరాహావతారాన్ని ధరించి సంహరించాడు.

ఇక రాబోయే మన్వంతరాలను గూర్చి వర్ణిస్తాను. మనవైవస్వత మన్వంతరం తరువాత రాబోతున్నది సావర్ణి మన్వంతరము. ఆ మనుపుత్రులు విజయ, ఆర్యవీర, నిర్మోహ, సత్యవాక్, కృతి, వరిష్ఠ, గరిష్ఠ, వాచ, సంగతులు. మహామునులైన అశ్వత్థామ, కృపాచార్య, వ్యాస, గాలవ, దీప్తిమాన్, ఋష్యశృంగ, పరశురాములు ఈ మన్వంతరంలోని సప్తర్షులు. సుతపా, అమృతాభ, ముఖ్య నామక మూడు దేవగణాలుంటాయి. ఒక్కొక్క గణంలో ఇరవైమంది దేవతలుంటారు. విరోచన పుత్రుడైన బలి చక్రవర్తి దేవేంద్ర పదవినందు కుంటాడు గానీ అతనికి అహంకారం పెరగడంతో విష్ణువే వామన రూపంలో వచ్చి ఆతని నుండి మూడడుగుల దానాన్ని గ్రహించి అడుగుకొక లోకంగా ముల్లోకాలనూ ఆక్రమిస్తాడు. బలి సిద్ధినీ మోక్షాన్నీ పొందుతాడు.

వరుణపుత్రుడైన దక్షసావర్ణి తొమ్మిదవ మనువుగా వస్తాడు. ఆతని పుత్రులు ధృతికేతు, దీప్తికేతు, పంచహస్తి, నిరామయుడు, పృథుశ్రవుడు, బృహద్యుమ్నుడు, ఋచీకుడు, బృహదుణుడు అనువారలు. ఈ మన్వంతరంలో మేధాతిథీ, ద్యుతి, సవస, వసు, హవ్య, కవ్య, విభులు సప్తర్షులు. పర, మరీచిగర్భ, సుధర్మ లింద్రులుగా ఎన్నికవుతారు. వారి ప్రధానశత్రువైన కాలకాక్ష దైత్యుని శ్రీ మహావిష్ణువు పద్మనాభుడై వధిస్తాడు.

పదవ మనువు ధర్మసావర్ణి. ఆతని పుత్రులు సుక్షేత్ర, ఉత్తమౌజ, భూరిశ్రేణ్య, శతానీక, నిరమిత్ర, వృషసేన, జయద్రథ, భూరిద్యుమ్న, సువర్చ, శాంతి, ఇంద్రులు. ఈ మన్వంతర

సప్తర్షులు అయోమూర్తి, హవిష్మాన్, సుకృతి, అవ్యయ, నాభాగ, అప్రతిమౌజ, సౌరభ మహామునులు. ప్రాణి నాయకులొక వంద దేవగణాల వారుంటారు. మహాబలశాలియు శాంతియను పేరుగలవాడును నగు దేవపురుషుడింద్రుడవుతాడు. అతని శత్రువైన బలియను అసురుని విష్ణువు తన గదతో సంహరిస్తాడు.

పదకొండవ మనువైన రుద్రసావర్ణి కొడుకులు సర్వత్రగ, సుశర్మ, దేవానీక, పురు, గురు క్షేత్రవర్ణ, పుత్ర, దృఢేషు ఆర్ద్రక నామకులు. ఈ మన్వంతరంలోని సప్తర్షులు హవిష్మాన్; హవిష్య, వరుణ, విశ్వ, విస్తర, విష్ణు, అగ్నితేజ మహామునులు. విహంగమ, కామగమ, నిర్మాణ, రుచి అను పేర్లతో నాలుగు దేవగణాలు ఒక్కొక్కటీ ముప్పదేసిమంది దేవతలతో వర్ధిల్లగలవు. వృషభుడను దేవపురుషుడు దేవేంద్రుడు కాగా ఆతని శత్రువైన దశగ్రీవ దైత్యుని విష్ణువు లక్ష్మీరూపమున అవతరించి వధిస్తాడు. ఈ రుద్రసావర్ణి మనువు శివపుత్రుడు.

తరువాత దక్షపుత్రుడైన దక్షసావర్ణి పన్నెండవ మనుపదవినధిష్ఠిస్తాడు. ఆయన పుత్రులు, దేవవాన్, ఉపదేవ, దేవశ్రేష్ఠ, విదూరథ, మిత్రవాన్, మిత్రదేవ, మిత్రబిందు, వీర్యవాన్; మిత్రవాహ, ప్రవాహులు. ఈ మన్వంతరంలో సప్తర్షులుగా తపస్వి, సుతప, తపోమూర్తి, తపోరతి, తపోధృతి, ద్యుతి, తపోధన, నామధేయులైన మహామునులు ప్రవర్తిల్లుతారు. స్వధర్మ, సుతపస, హరిత, రోహిత దేవగణాలుంటాయి. ప్రతి గణంలోనూ పదేసిమంది దేవతలూ, మొత్తం జాతికి ఋతధాముడను దేవేంద్రుడూ ఉంటారు. దేవశత్రువైన తారకాసురుని విష్ణువు నపుంసక స్వరూపమును ధరించి వధిస్తాడు.

పదమూడవ మనువు రౌచ్యుడు. ఆయన పుత్రులు చిత్రసేన, విచిత్ర, తప, ధర్మరత, ధృతె, సునేత్ర, క్షేత్రవృత్తి, సునయులు. ధర్మ, ధృతిమంత, అవ్యయ, నిశారూప, నిరుత్సక, నిర్మోహ, సుధర్మ, సుకర్మ దేవగణాలు ముప్పది మూడేసి మంది దేవతలతో వర్ధిల్లుతాయి. దివస్పతి ఇంద్రుడు కాగా ఆయన శత్రువైన త్వష్టిభుడను దైత్యుని శ్రీమహా విష్ణువు మయూర స్వరూపంలో వచ్చి వధిస్తాడు.

పదునాల్గవ మనువు విష్ణుపుత్రుడైన భౌత్యుడు. ఆయన పుత్రులు ఊరు, గభీర, ధృష్ట, తరస్వి, గ్రాహ, అభిమాని, ప్రవీర, జిష్ణు, సంక్రందన, తేజస్వి, దుర్లభులు. అగ్నీధ్ర అగ్నిబాహు, మాగధ, శుచి, అజిత, ముక్త, శుక్రమహామునులు సప్తర్షులు. చాక్షుష, కర్మనిష్ఠ, పవిత్ర, భ్రాజిన, వచోవృద్ధ దేవగణాలు ఒక్కొక్క గణంలో మరల ఏడేసి ఉపగణాలతో వర్ధిల్లుతాయి. ఈ మన్వంతరానికి శుచి దేవేంద్రుడు కాగా ఆతని శత్రువైన మహాదైత్య నామక దైత్యుని శ్రీమహా విష్ణువే స్వస్వరూపంలో దిగి వచ్చి వధిస్తాడు.

***(అధ్యాయం - 87)***

# రుచి ప్రజాపతితో పితరుల సంవాదం

శౌనకాది మహామునులారా! మార్కండేయ మహాముని క్రౌంచిక మహర్షికి ఒక సందర్భంలో పితృస్తోత్రాన్ని వినిపించాడు. దానిని వర్ణిస్తాను, వినండి.

ప్రాచీన కాలంలో రుచి ప్రజాపతి మాయా మోహమునుండి విడివడి, నిర్భయుడై, ఎక్కువ జపతపాలను చేస్తూ, కర్మలను గావిస్తూ, తక్కువ నిద్రిస్తూ, నిరహంకార భావనతో గొప్ప నియమబద్ధ ఆధ్యాత్మిక జీవితాన్ని ఈ పృథ్విపైనే గడపసాగాడు. క్రమంగా అగ్ని హోత్రాన్నీ, గృహస్థాశ్రమాన్నీ పరిత్యజించి ఒక పూటే భోజనం చేస్తూ ఒంటరిగా తిరుగుతుండగా పితృ దేవతలతనికి దర్శనమిచ్చి ఇలా అడిగారు :

'వత్సా! నీవింకా వివాహమెందుకు చేసుకోలేదు? అది ఉన్నత గృహస్థాశ్రమానికి ద్వారమనీ, అది స్వర్గ, మోక్షప్రాప్తికి మార్గమనీ నీకు తెలియదా? గృహస్థు మాత్రమే అందరికీ పనికొస్తాడు; సమస్త దేవతలనూ, పితరులనూ, ఋషులనూ, అతిథులనూ, యాచకులనూ భోజనం ద్వారా పూజాదానాదుల ద్వారా సంతృప్తిపఱచి ఉత్తమ లోకాలను చేరుకోగలడు; దేవతలను స్వాహా మంత్రాలతోనూ, పితరులను స్వధామంత్రాలతోనూ అతిథులనూ, భృత్యాదులనూ అన్నదానంతోనూ ఆనందింపజేయగలడు. అలా చేయక పోవడం వల్ల నీ పితృ, దేవ ఋణాలు తీరకుండా మిగిలిపోతాయి. అలాగే మనుష్యులకూ, ఋషులకూ, అన్యజీవాలకూ కూడా నువ్వు ఋణపడిపోతావు. పుత్రోత్పత్తి, దేవపూజ, పితృతర్పణాలు, చివరిదశలో సన్యాస గ్రహణం స్వర్గానికి సోపానాలు. మొదటి మెట్టుని కూడా చేరుకోని బతుకులెందుకు? పుత్రా! ఈ అన్యాయం వల్ల నీకు కలిగేవి కష్టాలు మాత్రమే. నీవు మరణించాక నరకానికే పోతావు. మరుజన్మలో కూడా క్లేశాలే ఎక్కువగా అనుభవమవుతాయి.

రుచి మిక్కిలి వినయంతో ఇలా బదులిచ్చాడు. మహానుభావులారా! మానవ జీవితంలో దేనినైనా పరిగ్రహించడం అత్యంత దుఃఖానుభవాన్నీ, పాప సంగ్రహాన్నీ, అనంతకాలం దాకా అధోగతినీ కలుగజేస్తుందనీ అందుచేత దేనినీ గ్రహించనివాడే ధన్యుడనీ విని యున్నాను. అందుచేతనే అనర్థాలకు మొదటి మెట్టు అయిన స్త్రీని పరిగ్రహించడానికి మొగ్గ లేదు. క్షణంలోనే అన్ని పుణ్యాలనూ నాశనం చేసే శక్తి ఆశకి వుంది. అందుకే నేనేదీ ఆశించలేదు. విద్య ద్వారా, సద్జ్ఞానోపార్జన రూపియైన జలం ద్వారా తన ఆత్మను నిర్మలం చేసుకోగలిగినవాడే నా దృష్టిలో ధన్యుడు, ముక్తుడు. విద్వాంసులెంతోమంది అనేక విధాలుగా సాంసారిక కర్మలనే రూపాన్ని ధరించి మనిషిని పంకిలంలో కూరుకు

పోయేటట్లు చేసే కుటుంబ జీవనాన్ని వర్ణించారు. ఇంద్రియాలకి దాసోహమై పోయే మనిషే స్త్రీ వెంటా, వివాహం వైపూ పరుగులు పెడతాడని బోధించారు. నేను జితేంద్రియ పురుషుడనై, తత్త్వజ్ఞానమనే తేటనీటితో నా ఆత్మ ప్రక్షాళనాన్ని చేసుకుంటున్నాను.'

'నాయనా! నీవు పలుకుతున్న ప్రక్షాళన కార్యక్రమం అందరికీ ఆచరణీయం కాదు; సార్వజనీనమూ కాదు, లోక కల్యాణకారకమూ కాదు. మనిషికి కొన్ని ధర్మాలుంటాయి. పూర్వజన్మల నుండి తెచ్చుకున్నవీ, ప్రారబ్ధకర్మఫలాలూ వుంటాయి. వాటిని బట్టి జన్మబంధా లేర్పడతాయి. అయితే ధర్మం కోసం చేసే పనికి బంధనాలు అంటవు. గృహస్థ ధర్మం అటువంటిదే.

ప్రారబ్ధ పాప పుణ్యాలు దుఃఖ సుఖభోగాలతో పోతాయి. నీవు చెప్పిన విద్వజ్జనప్రవచిత ఆత్మ ప్రక్షాళనం ఆ సుఖదుఃఖ అనుభవముల ద్వారా జరిగిపోతుంటుంది. దానివల్ల కర్మబంధాల నుండి రక్షణ కూడా చేయబడుతుంది. నీ వివేకంతో సంసారంలో వుండి కూడా ఆత్మను రక్షించుకోగలవు' అన్నారు పితరులు.

'హే పితృదేవతలారా! కర్మమార్గం ద్వారా అవిద్యా, మాయా బలపడతాయని వేదాలలోనే చెప్పబడింది కదా! మీరంతా నన్ను ఆ మార్గంలోకే పొమ్మని బలవంత పెడుతున్నారు' అన్నాడు రుచి.

'నాయనా! కర్మ ద్వారా అవిద్య పెరుగుతుందనే మాట అసత్యం కాదు. కాని విద్యావంతుడవడం కూడా ఒక కర్మే కదా! మాయను, అవిద్యనూ విచ్ఛిన్నం చేసే విద్య కూడా సంసారంలో భాగమే కదా! సజ్జను లెపుడూ శాస్త్ర ప్రతిపాదితములైన విహిత కర్మలను ఉల్లంఘింపరు. వారికి  వాటి ద్వారానే మోక్షం ప్రాప్తిస్తుంది. ఎవరి కర్మను వారు చేయాలి. అలా చేయని వారు అధోగతి పాలవుతారు. అపరిగ్రాహం ఆత్మ ప్రక్షాళన హేతువే కాని అదే అపరిగ్రాహం కర్మల విషయంలో అపరిగ్రాహ్యం. అయినా ఒక స్త్రీని పరిగ్రహించి ఆమెనూ ఉద్ధరించి, నీవూ ఉద్ధరింపబడుతున్నావు కదా! వంశాన్ని అభివృద్ధి పఱచి, యజ్ఞయాగాదులను చేసి, దానధర్మాలను నిర్వర్తించిన వాడే నిజమైన మనిషి. వానికి నిజమైన తోడు, నీడ స్త్రీయే. నువ్వు వివాహం చేసుకోక, వంశాభివృద్ధిని అరికట్టి పాపంలో కాలిపోతున్నావు.

అవిద్య విషంతో సమానమని విద్వజ్జనులు నీకు చెప్పారు కదా! కాని ఆ విషం కూడా మానవునికెన్నో విధాల ఉపయోగపడుతోంది కదా! కొండొకచో ప్రాణరక్షణ కూడా చేస్తున్నది. కాబట్టి కర్మల వల్ల అవిద్య, మాయ ఏర్పడినా వాటిని పటాపంచలు చేసే కర్మలున్నాయి. వాటినే నువ్వు చెయ్యి పెళ్ళి చేసుకో. గృహస్థాశ్రమంలోకి అడుగుపెట్టు' అని బోధపఱచారు పితృదేవులు.

మెత్తబడిన రుచి 'పితరులారా! మీ మాటను జవదాటలేను. కాని, నేను వృద్ధుడనై పోయాను. నాకిపుడు పిల్లనెవరిస్తారు? ఐనా నేను అకించనుడిని. నాదంటూ ఏమీ లేనివాణ్ణి. ఇట్టి పరిస్థితుల్లో కాపురం పెట్టడం అత్యంత కష్టసాధ్యం.'

'నాయనా! నీవేం చేస్తావో ఎలా చేస్తావో కాని గృహస్థుని కాకపోతే నీ పితరులమైన మేమంతా పతనమై పోతాము. నీవూ అధోగతి పాలౌతావు' అంటూ ప్రజాపతి రుచి యొక్క పితరులంతా పెనుగాలికి ఆరిపోయిన దీపాల వలె కనిపించకుండా పోయారు.

*(అధ్యాయం - 88)*

## రుచి గావించిన పితృస్తుతి శ్రాద్ధాలలో ఆ స్తుతి పాఠ మాహాత్మ్యం

ఏదో వినయం కొద్దీ తాను అకించనుడననీ తనకెవరూ పిల్లనెవరూఇవ్వరనీ అన్నాడే గాని ఈ రుచి ఒక ప్రజాపతి (రుచి అప్పటికింకా ప్రజాపతి కాదు. ఒక విప్రోత్తముడు మాత్రమే), బ్రహ్మ సంభవుడు, బ్రహ్మర్షి. అందుచేత ఆ మహాత్ముడు స్త్రీ కోసం కాకపోయినా కర్తవ్యోపదేశం కోసం వనంలోకి పోయి ఒకే చోట కదలకుండా కూర్చుని బ్రహ్మనుద్దేశించి నూరు దివ్య సంవత్సరాల పాటు కఠినతపమాచరించాడు.

బ్రహ్మ ప్రసన్నుడై ప్రత్యక్షమై 'విప్రోత్తమా! ఏమి నీ కోరిక?' అని అడిగాడు. సంపూర్ణ విశ్వానికే గతిని ప్రసాదించే బ్రహ్మదేవునికి తన గతిని వివరించి, తన పితరుల అభిలాషను వినిపించాడు రుచి.

'ఓయి విప్రోత్తమా! నీవు ప్రజాపతివికాగలవు. నీ ద్వారా ప్రజలు సృష్టింపబడవలసి వున్నది. ప్రజోత్పత్తిని గావించి నీ పితరులకు శ్రాద్ధ, పిండదానాదులను చేసి వారి అభిలాషను తీరుస్తావు.కాబట్టి నీ పితరులు చెప్పిన స్త్రీ పరిగ్రహణం మిక్కిలి ఉచితమైయున్నది. కాబట్టి ఈ విషయాన్ని ధ్యానమందుంచుకొని నీవు వారినే పూజించు. వారే నీకు సర్వ కామనలనూ నెరవేర్చగలరు. వారికి సాధ్యం కానిది వుండదు. సమ్యక్ పూజకు సంతుష్టులైన పితరులు స్త్రీ, పుత్రులనే అననేల, ఏమైనా ప్రసాదించగలరు' అని చెప్పి అంతర్ధానంచెందాడు బ్రహ్మ.

అప్పుడు మహర్షియైన రుచి నదీతటంపై నొక ఏకాంత ప్రదేశానికి పోయి అక్కడ ముందుగా తన పితరులకు తర్పణాలిచ్చి వారిని సంతృప్తిపఱచాడు. పిమ్మట ఏకాగ్రచిత్తుడై భక్తిపూర్వకంగా ఈ విధంగా స్తుతిస్తూ వారిని ఆరాధించసాగాడు.

*నమస్యేఽహం పితౄన్ భక్త్యాయే వసంత్యధి దైవతం ।*
*దేవైరపి హి తర్ప్యంతే యే శ్రాద్ధేషు స్వధోత్తరైః ॥*

నమస్యేఽహం పితౄన్ స్వర్గే సిద్ధాః సంతర్పయంతియాన్ ।
శ్రాద్ధేషు దివ్యైః సకలైరుపహారై రనుత్తమైః ॥
నమస్యేఽహం పితౄన్ స్వర్గేయే తర్ప్యంతే మహర్షిభిః ।
శ్రాద్ధైర్మనో మయైర్భక్త్యా భుక్తి ముక్తి మభీప్సుభిః ॥
నమస్యేఽహం పితౄన్ భక్త్యాయేఽ ర్చ్యంతే గుహ్యకైర్దివి ।
తన్మయత్వేన వాంఛద్భిరృద్ధి మాత్యంతికీం పరాం ॥
నమస్యేఽహం పితౄన్ మర్త్యైరర్చ్యంతే భువియే సదా ।
శ్రాద్ధేషు శ్రాద్ధయాభీష్ట లోకపుష్టి ప్రదాయినః ॥
నమస్యేఽహం పితౄన్ విప్రైరర్చ్యంతే భువియే సదా ।
వాంఛితాభీష్ట లాభాయ ప్రాజాపత్య ప్రదాయినః ॥
నమస్యేఽహం పితౄన్ యేవై తర్ప్యంతే ఽ రణ్యవాసిభిః ।
వన్యైః శ్రాద్ధైర్యతానిహారై స్తపోర్ధూత కల్మషైః ॥
నమస్యేఽహం పితౄన్ విప్రై ర్నైష్ఠి కైర్ధర్మ చారిభిః ।
యే సంయతాత్మభిర్నిత్యం సంతరప్యంతే సమాధిభిః ।
నమస్యేఽహం పితృశ్ర్చాద్ధై రాజన్యాస్తర్పయంతియాన్ ॥
కవ్యైరశేషైర్విధి వల్లోక ద్వయ ఫలప్రదాన్ ॥
నమస్యేఽహం పితౄన్ శ్వైరర్చ్యంతే భువియే సదా ॥
స్వకర్మాభిరతైర్నిత్యం పుష్పధూపాన్న వారిభిః ।
నమస్యేఽహం పితౄాశ్ర్చాద్ధోశూద్రైరపి చ భక్తితః ।
సంతర్ప్యంతే జగత్ కృత్స్నం నామ్నాఖ్యాతాః సుకాలినః ॥
నమస్యేఽహం పితౄాశ్ర్చాద్ధే పాతాలే యే మహాసురైః ॥
సంతర్ప్యంతే సుధాహారస్త్యక్త దంభమదైః సదా ॥
నమస్యేఽహం పితౄాశ్ర్చాద్ధై రచ్యంతే యే రసాతలే ।
భోగైరం శేషైర్విధివన్నాగైః కామానభీప్సుభిః ॥
నమస్యేఽహం పితౄాశ్ర్చాద్ధైః సర్పైః సంతర్పితాన్ సదా ।
తత్రైవ విధి వన్మంత్రభోగ సంపత్సమన్వితైః ॥
పితౄన్నమస్యే నివసంతి సాక్షాద్యే దేవలోకేఽథ మహీతలేవా ।

తథాంతరిక్షేచ సురారిపూజ్యాస్తే
వై ప్రతీచ్ఛంతు మయోపనీతం ॥
పితౄన్నమస్యే పరమార్థభూతా
యే వై విమానే నివసంత్య మూర్తాః ।
యజంతి యానస్తమలైర్మనోభిః
యోగీశ్వరాః క్లేశవిముక్తి హేతూన్ ॥
పితౄన్నమస్యే దివి యే చ మూర్తాః
స్వధాభుజః కామ్యఫలాభి సంధౌ ।
ప్రదానశక్తాః సకలేప్సితానాం
విముక్తిదాయే ఽనభిసంహితేషు ॥
తృప్యంతు తేఽస్మిన్ పితరః సమస్తా
ఇచ్ఛావతాం యే ప్రదిశంతి కామాన్ ।
సురత్వ మింద్రత్వ మితోఽ ధికం వా
గజాశ్వరత్నాని మహాగృహాణి ॥
సోమస్య యే రశ్మిషుయేఽ ర్కబింబే
శుక్లే విమానే చ సదా వసంతి ।
తృప్యంతు తే ఽస్మిన్ పితరోఽ న్నతోయైః
గంధాదినా పుష్టిమితో వ్రజంతు ॥
యేషాం హుతే ఽగ్నౌ హవిషాచ
తృప్తిర్యే భుంజతే విప్రశరీర సంస్థాః ।
యే పిండ దానేన ముదం ప్రయాంతి
తృప్యంతు తేఽస్మిన్ పితరోన్నతోయైః
యే ఖడ్గమాంసేన సురైరభీష్టైః
కృష్ణాస్తిలైర్దివ్య మనోహరైశ్చ ।
కాలేన శాకేన మహర్షి వయైః
సంప్రీణి తాస్తే ముదమత్ర యాంతు ॥
కవ్యాన్య శేషాణి చయాన భీష్టా
న్యతీవ తేషాం మమ పూజితానాం ।

తేషాంచ సాన్నిధ్య మిహాస్తు పుష్ప
గంధాంబు భోజ్యేషు మాయాకృతేషు ॥
దినేదినేయే ప్రతిగృహ్ణతే ఽర్చాం
మాసాంత పూజ్యాభువి యే ఽష్టకాసు ।
యే వత్సరాంతే ఽభ్యుదయే చ పూజ్యాః
ప్రయాంతు తే మే పితరోఽ త్ర తుష్టిం ॥
పూజ్యాద్విజానాం కుముదేందుభాసో
యే క్షత్రియాణాం జ్వలనార్క వర్ణః ।
తథా విశాంయే కనకావదాతా
నీలీ ప్రభాః శూద్రజనస్యయే చ ॥
తేఽ స్మిన్సమస్తామమ పుష్పగంధ
ధూపాంబు భోజ్యాది నివేదనేన ।
తథాగ్ని హోమేన చయాంతి తృప్తిం
సదాపితృభ్యః ప్రణతోఽ స్మి తేభ్యః ॥
యే దేవపూర్వాణ్యభితృప్తి
హేతో రశ్నంతి కవ్యానిశుభా హృతాని ।
తృప్తాశ్చయే భూతి సృజో భవంతి
తృప్యంతు తేఽస్మిన్ ప్రణతోఽ స్మి తేభ్యః ॥
రక్షాంసి భూతాన్య సురాం స్తథోగ్రాన్
నిర్ణాశయంతు త్వ శివం ప్రజానాం ।
ఆద్యాః సురాణా మమరేశ పూజ్యా
స్తృప్యంతు తేఽ స్మిన్ ప్రణతోఽ స్మి తేభ్యః ॥
అగ్నిష్వాత్తా బహిర్షద ఆజ్యపాః సోమపాస్తథా ।
వ్రజంతు తృప్తిం శ్రాద్ధే ఽస్మిన్ పితరస్తార్పితా మయా ॥
అగ్నిష్వాత్తాః పితృగణాః ప్రాచీం రక్షంతు మే దిశం ।
తథా బహిర్షదః పాంతు యా మ్యాం మే పితరః సదా ।
ప్రతీచీ మాద్యపాస్త ద్వదుదీ చీమపి సోమపాః ॥
రక్షోభూత పిశాచేభ్య స్తథైవాసుర దోషతః ॥

*సర్వతః పితరో రక్షాంకుర్వంతు మమ నిత్యశః ॥*
*విశ్వోవిశ్వభుగారాధ్యో ధర్మో ధన్యః శుభాననః ।*
*భూతిదో భూతకృద్ భూతిః పితౄణాం యే గణానవ ॥*
*కల్యాణః కల్యదః కర్తా కల్యః కల్యతరాశ్రయః ।*
*కల్యతా హేతు రనఘః షడిమే తే గణాః స్మృతాః ॥*
*వరో వరేణ్యో వరదస్తుష్టిదః పుష్టి దస్తథా ।*
*విశ్వపాలౌ తథాధాతా సప్తైతే చ గణాః స్మృతాః ॥*
*మహాన్మహాత్మా మహితో మహిమా వాన్మ మహాబలః ।*
*గణాః పంచ తథైవైతే పితౄణాం పాపనాశనాః ॥*
*సుఖదో ధనదశ్చాన్యో ధర్మదోఽ న్యశ్చ భూతిదః ।*
*పితౄణాం కథ్యతే చైవ తథాగణ చతుష్టయం ॥*
*ఏకత్రింశత్ పితృగణాయై ర్వ్యాప్తమఖిలం జగత్ ।*
*త ఏవాత్ర పితృగణాస్తుష్యంతు చమదాహితాత్ ॥* ***(ఆచార...81/13-49)***

ఈ స్తోత్ర భావంలో పితృదేవతల మాహాత్మ్యాన్ని తెలిపే విశేషాలు చాలానే కనిపిస్తాయి. వీరు ఆకాశంపై ఆధిపత్యాన్ని వహిస్తారు. శ్రాద్ధ సమయంలో దేవతలు కూడా స్వధామంత్రాల' ద్వారా వీరిని ప్రసన్నం చేసుకుంటారు. స్వర్గంతో సహా అన్ని లోకాల్లోనూ వుండే మహర్షులు మానసిక శ్రాద్ధాల ద్వారా వీరిని తృప్తి పరుస్తారు. వారి భుక్తి ముక్తి కామనలను పితృ దేవతలు తీర్చగలరు. స్వర్గంలోని సిద్ధులు వివిధ ఉపహారాల ద్వారా పితృదేవతలను సంతృప్తి పఱుస్తారు. అలాగే గుహ్యకాదుల కూడా. పృథ్విపై శ్రాద్ధాలను శాస్త్రోక్తంగా పెట్టేవారికి వీరు ఉత్తమ గతులను కల్పించగలరు. ఈ కర్మను చేయించే బ్రాహ్మణులను వీరే ప్రాజాపత్య లోకానికి పంపిస్తారు.

తపస్సు చేసుకుంటూ నిర్ధూతకల్మషులై, సంయతాహారులై వనంలో నివసించే మహామునులు కూడా వనంలో దొరికే పదార్థాలతో శ్రాద్ధకర్మలను చేసి వీరిని ప్రసన్నులను చేసుకుంటారు. నైష్ఠిక బ్రహ్మచారులూ, ధర్మాచారులూ, జితేంద్రియులూ కూడ వీరిని అపర కర్మల ద్వారా పూజించి ధన్యులౌతారు. పృథ్విపై గల నాలుగు వర్ణాల వారూ వీరికి శ్రాద్ధాలను పెట్టి ఉత్తమ గతులనందుకోగలుగుతున్నారు.

పాతాళంలో వుండే రాక్షసులు సైతం తమ దంభాహంకారాలను పక్కకు పెట్టి వినయంగా భక్తితో పితరులకు పిండప్రదానం చేస్తారు. రసాంతలాది ఇతర లోకాలలోని నాగాది జాతుల వారూ అలాగే చేస్తారు. దేవతలూ అంతే.

పరార్థం కోసం, అనగా ఇతరులకుపయోగపడడం కోసం, పితృయోనిలో వుండి కూడా, అమృతరూపులై విమానాల్లో ప్రయాణిస్తూ, నిర్మల మనస్సుతో, కష్టాల పాలైన యోగులకు, వాటి నుండీ, వారు కోరుకుంటే జీవితం నుండీ కూడా ముక్తిని ప్రసాదిస్తూ వుంటారు పితృదేవతలు. దేవతాకారాలను ధరించి స్వర్గంలో నివసిస్తూ, స్వధాభోజులై తమ పుణ్యఫలాన్నొక వంక అనుభవిస్తూనే మర్త్యాది లోకాల్లో తమను పూజించేవారికి పితృదేవతలు ఈప్సితార్థ సిద్ధిని కలిగిస్తుంటారు. ఏ కోరికాలేని వారికి కైవల్యాన్ని ప్రసాదించే సామర్థ్యం కూడ వారికి వుంటుంది.

అగ్నిలో వ్రేల్చిన హవిష్యాహుతులకు సంతృప్తి చెంది బ్రాహ్మణుని శరీరంలో ప్రవేశించి శ్రాద్ధ భోజనాన్ని స్వయంగా స్వీకరించే పితృదేవతలకు నమస్కరిస్తున్నానని ఇంకా అనేక విధాలుగా పితృ దేవతల మాహాత్మ్యాన్ని అభివర్ణిస్తూ రుచి ప్రజాపతి పితృస్తుతి కొనసాగింది.

మార్కండేయుడు క్రౌంచుడితో ఈ కథను చెప్పటంలో భాగంగా ఇలా అన్నాడు. హే క్రౌంచిక మునిశ్రేష్ఠా! రుచి ద్వారా ఈ విధంగా స్తుతింపబడిన తేజస్స్వరూపులైన ఆతని పితృగణం వారందరూ దశదిశలనూ వెలుగులతో నింపేటంత ప్రకాశంతో భాసిస్తూ అతనికి ప్రత్యక్షమయినారు. అతడు వారిలో ప్రతి ఒక్కరినీ మంత్ర సహితంగా గంధాక్షతాదులతో పూజించాడు. పితరులు మిక్కిలి ప్రసన్నులై ఏం కావాలో కోరుకొమ్మన్నారు. రుచి తనను బ్రహ్మదేవుడు ప్రజాపతివి కమ్మని ఆదేశించాడని విన్నవించి దానికి కావలసిన సంతానోత్పత్తి సామర్థ్యాన్నీ, తనకు తగిన, శ్రేష్ఠురాలైన, దివ్యపత్నినీ ప్రసాదించమని వేడుకున్నాడు.

పితృదేవతలు రుచితో ఇలా చెప్పారు. 'ఓ మునిసత్తమా! నాయనా! ఈ క్షణంలోనే ఇక్కడే నీవు కోరుకొన్న పత్ని లభిస్తుంది. నీకామె ద్వారా పరమ పరాక్రమశాలి, మహాత్ముడు, బుద్ధిమంతుడు, ఈ మన్వంతరానికి మూడులోకాలకూ అధిపతి కాగల రౌచ్యుడనే కొడుకు పుడతాడు. అతడు బహుపుత్రవంతుడవుతాడు. నీవు ప్రజాపతివై నాలుగు వర్ణాల ప్రజలనూ సృష్టించి చివరిలో ధర్మ, తత్త్వజ్ఞానాన్ని పొంది సిద్ధినొందుతావు.

ఇక నీ స్తోత్రం మమ్మెంతో సంతోష పెట్టింది. కాబట్టి మేము ఇకపై ఈ స్తోత్రం ద్వారా భక్తిశ్రద్ధలతో మమ్ము ప్రార్థించిన వారి పట్ల సుప్రసన్నులమై వారికి ఉత్తమ భోగాలనూ, ఆత్మ విషయక ఉత్తమ జ్ఞానాన్నీ, ఆయురారోగ్యాలనూ, పుత్రపౌత్రాదులనూ ప్రదానం చేస్తాము. శ్రాద్ధకర్మలో బ్రాహ్మణులు భోజనం చేస్తున్నపుడు వారికెదురుగా చేతులు జోడించి నిలబడి ఈ స్తోత్రాన్ని ప్రీతిపూర్వకంగా చదివితే మేమంతా అక్కడికి విచ్చేసి ఆ శ్రాద్ధఫలితాన్ని అక్షయం చేస్తాం.

ఏ శ్రాద్ధకర్మలోనైతే ఈ స్తోత్రం చదువబడుతుందో అక్కడ మేము పన్నెండు సంవత్సరాలకు సరిపడునట్లుగా తృప్తి నొందుతాము. హేమంతర్తువులో ఈ స్తవనం చేయువానిపై మా అనుగ్రహం పన్నెండేళ్ళ వఱకూ, శిశిరంలోనైతే ఇరవై నాలుగు, వసంత, గ్రీష్మర్తువుల్లోనైతే పదహారు సంవత్సరాల దాకా ఆ వ్యక్తి పైన ప్రసరిస్తూ వుంటుంది. వర్షాకాలంలో శ్రాద్ధ సమయంలో చదవబడే ఈ స్తుతి మా అందరికీ అక్షయ తృప్తినిస్తుంది. అంటే మా అనుగ్రహం కూడా ఆ వ్యక్తిపై అక్షయంగా వుంటుంది. ఇక శరత్కాలంలో శ్రాద్ధ సమయంలో ఈ స్తోత్ర పఠనాన్ని గావిస్తే మేము పదిహేనేళ్ళపాటు తృప్తినొందుతాము.

నాయనా రుచీ! ఈ సంపూర్ణ స్తోత్రం ఒకచోట వ్రాయబడి ఏ గృహంలోనైతే భద్రంగా వుంచబడుతుందో ఆ ఇంటికి శ్రాద్ధకర్మ జరిగే వేళ మేమంతా స్వయంగా విచ్చేసి ఆ యజమానిననుగ్రహిస్తాము. కాబట్టి ఓ మహాభాగా! మాకు శ్రాద్ధం పెట్టువారు బ్రాహ్మణ భోజన సమయంలో ఈ నీ ప్రవచిత స్తుతిని తప్పక వినిపించాలి' అని చెప్పి పితరులు అంతర్ధానం చెందారు.

**(మానవజాతికి పితరులు చేసిన ఈ వాగ్దానం శ్లోకరూపంలో అనుబంధం -10లో చూడండి.)**

తరువాతి కథను మార్కండేయ మహాముని ఇలా చెప్పాడు. పితృదేవతల కృప వల్ల ఆ సమయంలోనే ఆ నది మధ్య నుండి ప్రంలోచ అను పేరు గల అప్సర ఆవిర్భవించింది. మనస్సుకి ప్రీతిని కలిగించే అందంతో బాటు అన్ని శుభలక్షణాలూగల వేరొక కన్య ఆమె వెనుకనే వచ్చి నిలబడి రుచికి నమస్కరించింది. ప్రంలోచ ఆతనితో 'హే తపస్విశ్రేష్ఠా! నేనొక అచ్చరను. వరుణపుత్రుడూ, మహాత్ముడూనైన పుష్కరుని ద్వారా నాకీ అతిశయ సుందరియైన కూతురు జన్మించింది. నీకు భార్యగా ఈ మానిని అను పేరు గల సౌందర్య రాశిని దేవతలు నిశ్చయించారు. మీరు ఈమెను పరిగ్రహించండి. మీ దంపతులకు మనువే పుత్రునిగా పుడతాడు' అని చెప్పింది.

'అలాగే' అని సమ్మతించి ఆ నదీ తీరానికే మహామునులందరినీ పిలిపించి వారి సమక్షంలో శాస్త్రోక్తంగా రుచి ఒక యింటి వాడయినాడు. వారి పుత్రుడే పదమూడవ మనువు రౌచ్యుడు' అని చెప్పి మార్కండేయ ముని క్రౌంచునికి అతిథి సత్కారాన్ని గావించి వీడ్కొలిపాడు"

***(అధ్యాయాలు - 89,90)***

# విష్ణు భగవానుని అమృత ధ్యానస్వరూపం

"శౌనకాది మహామునులారా! స్వాయంభువ మనువాదిగా ఎందరో మహామునులు నిరంతరం, వ్రత, యమ, నియమ, పూజా, స్తుతి, జపసహితంగా నిరతులైవుండి శ్రీహరిని ధ్యానిస్తుంటారు. వారు ధ్యానించే విష్ణు భగవానుడు, దేహేంద్రియ, మనో బుద్ధ్యహంకార ములు లేనివాడు; రూపరహితుడు. ఆయన పంచభూతములచే అసంబద్ధుడు. ఆతడే అన్ని ప్రాణులకూ స్వామిగా, అందరినీ బంధనాలలో వుంచి నడిపించే నియంతగా, జగత్ప్రభువుగా విశ్వాన నెలకొనివున్నాడు. ఆయన చైతన్యరూపుడే కాని నిరాకారుడు. ఏ ఆసక్తీ లేనివాడైనా అందరి ఆసక్తులనూ తెలిసికొనగలడు. అందరు దేవతల చేత పూజింపబడు మహేశ్వరుడూ ఆయనే. తేజః స్వరూపుడై సత్త్వరజస్తమోగుణ భిన్నుడై కర్తృత్వాదిశూన్యుడై వెలుగొందువేల్పు విష్ణువు.

ఆయన వాసనారహితుడు, శుద్ధుడు, సర్వదోషరహితుడు, పిపాసావర్జితుడు, శోకమోహాదులకు బహుదూరుడు. జరామరణాలు ఆయనకుండవు, మోహాము ఆయననంటదు. సృష్టిగాని ప్రళయంగాని ఆయనకు లేవు. శ్రీహరి సత్యస్వరూపుడు, నిష్కల పరమేశ్వరుడు, నామరహితుడు, జాగ్రత్ స్వప్నసుషుప్తిరహితుడు. అవస్థాదులకు అధ్యక్షుడు, శాంతస్వరూపుడు, దేవాధిదేవుడు ఆయనే. జాగ్రదాది మన అన్ని అవస్థలలోనూ వుండేవాడు, నిత్యుడూ ఆయనే గాని ఆయన మాత్రం కార్యకారణరహితుడు.

అందరికీ అందరి ద్వారా కనిపించే మూర్త స్వరూపుడు, సూక్ష్మతమ స్వరూపుడు శ్రీహరి. అంటే కొండకంటే పెద్దవానిగానూ, చీమకంటె చిన్నవానిగానూ కనబడగలడు. జ్ఞానదృష్టి గల కర్ణేంద్రియానికి వినబడగలడు. జ్ఞానులకు విజ్ఞానమూ దివ్యదృష్టీ గలవారికి పరమానంద స్వరూపము ఆయనే. విష్ణువును కనుగొనడానికి మామూలు జ్ఞానం చాలదు. తురీయ అనగా అత్యుత్తమ జ్ఞానం వున్నవాడికి ఆయన పరమాక్షర స్వరూపం తెలుస్తుంది. అన్ని ప్రాణుల ఆత్మ స్వరూపుడూ, సాక్షాత్కల్యాణ స్వరూపుడూ, శివమునిచ్చువాడూ, వికారహీనుడూ, వేదాంతవేద్యుడూ, వేదాంతవేద్యుడూ, వేదరూపుడూ, ఇంద్రియాతీతుడూ, భూతేశ్వరుడూ, శబ్ద రూప రస స్పర్శ గంధాలనెడి పంచతన్మాత్ర రహితుడైన అనాది బ్రహ్మమూ ఆయనే. ఈ శ్రీ మహావిష్ణువే పరమయోగి, పరమహంసల ద్వారా సంపుటిత బ్రహ్మరంధ్రంలో 'అహం బ్రహ్మాస్మి' అనే భావానికి మూలమై పరిజ్ఞానమాత్రుడై వుంటాడు. జితేంద్రియుడై ఈ జ్ఞానాన్ని పొంది హరిని 'చూడ' గలిగిన ఏ మానవుడైనా పరబ్రహ్మ స్వరూపుడు కాగలడు.

'ఇక విష్ణుని –అనగా నా యొక్క **మూర్తధ్యాన స్వరూపము**ను వినిపిస్తాను' అంటూ విష్ణువిలా వినిపించాడని సూతమహర్షి శౌనకాది మహామునులకు చెప్పసాగినాడు.

విష్ణువు కోటి సూర్య ప్రభాసంపన్నుడు, అద్వితీయ జయశీలుడు, కుందపుష్పగోదుగ్ధ సమాన ధవళ వర్ణుడు. మోక్షాన్ని కోరుకొనే మునీశ్వరులు ఇట్టి స్వరూపంలో నున్న శ్రీహరిని ధ్యానిస్తారు. ఆ స్వరూపం అత్యంత సుందరం. విశాలమైన శంఖంతో, సహస్ర సూర్యప్రభాకలితమై ప్రచండ జ్వాలామాలతో చుట్టబడిన ఉగ్రరూపం గల చక్రంతో, శాంత స్వభావం ప్రస్ఫుటమగుచున్న సుందరవదనంతో, రక్షణకే పుట్టినట్లుగా చేతిలో సిద్ధంగా నున్న గదతో విరాజిల్లే రూపమిది.

ఈ శ్రీ మహావిష్ణువు రత్నములతో దేదీప్యమానమైన బహుమూల్య కిరీటాన్ని ధరించి వుంటాడు. కమలాన్నీ ధరిస్తాడు. వనమాలాధారియై సమాన భుజస్కంధాలతో, స్వర్ణ భూషణాలతో, శుద్ధ వస్త్రధారియై, విశుద్ధ దేహం సుందరకాంతులీనుచుండగా వెలుగులను విరజిమ్ముతూ సర్వకల్యాణకారకమైన కమలంపై నిలబడివుంటాడు.

శ్రీ మహావిష్ణువు స్వర్ణమయ శరీరుడై సుందర హారాలతో, శుభంకర భుజకీర్తులతో, రత్నకంకణ కేయూరాలతో, అలంకరింపబడి తన కాంతిలో అవి మెరుస్తుండగా, కౌస్తుభమణి ఒక వైపు, లక్ష్మీదేవి మరొకవైపు ఒదిగియుండగా శోభాయమాన నేత్రాలలో కరుణ తొణికిసలాడుతుండగా వెలుగులు విరజిమ్ముతుంటాడు.

అణిమాది గుణసహితుడై జగత్సృష్టి సంహారాలను కావిస్తుండే శ్రీ మహావిష్ణువు మునులకు, దేవతలకు, దానవులకు కూడా ధ్యానగమ్యుడు, అత్యంత సుందరుడు. బ్రహ్మాది దేవతల నుండి సమస్త ప్రాణివర్గం యొక్క హృదయాలలో శ్రీహరియే ప్రాణమై వెలుగుతుంటాడు. సనాతనుడు, అవ్యయుడు, అన్నిటినీ అందరినీ మించిన కృపాళువు, ప్రభువు, నారాయణుడు, దేవాధిదేవుడునైన శ్రీహరి మకరాకృతిలో నున్న కర్ణకుండలాలతో శోభిల్లుతుంటాడు. ఆయనే దుఃఖవినాశకుడు, పూజకు అర్హుడు, మంగళమయుడు, దుష్ట సంహారకుడు, సర్వాత్ముడు, సర్వస్వరూపుడు, సర్వత్రగామి, భక్తుల సర్వగ్రహ దోష నివారకుడు నైన భగవంతుండు.

ఆయన నఖాల నుండి చల్లని వెన్నెలలు కురుస్తున్న అనుభూతి కలుగుతుంది. సుందరములైన వేళ్ళు వేణువాదకుని వేళ్ళ వలె మృదువుగా వెలుగ్గా వుంటాయి. జగత్తుకే శరణ స్థలం జగన్నాథుడైన విష్ణువు. అందరికీ సుఖము నిచ్చు సంకల్పం, శక్తి ఆయనకున్నవి. సమస్త అలంకారాలచే అలంకృతుడై, ఆ భూషణాలే తమ పుణ్యాన్ని చూసుకొని మురిసి మెరసి పోతుండగా, సుందర దేహమంతటా చందనపు పూత చల్లటి అందాన్నిస్తుండగా

సౌమ్య రూపుడై, సర్వదేవసమన్వితుడై 'నేనే అందరిలో నివసించి రక్షించు వాసుదేవుడను' అనే భావనతో భాసించువాడు శ్రీ మహా విష్ణువు. అందరి భావనలలో వుండేది కూడా ఆ వాసుదేవుడే సూర్యమండలంలో వెలుగుతూ అగ్నిలో మండుతూ కనిపించేది కూడా ఆయనే.

ఇట్టి స్వరూపమున్న విష్ణుభగవానుని ధ్యానించు మానవులు పరమగతిని పొందగలరు. ప్రాచీన కాలంలో యాజ్ఞవల్క్య మహర్షి ఈ విష్ణు స్వరూపాన్నే ధ్యానించి ధర్మోపదేశ కర్తృత్వార్హత పొంది స్మృతికారునిగా చరిత్రలో నిలిచిపోయాడు. ఈ అధ్యాయాన్ని శ్రద్ధగా చదివిన వారికి కూడా పరమగతి ప్రాప్తిస్తుంది. ***(అధ్యాయాలు - 91,92)***

# వర్ణధర్మ నిరూపణ

శౌనకాది మహామునులారా! పరమ శివుని ప్రార్థన మేరకు మహావిష్ణువు యాజ్ఞవల్క్య మహర్షి ప్రతిపాదించిన ధర్మాలను ఇలా ఉపదేశించాడు.

యాజ్ఞవల్క్య మహర్షి మిథిలాపురిలో నున్నపుడు చాలామంది ఋషులు ఆయన వద్దకు వచ్చి ధర్మజ్ఞానాన్ని ప్రసాదించుమని ప్రార్థించారు. అన్ని వర్ణాలవారూ చేయవలసిన దానధర్మాది కర్తవ్యాలను వినగోరారు. వారికేది బోధించినా లోకకల్యాణానికే ఉపయోగపడుతుంది.

జితేంద్రియుడైన యాజ్ఞవల్క్యమహాముని సర్వప్రథమంగా విష్ణుభగవానుని ధ్యానించి ఆ ఋషులతో ఇలా చెప్పసాగాడు.

'మునులారా! ఏ దేశంలోనైతే కృష్ణసారమను పేరు గల మృగాలు తిరుగాడుతుంటాయో అదే ప్రపంచంలో పరమ పవిత్రమైన దేశం. (ఇదే నేటి భారతదేశం) ఆ దేశానికి చెందిన ధర్మాదిక విషయాలను వినిపిస్తాను.

పురాణాలూ, న్యాయశాస్త్రం, మీమాంస, ధర్మశాస్త్రాలు, శిక్ష, కల్పం, నిరుక్తం, వ్యాకరణం, ఛందం, జ్యోతిషంతో బాటు నాలుగువేదాలూ - ఇవే ఈ దేశంలోని పదునాలుగు విద్యలకూ ఆద్య స్థానాలు. మనువులు, విష్ణువు, యముడు, అంగిరుడు, వసిష్ఠుడు, దక్షుడు, సంవర్తుడు, శతాతపుడు, పరాశరుడు, ఆపస్తంబుడు, ఉశనుడు, వ్యాసుడు, కాత్యాయనుడు, బృహస్పతి, గౌతముడు, శంఖలిఖితుడు, హారీతుడు, అత్రి, అల్పజీవినైన నేను- మేమంతా ఆ శ్రీహరిని ధ్యానించి తద్వారా ధర్మోపదేశకులమైనాము.

ధర్మమనగా పుణ్యమే. పుణ్యానికి ఉత్పత్తి హేతువులు. శాస్త్ర విహిత దేశంలో, శాస్త్ర విహిత కాలంలో, శాస్త్ర విహితమైన ఉపాయంతో, యోగ్యులైన పాత్రులకు - అనగా

విద్యచే తపముచే సమృద్ధులైన బ్రాహ్మణులకు– చేయబడు దానములు, సర్వశాస్త్రోక్త కర్మలు. ఈ దానాలూ ఈ కర్మలే పుణ్యము యొక్క ప్రత్యేక, విభిన్న రూపాలని తెలుసుకోవాలి. ధర్మ లేదా పుణ్యమునుత్పత్తి చేసే ఈ దాన, కర్మముల ముఖ్య ఫలం – అనగా పరమ ధర్మం యోగం (చిత్త వృత్తి నిరోధం) ద్వారా కలిగే ఆత్మదర్శనం లేదా ఆత్మసాక్షాత్కారమే. ఈ సాక్షాత్కారానికి దేశ కాల నియమాలుండవు. అది ఎప్పుడైనా ఎక్కడైనా యోగం ద్వారా కలుగవచ్చును. అయితే దానాలకూ, కర్మలకూ దేశకాల పాత్రల ఆవశ్యక ముంటుంది. వీటిలో కొన్ని మార్పులు చేర్పుల విషయంలో సందేహాలుంటే వాటిని పరిషత్ అనగా ధర్మసభ తేల్చి చెప్పాలి. ఈ ధర్మ పరిషత్తు వేద, ధర్మశాస్త్ర పరిజ్ఞానులైన ముగ్గురు, నలుగురు సద్బ్రాహ్మణులతో నేర్పడి వుంటుంది. ఇదే కాక జనవంద్యుడైన బ్రహ్మవేత్త, వేదశాస్త్ర జ్ఞాతయైన బ్రాహ్మణుని మాటకు కూడా విలువ వుంటుంది.

ఈ దేశంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రములను నాలుగు వర్ణాలున్నాయి. ***(ఇవి కులాలు కావు. ఆనాటి సమాజంలో వ్యక్తుల కర్మాచరణను బట్టి ఏర్పడిన వ్యవస్థలో భాగాలు మాత్రమే...అను.)*** వీరిలో పై మూడు వర్ణాల వారినీ ద్విజులంటారు. గర్భాదానము నుండి శ్మశాన పర్యంతము వీరి సమస్త క్రియలనూ మంత్రాల ద్వారానే చేయాలి.

గర్భాదాన సంస్కారం ఋతుకాలంలోనే చేయాలి. గర్భస్పందనకు పూర్వమే పుంసవన సంస్కారం చేయబడాలి. గర్భాదానానికి ఆరవ లేదా ఎనిమిదవ నెలలో సీమంతోన్నయన సంస్కారం చేస్తారు. సంతానోత్పత్తి తరువాత జాతకర్మ, పదకొండవ రోజున నామకరణ సంస్కారం విధాయకాలు. నాలుగవ నెలలో నిష్క్రమణ, ఆరవ నెలలోఅన్నప్రాశ్న సంస్కారాలు గావించాలి. తరువాత వంశాచారాన్ని బట్టి చూడాకరణ సంస్కారాన్ని నెరవేర్చాలి.

ఇలా సంతానానికి విహిత సంస్కారాలను శాస్త్రోక్తంగా దానాదికయుక్తంగా చేయడం వల్ల బీజ (శుక్ర), గర్భ (శోణిత) కారణోత్పన్నాలైన సర్వపాపాలూ నశిస్తాయి. స్త్రీలకు చేసే సంస్కారాలు (పేరంటాలు) వివాహం తప్ప అన్నీ సామాన్యంగా అమంత్రకాలే. అంటే మంత్రం అక్కరలేదు.

గర్భధారణ నుండిగాని జన్మగ్రహణ నుండి గాని లెక్కగట్టి ఎనిమిదవయేట బ్రాహ్మణునికీ, పదకొండవ వర్షంలో క్షత్రియునికీ, పన్నెండవ సంవత్సరంలో వైశ్యునికీ ఉపనయన సంస్కారాన్ని సంపన్నం చేయాలి. దీన్ని గురువు చేత గాని, వంశాచారాన్ని బట్టి కాని చేయించాలి. ఈ విధంగా ఉపనీతుడైన వటువుకు గురువు మహావ్యాహృతిసహిత వేదాన్ని చదివి చెప్పే శక్తి వచ్చేలా చెయ్యాలి. అలాగే శౌచాచార శిక్షనీ ప్రదానం చెయ్యాలి.

ద్విజులు పొద్దున్న సాయంత్రవేళల్లో ఉత్తరం వైపు తిరిగి, అదే రాత్రయితే దక్షిణాభిముఖంగానూ మల విసర్జనం చేయాలి. తరువాత మలమూత్రాలు వాసన పోయేదాక మట్టితో నీటితో కడుక్కోవాలి. ఈ పనిని జలాశయ మధ్యంలో చేయరాదు. నూతుల వంటి వాటి వద్ద క్రింద చప్టాలపై కానివ్వవచ్చును. తరువాత శుద్ధస్నానానికి పోయి ఇరుపాదాలనూ శుభ్రంగా కడుక్కోవాలి. తరువాత మోకాళ్ళపై చేతులనుంచి తూర్పు లేదా ఉత్తరం వైపు కూర్చుని ★బ్రహ్మతీర్థాచమనము చేయాలి.

కూప, తటాకాది శుద్ధజలాలతో మూడుమార్లు ఆచమనం చేసి అంగుష్ఠమూలంతో రెండుమార్లు పెదవులను స్పృశించాలి. స్నానం ద్వారా శుద్ధి చెందవలసి వచ్చినపుడు ద్విజులు నురగ, బుడగలు లేని నీటితో సర్వేంద్రియాలనూ శుభ్రపఱచుకోవాలి. నదిలోగాని మరే జలాశయంలోగాని గుండెదాకా దిగి బ్రాహ్మణులూ, గొంతు దాకా దిగి క్షత్రియులూ, తాలువుకి కొంచెం కింది దాకా దిగి వైశ్యులూ ఆచమనం చేసి శుద్ధులౌతారు. స్త్రీలూ, శూద్రులూ తాలువు దాకా దిగి ఆచమనం చేస్తే శుద్ధులౌతారు.

ప్రాతఃస్నానంలో జలదైవత మంత్రమైన ***ఓం ఆపోహిష్ఠా...***ను పూర్తిగాపలుమార్లు పఠిస్తూ ఒళ్ళు తోముకోవడాన్ని పూర్తిచేసి జలాన్ని పోసుకుంటూ ప్రాణాయామ, సూర్యోపత్థాన, గాయత్రి మంత్ర పఠనం అనే పనులను కూడా చేసుకోవాలి.

***ఓం ఆపోజ్యోతీ...*** మున్నగు మంత్రాలు గాయత్రి మంత్రానికి శిరోభాగాలు. ఈ శిరోభాగయుక్తమైన ప్రతి మహావ్యాహృతికీ ఒక్కొక్కమారు ప్రణవాన్ని జోడించి మూడు మహావ్యాహతులతో గాయత్రి మంత్ర మానస జపాన్ని చేస్తూ నోటిలో ముక్కులో కదలుతుండే గాలిని నియంత్రించాలి.

సాయంకాలం ప్రాణాయామం చేసి మూడు జలదేవత మంత్రాలను చదివి నీటిని తలపై చిలకరించుకొని పశ్చిమం వైపు కూర్చుని నక్షత్రదర్శనమయ్యే దాకా గాయత్రిని జపించాలి. ఇలాగే ఉదయసంధ్యలో కూడా గాయత్రిని జపిస్తూ తూర్పు వైపు తిరిగి సూర్యోదయం దాకా స్థిరంగా కూర్చుని వుండాలి. ఈ రెండు సందెలలోనూ వంశాచారాన్ని బట్టి సంధ్యావందనం చేయాలి. తరువాత అగ్నిహోత్ర కార్యమును కూడా చేయాలి.

తరువాత 'నేను అముకుడను' (ఏమీ రానివాడను) అంటూ వృందజనులకు అనగా గురువులకూ, వృద్ధులకూ ప్రణామం చేయాలి. అటుపిమ్మట సంయమియైన బ్రహ్మచారి ఏకాగ్రచిత్తుడై, (ఆలోచనలను అటూ ఇటూ కదలాడనీయకుండా) స్వాధ్యాయం చేసుకొని

---

★ *కుడిచేతిలో బొటన వేలి మూలాన్ని బ్రహ్మతీర్థమనీ, చిటికెన వేలి, చూపుడు వేలి మూలాలను క్రమంగా ప్రజాపతి, పితృతీర్థాలనీ, కరాగ్రభాగాన్ని దేవతీర్థమనీ వ్యవహరిస్తారు.*

గురువుగారికి తనను తాను అధీనం చేసుకోవాలి. ఆయన పిలిచినపుడు పోయి విద్య నేర్చుకోవాలే గాని 'నేర్పండి' అని అడగడం సరికాదు. అడగడమే అవిధేయత. భిక్షాటన చేసి తెచ్చిన ద్రవ్యాన్ని గురుపాదాల వద్ద సమర్పించాలి. మనసు, మాట, శరీరము – ఈ మూడింటినీ ఎల్లపుడూ గురువుగారి హితంలోనే సంలగ్నం చేయాలి.

బ్రహ్మచారి దండము, మృగచర్మము, యజ్ఞోపవీతము, ముంజమేఖల – అను వాటిని గౌరవంగా భావించాలి. అవే అతనికొక గుర్తింపునిస్తాయి. ఏ వర్ణం వారైనా బ్రహ్మచారిగా నున్నంతకాలం భిక్షాటనం చేయవలసినదే. బ్రాహ్మణుల గృహములకు పోయి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణులు క్రమంగా ***భవతి భిక్షాందేహి, భిక్షాంభవతి దేహి, భిక్షాం దేహిభవతి*** అనే వాక్య ప్రయోగంతో యాచించాలి. భవతి అనగా 'అమ్మా' అని ఆ యింటి స్త్రీమూర్తిని సంబోధించుట.

భిక్షాటనానంతరము ఆశ్రమానికి వచ్చి అగ్నికార్యం చేసుకొని గురువుగారి ఆజ్ఞ అయినాక ఆపోశన క్రియను పూర్తిచేసి సమానులతో కలిసి కూర్చుని వినయపూర్వకంగా ఆపో౽శన [1]పట్టాలి. తరువాత భిక్షాన్నమును నిందించకుండా, ప్రీతి పురస్సరంగా తినాలి. మౌనంగా భోంచేయాలి. బ్రహ్మచర్య వ్రతంలో నున్నంత కాలం, కఱువు కాటకాలు లేని రోజుల్లో, రోజూ ఒకేచోట కాకుండా భిక్షాటన చేయాలి. బ్రహ్మచర్యాన్ని నియమ, నిష్ఠలతో పాటిస్తూ మితంగానే భుజిస్తూ గడపాలి. ఎవరైనా తద్దినం, శ్రాద్ధభోజనాలకి పిలిస్తే మాత్రం పోయి వారు పెట్టినవన్నీ తినాలి. ఎందుకంటే పితృదేవతలు బ్రాహ్మణరూపంలో వచ్చి భుజిస్తారు కాబట్టి. ఆ వేళలో కూడా తేనె, మద్యం, మాంసం, ఎంగిలి పదార్థాలను స్పృశించరాదు.

బ్రహ్మచారి చేత విధివిహిత క్రియలన్నిటినీ చక్కగా చేయించి, వానికి వేదమునందు శిక్షణ నిచ్చినవాడే 'గురు' శబ్దానికర్హుడు. యజ్ఞోపవీతధారణ మాత్రమే చేయించి వేదాన్ని చెప్పే వానిని 'ఆచార్యు'డంటారు. వేదంలోని ఒక ★ 'దేశా'[1]న్ని మాత్రమే అధ్యయనం చేయించిన వానిని 'ఉపాధ్యాయుడ'ని వ్యవహరిస్తారు. ఒక యజమానిచే 'వరించ' బడి అనగా గౌరవం మీరగా పూజింపబడి అతనిచే యజ్ఞమును సంపన్నము చేయించేవానిని 'ఋత్విక్' అంటారు. బ్రహ్మచారిగా నున్నవానికి, ఆ తరువాతి కాలంలో కూడా ఈ నలుగురూ యథాక్రమంగా పూజార్హులే. వీరందరికంటే పూజ్యురాలు తల్లి.

---

*[1] భోజనానికి ముందు ఒకసారి చివరనొకమారు నీటితో ఆచమనం చెయ్యడాన్ని ఆపోశన లేదా అవుపోసన అంటారు. ఈ సమయంలో అమృతోపస్తరణమసి అనే వాక్యమును చదవాలి.*

*★ మంత్రమనీ బ్రాహ్మణమనీ వేదానికి రెండు రూపాలుంటాయి. ఇందులో ఒక రూపాన్ని గానీ ఆ రూపంలోని ఒక భాగాన్ని గానీ బోధించడాన్ని 'ఏకదేశాధ్యాపన' మంటారు.*

నాలుగు వేదాలూ అధ్యయనం చేయదలచుకొన్నవారు ఒక్కొక్క వేదానికీ పన్నెండేసి సంవత్సరాల చొప్పున బ్రహ్మచర్య వ్రతాన్ని పాటించాలి. అంతకాలం పాటు ఆశ్రమంలో నుండుట సాధ్యపడని వారు అతిశయధీమంతులు అయితే అయిదేసి యేళ్ళకే ఈ వ్రతాన్ని కుదించుకోవచ్చు. కేశాంత సంస్కారము, పదహారవ, ఇరువది రెండవ, ఇరువది నాల్గవ యేట, క్రమంగా, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు చేయబడాలి. ఈ వర్ణాల వారికి ఉపనయనం కూడా క్రమంగా ఆయా వయసు పూర్తయ్యేనాటికి తప్పనిసరిగా చేయబడివుండాలి. లేకుంటే వారు పతితులై, సర్వధర్మాచ్యుతులై పోతారు. వ్రాత్యస్తోమమను క్రతువును చేసిన తరువాత, అదీ కొంతకాలం గడచిన తరువాతనే వారికి మరల యజ్ఞోపవీతధారణకు యోగ్యత కలుగుతుంది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణ పురుషులకు ద్విజులని పేరు. ద్వి..జ.. అనగా రెండుమార్లు పుట్టినవారని.తల్లి కడుపున తొలిసారి పుడతారు కదా!అది కాక ఉపనయన మైనపుడు మరల పుడతారు. అది రెండవ జన్మ కింద లెక్క. కాబట్టి వారు ద్విజులు.

శ్రౌత–స్మార్త యజ్ఞాలనూ, తపశ్చర్య (చాంద్రాయణాది వ్రతాలు)నూ, శుభకర్మలనూ (ఉపనయనాది సంస్కారాలు) బోధించగలిగేది వేదమొక్కటే. ద్విజులకు, అందుకే, వేదమే పరమ కల్యాణ సాధనము. అలాగే వేదమూలకములగు స్మృతులు కూడ.

వేదాధ్యయనం చేయగనే సరికాదు. ప్రతిదినం ఋగ్వేదమునధ్యయనం చేసేవాడు దేవతలను తేనెతోనూ పాలతోనూ, పితరులను తేనెతోనూ, నేతితోనూ తృప్తిపఱచాలి. అంటే శాస్త్రోక్తంగా పూజించి నైవేద్యం పెడితే వారు దిగివచ్చి స్వీకరించి సంతసిస్తారు. మిగతా మూడు వేదాలలో దేనిని ప్రతిదినం అధ్యయనం చేసే వారైనా నేతితో అమృతంతో పితరులనూ దేవతలనూ సంతోషపెట్టాలి. అలాగే ప్రతిదినం [1]వాకోవాక్యం, పురాణం [2]నారాశంసీ, [3] గాథికా, ఇతిహాసాలు [4] విద్యా...లను అధ్యయనం చేసే ద్విజుడు పితరులనూ దేవతలనూ, మాంసం (ఫలాలు)..., పాలు, అన్నములతో తృప్తి పఱచాలి.

ఈ దేవతలూ పితరులూ కూడా ఒకనివల్ల సంతృప్తులైతే వానికి అన్ని శుభ, అభీష్టాలనూ ప్రసాదిస్తారు. ఏయే యజ్ఞ ప్రతిపాదిత వేదభాగాన్ని అధ్యయనం చేస్తామో ఆయా యజ్ఞ ఫలాలను పొందుతాము. అంతేకాక భూమి, దాన, తపస్సు, స్వాధ్యాయ ఫలాలను కూడా పొందగలము.

---

*[1] ప్రశ్నోత్తర రూపంలో వుండే వేదవాక్యాలు*

*[2] రుద్ర దైవత్య మంత్రాలు*

*[3] యజ్ఞ సంబంధితాలైన ఇంద్రాదుల గాథలు*

*[4] వారుణీ వంటి విభిన్న, అసాధారణ విద్యలు*

నైష్ఠికుడైన బ్రహ్మచారి తన ఆచార్యుని యొక్క సాన్నిధ్యంలోనే వుండాలి. ఆయన లేకుంటే ఆ కుటుంబసభ్యుల వద్ద వుండాలి. వారంతా కలసి ఎక్కడికైనా పోయినపుడు తనచే ఉపాసింపబడు అగ్ని అనగా తన వైశ్వానరాగ్ని శరణంలో వుండాలి. ఈ రకంగా భోగాలను వదలి, మెదడును పెంచి, శరీరాన్ని కృశింపజేసుకొని జితేంద్రియుడై బ్రహ్మ చర్యాశ్రమమున జీవించిన వానికి జన్మ చివర్లో బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది. పునర్జన్మ వుండదు. ***(అధ్యాయాలు - 93,94)***

# గృహస్థ ధర్మ నిరూపణం

**యా**జ్ఞవల్క్య మహర్షి ఇంకా ఇలా ప్రవచింపసాగాడు. యతవ్రతమునులారా! విద్యాధ్యయన సమాప్తి కాగానే బ్రహ్మచారి గురువుగారికి దక్షిణను సమర్పించి ఆయన అనుమతితో స్నానం చేసి బ్రహ్మచర్య వ్రతానికి వీడ్కోలు పలకాలి. తరువాత తల్లిదండ్రుల అనుమతితో గాని, గురువుగారి ఆదేశానుసారముగాని ఒక సులక్షణా, అత్యంతసుందరీ, మనోరమా, అసపిండా, వయసులో తనకన్న చిన్నదీ, అరోగా, భ్రాతృమతీ, భిన్న ప్రవర, గోత్రీకురాలూ నగు కన్యను వివాహం చేసుకోవాలి.

ఈ సందర్భంలో యాజ్ఞవల్క్య మహర్షి సపిండ ఎవరో కూడా వివరించాడు. తల్లితో మొదలుపెట్టి ఆమె తండ్రి, తాత, ముత్తాత... అలా లెక్కపెడుతూ పోయి ఏడవతరం దాకా ఉండిన వారందరినీ సపిండ్యులుగా భావించాలి. ఈ మధ్యలో వరుని వంశంలో ఎక్కడ కలిసినా ఆమె సపిండ్యయే అవుతుంది. ఎక్కడా కలవనిదే అసపిండ కాగలదు. అసపిండనే పెళ్ళి చేసుకోవాలి. అలాగే ఆమె మాతృ వంశంలోనూ పితృవంశంలోనూ అయిదేసి తరాల దాకా విచారించి సదాచార, అధ్యయన, పుత్రపౌత్ర సమృద్ధి దృష్టిలో పెట్టుకొని వారి ఖ్యాతిని చూడాలి గాని ధనాన్ని బట్టి కాదు. ఇటువంటి కన్యను కల్యాణ మాడదలచుకొనే వరుడు కూడా సమానవర్ణుడూ, ఆమెకి తగినవాడునై వుండాలి.

వర్ణసంకరం పనికిరాదు. ఏ వర్ణం వారు ఆ వర్ణం వారినే పెండ్లి చేసుకోవాలి. కొంతమంది విద్వాంసులు అగ్రవర్ణులు శూద్రకన్యలను పెళ్ళి చేసుకోవచ్చని వచిస్తారు కాని నేనుదాని కంగీకరించను. ఎందుకంటే 'ఆత్మా వైజాయతే పుత్రః అనీ 'అంగాదంగాత్సం భవసి' అని వేదం ఘోషిస్తోంది. ద్విజుడే శూద్రునిగా పుట్టి, ఆ శూద్రుడు ఈ ద్విజుని వలె, అంత జ్ఞానం సంపాదించకుండానే, గౌరవాదరాలు పొందాలనుకొని, సమాజం దానికడ్డుపడడంతో దానిపై, ద్విజజాతిపై కక్షగట్టి... ఇలా సమాజానికీ సవాలుగా నిలుస్తాడు. బ్రాహ్మణుడు తన వర్ణం నుండి ఒక కన్యను వివాహంచేసుకున్న పిమ్మట ఇతర వర్ణాల

కన్యలను పెండ్లాడవచ్చునీ, క్షత్రియులు క్షత్రియ కన్యను పెండ్లాడిన పిమ్మట వైశ్య, శూద్ర కన్యలను వివాహమాడవచ్చుననీ, వైశ్యులు వైశ్య కన్యతో వివాహమైన పిమ్మట శూద్రకన్యను చేసుకోవచ్చుననీ, శూద్రుడు మాత్రం శూద్ర కన్యను మాత్రమే పెండ్లాడాలనీ పెద్దలంటారు. (అది సామాజికావసరమైనపుడే అంగీకార్యమయ్యేది) కన్యకి కనీసం ఒక అన్నదమ్ముడైనా వుండాలి. అంతేకాని, పుత్రికా ధర్మం గల కన్య ప్రశస్తం కాదు. ఈ కన్య యొక్క పుత్రుడే ఆమె తండ్రికి పిండం పెట్టవలసి వస్తే ఆమెను పుత్రికా ధర్మం గల కన్య అంటారు.

వివాహాలలో ఎనిమిది రకాలున్నాయి.

అవి బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపూపత్య, ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచ విధాలు.

ఉత్తమ వంశానికి చెందిన, మంచి శీలస్వభావాలున్న వరుని మామయే స్వయంగా తన యింటికి పిలిచి, అలంకరించి, పూజించి కన్యాదానం చేయడం బ్రాహ్మ వివాహం.

యజ్ఞం చేస్తూ ఋత్విజుని అలంకృతుని చేసి పూజించి కన్యనివ్వడం దైవ వివాహం.

వరుని నుండి ధర్మార్థంగా ఒకటి రెండు జతల ఆవులను ఎద్దులను స్వీకరించి శాస్త్రోక్తంగా పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యడం ఆర్ష వివాహం.

వధూవరులనొకచోట చేర్చి 'మీరిద్దరూ కలసి గృహస్థ ధర్మాన్ని నిర్వర్తించండి' అని చెప్పి పూజ చేసి కన్యను దానం చేయడం ప్రాజాపత్యం.

కన్యకూ, ఆమె తండ్రికీ, ఆతని బంధువులకూ యథాశక్తి ధనాదులనిచ్చి స్వచ్ఛందంగా వరుడే కన్యను గ్రహించడం ఆసురవివాహం.

కన్యాబ్రహ్మచారీ పరస్పరం ఇచ్ఛాపూర్వకంగా తమకు తామే చేసుకొనేది గాంధర్వం.

కన్యను అపహరించి గొనిపోయి వరుడు తన స్వగృహంలో శాస్త్రోక్తంగా చేసుకొనేది రాక్షస వివాహం.

అన్నిటికన్నా అధమమైనది నిదురిస్తున్న, కామంపట్టిన లేదా మతిలేని కన్యను ఎవరూ చూడకుండా పట్టుకుపోయి వరుడే చేసుకొనేది. దీనికి పైశాచ వివాహమని పేరు.

మొదటి నాలుగు రకాల వివాహాలూ బ్రాహ్మణ వర్ణంలోనూ తరువాతి రెండు విధాల పెళ్ళిళ్ళూ క్షత్రియ వర్ణంలోనూ తఱచుగా అవలంబింపబడుతూ వుంటాయి.

సవర్ణ వివాహాలలో గృహ్యసూత్రానుసారం కన్య వరుని పాణిగ్రహణం చేయాలి. కృతత్రేతా ద్వాపరయుగాల్లో క్షత్రియ కన్య బ్రాహ్మణ వరునిగానీ వైశ్యవరుడు శూద్ర

కన్యను గానీ ఇదివఱకే చెప్పినట్టు వివాహం చేసుకోవడం ఆచారంగా కొన్నిచోట్ల ప్రత్యేక సందర్భాలలో జరిగేది. కలియుగంలో ఈ పద్ధతి ఎక్కడా, ఎటువంటి సందర్భాలలోనూ లేదు. వర్ణసంకరం జరుగరాదు.

కన్యాదానాన్ని గావించే అధికారం కన్యయొక్క తండ్రికీ, తాతకీ, సోదరునికీ సకుల్యునికీ[1] లేదా తల్లికీ వుంటుంది. తండ్రిదే ఈ ధర్మం, ఈ భాగ్యం. ఆయన లేకపోయినా, ఉండీ మతిస్థిమితం లేనివాడై పోయినా తాతకీ, అలా అదే క్రమంలో తరువాత చెప్పబడిన వారికీ ఈ అవకాశమివ్వబడుతుంది. కన్యాదానం చేయవలసినవాడు చేయకపోతే వానికి ఆ కన్య ఋతుమతియైనపుడల్లా ఒకటొకటిగా భ్రూణహత్యల పాపం చుట్టుకుంటుంది. కన్యాదాతలు లేనపుడు కన్యయే తనకు తానుగా తనను తాను దానము చేసుకొనే వెసులుబాటు కూడా అంగీకార్యమే.

కన్యను ఒకమారే దానంచెయ్యాలి. అలా చేసిన తరువాత ఆమె భర్తపై దౌర్జన్యం చేసి గాని మరొక విధంగా గాని ఆమెనపహరించి మరొకరికి దానమిచ్చువాడు చౌరకర్మతో సమాన పాపమునకు దండనార్హుడవుతాడు. ఆమె దోషమేమాత్రమూ లేకుండా పత్నిని పరిత్యజించు పతి దండనీయుడు. అత్యంత దుష్టురాలు (మహాపాతకి)గు పత్నిని పరిత్యజించవచ్చును.

ఒక కన్యను ఒక వరునికిచ్చుటకు వాగ్దానము చేయబడిన పిమ్మట వివాహానికి ముందే వరుడు మరణిస్తే ఆమెను జీవితాంతం వితంతువుగా గొడ్రాలిగా నుంచి వేయుట ధర్మము కాదు. ఆమెకు పుత్రవతి కావలెననే కోరిక వుంటే మరిది కాని, వరుని సపిండ, సగోత్రులలో నామెకు ఈడైనవాడెవరైనా కాని పెద్దల ఆజ్ఞ మేరకు ఆమెకు పుత్రుని సామాన్య పద్ధతిలోనే ప్రసాదించాలి. ఈ విధంగా ఈ పద్ధతిలో నామెకు కలిగిన పుత్రుడు ఆ మృతి చెందిన వరుని యొక్క క్షేత్రజ్ఞ పుత్రునిగానే పరిగణింపబడతాడు.

వివాహిత స్త్రీ వ్యభిచారానికి అలవాటు పడిపోతే, ఆమెను మంచి దారిలో పెట్టడానికి ఆమె పతి, అతని బంధువులూ శాయశక్తులా ప్రయత్నించాలి. చివరి ప్రయత్నంగా ఆమె అసహ్యక జీవనంపై ఆమెకే వైరాగ్యం కలిగేలాగ, ఆమెను ఇంటిలోనే వుంచి గృహిణిగా ఆమెకు గల అధికారాలన్నిటినీ తొలగించాలి. అలంకరించుకోనీయకుండా మలినగానే వుంచాలి. ఏదో ప్రాణరక్షణకు సరిపడునంతగానే తిండిపెట్టి కటిక నేలపై పడుకోబెట్టాలి.

స్త్రీకి వివాహానికి పూర్వమే చంద్రుడు శుచినీ, గంధర్వులు సౌందర్యాన్నీ మధురవాణినీ, అగ్నిదేవుడు అన్ని రకాల పవిత్రతనీ ప్రసాదిస్తారు. కాబట్టి ఈ దేవతలకు పూజలందే

---

*[1] సకుల్యులనగా ఎనిమిదవ తరం నుండీ పదవతరం దాకా నున్న బంధువులు*

భారతదేశం వంటి దేశాల్లో స్వభావసిద్ధంగా స్త్రీలందరూ పవిత్రులే అయివుంటారు. అయినా కూడా పూర్వకర్మల వల్ల తేడాలు రావచ్చు. అందుచే స్త్రీకి దోషమంటదనే నిశ్చయానికి రావడం సరికాదు. ఒక స్త్రీ తన పతికానివానిని మనసులో వాంఛిస్తే అదీ ఒక రకమైన వ్యభిచారమే అవుతుంది. అలాగే పరపురుషునితో సంపర్కాన్ని సంకల్పించినా వ్యభిచారమే కాగలదు. ఈ మానసిక వ్యభిచార దోషము ఆమె ఋతుకాలిక రజోదర్శనము కాగానే పోతుంది కాని మరల అటువంటి ఆలోచనలు చేయరాదు. నిజంగానే పరపురుషునితో సంగమించినా, తద్ద్వారా గర్భధారణ చేసినా ఆ స్త్రీని పరిత్యజించవలెను. ఇలాగే గర్భవధ, పతివధ, బ్రహ్మహత్య, శిష్యులతో సంగమం వంటి పనులలో నేది చేసినా ఆమెను మహాపాతకిగా అభిశంసించి పరిత్యజించాలి.

మదిరాపానం చేసేది, దీర్ఘరోగిణి, శాశ్వతద్వేషి, వంధ్య, అర్ధనాశిని, అప్రియవాదిని, నిష్ఠురభాషిణి లేదా పతికి హాని చెయ్యడం కోసమే జీవించునట్లుండేది యగు భార్యను ఆమె భర్త పరిత్యజించవచ్చును; మరొక వివాహం చేసుకోవచ్చును. అయితే తాను మొదట వివాహం చేసుకొని ఇపుడు పరిత్యజించిన స్త్రీని దాన, మాన, సత్కారాదుల ద్వారా భరణ సమన్వితను చేస్తుండాలి. అలా చేయనివాడు మహాపాపిగా నిందితుడు.

అన్యోన్యంగా దంపతులుంటే ఆ గృహానికి ధర్మార్థ కామవృద్ధి – త్రివర్గవృద్ధి – పుష్కలంగా వుంటుంది. భర్త పోయిన పిమ్మట ఇంకొక పురుషుని ఆశ్రయించకుండా అతని జ్ఞాపకాల బలిమితోనే జీవించే స్త్రీనీ, ఎట్టి విపత్కర పరిస్థితులెదురైనా భర్తను వదలిపోకుండా వుండే స్త్రీనీ లోకం నెత్తినబెట్టుకొని పూజిస్తుంది. ఈ లోకంలో యశంతోబాటు ఈ పాతివ్రత్యమహిమ వల్ల పరలోకంలో పార్వతీదేవి సాహచర్యం చేసే భాగ్యమబ్బుతుంది.

భార్యను పరిత్యజించినవాడామె సుఖంగా, ప్రసన్నంగా బతికేలా చూసుకోవాలి. తన సంపత్తిలో మూడవవంతు నామెకిచ్చెయ్యాలి.

స్త్రీకి తన భర్త యొక్క ఆజ్ఞను పాలించుటయే పరమధర్మము. స్త్రీకి ఋతు లేదా రజోదర్శనమైన తొలి దినం నుండి పదహారవ రాత్రివఱకూ సంతానప్రాప్తికి అవకాశముంటుంది. పుత్రప్రాప్తి కోసమై పురుషుడు ఆ రాత్రులలో మాత్రమే ఆమెతో సంగమించాలి. ఇలా సంతానం కోసం మాత్రమే సంగమించి మిగతా కాలాల్లో ఇంద్రియ నిగ్రహాన్ని పాటించడమే బ్రహ్మచర్య వ్రతం. అంతేగాని బ్రహ్మచర్యమంటే పెండ్లిని మానుకొనుట, స్త్రీవైపే చూడకపోవుట కాదు. పర్వతిథులలోనూ[1] ఋతుకాలం మొదటి

[1] *అష్టమి, చతుర్దశి, అమావాస్య, పున్నమ (మను–4/156)*

నాలుగు రాత్రులందూ, దినము అనగా ఎప్పుడైనా పగటివేళా సంగమం నిషిద్ధం. మఘ, మూల నక్షత్రాలలో సంగమం వర్జ్యం.

ఈ నియమాలను కచ్చితంగా పాటిస్తేనే సుందరుడు, సబలుడు, సద్గుణవంతుడు, ఆరోగ్యవంతుడునైన కొడుకు పుడతాడు. స్త్రీ పట్ల అన్ని బాధ్యతలూ అనగా తిండి, బట్ట, ఇల్లు మున్నగునవే కాక ఆమె కామవాంఛను పూర్తిగా తీర్చి ఆమెను సంతృప్తి పఱచవలసిన బాధ్యత కూడా ఆమెను చేపట్టిన వానిపై వుంటుంది. పైగా ఈ బాధ్యతకు సంబంధించి ఇంద్రుడు స్త్రీలకొక వరాన్నిచ్చాడు. అదేమనగా స్త్రీ యొక్క కామవాసననుఅనిషిద్ధ రాత్రులందు ఆమె పతి తప్పనిసరిగా తీర్చాలి. లేకుంటే వాడు పాపమును మూటకట్టు కుంటాడు.

స్త్రీని ఇంటియిల్లాలిగా గృహలక్ష్మిగా సంభావించి మెట్టినింటి వారంతా అనగా భర్త, వాని సోదరులు, వాని తల్లిదండ్రులు, ఇష్టబంధువులు – ఆమెను మధురాహారముతో చీని చీనాంబరాలతో అలంకార విశేషాలతో ఎల్లప్పుడూ ప్రసన్నంగా సుఖంగా వుండేలా చూడాలి. ఇది సామాజిక బాధ్యత కూడా.

స్త్రీకి గల బాధ్యతలు బాగా ఎక్కువ. ముఖ్యంగా పురుషునితో స్త్రీ యొక్క ప్రవర్తన ఎంతో బాధ్యతాయుతంగా వుండాలి. పుత్రసంతానమైనా స్వర్గప్రాప్తియైనా స్త్రీకి 'భర్తకు తనపై గల' ప్రేమ ఆధారంగానే సంక్రమిస్తాయి కాబట్టి ప్రతి ఆడదీ తన పత్యారాధన ఫలితంగా, స్నేహఫలంగా పతి ప్రేమను పొందాలి. సాధారణ స్త్రీకి శాస్త్రాలను గాని గ్రంథాలను గాని పఠించే అర్హత లేదు కాని భర్త ద్వారా వాటన్నిటినీ ఆమె వినవచ్చును. విధి నిషేధ పూర్వకంగా భర్త చెప్పే ధర్మాచరణను సొంతమూ చేయడం ద్వారా మోక్ష ప్రాప్తి నందవచ్చును. భర్త అనంతరం కొడుకే ఆమెకు ధర్మశాస్త్రగురువు కాగలడు.

గృహస్థధర్మానికి మూలం పతివ్రతయగు గృహిణి. ఆమె పతి చిత్తవృత్తిని కూలంకషంగా తెలుసుకొని వుండాలి. అతడెపుడేది కోరుకుంటాడో దానిని అప్పటికి అతడు అడగకుండానే అమర్చిపెట్టాలి. సర్వకాల సర్వావస్థలలోనూ అతని మేలునే కోరుతూ తన ప్రతిపనీ ఆ ఆశయం వైపే మళ్ళేలా చూడాలి, చేయాలి.

భర్త యొక్క తల్లిదండ్రులనూ, అక్కచెల్లెళ్లనూ, అన్ననూ, పినతండ్రినీ, గురువునీ, వృద్ధ స్త్రీలనూ గౌరవించడం ఆదరించడం పత్నియొక్క ధర్మం. తనకన్నా చిన్నన్నవారైన భర్తృ వర్గీయులతో స్నేహంగా వుంటూనే ఇంటి పనులు చేయించుకోవాలి. లేకుంటే సోమరులవుతారు. పతి యొక్క బంధువుల మధ్యలో తాము కూర్చునియున్నపుడామె యొక్క మాటలు, చేతలు అన్నీ అతనికి అనుకూలంగానే సాగాలి; ఈ సంగతి అందరికీ తెలియాలి. ఈ శీలమే ప్రశస్తమని జనశ్రుతి.

ఇంటికోడలు తనకు వరసైన పురుషులతో హాస్యాలాడకూడదు. పర పురుషునితో ఏకాంతంగా అసలు ఉండనేకూడదు. పరపురుషుల చేతిలో ఏ వస్తువునూ ఉంచకూడదు, వారి చేతి నుండి తన చేతితో అందుకొనరాదు. భర్త అక్కడే వున్నా కూడా పరపురుషుల మధ్య కూర్చొనరాదు.

ఇంటిలోని సామగ్రి అంతా ఆమె అధీనంలోనే వుంటుంది. దానిని అనవసరంగా ఖర్చు చేయకూడదు. అవసరానికి తగినంతగా వాడుతుండాలి. కార్యకుశల, ప్రసన్న, మితవ్యయి అయివుండి రోజులో ఒకసారైనా అత్తమామలకు పాదాభివందనం చేసే స్త్రీని భర్త ప్రేమిస్తాడు, సమాజం గౌరవిస్తుంది.

ప్రోషిత పతికగానున్నపుడు- అనగా తన భర్త పరదేశానికి వెళ్ళినపుడు తన సఖీజనంతో ఆనందంగా ఆటలాడడం, పొరుగు వారిళ్ళలో కూర్చుని వాగడం, అతిగా అలంకరించుకోవడం, ఉత్సవాలలో పాల్గొనడం, హాసాలూ పరిహాసాలూ వంటివి చేయరాదు.

ఇల్లాలి మనుగడ పతితోనే. వీలైనంత వఱకు ఆమె గడపవలసిన సమయమూ అతనితోనే. ఆమె అధికారాలు పరిమితమే అయినా గృహస్థధర్మానికీ తద్వారా సమాజానికీ ఆమె అవసరం అపరిమితం. అందుకే సదాచారిణియైన స్త్రీ మరణించినపుడు అగ్నిహోత్రం లోని అగ్నితో ఆమె దహన సంస్కారాలను చేస్తారు. పతిహితైషిణియైన పత్నికి ఈ లోకంలో కీర్తి సమ్మానాలూ పరలోకంలో స్వర్గమూ సంప్రాప్తిస్తాయి. ***(అధ్యాయం - 95)***

# వర్ణసంకర జాతుల ప్రాదుర్భావం - గృహస్థధర్మం, వర్ణ ధర్మం, ముప్పదేడు ప్రకారాల అనధ్యాయం

బ్రాహ్మణ పురుషుడు క్షత్రియ కన్యను పెండ్లాడి ఆమెకు కనిన పుత్రునితో మూర్ధావసిక్త అనే సంకరజాతి ప్రారంభమైంది. అలాగే బ్రాహ్మణ వైశ్య సంకరంలో అంబష్ఠ, బ్రాహ్మణ శూద్ర సంకరంలో పారశవనిషాద జాతులు పుట్టుకొచ్చాయి. దీనిని అనులోమ సంకరమన్నారు.

| పురుష | స్త్రీ | సంకరజాతి పేరు |
|---|---|---|
| క్షత్రియ | వైశ్య | మాహిష్య |
| క్షత్రియ | శూద్ర | మ్లేచ్ఛ [1] |

[1] *యాజ్ఞవల్క్య స్మృతిలో మ్లేచ్ఛ పదానికి బదులు 'ఉగ్ర' యను పదం వాడబడింది.*

| | | |
|---|---|---|
| వైశ్య | శూద్ర | కరణ [2] |
| క్షత్రియ | బ్రాహ్మణ | సూత |
| వైశ్య | బ్రాహ్మణ | వైదేహక |
| శూద్ర | బ్రాహ్మణ | చాండాల |
| వైశ్య | క్షత్రియ | మాగధ |
| శూద్ర | క్షత్రియ | క్షత్తా |
| శూద్ర | వైశ్య | ఆయోగవ[3] |
| మాహిష్య | కరణ | రథకార |

సంకరం వల్ల చెడిన వర్ణం మరల పాతదశకు రావాలంటే ఆరు తరాలు పడుతుంది. అంటే బ్రాహ్మణునికీ శూద్రునికీ పుట్టిన సంతానాన్నీ నిషాదులన్నాము కదా. ఆ నిషాదుని కొక కూతురు పుట్టి,దానినొక బ్రాహ్మణుడు పెండ్లాడి, వారికొక కూతురు పుట్టి, దానినీ బ్రాహ్మణుడేమనువాడి... అలా నిషాద, బ్రాహ్మణ వివాహం ఆరు తరాల బాటు కొనసాగితే ఏడవతరం నిషాదునికి కూతురు పుట్టి ఆమెను కూడా బ్రాహ్మణుడేపెళ్ళిచేసుకుంటే అప్పుడు వారికి పుట్టిన పిల్లలు ఏడవతరం వారవుతారు కదా! వారికి శుద్ధ బ్రాహ్మణ వర్ణాన్ని శాస్త్రాలు ప్రసాదిస్తున్నాయి. అలాగే బ్రాహ్మణ వైశ్య సంకరమైన అంబష్ఠ జాతిలో అయిదవత రానికి పుట్టినవారు అనగా ఆరవ తరంవారు శుద్ధ బ్రాహ్మణులవు తారు. అలాగే మూర్ధావసిక్త జాతిలో అయిదవ తరంవారు శుద్ధబ్రాహ్మణులౌతారు. ఇదే విధంగా ఉగ్రా, మాహిష్యా జాతులలోనూ ఏడవ ఆరవ తరాలలో శుద్ధ క్షత్రియులుద్భవిస్తారు. అదే విధంగా కరణనామక సంకరజాతిలో ఆరవతరంలో శుద్ధ వైశ్యులుద్భవిస్తారు. అనగా సంకరదోషం పితృవర్ణ బీజం ఆరేడుతరాల పాటు అనుస్యూతంగా ప్రవహిస్తే గాని కడుక్కుపోదు.

వర్ణసంకరమంటే వివాహ విషయంలో మాత్రమే చేయబడేదని కాదు. వృత్తి విషయంలో కూడా జరుగుతుంది. యాజన, అధ్యయన, అధ్యాపనాలను చేయవలసిన బ్రాహ్మణుడు పరిస్థితుల ప్రభావం వల్ల ఆ వృత్తి ద్వారా జీవించలేక, బతుకు గడవక క్షత్రియ, వైశ్య లేదా శూద్రవృత్తి నవలంబించవచ్చు. ఇలా ఏ వర్ణం వారు మరొక వర్ణం పనిని చేసినా అది కర్మ వ్యత్యయమవుతుంది. అదీ వర్ణ సంకరంవంటిదే. అయితే పరిస్థితులు మెరుగు పడగానే ఎవరి అసలు పనిలోకి వాళ్ళు వెళ్ళకుండా తమ వర్ణం కన్నా హీనవర్ణానికి

---

*[2] మూర్ధవసిక్త, అంబష్ఠ, నిషాద, మాహిష్య, ఉగ్ర, కరణ– ఈ ఆరు సంకరజాతులనూ అనులోమజలన్నారు.*
*[3] సూత, వైదేహక, చాండాల, మాగధ, క్షత్తా, ఆవయోగ జాతులను ప్రతిలోమజలన్నారు.*

చెందిన కర్మను నిర్వహిస్తూ వుండి పోతే వారు వర్ణసంకరులుగానే పరిగణించబడతారు. వారు క్రమంగా ఏడవ, ఆరవ, అయిదవతరంల దాకా ఆ హీనవృత్తిలో వుండిపోవలసినదే.

ఇక సంకరజాతులను మూడు రకాలుగా విభజించవచ్చు. అవి సంకర, సంకీర్ణ, సంకర, వర్ణ సంకీర్ణ సంకర విభాగాలు.

అనులోమజులు, ప్రతిలోమజులు అనగా నిదివఱకు చెప్పబడిన మూర్ధవసిక్త నుండి ఆవయోగ జాతి దాకా గల పన్నెండు రకాలవారూ సంకరజాతి విభాగానికి చెందినవారు.

ఈ సంకరజాతిలో మరల సంకరం జరుగగా పుట్టినవారు – అనగా మాహిష్య–కరణ సంయోగం వల్ల పుట్టిన రథకార జాతి వంటి వారు సంకీర్ణ సంకరజాతి వారవుతారు.

మరింత లోతైన సంకరం జరిగిన చోట వర్ణ సంకరజాతి వారు పుడతారు. ఉదాహరణకి మూర్ధావసిక్త స్త్రీకి క్షత్రియ, వైశ్య లేదా శూద్ర పురుషుని ద్వారా పుట్టినవారు, అంబష్ఠ స్త్రీకి వైశ్య లేదా శూద్ర పురుషుని ద్వారా కలిగినవారు అలాగే పారశవ నిషాద స్త్రీకి శూద్రుడు కన్న పిల్లలూ ఈ జాతిలోకి వస్తారు. వీరిని అధరప్రతిలోమజులంటారు.

ఇటువంటి సంకరజాతి స్త్రీలకే బ్రాహ్మణ బీజం ద్వారా కలిగినవారు, మాహిష్య, ఉగ్రజాత్యాది స్త్రీలకు బ్రాహ్మణ లేదా క్షత్రియ పురుషుని ద్వారా పుట్టినవారు, కరణజాతి స్త్రీయందు అగ్రవర్ణుని ద్వారా కలిగినవారు ఇటువంటి వారిని ఉత్తర ప్రతిలోమజులంటారు. వీరినే అధర – అసత్, ఉత్తర – అసత్ వర్ణ సంకీర్ణ జాతుల వారని వ్యవహరిస్తారు.

ఇక ***గృహస్థధర్మాన్ని*** గూర్చి మాట్లాడుకుందాం.

గృహస్థు ప్రతిదినం స్మార్తకర్మా, వైశ్వదేవాది అగ్నికార్యాలూ సంపన్నం చేయాలి. దీనికి వివాహాగ్నిని కానీ సంపద్విభాగసమయంలో స్వయంగా తానే తెచ్చుకున్న సుసంస్కృతమైన అగ్నిని కానీ ఆరాధించాలి. శ్రౌతకర్మానుష్ఠానానికి అగ్నిహోత్రం వైతానాగ్ని (ఆహవనీయ మున్నగు అగ్నులలో నేదో ఒకటి) తో సంపన్నం చేయాలి. శరీర చింతలను (విసర్జనాలను) ఉదయసాయం కాలాలలో శాస్త్రోక్తంగా తీర్చుకోవాలి. గంధలేపనివృత్తి పర్యంత శుద్ధిని పొంది దంతధావన, స్నానాదికములను గావించి ప్రతి ద్విజుడూ ప్రాతఃకాల సంధ్యోపాసనను ముగించి అగ్నిహోత్ర కార్యాన్ని నిర్వర్తించుకోవాలి. హవనం చేసి సమాహిత చిత్తంతో సూర్యమంత్రాలను, అనగా ***ఉదుత్యం జాతవేదసం...*** మున్నగు వాటిని జపించాలి. తరువాత వేదార్థాలనూ – అనగా – నిరుక్త వ్యాకరణాదులనూ – ఇతర శాస్త్రాలనూ అధ్యయనం చేయాలి. యోగ క్షేమాది సిద్ధికై ఈశ్వరో పాసనను కూడా చేయాలి.

గృహస్థధర్మంలో మరొక ముఖ్యమైన అంశంతర్పణాలు. ప్రతి గృహస్థుప్రతిరోజూ దేవతలకూ పితరులకూ స్నానానంతరం తర్పణాలివ్వాలి. పూజకూడా చేయాలి. వేదపురాణేతిహాసాలలో కొంతమేర, యథాశక్తి, పారాయణం చేయాలి. జపంచేసుకొని భూత, పితర,దేవ, బ్రహ్మ, మనుష్య జాతులకు బలికర్మ★ను గావించాలి.

తరువాత స్వధా, హోమ, స్వాధ్యాయ, అతిథి సత్కారాలు చేయాలి. దేవతలనుద్దేశించి అగ్నిలోహవనాలిచ్చి కుక్కలు, చండాలురు, కాకులు మున్నగు ప్రాణులకై వండిన అన్నాన్ని భూమిపై వేయాలి. పితృగణాలకూ మనుష్యులకూ అన్నంతో బాటు జలదానం కూడా చేయాలి. అన్నమును తన కుటుంబమునకు మాత్రమే సరిపడునంత వండుట సరికాదు. పక్వాన్న మెల్లప్పుడూ అవసరానికి ఎక్కువగానే ఇంట్లో వుండాలి. స్వవాసిని, (పెళ్ళయినా కూడా ఏవోకారణాలవల్ల ఆనాటికి పుట్టింట్లో వున్న స్త్రీ) వృద్ధులు, గర్భిణులు, వ్యాధి పీడితులు, కన్యలు, అతిథులు, భృత్యులు– వీరందరికీ భోజనాలు పెట్టాకనే ఇంటి యిల్లాలు, ఇంటి యజమాని అగ్నిలో పంచప్రాణాహుతులనిచ్చి అన్నానికి గౌరవ భక్తి ప్రపత్తులతో నమస్కరించి భోజనం చెయ్యాలి. భోజనానికి ముందూ వెనకా అవపోసన పట్టాలి.

ద్విజులు అమృతతుల్యమైన భోజనాన్ని పాత్రలో ఆకుమూతపెట్టి వుంచినదాన్ని తినాలి. అతిథికోసం భోజనం ఎప్పుడూ కూడా ఎంత సాయంకాలమైనా సిద్ధంగావుండాలి. రోజులో ఎప్పుడైనా ఇంటికి వచ్చిన అతిథి అన్నంతినకుండా పోరాదు.బ్రహ్మచారులకూ సన్యాసులకూ (వారులభిస్తే వాళ్ళు దొరకడమే అదృష్టం) రోజూ భిక్షవేయాలి. స్నాతకులనూ, ఆచార్యులనీ, రాజునీ ప్రతియేటా పూజించాలి. అలాగే మిత్రులూ, అల్లుళ్ళూ, ఋత్విజులూ ప్రతి వర్షమూ ఆతిథ్య పూజలకు అర్హులు. బాటసారిని అతిథియనీ వేదపారంగతుని శ్రోత్రియుడనీ అంటారు. బ్రహ్మలోక ప్రాప్తిని కోరుకొనేవారు ఈ రెండు రకాల వారిని పూజించాలి.

ఎవరైనా మిక్కిలి వినయంగా, ఆదరంగా, గౌరవంతో ఆహ్వానిస్తేనే బ్రాహ్మణుడు, ఒకరియింటి పక్వాన్నాన్ని స్వీకరించాలి. గృహస్థు మితంగాభుజించాలి. నోటిని అనవసరంగా వాడకూడదు. ఏ విషయంలోనూ అతిచాంచల్య చాపల్యాలు కూడదు. అతిథులను సగౌరవంగా ఊరిపొలిమేరదాకా దిగబెట్టి సముచితంగా వీడ్కోలు పలకాలి.

తనకు ఇష్టులైన మిత్రులతో విద్వత్సంపన్నులతో గోష్ఠులు సలుపుతుండాలి. సాయంకాలం మరల సంధ్యవార్చి అగ్నిహోత్రం పనిచూసుకొని భోంచేయాలి. భోజనం తరువాత బుద్ధిమంతులైన భృత్యులతో ఇంటి వ్యవహారాలనూ, రాబోయే కార్యాలనూ ముచ్చటించాలి.

---

★ *భూతయజ్ఞం, స్వధా – పితృయజ్ఞం, హోమ – దేవయజ్ఞం, స్వాధ్యాయ – బ్రహ్మయజ్ఞం, అతిథి సత్కారం – మనుష్యయజ్ఞం. ఈ యజ్ఞాలన్నిటినీ బలికర్మగా వ్యవహరిస్తారు.*

వైశ్యులకూ, క్షత్రియులకూ కూడా యజ్ఞానుష్ఠానమూ, అధ్యయనమూ, దానమూ ముఖ్య విహిత కర్మలే. బ్రాహ్మణునికి యజ్ఞమునుచేయించుట, అధ్యాపనం, దానగ్రహణం అనేవి అదనపు ధర్మ కర్మలు.

క్షత్రియునికి ప్రజాపాలనమేప్రధానధర్మము.వైశ్యవర్ణులకుఅప్పులిచ్చుట, వ్యవసాయము, వాణిజ్యము, పశుపాలన ముఖ్య కర్మలుగా విధింపబడ్డాయి. శూద్ర వర్ణం వారు పై మూడు వర్ణాల వారికీ సాయపడాలి. ద్విజులు యజ్ఞాదికర్తవ్యాలను మానరాదు. అహింస, సత్యం, అస్తేయం,శౌచం,ఇంద్రియ సంయమనం, దమం,క్షమ, సరళత, దానం - మానవులందరికి అవశ్యాచరణీయ ధర్మాలు. అందరూ కుటిల, దుష్టప్రవృత్తులను పరిత్యజించాలి.

*ప్రధానం క్షత్రియం కర్మ ప్రజానాం పరిపాలనం ॥*
*కుసీదకృషి వాణిజ్యం పశుపాల్యం విశః స్మృతం ।*
*శూద్రస్యద్విజ శుశ్రూషా ద్విజోయజ్ఞాన్ నహాపయేత్ ॥*
*అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియ సంయమః ।*
*దమం క్షమార్జవం దానం సర్వేషాం ధర్మసాధనం ॥*
*ఆచరేత్ సదృశీం వృత్తమజిహ్మామశఠాం తథా ।* **(ఆచార.. 96 (27-30)**

మూడేళ్ళకు సరిపడునంత బియ్యమును పండించి దాచగలిగినవాడు సోమరసపానానికి అర్హతను సంపాదించుకుంటాడు. ఒక్కయేడాది అన్నానికి సరిపడు బియ్యం లేదా ధాన్యమును దాచగలిగిన వారు ముఖ్యంగా సోమయాగం యొక్క ప్రాక్ క్రియను చేయవలసి వుంటుంది. అనగా సోమయాగానికి పూర్వం చేయవలసిన అగ్నిహోత్ర, దర్శపూర్ణమాస, ఆగ్రాయణ, చాతుర్మాస్యాది కర్మలను అనుష్ఠించాలి.

ద్విజుడు ప్రతియేటా సోమయాగం, పశుయాగం, చాతుర్మాస్యయాగం, ఆగ్రాయణేష్ఠి (అనగా కొత్తగా ధాన్యపుగింజలు కనబడగానే చేయుయాగం) లను ప్రయత్న పూర్వకంగా శ్రద్ధగా చేయాలి. ప్రతియేటా చేయలేనివారు రెండుసంవత్సరాలలో ఒకమారు అదే వేళకు వైశ్వానరీ యిష్టిని చేయాలి.

ఆధ్యాత్మికంగా ఉన్నత శిఖరాలందుకొని మోక్ష ప్రాప్తిని కోరు బ్రాహ్మణుడు జీవించవలసిన విధానం వేరు. స్వాధ్యాయ విరోధియైన అర్థ సంపాదనం చేయరాదు. ఎవరి వద్దా ధనమును పుచ్చుకొనరాదు. చిన్న చిన్న పనులకూ వ్రతాలకూ ప్రతి ఫలాన్ని స్వీకరించరాదు. నృత్య గీతాదుల ద్వారా కూడా ధన సంపాదన చేయరాదు. శూద్రుని చేత యజ్ఞాన్ని చేయించి డబ్బును పుచ్చుకున్న బ్రాహ్మణుడు మరుజన్మలో చండాలునిగా

పుడతాడు. యజ్ఞం కోసం తీసుకువచ్చిన అన్నాన్ని దానంచేసుకున్నవాడు కోడి, గ్రద్ధ, కాకి యోనుల్లో పుడతాడు.

ఆధ్యాత్మికాశయాలను కలిగి శరీరాన్ని ధర్మమోక్షాలకొరక సాధనంగా వాడుకోదలచిన బ్రాహ్మణుడు రెండు మూడు రోజులకు సరిపడు బియ్యాన్ని మాత్రమే ఉంచుకోవాలి. మోక్ష సాధకునికి అన్నిటికంటె *శిలోంఛవృత్తి పరమ శ్రేష్ఠము.

అతనిని గుర్తించి రాజుగానీ, శిష్యుడుగానీ, యజ్ఞాలను నిత్యకృత్యంగా చేయించే యజమానిగాని ముందుకివచ్చి పోషణ భారాన్ని వహిస్తే అంగీకరించవచ్చును అప్పుడయినా ప్రాణాన్ని నిలబెట్టుకోవడం కోసంమే తినాలిగాని భోగద్రవ్యాలను స్వీకరించుట తగదు.

ఇక **అనధ్యయన** సందర్భాలను అనగా ఎట్టి సందర్భాలలో వేదాలనూ శాస్త్రాదులనూ చదువుకోకూడదో చర్చిద్దాం.

వేదం చదువుకోవడాన్ని ధర్మశాస్త్రాలు[1] చెప్పుకోవడాన్ని శ్రవణ నక్షత్రయుక్త శ్రావణ పూర్ణిమనాడు గాని హస్త నక్షత్రయుక్త పంచమి నాడుగాని లేదా పుష్యమాసంలో రోహిణీ నక్షత్రం వున్నరోజున గానీ గ్రామానికి వెలుపల జలాశయ సమీపాన గృహ్యసూత్రానుసారం ప్రారంభించాలి.

శిష్య, ఋత్విజ, గురు, బంధు – బాంధవులలో ఎవరైనా మరణిస్తే ఆ క్షణం నుండి మూడురోజుల పాటు అనధ్యయనమే. అలాగే స్వశాఖ శ్రోత్రియ బ్రాహ్మణుడు మరణించినా మూడురోజుల పాటు చదవకూడదు. సంధ్యా సమయంలో ఉరుములు వినబడినపుడు, ఆకాశంలో మెరుపులు కనబడినపుడు, భూకంప, ఉల్కాపాత సమయాలలోనూ అధ్యయనాన్ని ఆపివేయాలి. వేద, ఆరణ్యక అధ్యయన సమాప్తి జరిగిన తరువాత పూర్తిగా ఒక పగలూ ఒక రాత్రి సెలవిచ్చెయ్యాలి.

అష్టమి, చతుర్దశి, అమావాస్య, పున్నం, చంద్ర సూర్య గ్రహణాలు, ఋతు సంధులలో పాడ్యమి, శ్రాద్ధ భోజనాలు – ఈ వేళల్లో చదువుకి సెలవు... పూర్తిగా ఒక రోజు. అయితే ఏకోద్దిష్ట శ్రాద్ధానికి భోజనం లేదా ప్రతిగ్రహ సమయాల్లో మూడురాత్రులు గడిచేదాకా అనధ్యయనాన్ని పాటించాలి.

---

*★ శిలవృత్తి అనగా పంట కోతలైనాక పొలములో మిగిలియున్న ధాన్యపు గింజల నేరుకొని వాటితోనే అన్నం వండుకొని కడుపు నింపుకొనుట. ఉంఛవృత్తి యనగా ధాన్యపు బస్తాలనుండి రహదారిపై రాలిన ఒక్కొక్క గింజ నేరుకొని తెచ్చుట. ఈ రెండిటినీ కలిపి శిలోంఛవృత్తి అని వ్యవహరిస్తారు.*

[1] *యాజ్ఞవల్క్యమితాక్షర, ఆచారాధ్యాయం, 146*

ఉత్సవాలకీ, శక్రధ్వజందిగినపుడూ, ఏడుపులూ పెడబొబ్బలూ దగ్గర్లోనే వినబడు తున్నపుడూ, శవం లేచినపుడూ తాత్కాలిక అనధ్యయనముంటుంది. అపవిత్ర దేశంలో, అపవిత్రావస్థలో, మాటిమాటికీ నింగి మెరుస్తుంటేనూ, మధ్యాహ్నం పన్నెండు గంటలలోపల పలుమార్లు ఉరుములు వినబడినపుడూ జలమధ్యంలో, అర్ధరాత్రి వేదశాస్త్రాలను చదువరాదు. ఎవరైనా విశిష్టవ్యక్తి వచ్చినప్పుడు అధ్యయనాన్ని ఆపాలి.

పరుగెడుతూ కానీ మద్యం వాసనవస్తున్న వ్యక్తి పక్కనేవున్నపుడుగానీ, గాడిద, ఒంటె, గుఱ్ఱం, నౌక,చెట్టు, పర్వతంమున్నగు వానిపై కూర్చున్నపుడుగానీప్రయాణిస్తున్నపుడు గానీ, దొంగలు రాజులు గ్రామానికి ఉపద్రవాన్ని తెచ్చినపుడు గానీ వేదశాస్త్రాలను చదువరాదు.

ఇక విద్యార్థులు, గురువులు, బ్రాహ్మణాది ద్విజులు సంఘంలో పాటించవలసిన నియమాలను చూద్దాం. దేవతామూర్తి, ఋత్విజుడు, స్నాతకుడు, ఆచార్యుల, రాజుల, పరస్త్రీల నీడలు, రక్తం, మూత్రాది విసర్జకాలు దారిలో వున్నపుడు దాటుకొనిపోరాదు. ఆగిగాని, పక్కకి తొలగిగాని వెళ్ళాలి. మంచిపేరుగల బ్రాహ్మణుని, రాజుని సర్పాన్ని అవమానించకూడదు. అలాగే తనను తాను అవమానించుకోరాదు. విసర్జనాలను, ఇతరులు కాళ్ళుకడుక్కున్న నీళ్ళను దూరంనుండే చూసి తప్పుకోవాలి.

శ్రుతులలో, స్మృతులలో బోధింపబడిన సదాచారాన్ని పూర్తిగా పాటించాలి. ఒకరి రహస్యాన్ని బట్టబయలు చేసి వారిని బాధించరాదు. ఎవరినీ నిందించుటగాని కొట్టుటకాని దోషము. పుత్రునీ శిష్యునీ అవసరం మేరకు దండించవచ్చు. స్వధర్మాచరణ విషయంలో ఎటువంటి వెసులుబాటు కోసమూ చూడరాదు. దాన్ని తప్పనిసరిగా పూర్తిగా చేయవలసినదే. ధర్మ విరుద్ధమైన పనులను చేయరాదు. గృహస్థు తన తల్లిదండ్రులతో, అతిథితో, ధనికులతో వాదించరాదు.

నది, సెలయేరు, పుష్కరిణి, చెఱువులలో స్నానంచేయాలి. ఇతరుల సరోవరంలో స్నానంచేయడానికి ముందు అనుమతిని పొంది, అయిదు మట్టి ముద్దలను బయటికి తీసి ఒడ్డున పెట్టి వెళ్ళాలి.

ఇతరుల శయ్యపై పడుకొనరాదు. దేశం ఆపదలో నున్నపుడు మనం మాత్రం ప్రసన్నంగా భోంచెయ్యరాదు. ఏదో తినాలి కాబట్టి తినాలి.

కృపణుడు, బందీ, దొంగ, అగ్నిహోత్రం చెయ్యని బాపడు, వెదురుతో పని చేయువాడు, న్యాయస్థానంలో నేరం ఋజువైనవాడు (దోషిగా నిరూపింపబడినవాడు) వడ్డీ వ్యాపారి, వేశ్య, సామూహిక దీక్షలనిచ్చేవాడు, చికిత్సకుడు, రోగి, క్రోధి, నపుంసకుడు, నటన – నాట్యాల ద్వారా వేదికలపై పొట్టపోసుకొనే వాడు, ఉగ్రుడు, నిర్దయుడు, పతితుడు, డాబులు

కొట్టేవాడు, శాస్త్రవిక్రేత, స్త్రీ వశుడు, గ్రామంలో దేవతలకు శాంతి పూజలు చేయించేవాడు. నిర్దయుడైన రాజు, అబద్ధాల కోరు, మద్యవిక్రేత, బంగారం పనివాడు, వంది – వీరి యింటిభోజనమును చేయరాదు.

పాసిపోయిన, చలిది, నిలువయుండిన, రంగు మారిన, కుక్క ముట్టిన, పతితునిచే చూడబడిన రజస్వల ముట్టిన, [1]సంఘుష్ట, [2]పర్యాయాన్న భోజనమును సర్వదా త్యజించ వలెను.

శూద్రాన్నమును భుజించవచ్చును. ఐతే, ఆ శూద్రుడు కొన్ని తరాలుగా మన వృత్తిలో సహాయపడుతున్న వారి కుటుంబం వాడై వుండాలి. మనస్సు, మాట, శరీరం, కర్మ – వీటన్నింటినీ పరిశుద్ధంగా వుంచుకొని భగవదర్పణ బుద్ధితో మెలిగే వాడై వుండాలి.

తిలతండులమిశ్రిత పదార్థాలనూ, అప్పాలు, పాయసం, పండివంటలు – ఇట్టి వాటిని దేవతలకో, అతిథులకో సమర్పించాకనే మనంతినాలి.

నీరుల్లి, వెల్లుల్లి వంటి ఉగ్రపదార్థాలు తిన్న వారికి చాంద్రాయణ వ్రతం చేస్తే కాని ఆ దోషంపోదు. మితంగా తింటూ, హితంగా వుంటూ, చిన్న, తెలియని దోషాలకు భగవంతుని క్షమాపణ కోరుకుంటూ, జీవితాన్ని భగవత్ప్రసాదంగా భావించి ప్రతి కర్మనీ భగవంతునికే సమర్పిస్తూ ఆయననే ప్రార్థిస్తూ జీవించేవాడు ఆయననే చేరుకుంటాడు.

***(అధ్యాయం – 96)***

## ద్రవ్యశుద్ధి

**యా**జ్ఞవల్క్య మహర్షి ప్రవచనమింకాకొనసాగుతోంది. 'శ్రేష్ఠమునులారా! ఇపుడు ద్రవ్య శుద్ధిని గూర్చి వినిపిస్తాను.

బంగారం, వెండి, అబ్జ (ముక్తాఫల, శుక్తి, శంఖాదులు) కూరలు, త్రాళ్ళు, గొఱ్ఱె చర్మంతో చేసిన వస్తువులు, పాత్రలు, హోమంలో వేయవలసిన ధాన్యాలు, యజ్ఞ పాత్రలు లోపల మెత్తని నున్నని లేపనం లేనివై యుండి అపవిత్ర స్పర్శకులోనైతే నీటితో బాగా కడిగితే చాలు, శుద్ధములైపోతాయి. ధాన్యాదులపై కాస్త నీళ్ళు చిలకరిస్తే చాలు. యజ్ఞంలో వాడవలసిన స్రుక్, స్రువాలు (కర్రచెంచాలు) వేడి నీటితో కడిగితే శుద్ధి జరుగుతుంది.

---

*[1]భోజనం మిగిలిపోయింది. వచ్చితినేస్తారా.... అంటూ పెట్టే అన్నం.*
*[2]ఒకరికోసం సిద్ధం చేసి వారు స్వీకరించకపోతే మనకి పెట్టునది.*

ఉన్ని, పట్టు బట్టలను వేడినీటితో వెచ్చని గోమూత్రంతో కడిగి శుద్ధిచేయాలి. యజ్ఞపాత్రలను చేతితో బాగా మర్దించి కడగాలి. కఱ్ఱతో, దుప్పికొమ్ము లేదా పంటితో నిర్మింపబడిన పాత్రలను మట్టితో తోమి నీటితోకడగాలి. స్త్రీ ముఖానికీ, బ్రహ్మచారి భిక్షా పాత్రకీ, బజారులో అమ్మదలచుకున్న అన్నాదులకి శుద్ధి అవసరంలేదు – అవి ఎల్లపుడూ పవిత్రాలే. మట్టి పాత్రను పవిత్రం చేయడానికి అగ్నిలో పెడితేచాలు. చండాలుడు దానిని స్పృశించకుండా చూసుకోవాలి. ఆవువాసన చూసిన అన్నమూ, తలవెంట్రుకలూ కీటకాలూ పడిన అన్నమూ నీటితో, భస్మంతో, మట్టితో శుద్ధి అవుతుంది. నేలను శుద్ధిచేయాలంటే తుడిచి, కడిగి, తుడవాలి. తగరం, సీసం, రాగి, గాజు పాత్రలను ఉప్పు, నిమ్మరసం దశల వారిగా నీటిలో కలిపి కడగడం ద్వారా శుద్ధి చేయాలి. కంచు, ఇనుము పాత్రలను భస్మంతో తోమి నీటితో కడగాలి. అజ్ఞాతవస్తువులు పవిత్రాలే.

అమేధ్యములచే – అనగా శరీరము నుండి పుట్టినవైన మల, వసా, శుక్ర, శ్లేష్మాదులచే – అశుద్ధములైన పాత్రలను మట్టితో బాగా తోమి నీటితో కడగడం ద్వారా శుద్ధిచేయాలి. ప్రకృతి ద్వారా భూమిపై ఏర్పాటు చేయబడి గోవుచే త్రాగబడు నీరు శుద్ధమైనదే కావున దానిని శుద్ధి కార్యక్రమానికి వాడవచ్చును.

సూర్యరశ్మి, అగ్ని, ధూళి, చెట్టు నీడ, ఆవు, గుఱ్ఱము, నేల, వాయువు, మంచు బిందువులు ఎప్పుడూ పవిత్రాలే. మనిషి స్నానం చేశాక, నీరు త్రాగాక, తుమ్మినాక, పడుకొని లేచాక, భోజనం తరువాత, నడిచి వచ్చాక, బట్టలు మార్చాక ఆచమనం చేస్తే శుద్ధి అవుతుంది.

ఆవులింత, ఉమ్ము, నిద్ర, వస్త్రధారణ, కన్నీరు – ఈ పంచకార్యాలకూ ఆచమనం చేయనక్కరలేదు. దేవుని స్మరించి కుడిచెవిని ముట్టుకుంటే చాలు. బ్రాహ్మణుని చెవిపై అగ్ని మున్నగు దేవతలు ఎల్లపుడూ ప్రకాశిస్తుంటారు. ***(అధ్యాయం – 97)***

# దానధర్మమహిమ

**ఋ**షులారా! దానధర్మం చాలాగొప్పది. అన్ని వర్ణాలలోకీ అధ్యాయనాధ్యాపనల వల్ల బ్రాహ్మణ వర్ణం గొప్పది. వారిలో సత్క్రియానిష్ఠుడు అనగా కర్మనిష్ఠగలవాడు శ్రేష్ఠుడు. వారిలో విద్య, తపస్సు గల బ్రహ్మతత్త్వ వేత్త వరిష్ఠుడు. దానమిచ్చువాడు సత్పాత్రుని కీయదలచుకున్నపుడు ఇది చూడాలి. భోజనం పెట్టడానికీ అన్నదానం చేసేటప్పుడూ ఆకలీ, పేదరికమూ మాత్రమే కొలబద్దలు. అలా కాకుండా గృహస్థైనవాడు గో, భూ, ధాన్య, ధన, సువర్ణాది దానాలు చేసేటపుడు సత్పాత్రునికే చేయాలి.

విద్యా, తపస్సులేని బ్రాహ్మణుడు దానం పుచ్చుకోకూడదు. అపాత్రదానం వల్ల దాతా, ప్రతిగ్రహీతా కూడా అధోగతి పాలవుతారు. దానం అర్హులకు ప్రతిరోజూ చేయాలి. నిమిత్తకాలాల్లో – అనగా సూర్యచంద్రాదిగ్రహణాల వంటి ప్రత్యేక దినాల్లో విశిష్ట దానాలను చెయ్యాలి. యాచకులు వస్తే ఎవరికి తగిన దానాన్ని వారికి చేయాలి. విశిష్టమైన గోదానాన్ని చేసినపుడు మాత్రం దాని కొమ్ములకు బంగారు బొడిపెలనూ గిట్టలకు వెండి చుట్లనూ అలంకరించి ఒక కాంస్యపాత్రతో సహా ఇవ్వాలి. కొమ్ములకుండే బంగారం పది సౌవర్ణికాలు (నూటయెనిమిది మాశలు) గిట్టలకు పెట్టే వెండి ఏడు పళంలు వుండాలి.

గోదానాన్ని దూడతో సహాచేయాలి. ఆ దూడనీ అలంకరించాలి. ఆవురోగరహితమై వత్స సహితమైవుండాలి. దూడ దొరకకపోతే బంగారంతో కాని పిప్పల కఱ్ఱతో గాని చేసిన కొయ్యదూడనీయవలెను. ఇలా దానం చేసిన వానికి ఆవు లేదా దూడపై ఎన్ని రోమాలున్నవో అన్నేళ్ళు స్వర్గ సుఖములు సంప్రాప్తమౌతాయి. అదే కపిల గోవైతే దాత యొక్క ఏడు తరాలు ఉద్ధరింపబడతాయి.

గర్భము నుండి దూడ బయల్వెడలుతున్నప్పటి ఆవును పృథ్వీ సమానముగా పూజిస్తారు. స్వర్ణంతో గోదానం చేసే స్తోమతులేనివారు పాలిచ్చే ధేనువును గానీ గర్భముతోనున్న ధేనువును గాని దానం చేసి నా స్వర్గ ప్రాప్తి వుంటుంది.

అలసిన మనిషికి ఆసనాదికములను దానమిచ్చి అలసటను దూరం చేయడం, రోగికి సేవచేయడం, దేవపూజనం, బ్రాహ్మణుని పాదాలను కడగడం, ఆయన వాడే జాగానూ, వస్తువులనూ శుభ్రం చేయడం – ఇవన్నీ గోదానాన్ని శాస్త్రోక్తంగా చేసిన దానికి సమానమైన ఫలాన్నిస్తాయి. అలాగే బ్రాహ్మణుడు మిక్కిలిగా ఇష్టపడే వస్తువులను దానం చేసిన వానికి స్వర్గ ప్రాప్తి వుంటుంది.

భూమి, దీపం, అన్నం, వస్త్రాలు, నెయ్యి – వీటిని దానం చేసిన వానికి లక్ష్మి ప్రాప్తిస్తుంది. ఇల్లు, ధాన్యం, గొడుగు, మాల, వాహనం, నెయ్యి, నీరు, శయ్య, కుంకుమ, చందనాదులను దానమిచ్చినవారు స్వర్గలోకంలో ప్రతిష్ఠితులౌతారు.

సత్పాత్రునికి విద్యాదానమొనర్చిన వానికి దేవ దుర్లభమైన బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. వేదార్థాన్నీ, యజ్ఞాల విభిన్న విధులనూ సంపాదితం చేసి, శాస్త్రాలనూ విభిన్న ధర్మశాస్త్రాలనూ తరువాతి తరం వారికోసం కొంత మూల్యాన్ని స్వీకరించియైనా సరే, వ్రాసిన వానికి బ్రహ్మలోక ప్రాప్తి ఫలంగా వస్తుంది. ఈ ప్రపంచానికి మూలం వేద, శాస్త్రాలే. అందుకే భగవంతుడు ముందుగా వాటినే సృజించాడు. కాబట్టి ఎంతగట్టి

ప్రయత్నాలు చేసైనా వేదాల తాత్పర్యాన్ని తరువాతి తరాల వారి కందించాలి. ఇతిహాస పురాణాలను కూడా ఇలాగే వ్రాసివుంచిన వారికి, దానం చేసినవారికి బ్రహ్మదానానికి సమానమైన పుణ్యానికి రెండింతల పుణ్యం లభిస్తుంది.

నాస్తికుల వచనాలూ, కుతర్కాలూ ద్విజుడైన వాడు వినరాదు. ఎందుకంటే ఒకనిని అధోగతి పాలు జేయడానికా శబ్దమే చాలు.

దానం పుచ్చుకొనే అర్హత, అవకాశం వుండీ కూడా తమ వద్ద పుష్కలంగా వున్న దానిని వేరొకరికి ఇప్పించిన వారికీ, తమ వద్దలేకపోయినా ఇతరుల అవసరాన్ని గుర్తించి వారికిప్పించిన వారికీ దాతకు లభించినంత పుణ్యమే లభిస్తుంది.

కులట, పతితులు, నపుంసకులు, శత్రువులు దానమిచ్చినా స్వీకరించరాదు. పెద్దగా సచ్చరిత్రులు కానివారు కుశ, శాక, దుగ్ధ, గంధ, జలాది సామాన్య వస్తువులను అడగకుండానే ఇచ్చినా పుచ్చుకోవచ్చును. తల్లిదండ్రులను పోషించడానికై గాని దేవతలను అతిథులను పూజించుటకు గాని, తనకు ప్రాణం మీదికి వచ్చినపుడు గాని పతితులు కుత్సితులు కానివారెవరు దానమిచ్చినా స్వీకరించవచ్చును; అదీ అవసరం మేరకే.

*(అధ్యాయం - 98)*

# శ్రాద్ధాదికారులు - దాని సంక్షిప్తవిధి మహిమ, ఫలాలు

**ఋ**షిగణులారా! ఇపుడు సర్వపాపవినాశినియైన శ్రాద్ధ విధిని వినిపిస్తాను.

ఒక మనిషిపోయిన ఏడాదికి ఆ రోజే శ్రాద్ధం పెట్టాలను కుంటారు చాలా మంది. తద్దినం లేదా ఆబ్దికం - ఏడాదికొకసారి పెట్టేదే శ్రాద్ధమనుకుంటారు కూడ. కాని, శ్రాద్ధమనగా శ్రద్ధగా పితృదేవులను తలచుకొని చేయు కర్మయని భావము. ఇది ఏడాది కొకసారే పెట్టాలని లేదు.

అమావాస్య, అష్టకం[1], వృద్ధి (పుత్రజన్మమున్నగునవి) కృష్ణపక్షం, ఉత్తరాయణ దక్షిణాయన, ప్రారంభదినాలు, అన్నాది లాభదినాలు, విషువత్ - సంక్రాంతి[2], మకర సంక్రాంతి, వ్యతీపాతం, గజచ్ఛాయా - యోగం, చంద్ర - సూర్యగ్రహణాలు, కర్తకి బుద్ధి పుట్టినపుడు - వీటిలో ఎప్పుడైనా శ్రాద్ధం పెట్టవచ్చును.

మధ్య వయస్కుడై కూడా అన్ని వేదాలనూ అస్ఖలితంగా చెప్పడంలో దిట్ట (దీనికి పురాణ పదం అగ్ర్య), శ్రోత్రియుడు, బ్రహ్మవిదుడు, మంత్రాలతో బ్రాహ్మణములతో నున్న

---

[1] *హేమంత, శిశిర ఋతువులుండే నెలలలో వచ్చే బహుళ అష్టమి*

[2]*సూర్యుడు తులారాశిలో మేషరాశిలో సంక్రమణం చేయుతిథి*

వేదభాగానికి తాత్పర్యం చెప్పగలిగే విద్యావేత్త, జ్యేష్ఠ సామమను పేరుగల సామవేద భాగాన్ని బాగా అధ్యయనం చేయడానికి గల విహితవ్రతాచరణలన్నీ పూర్తిచేసి దాని అధ్యేతయైన మహావైదికుడు, ఋగ్వేదంలో త్రిమధు అను పేరుగల దానిలో అలాగే అధ్యేతయైనమేధావి, త్రిసుపర్ణనామంతో విలసిల్లే ఋగ్యజుర్వేదాలలోని ఏకదేశభాగా ధ్యేత, వీరిలో నెవరైనా శ్రాద్ధ సంపత్తి' గా ఆహ్వానింపబడి పూజింపబడడానికి అర్హులౌతారు. అనగా వీరికి ఆనాడు భోజనం పెట్టి దానాలిస్తే అక్షయ ఫలాలు అబ్బుతాయి.

అలాగే కర్మనిష్ఠుడు, తపోనిష్ఠుడు, శిష్య వత్సలుడైన మహోపన్యాసకుడు, విశిష్ట ఋత్విక్కు, [1]పంచాగ్ని విద్యను బాగా అధ్యయనం చేసి 'అధ్యేత' అనిపించుకున్నవాడు. బ్రహ్మచారి, మాతృపితృభక్తుడైన జ్ఞాననిష్ఠుడు కూడ శ్రాద్ధ సంపత్తులనబడతారు.

రోగి అంగహీనుడు, అధికాంగుడు, 1. కాణుడు 2. పౌనర్భవుడు[2], 3. అవకీర్ణాది ఆచార భ్రష్టులు శ్రాద్ధ యోగ్యులు కారు.

శ్రాద్ధాని కొకరోజు ముందే బ్రాహ్మణుని ఆహ్వానించి సిద్ధం చేసుకోవాలి. ఆ బ్రాహ్మణుడు ఆ క్షణం నుండే నియమ నియతుడైవుండాలి. (బ్రాహ్మణులను, బ్రాహ్మణులు plural) శ్రాద్ధదినం నాటి పూర్వాహ్ణంలో వారు రావాలి. రాగానే గృహస్థువారిచే అత్యంతాదరంతో ఆచమనం చేయించి ఆసనాలపై కూర్చుండపెట్టాలి. విశ్వేదేవ లేదా ఆభ్యుదయిక శ్రాద్ధానికి ఇద్దరు బ్రాహ్మణులనూ, పితృపాత్రలో వీలైనంతమంది బ్రాహ్మణులనూ కూర్చుకోవాలి. లేదా విశ్వేదేవపాత్రులుగా తూర్పు ముఖంగా ముగ్గురినీ కూర్చుండబెట్టవచ్చు. శక్తిలేనివారు దానికొకనినీ, దీని కొకనినీ తెచ్చి చేయించుకోవచ్చు. ఈ విధంగా మాతామహులకు కూడా కూర్చుండబెట్టవచ్చును.

ఆ తరువాత బ్రాహ్మణులకు హస్తార్ఘ్యము (చేతులు కడుక్కోవడానికి నీరు) నూ ఆసనానికి కుశలనూ ఇచ్చి వారి అనుమతి తోనే ***విశ్వేదేవాస...*** అనే మంత్రంతో విశ్వేదేవతలనా వాహనం చేసి భోజన పాత్రలో యవలను జల్లాలి. తరువాత పవిత్రయుక్త అర్ఘ్యపాత్రలో ***శం నో దేవీ....*** అనే మంత్రం ద్వారా నీటినీ ***యవో஽ సి....*** అనే మంత్రం ద్వారా యవలనూ పోసి ***యా దివ్యా....*** మంత్రంతో బ్రాహ్మణుని చేతిలో అర్ఘ్యోదకాన్ని ప్రదానం చేసి గంధ, దీపక, మాల, హారాది ఆభూషణాలనూ, వస్త్రాలనూ వారికి దానం చేయాలి.

---

*[1]సభ్య, ఆవసథ్య, ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులు పంచాగ్నులు*

*[2]పునర్భూకి పుట్టినవాడు. పునర్భూ అనగా వివాహానికి ముందే ఒక పురుషునితో లైంగిక బంధమున్న ఆడది. బ్రహ్మచారిగా గురుకులంలో వున్నపుడే వీర్యస్ఖలనం జరిగిపోయినవాడు.*

తరువాత జంధ్యమునపసవ్యం చేసుకొని అప్రదక్షిణ క్రమంలో అనగా ఎడమ క్రమంలో స్థానం ప్రదానం చేసి కుశలను ***అశంతస్త్వా...*** అనే మంత్రంతో (చేతబట్టుకొని) పితరులను ఆవాహనం చేయాలి. అనంతరం పితృస్థానంలో ఆసీనుడైయున్న భూదేవుని అనుమతిని తీసుకొని ***ఆయంతు నః పితరః....*** అనే మంత్రాన్ని పఠించాలి.

పితృకార్యంలో నువ్వులకే ప్రాధాన్యముంటుంది. (ఇతర కార్యాల్లో యవలను వాడతారు) పితృగణాలకు తిలలతో అర్ఘ్యాన్నిచ్చిదానిని బ్రాహ్మణుడందుకోగా క్రిందపడిన జలాలను (వీటినే సంస్రవలంటారు) 'పితృపాత్ర' అని వేరే ఒక గిన్నెను పెట్టి అందులో వుంచాలి. దక్షిణాగ్రకుశస్తంభాన్ని భూమిపై పెట్టి దానిపై పితృభ్యః స్థానమసి... అనే మంత్రం చదువుతూ ఇందాక చెప్పిన అర్ఘ్య పాత్రను పితరులకు ఎడమవైపు బోర్లించి పెట్టాలి. అగ్నికరణకి అనుమతి నివ్వమని ఆచార్యుని వేడుకొని ఆయన అనుమతించగానే శ్రాద్ధకర్త నేతితో కలిపిన అన్నాన్ని అగ్నికి ప్రదానం చేయాలి. పాత్రలో మిగిలిన అన్నాన్ని నెమ్మదైన మనసుతో నిదానంగా పితరుల యొక్క భోజన పాత్రలోకి తీసివుంచాలి. స్తోమతుకలిగినవారు పితరుల భోజనానికై వెండి పాత్రలనుపయోగించాలి.

***పృథివీ తేపాత్రం....*** అనే మంత్రంతో పాత్రలను అభిమంత్రితం చేసి ***ఇదం విష్ణుః ...*** అనే మంత్రాన్ని శ్రద్ధగా పఠిస్తూ మరింత శ్రద్ధగా గౌరవంగా బ్రాహ్మణుని బొటన వ్రేలి నందుకొని పితరులకుద్దేశింపబడిన అన్నంలో దానిని పెట్టాలి. గాయత్రి మంత్రాన్నీ ***మధువాతా....*** అనే మంత్రాన్నీ పఠిస్తూ మధ్యలో ఆపి బ్రాహ్మణులను భోజనానికి కూర్చుని మౌనంగా భోంచేయమని ప్రార్థించి మరల ఆ మంత్రాలనే చదువుతుండాలి. మరల బ్రాహ్మణులను మొగమాటపడవద్దని ప్రార్థించాలి. క్రోధాది మనోవికారాలను మనసులోకి రానీకుండా ప్రశాంతమనస్కుడై శ్రద్ధనిండిన గుండెతో వారికి వడ్డిస్తూ తొందరపెట్టకుండా, మంత్రాన్ని జపిస్తూ ఓపికగా భోజనాలు పెట్టాలి. హవిష్యాన్నము (హోమగుండంలో వండబడిన అన్నం) ను వారికి సమర్పించి వారు తృప్తిగా భోజనం చేసే దాకా పురుష సూక్తాన్నీ, పవమాన సూక్తాదులనూ జపిస్తుండాలి. వారు తృప్తిగా భుజించాక మరల ***మధువాతా...*** మంత్రాన్ని పఠించాలి. 'మేము తృప్తిగా సుష్ఠుగా భోంచేశాము' అని వారి చేత అనిపించుకొని వారు భుజించగా మిగిలిన అన్నాన్ని దక్షిణం వైపు తీసుకుపోయి తిలలను అందులో వేసి బ్రాహ్మణులు అన్నంతిన్న పాత్రలనూ వాటి ప్రక్కనే భక్తి మీరగా తెచ్చి ఆదరంగా వుంచాలి. ఎందుకంటే ఆ క్షణంలో వారు మనవూరి సామాన్య మానవులు కారు; పితృలోకం నుండి దిగివచ్చిన మన తండ్రులూ, తాతలూనూ. వారికి వేరువేరుగా ప్రక్షాళన జలాల నిచ్చి వెంటనే తుండుగుడ్డలను కూడా భక్తిగా ఇవ్వాలి.

ఉచ్ఛిష్టానికి సమీపంలోనే పితరాదులకూ మాతా మహాదులకూ పింద ప్రదానం చేయాలి. తరువాత బ్రాహ్మణులను ఆచమనం చేయవలసిందిగా ప్రార్థించాలి. తరువాత బ్రాహ్మణులు స్వస్తి వాక్యాలను చదువగా శ్రాద్ధకర్త **అక్షయమస్తు** అంటూ బ్రాహ్మణుల చేతులలో నీరుపోసి తన సామర్థ్యానికి తగినట్లుగా దక్షిణలిచ్చి **స్వధాంవాచయిష్యే** అనాలి. **వాచ్యతాం** అంటూ వారు అనుమతి నివ్వాలి. అపుడు శ్రాద్ధకర్త తన పితృదేవతలనుద్దేశించి **స్వధా** అనువాక్యాన్ని పలుకగా పితృదేవతల ప్రతిరూపమైన బ్రాహ్మణులు కూడా అదే వాక్యం ద్వారా అతనిని దీవిస్తారు. అప్పుడు శ్రాద్ధకర్త నీటిని భూమిపై వదలాలి. తరువాత **విశ్వేదేవాః ప్రీయంతాం** అంటూ మరికొంత నీటిని వదిలి పితృదేవతలను ఇలా ప్రార్థించాలి.

***దాతారో నోఽభి వర్ధంతాం వేదాః సంతతిరేవ చ ॥***
***శ్రద్ధా చనోమా వ్యగమద్ బహుదేయంచనోఽస్త్వితి ।*** ***(ఆచార 99 / 26,27)***

తరువాత ***వాజే వాజే....*** అనే మంత్రాన్నుచ్చరిస్తూ శ్రాద్ధకర్త ప్రసన్నంగా పితరులను యథాక్రమంలో విసర్జించాలి. మొదట్లో బోర్లించి పెట్టిన, సంస్రవజలాలుండిన పాత్రను సరిచేసి చేత బట్టుకొని బ్రాహ్మణులకు ప్రదక్షిణ చేసి వారిని వీడ్కొల్పాలి. వారితో బాటు కొంత దూరం నడచి వెళ్ళి సాదరంగా సాగనంపాలి. తరువాత శ్రాద్ధ కర్మలో మిగిలిన భోజనాన్ని స్వీకరించి ఆ రాత్రి బ్రహ్మ చర్యాన్నవలంబించాలి.

వివాహాది శుభకార్యాలు చేసేటపుడు పితరులకు నందీ ముఖశ్రాద్ధాన్ని పెట్టాలి. వారికి పెరుగు, బదరీ ఫలం, యవమిశ్రిత అన్నంలతో పిండదానం చేయాలి.

ఏకోద్దిష్టశ్రాద్ధం (ఎవరో ఒకే ఒక వ్యక్తి నుద్దేశించి పెట్టేది) విశ్వేదేవరహితం, ఏకాన్న, ఏక పవిత్రకయుక్తం అయివుంటే చాలు. ఈ శ్రాద్ధానికి ఆవాహనం, అగ్నౌకరణం కూడా అవసరంలేదు. జంధ్యాన్ని అపసవ్యం చేస్తే చాలు. బ్రాహ్మణులను పవిత్ర భూమిపై **ఉపతిష్ఠతాం** అంటూ కూర్చోమని ప్రార్థించాలి. అలాగే **అభిరమ్యతాం** అంటూ విసర్జన చేయాలి. బ్రాహ్మణులు **అభిరతాః స్మ** అనే వచనాన్ని చెప్పాలి.

సపిండీకరణ శ్రాద్ధంలో శ్రాద్ధ కర్త తిలలతో గంధ మిశ్రిత జలాలతో నాలుగు పాత్రలను నింపివుంచాలి. ఇవి పితరులకై ప్రత్యేకంగా విధించబడినవి. ఇవి కాక విశ్వేదేవులకు రెండు పాత్రలుండాలి. పితృపాత్రలలో నొకదానిని ప్రేతపాత్రగా ప్రత్యేకంగా వుంచి దానిని అర్ఘ్య ప్రదానానికి వినియోగించాలి. తరువాత శ్రాద్ధకర్త ఆ పాత్రలోని కొంత జలాన్ని మిగిలిన మూడు పాత్రలలోని నీటితో కలిపి పూర్వంలాగే అర్ఘ్యాది క్రియలను సంపన్నం చేయాలి. ప్రేత పిండాన్ని ***యేసమానా...*** తో మొదలయ్యే రెండు మంత్రాలను చదువుతూ

మూడు భాగాలుగా చేసి పితరుల పిండాలతో కలపాలి. దీని తరువాత ఏకోద్దిష్టంగా స్త్రీకి పిండాన్ని పెట్టాలి. ఒక యేడాదికి లోపే పెట్టు సపిండీకరణలో కూడా ఏడాది పూర్తయ్యాక పెట్టు విధంగానే సాన్నోదక కుంభాన్ని ప్రతి మాసం బ్రాహ్మణునకు, యథాశక్తిగా, దానం చెయ్యాలి. పితరులకు సమర్పితమైన పిండాన్ని ఆవు, బ్రహ్మ, బ్రాహ్మణుడు, అగ్ని, జలం – వీటిలో దేనికైనా అర్పించవచ్చును.

హవిష్యాన్నంతో శ్రాద్ధం పెడితే నెలరోజులకు సరిపడా అన్నంతిన్న తృప్తినీ, పాయసంతో పెడితే ఒక యేడాది బాటు భోం చేసిన తృప్తినీ పితృగణాల వారు పొందుతారు.

మృతవ్యక్తులకి ప్రత్యేకంగా కృష్ణ చతుర్దశినాడు శ్రాద్ధం పెట్టిన వానికి జీవితకాల పర్యంతమూ ఉత్సాహ, శౌర్య, క్షేత్ర, శక్తి సుఖాలుంటాయి. దేహాంతంలో స్వర్గలోక ప్రాప్తి వుంటుంది. (ఇక్కడ మృత వ్యక్తులనగా శ్రాద్ధకర్తకు ఊహతెలిశాక మృతులైనవారు కావచ్చు.)

విధి పూర్వకంగా అన్ని నియమాలనూ పాటిస్తూ భక్తి శ్రద్ధలతో శ్రాద్ధం పెట్టిన వానికి పుత్ర సంతతి, సర్వజనశ్రేష్ఠత, సౌభాగ్యం, సమృద్ధి ప్రముఖత, మాంగలిక దక్షత (ప్రాముఖ్యము అనే మాటను వాడాలి) అభీష్టకామనలపూర్తి, వాణిజ్యంలో లాభం, నిరోగత, యశం, శోకరాహిత్యము, ధనం, విద్య, వాక్సిద్ధి, పాత్రత, గోసంపద, అశ్వాలకలిమి, దీర్ఘాయువు – ఇవన్నీ కలిగి దేహాంతంలో మోక్షము లభిస్తుంది.

కృత్తిక నుండి భరణిదాకా ప్రత్యేక నక్షత్రంలోనూ శ్రాద్ధ కార్యాలను చేసిన వానికి ఇహలోకంలో వస్త్ర, భవనాదులూ, సర్వసుఖ సాధనాలూ పుష్కలంగా లభిస్తాయి. పిత, పితామహుడు పితృదేవతలలో అగ్రగణ్యులు. వీరు తమ శ్రాద్ధ కర్తకు ఆయువు, సంతతి, ధనం, విద్య, రాజ్యం, సర్వసుఖాలు, స్వర్గం, తరువాత మోక్షం కూడా ప్రసాదించగలరు.'

***(అధ్యాయం – 99)***

# వినాయక శాంతి స్నానం

'మునులారా! మనిషి తెలిసిగాని తెలియకగానీ చేసే కొన్ని పనులు దేవతలకు కోపం తెప్పిస్తాయి. వారు అప్రసన్నులౌతారు. అలా వినాయకుని అప్రసన్నతకు గురైన వారు ఆ విషయాన్ని తెలుసుకొనే అవకాశాన్ని ఆయనే కల్పించాడు' అంటూ వారి లక్షణాలను ఇలా చెప్పనారంభించాడు యాజ్ఞవల్క్య మహర్షి పుంగవుడు.

'వారికి స్వప్నాలెక్కువగా వస్తుంటాయి. ఆ కలలు కూడా స్నానం చేస్తున్నట్లు వస్తాయి. మరి కొన్ని కలల్లో మరణించిన ప్రాణుల తలలు మాత్రమే కనిపిస్తుంటాయి. కలలోనే

కాక ఇలలో కూడా వారెపుడూ ఉద్విగ్నులై ఆత్రుతపడుతునే వుంటారు. వారే ప్రయత్నం చేసినా సఫలం కాదు. ఏ కారణమూ లేకుండానే నొప్పులు బాధిస్తుంటాయి. వినాయకుని అప్రసన్నతకు గురైన రాజు రాజ్యాన్ని కోల్పోతాడు; కన్యకు పతి దొరకడు; గర్భిణికి కొడుకు పుట్టడు. కాబట్టి ఇలాంటివారే కాదు ఎలాంటి వారైనా ఈ శాంతిని చేయించాలి.

అప్రసన్నతకు గురైన మనిషికి బంధువులూ బ్రాహ్మణులూ కలిసి ఇలా స్నానం చేయించాలి. భద్రాసనం మీద కూర్చుండబెట్టి బ్రాహ్మణులు స్వస్తివాచన పూర్వకంగా ఈ స్నానాన్ని చేయించాలి. పచ్చ ఆవాలను పొడిగావించి నేతితో కలిపి ముద్దచేసి దానినా వ్యక్తి శరీరంపై నలుగుడు పెట్టాలి. తరువాత అతని లేదా ఆమె యొక్క తలకు సర్వౌషధాలూ, సుగంధద్రవ్యాలూ కలిపి తయారు చేసిన నూనెను పట్టించాలి. ఔషధ మిశ్రితమైన నీటితో నాలుగు కుండలను నింపి వుంచి నలుగుడు పిండిని పూర్తిగా లాగివేసి తలపై పట్టించిన నూనె కాస్త తడియారగానే ఒక్కొక్క కుండనూ (ఈ కుండల్లో నీరు పోయడానికి ముందే పుణ్యనది, సరోవరం వంటి అయిదు పవిత్ర జలాశయాల నుండి తెచ్చిన మట్టినీ, గోరోచనాన్నీ, గంధాన్నీ, గుగ్గిలాన్నీ వేసి వుంచాలి) ఆ వ్యక్తి నెత్తి పై నుండి పోస్తూ స్నానం చేయించాలి.

మొదటి కలశలోని నీటిని పోస్తూ ఆచార్యుడు ఈ శ్లోకాన్ని చదవాలి. (మంత్ర)

ఈ మంత్ర శ్లోకాన్ని చదవాలి.

***సహస్రాక్షం శతధారమృషిభిః పావనం స్మృతం ॥***
***తేన త్వామభిషించామి పావమాన్యః పునంతుతే ।*** **(ఆచార 100 / 6,7)**

సహస్ర నేత్రాలూ (సహస్ర శక్తులని ఉద్దేశ్యం), అసంఖ్యాక ధారలూ, మహర్షిబృందం పవిత్రములనీ పవిత్రీకరములనీ ఆదేశించిన పవిత్రజలాలతో (వినాయక గ్రస్తుడవైన నిన్ను) అభిషేకిస్తున్నాను. ఉపద్రవశాంతి నీకగుగాక – అని దీని భావము.

రెండవ కలశాన్ని ఈ క్రింది మంత్రయుక్త శ్లోకాన్ని పఠిస్తూ ఆ వ్యక్తి తలపై వంచి అభిషేకించాలి.

***భగంతే వరుణోరాజా భగం సూర్యో బృహస్పతిః ॥***
***భగమింద్రశ్చవాయుశ్చ భగం సప్తర్షయో దదుః ।*** **(ఆచార 100 / 7,8)**

మూడవ కలశలోని నీటితో వ్యక్తి నభిషేకిస్తూ ఈ మంత్ర పూత శ్లోకాన్ని చదవాలి.

***యత్తే కేశేషు దౌర్భాగ్యం సీమంతే యచ్చ మూర్ధని ॥***
***లలాటే కర్ణయోరక్ష్ణో రాపస్తద్రఘ్నంతు తే సదా ।*** **(ఆచార 100 / 8,9)**

నీ సర్వాంగాలనూ పట్టిన దరిద్రం నేటితో ఈ నీటి పవిత్రత వల్ల కదుక్కుపోవాలి గాక అని ఈ శ్లోకభావం.

అనంతరం నాల్గవ కుండలోని నీటిని పోస్తూ పై మూడు శ్లోకాలనూ పఠించాలి. ఎడమ చేతిలో కుశదర్భలను తీసుకొని, బ్రాహ్మణుడు, ఆ వ్యక్తి యొక్క తలను స్పృశిస్తూ మేడి కర్రనుండి చేసిన స్రువ (చెంచాలాటిదేకాని కర్రచివర గోయి వుంటుంది. యజ్ఞాలలో వాడతారు) తో ఆవనూనెను కుడి చేతితో తీసుకొని అగ్నిలో ఆహుతులను సమర్పించాలి. ఈ ఆహుతులను ఈ క్రింది మంత్రాలు చదువుతూ వేయాలి.

***మితాయస్వాహా, సమ్మితాయ స్వాహా,***
***శాలాయ స్వాహా, కటంకటాయ స్వాహా,***
***కూష్మాండాయ స్వాహా, రాజపుత్రాయ స్వాహా*** ★

తరువాత లౌకిక అగ్నిలో గిన్నెలో, బియ్యంతో, అన్నాన్ని వండి చరు (హోమగుండంలో వండినలేదా వేసెడి అన్నం) ని తయారు చేసి దానిని ఇంతకు ముందు చెప్పబడిన ఆరు **స్వాహా** మంత్రాలతో ఆ లౌకికాగ్నిలోనే హవనం చేసి మిగిలిన దానిని ఇంద్రాగ్నియమాది దేవతలకు బలుల కింద సమర్పించాలి. ఆపై ఒక అరుగుపై దర్భలను పఱచి, దానిపై పుష్ప, గంధ, ఉండేరకమాల, పక్వాన్న, పాయసాలూ, నేయి కలిపిన పులావు, ముల్లంగి (ప్రత్యేకం) గడ్డి, అప్పాలు, పెరుగు, బెల్లంవుండలు, లడ్లు, చెఱకుముక్కలు ఈ ద్రవ్యాలన్నిటినీ చేర్చివుంచాలి.

వినాయక జననియైన దుర్గాదేవిని ప్రతిష్ఠించి చేతులు జోడించి నమస్కరించి, అర్ఘ్యమివ్వాలి. పుత్ర సంతానం కావలసిన స్త్రీ దూర్వా, సరసపుష్పాలతో భగవతి పార్వతీ దేవి నర్చించి స్వస్తివచనాలతో బాటు ఈ క్రింది ప్రార్థనా శ్లోకాన్ని చదవాలి.

***రూపందేహియశోదేహి భగం భగవతి దేహి మే ।***
***పుత్రాందేహి శ్రియందేహి సర్వాన్ కామాంశ్చదేహి మే ॥*** ***(ఆచార 100 / 16)***

తరువాత బ్రాహ్మణులను భోజనాలతో తృప్తి పఱచాలి. గురువుగారికి రెండు వస్త్రాలనిచ్చి (అంటే గురు గ్రహానికి) అన్యగ్రహాలను పూజించి మరల ప్రత్యేకంగా సూర్యార్చన చేయాలి. ఈ విధంగా వినాయకునీ గ్రహాలనూ, పూజించిన వ్యక్తులు సర్వకార్యాల్లోనూ సాఫల్యము నందగలరు. ***(అధ్యాయం - 100)***

---

★ *యాజ్ఞవల్క్యమితాక్షర గ.ప్ర. అధ్యాయంలో 285వ శ్లోకంలో మాత్రం పై మంత్రాలలో 'స్వాహా' కు ముందు ప్రయుక్తమైన నామాలన్నీ వినాయకునివే అని చెప్పబడింది.*

# గ్రహశాంతి

మునులారా! సిరిసంపదలూ, సుఖశాంతులూ కోరుకొనేవారు ముందు తమపై విభిన్న గ్రహాల 'చూపు' ఎలావుందో చూసుకొని 'అది' బాగులేని చోట జాగ్రత్తపడాలి. అంటే తమతమ జాతకాల్లో నున్న గ్రహదోషాలను ఆయాగ్రహ సంబంధిత యజ్ఞాలను చేయడం ద్వారా పోగొట్టుకోవాలి. మనకి తొమ్మిది గ్రహాలున్నాయని విద్వాంసులు చెప్తారు. అవి క్రమంగా సూర్య, చంద్ర, మంగళ, బుధ, బృహస్పతి, శుక్ర, శని, రాహు, కేతువులు వీటిని లేదా వీరిని అర్చించడానికి ప్రతిమలను అనగా మూర్తులను క్రమంగా రాగి, స్ఫటికం, రక్తచందనం, బంగారం, వెండి, ఇనుము, సీసం, కంచు ధాతువులతో తయారు చేయించాలి. ఇక వారి రంగులు క్రమంగా ఎరుపు, తెలుపు, ఎరుపు, పసుపు, పసుపు, తెలుపు, చివరి మూడు గ్రహాలూ నలుపు. వీరి పూజాద్రవ్యాలు కూడా క్రమంగా అవే రంగుల్లో వుంటాయి. ఈ నవగ్రహాలనూ ఒకచోట శాస్త్రోక్తంగా స్థాపించి (లేదా స్థాపింపబడిన చోటికి పోయి) సువర్ణ, వస్త్ర పుష్పాలను నవగ్రహ మండపానికి సమర్పించాలి. గంధ, బలి, ధూప, గుగ్గులాదులను కూడా ఇవ్వాలి. చరు (అనగా హోమంలో వండబడిన అన్నం)ని మంత్రాల ద్వారా ప్రతి ఒక్క గ్రహాన్నీ ఉద్దేశించి సమర్పించాలి. ఆ తరువాత ఈయా గ్రహాలనూ ఆయా మంత్రాలతో దిగువనిచ్చిన విధంగా జపించి అర్చించాలి.

*ఓం ఆకృష్ణేన రజసా... సూర్య*
*ఓం ఇమందేవా... చంద్ర*
*ఓం అగ్నిమూర్ధాదివః కకుత్... మంగళ*
*ఓం ఉద్బుధ్యస్వ... బుధ*
*ఓం బృహస్పతే... బృహస్పతి*
*ఓం అన్నత్పరిస్రుతం... శుక్ర*
*ఓం శం నో దేవీ... శని*
*ఓం కయానశ్చి... రాహు*
*ఓం కేతుం కృణ్వన్... కేతు*

ఈ నవగ్రహాలకు ఇదే క్రమంలో మందార, మోదుగ, కాచు, ఉత్తరేను, రావి, మేడి, శమి, దూర్వ, కుశ సమిధలను నేయి, పెరుగు, తేనెలలో ముంచి హవనం చేయాలి. తరువాత మరల పైన చెప్పబడిన మంత్రాలను చదువుతూ ఈ క్రింది పదార్థాలను

ఆహుతులివ్వాలి. సూర్యునికి బెల్లం, చంద్రునికి ఉప్మా, మంగళునికి పాయసం, బుధునికి బియ్యంతో పరమాన్నం, బృహస్పతికి పెరుగన్నం, శుక్రునికి నెయ్యి, శనికి అరిసెలు, రాహువుకు పండ్ల గుజ్జు, కేతువుకి అనేక రంగుల ధాన్యాలతో ఉడికించిన ముద్ద.

ఇదే క్రమంలో అన్నదానం కూడా ప్రతి గ్రహం పేరు పేరునా చేయాలి. తరువాత ప్రతి గ్రహం పేరుతో రకమంగా ధేనువు, శంఖం, ఎద్దు, బంగారం, బట్టలు, గుఱ్ఱం, నల్లావు, ఆయుధాలు, మేకలను దానంచేయాలి. గ్రహాలు శాంతించి అనుగ్రహిస్తే జాతకాలను మార్చగలవు. సిరులను కురిపించగలవు; రాజ్యాలనే ఇవ్వగలవు; రోగిని సంపూర్ణారోగ్యవంతునిగా చేయగలవు. ***(అధ్యాయం - 101)***

# వానప్రస్థ ధర్మ నిరూపణం

**ము**నులారా! వానప్రస్థాశ్రమాన్ని వర్ణిస్తాను. అవధరించండి. వానప్రస్థాశ్రమంలో ప్రవేశించదలచుకొన్నవాడు తన భార్యను తీసుకొని వెళ్ళవచ్చు, లేదా, సమర్థుడైన కొడుకుపై ఆమె సంరక్షణ భారాన్ని మోపి వెళ్ళవచ్చు. అంతేగాని ఆమె సంగతి చూడకుండా వెళ్ళరాదు.

వానప్రస్థికి బ్రహ్మచర్యం విధాయకం. శృంగారానికి సంబంధించిన ఆలోచన కూడా మదిలో మెదలరాదు. శ్రౌతాగ్నినీ గృహాగ్నినీ తనతోబాటు వనంలోకి తీసుకుపోవాలి. ఎందుకంటే వనమంటే అడవి. అడవిలోకిపోయి ఆశ్రమాన్నీ ఆశ్రయాన్నీ ఏర్పాటు చేసుకొని శాంతంగా క్షమసహితంగా మనస్సునుంచుకొని అహర్నిశలూ దేవోపాసన చేస్తూ జీవించడాన్నే వానప్రస్థాశ్రమం అని వ్యవహరిస్తారు. అక్కడ దున్నని భూమి నుండి పుట్టిన అన్నం ద్వారా అగ్నిదేవునికీ, పితరులకూ, దేవతలకూ, అతిథులకూ, సేవకులకూ తృప్తి కలిగించాలి. ఆత్మజ్ఞాన తత్పరులైవుండాలి. శరీరానికి స్నానం అంగవస్త్రధారణ తప్ప ఏ సంస్కారమూ వుండరాదు. జటలూ, గడ్డమూ ఎంతగా పెరిగినా పట్టించుకోరాదు. ఇంద్రియ దమనం, త్రికాలస్నానం తప్పనిసరి. ఎవరి నుండీ ఎటువంటి దానాన్నీ స్వీకరింపరాదు. స్వాధ్యాయం, భగవద్ధ్యానం, లోకకల్యాణం – ఇవే వానప్రస్థికి నిత్యకృత్యాలు. తప్పనిసరైతే అన్నం కోసం మాత్రమే ధన సంపాదన చేయవచ్చు.

వ్రతాల ద్వారా ఆత్మశుద్ధిని గావించుకోవాలి. వారానికొకమారు, తరువాత పక్షంలో నొకమారు, ఆపై మాసాంతమందే భోజనం చేసే వ్రతం పట్టాలి. చాంద్రాయణం చేస్తూ, భూమిపై శయనిస్తూ వీలైనన్ని ధార్మిక కృత్యాలను (అన్నంతో కాకుండా) ఫలాలతో సంకల్పించి నెరవేర్చాలి. గ్రీష్మర్తువు (గ్రీష్మఋతువు) లో కూడా పంచ– అగ్ని మధ్యంలో

(నాలుగు దిక్కులా అగ్నిని రగిల్చి సూర్యుని అయిదవ అగ్నిగా భావిస్తారు. ఈ పంచాగ్నుల మధ్యమే పంచ-అగ్ని మధ్యం). వర్షాలు పడుతున్నా, మంచు కురుస్తున్నా అరుగుపైనే పడుకోగలగాలి. హేమంతర్తువులో తడిబట్టలు కట్టుకొని, జపం, యోగాభ్యాసం చేయాలి.

పడకమీద తుమ్మముళ్ళు పఱచిన వానిపై క్రోధంగాని, పాదముల క్రింద ఎఱ్ఱ ముఖమలు తివాచీ పఱచిన వానిపై ప్రసన్నతగాని, సర్వాంగాలనూ చందన చర్చతో నెఱపిన వానిపై ప్రేమగాని కలుగరాదు. అప్పుడే అతడు / ఆమె శుద్ధవానప్రస్థి అయినట్లు భావించవచ్చు. సుఖదుఃఖాల కతీతులై సర్వసంగపరిత్యాగులై భగవంతుని వైపు చేసే ప్రయాణంలో చివరిదానికి ముందలి మజిలీ వానప్రస్థం. ***(అధ్యాయం - 102)***

# సన్యాసధర్మ నిరూపణ

(సంస్కృతంలో 'సంన్యాస' అనే వుంటుంది. కొన్ని చోట్ల 'సన్యాస' అనే పదం కూడా కనిపిస్తున్నా తెలుగులో ఎక్కువగా కనిపిస్తున్నది 'సన్యాసమే'. అను)

హే సజ్జనులారా! ఇపుడిక భిక్షు - ధర్మమను నామాంతరంగల సన్యాసధర్మాన్ని వినిపిస్తాను.

గృహస్థ వానప్రస్థాశ్రమాలలో తాను చేసిన అన్ని యజ్ఞాలకూ మకుటాయమానమైన ప్రాజాపత్య యజ్ఞాన్ని కూడా సంపన్నంచేసి చివరగా వేద విహిత విధానానుసారం సమస్త శ్రౌతాగ్నులనూ తనలో ఆరోపించుకొని ఒక వ్యక్తి సన్యాసాన్ని పుచ్చుకోవచ్చును. సన్యాసి అన్ని ప్రాణుల హితాన్నీ కోరాలి, శాంతుడై, త్రిదండాన్ని ధరించి వుండాలి. కమండలువును పట్టుకొని వుండాలి. అన్ని ప్రకారాల సుఖసాధనయుక్త భావాలనూ పరిత్యజించి, అహంకారాన్ని వదులుకొని భిక్షార్థిగా, ఏదో ఒక గ్రామాన్నాశ్రయించి బతుకును గడుపుకోవాలి. సాయంకాలం ఆ గ్రామంలో కనిపించరాదు.

యమనియమపాలన సన్యాసికి తప్పనిసరి. వాటిని పాటిస్తూ యోగసిద్ధిని గానీ పరమహంస స్థాయిని గానీ పొందిన సన్యాసి త్రిదండికానక్కరలేదు. వెదురు కర్ర నొక దానిని (ఏకదండి) పట్టుకోవచ్చు. ఈ విధంగా సన్యాసాశ్రమాన్ని పాలించిన వారు తగిన సమయంలో ప్రాణాలనుకూడా వదలివేసి అమరత్వమును పొందగలరు.

***(అధ్యాయం - 203)***

## కర్మవిపాక నిరూపణ

మునులారా! పాపకర్మం వల్ల నరకంలోపడి అనుభవించే నారకీయయాతన పూర్తికాగానే ఆ పాపకర్మ క్షయమై పోతుంది. అనగా తగ్గిపోతుంది కాని పూర్తిగా నశింపదు. ఆ మిగిలిన పాపం శమించే దాకా ప్రాణి మరల మరల జన్మలెత్తుతునే వుండాలి.

బ్రహ్మ హత్యా పాతకుడు నరకంలో ఘోర శిక్షలననుభవించి మరల భూమిపై ముందు కుక్కగా, పిదప గాడిదగా, ఆపై ఒంటెగా జన్మించాలి. మదిరాపానం చేసిన మహా పాతకులకు కప్ప ఆపై పేను జన్మలుంటాయి. బంగారం దొంగ క్రిమిగా, కీటకంగా, గురుతల్పగామి గడ్డిగా, కలుపు మొక్కగా జన్మించి గతించినా వారిపాపం ఇంకా మిగిలేవుంటుంది. అది పోవడానికి వారు క్రమంగా క్షయరోగులుగా నల్లటి పళ్ళవారిగా, వంకర గోళ్ళ వారిగా చివరగా కుష్టు రోగులుగా జన్మించి జీవించి గతిస్తారు.

అన్నందొంగ రోగిగా, మాటతప్పినవారు మూగవారిగా, ధాన్యం దొంగ అధికాంగునిగా, నూనె దొంగ దానినే తాగి బతికే నీచ కీటకంగా, చెడు సలహాలిచ్చే వాడు దుర్గంధముఖునిగా పుడతారు.

బ్రాహ్మణ ధనాన్నపహరించిన వారూ కన్యని కొనేవారూ బ్రహ్మ రాక్షసులుగా ఆపై ఎద్దులుగా, కూరల దొంగ నెమలిగా, పుష్పచోరుడు చుంచెలకగా, ధాన్యాన్ని దౌర్జన్యంగా అపహరించినవాడు ఎలుకగా, పండ్ల దొంగ కోతిగా, పశువులను దొంగిలించిన వాడు మేకగా, పాలదొంగ కాకిగా జన్మిస్తారు. మాంసం దొంగ గ్రద్దగా, బట్టల దొంగ తెల్లమచ్చల జీవిగా, ఉప్పుదొంగ కీచురాయిగా జన్మిస్తారు.

ఈ విధంగా పాపాలన్నీ నశించిన పిమ్మట భగవంతుడు వీరిని దరిద్రులుగా పుట్టించి ఒక అవకాశాన్నిస్తాడు. ఆ జన్మలో మంచి పనులు చేస్తే ఉత్తమ జన్మలభించవచ్చు; యోగిపుంగవులుగా మారితే మరుజన్మేలేకపోవచ్చు. ***(అధ్యాయం - 104)***

## ప్రాయశ్చిత్తాలు - కృచ్ఛ్ర, పరాక, చాంద్రాయణాది వ్రతాల స్వరూపాలు

***విహితస్యాననుష్ఠానాన్నింది తస్యచసేవనాత్ ।***
***అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతన మృచ్ఛతి ॥ (ఆచార - 105/1)***

చేయవలసిన పనులను చేయకపోవడం, చేయకూడని పనులను చేసేయడం, ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోవడం - ఈ మూడిటిలో ప్రతీది మానవుని అధోగతి పాల్చేసే శక్తిని కలిగి వుంటుంది. కాబట్టి ఆత్మశుద్ధికై ప్రతి ఒక్కరూ తాను తెలిసోతెలియకో చేసిన

దుష్కర్మకు ప్రాయశ్చిత్తాన్ని చేసుకోవలసిందే. అలా చేసుకున్న వారి అంతరాత్మా ప్రసన్నమవుతుంది. లోకం వారిని ప్రసన్నతాదృక్కులతో చూడడమూ జరుగుతుంది. ప్రాయశ్చిత్తం వల్ల పాపాలునశిస్తాయి. పశ్చాత్తాపం నరకాన్ని దూరం చేస్తుంది.

అలాకాకుండా 'నేను ప్రాయశ్చిత్తం చేసుకోను. నాకు పశ్చాత్తపింపవలసిన అగత్యం లేదు' అని మొండికేసిన వాని కోసం, ఇదిగో, ఈ క్రింద చెప్పబడిన నరకాలన్నీ సిద్ధంగా వుంటాయి.

మహారౌరవం, దాని కన్నను మహాభయంకరములైన తామిస్ర, లోహశంకు, పూతిగంధ, హంసాభ, లోహితోద, సంజీవన, నదీపథ, మహా నిలయ, కాకోల, అంధతామిస్ర, తాపన నరకాలే అవి.

బ్రాహ్మణ హంతకుడు, తాగుబోతు, బ్రాహ్మణుని బంగారాన్ని దొంగిలించినవాడు, గురుపత్నిని కామించినవాడు, వీరితో తిరిగేవారు – ఈ మహాపాపులంతా అవీచి, కుంభీపాకమను పేర్లుగల నరకాలలో పడతారు. అవే అత్యంత భయంకర నరకాలు.

గురువునీ వేదాన్నీ నిందించడం కూడా బ్రహ్మహత్యతో సమానమైన పాతకమే. నిషిద్ధ పదార్థాలను తినుట, కుటిలతతో నిండిన ప్రవర్తన, రజస్వలయగు స్త్రీని పెదవులపై చుంబించుట,మద్యపానం ఒకేరకమైన పాపాలు. అశ్వ, రత్న, స్వర్ణ చౌర్యాలు సమానపాపాలు. మిత్రపత్ని, తనదికాని ఉత్తమ జాతి స్త్రీ, చండాలి, సోదరి, కోడలు వంటి స్త్రీలతో రమించుట కూడ గురుపత్నీ గమనంతో సమానమైన మహాపాపాలే. అలాగే పిన్ని, అత్త, ఆచార్యపుత్రి, ఆచార్యపత్నీ కూతురు వరుస స్త్రీలతోడి రమింపు కూడ గురుపత్నీ గమనంతో సమానమైన మహాపాతకాలే.

ఇలాంటి మహాపాపులకు ముందుగా లింగఛేదనం చేసి కొంతకాలమాగి అప్పుడు వారిని వధించాలి. ఇటువంటి పాపంలో పాలు పంచుకుని ఇష్టపూర్వకంగా వ్యభిచరించిన స్త్రీనికూడ క్రమక్రమంగా వధించాలి.

గోహత్య, వ్రాత్యత (వడుగు చేసుకోక పోవడం) బ్రాహ్మణ స్వర్ణ లేదా తత్సమానద్రవ్యాపహరణ, అప్పునెగ్గొట్టుట, దేవపితృఋషి ఋణాలను తీర్చకుండుట, అధికారి అయివుండీ అగ్నికార్యం చేయకుండుట, అమ్మకూడని లవణాదులను అమ్ముకొనుట, పెద్దన్నకు పెళ్ళికాకుండానే తాను చేసుకొనుట, అధ్యయనాధ్యాపనములకు డబ్బును వాడుట, తమ్మునికి వివాహం చేసి తాను పెండ్లిని మానుకొనుట, పరస్త్రీ గమనము, చక్రవడ్డీలను గుంజుకొనుట, లవణం తయారీ, స్త్రీ వధ, శూద్రవధ, నిందితధనంతో జీవనం గడుపుట,

నాస్తికత, వ్రతలోపం, కొడుకును అమ్ముకొనుట, మాతాపితలను పరిత్యజించుట, చెఱువులనూ తోటలనూ అమ్ముకొనుట, కన్యపై అపవాదు వేసి దూషించుట, తనకోసం మాత్రమే భోజనమును వండుకొనుట, మద్యపానం చేసే స్త్రీతో సంబంధం పెట్టుకొనుట, స్వాధ్యాయ, అగ్ని, పుత్ర బంధు - ఈ నాల్గింటినీ పరిత్యజించుట,అసత్ శాస్త్రాలను చదువుట, భార్యనూ తననూ అమ్ముకొనుట - ఇవన్నీ ఉపపాతకాలు.

మునులారా! ఇక వీటికి ప్రాయశ్చిత్తాలను వినండి.

తెలియక బ్రహ్మహత్యచేసినవాడు ఒక కపాలాన్ని చేత బట్టుకొని మరొక కపాలాన్ని కర్రకు గుచ్చి ధ్వజాన్ని వలె మోస్తూ భిక్షాటన చేస్తూ యమ నియమాలు పాటిస్తూ పన్నెండేళ్ళపాటు తిరుగుతునే వుండాలి. తెలిసి చేసినవాడు (బ్రహ్మ హత్యయని) లోమభ్యః **స్వాహా** ఇత్యాది మంత్రాలతో తన శరీరాంగాలకు ప్రతీకలుగా విభిన్న శాస్త్ర విహిత ద్రవ్యాలను అగ్నికి ఆహుతి చేసి చివరగా తన శరీరాన్ని కూడా నిర్దిష్ట విధానం ద్వారా అగ్నికి ఆహుతి చేయాలి. బ్రాహ్మణుని రక్షించడం కోసం తన ప్రాణాన్ని అర్పించినా కూడా బ్రహ్మహత్యాపాతకం నుండి విముక్తి కలుగుతుంది. ఇవే కాకుండా ప్రాణత్యాగమక్కరలేని ప్రాయశ్చిత్తాలున్నాయి. అవి ఇంచు మించు ప్రాణం పోయడమంత కష్టం.

అత్యధికంగా కష్టపెడుతున్న, దుస్సహమైన, బహుకాల వ్యాపితమైన రోగంతో గాని అంతకన్న ప్రాణములనార్పివేసేటంత భయంవల్ల గాని చెప్పలేనంత బాధపడుతున్న బ్రాహ్మణుని గాని గోవుని గాని, చేరదీసి ఆదరించి సేవచేసి సంరక్షణ చూసి, సంపూర్ణారోగ్య వంతులను గావించినచో కూడా బ్రహ్మ హత్యాపాతకం పోతుంది.

బ్రాహ్మణుల కడుపున పుట్టాడన్న మాటే గాని ఏ గుణమూ వీడు బ్రాహ్మణుడు అని చెప్పడానికి వీలులేకుండా వున్న వానిని పొరపాటున చంపినా కూడా అది బ్రహ్మ హత్యే అవుతుంది దానికి ప్రాయశ్చిత్తం ఇది :

అడవిలోనికి పోయి మంత్రాలతో ఐతరేయ బ్రాహ్మణాది అంగాలతో సహా వేదాన్ని పూర్తిగా మూడుమార్లు పారాయణ చేయాలి లేదా వేదవిద్యకై తన జీవితాన్ని ధారపోస్తూ తన ధనాన్నంతటినీ యోగ్య పాత్రులకు సమర్పించి వేయాలి. సోమయాగం చేసిన లేదా చేస్తున్న క్షత్రియుని గానీ వైశ్యునిగానీ చంపినా బ్రహ్మ హత్యకు విధింపబడిన ప్రాయశ్చిత్తాన్నే చేసుకోవాలి. ప్రాయశ్చిత్త కర్మలో మరొక విశేషమేమనగా హత్యాప్రయత్నం చేయడమే తప్పు అవతలి వ్యక్తి మరణించినా, ఏదో చావు తప్పి కన్ను లొట్టపోయి బతికి బయటపడినా

హత్యకి చెప్పబడిన ప్రాయశ్చిత్త కర్మను చేసుకోకతప్పదు. అంటే అవతలి వాడు చావకపోయినా హత్యా ప్రయత్నంచేసిన వానికి హత్యాపాపమే అంటుకుంటుంది.

మదిరాపానానికి ప్రాయశ్చిత్తం అగ్నివలె వేడెక్కి పొగలు గ్రక్కుతున్న మద్యాన్ని గానీ, సలసలమరుగుతున్న గోమూత్ర, గోదుగ్ధ, గోఘృతాలలో నొకదానిని గాని ఆపకుండా ఆగకుండా భగవన్నామస్మరణ చేస్తూ త్రాగుట. నీరనుకొని మద్యం - పొరపాటున - తాగేసినవారు జడలు పెంచుకొని మలిన వస్త్రాలను కట్టుకొని మరుగుతున్న నేతిని త్రాగుతూ బ్రహ్మహత్యకు గల ప్రాయశ్చిత్తాన్ని చేసుకోవాలి. తరువాత తన వర్ణానికి తగిన సంస్కారాన్ని చేసుకోవాలి.

వీర్య పానం, సురాపానం, మూత్రపానం, చేసే బ్రాహ్మణి సద్గతి నందకపోగా క్రమంగా గద్ద, కుక్క, పంది యోనుల్లో పుడుతుంది. బ్రాహ్మణుని బంగారాన్ని అపహరించిన వానికి ప్రాయశ్చిత్త కర్మ మేమనగా వాడొక రోకలిని మోసుకొని రాజ సభలోకి (న్యాయస్థానం అప్పట్లో అదే) పోయి తాను చేసిన పాపాన్ని ప్రకటించి రాజు విధించినన్ని దెబ్బలు ఆ రోకటి తోనే తినాలి. ఈ శిక్షాక్రమంలో వాడు మరణించినా, శిక్షానంతరం జీవించినా పవిత్రుడే అవుతాడు. (తెలుగిళ్ళలో ఒక మాటుంది. రాజదండనవుంటే ఇక యమదండన వుండదని.) ఇలా చేయనివారు తమ తప్పునొప్పుకొని తమయెత్తు బంగారాన్ని ఆ బ్రాహ్మణునికి సమర్పించుకున్నా ఆ పాపం పోతుంది.

గురుపత్నితో గమించినవాడు ఎఱ్ఱగా కాలుతున్న ఇనుప స్త్రీ విగ్రహాన్ని కౌగలించుకొని ప్రాణత్యాగం చేయాలి లేదా తన లింగాన్నీ, అండకోశాల్ని తానే కత్తిరించుకొని నైరృత్య దిశవైపు విసిరేయాలి). ఈ మహా పాపానికి ఇంకా రెండు రకాల ప్రాయశ్చిత్తాలు చెప్పబడ్డాయి. పశ్చాత్తపించిన వాడు మూడు సంవత్సరాల పాటు ప్రాజాపాత్య, కృచ్ఛ్రవ్రత పాలనను చేయాలి లేదా మూడు మాసాల పాటు చాంద్రాయణ వ్రతం చేస్తూ ఏకదీక్షగా వేదసంహితను పఠిస్తూ వుండాలి. దీక్షపూర్తయితే పాపం పోతుంది.

గోవధచేసిన పాపి పంచగవ్యాలను మాత్రమే స్వీకరిస్తూ ఒక నెలపాటు మునివలె ఏ వికారాలూ లేకుండా గోశాలలోనే జీవిస్తూ గోసేవ చేయాలి. మాసాంతంలో యథాశక్తిగా గోదానం చెయ్యాలి.

ఉపపాతక శుద్ధి చాంద్రాయణ వ్రతం వల్ల సిద్ధిస్తుంది. ఒక మాసం దాకా పాలను మాత్రమే స్వీకరిస్తూ 'పరాక' నామక వ్రతం చేసినా అదే ఫలముంటుంది.

క్షత్రియవధను చేసినవాడు ఒక ఎద్దునూ వేయి ఆవులనూ దానంచేయాలి లేదా బ్రహ్మహత్యకు నిర్దేశింపబడిన ప్రాయశ్చిత్తాన్ని మూడేళ్ళ పాటు చేసుకోవాలి. వైశ్యుని

వధించిన వాడు వంద గోవులను దానం చేయాలి లేదా బ్రహ్మ హత్యాపాతక ప్రాయశ్చిత్త వ్రతాన్ని ఒక యేడాది పాటు చేయాలి. శూద్రుని హత్యచేసినవాడు గాని స్త్రీ ని వధించిన వాడు గాని బ్రహ్మహత్యా పాతక ప్రాయశ్చిత్త వ్రతాన్ని ఆరునెలల పాటైనా ఆచరించాలి లేదా సత్పాత్రునికి పది సవత్సపయస్వినీ గోవులను దానమైనా ఇవ్వాలి. ఇవన్నీ తెలియకగాని అజ్ఞానవశానగాని అప్రయత్నంగా గాని, చేసిన హత్యలకు ప్రాయశ్చిత్తాలు.

పిల్లి, ముంగిస, ఉడుము, కప్ప, సాధారణ పశువులు – వీటిని చంపడం కూడా పాపమే. ఈ పాపము చేసినవాడు మూడు రాత్రులు గడిచే దాకా పాలను మాత్రమే స్వీకరిస్తూ పాదకృచ్ఛ్రవ్రత పాలనము చేయాలి. ఏనుగును వధించినవాడు అయిదు నీలవృష భాలను పేరుగల విశిష్టలక్షణాలున్న ఎద్దులను సత్పాత్రునికి దానం చెయ్యాలి. చిలుకనుగాని రెండేళ్ళ వయసున్న దూడని గానీ క్రౌంచపక్షిని గాని వధించిన వాడు మూడేళ్ళ వయసున్న దూడను దానం చేయాలి. గాడిద, మేక, గొఱ్ఱె లలో నొక దానిని చంపినవాడొక ఎద్దును దానంచేయాలి. వృక్ష, గుల్మ, లతాదులను నరికి వేసిన ద్విజుడు నూరుమార్లు గాయత్రిని జపించాలి.

తప్పనిసరి పరిస్థితుల్లో ఇష్టంలేకున్నా మధు, మాంసాలను సేవించినవాడు కృచ్ఛ్రవ్రతాన్నీ అన్యశేష వ్రతాల్నీ ఆచరిస్తే ఆ పాపం శాంతిస్తుంది. గురువుగారు చెప్పిన పనిని చేస్తూ గాని మార్గంలోగాని శిష్యుడు మృతి చెందితే ఆ పాపం గురువును ముట్టు కుంటుంది. గురువు దానికి ప్రాయశ్చిత్తంగా మూడు కృచ్ఛ్రవ్రతాలనా చరించాలి. గురువు గారిని అసంతృప్తికి గురిచేసిన శిష్యునికి మాత్రం ఆ గురువుగారిని ప్రసన్నుని, సంతృప్తుని (సంతుష్టుని) చేసుకోవడమే ప్రాయశ్చిత్తం. గురువుగారిని బాధించిన పాపం పోవాలంటే ఆ గురు ప్రసన్నతే తప్ప మరో దారిలేదు.

నిర్దోషులనూ, అమాయకులనూ పాపులని దూషించి దొంగబుజువులతో నిరూపించే ప్రయత్నం చేసేవాడు మహాపాపి. వీనికి ప్రాయశ్చిత్తం జితేంద్రియుడై, ఒక నెలపాటు మంచి నీళ్ళు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ పాపమోచన మంత్రమును జపించుట.

అసత్ ప్రతి గ్రహం అనగా అపసవ్య దానమును పుచ్చుకొనుట కూడా పాపమే. దీనికి ఒక మాస పర్యంతం బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ పయోవ్రతం అనగా పాలనే ఆహారంగా తీసుకొనే వ్రతమును చేస్తూ పశువులసాలలో నివాసముంటూ సదా గాయత్రిమంత్రాన్ని జపిస్తూ గడపడం ప్రాయశ్చిత్తంగా చెప్పబడింది.

వ్రాత్యుని కుపనయనం చేసి యజ్ఞం చేయించిన వాని కంటుకొనే పాపం మూడు కృచ్ఛ్ర వ్రతాలను ఆచరించడం వల్ల నశిస్తుంది. అభిచారకహోమం (మంత్రం ద్వారా

అపకారం) వల్ల వచ్చే పాపానికీ ఇదే ప్రాయశ్చిత్తం★. ★వేదప్లావి ఒక సంవత్సరం పాటు యవలనే తిని బతకాలి.

శరణని వచ్చి ఆశ్రయించిన వానికి దక్షత వుండీ కూడా శరణివ్వని వాడి పాపానికీ ఇదే తగిన ప్రాయశ్చిత్తం.

గాడిదపైగాని ఒంటెపైగాని ప్రయాణించేవాడు మూడు ప్రాణాయామాలు చేయాలి. తెలియక, అనగా అవి పాపములని తెలియక, చేసిన నగ్నస్నానము, నగ్నశయనము, పగటిపూట రతి అనే పాపాలు కూడా మూడు ప్రాణాయామాల ద్వారా నశిస్తాయి. గురుజనులను 'నీవు' అని సంబోధించరాదు. అట్టి పాపము ఆ గురు జనుల ప్రసన్నతవల్ల పోతుంది. బ్రాహ్మణుని కొట్టడానికి వెళ్ళడమే పాపం. దానికి కృచ్ఛ్ర వ్రతమే ప్రాయశ్చిత్తం. క్రోధంలో ఒళ్ళు మరచిపోయి బ్రాహ్మణుని కొట్టిన పెనుపాపము అతి కృచ్ఛ్రవ్రతమున గాని తీరదు.

విఖ్యాతమైన పాపాలకు ప్రాయశ్చిత్తాన్ని గురుజనులు అనగా పరిషత్తు నిర్ణయాన్ని బట్టి కూడా చేయవచ్చు.

విఖ్యాతం కాని పాపాలకు గుప్త రూపంలోనే ప్రాయశ్చిత్త నిర్ణయం చేయబడాలి. దీని భావమేమనగా ఒక వ్యక్తి బ్రహ్మహత్య చేసినట్లు అతనికే తరువాత తెలిసిందనుకుందాం. ఊరిలో ఇంకెవరికీ తెలియదనుకుందాం. అప్పుడా వ్యక్తి పరిషత్తులో నొకనిని కలుసుకొని తనకి తెలియకుండానే తనవల్ల జరిగిన బ్రహ్మహత్యకు పాపమంటకతప్పదు కాబట్టి ప్రాయశ్చిత్తాన్ని వేడితే ఆయన చెప్పేది గుప్త రూపంలో నున్న ప్రాయశ్చిత్త మనబడుతుంది. ఈ ప్రాయశ్చిత్తాలలో కొన్ని ఇలావుంటాయి.

బ్రహ్మహత్య చేసిన పాపి మూడు రాత్రులు గడిచేదాకా ఉపవాసం చేసి విశుద్ధ జలాల మధ్య అనగా నదీ సరోవరాదులలో పీకల దాకా మునిగి అఘమర్షణ మంత్రాన్ని జపించాలి. మూడు రాత్రులు దాటాక వచ్చే పగటిపూట ఒక పాలిచ్చే ఆవును సత్పాత్రునికి దానమివ్వాలి.

---

*★యాజ్ఞవల్క్య స్మృతిలోని 288వ శ్లోకానికి చేయబడిన మితాక్షర వ్యాఖ్యలో ప్రకృతంలో విప్లవ శబ్దానికి మూడర్థాలు చెప్పబడ్డాయి 1. వేదాన్ని రక్షించవలసిన బాధ్యత గలవాడు దానికి తగ్గ సామర్థ్యముండి కూడా ఆ పనిని చేయకపోవడం వేద విప్లవం. 2. అనధ్యయన లేదా అనధ్యాయ కాలంలో వేదాన్ని అధ్యయనం చేయడం అధ్యయన విప్లవం 3. వేదాధ్యయన సమర్థుడూ, వేదాధ్యయనం చేసి గొప్ప స్థాయికి తానుపోయి వేదాన్నిగొని పోగలిగే దక్షుడూ అయినవానికి సరిగ్గా చదువు చెప్పకుండా నిరుత్సాహానికి వానిని గురిచేయడం విప్లవం. ఈ మూడు దోషాల్లో దేనికి పాల్పడినా ఆ దోషి వేదప్లావి అనబడతాడు.*

*★వేదమూ ధర్మము క్షుణ్ణంగా తెలిసిన ముగ్గురు లేదా నలుగురు బ్రాహ్మణులతో ఎక్కడిక్కడ ప్రాయశ్చిత్త పరిషత్తులను ఏర్పాటు చేసుకోవచ్చు. మరీ చిన్న గ్రామాలలో నైతే వేదమూ, ధర్మ శాస్త్రమూ బాగా తెలిసిన బ్రహ్మవేత్తయగు ఒక బ్రాహ్మణునే పరిషత్తుగా నిర్ణయించుకొని ఆయనకే సర్వాధికారాలనూ సమర్పించవచ్చు. ఈ విషయం యాజ్ఞవల్క్యస్మృతి, ఆచారాధ్యాయం, 9వ శ్లోకంలో నిర్దేశింపబడింది.*

ఈ విధంగా తపించి, జపిస్తే అజ్ఞానవశాన తన చేత జరిగిన బ్రహ్మహత్యా పాతకం నశిస్తుంది. దీనికే మరొక ప్రాయశ్చిత్తం కూడా చెప్పబడింది. బ్రహ్మహత్య కర్త ఒక పగలూ ఒక రాత్రి వాయుభక్షణ మాత్రమే చేస్తూ శుద్ధ జల మధ్యంలో అలా నిలబడే వుండిపోయి తెల్లవారగానే బయటికి వచ్చి **లోమభ్యస్వాహా** మున్నగు ఎనిమిది మంత్రాలనూ ఘోషిస్తూ ఒక్కొక్క దానితో అయిదేసి ఆహుతులను యథావిధానంగా అగ్నిలో వ్రేల్చాలి★.

మద్యపానం తెలియక చేసి తెలిశాక పశ్చాత్తాపము నొందినవాడు జలమధ్యంలో నిలబడి రుద్రదేవ మంత్రాన్ని జపిస్తూ మూడు రోజులు ఉపవాసంతో గడిపి ఆ మరునాడు గుమ్మిడి ముక్కలను (కుష్మాండీబుచా) నేతిలోముంచి అగ్నికి ఆహుతులనిస్తే ఆత్మశుద్ధి కలుగుతుంది. గురుపత్నీగమనం చేసిన పాపి ఇలాగే చేస్తూ రుద్రదేవమంత్రానికి బదులు ***సహస్ర శీర్షా...*** మంత్రాన్ని జపించాలి.

మిగిలిన పాపాలకు నూరుమార్లు ప్రాణాయామం చేయడం లేదా త్రైకాలిక సంధ్యోపాసన, బ్రాహ్మణునిచే పదకొండాహుతులనిప్పించి రుద్రానువాకములు జపించుట మున్నగునవి ప్రాయశ్చిత్త విధానాలు. బ్రహ్మహత్య తప్ప మిగతా పాపాలన్నీ వాయుభక్షణం మాత్రమే చేస్తూ దినమంతా సూర్యరశ్మి పడే చోట జలంలోవుండి రాత్రంతా కూడా అక్కడే వుండి వేయిమార్లు గాయత్రి మంత్రాన్ని జపిస్తే నశిస్తాయి.

వేదాభ్యాసం చేసే శాంతి పరాయణుడైన పంచయజ్ఞానుష్ఠాత నుండి పాపమే దూరంగా పారిపోతుంది. యమ నియమాలున్న వానికి పాపపుటాలోచనలే రావు. బ్రహ్మచర్యం, దయ, క్షమ, భగవద్ధ్యానం, సత్యం, నిష్కాపట్యం, అహింస, అస్తేయం, మాధుర్యం దమం – అనే పదీ యమములు. స్నానం, మౌనం, ఉపవాసం, యజ్ఞం, స్వాధ్యాయము, ఇంద్రియని గ్రహం, తపస్సు, అక్రోధం, గురుభక్తి, పవిత్రత– ఈ పదీ నియమాలు. (మౌనం అంటే శాశ్వతంగా మూగబోవడమని కాదు; కొంతకాలం పాటు కొన్ని వ్రతాలలో భాగంగా మాట్లాడకుండా వుండడం).

ఆవు యొక్క పాలు, పెరుగు, నెయ్యి, మూత్రం, మయం పంచగవ్యాలు. వీటిని కుశోదకంతో కలిపి దానినే అన్నానికి బదులు తినడం కృచ్ఛ్రవ్రతమవుతుంది. ఒకరోజంతా దీనిని మాత్రమే స్వీకరించి మరునాడు పగలంతా ఉపవాసముండి రెండవరోజు రాత్రంతా పంచగవ్యాలనే స్వీకరిస్తూ వుంటే దానిని కృచ్ఛ్రసాంతపన వ్రతమంటారు.

తొలిరోజు ఆవుపాలు, మరునాడు ఆవుపెరుగు, మూడవనాడు ఆవునెయ్యి, నాల్గవదినం గో మూత్రం, ఐదవ రోజు గోమయం, ఆరో రోజు కుశోదకం మాత్రమే స్వీకరించి

---

★*ఈ మంత్రాలు యాజ్ఞవల్క్యస్మృతిలో 247వ శ్లోకంలో కనిపిస్తాయి.*

ఏడవరోజు ఏమీ తీసుకోకుండా కటిక ఉపవాసం చేస్తే ఈ మొత్తమంతా కలిపి పరమ పవిత్రమైన 'మహాసాంతపన' వ్రతమనబడుతుంది.

పలాశ, గూలర, కమల, బిల్వ పత్రాలలో ఒక్కొక్కరోజు ఒక్కొక్క దాన్ని నీటిలో వేసి ఉడికించి ఆ రోజంతా ఆ నీటినే త్రాగాలి. అలా నాలుగు రోజులు నాలుగాకుల నీరు తరువాత అయిదవ రోజున కుశోదకం మాత్రం త్రాగాలి. అంటే ఈ అయిదు రోజులూ ఇంకేదీ తినకుండా తాగకుండా కృశించాలి. ఈ వ్రతాన్ని పర్ణకృచ్ఛ్రవ్రతమంటారు. తొలిరోజు వేడి ఆవుపాలనూ, మలిరోజు వేడి నేతినీ, మూడవరోజు వేడినీటినీ మాత్రమే ప్రాశ్నచేసి (అనగా నోట్లో వేసుకొని) నాలుగవ రోజు పూర్తిగా ఉపవాసముండి పోవాలి. ఈ వ్రతాన్ని మహాతప్తకృచ్ఛ్రవ్రతమంటారు. ఈ కృచ్ఛ్రవ్రతాలు పరమశుద్ధికరాలు, పవిత్రాలు.

కృచ్ఛ్రవ్రతాలలో మరొకటి పాదకృచ్ఛ్రవ్రతం. మొదటి రోజు ఏకభుక్తం (మధ్యాహ్నం పన్నెండుకి భోజనంచేసి మరేమీ తినకుండా రాత్రి శయనించడం) రెండవ రోజు నక్తవ్రతం (అనగా రోజంతా ఏమీ తినకుండా రాత్రి మాత్రం భోంచేయడం) మూడవ రోజు అయాచితం (ఎవరినీ యాచించకుండా ఇంట్లో వండుకోకుండా ఎవరైనా వచ్చి పెడితే, అదీ ఒకపూట తినడం) నాలుగవ రోజు కటిక ఉపవాసం. ఇదంతా కలిపి పాదకృచ్ఛ్రవ్రతం అవుతుంది. ఇదే వ్రతాన్ని ఒకే నెలలో మూడుమార్లు చేస్తే దానిని ప్రాజాపత్యవ్రతమంటారు. ఈ వ్రతంలో కూడా భోజనం చేయునపుడు ఒకమారు చేతినిండా పట్టు అన్నాన్ని మాత్రమే రోజంతటిలో తిని నాలుగు రోజులుండగలిగితే దానిని అతికృచ్ఛ్రవ్రతమంటారు. పన్నెండు రోజులు పూర్ణ ఉపవాసం చేయడాన్ని పరాకవ్రతమంటారు. ఇరవై ఒక్క రోజుల పాటు నీరు లేదా పాలు మాత్రమే తీసుకొని అతి కృచ్ఛ్రవ్రతపాలనం చేయడాన్ని కృచ్ఛ్రాతి కృచ్ఛ్రవ్రతమని వ్యవహరిస్తారు.

ఆరు రోజుల కృచ్ఛ్రవ్రతమొకటుంది. నూనెను బాగా పిండి చేసిన పిమ్మట మిగిలిన నూల పిప్పిని తొలిరోజూ, గంజిని రెండవరోజూ, మజ్జిగను మాత్రమే మూడవదినమూ, కేవలం జలాన్ని నాలుగవనాడూ పేలపిండిని అయిదవరోజూ ఆహారంగా స్వీకరించి ఆరవరోజు కటిక ఉపవాసం చేయడాన్ని సౌమ్యకృచ్ఛ్రవ్రతమంటారు. ఈ వ్రతాన్నే కొంచెం అతిశయింపజేసి ఒకరోజు తినే పదార్థాన్ని మూడు రోజులపాటు తింటూ మొత్తం పదిహేను రోజులు చేసి పదహారవనాడు పూర్ణోపవాసం చేస్తే దాన్ని తులాపురుష (సంజ్ఞక) కృచ్ఛ్రవ్రతమంటారు.

చాంద్రాయణ వ్రతమనగా చంద్రుని కళలను బట్టి ఆహారాన్ని స్వీకరించడం. అమావాస్యనాడు ఒక నెమలిగుడ్డంత అన్నాన్ని తిని రోజుకొక గుడ్డు ప్రమాణాన్ని

పెంచుకుంటూ పూర్ణిమనాడు సంపూర్ణ భోజనం చేసి, మరునాటి నుండి అదే కొలతలో తగ్గించుకుంటూ పోయి అమావాస్యనాడు మరల నెమలిగుడ్డంత ద్రవ్యాన్నే తిని చేసే వ్రతానికి చాంద్రాయణ వ్రతమని పేరు. మొత్తం నెలలో రెండు వందల నలభై గ్రాసాల హవిష్యాన్నమును పైన చెప్పిన క్రమంలో తిని వుండి పోవడానికి విశేష వ్రతమని పేరు. పైన చెప్పిన వ్రతాలను అనుష్ఠిస్తున్న అన్ని రోజుల్లోనూ ప్రాతః, మధ్యాహ్న, సాయంకాలీన స్నానాలు చేసి పవిత్ర సంజ్ఞక విశేషమంత్రాలను జపిస్తూ గ్రాస పరిమాణంలో అన్నం తినడానికి ముందు ప్రతి గ్రాసాన్నీ గాయత్రితో అభిమంత్రితం చేస్తూ ఒక విధమైన నిరాసక్త, ఆధ్యాత్మిక, ప్రశాంత జీవనాన్ని గడపాలి.

కొన్ని పాపాలకు శాస్త్రంలో ప్రాయశ్చిత్తాలు చెప్పబడలేదు. అటువంటి పాపాలన్నీ చాంద్రాయణ వ్రతం వల్ల నశిస్తాయి. ఏదో పాప ప్రక్షాళన కోసం కాకుండా, పుణ్యుడు మరింత పుణ్య సముపార్జన కోసం చాంద్రాయణ వ్రతాన్ని చేస్తే వాని పుణ్యము పండి దేహాంతంలో చంద్రలోకాన్ని చేరుకుంటాడు. అలాగే ప్రాయశ్చిత్తం కోసం కాకుండా పుణ్యం కోసం కృచ్ఛ్రవ్రతం చేసేవాడు గొప్ప ఐశ్వర్యవంతుడౌతాడు. ***(అధ్యాయం - 105)***

# అశౌచం, ఆపద్వృత్తి

**ము**నులారా! ఇపుడు మృత్యువు ఆవరించాక మనిషికి కలిగే మరణశౌచాన్ని వర్ణిస్తాను వినండి.

రెండేళ్ళలోపు వయసున్న బాలకుడు మృతి చెందితే వానిని పాతిపెట్టాలి. జలాంజలి నీయకూడదు. ఈ పాతిపెట్టవలసిన చోటు నగరానికైనా గ్రామానికైనా వెలుపలవుండాలి. శ్మశానం కారాదు. శవాన్ని గంధ, మాల్య, అనులేపనాదులతో బాగా అలంకరించాలి. (మనుస్మృతి 5/68,69). రెండేళ్ళు దాటి, ఉపనయనమయ్యేలోగా మరణించిన బాలకుని బంధుగణమంతా కలసి శ్మశానానికి గొనిపోయి లౌకికాగ్నితో, యమసూక్త, పారాయణ చేస్తూ చితిపై దహనం చేయాలి.

వడుగై, మరణించిన బాలునికి అన్ని క్రియలనూ ఆహితాగ్నితో సమానంగా చేయాలి. మరణతిథికి ఏడవ లేదా పదవరోజున ముందుగా, అతని వర్ణంలో గోత్రంలో నుండు పరిజనులు (సమాన గోత్ర, సమాన పిండ, సమానోదక జనులు) **అపనః శోశుచదఘం** అనే ఋగ్వేద (1/97/1-8) మంత్రాలతో దక్షిణం వైపు తిరిగి యథాసంభవంగా అంటే వీలైనంతగా ఇంటికి దూరంగా నున్న జలాశయానికి పోయి జలాంజలులివ్వాలి. ఇలాగే

మాతామహునికీ ఆచార్యపత్నికీ ఇతరులకు కూడా ఇవ్వాలి. ఉపనయనమైనాక మరణించిన వానికి కూడా సంపూర్ణకర్మకాండను నడిపించాలి.

మిత్రుడు, వివాహితస్త్రీ (సోదరి మొదలైనవారు) వదిన, మామగారు, ఋత్విక్కు మరణించినపుడాయా ఆత్మల అభ్యున్నతికై జలాంజలులిస్తూ పేరునీ గోత్రాన్ని చెప్పి ఒకేసారి జలాంజలి నివ్వాలి. ఈ జలాంజలులనే ధర్మోదకాలని కూడా అంటారు) పాఖండులూ, పతితులూ పోయినపుడు ధర్మోదకాల తంతువుండదు. బ్రహ్మచారి (ఆశ్రమంలో వుండి పోయిన యువసన్యాసి) వ్రాత్యుడు, వ్యభిచారిణియగు స్త్రీకి కూడా ధర్మోదకాలివ్వరు. తాగుబోతుకీ ఆత్మహత్య చేసుకున్నవారికీ కూడా అశౌచముంటుంది కాబట్టి వారు జలాంజలులకర్హులు కారు.

వ్యక్తి మరణించినపుడు పెద్దపెట్టున ధ్వనులు చేస్తూ రోదించడం నిషిద్ధం. జీవుల స్థితి అనిత్యమనే జ్ఞానం కనీసం అప్పుడైనా వుండాలి. యథాశక్తిగా శ్మశానానికి గొనిపోయి దహనక్రియను గావించి స్వజనులంతా ఆ వ్యక్తి ఇంటికి రావాలి. ద్వారంలో ప్రవేశిస్తూనే వేపాకును నమలి, ఆచమనం చేసి అగ్ని, జలం, పేడ, తెల్ల ఆవాలు - ఈ నాల్గింటినీ ముట్టుకొని రాతిపై పాదాలను ఒక్క క్షణం వుంచి అప్పుడు నెమ్మదిగా ఇంటిలోనికి రావాలి. ఎవరి ప్రేతాన్ని ముట్టుకొని శ్మశానం కెళ్ళకుండా ఇంటికి వచ్చినా ఇంటిలోకి ప్రవేశిస్తూ ఈ విహిత కర్మనంతటినీ ఆచరించాలి. దహనం పూర్తయ్యేదాకా గానీ దహనక్రియకు గానీ మరుభూమిలోవుండి వచ్చిన సపిండులు అక్కడే స్నానం చేసి ప్రాణాయామం చేస్తే శుద్ధులవుతారు. పుణ్యం కూడా ప్రాప్తిస్తుంది. (ప్రేతానుగమనమే పుణ్యము)

ఆ రోజు భోజనం మానకూడదు గానీ వారు పెట్టినదేతినాలి. అడగకూడదు. పరిజనులంతా విడివిడిగా మూడు రాత్రులు నేలపైనే శయనించాలి. పిండయజ్ఞానంతరం మృతవ్యక్తినుద్దేశించి విహిత పిండదాన ప్రక్రియానుసారము దంజెమునపసవ్యం చేసుకొని మూడు రోజుల దాకా పిండరూప అన్నాన్ని మౌనంగా భూమిపై పెడుతుండాలి. శ్రాద్ధం పెట్టే అధికారమున్న వ్యక్తి నీలాకాశం క్రింద నిలబడి ఒక శిక్య మట్టి పాత్రతో నీటినీ మరొక మట్టిపాత్రతో పాలనీ ఆ ప్రేతాత్మకు సమర్పించాలి. ఆ సమయానికి ఆ అధికారికి ఏదైనా అశౌచంవుంటే దానిని శ్రౌతాగ్నిలో స్మార్తాగ్నిలో చేసే నిత్యకర్మ (అగ్నిహోత్రం, దర్శ పూర్ణ మాసం, విహిత స్మార్తాగ్నిలో సాయం-ప్రాతః హోమం) అనుష్ఠానం ద్వారా శ్రుతిలో ఆజ్ఞాపింపబడిన పద్ధతి ద్వారా శుద్ధి చేసుకొని శ్రాద్ధకర్మను తప్పనిసరిగా చేయాలి.

దంతములు మొలవకముందే పిల్లలు మరణిస్తే వారి బంధువులకు ఖననం జరిగిన వెంటనే శుద్ధి లభిస్తుంది. దంతాలు మొలిచాక పుట్టుజుత్తులు తీయించక ముందు మృతి చెందిన పిల్లల బంధువులకు ఒక రాత్రి, ఒక పగలు అశౌచముంటుంది. చూడాకరణమై ఉపనయనం కాక చనిపోయిన బాలల బంధువులకు మూడు రాత్రులు గడిచేదాకా అశౌచం వుంటుంది. ఉపనయనమైన తరువాత మృతి చెందిన వాని బంధువులలో సపిండకులకు పదిరాత్రుల దాకానూ సమానోదకులకు మూడు రాత్రుల దాకానూ అశౌచముంటుంది.

రెండు సంవత్సరాల వయసు రాకుండానే మృతి చెందిన పిల్లల తల్లిదండ్రులకు పది రాత్రులు గడిచేదాకా అశౌచముంటుంది. పరివారంలో జననమో మృతియో జరిగినా ఈ పదిరాత్రుల మైల పట్టింపులో తేడా వుండదు.

సపిండులు మరణిస్తే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు పది, పన్నెండు, పదిహేను, ముప్పది దినాల మైల వుంటుంది. పెండ్లికి, నిశ్చితార్థానికి ముందు చూడాకరణ తరువాత మృతి చెందిన కన్య బంధువులకు ఒక పగలు, ఒక రాత్రి గడిచాక శుద్ధి అవుతుంది. దంతాలు మొలిచేలోగానే మృతి చెందిన బాలకుని ఖననం బదులు అగ్ని సంస్కారం చేస్తే ఒక రోజు దాటగానే శుద్ధి జరిగిపోతుంది*.

గురువు, అంతేవాసి (ఆశ్రమంలో వుండేవాడు) శిష్యుడు, వేదాంగ ప్రవక్త, బంధువు, శ్రోత్రియుడు (వేదాలలో ఒక శాఖని బోధించినవాడు ) అనౌర పుత్రుడు (దత్తపుత్రుని వంటివాడు) రాజు, తెలిసిన మనిషి మృతి చెందినవార్త తెలియగానే గాని దహనానంతరం గాని స్నానం చేయగానే శుద్ధి జరిగిపోతుంది. ఆత్మహత్యకు పాల్పడ్డవారికీ అంతే.

సత్రమును ఇరవైనాలుగు గంటలూ ప్రజలకోసమే ఆశించకుండా నడిపేవాడు (అన్నం ఉచితంగా పెట్టేవాడు) కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతాలు చేస్తున్నవాడు, బ్రహ్మచర్య దీక్షలో నున్నవాడు, వానప్రస్థి, బ్రహ్మవిదుడైన సన్యాసి– (వీరు మానవాతీతులనో ఏమోగాని) వీరికి ఎవరు పోయినా మైల అంటదు. ఎట్టి అశౌచమూ వుండదు. దాన కార్యక్రమానికైసిద్ధం చేయబడిన సామగ్రికీ, వివాహ నిమిత్తం కూర్చబడిన ద్రవ్యానికీ, సంగ్రామ సమయంలో ఆ భయంతో నున్న ప్రజలకీ మైల వుండదు. అలాగే వరదల వంటి భయంకర విపత్కర పరిస్థితులలోచిక్కుకున్నవారికీ, అరాచక విప్లవ ప్రాంతాల్లో జీవిస్తున్నవారికీ ఏమైలా అంటదు.

గ్రీష్మ ఋతు ప్రభావం వల్ల కుంచించుకు పోయిన జలాశయం మళ్ళా నీటితో నిండేదాకా ఎటువంటి శుద్ధి కార్యక్రమాలకూ పనికిరాదు. అంటే జలాశయానికే శుద్ధి అవసరం. అది నీటితో నిండినప్పుడే అవుతుంది.

---

* *ఈ విషయం యాజ్ఞవల్క్య స్మృతి – మితాక్షర – 24వ శ్లోకంలో చెప్పబడింది.*

ఆపత్కాలంలో బ్రాహ్మణుడు క్షత్రియ లేదా వైశ్యవృత్తులను స్వీకరించవచ్చు. వైశ్యుడి వృత్తి అమ్మకమే అయినా అతడు ఎట్టి ఆపత్కర పరిస్థితుల్లోనైనా వైశ్యవృత్తి చేసే బ్రాహ్మణుడు పండ్లు, సోమలత, వస్త్రాలు, లతలు, ఔషధీలతలు, పాలు, పెరుగు, నెయ్యి, నీరు, నువ్వులు, అన్నం, రసం, ఉప్పు, తేనె, లక్క, హవిష్యాన్నం, మణులు, చెప్పులు, మృగచర్మం, మాంసం, సుగంధద్రవ్యాలు, మూలాలు – వీటిని అమ్మరాదు.

బ్రాహ్మణుడు తన శ్రౌత –స్మార్త – యాజ్ఞపూర్ణతకై కావలసిన ధాన్యాన్నీ, అత్యావశ్యక ములైన మందులనూ తిలలు విక్రయించి కొనుక్కోవచ్చును. అదీ ఆపత్కాలంలోనే. అప్పుడు కూడా లవణాదికములను అమ్ముకొనరాదు. తన వైయక్తికయజ్ఞాలను చేసుకొంటూనే ఆపద్ధర్మంగా ఇతర వృత్తులను చేయు బ్రాహ్మణుడు సూర్యుని వలె నిష్కలుషితంగానే వంటాడు. అతని బ్రాహ్మణ్యానికి తరుగూ విరుగూ వుండవు. వ్యవసాయం, పశుపాలనమూ కూడా అప్పుడు తప్పుకాదు. అయితే గుఱ్ఱాలను అమ్ముకోరాదు.

ఆపత్కాలంలో అనివార్యమైనపుడు గృహస్థ బ్రాహ్మణుడు కూడా భిక్షమెత్తుకోవచ్చును. ఇది మూడు రోజుల వఱకే అంగీకార్యము. ఆ బ్రాహ్మణుని నుండి ధాన్యమును భిక్షగా పొందిన బ్రాహ్మణుడు దానిని ఒక్కరోజు మాత్రమే ఆకలి తీర్చుకొనుటకు వాడుకోవాలి. ఆ విషయాన్ని బహిరంగంగా ఒప్పుకోవాలి. అప్పుడు అతని పాలకుడైన రాజు అతని వంశం, రీతి, శాస్త్రాధ్యయనం, వేదజ్ఞానం, తపము, జపము మున్నగు వైశిష్ట్యాలను విచారించి ఆ బ్రాహ్మణుడు ధర్మానుకూలంగా జీవించగలిగే ఏర్పాటు చేయాలి. అని యాజ్ఞవల్క్య మహర్షి చెప్పాడు." ***(అధ్యాయం - 106)***

## పరాశర మహర్షి చెప్పిన వర్ణాశ్రమ ధర్మాలు; ప్రాయశ్చిత్త కర్మలు

**సూ**తుడు శౌనకాది మహామునులతో మాట్లాడుతూ తన గురువైన వ్యాసమహర్షికి పరాశర మహర్షి వినిపించిన ధర్మకర్మాలను ఇలా ప్రవచింపసాగాడు.

"శౌనకాచార్యా! ప్రతి కల్పాంతంలోనూ అన్నీ నశించిపోతాయి. కల్పప్రారంభంలో మన్వాదిఋషులు వేదాలను స్మరించి బ్రాహ్మణాది వర్ణాల ధర్మాలను మరల విధిస్తుంటారు.

కలియుగంలో దానమే ధర్మము. పాపమూ శాపమూ సర్వాంతర్యాములుగా పరిఢవిల్లే ఈ కలియుగంలో పాపాన్ని అంతంచేయలేము. పాపంచేసిన వారిని మాత్రమే పరిత్యజించవలసి వుంటుంది★.

---

★ *త్యజేద్దేశం కృతయుగే త్రేతాయాంగ్రామ ముత్సృజేత్ ।*
*ద్వాపరే కులమే కంతు కర్తారంతు కలౌయుగే ॥*

సత్య (కృత) యుగంలో పాపాత్ములుంటే ఆ దేశాన్నే ఋష్యాదులు త్యజించేవారు. అలా త్రేతాయుగంలో గ్రామాన్నీ, ద్వాపరంలో పాపి కుటుంబాన్నీ త్యజించారు. కలియుగంలో పాపం సార్వలౌకికమైపోతుంది కాబట్టి పాపిని మాత్రమే త్యజించగలరు.

మనిషి ఆచారం (సదాచారం, శౌచాచారం) ద్వారానే అన్నీ పొందగలుగుతాడు. సంధ్య, స్నానం, జపం, హోమం, దేవపూజనం, అతిథి సత్కారం అనే ఆరు సత్కర్మలనూ ప్రతి దినం చేయాలి. ఆచారవంతుడైన బ్రాహ్మణుడు గాని సర్వసంగపరిత్యాగియైన సన్యాసిగాని కలియుగంలో దుర్లభం. బ్రాహ్మణులు తమ వర్ణ ధర్మాలను పాటించాలి. (అధ్యయనా ధ్యాపనాదులను వదులుకోరాదు) క్షత్రియులు దుష్టులైన శత్రువులను గెలిచి ప్రజలను కన్నబిడ్డల వలె చూసుకోవాలి. వైశ్యులు వ్యవసాయ, వ్యాపార, పశుపాలనాదికములను చేయిస్తూ న్యాయసమ్మతంగానే ధనార్జన చేయాలి. శూద్రులు ఈ పై మూడు వర్ణాల వారికీ నిష్కపటంగా సహకరిస్తూ దేశసౌభాగ్యానికి ఊతమివ్వాలి.

తినకూడనివి తినడం, దొంగతనం పోకూడని చోటికి పోవడం మనిషి పతనానికి కారణాలౌతాయి. వ్యవసాయం చేసేవాడు అలసిపోయిన ఎద్దుని మరల కాడికి కట్టరాదు. దాని చేత బరువులనూ మోయించరాదు. ద్విజులు స్నానం, యోగం, పంచయజ్ఞం – వీటిని మానరాదు. బ్రాహ్మణులకి నిత్యం భోజనాలు పెట్టాలి. క్రూరకర్ముల విషయంలో మొగమాటానికీ స్వార్థానికీ తావివ్వకుండా ప్రవర్తించాలి.

నువ్వులనూ, నేతినీ అమ్ముకోరాదు. పంచసూనాజనిత దోషం పోవడానికి బలి వైశ్వ దేవహోమాన్ని నిత్యం చేయాలి. రైతు తన సంపాదన లేదా పంటలోని ఆరవభాగాన్ని రాజుకీ, ఇరువదవ భాగాన్ని దేవునికీ, ముప్పది మూడవ భాగాన్ని బ్రాహ్మణులకీ ఇవ్వాలి. దీని వల్ల కృషి హింసా పాపం ప్రక్షాళితమవుతంది. ఈ విధంగా ఇవ్వకపోతే (పన్ను ఎగ్గొడితే) పాపం వస్తుంది. అదీ దొంగతనంతో సమానమైన పాపం !

(పరాశరుడు ఏ వర్ణానికెన్నాళ్ళు మృత్యు అశౌచముంటుందో యాజ్ఞవల్క్యుని లాగే చెప్పాడు) బంధువులలో ఈ మైల నాలుగో తరం దాకా పది రోజులు, అయిదవ తరంలో ఆరురోజులు, ఆరో తరంలో నాలుగురోజులు, ఏడవతరంలో మూడురోజులు వుంటుంది. పరదేశంలో నున్న బాలకుడు పోతే మృత్యు అశౌచం పెద్దగా వుండదు. వార్త వినగానే స్నానం చేస్తే వెంటనే శుద్ధి అయిపోతుంది.

గర్భస్రావ, గర్భపాతాలలో బిడ్డ మరణించినపుడు తల్లి ఎన్నవ నెల గర్భవతి అయి వుండినదో అన్ని రోజుల అశుచి ఆ బిడ్డ బంధుగణానికి వుంటుంది. నాలుగవ నెల వఱకూ జరిగే గర్భనష్టాన్ని గర్భస్రావమని ఆరు మాసాలు నిండేలోగా గర్భనష్టం జరిగితే గర్భపాతమనీ అంటారు.

శిల్పకారుడూ, మేదరవాడు, రాజూ, రాజ గురువూ, శ్రోత్రియ బ్రాహ్మణుడూ, దాసదాసీ జనమూ భృత్యులూ వీరిలో ఎవరు పోయినా (వారి సంతానానికి తప్ప) మైల వుండదు.

పురిటిమైల అనగా పిల్లలు పుట్టినపుడు కలిగే అశుచి కన్నతల్లికే పదిరోజుల పాటు వుంటుంది. తండ్రి స్నానం చేయగానే శుచి అవుతాడు. వివాహం లేదా యజ్ఞం తలపెట్టి అన్ని యేర్పాట్లూ చేసుకొన్నాక మృత్యు లేదా పురిటి వార్త తెలిసినా ఆ ఉత్సవం చేయువారికి, అందులో పాల్గొనువారికి అశుచి వుండదు. అనాథ శవాన్ని మోసేవారికి ప్రాణాయామ మాత్రమున శుద్ధి కలుగుతుంది. తెలిసీ శూద్రశవాన్ని మోసినవారికి మాత్రం మూడురాత్రుల వఱకూ అశుచి.

మంచివాడు, సచ్ఛరిత్రుడునైన పతిని మదమెక్కి వదిలేసిన స్త్రీ ఏడుజన్మల దాకా ఆడదానిగానే పుడుతుంది. అన్ని జన్మలలోనూ విధవగానేపోతుంది. అన్నపానాదుల విషయంలో భ్రష్టురాలైన స్త్రీ మరుజన్మలో పందిగా పుడుతుంది.

ఔరసుడూ, క్షేత్రజ్ఞుడూ ఒకే తండ్రికి పుడితే ఆ తండ్రి పోయినపుడు రెండు రకాల వాళ్ళూ పిండదానం చేయవచ్చును.

పరివేత్త (అన్నకు పెండ్లి కాకుండా తానే ముందు చేసుకున్న తమ్ముడు) పరివిత్తి (తమ్ముడికి వివాహం జరిగిపోయి తాను అది లేకుండా వుండిపోయిన అన్న) – ఈ రెండు రకాల వారికీ కృచ్ఛ్రవ్రతం చేసుకునే దాకా శుద్ధి లేదు. తమ్ముని పత్ని కూడా కృచ్ఛ్రవ్రతం చేయాలి. కన్యాదాత అతికృచ్ఛ్రం చేసుకోవాలి. ఇటువంటి వివాహాన్ని చేయించిన పురోహితుడు చాంద్రాయణ వ్రతం చేయాలి. అప్పుడుగాని వీరికి శుద్ధి లేదు.

అన్న గూనివాడో, మరుగుజ్జో, నపుంసకుడో, నత్తివాడో, జన్మాంధుడో, ఇతర అంగ విహీనుడో అయితే మాత్రం తమ్ముడు ముందుగా వివాహం చేసుకోవచ్చును. దోషం లేదు.

నిశ్చితార్థంలో ఎవరికో వాగ్దత్తయైన కన్య ఆ వరుడు పరదేశమేగిపోయి (ఇక రాడని తెలిసి)నా, మృతి చెందినా, సన్యాసం పుచ్చుకున్నా, నపుంసకుడని తెలిసినా, పతితుడై పోయినా (ఆమె) వేరొకరిని వరించి వివాహం చేసుకొనవచ్చును. పతితోబాటు, సతీధర్మమునను సరించి, అగ్ని ప్రవేశం చేయు స్త్రీ తన శరీరంపై ఎన్ని రోమాలున్నాయో అన్నేళ్లపాటు స్వర్గంలో నివాసముండగలదు★.

కుక్కకాటుకి గురైనవాడు ఔషధసేవనం గావించి గాయత్రి మంత్రాన్ని జపిస్తే అశౌచం పోతుంది. స్వయంగా దాన్ని జపించే అర్హత లేనివారు బ్రాహ్మణునెవరినైనా ఆశ్రయించి

★ సతీసహగమనాన్ని ప్రస్తుత రాజ్యాంగం నిషేధించింది – అను

ఆయన చేత ఈ జపాన్ని చేయించాలి. చండాలాదుల ద్వారా చంపబడిన బ్రాహ్మణుడు స్వయంగా అగ్నిహోత్రి అయితే ఆయనను లౌకికాగ్నితో దహనం చేయవచ్చును. ఆయన అస్థికలను సేకరించి మరల మంత్రపూర్వకంగా ఆయన యొక్క అగ్నిహోత్రశాల నుండి అగ్నిని తెచ్చి, అంతకు ముందే పాలతో శుద్ధి చేసిన ఆయన అస్థికలను అందులో దహనం చేయాలి. వ్యక్తి పరదేశంలో మరణిస్తే ఇక్కడి పరిజనులు తమ గృహాలలోనే కుశలతో ఆ వ్యక్తి శరీరాన్ని తయారుచేసి అగ్నికి ఆహుతిచేయాలి. ఆ పరదేశ మృతుడు అగ్నిహోత్రియైతే మృగచర్మంపై ఆరువందల పలాశ ఆకులను అతని ఆకారంలో పఱచి శిశ్నభాగంలో శమీ, వృషణభాగంలో అరణీ పెట్టి కుడిచేతి జాగాలో అన్నం కుండనీ ఎడమచేతి జాగాలో యజ్ఞియపాత్రనీ వుంచాలి. వక్షోభాగంలో సోమరసం తయారీలో వాడే రాతినుంచాలి. ముఖభాగంలో నేతిలో ముంచిన తిలలనూ, తండులాలనూ నేత్రాల వద్ద నేతికుండనూ ఉంచాలి. కనులు, చెవులు, ముక్కు, నోరు ప్రాంతాలలో చిన్న చిన్న బంగారు ముక్కలనుంచే పద్ధతి కూడా వుంది. ఇలా అగ్నిహోత్రం యొక్క సమస్త ఉపకరణాలనూ వుంచి ఆ అగ్నిహోత్రి ఊహాకల్పిత కళేబరాన్ని **'అసౌస్వర్గాయ లోకాయ స్వాహా'** అనే మంత్రాన్ని చదువుతూ నేతిని ఒక ఆహుతి నిచ్చి...అగ్నికి ఆహుతి చేస్తే ఆయనకు బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది.

హంస, చిలుక, క్రౌంచం, చక్రవాకం, కోడి, నెమలిలలో దేనిని వధించినా ఒక పగలూ ఒక రాత్రీ ఉపవాసం చేస్తే పాపం పోతుంది. నాలుగు కాళ్ళ పశువును (గోవును కాదు) దేనిని వధించినా ఒక రోజంతా నిలబడి, ఉపవసించి, గాయత్రిని జపిస్తే పాపశాంతి కలుగుతుంది.

శూద్రుని వధిస్తే కృచ్ఛ్రవ్రతం చేయాలి. వైశ్యుని హత్య చేస్తే అతికృచ్ఛ్రవ్రతము చేయాలి. క్షత్రియుని చంపితే ఇరవై రెండూ, బ్రాహ్మణుని మృతి నొందిస్తే ముప్పదీ చాంద్రాయణ వ్రతాలు చేయాలి". ***(అధ్యాయం - 107)***

# బృహస్పతి ప్రోక్త నీతిసారం

నైమిషారణ్యంలో శౌనకాచార్యుని జిజ్ఞాస మేరకు అర్థశాస్త్రంపై ఆధారపడిన నీతిసారాన్ని, ఒకప్పుడు ఇంద్రునికి బృహస్పతి ఉపదేశించిన దాన్ని, ఇలా బోధించసాగాడు సూతమహర్షి.

"శౌనకాది మహామునులారా! ఇది రాజులు - అనగా పరిపాలకులు, వ్యాపార సామ్రా జ్యాధినేతలు, వారి గురువులైన మునులు, బ్రాహ్మణులు ఇలా అందరూ తెలుసు కోవలసిన విషయము.

పురుషార్థ చతుష్టయాన్ని, అనగా ధర్మార్థ కామమోక్షాలను సిద్ధించుకోదలచుకున్న వాడు సజ్జనులతోనే చెలిమిచేయాలి. దుర్జన సాంగత్యంలోనే బతికేసేవాడు ఇహపరాలు రెండింటికీ చెడతాడు.

*సద్భిఃసంగం ప్రకుర్వీత సిద్ధికామః సదానరః ।*
*నాసద్భిరిహలోకాయ పరలోకాయ వాహితం ॥* *(ఆచార...108/2)*

క్షుద్రునితో సంభాషణా, దుష్టుని దర్శనమూ, శత్రు సేవకునిపై ప్రేమా, మిత్రునితో విరోధమూ, మూర్ఖునికుపదేశమూ, దుష్ట స్త్రీ నుండి సహాయ స్వీకరణమూ ప్రమాదకర ములు, దుఃఖదాయకములు. కాలవైపరీత్యం వల్ల మిత్రునితో శత్రుత్వమూ, శత్రువుతో మిత్రత్వమూ నెఱపవలసి వచ్చినపుడు అది శాశ్వతంకాదని మనసులో గట్టిగా అనుకుంటూ జాగ్రత్తగా నిర్వహించాలి.

కాలం బహుశక్తివంతం. దానిని గెలుచుట కష్టసాధ్యం. అది దురతిక్రమణీయం. అదే ప్రాణులను పరిపాలిస్తుంది, సంహరిస్తుంది, ప్రాణులు నిద్రిస్తున్నా అది నిద్రించదు. కాలమే మానవ జీవితంలోని అన్ని ఘట్టాలనూ నిర్ణయిస్తుంది.

ఋషులారా! బృహస్పతి బోధనలవల్లే ఇంద్రాది దేవతలు నీతిజ్ఞులు కూడ అయినారు. ఆయన ఇంకా ఇలా చెప్పాడు:

స్థితిమంతులంతా అశ్వమేధయాగం చెయ్యాలి. దేవుళ్ళను పూజించినంత భక్తిశ్రద్ధలతోనే బ్రాహ్మణులనూ రాజర్షులనూ పూజించాలి.

*ఉత్తమైః సహసాంగత్యం పండితైః సహ సత్కథాం ।*
*అలుబ్ధైః సహమిత్రత్వం కుర్వాణో నావసీదతి ॥* *(ఆచార... 108/12)*

ఉత్తమ ప్రకృతి గల మంచివారితో కలిసి తిరగడం, పండితులతో మాట్లాడుతూ వారికి సల్లాపంబునందుల్లాసంబు కలిగింపజేసి ఉత్తమ కథలను విశేషాలను వినడం, లోభులు కాని వారితో స్నేహం చేయడం – వీటిని పాటించే బుద్ధిమంతుడు సుఖపడతాడు.

ఇతరులను నిందించుట, పరుల ధనాన్ని అపహరించుట, మగనాలితో సరసాలాడుట, తనది కాని ఇంటిలో నుండుట – ఎన్నడూ చేయరాదు. మనకి మేలు చేసేవాడు పరుడైనా బంధువే; మనకి కీడు చేసేవాడు బంధువైనా పరుడే అని గ్రహించాలి.

ఎవరు మనను పోషిస్తారోవారే మాతాపితలు. శరీరం నుండి పుట్టినదే అయినా వ్యాధిని తగిలేయడానికే చూస్తాము కదా! ఎక్కడో అడవిలో పుట్టినదైనా మందుని మనలో కలుపుకుంటాము కదా!

*పరోఽపి హితవాన్ బంధుర్బంధు రప్యహితః పరః ।*
*అహితో దేహజో వ్యాధిర్హిత మారణ్య మౌషధం ॥*
*సబంధుర్యోహితే యుక్తః సపితా యస్తు పోషకః ।*
*తన్మిత్రం యత్ర విశ్వాసః సదేశోయత్ర జీవ్యతే ॥* **(ఆచార...108/14,15)**

చూసేవాడే నేస్తం, మానింది మందు, బతికింది ఊరు అని పెద్దలంటారు కదా!

చెప్పిన పనిని అక్షరాలా మనసా చేసేవాడే సేవకుడు, మొలకెత్తే విత్తనమే విత్తనం, ప్రియంగా సంభాషించేదే భార్య, తండ్రినీ తల్లినీ, వృద్ధులైనా పూజించి పోషించేవాడే కొడుకు, గుణవంతునిగా ధర్మప్రవృత్తితో బతికేవాడి బతుకే నిజమైన బతుకు. ఇలా కాని వాళ్ళు బతకడం భూమికి బరువు.

*సాభార్యా యా గృహేదక్షా సాభార్యా యా ప్రియం వదా ।*
*సాభార్యా యా పతి ప్రాణా సా భార్యా యా పతివ్రతా ॥* **(ఆచార... 108/18)**

ఇలాంటి పతివ్రతయు, పైగా సుందరి, మంగళప్రదకార్యాలు చేయునది, ధర్మపరాయణ, శృంగార సుఖం కోసం కాకుండా పుత్ర సంతానం కోసం మాత్రమే సంగమాన్ని కోరుకొనేది యగు భార్య లభించినవాడు దేవేంద్రుని వలె వెలుగొందుతాడు.

అలాకాకుండా ఎగుడుదిగుడు కన్నులది, పాపిని, కలహప్రియ, పరపురుషులపై ఆసక్తి కలదియైన భార్యకు దొరికిపోయినవాడు ఎన్ని వున్నా, అన్నీ వున్నా దరిద్రుడే. ఇలాంటి వాడు పెళ్ళయిన స్వల్పకాలంలోనే వృద్ధావస్థను చేరుకుంటాడు.

దుష్టపత్ని, దుష్టమిత్రుడు, పొగరుబోతుభృత్యులు గలవాడు సర్పమున్న గృహంలో నివసిస్తున్నట్లే లెక్క. వానికి సుఖం వుండదు. శాంతీ వుండదు.

దుష్టసాంగత్యాన్నొదిలేసి, మంచివారితో కలసిమెలసి తిరుగుతూ రాత్రింబవళ్ళు వీలైనంతవఱకు పుణ్యాన్నే సంపాదిస్తూ భగవంతుని నిత్యత్వాన్నీ మనయొక్క అనిత్యత్వాన్నీ తలుస్తూనే జీవించాలి.

వేశ్యాలంపటంలో పడరాదు. అల్పమైన చదువున్నవాడూ బలహీనుడూ మహాశక్తిశాలిగా రూపొందవచ్చు, పచ్చికృతఘ్నుడని ప్రజలంతా అనేవాడు కూడా మంచివాడై పోయి నమ్మదగిన వ్యక్తిగా పేరొందవచ్చు, అగ్ని చల్లగా కావచ్చు, మంచుని ముట్టుకుంటే వేడిగా తగలవచ్చు. కాని వేశ్యకు పురుషునిపై ప్రేమ రాదు.

సూతుడిలా కొనసాగించాడు. నీతిసారాన్ని మునులకీయసాగాడు. ధనాన్ని సంపాదించాలి కాని, దాన్ని తనకూ, స్త్రీలకూ, పిల్లలకూ ఆపదవచ్చినపుడు వాడుకోవడానికి చాలినంతవఱకే దాచుకోవాలి.

వర్ణం కోసమొక వ్యక్తినీ, గ్రామం రక్షించబడవలసి వస్తే తప్పనిసరైతే ఒక కుటుంబాన్నీ, మహానగరాన్ని కాపాడవలసి వస్తే జనపదాన్నీ త్యాగం చేయవచ్చు. ఆత్మరక్షణ కోసమైతే గ్రామం, నగరం, దేశం, దేనినైనా పరిత్యజించవచ్చును.

*త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్ ।*
*గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్ ॥* *(ఆచార...109/2)*

దుష్టచరిత్రుని ఇంటిలో నుండడం కన్నా నరకంలో నుండుటయే మేలు. ఎందుకంటే నరకం పాపాలను దగ్ధం చేస్తుంది.

బుద్ధిమంతుడెపుడూ ఒక పాదాన్ని పూర్తిగా స్థిరంగా మోపిన తరువాతే రెండో కాలెత్తుతాడు. నేల విడిచి సాము చేయడు. అంటే ఒక చోటుని వదలిపోవునపుడు ఇంకొక దానిని సిద్ధం చేసుకొన్నాకనే కదలాలి.

దుష్టజనులచే పరివ్యాప్తమైన దేశాన్నీ, ఉపద్రవగ్రస్తమైన నివాసభూమినీ, మాయావి యైన మిత్రునీ ఏ మాత్రం సంకోచించకుండా, ఆలస్యం చేయకుండా వదిలేయాలి.

పీనాసివాడి చేతిలో పడిన ధనమూ, అత్యంత దుష్టుడూ, కోపిష్టి వద్ద నున్న జ్ఞానమూ, గుణంగానీ శౌర్యంగానీ లేనివానికి గల సౌందర్యమూ, ఆపద వేళలో మొగం చాటేసే మిత్రుడూ ఎందుకూ పనికిరారు.

అధికారంలో వున్నవాడికైతే సాయపడడానికి అపరిచిత వ్యక్తులు కూడా అత్యుత్సాహంతో ముందుకు వస్తారు. చిటికెలో మిత్రులయి పోతారు. అదే వ్యక్తి పదవీచుత్యుడైతే, అసమర్థుడని తేలిపోతే పరిచయస్తులు కూడా పలకరించరు. స్వంతవారే శత్రువులా చూస్తారు. (తరువాత తెలుగులో వచ్చిన – అధికారాంతమునందు చూడవలెరా ఆయయ్య సౌభాగ్యముల్ – అనే సుభాషితానికి గరుడపురాణమే మూలం కావచ్చు.)

నిజమైన మిత్రుడెవరో ఆపదవచ్చినపుడే తెలుస్తుంది. అలాగే యుద్ధంలో వీరత్వమూ, ఏకాంతంలో శుచితా, వైభవం క్షీణించినపుడు పత్నీ, దుర్భిక్షంలో అతిథి ప్రియత్వం నిగ్గు తేలతాయి. అనగా వారి అసలు రంగులు బైట పడతాయి.

*వృక్షం క్షీణఫలం త్యజంతి విహగాః*
*శుష్కం సరః సారసా నిర్ద్రవ్యం*
*పురుషంత్యజంతి గణికా భ్రష్టం నృపం మంత్రిణః ।*
*పుష్పం పర్యుషితం త్యజంతి మధుపాః*

*దగ్ధం వనాంతం మృగాః సర్వః కార్యవశా*
*జ్జనోహిరమతే కస్యాస్తి కో వల్లభః ॥* **(ఆచార...109/9)**

ఎవరికి యెవరు? చివరికి యెవరు? పళ్ళ కాపు ఆగిన చెట్టుని పిట్టలు వదిలిపోతాయి. సరస్సు ఎండిపోవడం మొదలవగానే అక్కడ వాలేవి ఇక వాలవు. వేశ్యలు ధనాన్ని పిండేసిన తరువాత విటుని ఇక తమ గుమ్మం తొక్కనివ్వరు. వాడిన, మాడిన పూలపై తుమ్మెదలు వాలడం మానుకుంటాయి. కాలిన అడవిని జంతువులన్నీ త్యజిస్తాయి. ఇవన్నీ వేరే ఆశ్రయాలను వెతుక్కుంటూ పోతాయి. కాబట్టి మునులారా! ఈ వ్యావహారిక జగత్తులో ఎవరూ ఎవరికీ ఏమీ కారు.

***లుబ్ధమర్థ ప్రదానేన శ్లాఘ్యమంజలి కర్మణా ।***
***మూర్ఖం ఛందాను వృత్త్యా చ యాథాత థ్యేన పండితం ॥***
***సద్భావేన హి తుష్యంతి దేవాః సత్పురుషాః ద్విజాః ।***
***ఇతరేఖాద్యపానేన మానదానేన పండితాః ॥*** **(ఆచార...109/10,11)**

లోభికి ఏదోరూపంలో ధనాన్నిస్తే తెగ ముచ్చటపడిపోతాడు. ఆ రకంగా వాడి మనసును గెలుచుకోవచ్చును. అలాగే అంజలించి ఉదారచిత్తులనూ, పొగడ్తలతో మూర్ఖులనూ, తాత్త్వికచర్చ ద్వారా విద్వాంసులనూ, మంచి మనసు చేత ఉన్నతాలోచనల చేత దేవతలనూ సజ్జనులనూ ద్విజులనూ మంచి చేసుకోవచ్చును. అన్నపానాలతో సామాన్యులనూ, మాన సమ్మానాలతో పండితులనూ ఆకట్టుకోగలము.

నదిని నమ్ముకొని ఒక చోట వుండిపోవాలనుకోవడం తెలివైన పనికాదు. అది అతిగా నిండినా పూర్తిగా ఎండినా ముప్పు తప్పదు. అలాగే గోళ్ళతో కొమ్ములతో వుండే జంతువులనూ ఆయుధాన్ని ధరించి తిరిగేవారినీ, రాజ పరివారాన్నీ విశ్వసించి ఉండిపోకూడదు.

***నదీనాంచనఖీ నాంచ శృంగిణాం శస్త్రపాణి నాం ।***
***విశ్వాసోనైవ కర్తవ్యః స్త్రీ షు రాజకులేషు చ --*** **(ఆచార... 109/14)**
***★అర్థనాశం మనస్తాపం గృహేదుశ్చరితానిచ ।***
***వంచనం చాపమానం చ మతిమాన్ న ప్రకాశయేత్ ॥*** **(ఆచార... 109/15)**

ఈ ప్రపంచంలో దోషం లేని వంశం, రోగ పీడితులు కాని మనుషులు, దుఃఖితులు కాని వారు, అహంకారాన్ని గెలువగలిగిన ధనవంతులు, దుర్జనుల వల్ల దెబ్బతిననివారు ఉండరు.

---

★*అవమానమును, ధన నష్టమును ప్రకాశము చేయరాదందురు అనే నీతిచంద్రిక సూక్తికి కూడ గరుడ పురాణమే మూలం. (శ్లో 109/15)*

ఎచ్చోటనైతే వ్యక్తికి గౌరవం లభించదో, ఆదరించేవారుండరో, బంధుబాంధవులు లేరో, విద్యా లాభ అవకాశమే వుండదో అచ్చోటును వీలైనంత వేగం వదలిపోవాలి.

ధనసంచయం చేసేవాడు దానినెంత వఱకు రక్షించగలడో కూడా ఆలోచించుకోవాలి. రాజులు, చోరులు దాని జోలికి రాకుండా కాపాడుకోగలగాలి. అప్పుడైనా ప్రాణాలను పణంగా పెట్టి కొండొకచో అన్యాయానికి ఒడిగట్టి సంపాదించిన సొమ్ము వానితో పరలోకానికి వెళ్ళదు కానీ తత్సంపాదనకై వాడుచేసిన పాపాలు వానిని నరకం దాకానూ మరుజన్మల లోనూ కూడా అనుసరిస్తాయి. కాబట్టి అధర్మం, లోభం పనికిరావు. సాధారణంగా ఇటువంటి అధార్మికులూ, లోభులే మరుజన్మలో కడుపారగ కూడుగానీ తలదాచగ గూడు కానీ చలినాపగవలువలుగానీ లేని దరిద్రులుగా, రోగులుగా జీవనాన్ని గడుపుతుంటారు. వీరంతా దానం,ధర్మం లేని ఒకనాటి శ్రీమంతులే. మనం ఇటువంటి వారు మనను యాచిస్తున్నపుడు మనకొక హెచ్చరిక చేస్తున్నారని అర్థం చేసుకోవాలి. 'ఓయి మానవులారా. మీరు అన్యాయాలు చేసి, దానాలు చేయకుండా బతికేస్తే వచ్చే జన్మలో మాలాగే అడుక్కుతినాలి'

***శిక్షాయంతి చయాచంతే దేహీతి కృపణా జనాః ।***
***అవస్థేయమదానస్యః మా భూదేవం భవానపి ॥*** ***(ఆచార 109/25)***

పీనాసివాని ధనం యజ్ఞాలకు ఉపయోగపడదు (వాడు చేయడు కాబట్టి) బ్రాహ్మణులను చేరదు (వాడివ్వడు కాబట్టి) చివరికది చేరేది రాజును (లాక్కుంటాడు కాబట్టి) లేదా దొంగను. (దోచుకుంటాడు కాబట్టి).

విద్యను నిరంతరం అధ్యయనమో, అభ్యాసమో చేసుకుంటూ వుండకపోతే దానిని మరిచిపోతాం. శక్తి కూడా అంతే.

దొంగని క్షమించడంగాని చిన్న శిక్ష వేసి ఊరి మీదికి వదలి వేయడంగాని కూడదు. వానికి సరైన శిక్ష మరణదండనే.దుష్టుడైన మిత్రుని దూరంగా వుంచాలి.ఎదురైతే పలకరించి ఎలాగో పారిపోవాలి. అదే వానికి శిక్ష. స్త్రీకి సరైన శిక్ష ఆమెను తన శయ్యపై కాకుండా వేరే ఒంటరిగా పడుకోబెట్టడం. బ్రాహ్మణునికి శిక్ష వానిని దేనికీ పిలవక పోవడమే.

పనిని పెంచడం ద్వారా భృత్యునీ, దుఃఖం కలిగించే సంఘటన వచ్చినపుడు బంధు బాంధవులనూ, విపత్కాలంలో మిత్రునీ, ఐశ్వర్యం నష్టమైపోయినపుడు స్త్రీనీ జాగ్రత్తగా గమనించక్కరలేకుండానే వారి రంగులు బైటపడతాయి.

*జానీయాత్ ప్రేషణే భృత్యాన్*
*బాంధవాన్ వ్యసనాగమే ।*
*మిత్రమాపది కాలే చ*
*భార్యాంచ విభవక్షయే ॥* *(ఆచార... 109/32)*

స్త్రీకి పురుషుని కన్నా రెండింతలు ఆహారమూ, నాల్గింతలు బుద్ధీ, ఆరింతలు ఓపికా, ఎనిమిది రెట్లు కామ వాంఛా వుండాలనీ, వుంటాయనీ పెద్దలంటారు.

స్వప్నం వల్ల నిద్రపై విజయం లభింపదు. అనగా కలల వల్ల నిద్ర చెడుతుందే గానీ తీరదు. కామంతో స్త్రీని గెలుచుకొనుట అసాధ్యం. ఇంధనంతో అగ్నిని తృప్తిపఱచలేము. మద్యంతో దాహాన్నీ తీర్చలేము. స్త్రీకి సౌకర్యాలను కలిగిస్తున్నకొద్దీ ఆమెకు కోరికలు పెరిగిపోతుంటాయి. కట్టెముక్కలను వేస్తున్న కొద్దీ అగ్ని మరింత రాజుకుంటుంది కదా! నదులు తనలో కలుస్తున్న కొద్దీ సముద్రునికి దాహమూ అలాగే పెరిగిపోతుంటుంది.

ప్రియవచనాలు, కోరికల సిద్ధి, సుఖాలు, పుత్రులు - ఇలాంటివన్నీ వస్తున్నకొద్దీ ఇంకా కావాలనే అనేవారే తప్ప ఇక చాలు అనేవారుండరు.

మోక్షమనేది వనాలలోనో పర్వతాలపైననో మాత్రమే దొరకదు. తనకు ధర్మశాస్త్రాలు విధించిన కర్మను తత్పరతతో దైవార్పణంగా చేస్తూ, గౌరవంగా బతకడానికి చాలినంత మాత్రమే ధనాన్నార్జిస్తూ, శాస్త్ర చింతనపై రక్తినీ, తన భార్యపై మాత్రమే అనురక్తినీ పెంచుకుంటూ జితేంద్రియుడై, అతిథిసేవానిరతుడై జీవనాన్ని గడిపే సత్పురుషుడు ఆయువు తీరినంతనే స్వంత ఇంటినుండే మోక్షపదాన్ని చేరుకోగలడు.

స్వర్గం ఎక్కడో ఆకాశంలో మాత్రమే ఉందనుకోడానికి లేదు. సత్కర్మ నిరతుడైన పురుషునికి తన లోగిట్లోనే అనుకూలవతి, సుందరి, సముచితాలంకార భూషిత, ఆరోగ్యవంతురాలు అయిన భార్యా, ఎవరినీ యాచించకుండా పీడించకుండా బతుకు జరిగే వెసులుబాటూ వుంటే అదే భాగ్యము, అదే స్వర్గము.

స్వభావసిద్ధంగానే ధర్మ విరుద్ధంగా పతికి ప్రతికూలంగా వుండే స్త్రీలు దానానికీ మానానికీ శాస్త్రాలకీ శస్త్రాలకీ లొంగరు. (వారితో బ్రతకవలసిరావడమే నరకం)

*న దానేన న మానేన నార్జవనే న సేవయా ।*
*న శస్త్రేణ న శాస్త్రేణ సర్వథా విషమాః స్త్రియః ॥* *(ఆచార... 109/45)*

విద్యార్జన, ధనసంగ్రహం, పర్వతారోహణం, అభీష్టసిద్ధి, ధర్మాచరణం, - ఈ అయిదింటినీ ఓపికగా క్రమక్రమంగా సాధించుకోవలసి వుంటుంది.

దేవపూజనాదిక కర్మలూ, బ్రాహ్మణులకిచ్చే దానమూ, సద్విద్య మంచిమిత్రుడూ – ఇవి మానవునికి జీవిత పర్యంతమూ సహాయకారులవుతాయి. బాల్యకాలంలో విద్యనీ, యువావస్థలో ధనాన్నీ అనుకూలవతియైన పత్నినీ సంపాదించుకోలేని వారు సుఖవంతమైన జీవితాన్ని గడపలేరు.

విద్యార్జన ఒక ఉపాసన. ఆ ఉపాసనా కాలంలో మనిషికి భోజనాన్ని గురించిన ఆలోచనరాకూడదు. విద్య కోసం, అవసరమైతే, గరుత్మంతుని వలె, ఎంత దూరమైనా పోవాలి. వీలైనంత వేగంగా పోవాలి.

శుష్కతర్కం వల్ల ఎవరికీ ప్రయోజనముండదు. సిద్ధాంత స్థాపనము కేవలం తర్కమాత్రాన జరగదు. ధర్మం కూడా తర్కము నను సరించివుండదు. పరిస్థితులను బట్టి ధర్మం మహర్షులచే ఆదేశింపబడుతుంది.

***తర్కో౽ ప్రతిష్ఠాశ్రుతయో***
***విభిన్నాః నాసావృషిర్యస్య మతం న భిన్నం ।***
***ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం***
***మహాజనోయేన గతః సపంథాః ॥*** **(ఆచార...109/52)**

ఆకారం, సంకేతం, గతి, చేష్ట, మాట, కనులు, ముఖము – మనిషి యొక్క అంతః కరణ వీటి ద్వారా బయటపడిపోతూనే వుంటుంది. వీటిని బట్టి అవతలివాని అసలు రంగుని కనుగొని అవగతం చేసుకోగలిగిన వాడే నిజమైన విద్వాంసుడు. జంతువులలో గుఱ్ఱానికీ, ఏనుగుకీ ఈ శక్తి కొంత వఱకూ వుంటుంది." ***(అధ్యాయాలు 108, 109)***

## నీతిసారం

**సూ**తుడు శౌనకాది మహామునులకు ఇంకా ఇలా చెప్పాడు, "మహామునులారా! సునిశ్చితార్థాన్ని వదిలేసి అనిశ్చిత పదార్థాలను సేవించేవాడు రెండింటికీ చెడతాడు.

వాగ్వైభవం లేని వ్యక్తి యొక్క విద్య, పిరికివాని చేతిలోని ఆయుధంవలెనే వానికి పనికిరాదు. అంధుని భార్య యొక్క అందమూ అంతే.

సుందర భోజ్య పదార్థాల కలిమీ, వాటిని అరిగించుకొనే శక్తీ, రూపవతియగు భార్యా, ఆమెను అన్ని విధాలా సంతృప్తి పఱచగలిగే శక్తీ, ధనమూ, వైభవమూ, దానం చేసే బుద్ధీ – ఇవన్నీ గొప్ప తపస్సును చేసిన వారికే లభిస్తాయి.

వేదానికి ఫలం అగ్నిహోత్రం; విద్య యొక్క ఫలాలు శీలమూ, సదాచారమూ; స్త్రీ వల్ల లాభం రత్యానందం, పుత్రప్రాప్తి; అలాగే ధనం వుండేది దానానికీ, భోగానికీ.

ధనం ఉండాలి కానీ అనర్థాన్ని తెచ్చి పెట్టే ధనం అభిలషణీయం కాదు. మణిని కోరుకోవచ్చు. కాని పాముపడగపై నున్న మణి కోసం పాకులాడకూడదు కదా!

అగ్నిహోత్రం కోసం హవిష్యాన్నాన్ని తక్కువ స్థాయి వాని వద్ద నుండి కూడా గ్రహించవచ్చు. బాలకుని వద్ద నుండైనా సుభాషితాన్ని ఆలకించి ఆదరించాలి. స్వర్ణము అపవిత్ర స్థానంలో వున్నా చేజిక్కించుకోవచ్చు. అలాగే నీచవ్యక్తి వద్ద శ్రేష్ఠ విద్య వుంటే నిస్సంకోచంగా ఆ విద్యను నేర్చుకోవచ్చు.

రాజుతోస్నేహం మంచిదికాదు. స్త్రీ శిశువులు మాత్రమే జనించే కుటుంబము యజ్ఞయాగాదులు చేసైనా పుత్ర సంతానాన్ని పొందవలసి వుంటుంది.

వివేకవంతుడు తన వంశంలోని వారందరినీ భగవద్భక్తులతో కలిసివుండేలా చేస్తాడు. పిల్లలను విద్యాధ్యయనంలో మగ్నులను చేస్తాడు. శత్రువులను ప్రమాదాలలో ముంచుతాడు. తనకిష్టులైన వారిని ధర్మమార్గంలో నడిపించే ప్రయత్నం చేస్తాడు.

భృత్యులనూ, ఆభరణాలనూ వేటికి తగినచోట్లలో వాటినుంచాలి. చూడామణిని కాలికి పెట్టుకోలేము కదా! కాబట్టి భృత్యుని కరుణించవచ్చు కాని నెత్తికెక్కించుకోరాదు. మనస్వియైన మనుజుడు పూలగుత్తి వలె నరుల తలలపైనైనా వుండాలి లేదా అడవిలోనే రాలిపోవాలి. మణీలక్కా కొండొకచో కలిసే వుండవచ్చు. స్వచ్ఛంగా స్వయం ప్రకాశ మానంగా వుండే మణిని లక్క సహాయంతో ఆభరణాలలో అమరుస్తారు. అయినా దేని విలువ దానిదే. గుఱ్ఱం, ఏనుగు, ఇనుము, కఱ్ఱ, రాయి, బట్ట, ఆడది, మగవాడు, నీరు – ఇవన్నీ కలిసి ఒకే చోట వుండవచ్చు కాని దేని విలువ దానిదే.

అర్థం వల్ల సాధారణంగా వచ్చే అనర్థాలు దైవానుగ్రహమున్న వానికి రావు. కాబట్టి దేవుని పూజించాలి.

కొన్ని కొన్ని పరిస్థితుల్లో సిగ్గు లేదా బిడియము లేదా మొగమాటము పనికిరావు. డబ్బు రావలసిన చోట, ప్రయోగాలలోను, కార్యసిద్ధి ప్రయత్నంలోను, భోజన వేళ, సంసార వ్యవహారంలోను లజ్జను పరిత్యజించాలి.

ఎటువంటి ఊరనుండాలో ఎవరు చొప్పడకున్నట్టి ఊరు చొరకూడదో వినండి*.

*ధనినః శ్రోత్రియోరాజా నదీ వైద్యస్తు పంచమః ।*
*పంచయత్ర న విద్యంతే నకుర్యాత్ తత్ర సంస్థితం ॥* *(ఆచార... 110/26)*

---

* *కనీసం పదేళ్ళ కిందటిదాకా ప్రతి తెలుగు నోటా పలుకబడిన గల సుమతి పద్యం 'అప్పిచ్చు వాడు వైద్యుడు'కి గరుడ పురాణమే మూలం – అను)*

దానధర్మాలు లేనిచోట, రాకపోకలు కనబడని చోట, అనుచితాచారులను భయపెట్టి ఆపే యంత్రాంగం పని చేయని చోట, ప్రజలు సిగ్గుని చిన్నప్పుడే వదిలేసిన చోట – అది ఎంత రమ్యమైన గ్రామమైనా, నగరియైనా – ఒక్క రోజైనా నిలువరాదు. అలాగే దైవజ్ఞులు, వేదజ్ఞులు, పాలకుడు, సజ్జనులు, జలసమృద్ధి అనగా నీటివసతి లేనిచోటకూడా నిలువరాదు. ***(అధ్యాయం – 10)***

## రాజనీతి

***(ఇది ఆ రోజులలో రాజుకి పనికివచ్చిన నీతి. ఇపుడు రాజులు లేరు. అయినా రాజాధికారాలుగల వారున్నారు. ప్రభుత్వముంది. కాబట్టి నేటి సమాజానికి కూడా ఈ నీతులవసరం)***

ప్రజలనుండి పన్నులరూపేణా డబ్బు వసూలు చేయడం తోటమాలి మృదువుగా తాను పెంచిన మొక్క నుండి ★పూలు కోసినట్లుండాలి. అంతేకాని వంట చెఱకు కోసం చెట్టు నరకినట్లుండకూడదు.

ఇతర రాజ్యాల నుండి వచ్చిన ద్రవ్యాలను రాజు స్వీకరించాలి. అవి పాడైపోతే, విరిగిన పాలనువలె, త్యజించాలి. పాల కోసం ఆవుని వాడుకోవాలిగాని పొదుగును కోసివేయకూడదు. అలాగే రాజు ధనికులనూ వాడుకోవాలి.

*సత్యం మనోరమాః కామాః సత్యం రమ్యా విభూతయః ।*
*కింతువైవనితాపాంగ భంగి లోలంహి జీవితం ॥*
*వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ*
*రోగాశ్చ శత్రవ ఇవ ప్రభవంతి గాత్రే ।*
*ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివాంభో*
*లోకోన చాత్మహితమాచరతీహ కశ్చిత్ ॥* ***(ఆచార...111/9,10)***

అన్నీ సత్యంలాగా శాశ్వతంలాగా కనిపిస్తాయి. కాని ఐశ్వర్యం, భోగాలు, స్త్రీ, ప్రేమ, పదవి వంటివి సత్యాలూ కావు నిత్యాలూ కావు. అసలు కనిపించని రోగం, ముసలితనం, మృత్యువు మాత్రమే నిత్య సత్యాలు, శాశ్వతాలు. కాబట్టి రాజైనా ప్రజలైనా ధర్మాచరణ రక్తులై జీవించాలి.

---

★ *ఈ భావాన్నే పువ్వులోంచి తుమ్మెద తేనెను లాగినంత మృదువుగా నొప్పి లేకుండా ప్రజల నుండి ప్రభుత్వము పన్నులు వసూలు చేయాలని చెప్పాడు. అర్థశాస్త్రంలో చాణక్యుడు. (గరుడపురాణంలో కూడా వుంది 123/5)*

పరస్త్రీలలో తల్లినీ, పరద్రవ్యంలో మట్టినీ, సర్వప్రాణులలో తన ఆత్మనీ చూడగలిగిన వాడే నిజమైన విద్వాంసుడు.

పదవికోసం ప్రయత్నించేవాడు ఆ పనిని ప్రజలకోసం చేయడు. తన కోసమే చేస్తాడు. అది క్షంతవ్యమే కాని ఆ పదవి వల్ల వచ్చిన అధికారాన్నీ ఐశ్వర్యాన్నీ ప్రజోపయోగ కరమైన యజ్ఞయాగాదులకూ దానాలకూ వినియోగించినవాడే నరకానికి పోకుండా వుంటాడు. (రాజ్యాంతే నరకం, ధ్రువం – అనే నానుడి వానికి వర్తించదు)

రాజుకైనా ప్రజలకైనా ధనం అత్యంత ముఖ్యం. ధనవంతునికీ మిత్ర, బంధు, బాంధవులుంటారు. అతనినే మహాపురుషుడనీ, సమర్థుడనీ కొనియాడతారు. ధనం కోల్పోతే అదే వ్యక్తిని అందరూ వదిలేస్తారు. వాడసలు మగాడే కాడంటారు. మరల ధనం సంపాదించుకు వస్తే నాలికకరచుకొని అతని చుట్టూ చేరతారు.

*యస్యార్థాస్తస్యమిత్రాణి యస్యార్థా స్తస్య బాంధవాః ।*
*యస్యార్థాః స పుమాంల్లోకే యస్యార్థాః సచపండితః ॥*
*త్యజంతి మిత్రాణి ధనైర్విహీనం పుత్రాశ్చ దారాశ్చ సుహృజ్జనాశ్చ ।*
*తేచార్థవంతం పునరాశ్రయంతి హ్యర్థోహి లోకే పురుషస్య బంధుః ॥*

***(ఆచార... 111/17,18)***

రాజుకి శాస్త్ర జ్ఞానముండాలి. అదొక కన్ను వంటిదైతే, మరొక కన్ను గూఢచారులు.

ఏ రాజు యొక్క పుత్రులూ, భృత్యులూ, మంత్రులూ, పురోహితులూ, ఇంద్రియాలూ తమ తమ కర్తవ్య పాలనలో బద్ధకం వహిస్తారో ఆ రాజు ఎంతో కాలం రాజుగా మనలేడు. వీరంతా సక్రమంగా పనిచేస్తే బలవంతుడైన రాజు ఎన్నేళ్ళయినా ఏలగలడు.

ప్రయత్నం, సాహసం, ధైర్యం, బుద్ధి, శక్తి, పరాక్రమం ఉన్నవానిని దేవతలు కూడా మెచ్చుకొని పై పదవికి పంపిస్తారు.

*ఉద్యోగః సాహసం ధైర్యం బుద్ధిః శక్తిః పరాక్రమంః ।*
*షడ్విధో యస్య ఉత్సాహస్తస్య దేవోఽ పి శంకతే ॥*
*ఉద్యోగేన కృతే కార్యే సిద్ధిర్యస్య న విద్యతే ।*
*దైవం తస్య ప్రమాణం హి కర్తవ్యం పౌరుషం సదా ॥* ***(ఆధార...111/32,33)***

ఈ ఆరూగలవాడే పురుషుడు. ఈ జన్మలోని పౌరుషమే మరుజన్మలో భాగ్యమవుతుంది. ***(అధ్యాయం – 111)***

ఉత్తములనీ, మధ్యములనీ, అధములనీ భృత్యులలో మూడు రకాల వారుంటారు. అది పరీక్షను పెట్టి తేల్చుకోవాలి.

బంగారాన్ని ఎలాగైతే అత్యంత జాగరూకతతో ఘర్షణ, ఛేదన, తాపన, తాడన పరీక్షలను పెట్టి తీసుకుంటామో భృత్యులను రాజు కూడా అలాగే ఎంచుకోవాలి.

వర్ణము, వ్రత, శీల, కర్మములు ఈ ఎంపికలో ప్రధాన పాత్రనువహిస్తాయి. ముఖ్యంగా కోశాధికారిని ఎంచుకొనేటపుడు అభ్యర్థి యొక్క వంశాన్నీ, శీల సద్గుణసంపన్నతలనూ, సత్య ధర్మపరాయణత్వాన్నీ, రూప సంపదనూ, ప్రసన్న చిత్తాన్నీ పరిగణనలోకి తీసుకోవాలి. రత్నాల గూర్చి బాగా తెలిసిన వానినే రత్న పరీక్షకునిగా నియమించుకోవాలి. బలపరాక్రమాలే కాక మంచి యుద్ధవ్యూహరచనాదక్షుని సేనాధ్యక్షునిగా నియమించుకోవాలి. సంకేతమాత్రమున స్వామి అవసరాన్ని పోల్చుకోగలిగేవాడూ, బలవంతుడూ, సుందర శరీరుడూ, పని బద్ధకంలేనివాడూ, జితేంద్రియుడూ అయిన వానిని ప్రతీహారిగా పెట్టుకోవాలి.

మేధావీ, వాక్పటుత గలవాడూ, విద్వాంసుడూ, జితేంద్రియుడూ, సర్వశాస్త్ర పరిచయం మరియు విమర్శక దృష్టీ ఉన్నవాడూ, స్వతహాగా సజ్జనుడూనగు వానిని లేఖకునిగా పెట్టుకోవాలి. బుద్ధిమంతునీ, వివేకశీలునీ, శూరునీ, పరేంగితజ్ఞునీ, మాటతీరు గలవానినీ, యథార్థం చెప్పే ధైర్యమూ చెప్పడంలో నేర్పూగలవానినీ, దూతగా నియమించుకోవాలి. సమస్త స్మృతులూ శ్రుతులూ చదివిన పండితుడూ, శాస్త్రాలలో నిష్ణాతుడూ, శౌర్య పరాక్రమసంపన్నుడూ నగు వానిని ధర్మాధ్యక్ష పదవికి ఎన్నుకోవాలి.

వంటవాడు వంశపారంపర్యంగా రావాలి. పాకశాస్త్ర ప్రవీణుడై వుండాలి. నిజాయితీ, సత్యవాక్పరిపాలనా, పవిత్రతా, సామర్థ్యమూ గలవాడై వుండాలి.ఎన్ని అర్హతలున్నా దుర్జనుని ఏ పదవికీ తీసుకొనరాదు. అధికారాన్ని ఎవరి చేతిలోనూ పెట్టరాదు. ***(అధ్యాయం – 112)***

# నీతిసారం

రాజు తన భృత్యుల శీలం విషయంలో బాగా నిక్కచ్చిగా వుండాలి.ఎవరిలో లోపం కనిపించినా వెంటనే తొలగించాలి. పనిలో నిర్లక్ష్యం చూపిన వారిని కఠినంగా శిక్షించాలి.

*సద్భిరా సీత సతతం సద్భిః కుర్వీత సంగతిం ।*
*సద్భిర్వివాదం మైత్రీంచ నా సద్భిః కించి రాచరేత్ ॥*
*పండితైశ్చ వినీతైశ్చ ధర్మజ్ఞైః సత్యవాది భిః ।*
*బంధనస్థోఽ పి తిష్ఠేశ్చ నతు రాజ్యేఖలైః సవా ॥* ***(ఆచార... 113/2,3)***

నిరంతరం మంచివారితోనే వుండాలి. వివాదం, మైత్రీ కూడా వారితోనే చేయాలి. మంచివారితో కలసి అడవులలోనైనా సుఖించవచ్చు గాని చెడ్డవారితో కలిస్తే రాజ్యభోగం కలుగుతుందన్నా అంగీకరించరాదు.

ఏ పనినీ సగంలో ఆపడం, విడువడం మంచిలక్షణం కాదు. పనిని సంపూర్ణంగా చేయగలిగితేనే ఒప్పుకోవాలి. చేసేదాకా అన్ని కర్మలూ ఆ పనివైపే సాగాలి. రాజులైనా ప్రజలైనా ఆశపోతూలూ, తొందరపాటు మనుష్యులూ కారాదు. పుట్ట, తేనెతుట్టె, చంద్రుని వెన్నెల ఎలాగైతే క్రమక్రమంగా పెరుగుతాయో స్థిరంగా నిలిచే సొమ్ము కూడా కొంచెం కొంచెంగా పెరుగుతుందనే జ్ఞానాన్ని కలిగివుండాలి.

*అర్జితస్య క్షయం దృష్ట్వా సంప్రదత్తస్య సంచయం ।*
*అవంధ్యం దివసం కుర్యాద్దానాధ్యన కర్మసు ॥* **(ఆచార... 113/8)**

దానం చేస్తే ధనం తరిగిపోతుందని, కష్టపడి ధనం సంపాదించి దానాలకీ, అధ్యయనాలకీ ఖర్చు పెట్టి వేస్తే మళ్ళా దరిద్రులమై పోతామని కొందరు భయపడుతుంటారు గానీ దానం వల్ల, విద్య వల్ల ధనం పెరుగుతుందే కాని తరగదు. ఇంద్రియ నిగ్రహం గలవాడు నగరంలో నివసిస్తున్నా నష్టపోడుగాని అదిలేని వాడిని అడవిలో పడేసినా బాగుపడడు. ఇంద్రియ నిగ్రహం కలిగి గృహస్థాశ్రమాన్ని పాటించేవాడు ఏ తపస్వికీ తీసిపోడు. వానికి ఇల్లే తపోవనం. కర్మే భగవంతుడు.

సత్యమును పాలించడమే ధర్మాన్ని రక్షించడం కూడా అవుతుంది. అభ్యాసం విద్యనీ, కడిగి తోమి కడుగుట పాత్రనీ శీలం వ్యక్తి యొక్క వంశాన్నీ రక్షిస్తాయి.

*సత్యేన రక్ష్యతే ధర్మో విద్యాయోగేన రక్ష్యతే ।*
*మృజయా రక్ష్యతే పాత్రం కులం శీలేన రక్ష్యతే ॥* **(ఆచార...113/10)**

బంధువులనో ఆత్మీయులనో ధనం అడుక్కు తిని బతకడం కంటే నూతిలోపడి కాని, పాముల చేత కరిపించుకొని గాని చావడమే మేలు. దానికి ధైర్యం చాలకపోతే ఏ వింధ్యాటవిలోనో నివసించుట మంచిది.

సంపదలు దానం వల్లనో భోగం వల్లనో నశింపవు. పూర్వజన్మ పాపం వల్ల నశిస్తాయి. ఆర్జిత పుణ్యమున్న వాని సంపద వృద్ధి చెందుతుంది.

బ్రాహ్మణునికి విద్యా, పృథ్వికి రాజు, ఆకాశానికి చంద్రుడూ, సమస్త చరాచరాలకూ శీలమూ ఆభూషణాలు.

*విప్రాణాం భూషణం విద్యా పృథివ్యా భూషణం నృపః ।*
*నభసో భూషణం చంద్రః శీలం సర్వస్వ భూషణం ॥* **(ఆచార... 113/13)**

ఇతిహాస ప్రసిద్ధులు ధర్మవీరులునైన రాజపుత్రులు ధర్మజాది పంచపాండవులు. వీరంతా చంద్రసమాన కాంతిమంతులు, సాటిలేని పరాక్రమశీలురు, సూర్యప్రతాపులు. పైగా స్వయంగా విష్ణువేయైన శ్రీకృష్ణ పరమాత్మకు మిక్కిలి ఇష్టులు. అయినా అంతటి వారూ భిక్షాటన చేసుకున్నారే గాని ధర్మాన్ని తప్పలేదు, కర్మాన్ని వదులుకోలేదు. ఇదీ శీలమంటే. దుష్టగ్రహాలెంత బాధించినా ధర్మాన్ని త్యజించరాదు.

ధర్మానికి లోబడి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే శ్రమకోర్చి సృష్టి, స్థితి లయలను క్రమం తప్పకుండా చేస్తూ, వారి కర్మను వారు సంపన్నం చేస్తున్నారు. మనమంతా ఆ కర్మకు కూడా నమస్కరించి కర్మాధీనులమై జీవించవలసినదే.

*బ్రహ్మాయేన కులాలవన్నియ మితో*
*బ్రహ్మాండ భాండోదరే*
*విష్ణుర్యేన దశావతారగహనే*
*క్షిప్తో మహాసంకటే ।*
*రుద్రోయేన కపాల పాణి పుటకే*
*భిక్షాటనం కారితః*
*సూర్యోభ్రామ్యతి నిత్యమేవ*
*గగనే తస్మై నమః కర్మణే ॥* **(ఆచార... 113/15)**

దానం, దానివల్ల కలిగే కష్టసుఖాలూ కూడా కర్మాధీనాలే. విష్ణువంతటివాడు దానాన్ని అడగడానికి వామనుడైపోయాడు. అంతవఱకూ ముల్లోకాలనూ ఏకచ్ఛత్రాధిపత్యంగా యేలిన బలిచక్రవర్తి మూడడుగుల దానమిచ్చి ముల్లోకాలనూ కోల్పోయాడు. ఇదంతా భగవంతుని క్రీడ. ఆ ఆడించేవానికి నమస్కారము.

*దాతా బలి ర్యాచకకో మురారిర్దానం మహీం*
*విప్రముఖస్య మధ్యే ।*
*దత్త్వాఫలం బంధనమేవ లబ్ధం నమోఽ స్తుతే*
*దైవయ థేష్టకారిణే ॥* **(ఆచార... 113/16)**

పాపానికి శిక్ష తప్పదు. ఈ శిక్ష, పాపి యొక్క పాపాన్నే తప్ప వంశప్రతిష్టనూ చూడదు, తల్లిదండ్రులనూ చూసి భయపడదు. సాక్షాత్తూ లక్ష్మీనారాయణుల సంతానమైనా పాపం చేస్తే దండన తప్పదు. (మన్మథుడు దండింపబడినాడు కదా!)

కొంతమంది 'నేను ఏ పాపమూ చేయలేదు. అయినా దేవుడు నన్ను శిక్షిస్తున్నాడు' అనీ 'మా వూరి పెత్తందారు ఎన్ని పాపాలు చేశాడో లెక్కేలేదు. అయినా వాడు తెగ సుఖపడిపోతున్నాడు. దేవుడేం చేస్తున్నాడో మరి' అనీ వాపోతారు. పూర్వజన్మలో చేసిన కర్మల యొక్క ఫలాన్ని ఈ జన్మలో అనుభవించాలని శాస్త్రం చెబుతోంది.

త్రికూట పర్వతం పెట్టనికోటై, సముద్రమే పరిఖగా వుండి, రాక్షసగణంచే రక్షితుడై, సాటిలేని బలపరాక్రమ సంపన్నుడై, స్వయంగా విశుద్ధాచరణా కోటిలింగార్చనా సముపేతుడై, అద్భుత తపశ్శక్తి సంపన్నుడైన రావణాసురుడే కాలం కలసి రాకపోవడంతో కూలిపోయాడు. ఇక సామాన్యుల సంగతి చెప్పేదేముంది?

ఏ క్షణాన, ఏ అవస్థలో ఏది జరగాలో అదే జరుగుతుంది. మరోటి, మరోలా జరగదు.

***యస్మిన్వయసి యత్కాలో యద్దివాయచ్చ వా నిశి ।***
***యన్ముహూర్తే క్షణేవాపి తత్తథా న తదన్యథా ॥*** ***(ఆచార... 11/22)***

భగవంతుడు మనకివ్వని దానిని అప్రదత్తమంటారు. మనం మన సామర్థ్యంతో అంతరిక్షంలోకైనా పోవచ్చు, భూగర్భంలోనైనా ప్రవేశింపవచ్చు, దశదిశలనూ మోయగలగ వచ్చు కాని అప్రదత్త వస్తువును పొందలేము.

***పురాధీతా చయా విద్యా పురాదత్తశ్చ యద్ధనం ।***
***పురాకృతానికర్మాణి హ్యగ్రే ధావతి ధావతి ॥*** ***(ఆచార... 113/24)***

మనకబ్బిన విద్యా, మనను చేరిన ధనమూ కూడా పూర్వజన్మకృత పుణ్యఫలాలే. మనం ధర్మం చేస్తున్న కొద్దీ ఇవి మనను అనుసరిస్తూనే వుంటాయి.

అన్ని శుభలక్షణాలూ వుండి బ్రహ్మాండమైన ముహూర్తంలో వివాహం జరిగి సీతవంటి భార్య భరత సౌమిత్రుల వంటి తమ్ములు ఉండి కూడా వారూ, శ్రీరాముడూ ★పదునాలుగేళ్ళ పాటు సుఖపడలేదు. ఇక సామాన్యుల గతి ఏమి? ఇదీ పురాకృతమనగా.

***కర్మాణ్యత్ర ప్రధానాని సమ్యగృక్షే శుభగ్రహే ।***
***వనిష్ఠకృత లగ్నేఽపి జానకీ దుఃఖభాజనం ॥***
***స్థూల జంఘోయదారామః శబ్ద గామీ చలక్ష్మణః ।***
***ఘన కేశీయదాసీతా త్రయస్తే దుఃఖభాజనం ॥***

---

★ *ఇక్కడ శ్రీరాముడు పూర్మజన్మలో చేసిన పాపమేమిటని అనుమానం రావచ్చు. శ్రీరాముడు విష్ణువు. విష్ణువు అంబరీషుని శరీరంలో ప్రవేశించి దుర్వాసుని ద్వారా పుడమిపై పుట్టాలనే శాపాన్ని పొందాడు. రావణుని ఆవేశించి ఆత్మలింగానికి బదులు తనను కోరేలా చేసినందుకు పార్వతీదేవి విష్ణువుని భార్యా వియోగంతో బాధపడుమని శపించింది.*

*నపితుః కర్మణా పుత్రః పితా వా పుత్ర కర్మణా ।*
*స్వయంకృతే న గచ్ఛంతి స్వయం బద్ధాః స్వకర్మణా ॥ (ఆచార...113/25-27)*

మునులారా! ఇందులో ఇంకో విశేషంకూడా వుంది. తండ్రి పాప పుణ్యాలలో కొడుకుకి గానీ కొడుకు పాపపుణ్యాలలో తండ్రికి గానీ వాటా వుండదు. ఈ దేశంలో వుంటేనే ఈ పూర్వజన్మ పాపాలు వెంటాడతాయనుకోవడం భ్రమ. మనిషి ఎక్కడ పుట్టినా ఆ పాపం దుఃఖ రోగరూపంలో కట్టి కుడుపుతుంది.

*ప్రాప్తవ్యమర్థం లభతేమనుష్యో*
*దేవోఽ పి తం వారయితుం న శక్తః ।*
*అతో న శోచామి న విస్మయో మే*
*యదస్మదీయం నతు తత్పరేషాం ॥ (ఆచార... 113/32)*

సర్పము, ఎలుక, ఏనుగు పారిపోవలసి వస్తే ఎక్కడిదాకా పోగలవు? పుట్ట, కన్నం, అడవి... అంతదాకానే కదా! అలాగే మన ఐశ్వర్యం కూడా మన పూర్వజన్మ సుకృతం అయిపోయేదాకానే వుంటుంది. మనం కర్మను దాటిపోలేము.

నూతి నుండి నీరు తోడుతున్న కొద్దీ ఊరుతుంటుంది. సద్విద్య ఎవరికైనా ఇస్తున్న కొద్దీ పెరుగుతుంటుంది. ధర్మమార్గంలో సంపాదించిన ధనమే ధనం. అది దానం చేస్తున్న కొద్దీ పెరుగుతుంటుంది. అధర్మాచరణ ద్వారా ఆర్జింపబడిన ఐశ్వర్యం తాను మిగలదు గానీ ఆ మనిషికి పాపాన్ని మాత్రం మిగిల్చిపోతుంది.

సత్యపాలనం, మనఃశుద్ధి, ఇంద్రియ నిగ్రహం, భూతదయ, జలప్రక్షాళన - ఇవి పంచశుచి మార్గాలు. సత్యపాలన శుచి గలవానికి స్వర్గప్రాప్తి సులభమే. సత్యమునే మాట్లాడువాడు. అశ్వమేధ యాగం చేసినవానికన్నా గొప్పవాడు.

*సత్యం శౌచం మనఃశౌచం శౌచమింద్రియ నిగ్రహః ।*
*సర్వభూతేదయా శౌచం జలశౌచంచ పంచమం ॥*
*యస్య సత్యం హి శౌచం చ తస్య స్వర్గో న దుర్లభః ।*
*సత్యం హి వచనం యస్య స్యో ఽ శ్వమేధాద్విశిష్యతే ॥ (ఆచార...113/38,39)*

దుష్టస్వభావులు, ఆత్మవంచకులు, వంచకులు అంతరాత్మ గొంతు నొక్కేసి దురాచారమే చేసేవారు ఎన్నిమార్లు పుట్టమన్ను నంటించి మరీ శరీరాన్ని తోముకున్నా పవిత్రులు కానేరరు. చేతులు, పాదాలు, మనస్సు మకిలి లేకుండా వున్నవారు, ధర్మపాలకులు, ఆధ్యాత్మ విద్యా సంపన్నులు, సత్కీర్తి నార్జించినవారు తీర్థాలలో మునగక పోయినా పవిత్రులుగానే వుంటారు. తీర్థఫలాన్నీ అందుతారు.

*యస్యహస్తౌచ పాదౌచ మనశ్చైవ సుసంయతం ।*
*విద్యాతపశ్చ కీర్తిశ్చ స తీర్థఫలమశ్నుతే ॥* (ఆచార...113/41)

సన్మానానికి పొంగిపోకుండా, అవమానానికి కోపించకుండా, ఎదుటివాడు కోపం తెప్పించడానికెంత ప్రయత్నించినా పరుషవాక్కు లాడకుండా వుండేవానినే సాధు పురుషుడంటారు.

*నప్రహృష్యతి సమ్మానైర్నావమానైః ప్రకుప్యతి ।*
*నక్రుద్ధః పరుషం బ్రూయాదేతత్ సాధోస్తు లక్షణం ॥* (ఆచార...113/42)

మనిషి దేనికైనా ప్రయత్నం చేయాలి. గట్టి ప్రయత్నమే చెయ్యాలి. అది ఫలించకపోతే బాధపడరాదు. కోపం తెచ్చుకోరాదు. విద్వాంసుడూ మధురభాషీ యైన వ్యక్తి దరిద్రునిగా జీవితాన్ని ప్రారంభించి ధనార్జనకై ప్రయత్నించినా అతని దారిద్ర్యం తీరకపోవచ్చు. బుద్ధి, పౌరుషం, బలం, మంత్రశక్తీ వుండి కూడా అలభ్య– అదృష్ట వస్తువు కోసం ప్రయత్నించి, ఒక వ్యక్తి భంగపడవచ్చు. నిరాశచెందరాదు.

అయాచితంగా వచ్చిన దానిని అనుభవించి అది పోయినపుడు విపరీతంగా బాధపడిపోవడం అనవసరం. ఎక్కడి నుంచి వచ్చింది అక్కడికే పోతుంది. ఎలా వచ్చింది అలాగే పోతుంది. బాగా పెరిగిన చెట్టు పై కొన్నివందల పక్షులు రాత్రంతా కాపుర ముంటాయి. తెల్లారగానే పోతాయి. ఒకవేళ ఆ చెట్టు కూలిపోతే అవి దుఃఖిస్తూ సమయాన్ని వ్యర్థం చేస్తూ కూర్చోవు. ఈ మాత్రం ఇంగితం మనిషికెందుకుండదో?

శౌనకాచార్యా! పుట్టడానికి పూర్వం మనకేమీలేదు. గాలిలో ఎగురుతూ వచ్చాం. అలాగే పోయిన తరువాత కూడా మనకేమీ వుండదు. మనకున్నవన్నీ మధ్యలో వచ్చి పోయేవేగా!

*అవ్యక్తా దీని భూతాని వ్యక్తమధ్యారి శౌనక ।*
*అవ్యక్త నిధనాన్యేవ తత్రకా పరిదేవనా ॥* (ఆచార...113/48)

పోయేకాలం వచ్చినవాడు సూదిగుచ్చుకున్నా పోతాడు. అది రానివాడు అంటే ఇంకా ఆయువున్నవాడు యుద్ధంలో శరీరం నిండా సందు లేకుండా బాణాలు కూరీసినా బతికేస్తాడు. కాబట్టి చావుకి భయపడనక్కరలేదు. అలాగే ఎవరికెంత ప్రాప్తమో అంతే వస్తుంది, వుంటుంది. ప్రాప్తించిన దానికి సంతోషించరు కానీ అప్రాప్య వస్తువుకై అంగలారుస్తారు, అలమటిస్తారు. ఇది అనవసరం. ప్రయత్నం మంచిదే; దుఃఖం కాదు.

వృక్షాలు ఏ పూజలు చేశాయని,ఏ ప్రార్థనలు సలిపాయని వాటికి సమయం వచ్చేసరికి పూత, కాత, పంట వస్తున్నాయి? మానవులకు కూడా పూర్వ జన్మ పుణ్య,

పాపకర్మల ఫలాలు ఆయా సమయాల్లో అందుతాయి. పూజలు, ప్రార్థనలు మనిషికి ఈ జన్మలోనూ వచ్చే జన్మలోనూ వచ్చే ఫలాల విషయంలో మార్పులు తేగలవు. శీలం, వంశం, విద్య, జ్ఞానం, గుణం,శుద్ధత - ఇవేవీ పూర్వకర్మమును మార్చలేవు. పూర్వజన్మతపః ఫలమే చెట్టుకి సర్వాంగ శోభనిచ్చినట్లు మనిషికి సర్వాంగసౌందర్యాన్నీ, అన్ని సంపదలనూ ఇస్తుంది.

ప్రాణియొక్క మృత్యువు ఆ మృత్యుకారణమున్న చోటే వుంటుంది. లక్ష్మి ఎక్కడుంటుంది? సంపదలున్నచోటే కదా! మన కర్మ చేత ప్రేరేపింపబడి మనమే ఆయా ఫలానున్న చోటికి వెళ్తాము. గోశాలలో ఎన్ని గోవులున్నా దూడ తన తల్లి వద్దకే పోయినట్లు ప్రపంచంలో ఇంతమంది వున్నా నీ పూర్వకర్మఫలం నిన్నే చేరుకుంటుంది.

*తత్రమృత్యుర్యత్ర హంతా తత్ర శ్రీర్యత్ర సంపదః ।*
*తత్ర తత్ర స్వయం యాతి ప్రేర్యమాణః స్వకర్మభిః ॥*
*భూతపూర్వం కృతం కర్మ కర్తార మనుతిష్ఠతి ।*
*యథాధేను సహస్రేషు వత్సో విందతి మాతరం ॥* **(ఆచార... 113/53,54)**

మూర్ఖ ప్రాణులకు తెలియదు. చెప్పినా వినరు. తమకు కలిగిన దుఃఖాలకు కనలి★ దేవుని నిందిస్తారు. మనుజులపై కక్ష పెట్టుకుంటారు. ఫలితంగా మరిన్ని పాపాలుచేసి వచ్చే జన్మలో కూడా ఇలాగే తగలడతారు. తన సుఖదుఃఖాలతో ప్రమేయం లేకుండా పుణ్యకార్యాలు చేసినవాడే ఇప్పుడు సుఖంగా బతుకుతున్నాడని తెలుసుకోవాలి.

ఇతరుల దోషాలను వెతికి పట్టుకోవడంలో గొప్ప తెలివితేటలు ప్రదర్శిస్తూ తనుచేసే తప్పులను మాత్రం కానుకోలేనివాడు గేదెలాంటివాడు.

*నీచః సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యతి ।*
*ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి న పశ్యతి "* **(ఆచార... 113/57)**

రాగద్వేషాల నంటిపెట్టుకొని బతికే జీవికి ఎక్కడా సుఖముండదు. సంతోషమున్న చోటనే సుఖముంటుంది. స్నేహమున్న చోట ఆ స్నేహమేమైపోతుందో, తను ప్రేమించిన వారి గతి ఏమిటోనని భయముంటుంది. ఇదే మమకారం. దీనిని విసర్జించినవాడే సుఖపడగలడు. ఈ శరీరమే సుఖదుఃఖాల నిలయం. అవి శరీరంతోనే పుడతాయి.

పరాధీనతయే దుఃఖం, స్వాధీనతయే సుఖం. మనిషికి సుఖదుఃఖాలు ఒకదాని వెంటనొకటి చక్రంలోని కర్రలలాగా వస్తూనే వుంటాయి; పోతూనే వుంటాయి. అనాసక్త భావంతో అన్ని పనులూ చేసుకొనే వాడొక్కడే నిత్యసుఖి.

---

★కనలి = కోపించి

*సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖం ।*
*ఏ తద్విద్యాత్ సమాసేన లక్షణం సుఖదుఃఖయోః ।*
*సుఖస్యానంతరం దుఃఖం దుఃఖ స్యానంతరం సుఖం ।*
*సుఖం దుఃఖం మనుష్యాణాం చక్రవత్ పరివర్తతే ।*
*యద్గతింతదతిక్రాంతం యది స్యాత్ తచ్చదూరతః ।*
*వర్తమానేన వర్తేత నస శోకేన బాధ్యతే ॥ (ఆచార...113/61-63)*

మునులారా! ఎవరూ ఎవరికీ పుట్టుకతోనే మిత్రులుగానీ శత్రువులు గానీ కారు. కారణంవల్లనే ఆ బంధాలేర్పడుతున్నాయి. ఈ 'మిత్ర' శబ్దం అక్షర రూపంలోనున్న రత్నమే. ఈ శబ్దం మనిషికి సుఖాన్ని కలిగిస్తుంది. ప్రాణికోటికి ప్రేమను కురిపించేవాడూ విశ్వాసాన్ని చూపించేవాడూ మిత్రుడొక్కడే. స్వార్థం లేని బంధం కూడా ఇదొక్కటేనేమో!

ఇంతకన్న పవిత్రమైన శబ్దం 'హరి'. ఈ శబ్దాన్నుచ్చరించేవాడు బట్టలు వేసుకొని బత్తాములు పెట్టుకొని బయటికి బయలుదేరినంత సుఖంగా మోక్షపదవినందడానికి లోకం నుండి పైకి వెళతాడు.

*సకృదుచ్చరితం యేన హరిరిత్యక్షర ద్వయం ।*
*బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ॥ (ఆచార... 114/3)*

అన్ని విధాలా తన తోటివాడేయైన మిత్రుని మీద వున్న నమ్మకం మనకి తల్లిదండ్రుల మీద భార్యాపుత్రుల మీద కూడా వుండదు. మిత్రత్వాన్ని శాశ్వతంగా నిలబెట్టుకోదలచు కున్నవారు ఒకరితో నొకరు జూదమాడకూడదు, ఆర్థిక లావాదేవీలు పెట్టుకోకూడదు, ఒకరి భార్యకింకొకరు దూరంగా వుండాలి.

మధుర పదార్థాల ద్వారా చిన్నపిల్లలనూ వినమ్రభావంతో సజ్జన పురుషులనూ, ధనం ఇస్తానని చెప్పి స్త్రీనీ, తపస్సు చేసి దేవతలనూ, చక్కని, కమ్మని మాట తీరును చూపించి (అనగా సద్వ్యవహార విశేషాన) సమస్తలోకాన్నీ వశపఱచుకోగలిగినవాడే నిజమైన పండితుడు.

కపటం ద్వారా మిత్రులనూ, పాపపు సొమ్ము ద్వారా ధర్మాన్నీ, ఇతరులను పీడించి ధనాన్నీ, పెద్దగా శ్రమించకుండా సుఖంగా విద్యనూ, కఠోర వ్యవహారం ద్వారా క్రూరంగా భయపెట్టి స్త్రీనీ వశం చేసుకోదలచినవాడు వివేకవంతుడు కాడు. ఇవేవీ తెలివైన పనులు కావు. ఆ కపటం, ఆ భయం, ఆ ధనం, ఆ బలం పోగానే ఆయా సంపదలూ పోతాయి.

పండ్లకోసం చెట్టును పెకలించేవాడు దుర్బుద్ధి. ఎంత ప్రయత్నమైనా చేసి పండ్లు కోసుకోవాలేగాని చెట్టుని నాశనం చేయడం అవివేకం.

నమ్మకూడని వానిని నమ్మకోకూడదు. లోకంలో అందరి నమ్మకాన్నీ వమ్ము చేసినవాడు తనకు మాత్రం నమ్మకస్తుడెలా అవుతాడు? ఆ మాటకొస్తే మిత్రుని కూడా అతిగా విశ్వసించరాదు.

*న విశ్వసే దవిశ్వస్తే మిత్రస్యాపి న విశ్వసేత్ ।*
*కదాచిత్ కుపితం మిత్రం సర్వం గుహ్యం ప్రకాశయేత్ ॥ (ఆచార...114/22)*

మిత్రునికి కోపం వస్తే మన రహస్యాలు బయటపెట్టే ప్రమాదముంది కావున ఎవరినీ నమ్మవద్దని సామాన్యులకు పెద్దలు చెప్తారు కానీ అన్ని ప్రాణులనూ విశ్వసించడం, అన్నింటి పట్లా సాత్త్వికభావాన్నే కలిగియుండడం, తమదైన సాత్త్విక స్వభావాన్ని యెల్లవేళలా సంరక్షించుకోవడం సజ్జన పురుషుల లక్షణాలు.

దరిద్రునికి 'గోష్ఠి' అనేది విషంతో సమానం. (గోష్ఠి అంటే నేటి పార్టీలిచ్చుట) అలాగే వృద్ధునికి నవయువతీ సంగమం, మిడిమిడి జ్ఞానంతో ఆపేసిన చదువు, అజీర్ణంగా నున్నపుడు చేసే విందు భోజనం కూడా విషంతో సమానాలే.

మనుష్యుని శరీరంలోకి రోగం ప్రవేశించడానికి ఆరు కారణాలుంటాయి. ఎక్కువగా నీరు త్రాగుట, అతిగా తినుట, ధాతు క్షీణత మలమూత్ర విసర్జనను తొందర తొందరగా కానిచ్చి వేయుట లేదా ఆపుకొనుట, పగటి నిద్ర, రాత్రి జాగరణ– వీటిలో ఒక్కటి చాలు...శరీరం లోకి రోగం ప్రవేశించడానికి.

తెల్లవారకుండానే వేసే ధూపం, అతిగా రతి, శ్మశానం పొగలను పీల్చుట, అగ్నిలో చేతిని పెడుతూ తీస్తూ ఆడుట, రజస్వలతో సంభాషణ – ఇవి దీర్ఘాయుష్కుల ఆయువునే తగ్గించే శక్తి కలిగి వుంటాయి. ఇలాగే ఆయువును నాశనం చేసేవి మరో ఆరున్నాయి: ఎండిన మాంసం, వృద్ధ స్త్రీ, బాలసూర్యుడు, రాత్రి పెరుగు సేవనం, ప్రభాతకాలంలో మైథునం మరియు నిద్ర.

అప్పుడే తయారైన నెయ్యి, ద్రాక్షపండ్లు, వయసులో నున్న స్త్రీ, పాలు, వేడినీరు, చెట్టు నీడ – వీటిని అనుభవించగానే ప్రాణశక్తి బలపడుతుంది. నూతినీరు, మఱ్ఱి చెట్టు నీడ శీతాకాలంలో వెచ్చగానూ వేసవిలో చల్లగానూ వుంటాయి. తైలమర్ధనం, సుందర భోజనం పొందగానే శక్తి కలుగుతుంది. మార్గాయాసం, మైథునం, జ్వరం తాత్కాలికంగా మనిషిని నీరసపెడతాయి.

మాసిన బట్టలు ధరించేవారు, పళ్ళు శ్రద్ధగా తోముకోనివారు, అధికంగా తినేవారు, కఠోరంగా మాట్లాడేవారు, సూర్యోదయ సూర్యాస్తమయ సమయాల్లో నిద్రించేవారు – సాక్షాత్తూ విష్ణు సమానులైనా సరే వారికడ లక్ష్మి నిలువదు.

*కుచైలినం దంతమలోపధారిణం*
*బహ్వాశినం నిష్ఠుర వాక్య భాషిణం ।*
*సూర్యోదయే హ్యస్త మయేఽ పిశాయినం*
*విముంచతి శ్రీరపి చక్రపాణిం ॥*

తన గోళ్ళతో గడ్డిని చీల్చువాడు, నేలపై వ్రాసే వాడు, కాళ్ళు కడుక్కోనివాడు, దంతాలను స్వచ్ఛందంగా ఉంచుకోనివాడు, నగ్నంగా శయనించువాడు, భోజన పరిహాసాల తిగా చేయువాడు, తన అంగాలపై ఆసనంపై మద్దెల కొట్టుకొనువాడు, కేశసంస్కారం చేసుకోనివాడు, ప్రాతస్సాయం సంధ్యలలో నిదురించువాడు, కుచైలుడు - ఇలాంటి వారి కడకూడా లక్ష్మి నిలువదు.

తలంటి విరళంగా పోసుకోవడం, పాదాలు అవసరం మేరకు కడుక్కుంటుండడం, వేశ్యను సంపూర్ణంగా వర్జించడం, శరీరమంతా శుభ్రంగా వుంచుకోవడం, అల్పంగానే తినడం, నగ్నతలేకుండా శయనించడం- ఈ పనులన్నీ చేయువాని వద్దకు లక్ష్మి వచ్చి చేరుతుంది.

బాలసూర్యుని తేజం, రగులుతున్న చితి యొక్క పొగ, వృద్ధ (తనకంటే పెద్ద) స్త్రీ సాంగత్యం, చీపురు నుండి వచ్చే దుమ్ము - ఇవన్నీ ఆయుక్షీణాలు.

ఏనుగు, గుఱ్ఱం, రథం, గోవు, ధాన్యంల నుండి రేగే ధూళి శుభకరమే కాని గాడిద, ఒంటె, గొఱ్ఱె, మేక నడిచినపుడు రేగే ధూళి అశుభకరం. ముఖ్యంగా ఆవు, ధాన్యము, పుత్రుని అంగముల నుండి వచ్చు ధూళి కల్యాణకారి, మహాపాతక వినాశిని.

దేన్నయినా చేటతో విసురుతున్నపుడు వచ్చే గాలి, గోటి నీరు, స్నానం చేశాక గుడ్డ దులిపినపుడు చిలికే జలం, తల వెంట్రుకల నుండి జారే నీరు, చీపురు ధూళి బహు చెడ్డవి. ఇవి ఆర్జిత పుణ్యాన్నంతటినీ నశింపజేయగలవు. బ్రాహ్మణునికీ, అగ్నికీ, గుఱ్ఱానికీ ఎద్దుకీ, ఇద్దరు బ్రాహ్మణులకీ, ఆలుమగలకి, యజమాని దంపతులకీ మధ్య నుండి వెళ్ళరాదు.

విశ్వసించకూడనివారిని అసలు విశ్వసించనేకూడదు. నమ్మదగినవారిని కూడడా అతిగా పూర్తిగా నమ్మకూడదు. దీనివల్ల అంటే నమ్మడం వల్ల ఒక విలక్షణమైన భయం పుట్టుకొస్తుంది. అది మన సుఖాలన్నింటినీ నాశనం చేస్తుంది. శత్రువుతో సంధి చేసుకోవచ్చు గానీ వానిపై విశ్వాసముంచుట చిటారుకొమ్మ మీద నిద్రపోవడం వంటిదే.

*నవిశ్వసే దవిశ్వస్తం విశ్వస్తం నాతి విశ్వసేత్ ।*
*విశ్వాసాద్భయముత్పన్నం మూలాదపి నికృంతతి ॥*

*వైరిణా సహసంధాయ విశ్వస్తో యది తిష్ఠతి ।*
*సవృక్షాగ్రే ప్రసుప్తోహి పతితః ప్రతిబుధ్యతే ॥ (ఆచార... 114/47,48)*

పడిపోయాకే తెలుస్తుంది పడిపోయానని.

అత్యంత కాఠిన్యమూ, అలవి మీరిన మెత్తదనమూ రెండూ తప్పే. బలహీన కాండములు గల మొక్కలను శ్రమలేకుండా నరకవచ్చు. మహావృక్షాలు ఒకపట్టాన లొంగవు.

మనం ఆహ్వానించకపోయినా దుఃఖాలు వస్తాయి; వాటంతటా అవే పోతాయి కూడ. సుఖాలు కూడా అంతే. సాధారణంగా సజ్జన పురుషులు సుఖపడతారు. దుష్టులకు దుఃఖాలు తప్పవు. కాబట్టి సజ్జనులుగానే జీవించాలి.

రహస్యం నాలుగు చెవుల మధ్యనే వుండాలి. ఆరో చెవి దాకా వెళితే అది రహస్యం కాబోదు. భవిష్యద్ వ్యూహాలూ రెండు చెవుల మధ్యనే అనగా ఒక మనిషి బుఱ్ఱలోనే వున్నంతకాలం అవి బ్రహ్మకు కూడా తెలియవు.

*షట్కర్ణో భిద్యతే మంత్రశ్చతుః కర్ణశ్చ ధార్యతే ।*
*ద్వికర్ణ స్యతు మంత్రస్య బ్రహ్మోప్యంతం నబుధ్యతే ॥ (ఆచార...114/54)*

పాలీయని, చూలు కట్టని ఆవు, విద్వాంసుడు, ధార్మికుడు కాని కొడుకు ఉండి మాత్రం లాభమేమి? చంద్రుడొక్కడే అయినా ఆకాశమంతా వెలుగొందునట్లు మహాపురుషుడైన కొడుకు వల్ల వంశమంతా వన్నెకెక్కుతుంది. తారలెన్ని వున్నా చంద్రుడే శోభస్కరుడు కుపుత్రులు వందమంది కంటె గుణవంతుడైన ఒక్క కొడుకే మేలు, చాలు.

*ఏకేనాపి సుపుత్రేణ విద్యాయుక్తేన ధీమతా ।*
*కులం పురుష సింహేన చంద్రేణ గగనం యథా ॥*

*ఏకేనాపి సువృక్షేణ పుష్పితేన సుగంధితా ।*
*వనంసువాసితం సర్వం సుపుత్రేణ కులం యథా ॥*

*ఏకోహి గుణవాన్ పుత్రో నిర్గుణేన శతేన కిం ।*
*చంద్రోహంతి తమాం స్యే కో నచ జ్యోతిః సహస్రకం ॥ (ఆచార...114/59)*

పిల్లలను అయిదేళ్ళ వయసొచ్చేదాకా ప్రేమ కురిపిస్తూ పెంచాలి. అక్కడి నుండి పదేళ్ళు వచ్చేదాకా అవసరమైతే దండించియైనా క్రమశిక్షణ నేర్పాలి. పదారేళ్ళదాకా విద్యాబుద్ధులు నేర్పి ఆ తరువాత వారిని మిత్రుల వలె సంభావించాలి.

కొందరి ముఖాలు పులిముఖాల వలెనున్నా వారు సాత్త్వికులు కావచ్చు. కొందరి ముఖాలు లేడి ముఖాల వలె అమాయకంగా వున్నా వారు క్రూరులూ కావచ్చు. అందుచేత పైపై చూపులతో ఎవరినీ విశ్వసించరాదు.

క్షమించే లక్షణం వున్నవారిలో అది దోషం కూడా కావచ్చు. ఎందుకంటే జనులు వారు అసమర్థులనుకుంటారు.

*ఏకః క్షమావతాం దోషో ద్వితీయో నోప పద్యతే ।*
*యదేనం క్షమయా యుక్తమశక్తం మన్యతే జనః ॥*

ఈ ప్రపంచంలోని భోగాలన్నీ క్షణభంగురాలేనని శాస్త్రాలు వక్కాణిస్తున్నాయి. కాబట్టి అనుభవించవచ్చు గాని ఆరాటపడరాదు. విద్వాంసుడెపుడూ ఆకర్షణకు లోను కాడు.

అన్న పితృసమానుడే. నాన్న చనిపోతే ఆ కుటుంబానికి అన్నే దిక్కవుతాడు. తమ్ముళ్ళందరినీ పైకి తెచ్చి వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళునిలబడేలా చేసే అన్న నాన్నే కాదు దేవుడితోసమానుడవుతాడు. కాబట్టి అన్నను దేవునివలె చూసుకొనేవాడే నిజమైన మనిషి.

తక్కువ బలం కలవారిని తక్కువగా చూడకూడదు. వారు ఒక బృందంగా ఏర్పడితే ఏమైనా చేయగలరు. గడ్డి పరకలతో నేసిన తాడు ఏనుగునే బంధించగలుగుతున్నది కదా!

ఒకరిని దోచి ఇంకొకరికి దానం చేయువానికి ఆ దానం సద్గతి నివ్వదు. దోపిడీలు చేసిన పాపానికి వాడు నిస్సందేహంగా నరకానికే పోతాడు. దేవతల, బ్రాహ్మణుల ధనాన్ని అపహరించినా, వారిని తిరస్కారంగా చూసినా వంశం వృద్ధికాదు. బ్రహ్మహత్య, మద్యపానం వంటి మహాపాతకాలకు కూడా ప్రాయశ్చిత్తముంది కాని సజ్జనుల వద్ద ఉపకారాన్ని పొంది వారికే కీడు చేసే కృతఘ్నులకు నిష్కృతి లేదు.

పొరపాటున కూడా దుష్టునీ, శత్రువునీ ఉపేక్షించకూడదు. వాళ్ళు అల్పులే, పరవాలేదు అనుకోకూడదు. చిన్న నిప్పురవ్వే బ్రహ్మాండమును భస్మము చేయగలదని మరువరాదు.

యౌవనంలో కూడా శాంతంగా వుండగలవాడే నిజమైన శాంత స్వభావి. అన్నీ అయిపోయినవాడూ, శక్తులన్నీ ఉడిగిపోయినవాడూ శాంతుడు కాక చేసేదేముంటుంది?

*నవే వయసి యఃశాంతః సశాంత ఇతి మేమతిః ।*
*ధాతుషుక్షీయమాణేషు శమః కస్య న జాయతే ॥* **(ఆచార... 114/73)**

సంపదలన్నీ భగవంతుడివీ, ఆయన ప్రసాదించిన ప్రకృతివీనీ.

'ఈ సంపదంతా నాది' అని ఏ మనిషీ భ్రమపడరాదు. ***(అధ్యాయాలు-113, 114)***

# నీతిసారం

వివేకవంతుడు, నీతిజ్ఞుడు అయినవాడు గుణహీన పత్నినీ, దుష్టమిత్రునీ, దురాచారియైన రాజునీ, కుపుత్రునీ, గుణహీనకన్యనీ, కుత్సిత దేశాన్నీ దూరం నుండే పరిత్యజిస్తాడు.

కలియుగంలో ధర్మం మానవ సమాజం నుండి దూరంగా పారిపోతుంది. తపస్సులో స్థిరత వుండదు; మానవుల హృదయాలకు సత్యం దూరమైపోతుంది. మనుష్యులు కపట వ్యవహారమగ్నులై బతికేస్తుంటారు; బ్రాహ్మణులు ఆశపోతులైపోయి ధనదాహంతో మసలుతుంటారు; పురుషులు స్త్రీల అడుగులకు మడుగులొత్తడమే తమ జీవిత పరమార్థంగా భావిస్తారు; స్త్రీలు తమ మనస్సును, బుద్ధిని స్థిరంగా పెట్టుకోలేకపోయినా తెలివితేటల, అందచందాల ఆసరాతో లోకాన్నే ఒక ఆట ఆడిస్తుంటారు.

కాబట్టి ఈ కలికాలంలో నీచ ప్రవృత్తి గల వారే పెద్ద పెద్ద పదవులలోకి వచ్చి దేశాన్నేలుతూ మొత్తం లోకాన్నే భ్రష్టు పట్టించడంతో సుజనులకు సామాన్య జీవనం కూడా మిక్కిలి కష్టసాధ్యమైపోతుంది. పోయినవాళ్ళే ధన్యులనిపిస్తుంది. ఉన్నవాళ్ళు పోయిన వారికి తీపి గురుతులు కాకుండా చేదు జ్ఞాపకాలుగా మిగులుతారు. ఎప్పటికప్పుడే 'ఆహా! మృతులెంత అదృష్టవంతులో కదా!ఈ అరాచకాన్నీ, ఈ దేశం ముక్కలైపోడాన్ని,ఈ సమాజం సర్వభ్రష్ఠత్వాన్ని, పరాసక్తలైన పత్నులనీ, దురాచారాసక్తులైన పుత్రులనీ చూడకుండానే పోయారు. వారు ఏ లోకంలో వున్నా ఈలోకంలోని మనకంటే సుఖంగానే వుండివుంటారు. అని వృద్ధులంతా తమలో తాము, తమతోతాము సంభాషించుకొంటుంటారు.

కొడుకు చెడిపోతే తల్లిదండ్రులకు దానికి మించిన నరకయాతన లేదు. అలాగే దురాచారిణియైన స్త్రీకి ప్రేమ వుండదు. కాబట్టి ఆ కుటుంబంలో ఒక్కరికీ సుఖమూ వుండదు. దుర్జనుడైన మిత్రుని ఎలాగూ నమ్మలేము కదా! నమ్మకం లేని చోట సుఖమెట్లా వుంటుంది? ఇక రాజ్యంలో దుష్టులంతా కలిసి దుష్టశాసనాలనే ప్రజలపై రుద్దుతూ పోతుంటారు కాబట్టి ప్రభుత్వం చేత ప్రేమింపబడుతున్న ఏ పాతికశాతం మందో సుఖపడతారు. వారే ఈ శాసనకర్తలను నిలబెడతారు కూడ. మిగతావాళ్ళు ఈ దేశంలో పుట్టించినందుకు దేవుణ్ణి తిట్టుకుంటూ ఎలాగో బతికేస్తుంటారు. ఎక్కువమంది ఇతరులపై ఆధారపడి బతికేస్తుంటారు. పరాన్నభుక్కు ఇంద్రుడైనా సరే వాని ఐశ్వర్యం చేజారిపోతుంది.

*పరాన్నంచ పరస్వంచ పరశయ్యాః పరస్త్రియః ।*
*పరవేశ్మని వాసశ్చ శక్రాదపి హరే చ్ఛ్రియం ॥* (ఆచార.... 115/5)

ఒక కుండలోని నీటిని ఇంకొక కుండలోని నీటితో కలిపినట్లు అంటురోగం కన్నను వేగంగా పాపం ఒకరినుండి ఒకరికి అంటుకుంటుంది. పాపితో నిత్యం మాట్లాడుతూ, శరీరాన్ని తగులుతూ, కలిసి తిరుగుతూ, తోడుగా భోంచేస్తూ, ఒకే ఆసనంపై, శయ్యపై మెలగుతూ ఒకే చోటికి వస్తూ పోతూ మంచివారెవరైనా ఎందరైనా సహజీవనం చేయవలసివస్తే ఆ పాపాత్ముడు మంచివాడు కాడు గానీ ఈ పుణ్యాత్ములంతా పూర్తిగా చెడిపోయి దురాత్ములై పోతారు. ఈ రకమైన సహజీవనం కలియుగంలో తప్పనిసరి.

*స్త్రియో నశ్యంతిరూపేణ తపః క్రోధేన నశ్యతి ।*
*గావో దూర ప్రచారేణ శూద్రా న్నేన ద్విజోత్తమః ॥ (ఆచార... 115/7)*

అందం వల్ల ఆడది చెడగా, క్రోధం వల్ల తపస్సు తగలబడిపోతుంది. దూర ప్రయాణాల వల్ల గోవులు దూరం కాగా, ★శూద్రాన్నంవల్ల ఎంతటి ద్విజోత్తములైనా దిగజారిపోతారు.

పిల్లల, శిష్యులపట్ల బాధ్యతకు బదులుగా అతి గారాబం, స్వార్థం, చోటు చేసుకోవడం వల్ల కలియుగంలో తల్లిదండ్రుల, గురువుల ప్రవర్తన కారణంగా యువతరానికి సరైన దిశా నిర్దేశం లేకపోతుంది. వృద్ధాప్యంలో మానవులకి నడక ఎక్కువవుతుంది. స్త్రీకి సంభోగం లుప్తమవుతుంది. పర్వతాలకు నీటి దెబ్బ తగులుతుంది. బట్టలు ఎక్కువ కాలం ఎండలో వుండడం వల్ల చివికిపోతాయి.

నీచుడైన వ్యక్తి ఇతరులతో గొడవ పడడానికే ప్రయత్నిస్తుంటాడు. మధ్యముడు ఎక్కువగా సంధికోసమే ప్రయత్నిస్తుంటాడు. ఉత్తముడు గొడవపడడు. గౌరవాన్ని ఇచ్చిపుచ్చుకుంటాడు. మహాపురుషులకు మానమే ధనముకదా! సన్మానమే వుంటే ఇక ధనమెందుకు? మానమూ దర్పమూ నశించినవానికెంత ధనముండి ఏమి లాభము? వాడు జీవించుట మాత్రము దేనికి? మాన, స్వాభిమాన యుగళము లేక ధన, ఆయుర్యుగళ ముండీ లేనట్లే కదా!

నీచ ప్రకృతి గలవాడు ధనాన్నే కోరుకుంటాడు. మధ్యముడు ధన, మానాలు రెండూ కావాలంటాడు. ఉత్తముడు గౌరవాన్ని మాత్రమే అభిలషిస్తాడు.

---

*★ఇక్కడ శూద్రాన్నం అంటే ఏ వెనుకబడిన కులంవారో,ఇప్పటి భాషలో, వండిపెట్టిన అన్నం కాదు. అది మూర్ఖపుటాలోచన. మడీ, తడీ, శుచీ శుభ్రతా లేని అన్నమే అప్పటి భాషలో శూద్రాన్నము. గొడ్డుకారము, గుప్పెడు ఉప్పు కలిసినది శూద్రాన్నము. నీచుతో నిండినది శూద్రాన్నము. అలాగే ద్విజులనగా బ్రాహ్మణులు మాత్రమే కారు. ఇలా ఎందుకు చెప్పవలసివస్తుందంటే ఈ 'శూద్ర' శబ్దాన్ని చూపించి పరదేశీయులు, వారి మానసపుత్రులు కపట వ్యూహరచన చేసి ఒక పథకం ప్రకారం గ్రంథాలు వ్రాసి, ఉపన్యాసాలిస్తూ ఇప్పటికే ఈ సమాజాన్ని విడగొట్టేయడంలో చాలావరకు విజయం సాధించారు.*

*అధమాధన మిచ్ఛంతి ధనమానౌహి మధ్యమాః ।*
*ఉత్తమా మానమిచ్ఛంతి మానోహి మహతాం ధనం ॥* **(ఆచార 115/13)**

అడవిలోని సింహానికెంత ఆకలేసినా ఇతర జంతువులచే చంపబడిన జంతు లేక నరమాంసాన్ని తినదు. ఉత్తమ వర్ణుడైన వ్యక్తి ధనహీనుడైపోయినా నీచకర్మను చేపట్టడు. వనంలో సింహాన్ని అభిషేకించకపోయినా అది మృగరాజే. సమాజంలో ఉత్తమునికి గౌరవ మర్యాదలూ అలాగే లభిస్తాయి.

*నాభిషేకో న సంస్కారః*
*సింహస్య క్రియతే వనే।*
*నిత్య మూర్జిత సత్త్వస్య*
*స్వయమేవ మృగేంద్రతా ॥*

బద్ధకస్తుడైన వర్తకుడు, అహంకారియైన సేవకుడు, కటువుగా మాట్లాడే వేశ్యా తమ వృత్తులలో రాణించలేరు.

దరిద్రుడై వుండీ దాత కావాలనే కోరికా, ధనికుడై యుండీ పీనాసితనమూ, అతి గారాబం చేసి కొడుకుని చెడగొట్టుకోవడమూ, మంచివాడై వుండి దుష్టులను సేవించడమూ, ఇతరులకి కీడు చేస్తూ చనిపోవడమూ మనిషిని దుశ్చరిత్రుని చేసే పంచలక్షణాలు.

*దాతా దరిద్రః కృపణో- ర్థయుక్తః పుత్రో- విధేయః కుజనస్యసేవా ।*
*పరాపకారేషు నరస్య మృత్యుః ప్రజాయతే దుశ్చరితాని పంచ ॥*

*కాంతా వియోగః స్వజనాప మానంఋణస్యశేషః కుజనస్యసేవా ।*
*దారిద్ర్య భావాద్విముఖాశ్చ మిత్రా వినాగ్నినా పంచదహంతి తీవ్రాః ॥*

**(ఆచార 115 -17,18)**

అలాగే అగ్ని అవసరం లేకుండానే మనిషిని తీవ్రంగా దహించి పడవేసేవి అయిదుంటాయి. అవి పత్నీవియోగం, స్వజనులే చేసే అవమానం, మిగిలిపోయిన ఋణం, దుర్జనులను సేవించవలసిరావడం, ధనహీనత వల్ల మిత్రులు పెడమొగమై పోవడం.

మనిషికి అనేక సహస్ర చింతలుంటాయి గానీ వాటిలో నాలుగు మాత్రం తీక్ష్ణమైన కత్తివాదరలాగా మనసును కోసివేస్తుంటాయి. అవి నీచుడిచే అవమానింపబడడం, ఆలి ఆకలి, అనురాగం లేని ఆలు, ముఖ్యమైన ప్రాణాధార కార్యాలకు కలిగే అవరోధాలు.

అనుకూలురైన కొడుకులు, ధనాన్ని సమకూర్చిపెడుతున్న విద్య, ఆరోగ్యం చెడని శరీరం, సత్సంగినీ మనోజ్ఞను కూలావశవర్తినీయైన భార్య ఈ పంచ భాగ్యాలూ పురుషుని దుఃఖాలన్నిటినీ దూరం చేస్తాయి.

లేడి, ఏనుగు, కీటకం, తుమ్మెద, చేప - ఈ అయిదూ క్రమంగా శబ్ద, స్పర్శ, రూప, గంధ, రసాలను ప్రమాదకరస్థాయిలో ఇష్టపడి సేవించి పీకలమీదికి తెచ్చుకుంటాయి. ఈ సంగతి తెలిసి కూడా ఈ అయిదింటినీ ఇంద్రియ నిగ్రహం లేకుండా సేవించి సర్వజ్ఞుడనని చెప్పుకునే మనిషి కూడా నష్టపోతుంటాడు.

*కురంగమాతంగ పతంగ భృంగ*
*మీనా హతాః పంచభిరేవ పంచ ।*

*ఏకః ప్రమాదీ స కథం నఘాత్యో*
*యః సేవతే పంచభిరేవ పంచ ॥* **(ఆచార 115/21)**

బృహస్పతితో సమానంగా చదువుకున్న బ్రాహ్మణులైనా ఈ అయిదుపనులనూ చేయరాదు. అవి ఏవనగా ధైర్యాన్ని కోల్పోవడం, కటువుగా ధుమధుమలాడుతూ వుండడం, గమ్యం లేకుండా జీవించడం, మలిన వస్త్రాలనే ధరించడం, అనాహూతంగా అంటే ఎవరూ పిలవకపోయినా సంబరాలకూ పెళ్ళిళ్ళకూ పోవడం. ఈ పనులలో ఒక్కటి చేసినా బ్రాహ్మణునికి పూజించేవారూ, గౌరవించేవారూ మిగలరు.

ఆయువు, కర్మ, ధనం, విద్య, మృత్యువు ఈ పంచాంశాలూ మనం పుట్టినపుడే నిశ్చితమైపోతాయి. మనం చేయవలసినదల్లా వాటిని మెరుగుపరుచుకొని జీవించడమే. భగవంతుని దయవుంటే మృత్యువు అనాయాసం కావచ్చు. ఆయువు ఆరోగ్యమయం కావచ్చు.

*ఆయుః కర్మ చ విత్తం చవిద్యా నిధనమేవచ ।*
*పంచైతాని వివిచ్యంతే జాయమానస్య దేహినః ॥* **(ఆచార...115/23)**

మబ్బునీడ, దుష్టుని ప్రేమ, పరనారితోడు, యౌవనం, ధనం - ఈ అయిదూ అస్థిరాలు. మనిషికి సంబంధించినవన్నీ, ధర్మకీర్తులు తప్ప, అస్థిరాలే.

*అభ్రచ్ఛాయాఖలే ప్రీతిః పరనారీషుసంగతిః ।*
*పంచైతే హ్యస్థిరాభావా యౌవనాని ధనానిచ ॥*

*అస్థిరం జీవితం లోకే అస్థిరం ధనయౌవనం ।*
*అస్థిరం పుత్ర దారాద్యం ధర్మః కీర్తిర్యశః స్థిరం ॥* **(ఆచార..115/25,26)**

నూరేళ్ళ జీవితం గొప్పనుకుంటాం కానీ ఈ నూరేళ్ళూ దేనికీ చాలదు. ఇందులో సగభాగం నిద్రలోనే గడచిపోతుంది కదా! మిగిలిన దానిలో సగభాగం వ్యాధి, దుఃఖం, వృద్ధాప్యం లచే తినివేయబడుతుంది. ఇక మిగిలిన దానిలోనే బాల్యము, ఇష్టజన వియోగ దుఃఖము లాంటి వన్నీ వుంటాయి కదా! ఇక జీవిక అనగా కొలువు. తిండికోసం పనిచేసే

సమయం, దానిలోని సాధకబాధకాలు ఆ మిగతా సమయాన్ని మింగివేస్తాయి. కాబట్టి మనకి ఉన్న సమయంలోనే ధర్మాన్ని దైవకర్మాల్నీ ఆచరించాలి. అంతేకాని, దానికి 'చాలా వేళ వుందిలే' అనుకోకూడదు. అని ఊరుకోకూడదు. సర్పం వాయువుని మింగేస్తున్నట్టు మృత్యువు ప్రతిక్షణం ఆయువును తినేస్తుంటుంది. అందుకనే మనం వయసు పెరుగు తోందని సరదాపడిపోకుండా ఆయువు తరుగుతోందని జాగ్రత్తపడాలి. 'యవ్వనవేళ' లోనే ఆధ్యాత్మికత వైపు మళ్ళాలి.

మనిషికీ పశువుకీ గల ముఖ్యమైన తేడా ఏమిటంటే నడుస్తున్నా, ఆగివున్నా, మేలు కొనివున్నా, నిద్రలోనైనా లోకహితాన్ని గురించే ఆలోచించడం మనిషి ధర్మం.ఆ ప్రసక్తే లేనిది పశుధర్మం. తన తిండి తాను తింటూ తన కోసం, తన పరిధిలోని జనాలకోసం మాత్రమే ఆలోచిస్తూ బతికేవాడికీ పశువుకీ పెద్దగా తేడా వుండదు. పశువు కూడా పిల్లలకి పాలిస్తుందిగా!

*గచ్ఛ తస్తిష్ఠతో వాపి జాగ్రతః స్వపతో నచేత్ ।*
*సర్వసత్త్వ హితార్థాయ పశోరివ విచేష్టితం ॥*

హితమేదో కానిదేదో తెలియకుండానే గొప్ప వాడైపోయి, వేద, పురాణ, శాస్త్ర చర్చలవేళల్లో తర్క- వితర్కాలను రెచ్చిపోయి చేసేస్తూ, తన కడుపు నిండగానే తనివితీరి పోయిందనుకునే వాడికీ పశువుకీ ఏమి తేడా వుంది? వీడు వాగుతాడు, అది వాగలేదు. వీనిలో ఏ వైశిష్ట్యమున్నదని వీనిని పశువుకంటె భిన్నుడనుకోవాలి.

పరాక్రమం, విద్య, అర్థలాభములతో బాటు తపస్సు, దానబుద్ధి కూడా గలవాడై ప్రపంచంలో కీర్తి సంపాదించనినాడు ఆ మనిషికీ ఆతని మాత విసర్జించే మలానికీ, సమాన ప్రయోజనమే వుంటుంది. విజ్ఞానము, పరాక్రమం, యశము, అక్షుణ్ణ సమ్మానయుక్తమునగు జీవితాన్నెవడైతే ఒక ఏడాదిపాటైనను గడపగలడోవాడే మనిషిగా బతికినట్లు విజ్ఞులు గుర్తిస్తారు. వానిది భాగ్యవైభవము, వాని దవంధ్య జీవనము అంటూ కవులు కీర్తిస్తారు.

కాకివలె బతికి ఏమి లాభం? హంస వలె గానీ సింహమువలె గానీ జీవించవలె. కాకి పెంటను తిని బతుకుతుంది. ఎన్నేళ్ళయినా వుంటుంది. ధర్మంగా ధనాన్ని సంపాదించి గురువులనూ, భృత్యులనూ ధనంతో కంటె ప్రేమతో కట్టిపడవేయ గలిగినవానిదే మానవ జీవనమవుతుంది. మనిషికి ముందు తన పట్ల తనకి గౌరవ భావముండాలి. ఆత్మాభిమాన ముండాలి గాని అహంకారముండకూడదు. భూతదయ లేనివాడు, మిత్రులకు మంచి పనులలో పెద్ద మనసుచేసుకొని సాయపడనివాడు ఎంత ధనవంతుడైనా సరేవాడు పోయిన

నాడు ఊరి ప్రజలు 'మొన్న ఒక కాకి పోయింది. నేడు ఈయన పోయాడు. ఊరికి ఒరిగిందీ లేదు తరిగిందీ లేదు' అనుకుంటే వాడి పుట్టుకలోనే అర్థం లేదు.

*యో వాత్మనీహ నగురౌ నచ భృత్యవర్గే*
*దీనే దయాం నకురుతే నచ మిత్ర కార్యే ।*
*కిం తస్య జీవిత ఫలేన మనుష్యలోకే*
*కాకో-పి జీవతి చిరం చ బలించ భుంక్తే ॥*
*స్వాధీన వృత్తేః సాఫల్యం న పరాధీన వర్తితా ।*
*యే పరాధీన కర్మాణో జీవంతో-పి చతే మృతాః ॥*

స్వాతంత్ర్యమే స్వర్గలోకం. పరాధీనులై జీవించువారు మృతకల్పులు ***(ఆచార.. 125/35,37)***

ఈ సమాజంలో ఒక క్షణంలో పుట్టి మరొక క్షణానికే కనబడక మాయమైపోయే క్షణభంగురాలు చాలానే వున్నాయి. వాటిని నమ్ముకొనరాదు.

ఆకాశాన్ని కమ్ముకునే మబ్బునీడా, గడ్డిమంటా, నీచుడి సేవాభావం, దారిలో కనిపించే నీరూ,వేశ్యలకు ప్రేమా, దుష్టుని మనసులో పుట్టే ప్రీతీ ఈ ఆరూ క్షణభంగురాలు. మబ్బుల్లో నీరు చూసి ముంత ఒలకబోసుకోరాదు. అలాగే మిగతా వాటినీ నమ్మరాదు.

*అభ్రచ్ఛాయా తృణా దగ్నిర్నీచసేవా పథోజలం ।*
*వేశ్యారాగః ఖలే ప్రీతిః షడేతే బుద్బుదోపమాః ॥* ***(ఆచార.. 115 -39)***

బాల్యం తీరిన తరువాత నోరుపెట్టినా ఎవరూ పడరు. గౌరవం నోటిని బట్టి రాదు. బాలురకు మాత్రం రోదనమే బలం.నిర్బలులకు రాజే బలం. మూర్ఖునకు మౌనం బలం. దొంగకి అసత్యమే బలం. మనిషి శాస్త్రజ్ఞానాన్ని సంపాదిస్తున్న కొద్దీ వాని బుద్ధి వికసిస్తూ వుంటుంది. మరింత జ్ఞానాన్ని సంపాదించాలనిపిస్తుంది. అలాగే మనిషి జగత్కల్యాణం వైపు మనసును మళ్ళించగానే కొన్ని పనులు చేయడం ద్వారా కీర్తి లభించి, మనసు విశాలమై మరిన్ని మంచిపనులు చేయాలనిపిస్తుంది. అందుకే మంచి పని చేయాలనే ఆలోచన వచ్చిన ఉత్తరక్షణంలోనే దానిని అమలులో పెట్టెయ్యాలి.

*యథాయథా హి పురుషః శాస్త్రం సమధి గచ్ఛతి।*
*తథా తథా స్యమేధా స్యాద్వి జ్ఞానంచాస్య రోచతే ॥*
*యథా యథా హి పురుషః కల్యాణే కురుతే మతిం ।*
*తథా తథా హి సర్వత్ర శ్లిష్యతే లోక సుప్రియః ॥* ***(ఆచార..115/42,43)***

లోభం ఎలాగూ మంచిదికాదు. ఒక్కొక్కప్పుడు చిన్నపొరపాట్లు, గట్టి నమ్మకము కూడా ప్రమాదిస్తాయి. కాబట్టి ఈ మూడింటి విషయంలో జాగ్రత్త అవసరం. భయం కూడా అలాటిదే. ఏదైనా ఆపద వస్తుందేమోనని భయపడి జాగ్రత్తగా వుండడం మంచిదేకాని ఆపద వచ్చేశాక మాత్రం భయాన్ని పూర్తిగా పరిత్యజించి ఆపదను ధైర్యంగా ఎదుర్కోవాలి.

ఋణశేషం అగ్నిశేషం వ్యాధిశేషం ఉంచినకొద్దీ ఋణాగ్ని వ్యాధులు పెరిగిపోతునే వుంటాయి. కాబట్టి వాటిని పూర్తిగా తుడిచిపెట్టాలి.

*ఋణశేషం చాగ్నిశేషం వ్యాధిశేషం తథైవచ ।*
*పునః పునః ప్రవర్ధంతే తస్మాచ్ఛేషం న కారయేత్ ॥* **(ఆచార..115/46)**

మనతో కలిసి వుండి మిత్రుని వలె నటిస్తూ మన పరోక్షంలో మన పనులన్నిటినీ తన స్వార్థం కోసం చెడగొట్టేవానిని అసలు విషయం తెలియగానే తన్ని తగిలెయ్యాలి. మాయావియైన శత్రునివలె.

*పరోక్షే కార్య హంతారం ప్రత్యక్షే ప్రియవాదినం ।*
*వర్జయేత్ తాదృశం మిత్రం మాయామయ మరింతథా॥* **(ఆచార115/48)**

సుందరమైన స్వచ్ఛమైన నీటిలో మాలిన్యాన్ని పోస్తే తాగడానికి పనికిరాకుండా పోతుంది. అలాగే దుష్టునితోడి సాంగత్యం వల్ల మంచివాడు చెడిపోతాడు. (అటునుంచి ఇటుకాదు)

*దుర్జనస్యహి సంగేన సుజనోఽపి వినశ్యతి ।*
*ప్రసన్నమపి పానీయం కర్దమైః కలుషీకృతం ॥*

ధనాన్ని బ్రాహ్మణునికి దానం చేస్తేనే ఆ ధనం సద్వినియోగ మయిందనుకోవాలి. అంతేగాక సాధ్యమయినంతగా బ్రాహ్మణులను సర్వవిధాలా సన్మానించుకోవాలి. బ్రాహ్మణులు తినగా మిగిలినదానిని తినుటయే ఉత్తమ భోజనకర్మ అనబడుతుంది. పాపము చేయనివాడే బుద్ధిమంతుడు. హితము చెప్పి చేయువాడే మిత్రుడు. దంభరహితంగా, అనగా డాబు దప్పాలతో గొప్పలు చెప్పుకోకుండా ఆచరించే ధర్మమే వాస్తవిక ధర్మాచరణం.

*తద్భుజ్యతేయ ద్విజ భుక్తశేషం*
*సబుద్ధిమాన్ యోన కరోతిపాపం ।*

*తత్ సౌహృదం యత్క్రియతే పరోక్షే*
*దంభైర్వినాయః క్రియతే స ధర్మః ॥*

వృద్ధజనులు లేని సభ సభేకాదు. ధర్మోపదేశం చేయని వృద్ధుని వృద్ధునిగా పరిగణించరు. సత్యము నిముడ్చుకోని ధర్మము ధర్మమూ కాదు, కపటంతో నిండిన సత్యం సత్యమూ కాదు. కపటసత్యమనగా ఒక మనిషి చేసిన మంచిపనిని మన వాదనా పటిమతో కపట వ్యూహరచనాశక్తితో చెడ్డపనిగా నిరూపించి మనము లాభము పొందునట్టిది. ఇక్కడ మనం చెప్తున్నది సత్యమేకాని వక్రించి చెప్తాం.(ఉదాహరణకి పరశురాముడు కర్ణుని శపించడం సత్యమే. కాని కర్ణుడు బ్రాహ్మణుడు కాడు కాబట్టి శపించేశాడని చాలమంది అనేస్తున్నారు. పరశురాముడు బ్రాహ్మణులకే విద్య చెప్తానని 'బోర్డు' పెట్టుకొని కూర్చొనలేదు. భీష్మునికి పరశురాముడే గురుదేవుడు. ఆయన బ్రాహ్మణుడు కాదు కదా! పరశురాముడు కర్ణుని, అబద్ధమాడి మోసం చేసి విద్యను సంగ్రహించాడని కోపించి శపించాడు. కర్ణుడు శపింప బడడంసత్యమే. ఆతడు ఇతరులతో చెప్పుకున్నది మాత్రం కపటసత్యం. ఏకలవ్యుని విషయంలో కూడా ఇలాంటి కపట సత్యాలెన్నో జనశ్రుతిలో వున్నాయి. విశ్వనాథ పావని శాస్త్రిగారి 'ఆచార్య దాక్షిణ్యం' అనే నాటకం చదివితే ఆ కపట సత్యాలన్నీ కాలి బూడిదై పోతాయి.

*నసాసభాయత్ర న సంతివృద్ధాః*
*వృద్ధా నతే యేన వదంతి ధర్మం ।*
*ధర్మః సనోయత్ర న సత్యమస్తి*
*నైతత్ సత్యం యచ్ఛలే నానువిద్ధం ॥* **(ఆచార.. 115/52)**

మనుష్యులలో బ్రాహ్మణులు (అంటే కులం కాదు వర్ణధర్మం మాత్రమే) తేజస్సులో ఆదిత్యుడు, శరీరంలో శిరస్సు, వ్రతాలలో సత్యవ్రతం శ్రేష్ఠతమాలు.

మనస్సుకి ప్రసన్నతనిచ్చేదే మంగళకరం, శుభం. ఇతరుల సేవకై సమర్పింపబడేదే నిజమైన జీవనం. ధనం అందరికీ ఉపయోగపడినపుడే దానికి సార్థక్యముంటుంది. సమర భూమిలో శత్రువుకెదురుగా నిలబడిచేసే గర్జనయే వాస్తవిక గర్జన. మదోన్మత్తత లేని స్త్రీయే శ్రేష్ఠవనిత. జితేంద్రియుడే నిజమైన పురుషుడు.

ఎంత గొప్ప రాజ్యైశ్వర్యాలైనా బ్రాహ్మణుని శాపంతగిలితే నశించిపోతాయి. ఎంత గొప్ప బ్రాహ్మణ తేజమైనా పాపాచార భూయిష్ఠమైతే నశించిపోతుంది. అశిక్షిత గ్రామంలో

నివసించే బ్రాహ్మణుని సదాచారం సమాప్తమైపోతుంది. అలాగే దుష్ట స్త్రీల వంశం మిగలకుండా పోతుంది.

సంగ్రహానికి క్షయమూ, ఉత్కర్షకి పతనమూ, సంయోగానికి వియోగమూ, జీవనానికి మృత్యువూ అంతాన్ని తెస్తాయి. మరణమృదంగాన్ని వాయిస్తాయి.

రాజులేని రాజ్యంలోగాని అనేక రాజులున్న రాజ్యంలోగాని నివాసముండకూడదు. అలాగే ఆడపెత్తనం, బాలురకే అధికారం వున్న ఆవాసాలూ త్యాజ్యాలే.

***పితారక్షతి కౌమారే***
***భర్తా రక్షతి యౌవనే।***
***పుత్రస్తు స్థవిరే కాలే***
***నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి॥*** ★ ***(ఆచార.. 115/63)***

డబ్బే ప్రాణమైన వానికి మిత్రులు, బంధువులు మిగలరు. స్త్రీ వ్యసనం కానీ, ఇతర వాంఛలు కానీ విపరీతంగా నున్న వానికి సిగ్గూ, భయమూ వుండవు. చింతామగ్నునికి అనగా నిత్యం బాధలూ వాటి ఆలోచనలే గల వానికి సుఖమూ, నిద్రా రావు. ఎంత తిన్నా ఆకలి తీరని వానికి బలం, తేజం నిలబడవు.

***అర్థాతురాణాం న సుహృన్న బంధుః***
***కామాతురాణాం న భయం న లజ్జా।***
***చింతాతురాణాం న సుఖం న నిద్రా***
***క్షుధాతురాణాం న బలం న తేజః॥*** ***(ఆచార..115/67)***

తన బాధలూ, వాటికి సంబంధించిన ఆలోచనలూ ఉన్నవానికే కాదు దుష్టునికీ ఇతరుల ధనాన్ని అపహరించడంలో విపరీతాసక్తి గలవానికి కూడా నిద్ర పట్టదు. పరకాంతా సక్తునికీ నిద్రపట్టదు. దోషికి నిద్రపట్టదు. ఋణమూ, రోగమూ లేనివాడూ, ఆడదాని జోలికే పోనివాడూ మాత్రమే నిద్రనొక భోగంలాగ అనుభవించ గలరు.

కమలానికి జలంలో నిలబడివున్నంత కాలమే వరుణ, సూర్యదేవుల స్నేహం లభిస్తుంది. పడిపోతే ఏమీలేదు. ఎవరూ లేరు. మనిషైనా పదవిలో నున్నపుడే అంతా

★*ఈ శ్లోకానికి దుష్ట వ్యాఖ్యానాలెక్కువైపోయాయిగానీ, పురాణకారుని ఉద్దేశ్యం కుసుమకోమలాంగియగు స్త్రీకి రక్షణ అవసరమని మాత్రమే.*

మిత్రత్వాన్ని పాటిస్తారు.దిగిపోయిన తరువాత ఎవరూ పట్టించుకోరు. ఆ అయ్యగారి సౌభాగ్యాలు అధికారాంతంలో చూద్దామన్నా మిగలవు. పైగా పదవిలో నున్నపుడు ఆయన చేసిన పనులకి ఇప్పుడు శత్రువులు బయట పడుతుంటారు. కేశములూ, దంతములూ, గోళ్ళూ శరీరంపై నున్నంతకాలమే గదా, వాటికి విలువ!

*స్థానా స్థితాని పూజ్యంతే పూజ్యంతే చ పదేస్థితాః ।*
*స్థానభ్రష్టా న పూజ్యంతే కేశా దంతా నఖా నరాః ॥ (ఆచార.. 115/73)*

తమ తమ నెలవులు దప్పిన తమ వారే శత్రులగుట తథ్యము కదా!

వర్ణం, వంశం, దేశం, స్నేహం, భోజనం వాటంతటవే తెలుస్తాయి. ఎవరూ ఎవరినీ అడగనక్కరలేదు. ఆచారాన్ని చూసి వర్ణ, వంశాలనూ, భాష, భాషణల తీరును బట్టి దేశాన్ని, మనిషి మరో మనిషిని చూడగానే పలకరించే పద్ధతిని బట్టి వారి మధ్య గల స్నేహాన్ని, శరీరపుష్టిని గమనించి భోజనాన్నీ పోల్చివేయవచ్చు. ఆచారాదులే చెప్తాయి.

సముద్రంలో వాన, బాగా కడుపు నిండిన వానిని భోజనం చేయమంటూ పట్టుదల పట్టడం, అఖిల ఐశ్వర్యవంతునికి దానమిచ్చుట, నీచునికి చేసే ఉపకారాలు వ్యర్థము.

*దూరస్థో ఽపి సమీపస్థో*
*యోయస్య హృదయేస్థితః ।*
*హృదయా దపి నిష్క్రాంతః*
*సమీప స్థోఽపి దూరతః ॥ (ఆచార 115/ 76)*

గుండెలో గూడు కట్టుకొని కూర్చున్న ప్రాణి ఎంతదూరంలో వున్నా మనకు దగ్గరలో నున్నట్లే అనిపిస్తుంటుంది. హృదయంలోంచి తొలగించబడినవారు కాని హృదయం దాకా రాలేనివారు గాని పొరుగింట్లోనే వున్నా పరాయిదేశంలో నున్నట్లే లెక్క.

ముఖంలో వికృతి, గొంతుపూడుకుపోత, దైన్యభావం, చెమటతో తడిసి ముద్దైన శరీరం, అత్యంత భయంకర చిహ్నాలు. అవి సామాన్యమానవుని ఆకృతి పై వాని మృత్యు సమయంలో కనిపిస్తాయి. కాని, బిచ్చమెత్తుకొని బతికేవాని ఆకారం నిరంతరం ఇలాగే వుంటుంది.

మనిషి కుంచించుకుపోవడం, క్రిమిదోషంతో సదా పీడితుడై వుండడం, వాయు వికారగ్రస్తుడై వుండడం, రాజ్యం లేదా గృహం నుండి తగిలేయబడడం, పర్వత శిఖరంపై

నివసించడం ఇవన్నీ కూడా ముష్టి వానిగా బతకడం కన్నా మంచివే. యాచననే వృత్తిగా స్వీకరించి బతికేయాలనుకోవడం అనుచితం.

*జగత్పతిర్హి యాచిత్వా*
*విష్ణుర్వామనతాం యతః ।*
*కోన్యోఽధిక తరస్తస్య*
*యోర్థీ యాతి న లాఘవం ॥* **(ఆచార 115 /71)**

జగత్పతీ, కొండంత దేవుడూనైన శ్రీ మహావిష్ణువే బలిచక్రవర్తిని యాచించడానికి వెళ్ళినపుడు అంతటి ఐశ్వర్యవంతుడూ కుంచించుకుపోయి వామనుడై పోయాడంటే ఇక కడమ వారిని గూర్చి చెప్పాలా?

*ఇక విద్య యొక్క గొప్పదనాన్ని గూర్చి వినండి.*★

*విద్యానామ కురూపరూప మధికం విద్యాతి గుప్తం ధనం*
*విద్యాసాధుకరీ జనప్రియకరీ విద్యా గురూణాం గురుః ।*
*విద్యా బంధుజనార్తి నాశనకరీ విద్యా పరం దైవతం*
*విద్యా రాజసుపూజితాహి మనుజో విద్యా విహీనఃపశుః॥* **(ఆచార15/81)**

కురూపికి కూడా విద్య వుంటే కళ, కాంతి వస్తాయి. రూపాన్నంటే తల్లిదండ్రులివ్వలేక పోవచ్చుగానీ అవకాశముండీ పిల్లలకు మంచి చదువు చెప్పించని వారు ఆ పిల్లలకు శత్రువులకిందే లెక్క. విద్యరూపాన్నిస్తుంది. దాచుకున్న సొమ్ములాగా అక్కరకొస్తుంది. ఎవరి చేతిలోనైతే తాను వుంటుందో వానిని సాధు స్వభావిగా మారుస్తుంది. లోకులందరికీ ప్రీతిపాత్రునిగా చేస్తుంది. గురువులకు కూడా గురువైనది విద్య. అది విద్యావంతుని యొక్క బంధు బాంధవుల కష్టాలను కూడా దూరం చేసి కాపాడగలదు. విద్యయే పరమ దేవత. రాజుల చేత కూడ సామాన్యుడైన విద్యావంతుడు పూజింపబడతాడు. విద్యగల వాడే మనిషి. అది లేనినాడు పశువు. ఎట్టి ద్రవ్యమైనను దొంగలనుండి సంపూర్ణంగా సురక్షితమనలేము. కాని, విద్య దొంగలచేతికి దొరకని దైవం, ద్రవ్యం. (అనంతర కాలంలో తెలుగులో వెలసిన విద్యా పద్యాలకు – ముఖ్యంగా విద్యలేనివాడు వింతపశువు. విద్య నిగూఢ గుప్తమగు విత్తము, విద్య నెఱుంగని వాడు మర్త్యుడే – వంటి సుప్రసిద్ధ భావాలకు గరుడపురాణమే మూలము) **(అధ్యాయం –115)**

★*తెలుగు వారు భర్తృహరి సుభాషితాల ద్వారా దీనిని చిన్నపుడే వినేశారు. ఆ భర్తృహరికే మూలం గరుడపురాణం*

# తిథులూ - వ్రతాలూ

బ్రహ్మదేవుడు వ్యాసమహర్షికి ఇంకా ఇలా చెప్పాడు. 'హే వ్యాసమునీ! ఇపుడు నేను కొన్ని వ్రతాలను నీకుపదేశిస్తాను. వీటిని శ్రద్ధాభక్తులతో చేసే వారికి విష్ణువు అన్నీ ఇస్తాడు. అన్నిమాసాల్లో, అన్ని నక్షత్రాల్లో, అన్నితిథుల్లో హరికి ప్రియమైన వ్రతాలున్నాయి.★

పాడ్యమి తిథి నాడు వైశ్వానరునీ, కుబేరునీ పూజించాలి. వారు సాధకునికి అర్థలాభాన్ని అంటే ధన, కనక, వస్తు వాహనాదులను ప్రదానం చేస్తారు. పాడ్యమీ, అశ్వనీ నక్షత్రాలు కలిసిన నాడు ఉపవాసం చేస్తే బ్రహ్మదేవుడు, సంతోషించి అర్థాన్నిస్తాడు.

| తిథి | పూజ్యదైవతాలు | ఫలాలు |
|---|---|---|
| విదియ | యముడు, లక్ష్మీనారాయణుడు | అర్థలాభం |
| తదియ | గౌరి, శివుడు, గణేశుడు | |
| చవితి | చతుర్వ్యూహాలతో విష్ణువు | |
| పంచమి | హరి | |
| షష్ఠి | కార్తికేయుడు,సూర్యుడు (రవి) | |
| సప్తమి | భాస్కరుడు (ఉపవాసంచేయాలి) | అర్థలాభం |
| అష్టమి | దుర్గ | |
| నవమి | మాతృకలు, దిశలు | అర్థలాభం |

---

★ఏకభుక్తం, నక్తవ్రతం, ఉపవాసం లేదా ఫలాహారవ్రతం - ఏది చేసినా శ్రీహరి ఆవ్రతికి ధన, ధాన్య, పుత్ర, రాజ్య, విజయాలలో ఎన్నైనా గానీ అన్నీ అయినా గాని ప్రసాదిస్తాడు.

దినార్థ సమయే తీతే భుజ్యతే నియమేనయత్ ।
ఏకభుక్త మితిప్రోక్తం రాత్రౌ తన్న కదాచన ॥

పగటిలో సగం కాలం గడిచాక భోజనం చేసి మరల ఇరువది నాలుగు గంటలు గడిచేదాకా ఏమీ తినకుండా చేసే వ్రతం ఏకభుక్తం.

దివ సస్యాష్టమే భాగే మందీభూతే దివాకరే ।
నక్తం తచ్చ విజానీయాన్న నక్తం నిశిభోజనం ॥
నక్షత్ర దర్శనాన్నక్తం గృహస్థేన విధీయతే ।
యతేర్ది నాష్టమే భాగే రాత్రౌ తస్య నిషేధనం ॥

పగటిలో ఎనిమిదవ భాగం గడిచాక, సూర్య ప్రభలు మందమైపోతున్నపుడు భోజనం చేసి మరల ఇరువది నాలుగు గంటలలోపల ఏమీ తినకుండా వుండడాన్ని నక్తవ్రతమంటారు. గృహస్థు నక్షత్ర దర్శనమయ్యాక తినాలి. యతులు సూర్యాస్తమయానికి కాస్తముందు భిక్షాటన చేసి తినాలి.

| | | |
|---|---|---|
| దశమి | యముడు, చంద్రుడు | |
| ఏకాదశి | ఋషిగణాలు | |
| ద్వాదశి | హరి, మన్మథుడు | |
| త్రయోదశి | శివుడు | |
| చతుర్ధశి, పున్నం | బ్రహ్మ | |
| అమావాస్య | పితృగణాలు | ధనసంపత్తి |

ఆదివారం అశ్వనితో మొదలుపెట్టి వరుసగా నాలుగు నక్షత్రాలను, సోమవారం అయిదునుండి మరోనాల్గింటిని అలా శనివారం మూడిటితో మొత్తం ఇరవైయేడు నక్షత్రాలనూ పూజించినవారి కోరికలన్నిటినీ ఆ నక్షత్రాలు నెరవేర్చగలవు. ***(అధ్యాయం - 116)***

## అనంగ త్రయోదశీవ్రతం

బ్రహ్మదేవుడు వ్యాసమహర్షికి ఇలా ఉపదేశించసాగాడు. హే మహర్షీ! మార్గశిర శుక్ల త్రయోదశి నాడు ఈ అనంగత్రయోదశి అనే వ్రతాన్నిచేయాలి.

మల్లికా వృక్షపు దంతపు పుల్ల, ఉమ్మెత్తపూలతో పండ్లతో శివుని పూజించాలి. తరువాత అనంగాయేతి... అనే మంత్రాన్ని పూర్తిగా చదువుతూ భగవంతుడైన శివునికి తేనెను నైవేద్యంగా అర్పించాలి. పుష్యమాసంలో ఆయననే యోగేశ్వరుడను పేర బిల్వ పత్రాలతో, కదంబ దంతపు పుల్లతో (పలుదోముపుల్ల) చందన, కృసరా (నైవేద్యం) దులతో పూజించాలి.

మునులారా! మాఘమాసంలో నటనాగరుడైన శివదేవుని కుందపుష్పాలతో ముత్యాలమాలతో పూజించి పాకడ చెట్టునుండి విరిచిన దంతధావనం పుల్లనూ పూరికా నైవేద్యాన్ని సమర్పించాలి. ఫాల్గునమాసంలో మరూబక (మండక) ములను పేరుగల పూలతో వీరేశ్వరనామక శివుని పూజించి ఆయనకు చక్కెర, కూర, గంజిలను నివేదించి మామిడి పల్దోము పుల్లను సమర్పించాలి.

చైత్రమాసంలో సురూప భగవానుని పూజించాలి. రాత్రి కొంచెం కర్పూరం నివేదించాలి. స్వామికి దంతధావనకి మఱ్ఱిపుల్లనీ నైవేద్యానికి పూరీలను సమర్పించాలి. వైశాఖమాసంలో శివదేవుని సంహారకారక దమనక రూపంలో పూజించి ఉప్మా, బెల్లం నైవేద్యాలుగాను, గూలర (మేడి) పుల్లను దంతాలపనికినీ సమర్పించాలి. ప్రాశ్నకై జాతి ఫలాలను అర్పించాలి.

జ్యేష్ఠమాసంలో ప్రద్యుమ్నదేవుని చంపక పుష్పాలతో పూజించి బిల్వ దంతపు పుల్లని, లవంగమొగ్గలనూ సమర్పించాలి. ఆషాఢమాసంలో ఉమాభద్రుని పూజించి అగరుగంధాన్ని పూసి ఉత్తరేని దంతపు పుల్లని సమర్పించాలి.

శ్రావణమాసంలో శూలపాణియైన శివుని పూజించాలి. గన్నేరుపూలు, గంధం, నెయ్యి, కలిపిన భోజనం, గన్నేరుపుల్ల పూజాద్రవ్యాలు భాద్రపదంలో సద్యోజాత నామంతో శివుని పొగడపూలతో పూజించి అరిసెలను నైవేద్యం పెట్టాలి. ఆశ్వియుజమాసంలో సురాధిపుడైన శివుని చంపకపుష్పాలు, బంగారు కలశతో నీరు, సువాసన వచ్చు మోదకాలు పూజాద్రవ్యాలుగా చేసి ఆరాధించాలి. దంతధావనపు పుల్లగా దమనకాన్ని సమర్పించాలి. కార్తికమాసంలో చంద్రపుల్లని దంతాలకీ, మదనపుష్పాలనూ, పాలనూ కూరగాయలనూ శివపూజానైవేద్యాలకి సమర్పించాలి. ఈ ఏడాదిలో ప్రతిరోజూ కమలపుష్పాలతో శివుని అర్చించాలి.

పైన చెప్పబడిన విధంగా సంవత్సరంపాటు పూజలు చేసిన తరువాత రతీసహితుడైన అనంగదేవుని స్వర్ణప్రతిమను స్వర్ణనిర్మితమైన మండలంలో స్థాపించి వారికి గంధాదులతో పూజ చేసి తిలలతో బియ్యంతో హవనసామగ్రిని తయారుచేసి వారికి పదివేల ఆహుతుల నివ్వాలి. ఆ రాత్రి జాగరణ చేసి గీత వాద్యాదులతో ఆనందభరితంగా గడిపి ప్రాతః కాలంలో ఆ దేవతలను మరల పూజించాలి. తరువాత బ్రాహ్మణులకుశయ్య,పాత్ర, ఛత్ర, వస్త్ర, పాదరక్షాదులను దానం చేసి గోవులకూ బ్రాహ్మణులకూ ఆత్మకింపయిన భోజనాలను భక్తి పూర్వకంగా పెట్టాలి. వ్రతం పూర్తయినాక ఉద్యాపన చేయాలి. ఈ విధంగా ఈ అనంగత్రయోదశీ వ్రతాన్నాచరించిన వారికి లక్ష్మి,పుత్ర సంతానం, ఆరోగ్యం, సౌభాగ్యం ఈ లోకంలో అక్షయంగా లభిస్తాయి.దేహాంతంలో స్వర్గం ప్రాప్తిస్తుంది. ***(అధ్యాయం-117)***

# అఖండ ద్వాదశీ వ్రతం

మునులారా! ఇపుడు మోక్ష, శాంతిప్రదమైన అఖండ ద్వాదశీ వ్రతాన్ని వినిపిస్తాను. మార్గశిర శుద్ధ ద్వాదశినాడు ఆవుపాలు, పెరుగులను మాత్రమే భోజనంగా స్వీకరించి జగన్నాథుడైన విష్ణువును పూజించాలి. నాలుగు నెలలపాటు అనగా ఫాల్గున మాసం దాకా వ్రతి ఇలా ప్రతి ద్వాదశినాడూ చేసి చివర అయిదు రకాల ధాన్యాలను అయిదు పాత్రలలో నింపి బ్రాహ్మణునికి దానం చేసి విష్ణుభగవానుని ఈ విధంగా ప్రార్థించాలి.

*సప్త జన్మని హేవిష్ణో యన్మయా హి వ్రతం కృతం ।*
*భగవంస్త్వ ప్రసాదేన తదఖండ మిహాస్తు మే ॥*

*యథాఖండం జగత్సర్వం త్వమేవ పురుషోత్తమ ।*
*తథాఖిలాన్య ఖండాని వ్రతాని మమ సంతువై ॥* ***(ఆచార ..118/3,4)***

ఇలా తాను ఏడు జన్మలలో చేసే ప్రతిపుణ్య కర్మఫలాన్నీ అఖండం చేయుమని దేవుని ప్రార్థిస్తూ చైత్రాది నాలుగు మాసాల్లో సక్తు (సక్తు = పేలపిండి) తో నింపిన పాత్రలనూ, శ్రావణాది నాలుగు మాసాలలో నేయి నింపిన పాత్రలనూ బ్రాహ్మణునికి దానం చేయాలి. (సామర్థ్యం లేనివారు సంవత్సరంలో మూడు మార్లే దానమీయవచ్చును) ఈ విధంగా ఒక సంవత్సరం పాటు ఈ వ్రతాన్ని చేసినవారికి ఉత్తమ స్త్రీ, మంచి కొడుకులూ లభిస్తారు. దేహాంతంలో స్వర్గలోక ప్రాప్తి వుంటుంది. ***(అధ్యాయం – 118)***

# అగస్త్యార్ఘ్య వ్రతం

**భు**క్తి ముక్తి ప్రదాయకమైన ఈ వ్రతాన్ని కన్యారాశిలో సూర్యసంక్రాంతికి మూడు రోజుల ముందు ప్రారంభించాలి. కాశపుష్పాలతో (రెల్లుపూలతో)అగస్త్యుని మూర్తిని తెలతెల వారుతుండగా పూజించి కుంభంలోని నీటితో ఆ మహనీయునికి అర్ఘ్యమివ్వాలి. ఆ రోజంతా ఉపవసించి రాత్రి జాగరం చేసి తెల్లవారినాక బంగరు లేదా వెండి పాత్రలో, అయిదు రంగులున్నదానిలో, సప్తధాన్యములను పోసి, పెరుగునీ చందనాన్నీ కూడా రంగరించి ***అగస్త్యఃఖనమానః...*** అనే ఋగ్వేద (1/179/6) మంత్రం చదువుతూ మరల అర్ఘ్యప్రదానం చేయాలి. దీనికి ముందే పెరుగులో ముంచిన అక్షతలతోనూ, పూలతోనూ, పండ్లతోనూ ఆయన మూర్తిని పూజించాలి.

*అర్ఘ్యానంతరం ఈ మంత్రంతో ప్రార్థించాలి.*
*కాశపుష్ప ప్రతీకాశ అగ్ని మారుత సంభవ ।*
*మిత్రా వరుణయోః పుత్ర కుంభయోనే నమోஉస్తుతే ॥* ***(ఆచార..119/5)***

ఈ వ్రతాన్ని శూద్రులు, స్త్రీలు కూడ చేయవచ్చును. పూజానంతరం ఒక కుండలో బంగారాన్నీ, వేరే దక్షిణనీ పెట్టి బ్రాహ్మణునకు దానమివ్వాలి. వేరే ఏడుగురు బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. ఇలా ప్రతి సంక్రాంతినాడూ చేస్తూ ఒక యేడాది పాటు చేసినవారు సర్వ ప్రకారాల శ్రేయస్సులకూ అధికారులౌతారు. ***(అధ్యాయం –119)***

# రంభాతృతీయ వ్రతం

బ్రహ్మదేవుడింకా ఇలా చెప్పసాగాడు, "సౌభాగ్యం, లక్ష్మి, పుత్రాది ఫలప్రదమైన రంభాతృతీయ వ్రతాన్నుపదేశిస్తాను. దీనిని మార్గశిర శుద్ధ తదియనాడు చేయాలి. ప్రతి ఈ రోజు ఉపవసించి (కుశాలను ఉదకాన్ని కలపి ఆ) కుశోదకాన్ని చేత బట్టుకుని బిల్వ పత్రాల చివరలను దానిలో ముంచి వాటితో మహాగౌరిని పూజించాలి. ఈ పూజలో కదంబవృక్షాన్నుండి తీసిన పలుదోముపుల్లను వాడాలి. పుష్యమాసంలో మరుబక పుష్పాలతో పార్వతీదేవిని పూజించి క్రుసర (కృశర) అనగా బియ్యం, నువ్వులు కలిపి వండిన సిద్ధాన్నమును నైవేద్యం పెట్టి మల్లికా దంతధావన సాధనాన్ని దేవికి సమర్పించాలి. ఉపవాసం చేసి కర్పూరాన్ని మాత్రమే ప్రాశించాలి. మిగతా మాసాల్లో.........

| మాసం | ప్రాశ్న | పూలు | నైవేద్యం | దేవత | పల్దోము పుల్ల |
|---|---|---|---|---|---|
| మాఘ | నెయ్యి | తెల్లకమల | పెరుగన్నం | సుభద్రాదేవి | |
| ఫాల్గున | [1]జీవ | కుంద | [2]శష్కులి | గోమతి | కుందనాళం |
| చైత్ర | పెరుగు | దమనక | కృశరాన్నం | విశాలాక్షి | [3]తగరకాష్ఠ |
| వైశాఖ | అశోకమొగ్గ | కర్ణికార | శ్రీముఖి | వట | |
| జ్యేష్ఠ | లవంగం | శతపర్ణి | చక్కెర | నారాయణి | శతపర్ణి |
| ఆషాఢ | తిల | బిల్వపత్ర | నెయ్యి,పాయసం | మాధవి | గూలర |
| శ్రావణ | తగర | క్షీరాన్నం | శ్రీదేవి | మల్లిక | |
| భాద్రపద | సింగడా | పద్మ | బెల్లం | ఉత్తమాదేవి | |
| అశ్వయుజ | అన్నం | జపా | సుగంధాన్నం | రాజపుత్రి | |
| కార్తిక | పంచగవ్య | జాతి | కృశరాన్నం | పద్మజ | |

*ప్రాశ్నయనగా నోటిలో వేసుకొనుట.*

ఈ ప్రకారంగా మార్గశిరం నుండి కార్తికం దాకా ఒక ఏడాదిపాటు వ్రతాన్న వలంబించి చివర కొందరు బ్రాహ్మణులను వారి పత్నులతో బాటు పూజించి వారికి

---

*[1]జీవ అనేది ఒక కాయగూర పేరు. ఇది పంచదారంత తీయగా వుంటుంది.*

*[2]శష్కులి అంటే పూరీయే గాక తిల, తండుల, ఉడద చూర్ణంతోచేసిన యవాగు అనే అర్థం కూడా ఉంటుంది.*

*[3]తగర అనే పదానికి పూలచెట్టు, తెల్లపూలు, మదన వృక్షమనే అర్థాలున్నాయి.*

నేయి, నువ్వులతో వండిన వంటలతో భోజనం పెట్టాలి. పిమ్మట శివపార్వతులకు వస్త్ర,ఛత్ర, సువర్ణాదులతో పూజ చేసి బెల్లాన్ని నైవేద్యంగా పెట్టాలి. ఆ రాత్రంతా జాగారం చేసి గీత వాద్యాదులతో భజనలను ఏర్పాటుచేసి తెల్లవారగానే యథాశక్తి గోదానాదులను చేయాలి. ఈ వ్రతాన్ని భక్తిశ్రద్ధలతో ఆచరించినవారికి అన్ని సంపదలూ అబ్బుతాయి.

ఈ వ్రతాన్ని రంభ తొలిసారి చేసి ధన్యురాలైనది కాబట్టి ఆమె పేరిటనే దీన్ని వ్యవహరిస్తున్నారు. ***(అధ్యాయం -120)***

# చాతుర్మాస్యవ్రతం

**ఈ** వ్రతాన్ని ఆషాఢమాసంలో ఏకాదశినాడుగాని పున్నమనాడు గాని భగవానుడైన హరిని వీలైనన్ని విధాల పూజించి ఈ క్రింది శ్లోకాలతో ప్రార్థించి ప్రారంభించాలి.

***ఇదం వ్రతం మయాదేవ గృహీతం పురతస్తవ ।***
***నిర్విఘ్నం సిద్ధి మాప్నోతు ప్రసన్నే త్వయి కేశవ ॥***

***గృహీతేఽస్మిన్ వ్రతేదేవ యద్య పూర్ణే మ్రియామ్యహం ।***
***తన్మే భవతు సంపూర్ణం త్వత్ప్రసాదాజ్జనార్దన ॥*** ***(ఆచార..121/2,3)***

ఒకవేళ ఈ వ్రతం చేస్తూ పూర్తికాకుండా నేను మరణిస్తే సంపూర్ణ వ్రత ఫలాన్నే దయచేయించుమని ఈ శ్లోకం ద్వారా హరిని ప్రార్థించడం జరుగుతోంది (వ్రతం చెడ్డా ఫలితం దక్కాలనే జాతీయానికి గరుడ పురాణమే మూలమైవుంటుంది – అను)

ఈలాగున ప్రార్థించి హరిని పూజించి వ్రత, పూజన,జపాదిక నియమ గ్రహణం చేయాలి. ఈ సంకల్పంతోనే పాపాలు దూరమవుతాయి. సాధకుడు స్నానం చేసి సంకల్పం చెప్పుకొని ఆషాఢంనుండి (తో) మొదలుపెట్టి నాలుగు మాసాల పాటు ఏకభుక్తముంటూ విష్ణుపూజ చేస్తే ఆయనయొక్క పరమ పవిత్రనిర్మల లోకాన్ని చేరుకుంటాడు.

నూనెలను,మద్యమాంసాదులను విసర్జించి, వేద పారంగతుడనిపించుకొని కృచ్ఛ్రపాదవ్రతి(1)యైన విష్ణుభక్తుడీ వ్రతాన్ని చేస్తే విష్ణులోకానికి వెళతాడు. ఒక రాత్రి ఉపవాసాన్ని చేసిన వ్రతి వైమానిక దేవతగా పదోన్నతిని పొందుతాడు. మూడు రాత్రులు పవాసం చేసి ఆ తరువాత మూడురాత్రులపాటు ఆరవ అంశనే భోజనం చేయు వ్రతికి

---

*[1]ఇది మూడురోజుల వ్రతం. తొలిరోజు ఒకేమారు హవిష్యాన్నాన్ని తినాలి. రెండవరోజు ఆయాచిత హవిష్యాన్నాన్నే తినాలి. మూడవరోజంతా ఏమీ తినరాదు (యాజ్ఞవల్క్యస్మృతి, ప్రాయ..శ్లో 318)*

శ్రీ ద్వీప నివాసం ప్రాప్తిస్తుంది. చాంద్రాయణ వ్రతం[2] చేసిన చాతుర్మాస్య వ్రతికి ముక్తి, విష్ణులోక ప్రాప్తి కోరకుండానే లభిస్తాయి. ప్రాజాపత్యవ్రతం[3] చేసిన వ్రతికి కూడా విష్ణులోకం ప్రాప్తిస్తుంది. ఈ వ్రతం చేసిన పరాకవ్రతి[4]కి సాక్షాత్తూ హరిప్రాప్తి యే చెప్పబడింది.

ఈ చాతుర్మాస్య వ్రతంలో సత్తుపిండినీ, యవాన్నాన్నీ మాత్రమే ఎవరైనా పెడితే తింటూ, పాలు, పెరుగు, నెయ్యిలను ఒక మారే నోటిలో వేసుకొని వుంటూ, గోమూత్ర యావకాన్ని తింటూ, పంచగవ్యాలను మాత్రమే త్రాగుతూ జీవించాలి. లేదా షడ్రసాలను పరిత్యజించి శాక-మూల- ఫలాలను మాత్రమే తినాలి. ఈ విధంగా చేసినవారు విష్ణులోక ప్రాప్తి నందగలరు. ***(అధ్యాయం -121)***

# మాసోపవాసవ్రతం

ఇది సర్వోత్తమ వ్రతాలలో నొకటి. ఈ వ్రతాన్ని వానప్రస్థులు, సన్యాసులు, స్త్రీలు పాలన చేసారు. ఆశ్వయుజ శుద్ధ ఏకాదశినాడుపవాసం చేసి వ్రతారంభంలో విష్ణు భగవానునిలా ప్రార్థించాలి.

***ఆద్యప్రభృత్యహం విష్ణో యావదుత్థానకం తవ।***
***అర్చయే త్వామనశ్నంస్తు దినాని త్రింశదేవ తు ॥***

***కార్తికా శ్వినయోర్విష్ణో ద్వాదశ్యోః శుక్లయోరహం ।***
***మ్రియే యద్యంతరాలే తువ్రతంభంగో నమేభవేత్ ॥*** ***(ఆచార..122/3,4)***

స్వామీ! నీవు లేచేదాకా నేనేమి తినను. ఈ ఆశ్వయుజ కార్తీక శుద్ధ ద్వాదశులమధ్య నేను మరణిస్తే ఆవిధంగా వ్రతం చెడినా ఫలితం మాత్రం నాకు దక్కించు అని ఆయనను వేడుకొని మధ్యాహ్న, సాయంకాలాలలో స్నానం చేసి, హరిని, దేవాలయానికి పోయి

---

*[2] చాంద్రాయణ వ్రతం మనుధర్మశాస్త్రం **11/216** లో పేర్కొనబడింది. తదనుసారము ఇది ఒక నెలపాటు పడవలసినపాటు త్రికాల స్నానం, పున్నం నాడు వ్రతం మొదలు, పదిహేను గ్రాసాల హవిష్యాన్న గ్రహణం, మరునాటి నుండి ఒక్కొక్క గ్రాసాన్ని తగ్గించుకుంటూ తిని కృష్ణపక్ష చతుర్దశినాడు ఒకే ఒక్క గ్రాసం తిని, అమావాస్యనాడు పూర్ణ ఉపవాసం, మరునాడు అనగా శుద్ధ పాడ్యమి నాడు ఒకే గ్రాసంతిని అలా రోజుకొకటి పెంచుకుంటూ పోయి పున్నంనాడు మరిల పదిహేనుగ్రాసాల హవిష్యాన్నాన్ని తిని వ్రత సమాప్తి చేయుట.*

*[3]ప్రాజాపత్యవ్రతం పన్నెండు రోజుల వ్రతం. ఏనాడైనా నియమగ్రహణం చేసి తొలిమూడు రోజుల్లో పగలు మాత్రమే హవిష్యాన్నాన్ని తినాలి. మలి మూడురోజుల్లో రాత్రి మాత్రమే. తరువాతి మూడు రోజులు అయాచితం. చివరి మూడురోజులూ సంపూర్ణఉపవాసం (మను**11/211**)*

*[4]పరాక వ్రతమనగా పన్నెండు రోజులపాటు ఏ ఘనపదార్థాన్నీ తినకుండా నీరు మాత్రమే త్రాగి ఉండిపోవుట. (యా.స్మృ. ప్రా.**320**, మను **11/215**)*

సుగంధాదులతో పూజించాలి. వ్రతి మాత్రము తాను ఉబటన, సుగంధిత గంధాలే పాదులను పూసుకోరాదు.

ద్వాదశినాడు భగవానుడైన హరిని పూజించి బ్రాహ్మణులకు భోజనాలు పెట్టాలి. ఒక మాసం దాకా హరినే పూజిస్తూ మంచినీళ్ళే త్రాగుతూ అప్పుడు పారణ చేయాలి. మధ్యలో వ్రతి నీరసంతో మూర్ఛపోతే ఇతరులు ఆయన నోటిలో పాలుపోయవచ్చు. దీనివల్ల వ్రత భంగం కాదు. ఈ వ్రతం భక్తి, భుక్తి, ముక్తిదాయకం. ***(అధ్యాయం -122)***

# భీష్మపంచకవ్రతం

**కా**ర్తీకమాసమంతా ఏకభుక్తాలతో, నక్తవ్రతాలతో, అయాచిత వ్రతాలతో, కూర-పాలు- పండ్లు వీటిలో నొక ఆహారంతో ఉపవాసాలతో హరిపూజనం గావిస్తూ గడపాలి. అలా గడిపిన వారికి అన్ని పాపాలూ నశించి అన్ని కోరికలూ తీరి, హరిని కటవాస ప్రాప్తి కలుగుతుంది.

హరివ్రతమెప్పుడైనా శ్రేష్ఠమే కాని, సూర్యుడు దక్షిణాయనంలోనికి వెళ్ళినపుడు చేసే ఈ వ్రతాలు అధిక ప్రశస్తాలుగా పేర్కొనబడుతున్నాయి. ఈ కాలం తరువాత చాతుర్మాసాలూ, కార్తీకమాసం సముచితాలుగా చెప్పబడుతున్నాయి. సాధారణంగా కార్తిక శుద్ధ ఏకాదశి నాడీ వ్రతాన్ని మొదలుపెడతారు. ఈ రోజు త్రి సంధ్యలలో స్నానాలు చేసి యవాది పదార్థాలతో పితరులకు నిత్యపూజలను గావించి అప్పుడు హరిని పూజించాలి. వ్రతి మౌనంగా నెయ్యి, తేనె, చక్కెర, పంచగవ్యాలు, నీరులతో హరి మూర్తికి స్నానం చేయించి కర్పూరాది సుగంధ ద్రవ్యాలతో హరి శరీరానికి అనులేపనం చేయాలి.

సాధకుడు పున్నం వరకూ ప్రతిరోజూ విష్ణుదేవునికి నేతి తోడి గుగ్గిల ధూపాన్నిచ్చి పక్వాన్నాలనూ మధురమైన మిఠాయిలనూ నైవేద్యంగా సమర్పించి **ఓం నమోవాసుదేవాయ** అనే మంత్రాన్ని నూటెనిమిది మార్లు జపించాలి. తరువాత ఇదే మంత్రాన్ని స్వాహాయుక్తంగా పఠిస్తూ బియ్యం, నువ్వులు, నెయ్యిలను కలిపి వాటితో (దానితో) ఆహుతులివ్వాలి.

వ్రతి తొలిరోజు కమల పుష్పాలతో శ్రీమన్నారాయణుని పాదాలనూ, మలిరోజు బిల్వపత్రాలతో జంఘలనూ, మూడవరోజు గంధంతో నాభినీ, తరువాతి దినాన బిల్వ పత్రాలతో జవాపుష్పాలతో స్కంధమునూ, చివరిరోజు మాలతీ పుష్పాలతో స్వామి శిరోభాగాన్నీ పూజించాలి. ఈ అయిదురోజులు పుడమిపైనే నిద్రించాలి. ఈ రోజుల్లో క్రమంగా గోమయం, గోమూత్రం, పెరుగు, పాలు, నెయ్యిలను మాత్రమే రాత్రి నోటిలో వేసుకోవాలి. పగలంతా ఏమీ తినరాదు. ఈ వ్రతం వల్ల ఇహంలో భోగం, పరంలో

మోక్షం కూడాలభిస్తాయి. మాసంలోని రెండు పక్షాలలోనూ ఈ వ్రతాన్ని చేసిన వారికి ఏయే పాపాలుచేస్తే నరకానికి పోతామో ఆయా పాపాలన్నీ పూర్తిగా నశిస్తాయి.

(దీన్ని భీష్మపంచకవ్రతమని ఎందుకన్నారో తెలియరాలేదు. శోధించాలి)

సూతకులూ, మృతకులూ కూడా అశౌచకాలంలో కూడా ఈ వ్రతాన్ని చేయవచ్చును. (సూతకయనగా పుట్టుక, మృతకయనగ బంధుమరణము)

దశమీ ఏకాదశీ ఒకేరోజులో పడితే అది అసురదినమవుతుంది. కాబట్టి అటువంటి రోజు వ్రతం గాని ఉపవాసం కాని చేయరాదు. ***(అధ్యాయం -123)***

# శివరాత్రి వ్రతకథ - విధానం

**ఒ**కప్పుడీ వ్రతాన్ని శంకరభగవానుడు గౌరీదేవికుపదేశించాడు.

మాఘ, ఫాల్గున మాసాల మధ్యలో వచ్చే కృష్ణ చతుర్దశినాడు ఉపవాస, జాగరణాలు చేసి శివుని పూజించిన వారికాయన 'ఇక్కడ' భుక్తినీ 'అక్కడ' ముక్తినీ ప్రసాదిస్తాడు.

చాలాకాలం క్రిందట అర్బుద దేశంలో సుందరసేనుడను ఒక పాపాత్ముడైన నిషాద రాజుండేవాడు. అతడొకనాడు కుక్కలను వెంటబెట్టుకుని వేటకై ఒక అడవికి వెళ్ళాడు. దైవవశాన అతడికి ఏ జంతువూ దొరకలేదు. వెంట తెచ్చుకున్న ఆహారమూ, నీరూ నిండుకోవడంతో ఆకలి దప్పులతో అలమటిస్తూ వాటి కోసం కూడా తిరిగి దారి తప్పి రాత్రంతా నిద్రలేకుండా వెదకి చివరికి ఒక తటాకాన్ని చేరుకుని అక్కడే నిలచిపోయాడు. ఆకలి వల్ల నిద్రపట్టలేదు. అక్కడే ఒడ్డు మీద ఒక చెట్టు క్రింద అతనికి శివలింగం కనిపించింది. అతడు చెట్టుపైన రాత్రిని గడపడం కోసం ఎక్కగా అతడు కదిలినపుడల్లా ఆ చెట్టు ఆకులు శివలింగం మీద పడ్డాయి. అది బిల్వవృక్షం. అవి బిల్వపత్రాలు. అతడు త్రాగడానికి తెచ్చుకున్న నీళ్ళు శివలింగం మీద పడ్డాయి. పాత్ర నుండి పడిన నీటితో శివునికి అభిషేకం జరిగింది. అతని పొదిలోని బాణమొకటి జారి శివలింగం ప్రక్కన పడింది. అతడా బాణాన్ని తీసుకోవడానికి చేయి సాచినపుడా చేతికి శివలింగం తగిలింది. ★ ఈ ప్రకారమా కొండరాజు ద్వారా రాత్రి జాగరణ, ఉపవాసము, బిల్వపత్రాలతో శివపూజ, లింగాభిషేకం అతనికి తెలియకుండానే జరిగిపోయాయి. అతనికి తెలియని విషయం మరొకటి కూడా ఉంది. ఆ రాత్రి శివరాత్రి. తెల్లవారాక అతడు తన నిషాద రాజ్యానికి వెళ్ళిపోయాడు.

---

★ *శివలింగ సమీపంలో అతని బాణం పడిపోయినపుడతడు వంగి మోకాళ్ళపై కూర్చుని చేతిని ముందుకి చాచి దానినందుకున్నపుడతని చేయి శివలింగానికి తగిలింది కదా! తద్వారా అతనికి మోకాటిపూజ, శివస్పర్శన పుణ్యం కూడా కలిగాయి.*

అతడు కొంతకాలానికి మరణించాడు. యమ దూతలాతని పాశబద్ధుని చేసి గొనిపోవుచుండగా శివదూతలడ్డుపడ్డారు. యమదూతలకు శివరాత్రి పుణ్యాన్ని వివరించి ఆ నిషాదుడు తన కుక్కలతో సహా నిష్పాపుడెలాగైనాడో బోధపరచి వానిని కైలాసానికి గొంపోయారు. ఈ విధంగా తెలియక చేసిన అసంకల్ప వ్రతికే ఇంత అదృష్టం పట్టినపుడు ఇక తెలిసి, సంకల్పించి మరీ శివరాత్రి వ్రతాన్ని చేసిన వారి సంగతి వేరే చెప్పాలా?

ఈ వ్రతానికి త్రయోదశినాడే దీక్షాగ్రహణం చేసి శివుని పూజించి ఇలా ప్రార్థించాలి.

*ప్రాతర్దేవ చతుర్దశ్యాం జాగరిష్యా మ్యహం నిశి ।*
*పూజాం దానం తపోహోమం కరిష్యామ్యాత్మక శక్తితః ॥*

*చతుర్దశ్యాం నిరాహారో భూత్వా శంభు పరేఽహని ।*
*భోక్ష్యేఽహం భుక్తి ముక్త్యర్థం శరణం మే భవేశ్వర ॥* **(ఆచార124/12,13)**

మహాదేవునికి పంచామృతాలతో స్నానం చేయించి 'ఓం నమో నమశ్శివాయ' అనే మంత్రంతో పూజ చేయాలి. తదనంతరం పెరుగు, తిలతండులాలతో, వరి ధాన్యంతో నిర్మితమైన 'చరు' ని ఆహుతులుగా అగ్నిలో వ్రేల్చి పూర్ణాహుతినివ్వాలి. వ్రతి రాత్రి గీత వాద్యాలతో ఉత్సవాన్ని చేయించి హరి కథలను కూడా పెట్టించి తాను కథలను వినాలి. అర్ధరాత్రి, మూడోజాము, నాలుగోజాములు మొదలుకాగానే కాసేపు శివపూజ చేస్తూ మూలమంత్రాన్ని జపిస్తుండాలి. తెల్లవారగానే స్వామినీ విధంగా అర్థించాలి.

*అవిఘ్నేనవ్రతం దేవత్వత్ప్ర సాదాన్మయార్చితం ।*
*క్షమ స్వ జగతాం నాథ త్రైలో క్యాధి పతేహర ॥*

*యన్మయాద్యకృతం పుణ్యం యద్రుద్రస్య నివేదితం ।*
*త్వత్ప్ర సాదాన్మయాదేవ వ్రత మద్య సమాపితం ॥*

*ప్రసన్నో భవమే శ్రీమన్ గృహం ప్రతిచ గమ్యతాం ।*
*త్వదాలోకన మాత్రేణ పవిత్రోఽస్మి న సంశయః ॥*(ఆచార.. **124/17-19)**

తరువాత ధ్యాన నిష్ఠుడైన బ్రాహ్మణుని భోజనంతో తృప్తిపఱచి వస్త్ర, ఛత్రాదులతో, యథాశక్తి, ఆయనను పూజించి మరల పరమశివుని ఇలా వేడుకోవాలి.

*దేవాదిదేవ భూతేశ లోకానుగ్రహ కారక ॥*
*యన్మయా శ్రద్ధయాదత్తం ప్రీయతాం తేన మే ప్రభుః॥* **(ఆచార124/20,21)**

ఇలా క్షమాపన స్తుతి చేయడంతో శివరాత్రి వ్రతమైపోతుంది. శివుడు సంప్రీతుడవుతాడు. సాధారణంగా ఈ వ్రతాంతంలోనే ద్వాదశ వార్షిక సంకల్పం చేస్తారు. ప్రతి ద్వాదశి నాడూ

ఉపవాసజాగరణలతో సహాఇలాగే ఏడాదిపాటు శివపూజను చేస్తారు. దీనివల్ల ప్రతికి సంపదలు, కీర్తి, పుత్రులు, అధికార ప్రాప్తి-ఇవన్నీ కలుగుతాయి. దేహాంతంలో శివలోకమూ ఒనగూడుతుంది. ఏడాది చివర పన్నెండుగురు బ్రాహ్మణులను భోజనం ద్వారా సంతృప్తి పఱచి దీపదానం చేసిన వారికి స్వర్గలోక ప్రాప్తి వుంటుంది. ***(అధ్యాయం -124)***

# ఏకాదశీ★ మహాత్మ్యం

ఒకప్పుడు మాంధాతయని ఒక రాజుండేవాడు. ఆయన ఈ వ్రతాన్ని చేసి చక్రవర్తి, సమ్రాట్ అనిపించుకొనే స్థాయికి ఎదిగాడు. ఈ వ్రతపుణ్యం అంత గొప్పది. ఈ వ్రతంలో ప్రథమ నియమం కృష్ణ, శుద్ధ - రెండు ఏకాదశులలోనూ జీవితాంతమూ భోజనం చేయకుండా వుండుట.

కౌరవ సమ్రాజ్ఞి గాంధారి దశమీ విద్ధ ఏకాదశినాడు ఈ వ్రతాన్ని చేసింది. ఆ దోషం వల్ల ఆమె పుత్రులామె జీవితకాలంలోనే నశించారు. కాబట్టి దశమితో యుక్తమైన ఏకాదశినాడు వ్రతం చేయరాదు.

ద్వాదశితో కలిసిన ఏకాదశినాడు శ్రీ హరి వ్రతుల వద్దకు వచ్చి వుంటాడు. దశమితో కలిసిన ఏకాదశినాడు రాక్షసులు వచ్చి వుంటారు. తిథి విషయంలో సందేహాలున్నవారు ద్వాదశినాడు కూడా ఉపవసించి త్రయోదశినాడు పారణం చేయడం మంచిది.

ఒకరోజులో ఏకాదశి ఏకకళ మాత్రమే వుంటే ద్వాదశినాడీ వ్రతాన్ని చేయాలి. (తగులు, మిగులు అనే మాటలు తెలుగు కుటుంబాలలో వాడుకలో వున్నాయి. తగులు మరీ తక్కువగా వుంటే మిగులులో చేయవచ్చని అర్థం) ఒకే రోజులో దశమి, ఏకాదశి, త్రయోదశి తిథులు వస్తే ఆ రోజు తప్పనిసరిగా వ్రతం చేయాలి. అది పరమమంగళకరమైన రోజు; సర్వపాపవినాశకరమైన రోజు.

రాత్రి జాగరణ, పురాణ శ్రవణం, గదాధర విష్ణుదేవుని పూజ - ఈ మూటినీ కృష్ణ, శుద్ధ ఏకాదశులలో, ఉపవాసంతో సహా జీవితాంతమూ చేసిన రుక్మాంగద మహారాజుకి మోక్షం లభించింది. కాబట్టి ఈ వ్రతాన్ని ఎవరుచేసినా సుఖజీవనం, మోక్షప్రాప్తి కలుగుతాయి. ***(అధ్యాయం -125)***

---

★ *ఈ పురాణంలో వైష్ణవంలోని ఏకాదశిని మాత్రమే చర్చించడం జరిగింది.*

# విష్ణుమండల పూజావిధి

"భుక్తి ముక్తిప్రదాయకం, పరమగతి ప్రాప్తిదం ఐన మరొక శ్రేష్ఠ పూజను విధి విధానయుక్తంగా వర్ణిస్తాను వినండి" అంటూ బ్రహ్మదేవుడు విష్ణుమండల పూజను వర్ణించసాగాడు.

ప్రతి ముందొక సామాన్య పూజామండలాన్నే నిర్మించి దాని ద్వారం దగ్గర పూజను మొదలుపెట్టాలి. ద్వారప్రదేశంలోనే ముందుగా ధాత, విధాత, గంగా యమునలనూ తరువాత శ్రీ, దండ, ప్రచండ, వాస్తు పురుషులనూ పూజించాలి.

తరువాత మండల మధ్యభాగంలో ఆధారశక్తి కూర్మదేవ, అనంతులను పూజించాలి.

పిమ్మట పృథ్వి, ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్య, అధర్మ, అజ్ఞాన, అవైరాగ్య, అనైశ్వర్యాలను కంద, నాళ, పద్మ, కర్ణిక, కేసరాది భాగాలపై పూజించి, సత్త్వ రజస్తమో గుణాలను కూడా పూజించాలి. తరువాత యథావిహిత స్థానాల్లో సూర్యాదిగ్రహాలనూ, విమలాది శక్తులనూ అర్చించాలి.

తరువాత మండల కోణ భాగాలలో దుర్గ, గణేశ, సరస్వతి, క్షేత్ర పాలుడగు స్వామిలను పూజించాలి. అప్పుడు వాసుదేవుని ఆసనాన్నీ దానిపై వుంచిన మూర్తులనూ పూజించి వాసుదేవ, బలభద్రుల స్మరణను కొంతసేపు గావించి ఆపై అనిరుద్ధునీ, నారాయణునీ పూజించాలి. అపుడు నారాయణుని సంపూర్ణ పూజను –అనగా హృదయాది సర్వాంగములనూ, శంఖ చక్రగదాది ఆయుధాలనూ అర్చించాలి. అనంతరం శ్రీ, పుష్టి, గరుడ, గురు, పరమగురువులనూ, ఇంద్రాది అష్టదిక్పాలకులనూ (వారి వారి దిశలలోనే) పూజించి మండల పైభాగంలో బ్రహ్మనీ, క్రింది భాగంలో నాగదేవతనీ పూజించాలి. ఆగమశాస్త్రంలో చెప్పబడిన విధంగా చోటును చూసి ఈశానకోణంలో విష్వక్సేనుని పూజించడంతో మంగళకరమైన మండలపూజ సంపూర్ణమవుతుంది.

ఈ విధంగా విష్ణుమండలపూజను గావించినవారు మహాత్ములవుతారు. వారికి పునర్జన్మ వుండదు.

*(ఇందులో పేర్కొనబడిన దేవతలందరినీ మంత్ర సహితంగా ఎలా పూజించాలో ఈ పురాణంలోనే అధ్యాయాలలో చెప్పబడింది)*

***(అధ్యాయం-126)***

# భీమా - ఏకాదశి (భీమైకాదశి)

(సంస్కృత వ్యాకరణం ప్రకారం 'భీమైకాదశి' అనాలి)

ప్రాచీనకాలంలో పాండు పుత్రుడైన భీమసేనుడు మాఘశుద్ధ హస్తనక్షత్ర యుక్త ఏకాదశినాడు ఈ పరమ పుణ్యప్రద వ్రతాన్ని చేసి పితృౠణ విముక్తుడైనాడు. ఆ మరుసటి రోజును ఆనాటినుండి భీమద్వాదశిగా వ్యవహరిస్తున్నారు. బ్రహ్మహత్యాది మహాపాతకాలు కూడా ఆ రోజు శాస్త్రోక్తంగా వ్రతం చేస్తే నశిస్తాయి.

బ్రహ్మ హత్య, సురాపానం, స్వర్ణచౌర్యం, గురుపత్నీగమనం –ఈ పాపాలు మహాపాతకాలని ధర్మశాస్త్రాలు వక్కాణిస్తున్నాయి. వీటిలో ఏ ఒక్కదాన్నయినా చేసినవాడు త్రిపుష్కర తీర్థాలలో మునిగినా శుద్ధుడు కాడు, పవిత్రుడు కాలేడు. ఈ వ్రతం మహాపాతకుని కూడా శుద్ధునీ, పవిత్రునీ చేయగలదు. నైమిష, కురు, ప్రభాసక్షేత్రాలూ, కాళింది(యమున) గంగ మున్నగు తీర్థాలూ ఎట్టి పాపాన్నయినా కడిగివేయగలవు గానీ మహాపాపములను నశింపజేయలేవు. దానాలూ, జపాలూ, హోమాలూ, పూజలూ కూడా అంతే. పృథ్వినే దానం చేయగా వచ్చేపుణ్యాన్ని త్రాసులో ఒకవైపూ, ఈ పవిత్ర భీమైకాదశి ద్వారా హరిని పూజింపగా వచ్చిన పుణ్యాన్నొక వైపూ వేసి తూస్తే ఏకాదశిపుణ్యమే ఎక్కువ శక్తిమంతమని తేలిపోతుంది.

వ్రత విధానమేమనగా ముందుగా వరాహ దేవుని స్వర్ణ ప్రతిమను తయారుచేయించి దానిని నూతన తామ్రపత్రంలో కలశపై స్థాపించాలి. తరువాత బ్రాహ్మణులచే సమస్త విశ్వమునకే బీజభూతుడైన విష్ణుదేవుని రూపమైన ఆ వరాహ ప్రతిమను తెల్లని పట్టుబట్టలచే కప్పించి స్వర్ణ నిర్మిత దీపాదులచే ప్రయత్నపూర్వకంగా పూజచేయించాలి.

| | | |
|---|---|---|
| ఓం వరాహాయనమః | – | **చరణ కమలాలు** |
| ఓం క్రోడాకృతయేనమః | – | **కటిప్రదేశం** |
| ఓం గంభీర ఘోషాయనమః | – | **నాభి** |
| ఓం శ్రీ వత్సధారిణే నమః | – | **వక్షఃస్థలం** |
| ఓం సహస్ర శిరసే నమః | – | **భుజాలు** |
| ఓం సర్వేశ్వరాయనమః | – | **గ్రీవము** |
| ఓం సర్వాత్మనే నమః | – | **నోరు** |
| ఓం ప్రభవాయ నమః | – | **లలాటము** |
| ఓం శతమయూఖాయనమః | – | **కేశరాశి** |

పైన చెప్పబడిన మంత్రాలను జపిస్తూ స్వయంగా ప్రతియే వాటికెదురుగా చెప్పబడిన, మహావిష్ణువు యొక్క శరీరభాగాలను పూజించాలి. తదనంతరం రాత్రి జాగారం చేసి హరికథా శ్రవణం చేయాలి. అదీ విష్ణు పురాణమైతే ప్రశస్తం. మరుసటి దినం స్నానాదికాలనూ నిత్యపూజనూ ముగించి నిన్న పూజలందిన స్వర్ణమయ వరాహమూర్తిని పూజాసక్తుడైన బ్రాహ్మణునికి దానమిచ్చి పారణ చేయాలి.

ఈ విధంగా ఈ వ్రతాన్ని చేసిన వానికిక పునర్జన్మ వుండదు. పితృ, గురు, దేవ ఋణాలూ తీరిపోతాయి. ఈ లోకంలో వున్నంతకాలం అన్ని కోరికలూ తీరి సుఖశాంతులతో జీవిస్తాడు. 'ఈ వ్రతమే అన్ని వ్రతాలకూ ఆది' అని పెద్దలంటారు. ***(అధ్యాయం -127)***

# వ్రత పరిభాష, నియమాదులకు సంబంధించిన జ్ఞానం

**వ్యా**సమునీంద్రా! నారాయణ సంప్రీతికరములైన కొన్ని వ్రతాలను పదేశిస్తాను. శాస్త్రములలో వర్ణింపబడిన నియమములను తప్పకుండా పాటించడమే వ్రతం. అదే తపస్సు కూడానూ. కొన్ని సామాన్య నియమాలిలా వుంటాయి.

నిత్యం త్రిసంధ్యలలో స్నానం. భూమిపై శయనం. పవిత్రంగా వుంటూ రోజూ హవనం చేయడం.

పతిత జన సాంగత్యాన్ని వర్జించడం. వ్రతం కోసం కాంస్యపాత్ర, ఉడద (చిక్కుడు) ధాన్యం, పెసరవంటి పప్పు, ధాన్యాలు, ఉల్లి, ఇతరులు పెట్టే అన్నం, కూరలు, మధుసేవనం (అనగా తేనె వంటి రుచులు, భోగాలు. మద్యపానం ఎప్పుడూ పాపమే) వీటన్నిటినీ విసర్జించాలి. పువ్వులు, ఇతర అలంకారాలు, కొత్తబట్టలు, ధూపగంధలేపనాది సరదాలు, అంజన ప్రయోగం – వ్రతకాలంలో వదిలెయ్యాలి. ఒక మారు కంటె నెక్కువగా నీరు, ఇతరపానీయాలు (కాఫీ, టీలాంటివి ఇప్పుడు) తాంబూలం, పగటినిద్ర, భార్యతోనైనా మైథునం, వీటిలో నేది చేసినా వ్రతభంగమే అవుతుంది. పంచగవ్యాలను త్రాగవచ్చు.

క్షమ, సత్యం, దయ, దానం, శౌచం, ఇంద్రియనిగ్రహం, దేవపూజ, అగ్నిలోహవనం, సంతోషం, నీతి (పురాణంలో అచౌర్యమని వుంది) ఈ పదీ అన్ని వ్రతాలకూ సర్వసామాన్య ధర్మాలు.

*క్షమా సత్యం దయాదానం శౌచమింద్రియనిగ్రహః ।*
*దేవ పూజాగ్ని హవనే సంతోషోఽస్తేయమేవచ ।*
*సర్వ వ్రతేష్వయం ధర్మః సామాన్యోదశధా స్మృతః ॥* ***(ఆచార..128/8,9)***

ఇరవై నాలుగు గంటలలో ఒకేమారు చీకటిపడి నక్షత్ర దర్శనం జరుగుతుండగా భోజనం చేయడమే నక్తవ్రతమవుతుంది. రాత్రెప్పుడో భోంచేయడం కాదు. పంచగవ్య ప్రాశ్నకి కూడా హద్దులూ, మంత్రాలూ వున్నాయి.

| | | |
|---|---|---|
| గోమూత్రం | గాయత్రి | ఒకపలం |
| గోమయం | గంధద్వారా... | అర్ధాంగుష్ఠ |
| ఆవుపాలు | ఆప్యాయస్వ... | ఏడు పలంలు |
| ఆవు పెరుగు | దధి | మూడు పలంలు |
| ఆవునెయ్యి | తేజో౬సి | ఒక పలం |

**దేవస్య....** అనే మంత్రంతో కుశదర్భలు కడిగిన మంత్రజలంతో పంచగవ్యాలను శుద్ధి చేయాలి. ఒకపలం ఆ జలాన్ని ఆయా మంత్రాలను చదువుతూ ఆయా ద్రవ్యాల బరువును తూచి పెట్టుకొని సేవించాలి.

ఆగ్న్యాధానం, ప్రతిష్ఠ, యజ్ఞం, దానం, వ్రతం,వేదవ్రతం,వృషోత్సర్గం, చూడాకరణం, ఉపనయనం, వివాహాది మంగళకరకృత్యాలు, రాజ్యాభిషేకాది అధికార కర్మలు మలమాసంలో చేయరాదు.

అమావాస్యనుండి అమావాస్య దాకా జరిగే కాలాన్ని చాంద్రమాసమంటారు. సూర్యోదయం నుండి మరుసటి సూర్యోదయం దాకా వుండే కాలాన్ని ఒక దినం (ప్రస్తుత భాషలో రోజు) అంటారు. ఇలాటి ముప్పదిరోజులొక మాసం. ఒక రాశి నుండి మరొకరాశి లోకి సూర్యుని సంక్రమణకాలాన్ని సౌరకుటుంబం అంటారు. నక్షత్రాలు ఇరవైయేడు. వాటివల్ల లెక్కగట్టే మాసం నక్షత్రమాసం. వివాహకార్యానికి సౌరమాసాన్నీ, యజ్ఞాదులకు మాసాన్నీ (సావనమాసం) గ్రహించాలి.

యుగ్మతిథులనగా రెండు తిథులొకేరోజు పడడం. వీటిలో విదియతో తదియ, చవితితో పంచమి, షష్ఠితో సప్తమి, అష్టమితో నవమి, ఏకాదశితో ద్వాదశి, చతుర్దశితో పున్నమి, పాడ్యమితో అమావాస్య యోగించిన రోజులు గొప్పఫలదాయకాలవుతాయి. ఇతర యుగ్మాలు మహాఘోర కాలాలు. వాటికి మన పూర్వజన్మపుణ్యాన్ని కూడా హరించేటంత దుష్టశక్తి వుంటుంది.

వ్రత ప్రారంభానంతరం స్త్రీలకు రజోదర్శనమైనా వ్రతనష్టం జరగదు. వారు దాన, పూజాదికార్యాలను ఇతరులచేత చేయించాలి. స్నాన- ఉపవాసాదిక కాయిక కార్యాలను స్వయంగా చేస్తే చాలు.

క్రోధ, ప్రమాద, లోభాల వల్ల వ్రత భంగమైనవారు మూడు రోజులుపవసించి శిరోముండనం చేయించుకొని వ్రతాన్ని పూర్తి చేయవచ్చు. శరీరం సహకరించక మధ్యలోనే వ్రతాన్ని ఆపవలసి వచ్చినవారు పుత్రాదులచే దానిని పూర్తిచేయించవచ్చును. వ్రతం చేస్తూ వ్రతి మూర్ఛపోయినంత మాత్రమున వ్రత భంగమైపోదు. జలాది పరిచర్యలచే మేలుకొని, తేరుకొని మరల కొనసాగించవచ్చును. ***(అధ్యాయం -128)***

# పాడ్యమి నుండి పంచమి దాకా వివిధ తిథి వ్రతాలు

**వ్యా**సమహర్షీ! ఇపుడు నేను ప్రతిపదాది తిథుల వ్రతాలను ఉపదేశిస్తాను. ప్రతిపదా అనగా పాడ్యమి తిథి నాడు చేయవలసిన ఒక విశేషవ్రతం పేరు శిఖి వ్రతం. ఈ వ్రతాన్నాచరించిన వారికి వైశ్వానరపదం సిద్ధిస్తుంది. పాడ్యమి నాడు ఏకభుక్తవ్రతం. అనగా పగటిపూట ఒకేమారు భోజనం చేసి వుండిపోవాలి. వ్రతం చివర్లో కపిల గోవును దానమివ్వాలి. చైత్రమాసారంభంలో విధిపూర్వకంగా గంధ, సుందరపుష్ప, మాలాదులతో బ్రహ్మను పూజించి హవనం చేసినవారు అభీష్ట ఫలప్రాప్తి నందగలరు. కార్తిక శుద్ధ అష్టమినాడు పూలనూ వాటి మాలలనూ దానం చేయాలి. ఇలా ఏడాదిపొడవునా చేసిన వారికి రూప సౌందర్యం లభిస్తుంది.

శ్రావణ కృష్ణ తదియనాడు లక్ష్మీ, శ్రీధర విష్ణుల మూర్తులను బాగా అలంకరించ బడిన శయ్యపై స్థాపించి పూజించి రకరకాల పండ్లను నివేదించి ఆ శయ్యాదులను బ్రాహ్మణునికి దానం చేసి ఈ విధంగా ప్రార్థించాలి. శ్రీధరాయనమః శ్రియైనమః ఈ తదియనాడే ఉమామహేశ్వరులనూ, అగ్నినీ కూడా పూజించాలి. ఈ దేవతలందరికీ హవిష్యాన్నాన్నీ, తన కిష్టమైన పదార్థాలనూ, తెల్లకమలాల (దమనకాల) నూ నివేదించాలి.

ఫాల్గునాది తదియల వ్రతంలో వ్రతి ఉప్పు తినరాదు. వ్రతాంతమున బ్రాహ్మణుని ఆయన పత్నితో సహా పూజించి అన్న, శయ్యా, పాత్రాది ఉపస్కరయుక్త మైన ఇంటిని దానం చేసి ***భవానీ ప్రీయతాం*** అనాలి. ఇలా చేసిన వారికి దేహాంతం లో భవానీలోకం ప్రాప్తిస్తుంది. ఈ లోకంలో కూడా సర్వసుఖాలూ లభిస్తాయి.

మార్గశిర తదియనుండి క్రమంగా తిథి నాటి కొకరుగా గౌరి, కాళి, ఉమ, భద్ర, దుర్గ, కాంతి, సరస్వతి, మంగళ, వైష్ణవి, లక్ష్మి, శివా, నారాయణీ దేవీ స్వరూపాలను పూజించాలి. దీనివల్ల ప్రియజన వియోగాది కష్టాలు కలగకుండా వుంటాయి.

మాఘశుద్ధ చతుర్థినాడు ఆహారమేమీ తీసుకోకుండా బ్రాహ్మణునికి తిలాదానం చేసి వ్రతి తిలలను నీటిని ఆహారంగా భావించి ప్రాశ్న చేయాలి. ఈ విధంగా ప్రతినెలా

రెండేళ్ళపాటు చేసి వ్రత సమాప్తిని గావించాలి. ఇలా చేసిన వారికి జీవితంలో ఏ విఘ్నాలూ కలగవు. ప్రతి చవితి నాడూ గణపతిని యథావిధిగా పూజించాలి. ఈ పూజలో మూలమంత్రమైన ***ఓం గఃస్వాహా*** ను వీలైనన్ని మార్లు పఠిస్తూ ఈ క్రింద పేర్కొన్న విధంగా అంగన్యాస పూజనూ చేయాలి.

***ఓం గ్లౌం గ్లాం హృదయాయనమః*** అంటూ కుడిచేతి అయిదు వేళ్ళతోనూ గుండెను ముట్టుకోవాలి.

***ఓంగాంగీంగూం శిరసే స్వాహా*** అంటూ తలనూ

***ఓంహ్రూంహ్రీం హ్రీం శిఖాయై*** వషట్ అంటూ పిలకనూ

***ఓం గూంకవచాయ వర్మణే హుం*** అంటూ కుడి వ్రేళ్ళతో ఎడమభుజాన్నీ ఎడమ చేతి వ్రేళ్ళతో కుడిభుజాన్నీ స్పృశించాలి.

ఇంకా ***ఓం గౌం నేత్ర త్రయాయ వౌషట్*** అంటూ కుడిచేతి వ్రేళ్ళ కొనలతో రెండు కనులనూ, లలాట మధ్య భాగాన్నీ స్పృశించాలి.

చివరగా ***ఓం గౌం అస్త్రాయ ఫట్*** అనే మంత్రవాక్యముతో కుడిచేతిని తలపైకి లేపి ఎడమవైపు నుండి తలవెనుకకు గొనిపోయి కుడివైపు నుండి ముందుకి తీసుకువచ్చి చూపుడు, మధ్యమ వ్రేళ్ళతో ఎడమ అరచేతిని చప్పట్లు కొట్టినట్టు చరచాలి.

***ఆవాహనాదులలో ఈ క్రింది మంత్రాలను పఠించాలి.***
***ఆగచ్ఛోల్కాయ గంధోల్కః పుష్పోల్కో ధూపకోల్కకః ।***
***దీపోల్కాయ మహోల్కాయ బలిశ్చాథ విస (మా)ర్జనం ॥***

పూజాద్రవ్యాలన్నిటినీ తేజః స్వరూపాలుగా భావించి సాధకుడు పెట్టి వెలిగించిన దీపానికి మరింతకాంతిని ప్రసాదించి వ్రతాంతం దాకా నిలబెట్టుమని చేసినప్రార్థన ఇది.

ఆవాహన తరువాత ఒక ప్రత్యేక గాయత్రి మంత్రాన్ని పఠిస్తూ అంగుష్ఠాదిన్యాసం చేయాలి. ఇలా:

***ఓం మహా కర్ణాయ విద్మహే***
***వక్రతుండాయ ధీమహి***
***తన్నో దంతిః ప్రచోదయాత్ ।***

కరన్యాసం కడముట్టినాక ఈ మంత్రాన్నే పఠిస్తూ తిలాదులతో వినాయకుని పూజించి వాటినే ఆహుతులుగా ఇవ్వాలి. గణాలను కూడా స్మరిస్తూ ***ఓం గణాయనమః, ఓం***

***గణపతయేనమః ఓం కూష్మాండకాయనమః*** అంటూ పూజించాలి. ఇదేవిధంగా ఇతర గణాలను పూజిస్తూ 'స్వాహా'ను చేర్చి ఆహుతులిలా ఇవ్వాలి.

***ఓం నమ అమోఘోల్కాయ స్వాహా***
***ఓం నమః ఏకదంతాయ స్వాహా***
***ఓం నమస్ త్రిపురాంతక రూపాయ స్వాహా***
***ఓం నమశ్శ్యామదంతాయ స్వాహా***
***ఓం నమో వికారలా స్యాయ స్వాహా***
***ఓం నమ ఆహవేషాయ స్వాహా***
***ఓం నమః పద్మ దంష్ట్రాయ స్వాహా ।***

అనంతరం ప్రతి గణదేవునికి ముద్రలను ప్రదర్శించి, నృత్యం చేసి, చప్పట్లు కొట్టి, హాస్య ప్రసంగాలను చేయాలి. ఇలా చేసిన వారికి సకల సౌభాగ్యాలూ కలుగుతాయి.

మార్గశిరశుద్ధ చవితినాడు దేవగణముల వారిని పూజించాలి. సోమవారము, చవితిరోజులలో ఉపవాసముండి గణపతి దేవుని పూజించి ఆయనను జప, హవన, స్మరణల ద్వారా ప్రసన్నం చేసుకోగలిగినవారికి విద్య, స్వర్గం, మోక్షం లభిస్తాయి.

ప్రతి శుద్ధ చవితినాడూ చక్కెర లడ్లతో, కుడుములతో విఘ్నేశ్వరుని పూజించేవారికి సర్వకామనలూ సిద్ధిస్తాయి, సర్వసౌభాగ్యాలూ అబ్బుతాయి. దమనకాలతో ఇదే విధంగా పూజించేవారికి పుత్ర ప్రాప్తి కలుగుతుంది. అందుకే కొన్ని ప్రాంతాల్లో శుద్ధ చవితిని దమనా అని కూడా అంటారు.

***ఓం గణపతయేనమః –*** ఈ మంత్రంతో గణపతిని పూజించాలి. ఏ మాసపు శుద్ధచవితి నాడైనా గణపతిని పూజించి హోమ, జప, స్మరణములను చేస్తే అన్ని విఘ్నాలూ నశించి అన్ని కోరికలూ తీరతాయి. గణపతికి గల విభిన్న నామాలను జపిస్తూ గాని స్మరిస్తూ గాని ఆ ఆద్యదేవుని పూజిస్తే సద్గతి ప్రాప్తిస్తుంది. ప్రతి ఈ లోకంలో నున్నంతకాలం సమస్త సుఖాలనూ అనుభవిస్తాడు. అంతలో స్వర్గాన్నీ మోక్షాన్నీ పొందుతాడు.

***వినాయకుని పన్నెండు నామములూ ఈ శ్లోకంలో చెప్పబడ్డాయి.***

*గణపూజ్యో వక్రతుండ ఏకదంష్ట్రీ త్రియంబకః ।*
*నీలగ్రీవో లంబోదరో వికటో విఘ్న రాజకః ॥*

*ధూమ్రవర్ణో భాలచంద్రో దశమస్తు వినాయకః ।*
*గణపతి ర్హస్తిముఖో ద్వాదశారే యజేద్గణం ॥* ***(ఆచార.. 129/25,26)***

ఒక్కొక్క నామాన్నే జపిస్తూ ఒక్కొక్క చవితి నాడూ యథావిధిగా పూజ చేసి అలా ఒక ఏడాది చేసినవారికి అభీష్ట సిద్ధి కలుగుతుంది.

ఇక పంచమి నాడు నాగులను పూజించాలి. శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తిక మాసాలలో శుక్ల పంచమి తిథుల్లో వాసుకి, తక్షక, కాళియ, మణిభద్రక, ఐరావత, ధృతరాష్ట్ర, కర్కోటక, ధనుంజయ నామకులైన ఎనమండుగురు నాగరాజు లనూ పూజించాలి. వీరికి నేతితో స్నానం చేయించి పూజ చేయాలి. ఈ నాగాధీశులు తమ భక్తులకు ఆయురా రోగ్యాలనూ, స్వర్గలోక నివాసాన్నీ ప్రసాదించగలరు. అనంతుడు, వాసుకి, శంఖుడు, పద్ముడు, కంబలుడు, కర్కోటకుడు, ధృతరాష్ట్రుడు, శంఖకుడు, కాళియుడు, తక్షకుడు, పింగళుడు – ఈ పన్నిద్దరు నాగులనూ ఇదే క్రమంలో నెలకొకరిని పూజించాలి. భాద్రపద శుద్ధపంచమి నాడు ఎనమండుగురు నాగులనూ ఒకేసారి పూజించాలి. నాగరాజులు స్వర్గాన్నీ మోక్షాన్నీ ప్రసాదించగలరు.

శ్రావణశుద్ధ పంచమినాడు ద్వారానికి రెండువైపులా ఈ నాగుల చిత్రపటాలను పెట్టి పూజించాలి. నైవేద్యంగా పాలనూ నేతినీ వుంచాలి. ఈ పూజవల్ల విషదోదాషాలా యింటి కంటవు. పాము కాటు ఆ ఇంటివారినేమీ చేయలేదు. అందుకే ఈ పంచమిని దంష్ట్రో ద్వార పంచమి అంటారు. ***(అధ్యాయం –129)***

# షష్ఠి, సప్తమి వ్రతాలు

**భా**ద్రపద షష్ఠినాడు కార్తికేయుని పూజించాలి. ఈ పూజలో చేసే స్నానాది పవిత్ర కృత్యాలన్నీ అక్షయ ఫలదాయకాలవుతాయి. వ్రతి షష్ఠినాడుపవాసం చేసి సప్తమి నాడు బ్రాహ్మణులకు భోజనాలు పెట్టి ముందుగా ***ఓం ఖఖోల్కాయనమః*** అనే మంత్రంతో సూర్యుని పూజించాలి. అష్టమినాడు మిరియాలతో భోజనం చేసి పారణ చేయాలి. (సప్తమి నాటి భోజనం సంగతి ఇక్కడ చెప్పబడలేదు. గాని కొన్ని ప్రాంతాల్లో ఆరోజు 'చప్పిడి' చేస్తారు. అనగా ఉప్పుకారములు లేని భోజనం చేస్తారు – అను) మిరియాన్ని 'మరిచ' అంటారు. కాబట్టి ఈ సప్తమి వ్రతానికి మరిచ సప్తమివ్రత మనే పేరుంది. ఈ వ్రతం చేసిన వారికి దూరమైన ప్రియజనులు దగ్గరౌతారు. ఇక ఎడబాటన్నది వుండదు. ఈ రోజు సంయమనాన్ని పాటిస్తూ స్నానాదికములను చేసి ***మార్తండః ప్రీయతాం*** అంటూ యథావిధి సూర్యుని పూజించి, అదే వాక్యాన్ని పలుకుతూ బ్రాహ్మణులకు ఖర్జూరం, నారికేళం, గజనిమ్మ మున్నగు పండ్లను దానం చేయాలి. వ్రతి కూడా ఆ రాత్రికి వాటినే తిని శయనించాలి. ఈ వ్రతాన్ని ఫల సప్తమీ వ్రతమని ఇందువల్లనే అంటారు.

సప్తమి నాడు సూర్యదేవుని పూజించిన తరువాత బ్రాహ్మణునికి పాయసంతో భోజనం పెట్టి దక్షిణనిచ్చి వ్రతి స్వయంగా పాలను త్రాగి వ్రతాన్ని ముగిస్తే పుణ్యప్రదుడౌ తాడు. కోరికని బట్టి ఆహారముండే వ్రతమిది. ధన- పుత్ర లాభం కావలసినవారు ఓదన, భక్ష్యాదులను తీసుకోరాదు. దీనిని అనౌదక సప్తమీ వ్రతమంటారు.

అలాగే విజయాన్ని కోరుకునేవారు వాయు భక్షణ మాత్రమే చేయాలి. దానిని విజయ సప్తమి వ్రతమంటారు. మధు, మైధునాదులనూ, ఉడద, యవ, తిలాదులనూ, తైలమర్దన, అంజనాదులనూ ఇతర సర్వభోగాలనూ పరిత్యజించి చేస్తేనే ఈ వ్రతం పూర్తి ఫలితాన్నిస్తుంది. ***(అధ్యాయం -130)***

# దూర్వాష్టమి, శ్రీకృష్ణాష్టమి

**భా**ద్రపద శుద్ధ అష్టమినాడు దూర్వాష్టమి వ్రతాన్ని చేయాలి. దూర్వ యనగా గరిక. ఆ రోజు ఉపవాసం చేసి గౌరీ, గణేశ, శివ ప్రతిరూపాలను గరికెతోనూ ఆపై ఫల పుష్పాదులతోనూ పూజించాలి. ప్రతి పూజాద్రవ్యాన్నీ ***శంభవేనమః, శివాయనమః*** అంటూ శివునిపై వేయాలి. దూర్వను కూడా ఇలా ప్రార్థించాలి.

***త్వందూర్వేఽమృతజన్మాసి వందితా చ సురాసురైః ।***
***సౌభాగ్యం సంతతిం కృత్వా సర్వకార్య కరీభవ ॥***

***యథాశాఖా ప్రశాఖాభిర్విస్తు తాసి మహీతలే ।***
***తథా మమాపి సంతానం దేహి త్వమజరామరే ॥***

ఈ దూర్వాష్టమి వ్రతాన్ని చేసిన వారికి సర్వస్వ ప్రదానాన్ని దేవతలు చేస్తారు. ఈ వ్రతం చేసి అగ్ని పక్వం కాని భోజనం చేసేవారు బ్రహ్మహత్యాపాతకం నుండి విముక్తు లౌతారు.

శ్రీకృష్ణాష్టమి భాద్రపద కృష్ణ అష్టమి నాడు జరపబడుతుంది. ఆ రోజు అర్ధరాత్రి రోహిణినక్షత్రంలో ఆ యుగపురుషునిగా భగవానుడైన శ్రీహరి పుడమిపై నవతరించాడు. సప్తమితో కలిసిన ఈ అష్టమి కూడా వ్రతయోగ్యమే. ఈనాడు కృష్ణుని పూజించిన వారికి మూడు జన్మల పాపాలు నశిస్తాయి. ముందుగా

***ఓం యోగాయ యోగపతయే యోగేశ్వరాయ ।***
***యోగ సంభవాయ గోవిందాయ నమోనమః ॥***

అనే మంత్రంతో యోగేశ్వరుడూ యోగీశ్వరుడూనైన శ్రీకృష్ణుని ధ్యానించి ఈ క్రింది మంత్రంతో ఆయన ప్రతిమకు స్నానం చేయించాలి.

*ఓం యజ్ఞాయ యజ్ఞేశ్వరాయ యజ్ఞపతయే*
*యజ్ఞ సంభవాయ గోవిందాయ నమో నమః ।*

అనంతరం ఈ మంత్రంతో ఆయనను పూజించాలి.

*ఓం విశ్వాయ విశ్వేశ్వరాయ విశ్వపతయే*
*విశ్వ సంభవాయ గోవిందాయ నమో నమః ।*

పిమ్మట ఈ మంత్రంతో స్వామిని శయనింపజేయాలి.

*ఓం సర్వాయ సర్వేశ్వరాయ సర్వపతయే*
*సర్వసంభవాయ గోవిందాయ నమోనమః ।*

ఒక స్థండిలం (వేది) పై చంద్రునీ, రోహిణీనీ శ్రీకృష్ణభగవానునీ ఉంచి పూజించాలి. పుష్ప, జల, చందనయుక్త జలాన్ని ఒక శంఖంలో తీసి పట్టుకొని మోకాళ్ళపై కూర్చుని క్రింది మంత్రాన్ని చదువుతూ చంద్రుని కర్ఘ్యమివ్వాలి.

*క్షీరోదార్ణవ సంభూత అత్రినేత్ర సముద్భవ ।*
*గృహాణార్ఘ్యం శశాంకేశ రోహిణ్యా సహితో మమ ॥* *(ఆచార..131/8,9)*

తరువాత మహాలక్ష్మికీ, వసుదేవునికీ, నందబలరామ యశోదలకూ అర్ఘ్యమివ్వాలి. అనంతరం శ్రీకృష్ణ పరమాత్మను ఇలా ప్రార్థించాలి.

*అనంతం వామనం శౌరిం వైకుంఠం పురుషోత్తమం ॥*
*వాసుదేవం హృషీకేశం మాధవం మధుసూదనం ।*

*వరాహంపుండరీకాక్షం నృసింహం దైత్య సూదనం ॥*
*దామోదరం పద్మనాభం కేశవం గరుడధ్వజం ।*

*గోవింద మచ్యుతం దేవమనంతమప రాజితం ॥*
*అధోక్షజం జగద్బీజం సర్గస్థిత్యంత కారణం ।*

*అనాది నిధనం విష్ణుం త్రిలోకేశంత్రివిక్రమం ॥*
*నారాయణం చతుర్బాహుం శంఖ చక్ర గదాధరం ।*

*పీతాంబర ధరం దివ్యం వనమాలావిభూషితం ॥*
*శ్రీ వత్సాంకం జగద్ధామం శ్రీ పతిం శ్రీధరం హరిం ।*

*యేదేవం దేవకీ దేవీ వసుదేవాదజీ జనత్ ॥*
*భౌమస్య బ్రాహ్మణో గుప్త్యై తస్మై బ్రహ్మాత్మనే నమః।* **(ఆచార131/10-16)**

ఈ ప్రకారంగా శ్రీకృష్ణభగవానుని అనేక నామ సంకీర్తన చేసి మరల సద్గతికై ఇలా ప్రార్థించాలి.

*త్రాహిమాం దేవ దేవేశ హరే సంసార సాగరాత్ ।*
*త్రాహి మాం సర్వపాపఘ్న దుఃఖశోకార్ణవాత్ ప్రభో ॥*

*దేవకీ నందన శ్రీశ హరే సంసార సాగరాత్ ।*
*దుర్వృత్తాం స్త్రాయసే విష్ణో యే స్మరంతి సకృత్సకృత్ ॥*

*సోఽహం దేవాతి దుర్వృత్త స్త్రాహి మాం శోక సాగరాత్ ।*
*పుష్కరాక్ష నిమగ్నోఽ హం మహత్యజ్ఞాన సాగరే ॥*

*త్రాహి మాం దేవ దేవేశ త్వామృతేఽన్యో న రక్షితా ।*
*స్వ జన్మవాసుదేవాయ గో బ్రాహ్మణ హితాయ చ ॥*

*జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయనమో నమః ।*
*శాంతి రస్తు శివంచాస్తు ధన విఖ్యాతి రాజ్య భాక్॥* **(ఆచార..131/17-21)**

ఈ ప్రార్థనలో వేడుకొన్నవన్నీ అనగా, అశాంతినుండి రక్షణ, దురాచారం నుండి విడుదల, అజ్ఞాన నాశనం, శాంతి, శుభం, ధనం, విఖ్యాతి, అధికారం ఇవన్నీ ఈ వ్రతం చేసినవారికి లభిస్తాయి. **(అధ్యాయం -131)**

## బుధాష్టమి - వ్రతం, కథ

బుధవారం, అష్టమి కలిసిన నాడు ఈ వ్రతాన్ని చేస్తారు. జలాశయంలో నిలబడి పంచోపచార విధితో బుధగ్రహాన్ని పూజించాలి. తరువాత గుమ్మడికాయనూ, బియ్యాన్నీ దానమిచ్చి యథాశక్తి దక్షిణనివ్వాలి. బుధదేవుని యొక్క పూజలోవాడే బీజమంత్రం ***ఓం బుం బుధాయనమః.*** ఈ దేవ పూజానంతరం కమల గట్టాది ఆహుతులను ఈయదానికి ***ఓం బుం బుధాయస్వాహా*** అనే మంత్రాన్ని ప్రయోగించాలి. జలాశయ మధ్యాన్నే పూర్ణమండలంగా భావించుకొని అక్కడే పూజా మండలాన్ని కల్పించుకొని దాని మధ్యలో పద్మదళాన్నీ దానిపై శ్యామవర్ణుడూ ధనుర్బాణయుక్తుడూనగు బుధునీ కల్పించుకొని ఆయన అంగాలను పూజించాలి. అప్పుడు పరమపుణ్యదాయినియైన ఈ వ్రతకథను జలాశయ తీరంలో కూడా పూజచేసి కూర్చుని వినాలి.

ప్రాచీన కాలంలో పాటలీపుత్రంలో 'వీరుడు' అను పేరు గల శ్రేష్ఠ బ్రాహ్మణుడొకాయన వుండేవాడు. ఆయన భార్య పేరు రంభ, కొడుకుపేరు కౌశికుడు, కూతురిపేరు విజయ. ఆతనికొక ఎద్దు కూడా వుండేది. దానికి ధనపాలుడని పేరు పెట్టి ప్రేమగా చూసుకుంటుండేవాడు. గ్రీష్మఋతువులో నొకనాడు కౌశికుడు ఎద్దుతో సహా గంగా స్నానానికి పోయి నదిలో నుండగా కొందరు దొంగలైన గోపాలకులు వచ్చి ఎద్దుని ధనపాలుని బలవంతంగా పట్టి బంధించి పట్టుకొనిపోయారు. కౌశికుడు దుఃఖితుడు, అన్వేషకుడునై అత్తీర ప్రాంతకాంతారంలో తిరుగసాగాడు. దైవవశాన వీరుని పత్నీ కూతురూ కూడా గంగాజలం కోసం వెళుతూ అక్కడికే చేరుకున్నారు. ఈలోగా కౌశికుడు ఆకలిదప్పులకు లోనై వనం నుండి బయటికి వచ్చి కలువకాడలు తినే ఉద్దేశ్యంతో ఒక కోనేటి వద్దకు రాగా అతని సోదరి కనిపించింది. ఇద్దరూ కాస్తముందుకి వెళ్ళేసరికి అక్కడ కొందరు దివ్య స్త్రీలు ఏదో పూజ చేసుకుంటూ దర్శనమిచ్చారు. కౌశికుడు ఆశ్చర్యపోతూనే వారి వద్దకు పోయి తనకూ తన సోదరికీ ఆహారాన్ని అర్థించాడు. వారీ బ్రాహ్మణ బాలకుని చూసి ప్రసన్నులై ఈ పదార్థాలన్నీ వ్రతానికుద్దేశింపబడినవి. మీరు కూడా మాతో పాటు ఈ బుధదేవుని వ్రతం చేయండి. మీ కోరికలు తీరుతాయి అన్నారు.

ఆ విధంగానే చేసి ప్రసాదం స్వీకరిస్తూ కౌశికుడు తన ఎద్దునీ విజయకి మంచి భర్తనీ కోరుకుని వెనుకకు మరలగా ఎద్దు ఎక్కడినుండో వచ్చి కౌశికుని ఎదుట నిలబడింది. దివ్య స్త్రీలు వారిని దీవిస్తూ అంతర్ధానం చెందారు.

వీరునికి మొదటినుండీ తన కూతుర్ని పరమ ధర్మపరుడైన వానికి, యమధర్మ రాజంత వానికి, ఇచ్చి పెళ్ళి చెయ్యాలని వుండేది. పాపమతడా కోరిక తీరకుండానే మరణించాడు. తరువాత కౌశికుడు విద్యలోనూ వీరత్వంలోనూ సర్వసమర్థుడై రాజ్య ప్రాప్తి కోసం మరల బుధాష్టమి వ్రతాన్ని గావించాడు. దైవమనుకూలించడంతో అచిరకాలంలోనే అయోధ్య సామ్రాజ్యంలో గల విశాల రాజ్యానికి రాజయ్యాడు.

తన తండ్రి కోరికనే తానూ కోరికొని మరల బుధాష్టమి వ్రతాన్ని చేశాడు. వ్రత ప్రభావం వల్ల యమధర్మరాజే స్వయంగా దిగివచ్చి విజయను వివాహం చేసుకొని ఆమెతో 'దేవీ నీవు నా గృహస్వామినివై నన్ననుగ్రహించు' అని ఆహ్వానించాడు. అద్భుతమైన ఆయన గృహంలో ఒక గదికి మాత్రం ఎప్పుడూ తాళం వేసి వుంటుంది. ఆ గది జోలికి పోవద్దని ఆయన చెప్పాడు కూడ. అయినా ఒకనాడేమీ తోచక స్త్రీ సహజమైన చాపల్యంతో విజయ ఆ గది తాళాలను తీసి తలుపు తెరిచి లోనికి చూచింది. వెంటనే ఆ లోపలి దృశ్యం కనబడి ఆమెకు తట్టుకోలేనంత దుఃఖం వచ్చింది. ఆ గదిలో ఆమె తల్లి

యమపాశబద్ధురాలై నానాహింసలనూ అనుభవిస్తూ గోచరించింది. ఆమెకు కౌశికుడు తనకు బోధించిన ముక్తి ప్రదాయకమైన బుధాష్టమి వ్రతం గుర్తుకొచ్చింది. వెంటనే ఆమె అనితర సాధ్యమైన భక్తి శ్రద్ధలతో బుధాష్టమి వ్రతాన్ని చేసింది. ఆ వ్రతఫలం వల్ల ఆమె తల్లి పాశమునుండి విడివడి దేవలోకం వైపు సాగిపోయింది.

అష్టమి తిథినాడు పగలు వ్రతం చేసి రాత్రి నక్తవ్రత నియమం పాటించి భోంచేస్తూ ఇలా ఒక యేడాది పాటు అన్ని అష్టమి దినాలలోనూ వ్రతం చేసి చివర గోదానం చేస్తే ఆ వ్రతి ఇంద్రపదానికర్హుడౌతాడు. ఈ వ్రతానికి సద్గతి వ్రతమని పేరు. పుష్య శుక్లాష్టమి నాడు చేసే వ్రతానికి మహారుద్రవ్రతమని పేరు.

ఒక నెలలో రెండు అష్టములూ బుధవారాలనాడే పడితే ఆ వ్రతికిక ఎదురేలేదు. అతని సంపత్తి ఏనాటికీ తగ్గదు. ముక్తిని కోరేవారు ఈ వ్రతం చేస్తూ పిడికిలి బిగించి రెండు వేళ్ళను విడదీసి, మిగిలిన పిడికిలితో ఎనిమిది మార్లుబియ్యాన్ని తీసి గిన్నెలో వేసి ఆ ద్రవ్యంతోనే సొజ్జి లేదా జావను వండుకొని తినాలి. వ్రతసమాప్తి సమయంలో దానితో పాటు చింతపండునూ, కరేలువను ఆకు కూరనూ మామిడాకుల దోనెలో పెట్టుకొని తిని వ్రత కథను శ్రద్ధగా విన్నవారి కన్ని కోరికలూ తీరతాయి. ***(అధ్యాయం -132)***

## కొన్ని నవమి వ్రతాలు - బుష్యేకాదశి

చైత్రమాసంలో పునర్వసు నక్షత్రయుక్త శుద్ధ అష్టమిని అశోకాష్టమి అంటారు. ఈ రోజు ఎనిమిది అశోకమంజరి మొగ్గలను కషాయం తీసి త్రాగాలి. అలా త్రాగుతున్నపుడీ శ్లోకం ద్వారా శివప్రియమైన ఆ దేవతను వ్రతి శోక విముక్తికై ప్రార్థించాలి.

***త్వామ శోక హరాభీష్ట మధుమాస సముద్భవ ।***
***పిబామి శోక సంతప్తో మామశోకం సదాకురు ॥*** ***(ఆచార.. 133/2)***

మంత్రయుక్తమైనదేదైనా గొప్పగా పనిచేస్తుంది.

**మహానవమి :** ఆశ్వయుజ శుద్ధంలో ఉత్తరాషాఢ నక్షత్రమూ, అష్టమీ కలిసిన నవమిని మహానవమి అంటారు. ఈ తిథిలో చేయు స్నానదానాదులకు అక్షయ ఫలాలుంటాయి. కేవల నవమి వున్నా (ఆశ్వయుజ శుద్ధంలో) దుర్గాపూజ చేయాలి. భగవంతుడైన శివుడే ఇతర దేవతలతో బాటు ఈ వ్రతాన్ని చేశాడు. ఇది అత్యంత, అత్యధిక, పుణ్యప్రదమైన మహావ్రతము. శత్రువులపై విజయాన్ని కోరుకునే రాజు నుండి జీవన సమరంలో, ఆకలిపోరాటంలో గెలుపు కావాలనే సామాన్యుడి దాకా ఈ వ్రతాన్ని చేస్తారు;

చెయ్యాలి. జప - హోమాల తరువాత కుమారీలకు భోజనం పెట్టాలి. ఈ వ్రతంలో దేవీ పూజనాది కృత్యాలలో ప్రయుక్తం కావలసిన మూల మంత్రం ఇది.

*ఓం దుర్గే దుర్గే రక్షిణి స్వాహా*

ఈ వ్రతాన్ని చేయువారు ముందుగా అష్టమినాడే కఱ్ఱలతో దేవికి తొమ్మిదిగాని ఒకటిగాని మండపాలను నిర్మించాలి. అందులో దేవి యొక్క బంగారు లేదా వెండి మూర్తిని స్థాపించాలి. దేవి మూర్తిని పుస్తకం, శూలం, ఖడ్గం లేదా పట్టు వస్త్రంలతో పూజించాలి. వాటిని చుట్టూ వుంచాలి. ఆమె యొక్క పదునెనిమిది చేతులలోనూ ఎడమవైపున్న వాటిలో కపాలం, వేటకొడవలి, గంట, అద్దం, విల్లు, ధ్వజం, డమరుకం, పాశం వుండాలి. ఒక చేయి చూపుడు వేలు మనవైపు కాకుండా పైకి చూపుతూ వుండాలి. కుడివైపున్న హస్తాలలో శక్తి, ముద్గరం, శూలం, వజ్రాయుధం, కత్తి, అంకుశం, బాణం, చక్రం, శలాకాయుధం అమర్చబడాలి. ఇతర దేవీ విగ్రహాలకు పదహారు చేతులే వుంటాయి. డమరుకం వుండదు.

మహానవమి నాడు ఉగ్ర చండాదేవికి ప్రాధాన్యమెక్కువ. రుద్రచండ, ప్రచండ, చండోగ్ర, చండనాయిక, చండ, చండవతి, చండరూప, అతి చండిక లను ఎనమండుగురు దేవీమతల్లుల మధ్య అగ్ని ప్రభలతో వెలిగిపోతూ నిలచి వుంటుంది. ఉగ్రచండాదేవి మిగతా దేవీ మణుల వర్ణాలు క్రమంగా రోచన, అరుణ, కృష్ణ, నీల, ధూమ్ర, శుక్ల, పీత, పాండురములు కాగా ఉగ్రచండాదేవి నాలుకలు చాస్తున్న అగ్నిజ్వాలల రంగులో వుంటుంది. ఆమె సింహంపై స్థితమై వుండగా నామె కెదురుగా కత్తి పట్టుకొని మహిషాసురుడుంటాడు. దేవి తన యొక్క ఒక చేతిలో వాని జుట్టు పట్టుకుని వుంటుంది. ఇదీ అమ్మ ఆకారం.

ఈ భగవతి చండిని మూల మంత్రంతో జపించేవానికే బాధలూ వుండవు. పైగా పండితుడు కూడా కాగలడు. ఎందుకంటే అది విద్యామంత్రం కూడ. దేవి విగ్రహంలోని ఖడ్గం త్రిశూలం పదిహేనేసి అంగుళాలుండాలి. గర్భగుడి (లేదా మండపం) నాలుగు కోణాల్లో నైరృత్యాదిగా ఆ మహాదేవి యొక్క ఉగ్రశక్తులైన ★ పూతన, పాపరాక్షసి, చరకి, విదారికల ప్రతిమలను పెట్టి వారిని కూడా పూజించాలి.

రాజులు శత్రు సంహారాన్ని గాని ఇతర విజయాలను గాని సంకల్పించి నపుడు మహానిష్ఠగా ఈ మహానవమి పూజలను చేస్తుంటారు. వారు దీనితోబాటు చేయవలసిన

---

★*ఈ పూతన శ్రీ కృష్ణావతారంలో కనిపించే పూతన కాదు. ఈమె ద్వాపర యుగానికి ముందే వున్న మహాశక్తి.*

విశేషపూజనమొకటున్నది. అదేమనగా బ్రహ్మాణీ, మహేశీ, కౌమారీ, వైష్ణవీ, వారాహ్యాది మాతృకలకు పాలతో స్నానాదులను చేయించి మహాదేవికి రథయాత్రను జరిపించుట. వారి కోరికలన్నీ ఫలిస్తాయి.

ఆశ్వయుజ శుద్ధనవమి నాడు ఏకభుక్తముండి దేవినీ, బ్రాహ్మణునీ పూజించి ఒక లక్ష బీజమంత్ర జపాన్ని చేయాలి. దీనిని **వీరనవమి** వ్రతమంటారు. చైత్ర శుద్ధనవమినాడు దమనక పుష్పాలతో దేవిని పూజిస్తే ఆయురారోగ్యైశ్వర్యములతో బాటు శత్రుంజయత్వం కూడా సిద్ధిస్తుంది. దీనిని దమనక నవమివ్రత మంటారు.

ఈ మాసంలోనే శుద్ధ దశమి నాడు ఏకభుక్త వ్రతాన్ని ప్రారంభించిఅలాఒక యేడాది పాటు చేసి చివర పదిగోవులను దానమిచ్చి దిక్పాలకులకు బంగారుఒడ్డాణమును నివేదించు కున్నవారికి బ్రహ్మాండాధిపత్యమే సిద్ధిస్తుంది. ఈ వ్రతానికి ***దిగ్దశమివ్రత*** మని పేరు.

ఈ ఏకాదశినాడూ, చైత్ర ఏకాదశినాడూ ఋషులను పూజించే వ్రతాలున్నవి. అవే ఋష్యైకాదశి వ్రతాలు. దమనక పుష్పాలతోనూ, వాటితోనే కట్టబడిన దండలతోనూ మరీచి, అత్రి, అంగిర, పులస్త్య, పులహ, క్రతు, ప్రచేత, వసిష్ఠ, భృగు, నారద మహర్షులను భక్తి మీరగా పూజిస్తే 'ఇక్కడ' అన్ని భోగాలతో బాటు జ్ఞానం కూడా కలిగి దేహాంతంలో 'అక్కడ' ఋషిలోక నివాస ప్రాప్తి వుంటుంది. ***(అధ్యాయాలు 133 -135)***

# శ్రవణద్వాదశి వ్రతం

*(నక్షత్రాల పేర్లనూ, తిథుల పేర్లనూ స్త్రీ లింగాలుగా భావించి సంస్కృత మర్యాద ప్రకారం చివర దీర్ఘాన్నుంచే సంప్రదాయముంది. తెలుగులో అవసరం లేదు. పెట్టినా దోషమేమీ కాదు)*

ప్రాణులకు భోగమునూ మోక్షాన్నీ కూడా కలిగించే వ్రతమిది. ఏకాదశి, ద్వాదశి, శ్రవణ నక్షత్రంఈ మూడూ యోగించిన రోజును విజయతిథి అంటారు. ఈ రోజు హరిని పూజిస్తూ చేసే అన్ని కార్యాలకూ అక్షయ పుణ్యఫలాలు లభిస్తాయి. ఈ రోజు ఏకభుక్తం, నక్తవ్రతం, అయాచితం, ఉపవాసం, భిక్షాన్నఖాదనం–ఏది చేసినా దానికి అనంత పుణ్యం వ్రతికి లభిస్తుంది. నియమమేమనగా కంచుపాత్ర, తేనె, మాంసం, లోభం, అసత్యభాషణం, వ్యాయామం, మైథునం, పగటి నిద్ర, అంజనం, రాతిపై నూరిన పదార్థాలు – వీటన్నిటినీ విసర్జించాలి. పెసర వంటి పప్పుధాన్యాలనూ విసర్జించాలి.

భాద్రపద శుక్ల ద్వాదశిశ్రవణ నక్షత్రం కలిసి ఒకేరోజు పడినపుడు అది గొప్ప మహత్తు గల దినమౌతుంది. ఆ రోజు చేసే ఉపవాసం గొప్పఫలప్రదమౌతుంది. ఈ రోజు బుధవారం పడితే నదీ సంగమంలో స్నానం చేసి జపం చేసిన వారికి మహనీయ ఫలాల బ్బుతాయి. ఈ రోజు వామన రూపియైన భగవానుని స్వర్ణమయ ప్రతిమను రత్నాలతో జలాలతో నింపిన పూర్ణకుంభంపై రెండు తెల్లటి వస్త్రాలను కప్పి దానిపై నుంచి ఛత్ర, పాదరక్ష సమన్వితం చేసి పూజించాలి.

ఈ యీ మంత్రాలతో ఎదురుగా సూచింపబడిన స్వామి వారి ఆయా అంగాలను అర్చించాలి.

| | | |
|---|---|---|
| ఓం నమో వాసుదేవాయ | – | **శిరస్సు** |
| ఓం శ్రీధరాయ నమః | – | **ముఖమండలం** |
| ఓం కృష్ణాయ నమః | – | **కంఠం** |
| ఓం శ్రీ పతయే నమః | – | **వక్షఃస్థలం** |
| ఓం సర్వాస్త్రధారిణే నమః | – | **భుజాలు** |
| ఓం వ్యాపకాయ నమః | – | **కుక్షి ప్రదేశం** |
| ఓం కేశవాయ నమః | – | **ఉదరం** |
| ఓం త్రైలోక్య పతయే నమః | – | **గుహ్యస్థానం** |
| ఓం సర్వభృతే నమః | – | **జంఘలు** |
| ఓం సర్వాత్మనే నమః | – | **చరణాలు** |

నేతిని పాయసాన్ని ఆయనకు నైవేద్యంగా సమర్పించాలి. కుంభాలనూ కుడుములనూ కూడా నివేదించి రాత్రంతా భజన చేస్తూ జాగరం చెయ్యాలి. తెల్లారి స్నానం చేసి ఆచమనం చేసి మరల స్వామిని పూజించి పుష్పాంజలి సహితంగా ఆయననిలా ప్రార్థించాలి.

***నమోనమస్తే గోవింద బుధశ్రవణ సంజ్ఞక ॥***
***అఘౌఘ సంక్షయం కృత్వా సర్వ సౌఖ్య ప్రదోభవ।*** ***(ఆచార..1136/11,12)***

అనంతరం ***ప్రీయతాం దేవదేవేశ*** అంటూ బ్రాహ్మణులకు కలశలను దానం చేయాలి. ఈ పూజకు నదీతటం ప్రశస్త స్థలం. ***(అధ్యాయం –136)***

# తిథి, వార, నక్షత్రాది వ్రతాలు

చైత్ర శుద్ధ త్రయోదశిని **కామదేవ త్రయోదశి** అంటారు. ఈ రోజున తెల్లకమలం మున్నగు పూలతో రతి, ప్రీతియుక్తుడు, మణి విభూషితుడు, శోక విదూరకుడునగు మన్మథుని పూజించాలి. ఈ వ్రతం పేరు ***మదనత్రయోదశి.*** ఇది సుఖసంతోషాలనిస్తుంది.

ప్రతిమాసంలోనూ రెండు చతుర్దశులనాళ్ళూ రెండు అష్టమి దినాల్లోనూ ఉపవాసం చేసి పరమశివుని పూజించాలి. ఇది ముక్తిప్రదాయకం. ఈ వ్రతానికి ***శివాష్టమీ చతుర్దశి*** వ్రతమని పేరు.

ధామవ్రతం కార్తీకమాసంలో ఏవో మూడు రాత్రులపాటు ఉపవాసముండి చేసే వ్రతం. దీని చివర్లో ఒక భవనాన్ని దానంచేయాలి. ఈ వ్రతాన్ని చేసిన వారికి సూర్యలోకం ప్రాప్తిస్తుంది. ***వారవ్రతం*** లోనైతే ప్రతిరోజూ సూర్యుని పూజించి ఆయనపేరుకి ఆ వారం (దినం) పేరుని జోడించి సంకల్పం చెప్పుకోవాలి. ఈ వారంరోజులూ నక్తవ్రతాన్ని పాటించాలి. ఈ వ్రతంచేసిన వారికి సర్వఫలప్రాప్తి కలుగుతుంది.

మనమాసాలపేర్లు నక్షత్రాల ననుసరించి పెట్టబడ్డాయి కదా! ఆ నక్షత్రం ఆ నెలలో పున్నంతో యోగిస్తే ఆ రోజున ఈ నక్షత్రవ్రతమును మొదలెట్టాలి. కార్తిక మాసంలో కృత్తిక నక్షత్రం పౌర్ణమినాడు పడినరోజు ఈ వ్రతానికి సర్వప్రశస్తం. ఆ రోజు కేశవుని యథాశక్తి అలవాటైన పద్ధతిలో పూజించి నాలుగు నెలలపాటు వరుసగా అనగా కార్తిక, మార్గశిర, పుష్య, మాఘ మాసాలలో నేతితో హవనాలు చేసి బియ్యం, నువ్వులు కలిపిన అన్నాన్ని (కృసరాన్న, కృశరాన్న) ఉప్మా వలె వండి నైవేద్యం పెట్టాలి.

ఆషాఢాది నాలుగునెలల్లో పాయసాన్ని నివేదించి బ్రాహ్మణులకు పాయసంతో భోజనాన్ని పెట్టాలి. పంచగవ్యాలనే ప్రాశిస్తూ జలస్నానాలు చేస్తూ క్రమం తప్పకుండా నైవేద్యాలు పెడుతూ మరో నాలుగు నెలలూ ఇలాగే చేసి సంవత్సరాంతమున భగవంతుని విశేషరూపంతో పూజించి ఇలా ప్రార్థించాలి.

***నమో నమస్తేఽచ్యుత సంక్షయోఽస్తు***
***పాపస్య వృద్ధిం సముపైతు పుణ్యం ।***
***ఐశ్వర్య విత్తాది సదా క్షయం మే***
***తథాస్తు మే సంతతి రక్షయైవ ॥***

*యథాచ్యుత త్వం పరతః పరస్మాత్ ।*
*స బ్రహ్మభూతః పరతః పరస్మాత్ ।*

**తథాచ్యుతం మే కురు వంఛితం సదా**
**మయా కృతం పాప హరా ప్రమేయ ॥**

**అచ్యుతానంత గోవింద ప్రసీద యదభీప్సితం ।**
**తదక్షయమమేయాత్మన్ కురుష్వ పురుషోత్తమ ॥** ***(ఆచార..137/10-12)***

ఈ మాసనక్షత్ర వ్రతాన్ని ఏడేళ్ళపాటు చేయాలి. అలా చేసిన వారికి ఆయువు, లక్ష్మి, సద్గతి ప్రాప్తిస్తాయి.

స్వచ్ఛ హృదయులై ఉపవాససహితంగా ఒక సంవత్సర పర్యంతం యథాక్రమంగా ఏకాదశి, అష్టమి, చతుర్దశి, సప్తమి తిథుల్లో విష్ణు, దుర్గ, శివ, సూర్య పూజలను గావించిన వారికి అన్ని నిర్మల అభిలాషలూ తీరుతాయి. దేహాంతంలో దేవలోక ప్రాప్తి ఉంటుంది. వ్రత కాలంలో ఏకభుక్తంగాని, నక్తవ్రతం గాని, ఆయాచితంగాని, ఉపవాసం గాని పాటించాలి. పైన చెప్పిన దేవతలందరినీ శాకాదులతో పూజిస్తే భోగం, మోక్షం రెండూ అబ్బుతాయి.

పాడ్యమినాడు కుబేర, అగ్ని, నాసత్య, దస్ర నామక దేవతలనూ, విదియ నాడు లక్ష్మినీ, యమధర్మరాజునూ, పంచమినాడు పార్వతీదేవిని నాగగణాలనూ పూజించాలి. అలాగే షష్ఠినాడు కార్తికేయునీ సప్తమినాడు సూర్యదేవునీ, అష్టమి నాడు దుర్గనీ, నవమినాడు మాతృకలనూ తక్షకునీ పూజించాలి. అదేవిధంగా దశమి నాడు ఇంద్రునీ, కుబేరునీ, ఏకాదశినాడు సప్తర్షులనూ, ద్వాదశి నాడు హరినీ, త్రయోదశినాడు మన్మథునీ, చతుర్దశినాడు మహేశ్వరునీ, పున్నం నాడు బ్రహ్మనీ, అమావాస్యనాడు పితృదేవతలనూ పూజించాలి. ***(అధ్యాయం -137)***

# సూర్యవంశవర్ణన

రుద్రదేవా! ఇక భరతఖండాన్నేలిన మహారాజ వంశాలను వర్ణిస్తాను. ముందుగా సూర్యవంశ వర్ణన గావిస్తాను.

విష్ణు భగవానుని నాభికమలం నుండి బ్రహ్మ, ఆయన అంగుష్ఠ భాగము నుండి దక్షప్రజాపతి ఉద్భవించగా దక్షపుత్రిగా దేవమాత అదితి జనించింది. అదితి నుండి వివస్వతుడను పేర సూర్యుడు, ఆయనకు వైవస్వతమనువు జనించారు. మనువునకు

తొమ్మండుగురు కొడుకులు. వారు ఇక్ష్వాకువు, శర్యాతి, నృగుడు, ధృష్ట, పృషధ్రుడు, నరిష్యంతుడు, నభగుడు, దిష్ట, శశకుడు (కరషుడు).

మనువుకు ఇల యనుకూతురూ, సుద్యుమ్నుడను కొడుకు కూడా కలిగారు. ఇలకు బుధుని వల్ల పురూరవ మహారాజూ, సుద్యుమ్నునికి అతని పత్ని ద్వారా ఉత్కళ, వినత, గయనామకులయిన పుత్రులూ జనించారు.

గోవధ చేసిన పాపానికి మనుపుత్రుడు పృషధ్రుడు శూద్రుడైపోయాడు. కరుషుని నుండి క్షత్రియుల ఉత్పత్తి జరిగింది. వారు కారుషులుగా విఖ్యాతి నందారు. దిష్టపుత్రుడైన నాభాగుడు వైశ్యుడైనాడు. అతని కొడుకు పేరు భలందనుడు. వాని వంశమున వరుసగా వత్స ప్రీతి, అతనికి పాంశుఖ నిత్రులు, ఖనిత్రునికి భూపుడు, అతనికి క్షుపుడు, అతనికి వింశుడు, అతనికి వివింశకుడు కలిగారు.

వివింశకుని వంశములో వరుసగా ఖనినేత్రుడు, విభూతి, కరంధముడు, అవిక్షితుడు, మరుత్తు, నరిష్యంతుడు, తముడు, రాజవర్ధనుడు,సుధృతి,నరుడు,కేవలుడు, బంధుమానుడు జనించారు.

బంధుమానుని వంశంలో వరుసక్రమంలో వేగవానుడు, బుధుడు, తృణబిందువు, విశాలుడు, హేమచంద్రుడు, చంద్రకుడు, ధూమ్రాశ్వుడు, సృంజయుడు, సహదేవుడు, కృశాశ్వుడు, సోమదత్తుడు, జనమేజయుడు కలిగారు.

వీరంతా వైశాలక రాజులని పిలువబడ్డారు. వీరిలో తృణబిందువుకి అలంబుష అనే అప్సరస ద్వారా ఇలవిలాయను కూతురు కూడా కలిగింది.

వైవస్వత మనుపుత్రుడు శర్యాతికి సుకన్యయను కూతురు పుట్టింది. ఆమె చ్యవన మహర్షిని పెండ్లాడింది. శర్యాతి వంశంలో వరుసగా అనంతుడు, రేవతుడు, రైవతుడు జనించారు. రైవతుని కూతురు రేవతి.

వైవస్వత మనుపుత్రుడు ధృష్టునికి ధార్ష్ట నామకపుత్రుడు జనించాడు. అతడు వైష్ణవుడైనాడు. మనుపుత్రుడైన నభగుని వంశంలో క్రమంగా నేదిష్ఠ, అంబరిష, విరూప, పృషదక్ష (శ్వ) రథీనరులు జనించారు. వీరంతా వాసుదేవ భక్తులు.

మనుపుత్రుడైన ఇక్ష్వాకునికి వికుక్షి, నిమి, దండకులని ముగ్గురు కొడుకులు. వికుక్షి యజ్ఞీయ శశకము(కుందేలు)ను భక్షించి శశాదనామంతో విఖ్యాతుడైనాడు. అతని కొడుకులు పురంజయుడు, కకుత్స్థుడు. ఈ రెండవవాని కొడుకు వేనుడను పేరు గల అనేనసుడు. ఆతని పుత్రుడేవిష్ణువుఅంశగల పృథుచక్రవర్తి. ఆ తరువాత వంశపారంపర్యంగా

విశ్వరాతుడు, ఆర్ద్రుడు, యువనాశ్వుడు, శ్రీవత్సుడు, బృహదశ్వుడు, కువలాశ్వుడు, ధృఢాశ్వుడు పుట్టారు. దృఢాశ్వ చక్రవర్తి ధుంధుమారుడనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఆ తరువాత ఆ వంశంలో దృఢాశ్వ కుమారులు చంద్రాశ్వుడు, కపిలాశ్వుడు, హర్యశ్వుడు అను వారలలో హర్యశ్వుని వంశంలో వరుసగా నికుంభుడు, హితాశ్వుడు, పూజాశ్వుడు, యువనాశ్వుడు, మాంధాత జన్మించారు. మాంధాతకతని పత్ని బిందుమతి ద్వారా ముచుకుందుడు, అంబరిషుడు ('రి' కి దీర్ఘం పెట్టకూడదు) పురుకుత్సుడు అను ముగ్గురు కొడుకులూ, యాభైమంది కూతుళ్ళూ పుట్టారు. మాంధాత కూతుళ్ళందరినీ సౌభరి మహాముని పెండ్లాడాడు.

అంబరిషుని కొడుకు యువనాశ్వుడు, అతని కొడుకు హరితుడు. పురుకుత్సునికి నర్మద ద్వారా త్రసదస్యువను పుత్రుడుదయించాడు. అతని వంశంలో క్రమంగా అనరణ్యుడు, హర్యశ్వుడు, వసుమనుడు, త్రిధన్వుడు, త్రయ్యారుణుడు, సత్యరతుడు (త్రిశంకువు) హరిశ్చంద్రుడు, రోహితాశ్వుడు, హరీతుడు, చంచు, విజయుడు, రురుకుడు, వృకుడు, బాహువు, సగరుడు ఉద్భవించి చక్రవర్తులైనారు.

సగరునికి సుమతి అను పత్ని ద్వారా అరవైవేలమంది పుత్రులు కలిగారు. కాని వారిలో నెవరూ మిగలలేదు. పాతాళంలో కపిల మహర్షిని దూషించి, కొట్టిన పాపానికి, వారి పాపాగ్నిలో వారే కాలి బూడిదైపోయారు.

సగరుని రెండవపత్ని కేశినికి అసమంజసుడు, అతనికి అంశుమంతుడు, అతనికి దిలీపుడు,ఆయనకు భగీరధుడు జనించారు. ఈ భగీరథుడే దివిజ గంగను భువికి తెచ్చిన మహనీయుడు. ఆయననుండి సూర్యవంశక్రమం ఇలా పరంపరగా తామర తంపరగా కొనసాగింది. భగీరథుని తరువాత వరుసగా శ్రుతుడు, నాభాగుడు, అంబరిషుడు, సింధు ద్వీపుడు,అయుతాయువు, ఋతుపర్ణుడు, సర్వకాముడు, సుదాసుడు, సౌదాసుడు (మిత్ర సహుడు) కల్మాషపాదుడు, అశ్వకుడు, మూలకుడు, దశరథుడు, ఐలబిలుడు, విశ్వసహుడు, ఖట్వాంగుడు, దీర్ఘబాహువు, అజుడు, దశరథుడు చక్రవర్తులైనారు.ఈ దశరథపుత్రులే రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు.

శ్రీరామచంద్రుని పుత్రులు కుశలవులు, భరతునికి తార్క్ష పుష్కరులూ, లక్ష్మణునికి చిత్రాంగద చంద్రకేతువులూ, శత్రుఘ్నునికి సుబాహు శూరసేనులూ జనించారు. కుశమహా రాజు వంశం ఈ విధంగా వర్ధిల్లింది.

---

★ *(ఎవరి పేరిటనైతే ఈ వంశాన్ని రఘువంశమని వ్యవహరిస్తారో ఆ రఘుమహారాజు పేరు కనబడకపోవడం చింత్యం) అయితే ఈ పురాణంలోనే 143వ అధ్యాయంలో అజుడు రఘుపుత్రుడని చెప్పబడింది. అంటే ఈ అధ్యాయంలో పేర్కొనబడిన దీర్ఘబాహువే రఘుమహారాజని తెలుస్తోంది.*

కుశుడు, అతిథి, నిషధుడు, నలుడు, నభస్సు (నభుడు) పుండరీకుడు, క్షేమధన్వుడు, దేవానీకుడు అహీనకుడు, రురుడు, పారియాత్రుడు, దలుడు,చలుడు,ఉక్థుడు, వజ్రనాభుడు, గణుడు, ఉషితాశ్వుడు, విశ్వసహుడు, హిరణ్యనాభుడు, పుష్పకుడు, ధ్రువసంధి, సుదర్శనుడు, అగ్నివర్ణుడు, పద్మవర్ణుడు, శీఘ్రుడు, మరుడు, సుశ్రుతుడు, ఉదావసుడు, నందివర్ధనుడు, సుకేతువు, దేవరాతుడు, బృహదుక్థుడు, మహావీర్యుడు,సుధృతి, ధృష్టకేతువు, హర్యశ్వుడు, మరుడు, ప్రతీంధకుడు, కృతిరథుడు, దేవమీఢుడు, విబుధుడు, మహాధృతి, కీర్తిరాతుడు, మహారోముడు, స్వర్ణరోముడు, హ్రస్వరోముడు, సీరధ్వజుడు.

సీరధ్వజునికి సీత యను పేరుగల పుత్రిక, కుశధ్వజుడనే తమ్ముడు ఉన్నట్టు తెలుస్తోంది. సీరధ్వజుని పుత్రుడైన భానుమంతుని వంశంలోక్రమంగా శతద్యుమ్నుడు, శుచి, ఊర్జుడు, సనద్వాజుడు, కులి, అనంజనుడు, కులిజిత్తు, ఆధినేమికుడు, శ్రుతాయువు సుపార్శ్వుడు, సృంజయుడు, క్షేమారి, అనేనుడు, రామరథుడు, ఉపగురువు, ఉపగుప్తుడు, స్వాగతుడు, స్వవరుడు, సువర్చుడు, సుపార్శ్వుడు, సుశ్రుతుడు, జయుడు, విజయుడు, ఋతుడు, సునయుడు, వీతిహవ్యుడు, ధృతి, బహులాశ్వుడు, కృతి, జనకుడు రాజులైనారు.

ఈ జనక మహారాజు రెండు వంశాలవాడని తెలుస్తోంది. ఆయన రాజయోగిగా యోగమార్గాన్ని అనుసరించి దానిని అభివృద్ధి చేశాడు. ***(అధ్యాయం -138)***

# చంద్రవంశ వర్ణన

శ్రీహరి పరమశివాదులకు ఇంకా ఇలా చెప్పసాగాడు. "నారాయణుని నాభి కమలం నుండి బ్రహ్మ, ఆయన నుండి అత్రి ఆయననుండి చంద్రుడు ప్రాదుర్భవించారు.

చంద్రుని నుండి అతని వంశంలో బుధుడు, పురూరవుడు కలిగారు. చంద్రుని మనుమడైన పురూరవునికి ఊర్వశి ద్వారా ఆరుగురు పుత్రులు కలిగారు. వారు శ్రుతాత్మక, విశ్వావసు, శతాయు, ఆయు, ధీమాన్, అమావసులు.

అమావసుని వంశంలో వరుసగా భీమ, కాంచన, సుహోత్ర, జహ్ను, సుమంతు, ఉపజాపక, బలాకాశ్వ, కుశులుద్భవించారు. కుశునికి నలుగురు కొడుకులు వారు కుశాశ్వ కుశనాభ వసు అమూర్తరయులు.

కుశాశ్వుని కొడుకు గాధి. గాధి కొడుకే సుప్రసిద్ధ రాజు, రాజర్షి, కడకు బ్రహ్మర్షి, గాయత్రి మంత్ర ద్రష్టయునగు విశ్వమిత్రుడైన విశ్వామిత్రుడు. ఆయనకు దేవరాత, మధుచ్ఛందాది అనేక పుత్రులు కలిగారు. గాధి తన కూతురైన సత్యవతిని ఋచీకుడను

బ్రాహ్మణోత్తమునకిచ్చి పెండ్లి చేశాడు. ఋచీక పుత్రుడు జమదగ్ని. జమదగ్ని కొడుకే పరశురాముడు.

బుధపుత్రుడైన ఆయువు కొడుకు నహుషుడు. ఇతని పుత్రులు అనేన,రాజి, క్షత్ర వృద్ధ, రంభకులు. క్షత్ర వృద్ధ (వృద్ధి) పుత్రుడు సుహోత్ర మహారాజుకు కాశ్య, కాశ, గృత్స మదులని ముగ్గురు తనయులు. గృత్సమదుని కొడుకే శౌనకుడు. కాశ్యపుత్రుడైన దీర్ఘతమునికి ధన్వంతరి జనించాడు. ఆతని వంశంలో క్రమంగా కేతుమాన్, భీమరథ, దివోదాస, ప్రతర్దను లుదయించారు. ప్రతర్దనునే శత్రుజిత్తని కూడా అంటారు.

శత్రుజిత్తుని వంశంలో వరుసగా ఋతధ్వజ, అలర్క, సన్నతి, సునీత, సత్యకేతు, విభు, సువిభు, సుకుమార, ధృష్టకేతు, వీతిహోత్ర, భర్గ, భూమికులు రాజ్యం చేశారు.

నహుష పుత్రుడైన రాజి లేదా రజికి అయిదువందలమంది కొడుకులు పుట్టారు. కానీ వారందరినీ ఇంద్రుడు సంహరించాడు. అక్కడ నహుష పుత్రుడైన క్షత్ర వృద్ధుని వంశం వర్ధిల్లింది. వారి పేర్లు ప్రతిక్షత్ర, సంజయ, విజయ, కృత, వృషధన, సహదేవ, అదీన జయత్సేన, సంకృతి క్షత్ర ధర్ములు. ఇది నహుషుని ఒక వంశం.

నహుష చక్రవర్తికి యతి, యయాతి, సంయాతి, అయాతి, వికృతి నామకులగు మరో అయిదుగురు కుమారులున్నారు. యయాతికి దేవయాని ద్వారా యదువు తుర్వసుడు పుట్టారు. వృషపర్వపుత్రియగు శర్మిష్ఠ ద్వారా యయాతికి ద్రుహ్యు, అను, పురునామకులైన తనయులు జనించారు.

యదువుకు సహస్రజిత్తు, క్రోష్టువు, రఘువులనే కొడుకులు పుట్టారు. సహస్రజిత్తు కొడుకు శతజిత్తు కాగా అతనికి హయహైహయులు జనించారు. హయునికి అనరణ్యుడూ హైహయునికి ధర్ముడూ పుట్టారు. ధర్ముని వంశక్రమంలో ధర్మనేత్రుడు, కుంతి (కుంతుడు), సాహంజుడు, మహిష్మంతుడు, భద్రశ్రేణ్యుడు, దుర్దముడు వర్ధిల్లారు.

దుర్దముని కారుగురు కొడుకులు. వారు ధనక, కృతవీర్య, జానక, కృతాగ్ని, కృతవర్మ, కృతౌజులు. వీరంతా పరమ బలశాలులే. కృతవీర్యుని కొడుకు అర్జునుడు, అతని పుత్రుడు శూరసేనుడు. కృతవీర్యునికి అర్జునుడే కాక, ఇంకా జయధ్వజ, మధు, శూర, వృషణ నామకులైన పుత్రులు జనించారు. వీరంతా గొప్ప సువ్రతులు. జయధ్వజ పుత్రుడు తాలజంఘుడు కాగా అతని తనయుడు భరతుడు. వృషణపుత్రుడు మధువు, అతని పుత్రుడు వృష్ణి. ఈ వృష్ణియే వృష్ణి వంశానికి మూలపురుషుడు.

క్రోష్టు వంశంలో క్రమంగా విజజ్ఞివాన్, ఆహి, అశంకు, చిత్రరథ, శశ బిందువులు జనించారు. ఈ శశబిందునికి లక్షమంది పత్నుల ద్వారా పృథుకీర్తి, పృథుజయ, పృథుదాన,

పృథుశ్రవాది పదిలక్షలమంది శ్రేష్ఠులైన పుత్రులుదయించారు. పృథుశ్రవుని పుత్రుడు, అతని కొడుకు ఉశనుడు, అతని పుత్రుడు శితగు, అతని తనయుడు శ్రీ రుక్మకవచుడు. ఇతనికి రుక్మ, పృథురుక్మ, జ్యామఘ, హరి, పాలితులనే పుత్రులు పుట్టారు. జ్యామఘుని కొడుకు పేరు విదర్భుడు.

విదర్భునికి శైబ్య అనే భార్య ద్వారా క్రథ, కౌశిక, రోమపాదులను పుత్రులు కలిగారు. రోమపాదుని కొడుకు బభ్రువు, మనుమడు ధృతి.

కౌశికుని వంశంలో ఋచి, చేది, కుంతి, వృష్ణి, నివృత్తి, దశార్హ, వ్యోమ, జీమూత, వికృతి, భీమరథ, మధురథ, శకుని, కరింభ, దేవమాన్ (దేవనత) దేవక్షత్ర, మధు, కురువంశ, అను పురుహోత్ర, అంశు, సత్త్వ శ్రుత, సాత్త్వతులు రాజులైనారు.

సాత్త్వతుని కేడుగురు కొడుకులు.వారు భజినుడు, భజమానుడు, అంధకుడు, మహాభోజుడు, వృష్ణి, దివ్యవంతుడు, దేవవృధుడు. భజమానుని కొడుకుల పేళ్ళు నిమి, వృష్ణి, అయుతాజిత్, శతజిత్, సహస్రజిత్, బభ్రు, దేవ, బృహస్పతి.

మహాభోజుని వంశంలో భోజుడు, వృష్ణి, సుమిత్రుడు జనించగా సుమిత్రుని ముగ్గురు కొడుకులైన స్వధాజిత్, అనామిత్ర, అశినులలో అనమిత్రుని ముగ్గురు కొడుకులయిన నిఘ్న, ప్రసేన, శిబిలలో శిబి కొడుకు సత్యకుడు కాగా అతని కొడుకు సాత్యకి. ఇతని వంశంలో వరుసగా సంజయుడు,కులి,యుగంధరుడు జన్మించారు. వీరిని శైబేయులంటారు.

అనమిత్రునికి వృష్ణి, శ్వఫల్కుడు, చిత్రకుడు అని మరో ముగ్గురు కొడుకులున్నారు. శ్వఫల్కునికి గాందినియను పత్ని ద్వారా పరమవైష్ణవోత్తముడైన అక్రూర మహాశయుడు జన్మించాడు. ఉపమద్గుడు, దేవవంతుడు, ఉపదేవుడు అక్రూర నందనులు.

చిత్రకునికి పృథు, విపృథు, సాత్త్వత నందనుడైన అంధకునికి శుచి, భజమాన పుత్రుడైన కుకురునికి ధృష్టుడు (ధృష్టకుడు) జన్మించారు. ధృష్టుని వంశంలో క్రమంగా కాపోతరోమకుడు, విలోముడు, తుంబురుడు, దుందుభి, పునర్వసు, ఆహుకుడు జన్మించారు.ఆహుకునికి ఆహుకియను కూతురూ దేవకుడు, ఉగ్రసేనుడు అను కొడుకులు జనించగా దేవకుని కూతురుగా (వరమున) శ్రీకృష్ణపరమాత్మ కన్నతల్లి దేవకి ఆవిర్భవించింది. దేవకునికి మరొక ఆరుగురు కూతుళ్ళు కూడా కలిగారు. ఆయన తన సప్త కన్యలనూ వసుదేవునికే ఇచ్చి వివాహం చేశాడు. దేవక పుత్రుడైన సహదేవునికి దేవవాన్ ఉపదేవ నామకులైన ఇద్దరు కొడుకులు.

ఆహుకపుత్రుడైన ఉగ్రసేనునికి కంస, సునామ, వటాది అనేక పుత్రులు జనించారు. అంధక పుత్రుడైన భజమాను నందనుడు విదూరథుని వంశంలో క్రమంగా శూర, శమి, ప్రతిక్షత్ర, స్వయంభోజ, హృదిక, కృతవర్మాదులు జనించారు.

శూరునికైదుగురు కూతుళ్ళు కూడా పుట్టారు. వారుపృథ,శ్రుతదేవి,శ్రుతకీర్తి, శ్రుతశ్రవ, రాజాధిదేవి. వీరిలో పృథను కుంతి భోజకుని పెంపకానికిచ్చే శారు. అతడామెను అల్లారుముద్దుగా పెంచి పాండురాజుని కిచ్చి వివాహం చేశాడు. ఆమె పుత్రులే భారతవీరులు ధర్మరాజు, భీముడు, అర్జునుడు. తన సవతి సహగమనం చేయడంతో ఆమె పుత్రులైన నకుల సహదేవులను కూడ పృథయే పెంచింది. ఈమె పుత్రుడే కర్ణుడు కూడ. ఈమెను 'కుంతి' అని పిలిచేవారు.

ఈ కుంతి చెల్లెలు శ్రుతదేవి కడుపున బుట్టినవాడే దంతవక్త్రుడు. శ్రుతకీర్తి కేకయ రాజుని పెండ్లాడి సతర్దనాది అయిదుగురు కొడుకులను కన్నది. రాజాధిదేవికి విందు, అనువిందులని ఇద్దరు కొడుకులు పుట్టారు. శ్రుతశ్రువ చేది రాజైన దమఘోషుని పెండ్లాడింది. ఆమె కొడుకే శిశుపాలుడు.

వసుదేవునికి పౌరవ, మదిర, దేవకి, రోహిణి, భద్రాది భార్యలలో దేవకీ నందనుడు శ్రీకృష్ణపరమాత్మ కాగా రోహిణీపుత్రుడు బలరాముడు. బలరామునికి రేవతి ద్వారా సారణ, శఠాది పుత్రులు జనించారు. దేవకి పుత్రులైన కీర్తిమాన్, సుషేణ, ఉదార్య, భద్రసేన, ఋజుదాస, భద్రదేవులను కంసుడు చంపేశాడు. శ్రీకృష్ణునికి భార్యల ద్వారా చాలమంది కొడుకులు పుట్టారు. వారిలో ప్రద్యుమ్న, చారుదేష్ణ, సాంబులు ప్రధానులు. ప్రద్యుమ్నపత్ని కకుద్మినికి మహాపరాక్రమశాలియైన అనిరుద్ధుడు పుట్టాడు. అనిరుద్ధునికి సుభద్రయను పేరు గల పత్ని ద్వారా వజ్రుడు జన్మించాడు. అతడు అతని పుత్రుడు ప్రతి బాహువు, మనుమడు చారు (దత్తుడు) రాజ్యాలనేలారు.

యయాతి పుత్రుడైన తుర్వసుని వంశంలో వహ్ని, భర్గ, భాను, కరంధమ, మరుత్తులు జనించారు.

రుద్రదేవా! ఇక ద్రుహ్యు అను వంశములను వర్ణిస్తాను వినండి.

యయాతి పుత్రుడు ద్రుహ్యుని తరువాత అతని వంశంలో వరుసగా సేతు, ఆరద్ధ, గాంధార, ధర్మ, ఘృత, దుర్గమ, ప్రచేతులు జన్మించారు.

అనువు వంశంలో వరుసగా సభానల, కాలంజయ, సృంజయ, పురంజయ, జనమేజయ, మహాశాల, ఉశీనర, శిబి, వృషదర్భ, మహామనోజ, తితిక్షు, రూషద్రథ,

సుతపులు జన్మించారు. సుతపసుతుడైన బలి మహారాజు కైదుగురు కొడుకులు. వారే అంగ, వంగ, కళింగ, ఆంధ్ర, పౌండ్రులు.

అంగుని వంశంలో అనపాన, దివిరథ, ధర్మరథ, రోమపాద, చతురంగ, పృథులాక్ష, చంప, హర్యంగ, భద్రరథ, బృహత్కర్మ, బృహద్భాను, బృహద్మన, జయద్రథ, విజయ, ధృతి, ధృతవ్రత, సత్యధర్మ, అధిరథ, కర్ణ, వృషసేనులు పుట్టారు.

రుద్రాది దేవతలారా! ఇక పురు వంశ వర్ణన వినండి.

పురువు, జనమేజయుడు, నమస్యు, అభయుడు, సుద్యు, బహుగతి, సంజాతి, వత్సజాతి, రౌద్రాశ్వుడు, ఋతేయు, రతినారుడు, ప్రతిరథుడు, మేదాతిథి, ఐనిలుడు, దుష్యంతుడు, భరతుడు (ఇతడే శకుంతల కొడుకు) వితథుడు, మన్యువు, నరుడు, సంకృతి, గర్గుడు, అమన్యువు,శిని–వీరంతా పౌరవ వంశ వర్ధనులే. (రౌద్రాశ్వుని కేడుగురు కొడుకులు. వారి పేర్లు ఋతేయు, స్థండిలేయు, కక్షేయు, కృతేయు, జలేయు, సంతతేయులు వీరంతా రాజశ్రేష్ఠులే)

భరతపుత్రుడైన మన్యువు వంశంలో వరుసగా మహావీర, ఉరుక్షయ, త్రయ్యారుణి, వ్యూహక్షత్ర, సుహోత్ర, రాజన్యులుద్భవించారు. హస్తి, అజమీఢ, ద్విమీఢులు, సుహోత్రనందనులు. హస్తి కొడుకుపేరు పురుమీఢుడు కాగా అజమీఢుని కొడుకు కణ్వుడు, మనుమడు మేధాతిథి. వీరి వల్లనే బ్రాహ్మణులలో కాణ్వాయన గోత్రమేర్పడింది.

అజమీఢుని మరొక పుత్రుడైన బృహదిషుని ద్వారా రాజవంశం నిలబడింది. బృహదిషుని వంశంలో క్రమంగా బృహద్ధను, బృహత్కర్మ, జయద్రథ, విశ్వజిత్, సేనజిత్, రుచిరాశ్వ, పృథుసేన, పార, నృప, సృమరులు రాజులైనారు. పృథుసేనుని మరొకపుత్రుడైన సుకృతి వంశంలో కూడా క్రమంగా విభ్రాజ, అశ్వహ, బ్రహ్మదత్త, విష్వక్సేనులు కూడా రాజ్యం చేశారు.

ద్విమీఢుని వంశంలో క్రమంగా యవీనర, ధృతిమాన, సత్యధృతి, ధృఢనేమి, సుపార్శ్వ, సన్నతి, కృత, ఉగ్రాయుధ, క్షేమ్య, సుధీర, పురంజయ, విదూరథులు జనించారు.

అజమీఢునికి పత్ని నళిని ద్వారా నీలమహారాజుదయించాడు. ఆయన వంశంలో క్రమంగా శాంతి, సుశాంతి, పురు, అర్క, హర్యశ్వ, ముకులులు వర్ధిల్లారు. ముకులునికైదు గురు కొడుకులు. వారు యవీర, బృహద్భాను, కమిల్ల, సృంజయ, శరద్వానులు.

వీరిలో శరద్వానుడు బ్రాహ్మణ వృత్తి నవలంబించి పరమ వైష్ణవునిగా పేరు గాంచాడు. ఆయనకు పత్ని అహల్య ద్వారా దివోదాసుడను పుత్రుడు కలిగాడు. దివోదాసుని కొడుకు శతానందుడు. ఇతని కొడుకైన సత్యధృతి దేవకాంతయైన ఊర్వశి ద్వారా కృపాచార్యునీ,

కృపినీ కన్నాడు. ఈ కృపినే భారతవీరుడు, గురుదేవుడునైన ద్రోణాచార్యుడు పెండ్లాడాడు. వారి పుత్రుడు అశ్వత్థామ.

దివోదాసుని వంశంలో వరుసగా మిత్రాయు, చ్యవన, సుదాస, సౌదాస, సహదేవ, సోమక, జహ్ను, పృషత, ద్రుపద, ధృష్టద్యుమ్న, ధృష్టకేతులు జనించారు.

అజమీఢుని పుత్రుడైన ఋక్షుని వంశంలో వరుసగా సంవరణుడు, కురు మహారాజు వర్ధిల్లారు. కురురాజుకి ముగ్గురు కొడుకులు. వారు సుధను, పరీక్షిత్, జహ్నులు.

సుధనుని వంశంలో క్రమంగా సుహోత్ర చ్యవన, కృతక, ఉపరిచరవసువులు రాజులు కాగా ఉపరిచరవసువునకు బృహద్రథ, ప్రత్యగ్ర, సత్యాదిగా అనేక పుత్రులు కలిగారు.

బృహద్రథుని వంశంలో కుశాగ్ర, ఋషభ, పుష్పవాన్, సత్యహిత, సుధన్వ, జహ్నులు దయించారు. బృహద్రథుని మరొకపుత్రుడు జరాసంధుడు. అతని వంశక్రమంలో సహదేవ, సోమాపి. అతని పుత్రులైన శ్రుతవంత, భీమసేన, ఉగ్రసేన, శ్రుతసేన, జనమేజయులుద్భ వించారు.

కురు మహారాజు మరొక కొడుకైన జహ్నుని నుండి క్రమంగా సురథ, విదూరథ, సార్వభౌమ, జయసేన,అవధీత,అయుతాయు, అక్రోధన, అతిథి, ఋక్ష, భీమసేన, దిలీప, ప్రతీప మహారాజులుదయించగా ఆయనకు దేవాపి, శంతను, బాహ్లికులుదయించారు. బాహ్లికుని వంశంలో క్రమంగా సోమదత్తుడు, భూరి, భూరిశ్రవసుడు, శలుడు జన్మించారు.

గంగ ద్వారా శంతనునికి మహాప్రతాపవంతుడు, సాక్షాత్సకల ధర్మ స్వరూపుడు నగు దేవవ్రతుడు (భీష్ముడు) ఉద్భవించాడు. ఆయనే భారతదేశానికి రాజయివుంటే చరిత్ర గతి మంచి వైపు మరలివుండేది. కాని శంతనుండు చేసిన మోహజనితమైన పొరపాటు వల్ల దేశం కష్టాల పాలైంది. ఆయన సత్యవతిని పెండ్లాడడం కోసం ఈయన కఠోర బ్రహ్మచర్య దీక్షను చేపట్టాడు.

సత్యవతికి అప్పటికే పరాశర మహర్షి ద్వారా విష్ణు సమానుడైన వ్యాసమహర్షి జన్మించియున్నాడు. ఆమెకి శంతనుని ద్వారా చిత్రాంగద, విచిత్ర వీర్యులు జనించారు. వారు ఏవో చిన్న చిన్న కారణాల వల్ల సంతానం లేకుండానేమరణించడంతో వ్యాసమహర్షి దేవర న్యాయం వల్ల సత్యవతి కోడళ్ళలో అంబికకు ధృతరాష్ట్రుడూ, అంబాలికకు పాండురాజూ జన్మించారు. ధృతరాష్ట్రునికి గాంధారి ద్వారా దుర్యోధన దుశ్శాసనాది నూరుగురు కొడుకులూ, పాండురాజుకి కుంతి, మాద్రియను పత్నుల ద్వారా ధర్మరాజాది పంచపాండవులూ జనించారు. వీరికీ చాలామంది కొడుకులే పుట్టారు గానీ అంతా

యుద్ధంలో పోయారు. అర్జున పుత్రుడైన అభిమన్యుని కొడుకు మాత్రమే మిగిలాడు. పరిక్షీణించిన వంశంలో నిలిచిన ఒకే ఒక్క నిసుగు కావున అతన్ని 'పరిక్షిత్' అన్నారు. అతని కొడుకు జనమేజయుడు. ***(అనుబంధం -11)లో చూడండి. (అధ్యాయాలు - 139,140)***

# భవిష్యత్తులో రాజవంశాలు

చంద్రవంశంలో జనమేజయుని వంశంలో క్రమంగా శతానీక అశ్వమేధ దత్త, అధిసోమక, కృష్ణ, అనిరుద్ధ, ఉష్ణ, చిత్రరథ, శుచిద్రథ, వృష్ణిమాన్, సుషేణ, సునీథక, నృచక్షు, ముఖబాణ, మేధావి, నృపంజయ, బృహద్రథ, హరి, తిగ్మ, శతానీక, సుదానక, ఉదాన, అహ్నినర, దండపాణి, నిమిత్తక, క్షేమక, శూద్రకులు రాజ్యం చేశారు.

రుద్రదేవా! ఇక్ష్వాకు వంశీయుడైన బృహద్బలుని వంశపారంపర్య క్రమంలో బృహద్బలుడు, ఉరుక్షయ, వత్సవ్యూహ, సూర్య, సహదేవ, బృహదశ్వ, భానురథ, ప్రతీచ్య, ప్రతీతక, మనుదేవ, సునక్షత్ర, కిన్నర, అంతరిక్షక, సువర్ణ, కృతజిత్, ధార్మిక, బృహద్భ్రాజ, కృతంజయ, ధనంజయ, సంజయ, శాక్య, శుద్ధోదన, బాహుల, సేనజిత్, క్షుద్రక, సమిత్ర, కుడవ, సుమిత్రులు రాజ్యపాలనం గావించారు.

ఇక మగధ వంశంలో క్రమంగా జరాసంధ, సహదేవ, సోమాపి, శ్రుతశ్రవ, అయుతాయు,నరమిత్ర, సుక్షత్ర, బహుకర్మక, శ్రుతంజయ, సేనజిత్, భూరి, శుచి, క్షేమ్య, సువ్రత, ధర్మ, శ్మశ్రుల, ధృఢసేన, సుమతి, సుబల, నీత, సత్యజిత్, విశ్వజిత్, ఇషుంజయులు పరిపాలకులయినారు. జరాసంధుని అసలు పేరు బృహద్రథుడు కాబట్టి వీరికి బార్హద్రథులని పేరు. వీరి తరువాత వారిలో ముందు ముందు అధర్మం, శూద్రత్వం ఎక్కువగా వుంటాయి.

సాక్షాత్తు అవ్యయుడైన నారాయణుడే స్వర్గాదిలోకాలను రచించాడు. ఆయనే మూడు పేర్లతో సృష్టి, స్థితి, లయలను గావిస్తాడు. ప్రళయం నైమిత్తికమనీ, ప్రాకృతమనీ, ఆత్యంతిక మనీ మూడు విధాలు. ప్రళయ కాలం వచ్చినపుడు భూమి నీటిలో, నీరు తేజంలో, తేజం గాలిలో, గాలి నింగిలో, నింగి అహంకారంలో, అహంకారం బుద్ధిలో, బుద్ధి జీవాత్మలో, చివరగా ఆ జీవాత్మ అవ్యక్త పరబ్రహ్మ పరమాత్మలో విలీనమైపోతాయి.

ఏకమాత్ర నిత్యుడా పరబ్రహ్మ ఒక్కడే. ఈ మహారాజులూ, సార్వభౌములూ, చక్రవర్తులూ, ఎవరూ శాశ్వతులు కాలేదు. కాలేరు. కాబట్టి మనిషి పాప కర్మకి దూరంగా అవినాశియైన ధర్మానికి దగ్గరగా జీవించాలి. పాపి సార్వభౌముడైనా హరిని చేరలేడు. పుణ్యాత్ముడు నిరుపేదయైనా హరిని చేరుకోగలడు. ***(అధ్యాయం -141)***

# భగవంతుని విభిన్న అవతారాల కథ, పతివ్రతా మహాత్మ్యం - ఆఖ్యానాలు

"వేదాది ధర్మాలను రక్షించడానికి ఆసురీధర్మాన్ని నాశనం చేయడానికీ సర్వశక్తిమంతుడైన భగవంతుడు శ్రీహరి ఎన్నో అవతారాలను ధరించి ఈ సూర్యచంద్ర వంశాల పాలన పోషణలను చేశాడు. జన్మమే లేనివాడు మనకోసం చివరికి చేపగానూ తాబేలుగానూ పుట్టవలసి వచ్చినా వెనుకాడలేదు. అని బ్రహ్మ వ్యాసమహర్షికి వివరించసాగాడని శౌనకాది మహామునులకు మహాపౌరాణికుడైన సూత మహర్షికి చెప్పసాగాడు.

"ఆ స్వామి మత్స్యావతారాన్ని ధరించి లోక కంటకుడైన హయగ్రీవుడను దైత్యుని సంహరించి వేదాలను మరల భూమిపైకి తెచ్చి మన్వాదులను రక్షించాడు. క్షీరసాగర మథన సమయంలో లోకహితాన్ని కోరి ఆదికూర్మమై మందర పర్వతాన్ని తనమూపున ధరించి భరించాడు. క్షీరసాగరం నుండి అమృతాన్ని తేవడానికీ,ప్రజారోగ్యాన్ని కాపాడడానికీ తానే స్వయంగా ధన్వంతరియై దిగివచ్చాడు. సుశ్రుతునికి అష్టాంగ పర్యంతమైన ఆయుర్వేదాన్ని కూలంకషంగా బోధించి అవతారాన్ని చాలించాడు. దేవతలను తన్ని తగలేసి అమృతభాండాన్ని ఎగరేసుకుపోయిన రాక్షసులనుండి అమృతాన్నీ, ఆవిధంగా ధర్మాన్నీ కాపాడడానికి ఆడవేషం (మోహిని) వేసి ఆటలాడడానికి కూడా సంకోచింపలేదు.

కరుణాకరుడైన శ్రీహరి వరాహావతారాన్ని ధరించి హిరణ్యాక్షుని సంహరించి అతనిచే సముద్ర పతితమైన భూమినుద్ధరించాడు. నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని సంహరించి వైదిక ధర్మాన్ని నిలబెట్టాడు. తరువాత జమదగ్ని యింట పరశురామునిగా నవతరించి మొత్తం ఆర్యావర్తాన్ని క్షత్రియమదాహంకార కబంధ హస్తాలనుండి విడిపించాడు. దీనికాయన ఇరువది యొక్క మార్లు దేశమంతటా కలయదిరిగాడు. అహంకారంతో కన్నుమిన్ను గానకుండా వరప్రసాదంతో మదమెక్కి పోయిన వేయిచేతుల కార్తవీర్యార్జునుని కూడా సంహరించి ఒక గొప్ప యజ్ఞాన్ని చేసి అందులో మొత్తం భూమిని కశ్యప మహర్షికి దానం చేసి మహేంద్రగిరి పైకి తపస్సు చేసుకొనుటకు వెడలిపోయాడు.

తరువాత రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల స్వరూపంలో దశరథుని యింట శ్రీహరి అవతరించాడు. పితృవాక్యపాలన, సత్యపరాక్రమం, దుష్టసంహారం మున్నగు ఆదర్శలక్షణాలకు ఆలవాలమైన శ్రీరాముడు మర్యాదపురుషోత్తముడెలా వుండాలో తన జీవనయానమే ఉదాహరణగా జీవించి మానవజాతికి చూపించాడు. రావణాది లోకకంటకుల నుండి జాతిని రక్షించాడు. తండ్రి మాట మేరకు పదునాలుగేండ్లు అడవులలో ఇడుములు పడి త్రైలోక్యపూజ్యుడై మరలి వచ్చి పట్టాభిషిక్తుడై దేవతలను, ఋషులను,

బ్రాహ్మణులను, ప్రజలను, ఆనందసాగరంలో ఓలలాడించాడు. అశ్వమేధాది ఎన్నో యజ్ఞాలను చేసి వైదిక ధర్మాన్ని నిలబెట్టాడు. సీతకి కూడా అంత గొప్పతనమూ ఉంది. రామకథను సీతాచరితమన్నవారూ ఉన్నారు. ఆమె అంత గొప్ప పతివ్రత.

ఇపుడు పతివ్రతామాహాత్మ్యాన్ని వినిపిస్తాను. ప్రాచీన కాలంలో ప్రతిష్ఠాన పురంలో కౌశికుడని ఒక కుష్టు రోగియైన బ్రాహ్మణుడుండేవాడు. అతని పత్ని అతనిని దైవసమానంగా చూసుకుంటూ ప్రేమతో భక్తిగా, అతనికి సర్వోపచారాలూ చేస్తూ అతనికే మాత్రమూ అసౌకర్యం కలుగకుండా సేవిస్తుండేది. అయినా అదేమి కర్మయోగాని ఆ పతి ఆమెనొక మంచి మాటైనా ఆడకపోగా ఆమెపై విసుక్కొనేవాడు, కోపించేవాడు, కోరరాని కోరికలు కోరేవాడు. ఒకనాడతడు వేశ్యా సంపర్కమును వాంఛించాడు. ఆమె బాగా చీకటి పడినాక అతనిని భుజాలపై నెత్తుకుని, తగినంత ధనాన్ని కూడా పట్టుకొని వేశ్య ఇంటివైపు పోసాగింది.

దారిలో నొక కూడలిలో తపస్వీ, మహాత్ముడూనైన మార్కండేయ మహర్షి★ కొరతవేయబడివున్నాడు. ఆయన శరీరంలో దిగబడిన లోహపు శంకువు వల్ల కలిగే దుస్సహవేదన తెలియకుండా సమాధిగతుడై వున్నాడు. చీకటిలో కనబడక ఈ పతివ్రత ఆయన పక్కనుండే వెళ్ళడంతో ఆమె భర్త కాలు ఆ మహర్షికి తగిలి ఆయన సమాధి భగ్నమైంది. వెంటనే భరింపరాని నొప్పి ఆయనను విహ్వలుని చేయడంతో ఇక తట్టుకోలేక తనకి తగిలిన కాలు ఎవడిదో వాడు సూర్యోదయం కాగానే మరణిస్తాడని శపించాడు. ఆ పతివ్రతకు తన భర్త సరదాగా కాలు ఊపుతూ ఉన్నాడనీ, అది ఎవరో మహానుభావునికి తగిలి శపించాడనీ తెలియగానే తన దోషం లేకుండానే తనకి వైధవ్యం కలగడం అన్యాయమనీ, కాబట్టి ఇక సూర్యుడు ఉదయించనే కూడదనీ శాసించింది. ఆమె యొక్క పాతివ్రత్యమహిమ వల్ల ఆ రాజ్యంలోనే కాక ఎక్కడా కూడా సూర్యుడుదయించలేదు. దానితో ప్రపంచం అల్లకల్లోలమైపోయింది.

భయభీతులైన దేవతలు బ్రహ్మదేవుని శరణుజొచ్చారు. ఆయన ఒక మహాపతివ్రతను శాంతింపచేసే శక్తి ఆమెకు గురుతుల్యురాలైన పరమ పతివ్రతకే వుంటుందని చెప్పి వారందరినీ పోయి అత్రి మహాముని పత్నియైన అనసూయను ప్రార్థించుమని సూచించాడు. మహాతపస్వినియైన అనసూయ దేవతలను కరుణించి ఆ బ్రాహ్మణ పత్నిని రావించి ఆమె భర్తకు ఆయురారోగ్యాలను ప్రసాదించి సూర్యుడు దయించే ఏర్పాటు చేసింది. ఇంతటి పతివ్రతే సీత కూడా. ***(అధ్యాయం -142)***

---

★*ఆ పతివ్రత పేరు సుమతి. ఆ మహామునిపేరు మిగతా అన్ని చోట్లా మాండవ్యుడనే వుంది.*

# రామాయణకథ

రామాయణానికే సీతా చరితమనే పేరు కూడా వుంది. ఆమె చరిత్రను విన్నంత మాత్రాననే అన్ని పాపాలూ నశిస్తాయి.

భగవంతుడైన శ్రీమన్నారాయణుని నాభికమలం నుండి బ్రహ్మ, ఆయన నుండి మరీచి, అలా పరంపరగా కశ్యపుడు, సూర్యుడు, వైవస్వతమనువు, ఇక్ష్వాకువు ఆయన వంశంలో రఘుమహారాజు, అజమహారాజు, దశరథుడు జన్మించారని తెలుసు కదా! ఆయనకు మహా బలవంతులు పరాక్రమశాలురునైన రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు నోము ఫలములై కలిగారు.

శ్రీరాముడు విష్ణువేనని చెప్తారు. హరి అవతారాలలో సంపూర్ణ మానవ జీవితాన్ని గడిపి మానవజాతికి, కుటుంబవ్యవస్థకు ప్రపంచంలోనే ఆదర్శంగా నిలచినది శ్రీరామావతారము. వసిష్ఠ, భరద్వాజ, విశ్వామిత్ర మహర్షులు శ్రీరాముని సర్వవిద్యా విశారదుని, సకలకళావల్లభుని గావించారు. ఆయన కన్న గొప్పవీరుడు కాని ఆయనతో సమానుడైన వీరుడు గాని చరిత్రలో లేరు.

విశ్వామిత్రుని యాగమును కాచుటలో భాగంగా శ్రీరాముడు తాటకను వధించాడు. సుబాహుని కూడా వధించాడు. మారీచుడూ అప్పుడే చావాలి కాని అలా కాకపోవడం దైవసంకల్పం. జనకునింట నున్న శివధనువును విఱచి సీతను చేపట్టి కళ్యాణ రాముడైన శ్రీరాముడు లక్ష్మణ ఊర్మిళ, భరత మాండవి, శత్రుఘ్న- శ్రుతకీర్తి జంటలతో సహా అయోధ్యకు తిరిగి వచ్చాడు. ప్రజలలో, ప్రజలతో కలిసి కలయ దిరుగుతూ నిషాదుడైన గుహునితో కూడ స్నేహం చేసి అందరి మనసులలోనూఆదర్శ క్షత్రియపుత్రునిగా నిలిచాడు.

భరతుడు శత్రుఘ్నునితో కలిసి తన మేనమామల రాజ్యానికి వెళ్ళాడు. సరిగ్గా ఆ సమయంలోనే దశరథుడు శ్రీరాముని పట్టాభిషిక్తుని చేయ సంకల్పించాడు. **( అనుబంధం -13లో చూడండి)** కైక దీని కంగీకరింపకపోగా తనకాయన ఇచ్చిన వరాలను ఇపుడు కోరుకుంది. రాముని పదునాలుగేడులు అడవికి పంపమంది. భరతునికి పట్టాభిషేకం చేయమంది. దశరథుడు మాట తప్పలేక మ్రాన్పడిపోగా శ్రీరాముడు వచ్చి విషయం తెలుసుకుని తండ్రి పాదాలకు నమస్కరించి అడవులవైపు వెడలిపోగా మహాపతివ్రత సీత, జోడు విడని సైదోడు లక్ష్మణుడు ఆయన వెంట నంటి వెళ్ళారు. చిత్రకూటంలో ఉండసాగారు.

అయోధ్యలో శ్రీరామ వియోగాన్ని తట్టుకోలేక దశరథుడు మరణించాడు. మేనమామ యుధాజిత్తు నింటినుండి మరలి వచ్చిన భరతుడు మిక్కిలిగా దుఃఖించి తన తల్లిని

అభిశంసించి రాముని మరల్చుకొని రావడానికి అడవికి వెళ్ళాడు కాని రాముడు రాలేదు. అపుడు భరతుడు అన్నగారికి బదులు ఆయన పాదుకలను సింహాసనంపై పెట్టుకుని తాను కూడ వనవాసిలాగే జీవిస్తూ రాజ్యవ్యవహారాలను చక్కబెడుతూ అన్నగారి ఆగమనం కోసం ఎదురుచూస్తూ వుండిపోయాడు. అతడు అయోధ్యలో అడుగుపెట్టలేదు. నందిగ్రామంలోనే వుండిపోయాడు.

శ్రీరాముడు చిత్రకూటాన్ని వదిలి మున్యాశ్రమాలను దర్శించుకుంటూ అత్రి, సుతీక్ష్ణ, అగస్త్య మహర్షులకు నమస్కరించి వారి ఆశీర్వాదాలను గైకొని దండ కారణ్యంలో పర్ణశాలను నిర్మించుకుని నివసించసాగాడు. అక్కడికి నరభక్షకియైన శూర్పణఖయను రాక్షసి రాగా శ్రీరాముడామె ముక్కుచెవులను కోయించాడు. అమె గొల్లున యేడుస్తూ వెళ్ళి తన బంధువులైన ఖరదూషణ, త్రిశిరాది పదునాలుగు వేల మంది రాక్షసులను రెచ్చగొట్టి శ్రీరామునిపైకి ఉసికొల్పింది. వారంతా పెల్లున గొప్ప హడావుడి చేస్తూ ఆయనపై పడ్డారు. కాని రామబాగాగ్ని శిఖల్లో శలభాల్లాగ మాడి పోయారు. ఒక్కడూ మిగలలేదు. దాంతో శూర్పణఖ తన యన్నయు, లంకేశ్వరుడు నైన రావణాసురునికి తన బద్ధ పన్నములనూ, ఖరదూషణాదులను మృతినీ విలపిస్తూ వివరిస్తూనే సీత యొక్క అతిలోక సౌందర్యాన్ని కూడా వర్ణించి చెప్పింది. అతడొక పథకం ప్రకారం సీతాపహరణాని కొడి గట్టాడు. ముందుగా మాయలమారి మారీచుడు బంగారు లేడిగా మారి సీతనా కర్షించగా ఆమె కోరిక మేరకు శ్రీరాముడు దానిని పట్టి తెచ్చుటకు బయలుదేరాడు కాని కొంతసేపటికి ఓపిక నశించి దానిపై బాణప్రయోగం గావించగా ఆ దెబ్బ తగలగానే మారీచుడు రాముని గొంతుతో పరమబాధాకరంగా 'హా సీతా హా లక్ష్మణా' అని చావుకేక పెట్టిపోయాడు. సీత భయపడిపోయి లక్ష్మణుని పంపించగా అదే అదనుగా రావణుడు సన్యాసి వేషంలో వచ్చి సీతను అపహరించి లంకకు గొనిపోయాడు. దారిలో దశరథ మిత్రుడైన జటాయువు అడ్డుపడగా అతనిని నేలకూల్చాడు.

రామలక్ష్మణులు వెనుకకు వచ్చేసరికి పర్ణశాల శూన్యంగా వుంది. అత్యంత దుః ఖితుడై కూడా రాముడు కర్తవ్యాన్ని మరువలేదు. సీతాన్వేషణలో పడ్డాడు. రావణుని జాడలను, నేలపై బడినంత మేర, వెతుకుతూ పోగా వానిచే నేలకూల్చబడిన జటాయువు కొన వూపిరి మీద వుండి కనిపించాడు. అతడు సీత నెవరో దానవుడపహరించి దక్షిణదిశ వైపు సాగిపోయాడని చెప్పి శ్రీరాముని చేతుల్లోనే మరణించాడు. రాముడు తనకు పితృ సమానుడైన జటాయువుకి అంత్యక్రియలు గావించి దక్షిణదిశవైపు సీతను వెతుకుతూ వెళ్ళాడు. దారిలో ఆయనకి సుగ్రీవునితో సంధి కుదిరింది. వాలిని చంపి సుగ్రీవుని రాజును చేశాడు. వానలకాలం రావడంతో ఆ కాలమంతా ఋష్యమూకంపైనే గడిపాడు.

వానలు కడముట్టగానే సుగ్రీవుడు పర్వతాకారులైన అంతే ఉత్సాహం కూడా కలవారైన తన వానరయోధులను సీతను వెదకుటకై నలుదిశలకూ పంపించాడు. దక్షిణ దిశవైపు అంగదుడు, ఆంజనేయుడు, జాంబవంతుడు మున్నగు మహాయోధులు వెళ్ళారు. చివరికి సాగరతీరాన్ని చేరి ఆశలన్నీ ఆవిరైపోయాయనీ తాము వెనుకకు మరలి శ్రీరాముని మరింత బాధించుట కన్నా జటాయువు వలె ఆయన కార్య సాధనలో మరణించుటే మేలని నిరాశాపూరిత వాక్కులను వెలార్చుచుండగా జటాయువు సోదరుడైన సంపాతి వీరి మాటలను విని బాధలను గని విషయం కనుగొని సీత జాడను తెలిపాడు. కడలికి ఆవల గల లంకలో సీత రావణుని చెఱలో వున్నదని చెప్పాడు.

కపి శ్రేష్ఠుడైన వీరాంజనేయుడు వెంటనే లంఘించి శతయోజన విస్తృతి గల సముద్రాన్ని దాటి లంకలో అశోకవనంలో వున్న సీతను దర్శించాడు. స్వయంగా రావణుడే వచ్చి ఆమెపై తనకు గల అవ్యాజ ప్రేమను ప్రకటించడం,ముల్లోకాలకే సమ్రాజ్ఞిని చేస్తానని ప్రలోభపెట్టడం, తన కోరికను తీర్చని పక్షంలో చంపేస్తానని భయపెట్టడం చూశాడు. సీత దేనికీ లొంగక స్థిరంగా తాను రాముని తప్ప మరొక పురుషుని వరించనని చెప్పడం, అంతటి లంకేశ్వరునీ గడ్డిపోచకన్న హీనంగా చూసి మాట్లాడడం కూడా చూశాడు. ఈ విశ్వంలోనే సీతను మించిన పరమపతివ్రత లేదని గ్రహించాడు.

నోటికి వచ్చిన దెల్ల పలికి రావణుడు పోయిన వెనుక అశోకవనంలో శోక సంతప్తయై నిలచిన సీతను ఆంజనేయుడు మెల్లగా సమీపించి శ్రీరామస్తుతిని గానం చేసి ఆమె కాస్త కుదుటపడగానే శ్రీరాముని వ్రేలి ఉంగరాన్ని ఆమె కిచ్చి తాను రామదూతనని విన్నవించుకున్నాడు. ఆమెకు ధైర్యం చెప్పి ఆమె ప్రసాదించిన చూడామణిని గైకొని బయలుదేరాడు.

సీత నిలచిన ప్రాంతాన్ని మాత్రం క్షేమంగా వుంచి మిగతా అశోక వనాన్నంతటినీ ధ్వంసం చేయసాగాడు. రావణుని సైనికులు తనను పట్టబోతే రావణపుత్రుడు అక్షకుమారునితో సహా కొన్ని వేల మందిని సంహరించిన ఆంజనేయుడు ఇంద్రజిత్ బిరుదాంకితుడైన మేఘనాథుని బ్రహ్మాస్త్రానికి మాత్రం కట్టుబడ్డాడు.(అదీ బ్రహ్మదేవుని కిచ్చిన మాటను నిలబెట్టుకొనుటకే) రావణుని కొలువులో ఏమాత్రమూ భయపడకుండా అతనికెదురుగా నిలచి సీతమ్మను సాదరంగా గొనిపోయి రామయ్య కర్పించి ఆయన శరణుజొచ్చుమని హితవు చెప్పాడు. రావణుడా వేదము వంటి వాక్యమును పాటింపకపోగా పరమ కుపితుడై ఆంజనేయుని తోకకి నిప్పటించి చంపాలనుకున్నాడు. కాని మృత్యుంజయుడైన ఆంజనేయ స్వామి ఆ వాలాగ్ని తోనే లంకకు నిప్పంటించి మరల జలధిని లంఘించి రాముని పాదాల కడ వాలిపోయాడు. (ఈ విధంగా శ్రీరామబంటు సీతను చూచి రమ్మంటే లంకను కాల్చి వచ్చాడు) సీత చూడామణిని రామునికి సమర్పించాడు.

తరువాత సుగ్రీవ, అంజనాసుత, అంగద, లక్ష్మణాది పరివార సమేతంగా శ్రీరాముడు సాగరతీరాన్ని చేరుకొని నలుని ద్వారా సముద్రంపై సేతువును నిర్మించి ఆవలి ఒడ్డును చేరుకొని అక్కడి సువేల పర్వతం పై విడిది చేసి అక్కడినుండి లంకాపురాన్ని వీక్షించాడు. విభీషణుడు రాముని శరణుజొచ్చాడు.

తరువాత నీల, అంగద, నలాది ముఖ్య వానరులతో, ధూమ్రాక్ష, వీరేంద్ర, ఋక్షపతి జాంబవంతాది ముఖ్య వీరులతో,సుగ్రీవ, ఆంజనేయాది వర పరాక్రములతో కలసి రామలక్ష్మణులు లంకా సైన్యమును సర్వనాశనం చేయసాగారు.విశాల శరీరులై నల్లని పెనుగొండలవల నున్న ఎందరో రాక్షసులు వీరి చేతిలో మట్టి కరిపించారు. దేవతలనే గడగడ వణకించిన, బలవీరపరాక్రమ సాహస సంపన్నులైన విద్యుజ్జిహ్వ, ధూమ్రాక్ష, దేవాంతక, నరాంతక, మహోదర, మహాపార్శ్వ, మహాబల, అతికాయ, కుంభ, నికుంభ, మత్త, మకరాక్ష, అకంపన, ప్రహస్త, ఉన్మత్త, కుంభకర్ణ, మేఘనాథులతో కూడిన మొత్తం రావణ పరివారాన్ని కారణజన్ములైన రామలక్ష్మణులు తమ దివ్య శస్త్రాస్త్ర విద్యా నైపుణి మీరగా యమపురికి పంపించారు.

చివరగా శ్రీరాముడు ద్వంద్వయుద్ధంలో లోకకంటకుడైన రావణుని సంహరించాడు. తరువాత సీత పాతివ్రత్యాన్ని అగ్నిదేవుని సాక్షిగా లోకానికి నిరూపించి పుష్పక విమానంపై అయోధ్యకు మరలివచ్చి పట్టాభిరాముడయ్యాడు.ప్రజలను కన్నబిడ్డలను వలె చూసు కున్నాడు. పది అశ్వమేధయాగాలు చేసి, గయతీర్థంలో పితరులకు తర్పణాలిచ్చి బ్రాహ్మణులను విభిన్న ప్రకారాల దానాలిచ్చి దేవతలను, పితరులను, ప్రజలను సంప్రీతులను చేస్తూ పదకొండు వేల సంవత్సరాలు రాజ్యపాలనం చేశాడు.

*ఏకాదశ సహస్రాణి*
*రామో రాజ్యమ కారయత్ ।* *(ఆచార.. 143/50)*

రామునికి తగిన పత్నిగా కొన్నిచోట్ల ఆయనకన్న గొప్ప శీల స్వభావాన్ని కనబఱచిన మహాదేవిగా సీత ఈనాటికీ పతివ్రతా తిలకంగా లోకులచేత పూజలందుకుంటోంది.

భరతుడు శైలూష నామకుడు, లోక కంటకుడునైన గంధర్వుని సంహరించాడు. శత్రుఘ్నుడు లవణాసురుని చంపి ప్రజలను కాపాడాడు.

తరువాత ఈ నలుగురు సోదరులూ అగస్త్యాది మునుల తపోవనాలకుపోయి వారిని తృప్తిగా సేవించుకొని వారి ద్వారా ధర్మాలనూ, రాక్షస చరిత్రలనూ తెలుసుకొని, తమ వారసులను కూడా తమంత వారినిగా చేసి అవతారం చాలించారు. ***(అధ్యాయం -143)***

# ప్రత్యేకానుబంధం

## (కొన్ని కఠిన పదాలకి అర్థాలు)

మాశ - మినుములు, ఒక కొలత
రాజమాశ - అలసందెలు
కరక - కరక్కాయ, పుట్టగొడుగు
త్రికుట - సొంటి+పిప్పలి+ మిరియాలు
భృంగరాజ - గుంటగలిజేరు.
వాసక - అడ్డసరము
శతావరి - పిల్లపీచర
గుడూచి - తిప్పతీగ
కాకాదని - పెద్దమాచి
మధుక - తిప్పతీగ
పిప్పలి - రావి
తిందుకం - తుమ్మికి
ప్రియాలం - మోరటి
రాజాదనం - మోదుగు, పాలచెట్టు
లకుచం - గజనిమ్మ
కపిత్థం - వెలగ
కేశ(స) ర - పొన్న, పొగడ
మాతులుంగ - మాదీఫలం
హరీతకి - కరకచెట్టు
త్రిపుట - బంగిచెట్టు
వాస్తుక - ఒకదినుసు కూరాకు
ఏరండ - ఆముదపు చెట్టు
కాకమాచి - కాచి
వర్షభూ - గలిజేరు
రాజిక - నల్లావాలు
చిత్రక - గుమ్మడి, ఆముదం
శిగ్రు - మునగచెట్టు
చవ్య - వస చెట్టు
చరణ - వేరు
తర్కారి - తక్కిలిచెట్టు
కాశమర్దకం - గుగ్గిలం వంటిదే
చణక - సెనగలు
షష్టిక - అరవై దినాల్లో పండే ధాన్యం
గౌరషష్టిక - ఎఱ్ఱని షష్టికం
శ్యామక - చామ, గడ్డి
ప్రియంగు - కొఱ్ఱలు, నల్లావాలు
కర్కంధు - రేగు
పీనసం - పడిశం
వంక్షణ - గజ్జ
విసర్పరోగ - దురదలు
విషూచి(క) - కలరా
విరసతా - రసహీనత
ఆంత్రకూజనం - ప్రేగు కూత
తంద్ర - కునికిపాటు
బృహతి - వాకుడు, ములక

పునర్నవ - గోరు, గలిజేరు
నిర్గుండకి - వావిలిచెట్టు
మేద - కడుపు
తగర - నందివర్ధనం
ప్రసారణి - గొంతెమ గోరుచెట్టు
హరీతకి - కరక
హయమారక - గన్నేరు
యవాని - ఓమము
(ద్రవ్యము,అంగడి దినుసు)
గణిక - అడవి మొల్ల, నెల్లి చెట్లు
సప్తపర్ణి - ఏడాకుల అరటి లేదా పొన్న
వ్యోష (వ్యోశ) - సొంటి, రావి, నల్లమిరపల మిశ్రమం
అగ్నిమంథ - శ్రీపర్ణం, నెల్లి
కర్షఫలము - తాండ్ర
శతపుష్పి - సదాపచెట్టు
ఉదుంబర - మేడిచెట్టు
శిగ్రు - మునగచెట్టు
అగురు - ఇరుగుడు చెట్టు
జీవనీయ - పాలకూర
శైలేయ - ఇందుప్పు, ఊపువ్వు చెట్టు
లోధ్ర - లొద్దుగు చెట్టు
పాథస్సు - జలము, అన్నము
పర్పట,పర్పర - పాపట చెట్టు
ఛిన్న - తిప్పతీగ

నీలి - నల్లగోరింట
మందార - ఇనుపచిట్టెము, దానితో చేసిన సిందూరము
యవక్షారము - యవల వల్ల కలిగిన ఉప్పు
కలింద - తాడెచెట్టు
ఉత్సర్గ - దానం, విడుపు
బరగద - మఱ్ఱి
తిందుక - తుమ్మికి చెట్టు
ప్లక్ష - జువ్వి
పలాశ - మోదుగు
కసార - నీటి చెలమ
కనేర - గన్నేరు
భోజపురి - జామ
లాజా - అక్షతలు
కుట్మల - మొగ్గ
కృశర - నువ్వులు + అన్నం
ఉడద - గుఱ్ఱపు చిక్కుడు
పొంసలా - చలివేంద్రం
అధివాసన - సుగంధ ద్రవ్యాలతో పూజ
బలి, వస్తి - పొత్తి కడుపు
ఖండహరం - తీపి పూలచెట్టు
అపామార్గ - ఉత్తరేను మొక్క
తగర - నందివర్ధనం
ప్రియంగు - ప్రేంకణపు చెట్టు
సిందువార - వావిలి చెట్టు
ధతురా - ఉమ్మెత్త

ఘటుకట్టైయా – దురదగొండి
తుంబాజడం – ఉసిరి మూలం
బహువార – విరిగి చెట్టు
లోధ్ర – లొద్దుగు
శోణ – ఎఱ్ఱదుండిగ మొక్క
ప్రియాల – ద్రాక్ష, మోరటి
గజపీపల – రావి
భారంగి – కేబేజి వంటిదే
వచా – వస
ఖస – గసగసాలు
మార్జార – తెల్లగసి చెట్టు
కసమర్ద – కసివెంద (పచ్చనిపూలు)
మాతులుంగ – జామి
విదారి – తెల్లనేలగుమ్మడు
జృంభక – ఆవులింత
శ్రీఫల – మారేడు
ధాత్రీఫల – ఉసిరిక
జంబూఫల – నేరేడు
దంతి – నేరేడు
వికంకత – కానరేగు చెట్టు
వృషలీ – శూద్ర స్త్రీ
పీపల – రావి
సాఀవాఀ – నూకలు
మూంజ – జనుము
మూర్వా – అవిసె
సన – గొఱ్ఱె

తాండవనృత్య – గడ్డి, ఒక ధాన్యం
ఆలాత – మండుతున్న కఱ్ఱ
వృషలీపతి – వినాయకుడు
సావా – కత్తి ఒరలను ఈ మొక్క నుండి చేస్తారు.
మధూక – జీర్ణం కోసం వాడే మొక్క
ఉపస్థ – ఒడి
కరవా – ఈక
కేతకి – గొజ్జంకి
బాలుకామయ – కోవెల చెట్టు
తగర – కసింద చెట్టు (+)
కకడీ – దోస
శుకరవృత్తి – మద్యశాలను శుభ్రపఱచు
ఖదిర – చంద్ర, ముదుగు దామర
దాడిమ – దానిమ్మ
బహువార – విరిగిచెట్టు
శోణ – ఎఱ్ఱ దుండిగ
పువా – అరిసె
కుసుంభ – కుంకుంపువ్వు
బాలూ – ఇసుక
అజరూషక – తెల్లసందిడి
న్యగ్రోధ – జువ్వి
అగహనీ – మార్గశిరంలో కోసిన ధాన్యపు బియ్యం
ఛాగ – మేక, మేకపాలు
ముశల – రోకలి

| | |
|---|---|
| కేతకి | – మొగలి |
| అలక్త | – లక్క |
| సందంశ | – పటకారు |
| వటక | – వడియం |
| శోథ | – వాపు |
| ముద్గల, ముద్గాన్నం | – పెసరఅన్నం |
| శాల్యన్నం | – వరి అన్నం |
| యవాగు | – జావ |
| కుబ్జక | – పొట్ల |
| శాల్మలి | – పత్తి |
| శాలిహోత్ర | – గుఱ్ఱం |
| కోద్రవ | – గడ్డిపఅక |
| రౌప్య | – నాణెం |
| కంకత | – దువ్వెన |
| కరజ | – కానుగ చెట్టు |
| కంకోల | – గుమ్మడి గుజ్జు |
| వసా | – కొవ్వు |
| ద్రోణపుష్టి | – కాయగూర |
| మురి | – కప్పనది |
| జటామాంసి | – ఆకుపచ్చని పూలుండే ఒక వాసన చెట్టు |
| కుటజ | – కొండమల్లె, అడవిమల్లె |
| పిటారీ | – చిన్నబుట్ట |
| ముస్తా | – జీర్ణకోశమందు |
| శతావరి | – తోటకూర |
| హల్దీ | – కుంకం |
| ప్రియంగు | – నల్ల ఆవాలు |
| మోంగర | – కొండమల్లె, మాలతి |
| మహువా | – సోమలత |
| బదరీ | – రేగు |
| ఖయిర | – కాచు |
| కదంబ | – కడిమి |
| అతిముక్తక | – నెమ్మి, నల్లతుమికి |
| గులర | – ముతక చక్కెర |
| గంధనాడి | – ఎఱ్ఱపూల తులసి |
| అగస్తి,అగస్త్య | – అగిసె |
| సిహ్లక | – బెంజాయిన్ |
| కింశుక | – మోదుగ |
| గిరి కర్ణిక | – దింటెన |
| అపరాజిత | – గిరికర్ణిక |
| రురు | – నల్లచారల దుప్పి |
| నేమి | – కమ్మి |
| జు ఆ | – పేలపిండం |
| నీలవృక్ష | – నల్లగోరింట |
| కర్కంధు | – రేగు |
| పీనస | – పడిశం |
| వంక్షణ | – తొడసంధి, గజ్జ |
| విసర్పరోగ | – దురద |
| ఆంత్ర | – ప్రేగు |
| తంద్ర | – కునికిపాటు |
| గుడూచి | – తిప్పతీగ |

చిత్రక – ఆముదం, గుమ్మడి
బృహతి – వాకుడు, ములక
నిర్గుండకి – వావిలి
భృంగరాజ – గుంటగలిజేరు
వాసక – అడ్డసర
మధుక – తిప్పతీగ
రాజాదనం – మోదుగు పాలచెట్టు
లకుచ – గజనిమ్మ
కపిత్థ – వెలగ
కేశర(కేసర)– పొన్న, పొగడ
మాతులుంగ– మాదీఫలం
హరీతకి – కరకచెట్టు
త్రిపుట – బంగిచెట్టు
వాస్తుక – దినుసుకూరాకు
ఎ (ఏ)రండ– ఆముదం చెట్టు
కాకమాచి – కాచి
వర్షభూ – గలిజేరు
గౌరషష్టిక – ఎఱ్ఱటి, 60 దినాల్లో పండే ధాన్యం
రాజిక – నల్ల ఆవాలు
చవ్య – వస చెట్టు
తర్కారి – తక్కిలిచెట్టు
చణక – సెనగలు
మాశ – మినుములు
రాజమాశ – అలసందెలు
కరక – పుట్టగొడుగు, దానిమ్మ, కరక్కాయ

త్రికుట – సొంటి, పిప్పలి, మిరియాలు
కాకాదని – పెద్దమాచి
మేఢకి,వ్యోశ– సొంటి + రావి + నల్లమిరప
శ్యామాక – గడ్డి, చామ
కటుక – త్రికుట
కశేరుక – వెన్నెముక, కమ్మరేగు చెట్టు
కచ్ఛుర – రేగడిదూల, వాకుడు, గంట్లకచోర చెట్లు
కంటకారిక – వాకుడు చెట్టు
కుష్ఠ, కుశ్థ – చెంగల్వ కోష్టు చెట్టు
క్వాథ – బాధ
విడంగ – వంట ఉప్పు, ఒక చెట్టు
బల – ముత్తవ పులగ చెట్టు
నీవార – విత్తక పండే గడ్డి ధాన్యము
నిర్గుండి – నల్లవావిలి
శష్కులి – చక్కిలం (కూడా)
ఇంగుది – గార చెట్టు
కలాయము – గుండ్రని సెనగలు
సిద్ధార్థ – తెల్ల ఆవాలు
ఛిన్న – తిప్పతీగ
మండూర – ఇనుము కలిసిన సిందూరము
స్నుహి – జెముడు చెట్టు
త్రివృత – తెల్ల తెగడ
విశాల – పెద్ద పాపర చెట్టు
ద్రుమ – పారిజాత

జీవనీయ – పాలకూర

శైలేయ – ఊపువ్వు చెట్టు

గుంజ – గిరిజ చెట్టు

పర్పట – పాపట చెట్టు

భూనింబ – నేలవేము

బ్రాహ్మి – బారంగి, పొన్నగంటి

బ్రాహ్మణయష్టిక – చిఱు తేకు, బారంగి

అతి విష(శ)– అతివస

అమృత – ఉసిరిక, కరక

విశ్వ – అతివస చెట్టు

విశ్వ – సొంటి (కూడ)

వత్సక – కొడిసె చెట్టు

పిచ్ఛిల – ఇరుగుడు, బూరుగు

పినగుమ్ముడు – టేకు

బదరి – రేగు, గంగరేగు, పత్తి

మైరోబాలన్ – చెర్రీల ముద్ద

ముస్త – నిడుముస్తె చెట్టు

మధుద్రుమము– ఇప్పచెట్టు

మధుపర్ణి – గుమ్ముడు, ఇప్ప, నీలి

మధుర – సదాప చెట్టు

మధురస – చాగ, ద్రాక్ష, పిన్నపాల చెట్లు

మధుశిగ్రు – ఎఱ్ఱపూల మునగ

మధుశ్రవ – తెల్లగురిజ

మధుష్ఠీల(వ)– ఇప్ప

మధుశ్రేణి – చాగ

మధూలిక – పుప్పొడి, చాగ

మధుస్రవ – పాలకూర

మనశ్శిల – మణిసిల, కొండమీది ఎఱ్ఱమన్ను

పాఠ – విసబొద్ది చెట్టు

సువర్చల – నింగిమిరి చెట్టు

సితవీర్య – జీలుగు

సిక్థ – మైనం, మెతుకు

ఊషణ – పిప్పలి, మిరియం

గ్రంథిక – పిప్పలివేరు, గుగ్గిలపు చెట్టు, వెఱుతురు.

గ్రంథిల – వెఱుతురు చెట్టు ములువెలగ

ఉదీచ్య – కురువేరు, ఉత్తరపు దిక్కు

విష – అతివస చెట్టు

విభీతక – తాండ్రచెట్టు

వహ్ని – చిత్రమూలపు చెట్టు

వకుళ – పొగడ

జ్యోతిష్మతి – మానేరు తీగ

జీమూత – డావరడంగి చెట్టు

ఇక్ష్వాకు – చేదుసొర

ధాన్యాక – ధనియాలు

ధామార్గవ – ఉత్తరేను, ఆవడ చెట్లు

మదన – ఉమ్మెత్త, మంగచెట్లు

ఇంద్రాణి – వావిలి చెట్టు

ఇంద్రవల్లి – ఇల్లింద చెట్టు

ఇంద్రవారుణి – పెద్ద పాపర చెట్టు

ఇంద్రద్రు – ఏఱుమద్ది

ఇందుప్పు – సైంధవ లవణం

ఇంద్ర - మరువం
మజ్జ - ఎముకలోపలి జిడ్డు
కశేరుక - కమ్మరేగు చెట్టు
కవచము - కలజువ్వి
కరజ - కానుగు
కరమర్దము - కలివెచెట్టు
శృంగాటక - పరికెగడ్డ
అమ్లిక - చింత, పులి చింత చెట్లు
లశున - వెల్లుల్లి
లాంగలి - తరిగొట్టు, నీరు పిప్పలి, నారికడము చెట్లు
శల్లకి - సల్లకి, అందుగు చెట్టు
శాల - పెనుగొమ్మ
శింబి - తంబతీగ
పవిత్రకం - మేడి, రావి
పాటలి - కలిగొట్టు చెట్టు
పాలక్య - గంధపు చెట్టు
కచ్ఛుర - వాకుడు చెట్టు
చిల్ల - కతకపు చెట్టు
తోయదం - తుంగ చెట్టు
నాగబల - బీర
నిశ - పసుపు
నేమి - తినాస చెట్టు
వర్షభూ - గలిజేరు చెట్టు
వరుణము - ఉలిమిరి చెట్టు
కంటకారిక - వాకుడు చెట్టు
ఆరగ్వధ - రేలచెట్టు
అజాజి - జీలకఱ్ఱ
ఉపకుంచిక - నల్లజీలకఱ్ఱ, చిట్టేలకి చెట్టు
ఉపకుల్య - పిప్పలి
భల్లాతకి - జీడి
పూగ - గంగరావి
శతమూలి - పిల్లపీచర
శతవీర్య - తెల్లగరిక
వ్యాఘ్రి - వాకుడు చెట్టు
తుంబి - తుమ్మి, సొర

## హరివంశ వర్ణన (శ్రీకృష్ణకథ)

భగవానుడైన శ్రీకృష్ణుని మాహాత్మ్యముచే పరిపూర్ణమైన కారణంగా శ్రేష్ఠ తమంగా నిలచిన హరివంశాన్నొకమారు తలచుకుందాం.

పృథ్విపై పెచ్చుమీరిన అధర్మాన్ని నశింపజేసి ధర్మానికి పూర్వవైభవాన్ని తెచ్చి నిలబెట్టడానికి శ్రీకృష్ణుడు బలరామునితో సహా దేవకీ వసుదేవులకు జన్మించాడు. పుట్టిన కొన్ని దినాలకే కృష్ణుడు పూతనను స్తన్యంతో బాటు ప్రాణాలను కూడా పీల్చి సంహరించాడు. తరువాత శకటాసురుని తన చిరుకాలి తాపుతో మట్టు బెట్టాడు. రోటి

నీడ్చుకుంటూ పోయి మద్దిచెట్లను కూల్చి సంపూర్ణ దేవ మానవగణాలన్నీ విస్మయపడగా నలకూబర, మణిగ్రీవులకు శాపవిమోచనాన్ని కలిగించాడు. కాళింది మడుగున విషమును కలిపే కాళియ నాగుని తలలపైతాండవ మాడి గోకులవాసుల కాతని పీడ విరగడజేశాడు. గోవర్ధన గిరినెత్తి ఇంద్రుని బారిన పడిన ప్రాణులను రక్షించి ఇంద్రునికి గర్వభంగం చేశాడు. ఇలా శ్రీకృష్ణ లీలలెన్నో విశ్వవిఖ్యాతమై యున్నవి. వాటిని తెలియని వారుండరు. తాను స్వయంగా అరిష్టాసుర కేశి (కంస) చాణూరాది బలశాలురైన దైత్యులను సంహరించుటయే గాక పాండవులకు సాయపడి కురుక్షేత్ర యుద్ధంలో లక్షలాదిగా ఆసుర శక్తులకు మరణశాసనాన్ని వ్రాసి భూభారాన్ని తగ్గించాడు.

పురాకృత సుకృతాల వల్లనో, వరదానాల ఫలరూపంగానో రుక్మిణీ, సత్యభామాది ఎనమండుగురు రమణీలలామలూ, నరకాసురునిచే చెఱపట్టబడిన పదహారుమంది క్షత్రియ కన్యలూ శ్రీకృష్ణుని భార్యలైనారు. ఆయన ద్వారా యాదవ వంశం పుత్ర పౌత్రాభివృద్ధిని గాంచింది. రుక్మిణీ కృష్ణుల నందనుడైన ప్రద్యుమ్నుడు శంబరాసురుని వధించడం ద్వారా లోక రక్షకుడైనాడు. ఆతని పుత్రుడైన అనిరుద్ధుని బాణాసురుని కూతురైన ఉష వలచి వలపించుకొని వివాహానికి సిద్ధపడగా బాణుడు కుపితుడై అనిరుద్ధుని పట్టి బంధించాడు. మనుమని కొఱకై శ్రీకృష్ణుడు బాణాసురునితో యుద్ధం చేయవలసి వచ్చింది. అతడు కూడా సామాన్యుడేమీ కాడు. వేయి భుజాలు గలవాడు, గొప్ప శివభక్తుడు. అయినా అతని అధర్మమే శ్రీకృష్ణుని చేతిలో అతనిని పరాజితుని చేసింది. శ్రీకృష్ణుడు బాణాసురుని సంహరించలేదు గాని అతనికి రెండు భుజాలను మాత్రమే మిగిల్చి మిగతా అన్నిటినీ నరికివేసి అతని అహంకారాన్ని సంహరించాడు.

ఇంద్రుని జయించి దేవతల నందనవనంలోని పారిజాతాన్ని భూలోకానికి గొనివచ్చిన శ్రీకృష్ణుడు బలదైత్యునీ శిశుపాలునీ వధించి ద్వివిదనామక వానరాసురునీ సంహరించి లోకులను కాపాడాడు.

శ్రీకృష్ణుడు నూట పాతిక సంవత్సరాలు ఈ పుడమిపై జీవించాడు. అన్నేళ్ళలో ఏ ఒక్క నిముషమూ కూడ తన కోసం తాను బ్రతకలేదు. ఆయన వైకుంఠానికేగిన పిమ్మట అనిరుద్ధపుత్రుడైన వజ్రుడు ఈ వంశాన్ని నిలబెట్టాడు.

అన్నిటికన్నా గొప్ప విశేషం శ్రీకృష్ణుడిచ్చిన గురుదక్షిణ ఇక లేడనుకున్న సాందీపని పుత్రుని సముద్రశోధనం, రాక్షస సంహారం గావించి వెనక్కి తెచ్చాడు. ***(అధ్యాయం –144)***

# మహాభారతం - బుద్ధాది అవతారాలు

**భూ**భారాన్ని తగ్గించడానికీ వీలైనంత ఎక్కువమంది దుష్టుల్ని సంహరింప డానికీ భగవానునిచే కల్పింపబడిన మహాభారత యుద్ధమును యుధిష్ఠిరాది పాండవులను శ్రీకృష్ణుడు రక్షించిన తీరును ఒకపరి తలుద్దాం.

విష్ణు భగవానుని నాభి కమలం నుండి నేను (అనగా బ్రహ్మ)పుట్టాను కదా! నానుండి అత్రి, అతడి నుండి చంద్రుడు, అతడి నుండి బుధుడు ఉద్భవించారు. బుధునికి ఇలాదేవియను పత్ని ద్వారా పురూరవుడు జనించాడు. అతనికి ఆయువను పుత్రుడు అతనికి యయాతి అను కొడుకు పుట్టారు. యయాతి వంశంలో భరతుడు, కురుడు, శంతనుడు కలిగారు. శంతనునికి గంగ ద్వారా సర్వ సద్గుణ సంపన్నుడు, బ్రహ్మ విద్యలో పారంగతుడునగు దేవవ్రతుడు జనించాడు. ఏ యుగంలోనూ ఎవరూ చేయలేనంత గొప్ప ప్రతిజ్ఞను చేసి బ్రహ్మచారిగానే చివరిదాకా జీవించి రాజ్య సింహాసనాన్ని కూడా తండ్రిగారి రెండవ పెళ్ళి ముచ్చట తీర్చడం కోసం త్యజించిన దేవవ్రతునే ఆ ప్రతిజ్ఞ యొక్క భీషణత్వానికి అచ్చెరువొంది ఈ లోకం అత్యంతాదరంతో భీష్ముడని పిలుచుకొంది.

శంతనునికి భీష్ముని దయ వల్ల ప్రాప్తించిన పత్ని సత్యవతి ద్వారా చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అను కొడుకులు పుట్టారు. వారిలో చిత్రాంగదుడు అదే పేరుగల గంధర్వునితోడి యుద్ధంలో మరణించాడు. విచిత్ర వీర్యుని కోసం భీష్ముడు కాశీరాజ పుత్రికలైన అంబికను అంబాలికను తెచ్చి అతనికిచ్చి వివాహం చేశాడు. విచిత్రమైన వీరత్వం ఏమాత్రమూ లేని విచిత్ర వీర్యుడు పిల్లలు పుట్టకముందే మరణించాడు.

అప్పుడు సత్యవతి శంతనుని వంశాన్ని నిలబెట్టడం కోసం తన పెద్ద కొడుకైన వ్యాస దేవుని ఆజ్ఞాపించి దేవర న్యాయం ద్వారా తనకోడళ్ళను పుత్ర వతులను చేయించింది. అంబికకు ధ్రుతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు పుట్టారు. అంబిక పనుపున పోయిన ఆమె దాసి వ్యాసమహర్షి ద్వారా విదురుని కన్నది. ధృతరాష్ట్రునికి గాంధారి ద్వారా నూరుగురు కొడుకులు, ఒక కూతురు కలుగగా పాండురాజునకు కుంతి ద్వారా యుధిష్ఠిర భీమార్జునులు, మాద్రి ద్వారా నకుల సహదేవులు కలిగారు. గాంధారి పుత్రులను కౌరవులనీ కుంతీ మాద్రుల కొడుకులను పాండవులనీ లోకం పిలుచుకోసాగింది. ఈ నూట్రైదుగురు వంశాంకురాలూ మహాబలశాలులే గాని గాంధారి పెద్దకొడుకైన సుయోధనుడు, పాండవులూ సాహస పరాక్రమాలూ కూడా వుండడం వల్ల మహావీరులుగాప్రఖ్యాతి చెందారు.

దైవవశాత్తూ కౌరవ పాండవుల మధ్య వైరభావాలు జనించాయి. దుర్యోధనుడు పాండవులనెన్నో బాధలకు గురిచేశాడు. లక్కయింటిని వారికి విడిదిగా చూపించి దానిని దహనం చేయించాడు. ముందే పసిగట్టిన విదురుడు సొరంగమార్గాన్ని తవ్వించి పాండవులను రక్షించాడు. విదురుని సలహా మేరకు పాండవులు కొన్నాళ్ళు ఏకచక్రపురంలో బ్రాహ్మణ వేషాల్లో నివసించారు. అక్కడ భీముడు బకాసురుడను రాక్షసుని చంపి ఆ పుర నివాసులకు శాశ్వతంగా వాని పీడను వదిలించాడు. అక్కడినుండి పాంచాల దేశానికి వెళ్ళి ద్రౌపదీ స్వయంవరంలో పాల్గొన్నారు పాండవులు. అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని గెలుచుకోగా విధివశాన ఆమె పాండవ పత్నియైనది.

తరువాత భీష్మ ద్రోణుల ప్రోద్బలం వల్ల, విదురుని మంత్రాంగం వల్ల ధృతరాష్ట్రుడు పాండవులను పిలిపించి వారికి అర్ధరాజ్యాన్నిచ్చేశాడు.వారు ఇంద్ర ప్రస్థమనే గొప్ప సుందరమైన రాజధానిని కట్టుకొని ఒక అద్భుతమైన సభామండపాన్ని కూడా నిర్మింపజేసుకుని రాజసూయ యజ్ఞాన్ని కూడా దిగ్విజయంగా నెరవేర్చారు.

వాసుదేవుని అనుమతితోనే అర్జునుడు ద్వారకాపురికి పోయి కృష్ణసోదరి సుభద్రను పెండ్లాడాడు. అగ్నిదేవునికి ఖాండవ వన దహనంలో సహాయపడి నంది ఘోషమను దివ్యరథాన్ని, ముల్లోకాలలో శ్రేష్ఠతమమైనదిగా పేరు గాంచిన గాండీవమను ధనుస్సునూ, అవినాశములైన బాణములనూ, అభేద్య దివ్య కవచాన్నీ ఆయననుండి అర్జునుడు పొందాడు. రాజసూయ సందర్భంగా దేశ– దేశాంతరాలలో దిగ్విజయయాత్రను చేసి అసంఖ్యాకములుగా యుద్ధాలను చేసి అనేకులైన రాజులనోడించి వారి నుండి కప్పములుగా గొన్న కొండలంతేసిరత్నరాశులనుఅర్జునుడు తనఅన్నయుధిష్ఠిరునకు(ధర్మరాజుకి) సమర్పించాడు.

పాండవుల మొత్తం శ్రీని అపహరించడానికి శకుని ధర్మరాజుని ద్యూతక్రీడకు ఆహ్వానించి దుర్యోధనుని ప్రతినిధిగా తాను పాచికలు వేసి మాయచేసి గెలిచాడు. తత్ఫలితంగా పాండవులు ద్రౌపదితో సహా పన్నెండేళ్ళు వనవాసమూ, ఒక యేడు అజ్ఞాత వాసమూ చేయవలసి వచ్చింది. కుంజరయూధము దోమకుత్తుక జొచ్చినట్లు పాండవులు విరాటరాజు కొలువులో పనిచేసి అజ్ఞాతవాస నియమాన్ని పూర్తిచేశారు.

అజ్ఞాతవాస కాలంలో పాండవులలో ఏ ఒక్కరు బయటపడిపోయినా మరల వారందరూ పన్నెండేళ్ళు వనవాసమూ ఒక యేడు అజ్ఞాతవాసమూ చేయాలనే నియమం పెట్టారు. కాబట్టి పాండవుల ఉనికిని కనిపెట్టడానికి విశ్వప్రయత్నం చేసిన దుష్ట

చతుష్టయానికి అనగా దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులకు చివరి దశలో పాండవులు విరాట రాజ్యంలో వున్నారేమోననే అనుమానం వచ్చి పెద్ద సైన్యంతో దాడిచేసి గోవులను అపహరించడానికి ప్రయత్నించారు. అర్జునుడు వచ్చి అవక్రవిక్రమ ప్రతాపాన్ని మెరిపించి మొత్తం కౌరవసేనను చిత్తుచిత్తుగా ఓడించాడు. కర్ణుడు పడిపోయాడు. దుర్యోధనుడు మూర్ఛపోయాడు. తెలివివచ్చి సంతోషించబోయిన దుర్యోధనునికి అజ్ఞాతవాసకాలం నాటికి ముందలిరోజే సమాప్తమైపోయిందని చావు కబురు చల్లగా చెప్పి వెనుకకు మరలించుకుపోయారు గురువులు.

జూదపు నియమాలను దిగ్విజయంగా పాటించారు. కాబట్టి తమ అర్ధరాజ్యాన్ని తమకివ్వాలనీ అలాకాని పక్షంలో కనీసం అయిదూళ్ళయినా ఇమ్మని పాండవులు శ్రీకృష్ణుని ద్వారా రాయబారం చేశారు. సూదిమోపినంత స్థలమైనా ఇవ్వబోనని దుర్యోధనుడు చెప్పడంతో అసలు రాజుకు గుడ్డితనంతోబాటు మూగరోగం కూడా కలగడంతో యుద్ధమూ, బంధునాశమూ తప్పలేదు. *(ముసలిరాజుకి అంధత్వం పుట్టుకతోనే వచ్చింది. ఈ మూగతనం పుత్ర వ్యామోహం నుండి ఇప్పుడు పుట్టుకొచ్చింది)*

*(అయిదువేల యేళ్ళ క్రిందట)*

ఆ ముందుగానీ ఆ తరువాత గానీ ఏ ఒక్కజాతీ కనీవినీ యెఱుగని మహాయుద్ధం కౌరవపాండవుల బాహ్యానాయకత్వాన కురుక్షేత్రంలో జరిగింది. పాండవుల తరపున ఏడు అక్షౌహిణుల సైన్యమూ, కౌరవులవైపున పదకొండ క్షౌహిణుల సైన్యమూ ఈమహాసంగ్రామంలో పాల్గొన్నారు. ధృష్టద్యుమ్నుని★ పాండవులూ భీష్ముని కౌరవులూ తమ తమ సర్వ సైన్యాధ్యక్షులుగా ఎన్నుకున్నారు. పాండవ సేనాపతి యుద్ధం ముగిసేదాకా ఆ పదవిలోనే ఉన్నాడు కానీ కౌరవ సేనాపతులు మారవలసి వచ్చింది.

*(ఈ క్రింది పేరా గరుడపురాణానికే ప్రత్యేకం....)*

పాండవసేనాపతిగా శిఖండీ, కౌరవసేనాపతిగా భీష్ముడూ యుద్ధాన్ని ప్రారంభించారు. రెండు సేనల మధ్యా అస్త్రశస్త్రాలతో బ్రహ్మాండమైన యుద్ధం భయంకరంగా పదిరోజులపాటు జరిగింది. పదవరోజు శిఖండి, అర్జునుడు ప్రయోగించిన వందలాది బాణాలు తన తనువును భేదించడంతో భీష్ముడు నేలకొరిగాడు.

---

★***(శిఖండి అని గరుడ పురాణంలో వుంది)***

స్వచ్ఛంద మరణాన్ని వరంగా పొందిన భీష్ముడు హస్తినాపురానికి సమర్థమైన స్థిరమైన పాలన వచ్చేదాకా మరణించదలచుకోలేదు. సూర్యుడు ఉత్తరాయణ పుణ్యకాలంలోకి వచ్చేదాకా అలాగే అంపశయ్యపై వుండి యుద్ధాగ్ని ఆరగానే అప్పటికి మిగిలిన ధర్మరాజుకి (విష్ణుసహస్రంతోసహా) సర్వ ధర్మ సంబంధిత విభిన్న ఉపదేశాలనిచ్చి, పితృతర్పణలిచ్చి, శ్రీకృష్ణభగవానుని తదేకంగా తిలకిస్తూ ప్రాణం విడిచాడు. ఆయనకు నిర్మలాత్ములకు లభించే పరమానంద పదమైన మోక్షం లభించింది.

తరువాత కౌరవ సైన్యాధ్యక్ష పదవిపై ద్రోణాచార్యుడాసీనుడైనాడు. ఆయన పాండవ సేనాపతియైన ధృష్టద్యుమ్నునితో తలపడ్డాడు. వీరి సేనలమధ్య భయంకరమైన యుద్ధం అయిదురోజులపాటు సాగింది. కౌరవుల పక్షాన పోరాటం చేస్తున్న వందల కొలది రాజులు అర్జునుని బాణాగ్నిలో భస్మమైపోయారు. అశ్వత్థామ మృతి చెందాడనే అసత్యపు వార్త విని హతాశుడై ద్రోణాచార్యుడు మరణించాడు. *(ఆయనను ధృష్టద్యుమ్నుడు చంపినట్టు ఇక్కడ చెప్పబడలేదు)*

తరువాత కర్ణుడు కౌరవ సేనాపతిగా రెండురోజులు ప్రచండంగా యుద్ధాన్ని కొనసాగించాడు కానీ అతడు మహావీరుడైన అర్జునుని నిశితాస్త్రాల దెబ్బకు నేలకొరిగాడు. అప్పుడు సేనాపతిగా నియుక్తుడైన శల్యుడు అపరాహ్ణానికి ముందే ధర్మరాజు తోడి యుద్ధంలో మరణించాడు.కాలాంతకుని వలె కాల సర్పంవలె క్రోధంతోబుసలుకొడుతూ యమదండము వంటి గదను తిప్పుతూ భీమునిపైకి పోయిన, దుర్యోధనుడు తన అధర్మమే భీముని రూపంలో తననోడించగా నేలకొరిగాడు. 'యతో ధర్మస్తతో జయః' అనే సూక్తికి నిలువెత్తు ఆదర్శంగా, ఉదాహరణగా భారతయుద్ధం చరిత్రలో నిలచి వుంది.

యుద్ధం ముగిసిపోయినా హత్యాకాండ ఆగలేదు. ద్రోణపుత్రుడైన అశ్వత్థామ అర్ధరాత్రి వేళ పాండవ శిబిరంపై దాడిచేసి తన తండ్రి వధను స్మరిస్తూ ఎందరో పాండవ వీరులను సంహరించాడు. అలా చంపబడిన వారిలో ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపది పుత్రులైన పంచపాండ వులూ ఉన్నారు. అర్జునుడు అశ్వత్థామను వెంబడించిపోయి అతనిని నిలువరించి యుద్ధంలో ఓడించి ఐషికమను పేరు గల అస్త్రంతో అతని సర్వశక్తులకూ, అహంకారానికీ కారణమైన శిరోమణిని పెకిలించి వేశాడు. గురు పుత్రుడనీ బ్రాహ్మణుడనీ అశ్వత్థామను అర్జునుడు చంపలేదు.

ధర్మరాజు అత్యంత శోక సంతప్తలైన స్త్రీల నందరినీ ఓదార్చి తాను పవిత్రక స్నానమాచరించి దేవతలకూ పితృజనులకూ తర్పణాలిచ్చాడు. తరువాత రాజ్యాభిషిక్తుడై

ప్రజాశ్రేయస్సు కోసం అశ్వమేధయాగాన్ని చేసి విష్ణువును పూజించాడు. బ్రాహ్మణులను దక్షిణాదులతో తృప్తిపఱచాడు. ఈలోగా శ్రీకృష్ణుడు అవతారాన్ని చాలించాడు. ఆ వార్తను వినగానే ధర్మరాజు అభిమన్యు పుత్రునికి రాజ్యాభిషిక్తుని చేసి తన సోదరులతో పత్నితో సహా విష్ణు సహస్రనామాన్ని జపిస్తూ స్వర్గం వైపు సాగిపోయాడు.

మహాభారతయుద్ధంలో అసురశక్తులు తొంబది శాతం నశించినా ఇంకను కొందరు దానవులు మిగిలిపోయారు. వారు శరవేగంతో అభివృద్ధి చెందడాన్ని గమనించి శ్రీమహా విష్ణువే బుద్ధుడై అవతరించి వారిని సమ్మోహితులను చేసి వారిలోని దానవత్వాన్ని రూపుమాపి ఉత్తమ మానవులనుగా తీర్చిదిద్దాడు.

అధర్మం ప్రస్తుతానికి అదుపులో వుంది. అది గాడి తప్పి విజృంభిస్తుంది. అపుడు శ్రీమహావిష్ణువు సంభల గ్రామంలో కల్కినామంతో అవతరిస్తాడు. అశ్వాన్నధిరోహించి జగమంతటా కలయదిరిగి ఎక్కడెక్కడి అధర్మపరులనూ వెదకి పట్టుకొని వధిస్తాడు.

రుద్రదేవా! అధర్మాన్ని అంతమొందించడానికీ, సత్త్వగుణ ప్రధాన దేవతల శక్తులను పెంచడానికీ, పుడమిపై పెచ్చరిల్లు అశాంతిని త్రుంచడానికి శ్రీమన్నారాయణు డేదో ఒక రూపంలో దిగి వస్తూనే ఉంటాడు. లోకుల ఆరోగ్య రక్షణ కోసం పాల సముద్రంలో అమృత భాండాన్ని పట్టుకొని ధన్వంతరిగా అవతరించిన ఆయనే విశ్వామిత్ర పుత్రుడైన సుశ్రుతుడను మహాత్మునికి ఆయుర్వేదాన్ని స్వయంగా ఉపదేశించాడు. ***(అధ్యాయం -145)***

# ఆయుర్వేద ప్రకరణం

*గరుడ పురాణంలోని ఆయుర్వేద ప్రకరణానికి గొప్ప ప్రసిద్ధి ఉంది. ఇందులోని మొదటి ఇరవై అధ్యాయాలలో నిదాన- స్థాన విషయాలు వర్ణింపబడ్డాయి రోగ కారణాలనూ లక్షణాలనూ బట్టి రోగనిర్ణయాన్ని చేయడాన్నే రోగ నిదానమంటారు. తరువాతి నలభై అధ్యాయాలలో రోగచికిత్స, ఔషధాలు - వాటి నిర్మాణ విధి చెప్పబడ్డాయి. అంతేగాక మందుకి తగిన అనుపానం, వాడవలసిన తీరు కూడా చేర్చబడ్డాయి. ఒకే రోగానికి అనేకములైన మందులు సూచించబడ్డాయి. కాని వీటిని సుయోగ్యుడైన వైద్యుని పర్యవేక్షణలోనే వాడాలి.*

*ఈ ప్రకరణంలో (పురాణంలో) అక్కడక్కడ గల ఖండితాలనూ, అస్పష్టతనూ ఆర్ష సంస్కృతికి చెందిన ఆయుర్వేద గ్రంథాలనాశ్రయించి సరిచేయడం జరిగింది*

## రోగనిదానం

ధన్వంతరి సుశ్రుతునికి చెప్పిన శాస్త్రమిది.

ప్రాచీన కాలంలో ఆత్రేయాది మహామునులు రోగనిదానానికి సంబంధించి గొప్ప కృషి చేశారు. దానికి స్వయంకృషినీ ప్రతిభనూ జోడించి ధన్వంతరి ఇలా ఉపదేశించాడు.

"సుశ్రుతా! పాప్మ, జ్వర, వ్యాధి, వికార, దుఃఖ, ఆమయ, యక్ష్మ, ఆతంక, గద, ఆబాధ - ఇవన్నీ పర్యాయవాచ్యములైన శబ్దములు.

రోగాన్ని తెలుసుకోవడానికి అయిదు ఉపాయాలుంటాయి. అవి నిదానం, పూర్వరూపం, రూపం, ఉపశయం, సంప్రాప్తి. నిమిత్తం, హేతువు, ఆయతనం, ప్రత్యయం, ఉత్థానం, కారణం - అనే వాటిని బట్టి రోగాన్ని పోల్చడమే రోగనిదానం. దోషవిశేషాలు తెలియకుండానే రోగాన్ని పోల్చగలిగితే దానిని పూర్వరూపమంటారు. ఇది సామాన్యమనీ, విశిష్టమనీ రెండు విధాలు. ఈ పూర్వరూపం పూర్తిగా వ్యక్తమైతే రూపం అనబడుతుంది. సంస్థాన, వ్యంజన, లింగ, లక్షణ, చిహ్న, ఆకృతి, ఇవి రూపానికి పర్యాయ వాచ్యములైన శబ్దాలు. హేతు-విపరీతం, వ్యాధి- విపరీతం, హేతు-వ్యాధి- ఉభయ- విపరీతం, హేతు విపరీతార్థకారి, వ్యాధి విపరీతార్థకారి, హేతు వ్యాధి ఉభయ విపరీత అర్థకారి ఔషధాలుంటాయి. ఇవి అన్న, విహారాలను సుఖదాయకంగా ఉపయోగపడేలా చేస్తాయి.

దీనిని సాత్మ్యమంటారు. ఉపశయమని కూడా అంటారు. దీనికి విపరీతం అనుపశయం. అనుపశయానికి మరోపేరు వ్యాధ్య సాత్మ్యము. దోషం శరీరంలో పైకి గాని ఇతర దిశల్లో గాని వ్యాపిస్తున్న పద్ధతి, దానివల్ల వచ్చేరోగం సంప్రాప్తి అనబడుతుంది. దానికి పర్యాయ పదాలు జాతి, ఆగతి.

సంప్రాప్తిలో సంఖ్య, వికల్పం, ప్రాధాన్యం, బలం, వ్యాధి కాల విశేషతలు ఆధారంగా విభిన్న విధాలు నిర్ణయింపబడివున్నాయి. ఈ శాస్త్రంలోనే జ్వరభేదాలు ఎనిమిది చెప్పబడ్డాయి. ఇది సంఖ్యాసంప్రాప్తి.

రోగోత్పత్తికి కారణభూతమైన దోషముల అంశాంశ కల్పన అంటే ఎక్కువ, తక్కువల వివేచన వికల్ప సంప్రాప్తి.

స్వతంత్రత లేదా పరతంత్రతతల ద్వారా దోషాలయొక్క ప్రాధాన్యాన్ని గానీ, అప్రాధాన్యాన్ని గానీ వివేచన చేయడం ప్రాధాన్య సంప్రాప్తి.

హేతు – పూర్వరూపం, రూపముల సంపూర్ణత లేదా అల్పతల ద్వారా రోగబలం, అబలములను వివేచించడం బలసంప్రాప్తి. దోషానుసారం రాత్రి, పగలు, ఋతువు, భోజనాల పరిపాక అంశాలు (ఆది, అంత, మధ్య) చూసి వాటి ద్వారా రోగకాలాన్ని తెలుసుకోవడం కాలసంప్రాప్తి.

ఈ విధంగా నిదానం యొక్క అభిధేయాలు (నిదాన, పూర్వరూప, రూప, ఉపశయ, సంప్రాప్తి) నిర్వచింపబడడం జరిగింది. ఇపుడు వాటిని మరింత విస్తారంగా చూద్దాం. అన్ని రోగాలకూ మూలకారణం శరీరస్థితమైన కుపిత దోషమే. అయితే దోష– ప్రకోపానికి ఒంటికి పడని తిండి ఎక్కువగా దోహదం చేస్తుంది. దీనిని అహిత సేవనమంటారు. ఇది మూడు రకాలు.

**వాత ప్రకోప నిదానం :** చేదు, వేడి, కషాయ, ఆమ్ల, గట్టి పదార్థాలతో అన్నమును అతిగా తినడం, పరుగులు పెట్టడం గబగబా మాట్లాడడం, రాత్రి జాగరం, ఎక్కువ ధ్వనిచేస్తూ మాట్లాడడం, అన్ని పనులనూ అతిగా చేస్తుండడం, భయం, శోకం, చింత, అతి వ్యాయామం, శృంగారంలో మితిలేకుండా పాల్గొనడం, వీటివల్ల శరీరంలోని వాయువు ప్రకోపానికి లోనవుతుంది. ఈ వాయువికారం విశేషించి గ్రీష్మఋతువులో పగటి, రాత్రి భోజనాల తరువాత ఎక్కువగా బాధిస్తుంది.

**పిత్త ప్రకోప నిదానం:** చేదు, గట్టి, గరుకు, వేడి, ఉప్పటి పదార్థాలనూ కోపాన్నీ, దాహాన్నీ పెంచే తిళ్ళనూ తినడం వల్లం పిత్తం ప్రకోపిస్తుంంది. ఇది శరదృతువులో మధ్యాహ్నం అర్ధరాత్రి వంటి మంటను పుట్టించే క్షణాలలో ఎక్కువగా బాధిస్తుంది.

**కఫ- ప్రకోపనిదానం :** తీపిరసాలు, ఆమ్లాలు, లవణాలు, స్నిగ్ధ, గురు, అభిష్యంది, శీతల భోజనాల వల్లనూ, ఎక్కువకాలం కూర్చొనుట, నిద్రపోవుట, సుఖపడుట, అజీర్ణం, పగటినిద్ర, బలకారక పదార్థాలను అతిగా తినుట, కష్టపడకపోవుట మొదలగు కారణాల వల్ల అన్నం అరిగే ప్రారంభకాలంలోనూ, రాత్రి పగలు ప్రారంభ కాలాల్లోనూ కఫం ప్రకోపిస్తుంది. దీన్నే శ్లేష్మమని కూడా అంటారు.

**త్రిదోష సామాన్య సంప్రాప్తి :** ఈ మూడు ప్రకోపాల మిశ్రిత స్వభావంతో సన్నిపాతం పుట్టుకొస్తుంది. సంకీర్ణ భోజనం, అజీర్ణం కలిగించే భోజనం, విషమ, విరుద్ధ భోజనం (మొత్తం మీద వంటికి పడని తిండి) మద్యపానం, పచ్చిముల్లంగి, ఎండినకూరలు, గానుగపిండి, మృత్యువత్సరమని పేరుగాంచిన పేలపిండి, మాంసం, చేపలు ఇవన్నీ సన్నిపాతాన్ని తెచ్చే ఆహారాలే. దూషితాన్నమూ, గ్రహప్రభావమూ కూడా ఈ వికారాన్ని తెచ్చిపెడతాయి. ఇంకా చాలా చాలా కారణాలే వున్నాయి. రసవాహినుల ద్వారా శరీరం లోపలకి చేరుకొని రోగాలను కలిగించే పదార్థాలుకూడా ఉన్నాయి. ***(అధ్యాయం-146)***

# జ్వర నిదానం

**జ్వ**రాలలో చాలా రకాలే వున్నాయి. కొన్నిటిపేర్లు ఇలా వుంటాయి. ఇవి శివుని కంటిమంట నుండి పుట్టినవని అంటారు. రోగపతి, పాప్మ, మృత్యురాజ, అశన, అంతక, ఓజో**ఽ**శన, మోహమయ,సంతాపాత్మ, సంతాప, అపచారజ జ్వరాలు ఎక్కువగా బాధిస్తాయి.

ఏనుగు కొచ్చే జ్వరాన్ని పాకలమనీ, గుఱ్ఱానికొచ్చేదాన్ని అభితాపమనీ, కుక్కకైతే అలర్కమనీ అంటారు. మేఘాలకీ, నీటికీ, మందులకీ, నేలకీ కూడా జ్వరాలొస్తాయి. వాటి పేర్లు క్రమంగా ఇంద్రమదం, నీలిక, జ్యోతి, ఊషర.

**కఫజ్వర లక్షణాలు :** గుండెగాబరా, వాంతి, దగ్గు, చలి, వాపు, కఫం ద్వారా వచ్చే జ్వరలక్షణాలు. తరువాత ఒళ్ళు నొప్పులు వుంటాయి. చికిత్స ఆలస్యమైనా సరైన మందు పడకపోయినా ఈ బాధలు రోజురోజుకీ పెరిగిపోతుంటాయి. ఏ సమయంలో ఏ లక్షణం ఎక్కువవుతోందో చూసి మందువెయ్యాలి. ఉపశయ (ఎక్కువ కావడం) అనుపశయ (కాకపోవడం) ములను బట్టి రోగాలే మారుతుంటాయి. అనగా మందు, విహారం, అన్నం, దేశకాలాదులలో మార్పు ఒక మనిషికి సుఖాన్ని కలిగిస్తే అది ఉపశయం. వీటిలో నేదైనా ఒక వ్యక్తి సుఖాన్ని హరిస్తే లేదా హాని కలిగిస్తే అది అనుపశయం.

అరుచి, అజీర్ణం, స్తంభనం, బద్ధకం, గుండెలో మంట, విపాకం, నిద్ర వస్తున్న ట్లుండడం, చొంగ కారడం, గుండె బరువెక్కడం, ఆకలి వేయకపోవడం, ముఖం బిరుసుగా తగలడం, ఒళ్ళు పాలిపోవడం, ఒళ్ళు బరువెక్కడం, మూత్రం మాటి మాటికీ రావడం, శరీరకాంతి తగ్గడం, ఇవన్నీ ఆమ (కఫంలో ఒక)జ్వర లక్షణాలు.

ఆకలి మందగించడం, ఒళ్ళు తేలిపోతున్నట్లుండడం, సామాన్య జ్వరలక్షణాలు. జ్వరంలో వాత, పిత్త, కఫ రోగాల మూడు లక్షణాలు కనిపిస్తే దానిని పరిపక్వ అష్టాహ మంటారు. రెండింటి లక్షణాలుంటే ద్వంద్వజమంటారు.

**వాత- పిత్త- జ్వరలక్షణాలు :** తలనొప్పి, మూర్ఛ, వాంతులు, ఒళ్ళు వేడెక్కడం, మోహం, గొంతు బలహీనంగా వుండడం, ముఖం డోక్కుపోవడం, అరుచి, ఒంట్లోప్రతి భాగంలో విరగదీసినంత నొప్పి, అనిద్ర, చిత్తభ్రమ, రోమాంచం, చలి- ఇవన్నీ వాత, పిత్త జ్వరం తగిలిన శరీరంలో కనిపించే లక్షణాలు.

కఫ-వాత జనిత జ్వరానికి ఉష్ణోగ్రత పెద్దగా వుండదు. తలనొప్పి, అరుచి(అంటే నాలుకకి ఏదైనా చేదుగా గానీ రుచి హీనంగా గాని తగలడం) సంధులలో నొప్పి, మాటి మాటికీ ఉమ్మి రావడం, ఊపిరి భారం కావడం, దగ్గు, ముఖం పాలిపోవటం, చలి, పగటిపూట కూడా కనులు చీకట్లు కమ్మడం, నిద్రపట్టకపోవడం ఇవన్నీ వుంటాయి.

బయట వేడిగా వున్నా చలివేస్తున్నట్లు అనిపించడం, ఒళ్ళు కొయ్యబారి నట్లుండడం, చెమట, దాహం, మంట, దగ్గు, శ్లేష్మ పిత్తాల జోరు, మూర్ఛ, అనాసక్తి, బద్ధకం, నోరు చేదుగా అనిపించడం, ఇవన్నీ శ్లేష్మ పిత్త జన్యమైన జ్వరాన్ని సూచిస్తాయి.

వాత- పిత్త- శ్లేష్మ అన్ని లక్షణాలూ కనిపిస్తే సర్వజ (సన్నిపాత) జ్వరంగా భావించాలి. దానికైతే ఈ లక్షణాలన్నీ ఒక్కొక్క మారు ఒక్కొక్కటిగా బయల్పడు తుంటాయి. సన్నిపాతంలో చలి, పగటి మహానిద్ర, రాత్రి నిద్రలేమి గాని దినరాత్రులు మొత్తంగా నిద్ర గాని వుంటాయి. ఆ నిద్రలేమి సమయంలో రోగి పాటలు పాడతాడు. నాట్యం చేస్తాడు. లేదా హాస్యాలాడతాడు. అతని సామాన్య స్థితి పోలిక లేనంతగా మారిపోతుంది. కనులు మలినమవుతాయి. అశ్రువులను వర్షిస్తాయి. కనుల చివరలు ఎఱ్ఱబడతాయి. పూర్తిగా మూతబడవు. శరీరంలో పిక్కలు, పక్కలు, తల సంధులతో సహా ప్రతి ఎముకా నొప్పెడు తుంది. చిత్త భ్రమకూడా ఉంటుంది. రెండు చెవుల నుండీ శబ్దాలు, హోరు వస్తుంటాయి. పోటు కూడా వుంటుంది. నాలిక కొంత ఎఱ్ఱగా, కొంత నల్లగా వుండి దురదేస్తుంటుంది. తడి ఆరిపోతూ పొడిగా వుంటుంది. ఎముకలు, సంధులు సడలిపోయినట్లుగా వుంటాయి.

రోగి నోటినుండి రక్త పిత్త మిశ్రితమైన ఉమ్మి పడుతుంటుంది. తట్టుకోలేనంత దాహం వేస్తుంటుంది. కోష్ఠ (పొట్ట) ప్రదేశాలన్నీ నల్లగా ఎఱ్ఱగా అయిపోతాయి. గుండ్రటి దద్దుర్లు పొట్టపై ఏర్పడతాయి. గుండెలో బాధ కలుగుతుంది. అన్ని ద్వారాల నుండీ అత్యధికం గానో, అత్యల్పంగానో విసర్జనాలు వస్తుంటాయి. ముఖంలో జిడ్డు, నీరసం, హీనస్వరం, తేజస్సు మందగించడం, ప్రలాపం పుట్టుకొస్తాయి. ఈ జ్వరం బయటపడ కుండా లోపల్లో పలే శరీరంలో పెరుగుతుంటుంది. గొంతునుండి గురక, కంఠం నుండి అవ్యక్త శబ్దాలు, శరీరాన్ని కదపాలనే కోరిక నశించడం అనే లక్షణాలు కనిపిస్తే రోగవ్యాప్తి ప్రమాదకర స్థాయికి చేరిపోయిందని అర్థం. దానిని బలవీర్య – వినాశక అభీన్యాస – సన్నిపాత జ్వరంగా వ్యవహరిస్తారు.

ఈ సన్నిపాత జ్వరం యొక్క వాయు వికారం వల్ల గొంతులో అడ్డు ఏర్పడి పిత్తంలోపలి భాగంలో నొప్పి పుట్టుకొచ్చి నాసికాదులు కారుతుంటాయి. కళ్ళు పచ్చబడతాయి. మూడు రకాల జ్వరమూ ఒకేసారి తగిలినపుడు శరీరంలోని అగ్నితత్త్వం నశించిపోవడం మొదలౌతుంది. అది పూర్తిగా నశిస్తే మాత్రం రోగం మానడం అసాధ్యం.

ఈ సన్నిపాత జ్వరానికి మరోరూపం కూడా ఉంటుంది. పిత్తం వేరైపోయినట్లుం టుంది. పొట్టలో మంట పుడుతుంది. జ్వరం రాకముందే ఒక విధమైన గాబరా వుంటుంది. వాత –పిత్త ప్రవృత్తులు శరీరంలో పెరుగుతుంటే ఈ జ్వరం కమ్ముతుంది. చలీ, వేడీ రెండూ వుంటాయి. వాటినుండి రక్షింపబడడం మిక్కిలి కష్టం. శీత ప్రభావం వల్ల నోటినుండి కఫం వస్తుంటుంది. నోరు ఎండిపోతుంది. పిత్తం పనితగ్గడం వల్ల మూర్ఛ, మదం, దాహం ఏర్పడతాయి. బద్ధకం, కదలలేనితనం వచ్చి పుల్లవాంతులవుతాయి.

**ఆగంతు జ్వరలక్షణాలు :** బాహిర కారణాల ద్వారా తగిలే ఈ తాత్కాలిక జ్వరం దెబ్బ తగలడం వల్ల కానీ, సంయోగం వల్ల కానీ, శాపం లేదా రక్తం తగలడం వల్ల గానీ చిల్లంగి దిష్టి వంటి ప్రయోగాల వల్ల గానీ వచ్చే జ్వరాన్ని ఆగంతు జ్వరం అంటారు. వీటిలో మొదటిది అభిఘాతజం అనబడుతుంది.

కాలిన గాయాల వల్ల గాని ఒళ్ళు చురికిపోవడం వల్ల గానీ వచ్చేది అభిఘాతజ జ్వరం. అత్యధిక శ్రమ వల్ల వచ్చే జ్వరంలో వాతం రక్తాన్ని పాడుచేస్తుంది. చర్మం పేలిపోయినట్లవుతుంది. ఒళ్ళు నొప్పులు వాపులు వుండి ఉష్ణత పెరుగుతుంది.

దుష్ట గ్రహపీడ, మత్తు పదార్థాలు, విషాలు, కోపం, భయం, దుఃఖం, ప్రేమ కూడా జ్వరాన్ని కలిగిస్తాయి. ఇది సామాన్య జ్వరంలాగే వుంటుంది కానీ తెరలు తెరలుగా వచ్చే

నవ్వూ, ఏడుపూ దీని ఉద్ధృతిని తెలియజేస్తాయి. మత్తుమందు లనీ, పొగనీపీల్చడం వల్ల వచ్చే జ్వరానికి స్పృహతప్పుట. తలనొప్పి, వాంతులు, తుమ్ములు లక్షణాలు. విషం వల్ల వచ్చే జ్వరంలో తెలివి తప్పుట, విరేచనాలు, కనులు చీకట్లు కమ్ముట, చర్మం రంగు మారుట, మంట, తలతిరుగుట, కనిపిస్తాయి. కోపం వల్ల వచ్చే జ్వరంలో ప్రత్యేకంగా వణుకు, దడ, తలనొప్పి పుట్టుకొస్తాయి. క్రోధ జ్వరంలో లేదా భయ జ్వరంలోనైతే ఆగకుండా వెలువడే వాగుడు ప్రత్యేక లక్షణం.. ప్రేమ, కామం వల్ల జ్వరం వచ్చినపుడు మత్తుగా వుంటుంది. ఏం తిన్నా రుచి తెలియదు, ఒళ్ళంతా మండుతున్నట్లుంటుంది. సిగ్గుగా వుంటుంది, నిద్రపట్టదు, బుఱ్ఱ సరిగా పనిచేయదు, ధైర్యం పోతుంది.

గ్రహదోష జ్వరంలో సన్నిపాత లక్షణాలు కనిపిస్తాయి. అదనంగా వాయుసమస్య, జీర్ణసమస్య ఉంటాయి. శాప, రక్త జ్వరాల్లో అన్ని బాధలూ భరించలేనంతగా వస్తూ పోతుంటాయి. మంత్రోచ్చాటన జరుగుతున్నపుడల్లా రోగులు ఎగిరెగిరిపడుతుంటారు. శరీరం పగుళ్ళు వేస్తుంటుంది. మత్తు ఆవహిస్తుంది. ప్రతిభాగం మండుతున్నట్లుగా వుంటుంది. మూర్ఛవస్తుంది. ఉష్ణోగ్రత రోజు రోజుకీ పెరిగిపోతుంటుంది.

జ్వరాలలో ఎనిమిది రకాలుంటాయి. ముందుగా శారీరక, మానసిక విధాలుగా వాటిని విభజించారు. అలాగే మంద, తీవ్ర, ఆంతర, బాహ్య, ప్రాకృత, వైకృత, కుదిరేవి, కుదరనివి, పక్వాలు, అపక్వాలు. వీటిలో మొదటివి శారీరకం. రెండోవి మానసికం.

కఫ, వాత, మిశ్రిత రోగాలలో చలి, వణుకు వుంటాయి. పిత్తలోపం వుంటే ఒళ్ళంతా మంటలు పుడుతున్న బాధ వుంటుంది. మూడిటి సన్నిపాతమూ వుంటే ఒక మారు చలీ ఒకమారు వేడీ బాధిస్తాయి. (ఈ వేడినే ఉడుకు అంటారు) ఈ జ్వరం లోజ్వరమైతే (ఆంతరమైతే) అన్ని బాధలు లోపలే వుండి మలబద్ధకం కూడా పుట్టుకొస్తుంది. బాహిర జ్వరానికి ప్రత్యేక లక్షణం విరేచనాలు. ఈ జ్వరాలను కుదర్చవచ్చును.

ప్రాకృత, వాత, వర్షాకాల జ్వరాన్నీ, వైకృత వర్షకాల జ్వరాన్నీ కుదుర్చుట దాదాపు అసాధ్యం.

ఆకురాలు కాలంలో పిత్తదోషంవల్ల వచ్చేది ప్రాకృత జ్వరం, వాత, కఫ దోషం వల్ల వచ్చేది వైకృతం. కాలంలో కఫదోష జ్వరాన్ని ప్రాకృతమనీ ఇతరాలని వైకృతమనీ అంటారు. వైకృతరోగాలేవీ కుదిరేరోగాలు కావు (జ్వరాలు మాత్రం) వాత దోషం వల్ల వానల కాలంలో వచ్చే జ్వరానికి పిత్త, కఫాలు కూడా లోనవుతాయి. ఆకురాలు కాలంలో పాడయిన

---

★*(మరో వర్గీకరణ ప్రకారమైతే శారీర– మానస, సౌమ్య – తీక్ష్ణ, అంతర్– బాహిరాశ్రయ, ప్రాకృత – వైకృత, సాధ్య– అధ్యాయ, సామ– నిరామయ జ్వరాలు పైన చెప్పిన వాటికి అదనంగా కనిపిస్తాయి.)*

పిత్తం కఫాన్ని కలుపుకొని జ్వరాన్నేర్పాటు చేస్తుంది. ఈ జ్వరాలకు లంఖణం మంచి నిరోధక మార్గమే. వసంతంలో వన్నె చెడిన కఫం వాతంతో కలిసి తెచ్చే జ్వరాలుంటాయి. పిత్త దోషం కూడా కలుస్తుంది. బలంగా వున్న మనుష్యులు జ్వరాన్ని మందులనే ఆయుధాలతో జయిస్తారు కానీ జన్మతః బలహీనులను జ్వరం బలిగొంటుంది.

మలబద్ధకం వల్ల వచ్చేదీ, మూడు దోషాలు కలిపివుండేదీ ఆమజ్వరం. జఠరాగ్ని మందం, అతిమూత్రం, జీర్ణమండల వ్యవస్థ మందగించడం (ఆకలి నశించడం) దీని లక్షణాలు.

పచ్యమాన జ్వరలక్షణాలు ఉష్ణోగ్రతతో సహా దాహం,వాగుడు, పలవరింతలు అన్నీ తక్కువ కాలంలోనే పెరిగిపోవడం, ఊపిరి తీవ్రంగా వేగవంతమవుతుంది. తల తిరుగుతుంది. నీళ్ళ విరేచనాలవుతాయి. నొప్పులుంటాయి. జీర్ణకోశాన్ని ఖాళీగా వుంచితే ఆమ వ్యర్థాలు పోతాయి కాబట్టి ఈ జ్వరానికి వారం రోజుల ఉపవాసాన్ని (లంఖణాలని) గట్టిగా సూచించవచ్చును. జఠర రసాల్లో లోపాలను బట్టి అయిదు రకాల జ్వరాలను పోల్చవచ్చును.

సంతత, సతత, అన్యేద్యు, త్రిత్యక, చతుర్థక సప్తధాతువులలోనూ, మలమూత్ర కోశాలలోనూ, నాళాలలోనూ పేరుకుపోయిన జ్వరం ఏడు, పది లేదా పన్నెండు రోజుల్లో వాత, పిత్త, కఫ దోషాలతో బాటు తగ్గించబడవచ్చు. తగ్గుతుంది కూడా. తగ్గకపోతే మాత్రం ప్రాణాపాయమే. ఇలా అగ్నివేశుడన్నాడు. పదునాల్గు, తొమ్మిది, పదకొండు రోజులని హారితుడన్నాడు.

శుభ్రత, పరిశుభ్రత, అశుభ్రతల ప్రభావం కూడా దోషనివారణకు పట్టే కాలంపై ప్రభావాన్ని చూపుతాయి. అలాగే ఒళ్ళు బరువుకూడా. దోషం పూర్తిగా మందులు, ఆహారపు మార్పుల వల్ల,నశించాకనే జ్వరం కూడా తగ్గిపోతుంది. జ్వరం తగ్గుతున్న కొద్దీ బాధితుల మలమూత్ర విసర్జన ప్రక్రియలు మెరుగు పడుతుంటాయి. అలాగే ముఖంలో తేటదనం, మెరుపు, శరీరంలో చురుకుదనం కూడా పెరుగు తుంటాయి.

శరీరగత ద్రవాల విషమత సాధారణంగా సతత జ్వరానికి కారణమవు తుంది. ఇది మొదట్లో వచ్చిపోతుంటుంది. పోయింది కదాని ఆలసిస్తే పీకపట్టుకుంది. రాత్రిళ్ళు ఎక్కువగా బాధపెడుతుంది. అన్యేద్యు జ్వరం సంధ్య (పగటికీ, రాత్రికీ మధ్య) లో ఎక్కువ ఉగ్రమవుతుంది. ఇందుల మాంస పుష్టిగల శారీరక ప్రదేశాలు ప్రభావితమవుతాయి. తలనొప్పి ఎక్కువగా వుంటే ఇది పిత్తవాత దోషమనీ (త్రిక) వెన్నునొప్పిగా వుంటే అది

కఫ,పిత్త, దోష జనితమనీ గ్రహించాలి. వాత, కఫ దోష జనితమైన జ్వరంలో వీపంతా నొప్పెడుతుంది. ఈ జ్వరం ఒకరోజు మధ్యలో పూర్తిగా ఆగిపోతుంది. మరల ఒకరోజు తరువాత మొదలవుతుంది.

చతుర్థక జ్వరానికి కొవ్వు, మూలుగ, ఎముకలు గురవుతాయి. మూలుగకు మాత్రమే అంటే దోషం రోజులో రెండు మార్లు విజృంభిస్తుంది. కఫ దోషముంటే మోకాళ్ళు నొప్పెడుతాయి. తొడనొప్పి వుంటుంది. వాత దోషముంటే తల నొప్పి కూడా వుంటుంది. ఈ చతుర్థక విపర్యయజ్వరం సరైన మందుపడితే నాలుగవ రోజు కల్లా తగ్గుముఖం పడుతుంది. ద్రవాలు ఊరడంలో తేడా గలవారు వారం పాటు లంఖణాలు చెయ్యాలి. అయితే ఈ జ్వరదోషాలు మెదడులోనికి ప్రవేశిస్తే మాత్రం దానిని ఆపడం అసాధ్యం.

జ్వరం దోషప్రవేశానికి సంకేతం– రోగం శరీర ద్రవాలతో కలిసి నెమ్మదిగా ప్రవహిస్తూ రక్తనాళాలను కలుషితం చేసి వ్యాపిస్తుంది. మందు ప్రవేశించని మనిషి బలహీనుడవుతున్న కొద్దీ రోగం తీవ్రతరమై విషపు స్థాయిని చేరుకొంటుంది. కాబట్టి జ్వరం కనబడినా 'అదే పోతుందిలే' అనుకొని ఒక లంఖణం చేసేసి ఊరుకోకూడదు.

విషమ, సతత జ్వరాలు దేహ రసాలలోకి ప్రవేశించి ఆగగానే కొన్ని లక్షణాలు బయటపడతాయి. అవి సముద్ర ప్రయాణం తొలిసారి చేసే వారికి వచ్చే రుగ్మతలను పోలివుంటాయి. తరువాత ఒళ్ళు బరువు, నిస్త్రాణ, కాలుసేతులను పొడుస్తున్నట్టుగా నొప్పులు, ఆవులింతలు, అరుచి, వాంతి వస్తున్నట్లుండడం, శ్వాసలో శ్రమ. జ్వరం రక్తంలో చేరితే మరిన్ని లక్షణాలు బయటపడతాయి. అవి ఉమ్మితే రక్తం పడడం, తీవ్ర పిపాస, చర్మంపై వేడి పగుళ్ళు, ఎఱ్ఱమచ్చలు, మంట, తల తిరుగుడు, మత్తు, అతి పలవరింతలు.

జ్వరం మాంసంలోనే వుంటే దాహం, అలసట, అపనమ్మకం, లోపలంతా మండుతున్నట్టుండడం, కళ్ళు తిరగడం, చీకట్లు కమ్మడం, దుర్వాసన, అంగాలలో వణకు కనిపిస్తాయి. జ్వరం కొవ్వులోనికి చేరినపుడు చెమట, అతిపిపాస, వాంతులు, పుల్లవాసన, చిరాకు వుంటాయి. ఇక జ్వరము ఎముకలలోనికి దూరినపుడు కనిపించే లక్షణాలు తెలివితప్పడం, పలవరింతలు, అలసట,అరుచి, ఆకలి బాగా మందగించుట, ఎముకలలో నొప్పి, జ్వరం వీర్యంలోనికి ప్రవేశిస్తే చీకట్లు కమ్ముతాయి. సంధులు వీడిపోతున్నట్లవుతాయి. లింగం మొద్దుబారిపోతుంది. వీర్యం కారితే మరణమే సంభవిస్తుంది.

---

*రస, రక్త, మాంస, మేద, అస్థి, మజ్జ,శుక్ర అనేవి సప్తధాతువులు

ఈ అయిదు రకాల చతుర్థక విపర్యయ జ్వరాలనూ వాటి దశలు పెరిగేకొద్దీ తగ్గించడం కష్టమవుతూ వుంటుంది. ప్రలేపక రకానికి చెందిన జ్వరానికి లక్షణాలు స్పృహ తప్పుట, పలవరింతలు, చలి, వేడి తగ్గిపోవడం, అంగాలన్నీ బరువెక్కడం, శరీర మంతటా కఫం ఒక పొరలాగా ఏర్పడినట్లు భయం కలగడం.

అంగ బలాశక (అంగాలబలాన్ని తినివేయు)జ్వరంలో ఉష్ణోగ్రత పడిపోవడం, ఒళ్ళంతా గరుకుగా కొయ్యబారినట్టుండడం, నడక కష్టం కావడం, అంగాలు తిమ్మిరెక్కడం, నిరంతరం కఫం బయటికి వస్తుండడం జరుగుతాయి. ఈ సమయంలో శరీరం నుండి స్రవించే ద్రవం చింతపండు ముక్కల రంగులో వుంటే దానిని హారిద్రక జ్వరమంటారు. ఈ పసుపు పచ్చ జ్వరం ప్రాణాంతకమే.

రాత్రిజ్వర లేదా పౌర్వరాత్రిక జ్వరంలో మూడు రకాల దోషాలుంటాయి. రోగి బలహీనుడైపోతాడు. ఇది రాత్రి మాత్రమే కాస్తుంటుంది. పగటివేళ ఇది కనబడకనే పోవడానికి కారణం కఫంలో తేమపోగా వాతం పొడిగా అయిపోవడం. కఫమూ, పిత్తమూ రోగి మొండెంలో చెడినపుడు శరీరంలో పైభాగాలన్ని వెచ్చగా, వేడిగా తగులుతుండగా బొడ్డు కింద అన్ని భాగాలూ మంచు ముద్దల్లా తగుల్తాయి.

శరీర ద్రవాల్లో రసాల్లో, రక్తనాళాల్లో వున్న జ్వరాన్ని చికిత్స ద్వారా తరిమేయవచ్చును. కొవ్వులో మాంసంలో చేరిన జ్వరాన్ని మాన్పవచ్చు. ఎముకల్లో మూలుగలో దూరిన జ్వరం తగ్గదు. (అస్థిగతరోగం) ఇందులో అపస్మారకం, కోపదారి తనం ప్రధాన లక్షణాలు.

జ్వరం తగ్గినట్లు ఎలా తెలుస్తుందంటే రోగికి శరీరం తేలికైనట్లుంటుంది. అలసట తీరుతుంది. ఉష్ణోగ్రత వుండదు. కనులు తేటగా వుంటాయి. చిన్న చిన్న చెమరింపులుండి వెంటనే ఆరిపోతుంటాయి. నోరు ఎగుడు దిగుడుగా వున్నట్లని పిస్తుంది. ఏదైనా తినాలని పిస్తుంది. మనసు ప్రశాంతంగా వుంటుంది. తుమ్ములు వస్తాయి. తుమ్మినపుడల్లా హాయిగా వుంటుంది. బుఱ్ఱ గోక్కోవాలనిపిస్తుంటుంది. ***(అధ్యాయం -147)***

# రక్త, పిత్త,కాస, శ్వాస, హిక్కా, రాజయక్ష్మ రోగ నిదానాలు

రక్తపిత్త రోగంలో పిత్తం రక్తాన్ని కలుషితం చేస్తుంది. పిత్తం ఆందోళన చెందడానికి ప్రధానకారణం విపరీతమైన, బలమైన తిండి (**ఉదా॥** కోద్రవ, ఉద్దాలకాది ధాన్యాలు) మిక్కిలి వేడి, పుల్లని, కారపు, ఘాటైన ఇతర చిక్కటి వాసనలు, రుచులుగల పదార్థాలను తినుట వల్ల పిత్తం పాడవుతుంది. ఈ రోగంలో శరీరం నుండి బయటికి వచ్చే ద్రవాలూ, రసాలూ ఎట్టిగా రక్తపు వాసననే కలిగియుండడం వల్ల ఈ రోగానికి ఆయుర్వేదంలో రక్త

పిత్త రోగమని పేరు పెట్టబడింది. ఈ ద్రవాలూ, రసాలూ, రక్త నాళాల్లోంచి, కాలేయం నుండీ, క్లోమం ద్వారానూ స్రవిస్తాయి.

ఈ జ్వరం చేసే రక్త స్రావక దురాక్రమణ,చాలా లక్షణాల ద్వారా సూచించబడుతుంది. తల బరువు, ఆకలి లేకపోవడం, చల్లని వస్తువులు తినాలనిపించడం, దృష్టి పొగలు గ్రమ్మడం, పుల్లవాసనలతో వాంతులు, అసహ్యత, వెక్కుళ్ళు, ఊపిరందకపోవడం, తల తిరగడం, గ్లాని, ఎఱ్ఱరంగుని భరించ లేకపోవటం, జ్వరం తగ్గినపుడల్లా, నోటిలోంచి చేపల వాసన రావడం, కనులలో ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ ఛాయలు ఏర్పడడం, బయట కనిపించే రంగులలో తేడా తెలియకపోవడం, పిచ్చెక్కిపోయినట్లు కలలు రావడం – ఈ లక్షణాలు.

తారుమారైన, కలుషితమైన రక్తం శరీరంపైకి ప్రవహించినపుడు ముక్కు, కన్ను, నోరు, చెవుల ద్వారానూ, క్రిందికి వచ్చినపుడు లింగ, యోని, గుదాల ద్వారానూ బయటికి వస్తుంది. శరీరమంతటా వున్న రోమకూపాల నుండి కూడా చిమ్ముతుంది.

ఈ రోగ చికిత్సలో రక్తాన్ని నిరోధించడం కంటే ప్రక్షాళన చేయడమే మంచిది. కఫం ఉన్నచోట ప్రక్షాళన చికిత్స ద్వారా మొత్తం శరీరమంతా స్వచ్ఛమై పోతుంది. వగరైన తియ్యనైన ఓషధుల ద్వారా కఫమును ఉత్పత్తి చేయవచ్చును. పులుపు, ఘాటు, వగరు గల మందులలో కఫాన్ని ఉత్పత్తి చేసే వాటిని కూడ వాడవచ్చును. రక్తస్రావం శరీరపు క్రింది భాగాలలో వుంటే రోగి పరిస్థితి ప్రమాదకరంగా వుంటే మంగకాయను వాడాలి. ముందు కొంచెంగా పిత్త పీడక ఔషధాన్ని కూడా వాడితే రోగికి బలం చేకూరుతుంది. అటువంటి రోగికి వగరుగా, తియ్యగా వుండే పదార్థాలను తినిపించడం అవసరం. అయితే పాడైపోయిన పిత్తంతో బాటు వాత, కఫ దోషాలు కూడా కలిసి వున్న రోగిని కాపాడడం అసాధ్యం. ఊర్ధ్వకాయంలో అత్యధిక రక్తస్రావం కలిగిన వారిని ప్రక్షాళించినా ప్రయోజన ముండదు. అసలు ప్రక్షాళనే జరుగదు.

రక్త పిత్త రోగుల్లో ప్రతిలోమ (పైకి) రక్తస్రావమున్న వారికి మంగకాయ (నక్స్‌వామికా), ప్రక్షాళన మాత్రమే చికిత్స మార్గములు. అన్ని శారీరక ద్రవాలూ పాడయినపుడు మంగకాయ చికిత్స ఒక్కటే అనుసరింపబడాలి. సాధారణంగా ఈ రోగులకు తొలిరోజు నుండే తీవ్రస్థాయికి చెందిన బాధలు బయటపడుతుంటాయి. కాబట్టి రోగం కచ్చితంగా కుదురుతుందని మాత్రం చెప్పలేము.

కాస (దగ్గు) లోపల్లోపల వేగంగా వ్యాపించే రోగానికి సంకేతం. ఇది వాత, పిత్త, కఫ దోషాలతో బాటు శరీరంలోపల చేయబడిన గాయాల వల్ల లోనికి పోయిన ద్రవ్యాలవల్ల

కూడా సోకుతుంది. వాత దోషం వల్ల తీవ్రంగానూ క్రమంగా ఇతరాలలో కాస్త తక్కువ గానూ దగ్గు కనిపిస్తుంది. నిర్లక్ష్యం చేస్తే శరీరం పూర్తిగా వేగంగా పాడవుతుంది. ఈ రోగం సోకిందనడానికి గొంతు దురద, మంట, అన్నద్వేషం సంకేతాలు.

వాతదోషం వల్ల వచ్చే దగ్గు రుగ్మతలో గొంతు నోరులు బీటలు వేసినట్లవుతాయి. చెవి పొరలు పొడిదేరిపోతాయి. శరీరం లోపల వుండే వాయువులు పైకెగసి ఛాతీలోకి దూసుకుపోయి కంఠనాళమును ఒత్తుతుంటాయి. అన్ని అంగాలలోకి ఆ వాయువు దూరడంతో ఒళ్ళంతా బూరటిల్లినట్టుంటుంది. కనుగ్రుడ్డు పైకి ఉబికి వచ్చినట్లుంటాయి. గొంతులోంచి ఇనుప రేకులను విరిచిన ధ్వని వస్తుంది. ఛాతీ, పక్కలు, తల, తొడలు నొప్పెడతాయి. ఉద్రేకము, మూర్ఛ వస్తాయి. రోగి మాట్లాడలేక పోతుంటాడు. పొడిదగ్గు బాధిస్తుంది. దగ్గినపుడు శరీరమంతా విపరీతంగా నొప్పి పుడుతుంది. ఆ దగ్గు ధ్వని పెద్దదిగా వుంటుంది. ఒళ్ళంతా గగుర్పాటులకు లోనవు తుంది. అతి కష్టం మీద ఎంతో కొంత పొడి కఫాన్ని ఉమ్మితే కాస్త తేలికగా అనిపిస్తుంది.

పిత్త ద్రవ ప్రకోపం వల్ల వచ్చే దగ్గుకి ఈ లక్షణాలుంటాయి. కళ్ళు పచ్చబడతాయి. నోరు చేదుగా వుంటుంది. శరీర ఉష్ణోగ్రత పెరుగుతుంది. తల తిప్పుతుంది. వాంతిలో రక్తం పడుతుంది. దాహం వుంటుంది, గొంతు పెగలదు. చూపు మబ్బేసినట్లుంటుంది, మత్తు ఆవరిస్తుంది, దగ్గినపుడు గొంతుపై అగ్నివృత్తాలు కనిపించి, పోతుంటాయి. కఫదోషం వల్ల వచ్చే ఛాతినొప్పి, తలనొప్పి, తిమ్మిరి, గుండె బరువు వుంటాయి. గొంతునిరంతరం కఫం ముద్దలతో గరగరమంటూనే వుంటుంది. ముక్కు దిబ్బడ, వాంతి వస్తున్నట్లుండడం, తిండి అంటే చిరాకు, ఒళ్ళు గగుర్పాటు కలుగుతాయి.

పోరాటాలలో వ్యాయామాలలో అజాగ్రత్తగా, శక్తికి మించి పాల్గొంటే ఛాతి లోపలి భాగంలో గాయాలై వాత, పిత్త,కఫాలు మూడూ ప్రకోపిస్తాయి.కఫం రక్తంతో కలసి ముదులు కడుతుంది. అది పసుపు పచ్చ లేదా మలిన రంగులో వుంటుంది. రోగి దగ్గుతూ కఫాన్ని ఉమ్ముతున్నపుడు ఛాతీ విరిగిపోతుందేమో అన్నంత బాధ కలుగుతుంది. శరీరమంతా సూదులతో పొడుస్తున్నట్లుంటుంది. తరువాత బల్లెంతో పొడుస్తున్నట్లుంటుంది. మోచేతుల, మోకాళ్ళ (సంధుల) నొప్పులు, జ్వరపు వేడితో బాటు పెరుగుతుంటాయి. దాహం, ఊపిరాడక ఆయాసపడుతుండడం, గొంతు క్షీణించడం, వణుకు, పావురం వలె గుడగుడ ధ్వనులు, ఉమ్మినా వాంతి చేసుకున్నా బోలెడు కఫం రావడం, జ్వరం కాస్త ముదిరితే మూత్రంలో రక్తం పోవడం, వెన్నునొప్పి ఇవన్నీ వుంటాయి. ఇవన్నీ క్షతకాస లక్షణాలు. ఈ దశలో వాతం ప్రకోపించి శరీర ధాతువులన్నీ తీవ్రంగా దెబ్బతింటే **రాజయక్ష్మ** జ్వరం ప్రవేశిస్తుంది.

అప్పుడు రోగి దగ్గినపుడు పడే కఫం ఆకుపచ్చగా, పసుపుపచ్చగా, ఎఱ్ఱని చారలతో నిండి బహిర్భూమి సందర్భంలోని దుర్వాసన వేస్తుంటుంది. చీము కూడా పడుతుంటుంది. నిద్ర పోవడానికి ఎంత ప్రయత్నించినా నొప్పి వల్ల కుదరదు. గుండెను ఎవరో మూకుడులో పెట్టి వేయిస్తున్నట్లుంటుంది. అకస్మాత్తుగా వేడిగా ఒకమారు చల్లటిదొక మారు తినాలని పిస్తుంది. ఎంత తిన్నా చాలదనిపిస్తుంది. నీరసం ఎక్కువవుతుంది.

ఉన్నట్టుంటి ముఖం కాంతివంతంగా, గాజువలె నున్నగా అవుతుంది. కనులలో మెరుపు కనబడుతుంది. అయినా రోగబాధలన్నీ పెరుగుతుంటాయి. బలహీనులను ఈ జ్వరం పూర్తిగా వంచివేస్తుంది. బలవంతులలో గాయాల వల్ల వచ్చిన దగ్గు అయితే చికిత్స ప్రారంభ దశలో వుండగానే తగ్గిపోతుంది. జాగ్రత్తగా చికిత్స చేస్తే వృద్ధులను కూడా తొలిదశలలోనైతే రోగవిముక్తులను చేయవచ్చు. దగ్గు, మందాగ్ని, క్షయ, కడుపులో తిప్పు, వాంతి మున్నగు రోగలక్షణాలు కనబడగానే నిర్లక్ష్యం చేయకుండా చికిత్సకుని సంప్రదించాలి. లేకుంటే అవి చాలా వేగం ముదిరి పోతాయి.

***శ్వాసనిరోధక*** రోగం దగ్గు బాగా ముదిరితే వస్తుంది. శరీరంలోని ద్రవాలను ఉద్రిక్తపఱచడం వల్ల కూడా ఇది రావచ్చు. ఆమాతిసారం (చీము విరేచనం) వమనం, పచ్చకామెర్లు, ధూళి అసహ్యత, పొగ, గాలి తెరలలో చిక్కుకొనుట, మంచు కరిగిన నీరు, విషతుల్యరసాలు, సంధులపై హింస్రకదాడులు కూడా శ్వాస నిరోధక జ్వరాలను కలిగిస్తాయి. ఇందులో క్షుద్రక, తమక, ఛిన్న, మహా, ఊర్ధ్వ అని ఐదు రకాలున్నాయి. కఫం పేరుకుపోవడం వల్ల గాలికి అడ్డంకి ఏర్పడుతుంది. శరీరంలో నిరంతరం పరిభ్రమించే వాయువులు ఒకచోట నిరోధింపబడితే చుట్టూ తిరుగుతూ మెత్తటి ప్రధాన కణజాలాలపై నాళాలపై గుండెపై, బలమైన ఒత్తిడిని కలుగజేసి ఆయా భాగాలను పాడు చేస్తాయి. నడుము లోపలి అంగాలను కూడా ప్రభావితం చేస్తాయి.

ఈ రుగ్మతలో కనిపించే తొలి బాధలు ఛాతీలో నొప్పి, శ్వాసలో తేడా, మలబద్ధకం, కణతల వద్ద పగుళ్ళు వేస్తున్నంత నొప్పి, అతిగా తినడం వల్ల ఆయాసం. లోలోన ఉద్రేకించిన వాయువులు శ్వాస నాళాలలో వెనుకకూ ముందుకూ పరుగిడుతూ కఫాన్ని రెచ్చగొడతాయి. దానివల్ల కలిగే శ్వాసలో శ్రమను, క్షుద్ర శ్వాస రుగ్మత అంటారు. అది తలను, మెడను, గుండెను పిడికిట బట్టి వాటి పక్కలలో అతి నొప్పిని కలిగిస్తుంది. గొంతులో పిల్లికూతలు, వెక్కిళ్ళు, పడిశము, ముక్కు వాపు వస్తాయి. కఫం పైకి పోయినపుడు ఒళ్ళంతా నొప్పెడుతుంది. కాని అది పోగానే కాసింతసేపు ఊపిరాడుతుంది.

పడుకుని వుంటే ఊపిరాడదు. కూర్చుంటే కాస్త నయం. నిలబడితే బాగా ఊపిరాడుతుంది. దీనివల్ల రాత్రిళ్లు కాళరాత్రులవుతాయి. తల పైకెత్తితే నుదురంతటా చెమట్లు పట్టి కణతల వద్ద నొప్పి పుడుతుంది. ఊపిరి తీయడం కోసం అవస్థ పడుతున్న రోగి వణకుతుంటాడు. వేడిగా ఏదైనా తాగాలనుకుంటాడు. ఇది తమక దశ. బలమైన అంగాలు కలవారిలో ఈ రుగ్మతను చికిత్స ద్వారా కుదర్చవచ్చును. తీక్ష్ణమైన జ్వరం, కంపనం వున్నవారిని చలవద్వారా రోగముక్తులను చేయలేము.

మహాశ్వాస రోగంలో బాధితులకు ఊపిరందదు. దానికై గట్టిగా ప్రయత్నిస్తే సర్వాంగాలూ బద్దలైనంత నొప్పి పుట్టుకొస్తుంది. చెమటలు పడతాయి. తెలివి తప్పుతుంటుంది. నడుముకి లోపలంతా మండుతుంటుంది. కళ్ళుపైకెత్తి చూడలేరు. అవి గిరగిర తిరిగిపోతున్నట్లనిపిస్తాయి. ఒక కన్ను బాగా ఎఱ్ఱబడిపోతుంది. మలబద్ధక ముంటుంది. నోరంతా పొడిగా వుంటుంది. అతి వాగుడు, పలవరింతలు, తెలివితప్పుట ఒక దాని వెంట నొకటి వస్తుంటాయి. ముఖం పాలిపోతుంది. లేపి కూర్చోబెడితే శ్వాస తీసుకున్నపుడు శబ్దాలు వస్తుంటాయి. అవి ఎద్దు అంకెల్లా వుంటాయి.

తరువాతి దశలో రోగికి స్పర్శ కూడా తెలియదు. కనులలో ముఖంలో ఏదీ అర్థం కానపుడు కలిగే గాబరా కనిపిస్తుంది. మలమూత్రాలాగిపోతాయి. మాట పడిపోతుంది.

ఊర్ధ్వ శ్వాసరోగికి నిశ్వాసం ఉండదు. ఊపిరి పీలుస్తున్నట్టే వుంటాడు. అదీ లోపలికి గాలి వెళుతున్నట్టే వుంటుంది. పైకి రాదు. కణతలు, తల తీవ్రమైన నొప్పికి లోనవుతాయి. గొంతు తడారిపోతుంది. నోరు, చెవులు కఫాన్నీ చీమునీ కలిగి నిండిపోయినట్లుంటాయి. వాయు ప్రకోపం వల్ల రోగి అటూ ఇటూ ఏదో, ఎటో తెలియనట్లుగా తిరుగుతుంటాడు. సంధులు నొప్పెడుతున్నాయని మూలుగుతాడు. అరుస్తాడు. కాని ధ్వని బయటకు రాదు. ఈ బాధలన్నిటినీ రోగాన్ని కుదర్చడం ద్వారా తొలగించవచ్చు. అదీ మరీ ముదిరిపోకుండా వుంటేనే. ఈ రోగం శీఘ్ర ప్రాణాంతకం.

★ **హిక్కా** ముందుగా 'గాలి ఆకలి' (ఊపిరాడక గట్టిగా ప్రయత్నించి నీరసం తెచ్చుకోవడం) తో సోకుతుంది. ఇందులో భక్ష్యోద్భవ, క్షుద్ర, యమలా, మహతీ, గంభీరా అనే రకాలున్నాయి. మొదటి రకం తొందర తొందరగా గట్టి, ఘాటు పదార్థాలను ముందూ వెనకా చూసుకోకుండా మేసెయ్యడం వల్ల వస్తుంది. ముఖ్యంగా సాయంత్రం లేదా రాత్రి వాతం ఆందోళితంగా వున్నపుడు నోట్లోకి త్రోయబడే గట్టి తిండి ద్రవాలు దీనికి ఉత్పాదకాలు. వాయువు రెచ్చగొట్టబడగానే చిన్నచిన్న ధ్వనులు వస్తాయి. రోగి ఏ కాస్త

---

★హిక్కా అంటే వెక్కిళ్ళు

కష్టించినా వాతం ప్రకోపించి క్షుద్ర హిక్కా వస్తుంది. బోరయెముక నుండి పుట్టే ఈ రోగంలో కొన్నాళ్ళు దాకా వ్యాప్తీ, తీవ్రతా వుండవు. తరువాతి రకమైన యమలా జంటలలో కనిపిస్తుంది. అది కూడా తీవ్రంగా వుండదు. అయితే ఈ దశలో ముఖం వణుకుతుంటుంది. తల, మెడ తిరుగుతుంటాయి. ఇది ముదిరితే తెలివిలేని వాగుడు, వాంతులు, విరేచనాలు, కనుగ్రుడ్లు తిరుగుట, కళ్ళు తేలవేయుట, ఆవులింతలు ఇవన్నీ గోచరిస్తాయి. ఇవన్నీ ఎక్కువ కాలం పాటు వుంటే రోగం ముదురుతోందని గ్రహించాలి.

మహతీ వెక్కిళ్ళలో అన్నీ తీవ్రంగానే ఉంటాయి. కనుబొమ్మలు క్రిందికి జారిపోతాయి. కణతలు లోతుకి పోతాయి, కళ్ళు చెవులకి దగ్గరగా జరుగుతుంటాయి. ఒళ్ళంతా తిమ్మిరెక్కిపోతుంది. మాటలో స్పష్టత పోతుంది. జ్ఞాపకశక్తి నశిస్తుంది. తెలివి తప్పిపోతుంది. సంధులన్నీ విడిపోతాయి. వెన్నెముక వంగిపోతుంది.

గంభీర అంటేనే తీవ్రత. ఇది నడుము, నాభిలలో మొదలవుతుంది. తీవ్రమైన నొప్పి, పెద్ద ధ్వనులు, పరమహింస, మిక్కిలి బలం (అంటే మందుకి లొంగకపోవడం) దీని లక్షణాలు. పెద్దపెద్ద ఆవులింతలూ, అంగాల కుదుపూ వుంటాయి. జాగ్రత్తగా, ఓపిగ్గా చికిత్స చేస్తే దీన్ని రూపుమాపవచ్చు. హిక్కా, క్షయలు ప్రాణాంతకాలు. ఇతర (ఈ అధ్యాయంలో వున్న) రోగాలు కూడా బలహీనుల, త్రాగుబోతుల, అతి తిండిపోతుల, వృద్ధుల, అతి నీరస జీవుల, మలబద్ధక రోగుల విషయంలో ఒక రోజు నిర్లక్ష్యం చేసినా ప్రాణాంతకాలవుతాయి.

***రాజయక్ష్మ,*** క్షయ రోగాలలో తొలి జబ్బు పాతరోజుల్లో నక్షత్రాలకీ, చంద్రునికీ, రాజులకీ, బ్రాహ్మణులకీ ఎక్కువగా సోకేది కాబట్టి దానికాపేరు పెట్టబడింది. దీనికే క్షయ అనీ రోగరాట్ అనీ శోష అనీ కూడా పేర్లున్నాయి. దీనికి కారణాలు 1) సాహసం అనగా తెగింపు, అతి వ్యాయామం, అతి బలం 2) వేగ సంరోధం అనగా మలమూత్రాలను బలవంతంగా అణచిపెట్టుట 3) శుక్రజ స్నేహ సంక్షయం అంటే వీర్యాన్ని, శక్తినీ, బలాన్నీ వృథా చేయడం 4) అన్నపాన విధి త్యాగం అనగా ఒక నియమమూ, అదుపూ లేకుండా తినడం, త్రాగడం.

పైన చెప్పిన కారణాల వల్ల వాతం ప్రకోపిస్తుంది. పిత్తం చెదరిపోతుంది. అనవసరాలూ హానికరాలునైన పదార్థాలు గడ్డకట్టిపోయి కఫం ఉద్రేకానికి లోనై అది నాళాలలో పేరుకుపోతుంది. సంధులలో చేరుతుంది. కాలువలను అడ్డుతుంది. అపుడు ఈ రోగం కవాటాలను మూసిగాని, వాచేలా చేసి గాని నరాలను చెడగొడు తుంది. ఆపుడు గుండె దానిప్రక్క క్రింది భాగాల్లో తీవ్రమైన నొప్పి పుడుతుంది.

ఈ రోగ లక్షణాలు (వచ్చిందని సంకేతాలు) పడిశం, ఉష్ణోగ్రత పెరుగుదల, చొంగ కారుట, నోటిలో తీపి రుచి, శరీరం నున్నబడుట, తిండి సహించకపోవుట, నడవాలనే తీవ్రవాంఛ, తినాలనే గట్టి కోరిక, ఆ రెండూ చేయలేకపోవడం, స్వచ్ఛతలో అతివ్యగ్రత, ఎంత శుభ్రంగా వున్నదైనా అపరిశుభ్రంగా వుందని అరవడం, తన భోజనపాత్రలో తాగే వాటిలో లేని ఈగలను, తలవెంద్రుకలను గడ్డి పరకలను ఉన్నాయని అనుమానించి ఏరుతుండడం,వెక్కుళ్ళు, అశాంతి, వాంతులు,ఎంత రుచికరమైనవి పెట్టినాబాగు లేవనడం.

ఈ రోగిలో కొన్ని సందర్భాల్లో శరీరమంతటా కనులతో సహా తెల్లటి మెరుపు రంగు వచ్చి చేరుతుంది. నాలుక, బాహువుతీవ్రంగా నొప్పెడతాయి. స్త్రీ సుఖం కావాలని పిస్తుంది. మద్యమాంసాలూ కావాలనిపిస్తుంది. తీరా వాటిని చూస్తే చిరాకు కలుగుతుంది. విచిత్రమైన కలలు వస్తుంటాయి. నిర్మానుష్యగ్రామాలూ, ఎండిన చెరువులు, దొరువులు, చాలా కాంతివంతమైన తోకచుక్కలు, చెట్లతో సహా తగలబడిపోతున్న అడవులు, తనపైకి ఉరుకుతున్న ఊసరవెల్లులు, పాములు, కోతులు, పక్షులు - ఇలాటివన్నీ కలలోకి వస్తుంటాయి.

గోళ్ళూ, ఎముకలూ, జుట్టూ అసహజమైన వేగంతో పెరిగిపోతుంటాయి.

శ్వాసకోశానికి సంబంధించి ఈ రోగరాజంలో పదకొండు రుగ్మతలు బయట పడతాయి. పడిశము, శ్వాసకృచ్ఛ్రము, దగ్గు, గొంతు నీరసించుట, తలనొప్పి, అన్నద్వేషం, ఎగవూపిరి, అంగముల్లో అతి నీరసం (చీపురుపుల్లల వలె అయిపోవుట) వాంతులు, జ్వరం, ఛాతీనొప్పి - ఇవి వచ్చిన తరువాత గొంతులో భరించలేని బాధ, ఉమ్ములో చీము, నెత్తురు, అంగాలు నొక్కుకుపోతున్న బాధ కలుగుతాయి.

వాత ప్రకోపంవల్ల తల,కణతలు అంగాలు నొప్పెడతాయి. అన్నీ ఒత్తిడికి లోనౌతాయి. గొంతు నొక్కుకుపోతున్నట్లుంటుంది. పిత్త ప్రకోపం వల్ల భుజాలలో మంట, అరికాళ్ళలో, చేతుల్లో మంట, నులుగడుపు, నెత్తుటి వాంతులు, మలంలో దారుణ దుర్వాసన, నోటిదగ్గర దుర్వాసన, జ్వరం, పేలాపన వస్తాయి. కఫం ప్రకోపిస్తే అరుచి, వాంతులు, సగం శరీరం బరువెక్కిన భీతి కలుగుతాయి.

నోటినుండి చొంగకారుట, జలుబు, అజీర్ణం, శ్వాసకృచ్ఛ్రం, గొంతు బొంగురు కూడా కఫం వల్లనే వస్తాయి. జీర్ణకోశం సరిగా పనిచేయకపోవడం వల్ల మామూలుగా స్రవించే ద్రవాలు పెరిగి కఫం రసాలు అతిగా ఊరి నిలవైపోయినిల్చిపోయి అన్ని నాళాలపై పూతలాగేర్పడి వాటి ద్వారాలను మూసేస్తాయి. అప్పుడు శరీరంలో ధాతునిర్మాణం ఆగిపోయి మొత్తం అంతటా మంటలు చెలరేగుతున్నట్లుండి మతి చెదరిపోతుంది. మరికొన్ని

దారుణ బాధలు కూడా వుంటాయి. క్షయరోగి తీసుకునే ఆహారం హానికర ఆమ్లాలతో తడిసిపోయి ఇతర ద్రవాలతో కలిసి ఎందుకూ పనికిరాకుండా పోతుంది. అతనికి బలం చేకూరదు. రసాలేవీ అతని శరీరంలో రక్తాన్నుత్పత్తి చేయవు. దాంతో రోగి క్షీణించి పోయి కాళ్ళూ చేతులూ చీపురుపుల్లల్లాగా అయిపోతాయి. ఈ చీపురుపుల్ల లక్షణం కనిపించే లోపల ఎన్ని రుగ్మతలు బయటపడినా మందుల ద్వారా చికిత్స ద్వారా రోగాన్ని కుదర్చవచ్చు.

దేహంలో జఠరాదిరసాలు పాడైతే కొవ్వు చేరక మనిషి నీరసించిపోతాడు. గొంతు బొంగురు వచ్చి గొంతు బలహీనమై బొంగురువోయి వణుకుతుంది.

వాత ప్రకోపంలో శరీర కాంతినాశనమగుట, నునుపు పోవుట, వెచ్చదనం మాయమగుట జరిగి గొంతుభాగం బార్లీగింజ రూపంలో రంగులోకి వచ్చేస్తుంది. కఫ ప్రకోపానికి ఈ జబ్బులో ఒక వింతైన గురక, గొంతులో నిరంతరం జిగటగా చీము కదులుతుండడం సూచనలు. పిత్త ప్రకోపం వున్న క్షయ రోగికి గొంతు, తాలువు మండుతున్నట్లుంటాయి. కఫలక్షణాలైన తలతిప్పు, కనులముందు చీకటి తెరలు కూడా కనిపించవచ్చు.

ఏది యేమైనా కాలుసేతులు చీపురు పుల్లలవలె కాక ముందైతే చికిత్స చేయవచ్చు.

***(అధ్యాయాలు 148-152)***

# అరోచకం

సుశ్రుతా! ఇపుడు అరోచక అనగా అన్నముగాని మరేమిగాని సహించక నిరాసక్తత పెరుగుట అనే రోగాన్ని చర్చిద్దాం.నాలుకనుండీ, గుండె నుండీ స్రవించే మూడు గ్రంథుల వల్ల వాత పిత్త కఫప్రకోపాల వల్ల మూడు రకాల అరోచకం కలుగుతుంది. నాలుగవ రకం ఈ మూడు ప్రకోపాలూ కలిస్తే వస్తుంది.అయిదవ దానికి కారణంమానసిక రుగ్మత.

వాతం వల్ల వచ్చే అరోచకంలో నోరంతా వగరు తిన్నట్టుగా వుంటుంది. పిత్త ప్రకోపంలో చేదు కఫం కారణమైతే తీపి రుచులు నోటిని కమ్మేస్తాయి.

కోపంగాని దుఃఖం కాని కమ్ముకున్నపుడు మనిషికి ఏ రుచీ పట్టదు.అరోచక రోగికి ఏది తిన్నా నోటిలో రోగ ప్రకోపం వల్ల వున్న రుచితప్పఇంకేరుచీ తెలియదు.దీనికి కారణం వాంతి వస్తున్నట్లుండడం ఈ కఫ ప్రకోపానికి మూల కారణమేమిటంటే ఉదాన వాయువు నాలుక అడుగున చేరిన ప్రకోపాలను ఎగురుగొట్టడానికి ప్రయత్నం చేసినపుడు పిచ్చి పిచ్చి రసాలేవో ఊరిపోయి నోరంతటా చిమ్మబడడం. అది నాభి ప్రాంతాన్ని,

వీపుని బాధిస్తుంది. తిన్నదేదైనా లోనికి పోగానే పక్కలోకి దిగబడుతుంది. కొంచెం కొంచెం వాంతి రూపంలో బయటికొస్తుంది. మొత్తం నోరంతా వగరైపోతుంది. వాత చర్యల వల్ల పెద్ద ధ్వనులతో త్రేన్పులు వచ్చి నాలుక తడారిపోతుంది. వెక్కుళ్ళు, గొంతు బిరుసెక్కుట వుంటాయి.

ఈ రోగం పిత్త ప్రకోపం వల్ల వచ్చినదైతే ఉప్పు నీరు లాటిది రక్తంతో కలిసి వాంతిలో పడుతుంది. అది హరిత, పీత వర్ణాలు కలిసిన రంగులో ఉంటుంది. వాంతి వస్తున్నపుడు నోరంతా చేదుగా, ఘాటుగా వుంటుంది. దాహం, తెలివితప్పుట, శరీరమంతా మండుతున్నట్లుండుట దీని ఇతర లక్షణాలు. కఫం వల్ల వచ్చే రోగంలో చిక్కగా తేనెలా జిగటగా నున్న పసుపు పచ్చటి చీము నీటితో కలిసి వాంతి అవుతుంది. నోరు ఉప్పగా అయిపోతుంది. రోమాంచమూ కలుగుతుంది.

ఇది తీవ్రతరమైతే నోరు వాచిపోయి తీయగా అయిపోగా, మనిషిలో స్థిరతపోయి, నాడిలో అశాంతి బయలుదేరి, అక్కడ నొప్పి వచ్చి, వెక్కుళ్ళు తరుచుగా వస్తుంటాయి. ఈ దశలో కుదుర్చడం అసాధ్యం.

ఈ రోగికి ఏది విన్నా, ఏమికన్నా అసహ్యతే కలుగుతుంటుంది. ఈ బాధలన్నీ ఆహారంలో కల్తీ వల్ల కలిగినవైతే (పురుగులున్నవైతే) శూల లక్షణాలన్నీ వస్తాయి. ప్రకంపనం వుంటుంది. వాతం కూడా చెడుతుంది. ***(అధ్యాయం -153)***

# హృదయ తృషారోగము

హృద్రోగం – అనగా గుండె జబ్బు. క్రిముల వల్ల వాత, పిత్త, కఫ, ప్రకోపాల వల్ల లేదా మూడిటి కలయిక వల్ల మొత్తం అయిదు కారణాలలోనేదో ఒక దాని వల్ల గుండె చెడవచ్చును.

వాతం వల్లే వచ్చే హృద్రోగంలో గుండె, కడుపుభాగం అంతా ఖాళీ అయిపోయి నట్లుంటుంది. రోగి తెగతింటూ వుంటాడు. ఈ తిన్నదంతా ఎక్కడికి పోయిందని ఏడుస్తుం టాడు. గుండె భాగం తిమ్మిరెక్కినట్లవుతుంది. తడుముకుంటే లోపలేదో విరిగిపోయి నట్లుంటుంది. గుండె తడారిపోతుంది. రోగికి మత్తుగా వుంటుంది. ఉన్నట్లుండి రోగి నిరాశ చెందుతాడు. దుఃఖభారం పెరుగుతుంది. తీవ్రంగా భయపడతాడు. ధ్వని దేషం కలుగుతుంది. చిన్న ధ్వనికి కూడా చిరాకు పడిపోతాడు. నిద్ర సరిగా పట్టదు, శ్వాస కష్టం మీద ఆడుతుంది.

పిత్తం వల్ల వచ్చే హృద్రోగంలో రోగికి విపరీతమైన దాహం, నీరసం, నిస్సత్తువ, మంట, చెమట, త్రేన్పులు (పుల్లటివి) అరగనివి, ఆమ్లం, వాంతి, జ్వరం, కనులు మబ్బు వేయుట జరుగుతాయి.

ఇదే రోగం కఫం వల్ల వస్తే గుండె తిమ్మిరెక్కి పోతుంది.జీర్ణకోశం చెడుతుంది. ముఖంలోతుకి పోయినట్లవుతుంది. లేదా ఉబ్బుతుంది.వెక్కుళ్ళు, ఒంటి నొప్పులు, ఉమ్మిలో చీము పడుట, మత్తుగా వుండుట, ఆయాసము, తిండిపట్ల విముఖత దీని ఇతర లక్షణాలు.

వాత, కఫ, పిత్త, మూడిటి దోషాల కారణంగా గుండె సమస్య వస్తే పై విభిన్న లక్షణాలన్నీ కనబడతాయి. క్రిముల వల్ల వచ్చే హృదయ తుషారోగంలోనల్లని పచ్చని కలగలుపు రంగు కనులలో కనబడుట, మత్తుగా వుండుట, కళ్ళు చీకట్లు కమ్ముట, గుండె రసాల నిల్వ, అశాంతి, అంగాలలో దురద, దగ్గున్నా లేకున్నా కఫం నోటి నుండి రాలుట అనే లక్షణాలు బయటపడతాయి.

గుండెనెవరో అంపంతో కోస్తున్నట్లుంటుంది. కత్తెరతో కత్తిరిస్తున్నట్లుంటుంది. ఈ రోగమునకు తొలి దశలోనే మందు పడకపోతే ప్రాణాంతకమే.

త్రిదోషాలలో దేనివల్లనైనా పిపాస హెచ్చు మీరుతుందిగానీ గుండె నీరసం మాత్రం మూడూ కలిసి వస్తేనే వుంటుంది.

హృద్రోగాలలో అంటువ్యాధి కూడా ఒకటుంది. అది సోకినా వాత, పిత్త దోషాలుంటేనే శరీరం లో వర్ధిల్లుతుంది (ఇది ఆరవ హృద్రోగం)

హృదయరోగం లేదా హృద్రోగం ఏదైనా మరొక దోష ప్రోద్బలం ఉంటేనే ఉద్రేకిస్తుంది. కుదుపు, గుండెదడ, మనోద్రేకము, గుండెలోమంట, ధాతు బలహైన్యము వల్ల మూర్ఛ – ఇవన్నీ కనిపిస్తాయి. నాలుక అంగిలి భాగం ఎండిపోయి దాహం వేయుట, అన్ని జలభాగాలూ పొడిబారుట, పరాకుమాటలు, స్పృహ తప్పుట, నోరు బీటలు వారినట్లగుట, అన్నద్వేషం, గొంతులో దైన్యం,మనసు ఒకరీతిలో నుండక పోవుట, జలాంగాలన్నీ ఎండుట వల్ల నాలుకను బయటకు తీయలేకపోవుట, త్రేనుపులు కూడా హృద్రోగికి ఉంటాయి.

వాత దోషం వల్ల వచ్చే గుండెజబ్బు అతి బలహైన్యము, నిరాశ, తలలో మత్తు, కణతల నొప్పి, వాసన చూసే శక్తి తగ్గుట,(నాలుకకి)నునుపు జిడ్డుతగ్గుట, నిద్రపట్టక పోవుట, మొత్తంగా నీరసం – లను కలిగివుంటుంది.

పిత్తదోషం ఆమ్లత్వంలో సన్నటి పెరుగుదలనూ, మూర్ఛనూ, నోట చేదునీ, కంట ఎరుపునీ, శరీరంపై పొడినీ, లోపల మంటనీ, రోమకూపాల్లోంచి ఆవిరులొస్తున్న భ్రమనీ కలిగిస్తుంది.

హానికారక కఫం ఒక చోట స్థిరంగా వుండిపోయి అలా వెళుతున్న, జలనాళి కలలోని, వాయువుని అడ్డేస్తుంది. అప్పుడా గొట్టాలు మంటలలో పడిన మట్టి కుండల్లా ఉష్ణాన్ని పీల్చుకున్నట్లయిపోతాయి. గొంతు బార్లీ గింజతో పొడవ బడుతున్న ట్లుంటుంది. నోటిలో తీపి, నిద్రవస్తున్నట్లు వుండడం అనుభవ మవుతాయి. తల సోమరిగా మారుతుంది. అలసట, ఆయాసము, తిండి నచ్చకపోవుట, అజీర్ణము – ఇవన్నీ త్రిదోషాలూ కలిసి హృద్రోగిపై దాడి చేయడం వల్ల వస్తాయి.

చీము, అజీర్ణ పదార్థాల నిలువ కలిసి రక్త ప్రసరణాన్ని నిరోధిస్తాయి. దీనివల్ల వాత, పిత్తాలు ఆందోళితమవుతాయి. దీని వల్ల రోగి కొంతసేపు వేడినీ కొంతసేపు చల్లదనాన్నీ తట్టుకోలేకపోతుంటాడు. రెండూ భరించలేనంత భారీగానే శరీరంపై దాడి సలుపుతాయి.

దాహం ప్రేగులలోని ముఖ్య ప్రాంతాన్ని నిరోధిస్తే అది పిత్త ప్రకోపమే. రసాల తగ్గుదల వల్ల వచ్చే దాహం త్రిదోష కారకం. కణజాల క్షీణత, మూర్ఛ, జ్వరం, త్రిదోష తీవ్రతల వల్ల దాహాన్ని ఉపసర్గాత్మిక అంటారు. ఇది మృతికి ముందలి దశ చిహ్నం.

*(అధ్యాయం – 154)*

# మదాత్యయరోగ నిదానం

మత్తు పదార్థాలను సేవించడం వల్ల వచ్చే రోగాన్ని మదాత్యయ రోగమంటారు. మద్యం వల్ల ముందుగా శృంగారంలో సమయం తగ్గిపోతుంది. అది శరీరంలోని అతి సూక్ష్మ నాళాల్లో కూడా చొచ్చుకుపోయి వాటిని చెడగొడుతుంది. మెదడుపై ప్రభావాన్ని చూపడం ప్రారంభిస్తుంది.

మధువును గాని సారాను గాని ఇతర మాదక ద్రవ్యాలను గాని అతిగా సేవించిన వారిని బ్రతికించడం కష్టం. అది వారి కణములన్నిటినీ సోమరులుగా తయారుచేస్తుంది. దాంతో అవి ఏ మందుకీ ప్రతి చర్యను చూపించవు. మద్యం జ్ఞానేంద్రియాలనుద్రేకపఱచి మెదడును మొద్దుబారేలా చేస్తుంది. అందువల్ల వాటి మధ్య సమన్వయం లోపించి మొత్తం శరీరభాగాలన్నీ దెబ్బతింటాయి. అందుకే మొదటిసారి, రెండవసారి తాగిన వాడికి

చురుకుదనం పెరిగినట్లై గొప్ప హాయిగా వుంటుంది కాని తరువాత ఆ సుఖం వుండదు. అయినా మూర్ఖుడు భ్రమలో మునిగి ఆ సుఖం కోసం అన్వేషిస్తూ తాగుతునే ఉంటాడు. తాగుడుకి అలవాటుపడిన ఉన్నతాధికారి అదుపులేని క్రూర విషసర్పమువంటివాడు. ఈ మత్తులో గాని, అది దొరకనపుడు గానీ ఎవరిని ఎందుకు కాటేస్తాడో చెప్పలేం. మద్యం క్రూరత్వాన్ని పెంచుతుంది. నోటితో చెప్పలేని చెడ్డపనులు చేయిస్తుంది.

అది సజ్జనుడిని నీచునిగా మార్చేస్తుంది. అది బాగా నెత్తి కెక్కినవాడు ఎంత చెడ్డ పనిచేయడానికైనా భయపడడు. మందుకి బానిసైపోయి అది దొరకని వాడు, ఆ దొరకని నాడు పరమనీచుడై పోయి గుక్కెడు మద్యం కోసం హత్యచేయడానికైనా వెనుకాడడు. ఈ దశకి వచ్చేసరికి వాని ఆరోగ్యం సర్వనాశనమైపోయి వుంటుంది. మెదడు దెబ్బతినేయడంతో ఏది సుఖమో ఏది అసుఖమో తెలియక ఏడవవలసినపుడు నవ్వుతాడు. నవ్వవలసినపుడు ఏడుస్తాడు. జ్ఞాపకశక్తి నశిస్తుంది. తులన దెబ్బతిని ఎక్కడబడితే అక్కడ పడిపోతుంటాడు.

సహజంగా బాగా తిని అరిగించుకొనేశక్తి గలవారు,స్వతహాగా బాహుబల సంపన్నులు, మంచి పుష్టికరమైన భోజనంతో మద్యాన్ని పుచ్చుకున్నా వారికి పెద్దగా మత్తెక్కదు. ఆ మత్తుకోసం మరింత తాగితే మాత్రం సర్వనాశనం తప్పదు.

తాగుబోతులకు వచ్చే జబ్బులు పిత్త, కఫ దోషాల్లో దేని ప్రకోపం వల్లనైనా రావచ్చు. త్రిదోషాలూ ఒకేసారి దాడి చేయడం వల్ల కూడా కలగవచ్చును.

తఱచుగా వచ్చే విరేచనాల వల్ల దాహం, కాసింత నిరాశ, జ్వరం, అరుచి, ఆహార విముఖత, మలబద్ధకం, కళ్ళు చీకట్లు కమ్ముట, వెక్కుళ్ళు, శ్వాసలో ఇబ్బంది, నిద్రపట్టక పోవుట, అతిగా చెమటలు పట్టుట, మలమూత్ర విసర్జనల్లో ఏదో అడ్డు పడినట్లుండుట, ఒళ్ళు అక్కడక్కడ వాచుట, మానసిక ఆందోళన ఇవన్నీ త్రిదోషాలు కలిసి తాగుబోతుపై దాడిచేస్తే బయటికి కనిపించే లక్షణాలు. రోగి ఏదో కలలలోకంలో పడినట్లుంటాడు. పిలిచినా పలకడు.

ఈ రోగం పిత్తదోషం వల్ల వస్తే అంతటా మంటపుడుతున్నట్లుంటుంది. లోనాపైనా కూడా. జ్వరం, స్వేదనం, స్పృహ తప్పుట, గుండె దడ కనిపిస్తాయి.

కఫ ప్రకోపం వల్ల వస్తే వాంతులు, అశాంతి, నిద్రమత్తు, కడుపు వాయువు ఎక్కువై బరువెక్కుట (ఉదరగౌరవం) అనే లక్షణాలు బయటపడతాయి.

తెలిసి తెలిసీ మత్తుకి అలవాటుపడిపోయిన వారు క్రమేపీ ఆలోచించే శక్తిని కోల్పోతారు. మానసిక రోగాలు ప్రవేశిస్తాయి. ప్రతీదీ వారికి ఆనందాన్నే కలిగి స్తుంటుంది.

కర్రముక్క ఇచ్చినా, అన్నం ముద్ద పెట్టినా, లడ్డూను చేతిలో వుంచినా ఒకలాగే, చిన్నపిల్లల్లా, సంతోషపడిపోతారు. ఇవి ఎక్కువగా వాత ప్రకోప లక్షణాలు. నోటి నుండి కఫం, చీము పడుతుండడం, ఏమీ తాగకున్నా నిద్రమత్తులో జోగుతున్న ట్లుండడం వీరి లక్షణాలు. ఒళ్ళు నొప్పులెక్కువగా వుంటాయి. ఏం మాట్లాడినా పెద్దగా అర్థం వుండదు. ఒకటనుకొని ఇంకొకటి అంటారు. గుండె, గొంతు చెడతాయి. మూర్ఛలొస్తుంటాయి. ఊపిరి హాయిగా, సక్రమంగా ఆడక అవస్థ పడుతుంటారు. దాహం, జ్వరం, కడుపులో తిప్పు బాధిస్తుంటాయి. ఏదో ఒకటి రెండు మార్లు దారి తప్పి తాగినా తెలివితేటలుపయోగించి దానిని పూర్తిగా వదిలేసిన వారికి ఈ రోగాలేవీ రావు.

వంచనకు గురైనవారూ, ప్రథమకోపులూ మత్తుకి సంబంధించిన మూడు రోగాలకూ అనగా మూర్ఛలు, నేలపైబడి లేవలేకపోవుట, కడుపులో త్రిప్పులకూ లోనవుతారు. వీరు తిండికి సంబంధించిన నియమాలను సరిగా పాటించకపోతే ప్రమాదమే. శరీరంలో నాళాలన్నీ చెడతాయి. వాత, పిత్త, కఫలోపాలూ, మలిన రక్తం, శరీర భాగాలన్నిటిలో సారా ప్రవహించడం వల్ల ఈ రోగులను సరిచేయుటకు చాలాకాలం పడుతుంది.

మత్తురోగులలో వాతం ప్రకోపిస్తే మనిషి చీపురు పుల్లలాగైపోతాడు. రక్తహీనత ఏర్పడు తుంది. ఏ కోశానా మెరుపన్నది మిగలదు. జీవకళ కనబడదు. శరీరం ఎఱ్ఱబడు తుంటుంది. మనిషిలో మోసం చేసే బుద్ధి పెరిగిపోతుంది. ఆలోచనలు, చర్యలు స్థిరంగావుండవు. పిత్తం ప్రకోపిస్తే మత్తులో వున్నా లేకున్నా ఆ రోగి తెగ చిరాకు పడిపోతుంటాడు. శరీరానికిఎరుపూ, పసుపూ కలిగిన అందవికారమైన రంగు వస్తుంది. కఫం ప్రకోపిస్తే మనిషి నడుస్తున్నా, అరుస్తున్నా నిద్రలో వున్నట్లే వుంటాడు. సందర్భశుద్ధి లేకుండా మాట్లాడుతుంటాడు. ఏదో మరో లోకంలో వున్నట్లుంటాడు. మూడు ప్రకోపాలూ కలిసివున్న వారికి ఈ పై లక్షణాలన్నీ కనిపిస్తాయి. రక్తప్రసరణంలో ఆటంకమేర్పడుతుంది. పక్షవాతమూ రావచ్చు.

త్రిదోష ప్రకోప లక్షణాలు ఇంకా ఇలా కూడా ఉంటాయి. రోగి తన వారి గొంతుకలను ఎంత ప్రయత్నించినా పోల్చలేకపోవడం పిత్తలోపం. మనిషి నిద్ర పోతున్నా శరీరం వణకుతునే వుండడం జరిగినపుడు వాత లక్షణాలను జాగ్రత్తగా పరిశీలించాలి. రోగికి ఆకాశం ఎఱ్ఱగా కనిపించవచ్చు. లేదా అంతా చీకటిగా నల్లటి తెరల చాటుననున్నట్లు కనిపించవచ్చు. ఒక్కసారి తల విదిలించి చూస్తే అంతా బాగానే కనబడుతుంది. కాని గుండెలో సన్నగా నొప్పి మొదలెట్టినట్లవుతుంది. తల తిరుగుతుంది. ఛాతీ భాగమంతా ప్రకంపిస్తున్నట్లవుతుంది. వెక్కిళ్ళు వస్తుంటాయి.

పిత్త ప్రకోపంలో ఆకాశం ఎఱ్ఱగా గాని పచ్చగా గాని కనబడుతుంది. మాటిమాటికీ స్పృహ పోతుంటుంది. తెలివి వచ్చాక విపరీతంగా చెమటలు పడతాయి. అధికదాహం,

గొంతులో మంట వుంటాయి. శరీరం రంగు ఒకవైపు పసుపు పచ్చగానూ మరొకవైపు నీలంగానూ తేలవచ్చు.కనులు ఎఱ్ఱగానో పచ్చగానో అయిపోతాయి.

కఫ ప్రకోపంలో రోగికి ఆకాశం నిత్యం మేఘావృతంగానే గోచరిస్తుంది. మృతి చెందినట్లయిపోయి ('కోమా' లో వుండి) కొన్ని గంటల తర్వాత ఎప్పుడో ఈ లోకంలోకి వస్తాడు. గుండెలో గాబరాగా వుందని గోల పెడుతుంటాడు. చొంగ కారుతుంటుంది. అంగాలన్నీ బరువెక్కిపోయి తిమ్మిర్లు వస్తాయి. ఉన్నట్టుండి 'దబ్బు'మని కిందపడిపోతాడు. అపస్మారంలోకి వెళ్ళిపోతాడు. మరల లేచి తన పనులు తాను చేసుకుంటున్నపుడు కూడా మాటలో స్పష్టత వుండదు.

కాబట్టి మత్తు మందు ఏదైనా ప్రమాదకరమే కాని అదే మత్తు పానీయాన్ని వ్యక్తి యొక్క శరీరతత్త్వాన్ని బట్టి రోజుకి అయిదు నుండి పదిచుక్కలు తీసుకుంటే నిద్రబాగా పడుతుంది. బుర్ర చక్కగా పనిచేస్తుంది. అంగాలలో చురుకుదనం వస్తుంది. చర్మానికి నైగనిగ్యం, ముఖానికి నవకం వస్తాయి. కాని మానవజాతి చేసుకునే దురదృష్టమేమనగా అలా రోజుకి అయిదు, పది చుక్కలనే పుచ్చుకొని అంతటితో ఆగేవాడు కోటికొక్కడుంటాడు.

*(అధ్యాయం -155)*

# అర్శలు లేదా మొలలు

**మాం**సం నుండి కొంచెం సూదిగా మొనలుదేలిన పెరుగుదలలు శరీరం లోపల అన్నిచోట్లా ఏర్పడుతుంటాయి. కాని, వాటిలో మలద్వారంలో పెరిగి మల విసర్జన కంతరాయం కలిగించే వాటిని మొలలు లేదా లేదా అర్శలు అంటారు. (ప్రస్తుత భాషలో పైల్సు) ఇవి సహజ అనంతరోత్థయని రెండు విధాలు.

గుహ్యానాళం అయిదున్నర అంగుళాల పొడవుంటుంది. అందులో పొడిగా రాళ్ళవలె ఉండే మొలలు మూడున్నర అంగుళాల మేరకు పెరుగుతాయి. ఆదారంట వెళ్ళే రక్తనాళాలీ మొలలకు తగిలి పగులుతాయి. తద్వారా రక్తస్రావం జరుగుతుంది. ఇది సాధారణంగా తల్లిదండ్రుల దోషాల కారణంగా పిల్లలకు సంక్రమిస్తాయి. దేవతల శాపాలు కూడా మొలలను పెంచుతాయి.

సహజంగా, అనగా వంశపారంపర్యంగా వచ్చే మొలలు సంపూర్ణంగా నశించడమనేది వుండదు. ఈ రకం మొలలు గరుకుగా, చండాలంగా, లోపలివైపు మొనదేలి, పాలిపోయిన పసుపురంగులో వుంటాయి. వీటివల్ల వచ్చే అనారోగ్య ఫలితాలు పరమభయంకరంగా వుంటాయి.

ఈ మొలలు ఆరు విధాలుగా విభజింపబడ్డాయి. త్రిదోషాలూ కలిసి కాని రెండేసి కలిసి గాని ఈ రుగ్మతకు కారణమవుతాయి. పొడిమొలలు వాత, కఫదోషాల వల్లా, తడిమొలలు పిత్త దోషం వల్లా ఏర్పడతాయి.

జఠరరసాలు ఆహారాన్ని దహించే వేళలో శృంగారానుభవాన్ని పొందే వారిలో ఈ దోషాలు మరింత ప్రకోపిస్తాయి. అపానవాయువు ప్రకోపించడానికి తెలివి తప్పేదాకా త్రాగడం, బరువైన – అరగడం కష్టమైన తిండి తినడం, కడుపును మాటిమాటికీ నిమురు కోవడం, కనులను గొంతును అరచేతులతో రుద్దుకోవడం, అతి శీతల ద్రవాన్ని వాడడం, అతిగా స్వారి చేయడం, సహజమైన కోరికలను అణచుకోవడం, విరేచనాలు, మలబద్ధకం – ఇలాటివన్నీ దోహకాలౌతాయి, కారణాలూ అవుతాయి.

అపానవాయువు కలత చెందినపుడు మలం పైకి పోయే దారిలో ములుకు ల్లాటి మొలలు లేచి దానిని అడ్డేస్తాయి. అప్పుడు ఎముకలుకూడా నొప్పెడతాయి. తల తిరుగు తుంది. కళ్ళు మండుతాయి. వాయువు నాభి క్రింది ప్రాంతాల్లో కదలాడడం వల్ల రోగి శ్వాస తీసుకున్నపుడు ఇబ్బంది కలిగి, మలద్వారం వద్ద రక్తం వస్తుంది. తలనొప్పి, పేగుల నుండి గుడగుడ ధ్వనులు, అతి త్రేన్పులు, అతి మూత్రము, తక్కువ మలం, అన్నద్వేషం, తల, తిరుగుతున్నట్లుండుట, నాలిక చేదెక్కుట, తల ఛాతీ, పక్కల్లో నొప్పులు, భోగేచ్ఛ, ఇంట్లో వాళ్ళపై చిరాకు కలుగుతాయి.

ఈ రోగలక్షణాలు అతిసార, క్షయ, పచ్చకామెర్లు, క్లోమ వ్యాకోచాదులను పోలివుంటాయి. అయితే మల ద్వారం దగ్గరి బాధ పెరుగుతున్న కొద్దీ లక్షణాల వ్యగ్రతా పెరుగుతుంటుంది. అపానవాయువుకి బయటకు పోయే దారి మూసుకుపోతే అది మళ్ళా శరీరంలోకే వెనక్కి మళ్ళి పోయి అన్ని జ్ఞానేంద్రియాలనూ, హృదయాది ప్రధానాంగాలను చికాకు పెడుతుంది. అప్పుడది వాత, పిత్తాలలో పగుళ్ళను కల్పిస్తుంది. ఆ తరువాత మొలలు మరీ ఎక్కువగా విస్తరిస్తాయి.

రోగి బక్కచిక్కిపోతాడు, మరీ పుల్లల్లా కాలుసేతులైపోతాయి, విరక్తుడై పోతాడు. ముఖం పాలిపోతుంది. చెదచే పూర్తిగా మింగబడిన చెట్టు లాగైపోతాడు. మనిషిలో నవకం పోతుంది.

యక్ష్మవిషయంలో ఇదివఱకు చెప్పబడిన బాధలన్నీఈ రోగిని తాకుతాయి. సంధులన్నిటిలో నొప్పులు వస్తుంటాయి. దగ్గు, అతిదాహం, నోరు తడారిపోవుట, శ్వాసకృచ్ఛ్రము, పడిశం, తుమ్ములు, కడుపులో తిప్పు, ఒళ్ళునొప్పులు, వినికిడి తగ్గుట, జ్వరం, అతి నీరసం, ఒళ్ళు కొయ్యబారిపోవుట, జల్లిరోగము కనిపిస్తాయి. మలద్వారం నుండి మాంసం కడిగిన నీటిని పోలిన ద్రవం కారుతుంటుంది.

తడిమొలలు పిత్త దోషం వల్ల వస్తాయి. ఇవి చింతపండు రంగులో వుండి వాచుట, పగులుట చేస్తాయి. వాత మొలలు పొడిగా గరుగ్గా వుంటాయి.ఎఱ్ఱగా గాని జేగురు రంగులో గాని వుంటాయి. ఇవి ఏ ఆకారంలోనైనా వుండవచ్చు. పగుళ్ళు వేసినట్లు కనిపిస్తాయి. ఖర్జూర, కర్కంధు, కర్పాస పిక్కల రంగులో కూడ ఉంటాయి. కదంబ పుష్ప వర్ణంలోనూ తెల్ల ఆవాల రంగులోనూ కూడా వుండవచ్చు.

ఈ రోగం పెరుగుతున్నకొద్దీ శరీరం, గోళ్ళు, మలం, మూత్రం, కనులు, ముఖము నల్లబడుతూ వుంటాయి. వాపు, గుండ్రంగా వుండి, జారి పడుతున్నట్లున్న పెద్ద పొక్కులు, మల విసర్జనలో విపరీతమైన శ్రమ, బాధ వస్తాయి. (ఈ పొక్కులను అష్ఠీలలంటారు)

పిత్త దోషం వల్ల వచ్చే మొలలు మొదట్లో నీలం రంగులో వుంటాయి. పోను పోను ఎఱ్ఱగా, నలుపు ఎరుపు కలిసిన రంగులోకి వస్తాయి. వాటినుండి అరుణవర్ణంలో పలచగా వున్న ద్రవం కారుతుంటుంది. పచ్చిమాంసపు వాసనను వెలువరుస్తుంటాయి. మెత్తగా తగులుతాయి. వాటిలో కొన్ని చిలుక నాలుకలాగా, జలగ నోటిలాగా వుంటాయి. విరేచనం అజీర్ణంగా, పలచగా, ద్రవరూపంలో, ఎరుపు పసుపు నలుపు కలిపిన రంగులో అవుతుంది. ఈ మొలలు బార్లీ గింజల్లా మధ్యలో దళసరిగా వుంటాయి. చర్మం, గోళ్ళు ఆకుపచ్చ లేదా పసుపు రంగుల్లోకి వస్తాయి.

కఫం దోషం కారణంగా వచ్చే మొలలు బాగా లోపలికి వేళ్ళూనుకొని వుంటాయి. దళసరిగా వుంటాయి. నొప్పి మిగతా రకాల కన్న తక్కువ పెడతాయి. తెల్లగా వుండి, కుళ్ళినట్లు కనిపిస్తూ, గుండ్రంగా, నున్నగా, నిటారుగా వుంటాయి.ఆవుపొదుగులా, వెదురు కొమ్మలా, జీడిపిక్కలా ఉంటాయి. దురద పుట్టిస్తాయి. గోక్కుంటే గొప్ప హాయిగా వుంటుంది. తొడల సంధుల్లో నొప్పి, గుదంలో, మూత్ర కోశంలో, బొడ్డులో కూడా నొప్పి మొదలవుతుంది. శ్వాసలో ఇబ్బంది, పడిశం, దగ్గు, గుండెలో అశాంతి, చొంగకారడం, అన్నం సహించకపోవడం మున్నగు లక్షణాలు క్రమేపీ బయటపడతాయి.

మూత్ర విసర్జన కష్టతరమౌతుంది. ఆలోచించడానికి కూడా బద్ధకమేర్పడి తలదిమ్మెక్కిపోతుంది. చలి, శరీరంలో కుదుపు కలుగుతాయి. అన్ని రకాల సామర్థ్యమూ కొరవడుతుంది. ఏంతిన్నా ఒకంతట అరగదు. వాంతులు మున్నగు అజీర్ణ సంబంధ రోగాలన్నీ వచ్చి పడతాయి. విరేచనం మసిరంగులోకి వచ్చేస్తుంది. చీము పడుతుంది. మొలలు పగలవు, రక్తం కూడా కారదు. కాని చికాకుపెడతాయి. చర్మం బూడిద రంగును పులుముకున్నట్లయిపోతుంది. మరీ నున్నగా కూడా అయిపోతుంది.

మూడుదోషాలూ కలిసిన మొలల లక్షణాలు ఇలా వుంటాయి. రక్తంలో మాలిన్యాలున్న వారిలో పిత్త దోష లక్షణాలన్నీ కనిపిస్తాయి. మొలలు మఱ్ఱి లేదా గంజాయి చిగురుల్లా వుంటాయి. మలం గట్టిగా వేడిగా రోగగ్రస్తమై వుంటుంది. రక్తహీనత వల్ల వచ్చే రోగలక్షణాలన్నీ ఈ మొలల రోగిలో కూడా కనిపిస్తాయి. విరేచనాలు ఎక్కువై ఒక్కొక్కసారి ధారాపాతంగా రక్తంపోతుంది. శరీరం కప్పతోలు రంగులోకి వస్తుంది.

రోగి శరీర వర్ణాన్నీ, బలాన్నీ, బుద్ధి నిలకడనీ కోల్పోతాడు. శరీరంలోని ముఖ్య చర్యలు పాడవుతాయి. జ్ఞానేంద్రియాలు సక్రమంగా పనిచేయవు. గట్టి అనగా అరుగుట కష్టమైన ఆహారాన్ని ఆరగించడం వలన వాయువు ఎక్కువగా గుహ్య ప్రాంతంలో రేగిపోయి క్రిందికి వస్తున్న నాళాలను అడ్డుకుంటుంది. మొత్తం వ్యర్థ పదార్థాలన్నిటినీ పొడిగా, గట్టిగా మార్చేస్తుంది. మలమూత్రాలలోని తేమను హరించి వేసి రోగిని పరమ ప్రమాదకర స్థితిలోకి నెట్టివేస్తుంది. దానివల్ల నడుము, వీపు, ఛాతీప్రాంతాల్లో భరింపరాని నొప్పికి వ్యక్తి గురౌతాడు. మహోదరం, మలం ఒకే చోట ఉండిపోవడం, శూలనొప్పి, మూత్రాశయంలో బాధ, బుగ్గలు లోపలికి నొక్కుకు పోవడం జరుగుతాయి.

వాతదోషంలో వాయువు పైకి అంటే క్రింది భాగాలలో నుండవలసిన వాయువు శరీరంపై భాగాలలోకి పయనించడం వల్ల వాంతులు, అన్నంపై విరక్తి జ్వరం, గుండె భాగంలో దడ, నీళ్ళ విరేచనాలు, నులుగడుపు, మూత్రం అణచబడుట సంభవిస్తాయి. దాహం, తలనొప్పి, పడిశం, ప్లీహవ్యాకోచం కలుగుతాయి. చెవులు పనిచేయడం తగ్గుతుంది. ఈ వాతదోషాల వల్ల మరణం సంభవించవచ్చు. వాతమొలలు అతి ప్రమాదకరం. వీటిని తగ్గించడం జరుగుతుందే కాని నిర్మూలన సాధ్యం కాదు.

రెండు ప్రకోపాల వచ్చే మొలలను వెంటనే పోల్చి మందు వేస్తే ప్రయోజన ముంటుంది గాని ఒకయేడాది దాటితే మాత్రం నయం చేయడం అసాధ్యం. బాహ్య గుహ్యాకాలయిన మొలలు ఏదో ఒక దోషం వల్ల యేర్పడితే, వెంటనే అయితే, సులభంగానే వాటిని నిర్మూలించవచ్చు.

జననేంద్రియం పైగాని, బొడ్డులోగాని పుట్టే మొలలు కూడా వుంటాయి. అలాగే వ్యానమను పేరు గల వాయువులో తేడాలో చర్మంపై కూడా పుట్టుకొస్తాయి. ఆహార నియమాలను క్రమం తప్పకుండా పాటించేవారికి ఇవి తగ్గిపోయే అవకాశం ఎక్కువ. వైద్యునికి రోగి పూర్తిగా సహకరించాలి.

మొలలలో గరుకుదనం, పొడిచినట్లు పోటమరించడం వాతదోషం, మొనల్లో నలుపు పిత్త ప్రకోపం, రంగులు,నున్నన, మెత్తన కఫరోగం లక్షణాలు. ***(అధ్యాయం-156)***

# అతిసార గ్రహణి రోగాలు

శుశ్రుతా! నిజానికి అతిసార, గ్రహణిరోగాలు రెండూ నీళ్ళ విరేచనాలకి పెట్టబడిన పేర్లే. ఇవి ఆరు రకాలుగా వుంటాయి. త్రిదోషాలూ ఒక్కొక్కటిగానూ అంటే విడివిడిగానూ కలివిడిగానూ నాలుగు రకాలౌతాయి. భయం, దుఃఖం ఉత్పత్తి చేసే రకాలు రెండు.

నీటిని గాని ఇతర పానీయాలను గాని అతిగా తాగెయ్యడం ఈ జబ్బులకి సాధారణ కారణం. వాతం విచక్షణ రహితంగా తినే తిండి వల్లా, కొవ్వు వల్లా, వేపుడు వల్లా, పులుపు (మసాలా) ఘాటువల్లా, కొన్ని మొక్కల రెమ్మలు, గింజలవల్లా, సారా వల్లా, పగటి నిద్రవల్లా, మలమూత్రాలను బలవంతంగా ఆపడం వల్లా ప్రకోపించి వీటిని తెస్తుంది. వాయు ప్రకోపం వల్ల రక్తం శరీరంలోని క్రింది భాగాలకు అతిగా ప్రసరణంగావించి జఠరాగ్నిని ఆర్పేస్తుంది. తరువాత జీర్ణవ్యవస్థ అంతర్భాగంలో ప్రవేశించి ఆహారాన్ని మలాన్నీ కూడా పలచగా, ద్రవంలాగ చేసి పారేస్తుంది. ఛాతీనొప్పి, మలద్వారంలో బాధ, శరీరంలోపలి నుండి కముకు దెబ్బలు తిన్నట్టు నొప్పులు ఒకేసారి శరీరం పై దాడిచేస్తే ఈ రోగం వచ్చేసిందని పోల్చవచ్చు.

కడుపును నొక్కితే కొన్నిచోట్ల గట్టిగానూ, కొన్నిచోట్ల లోతుగా, మెత్తగానూ తగులుట, అజీర్ణము ఈ రోగలక్షణాలు. జ్వరం వుండదు. మలం చాలతక్కువగా పడుతుంది. అది కూడా ఎన్నో అవరోధాలను దాటుకొని వస్తున్నట్లు కష్టంగా పడుతుంది. ధ్వని వుండదు. వాత ప్రకోప లక్షణాలివి. ఇంకా మలం గట్టిగా జిగటగా బుడగలతో నుండుట, మలద్వారానికి కొంచెం పైన వుండే మాంసల ప్రదేశంలో మంట, కోసినట్లుండి నీళ్ళు తగిలితే మంట, ద్వారం మూసుకుపోయినట్లయి అతి కష్టం మీద తెఆచుకొనుట, ఒళ్ళు తఆచు గగుర్పాటుకు లోనగుట కూడా వాత దోష ప్రకోపజన్య అతిసార, గ్రహణి లక్షణాలే.

పిత్తజమైన అతిసారంలో మలం పచ్చగా, నల్లగా, చింతపండు రంగులో లేదా పచ్చగడ్డి రంగులో రక్తమిళితమై వుంటుంది. కంపు ఎక్కువగా వుంటుంది. రోగి అతి దాహంతో మందాగ్ని పీడతో, తల తిరుగుడు, మూర్ఛలతో బాధ పడుతుంటాడు. కడుపు నుండి మలం ద్వారా దాకా మండుతున్నట్లుంటుంది.

కఫదోషం వల్ల వచ్చే అతిసారంలో మలద్వారం వద్ద నొప్పి, మంట పెద్దగానే వుంటాయి. మలం దళసరిగా అంటే చిక్కగా, తక్కువగా, ఆగకుంగా కొంచెంగానే పడి ఆగిపోతుంది.

మూడుదోషాలూ కలిపివుండే అతిసారంలో పై లక్షణాలన్నీ దశలవారీగా బయట పడుతుంటాయి. గగుర్పాటు, భరింపలేనంత నొప్పి, మూత్రాశయం, కడుపు గుహ్యం బరువెక్కిపోతుండుట, తెలివి తప్పదు కానీ చేసిన పని చేయలేదనుకొనేటంత మఱపు కమ్ముకొనుట కూడా జరుగుతాయి.

భయం వల్ల ఈ రోగం వస్తే రోగి పడుకొని వుండగానే విరేచనమైపోతుంది. వాయవు ద్రవంగా మారి ప్రవాహంగా బయటకొస్తుంది. దుఃఖం వల్ల వచ్చే ఈ రోగంలో వాత, పిత్త ప్రకోపాలు కలిసిన లక్షణాలు కనిపిస్తాయి.

స్థూలంగా అతిసారం రెండు విధాలు. అవి సామ(చీముగలవి) నిరామ(చీము లేనివి) మొదటిరకంలో కంపు దారుణంగా వుంటుంది. మలంద్వారం వాచిపోయి విసర్జకాన్ని అడ్డుతుంటుంది. చొంగ కారుతుంటుంది.(నోరు) నిరామ రకంలో దీనికి వ్యతిరేక లక్షణాలుంటాయి.

అతిసారను సకాలంలో నిరోధించకుంటే అది ప్రమాదించి, ముదిరి గ్రహణి అవుతుంది. వాతజగ్రహణి వచ్చినవారికి గుండెదడ, ప్లీహవాపు, మొలలు, కామెర్లు, మతిపోవుట, శబ్దంతో నిర్గమించే ఆవిరుల జిగట, గట్టి, పొడి మలం, వెక్కిళ్ళు, ఊపిరందక పోవుట, తఱచు విరేచనమగుట అను లక్షణాలు కనిపిస్తాయి.

పిత్తజ గ్రహణిలో విరేచనం పసుపు పచ్చగా లేదా నీలం కలిసిన పసుపు రంగులో, పలచగా వుంటుంది. ఆమ్లపు పొక్కులు, గుండె, గొంతుల్లో మంటలు, అన్నద్వేషం, బాగా దప్పిక వుంటాయి.

కఫం ప్రకోపించడం వల్ల వచ్చే గ్రహణిలో అరుగుదల సమస్యా, మలం పోయినపుడు నొప్పి, వాంతులు, అన్నంగాని మరే ఆహారం గాని సహించకపోవడం, నోటిమంట మాటిమాటికి ఉమ్ముఊరడం, దగ్గు, చిరాకు, పడిశం, గుండె బరువు, కడుపుబ్బు, తీపిత్రేన్పు, బద్ధకం, రోమాంచము అనే లక్షణాలుంటాయి. ఇంకా, సన్నిపాత గ్రహణిలో, మలం చిక్కగా, ముక్కలుగా పడుట, మనిషి దుక్కగా వున్నా బలహీనంగానే కనబడుట కూడా జరుగుతాయి.

***గ్రహణిని కుదుర్చుట అసాధ్యము***
***తచ్ఛాంతిని చేయవచ్చు*** ***(అధ్యాయం -157)***

# మూత్ర ఘూత నిదానం

సుశ్రుతా! వస్తి, వస్తిశిరం, మేఢ్రం, కటి, వృషణములు, గుదము – ఈ ఆరు శరీరభాగాలూ ఒకదానికొకటి సంబంధితములై, ముడివడియుంటాయి. మూత్రకోశం క్రిందికి వంగి వున్నా ఎపుడూ నిండుగానే వుంటుంది. దానిలోకి ఎన్నో చిన్న చిన్న నాళాలు ద్రవాలను తెచ్చి నిరంతరం ఒంపుతునే వుంటాయి. ఈ ద్రవాలలో త్రిదోషాలు ప్రవేశిస్తే ఇరవై రకాల రోగాలొస్తాయి.

మూత్రఘాతం (మూత్రం తొక్కిపట్టబడుట) మధుమేహం పైన చెప్ప ఆరు విశిష్ట భాగాలలో దేనికి సోకినా అన్నీ చెడతాయి. వాతరోగమైతే మూత్రం తక్కువగా వస్తుంది గాని పోస్తున్నంతసేపూ లింగభాగం నొప్పెడుతునే వుంటుంది. పిత్త దోషమైతే పచ్చగా వచ్చే మూత్రం లింగనాళాన్ని మండిస్తుంది. పోస్తున్నంతసేపూ మంటగానే వుంటుంది. కఫప్రకోపంలో మూత్రం ఎఱ్ఱగా వుంటుంది. లింగం బరువెక్కినట్టుంటుంది. వాపు వుంటుంది.

త్రిదోషాలూ కలిపి వుంటే మూత్రం మెరుపుతో కూడిన పసుపు రంగులో జారుతుంది. వాయువు మూత్రకోశ ద్వారాన్ని తిప్పి వైచి ఎండిపోయేలా చేస్తుంది. పిత్త, కఫాలూ, వీర్యమూ మూత్రంతో కలిసి ఒక గట్టి ముద్దలాగ ఏర్పడతాయి. ఇది గోరోచనంలా వుంటుంది.

అశ్మరీ లేదా గోరోజనమను పేరు గల భయంకర రోగంలో కఫ ప్రకోపానిదే ప్రధానపాత్ర. మొదట్లో కనిపించే లక్షణాలు మూత్రకోశం వాపు, ఆ ప్రాంతమంతటా భరింపలేనినొప్పి.

మూత్రం దానికోశంలోనే నిరోధింపబడడంతో మూత్ర విసర్జనం యాతన పూరితమవుతుంది. జ్వరం, ఆహారం పట్ల విరక్తి కలుగుతాయి. బొడ్డు భాగంలో వెనుకవైపూ మూత్రాశయంలోనూ నొప్పులు పెరుగుతాయి. మూత్రం పడినపుడు స్వచ్ఛంగా ముత్యం రంగులోనే వుంటుంది. కాని గొప్ప నొప్పి పుడుతుంది. ఎప్పటికీ రావటం లేదని బలవంతాన పోస్తే రక్తం, మాంసం బయటికి వచ్చి మరీ ఎక్కువ నొప్పి వస్తుంది. వాతజదోషం వుంటే రోగి పళ్ళు పటపట కొరుకుతుంటాడు, కుదుపుకీ లోనౌతాడు. మూత్రం తఱచుగా చుక్కలు చుక్కలుగా పడుతుంది. మలం వాయు సహితమై పడుతుంటుంది. పిత్తదోషం వల్ల మూత్రాశయంలో మంట పుడుతున్నట్లుంటుంది. ఉడకబెడుతున్నట్లు వేడిగా వుంటుంది.

కఫ దోషం వుంటే అది బరువెక్కిపోయి చల్లగా తగులుతుంది. గోరోజనం చిన్నపిల్లల్లో ఎక్కువగా కనిపిస్తుంటుంది. దీనిని నిర్మూలించడం సులభమే.

ఇంకా మూత్రానికి సంబంధించి శుక్రాశ్మరి, శర్కర, వాతవస్తి, వాతష్ఠిల, వాతష్ఠిల, వాత కుండలిక, ఉష్ణవాత, మూత్రక్షయ, మూత్రసాద అను పేళ్ళు గల రోగాలుకూడా ఉన్నాయి. వీటిలో కొన్ని వీర్య సంబంధమైనవి. వీటిని కుదర్చడం సాధ్యమే.

*(అధ్యాయం - 158)*

# ప్రమేహ రోగ నిదానం

**ప్రమేహ** శబ్దానికి మోతీలాల్ బనారసీదాస్ ప్రకాశకులు ప్రచురించిన గరుడ పురాణంలో డయాబిటిస్ అనే అర్థం ఈయబడింది. ఈ గ్రంథంలో చక్కెరవ్యాధి అని కూడ వాడడం జరిగింది.

ప్రమేహ లేదా చక్కెర వ్యాధిలో ఇరవై రకాలున్నాయి. వీటిలో పది కఫ దోషం వల్ల, ఆరు పిత్త ప్రకోపం వల్ల నాలుగు వాత భేదం వల్ల వస్తాయి. కొవ్వు, మూత్రం, శ్లేష్మం వీటికి మూలాలౌతాయి. మూత్ర విసర్జన బట్టి రోగం పేరు ఉంటుంది.

- ★ మలం వేడిగావుండి మూత్రం చింతపండు రంగులో యేలాం చేప వాసన వేస్తుంది **హరిద్రమేహ**
- ★ ఎరుపు వాకతో పసుపు పచ్చరంగు మూత్రం **మంజిష్ఠమేహ**
- ★ మాంసం వాసనతో ఎట్టటి లవణాలతో ఎట్టటి రంగులోనే మూత్రం **రక్తమేహ**
- ★ తఱచుగా పడుతూ కొవ్వుతో కలసి జారుతూ కొవ్వు రంగులోనే మూత్రం **వసామేహ**
- ★ మూలగతో కలిసి పడుతూ అదే రంగులో వుండే మూత్రం **మజ్జమేహ**
- ★ ధారాపాతంగా పడుతూ జిగటగా వుండే చీముతో కలిసిజారే మూత్రం **హస్తిమేహ**

మధుమేహ రోగి మూత్రం తేనె రంగులో వుంటుంది. ఈ మేహం రెండు రకాలు. ధాతువుల తగ్గుదల వల్ల ప్రకోపించిన సర్వవాయు (వాత)దోషం వల్ల మూత్ర మార్గం నిరోధింపబడుతుంది. రోగలక్షణాలు కొన్నాళ్ళు పుష్కలంగా కనిపించడం కొన్నాళ్లు అసలు కనిపించకపోవడం, మరల కొన్నాళ్ళకు కనిపించడం అనగా బయటపడడం జరుగు తుంటుంది. దీనికి కారణం మాత్రం కనిపింపదు. కానీ రోగం మాత్రం ప్రమాదకరస్థాయిని చేరుకొంటుంది.

ప్రమేహ వ్యాధులన్నీ, నిర్లక్ష్యం చేస్తే మధుమేహంగా పరిణమిస్తాయి. మధుమేహం అంటేనే పూర్తిగా కుదరనిదని సూచన. ప్రమేహంలో ఏ విభాగంలోనైనా విసర్జనాలు తేనెలాగుండి తీపి వాసన వస్తుంటే మధుమేహం వచ్చేసిందని భావించవచ్చు.

కఫ దోష జనిత మేహ వ్యాధుల లక్షణాలలో ముందుగా అజీర్ణం, అరుచి, ఆహార నిరాసక్తత, వాంతులు, ఎప్పుడూ నిద్రవస్తున్నట్లే మగతగా వుండడం,దగ్గు, పడిశం బయట పడతాయి. అదే పిత్త జన్యమైతే మూత్రకోశంలోనూ దానికి కాస్త పైనా పీకుతున్నట్లుండడం, వృషణాలలో ఉబ్బు, వాపు, జ్వరం, శరీరమంతా మండు తున్నట్లుండుట, దప్పిక, పుల్ల త్రేన్పులు, మూర్ఛ, మలద్వారము జారినట్లుండుట అనే లక్షణాలు బయటపడతాయి.

వాత దోషజన్యమైన మేహంలో ఈ క్రింది లక్షణాలుంటాయి. ఉదావర్తం (గుద స్థానభ్రంశం) కంపము, గుండెనొప్పి ఘాటైన రుచులకోసం వెంపర్లాట, నిద్రలేమి, పడిశం, దగ్గు.

బయటికి తేలకుండా వుండే పుండ్ల ద్వారా పదిరకాల ముదిరిన ప్రమేహాలను ఈపేర్లతో గుర్తించారు. శరావిక, కచ్ఛపిక, జ్వాలిని, వినత, అలజి, మసూరిక, సర్షపిక, పుత్రిణి, విదారిక, విద్రధి.

ఈ రోగానికి కఫదోషంతో బాటు అపసవ్యమైన ఆహారం మూలకారణం. మరో కారణం సారాయి. మూత్రాశయంలో చేరిన హానికారక కఫం ముందుగా శరీరంలో జరిగే నిత్యకార్యక్రమాలకు అవరోధాలు కలిగిస్తుంది. చెమట, మాంసం, కొవ్వు, ద్రవాలు, రసాలు అన్నీ చెడడం మొదలుకాగానే 'ప్రమేహం' పుట్టుకొస్తుంది. కఫం క్షీణం కాగానే వాయువు మూత్ర సహిత పిత్తాన్నీ రకాన్నీ, ధాతువులనూ వస్తి భాగంలోకి గొనివచ్చి సర్వనాశనాన్ని సృష్టిస్తుంది. దీనివల్లనే సాధ్య,అసాధ్య నివారణలు గల చక్కెర వ్యాధులన్నీ ఏర్పడుతున్నాయి. మనిషి శరీరానికి చక్కెర చాలా అవసరం. కాని అది అదుపులో నున్నంత కాలమే శరీరానికి ఉపయోగపడుతుంది. కఫం, వాతం, పిత్తం సమపాళ్ళలో నున్నంతకాలం చక్కెర అద్భుతంగా పనిచేస్తుంది.

కూర్చునే ఆసనంలోనే అడ్డదిడ్డంగా శయనించే అలవాటున్న వారికి చక్కెర వ్యాధి వస్తుంది.

*ఈ వ్యాధిలో మరికొన్ని పేర్లు, లక్షణాలు చూద్దాం.*

★ స్వచ్ఛంగా చల్లగా, వాసన లేకుండా అధికంగా, నీటివలెనుండు మూత్రం

**ఉదకమేహ**

★ తీపి వాసనతో, తేనెలాగాని, చెఱకు రసంవలె గానీ జారిపడు అధికమూత్రం

**ఇక్షుమేహ**

★ చిక్కగా వరిగంజివలె జారు మూత్రం **సాంద్రమేహ**

★ మద్యం వలె పారదర్శకంగా జారుతూ చివరలో మాత్రం ముద్దగా పడే మూత్రం **సురామేహ**

★ ఉడికిన అన్నం ముద్ద రంగులో మరీ తెల్లగా జారే అధిక మూత్రం విసర్జన సమయంలో ఒళ్ళంతటా గగుర్పాటు **పిష్టమేహ**

★ మూత్రంతో బాటు అధిక పరిమాణంలో వీర్యం కూడా పడుట, వీర్యం రంగు మూత్రం **శుక్రమేహ**

★ మూత్రంతో బాటు ఇసుకరేణువుల వంటి అణువులుజారుట – సికతమేహ

★ చల్లటి, తీపి వాసనతో జారు అధికమూత్రం **శితమేహ**

★ నెమ్మదిగా ఆగుతూ ఆగుతూ జారే మూత్రం **శనైర్మేహ**

★ జిగటగా, ఉమ్మివలె, ముక్కలుగా జారే మూత్రం **లాలామేహ**

★ అన్నివిధాల లవణజలాన్ని పోలిన మూత్రం **క్షారమేహ**

★ అన్నివిధాల నీలంగా వుండే మూత్రం **నీలమేహ**

★ అన్ని విధాల నల్లగా వుండే మూత్రం **కాలమేహ**

ఇదివఱకు చెప్పబడిన చక్కెర పుండ్లపేర్లలోనే పైనున్న మూత్రం లాగే లక్షణాలు నిక్షిప్తమై వుంటాయి. అవే కాక పిత్త దోషం వల్ల అకస్మాత్తుగా ఏర్పడునవి కొన్ని. కొవ్వు ఎక్కువైనా కూడా పుండ్లు పుట్టుకురావచ్చు.

మూత్రం ఎఱ్ఱగానో, చింతపండు కడిగిన నీటిరంగులోనో వచ్చినంత మాత్రాన చక్కెరవ్యాధి సోకిందని నిశ్చయానికి రాలేము. మిగతా లక్షణాలేవీ లేకపోతే ఆ వ్యక్తికి రక్తపిత్తరోగం తగిలిందని అర్థం చేసుకోవాలి.

అతిస్వేదం, కాలుసేతుల దుర్వాసన, బద్ధకం, అంగాలు జారిపోయినట్లుండుట, నిరంతరం పడుకోవాలనే కోరిక, తిండి యావమీరుట, ఛాతీలో, కన్నుల్లో నాలుక చివర, చెవులలో సన్నని మంటలు రేగుట, పెదవులు బిరుసెక్కుట, తలవెంట్రుకలు, గోళ్ళు దళసరిగా, అతిగా పెరుగుట, చల్లని పదార్థాలనే తినాలనో తాగాలనో అనిపించుట, గొంతు, నోరు బీటలు వేసినట్లనిపించుట, అరికాళ్ళు, అరచేతులు మండుట ఇవన్నీ ప్రమేహ లక్షణాలే.

రోగి విసర్జించిన మూత్రానికి చీమలుపట్టుట ఒక ప్రధానసూచన. ***(అధ్యాయం–159)***

# విద్రధ, గుల్మనిదానం

నిలవై, పాసిపోయిన మిక్కిలిగా వేడెక్కిన, గరుకైన, సారంలేని, దప్పికను పెంచు ఆహారాన్ని తీసుకోవడం. అసలేవంకరగా నున్న శయ్యపై గాని మరెక్కడ గాని వంకర టింకరగా పడుక్కోవడం అనే స్వయంకృతాపరాధాల వల్ల రక్తాన్ని పాడుచేసే ఆహార విహారాల వల్ల వ్యక్తి దేహంలోని రక్తం కలుషితమై పోతుంది. దీనివల్ల చర్మం, మాంసం, పొట్ట, నరములు, ఎముకలు, మూలుగ ఇవన్నీ రూపుమాసి పోతాయి. రోగం పొట్టలోచేరి అక్కడి నుండి మొత్తం శరీరాన్ని పరిపాలిస్తుంది. అప్పుడు ముఖంపై గాని, నోటిలో గాని చివరకు శరీర బాహ్యాంతరాలలో ఎక్కడైనా గాని విపరీతంగా నొప్పి పెట్టే 'కురుపు' లవుతాయి. ఈ కురుపు లనే ఆయుర్వేదం విద్రధి అని పేర్కొంది.

ఇవి లోపలికీ బయటికీ కూడా చర్మాన్ని బుసబుసపొంగించి సలుపూ, పోటూ పెడతాయి. త్రిదోషాలూ కలివిడిగా గాని విడివిడిగా గాని విద్రధి, గుల్మాలకు కారణం కావచ్చు. వాటినుండి కలుషిత రక్తం బయటికి వస్తుంటుంది. అవి, లోనా బయటా కూడా చీమలపుట్ట లాగా ఎత్తుగా పెరుగుతాయి. జీర్ణవ్యవస్థని చెడగొడతాయి. నాభి ప్రాంతంలోనూ, మూత్రాశయంలోనూ, కాలేయంలోనూ, ప్లీహ, హృదయ, వాయుకోశ, మధ్య, ఊరుసంధి ప్రాంతాల్లోనూ ఎక్కువగా పెరుగుతాయి. గుండెదడ వచ్చినపుడు ఇవి భరింపనశక్యమైన పోటు పెడతాయి.

ఈ విద్రధి పుట్టినపుడు నల్లగా వుండి పగలడానికి ముందుగానీ బాగా చీము పట్టాక గానీ ఎఱ్ఱగా తయారవుతుంది. దీని వల్ల కొందరికి కొన్ని రోగ లక్షణాలూ మరికొందరికి ఇతరములైన రోగలక్షణాలూ బయటపడతాయి. వీటివల్ల కొందరికి తెలివి తప్పవచ్చు. కొందరికి తల తిరగవచ్చు లేదా  మూత్రం ఆగిపోవచ్చు, పెద్ద ధ్వనితో అన్నీ కదలవచ్చు.

పిత్త జన్యవిద్రధి ఎఱ్ఱగా,రాగిరంగులో లేదా నల్లగా వుంటుంది.జ్వరం,దాహం, స్పృహ తప్పిపడిపోవడం, మంట మున్నగు రుగ్మతలను కలిగిస్తుంది. కఫ జన్యమైతే పుట్టడం, చీము పట్టడం చాలా వేగంగా జరుగుతాయి. ఈ పొక్కులు కొంచెము తెలుపులో నుండి, దురద బాగా పెడతాయి. వణకు, ముట్టుకుంటే మంచులా చల్లగా తగులుట, విద్రధి గలచోట తిమ్మిరెక్కుట, ఆవులింతలు, అరుచి, ఒళ్ళు బరువెక్కుట కూడా జరుగుతాయి.

సన్నిపాత విద్రధి పెరుగుటకు చితుకుటకు కూడా చిరకాలం తీసుకుంటుంది. విషమంగా వుంటుంది.

బాహ్యాంతరిక రకాల్లో కూడా రోగికి గట్టి విరేచనం కాదు. కురుపు నల్లబడి దానిచుట్టూ మరిన్ని చిన చిన్న పొక్కులేర్పడి అన్నీ దురదా, సలుపూ, పోటూ పెడుతుంటాయి. చివరలో మంట పుడుతుంది. జ్వరం వస్తుంది.

కలుషిత రక్తం వల్ల ఏర్పడు బాహ్య విద్రధి పిత్త దోషం వల్ల పుడుతుంది. కొన్ని కురుపులు దెబ్బ తగలడం వల్ల కూడా పుడతాయి. ఈ దెబ్బ వల్ల వచ్చే గాయంలో నున్న రక్తం వాత దోషం వల్ల అక్కడ చేరి పిత్తాన్ని ప్రకోపింపచేయడంతో తీవ్రంగా బాధించే విద్రధులేర్పడతాయి.

బాధలలో గాని రోగాల్లో గాని తేడాలు విద్రధి పుట్టిన ప్రాంతాన్ని బట్టి వుంటాయి. బొడ్డు ప్రాంతంలో వచ్చే రోగం నీరు కట్టు రోగాన్ని తెస్తుంది. ప్లీహ ప్రాంతంలోని రుగ్మత శ్వాస కార్యంలో అవరోధాలను కల్పిస్తుంది. తీవ్ర దాహమునూ తెప్పిస్తుంది. ఊపిరితిత్తుల లోని విద్రధి గొంతులో అడ్డంకులనూ,గుండెలోనిది శరీరమంతటానొప్పులనూ కలిగిస్తాయి. నడుము, దాని పక్కలలోని కురుపు అక్కడ తిమ్మిరినీ, తమక శ్వాసమనే పడిశభేదాన్నీ, దబ్బనంతో గుండెను తవ్వుతున్నట్లుండే నొప్పినీ... సూది గుచ్చుతున్నట్లున్న గుండె నొప్పినీ సృష్టిస్తుంది. తొడల సందుల్లోగాని, పిఱ్ఱలపై గానీ, వెన్నుపై గానీ లోపలికైనా బయటికైనా పుట్టుకొచ్చే ఈ పొక్కు వల్ల పక్కల్లో నొప్పితో బాటు గుదంలో అడ్డంకీ ఏర్పడుతుంది.

చర్మంపైనే కాకుండా లోపలికి కూడా ఈ చక్కెర కురుపులుంటాయి. అవీ పెరుగు తాయి. చీము పట్టి పగులుతాయి. ఆ చీము బొడ్డు పైకి వుండే కురుపులకైతే నోటి నుండీ ఇతరాలకు గుదం నుండీ బయటకి వస్తుంది.

ప్రకోపితమై వాయువు దాని మార్గంలో అడ్డంకి తగిలినపుడు అంగాల వద్ద వాపుని కలిగిస్తుంది. మలనాళంకీ తొడల సందులకీ మధ్య గల నరాల గిన్నెను చేరి వృషణాలను దాటి పోతూ వాటిపై ఒత్తిడిని కలుగజేయడంతో అవి వాచిపోతాయి. ఇలాటి వరిబీజ రుగ్మతలు ఏడు రకాలుగా వుంటాయి.

ఈ దశలోనే వరిబీజాన్ని తగ్గించుకోవాలి. నిర్లక్ష్యం చేస్తే అది ఇక కుదరదు.

ఈ వరిబీజాన్నే వృద్ధి అని కూడా అంటారు. ఇది నిర్లక్ష్యం చేయబడితే గుల్మంగా మారుతుంది. గుల్మమనగా ప్లీహాదుల వ్యాకోచము. అది అజీర్ణము వంటి ఎన్నో వ్యాధులను సృజిస్తుంది. గుల్మాన్ని గట్టిగా నొక్కితే శబ్దాలు చేస్తూ అణగిపోతుంది. కాని కాసేపట్లోనే మరల యథాస్థాయికి చేరుకుంటుంది.

రక్తవృద్ధి (ఇదొక వృషణ రుగ్మత పేరు) నయం కాదు. వాతవృద్ధి అదే పరిమాణంలో కొనసాగుతూ, ఎఱ్ఱగా నీలంగా వుండే రక్తనాళాలు కనిపిస్తుండగా వుంటుంది. త్రిదోషాల

ప్రకోపాలను బట్టి ఈ వృద్ధి కురుపులలో ఏడు రకాలుంటాయి. ఎనిమిదవది స్త్రీలలో కనిపిస్తుంది.

జ్వరం, విరేచనాలు, వాంతులు, చలి, ఆకలి ఎంత బలవంతునైనా వంచి పారేస్తాయి. చీపురుపుల్లలా చేసేస్తాయి. అందుచేత అందరమూ ఆహార నియమాల విషయంలో, సరదాలవిషయంలోజాగ్రత్తగా వుండాలి.ఎక్కువ ఉడికిన అన్నాన్ని తిన్నా,అతిగా ఉపవాసాలు చేసినా, స్నానాలు చేసినా, అతిగా నీటితో సహా ఏది తాగినా తల తిరుగుతుంది. తెలివి తప్పుతుంది. కాబట్టి ఎందులోనూ అతి పనికిరాదు.

మితిని మించిన హితము లేదు.

విరేచనాదులను తగ్గించడానికి ప్రయత్నం చేస్తూనే మూలదోషమేంటో జాగ్రత్తగా పరిశీలించాలి.

వాతజ వృద్ధిలో వాయువు రోగి శరీరంలోని కలుషిత భాగాలతో కలిసి రోగాన్ని వృద్ధి చేస్తుంది. కాబట్టి వాటిని విడివిడిగా గాని కలిపి గాని అదుపు చేయాలి. వాయువు రక్తంతో కలిసి దానిని నాళాలలో సవ్యంగా ప్రవహించనీయకుండా అడ్డుకోవడం వల్ల శరీరంపై పొక్కులు కురుపులు ఏర్పడి ఆ గాలిలోపలి నుండి తన్నుకు వచ్చినపుడల్లా నొప్పెడతాయి. ఈ గుల్మాలు చర్మానికి లోపలివైపున్నా కూడా వైద్యుని స్పర్శకు తగులుతాయి. ఆ ప్రాంతం కాస్త వేడిగా కూడా వుంటుంది.

కఫజ గుల్మ రోగంలో స్తైమిత్యం, అరుచి, తలనొప్పి, సర్వాంగాలలో శైథిల్యం, శీత జ్వరం, మూర్ఛ, చెమట, దాహం, జ్వరం అనే లక్షణాలు బయట పడతాయి.

త్రిదోష జన్య గుల్మ రోగంలో ఈ లక్షణాలన్నీ కనబడవచ్చు. అంతేకాక తీవ్రవేదన, అతిశయించిన దప్పిక వుంటాయి. ఇది కుదరడం కష్టం.

దుష్ట రక్తం, దుష్టాశ్రయం వల్ల వస్తాయి కాబట్టి విద్రధి గుల్మాలు సవ్యంగా స్థిరంగా వుండవు. కొన్ని వేగమే పగులుతాయి. కొన్ని ఆలసిస్తాయి, కొన్ని పగలవు. అంతరాశ్రయ (చర్మంలోపలికున్న)గుల్మాల వల్ల, వస్తి, కుక్షి, గుండె ప్లీహాలలో నొప్పి వుంటుంది. జఠరాగ్ని, ఒంట్లో సత్తువ నశిస్తాయి. మల మూత్రాల చలనం మందగిస్తుంది. బహిరాశ్రయ (చర్మంపై నున్న) గుల్మాలున్న వారికి ఈ వేదనలు పెద్దగా బాధించవు గానీ ఉదరంలో తీవ్రవేదన కలుగుతుంది. కురుపున్న చోట శరీరం నల్లబడిపోతుంది. కురుపుకి గాలి సోకినా తీవ్రంగా నొప్పెడుతుంది. ఉదరాధ్మానం లేదా అనాహరోగమని దీనికి పేరు. పైకి వుండి ఎత్తుగా ముడిపడిన కురుపుని అష్ఠీల విద్రధి అంటారు.

వీటిలో కొన్ని కుదరడం అసాధ్యం.

***(అధ్యాయం - 160)***

# ఉదర రోగ నిదానం

మందాగ్ని వల్ల వచ్చే రోగాల్లో ఉదరరోగం ప్రధానమైనది. ఉదరంలో మలం ఉండి పోవడం వల్ల అజీర్ణరోగం పట్టుకుంటుంది. వాయువు దీని వల్ల పైకీ క్రిందికీ స్వేచ్ఛగా పోవడానికి కడ్డంకి ఏర్పడుతుంది. అప్పుడు ప్రవాహిని నాడులన్నీ పనిచేయకుండా ఆగిపోతాయి. ప్రాణాపానాది వాయువులు దూషితాలై మాంస సంధులలో ప్రవేశిస్తాయి. దాంతో కడుపు పనులకు అడ్డంకు లేర్పడి ఉదరవ్యాధులు వస్తాయి. ఇవి ఎనిమిది రకాలు. వాతజ, పిత్తజ, కఫజ, సన్నిపాతజ, సలిలజన్య, ప్లీహజన్య, బద్ధోధరవృద్ధి, క్షతజన్యములు. ఉదరరోగం శరీరంపై దాడి చేయగానే కాలుసేతులు, కడుపు వాచిపోతాయి. తిండి తినాలని వుండకపోవడంతో అది తగ్గిపోయి దానితో బాటు వంట్లో చురుకుదనం, బలం కూడా క్షీణిస్తాయి. రోగి బక్కచిక్కిపోతాడు. పొట్టమాత్రం ఉబ్బిపోతుంది. ఒక విధమైన ప్రేతకళ వచ్చేసి నట్లనిపిస్తుంది రోగిముఖంలో.

ఉదరరోగానికి పూర్వలక్షణాలు ఆకలి నశించడం, అరుచి, జీర్ణసమయంలో దాహం, మంట. దీనికి కారణ వ్యక్తి రోగిగా మారడానికి ముందు చేసే అపథ్యం.

ఉదరరోగం వల్ల బలం క్షీణిస్తుంది. దాని వల్ల చిన్న పనిచేయాల్సి వచ్చినా ఆయాసం వస్తుంది. ఏ పని మీదా బుద్ధి నిలవదు. అక్కడక్కడా కురుపుల వుతుంటాయి. ఏమాత్రం తిన్నా వస్తి సంధులలో నిరంతరం పీడ కలుగుతుంటుంది. రోగి చిన్నవాడైనావృద్ధుని వలె బలహీనుడైపోతాడు. బద్ధకం, నిర్లక్ష్యం, మలవేగం, మందాగ్ని, వాపులు, దాహం, మంట, ఆధ్మానం –ఇవన్నీ జలోదర లక్షణాలు. అన్ని ప్రకారాల జలోదరాలూ మృత్యు కారకాలే.

ఉదర సమస్యలో వాయువు నాభిలోనూ ప్రేగుల్లోనూ స్తబ్ధతను కలుగజేసి గుండె, బొడ్డు, కటి, గుదము, వంక్షణాలలో తీవ్ర బాధను కలిగించి బయటకు పెద్ద శబ్దంతో పోతుంది. స్వల్పంగా మూత్రం కూడా పోతుంది. కాలుసేతులపై, నోటిలో, కడుపులో కురుపులై పోతాయి. నడుము వెనుక భాగం నొప్పెడుతుంది. బొడ్డు క్రింది భాగమంతా బరువెక్కినట్లుంటుంది. కడుపులో నుండి గుడగుడ శబ్దాలు వినిపిస్తుంటాయి. ఇది వాతోదరం.

కఫజనిత ఉదరరోగంలో శరీరం పాలిపోవడం కూడా జరుగుతుంది. త్రిదోషాలూ కలిసి వచ్చే ఉదరరోగంలో ప్లీహం కురుపేసి స్థానభ్రంశం చెందుతుంది. ఈ లక్షణాలన్నింటితో బాటు ఈ ఉదరరోగంలో మూర్ఛ, శూలనొప్పి, కడుపు నల్లనగుట కూడా వుంటాయి. ప్లీహోదరంతో వాత పిత్త కఫములు మూడిటికీ సంబంధముంటుంది.

కుపితమైన అపానవాయువు మల (పురీష) పిత్త, కఫాల దారులనడ్డగించి ఉదర బద్ధ గుదోదర మను పేరు గల రోగాన్ని ఉత్పత్తి చేస్తుంది. దాని వల్ల జ్వరం, దగ్గు, శ్వాస సమస్య, తలలో బొడ్డులో పక్కలలో, గుదంలో నొప్పులూ కలుగుతాయి. కడుపు కదలికలు కోల్పోతుంది. దానిపై రక్త నాళాలు నీలంగా ఎఱ్ఱగా ఒక వలనేర్పాటు చేసినట్లు కనిపిస్తాయి. ఆవుతోక పై నున్నట్లుగా కడుపు పైభాగంలో మలం కనిపిస్తుంది.

అతిగా తినేవారికీ, ఎముకలనూ పాషాణయుక్త ఆహారాన్ని సేవించేవారికీ పురీష నాళమూ, ప్రేగూ పగిలిపోయి దానివల్ల చీమూ మలాలతో బాటు జలం కూడా గుదా మార్గం ద్వారా బయటికి పోతుంది. అది పచ్చగా ఎఱ్ఱగా పురీష గంధయుక్తమై వుంటుంది. ఈ మిశ్రమం కొంత కడుపులోనే దిగబడిపోయి జలోదరాన్ని కలిగించి తరువాత వాతాది దోషాలచే మరల వికృతి చెంది పరిస్రావీఛిద్రోదర మను పేరు గల రోగం వస్తుంది.

మద్యం నుండి నీరు దాకా గల పానీయాలను అతి శీతలంగా నున్న వాటిని అతి మిక్కిలిగా తాగేసే వారికి మందాగ్ని, కడుపులో చీము పుట్టుక ఎక్కువవుతాయి. వాత, కఫాలు ప్రకోపించి నీటి నాళాలను పాడు చేసి దూషిత జలాలను వృద్ధి చేస్తాయి. క్లోమాన్ని కంగారుపెట్టి ఉదరరోగాన్ని సృష్టిస్తాయి. కంపనంతో సహా ఇదివఱకు చెప్పబడిన అన్ని ఉపద్రవాలకూ రోగిని అగ్గలం చేసే ఈ రోగాన్ని ఢకోదరమనీ, ఉదకరోగమనీ అంటారు.

ఉదరరోగాన్ని నిర్లక్ష్యం చేసే అది బాగా పెరిగి చెమటతో సహా అన్ని స్రవంతులనూ ఆపేస్తుంది. జలములన్నీ కడుపులోనే వుండిపోయి అది బాగా ఉబ్బిపోతుంది. ఉదరరోగాల పేళ్ళు క్రమంగా వాతోదరం, పీతోదరం, కఫోదరం, శ్లేష్మోదరం,ప్లీహోదరం, సన్నిపాతోదరం, జలోదరం.ఇవి ఒకదానిని మించి మరొకటి క్రమంగా మనిషిని మృత్యువుకి దగ్గర చేస్తాయి.

ఏ ఉదర రోగానికైనా వేసే మందు పదిహేను రోజుల్లోనే గుణం చూపించాలి. లేకుంటే కష్టమే. ***(అధ్యాయం -161)***

## పాండు - శోథ నిదానం

**పి**త్త, వాత ప్రకోపాల వల్ల ఒక దశలో శరీరంలోని మలిన రక్తనాళాలు,ఇతర మలాలు కూడా ప్రకుపితాలవుతాయి. అపుడు ఈ దశలో పరమ బలవత్తరమైన వాయువు గుండెలోని కెగసి హృదయంలో నుండు పదిధమనులనూ ఆశ్రయంగా చేసుకొని సంపూర్ణ శరీరమంతటా విస్తరిస్తుంది. తరువాత పిత్తాన్నాశ్రయించి శ్లేష్మ, చర్మ, రక్త, మాంసాదులను చెడగొట్టి మలిన రక్తం చర్మానికీ మాంసానికి మధ్య చేరేలా చేస్తుంది. దాని పర్యవసానంగా

చర్మం భిన్నభిన్న వర్ణాల్లోకి మారుతుంది. సహజమైన రంగు పోతుంది. ముందు ఆకుపచ్చగా తరువాత పసుపు పచ్చగా చివరకు లేత పసుపు రంగులో ఒంటి రంగు ఉండిపోతుంది. దీనివల్లనే దీనిని పాండు రోగమన్నారు.

ఈ రోగంలో ధాతు గురుత్వం, స్పర్శ శిథిలతా వుంటాయి. ఆమ్ల జన్య పాండురోగం వల్ల శరీరంలోని సర్వగుణాలూ క్రమంగా నశిస్తాయి. రక్తం క్రమేపీ తగ్గిపోతుంది. మేదా, ఎముకలు నిస్సారమైపోతాయి. అన్ని అంగాల(లో) నూ నిస్సత్తువ ఆవహిస్తుంది. గుండెలో ద్రవాలు చేరుతాయి.కనులు ఉబికి వస్తాయి. నోటిలో లాలాజలమెక్కువ స్రవిస్తుంది. దాహం వెయ్యదు. చల్లటి పదార్థాలపై మక్కువ పెరుగుతుంది. కానీ చల్లదనముపై చిరాకు పెరుగు తుంది. రోమాంచం, మందాగ్ని వుంటాయి. శరీరానికి శక్తి తరిగిపోయి జ్వరం, శ్వాసలో ఇబ్బంది, కర్ణశూల, తలతిరుగుడు వస్తాయి. దీన్ని తెలుగులో 'బొల్లి' అనవచ్చు.

పాండు రోగంలో అయిదురకాలుంటాయి.వాతజ, పిత్తజ, కఫజ, సన్నిపాతజ, మృత్తికా భక్షణ జన్య, గుండెలో వణకు,చర్మం గరుకు దేరుట,అరుచి,మూత్రం పచ్చబడుట, చెమట, మూత్ర పరిమాణంలో తగ్గుదల ఇవన్నీ పాండు రోగానికి పూర్వరంగమనుకోవచ్చు. వాయు జన్యపాండు రోగంలో తీవ్రవేదన,ఒళ్ళు చిటచిటలాడుట మున్నగు లక్షణాలుంటాయి.

ఈ రోగం వల్ల రక్తనాళాలు, గోళ్ళు, మలమూత్రాలు, నేత్రాలు నల్లగాను ఎఱ్ఱగాను అవుతాయి. నోటినుండి ముక్కునుండి విరసత, మలశోషం, పక్కల్లో నొప్పి వస్తాయి. పిత్తజ పాండురోగంలో రక్తనాళాదులు ఆకుపచ్చగా కనిపిస్తాయి. రోగికి జ్వరం, కళ్ళు చీకట్లు కమ్ముట, దాహం, క్షీణత, మూర్ఛ, దుర్వాసన, చల్లనివి తిని తాగాలనే కోరిక, ముఖంలో పెళుసుదనము అను లక్షణాలు వస్తాయి.కఫజ పాండు రోగంలో గుండె చెమ్మగిల్లుట, మలభేదం, పుల్ల త్రేన్పులు, చిరుమంటలు వుంటాయి. కార్య నిరాసక్తత, నోటిలో ఉప్పటి రుచి, శ్వాసలో అసౌకర్యము, రోమాంచము, గొంతు బొంగురు, దగ్గు, వాంతులు,చిరాకు అను లక్షణాలు గోచరిస్తాయి. త్రిదోషజన్య మైన ఈ రోగంలో లక్షణాలను పోల్చుకోవడం కష్టం. ఈ లక్షణాలన్నీ గాని కొన్నిగాని వుంటూ అసహ్యంగా శరీరం మారిపోతుంది. రోగాలూ ముదిరిపోతాయి.

మన్ను తినడం వల్ల పాండురోగం రావచ్చునుకున్నాం కదా! వగరుగా నున్న మట్టి తినడం వల్ల వాతం,ఉప్పగా లేదా చప్పగా నున్నదాని వల్ల పిత్తం,తీపి మట్టి కఫం ప్రకోపి తాలవుతాయి.రసాలన్నీ తగ్గిపోతాయి.రక్తనాళాలన్నీ రక్తంతో నిండిపోయి ఆ రక్తం ప్రవహించకుండా అలాగే వుండిపోవడం పాండురోగానికి కారణమవుతుంది. ఈ రోగం

ముదిరిపోతే బొడ్డు, కాళ్ళు, ముఖం, మూత్ర మార్గం పొక్కులెక్కిపోతాయి. క్రిములు, రక్తం, కఫం మలంతోబాటు పడతాయి.

పిత్త రోగాన్నుత్పన్నం చేసే ఆహారపానీయాలను అతిగా సేవించే పాండు రోగికి కామెర్ల రోగం వస్తుంది. ఆతని పిత్తము రక్తమాంసాలను దహించి వేస్తుంది. దానివల్ల మూత్రం, కనులు, ముఖము, ఒళ్ళు, మలము, పసుపు పచ్చని రంగులోకి మారిపోతాయి. మనిషి దుర్బలుడై పోతాడు. పిత్త శోథాలు (కురుపులు) పుట్టుకొస్తాయి. నిర్లక్ష్యం చేస్తే అవి చాలా పెద్దవైపోతాయి. ఈ రోగాన్ని 'కుంభకామల' మంటారు. హలీమక నామకమైన మరొక రోగముంది. అది పిత్తము శ్యామ హరిత వర్ణాలలోకి పోతే వస్తుంది. పాండురోగంలో ఇదొక రకం.

పాండురోగ భేదాలన్నిటిలోనూ గట్టిగా కనిపించే లక్షణాలు కురుపులే. కాబట్టి ఈ శోథాలను క్షుణ్ణంగా పరిశీలించి రోగ నిదానానికి ఆపై నిర్మూలను పూనుకోవాలి.

*(అధ్యాయం -162)*

*దద్దురోగము, అమ్మవారు, చికెన్‌పాక్సు, స్మాల్‌పాక్సు అను పేళ్ళు గల విసర్ప రోగములు, కుష్టు రోగంలోని చాలా రకాలు భారత ప్రభుత్వ సంక్షేమ చర్యల వల్ల మనదేశంలో పూర్తిగా నివారింపబడినవి. ఇవి ఇక ఎవరికీ సోకే అవకాశం లేదు కాబట్టి అధ్యాయాలు 163,164,165 అనువదింపబడుట లేదు.*

# వాత వ్యాధి నిదానం

ధన్వంతరి ఇంకా ఇలా చెప్పసాగాడు. ఓయి శుశ్రుతా! వాత లేదా వాయు ప్రకోపమే మానవ శరీరంలో కనిపించకుండానే ఎన్నో అనర్థాలను కలిగిస్తుంది. ఆ వాయువే విశ్వకర్మ, విశ్వాత్మ, విశ్వరూప, ప్రజాపతి, స్రష్ట, ధాత, విభుడు, ప్రభువు, విష్ణువు, సంహర్త, మృత్యువు. ప్రాణవాయువు ప్రాణాలను నిలబెడుతుంది. అయితే సరిగా బతకడం చేతకాక దానినే శరీరంలోపల చెడగొట్టుకుంటే అదే ప్రాణం తీస్తుంది. కాబట్టి వాయువును సమంగా ఉంచుకోవడం కోసం విశేష ప్రయత్నం అవసరం.

వాతానికి సంబంధించి శరీర విజ్ఞానంలో రెండు కర్మ భేదాలు చెప్పబడ్డాయి. అవి ప్రాకృత వైకృతాలు. ఒక్కొక్క కర్మలో మరల నైదేసి విభాగాలు చెప్పబడ్డాయి. మన శరీరంలో నాలుగు ప్రధాన రసాలు ప్రవహిస్తుంటాయి. మన ఆచార విచారాల వల్ల కుపితమైన వాయువు వీటిలో ప్రవేశించి అవి సమంగా పారకుండా చేస్తుంది. వాటి ముఖ ద్వారాలను

కప్పేయడం ద్వారా వ్యక్తికి శూలనొప్పి, కడుపుబ్బు, ఆంత్రకూజనం, మలబద్ధకం, స్వరభంగం, దృష్టిభేదం, నడుంనొప్పి వంటి బాధలను కలిగిస్తుంది. వీటి ప్రభావం వల్ల వ్యక్తి శరీరతత్త్వం అభక్ష్య భక్షణం లాటి అలవాట్లను బట్టి మరిన్ని రోగలక్షణాలు కూడా బయటపడవచ్చును.

ఆమాశయం (అన్నకోశం) లో వాతదోషం చోటు చేసుకుంటే వాంతులు, ఆయాసం, దగ్గు, గొంతు బొంగురు, విషూచిక ఇంకా నాభిపై భాగంలోఅనేక బాధలూ వస్తాయి. వాత ప్రకోపం వల్ల కనులు, చెవులు కూడా పాడవుతాయి. చర్మం దద్దుర్లెక్కి పోతుంది. గొంతులో మంట పుడుతుంది. (ఇది వాయువు రక్తంలో ప్రవేశించడం వల్ల జరుగుతుంది) విష్టంభ, అరుచి, కృశత, భ్రమలు ప్రదూషిత వాయువు ప్రేగుల్లో ప్రవేశించడం వల్ల కలుగుతాయి. కుపిత వాయువు పొట్టలో ప్రవేశిస్తే రోగికి చర్మంపై ముడులు, కర్కశత, బరువెక్కినట్లుండుట, కడుపును పిడికిలి బిగించి ఎవరో గుద్దుతున్నట్లు నొప్పి, పెదవులు, నోరు ఎండిపోవుట మున్నగు కష్టాలు వస్తాయి. (వాయువు మాంసంలో దూరినా అంతే) ఎముకలో కలుషిత వాయువు ప్రవేశిస్తే అక్కడ తీవ్రమైన శూలనొప్పి కలుగుతుంది.

క్రింది నుండి ఎగురగొట్టబడిన వాయువు కుపితమై మీది భాగాలవైపు వెళితే అది గుండెని నొక్కిపట్టి ఇంకాపైకెగసి తలనుదాకి మెదడు లోనికి పోయి ఆయా భాగాలన్నిటినీ ఎముకలతో సహా నొప్పులపాలు చేస్తుంది. మొత్తం శరీరంపై నాలుగు వైపుల నుండీ దాడి చేస్తుంది. శరీరాన్ని శిథిలం చేసి పడేస్తుంది. మనిషిలోని ఉత్సాహాన్ని మట్టిపాలు చేస్తుంది. శ్వాస ఆడడమే కష్టమైపోతుంది. కన్నులు తెఱవ దానికి ప్రయత్నించినా వెంటనే మూసుకుపోతుంటాయి.కంఠం నుండి పావురం చేసే గుడగుడ శబ్దాల్లాటివి అంటే ధ్వనుల లాటి చప్పుళ్ళు వస్తుంటాయి. చికిత్సా క్షేత్రంలో ఈ రోగాన్ని ఉపతంత్రక రోగమంటారు.

కుపితవాయువు గ్రీవంలోనూ పక్కలలోనూ వుండే ప్రధాన రక్తనాళాలనూ అన్ని ధమనులనూదూసుకొనిపోతే శరీరంలో గొప్ప తీవ్ర ఉపద్రవాలే జరుగుతాయి.మెడ దగ్గరి సంధులు వదులైపోతాయి. శరీరమంతా ఒక వింటి బద్దలాగా వంగి పోతుంది. కనులు మూత బడకుండా స్తంభించిపోతాయి. దంతాలు వాటంతటవే కొరుక్కుపోతుంటాయి. కఫం వాంతిగా పడుతుంటుంది. పక్కటెముకలు నొప్పెడు తుంటాయి. గొంతు పెగలదు, మూతి, వెనుకభాగము, మెదడు బిగుసుకు పోతాయి. ఈ రోగాన్ని అంతరాయామ వాతరోగ మంటారు. బహిరాయామ రోగంలో కూడా శరీరం వింటి బద్దలాగే వంగి పోతుంది. తేడా ఏమిటంటే ఛాతీ ముందుకి వచ్చి తల వెనక్కిపోతుంది.రోగి యొక్క మలమూత్రాల

లోనూ, రక్తంలోనూ దూషిత వాయువు ప్రవేశించి శరీరాన్ని పసుపు పచ్చగా చేసి అత్యంత దాహాన్ని కలిగించే రోగాన్ని వ్రణాయామమంటారు.

వీటన్నిటినీ మొత్తంగా ఆక్షేపక రోగాలంటారు. శరీరంలోపల్లో చెడిపోయి వక్రభ్రమణం చేస్తున్న వాయువుని బాగు చేసి సక్రమంగా తిరిగేలా చేయగలిగితే రోగికి పూర్తి స్వస్థత చేకూరుతుంది.

నాలుకను అవసరానికి పదింతలు రాపిడి చేసి, అత్యుష్ణ పదార్థాలను తినడం వల్ల చిబుకమందలి వాయువు కుపితమై గెడ్డం భాగమంతటినీ స్తంభన దోషానికి గురిచేస్తుంది. నోటిని పూర్తిగా మూయడం గానీ తెరవడం గానీ కష్టమౌతుంది. దీనిని హనుస్తంభ- వ్యాధి అంటారు. ఈ రోగమున్నవాడు తినడానికీ, నమలడానికీ, మాట్లాడడానికీ విశ్వ ప్రయత్నం చేయవలసి వస్తుంది. కుపితవాయువు వాగ్వాహినీ, శిరలో ప్రవేశించి నాలుకను చెడగొట్టి 'జిహ్వాస్తంభ'మను పేరు గల వాతవ్యాధిని కలుగజేస్తుంది. తలపై ఎక్కువ బరువును పెట్టుకొని మోయుట వల్లా అతిగా నవ్వడం వల్లా, ఎగుడు దిగుడు స్థానాల్లో వంకరగా పడుకోవడం వల్లా, గట్టి వాటిని కొరికి తినడం వల్లా వాయువుకి వికారం పుట్టి శరీరం లోపల వక్రంగా పెరిగి పై భాగాలలో పేరుకుంటుంది. దాని ప్రభావం చేత రోగి ముఖం వంకరలు పోతుంది. పెద్ద ధ్వనితో అట్టహాసం చేస్తుంటాడు. కళ్ళు ఏదో ఒకేవైపు చూస్తూ ధ్యానంలో వున్నట్టుగా అలాగే వుండిపోతాయి. క్రమంగా శక్తులన్నీ ఉడిగిపోతాయి. ప్రాకృతిక వాయువు రక్తంలో ప్రవేశించినపుడు రక్తనాళాల్లో నాడుల్లో నొప్పి మొదలై మెదడులోని నాడులు కూడా పాడై అన్నీ నలబడిపోతాయి. దీన్ని శిరోగ్రహదోష మంటారు. దీన్ని కుదర్చడం అసాధ్యం. మొత్తం శరీరమంతా దోషయుక్త ప్రకృతిక వాయు (వాత) అధీనం లోకి వస్తే పక్షవాతం వస్తుంది. రోగి శక్తిలో మిగులు బట్టి అది ఏకాంగ, అర్ధాంగ పర్యంత మవుతుంది. మందులకు శరీరం సహకరించకపోతే 'సర్వాంగరోధ' (సర్వాంగ పక్షాఘాత) మను పేరుగల రోగం వస్తుంది. కుదర్చడం కష్టసాధ్యం.ఇదేరోగం పిత్త ప్రకోపం వల్ల వచ్చినా అతి కష్టం మీద కుదర్చవచ్చు. కాని ధాతువులు క్షయమైపోవడం వల్ల వచ్చే వాతప్రకోపం వల్ల గనుక ఈరోగం వస్తే దాని కుదర్చుడం అసాధ్యం. అలాగే కఫయుక్తమైన వాతం ఆమాశయంలో కలకలాన్ని సృష్టిస్తే రోగి శరీరమంతా కట్టలాగై పోతుంది. 'దండా పతానక' మను పేరు గల ఈ రోగాన్ని కుదర్చుడమూ అసాధ్యమే.

ప్రకుపిత వాయువు స్కంధ ప్రదేశానికి మూల భాగంలోకి ప్రవేశించి గాని అక్కడ జనించి గాని పైకి లేస్తుంది. అపుడు నాడులన్నీ సంకుచితాలైపోయి భుజాలలో స్పందన

ఆగిపోతుంది. దీన్ని 'అవబాహుక' రోగమంటారు. భుజాల వెనుక భాగం నుండి వేలికొనల దాకా వుండే నాడిని 'కండర' అంటారు. కుపితమైన వాయువు ఆ నాడిలో ప్రవేశించి దానిని నిరుపయోగంగావిస్తే వచ్చే జబ్బుకి విషూచి అని పేరు పెట్టారు. ఇదే రెండు జంఘలలో జరిగితే వచ్చే రోగం పేరు కలాయఖంజము.

వాత దోషం కాని మరేది గాని అంతఃశ్లేష్మం ద్వారా జంఘపు టెముకలలోకి చేరినపుడు మనిషికి స్తంభన రోగం వస్తుంది. ఎముకలు శిథిలాలైపోతాయి. జంఘల వద్ద చర్మం నల్లబడిపోతుంది. అంగాలలో జడత ప్రవేశిస్తుంది. బద్ధకం, అరుచి, మూర్ఛ, జ్వరం వస్తాయి. ఈరోగాన్ని ఊరు స్తంభమనీ బాహ్యావాతమనీ అంటారు. వాయువు రక్తంలో ప్రవేశించగా రెండూ ప్రకోపించినపుడు మోకాళ్ళ సందులలో మహాభయంకరాలూ, మిక్కిలి బాధాకరాలూ అయిన కురుపులు పుట్టుకొస్తాయి. వీటిని క్రోష్టుక శీర్షాలంటారు. వాయువు కుపితమై గుల్ఫాశ్రితమైతే ఆ రుగ్మతని వాతకంటకమంటారు.

పార్ష్ణి భాగం నుండి వేలి కొనలదాకా గల నాడులను ప్రభావితం చేసి పాదాలను నిశ్చలంగావించే వాయు ప్రకోప రోగానికి గృధ్రసి యనిపేరు. కఫ రోగం కూడా కలిస్తే దీనిని 'పాదహర్ష'మని వ్యవహరిస్తారు. పిత్త - రక్త సంశ్రిత వాత ప్రకోపం వల్ల రెండు పాదాలలోనూ మంటలు పుట్టించేది 'పాదదాహం' ***(అధ్యాయం - 166)***

## వాత రక్త- నిదానం

సుశ్రుతా! ఆరోగ్యాన్ని చెడగొట్టే తిండిని తినేవారు, క్రోధులు, పగలు నిద్రిస్తూ రాత్రి జాగారం చేసేవారు, సుకుమారులమని చెప్పుకుంటూ అతి ఎక్కువ ఆహారాన్ని స్వీకరించేవారు శ్రమను త్యజించి స్థూలకాయులయ్యేవారు, సుఖజీవనులు తమ చేతులారా తామే రక్తాన్ని కుపితం, కలుషితం చేసుకుంటారు. వీరిలో ముందుగా వాయువు చెడుతుంది. దీన్ని వాతం ప్రకోపించడం అంటారు. వాత దోషం వల్ల శరీరంలో అనారోగ్యకరమైన వాయువు వృద్ధి చెంది ముందు రక్తాన్నీ, తరువాత మాంసాన్నీ, పిమ్మట ధాతువులనీ పాడు చేస్తుంది.సంపూర్ణ శరీరంలో వ్యాపించి మోకాళ్ళు, జంఘలు, తొడలు, కటి, భుజాలు, కాలుసేతులు, సంధి స్థానాల్లో దురదలనూ, కోరికలనూ, సూదులతో పొడుస్తున్నట్లుండే బాధనూ,బరువునూ కలిగిస్తుంది. ఈ బాధలన్నీ తగ్గుతుంటాయి. మరల మరల వస్తుంటాయి. బాగా ముదిరాక రోగికి కాళ్ళు కదలడం ఆగిపోతుంది.

వాత- రక్త దోషంలో వాతాధిక్యత గల రోగికి అన్ని అంగాల్లో అత్యధిక శూల, గుండెదడ, శరీరకంపం, ఎముకలు విరుగుతున్నంత బాధ కలుగుతాయి. చర్మంపై పొక్కులు

పుట్టుకొచ్చి అవి పెద్ద కురుపులై సలుపు, పోటు పెడుతుంటాయి. కొన్నాళ్ళకి నల్లగా మారి మాడిపోయినట్లయి మళ్ళా పెరుగుతుంటాయి. ధమనులు నొక్కబడి వ్రేళ్ళ సందులు కుంచించుకుపోయి, అంగగ్రహమేర్పడి, దుస్సహవేదన కలుగుతుంది. శీత పదార్థాలను సేవిస్తే అరుచి, వాపు, కొయ్యబారుటలు, కంపనము, ఇంద్రియాలు చురుకు తగ్గుటలు ఏర్పడతాయి.

వాత– రక్త దోషంలో రక్తాధిక్య రోగిని కురుపులు యమ బాధపెడతాయి. ఒళ్ళంతా సూదులతో పొడుస్తున్న బాధలేర్పడతాయి. ఈ కురుపులు రాగి రంగులో వుంటాయి. నీరు కారుతుంటాయి. చిమచిమలాడుతుంటాయి. దురద పెడుతుంటాయి. ఏ మందు పూసినా శాంతి లభించదు. ఈ రోగంలో పిత్త దోషం కూడా కలిస్తే మంట,చెమట, మత్తు, మూర్ఛ, దాహం, నొప్పి, కురుపులు పగిలి రక్తం కారుట, మిక్కుటంగా వేడి చేయుట – అనే లక్షణాలు బయటపడతాయి. కఫ దోషం చేరి పెరిగితే శరీరం కఠినమగుట, బరువెక్కుట, శూన్యమైనట్లుండుట, చలి, జిడ్డెక్కుట, దురద, మందపీడ మున్నగు లక్షణాలు బయట పడతాయి. త్రిదోష జన్యమైతే మాత్రం వాత రక్త దోషాన్ని నిర్మూలించడం అసాధ్యం. వాతమూ రక్తమూ రెండూ పూర్తిగా చెడిపోతే రోగి బ్రతకడు.

వాతము పంచాత్మక వాయు సమూహము. ఆ పంచవాయువు లేవనగా ప్రాణ, వ్యాన, సమాన, అపాన ఉదానములు.

మనిషిలో రూక్షత, చంచలత, లంఘనం,అతిశయాహారం(బూకరింపు తిండి) కృత్రిమ వేగం, అనవసరమైన ఆయాసపాటు పెరిగితే ప్రాణవాయువు ప్రకోపించి పంచేంద్రియాలను దెబ్బ కొడుతుంది. పీనసం, మంట, దాహం, దగ్గు, ఊపిరాడక పోవుట అనే రోగాలు పుట్టుకొస్తాయి. అదే ఉదానవాయువు కుపితమైతే అది గెడ్డాన్నీ, నుదుటినీ ఆశ్రయించి కంఠావరోధ, మలభేద, అరుచి, పీనస, గలగండాదిక దోషాలకు జన్మనిస్తుంది.

అత్యధిక దూరంలో వున్న వాటికి పలుమార్లు యాత్రలు చేయడం, బహుస్నానాలు, మరీ అడ్డగోలుగా విషయ వాంఛలను తీర్చుకోవడం, ఎక్కువగా భోగాలను అనుభవించడం, అపథ్యం, కోపం, అతిగా హర్ష విషాదాలకు స్పందించడం మున్నగు కారణాలవల్ల వ్యక్తిలోని 'వ్యాన' వాయువు దూషితమవుతుంది. దీనివల్ల ముందుగా పురుషునిమగతనం దెబ్బ తింటుంది. దానితో అతనిలోని ఉత్సాహం నశిస్తుంది. ఇక శోకానికి అతి స్పందన నిచ్చే వ్యక్తి కాబట్టి అతి రోదనం వల్ల జ్వరం, పొడవబడుతున్నవేదన, రోమాంచం, స్పర్శ శూన్యత, కుష్టు, విసర్పం, సర్వాంగపీడ కలుగవచ్చును.

'సమాన' వాయువు అజీర్ణ కారకము, శీతలము, సంకీర్ణ దోషయుక్తము నగు తిండివల్లనూ, వేళాపాళాలేని నిద్ర, జాగరణల వల్లనూ కుపితమవుతుంది. ఈ సమాన వాయు ప్రకోపకారణాన శూలనొప్పులు, గుల్మాలు, గ్రహణి మున్నగు థకృతజన్య మరియు కామాశ్రిత రోగాలు వస్తాయి.

అపానవాయువు చాలా ముఖ్యమైనది. దీనిని జాగ్రత్తగా కాపాడుకోవాలి. బిరుసుగానూ, బరువుగానూ వున్న అన్నాన్ని తినడం, మలమూత్రాలను ఆపుకోవడం, ఎక్కువ బరువులను మోయడం, వాహనాలపైనే రోజంతా తిరగడం అంటే కాలు క్రింద పెట్టకపోవడం, మదిరాపానంచేయడం, ఎక్కువకాలం నిలబడే వుండిపోవడం, వీలు చేసుకొని మరీ ఎక్కువగా ఊరిమీద తిరగడం వంటి పనులు చేస్తే అది ప్రకుపితమవుతుంది. అప్పుడది పక్వాశయము నాశ్రయించి సమస్తరోగాలనూ పుట్టిస్తుంది. అంతేకాక మూత్ర, మల, అర్శ(మొలలు), వీర్య, మలవిరోధి సంబంధమైన ఎన్నో వ్యాధులనూ కలిగిస్తుంది.

ఉదానవాయు ప్రకోపంలో తంద్ర, స్తిమిత, బరువెక్కుట, జిడ్డుకారుట, బద్ధకం, ఒళ్ళుచల్లబడుట, అగ్నిమాంద్యం, రూక్ష మరియు కటు పదార్థాలను తినాలని వుండుట మున్నగు రోగలక్షణాలు కనిపిస్తే దానిని ఆమసదృశ లేదా సామవాయుదోష మంటారు. వీటికి వ్యతిరేకంగా అత్యుష్ణాది లక్షణాలు కనిపిస్తే 'నిరామ' వాయు దోషమని వ్యవహరిస్తారు.

ఇపుడిక వాయువు దేనిచేత ఆవృతమైతే ఎలాటి రోగలక్షణాలు బయటపడతాయో చూద్దాం. పిత్త దోషంచే ఆవృతమైన వాత వికారం శరీరంలో నేర్పడిన వ్యక్తికి మంట, దాహం, శూలనొప్పులు, భ్రమ, కనులు చీకట్లు కమ్ముట అను రుగ్మతలు కలుగుతాయి. చేదుగా గాని వేడిగా గాని పులుపైన గాని ఉప్పనివి గాని రోగి చేత పదార్థాలను సేవింపచేస్తే ఒకమారు వేడిగా ఒకమారు చల్లగా నుండే పదార్థాలను తినాలనే కోరికను వెల్లడిస్తాడు. కఫావృత వాతరోగి శీత, ఉష్ణరూక్ష భోజనాన్ని వాంఛిస్తాడు. అతనికి చలువలు కమ్ముట, ఒళ్ళు బరువెక్కుట, శూల, లంఘన, అగ్నిదాహ, అధిక తృష్ణాది రుగ్మతలు కలుగుతాయి. కఫావృత వాయురోగికి కటుఘృత యుక్త ముఖదోషం కూడా తగులుతుంది. ప్రతి అంగం దురద, అరుచి, వాంతులు కూడా ఉంటాయి.

రక్తావృత వాత రోగికి చర్మంలో మాంసంలో మంటలు పుడుతున్నట్లుంటుంది చర్మంపై ఎఱ్ఱని కురుపులు పుడుతుంటాయి. గుండ్రని మచ్చలేర్పడుతుంటాయి. వాయువు మాంసాశ్రితమైన రోగికి ఈ కురుపులు బాగా పెద్దవై సలుపుతూ రసికారుతూ వుంటాయి. మేదావృత (పొట్టలోని) వాతదోషంలో వేసే కురుపులు ముట్టుకుంటే వేడిగా తగులుతాయి. పై పొర తొలగిస్తే చల్లగా వుంటాయి. మజ్జావృత వాత దోషంలో ఈ కురుపులు విశాలంగా,

పెళుసుగా వుండి బాగా నొప్పెడుతాయి. వాటిని మృదువుగా నిమిరితే నొప్పి తగ్గినట్లని పిస్తుంది.

శుక్రంలో వాయువు చేరితే స్కలనం చాలా నెమ్మదిగా జరుగుతుంది. అన్నకోశంలో చేరితే తినగానే కడుపునొప్పెట్టి అరుగుతున్న కొద్దీ తగ్గుతుంటుంది. వాయువు మూత్రంలో చేరితే దాని ప్రవాహమాగిపోయి, పొత్తికడుపు తీవ్రంగా నొప్పెడుతుంది. పురీషంలో చేరితే మల ద్వారం వద్ద చిన్న చేరంపము (అంపము)తో కోస్తున్నట్లు బాధపుడుతుంది. రోగి వీలైనంతవేగం నేలపై పడుకొని మూర్ఛితుడైపోతాడు. మలం అతి కష్టం మీద బయటి కొస్తుంది.

వాయువు శరీరాంతర్గత ధాతువులను ఆవరిస్తే కటి ప్రదేశంలోను వంక్షణ, పీఠాలలోనూ వేదన పుడుతుంది. అది విలోమభావంలో అంటే అపసవ్యంగా లోపల్లోపలే తిరుగుతుంటే గుండె నొప్పి వచ్చి ఉక్కిరిబిక్కిరి చేస్తుంది.

పిత్త జన్యమైన దోషం వల్ల చెడిన వాయువు ప్రాణవాయువునావరిస్తే భ్రమ, మూర్ఛ, పీడ (తీవ్రమైన నొప్పి) మంట వస్తాయి. అదే వ్యాన వాయువునైతే పీడ, తంద్ర (పనిపై విరక్తి) స్వరభ్రంశం, ఒళ్ళు మంటలు పుట్టుకొస్తాయి. సమాన వాయువునైతే క్రమంగా అంగచేష్టా, అంగభంగం, వేదనా సహిత సంతాపం, తాప వినాశం, చెమట, బిగుసుకు పోవుట, తీవ్రదాహం దాపురిస్తాయి. అపాన వాయువు విషయంలోనైతే వంటిమంటలు, మలం ముద్ద పసుపురంగులో పడడం జరుగుతాయి. స్త్రీలలోనైతే తాప, అనాహ, ప్రమేహ లక్షణాలు వృద్ధి చెందుతాయి. రజవృద్ధి కూడా అవుతుంది.

ప్రాణవాయువు శ్లేష్మం చేత ఆవరించబడినపుడు నాద ప్రవాహంలో అడ్డంకి, కఫపు గళ్ళలు, అతిచెమట, శ్వాస ద్వంద్వాలలో అసమత ఏర్పడతాయి. కఫం ఉదానవాయువు చుట్టూ చేరితే ఒళ్ళు బరువెక్కుట, అరుచి, మాటమధ్యలోఆగిపోవుట, సత్తువ, మేనిరంగు, రోగనిరోధక శక్తి నశించుట జరుగుతాయి. కఫం వ్యానవాయువు నావరిస్తే కీళ్ళ బందులలో ఎముకల్లో పట్లు పుడతాయి. శరీరం బరువెక్కుతుంది. స్థూలకాయమై పోతుంది. కఫంచే సమానవాయువు ఆవృతమైతే కర్మేంద్రియాలలో అజ్ఞానత, శరీరంలో స్వేదం తగ్గుదల, అగ్నిమాంద్యం కనిపిస్తాయి. అపానవాయువు కఫావృతమైతే మలమూత్రాలు ఎక్కువగా పడతాయి. ఈ విధంగా వాత రక్త రోగాలు ఇరవై రెండున్నాయి.

కొన్ని మందులు సాధారణ సామాన్యరోగాలను నిర్మూలనం చేస్తాయి. కొన్ని మిశ్రమాలు శరీరంలో ఇక ఏ రోగాన్ని ప్రవేశింపనీయవు. శుశ్రుతా! తేనె, నెయ్యి, బెల్లంలతో సంయుక్తమైన త్రిఫల (కరక్కాయ, ఉసిరిక, తాంఢ్ర) చూర్ణము సర్వరోగ నిరోధిని నివారిణి

కూడ. రోజూ ప్రాతఃకాలంలో త్రిఫల చూర్ణాన్ని మంచి నీటిలో కలుపుకొని చిన్నప్పటినుండి త్రాగుతున్న వారికి ఏ జబ్బులూ రావు. జన్మదోషం వల్ల వచ్చే రోగాలు కూడా నశిస్తాయి. శతావరి, గుడూచి, చిత్రక, విడంగాలతో కలిపి ఈ చూర్ణాన్ని సేవిస్తే మరీ మంచిది. వీటితో బాటు అగ్నిమంథ్య, శొంఠి, మూసలి, బల, బృహతి, పునర్నవ, ఆవ, నిర్గుండకి, వేపాకు, భృంగరాజ, వాసకలను కలిపి సేవిస్తే బలహీనుడు కూడా రోజుకి ఏడుమార్లు అతి తక్కువ మోతాదులో కొన్నాళ్ళు సేవించేసరికి వజ్రకాయుడైపోతాడు. ఇప్పటివఱకు చెప్పిన ఓషధుల మూలికలన్నిటినీ చూర్ణం మున్నగు రూపాల్లో సేవించవచ్చు. అను పానాలుగా వైద్యశాస్త్ర నిష్ణాతులు చెప్పిన మోతాదులను కలిపి తీసుకోవాలి. ***(అధ్యాయం-167)***

# సంక్షిప్త ఔషధీయ యోగసారం

సుశ్రుతా! ముందుగా ఏయే ఋతువుల్లో ఏయే అపథ్యాలు ప్రకోపాలకు దారితీస్తాయో చూద్దాం.

వర్షర్తువులో తీక్ష్ణ, చేదు, వగరు రుచులు, రూక్ష గుణాలు గల తిండిని తినడం వల్లనూ, అతిగా బెంగ, శృంగారం, వ్యాయామం, భయం, శోకం, రాత్రి జాగరణ, గట్టిగా కేకలేయడం,చేవ కంటె ఎక్కువగా చేతలు వంటివి కారణాలుగా భోజనం అరుగుతున్నపుడూ, సందెలందూ వాయువు కుపితమవుతుంది.

గ్రీష్మంలోనూ వర్షర్తువులో కొంతమేరా మధ్యాహ్నకాలంలో వేడిగా, పులుపూ ఉప్పూ ఎక్కువగా వుండి, సులభంగా అరగని భోజనం చేసే వారికీ, మద్యపాన ప్రియులకూ, కోపిష్ఠులకూ ముఖ్యంగా అర్ధరాత్రివేళల్లో పిత్త ప్రకోపదోషం తగులుతుంది.

వసంతర్తువులో మంచి రుచికరమైనదీ, చల్లగా నున్నదీ అగు భోజనాన్ని అతిగా, ఆబగా తినేవారిపైనా, వ్యాయామం చేయని వారిపైనా, మాంసం తినేవారి పైనా, సుఖభోగాలనెక్కువగా అనుభవించేవారిపైనా, పగలు నిద్రించేవారిపైనా భోజనాంతంలో ప్రకుపితమైన పిత్తం దాడిచేస్తుంది.

ఇక త్రిదోషాలలో ఏది వస్తే ఎలాటి లక్షణాలు బయటపడతాయో ఇదివఱకే చెప్పబడింది కదా! మొత్తం మీద రోగ కారణాన్నీ, లక్షణాన్నీ, సంసర్గాన్నీ జాగ్రత్తగా పరిశీలించి ఒక నిర్ణయానికి రావాలి.

శరీరం దోషాలకూ, ధాతువులకూ, మలానికీ ఆధారమని చెప్పబడింది. కొవ్వు, రక్తం, మాంసం, మేద, ఎముక మూలగ, వీర్యం సప్తధాతువులు. ఇవి చెడనంతసేపు

పరవాలేదు. ఏ రోగం (దోషప్రకోపం) వచ్చినపుడు శరీరం ఎక్కడ ముందుగా చెడుతుందో చూడాలి. వాతం గుదాభాగాన్ని నడుమునీ ముందు పట్టుకుంటుంది. పిత్తం పక్వాశయంలో చేరి దాన్ని చెడగొడుతుంది. కఫం ఆమాశయ, కంఠ, మస్తక సంధి భాగంపై తొలిదాడిని చేస్తుంది. ఏ రకమైన తిండి తింటే ఏ ప్రకోపం దాపురిస్తుందో చూశాము కదా! కాబట్టి దానికి వ్యతిరేక రుచులు గల పదార్థాలను తింటే రోగ తీవ్రత తగ్గుతుంది.

మధుర భోజ్య పదార్థాలు నేత్ర శక్తినీ, రసాన్నీ, ధాతువులనూ అభివృద్ధి పరుస్తాయి. అవే స్వల్పంగా పుల్లగా వుండే పదార్థాలతో కలిస్తే, మనస్సునీ హృదయాన్నీ సంతృప్తి పరచి జఠరాగ్ని నుద్దీపించి అరుగులను మెరుగు చేస్తాయి. చేదుగా తీక్ష్ణంగా నున్న పదార్థాలు వేడిని పెంచి జ్వరం, దాహంను నశింపచేసి, శోధన శోషణలను గావిస్తాయి. కషాయ పదార్థాలు పిత్తవర్ధకాలు, స్తంభక కంఠగ్రహాది దోష వినాశకాలు, శరీర శోషకాలు అవుతున్నాయి. ఈ గుణాలన్నీ ఒక పరిమాణం (హద్దు) దాకానే వుంటాయి.

శరీరంలోని రసాలనీ, వీర్యాన్నీ విశేషంగా పరిపక్వం చేయడానికాధార భూతాలైన ద్రవ్యాలనూ పదార్థాలనూ ఉత్తమాహారంగా పరిగణిస్తారు. రస పరిపాకం మధుర, కటు భేదాలతో రెండు రకాలు.

చికిత్సకు ప్రధానాంగాలు నాలుగు. అవి వైద్యుడు, రోగి, మందు, పరిచారకుడు. ఈ నాలుగూ జాగ్రత్తగా వుంటే రోగం వేగంగా కుదురుతుంది. దేశం, కాలం, రోగి వయస్సు, శరీరంలోని అగ్ని యొక్క బలాబలాలు, ప్రకృతి, త్రిదోష ప్రకోపాలు. వాటి సామ్య వైషమ్యాలు, రోగి స్వభావం, మందు, రోగి శరీర సత్త్వ, సహన శక్తులు, రోగ తీవ్రత ఈ అంశాలన్నిటినీ బాగా పరిశీలించాకనే విద్వాంసుడైన చికిత్సకుడు ఆ రోగాన్ని కుదిర్చే పనిలో పడతాడు. (తచ్ఛాంతికి వెంటనే ఏదో చిట్కా వేసి రోగికి నమ్మకం కుదర్చడం కూడా జరుగుతుంది)

జలాశయాలనూ, పర్వతాలనూ ఎక్కువ కలిగిన దేశాన్ని ఆయుర్వేదంలో అనూపదేశ మంటారు. ఈ దేశంలో కఫం, వాయువు ఎక్కువగా ప్రకోపిస్తాయి. అడవులెక్కువగా వుంటే రక్త- పిత్తజ ప్రకోపాలెక్కువగా వస్తాయి. సామాన్య దేశాలలో అన్ని రోగాలూ వుంటాయి. మనిషి పదారేళ్ళొచ్చేదాకా బాలకుడనీ, డెబ్బది యేండ్ల వయసు దాటాక వృద్ధుడనీ మధ్య కాలంలో మధ్య వయస్కుడనీ ఆయుర్వేదం నిర్వచిస్తుంది. (ఇది 'అప్పటి'మాట)

కఫ, పిత్త, వాయువులు శరీరంలో అదే క్రమంలో పెరుగుతాయి. వృద్ధాప్యం వల్ల శరీరం శక్తిహీనమైనపుడు రోగి క్షారక్రియ, అగ్ని చికిత్స, శల్యకర్మలు లేకుండా అయిపోతాడు. కృశిస్తున్న దేహం గల వానికి బృంహణ, స్థూలకాయునికి కర్షణ, మధ్యనున్న వానికి రక్షణ అనెడి కార్యాలను చేపట్టాలి.

తల్లిదండ్రులకుండే త్రిదోషాదులు పిల్లలకీ సంక్రమిస్తాయి. రోగి తల్లిదండ్రులను గూర్చిన తెలివిడి చికిత్సకుని కుండడం అవసరం. పిత్తాది త్రిదోషాలు సహజ ప్రకృతులలో భాగమై పోతాయి కాబట్టి ఎలా వుండే వారికేది ప్రకోపిస్తుందో తెలియాలి.

బక్కబళ్ళు, కఱకుదనం, తక్కువ జుత్తు, మారేమనసు, కలవరింతలు గల వ్యక్తికి సాధారణంగా వాతం ప్రకోపిస్తుంది. వయసు మీరకుండానే తలపండుట,ఎఱ్ఱతోలు, చెమట ఎక్కువ, కోపంఎక్కువ, మంచి బుద్ధి, నిద్రిస్తున్నా చురుకుతనం తగ్గకుండుట అనే లక్షణాలున్నవానికి  పిత్త ప్రకోపం తగిలే అవకాశముంది. స్థిరచిత్తం మెల్లని చల్లని మాట, ప్రసన్నత, మెత్తని కేశాలు, కలలో నీళ్ళు, రాళ్ళు కనిపించుట అనే లక్షణాలున్న వానికి కఫం ప్రకోపించడం సాధారణం.మిశ్రిత లక్షణాలున్నవారికి ద్వి లేదా త్రిదోషాలుండవచ్చు.

దోషాల దశలు నాలుగు. అవి మంద, తీక్ష్ణ, విషమ, సమదశలు. జఠరాగ్నిని ముందు కాపాడి దానిని సమంగా వుంచాలి. విషమ స్థితిలో వాయువును అదుపు చేయాలి. తీక్ష్ణావస్థలో పిత్తదోషాన్ని మందావస్థలో కఫాన్నీ ప్రతిచర్య ద్వారా దశమారేలా చెయ్యాలి.

సర్వరోగోత్పత్తి కారకాలు అజీర్ణ, మందాగ్ని దోషాలే. వాటి లక్షణాలు ఆమ, అమ్ల, రస, విష్టంభాలు. ఆమ (చీము, జిగట) దోషం వల్ల విషూచిక, హృదయదోషం, బద్ధకం వంటి ఉపద్రవాలు వస్తాయి.అలాటప్పుడు వచ (ఇంగువకావచ్చు) కటుఫల (కరక లేదా కాకర కావచ్చు)ములను లవణజలంతో కషాయంచేయాలి.దానిని నీటిలోకలిపి త్రాగించాలి. వాంతి చేయించాలి. అమ్లదోషమున్న చోట శుక్రంలో తగ్గుదల, భ్రమ, మూర్ఛ, దాహం మున్నగు బాధలు బయటపడతాయి. ఇలాటి దశలో అగ్నిపై వండనివి తినుట, చల్లని నీరు తాగుట, చల్లని గాలిని గుండెల నిండా పీల్చుట మంచిది. రసదోషము న్నపుడు శరీరం పగులుట, తలనొప్పి, అన్నంగాని మరేది గాని తినాలనిపించకపోవుట జరుగుతాయి. ఈ దశలో రోగి చేత పగటినిద్రనీ, ఉపవాసాల్నీ మాన్పించాలి. విష్టంభ దోషమున్న రోగికి శూలనొప్పి, కురుపులు, అరుచి, మలమూత్ర విసర్జనల్లో ఇబ్బందీ కలుగుతాయి. అప్పుడు రోగికి చెమట పట్టించాలి. లవణ మిశ్రిత జలాన్ని త్రాగించాలి.

మూడు దోషాలూ గల వారికి ఇంగువ త్రికుటాలతో సైంధవ లవణాన్ని కలిపి ముద్ద చేసి పొట్టపై పూయాలి. వేడి(వెచ్చని)నీరు లేదా తేనె కలిపిన వెచ్చని  నీరు త్రాగడం వల్ల జీర్ణక్రియ సాఫీగా సాగుతుంది. వెదురు మొలకలు, పెరుగు, చేప కూడ మంచి మిశ్రమమే.దీనికి పాలు మాత్రం కలపకూడదు. బిల్వ, సిందూర (శోణ) గంభీర (శ్రీపర్ణి) పాటల (కలిగొట్టు) అగ్నిమాంద్య – ఈ అయిదుచెట్ల మూల సంగ్రహాన్ని

ఆయుర్వేదంలో 'పంచమూల' మంటారు. మందాగ్నిని పెంచి పోషించే కఫ, వాత దోషాలను పంచమూల సేవనం పటాపంచలుచేస్తుంది. ఏకాంగి యనుపేరు గల ఔషధం (శాలపర్ణి) పృశ్నిపర్ణి (పేరవనం) రెండు ప్రకారాల బృహతి(దురదగొండి)పల్లేరుకాయ ఈ అయిదింటి మిశ్రమాన్నీ 'లఘుపంచమూల' మంటారు. ఈ ఔషధం వాత- పిత్త దోష వినాశకం, కాంతి వర్ధకం. ఈ రెండు మిశ్రమాలనీ కలిపి 'దశమూలౌషధి' అంటారు. ఈ మందు సన్నిపాత జ్వరాన్ని నశింపజేయడంలో కడు సమర్థకం. దగ్గు, ఆయాసం, కునికిపాటు, పక్కనొప్పిలకు కూడా ఈ మందు బాగా పనిచేస్తుంది. ఈ మందుని నూనెతో నేతితో పరిపక్వం చేసి తలకి రాస్తే కేశ సంబంధిరోగాలు నశిస్తాయి.

ఇపుడు స్నేహపాకాన్ని వర్ణిస్తాను. ఇది మందుల కషాయం. పాత్రలో నీటిని తీసుకొని మూడింతలు ఆవిరైపోయే దాకా వేడి చేసి అపుడు దానితో, అనగా ఆ మిగిలిన నాలుగవ వంతుతో సమాన పరిమాణంగల స్నేహిలద్రవ్యము(ఔషధం)ను వేయాలి. ఇదే స్నేహపాకం. దీనిని పాలతో కూడా తయారుచేసుకోవచ్చు. పాలు స్నేహిల ద్రవ్యంతో సమాన పరిమాణంలో వుండాలి.

మనిషి ఆరోగ్యంగా వుండి కలకాలం జీవించాలంటే ఇంద్రియ నిగ్రహాన్ని పాటించాలి. అన్నీ తినాలి. బాగా తినాలి. కానీ ఒక వయసు వచ్చేదాకానే తిండి మంచిది. మంచి తిండిమరీ మంచిది. రుచులను సమపాళ్ళలో సేవించినంత కాలం రోగం రాదు.

*(అధ్యాయం- 168)*

## పదార్థాల గుణదోషాలు, ఔషధ సేవనంలో అనుపాన మహత్త్వం

**ఓ**యి శుశ్రుతా! పదార్థాలలో ఏవి మంచివో అనే జ్ఞానం చికిత్సకునికి మిక్కిలి అవసరం. ఎఱ్ఱటి శాలి బియ్యం వాత, కఫ, పిత్త దోషాలు మూడింటినీ నశింపజేయగలదు. దాహాన్నీ, కడుపులోని కొవ్వునీ కూడా తొలగించగలదు. మహాశాలి జీర్ణానికి గొప్ప దోహదకరం. కలమ(అనగా ఎక్కువ నీటితో కలిపిన కలమ బియ్యం)కఫ, పిత్తాలను అదుపు చేస్తుంది. గౌరషష్టిక మూడు దోషాలనూ, బరువునూ తగ్గిస్తుంది. శ్యామాకమనే ఔషధి మంచి వాయువునుత్పత్తి చేసి కఫ, పిత్త దోషాలను చెదరగొడుతుంది. ప్రియంగు, నీవార, కొరదూశ ధాన్యాలు కూడా అంతే. యవ (బార్లీ) తఱచుగా వాడితే వాయువునుత్పత్తి చేసి కఫ, పిత్తాలను బాగుచేస్తుంది. గోధుమ జీర్ణకారి. ముద్గ(పెసర) పప్పుధాన్యం. కఫ, పిత్త, రక్తాలలో అనవసర భారాన్ని తగ్గిస్తుంది. మాశ బలాన్నిస్తూ జీర్ణవ్యవస్థను మెరుగు పరుస్తూ కఫ, పిత్తాలను అదుపు చేస్తుంది. రాజమాశ జీర్ణకారి కాదు. అది దేహంలో అదనంగా

వున్న కఫ, పిత్తాలను చెదరగొట్టి వాయువు వల్ల తేడా రాకుండా కాపాడుతుంది. కులత్థము కఫం వాయువులను చెదరగొట్టి పడిశం, వెక్కిళ్ళు, ప్లీహ వ్యాకోచంలను తొలగిస్తుంది.

రక్త పిత్తం వల్ల వచ్చే జ్వరాన్ని మకుష్టకమనే మందు తగ్గిస్తుంది. చణక పప్పు వాయువునుత్పత్తి చేసి కఫ, పిత్తాలను చెదరగొడుతుంది. కాని దీని వల్ల నష్టాలు కూడా వుంటాయి. పెసలు, కలాయము కఫ, పిత్తాలను అదుపుచేస్తాయి. వాయువును పుట్టిస్తాయి. ఆఢకీ ఇదే పనిని చేస్తూ వీర్యవృద్ధిని కల్పిస్తుంది. అతని పిత్తాన్నుత్పత్తి చేస్తుంది. సిద్ధార్థ ధాన్యం కఫాన్నీ, వాతాన్నీ చెదరగొడుతుంది. నువ్వులు బలాన్నిస్తాయి గాని వేడిని పుట్టించి పిత్తాన్ని పెంచుతాయి. (తక్కువగా వాడాలి.)

చిత్రక, ఇంగుది, నాళిక, పిప్పలి, తేనె, శిగ్రుచవ్య, చరణ, నిర్గుంది, తర్కారి, కాశమర్దక, బిల్వాలు, కఫ, పిత్త దోషాలను నశింపచేస్తాయి. క్రిములను సంహరిస్తాయి. శరీరాన్ని తేలికగా చేసి ఆకలిని పెంచుతాయి. వర్షభూ, మార్కరలు వాత, కఫ దోషాలను నశింపజేసి తజ్జనితరోగాలన్నిటినీ తొలగిస్తాయి.

ఎరండ చేదుగా వుంటుంది. కానీ కాకమాచితో కలసి త్రిదోషాలనూ, చంగేరి కఫ, వాతాలనూ, వర్షభూ, మార్కరలు వాత, కఫాలనూ అదుపులో పెడతాయి. ఆవాలు అన్ని దోషాలనూ సృష్టిస్తాయి కాబట్టి వాటి విషయంలో జాగ్రత్తగా వుండాలి. కౌసుంభ, రాజిక, నాఢి చలలో చివరి రెండూ మంచివి. కౌసుంభ ఆవాల వంటిదే.

కలువాకు అన్ని దోషాలనూ పోగొడుతుంది. త్రిపుట అతి వాయుజనకం. కక్షర అన్ని దోషాలనూ నశింపజేస్తుంది. వాస్తుక రుచిగానూ వుంటుంది. త్రిదోషాలనూ తొలగి స్తుంది. చుచు అనే శాకం తియ్యగా వుంటుంది. చలవ చేస్తుంది. తోటకూర విషనాశకం. ఆకుకూర లన్నింటిలోనూ ఆ గుణముంటుంది. ముల్లంగి ఆమ దోషాన్ని పెంచుతుంది, వాతాన్నీ, కఫాన్నీ రక్షిస్తుంది. నిప్పులపై వండబడిన ముల్లంగి (కూర) అన్ని దోషాలనుండీ శరీరాన్ని రక్షిస్తుంది పైగా హృదయానికీ కంఠానికి మంచిది. దోస, వంగ, పరవల (దొండవంటి ఒకపాదు) కాకర కూరలు సవ్యంగా వండితే కుష్టు, మేహం, జ్వరం, శ్వాస, దగ్గు, పిత్తదోషం, కఫదోషం నశిస్తాయి. గుమ్మడి సర్వదోష వినాశకం, వస్తిశోధకం. కీరాదోస, ఉర్వారుకం (దోసలాటిదే ) మాత్రం పిత్తదోషాన్ని తగ్గిస్తాయి కాని వాత, కఫ ప్రకోపాలకు దోహదపడతాయి.

నిమ్మ, సొరలను ఏ రూపంలో సేవించినా కఫ, వాత దోషాలు తగ్గుతాయి. దానిమ్మ వాత దోషనాశకం. నారింజ దోష నివారకమే గాని బరువు చేస్తుంది. కేశర, మాతులుంగాలు కఫ, వాత వినాశకాలు, జఠరాగ్ని ప్రదీప్తకరాలు. చిక్కుడు వాత పిత్తాలపై పనిచేస్తుంది. పైగా శరీరానికి సున్నతనీ, శరీరాంతర్గత అధికోష్ణాన్ని హరించి ఆరోగ్యకరమైన

వాయువునూ పెంచుతుంది. ఉసిరిక మంచి రుచినీ, మాధుర్యాన్నీ, బలవర్ధక ఆమ్ల రసాన్నీ కలిగివుండి శరీర కాంతిని పెంచుతుంది. హరీతకికి పుణ్యాన్ని ప్రసాదించే శక్తి వుంది. దానిని సేవించిన వారికి అజీర్ణ సమస్య రాదు, కఫ– వాత దోషాలు దూరంగా పారిపోతాయి. బహేడా కూడా అలాటిదే. ఇది పిత్త దోషాన్ని కూడా హరించగలదు. చింతపండు వాతాన్ని, కఫాన్నీ అదుపుచేసి ఆమ్ల రసాన్ని కురిపిస్తుంది.

లకచం రుచిగా వుంటుంది. కానీ దోషాలనుత్పత్తి చేస్తుంది. బకుల (పొగడ) కఫ– వాత వినాశకం జామ సర్వరోగనివారిణి అయినా ముఖ్యంగా గుల్మ, వాత, కఫ, శ్వాస, కాస రోగనాశకం. కపిత్థం గ్రాహ్యాది జాతిలోని సర్వరోగాలనూ నయం చేస్తుంది. వేడిచేస్తే విషహారిణి కూడా అవుతుంది.

పండిన మామిడి మాంసాన్నీ, వీర్యాన్నీ, రంగునీ శక్తినీ వృద్ధిపఱుస్తుంది. కానీ వాత రోగాన్నుత్పత్తి చేస్తుంది. నేరేడు త్రిదోష వినాశకమే గాని విరోచనం కానివ్వదు. తిందుకం కఫ– వాతాల్నీ, రేగువాత– పిత్తాలనూ హరిస్తాయి. ప్రియాలం వాత జన్య దోషాన్ని పోగొడుతుంది. రాజాదనం, అరటి, పనస, కొబ్బరి స్వాదయుక్తాలు, ఒంటి నునుపునీ, కాంతినీ, బరువునీ పెంచుతాయి. వీర్యాన్నీ మాంసాన్నీ కూడా వృద్ధి చేస్తాయి.

ద్రాక్ష, మధుక, ఖర్జూర, కుంకుమలు వాత రక్త దోషాలపై విజయం సాధించే శక్తిని కలిగి వుంటాయి. పిప్పలిని వండుకొని తింటే శ్వాస, పిత్తాలు బాగుపడతాయి. ఆర్ద్రకం (అల్లం) రోచకం, పుష్టికారకం, అగ్నిదీపకం. అంతేకాక అల్లము కఫాన్నీ, వాతాన్నీ కూడా కాపాడుతుంది. శొంఠి, పిప్పలి, నల్లమిరపలను కలిపి స్వీకరిస్తే కఫవాత దోషాలు నశిస్తాయి. ఎఱ్ఱమిరపకాయలు శరీరానికి పుష్టి నివ్వలేవని శాస్త్రం చెబుతోంది. ఇంగువ గుల్మాన్నీ, శూలనూ, మలావరోధాన్నీ దూరం చేసే శక్తిని గలిగివుంటుంది. అలాగే వాతాన్నీ కఫాన్నీ కూడా దోషం లేకుండా సరిచేస్తుంది.

యమానీ, ధనియా, అజాఘృతాలు వాతజ, కఫజ దోషాలను దూరం చేస్తాయి. సైంధవలవణం కనులలో కాంతినీ, శరీరపుష్టినీ ద్విగుణీకృతం చేస్తూ త్రిదోషాలనూ తగ్గిస్తుంది. నల్లఉప్పు (సౌవర్చలం) వాతపు అడ్డంకులను తొలగిస్తుంది. వేడినీ, గుండెనొప్పినీ తగ్గిస్తుంది. విడంగం అనే మందు వేడినీ, దాని తీవ్రత వల్ల కలిగే అన్ని బాధలనూ, శూలనీ, వాత దోషాన్నీ నివారించగలదు. రోమకలవణం హృదయ రోగాన్నీ, పాండు జబ్బునీ, గొంతు బాధలనూ రూపుమాపుతుంది. యవక్షారం అగ్నిదీపకం. సర్జిక్షారం లవణాలను పెంచుతుంది. ఆకలిని కలిగిస్తుంది. కురుపులు చితికేలా చేస్తుంది. నాభాసం (వాన నీటి మందు) సర్వదోషాలనూ సర్వవిషాలనూ హరిస్తుంది. శరీరాన్ని గుండెనీ తేలిక పరుస్తుంది.

నదీయం అనగా జీవనది నీరు (నాదేయం అనికూడా అంటారు) మంచి వాయువునుత్పత్తి చేస్తుంది. వాపి (గుండము) నీరు వాయువునూ కఫాన్నీ అదుపులో వుంచుతుంది. తటాకోదకం వాయువునుత్పత్తి చేస్తుంది. నైర్ఘరం (సెలయేటి నీరు) శరీరాన్ని తేలికపఱచి, మెదడుకు పదును పెట్టి, మెరుపును ముఖంలోకి తెస్తూ పిత్తాన్ని అదుపు చేస్తుంది.

పగలు సూర్యకిరణాలూ, రాత్రి చంద్రకిరణాలూ తగిలే నీరు వాన నీటివలె (ఆకాశజలం) వలె ఆరోగ్యకరం. వేడి (వెచ్చనినీరు) చేయబడిన నీరు జ్వరాన్ని, గొంతు బాధల్నీ, ఒళ్ళు బరువులనూ వాత, కఫ దోషాలనూ పోగొడుతుంది. ఆవుపాలు వాయు, పిత్తాలను చెదరగొట్టి జీర్ణక్రియను మెరుగుపరుస్తాయి. శక్తినీ బరువునూ పెంచుతాయి. గేదె పాలు మరింత శక్తివంతములే కాని జఠరాగ్నికి స్వల్పంగా అడ్డంకులనేర్పరుస్తాయి. మేకపాలు రక్తవిరోచనాలనూ, ఆయాసాన్నీ, పడిశాన్నీ, అధిక కఫాన్నీ అరికడతాయి. రక్త పిత్తానికీ, కంటి చూపుకీ చనుబాలు మంచివి. పెరుగు జీర్ణానికి మంచిది. త్రిదోషాలనూ మందగింపజేస్తుంది. బాగా చిలకబడిన పుల్ల మజ్జిగ త్రిదోషాలనూ తొలగించి అన్ని నాళాలనూ శుద్ధి చేస్తుంది.

అప్పుడే తీసిన వెన్న (తాజా), మజ్జిగ త్రిదోషాలనూ తొలగిస్తాయి. వాంతులనూ, విరోచనాలనూ (అతిసారను) అరికడతాయి. అయితే, పులిసిపోయిన పాల పదార్థాలు ఒంటికి మంచివి కావు. (పుల్లమజ్జిగ అల్ప పరిమాణంలో అనుపానంగా ఎక్కడో పనికి రావడం వుంది) వెన్నా, మజ్జిగా మొలలనూ, వేడి కురుపులనూ, పచ్చకామెర్లనూ పోగొడతాయి.

నెయ్యి కూడా ఒక హద్దులోపల ఒంటికి మంచిదే. అన్నం అరగడానికీ త్రిదోషాలూ సోకకుండా ఉండడానికీ దోహదం చేస్తుంది. ఆవునెయ్యైతే మేధకు మెరుగులు దిద్ది, కన్నులలోకి కొత్తవెలుగులను కూడా తెచ్చిపెట్టగలదు. త్రిదోషాలకు తగిన మందులు ఎన్ని వేసినా ఆవు నెయ్యిని ఏదో ఒక మోతాదులో తగిలిస్తే గాని పోవు. ఔషధయుక్తమై భావన (శుద్ధి) చేయబడిన నెయ్యి జ్ఞాపకశక్తిని కాపాడుతుంది. మెదడుకు సంబంధించిన అతి పలవరింతల వంటి అన్ని వ్యాధులనూ కుదురుస్తుంది. మేకపాల నుండి తీసిన నేతికి కూడా ఈ ఔషధీయ గుణాలన్నీ వుంటాయి. మేక మూత్రం కఫ, వాయు దోషాలను పోగొట్టు శక్తినీ, క్రిములను కాల్చి వేసే శక్తినీ కలిగివుంటుంది. కొన్ని విషాలకు విరుగుడుగా కూడా పనిచేస్తుంది.

వైద్య శాస్త్రోక్తంగా తీయబడిన నువ్వుల నూనె గొప్ప ఆరోగ్యకారి. పచ్చకామెర్లు, జారుడు జబ్బు, గజ్జిలోనగు చర్మ వ్యాధులు, పేగు కురుపు, మూలవ్యాధి, ప్లీహ వ్యాకోచం,

చక్కెర వ్యాధి అను బాధలన్నీ దీని వల్ల సమసిపోతాయి. ఆవనూనెను కామెర్లకూ, కొవ్వు వల్ల, వాత, కఫ ప్రకోపాల వల్ల వచ్చే రుగ్మతలకూ వాడితే అవి తగ్గుతాయి. అలసీ (అవిసె)విత్తనాలనుండి ఒక పద్ధతిలో తీయబడిన నూనె త్రిదోష ప్రకోపాలకు మంచిదే కాని కళ్ళు పాడవుతాయి. కఫ, పిత్త దోషాలకు అక్ష నూనెను వాడవచ్చు. అది కేశాలనూ బలపరుస్తుంది. చర్మాన్నీ, రక్త నాళాలనూ మృదువుగా వుంచుతుంది.

ఆయుర్వేదంలో తేనెకున్న స్థానం విశిష్టమైనది. త్రిదోషాలనూ శాంతింపచేసి ప్రాణవాయువును పెంచే శక్తి దీనికున్నది. వెక్కుళ్ళు, పడిశం, క్రిములు, వాంతులు, మూత్రదోషాలు, విషం – మున్నగు రోగాలను ఇది తగ్గించగలదు. అనుపానంగా కూడా ఆయుర్వేదంలో తేనెకు అగ్రస్థానమీయబడింది.

చెఱకు రక్త పిత్తానికి మంచి మందు. బెల్లం వల్ల జీర్ణవ్యవస్థ బలపడుతుంది. అది కఫాన్ని ఉత్పత్తి చేస్తుంది. వాయు, పిత్తరోగాలను తగ్గిస్తుంది. ముతక పంచదార రక్త పిత్తాన్ని (నేతితో కలిపి ముందుగా వాడితే) చెదరగొడుతుంది. జీర్ణానికి కూడా దోహదం చేస్తుంది. పాత బెల్లం అన్ని విధాల మంచినే చేస్తుంది. బెల్లపు సారాయి పిత్త దోషాలను పెంచుతుంది కాని వాత, కఫ దోషాలను తగ్గిస్తుంది. సౌవీరజ పానీయాలు చురుకుదనాన్ని కలిగించినా రక్తపిత్తాన్ని కలిగిస్తాయి. మండాయను పేరుగల వేచిన బియ్యంతో చేయబడిన, అంబలి ఆకలిని, అరుగుదలను బలాన్నీ కూడా సంపూర్ణంగా పెంచుతుంది.

పేయం (కొన్ని ధాన్యాలు, మందులు కలిపి నీరు బాగా పోసి చేసిన జావ) పాడైన వాతాన్ని బాగు చేస్తుంది, శరీరాన్ని తేలికపఱచి మూత్రవ్యవస్థను పదిలపరుస్తుంది. దానిని మజ్జిగ, దాడిమ వ్యోశ, బెల్లం, తేనె, రావిలతో తగు పాళ్ళలో కలిపి లేహ్యంగా చేసి తీసుకుంటే దగ్గు, గొంతువాపు మున్నగు కంఠ వ్యాధులు అతిసార తగ్గిపోతాయి. చారు (రసం) సహజంగానే చింతపండు, నీరుల మిశ్రమం కావడం వల్ల గొంతునుండి చివరి దాకా గల వ్యవస్థను స్వస్థపరుస్తుంది. గుండ్రటి ఉల్లి, ముల్లంగి, పండ్లముక్కలతో నేతితోగాని నూనెతో గాని తయారు చేసిన రసం ఉత్సాహాన్నీ, బలాన్నీ పుంజుకునేలా చేస్తుంది. దీనిని గోరు వెచ్చగా నున్నపుడే త్రాగడం మంచిది.

దాడిమ, ఉసిరికలతో తయారుచేసిన యూష (ఉప్పులేని రసం) జఠరాగ్నిని ప్రజ్వరిల్ల చేసి వాత, పిత్త దోషాలను పోగొడుతుంది. ముల్లంగి యూష (ఉప్పులేని రసం) దగ్గునీ, శ్వాసకోశంలోని ఇబ్బందులనీ జలుబునీ కఫాన్నీ అదుపులోకి తెస్తుంది. యవ, కొల, కులత్థములతో వండిన యూష వాయువును పెంచి, గొంతును బాగుచేస్తుంది. ముద్గతో, ఉసిరికతో ఉడికించిన యూష కఫ, పిత్త దోషాలను నశింపజేస్తుంది.

వేడి మందకాలు (అంబళ్ళు) చలవ చేస్తాయి. పెరుగు, బెల్లం కలిపి తింటే వాతవృద్ధి, శష్కులి (జిలేబీ) ని నేతిలో వేయించుకు తింటే జఠరాగ్ని బాగా జ్వలించడం, సత్తుపిండిని దేనితో కలిపి వండుకు తిన్నా మంచి వాయువుల పెరుగుదలా లభిస్తాయి.

ఏది తిన్నా నీరు తాగడం మానకూడదు. అది దాహాన్ని తీర్చడమే కాక జీర్ణకోశం అలసిపోకుండా కాపాడగలదు. ***(అధ్యాయం - 169)***

# జ్వరం, అతిసార నివారణ

శుశ్రుతా! త్రిదోషాలలో నొకదాని వల్లగాని, రెండింటి వల్ల గాని, మూడు కలిసి వచ్చిన కలిసి దాని కాలంలో గాని వచ్చే జ్వరాలు ప్రధానంగా ఎనిమిది రకాలున్నాయని అనుకున్నాం కదా!

దాహం, ఉష్ణోగ్రతలో విపరీతమైన పెరుగుదల వున్న జ్వరానికి ముస్త, పర్పటక, ఉశీర, చందన, ఉదీచ్య, నాగరలను సమపాళ్ళలో నీళ్ళలో పోసి మరిగించి బాగా చల్లార్చి రోగి చేత త్రాగించడం మంచి చికిత్స. శీఘ్రంగా రోగి కుదుట పడతాడు.

నాగర, దేవకాష్ఠ, ధన్యాక, ద్వివిధ బృహతులతో కషాయాన్ని చేసి త్రాగితే ఏ జ్వరమైనా పోతుంది. పైగా జీర్ణమండలం కూడా బాగుపడుతుంది. ఆరగ్వధ, అభయ, ముస్త, రిక్త, గ్రంథికాలతో చేసిన చిక్కటి కషాయం ఆమ జ్వరానికి అద్భుతమైన మందు.జ్వరం బాగా పెరిగిపోయి అపస్మారక స్థితిలోకి పోయిన రోగికి మధూకసార, సింధూత్థ, వచ, ఊషణ, కణలను సమపాళ్ళలో కలిపి పొడిచేసి నీళ్ళలో కలిపి త్రాగిస్తే వెంటనే గుణం కనబడుతుంది.

మొత్తం లోపలి భాగాలన్నిటినీ కడిగేసి మరీ, ఏ జ్వరాన్నయినా తగ్గించేశక్తి త్రివృత, విశాల, త్రిఫల, కటుక, ఆరగ్వధ, చూర్ణాలను లవణజలంతో కలిపి తయారుచేసిన ఔషధానికుంది. తృతీయక జ్వరానికి శొంఠి, గుడూచి లేదా హరీతకి, ముస్త, చందన, ఉశీర, ధాన్యకలను పంచదారతోనూ నూరి తేనెతో రంగరించి తయారుచేసిన మందు బాగా పనిచేస్తుంది. అపామార్గ జటాలను ఏడు ఎఱ్ఱని దారాలతో కట్టి ఆదివారం నాడు రోగి నడుముచుట్టూ కడితే కూడా ఈ జ్వరం తగ్గుతుంది. (జటాని జఠాగా వ్రాస్తారు)

తఱచుగా వచ్చే జ్వరాలకు తర్పణాల సాధన మొకటుంది. పుత్ర సంతానం లేనివాడూ, సన్యసించిన పిమ్మట గంగోత్తర తీరంలో మృతి చెందినవాడూ నగు వ్యక్తి పేర తిలలతో తర్పణాలర్పించడం.

గుడూచి, త్రిఫల, వాసక, ఋజ్వీక, వేరుతో కలిపియున్న బల – వీటిని నేతితో కలిపి కషాయం చేసి సేవిస్తే జ్వరం పోతుంది. అలాగే ధాత్రి, శివ, కణ,చిత్రకాలను కలిపి తీసిన కషాయం చాలా వఱకు జ్వరాలను తగ్గిస్తుంది.

జ్వరం, విరేచనాలు ఒకేమారు వస్తే పృశ్నపర్ణి, బల, బిల్వ, నాగర, ఉత్పల, ధన్యాక, పాఠ(ఠ)ఇంద్రయవ, భూనింబ, ముస్త, పర్పరక, శౌంఠిలను కలిపి కషాయం చేసి రోగికిస్తే అవి తగ్గుతాయి. ఇది చీముపడుతున్న నులుగడుపుకి బాగా పనిచేస్తుంది. నాగర, అతివిశ, ముస్త, నేలవేము, అమృత, వత్సకలతో చేసిన కషాయం అన్ని రకాల జ్వరాలనూ విరేచనా లనూ కుదుర్చుతుంది. విశ్వ, మామిడి టెంకల కషాయంలో కాస్త ముతక చక్కెరనుకలిపి తేనెతో రంగరించి త్రాగినా, కుటజం బెరడును కణతో కలిపి పొడిచేసి తేనెతో కలిపి త్రాగినా, అతిసార అదుపులోకి వస్తుంది.

ముస్త, పర్పరక, శృంగవేర, ఉదీచలను వేడినీటిలో మరగించి చల్లార్చి అతిసార రోగికివ్వాలి. వానికి ఆహారంతోబాటు శాలపర్ణి, పృశ్నిపర్ణి, బృహతి, కంటకారిక, బల, స్వదంష్ట్ర (గోక్షుర) విశ్వాది, పాఠ, నాగర, ధాన్య కాల కషాయాన్నిస్తే మంచి గుణం కనిపిస్తుంది. కడుపులో శూల, రక్త విరోచనాలు, చీము పడుట, అతిసార రోగాలకు (రోగానికి) వత్సక, అతివిష, తిశ్వ, కణ, కందలతో చేసిన  కషాయాన్ని వాడాలి.

చిత్రకను కషాయంగా చేసి, అడుగంటే దాకా ఆవిరి చేసి మిగిలిన దానిని నేతితో కలిపి ఇస్తే గ్రహణి, ప్లీహవ్యాకోచం, మొలలు, శూల తగ్గుతాయి.

మొలలకు అయిదు రకాల ఉప్పును వాడాలి. అవి: సౌవర్చల, సైంధవ, విడంగ, ఔద్భిద, సాముద్రికలు. అప్పుడే చిలికిన మజ్జిగను గంటకొక రకం లవణంతో ఇస్తే గుణం కనిపించవచ్చు. శస్త్రచికిత్సకూడా ఉంది.

జీర్ణశక్తి పెరగడానికి పంచకొల, త్రియూషణ, మిరియాలు గుండ చేసి కషాయం చేసి ఇస్తే మంచిది. హరీతకిని నాగర, బెల్లం లేదా ఉప్పు గడ్డలతో కలిపి తరచుగా తీసుకుంటే ఆకలి పెరుగుతుంది. తాపజ్వరం, పచ్చకామెర్లు తగ్గించడానికి త్రిఫల, అమృత, వాస, తిక్త, భూనింబ, నింబాలను కషాయము చేసి తేనెతో కలిపి ఇవ్వాలి. సన్నిపాత జ్వరాలకూ, రక్తం గడ్డకట్టడానికీ త్రివృత, త్రిఫల, శ్యామ, పిప్పలులను తేనెతో పంచదారతో కలిపి ఇస్తే మంచిది.

వాసమందు  దొరుకుతున్నంతకాలం దగ్గు, కోరింత దగ్గు, రక్తస్రావక వ్యాధులు గల రోగులు నిరాశచెందనక్కరలేదు. ఆటరూషక (వాసక) మృద్వీక, పథ్యములను పందార, తేనెలతో కలిపి తీసుకుంటే గొంతు దురదవేసి కొండనాలుక క్రిందికి తగిలి దగ్గువచ్చే

రోగం తగ్గుతుంది. రక్తవ్యాధి (హీమోటైసిస్) కూడా పోతుంది. ఈ కషాయాన్ని నిత్యం ఇంట్లో ఉంచుకోవాలి. రక్తస్రావం వెంటనే కట్టాలంటే వాసరసాన్ని పటిక పంచదారతో, తేనెతో కలిపి త్రాగించాలి. అలాగే సల్లకి, బదరి, జంబు, ప్రియాల, ఆమ్ర, అర్జున లేదా ధవలను కలిపి తీసిన రసాన్ని పాలలో కలిపి తాగితే రక్తం కారడం ఆగుతుంది.

నిర్గుండి వేరు, పండు, ఆకు కలిపి శుద్ధి చేసి, నేతితో కలిపి తిన్నవారికి అధికాహారం వల్ల వచ్చే సమస్యలు తగ్గిపోతాయి. తరువాత మాత్రం తిండి తగ్గించాలి. అన్నద్వేషం, దగ్గు, దాహం గల రోగికి హరీతకి, సొంఠి, కణ, మిరియాలు, బెల్లం కలిపిన కషాయాన్ని వ్వాలి. కంటకారి లేదా గుడూచి రసంలో ఒక ప్రస్థ బరువున్న నేతినీ, ముప్పది పలాల కొలతలో రసాన్నీ కలిపి వేడి చేసి చల్లార్చి త్రాగిస్తే దగ్గు, అజీర్ణం తగ్గిపోతాయి.

కృష్ణ (రావిలో ఒకరకం) ధాత్రి, శిత, శుంఠిలను తేనెతో కలిపి సేవిస్తే వెక్కిళ్ళు ఆగిపోతాయి. ఆయాసమున్న రోగికి భార్గి, విశ్వరసాలను వెచ్చని నీటితో కలిపి ఇస్తే ఉపశమనం వుంటుంది. నాగర, పథ్యాలను గాని, రావి, పథ్యాలను గాని, కాస్త నూనెతో కలిపి ముద్ద చేసిన కాచుని గాని చప్పరిస్తే గొంతు పట్టడం, బొంగురు పోవడం తగ్గుతాయి. భావన నేతిని అశ్వగంధ కషాయంతోనూ ఈ ముద్దకి నాలుగింతల కొలతలో పాలతో కలిపి తీసుకుంటే వీర్యవృద్ధీ, శృంగార సామర్థ్యమూ కలుగుతాయి. మతి భ్రమణాన్నీ, గ్రహాపస్మారాన్నీ తగ్గించడానికి పాత నేతితో బ్రాహ్మీరసం, వచ, కుస్థ (ష్ట) శంఖపుష్పిలతో కలిపి తీసుకోవాలి. ఛిన్న, నీలి, ముందీరికల కషాయాన్ని నెయ్యి, తేనెల మిశ్రమంతో కలిపి స్వీకరిస్తే ఎంత విపత్కరమైన వాత రక్తదోషమైనా సరే, సమసిపోతుంది. దీనితో బాటు మూర్ఛ కూడా గల వారికి త్రిఫల, గుగ్గిలాలను కలిపి ఇవ్వాలి.

తొడల కదలికలు మందగించి పక్షవాతదశకు చేరుకున్న రోగికి గోమూత్రాన్ని గుగ్గిలంతో కలిపి ఇవ్వాలి. సామవాతానికి గోక్షురక, శుంథి కషాయం బాగా పనిచేస్తుంది. దశమూల, అమృత, ఎరండ, రాస్న, నాగర, దేవదారు కషాయాన్ని బెల్లం, మిరియాలతో కలిపి తీసుకుంటే పరమ మొండి వ్రణాలూ, కురుపులూ నశిస్తాయి. ఈ కషాయం దగ్గునీ, దాహాన్నీ, అన్న విరక్తినీ కూడా కుదిర్చివేస్తుంది.

కంటకారి రసం ముప్పది పళాలూ, గుడూ చిరసమొక ముప్పది పళాలూ తీసుకొని ఒక ప్రస్థ పరిమాణం గల నేతితో కలిపి వేడి చేసి చల్లార్చి ఆ ముద్దను తగినంతగా స్వీకరిస్తే దగ్గు, గుండెనొప్పి మాయమవుతాయి. ఆకలీ పెరుగుతుంది. కృష్ణ, సొంటి, శిత, మరిచల కషాయాన్ని గెడ్డలుప్పుతో, ఆముదంతో కలిపి తీసుకుంటే కడుపులో మంట, సామవాత ప్రకోపం తగ్గుతాయి. వాతశూలకి బల, పునర్నవ, ఎరండ, ద్వివిధ

బృహతి, గోక్షుర కషాయానికి ఉప్పు, ఇంగువలను కలిపి చేసిన మందు మంచిది. త్రిఫల, నింబ, యష్టిక, కటుక ఆరగ్వధాలతో కషాయాన్ని తయారుచేసి దానిని వేడిచేసి చల్లార్చిన ముద్దలో తేనెను కలిపి త్రాగితే కడుపులో మంట, ఉదరశూల తగ్గుతాయి. ఉదరశూలలోనే పరిణామార్తి అని మరోరకం కడుపునొప్పి వుంది. ఇది త్రిఫల చూర్ణాన్ని నీటిలో కలిపి యష్టికనందులు వేసి స్వీకరిస్తే తగ్గుతుంది. మండూరాన్ని గోమూత్రంతో శుద్ధిచేసి త్రిఫల చూర్ణంతో కలిపి తేనెతో రంగరించి వేసుకుంటే త్రిదోష జన్యమైన ఉదరశూల ఉపశమిస్తుంది. రెండు పాళ్ళు త్రివృతం అయిదుపాళ్ళు హరీతకి, నాలుగుపాళ్ళు కృష్ణంలను కలిపి ముద్ద చేసి సమపాళ్ళలో బెల్లంను కలిపి చిన్నచిన్న వుండలుగా జేసి చప్పరిస్తే మలబద్ధకం పోతుంది. వ్యాధి తీవ్రతను బట్టి ఉండలను వాడాలి. మలబద్ధకంతో బాటు ప్రేగు (వాయు) బొడిపెలు కూడా ఉన్నవారు అవి తగ్గాలంటే హరీతకి, యవక్షార, పిప్పలి, త్రివృతాలను నేతితో కలిపి వాడాలి. అలాగే త్రివృత, హరీతకి, శ్యామాలను స్నుహిరసంలో శుద్ధి చేసి ఎండబెట్టి మాత్రలుగా చేసి వాటిని తగినంతగా గోమూత్రంతో కలిపి తీసుకున్నా ఆనాహరోగం (మలబద్ధకం) తగ్గుతుంది.

త్రయూషణ, త్రిఫల, ధన్య, విడంగ, చవ్య, చిత్రకాలను నీటిలో మరగబెట్టి పూర్తిగా ఆవిరిపాలు చేయగా అడుగున మిగిలిన అవశేషాన్ని నేతితో కలిపి తీసుకుంటే వాత దోషాలూ, ప్లీహవ్యాకోచమూ నశిస్తాయి. నాగరవేరు, పాలు లేదా సౌవర్చల ఉప్పులను ఆడగుంట నక్కపాలతో కలిపి తీసుకుంటే గుండెదడ తగ్గుతుంది. కణ, పాషాణభేద, ఏలక, శిలాజటుకలను బియ్యం కడుగుతో బెల్లంతో కలుపుకొని  తాగితే మూత్రశూల పోతుంది.

వాత, మూత్ర, ప్రేగు దోషాలన్నిటికీ అమృత, నాగరి, ధాత్రి, వాజిగంధ, త్రికంటక లతో చేసిన కషాయం బ్రహ్మాండంగా పనిచేస్తుంది. కంటకం రసాన్ని తేనెతో కలిపి త్రాగినా యవక్షారమును సమాన పరిమాణంలో చక్కెరతో కలిపి తిన్నా మూత్ర విసర్జన కష్టాలు తొలగుతాయి. త్రిఫల చూర్ణాన్ని నీటితో కలిపి ముద్ద చేసి ఉప్పేసుకొని తిన్నా మూత్రం ధారాళంగా పోతుంది. కర్పూరపొడిని లింగం లోనికి జొనిపితే మూత్రం బాగా జారుతుంది. శిగ్రువేరుని కషాయం చేసి గోరువెచ్చగా త్రాగితే మూత్ర విసర్జనలో మంట తగ్గుతుంది. ధాత్రి,నిశా,తేనెలతోడి రసం గానీ, త్రిఫల, దారు దార్వి, అబ్జలపొడిని తేనెతో కలిపిన మిశ్రమం గానీ మూత్ర సమస్యలను తీరుస్తాయి.

బక్కగా వున్నవాడు దుక్కగా కావాలంటే యవ,శ్యామాకలను తినాలి. తీయని నీటిని త్రాగుతుండాలి. లావుపాటి వాళ్ళు సన్నబడాలంటే బాగా వేచినబార్లీపొడిని తేనెతో కలుపు కొని తినాలి. జీలకఱ్ఱ, చవ్య, వ్యోశ,ఇంగువ, సౌవర్చల ఉప్పు, అమలల మిశ్రమాన్ని తీసుకుంటే కొవ్వు తగ్గుతుంది.ఆకలి పెరుగుతుంది. అంటే ఒళ్ళు తగ్గుతుంది.బలం తగ్గదు.

చిత్రక ఉత్పలాలను రెండేసి ప్రస్థల పరిమాణంలో తీసుకొని నీటిలో బాగాతవ్వి ఆవిరైపోయేదాకా మరిగించి పాత్రలో మిగిలిన ముద్దను నాలుగుమార్లు నీటితో కలిపి వడకట్టి, రెండుమార్లు గోమూత్రంతో కడిగి ఎండబెట్టి ఒక ప్రస్థ నేతితో, ఒక ప్రస్థ పాలతో కలిపి స్వీకరిస్తే అన్ని రకాల ద్రవోదరాలు పోతాయి.

ఆరోగ్యంగా లావెక్కడానికీ, చిరకాలం జీవించగలగడానికి, ద్రవోదరం, మహోదరాలు నశించడానికీ పది పిప్పలి గింజలతో మొదలుపెట్టి రోజుకి పది పెంచుకుంటూ పోయి అలా పదిరోజులపాటు పాలతో తినాలి. తరువాత రోజుకి పదిచొప్పున తగ్గించుకుంటూ రావాలి. ఈ ఇరవైరోజులూ ఆహారంగా యష్టికనీ పాలనూ మాత్రమే స్వీకరించాలి. ఇలాగే కృష్ణ లేక ముద్గ అనే మందులతో కూడా ప్రయత్నించవచ్చును. ఇవి మాత్రం వెయ్యి ముక్కలదాకా వుండాలి.

పునర్నవ కషాయం ముద్దతో నేతిని కలిపి వేడి చేసి చల్లార్చి తీసుకుంటే కడుపుబ్బు తగ్గుతుంది. దీనితో పాటు బొడిపెలు మున్నగునవి కూడా కలవారికి గోమూత్రంలో నానబెట్టి తీసిన పిప్పలిని పాలతో కలిపి ఇస్తే గుణం కనిపిస్తుంది. అలాగే బెల్లం, అభయ లేదా విశ్వలను సమపాళ్ళలో పిప్పలి, గోమూత్రాలతో కలిపి ఇవ్వవచ్చు.

బల అనే మందును కషాయం చేసి పాలతోనూ ఆముదంతోనూ కలిపి తాగితే కడుపుబ్బు, ఉదరరోగాలూ, గిలక (ప్రేగు – వృషణ సంబంధి) రోగం నిమ్మళిస్తాయి. పథ్య ఔషధ, ఆవిరిశేషాన్ని కృష్ణ, సైంధవ, ఆముదపు వేచిన విత్తనాల కషాయంతో కలిపి తీసుకుంటే వరిబీజం (వృషణ వ్యాకోచం) తగ్గుతుంది.

శరీరంలోపలి కురుపులు స్నుహీగండీరక కషాయంతో కాపడం పెడితే పోతాయి. ఇలాటి కురుపే విద్రధి కూడా అది తేలని కురుపు.అది శోభాంజనాక. సింధూత్థ, హింగ్వౌషధాలను ముద్దచేసి పట్టీవేస్తే పోతుంది. కుష్ఠ ప్రారంభ దశయనదగు కంఠగండమాల నిర్గుండి ముద్ద చేసి పట్టీ వేస్తే  కంఠిరోగ సమసి పోతుంది. ధత్తూర, ఎరండ, నిర్గుండి ముద్దను పూస్తే పోవచ్చు. హస్తికార్ణ, పలాశలను వర్షభూ, శిగ్రు, సర్షపాలపొడితో నీటితో ముద్దను తయారుచేసి పట్టీ వేస్తే బూరగాలు తగ్గుతుంది. శోభంజనక (ముద్ద పసుపు) సింధూత్త, హిందూత్తలతో కడుపుపై పట్టీ వేస్తే ఉబ్బరం తీస్తుంది. శరపుంఖాన్ని తేనెతో కలిపి పట్టీ వేస్తే లోపలి కురుపులు నశిస్తాయి. వేపాకులను ముద్దచేసి రాస్తే చీము పట్టకుండా కాపాడుతుంది.

త్రిఫల, ఖదిర, దార్వి, న్యగ్రోధాలను ముద్దజేసి రాస్తే కురుపులు, గాయాలు ప్రక్షాళన చేయబడతాయి. యష్టి, మధుకాలను (వేడి) నేతితో కలిపి అప్పుడే తగిలిన గాయాన్ని ఎంత నొప్పికైనా ఓర్చుకొని గట్టిగా రుద్ది కడుక్కుంటే శీఘ్రమే అది మానిపోవచ్చు.

దూషితమైన పిత్తాన్నీ, రక్తపు వేడినీ చలువచేసే మందులతోనో సామాన్య ఆహార పదార్థాలతోనో తగ్గించవచ్చు. వెదురు, ఎరండ, స్వదంష్ట్ర బెరళ్ళను పొడిచేసి తేనె, హింగు, గెడ్డ ఉప్పులతో కలుపుకొని త్రాగితే రక్తం పరిశుభ్రమవుతుంది. మలిన రక్తం బయటికి పోతుంది.సామాన్యారోగ్యంచెడకుండా వుండాలంటేయవ,కొల,కులత్థలనుయవాగు (అంబలి లాటిది) తో కలిపి కాస్త గడ్డవుప్పేసుకొని తఱచుగా తింటుండాలి. కరంజారిష్ట, నిర్గుండి రసాలను కలుపుకొని తాగితే పురుగులునశించి అంతర కురుపులు మాడిపోతాయి. గుగ్గిల, త్రిఫలమాత్రలు నొప్పిని తగ్గిస్తాయి. మలబద్ధకాన్ని పోగొడుతాయి. ***(అధ్యాయం -170)***

# నాడీ వ్రణాది రోగాల చికిత్స

నరం మీద లేచిన కురుపుని నాడీవ్రణమంటారు. దీనికి శస్త్రచికిత్స అవసరమైనపుడు వెనుకాడరాదు.

సాధారణంగా గుగ్గిలం, త్రికుట, త్రిఫలాలను సమానపాళ్ళలో తీసుకొని శుద్ధిచేసి సిద్ధం చేసుకొని వుంచిన నేతితో కలిపి దాని సహాయంతో నాడిలో లేచిన వికృతవణాలపై, శూలపై,భగందరమను రోగంపైవిజయాన్ని సాధించవచ్చును.నిర్గుండకీ రసాన్ని శుద్ధతైలంతో కలిపి పూస్తే నాడీ దోషాలూ,వ్రణాలూ దూరమౌతాయి.పామాయను రోగానికిఈ మందును త్రాగించి కాని, అంజనం చేసి పూసి గాని, ముక్కుపొడుంగా చేసి పీల్చడం ద్వారా గాని చేసే గొప్ప గుణం కనిపిస్తుంది. మూడుపాళ్ళు గుగ్గిలం, అయిదుపాళ్ళ త్రిఫల,ఒక పాలు నల్లతుల సాకులను కలిపి తయారుచేసిన గుటికలను సరైన మోతాదులో వాడితే కురుపులు, గుల్మాలు, మొలలు, భగందరాలు తగ్గుతాయి. శిశ్న సంబంధిత సుఖ రోగానికి (ప్రస్తుత భాషలో సిఫలిస్) పఠోల,నింబ, భూనింబ, గుడూచిల మిశ్రమంతో కషాయం చేసి దానిలో గుగ్గిల, ఖదిరలను కలిపి త్రాగించాలి.ఈ రోగంలో నేర్పడు పొక్కులకూ,మచ్చలకూ నల్లగా మాడేదాకా పెనం మీద కాల్చిన త్రిఫలను బూడిద చేసి తేనెలో కలిపి పూస్తే గుణం కనిపిస్తుంది.అలాగే మందు నెయ్యిని త్రిఫల, నింబ, భూనింబ,కరంజ, ఖదిరల కషాయాన్ని ఆవిరిచేయగా మిగిలిన పొరకు చేర్చి ఉపయోగిస్తే ఈ శిశ్నరోగం వేగంగా తగ్గుతుంది.

ఎముక పగులు వేసినపుడు ఆచోటును బాగా కడిగి మన్ను, సున్నాలతో పట్టీ వేసి దర్భ గడ్డితో చుట్టాలి. మినుము, నెయ్యి, పాలు ఎక్కువగా ఆహారంగా పెట్టాలి. జింజెల్లీ గింజలతో చేసిన చారును తాగిస్తుండాలి. నిర్మాణాత్మక గుణాలున్న వాటినే తినిపించాలి.

ఎముక విరిగినవారు కొన్నాళ్ళపాటు వెల్లుల్లి, వేచిన బియ్యం లేదా ఇతర ధాన్యాలను కడిగిన నీటిలోపంచదారను వేసి వేడిచేసిఆవిరిపోగా అడుగున మిగిలినశేషము తింటూ

వుండాలి. దీనివల్ల ఎముక మిక్కిలి వేగంగా అతుక్కుంటుంది. అశ్వత్థ, త్రిఫల, వ్యోశలను సమపాళ్ళలో కలిపి ముద్దజేసి దానికి సమాన పరిమాణంలో గుగ్గిలాన్ని కలిపి మరల ముద్దను తయారుచేసి ఎముకలు కలిసే చోట్ల, బాధిత స్థలాల్లో రాస్తే అస్థిబాధలన్నీ తగ్గిపోతాయి.

కుష్టురోగాలన్నిటికీ వాంతి మందులు, క్షాళకాలు, రక్తమును పిండడాలు అత్యవసరం. ఆ తరువాత తగిన మిశ్రమాలను గాయాలపై గాని కురుపులపై గాని రాస్తుండాలి. వచ,వాస, పటోల, వేపబెరడు, ప్రియంగుల కషాయాన్ని తేనెతో కలిపి త్రాగించాలి. అది వాయువు నడుపులోకి తెచ్చి నిర్మాణాత్మకంగా పనిచేస్తుంది. క్షాళణాదులను త్రివృత, దంతి, త్రిఫల మిశ్రమాలతో చేయవచ్చు. మనశ్శిల, మిరియాలు, మందుకై శుద్ధిచేసిన నూనెతో కలిపి రాస్తే కుష్టు తగ్గవచ్చు. మైరో బాలన్లను అయిదు రకాలనూ అన్నంతో బెల్లం పాకంతో కలిపి తింటే శీఘ్రమే గుణం కనిపిస్తుంది. విడంగ, నాగబాల, కుష్ఠ, నిశ, సింధుత్థ, సర్ష పాలను నీటిలో  వేసి ఒక గంట తరువాత వడగట్టి ఆ ముద్దను గోమూత్రంతో కలిపి రాస్తే గుండ్రటి క్రిమి నశిస్తుంది.

మనశ్శిల, విడంగ, వాగుజి, సర్షప, కరంజిలను గోమూత్రంలో కలిపి ముద్ద జేసి రాస్తే కుష్టు నశించి శరీరం సూర్యుని వలె మెరుస్తుంది. ఆరగ్వధాకులను పిండిచేసి ఆర్నాలతో కలిపి ముద్దగా చేసి పూస్తే గుండ్రటి (బద్దె) పురుగు, కిట్టిమ, కుష్టు, సొరియాసిస్ నశిస్తాయి. వేడిపాలలో వాగుజి వేసుకొని తాగితే కుష్టు తగ్గుతుంది. జింజెల్లీ విత్తనాలు, నెయ్యి, త్రిఫల, తేనె, పంచదార, భల్లాట, వ్యోశ సమపాళ్ళలో కలిపి స్వీకరిస్తే శృంగార సామర్థ్యం పెరుగుతుంది. అంతేకాక శరీరంలో కుష్టు అణువులు చేరివుంటే అవి నశిస్తాయి. మెదడు చురుగ్గా పనిచేస్తుంది. జ్ఞాపకశక్తి పెరుగుతుంది. నాడీవ్రణం, మొల, మలద్వారంలో కురుపులు, కుష్టు, చక్కెరవ్యాధి ఇవన్నీ విడంగ, త్రిఫల, కృష్ణలను పొడిగా చేసి తేనెతో కలుపుకొని తాగితే కుదిరిపోతాయి. ఇది మంచి లేహ్యం.

మామిడి, ఖదిర మొలకలను ఒక కుండలో పెట్టి బూడిద మిగిలేదాకా వేడి చేసి అక్షరసంతో, తేనెతో, ధాత్రిరసంతో కలిపి తాగితే కుష్టుపోతుంది. నిశ, ఉసిరికలను అభయారిష్టతో కలిపి ఒక నెలపాటు తింటే కుష్టుకుదిరిపోతుంది. అలాగే భల్లాటక తైలాన్ని తాగినా, ఖదిర జలాన్ని కొన్ని పోషక పానీయాలతో కలిపి తాగినా కుష్టు దూరమవుతుంది.

కుష్టు రాక్షసుని పాలిటి ఇంద్రుని వజ్రాయుధం లాటి మందొకటుంది.  మందు కోసం ప్రత్యేకించి తయారుచేసిన (భావన) నేతిని వాచ, గుడూచి, త్రిఫల,పటొల, కరంజక, నింబ, అశన, కృష్ణ వేత్ర కషాయంతో కలిపితే వచ్చే మందు కుష్టుని కుదుర్చుటయే

కాదు. జీవితంలో మరెప్పుడూ రాకుండా చేస్తుంది. పైగా ఆయువును కూడా పెంచుతుంది. దుర్వాగడ్డి నుండి రసం తీసిదానిని దానికి నాలుగింతల పరిమాణం గల నూనెతో కలిపి వేడి చేసి చల్లార్చి శరీరాన్ని దానితో మర్దించుకొని కొంతసేపు అలాగే వుండి తరువాత స్నానం చేసెడివారికి ఏ చర్మవ్యాధులూ వుండవు. దురదలూ, కురుపులూ దరిచేరవు. అదే విధంగా మందు నూనెలో ద్రుమ బెరడు, అర్క, కుశ్త, లవణ, చిత్రక, గందీరికలను వేసి, వేచి, తీసినదానికి గోమూత్రాన్ని కలిపి వినియోగిస్తే కుష్ఠరోగం, ఇతర, అంతర బొడిపెలూ మాడిపోతాయి. ధాత్రి, నింబఫల, చిత్రకాలను పొడిచేసి గోమూత్రంలో ముంచి ఒంటికి రాస్తే దురదలుండవు.

ఆమ్ల పిత్త (ప్రస్తుత భాషలో ఎసిడిటీ) మును నిర్మూలించడానికి వాస, అమృత, పర్పటిక, నింబ, భూనింబ, మార్కర, త్రిఫల, కులత్థలను కలిపి కషాయం చేసి తేనెతో కలిపి వాడాలి.

అలాగే త్రిఫల, పటోల, తిక్త కషాయానికి పంచదారనూ యష్టిమధునూ కలిపి తీసుకుంటే జ్వరం, ఆమ్లపిత్తం, వాంతులు తగ్గుతాయి. వాస, తిక్త, పిప్పలి లేదా గుడ-కూష్మాండాలతో నేతిని కలిపి వండిన లేహ్యం అలాగే పిప్పలి, తేనె ముద్ద కూడా ఆమ్ల పిత్తాన్ని తగ్గిస్తాయి.

పిప్పలి, పథ్య,బెల్లాలను ముద్దగా చేసి వాడితే కఫదోషాలూ, అజీర్ణమూ నిమ్మళిస్తాయి. జీలకఱ్ఱ, ధన్యాకాలను కలిపి బాగా నూరి ఒక ప్రస్థనేతిలో వేయించి స్వీకరిస్తే కఫ, పిత్త దోషాలూ, అన్నద్వేషం, జీర్ణక్రియలో తేడాలూ నశిస్తాయి. వాంతులు తగ్గుతాయి.

పిప్పలి, అమృత, భూనింబ, వాసకారిష్ట, పర్పర, ఖదిరారిష్టలు కలిపిన కషాయం మిక్కిలి నొప్పులనూ, జ్వరాన్నీ, (ఎఱ్ఱ)కురుపులనూ తగ్గిస్తుంది. త్రిఫల, త్రివర్తలను పొడిచేసి నేతితో కలిపి వేడి చేసి చల్లార్చి తింటే శరీరంలోపలిభాగాలు క్షాళితములవుతాయి. అక్కి అనే దద్దు రోగంతో బాటు జ్వరం కూడా పోతుంది.

అష్టక – క్వాథ మనే కషాయం సర్వతీవ్ర చర్మ రోగ నివారిణి.దీనిని ఖదిర, మూడు రకాల ఫల(త్రిఫల) అరిష్ట, పటొల, అమృత, వాసకాలను కలిపి తయారుచేస్తారు. విసర్ప, కుష్ఠ, విస్ఫోట వంటి మొండి రోగాలకు కూడా ఉద్వాసన చెప్పగలిగే గొప్ప ఔషధమిది.

కాపాలకుష్ఠ అనే రోగానికీ, దానివల్ల వచ్చే దురదకీ గుంజపండ్లను నూనెతో కలిపి వేయించి భృంగరాజరసంతో కలిపి చేసిన మందు బాగా పనిచేస్తుంది. జలగర్దభ రోగం పటొల, నీలిమందులను కలిపి రాస్తే నశిస్తుంది.

కేశవర్ధకమూ, కేశసౌందర్య వర్ధకమూ కూడా ఆయుర్వేదంలో ఉంది. మామిడి టెంకలను చితగొట్టి ముద్దచేసి దానిని త్రిఫల, నీల, భృంగరాజక, లౌహచూర్ణ, కాంజికలతో కలిపి వేడి చేసి చల్లార్చి తలకి రాసుకుంటే పండిపోయిన జుట్టు మరల నల్లబడుతుంది. క్షీరి, ఈశ, అర్క, ఆకులను పిండి వాటి రసాన్ని రెండు ప్రస్థల పరిమాణంలోనూ, ఒక పళం మధుకాన్నీ పన్నెండు పసరల (పసరు కాదు)తో సిద్ధం చేసి నూనె(కుడవ) తో కలిపి వండి తలకి రాస్తే వయసు మీరడం వల్ల తెల్లబడిన వెంట్రుకలు మరల నల్లబడతాయి. తల నెరవడం కనిపించగానే ఈ మందుని వాడితే ఇక జుట్లు నల్లనేబడదు.

త్రిఫలను నోట్లో వేసుకుని పుక్కిలించి ఉమ్మితే ముఖం మీది అవాంఛిత రోమాలు రాలిపోతాయి. గొంతు, దంతరుగ్మాతలు లోధ్ర, త్రిఫల, చిత్రకలను బాగా చితగొట్టి తేనెతో రంగరించి ఆ ముద్దను వీలైనంతసేపు నోటిలో ఉంచుకుంటే తగ్గుతాయి. పటోల, నింబ, జంబీర, ఆమ్ర, మాలతుల చిగుళ్ళతో మొగ్గలతో పంచపల్లవ కషాయాన్ని తయారుచేసి నోటిలో రాసుకుంటే అందులోని రోగాలన్నీ తగ్గుతాయి.

లశున, ఆర్ద్రక, శిగ్రు, పారులి, మూలక, కదలీ రసాలను కలిపి గోరువెచ్చగా జేసి ఒక చుక్కను చెవిలో వేస్తే కర్ణ సమస్యలన్నీ తీరిపోతాయి. లాడి కారు వ్యాధి సంక్రమించి, తీవ్రవేదనతో,గింగురు ధ్వనితో బాధపడుతున్న వారికి గెడ్డ ఉప్పును మెత్తగా నూరి స్నుహి ఆకుల రసాన్ని దానికి కలిపి గోరు వెచ్చగా చేసి వాడితే ఫలితముంటుంది. తీవ్రమైన కర్ణశోధకు జాతి ఆకుల రసాన్ని నూనెతో కలిపి ఉడికించి చల్లార్చి వెచ్చగా వుండగా వాడితే తగ్గిపోతుంది. చెవిపోటు పెడుతున్నవారికి సొంఠి, లేదా ఆవనూనెను వెచ్చగా చేసి చెవిలో పోస్తే ఉపశమనం కలుగుతుంది.

పంచమూలి రసాలతో చిత్రక, హరీతకి, బెల్లం, నెయ్యిలను పాలలో ఉడికించి చల్లార్చితే దానికి షడంగయూషమని పేరు. ఇది పడిశానికి బ్రహ్మాండమైన మందు. కంటివాపు ధాత్రి రసాన్ని కంటిలో వేస్తే తగ్గుతుంది. కంటికి పైన శిగ్రు, దర్వి, రసాంజన, తేనెలో కరిగించిన ఉప్పుగడ్డలను ముద్దగా చేసి పూస్తే కంటి బాధలు చాలా వఱకు నశిస్తాయి. అలాగే హరిద్రభస్మం, దారు సింధుత్త (త్థ), రసాంజన, గైరికల ముద్ద కూడా కంటి రుగ్మతలను పోగొడుతుంది. అభయ, త్రిఫలలను నేతిలో వేచి నీటిలో ముంచి కంటి చుట్టూ రాస్తే మంచి ఫలిత ముంటుంది. శొంఠిని వేపాకులతో కలిపి బాగా పొడి చేసి ఉప్పురేణువును కంటి చుట్టూ రాస్తే చిన్న పగుళ్ళు, దురద, నొప్పి వంటి కంటి ఇబ్బందులు నశిస్తాయి.

అభయ అనే ఓషధినీ, దానికి రెండింతల అక్షనూ దానికి రెండింతలు అమృతనీ కలిపి బాగా మరిగించి ఆపై చల్లార్చి కషాయం చేసి తేనె, నెయ్యిలతో కలిపి అవలేహాన్ని

తయారుచేసి వుంచుకోవాలి. దీనిని కనులు లాగినపుడు, కన్ను నొప్పెట్టినపుడు తింటే ఆ బాధలు తగ్గుతాయి.

చందనం వత్తులు, త్రిఫల, పూగపలాశ, తరు మూలకాలను పొడిచేసి నీళ్ళలో కలిపి కరిగించి కంటికి రాస్తే అవి చీకట్లు కమ్మడం ఆగుతుంది. మిరియాల పొడిని పెరుగుతో కలిపి తింటే రేచీకటి తగ్గుతుంది. త్రిఫల చూర్ణాన్ని పాలలో వేసి మరిగించి కషాయం చేసి వడకట్టి రాత్రి నేతితో కలిపి తింటే కంటి చూపు మెరుగవుతుంది. పిప్పలి, త్రిఫల, ద్రాక్ష, లౌహచూర్ణ, సైంధవ లవణాలను భృంగరాజ రసంలో పోసి ముద్దచేసి అంజనంగా తయారుచేయాలి. దీనిని ఘటికాంజన మంటారు. దీనిని కంటికి పెడితే అంధత, త్రిదోషజన్యతిమిరత, దురద మున్నగు నేత్ర సంబంధిత రోగాలన్నీ నశిస్తాయి. త్రికటు, త్రిఫల, సైంధవ లవణం, రుచిక, శంఖనాభి, మాలతిపూవు, వేపాకులు, రసాంజన, భృంగరాజాలను బాగా చూర్ణం చేసి దానిని నెయ్యి, పాలు, తేనెలలో వేసి చిలికి తయారు చేసిన వటి అను మందు సర్వనేత్ర పీడలనూ పారద్రోలి కనులు మిసమిసలాడేలా చేస్తుంది.

ఎరండజడాన్ని కాల్చి ఆ మసిని మజ్జిగ తేటతో కలిపి నుదుటికిరాసినా ముచు కుందపుష్పరసాన్నిరాసినా తలనొప్పి తగ్గిపోతుంది. శతమూలి, ఎరండమూలం,చక్ర, వ్యాఘ్రి లను ఒక్కొక్క పళం తీసుకుని వాయు, కఫ దోషాలూ బొడ్డు పైకి గల భాగాల్లో తిమ్మిర్లు, నొప్పులు తగ్గుతాయి. భుజస్తంభ (భుజాల్లో కదలిక ఆగిపోవుట) రోగానికి లవణ, విశ్వ, బెల్లాలను గానీ పిప్పలి, గడ్డ ఉప్పులను గానీ ముద్ద జేసి రాస్తే ఫలితముంటుంది.

సూర్యావర్తమను పేరుగల పార్శ్వ నొప్పులకు (తలకూడా) నస్యమును పీల్చాలి. దశమూల మందులను నేతితో కలిపి నస్యమును చేసి పీల్చాలి. ***(అధ్యాయం 171)***

## స్త్రీ వ్యాధి చికిత్స, గ్రహదోషనివారణ, ఋతుచర్య పథ్యకారక, సర్వౌషధాలు

స్త్రీలకు వచ్చే ప్రత్యేక యోని వ్యాపద్ వ్యాధుల్లో చాలా వఱకు వాయువు నదుపులోకి తెస్తే తగ్గిపోతాయి.

వచ, ఉపకుంచిక, జాతి, వాసక,గట్టి ఉప్పు, అజాజి, యవక్షార,చిత్రకాల మిశ్రమాన్ని నేతిలో వేయించి ఆ పొడిని నీటిలో కరిగించాలి. దానికి కొంచెం పంచదారను కలిపి తీసుకుంటే తొడలమధ్య నొప్పి, చుట్టూ వున్న నొప్పి, గుండెదడ, మొలలు, ప్లీహవ్యాకోచం తగ్గుతాయి. బదరీ పత్రాలతో చేసిన ముద్దను రాస్తే అక్కడి పగుళ్ళు, రేగిన గాయాలు

మానిపోతాయి. లోధ్ర, తుంబీఫల ముద్ద జననేంద్రియాన్ని, దాని కండరాలను ఆరోగ్యంగా గట్టిగా వుంచుతుంది.

మందుకోసం శుద్ధి చేయబడిన నేతిలో పంచపల్లవాలనూ, యష్టి, అర్క, మాలతి పూలనూ వేసి ఎండలో వేడిచేసి వాడితే లుకేరియా (లుకోరియా) తగ్గుతుంది.

జపా కుసుమాలనూ, కాంజికలనూ, ఒకప్రస్థ జ్యోతిష్మతి దళాలతనూ దూర్వాతోనూ కలిపి ముద్దగా చేసి నీటితో కలిపి తాగినా, అలాగే చిత్రక, ధాత్రి భస్మ, అంజన, అభయాలను పంచదారతో కలిపి ముద్ద చేసి నీటిలో కలిపి త్రాగినా అధికరక్తస్రావం వుండదు. లక్ష్మణౌషధాన్ని నస్యంగా వాడినా, పాలతో కలిపి తాగినా గర్భధారణలో సమస్యలుండవు. అశ్వగంధాన్ని నేతితోనూ, అర్ధాఢకం పాలతోనూ కలిపి గాని, వ్యోశ, కేసరాలను నేతితో కలిపి గాని స్వీకరిస్తే గర్భధారణలో ఏ ఇబ్బందీ వుండదు.

గర్భిణికి అనవసరమైన నొప్పులూ, వ్యాకోచాలూ ఉంటే కుశ, కాశ, ఉరుబుక, గోక్షురక వేళ్ళను పంచదారతో కలిపి పాలలో పోసి బాగా మరిగించి చల్లార్చి త్రాగిస్తే ఆ రుగ్మతలన్నీ నశిస్తాయి.

కొంతమందికి పురుడు వచ్చిన వెంటనే గుండె, తల, మూత్ర కోశాదులలో నొప్పి పుడుతుంది. దానిని అర్కండమంటారు. పులిసిన యవక్షారమును గోరువెచ్చని నీటితో కలిపి తీసుకుంటే అర్కండ అదృశ్యమవుతుంది. దశమూల మందుల కషాయాన్ని నేతితో కలిపి వాడినా అదేఫలితం. చనుబాలు వృద్ధి చెందడానికి శాలి బియ్యపు పొడిని పాలతో కలిపి తాగాలి.అలాగే విదారి పూలను కార్పాస వేళ్ళతో కలిపి రసంతీసుకొనితాగినా అదే ఫలితం. ముద్గతో చేసిన చారు స్త్రీ యొక్క పాలను శుద్ధి చేస్తుంది. వృద్ధి కూడా చేస్తుంది.

బిడ్డకు కుష్ఠ, వచ, అభయ, బ్రాహ్మి, మధూక తేనె, నెయ్యిలతో చేసిన అవలేహాన్ని ఇస్తున్న కొద్దీ రంగు, ఎత్తు, కాంతి అన్నీ పెరుగుతుంటాయి. బిడ్డకు వాంతులు, దగ్గు, జ్వరం వుంటే లౌహ, ముస్తక, అతివిశ మిశ్రమాన్ని పట్టాలి. విరేచనాలవుతుంటే ముస్త, శౌంఠి, విశ, అరుణ, కుటజ మిశ్రమాన్ని పట్టాలి. ఎక్కిళ్ళూ, వాంతులూ వుంటే వ్యోశ, మాతులుంగ, తేనెల మిశ్రమాన్నివ్వాలి. కుష్ఠ అణువులు గోచరిస్తే ఏమాత్రమూ ఆలస్యం చేయకుండా కుష్ఠ, ఇంద్రాయవ, సిద్ధార్థ, నిశ, దూర్వల మిశ్రమాన్నివ్వాలి.

బిడ్డకు మహాముండినిక (మహాశ్రావణిక) ఉదీచ్యాల క్వాథంతో స్నానం చేయిస్తే గ్రహదోషాలన్నీ దూరమవుతాయి. గ్రహదోషం పొడసూపగానే ముందుగా సప్తవర్ణి, పసుపు, చందనాలను దేహానికి పూయాలి. శంఖ, కమలగట్ట, రుద్రాక్ష, వచ, లౌహాది రక్షలను కట్టాలి. ఈ క్రింది మంత్రం ద్వారా శాంతి చేయించాలి.

*ఓం కం టం గం గం వైనతేయాయనమః*
*ఓం హోం హాంహః*

అని చదువుతూ శరీరాన్ని నిమురుతూ బలులిస్తే అరిష్ట గ్రహాలు వదలి పోతాయి. బలి ప్రదానవేళ

***ఓం హ్రీం బాలగ్రహాద్ బలిం గృహ్ణీత బాలం ముంజత స్వాహా*** అనే మంత్రాన్ను చ్చరించాలి. చరకసంహితలో ***శిరీషో విషఘ్నానాం*** అని కనిపిస్తుంది. బియ్యం కడిగిన నీళ్ళలో శిరీష మూలాన్ని పిండి కషాయం చేసి త్రాగితే విషం తన ప్రభావాన్ని కోల్పోతుంది. అలాగే తెల్లపూల వర్షభూ లేదా పునర్నవ రసం కూడా మనిషిని పాముకాటు విష ప్రభావం నుండి కాపాడుతుంది.

నూకలు, గృహధూమం (ఇంటిమసి) నిశ అనే గడ్డ ఉప్పు, పెరుగు, నెయ్యి, తేనె కలిపి ముద్ద చేసి నీటితో త్రాగితే విషం విరిగిపోతుంది. ఆరోగ్యానికీ, ముసలి తనంలో కూడా శక్తి పెరగడానికీ ఒక ఓషధి వుంది. అదే అభయ.

ఆరు ఋతువులలోనూ, వర్షర్తువుతో మొదలుపెట్టి అభయను గడ్డఉప్పు, పంచదార, సొంటి కణ, తేనె, బెల్లంలతో కలిపి రోజూ త్రాగితే బలం తగ్గదు. అనారోగ్యం ఆవరించదు.

జ్వరం పడిలేచినవారు ఒక వంతు ఈ అభయను గాని, రెండు వంతులు విభీటకను గానీ, నాలుగొంతులు ధాత్రిని గాని తేనె, నెయ్యిలతో కలిపి కొన్నాళ్ళపాటు తీసుకుంటే మిక్కిలి వేగం కోలుకోవడమే కాక కొన్నేళ్ళకు సరిపడా బలాన్ని పొందుతారు. అశ్వగంధ కషాయాన్ని పాలతో నేతితో కలిపి తీసుకుంటే దేహబాధలన్నీ నశిస్తాయి. బలం కూడా వస్తుంది. మండూకపర్ణి, విదారి రసాలను కలిపి దానిలో తిల, ధాత్రి, భృంగరాజలను వేసుకొని త్రాగితే నూరేళ్ళయినా సరే ఏ జబ్బూ లేకుండా, రాకుండా బ్రతకవచ్చు. త్రికటు, త్రిఫల, వహ్ని, గుడూచి, శతావరి, విడంగ, ★లౌహచూర్ణాలను కలిపి ముద్ద జేసి తేనెతో రంగరించి స్వీకరిస్తే, సర్వరోగాలూ పోతాయి. త్రిఫల, కణ, సొంటి, గుడూచి, శతావరి, విడంగ, భృంగరాజల మిశ్రమాన్ని శుద్ధిచేసి రోజూ తీసుకుంటే ఆయువుతోపాటు అన్నిశక్తులూ పెరుగుతాయి. విదారి భస్మాన్ని తేనె, నెయ్యిలతో కలిపి తింటే శృంగార సామర్థ్యం పెరుగుతుంది.

జబ్బులతో పనిలేకుండా ప్రతిమనిషీ తీసుకోవలసిన జాగ్రత్తలు, సేవలు, ఔషధాలు ఇలా వుంటాయి.

---

★ *లౌహచూర్ణ శబ్దానికి సరైన తెలుగు మాట ఇనుపరజను. ఆంగ్ల గరుడ పురాణంలో **527**వ పేజీలోఆక్సైడ్ ఆఫ్ ఐరన్ అని కనిపిస్తుంది.*

అతి సర్వత్ర వర్జయేత్ అనేది ప్రధాన జాగ్రత్త. శరీర మర్దన, నూనె పట్టించుట, ఔషధ నశ్యసేవన, క్షాళక ప్రయోగాలు, ఎప్పుడో అరుదుగా వమనక స్వీకరణ వీటిని పంచకర్మలంటారు. రోజూ కాకున్నా వీటిని క్రమం తప్పకుండా చేయించుకోవాలి.

ఒక ఏడాదిలో ఆరు ఋతువులుంటాయి కదా! ఒక్కొక్క ఋతువూ రెండేసి నెలలుంటుంది. ఆరోగ్యంగా వుండదలచుకున్నవారు ఋతువుని బట్టి ప్రవర్తనను మలచుకోవాలి. శిశిర, వసంతర్తువుల్లో శృంగారంలో పాల్గొనే సందర్భాలను రాత్రులలో పెంచవచ్చు. అపుడు కూడా పగటి నిద్ర కూడదు. వర్షర్తువులో కూడా పగటి నిద్రను పూర్తిగా త్యజించాలి. హేమంతఋతువు (ఈ శబ్దం సరికాదని పెద్దలంటారు.) లో శరీరాన్ని వేడిగా కాచుకుంటూ వుండాలి. తేనెను స్వీకరిస్తుండాలి. పాలనూ, పాల పదార్థాలనూ ఎక్కువగా వాడాలి. గ్రీష్మఋతువులో మంచినీళ్ళను గాని మరి దేనిని గాని అతి శీతలంగా పుచ్చుకొనరాదు. కృత్రిమ శీతలత్వమేవిధంగా చూసినా మెదడుకు గాని శరీరానికి గాని మంచిది కాదు. శరత్కాలపు వెన్నెలలో నిద్రించడం గాని ఎక్కువసేపుండడం గాని చేయరాదు.

వేప, అతసి, కుసుంభ, శిగ్రు, ఆవ, జ్యోతిష్మతి, మూలక – వీటినుండి తీసి శుద్ధి చేసిన నూనెలు క్రిమిసంహారకాలు, చక్కెరవ్యాధి నిరోధకాలు, వాత–కఫ ప్రకోపాల వల్ల వచ్చే తలనొప్పికి నాశకాలు. దాడిమ, ఆమలకి, కొల, కరమర్ద, ప్రియాలక, జంబీర, నాగరంగ, ఆమ్రాతక, కపిత్థక ఓషధులు పథ్యంగా మంచివి, పిత్త వర్ధకాలు, వాయు నిరోధకాలే గాని 'కఫప్రకోపకాలు'. ఎటువంటి వాంతులకైనా మందుగా జల, జీమూతక, ఇక్ష్వాకు, కుటజ, కృతబంధన, ధామార్గవలను వాడవచ్చును. ప్రొద్దుటి వేళలో వమనం చేయించడానికి మదన, ఇంద్రాయణ, వచలను ఉపయోగించాలి. పిత్తం ప్రకోపించినపుడు త్రివృతం ప్రక్షాళకంగా పనికి వస్తుంది. కడుపు బాగా కడిగివేయడానికి నాగర, త్రివృతలను గెడ్డ ఉప్పుతో, పంచదారతో, తేనెతో కలిపి తీసుకోవాలి. హరీతకి, విడంగాలను గోమూత్రంతో కలిపి వేసుకున్నా ఇదే ఫలితముంటుంది. ఎరండ నుండి తీసిన నూనెను దానికి రెండింతల త్రిఫల కషాయంతో కలిపి తీసుకుంటే కూడా కడుపు కడుక్కుపోతుంది.

ఒక పాలు పథ్య, రెండు పాళ్ళు అక్ష, నాలుగు పాళ్ళు ధాత్రిలను కలిపి శతావరి రసంతో శుద్ధిచేసి తీసుకుంటే అన్ని రకాల నొప్పులూ తగ్గుతాయి. ***(అధ్యాయం –172)***

## మధుర, అమ్ల, తిక్తాదుల (ద్రవ్యాల)ఔషధీయ ఉపయోగాలు

శుశ్రుతా! తీపి, పులుపు, చేదు రుచులుండే ద్రవ్యాలను వాటిని ఔషధాలుగా వాడే పద్ధతులను అవధరించు. మధురాది ద్రవ్యాలలో శాలి, షష్టిక, గోధుమ, పాలు,నెయ్యి, ఫలరసాలు, తేనె, మజ్జ, శృంగాటక, కశేరు, ఇర్వరు, గోక్షుర, గంభీరి, కలువగింజలు, ద్రాక్ష, ఖర్జూరం, బల, కొబ్బరి, చెఱకు, ఆత్మగుప్త, విదారి, ప్రియాలక, మధూక, తాల, కుసుమంద (కుసుమాండ) లు పేర్కొనదగినవి. వీటిలో ప్రతిఒక్కటీ మూర్ఛ, మంటలను పోగొట్టుటలో ఉపయోగపడుతుంది. జ్ఞానేంద్రియాలకు ఓదార్పునిస్తుంది. కాని, వీటిని అతిగా తీసుకుంటే క్రిములు పుడతాయి. కఫానికి సంబంధించిన రోగాలు వస్తాయి. వీటినుండి వచ్చిన మందులను కూడా అవసరమైతేనే వాడాలి. (తప్పకపోతేనే)

తీయగా నున్న వాటిని, మందులనైనా సరే ఎక్కువగా తింటే దగ్గు, పడిసెం,నోటిలో తీపు,పొక్కులు,కురుపులు,కంతి, బోధకాలు, దళసరి నాలుక, గుడలేపాది సమస్యలు వస్తాయి.

దాడిమ, ఆమలక, ఆమ్ర, కపిత్థ, కరమర్దక, మాతులుంగ, ఆమ్రాతక, బదర, తింతిడి, పెరుగు, మజ్జిగ, కంజీక, లకుచ, అమ్ల వెట(త)స, లొణాలు పుల్ల మందులు. వీటిని సొంటితో కలిపితే గొప్ప జీర్ణకాలు, ఆకలిని పుట్టించెడి ఔషధాలు తయారవుతాయి. ఇది వాయువును, చీముతో కూడిన స్రవాలను సృష్టించగలవు. రతి సామర్థ్యాన్ని పెంచే శక్తి కూడా వీటికుంటుంది.

అలాగని ఎక్కువగానో అనవసరంగానో వాడేస్తే మాత్రం ఇవి హాని చేస్తాయి. అవయవాలు వదులై జారిపోవడం, గొంతు బిరుసెక్కిపోవడం, గుండె అదరడం, నోరు పొక్కడం,గాయాలను, లోపలి కురుపులను సృష్టించడం వంటి సమస్యలనుత్పన్నం చేస్తాయి.

క్షార ద్రవ్యాలు (సైంధవ, సువర్చల) యవక్షార, సర్జికాల వంటివి. వీటిని లవణ బృందమనవచ్చును. ఇవి విరేచనం కోసం, అరుగుదల కోసం, చీము రసాల స్రావం కోసం, స్వేదకారకాలుగానూ వాడతారు. వీటి శక్తి శరీరమంతటా శరవేగంతో ప్రాకుతుంది.

వీటినెక్కువగా వినియోగించడం వల్ల శరీరంలో నాళాలకు అవరోధాలేర్పడి దురదలు, కురుపులు పుట్టుకొస్తాయి. చర్మం వివర్ణమవుతుంది. రక్తవాతం పిత్త రక్తం ప్రకోపింప బడతాయి. పుంస్త్వం తగ్గవచ్చును.

ఇక చేదు ద్రవ్యాల బృందంలోనివిగా వ్యోష, శిగ్రు, మూలక, దేవదారు, ముష్ట (ముస్త) కుష్ఠక, లశున, వల్గుజీఫల, గుగ్గులు, లాంగల్యాదులు పరిగణింప బడుతున్నాయి. ఇవి ఆకలిని పెంచుతాయి, క్షాలకాలుగా పనిచేస్తాయి కాని కఫానికి ఇబ్బంది కలిగిస్తాయి. కుష్టునీ దురదలనీ పోగొడతాయి. బలుపునూ,అనవసర కొవ్వునూ,బడలికనూ, ఆయాసాన్నీ, క్రిములనూ తొలగిస్తాయి. వీర్యాన్ని కూడా అదుపుచేస్తాయి. కానీ అతిగా వినియోగిస్తే తలతిప్పు, మంట కలుగుతాయి.

ఇక తిక్త లేదా వగరుగా వుండే ఓషధీగుణాలున్న ద్రవ్యాలు కృతమాల,కరీర, హరిద్ర, ఇంద్రయవ, బృహతి, శంఖిని, గుడూచి, ద్రవంతి, త్రివృత, మండూక పర్ణి, కారవెల్లక, వార్తాకు, కరవీరక, వాసక, రోహిణి, శంఖపుష్పి, కర్కోటి, జయంతిక, జాతి, వరుణక, నింబ, జ్యోతిష్మతి, (ష్మ) పునర్నవాలు. కంటక, వేత్రాలు కొంతసేపు నమిలితే తియ్యగా తగులుతాయి. ఇవి తిణ్వా (తిక్వా) లను అనగా రస స్రవంతులను పారిస్తాయి. శరీరం తేలిక పడేలా చేస్తాయి. జీర్ణాన్ని మెరుగుపరుస్తాయి. ఆకలిని కలిగిస్తాయి. నాళాలను శుద్ధిచేసి, జ్వరాన్నీ, దాహాన్నీ తొలగించి దురదలను పోగొట్టి, మూర్ఛను నివారిస్తాయి. వీటిని ఎక్కువగా తీసుకుంటే మాత్రం మలమూత్రాలు పొడిబారిపోయి స్రావకాలు తగ్గుతాయి. జాగ్రత్తగా వాడితే పక్షవాతం, మెడవాలిపోవడం, ప్రేగు కురుపులు, తలనొప్పి వంటి అసాధ్యరోగాలు కూడా నిమ్మళిస్తాయి.

వగరు, పులుపు కలిసి వుండే త్రిఫల, శల్లకి, జంబు, ఆమాత్రక, వట, తత్సంబంధితాలు, తిందుక, వకుళ, శాల, ముద్గ, చిల్లాకాలు దేనినైనా పీల్చే గుణాన్ని కలిగి వుంటాయి. కాబట్టి వీలైనంత తక్కువగా వాడాలి.

ఇవికాక మిశ్రమ రుచులుగల ఓషధులొక ఇరవై వున్నాయి. అవి హరిద్ర, కుష్ఠ, లవణ, మేషశృంగి, రెండు రకాల 'బల'లు, కచ్చుర, శల్లకి, పునర్నవ, శతావరి, అగ్నిమంత, బ్రహ్మదండి, శ్వదంష్ట్ర, ఎరండక, యవ, కొల, కులత్థ, కర్షశి, దశమూల (ఇవొక పదిరకాలుంటాయి) ఈ మందులు ఒక్కటిగా కాని, కొన్ని కలిసి గాని త్రిదోషాలను చక్కగా కుదురుస్తాయి. ముఖ్యంగా అవసరం కంటె నెక్కువగా పెరిగిపోయి, మనిషిని చికాకుపఱచే వాత, కఫ, పిత్త అతిశయాలను తొలగిస్తాయి.

శతావరి, విదారి, బాలక, ఉశీర, చందన, దూర్వ, వట, పిప్పలి, బదరి, శల్లకి, కదలి, ఉత్పల, పద్మ, ఉదుంబర, పటోలక, హరిద్ర, గుడ, కుష్ఠక, శతపుష్పి, జాతి

వ్యోష, ఆరగ్వధ, లాంగలి అనే మందులను కఫ- విలంబక ఔషధాలంటారు. శరీరానికి కావలసిన కొవ్వుని ఇవ్వడంలో నెయ్యి, నూనెలు, బలాహారాలు, చిక్కుడు, బటానీల వంటివి సుప్రసిద్ధాలే కాని నీరసించినవారికి, బలం అవసరమై అరిగించు కోగలిగిన పరిమాణంలోనే వీటిని వాడాలి.

తెలివితేటలు, జ్ఞాపకశక్తి, అవగాహన సామర్థ్యము కోరుకునేవారు రోజూ ఎంతో కొంత పరిమాణంలో నేతిని తీసుకోవాలి. పిత్తరోగికి నేతి మందే ప్రశస్తమైనది. వాతరోగికి నేతినే కాస్త లవణంతో కలిపి యివ్వాలి. కఫరోగికి నేతిని వ్యోష, క్షారములతో కలిపి యివ్వాలి. సెగగెడ్డల వంటి ఎఱ్ఱ కురుపులు, సైనస్, పురుగులు, ఊబకాయము, కఫ-వాత ప్రకోపాలూ కలవారికీ లవణ, క్షార, ఘృత మిశ్రమాలు పనిచేస్తాయి.

మలం, మలద్వారం గట్టిపడినవారికి నూనెతోడి వైద్యం అవసరం. వాతావరణ కారణంగా(ఎండ, వాన, చలి)గాని, బరువులు మోయడం వల్ల గాని,అతి సంభోగ సుఖం వల్ల గాని,అతి వ్యాయామం వల్ల గాని, నీరసించినవారికి కూడ నూనెతోడి వైద్యం అవసరం. ఇక్కడ నీరసించడమనగా శరీరంలోనే అతి ముఖ్య ద్రవాలలో కణజాలాలలో అలసట.

నెయ్యి గాని నూనె గాని వేడి నీళ్ళతో కలిపి ఒక పద్ధతి ప్రకారం రాయడాన్ని స్నేహకర్మ అంటారు. పిత్తదోషానికి స్నేహకర్మ చికిత్సను తీసుకునేవారు వేడి నీటిని మాత్రమే తాగాలి. (దాహం వేసినపుడు కూడా) మంచి జీర్ణశక్తి (దీప్తాగ్ని) ని కలిగియుండి కూడా వర్చస్నిగ్ధత (నూనె పూసినట్లున్న) గల మలం విసర్జించేవానికి త్వరలో వాత ప్రకోపదోషం వస్తుంది. అందుచేత విరేచనంలో తేడా రాగానే వాయు సమానతకి పైని చెప్పిన చికిత్సలలో దేనినైనా చేయించుకోవాలి.

కఫ, వాయు ప్రకోపాలు కలిసి ఒకేసారి శరీరంపై దాడిచేసినా, విడివిడిగా వచ్చినా శ్యామాక, కొరదోష, అన్న, పిన్యాకములతో మజ్జిగను, వేచిన బియ్యపు పిండిని కలిపి డయాఫోరిక్ మెజర్స్‌తో చికిత్స చేయాలి.

మాటిమాటికీ బలహీనతవల్ల మూర్ఛితులయ్యేవారికీ, గొంతు బిరుసెక్కిపోయిన వారికీ, అత్యధిక స్థాయిలో బాన పొట్ట గలవారికీ ఈ చికిత్సను చేయకూడదు.

*(అధ్యాయం -173)*

# బ్రాహ్మీఘృతాది స్నేహపాకాలు- వాటి వినియోగాలు

శ్రీ మహావిష్ణువు శంకర భగవానులతోనూ, సూత మహర్షి శౌనకాది ముని పుంగవులతోనూ వెలయించిన గరుడ పురాణ ప్రవచనంలో ఆయుర్వేదమును గూర్చి ధన్వంతరి శుశ్రుతునికి బోధన గావిస్తున్నాడు ఇలా:

"శుశ్రుతా! నేతితో నూనెతో కొన్ని ఔషధాలను తయారుచేసుకోవచ్చు. ఈ ప్రక్రియకు పనికి వచ్చే నేతినీ నూనెనూ ముందుగా వైద్యశాస్త్ర పరిభాషలో 'భావన' అనగా 'మందుకి పనికొచ్చు శుద్ధి' చేస్తారు. ఒక ప్రస్థ నేతిని ఒక్కొక్క అక్ష పరిమాణంలో శంఖ, పుష్టి, వచ, బ్రాహ్మి, సోమ, బ్రహ్మ, సువర్చల, అభయ, గుడూచి, ఆటరూషక, వాగుజిలతోనూ, ఒక ప్రస్థ కంటకారీ రసంతోనూ, ఒక ప్రస్థపాలతోనూ కలిపి వండితే 'బ్రాహ్మీఘృత' మనే స్నేహపాకం తయారవుతుంది. ఇది జ్ఞాపకశక్తినీ, తెలివితేటలనూ, బలాన్నీ పెంచుతుంది. ఇలాటిదే మరొకపాకం నేతితో త్రిఫల, చిత్రక, బల, నిర్గుండి, నింబ, వాసక, పునర్నవ, గుడూచి, బృహతి, శతావరిలను కలిపి వండితే తయారవుతుంది. శాస్త్రప్రకారం శుద్ధిచేయబడిన ఈ మిశ్రమం ఆరంభ దశలో వుండే ఏ రోగాన్నైనా అణచివేస్తుంది.

మధూక, మంజిష్ఠ, చందన, ఉత్పల, పద్మక, సూక్ష్మమైల, పిప్పలి, కుష్ఠ, త్వగెల, అగురు, కేసర, అశ్వగంధ, జీవనీయ ఓషధులను నీటిలో కలిపి బాగా ఆవిరులొచ్చేదాకా మరగించి, అవశేషాన్ని ఆఢకలో సగం నూనెతో కలిపి, ఒక ఆఢకం పాలలో కలిపి మరల తక్కువ సెగలో ఉడికించి ఒక వెండి పాత్రలో ఉంచాలి. దీనిని 'బల్య' స్నేహ పాకమంటారు. దీనినొకప్పుడు మహారాజులు నిరంతరం తీసుకునేవారు. ఇది సర్వవాయు, ధాతు దోషాలనూ నివారిస్తుంది.

శతావరి రసాన్నీ, పాలనూ తలొక ప్రస్థా తీసుకొని, ఒక్కొక్క కర్మ మాత్రంగా శత పుష్ప, దేవదారు, మాంసి, శైలేయక, బల, చందన, తగర, కుష్ఠ, మనశ్శిల, జ్యోతిష్మతిలను వాటితో కలిపి ఒక ప్రస్థ నెయ్యి లేదా నూనె గల పాత్రలో వేసి మరగించాలి. ముద్దగా, లేదా తైలంగా తీసి దాచాలి. దీనిని నారాయణ ఘృతం లేదా నారాయణ తైలమంటారు. స్వయంగా మహావిష్ణువే దీనిని ధన్వంతరికిచ్చాడని ప్రతీతి. ఇది సర్వరోగనివారిణి.

ఈ క్రింది మూలకాలను నేతితో గాని నూనెతో గాని తయారుచేసి వుంచుకొని అవసరం మేరకు వాడవచ్చును.

1. శతావరి, గుడూచి
2. చిత్రక, వ్యోష, నింబక, నిర్గుండి.
3. ప్రసారణి, కంటకారి (రసాలు)
4. వర్షభు, బల
5. వాసక, త్రిఫల బ్రాహ్మిక, ఎరండక, భృంగరాజ, యష్టి, ముశలి, దశమూల, ఖదిర, వట.

వీటన్నిటినీ కషాయాలుగా గానీ, భస్మాలుగా గాని భద్రపఱచుకొనవచ్చును.

చిత్రక, అర్క, త్రివృత, యవాని, హయమారక, సుధ, బల, గణిక, సప్తవర్ణ, సువర్చిక, జ్యోతిష్మతి మూలికలను నూనెలో కలిపి వండిన దానిని నిష్యందన తైలమంటారు. ఇది భగందరములకూ అటు ఇతర సమస్యలకూ బాగా పనిచేస్తుంది. కణజాలాలను శుభ్రపరుస్తుంది. అవి బాగా పెరిగేలా చేస్తుంది. చర్మానికి చక్కటి రంగు నిస్తుంది.

ఆవనూనెలో అజమోద, సిందూర, హరితాల, రెండు రకాల నిశ, రెండు క్షారాలు, ఫెన, ఆర్ద్రక, సరల, ఇంద్రవారుణి, అపామార్గ, కదల, స్యందన, గొఱ్ఱె మూత్రాలను వేసి తక్కువ సెగలో ఉడికించి తీసి దానికి ఆవుపాలను కలిపి తయారు చేసిన దానిని అజమొదాదిక తైలమంటారు. ఇది కంతి వంటి చర్మరోగాలను కుదురుస్తుంది.

నేర్పరియైన చికిత్సకుడు తెలివైన గృహస్థు వీటిని ముందు అతి తక్కువ పరిమాణంలో తయారుచేసి పనితీరు చూసుకొని అప్పుడు బాగా తయారు చేసుకుంటారు. ***(అధ్యాయం-174)***

# జ్వర చికిత్స

**శు**శ్రుతా! ఏ జ్వరానికైనా ముందు లంఘనం (లంఖణం) చేయించాలి. అంటే ఆహారస్వీకరణను ఆపాలి. రోగిని చలిగాలి, ఈదురుగాలి లేనిచోట వుంచాలి. కాచి చల్లార్చిన నీరే త్రాగించాలి. నొప్పి ఎక్కువై వచ్చే జ్వరం కాపడం పెట్టడం వల్ల పోతుంది. చాలవఱకు వాత జ్వరాలన్నీ గుడూచి, ముస్తకాలను కషాయం కాచి ఇస్తే పోతాయి.

దురాలభ కషాయం పిత్త జ్వరానికి మంచి మందు. కఫ దోషజనిత జ్వరానికి సొంటి, పర్పట, ముస్త, బాలక, ఉశీర, చందనం, నెయ్యి, దురాలభలతో చేసిన కషాయాన్నివ్వాలి. పిత్త జ్వరానికి తిక్తక, ఎరండ, గుడూచి, సొంటి, ముస్తకాలు కలిపిన కషాయాన్నివ్వాలి. సాధారణ జ్వరాలన్నీ బాలక, సొంటి, పర్పటల కషాయానికి లొంగుతాయి.

బాలక, ఉశీర, పాఠ, కంటకారి, ముస్తక, సురదారులను కలిపి కషాయం చేసి దానిని ధన్యాక, నింబ, ముస్తల ముద్దతో కలిపి తేనెతో రంగరించి తీసుకుంటే ఏ జ్వరమైనా తగ్గుతుంది. త్రిఫల, పటోలపత్ర, గుడూచిల కషాయం అన్ని జ్వరాలనూ తగ్గించడమేకాక వాత ప్రకోపం వల్ల వచ్చే బాధలను కూడా తగ్గించి, ఆకలిని పెంచుతుంది.

హరీతకి, పిప్పలి, ఆమలి, చిత్రకలను పొడిచేసి నాలిక పై వేసుకున్నా జ్వరం తగ్గుతుంది. తగ్గకపోతే అప్పుడా పొడికి ధన్యాక, ఉశీర, పర్పట లేదా ఆమలకి, గుడూచి, చందనాల కషాయాన్ని కలిపి నీటిలో మరగించి వడకట్టి నీరు పోగా మిగిలిన ముద్దను తేనెతో కలిపి తీసుకుంటే ఎంతటి మొండి జ్వరమైనను తగ్గవలసినదే.

సన్నిపాత అనగా త్రిదోష జన్య జ్వరానికి హరిద్ర, నింబ, ముస్తక, త్రిఫల, దేవదారు, కటురోహిణి, పటోల పత్ర ఓషధుల మిశ్రిత కషాయాన్ని వాడాలి. దగ్గు, ఆయాసము గలవారికి నాగబల, కంటకారి, నాగర, గుడూచి, పుష్కరలను కలిపి గుండ జేసి ఇస్తే జ్వరంతోబాటు ఈ బాధలు కూడా తగ్గిపోతాయి.

కఫ, వాత జ్వరాలతో బాధపడుతున్న వారికి దాహం వేస్తే వెచ్చని నీరే తాగాలి. విశ్వ, పర్పటక, ఉశీర, ముస్త, చందనాలను మరగించి చల్లార్చి వడగట్టగా మిగిలే నీటిని ఇవ్వాలి. దాని వల్ల దాహం, జ్వరం, మంట, వాంతులు తగ్గుతాయి. వాతజన్య జ్వరానికి పంచమూల, బిల్వ, కషాయం బాగా పనిచేస్తుంది.

పిప్పలి వేరు ఆకలి పెరగడానికి దోహదం చేస్తుంది. వాత జ్వరానికి గుడూచి విశ్వల కషాయం కూడా బాగా అడ్డుకట్టవేస్తుంది. పిత్త జ్వరాన్ని పర్పట, నింబ కషాయంతో తేనె అనుపానంగా అమరిన మందు అదుపులోకి తెచ్చి పారద్రోలగలదు. తిక్త, పాట, పటోల, విశాల, త్రివృత, త్రిఫలాల కషాయం పాలతో కలిపి తీసుకుంటే ఏ జ్వరమైనా దిగిపోతుంది. ***(అధ్యాయం -175)***

# పలితకేశ, కర్ణశూలలకు ఉపచారాలు

వెంట్రుకలన్నీ రాలిపోయిన వానికి ఏడు రాత్రులపాటు ఏనుగు దంతాన్ని కాల్చిన బూడిదను రసాంజనంతో మేకపాలతో కలిపి నెత్తికి పట్టించి వుంచితే ఎనిమిదవ రోజు తెల్లారేసరికి జుట్టు మొలిచివుంటుంది. పెరుగుతుంటుంది కూడ.

ఒక పావు వంతు భృంగరాజరసానికి పూర్తి (ఒక భాగం) నూనెనూ గుంజ భస్మాన్నీ కలిపి రాస్తే జుత్తు బాగా పెరుగుతుంది. చంద్రలుప్త (బట్టతల)ను ఎలా (ఒక ఔషధం), మాంసి, కుష్ఠ, మురాల ముద్దతో బాగా రాపిడి చేసి దాని నిండా గుంజా ఫలాన్ని పూతగా

పూస్తే వెంట్రుకలు మరల పుట్టి పెరుగుతాయి. మామిడి టెంకలను పొడిగా చేసి తలపై పూసుకుంటే జుత్తు బలపడి, అందంగా తయారవుతుంది. కరంజ, ఆమలక, ఎల, లాక్షలను తలకి రాసుకుంటే ఎఱ్ఱబడిన జుత్తు మరల నల్లబడుతుంది.

విడంగ, గంధ పాషాణ, మనశ్శిలను మందుకోసం శుద్ధి చేసిన నూనెతో కలిపి దానికి నాలుగింతల పరిమాణం గల గోమూత్రంలో వేసి బాగా కలియబెట్టి తలపై చిలకరిస్తే పేలు, చుండ్రు నశిస్తాయి.

అప్పుడే కాల్చిన శంఖం బూడిదనీ సీసపు రజనునీ నీటితో కలిపి ముద్దజేసి తలకి పట్టిస్తే జుత్తు నున్నగా, నల్లగా నిగనిగలాడుతూ వుంటుంది. భృంగరాజ, ఇనుపరజను, త్రిఫల, బీజపూరక, నీలి, కరవీరలను సమపాళ్ళలో తీసుకుని ఆ మొత్తానికి సమాన పరిమాణంలో బెల్లం కూడా గైకొని బాగా ఉడికించి ఒక ముద్ద (ఈ ముద్దకు పర్యాయపదం ప్రస్తుత భాషలో పేస్టు) తయారుచేసి తలకి రాసుకుంటే తెల్లబడిపోయిన జుత్తంతా మరల నలుపును సంతరించుకుంటుంది. అలాగే మామిడి టెంక, త్రిఫల, నీలి, భృంగరాజ, కాల్చిన ఇనుపరజను, కంజికల మిశ్రమం కూడా వెండి జుత్తును నల్లగా మారుస్తుంది.

చక్ర మర్దక బీజాలు, కుష్ఠ, ఎరండ వేళ్ళు కలిపి బాగా వేడిచేసియున్న కంజిక (గంజి) ఇనుపరజనుల మిశ్రమంతో కలిపి ముద్ద చేసి తలపైగాని నుదుటిపై గాని మృదువుగా రాస్తే ఎలాటి తలనొప్పయినా పోతుంది.

గెడ్డఉప్పు, వచ, హింగు, కుష్ఠ, నాగేశ్వర, శతపుష్ప, దేవదారు మూలికలను నూనెలో వేసి ఉడికిస్తే ఒక ఔషధీయ తైలం తయారవుతుంది. ఇందులో పావు వంతు ఆవు పేడను పిండగా వచ్చిన పలుచటి నీటిని కలిపి ఒక చుక్క చెవిలో రాల్చితే ఎలాటి చెవిపోటైనా అదృశ్యమైపోతుంది. చెవి దుర్వాసన, లాడికారుట, పురుగులు చేరుట వంటి సమస్యలు గెడ్డలుప్పును మేక మూత్రంలో కరిగించి చెవిలో పోస్తే పూర్తిగా నశిస్తాయి. ఉత్త గోమూత్రాన్ని చెవిలో రెండు చుక్కలు వేసినా, మాలతి పూల, ఆకుల రసాన్ని వేసిననూ దుర్వాసన కలిగించే లాడి చెవినుండి కారుట ఆగిపోతుంది. కుష్ఠ, మాశ, బృహతి, అశ్వగంధ మరీచ, తగర, పిప్పలి, అపామార్గ, శ్వేత, సర్షప, యవ, తిలల ముద్దను గెడ్డలుప్పు తేనెలతో కలిపి శిశ్నంపై రాస్తే దానిలో చురుకుదనం పుడుతుంది. చేతులపై రాస్తే అక్కడి పక్షవాతం పోతుంది. చెవులపై రాస్తే అవి పెరిగి వినికిడి కూడా పెరుగుతుంది. ఆవనూనెను భల్లాటక, బృహతి, దాడిమ, ఏదైనా బెరడులతో కలిపి ఉడికించిన ముద్దను బాగా చల్లార్చి గోరువెచ్చగా వుండగా శిశ్నానికి రాస్తే దాని పొడవు పెరుగుతుంది.

***(అధ్యాయం –176)***

# నేత్రాది ఇతరాంగాలకు కరవాలాది దెబ్బలకు చికిత్స

శోభాంజన పత్ర రసాన్ని తేనెతో కలిపి తయారుచేసిన నేత్ర బిందువులు అన్ని కంటి జబ్బులనూ మాన్పుతాయి.

ఎనభై నువ్వు పువ్వులనూ, జాతిపూలనూ ఉపనింబ, అమల, సొంటి, పిప్పలి, తండులీయకాలతో కలిపి ముద్దచేసి దానిని నీడలో ఆరబెట్టి బియ్యపు కడుగుతో తడిపి మరల ఆరబెట్టి కాటుక వలె కంటిలో పెట్టుకుంటే కంటి సమస్యలన్నీ, ముఖ్యంగా చీకట్లు కమ్ముట కుదురుతాయి.

ఒకవంతు గడ్డఉప్పు, రెండు వంతులు మనశ్శిల, నాలుగు వంతులు శంఖలను కలిపి ముద్దచేసి నీడలో ఆరబెట్టి మాత్రలుగా చేసి దాచి, కాటుక వలె కంటికి పెడితే నేత్ర తిమిర, పటల, పింజట రుగ్మతలు పోతాయి.

విభీటక, శంఖనాభి, మనశ్శిల, వేపాకులు, మిరియాలు కలిపి బాగా పిండి చేసి మేకమూత్రంలో వేసి ముద్ద చేసి కంటికి రాస్తే రెప్పల సమస్యలు, తిమిర, రేచీకటి, [1]కొలకు బాధలు పోతాయి. త్రికటు, త్రిఫల, కరంజఫల, గెడ్డ ఉప్పు, పింజట, పుసులు, రెండు రకాల [2]రజని – హరిద్ర + దారుహరిద్ర, రజనిలను భృంగరాజ రసంతో కలిపి బాగా నూరి కాటుకలా తయారుచేఇస పెడితే కంటి బాధలు నశిస్తాయి. ఆటరూషక వేళ్ళను బాగా నూరి పుల్లగంజితో కలిపి కంటి చుట్టూ దిట్టంగా రాస్తే అన్ని కంటినొప్పులూ పోతాయి. అలాగే శతద్రు, బదరిమూల కషాయం కూడా త్రాగినా కంటి నొప్పులు కదిలిపోతాయి. అపామార్గ వేరుని ఆవనూనెతో కలిపి గుండ చేసి తడిపి ముద్దజేసి దానిని రాగి పాత్రలో వేసి ఉప్పు గెడ్డనూ, పాలనూ, పుల్లం బలినీ కలిపి వేడిచేసి చల్లార్చి కాటుకగా మార్చి వాడితే పింజట రోగం పోతుంది. కాటుకను పెడుతూ ఈ క్రింది మంత్రాన్ని చదివితే ఆద్యాలను పేరుగల నవదుర్గలు వశమవుతారు.

*ఓం దద్రుసర క్రోం హ్రీం ఠాః ఠాః దద్రు*
*సర హ్రీం హ్రీం ఓం ఉంఉం సర క్రీం క్రీం ఠాఃఠాః*

నేత్ర తిమిర రోగం బిల్వకాన్ని నీలివేరునీ కలిపి తయారుచేసిన మందుని కంటి కంటిస్తే పటాపంచలైపోతుంది. వత్తినిగాని పుల్లనిగాని పిప్పలి, తగర, హరిద్ర, ఆమలక, వచ, ఖదిరలను బాగా నూరి తయారుచేసి కాల్చి ఆ బూడిదను కాటుకలాగ పెడితే

*[1]పుసులు*
*[2]హరిద్ర, దారుహరిద్ర*

కంటి కురుపులు నశిస్తాయి. వాత జన్యములైన కంటి కురుపులకు ఎరండ (తెల్ల) ఆకులనూ వేళ్ళనూ కలిపి నూరి మేకపాలలో వేసి ముద్ద చేసి రాయడం చక్కని విరుగుడు. కంటి కురుపులకు మరొక మందు చందనం, ఉప్పుగడ్డ, వృద్ధపలాశ, హరీతకి, పాటలపుష్పాలు, నీలి, చక్రికాలను పొడిచేసి కాటుకగా రాయడం.

ఇక పచ్చకామెర్ల విషయానికొస్తే, ఘోశపండు వాసన చూస్తే, రసం తాగితే, కామెర్లు తగ్గుతాయి. వెండి కడ్డీని శరీరమంతటా ప్రయోగిస్తూ, రాగి, బంగారం పొడిని ముద్దచేసి ఒంటికి పట్టించడం ద్వారా కామెర్లని అదుపుచేయవచ్చును. దాడిమ పుష్పరసం, దూర్వ, అలక్తక, హరీతకిలను పొడుంగా దంచి ముక్కుతో పీల్చితే అక్కడి రక్తపు పొక్కులు, వాతరక్తదోషాలు నశిస్తాయి.

హే వృషభధ్వజా, *నీలలోహితా! జింగిని వేళ్ళను నూరి జింగిని రసంతోనే ముద్దగా చేసి ఎండబెట్టి నస్యంగా వాడినా ముక్కులోని రక్తపు పొక్కులు పోతాయి.

పెదవులపై పొక్కులు లేచినా, పెదవుల చివరలు చీలినట్లయినా ఆవునేతినీ, సర్జరస, ధన్యాక, ఉప్పుగడ్డలనూ, ధత్తూరక, గైరికలతో కలిపి ఉడికించి చల్లార్చి గుండజేసి దానికి అన్నమునూ నూనెనూ కలిపి ముద్దగా చేసి ఆముద్దను పెదవులపై రాస్తే ఆ బాధలు నశిస్తాయి. నోటిపూతా, పొక్కులూ జతీపర్ణాలను బాగా నమిలి కొంతసేపు అలాగే నోట్లో వుంచుకుంటే నశిస్తాయి. దంతాలు కదిలిపోతుంటే కోశ విత్తనాలను కొంతసేపు నమిలి మ్రింగితే పంటి కదలికలు ఆగుతాయి.

నోటి దుర్వాసన ముష్టక, కుష్ఠ, ఎలాయష్టిక, బాలక, ధన్యాకలను తేనెతో కలిపి నమిలితే నశిస్తుంది. సొంటిని నమిలితే కఫరసాలు స్రవిస్తాయి. మాతులుంగ ఆకులు, ఎలా, యష్టి, మధు, పిప్పలి, జాతి చెట్టు ఆకులు – వీటన్నిటినీ కలిపి నమిలినా ఆరోగ్య కరమైన కఫస్రవంతులు ఊరతాయి. శెపాలిక మొలకలను నమిలితే కంతి పోతుంది. గుంజవేరు తినడం వల్ల దంతాలలో నున్న క్రిములు నశిస్తాయి. కాక జంఘ, స్నుహి, నీలిలను తేనెతో కలిపి కషాయం చేసుకొని తాగితే మొత్తం నోటిలో పుట్టిన లేదా చేరిన క్రిములన్నీ నశిస్తాయి. అలాగే పాలలో కర్కటను కలిపి తేర్చి ఆ ముద్దకు నేతిని జోడించి పండ్లు తోమినా, కాళ్ళు రుద్దినా రెండూ బలపడతాయి. శిరీష విత్తనాలను వాటికి నాలుగింతలు పరిణామంలో గల హరిద్రంతో కలిపి ఉడికించి ఒక నస్యాన్ని తయారుచేసి పీలిస్తే తలనొప్పి, గొంతు బాధ శీఘ్రంగా తగ్గుతాయి. నిజానికి, కర్కటపాద అనే మందుతో పళ్ళను తడిమినా చాలు. జ్యోతిష్మతి పండ్లను నీటిలో నానబెట్టి అలా ఇరవై ఒక్క

---

* ఇది శివుని విష్ణువు సంబోధించిన తీరు.

రోజులుంచిన పిమ్మట వాటిని తెల్ల అభయ ముద్దతో కలిపి ముద్దజేసి దానితో దంతాలను తోమితే వాటిపైనున్న నల్లటి మచ్చలు, మరకలు పోయి ధగధగలాడతాయి. లోధ్ర, కుంకుమ, మంజిష్ఠ,లోహ కాలేయక, యవ, బియ్యపు గింజ, యష్టి మధులను కలిపి గుండజేసి నీరు కలిపి మృదువుగా ముఖానికి రాస్తే అది మిలమిలలు తళతళలతో వర్ధిల్లుతుంది. ఇది స్త్రీలకు బాగా పనిచేస్తుంది. ఒక్కొక్క కర్షక (ఒక కొలత) రక్తచందన మంజిష్ఠ, లక్కగానీ యష్టి మధు, కుంకుమలను గాని తీసుకొని దానినొక ప్రస్థ (బరువుకొలత) తైలం, రెండు ప్రస్థల మేకపాలు గల పాత్రలో వేసి బాగా ఉడికించి తీసి చల్లార్చి రోజుకొక మారుగా వారం రోజుల పాటు రాస్తే, ఎనిమిదవ రోజు కల్లా ముఖం అద్భుతకాంతితో ప్రకాశిస్తుంది.

సొంటి, పిప్పలిగుండ, గుడూచి, కంటకారికలను నీటిలో పోసి మరగించి త్రాగితే జీర్ణశక్తి పెరుగుతుంది. వాతదోషం వల్ల వచ్చే నొప్పులు తగ్గుతాయి. కరుజ కర్కట, ఉశీర, బృహతి, కటురోహిణి, గోక్షురాలు కలిపి కషాయం చేసుకొని తాగితే తలత్రిప్పు, మూర్ఛ, మంట, పిత్తజ్వరం, అతి నీరసం తగ్గిపోతాయి.

పిప్పలిపొడిని పాలు, నెయ్యి, తేనెలతో కలిపి కషాయం తీసి తాగితే గుండెదడ, దగ్గు, తీవ్ర మధ్యంతర జ్వరాలు (తగ్గిపోయి మరల వచ్చి మరల తగ్గి మరలి వచ్చే జ్వరాలు) తగ్గుతాయి. ఈ జ్వరాలను విషమజ్వరాలని కూడా అంటారు.

ఆవు పేడనుండి నీటిని వేరుచేసి కాకజంఘరసంతో కలిపి పాలు పోసుకొని తాగినా విషమజ్వరం మరి రాదు. సొంటిని పాలలో వేసి మరగించి చల్లార్చి త్రాగినా విషమ జ్వరం కుదురుతుంది.

యష్టిమధు, ముస్త, ఉప్పుగడ్డ, బృహత్ఫలాలను మెత్తగా నూరి నస్యం వలె చేసి పీల్చితే కమ్మగా నిద్రపడుతుంది. దానిని మిరియాలు, తేనెలతో కలిపి తింటే మరింత బాగా పనిచేస్తుంది. కాకజంఘ వేరుని తలచుట్టూ కట్టుకొని పడుకుంటే నిద్రపడుతుంది. నూనెతో పుల్లంబలిని తయారుచేసి సర్జరసాన్ని కూడా కలిపి చల్లని నీటిలో వేసి శరీరానికి పూస్తే వేడి, మంట, రక్తంలో మలినాలు, వీటికి కారణమైన జ్వరం నశిస్తాయి. శైలి, శైవల, అగ్నిమంత, సొంటి, పాషాణ భేదక శోభాంజనాలను గాని గోక్షుర, వరుణ, ఛన్న, శోభాంజనపు వేరులను హింగు, యవక్షారాలతో గాని కషాయం చేసుకొని తాగితే పిత్త, వాయువులు దారిలోకొస్తాయి. కషాయం ఎప్పుడైనా ఒక అర్ధ కర్ష ప్రమాణంలోనే తీసుకోవాలి. రోగి వయసును బట్టి మోతాదును మార్చాలి.

పిప్పలి, పిప్పలి వేరు, భల్లాటకాలను నీటిలో మరగించి తాగితే అజీర్ణము వల్ల వచ్చే మూర్ఛరోగాలు నశిస్తాయి.

ఊరుస్తంభ (తొడల కదలిక ఆగిపోవుట) రోగానికి అశ్వగంధ, మూలకములను చీమలపుట్ట పై నుంచి తెచ్చిన మన్నుతో కలిపి పట్టీ వేస్తే మంచి ఫలితముంటుంది. అనగా తొడలు మరల కదులుతాయి. అలాగే సంఘాతవాతం కూడా బృహతీక వేరుని గుండ జేసి నీటిలో కలుపుకొని తాగితే పోతుంది. తుఫాను వల్ల చెట్టు కూలిపోయినట్టు ఆర్ద్రక వేరు, తగరలను కలిపి మజ్జిగతో తాగితే జింజినీ వాతమనే మొండిజబ్బు కూలిపోతుంది.

అస్థి సంహారమనే ఓషధిని రోజూ అన్నంలో కలుపుకొని తిన్నా, అంబలి లేదా జావతో కలిపి తాగినా వాయుదోషం, ఎముకల పగుళ్ళు నశిస్తాయి. పాదాలు పీకితే, నొప్పి పెడితే వాటికి వేచిన ధాన్యాన్ని గుండజేసి మేకపాలతో నేతితో రంగరించి పూస్తే శాంతి లభిస్తుంది. తేనె, నెయ్యి, ఉప్పుగడ్డ, సిక్థ (అన్నం), బెల్లం, గైరిక, గుగ్గిలం, సర్జరసాలను ముద్దజేసి ఛాతీకి పూస్తే ఊపిరితిత్తులకు సోకిన రోగాలు నశిస్తాయి. అరి పాదాల బాధలు ఆవనూనెను రాసి పొగరాని నిప్పుపై వెచ్చగా కాచితే ఉపశమిస్తాయి. శరీరంపై పగుళ్ళు, కాలిన గాయాలు నేతిని సర్జరసం, జీరక, హరీతకి ముద్దకు కలిపి పూస్తే తగ్గిపోతాయి. వేడినూనెను యవ భస్మంతో కలిపి పూసినా ఆ బాధలు తగ్గుతాయి.

బాగా వేచి పొడిచేసిన నువ్వులను గేదె వెన్నతోనూ భల్లాటంతోనూ నస్యంగా చేసి పీలిస్తే గుండెలో కలిగిన అడ్డంకులు తొలగుతాయి. ఇదే మిశ్రమాన్ని పొక్కులకీ, కురుపులకీ పూసినా మంచి గుణం గోచరిస్తుంది. కత్తి వంటి వాటివల్ల కలిగిన గాయాలకు కర్పూరాన్ని ఆవుపాలనుండి తీసిన వెన్ననీ పెట్టి శుభ్రమైన తెల్లని గుడ్డతో కట్టు కడితే నొప్పి వెంటనే ఆగిపోతుంది. గాయం చీము పట్టదు. వాసన వుండదు. కత్తికోతలు శరపుంఖ, లజ్జాలుక, పాఠవేళ్ళనూ ఆకులనూ (లేదా బెరడులనూ) పిండిగా చేసి నీటితో తడిపి రాస్తే వెంటనే మానిపోతాయి. అపామార్గ వేరుని నీటిలో నూనెలో మరగించి ఆ మిశ్రమంలో కలిపిన గుడ్డతో కాపడం పెడితే ఏ దెబ్బ వల్ల కలిగిన నొప్పియైనా మాయమవుతుంది.

అభయ మూలికను ఉప్పుగడ్డ, సొంటిలతో కలిపి నూరి నీటితో కలిపి తాగితే అజీర్ణము నుండి విముక్తి లభిస్తుంది.

ఒక విచిత్రం వింటావా విశాలక్షీ నాథా! వేపవేళ్ళను నడుముకి చుట్టుకుంటే కంటినొప్పులు, ఎంత తీవ్రంగా బాధిస్తున్నా, వెంటనే పోతాయి.

శణ(శణ= జనుపనార, గోగునార) వేరుని తాంబూలంలో కలుపుకొని తింటే మూత్రసంబంధి రోగాలూ, వీర్యము కారుటలో ఇబ్బందులూ తొలగుతాయి. బియ్యం, ఆవవేరు (తెల్లఆవ) మాతులుంగ గింజలు తీసుకొని ఆవిరితో ఉడికించి మధ్యలో హరిద్రం

వేసి తీసి చల్లార్చి శరీరానికి పూసుకుంటూ వుంటే వారం రోజులలోనే శరీరానికి నునుపు, కాంతి వచ్చిచేరుతాయి.

శ్వేత అపరాజిత, వేప ఆకుల రసాన్ని గాని గురిగింజ రసాన్ని (వేరు) గాని నస్యంలా వాడితే డాకిని, బ్రహ్మరాక్షసి, భూతప్రేతాది దురదృష్టాలు పట్టవు.

ఎలుగుబంటి పాలను రోహిత చేప మాంసంతో నూనెలో పోసి మరగించి ఒంటికి రాసుకుంటే అన్ని జబ్బులూ తగ్గుతాయి. ఆ నూనెతోనే అభ్యంగన స్నానం చేస్తే మరీ మంచిది. చందన జలం నుండి నస్యాన్ని చేసి పీలిస్తే రాలిపోయిన రోమాలు మరల మొలుస్తాయి. లాంగలిక గోళాన్ని చేతిలో పట్టుకుని దానితో శరీరమంతటినీ రుద్దితే వరిబీజం (వృషణాలవాపు) తగ్గిపోతుంది. క్రూర విషసర్పాలను పుట్టలో వుండగానే నెమలి రక్తమును పోయుట ద్వారా చంపవచ్చు.

పుష్య నక్షత్ర మండలంలో చంద్రుడు ప్రవేశించినపుడొక సుదర్శన మూలాన్ని తెచ్చి ఇంటి మధ్యలో ఉంచుకుంటే ఆ గృహానికి పాములు రావు. పిల్లి మాంసాన్ని మల మూత్రాలను హరితాలనూ మేక పాలలో ఉడికించి ఒక ఎలుకను పట్టుకొని దాని ఒంటికి పూర్తిగా పట్టించి వదిలేస్తే ఆచోట నున్న ఎలుకలన్నీ పారిపోతాయి. త్రిఫల, అర్జునపుష్ప, భల్లాటక, శిరీషక, లాక్షసర్జరస, విడంగ, గుగ్గుల ముద్దను బాగాకాల్చి ఆ పొగలను ఇంటినిండా వ్యాపింపజేస్తే అన్ని ఈగలూ, దోమలూ నశిస్తాయి. ***(అధ్యాయం -178)***

# గర్భసంబంధి, దంత- కర్ణ -శూల, రోమాది రోగాలకు చికిత్స

బ్రహ్మదండి, వచ, కుష్ఠ, ప్రియంగు, నాగకేసరలను కలిపి మెత్తని పొడిగా చేసి తాంబూలంతో కలిపి ***ఓం నమోనారాయణ్యై స్వాహా*** అనే మంత్రాన్ని పదే పదే పఠిస్తూ తను వలచిన వానికిచ్చి, అతడు నమలుతుండగా ***ఓం హరిః హరిః స్వాహా*** అనే మంత్రాన్ని మననం చేసే స్త్రీకి ఆ తాంబూలాన్ని వేసుకున్నవాడు పూర్తిగా బానిసైపోతాడు అంటే వశమై పోతాడు.

ఆవుపల్లు, హరితాల, కాకి నాలుక – లను గుండకొట్టి ఒక వ్యక్తి తలపై వేయడం ద్వారా వానిని పూర్తిగా వశం చేసుకొనవచ్చును. అయితే, ఆ వ్యక్తి ఇంటిలో తెల్ల ఆవపూలదండ ఉంటే మాత్రం ఈ మందు పనిచెయ్యదు. విభీతక, సాఖొటక వేళ్ళను,

★ **స్త్రీలను వశపఱచుకోవడానికీ, రెండు వందల యేళ్ళు బ్రతకడానికీ శత్రువులను వామాచార ప్రయోగం ద్వారా చంపివేయడానికీ కొన్ని మార్గాలిక్కడ గరుడ పురాణంలో సూచింపబడినాయి. అనివార్య కారణాల వల్ల వాటిని అనువదించడంలేదు.**

ఆకులను ఒక ఇంటి గుమ్మం వద్ద పడవేస్తే ఆ ఇంటిలోని వారు నిరంతరం దెబలాడుకుంటూనే వుంటారు.

అగరు, గుగ్గిలం, నీలోత్పలం, బెల్లంలతో శరీరమంతటా ధూపం వేసుకొనేవారు రాజగృహంలో అందరికీ ఇష్టులౌతారు. (ఇప్పటి భాషలో చెప్పాలంటే పరపతీ, పలుకుబడీ ఎక్కువగా వుంటాయి.) తెల్ల అపరాజితనీ రోచననీ కలిపి గుండ చేసి తిలకంలో ధరిస్తే రాజభవనంలోని వారందరూ ఇష్టసఖులుగా మారిపోతారు.

సంభోగ సమయంలో బ్రహ్మదండిని నోటిలో పెట్టుకుంటే మంచిది. జయంతి వేరుని పెట్టుకున్నా మంచిదే. భృంగరాజ మూలాలను పిండికొట్టి వీర్యంతో కలిపి కాటుక వలె పెట్టుకున్న, రమణికి, ఆమె రమణుడు చేతిలోనే వుంటాడు. తమల పాకులను అపరాజిత, నీలోత్పల లతో కలిపి తినిపించడం ద్వారా ఎవరినైనా వశం చేసుకోవచ్చు.

శృంగార సంబంధితములైన కళాస్థానాలు (వీటిని చంద్రకళలని కూడా అంటారు) ప్రతి మనిషికీ వుంటాయి. అక్కడ మృదువుగా స్పృశించడం ద్వారా వారిలో కామ వికారాన్ని కలిగించవచ్చు. ఆ స్థానాలు ఇవి. కాలి బొటన వ్రేలు, పాదాలు, మడమలు, మోకాళ్ళు, తొడల సందులూ, బొడ్డు, వక్షం, నడుము, చంకలు, గొంతు, బుగ్గలు, పెదవులు, కనులు, నుదురు, తల పురుషులకు కుడివైపు, స్త్రీలకు ఎడమవైపు ఈ స్థానాలుంటాయి. అందరికీ అన్ని కళాస్థానాలలో మదన వికారం కలుగకపోవచ్చు. ఒక్కొక్కరికి ఒక్కొక్క స్థానంలో తీవ్రత ఎక్కువగా వుండవచ్చు. గట్టి కౌగలింత స్త్రీని ఎక్కువగా మదన వికారాల పాలుజేస్తుంది. సంభోగ శృంగారానికి సంబంధించి అరువది నాలుగు కామకేళీ సంబంధి కళలు చెప్పబడ్డాయి. దాని ద్వారా భార్యాభర్తలు మాత్రమే సుఖించాలనేది నియమం. ఈ నియమాన్ని పాటించినంతవఱకే సమాజంలో సుఖసంతోషాలుంటాయి.

రోచన, సువాసనతో నిండిన పూలు, వేపపూలు, ప్రియంగు, కుంకుమ, చందనాలను ముద్ద చేసి నుదుటిపై ఆరారా పూసుకుంటూ ఈ క్రింది మంత్రాన్ని నిత్యం జపించేవారిని లోకం పూజిస్తుంది.

*ఓం హ్రీం గౌరీ దేవి,*
*సౌభాగ్యం పురుష వశ్యాది దేహిమే*
*ఓం హ్రీం లక్ష్మీదేవి*
*సౌభాగ్యం సర్వం త్రైలోక్య*
*మోహనం దేహి మే ।*

మధు యష్టి, కంటకారిక, ఆవుపాలు, వీటిని సమపాళ్ళలో గైకొని, నీటిలో పోసి మూడు వంతులు ఆవిరైపోయేదాకా మరగించి మిగిలిన ఒక వంతు కషాయాన్ని తాగగలిగినంత వేడిగా త్రాగితే స్త్రీ వేగం గర్భధారణాది పనులలో కృత కృత్యురాలౌతుంది. అలాగే మాతులుంగ విత్తనాలను శుద్ధి చేసి పాలతో మరగించి తాగినా వేగం గర్భవతి అవుతుంది. మగపిల్లడు పుట్టాలని కోరుకునే మహిళ మాతులుంగ విత్తనాలనూ, ఎరండ వేళ్ళనూ నేతిలో కలుపుకొని తాగాలి.

పురుడు సులువుగా రావాలంటే అశ్వగంధాన్ని పాలలో మరగించి ముద్ద చేసి దానికి నేతిని కలిపి గర్భవతి చేత తినిపించాలి. (గర్భం రాకుండా వుండాలంటే ఏంచేయాలో కూడా గరుడపురాణంలో చెప్పబడింది)

బాగా వగరుండేలా తయారుచేసిన హరీతకీ కషాయంతో పళ్ళను బాగా కడుక్కొని, హరితాల, యవక్షార, పత్రాంగ, రక్తచందన, జాతి, హింగులక, లాక్షల ముద్దను వేడిచేసి దానిని పలువరుసపై పూసి వీలైనంతసేపుంచితే అవి ఎఱ్ఱవాకుగా పరమసుందరంగా శోభిల్లుతాయి.

మూలక ఓషధిని తక్కువ సెగలో ఆవిరితో ఉడికించి తీసి దానినుండి రసాన్ని పిండివేసి ఒక చుక్కను చెవిలో వేస్తే దుర్వాసన, లాడికారుట ఆగిపోతాయి.

అర్క ఆకులతో అలాగే తయారుచేసిన రసపు చుక్క ఎంతటి చెవిపోటునైనా అంతమొందించగలదు.

పొడి భావన మూలకనూ సొంటినీ కలిపి కాల్చి భస్మం చేసి దానిని హింగు, మహౌషధ, శతపుష్ప, వచ, కుష్ఠ, దారు, శిగ్రుల, ముద్దకు అద్దుకొని తింటే శక్తి, చైతన్యం, ఉత్సాహం వర్ధిల్లుతాయి.

నూనెను మందుకోసం శుద్ధిచేసిన సౌవర్చల, యవక్షార, సర్జక, సైంధవ, గ్రంథి, విడం, ముస్త, నాలుగు గీతల తేనె మాతులుంగ రసం, కదలీ రసాలతో కలిపి పచనము చేసి తింటే శరీరంలోని దుర్వాసనల్నీ నశిస్తాయి. దానిని సృష్టించే అనారోగ్యకర విసర్జక రసాలూ ఆగుతాయి. ఆవనూనెను చెవిలో వేసుకుంటే క్రిములు నశిస్తాయి.

హరిద్ర, వేపాకులు, పిప్పలి, మిరియం, విడంగభద్ర, ముస్త, విశ్వభేషజ, మందులను గుండజేసి దానికి గోమూత్రాన్ని కలిపి మాత్రలను లేదా ఉండలను తయారుచేసుకొని ఇంట్లో దాచుకుంటే ఒక దివ్యౌషధం దగ్గర వున్నట్లే. ఇది ఒక్క మాత్ర చాలు. అజీర్ణాన్ని అంతం చేయడానికి, రెండు బిళ్లలు లేదా గుళికలు చాలు విషూచి(కలరా) లాటి మొండి

జబ్బును పారద్రోలడానికి ఈ బిళ్ళను తేనెతో కలిపి తీసుకుంటే కంటిలోని చికాకులు పోతాయి. గోమూత్రంతో కలిపి గైకొంటే ఎక్కడి కురుపులైనా మాడిపోతాయి.

వచ, మాంసి, బిల్వ, తగర, పద్మకేశర, నాగపుష్ప, ప్రియంగులను సమపాళ్ళలో తీసుకొని గుండగా చేసి కొన్నాళ్ళపాటు శరీరం మొత్తానికి ధూపం వేయించుకున్న వాడు మన్మథుని వలె అందగాడవుతాడు.(సంభోగ శృంగారానికి సంబంధించి ఇక్కడ రెండు విషయాలీయబడ్డాయి.

***ఓం రక్త చాముండే అముకం***
***మే వశం ఆనయ ఆనయ***

ఓం హ్రీం హ్రూం హ్రః ఫట్ –అనే మంత్రాన్ని పదివేల మార్లు పఠించి స్వీయరక్తంతో గోరోచనాన్ని కలిపి తిలకంగా ధరించిన వానికి అందరూ వశవర్తులై అదుపులో వుంటారు.

సైంధవ, కృష్ణలవణ, సౌవీర, మత్స్య పిత్త, తేనె, నెయ్యి, పంచదారలను ముద్దగా చేసి యోనిపై రాసుకునే స్త్రీ యొక్క భర్త కలలోనైనా మరొక స్త్రీవైపు పోడు. శంఖపుష్పి, వచ, మాంసి, సోమరాజి, ఫల్గుకలను గేదె వెన్నతో కలిపి చిన్నచిన్న గుళికలను తయారుచేయాలి. కలువపూవును కాడతో సహా నూరి దానిని పాలతో, నేతితో కలిపి ఒక రసంగా తయారుచేసి ఆ చిన్నచిన్న గుళికలను ఈ రసంతో శుద్ధిచేసి యోనిలో జొనుపుకొనే స్త్రీ పదిమంది పిల్లలను కన్నాక కూడా గొప్ప శృంగార సుఖాన్ని, కన్యవలె ఇవ్వగలదు. ఆమె యొక్క అక్కడి కండరాలు ఎన్నేళ్ళైనా బిగుతుగానే వుంటాయి.

సర్షప, వచ, మదనపండ్లు, పిల్లిమలము, ధత్తూర, స్త్రీ జుత్తులను మిశ్రమం చేసి దానితో ధూపం వేస్తే చతుర్థకజ్వరం, డాకినుల దుష్ప్రభావం వల్ల వచ్చే జ్వరం తగ్గిపోతాయి. అర్జున పుష్పాలు, భల్లాటక, విడంగక, బాల, సర్జరస, సౌవీర, సర్షపాలను కలిపి కాల్చి ధూపం వేస్తే పాములు, ఈగలు, పేలు, దోమలు ఆ ఇంటికి చాలా దూరంగా పారిపోతాయి.

నేయి, తేనె, ఉప్పు, పాలను రాగి పాత్రలో కలిపి వుంచి తాంబూలంతో బాటు వేసుకుంటే కంటినొప్పులు తగ్గుతాయి. హరీతకి, వచ, కుష్ఠ, వ్యోశ, హింగు, మనశ్శిలలను నూరి ఆ గుండకు తేనెనీ నేతినీ కలిపి తీసుకుంటే దగ్గు, వెక్కిళ్ళు, ఆయాసం తగ్గుతాయి. పిప్పలి, త్రిఫల చూర్ణాలను అరచేతిలో వేసుకుని తేనెతో కలిపి నాకితే పడిశం, దగ్గు, వెక్కిళ్ళు తగ్గుతాయి.

నీలోత్పల, మధుక, పద్మకలను సమపాళ్ళలో తీసుకొని బియ్యపు కడుగులో పోసి పంచదార వేసి కలుపుకొని త్రాగితే రక్తంలోని దోషాలన్నీ పోతాయి. సొంటి పొడిని

తేనెతో పంచదారతో కలిపి తీసుకుంటే గొంతు బాగుపడుతుంది. హరితాల, శంఖ, అరిటాకు, పొడులను బాగా కలబోసి ఒంటికి రాస్తే ఆ మిశ్రమం రోమనాశకంగా పని చేస్తుంది. అలాగే లవణ, హరితాల, తుంబినపండ్లను లాక్షారసంతో కలిపిన ముద్ద కూడ.

సుధా హరితాల, శంఖచూర్ణము, మనశ్శిల, గరుకుప్పలను మేకమూత్రంతో కలిపి ముద్దచేసి ఒంటికి రుద్దితే అవాంఛిత రోమాలిక మొలవవు. ఉన్నవీ రాలిపోతాయి. శంఖ, ఆమలక పత్ర, ధాటకీ పుష్పాలను రుబ్బి పాలతో కలిపి నోటిలో కొంతసేపు పెట్టుకోవాలి. అలా ఒక వారం పాటు చేస్తే పళ్ళు అందంగా మెరుస్తాయి. ***(అధ్యాయాలు - 178-181)***

# భోజ్య పదార్థ విహితసేవన కాలం బల-బుద్ధి వర్ధక ఔషధాలు విషదోషశమనోపాయాలు

**ఖ**గవాహనుడు కాల కంఠాదులకింకా ఇలా చెప్పసాగాడు. "ఎప్పుడు ఏవి తినాలో తెలుసుకుని తినేవారికే తిన్న ఆనందంతో బాటు ఆరోగ్యం కూడా వుంటుంది.

*శరద్ గ్రీష్మ వసంతేషు*
*ప్రాయశోదధి గర్హితం ।*
***హేమంతే శిశిరే చైవ***
***వర్షాసు దధి శస్యతే॥*** ***(ఆచార.. 182/1)***

వసంత, గ్రీష్మ, శరదృతువులలో పెరుగును తినడం మంచిది కాదు. హేమంత, శిశిర, వర్షర్తువులలోనే తినాలి. వెన్నతో పంచదారను కలిపి తింటే బుద్ధి వికసిస్తుంది. రోజూ ఒక పళం పాత బెల్లాన్ని తినేవాడి శృంగార సామర్థ్యం అనూహ్యంగా పెరిగి పోతుంటుంది. కుష్ఠను బాగా పొడి చేసి నేయి, తేనెలతో కలుపుకొని రాత్రి పడుకో బోయేముందు తింటే ముడతలు పడకుండా చర్మం, రాలిపోకుండా జుత్తు వర్ధిల్లుతాయి. అతసి, మాశ, గోధుమలను గుండగా నూరి నేతితోనూ పిప్పలి భస్మంతోనూ కలిపి ముద్దగా చేసి ఒంటికి రాస్తే కొన్నాళ్ళలో అది మన్మథుని శరీరంలాగా తయారవుతుంది.

యవ, తిల, అశ్వగంధ, ముశలి, సరలాలను పిండిగా జల్లించి బెల్లంతో కలిపి లేహ్యంగా చేసుకొని రోజూ తినేవారు ఎంత వయసొచ్చినా యౌవన, బలాలను కోల్పోరు. హింగు, సౌవర్చల, సొంటిలతో చేసిన కషాయాన్ని తాగితే పరిణామ శూలవ్యాధి, అజీర్ణం నయమౌతాయి. ధాతకి, సోమరాజిలను గుండగా చేసి పాలలో పోసి ఉడికించి రోజూ తీసుకుంటే అతి బలహీనులు కూడా పరమ బలవంతులవుతారు. బక్కచిక్కినవారు

దుక్కలవుతారు. సర్వశక్తులూ క్షీణిస్తున్న వారొక పద్ధతి ప్రకారం రోజూ పాలు తాగితే ఆరోగ్యం, మేధస్సూ కూడా పెరుగుతాయి. పంచదార, తేనె, వెన్నలను కలిపి తింటే బలం పెరుగుతుంది.

కులీర(కర్కనశృంగి) చూర్ణాన్ని పాలతో కలిపితే క్షయరోగ నివారిణి తయారవుతుంది. భల్లాటక, విడంగ, యవక్షార, సైంధవ, మనశ్శిల, శంఖచూర్ణాలను కలిపి పిండి జల్లించి నూనెలో పోసి ఉడికించి చల్లార్చి దాచుకుంటే మన దగ్గర ఒక గొప్ప అవాంఛిత రోమ వినాశకరమైన ఔషధమున్నట్లే.

[1)] జలగను నూరి పిండి చేసి మలూర రసంతో కలిపి ముద్దచేసి అరచేతికి రాసుకుంటే ఆ చేతిలో ఎంతసేపైనా అగ్నిని పట్టుకొని ఆడించవచ్చును. శాల్మలి రసాన్ని కంచరగాడిద మూత్రంతో కలిపి గుమ్మరించడం ద్వారా ఎంత ప్రజ్వలిస్తున్న అగ్నినైనా చిటికెలో ఆర్పివేయవచ్చును.

గోరోచన, భృంగరాజలను పిండి నేతితో కలిపి వంటికి రాసుకుని

***ఓం అగనిష్టంభనం కురుకురు*** అనే మంత్రాన్ని పఠించేవారికి వాన నుండి రక్షణ కల్పిస్తుంది.

***ఓం నమో భగవతే జలం***
***స్తంభాయ సంసంసం కెక కెక చర చర***

ఈ మంత్రం ద్వారా నీటిని అదుపు చేయవచ్చు. (శత్రు సంహారానికి సంబంధించిన ప్రయోగం ఇక్కడొకటి చెప్పబడింది.)

ఏవైనా అయిదురకాల ఎఱ్ఱటి పూలను, ఆ విభిన్నములైన అవే పూల మొక్కల లేదా చెట్ల రసాలను కలపి నూరుకొని ముద్దచేసి కుంకుమనూ, స్వీయరక్తపు చుక్కలనూ, ఒక పళం రోచననూ దానికి కలిపి నుదుటిపై పూసుకుంటే ఎవరినైనా తన వశం చేసుకోగలరు.

చంద్రుడు పుష్య నక్షత్రంలో ప్రవేశించే రోజు బ్రహ్మదండిని ఆహారపానీయాల్లో కలుపుకొని సేవిస్తే అందరినీ ఆకట్టుకునే అందం స్వంతమవుతుంది. ఒక పళం యష్టిమధుని నీటిలో ఉడికించి తాగితే మలబద్ధకం, మూత్రావరోధాలు, గుండె పనిలోని అడ్డంకులు కూడా తొలగిపోతాయి.

---

*[1]జలగను పిండి చేయడం అంటే ఏమిటో స్పష్టంగా చెప్పబడలేదు. జలగను చంపి దానిని ఎండబెట్టి, తోలును ఇలా వాడడం కావచ్చును.*

పిప్పలి, శృంగవెర, సైంధవ, మరిచ, కుష్ఠలను పొడిచేసి వెన్నతో, పెరుగుతో కలిపి తయారుచేసిన మందు ఎలాటి విషాన్నైనా విరిచేయగలదు. త్రిఫల, ఆర్ద్రక, కుష్ఠక, చందనాలను నేతితో ఉడికించి త్రాగినా, ఒంటికి పూసుకున్నా విషం ఎక్కదు. గరుడుని వలె పాము విషాన్ని భయపెట్టే మందు పావురం కన్నులతో తయారవు తుంది. ఆ కనులను తెచ్చి హరితాల, మనశ్శిలలతో కలిపి నూరి మిశ్రమం చేసి ఉంచుకోవాలి. తేలు విషాన్ని హరించడానికి సైంధవ, త్రయూషణ భస్మం, పెరుగు, నెయ్యిలను కలిపి చేసిన మందు బాగా పనిచేస్తుంది. తేలు మంత్రం *ఓం హ్రూంజః*

రక్తాతిసార (రక్తవిరేచనాల)ను పంచదార, తేనెలను బియ్యపు కడుగుతో కలిపి తాగడం ద్వారా అరికట్టవచ్చును. పాలను తేనెతో కలిపి తాగితే రక్తస్రావాన్ని ఆపవచ్చును.

*(అధ్యాయం -182)*

## గ్రహణి, అతిసార, అగ్నిమాంద్య, ఛర్ది, అర్శాది రోగాల చికిత్స

హే చంద్రమౌళీశ్వరా! నల్లమిరప, శృంగబేర, కుటజం బెరడులను త్రాగడం ద్వారా (అతిగ్రహణిని, సారను) ఆపవచ్చును. అతిసార రోగాన్ని వినష్టం చేసే మందును పిప్పలి, దానివేరు, నల్లమిరప, తగర, వచ, దేవదారు రసం, పాఠామూలములను పాలలో పిసికి తయారుచేయవచ్చును. మరిచ, తిలలతో చేసిన మందు తాపాన్ని పోగొడుతుంది. (ఇందులో నువ్వులను కాకుండా నువ్వు పువ్వులను వాడాలి.) సమపాళ్ళలో హరీతకి, బెల్లంలను గైకొని తేనెతో కలిపి తీసుకుంటే విరేచనం అవుతుంది. తొడల పక్షవాతం (ఊరుష్టంభం) త్రిఫల, చిత్రక, చిత్ర, కటుక రోహిణిల మిశ్రమాన్ని సేవిస్తే తగ్గుతుంది. ఈ మందు కడుపుని కడిగేస్తుంది. మరీ మొండి ఊరుష్టంభమైతే హరీతకి, శృంగవెర, దేవదారు, చందనాలను అపామార్గ లేదా జయంతి వేరులను మేకపాలతో కలిపి చేసిన ద్రవంతో కలిపి కషాయం చేసి వారం రోజుల పాటు తాగితే పూర్తిగా తగ్గిపోతుంది.

అనంత, శృంగవెరలను బాగా చూర్ణించి గుగ్గిలం, బెల్లాలను సమపాళ్ళలో తీసుకొని దానికి కలిపి ఆ మిశ్రమం నుండి గుళికలను తయారుచేసుకొని తింటే వాయుదోషాలు, నరములపై ఒత్తిడులు, ఎముకలలో తేడాలు, అజీర్ణం బాగా తగ్గుతాయి.

పుష్య నక్షత్రంలో చంద్రుడున్న వేళ శంఖపుష్టి మొక్కను వేళ్ళతో ఆకులతో సహా నూరి మేకపాలలో వండి వుంచుకొని ఆవేశంతోనో దుఃఖంతోనూ అరుస్తూ పడిపోయే[1]

---

[1] *దీనిని ప్రస్తుత భాషలో హిస్టీరియా అంటారు.*

మూర్ఛజబ్బు గలవారికి వేస్తే వారు పూర్తిగా స్వస్థులవుతారు. సమపాళ్ళలో అశ్వగంధ, అభయాలను తీసుకొని తయారుచేసిన కషాయం రక్తపిత్త రోగాన్ని బాగా కుదర్చగలదు. కుష్ఠ, హరీతకిలను కలిపి చూర్ణంచేసి ఓ గుప్పెడు నోట్లో వేసుకొని మంచినీళ్ళు తాగేస్తే ఎంత మొండి వాంతులైనా ఆగిపోతాయి. గుడూచి, పద్మక, అరిష్ట, ధన్యాక, రక్తచందనాల కషాయం, పిత్తజనిత జ్వరాన్నీ, కఫజ్వరాన్నీ, వాంతులనీ, మంటనీ, దాహాన్నీ నివారించి జీర్ణవ్యవస్థను మెరుగుపఱుస్తుంది.

***ఓంహూం నమః*** అనే మంత్రాన్ని మననం చేస్తూ శంఖపుష్పిని రెండు చెవులకూ ధరించాలి. తరువాత చాతుర్థక వంటి తీవ్ర జ్వరాలతో బాధపడుతున్న రోగి వద్దకు పోయి ఒక చెవి నుండి పుష్పాన్ని తీసి చేత బట్టుకొని

***ఓం జంభినీ స్తంభినీ మోహయ సర్వవ్యాధిన్***
***మే వజ్రేణ ఠఃఠః సర్వ వ్యాధిన్ మే వజ్రేణ ఫట్***

అనే మంత్రాన్ని ఎనిమిది వందలమార్లు పఠించి ఆ పూవును రోగి చేతికిచ్చి రోగి గోరును ముట్టుకుంటే ఏ జ్వరమైనా వెంటనే దిగిపోతుంది. జంబూఫల, హరిద్రాలను పాము కుబుసంతో కలిపి కాపడం పెడితే అన్ని రకాల జ్వరాలూ నశిస్తాయి. కరవవీర, భృంగపత్ర, లవణ, కుష్ఠ, కర్కటాలను ముద్దచేసి నూనెతో మరగించి తీసి దానికి నాలుగింతల పరిమాణంలో గోమూత్రాన్ని కలిపి బాగా కుదిపి శరీరంపై చిలకరిస్తే దురదలు నశిస్తాయి. విచర్చిక, కుష్టలకూ ఇది మంచి మందే. లోపలి [2]కురుపులూ పోతాయి.

ప్లీహ వ్యాకోచానికి పిప్పలి తేనెలను కలిపి గాని, శూరణ దుంపవేరు గాని మంచి నివారణనిస్తాయి. పిప్పలి, హరిద్రలను గోమూత్రంతో కలిపి ముద్దగా జేసి గుదము ద్వారా వీలైనంత లోనికి జోనిపితే మొలలు[3] పోతాయి. ఆర్ద్రకాన్ని మేకపాలతో కలిపి తాగినా ప్లీహవ్యాకోచం నిమ్మళిస్తుంది. సైంధవ, విడంగ, సోమరాజి, సర్షప, రెండు రకాల రజని, విషాలను గోమూత్రంతో కలిపి ముద్ద చేసి కుష్ఠురోగికి ఆకురుపులపై వేసి వేపాకుతో కప్పి వుంచితే ఆ రోగం తగ్గుతుంది. ***(అధ్యాయం-183)***

---

*[2]దీనిని ప్రస్తుత భాషలో అల్సర్స్ అంటుంటారు.*
*[3]దీనిని ప్రస్తుత భాషలో పైల్సు అంటుంటారు.*

# అర్శ, అజీర్ణ, గండమాలాదుల చికిత్స

రజని, కదలీ భస్మం ముద్దచేసి రాస్తే చమరకాయలు, కురుపులపై పొరలు నశిస్తాయి. ఒక వంతు కుష్ఠకి రెండువంతుల పథ్యాని కలిపి కషాయం చేసి తాగితే తొడలపైభాగంలో వచ్చే అన్ని నొప్పులూ తగ్గుతాయి. అభయ, పిప్పలిలను వెన్న, పంచదారలతో కలిపి సేవిస్తే మొలలు తగ్గుతాయి.

ఆటరూషకం ఆకులను గుండచేసి వెన్నతో కలిపి చిన్నసెగతో ఉడికించి తీసి రాసినా మొలలు నశిస్తాయి. గుగ్గుల, త్రిఫల కషాయం గుదలోపలి మొలలను సమర్థంగా అణచివేస్తుంది. అజాజి, శృంగవెరలను పెరుగుతో కలిపి అంబట్లో వేసుకొని ఉప్పు కలుపుకొని తింటే మూత్రకృచ్ఛ్రం (నీరుకట్టు) విడిపోతుంది. (ఉప్పు కలపాలి) యవక్షారాన్ని పంచదారతో కలిపి తిన్నా నీరు కట్టురోగం కుదురుతుంది.

కాటుకపిట్ట మలమూత్రాలను గుఋపు నోటినురగతోనూ[1] శోభాజనంతోనూ కలిపి కాపడం పెట్టినా, కాటుకగా మార్చి పెట్టినా అదృశ్యం కావచ్చు.

కాలిన గాయాలకూ, కురుపుల కవచాలకూ నువ్వులనూనెతో కాల్చిన యవను కలిపి రాస్తే గొప్ప ఫలితముంటుంది. లజ్జాలు, శరపుంఖల పలాస్త్రిని ★వెన్నతో కలిపి రాసినా అదే ఫలితముంటుంది.

అగ్ని జన్యబాధలను తొలగించడానికి పైపై పూతలతో బాటు ఈ మంత్రాన్ని పఠించడం కూడా అవసరం.

*ఓం నమో భగవతే రర ఛింధి*
*ఛింధి జ్వలనం ప్రజ్వలితం*
*నాశయ నాశయ హుం ఫట్ ॥* **(ఆచార...184/8)**

నిర్గుండి వేళ్ళను మణికట్టు చుట్టూ కట్టి వుంచితే జ్వరం తగ్గుతుంది. గుంజవేళ్ళను (తెల్ల గుంజ మాత్రమే) ఏడు ముక్కలు చేసి మణికట్టుకి కడితే మొలలు తగ్గుతాయి. అడవిలో ప్రయాణిస్తున్నపుడు విష్ణుక్రాంతను మేకమూత్రంతో పలాస్త్రి చేసి శరీరమంతటా పూసుకుంటే దొంగలు దరిచేరరు, పులులు దూరంనుండే తొలగిపోతాయి. బ్రహ్మదండి వేళ్ళతో ఎన్నో పనులు చేయవచ్చును. త్రిఫల చూర్ణాన్ని వెన్నతో కలిపి తింటే కుష్టు

---

★ *ఆంగ్ల పేస్ట్, తెలుగు ముద్దలకు పర్యాయపదంగా పలాస్త్రిని వాడడం జరిగింది.*

[1] *శోభాంజనం కావచ్చు.*

క్రిములు నశిస్తాయి. వెన్నను వైద్యశాస్త్రప్రకారం శుద్ధిచేసి పునర్నవ, బిల్వ, పిప్పలిలతో కలిపి పచనం చేసి సేవిస్తే వెక్కుళ్ళు, దగ్గు, ఆయాసం, గొంతు దురద తగ్గిపోతాయి. ఈ మందుని గర్భవతులకు వాడితే పురుడు సులభంగా వస్తుంది.

పైన చెప్పబడిన పునర్నవ, పిప్పలి, బిల్వాల మందుని పాలూ, వెన్నా కలిపి ఉడికించి ఉండలు చేసుకొని రోజూ తింటే వీర్యవృద్ధి కలుగుతుంది. విడంగ, మధుక, పాఠ, మాంసి, సర్జపస, హరిద్ర, త్రిఫల, అపామార్గ, మనశ్శిల, ఉదుంబర, ధాటకీలను పొడి యొనర్చి నువ్వుల నూనెతో కలిపి వేడి చేసి చల్లార్చి తొడల మధ్య మృదువుగా పూసుకుంటే సంభోగ శృంగారం సఫలీకృతమవుతుంది. ఇరువురూ ఈ మందు రాసుకుంటున్న సమయంలో

***నమస్తే ఈశవర్గదాయ ఆకర్షిణి వికర్షిణి ముగ్ధే స్వాహా***

అనే మంత్రాన్ని జపిస్తే సత్సంతానం కలుగుతుంది.

పాదరసాన్ని జటిక రసం, పునర్నవ, అమృత దూర్వల వేళ్ళు, కనకం★, ఇంద్ర వారుణీలతో కలిపి ఈ మిశ్రమాన్ని ఒక ఉక్కు పాత్రలో వుంచాలి. ఇదివిషం.

రాగిని తేనె, వెన్న, బెల్లం, కారవెల్ల రసంలతో కలిపి కాలిస్తే వెండి తయారవు తుంది. అలాగే ఒక పళం సీసాన్ని పసుపుపచ్చని ధత్తూరపుష్పం, లాంగలిక రెమ్మలతో కలిపి కాల్చడం ద్వారా బంగారాన్ని తయారుచేయవచ్చును.

ధత్తూర నూనెతో వెలుగుతున్నదీపం కాంతిలో సమాధి స్థితిలో కూర్చున్న యోగి మానవులకే కాదు, దేవతలకు కూడా కనబడడు. మదపుటేనుగు యొక్క మదజల ధారలను కాటుకగా మార్చి దాని కంటికే పెడితే అది గొప్ప యుద్ధ విజయాలను సాధిస్తుంది. దానిపై నుండి పోరాడేవాడు మహావిజేత కాగలడు.

ఒక నీటి పాము నోటిలో దంతపు ముక్కను పెట్టి నీటిలోకి తోసేస్తే అది నేలపై వలెనే నీటిలోనూ నిలబడుతుంది. దాని కనులు, కోరలు, ఎముకలు, రక్తము, పొట్ట కొవ్వులను మిశ్రమంగా చేసి నూనెతో కలిపి తన శరీరం నిండా పూసుకొన్నవారు మూడు రోజుల పాటు జలగర్భంలో ఉండిపోగలరు. మొసలి కన్నులు, తాబేలు గుండె, ఎలుక యొక్క పొట్ట కొవ్వు, ఎముకలు, శిశుమారమనే పెద్ద సముద్రపు చేప యొక్క పొట్ట కొవ్వులను కలగలిపి పలాస్త్రి చేసి శరీరం నిండా పూసుకున్న వారు జలాశయాల అట్టడుగుభాగాల్లో కూడా, తమ స్వగృహాలలో వలెనే ఉండగలరు.

---

★ ఈ కనకం బంగారం కాదు. ఉమ్మెత్తగాని సంపెంగగాని కావచ్చును.

ఇనుపరజనును మజ్జిగలో కలుపుకొని తాగితే పచ్చకామెర్లు తగ్గుతాయి. తండులీయక వేరు, గోక్షురాలను పాలలో కలుపుకొని తాగితే తాపాలు, నోటి సమస్యలు తొలగిపోతాయి. జాతి, కొలల వేళ్ళను మజ్జిగతో కలుపుకొని త్రాగితే అజీర్ణ వ్యాధి నశిస్తుంది.

కుశవేళ్ళు గాని, బాకుచి గాని మజ్జిగలో కలిపితే అజీర్ణానికి మందుగా పనిచేస్తాయి. ఇవే బాకుచి వేళ్ళను పుల్లంబలితో కలిపి పుడిసిలిస్తే పలువరుసలో కలిగే వ్యాధులన్నీ తొలగిపోతాయి. కల్తీ ద్రవాలు త్రాగడం వల్ల వచ్చే ఇబ్బందులు ఇంద్ర వారుణి మూలాలను నీటిలో నానబెట్టి తాగడం వల్ల సమసిపోతాయి. సురభిక మూలాన్ని వాయు సమస్యలు వచ్చినపుడాశ్రయించాలి.

గుంజ పలాస్తిని పుల్లంబలిలో కలిపి తలకు పట్టీ వేస్తే ఎలాటి శిరోవేదనయైనా శిథిలమైపోతుంది. బల, అతిబల, యష్టిలను చూర్ణం చేసి తేనెతో పంచదారతో కలిపి తింటే గొడ్రాలు గర్భవతి కాగలదు. తెల్ల అపరాజిత వేరుని పిప్పల, సొంటిలతో కలిపి నూరి తలకి రాస్తే తీవ్రమైన తలనొప్పి కూడా తొలగిపోతుంది.

ప్లీహవ్యాకోచానికి కేతకి పత్ర చూర్ణాన్ని బెల్లంతో కలిపి గాని, శరపుంఖని మజ్జిగతో కలిపి గాని చేసిన మందు మంచి విరుగుడు. శుంఠి, సౌవర్చల, హింగులను కలిపి త్రాగితే అన్ని రకాల గుండెనొప్పి నుండీ శాంతి లభిస్తుంది. ***(అధ్యాయం -184)***

## గణపతి మంత్రం- ఔషధిక యోగం
## శోథ, అజీర్ణ, విషూచిక, పీనసాది రోగాలకు చికిత్స

**గ**ణపతి మహామంత్రమైన ***ఓంగం గణపతయే నమః*** సర్వగణాలకీ సార్వభౌముడైన విఘ్నేశ్వరుని ప్రసన్నం చేసుకోవడానికి జపించబడే మంత్ర రాజము. ఇది విద్యనూ ధనాన్నీ కూడా ప్రసాదించగలదు. దీనినొక వందమార్లు జపిస్తే మంచి కీర్తి ప్రతిష్ఠలు కలుగుతాయి. ఎనిమిదివేల మార్లు జపించి వెళితే ఏ ప్రయత్నంలో నైనా విజయం తథ్యం.

ఈ మంత్రాన్ని వెయ్యియెనిమిది (1008) మార్లు పఠిస్తూ (1008 ఆహుతులు) అదే సంఖ్యలో నల్లనువ్వులను వెన్నలో ముంచుతూ ఆహుతులను వ్రేలిస్తే మూడు రోజులలోనే ఆ ప్రాంతపు రాజు వశుడౌతాడు. శుక్ల అష్టమి, చతుర్దశి రోజులలో ఉపవాసముండి గణేశుని విధ్యుక్తంగా పూజించి వెయ్యియెనిమిది (1008)మార్లు తిలలను, ధాన్యపు గింజలను ఆహుతులిస్తే ఆ సాధకుడు ఏ యుద్ధంలోనైనా అజేయుడౌతాడు.

ఎంతటి వారైనా అతనిని సేవించుకోవాలనుకుంటారు. హ్రీం కారాన్నీ, విసర్గనీ, ఒక స్త్రీ నుదుటిమీద వేలితో వ్రాసి ఈ మంత్రాన్ని జపిస్తే ఆ స్త్రీ అతని వశంలో వుంటుంది.

సహదేవి భృంగరాజ, శ్వేతపారిజాత, వచలను కలిపి ముద్దజేసి తిలకంగా నిత్యం నుదుట ధరించేవాడు ముల్లోకాలనూ తన ఆజమాయిషీలో నుంచుకోగలడు. ఎడమచేతి చిటికెన వ్రేలితో గోరోచన, మీనపిత్తలనుండి చేయబడిన పుల్లలతో తిలకాన్ని దిద్దుకునేవాడు కూడా ముల్లోకాలనూ అదుపులో ఉంచుకోగలడు. తన మలిన రక్తంతో గోరోచనాన్ని కలిపి తిలకాన్ని చేసి నుదుట ధరించే స్త్రీ ఎవరివైపైనా గట్టిగా చూస్తే చాలు, వాడామె వలలో వెంటనే తలమునకలుగా పడిపోతాడు.

కాకజంఘమూలాన్ని పాలలో కలుపుకొని తాగితే శోథరోగం (మలినరక్తం వల్ల వచ్చే కురుపులు, బొడిపెలు) కుదురుతుంది.

అశ్వగంధ, నాగబల, బెల్లం, మాశల మిశ్రమాన్ని రోజూ తినేవారికి వయసు పెరిగినా జవసత్వాలు తగ్గవు.

త్రిఫల చూర్ణమును ఇనుపరజనుతో కలిపి గాని, కలపకగాని తేనెతో రంగరించి తీసుకున్నా, శంబూక క్షారకాన్ని నీటిలో వేసి మరగించుకొని తాగినా పరిణామ శూలయను అజీర్ణవ్యాధి నశిస్తుంది. లేడి కొమ్మును మంటలో కాల్చి బూడిద చేసి దానిని ఆవు వెన్నతో కలిపి తీసుకుంటే హృదయసంబంధి వ్యాధులూ, వీపునొప్పీ అంతరిస్తాయి. హింగు, సువర్చల, శుంఠిలను మహౌషధతో కలిపి నీటిలో మరగించి తాగితే అన్ని రకాల కడుపు నొప్పులూ కడముట్టుతాయి. అపామార్గపు వేరుని సముద్రపు ఉప్పుతో కలిపి తీసుకుంటే అజీర్ణమూ కడుపునొప్పీ తగ్గుతాయి. వట మొలకలను బియ్యపు కడుగులో శుద్ధి చేసి మజ్జిగలో పోసుకుని తాగితే విరేచనాలు తగ్గుతాయి. అంకోట వేళ్ళను అర్ధకర్ష పరిమాణంలో తీసుకొని నూరి బియ్యం కడుగులో పోసుకుని తాగితే అతిసార, నీళ్ళవిరేచనాలు కడతాయి. అలాగే మరిచ, సొంటి, కుటజ బెరడుపొడి, బెల్లం ఒకటి, రెండు, నాలుగు, ఎనిమిది పాళ్ళలో క్రమంగా తీసుకొని కషాయం చేసి తాగినా అతిసార జబ్బు అంతరిస్తుంది.

తెల్ల అపరాజిత వేళ్ళు, హరిద్ర, వండిన బియ్యం (అన్నం) అపామార్గ, త్రికటుక లను ముద్దగా చేసి గుళికలను తయారుచేసి వేసుకుంటే విషూచి నశిస్తుంది. మూత్ర సంబంధ రుగ్మతలన్నీ త్రిఫల, అగురు, శిలాజితు, హరీతకిలను వేరు వేరుగా చూర్ణం చేసి అయిదేసి నిముషాల వ్యవధిలో వేరువేరుగా తేనెతో రంగరించి తింటే పోతాయి. విభీటకాన్ని భస్మం చేసి తేనెతో కలిపి తింటే పడిశం పారిపోతుంది.

త్రికటు, త్రిఫల, అలక్త, నువ్వులనూనె, మనశ్శిల, వేపాకులు, జాతీసుమాలు, శంఖ నాభి, చందనాలను కలిపి బాగా మేకపాలతో, మేకమూత్రంతో పచనం చేసి మరల తీసి పొడిగా చేసి కాటుకలా వాడితే రేచీకటి, తెల్లగోడవలె కనబడుట, కంటి క్రింది నలుపు మున్నగు నేత్ర రోగాలు నశిస్తాయి.

పిప్పలి, త్రిఫలచూర్ణం, తేనె, సైంధవాల మిశ్రమం అన్ని రకాల జ్వరాలనూ, పడిశాన్నీ, దగ్గునీ, క్షయనీ పూర్తిగా క్షీణింపజేస్తుంది. దేవదారు పొడిని మేకమూత్రంలో ముంచితీస్తూ అలా ఇరువది యొక్క మార్లు శుద్ధిచేసి ఆపై కాటుకగా మార్చి కంటికి పెట్టుకుంటే రేచీకటి, కంటిచుట్టూ నలుపు, కనురెప్పల సమస్యలు తగ్గుతాయి. పిప్పలి, కేతకి, హరిద్ర, ఆమలక, వచలను పాలతో పచనం చేసి కాటుకవలె పూస్తే కూడా కళ్ళ జబ్బులు కడముట్టుతాయి.

కాకజంఘ, శిగ్రు వేళ్ళని నోటిలో నుంచుకొని కొంతసేపు నమలితే దంతాలలో, చిగుళ్ళలో వుండే క్రిములన్నీ నశిస్తాయి. ***(అధ్యాయం - 185)***

# ప్రమేహ, మూత్ర నిరోధ, శర్కర, గండమాల భగందరాది రోగాల చికిత్స

ప్రమేహ (చక్కెర, మూత్ర) రోగానికి గుడూచి కషాయంతో తేనెను కలుపగా వచ్చే మందు గొప్ప విరుగుడు. గొహాలిక మూలాలను నువ్వు గింజలతో, పెరుగు వెన్నలతో కలిపి పచనం చేసి తీసుకుంటే నీరు కట్టురోగం పోతుంది. ఇదే మందుకి కాస్త సౌవర్చలాన్ని కలిపి సేవిస్తే వెక్కిళ్ళు తగ్గిపోతాయి. గోరక్ష చూర్ణాన్ని కర్కటి మూలంతో కలిపి ఆ మిశ్రమాన్ని వాస్య కడుగులో వేసుకుని మూడురోజులు రెండుపూటలా తాగితే జల్లివేత, కొన్ని మూత్ర సంబంధిత రోగాలూ నశిస్తాయి. జల్లివేతకీ, కామెర్లకీ వేసవిలో సంగ్రహించిన మాలతి వేళ్ళను మేకపాలతో ఉడికించి చేసిన మందుకూడా పనిచేస్తుంది. దీనికి అనుపానంగా పందారను వాడాలి.

ద్విజయష్టిని గుండ చేసి బియ్యం కడిగిన నీటితో ముద్దగా చేసి పట్టీ వేస్తే కంఠి, గండమాల, వరిబీజము తగ్గుతాయి. ఈ మిశ్రమాన్ని రసాంజన, హరీతకి చూర్ణాల మిశ్రమంతో కలిపి శిశ్నానికి పూస్తే దానికి సంబంధించిన సమస్యలు మాయమవుతాయి. కరవీర లేదా పూగఫల మూలాలను రాస్తే 'ఆ' శక్తీ ఆసక్తీ రెండూ పెరుగుతాయి.

మొలలకు దంతి, హరిద్ర, చిత్రకాల పలాస్త్రి మంచి విరుగుడు. పిల్లి ఎముకను గుండకొట్టి, త్రిఫలను నీటితో కడిగి ఆ నీటితో ముద్దను చేతి రక్తం కారే చోట పూస్తే రక్తం ఇక కారదు. స్నుహిజలంతో హరిద్రాన్ని పలుమార్లు శుద్ధిచేసి పూతవేస్తే మొలలు తగ్గుతాయి. అలాగే ఘోషాఫల, సైంధవాలను మెత్తగా నూరి పలాస్త్రిని చేసి రాసినా, ఆవువెన్నెలో త్రికటుకని వండి దానికి మూడింతలు పలాశ, క్షార జలాలను (కడిగిన జలాలను) కలుపుకొని తాగినా *మొలలు నశిస్తాయి.

యవక్షార, సొంటిగుండ, బెల్లాలను సమపాళ్ళలో రోజూ పరగడుపునే తింటే అజీర్ణబాధలు రానేరావు. జఠరాగ్ని పెరుగుతుంది. హరీతకి, సైంధవ, చిత్రక, పిప్పలిలను కలిపి పిండి నూరి వేడి నీటిలో కలుపుకొని తాగితే ఆకలి పెరుగుతుంది. పందిమాంసాన్ని వెన్నతో కలిపితిన్నా ఆకలీ జీర్ణశక్తి పెరుగుతాయి.

హే వృషభధ్వజా! హస్తికర్ణ పలాశపొడిని వందపళంల పరిమాణంలో తింటే అన్ని రోగాలూ కట్టి వేస్తాయి. ఇదొక సర్వరోగనివారిణి. దీనిని పాలలో కలుపుకొని ఏడురోజులపాటు త్రాగితే జ్ఞాపకశక్తితో బాటు దేహదారుఢ్యం కూడా బ్రహ్మాండంగా పెరుగుతుంది. అలాగే పదహారు రోజులపాటు త్రాగితే శరీరం చంద్రకాంతులతో మెరుస్తుంది. వయసు వంద దాటినా ఒంటి సొగసు, నునుపు, మెరుపు తగ్గవు. అలా వెయ్యేళ్ళు జీవించవచ్చు. తేనెతో కలిపి తాగినా, తేనె, వెన్నలతో కలిపి తాగినా మరింత గుణముంటుంది.

ఈ హస్తికర్ణ పలాశకున్న గుణాలు ఏ మందుతో పోల్చినా ఎక్కువే. దీనిని పెరుగుతో తిన్నవారు వజ్రకాయులై మదన సుందరులై నారీజనాభిరాములవుతారు. జ్ఞాపకశక్తి కూడా పెరుగుతుంది. పుల్లంబలితో కలిపి తింటే దీర్ఘాయువు, నల్లగా మిలలాడే జుత్తు వుంటాయి. త్రిఫలతో కలిపి సేవిస్తే శరీరం దివ్యశరీరం వలె కాంతులీనుతూ వుంటుంది. ముడత పడదు. కనులు తేజోవంతాలవుతాయి. శిరోజాలు శాశ్వతసౌందర్యంతో భాసిస్తాయి. దీనిని కాటుకగా చేసి మేకపాలతో అద్ది కంటికి పెట్టుకుంటే అంధత్వంలాటి తీవ్ర సమస్య కూడా వారంరోజులకే పోతుంది.

భృంగరాజ వేళ్ళను ఎంపిక చేసి, దాచి చంద్రుడు పుష్యనక్షత్రంలో వున్నపుడు వాటిని గుండచేసి పెట్టుకొని సౌవీరతో కలిపి ఒక నెలరోజులపాటు రోజూ తింటే వార్ధక్యలక్షణాలైన ముడతలు, తెల్లవెంట్రుకలు నశిస్తాయి. ఏనుగు వలె బలవంతులవుతారు. వినికిడి ఏ మాత్రమూ తగ్గకుండా అయిదువందల యేళ్ళైనా జీవించగలరు.

***(అధ్యాయాలు 186,187)***

---

* ఈ మొలలనే ప్రస్తుత భాషలో పైల్సు అంటున్నారు

## వ్రణ, నేత్రరోగ, దంతక్రిమి, విషాదిక, వివిధ జ్వరాదిక చికిత్స

సూదిగా మొనదేలిన ఆయుధం వల్ల శరీరంపై ఏర్పడిన కోతగాయాలలో వెంటనే వెన్నకూరితే వాచకుండా, చీముపట్టకుండా వుండి త్వరగానే మానిపోతాయి. రక్తం మరీ ఎక్కువగా పోతుంటే అపామార్గవేళ్ళను అరచేతుల మధ్య నిడుకొని గట్టిగా పిండుతూ, వచ్చేరసాన్ని గాయంమీద పడేలా పోస్తే రక్తం కారడం ఆగుతుంది.

ఓ రుద్రదేవా! ఏదేనా ఆయుధపు మొనగాని మరే బాహ్యవస్తువుగాని మనిషి గాయంలో ఇరుక్కుని వుండిపోతే లాంగలిక, హిజ్జల మూలాలను బాగా పిండి ఆ రసం గాయంపై పడేలా వేయాలి.ఆ బాహ్య వస్తువు లోపలికి వెళ్ళి ఎంతకాలమైనా గాని, వెంటనే పైకి వస్తుంది. గాయాలు కాని, కురుపులుగాని చర్మంపై ఏర్పరచిన రంధ్రములు, గోతులు, చీలికలు మున్నగువాటిపై బలవేళ్ళనుగాని మేషశృంగిని గాని గుండచేసి నీటితో పలాస్త్రిని తయారుచేసి దానిని అద్దితే అవి తగ్గిపోయి చర్మం మరింతగా శోభిస్తుంది. అలాగే కంకుమూలపు గుండ కూడా. రోగికి ఈ దశలో కోద్రవ అన్నాన్నీ, గేదెపెరుగునూ మాత్రమే ఆహారంగా ఇవ్వాలి.

రక్తంలో మాలిన్యాలేర్పడితే శరీరంపై కురుపులు, మచ్చలు పుట్టుకొస్తాయి. అవి పూర్తిగా తగ్గిపోయి రక్తం మరల బాగుపడాలంటే బ్రహ్మయష్టి పండ్లను నూరి, గుండచేసి నీటితో ముద్దచేసి ఒంటికి పట్టించాలి. రాచపుండు, గడ్డ వంటి మొండి కురుపులు సైతం యవ, విడంగ, గంధపాషాణ, శొంఠిలను గుండ నూరి దానికి తొండ లేదా ఊసరవెల్లి రక్తాన్ని కలిపి ముద్దజేసి రాస్తే పోతాయి. హే గరళకంఠా! అగస్త్య పుష్పాలపొడి, మిరియాలపొడి కలిపి సేవిస్తే కడుపునొప్పులన్ని రకాలూ నశిస్తాయి. పాముకుబుసం, హింగు, వేపాకులు, యవలు, తెల్లావాలు, కలిపి పలాస్త్రి చేసి వాడితే భూతప్రేతాల వల్ల వచ్చేరోగాలు తగ్గుతాయి. గోరోచన, మరిచ, పిప్పలి, సైంధవ, తేనెల మిశ్రమంతో కాటుకను తయారుచేసి వాడినా భూతప్రేతాల ప్రభావం పడదు. గుడ్లగూబ తోకను గుగ్గిలంతో ధూపం వేస్తే దుష్టగ్రహపీడ వదలిపోతుంది. చాతుర్థక జ్వరంతో బాధపడుతున్న వానికి నల్లగుడ్డను కప్పి ఇందాకటిలాగే ధూపం వేస్తే ఆ జ్వరం తగ్గిపోతుంది.

తెల్ల అపరాజిత పూల రసాన్ని కంటిలోకి జారిస్తే దాని చుట్టు నున్న వలయాలు మాయమవుతాయి. ఓ నీలలోహితా, ఓ సురాసుర విమర్దనా! గోక్షుర మూలాలను నమలడం ద్వారా దంతములలో చేరు క్రిములను సమూలంగా నాశనం చేయవచ్చు. వృశ్చిక వేరుని నీటిలో కలిపి రాత్రంతా అలాగే వుంచి తెల్లారగానే తాగితే జ్వరం వలన వచ్చే మంటలు

ఆరతాయి. దానినే వాస్యను కడిగిన నీటితో కలిపి తాగితే ఏ విషమైనా విరిగిపోతుంది. లజ్జాలుక వేరుని తన వీర్యంలోనే ముంచి ఎవరి చేతిలోనైనా పెడితే వానికి వారి వల్ల ఎటువంటి ఆపదా రాదు.

పారవేళ్ళను మందుకు తగినట్లుగా శుద్ధిచేసి ఆవు వెన్నతో కలిపి తాగిన వానిపై ఏ విషమూ పనిచేయదు. రక్తచిత్రకవేరు, శిరీష రసాలను వాస్యజలంతో కలిపి చెవిలో వేస్తే పచ్చకామెర్లూ, సర్వతాపజ్వరాలు తగ్గిపోతాయి. క్షయరోగానికి మూడురోజులపాటు కోకిలాక్షను మేకపాలతో కలిపి త్రాగడం మంచి మందు.

మూడురకాల వాత రక్తవ్యాధులూ కొబ్బరిపూవును మేకపాలతో కలిపి స్వీకరిస్తే సమసిపోతాయి. సుదర్శన మూలాలను దండగుచ్చి మెడలో వేసుకుంటే త్ర్యాహిక జ్వరం పోతుంది. గ్రహదోషాలనుండీ, దెయ్యాలనుండీ రక్షణ లభిస్తుంది. అలాగే చంద్రుడు పుష్యనక్షత్రంలో ప్రవేశించినపుడు గుంజవేళ్ళను సేకరించి నోటిలో పెట్టుకుంటే విషాలన్నీ విరిగిపోతాయి. గుంజమొక్క వేళ్ళతో పాటు కాండాలను మణికట్టుకి గానీ, మెడకు గానీ చుట్టుకుంటే దుష్టగ్రహాల, శక్తుల ప్రభావం సోకదు – కృష్ణపక్ష చతుర్దశినాడు ఈ గుంజ ప్రభావం ఎక్కువగా వుంటుంది. కాబట్టి ఆ రోజు ఆ వేళ్ళనూ కాండాలనూ వాడడం ప్రశస్తం. ***(అధ్యాయాలు. 188, 189)***

# ఒళ్ళునొప్పులు గండమాల, ప్లీహ, విద్రధి మున్నగు వివిధ రోగాల చికిత్స, సుగంధద్రవ్యాల, విషచికిత్సమందుల వివరాలు

హే పార్వతీశా! అపరాజిత మూలాన్ని గోమూత్రంతో కలిపి తాగితే కంతి కనుమరుగైపోతుంది. మెడవద్ద, భుజాలలోనూ నొప్పులు కలిగినపుడు ఇంద్రవారుణి కషాయాన్ని చల్లని నీటితో కలిపి త్రాగినా, జింగిణి, శుకగించి గింజలను నశ్యంగా చేసి పీల్చినా వెంటనే ఉపశమనం కలుగుతుంది.

అశ్వగంధ, పిప్పలి, ద్వివిధవచ, కుష్ఠలను పలాస్త్రి చేసి గేదెవెన్నతో కలిపి లింగంపై పూస్తే దానిలోపలి నాళాలలో కలిగే నొప్పులు పోతాయి. అలాగే గుండెపై మృదువుగా రాస్తే అక్కడి నొప్పులు తగ్గుతాయి. కుష్ఠ నాగబాలల పలాస్త్రిని వెన్నతో కలిపి బాలికల వక్షస్సుపై రాస్తే యౌవనపు వంపుసొంపులు కనుల కింపుగా పెరుగుతాయి.

ప్లీహ వ్యాకోచానికొక అరుదైన చికిత్స వుంది. ఇంద్రవారుణిక మొక్కని పెకలించి రోగి నామాన్ని గట్టిగా అరచి చెబుతూ దాన్ని దూరంగా విసరివేస్తే రోగం తగ్గుతుంది.

విద్రధి– అనగా పైకి తేలకుండా వుండే పుండు తెల్ల పునర్ణవమూలాన్ని బియ్యపు కడుగుతో కలిపి తాగితే లోపల్లపలే మాడిపోతుంది. మహోదరంలోనగు వాటికి అరిటాకు భస్మం నీటిలో మరగించి తాగడం మంచి విరుగుడు అలాగే కదలీమూలాలను వెన్న, బెల్లంలతో వండి త్రాగితే నడుము ప్రాంతంలో వుండే క్రిములన్నీ నశిస్తాయి. రోజూ తెల్లారు జామునే నింబాకు పొడిని ఉసిరికకు అద్దుకొని సేవిస్తే కుష్ఠ మున్నగు రోగాలు నయమౌతాయి.

హరీతకి, విడంగ, హరిద్ర, తెల్ల ఆవాలు, సోమరాజ కరంజల వేరులు, సైంధవాలను కలిపి చూర్ణం చేసి గోమూత్రంతో ముద్దచేసి రాస్తే కుష్ఠ రోగం పోతుంది.

త్రిఫల ఒక పాలు, సోమరాజ బీజాలు రెండు పాళ్ళు తీసుకుంటూ వైద్యులు నిర్దేశించిన పథ్యాన్ని నిక్కచ్చిగా పాటిస్తే బద్దె పురుగు★ నశిస్తుంది.

అలాగే హరిద్ర, హరితాల, దూర్వ, గరుకుప్పూలను గోమూత్రంతో ముద్దచేసి రాస్తే పామాయను బద్దె పురుగు, చర్మవిషాలు నశిస్తాయి.

తెల్లమచ్చులకుష్ఠను సోమరాజ విత్తనాలను వెన్న, తేనెలతో ముద్ద చేసి పెట్టడం ద్వారా జయించవచ్చు. దీనికి అనుపానంగా మజ్జిగను వాడాలి.

తెల్ల అపరాజిత వేరును నీటిలో వుంచి ఆ నీటితోనే శుద్ధిచేస్తూ తీస్తూ ఒక నెలపాటు రాస్తే బొల్లి మటుమాయమవుతుంది.

గేదెవెన్న, సింధూర, మరిచకలను గజ్జి (పామా) వంటి తెగులున్న చోట రాస్తే ఆ రోగం పోతుంది. శుక్ల పిత్తానికి గంభారి పొడివేళ్ళను ఉడికించి పాలతో కలిపి చేసిన పానీయం మంచి విరుగుడు. శిల్పికను నశింపచేయాలంటే మూలకమూలాలను అపామార్గ రసంతో కలిపి నూరి చేసిన పలాస్త్రిని శరీరంపై రాయాలి. హరిద్రాన్ని కదలీ భస్మంతో కలిపి పెట్టినా ఆ వ్యాధి తగ్గుతుంది. గజ్జికి కదలి, అపామార్గ చూర్ణాలను ఎరండతో చేర్చి, రాయడం కూడా మంచి ఫలితాన్నిస్తుంది.

కూష్మాండమునెండ బెట్టి కాల్చి భస్మం చేసి దానికి గోమూత్రాన్ని కలిపి, హరిద్రతో నీటితో ముద్దచేసి చిన్న మూకుట్లో వేసి ఎద్దుపిడకపై తక్కువ సెగలో వేడిచేసి చల్లారినాక దానితో తయారుచేసిన తైలాన్ని చేతులకూ కాళ్ళకూ పట్టిస్తే వంకరలు తీరి అందంగా ఆరోగ్యంగా అవి పెరుగుతాయి. నువ్వులు, ఆవాలు, హరిద్ర, కుష్ఠకాలతో తయారుచేసిన తైలాన్ని శరీర మర్దనకుపయోగిస్తే దుర్వాసనలుపోయి సువాసనలబ్బుతాయి. దూర్వ,

★ *దీనిని ప్రస్తుత భాషలో రింగ్ వర్మంటున్నారు.*

కాకజంఘ తైలం కూడా ఇలాటిదే. అర్జున పుష్పాలు, జంబు, లోధ్రల ఆకులుకూడా ఇలా తైలంగా చేస్తే శరీర దుర్వాసనను పోగొడతాయి. లోధ్ర, నీటిని కనక(లత) పొడితో కలిపి శరీరానికి రాసుకుంటే వేసవి కాలంలో శరీరాన్ని బాధించేవేవీ దరిచేరవు. కాకజంఘ తైలం శరీరానికి సుగంధాన్నిస్తుంది.

యష్టిమధు, వాసక రసాల కషాయానికి పంచదార, తేనెలను చేర్చి తాగితే రక్తపిత్త, తాప, కామెర్ల రోగాలు తగ్గిపోతాయి. వాసక రసాన్ని తేనెతో తాగితే రక్త పిత్తం తగ్గుతుంది. రోజూ పొద్దున్నే సహజశీతల జలాన్ని త్రాగితే పడిశమే పట్టదు. పట్టినా నిలబడదు. విభీటక, పిప్పలి, సైంధవాలను పుల్లంబలితో తింటే గొంతు బాధలు (ధ్వనులతోసహా) తగ్గుతాయి.

ఆయాసం తగ్గడానికి పెద్ద ప్రయత్నమే చేయాలి. ఆమలక, మనశ్శిల, బలమూల, కౌలపత్ర, గుగ్గులాలను ఆవుపాలతో కషాయం చేసి త్రాగుతుండాలి. ఇంకా బదరి, జాతీపత్ర, కౌలపత్ర, మనశ్శిల లను కాల్చి ఆ పొగను పీలుస్తుండాలి. ఆయాసం శాశ్వతంగా నిష్క్రమిస్తుంది. త్రిఫల, పిప్పలిలను చూర్ణం చేసి తేనెతో రంగరించి భోజనానికి ముందు తీసుకుంటే దాహం, జ్వరం దగ్గరకు రావు. త్రిదోషాల వల్ల వచ్చే ఏ వాంతుల జబ్బైనా బిల్వమూల, గుడూచిల కషాయాన్ని తేనెతో తీసుకుంటే సమసిపోతుంది. దూర్వను గుండ చేసి బియ్యపు కడుగుతో ముద్ద చేసి తింటే కూడా వాంతులాగుతాయి.

గౌరీశంకరా! చంద్రుడు పుష్యనక్షత్రంలో ప్రవేశించినపుడు తెల్ల పునర్నవ వేళ్ళను సేకరించి నీటిలో వేసుకొని త్రాగివేసిన వాని జోలికి గాని ఇంటికి గాని ఏ సర్పాలూ రావు. ఎలుగుబంటి దంతాలతో చేయబడిన గరుడ ప్రతిమగల తాయెత్తును గాని రక్షను గాని ధరించిన వానిని ఏ పామూ కాటు వేయదు. శాల్మలి మూలాన్ని నీటితో కషాయం చేసుకొని త్రాగినవాని శరీరంలోకి పాముకోర దిగినా విషమెక్కదు. లజ్జాలుక మూలాన్ని చంద్రుడు పుష్యనక్షత్రమండలంలో నున్నపుడు సంగ్రహించి మణికట్టుకి కట్టుకున్నా, వాటి రసాన్నిశరీరంపై పూసుకున్నా ఏ పామునైనా పట్టుకోవచ్చు. రౌద్ర, దుందుభ జాతి పాముల విషాన్ని మహాకాలవేళ్ళను పుల్లంబలితో చేర్చి చేసిన పలాస్త్రి శరీరంపై రాయబడి హరిస్తుంది. తండులీయక వేరు బియ్యపు కడుగు, వెన్నలతో పలాస్త్రి చేయబడితే విష(సర్వవిధ విష) సంహారకమవుతుంది.

నీలి లేదా లజ్జాలుక వేరుని బియ్యపు కడుగులో నానబెట్టి తాగితే విష కీటకాల విషం విరిగిపోతుంది. అదేవిధంగా గుమ్మడిరసం, బెల్లం లేదా పంచదార, పాలు కలిపిన

మందుకూడా కీటక విషహారకమే. శ్వేతార్క మూలాన్ని చంద్రుడు పుష్యనక్షత్ర మండలంలో నున్నపుడు సేకరించి సహజశీతల జలంలో నానబెట్టి తాగితే విషకీటకాల కాటు, విషం పూసిన కత్తిగాటు ఆ మనిషిని బాధించవు.

మతిపోయి తిరుగుతున్న వారిని మరల మతిమంతులను చేసే శక్తి కొద్రువ మూలాలకుంది. వీటిని బెల్లంతో పాలతో కలిపి త్రాగితే పోయిన జ్ఞాపకశక్తి మరల వస్తుంది. యష్టి మధుని పైవిధంగా తాగితే ఎలక కొరకడం వల్ల చేరిన విషం ఎగిరిపోతుంది. అదీ మూడురోజుల్లోనే! నల్ల అంకోటను వేడినీళ్ళలో వేసుకుని తాగితే ఎలాంటి విషమైనా జీర్ణమై పోతుంది.

ఓ మహాదేవా! ఆవుపాలనుండి అప్పుడే తీసిన వెన్నకు సైంధవ లవణాన్ని చేర్చి సేవిస్తే తేలుకాటునుండి ఉపశమనం కలుగుతుంది.

మనిషి కాటుకి మందులేదంటారు గానీ ఉంది. కుసుంభ, కుంకుమ, హరితాల, మనశ్శిల, కరంజలతో అర్కమూలపు పొడిని చేర్చి తింటే మనిషి కాటు వల్ల ఎక్కిన విషం దిగిపోతుంది.

తేనెటీగ కుడితే సొంటి, తగరపాదికల పలాస్త్రిని ఆ కుట్టినచోట పూస్తే వెంటనే నొప్పి తగ్గిపోతుంది. దీనికి శతపుష్ప, సైంధవ, నవనీత మిశ్రమం ఇంకా బాగా పనిచేస్తుంది. కుక్క కాటుకి శిరీష విత్తనాన్ని పాలలో ఉడికించి చేసిన మందు మంచి విరుగుడు. కప్పకాటుకి వేరే మందేమీ అక్కరలేదు. ఆ చోట చర్మాన్ని చురికించి కొంచెం ఎఱ్ఱబడగానే నీళ్ళు పోస్తే చాలు.

ఎలుక కాటు వల్ల ఎక్కిన విషం చంద్రుడు నడినెత్తిన వున్నపుడు సంగ్రహించిన ధత్తూరకాన్ని తీసి రసం పిండి దానికి పాలు, బెల్లం, వెన్నలను కలిపి చేసిన మందువల్ల దిగిపోతుంది. సాలెపురుగు విషానికి దేవదారు, గైరికాలను గాని నాగేశ్వర, రెండు రకాల హరిద్రను గాని మంజిష్ఠికతో కలిపి చేసిన పలాస్త్రి మంచి విరుగుడు. కరంజ బీజాలు, వరుణ బెరడు, నువ్వులు, ఆవాలతో చేసిన మిశ్రమౌషధం సామాన్య విషాలన్నిటినీ విరిచేస్తుంది. గుఱ్ఱం దురదలతో హడావిడి చేస్తున్నపుడు దాని చర్మంపై కుమారీ పత్రం, వెన్న, ఉప్పులతో చేసిన పలాస్త్రిని పూస్తే అది శాంతిస్తుంది. ఇది కాస్త మొండిజబ్బు. పదిరోజులు మందు వాడాలి. ***(అధ్యాయాలు 190,191)***

# వివిధ స్నేహపాకాలద్వారా రోగచికిత్స, స్మరణ - మేధాశక్తి వర్ధక బ్రాహ్మీ ఘృతాది నిర్మాణ విధి

సర్వేశ్వరాదులారా! ఇపుడొక సర్వాజీర్ణ బాధా నాశనమగు ఒక మందు నెలా చేయాలో ఆలకించండి ఎనిమిదిపాళ్ళ చిత్రక, పదహారుపాళ్ళ సూరణ, నాలుగు సొంటి, రెండు మరిచ, మూడు పిప్పలమూల, నాలుగు విడంగ, ఎనిమిది ముషాలిక, నాలుగు త్రిఫల వీటన్నిటి పరిమాణంకీ రెట్టింపుగా బెల్లంలతో మోదకాన్ని తయారుచేసి దాచుకోవాలి. ఇది అజీర్ణానికి, కామెర్లకీ, తాపజ్వరాలకీ, విరోచనాలకీ, జీర్ణకోశ వ్యాధులకీ, ప్లీహ వ్యాకోచానికీ తిరుగులేని మందు.

ఈ క్రింది ఓషధులను ఒక్కొక్కటీ పది పళాలు తూచి తీసుకోవాలి : బిల్వ, అగ్నిమంథ, శ్యోనాక, పాటల, పారిభద్రక, ప్రసారణి, అశ్వగంధ, బృహతి, కంటకారిక, బల, అతిబల, రాస్న, శ్వదంష్ట్ర, పునర్నవ, ఎరండ, శారివ, పర్ణి, గుడూచి, కపికచ్ఛుక. వీటిని నిర్మలజలంలో పోసి మూడొంతులు ఆవిరైపోయేదాకా మరిగించాలి. ఆ మిగిలిన ఒక వంతును మూకుట్లో పోసి మరల వేడిచేయాలి. ఒక పది నిమిషాలు మరిగిన తరువాత మిగిలిన దానికి నాలుగింతలు మేకపాలను గాని ఆవు పాలనుగాని చేర్చి మొత్తం ద్రవానికి సమాన దవ్యరాశిగల శతావరినీ సైంధవాన్ని చేర్చాలి. దీన్ని దాచుకొని గుండె నొప్పి, పార్శ్వశూల, గండమాల, కంతి, *మనసులో బెంగ ప్రవేశించి కేకలు, ఏడ్పులు వచ్చే జబ్బు, వాత రక్త రోగాలకు విరుగుడుగా, అప్పటికప్పుడు శతపుష్ప, దేవదారు, బల, పర్ణి, వచ, అగరు, కుష్ఠమాంసి, సైంధవ, పునర్నవలను మిశ్రితం చేసి వాడాలి. అవసరాన్ని బట్టి దీన్ని తాగడం గాని, పీల్చడం గాని, పూయడం గాని చేయవచ్చు. శృంగార సామర్థ్యం కోసం కూడ దీనిని వాడతారు. పురుడు సులువుగా రావడానికి, వాతరోగాలకూకూడాదీనిని ఉపయోగిస్తారు.

ఆవనూనెను హింగ, తుంబురు, సొంటిలతో ఉడికించి తయారుచేసిన తైలం చెవి చుక్కలుగా వాడితే కర్ణసంబంధిత రోగాలన్నీ తగ్గిపోతాయి. ఎండుమూలక, సొంటిలను భస్మంచేసి, హింగులా, నాగరలతో కలిపి, వీటికి నాలుగింతలు మజ్జిగతో కలిపి బాగా కుదిపి చెవిలో వేస్తే చెవుడు, దుర్వాసనతో కూడినలాడి కారుట, చెవిపోటు తగ్గిపోతాయి. అలాగే పొడి మూలక, సొంటి, హింగుల, నాగర, శతపుష్పి, వచ, కుష్ఠ, దారు, శిగ్రు, రసాంజన, సౌవర్చల, యవక్షార,సముద్రపుటుప్పు, గ్రంథిక, విడముష్ట, తేనె, నాలుగింతలు

---

* *దీనిని ప్రస్తుత భాషలో హిస్టీరియా అంటున్నారు.*

శుక్త, మాతులుంగ, కదలీరసాలతో చేయబడిన తైలం కూడా చెవి సమస్యలను తుడిచిపారేస్తుంది. ముఖ్యంగా చెవుడు, చెవిలో రణగొణధ్వనులు, దుర్వాసన, కారుట, క్రిములు అను చెవి సమస్యలన్నీ ఈ తైలాన్ని వాడితే నశిస్తాయి. ఈ ఆవనూనెకు క్షారతైలమని పేరు. ఇది నోటిలోనూ, దంతాలమధ్యా వుంటే క్రిములను కూడా తొలగించగలదు.

చంద్రశేఖరా! ఇక చందన తైలాన్ని గూర్చి ఆలకించు. చందన, కుంకుమ, మాంసి, కర్పూర, జాతిపత్రిక, జాతీఫలాలు, కక్కోల, పూగ, లవంగ, అగురు, కుష్ఠ, కస్తూరి, తగర పాదిగ, గోరోచ, ప్రియంగు, బల, నఖి, సరల, సప్తపర్ణ, లాక్ష, ఆమలకి, పద్మకాలను ఆవనూనెలో వేసి తయారుచేసే ఈ చందన తైలం అతి చెమటనూ, శరీర దుర్వాసననూ, దురదలనూ, సర్వచర్మరోగాలనూ కుదురుస్తుంది. స్త్రీలకు వంధ్యత్వాన్ని పోగొడుతుంది. పురుషులలో శక్తిని పెంచుతుంది.

వెన్నతో చేసే చిత్రకఘృతం మొలలనూ, ప్లీహవ్యాకోచాన్నీ,కురుపులనీ (లోపలి) నశింపచేసి, జీర్ణశక్తిని పెంపొందిస్తుంది. ఒక ప్రస్థ వెన్ననూ ఎనిమిది ప్రస్థల నీటినీ తీసుకొని అందులో చిత్రక, యమాని, ధన్య, త్రయూషణ, జీరక, సౌవర్చల, విడంగ, పిప్పలి మూల, రాజికాలను వేసి బాగా ఉడికించి చల్లార్చితే చిత్రకఘృతం తయారౌతుంది.

ఒక ప్రస్థ ఆవనూనెను ఎనిమిది ప్రస్థల గోమూత్రంతో కలిపి మట్టిపాత్రలో గాని ఇనుప దబరాలో గాని పోసి సన్నటి సెగలో మరిగిస్తూ ఈ క్రింది మందులను ఒక్కొక్క దానినీ ఒక కర్షప్రమాణంలో అందులో వేయాలి. మరిచ, త్రివృత, కుష్ఠ, హరితాల, మనశ్శిల, దేవదారు, ద్వివిధ హరిద్ర, మాంసి, చందన, విశాల, కరవీర, పాలుగారుతున్న అర్క, ఆవుపేడ రసంతో కలిపిన అరపళం విష. ఈ తైలాన్ని ఒంటికి పూస్తే పామరోగం, విచర్చిక, బద్దెపురుగు దుర్వాసన వచ్చే అన్ని కురుపులూ అదృశ్యమైపోతాయి. చర్మానికొక కొత్తమెరుపు, నునుపు ఏర్పడతాయి. శ్విత్ర వంటి చర్మరోగాలూ, చికిత్స నివారణ అసాధ్యమనిపించే చిరకాలపు శ్వేతకుష్ఠ కూడా తగ్గుతాయి.

గజ్జి కురుపులకూ, ఎప్పటికీ చితకని సెగగడ్డలకూ దధికృతమైన మందొకటుంది. పటోల పత్ర, కటుక, మంజిష్ఠ, శారిబ, నిశ, జాతి, శమి, నింబపత్ర, మధుకలను వెన్నతో కలిపి ఉడికిస్తే ఆ మందు తయారవుతుంది.

శివాదులారా! ఇక బ్రాహ్మీఘృతాన్ని గూర్చి వినండి. ఒక ప్రస్థ వెన్నను, కంటకారి రసాన్నీ పాలనూ ముద్ద చేసి వుంచి దానికి ఒక అక్ష బరువున్న బ్రాహ్మి, శంఖపుష్పి, వచ,

సోమ, వృక్ష, సువర్చల, అభయ, గుడూచి, ఆటరూషక, వాగు జిల మిశ్రమాన్ని కలిపి ఉడికిస్తే బ్రాహ్మీఘృతం తయారవుతుంది. దీనిని సేవిస్తే తెలివితేటలూ, జ్ఞాపకశక్తీ పెరుగుతాయి.

అగ్నిమంథ, వచ, వాస, పిప్పలుల మిశ్రమాన్ని తేనెతో సైంధవంతో కలిపి వారంరోజులపాటు పుచ్చుకుంటే గొంతు పరిశుద్ధమై కిన్నరులంత బాగా పాడగలిగే శక్తివస్తుంది. అపామార్గ, గుడూచి, కుష్ఠ, శతావరి, వచ, శంఖపుష్ప, అభయ, విడంగల మిశ్రమాన్ని వెన్నతో కలుపుకొని మూడురోజులు వాడితే ఎనిమిది వందల పుస్తకాలలోని విషయాన్ని కూడా ధారణలో వుంచుకోగలరు. వచని నీరు, పాలు లేదా వెన్నతో కలిపి నెలరోజులపాటు తింటే గ్రాహకశక్తి, బ్రహ్మాండంగా పెరుగుతుంది. ఒక పళం వచను పాలతో సూర్య లేదా చంద్రగ్రహణ వేళలో తాగితే తెలివితేటలు బాగా పెరుగుతాయి.

భూనింబ, నింబ, త్రిఫల, పర్పట, పటోలి, ముస్తక, వాసకలను నీటితో బాగా మరిగించివాడితే రాచపుండు మాడిపోతుంది. ఎంత కలుషితమై పోయిన రక్తమైనా శుభ్రపడిపోతుంది. శంఖ, కేతకఫల, వచ, సైంధవ, త్రయూషణ, ఫెన, రసాంజన, విడంగ, మనశ్శిల, తేనెలతో చేసిన కాటుక కనులలోని మసకలను, గుడ్డితనాన్ని, రెప్పల వెనుక నల్లని చారలను కుదుర్చుతుంది.

ఒక ద్రోణం పరిమాణంగల నీటిలో రెండు ప్రస్థల మాషకాన్ని వేసి మూడు వంతులు ఆవిరైపోయేదాకా మరిగించి తీసి దానికి ఒక ప్రస్థ నూనెనూ ఒక ఆఢక కొలతలో పుల్లంబలినీ చేర్చి మరల మరిగించి తీసి ఈ మందుకి పునర్నవ, గోక్షుర, సైంధవ, త్రయూషణ, వచ, లవణ, సురదారు, మంజిష్ఠ, కంటకారికలను కలిపి తైలాన్ని తయారుచేసి గాని నశ్యంగా మార్చి గాని చెవిలోవేసినా పీల్చినా ఎంత దారుణమైన చెవిపోటైనా చిటికెలో మాయమైపోతుంది.

ఒక ప్రస్థ నూనెను రెండు పలంల సైంధవం, అయిదు పలముల శుంఠి, అంతే చిత్రిక, అయిదు ప్రస్థల సౌవీరతో కలిపి బాగా మరిగించి దించి చల్లార్చి సేవిస్తే వాతదోషాలన్నీ నశిస్తాయి. ప్లీహ వ్యాకోచమూ తగ్గుతుంది. ఉదుంబర, వట, ప్లక్ష, రెండు రకాల జంబు, అర్జున, పిప్పల, కదంబ, పలాశ, లోధ్ర, తిందుక, మధూక, ఆమ్ర, సర్జ, బదర, పద్మకేసర, శిరీషబీజ, కేతకలను కలిపి కషాయం చేసి దానిని నూనెలో మరిగించి తయారుచేసిన మందు సర్వ చర్మరోగ నివారిణి. ఎప్పటినుండో బాధిస్తున్న మచ్చలు, కురుపులు, వాటివల్ల నొప్పులూ కూడా ఈ మందుపూస్తే నశిస్తాయి. ***(అధ్యాయం -192)***

# బుద్ధి శుద్ధ కరౌషధి, అభ్యంగాలు, ఉపయోగకర చూర్ణాలు విరేచక ద్రవ్యాలు

శివ మహాదేవా! పలాండు, జీరక, కుష్ఠ, అశ్వగంధ, అజమోదక, వచ, త్రికటుక, లవణాలను కలిపి నూరి బ్రాహ్మీ రసంలో తడిపి ముద్ద చేసి తేనెతోనూ వెన్నతోనూ కలిపి ఒక వారం రోజులపాటు తింటే మనిషి మస్తిష్కం అన్ని విధాల బాగుపడి మేధావి అవుతాడు (అవుతుంది).

సిద్ధార్థక, వచ, హింగు, కరంజ, దేవదారు, మంజిష్ఠ, త్రిఫల, విశ్వ, శిరీష ద్వివిధరజని, ప్రియంగు, నింబ, త్రికటులను మెత్తగా నూరి గోమూత్రంతో కలిపి నశ్యంగా గాని, పట్టీగా గాని, లేపనంగా గాని వాడితే అరిచి కేకలు పెట్టి ఆందోళనవల్ల ఏడ్పులు పెడబొబ్బలు పెట్టు మానసిక రోగము* విషప్రభావం, మానసికోద్రేకంతో మతి తప్పిన స్థాయి, బక్కచిక్కిపోవుట, చర్మంపై మచ్చలు, చర్మం రంగు మారుట వంటి విభిన్నరోగాలన్నీ విరిగిపోతాయి. అంతేకాక విష్ణునామం జపించుచూ పూసుకుంటే దుష్టగ్రహపీడ దూరమైపోయి రాజద్వార ప్రవేశం, సమ్మానం కూడా కలుగుతాయి.

నింబ, కుష్ఠ, ద్వివిధ హరిద్ర, శిగ్రు సర్షపజ, దేవదారు, పటొల, ధన్యలను మజ్జిగతో కలిపి ముద్దచేసి రోగి తలపై కాస్త నూనెను చిలకరించి పై ముద్దను లేపనం వలె మృదువుగా పూస్తే అన్ని విధాల చర్మపు చెక్కుడులు, కుష్టులు, దురదలు నశిస్తాయి.

సముద్రపు ఉప్పు, గెడ్డలుప్పు, క్షార రాజిక, విడలవణ, కటు, ఇనుపరజను, త్రివృత, సువర్ణకాలను సమపాళ్ళలో తీసుకొని పెరుగు, గోమూత్రం, పాలు ఉంచిన గిన్నెలో వేసి తక్కువ సెగలో వేడి చేసి చల్లార్చి చూర్ణం చెయ్యాలి. దీనిని అగ్ని బలచూర్ణమంటారు. దీనిని భోజనానంతరం వేడినీటితో కలిపి తాగితే వెంటనే కొంచెం వెన్నను తింటే అన్ని రకాల అజీర్ణరోగాలూ, బొడ్డు బాధలూ, మూత్రనాళ సంబంధిత అవస్థలూ, ప్లీహ వ్యాకోచమూ నశిస్తాయి.

ఆయాసానికి దగ్గుకీ, అభయ, ఆమలక, ద్రాక్ష, పిప్పలి, కంటకారిక, శృంగి, పునర్నవ, సొంటిల మిశ్రమం బ్రహ్మాండంగా పనిచేస్తుంది. జ్వరానికి అభయ, ఆమలక, ద్రాక్ష, పాఠ, విభీటక, పంచదారలను సమానపాళ్ళలో కలిపి చేసిన మందు శీఘ్రనివారకం. త్రిఫల, బదర, ద్రాక్ష, పిప్పలి మిశ్రమం తీసుకున్నా, హరీతకిని వేడి నీటితో కలిపి ఉప్పేసుకుని త్రాగినా జాడించి విరేచనమవుతుంది.

---

*హిస్టీరియా

పైన చెప్పిన మందులన్నీ ఆయా రోగాలనే చెట్లకు పిడుగుపాట్ల వంటివి. మందునిచ్చువారు, తీసుకొని వేసుకొనువారు హరినామస్మరణను గానీ, విష్ణుస్తోత్రాన్ని గానీ ఆయా సమయాల్లో చేస్తూ వుండాలి. దైవబలం వుంటేగాని రోగాలు తగ్గవు.

*(అధ్యాయం - 194)*

# వ్యాధి హర వైష్ణవ కవచం

రుద్రాదులారా! ఇపుడు మీకు సమస్త వ్యాధి వినాశకం, సకల కల్యాణ కారకం, పరమశివపూజితం అయిన వైష్ణవ కవచాన్ని వినిపిస్తాను. 'అజన్ముడు, నిత్యుడు, అనామయుడు, ఈశానుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపి, దేవదేవేశ్వరుడు, జనార్దనుడునగు మహావిష్ణువుకి ప్రణామం చేసి ఈ అమోఘమైన అప్రతిమానమైన వైష్ణవ కవచాన్ని ధారణ చేస్తున్నాను.' అని సంకల్పం చెప్పుకొని సర్వదుఃఖనివారకమైన ఈ కవచాన్ని చదవాలి, ఇలా:

**విష్ణుర్మామ గ్రతః పాతు కృష్ణో రక్షతు పృష్ఠతః ।**
**హరిర్మే రక్షతు శిరో హృదయంచ జనార్దనః ॥**

**మనోమమ హృషీకేశో జిహ్వాం రక్షతు కేశవః ।**
**పాతు నేత్రే వాసుదేవః శ్రోత్రే సంకర్షణో విభుః ॥**

**ప్రద్యుమ్నః పాతుమే ఘ్రాణ మనిరుద్ధస్తు చర్మచ ।**
**వనమాలాగల స్థాం తం శ్రీవత్సో రక్షతా దధః॥**

**పార్శ్వం రక్షతు మే చక్రం వామం దైత్య నివారణం ।**
**దక్షిణంతు గదా దేవీ సర్వాసుర నివారిణీ ॥**

**ఉదరం ముసలం పాతు పృష్ఠం మే పాతులాంగలం ।**
**ఊర్ధ్వం రక్షతు మేశాంగం జంఘే రక్షతు నందకః ॥**

**పార్ష్ణి రక్షతు శంఖశ్చ పద్మం మే చరణావు భౌ।**
**సర్వకార్యార్థ సిద్ధ్యర్థం పాతుమాం గరుడః సదా ॥**

**వారాహోరక్షతు జలే విషమేషు చ వామనః ।**
**అటవ్యాం నరసింహశ్చ సర్వతః పాతుకేశవః ॥**

**హిరణ్య గర్భో భగవన్ హిరణ్యం మే ప్రయచ్ఛతు ।**
**సాంఖ్యాచార్యాస్తు కపిలో ధాతు సామ్యం కరోతు మే ॥**

శ్వేత ద్వీప నివాసీ చ  శ్వేత ద్వీపం నయత్వజః ।
సర్వాన్ సూదయతాం శత్రూన్ మధుకైటభ మర్దనః ॥

సదా కర్షతు విష్ణు శ్చ కిల్బిషం మమ విగ్రహాత్ ।
హంసో మత్స్యస్తథా కూర్మః పాతుమాం సర్వతో దిశాం ॥

త్రివిక్రమస్తు మే దేవః సర్వపాపాని కృంతతు ।
తథానారాయణో దేవో బుద్ధిం పాలయతాం మమ ॥

శేషో మే నిర్మలం జ్ఞానం కరోత్వజ్ఞాన నాశనం ।
వడవా ముఖో నాశయతాం కల్మషం యత్కృతం మయా ॥

పద్భ్యాందదాతు పరమం సుఖం మూర్ధ్ని మమ ప్రభుః ।
దత్తాత్రేయః ప్రకురుతాం సపుత్ర పశుబాంధవం ॥

సర్వానరీన్ నాశయతు రామః పరశునా మమ।
రక్షోఘ్నస్తు దాశరథిః పాతు నిత్యం మహాభుజః ॥

శత్రూన్ హలేన మే హన్యాద్ రామో యాదవ నందనః ।
ప్రలంబ కేశి చాణూర పూతనా కంస నాశనః ॥
కృష్ణస్యయో బాలభావఃసమే కామాన్ ప్రయచ్ఛతు ॥

అంధకార తమో ఘోరం పురుషం కృష్ణ పింగళం ।
పశ్యామి భయ సంత్రస్తః పాశహస్త మివాంతకం ॥

తతో-హం పుండరీ కాక్షం అచ్యుతం శరణం గతః ।
ధన్యో-హం నిర్భయో నిత్యం యస్యమే భగవాన్ హరిః ॥

ధ్యాత్వా నారాయణం దేవం సర్వోపద్రవ నాశనం ।
వైష్ణవం కవచం బద్ధ్వా విచరామి మహీ తలే ॥

అప్రదృష్యో-స్మి భూతానాం సర్వదేవ మయో హ్యహం ।
స్మరణా ద్దేవ దేవస్య విష్ణో రమిత తేజసః ॥ *(ఆచార.. 194/1-22)*

శివాదులారా! రాక్షసులతో పిశాచాలతో నిండిన దట్టమైన అడవులలోనైనా, అశుభప్రాంతాలలో నైనా, రాజమార్గమందైనా, ద్యూతక్రీడయందైనా, చిన్న గొడవల్లో గాని, పెనుపెనుగు లాటల్లోగాని, నదిని దాటుతున్నప్పుడూ, ఆపత్కాలంలో, ప్రాణ

సంకటమప్పుడూ, అగ్ని చోర గ్రహ విద్యుత్ బాధలందునూ, సర్పవిషం అలుము కొన్నపుడూ, విషు్న రోగ పీడలలో ఇతరేతర భయంకర పరిస్థితుల్లో ఈ వైష్ణవ కవచస్తోత్రాన్ని భక్తిగా చదివిన వారికి ఆయాబాధల నుండి విముక్తి కలుగుతుంది. నిత్యం చదివే వారికి ఆ బాధలే కలుగవు. ఇది మంత్రరూపి కూడ ***(అధ్యాయం -194)***

# సర్వకామ ప్రద విద్య

మహేశా! నేనిపుడు సర్వకామప్రద అను ఒక విద్యను ఉపదేశిస్తాను. దీనిని ఏడు రాత్రులపాటు ఉపాసిస్తే అన్ని ప్రయత్నాలలోనూ విజయం లభిస్తుంది. ఇది స్తోత్ర రూపంలో వుంటుంది, ఇలా:

*సర్వకామ ప్రదాం విద్యాం*
*సప్తరాత్రేణ తాం శ్రుణు ।*
*నమస్తుభ్యం భగవతే*
*వాసుదేవాయ ధీమహి ॥*
*ప్రద్యుమ్నాయా నిరుద్ధాయ*
*నమః సంకర్షణా యచ ।*
*నమో విజ్ఞాన మాత్రాయ*
*పరమానంద మూర్తయే ॥*
*ఆత్మారామాయ శాంతాయ*
*నివృత్త ద్వైత దృష్టయే ।*
*త్వద్రూ పాణిచ సర్వాణి*
*తస్మాత్ తుభ్యం నమోనమః ॥*
*హృషీ కేశాయ మహతే*
*నమస్తేఽ నంత మూర్తయే ।*
*యస్మిన్నిదం యతశ్చైతత్*
*తిష్ఠ త్యగ్రే ఽపి జాయతే ॥*
*మృణ్మయీాం విహాసి క్షోణీం*
*తస్మైతే బ్రహ్మణే నమః ।*
*యన్న స్పృశంతి న విదుః*
*మనోబు ద్ధీంద్రియా సవః ।*
*అంతర్బహి స్త్వం చరసి*
*వ్యోమ తుల్యం నమామ్యహం ॥*

ఓం నమో భగవతే మహాపురుషాయ మహా భూత పతయే సకల సత్త్వ భావి వ్రీడని కర కమల రేణూత్పల నిభ ధర్మాఖ్య విద్యయా చరణారవింద యుగళ పరమేష్ఠిన్ నమస్తే। అవాప విద్యా ధరతాం చిత్ర కేతుశ్చ విద్యయా ॥ ***(ఆచార 195/1-6)***

చిత్ర కేతువను సామాన్యుడు ఈ విద్య ద్వారానే ఉత్కృష్టమైన విద్యాధరత్వాన్ని పొందగలిగాడు. ***(అధ్యాయం -195)***

# విష్ణు ధర్మాఖ్య విద్య

హే మహేశ్వరా! దేవరాజైన ఇంద్రుడు ఏ 'విష్ణుధర్మ' మనుపేరుగల విద్యను జపించి సమస్త శత్రువులను ఓడించి స్థిరంగా దేవరాజైనాడో ఆ విద్యనుపదేశిస్తాను, స్వీకరించండి.

ఈ విద్యా జపానికి ముందు రెండు పాదాలను, రెండు మోకాళ్ళను, ఇరు జంఘ ప్రదేశాలను, ఉదర హృదయ వక్షస్థల ముఖాలను, తలను ఓంకారాది బీజ వర్ణాలతో క్రమంగా న్యాసం చేయాలి. ఆ తరువాత అవే అంగాలను వెనుక నుండి ముందుకు **నమో నారాయణాయ** అనే మంత్రాన్ని జపిస్తూ న్యాసం చేయాలి. అప్పుడు ద్వాదశాక్షర యుక్తమైన వాసుదేవ మంత్రాన్ని చదువుతూ ఒక్కొక్క అక్షరానికొక్కొక్క అంగం చొప్పున కరముతో మొదలుపెట్టి చివరి 'య' కారం తో చిటికెన వ్రేలిని న్యాసం చేయాలి. చివరగా హృదయన్యాసాన్ని ఓంకారంతోనూ మస్తక న్యాసాన్ని సంపూర్ణమంత్రంతోనూ చేయాలి. నేత్రాలను ***ఓం విష్ణవే నమః తో*** న్యాసం చేసుకొని పరమశక్తి సంపన్నుడైన పరమాత్మ శేషనారాయణుని ఈ విధంగా ధ్యానించాలి.

*మమరక్షాం హరిః కుర్యాన్*
*మత్స్య మూర్తి ర్జలే ఽ వతు ॥*
*త్రి విక్రమ స్తథాకాశో*
*స్థలే రక్షతు వామనః ।*
*అటవ్యాం నరసింహస్తు*
*రామో రక్షతు పర్వతే ॥*
*భూమౌరక్షతు వరాహో*
*వ్యోమ్ని నారాయణోఽ వతు।*
*కర్మ బంధాచ్చ కపిలో*
*దత్తో రోగాచ్చ రక్షతు ॥*
*హయగ్రీవో దేవతాభ్యః*
*కుమారో మకర ధ్వజాత్ ।*
*నారదోఽన్యార్చనాద్దేవః*
*కూర్మోవై నైరృతే సదా ॥*

*ధన్వంతరి శ్చాపథ్యాచ్చ*
*నాగః క్రోధ వశాత్ కిల ।*
*యజ్ఞో రోగాత్ సమస్తాచ్చ*
*వ్యాసోఽజ్ఞానాచ్చ రక్షతు ॥*
*బుద్ధః పాషండ సంఘాతాత్*
*కల్కీ రక్షతు కల్మషాత్ ।*
*పాయాన్మధ్యం దినే విష్ణుః*
*ప్రాతర్నారాయణో ఽవతు ॥*
*మధుహా చాపరాహ్ణే చ*
*సాయం రక్షతు మాధవః ।*
*హృషీకేశః ప్రదోషేఽ వ్యాత్*
*ప్రత్యూషే ఽవ్యాజ్జనార్దనః ॥*
*శ్రీధరోఽ వ్యాదర్ధరాత్రే*
*పద్మనాభో నిశీథకే ।*

*చక్ర కౌమోదకీ బాణా సదా సర్వత్ర పాతుమాం ।*
*ఘ్నంతు శత్రూంశ్చ రాక్షసాన్ ॥ విదిక్షు దిక్షుచ సదా*
*శంఖం పద్మంచ శత్రుభ్యః నరసింహాశ్చ రక్షతు ॥*
*శార్ఙగీం వై గరుడ స్తథా । ఏతద్ధారయ మాణశ్చయం*
*బుద్ధీం ద్రియ మనః ప్రాణాన్ యం పశ్యతి చక్షుషా ।*
*పాంతు పార్శ్వ విభూషణః ॥ సవశీ స్యాద్వి పాప్మా చ*
*శేషః సర్వస్వరూపశ్చ రోగముక్తో దివం వ్రజేత్ ॥*

***(ఆచార..196/6-16)***

ఈ విధంగా విష్ణు ధర్మాఖ్య విద్యను ధారణ చేసిన వానికి ఏది కావాలనుకున్నా సమకూడుతుంది. రోగాలనుండి, పాపాలనుండి ముక్తుడై దేహాంతంలో స్వర్గలోకానికి వెళతాడు. ***(అధ్యాయం - 196)***

# గారుడీ విద్య, గరుడ దేవుని విరాట్ స్వరూపం

ధన్వంతరి ఈ విద్యను శుశ్రుతునికుపదేశించాడని సూతుడు శౌనకాది మహా మునులకీ విధంగా బోధించసాగాడు. "గరుత్మంతుడే స్వయంగా కశ్యపునికి ఉపదేశించిన మహావిషయమిది. ఈ విద్య సర్వవిషాపహారకం.

లోకం పంచతత్త్వ నిర్మితము కదా! నేల, నీరు, నిప్పు, గాలి, నింగి అనే ఈ పంచతత్త్వాలకి వేరువేరుగా మండలాలుంటాయి. ప్రతి మండలానికి అధిష్ఠాతృ దేవత, ఇతర దేవతలు, వారందరికీ వేర్వేరు మంత్రాలు కూడా వుంటాయి. ఈ మండలాధి పతులైన దేవతలను వారి వారి మంత్రాలతో యథావిధిగా న్యాస పూర్వకంగా పూజిస్తే సర్వత్రా మంచి ఫలితాలు రావడమే కాక విషాదుల నుండి సంపూర్ణ రక్షణ లభిస్తుంది.

ఈ విద్యా సాధకుడు ముందుగా ఈ అయిదు మండలాల స్వరూపాలనూ వాటి అధిష్ఠాతృ దేవతలనూ విడివిడిగా ధ్యానించాలి. అవి ఇలా వుంటాయి.

**పృథ్వీమండలం :** చతురస్రాకారం, సువిశాలం, చతుర్ముఖం, పసుపువర్ణం, ఇంద్ర దేవాధీనం.

**వరుణమండలం :** పద్మాకారం, అర్ధ చంద్రయుక్తం, ఇంద్రనీల మణి వర్ణం, సౌమ్య స్వరూపం, స్వస్తికతో నున్నది, వరుణ దేవాధీనం.

**అగ్నిమండలం :** త్రికోణాకృతి, జ్వాలా మాలలతో నిండి వుంటుంది. అగ్ని వర్ణం, అగ్ని దేవాధీనం.

**వాయుమండలం :** వృత్తాకృతి, బిందుయుక్తం, వివిధ ఔషధాలను కాల్చి కాటుకరంగుతో చేయబడాలి. వాయుదేవాధీనం.

**ఆకాశమండలం :** క్షీరసాగరంలో ఎగసి పడుతుండే కెరటాల ఆకృతి, శుద్ధస్ఫటిక వర్ణం, అమృత కిరణాలతో ప్రపంచాన్నే ప్లావితం చేయు చంద్రాధీనం. ఇక ఏ మండలంలో ఏయే మహానాగాలుంటాయంటే:

| | |
|---|---|
| వాసుకి, శంఖపాల | **– పృథ్వీ** |
| కర్కోటక, పద్మనాభ | **– జల** |
| కులిక, తక్షక | **– అగ్ని** |
| మహాపద్మ, పద్మ | **– వాయు** |

వీటినే అష్టమహానాగాలంటారు. సాధకుడు ఈ నాగాలను ధ్యానిస్తూ ఆయా మండలాలను స్పృశించాలి. అంగుష్ఠం నుండి చిటికెనవేలి దాకా అనులోమ, విలోమ రీతులలో ఈ న్యాసాన్ని చేయాలి. వ్రేళ్ళ సందులలో జయావిజయా నామక శక్తులను కూడా ఇలాగే న్యాసం చేయాలి.

మరల తన శరీరంలోనే శివషడంగ న్యాసాన్ని పంచతత్త్వ న్యాసాన్నీ వ్యాపక న్యాసాన్నీ చేయాలి. దేవత పేరుకి ముందు 'ఓం'కారాన్ని (చతుర్థీ విభక్తిలో పేరునీ) తరువాత 'నమః' నీ ప్రయోగించి మంత్రాలను చదివి వారిని పూజించాలి. దేవతల పేర్లలోని మొదటి అక్షరానికి కూడా మంత్రశక్తి వుంటుంది. అష్టనాగాల మంత్రాలు వాటి సన్నిధానాన్ని ప్రసాదించగలవు. పంచతత్త్వాలకు ఇందాకటి వలెనే ముందు ఓంకారాన్ని పెట్టి జపించినా చివర 'స్వాహా' నుంచి జపించాలి. ఈ పేర్లన్నీ ఈ విధంగా జపిస్తే మంత్రాలైపోయి సాక్షాత్తు గరుడునితో సమానంగా సాధకుని అన్ని అభీష్టకర్మలనూ సిద్ధింపచేయగలవు.

స్వర వర్ణాలతో ముందు కరన్యాసాన్నీ తరువాత సర్వాంగన్యాసాన్ని చేసుకోవాలి. తరువాత ఆత్మ శుద్ధికారకమైన ఉద్దీప్త ప్రాణశక్తి యొక్క చింతనం చేయాలి. పిమ్మట అమృతవర్షిణీ బీజాన్ని ధ్యానించాలి. ఇంతవఱకు చేసిన దానినే ఆప్యాయనమంటారు. ఇపుడు మస్తిష్కంలో ఆత్మ తత్త్వచింతనం చేయాలి. ఇపుడు రెండు పాదాలనూ నేలపై పెట్టి స్వర్ణ సమాన కాంతులతో సమస్తలోకపాల సమన్వితమై అంతటా పఱచుకొనియున్న మహాదేవతయైన పృథ్విని న్యాసం చేయాలి.

బుద్ధిమంతుడైన సాధకుడెప్పుడూ నేలతల్లిని దేవతగానే చూస్తాడు. ఇప్పుడు తన సంపూర్ణ శరీరంతో పృథ్వీదేవికి న్యాసం చేయాలి. తరువాత మిగతా నాలుగు మండలాలనూ వాటిలోని దేవతలనూ న్యాసం చేయాలి. ఈ విధంగా పంచభూత తత్త్వాలకు న్యాసం చేసిన పిమ్మట అష్టనాగుల యొక్క న్యాసధ్యానాలను చేయాలి.

తరువాత స్థావర, జంగమప్రాణులకు సోకిన విషాన్ని, విషదోషాన్నీ చిటికెలో పారద్రోలు గరుడ భగవానునీ పరమశివునీ ధ్యానించాలి. వారిద్దరికీ సాధకుడు దేహంతో న్యాసం చేయాలి.

పిమ్మట తనకి కావలసిన రూపాన్ని ధరించే శక్తి గలవాడైనా భయంకర రూపంలోనూ వుండేవాడు, మనస్సుపై విజయాన్ని ప్రాప్తింపచేయగలవాడు, ప్రపంచాన్నంతటినీ తనదైన రసంలో ముంచెత్తగలవాడు, సృష్టికీ సంహారానికీ కారకుడు, తన ప్రకాశ పుంజాల ఉద్దీప్తత వల్ల ప్రపంచమంతటా వ్యాపించినవాడు, పది భుజాలతో నాలుగు ముఖాలతో, పింగళ వర్ణ నేత్రాలతో, భయంకరమైన దంతాలతో ప్రజ్వలిస్తూ శూలధారియై మూడు కనులతో నెలవంకతో, శోభిల్లు గరుడ స్వరూపుడైన భైరవుని మనసుతో చూస్తూ ఆరాధిస్తూ పూజించాలి (చింతనం)

ఆ పరమతత్త్వమే నాగులను నశింపచేసి లోకాలను కాపాడడం కోసం మహా భయంకరమైన గరుడ రూపాన్ని ధరించాడు. గరుడ దేవుని విరాడ్రూపంలో ఆయన రెండు పాదాలూ పాతాళ లోకంలోకి వుండగా ఆయన రెక్కలు మొత్తం అన్ని లోకాలలోకీ వ్యాపించి వుంటాయి. ఏడు స్వర్గాలూ ఆయన వక్షఃస్థలం పైననే నిలచి వుంటాయి. బ్రహ్మాండమంతా ఆయన కంఠాన్నాశ్రయించివుండగా ఎనిమిది దిక్కులూ ఆయన మస్తకంలో ఆరంభమై అంతమవుతాయి. ఈశ్వరుడు తన మూడు శక్తులతో సహా గరుత్మంతుని శిఖలో నివసిస్తాడు. ఈ గరుడ భగవానుడే సాక్షాత్పరాత్పరుడైన శివుడు ఆయనే సమస్త భువన నాయకుడు. త్రినేత్రధారి, ఉగ్రరూపి, నాగవిష వినాశకుడు, సర్వలోక రక్షకుడు, భీషణ ముఖుడు, గరుడ మంత్రాధిదేవత, కాలాగ్ని వలె పరమ కాంతిమంతుడు, భక్తి పూర్వకంగా చింతనం చేసిన వారి సమస్త అభీష్ట కర్మలనూ సిద్ధింపచేయువాడునగు గరుత్మంతుని ఉపాసించు సాధకుడు కూడా ఆయన వలనే శక్తిమంతుడు కాగలడు. వానిని చూడగానే రాక్షసశక్తులూ, పీడాజనిత జ్వరాలూ, పిశాచాదులూ పారిపోతాయి. ***(అధ్యాయం -197)***

# త్రిపుర భైరవి, జ్వాలాముఖి దేవ్యాదుల పూజావిధి

త్రిపుర లేదా త్రిపురాభైరవిని యథావిధి ***ఓం హ్రీం ఆగచ్ఛదేవి*** అనే మంత్రముతో ఆవాహన చేసి ***ఐం హ్రీం హ్రీం*** అనే మంత్రమునుచ్చరిస్తూ లేఖను గీసి ***ఓంహ్రీం క్లోదిని భం నమః*** అనే మంత్రాన్ని జపిస్తూ దేవికి ప్రణామం చెయ్యాలి. తరువాత మహాప్రేతాసనంపై శక్తులతో సహా కొలువు తీరిన త్రిపురాభైరవీ దేవిని విధ్యుక్తంగా పూజించాలి.

***ఐం హ్రీం త్రిపురాయై నమః***

అనే మంత్రాన్నుచ్చరిస్తూ దేవి యొక్క పశ్చిమ, ఉత్తర, దక్షిణ, ఊర్ధ్వాది ముఖాలకు నమస్కారం చెయ్యాలి.

***ఓం హ్రీం పాశాయనమః క్రీం అంకుశాయనమః, ఐం కపాలాయ నమః*** ఇత్యాది మంత్రాలతో ఆమె ఆయుధాలకు నమస్కారం చేయాలి. త్రిపురభైరవి పూజలో భాగంగా ఎనమండుగురు భైరవులనూ వారితో బాటుగా మాతృకలనూ కూడా పూజించాలి.

అసితాంగ, రురు, చండ, క్రోధ, ఉన్మత్త, కపాలి, భీషణ, సంహారులను ఎన మండుగురూ భైరవులు కాగా బ్రహ్మాణి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండ, అపరాజిత (దుర్గ)లను వారలు ఎనమండుగురూ మాతృకలు.

భైరవులనూ మాతృకలనూ ఒకరిద్దరిని  ఒకే మంత్రంలో ఒక్కొక్క దిక్కు వైపు ఆవాహన చేయాలి.

***ఓం కామరూపాయ అసితాంగాయ భైరవాయనమో బ్రహ్మాణ్యై*** అనే మంత్రంతో తూర్పుదిక్కులో అసితాంగ భైరవునీ బ్రహ్మాణీ దేవినీ ఆవాహన పూర్వకంగా పూజించాలి.

అలాగే ***ఓం స్కందాయనమః రురు భైరవాయనమః, మాహేశ్వర్యై నమః*** అను మంత్రాల ద్వారా స్కంద, రురు భైరవ, మాహేశ్వరీలను దక్షిణంలోనూ ఓం చండాయనమః , కౌమార్యైనమః అనే మంత్రాలతో చండభైరవునీ, కౌమారీ దేవినీ పడమటి దిక్కులోనూ

***ఓం ఉల్కాయనమః ఓం క్రోధాయనమః, ఓం వైష్ణవ్యై నమః*** అనే మంత్రాలతో ఉల్క, క్రోధ, వైష్ణవీలను  ఉత్తర దిక్కులోనూ..

***ఓం అఘోరాయనమః ఓం ఉన్మత్త భైరవాయనమః, ఓం వారాహ్యైనమః*** అనే మంత్రాలతోర అఘోర, ఉన్మత్త, వారాహీలను ఆగ్నేయంలోనూ......

***ఓం సారాయ కపాలినే భైరవాయ నమః, ఓం మాహేంద్ర్యై నమః*** అనే మంత్రాలతో సమస్త సంసారానికీ సారభూతుడైన కపాలి భైరవునీ మాహేంద్రీ మాతనూ నైరృత్య దిశలోనూ...

***ఓం జాలంధరాయనమః, ఓం భీషణాయ భైరవాయనమః, ఓం చాముండాయై నమః*** అనే మంత్రాలతో జాలంధర, భీషణభైరవ, చాముండలను వాయవ్యం లోనూ.......

***ఓం వటుకాయనమః, ఓం సంహారాయనమః, ఓం చండికాయై నమః*** అనే మంత్రాలతో వటుక, సంహార, చండికలను ఈశాన్యంలోనూ ఆవాహన చేసి పూజించాలి★

తదనంతరం సాధకుడు రతీదేవినీ, ప్రీతీదేవినీ, కామదేవునీ, ఆయన పంచ బాణాలనూ పూజించాలి. ఈ విధంగా మొక్కవోని దీక్షతో ఎల్లవేళలా ధ్యానం, పూజ జప, హోమాలను చేసిన సాధకునికి దేవి పలుకుతుంది. నిత్యక్లిన్న, త్రిపుర భైరవి, జ్వాలాముఖి అను దేవీ రూపాలు సమస్తవ్యాధి వినాశకాలు.

జ్వాలాముఖీ దేవిని ఇలా పూజించాలి. ముందుగా పద్మ మండలాన్ని వెలయించి దాని బాహ్య దళాల్లో క్రమంగా నిత్య, అరుణ, మదనాతుర, మహామోహ, ప్రకృతి, మహేంద్రాణి, కలనాకర్షిణి, భారతి, బ్రహ్మాణి, మాహేశి, కౌమారీ, వైష్ణవీ, వారాహి, మాహేంద్రీ, చాముండ, అపరాజిత, విజయ, అజిత, మోహిని, త్వరిత, స్తంభినీ, జృంభిణి, కలికాదేవిలను పూజించాలి. తరువాత పద్మమధ్యంలో జ్వాలాముఖిని యథావిధిగా పూజించడం ద్వారా అన్ని విషాలనూ, సర్వదోషాలనూ దూరంగా పారద్రోలవచ్చు.

చాముండీ యంత్రం ద్వారా ప్రశ్నకర్తకు శుభాశుభ పరిజ్ఞానం కలుగుతుంది. ఈ పూజలను స్వయంగా భైరవుడే ఉపదేశించాడు. ***(అధ్యాయాలు 198, 199)***

## వాయుజయ నిరూపణం

**వా**యుజయమనేదొక ప్రశస్తమైన విద్య. దీని ప్రభావం వల్ల జయపరాజయాలు ముందే తెలుస్తాయి. పరాజయాన్ని నిలువరించడానికి సంకేతాలు కూడా ఇవ్వబడతాయి. అలాగే విదేశయాత్రలకు శుభాశుభ ముహూర్తాలకి సంబంధించిన జ్ఞానం కూడా ఈ విద్య వల్ల ఒనగూడుతుంది.

వాయు, అగ్ని, జల, ఇంద్రులను మాంగలిక చతుష్టయమంటారు. వాయువు ఎక్కువగా ప్రాణి యొక్క వామ, దక్షిణ భాగములలో నున్న నాడులలో ప్రవహిస్తుంటుంది.

★ *(అష్టమాతృకలలో అపరాజిత (దుర్గ) పేరు కనిపిస్తోంది. మంత్రాలలో మాత్రం ఆపేరుతో కాకుండా ఆ దేవిని చండికానామ జపంతో ఆవాహన చేయాలని తెలుస్తున్నది.)*

అగ్ని ప్రాణి శరీరంలో క్రింది నుండి పైకీ, జలంపై నుండి క్రిందికీ కదులుతుంటాయి. మహేంద్రతత్త్వం శరీర మధ్యభాగంలో వుంటుంది. కాని కృష్ణపక్షంలో దక్షిణ, శుక్లపక్షంలో వామ భాగాలలో గల నాడులలో ప్రవహిస్తుంటుంది. రెండు పక్షాలలోనూ మొదటి మూడు రోజులలోనూ నాసిక నుండి ప్రవహించే వాయువుకి ఉదయకాలపు గాలియని పేరు. ఈ వాయువు కుడి నాసికా రంధ్రం నుండే నిర్గమించాలి. అలాకాకుంటే అనారోగ్యం. అలాగే ఏ ప్రాణి శరీరంలోనైనా వాయువు సూర్యమార్గంలో పుట్టి చంద్ర మార్గంలో అస్తమించాలి. అటునుంచి ఇటైతే అనారోగ్యం.

ఓ వరాననా! వాతావరణంలో ఒక పగలూ, రాత్రీ కలిపి మొత్తం పదహారు సంక్రాంతులుంటాయని చెప్పబడింది. గంటన్నరకొకమారు ఏర్పడే ఈ సంక్రాంతుల గతి తోనే శరీరంలో వాయువుయొక్క సంక్రాంతుల పరిమాణం కూడా వుంటుంది. ఇది ఒక క్రమంలో తిరిగినంతకాలం ఏ ముప్పూరాదు కాని గతితప్పితే కష్టం. భోజన, మైథున కాలాల్లోనూ కత్తి పట్టి కదనరంగంలో కదలాడుతున్నపుడూ కుడివైపు నుండి వాయువు ప్రవహించాలి. అలాగే ప్రశ్న కర్తకు ఆ సమయంలో వాయువు నాసిక యొక్క వామరంధ్రం నుండి ప్రవహిస్తే చాల మంచిది. వాయువు జలతత్త్వ మహేంద్ర తత్త్వాల ద్వారా ప్రవహించి నంతసేపు కూడాఏ దోషమూ అంటదు. రాజ్యానికి కుడివైపునుండి వాయుప్రసార మెక్కువైతే అనావృష్టి, ఎడమవైపు నుండి ఎక్కువైతే అతివృష్టి కలుగుతాయి. (అధ్యాయం -200)

## అశ్వ లక్షణాలు, అశ్వ గజ రోగ చికిత్స

**కా**కి పెదవులు, నల్లనాలుక, ఎలుగు ముఖం, వేడితాలువు, ఉగ్రదృక్కులు, దంత హీనత, కొమ్ములు, స్తనబాహుళ్యం, పిల్లిపాదాలు, పులిపోలికలు, కుష్టుమచ్చలు, పొక్కులు, కోతి కనులు - వీటిలో ఏ ఒక్కలక్షణం ఒక గుఱ్ఱంలో కనిపించినా దానిని ప్రక్కన పెట్టెయ్యాలి, స్వీకరించరాదు. తురుష్కజ గుఱ్ఱాన్ని ప్రథమశ్రేణిదిగానూ, అయిదు హస్తాల ఎత్తున్నదాన్ని ద్వితీయశ్రేణిదిగానూ, మూడు హస్తాల ఎత్తున్నదాన్ని తృతీయశ్రేణి గుఱ్ఱంగానూ పరిగణిస్తారు.

పొడుగు కాళ్ళు, కురుచ చెవులు, చర్మంపై రంగులో బహుఛాయలు గల గుఱ్ఱాలు ఆరోగ్యకరంగా, ఆరోగ్యంగా వుంటాయి. అశ్వం ఆరోగ్యంగా కలకాలం జీవించాలంటే దాని యజమాని రేవంతుని పూజించాలి. బ్రాహ్మణులకు అడపాదడపా భోజనాలు పెడుతుండాలి. సరళ, నింబ, పత్ర, గుగ్గుల, సర్షప, తిల, వచ, హింగుల మిశ్రమాన్ని వెన్నతో కలిపి గుఱ్ఱం మెడ చుట్టూ రాస్తుండాలి.

గుఱ్ఱానికి పట్టే కురుపులలో వాతజాల వేగం చీము పట్టవు. కఫజాలు పడతాయి. పిత్తజాలు గొంతులో మంటను, పొక్కులను రేపి రక్తాన్ని చెడగొడతాయి. నొప్పి ఏ కురుపులోనూ పెద్దగా వుండదు. ఇంకోరకం కురుపులు ఆయుధాదులు చేసిన గాయాల వల్ల ఏర్పడతాయి. వాటిని ఎరండవేరు, రెండు హరిద్రకాండాలు, చిత్రక, విశ్వభేషజ, రసోన లేదా సైంధవాలను బాగా నూరి వెన్నతో పుల్లంబలితో కలిపి వాడడం ద్వారా రూపుమాపవచ్చును. తిల, మాడ్చిన, బియ్యపుపిండి, ఉప్పులను అన్నం ముద్దతో కలిపి గాయంపై పూసి వేపాకుతో పట్టీ వేసినా కూడా అవి తగ్గుతాయి. ఆవనూనెను అశ్వానికి రాయడం మంచిది.

కొన్ని రకాల గుఱ్ఱపు తెగుళ్ళకు నశ్యం అనివార్యమైనపుడు మాతులుంగ లేదా మాంసి రసాన్ని వాడాలి. తొలిరోజు ఒక పళం నిచ్చి రోజుకొక పళాన్ని పెంచుకుంటూ పోవాలి. ఈ మందును ఉత్తమాశ్వానికి పదునెనిమిది రోజులు, మధ్యమ, అధమాశ్వాలకి క్రమంగా పదునాల్గు, ఎనిమిది రోజులూ వాడవచ్చు. దీనిని ఆకురాలు కాలమందూ, వేసవిలోనూ వాడరాదు.

వాతజ సమస్యలకు నూనెతో పంచదార, వెన్న, పాలు లను కలిపి వాడాలి. కఫజన్య సమస్యలకు ఆవనూనెతో మందును కలిపి వాడాలి. పిత్త సమస్యలకు త్రిఫల, జలమిశ్రమానికి మందును కలిపి పట్టాలి. షష్టిక శాలి గింజలను తిని పెరిగిన గుఱ్ఱానికి అలసటా, వృద్ధత్వమూ ఉండవు. మగ్గిన జంబూఫల, వర్ణంలో గాని బంగారు రంగులోగాని వుండే అశ్వాలకు ముసలితనముండదు. అశ్వానికి వినికిడి సమస్య యేర్పడితే, కఫ సమస్య కూడా వుంటే దానికి పుల్లగా ఘాటుగా వుండే ఆహారాన్ని పెట్టాలి. కుంటుతున్నా, పొక్కులెక్కినా, కుష్టు కనిపించినా ఆ గుఱ్ఱానికి త్రిఫల కషాయాన్నీ గోమూత్రాన్నీ పట్టాలి. వాత పిత్త, కురుపులకు ఆవుపాలూ, వెన్నా మంచి మందు.

బలం బాగా తగ్గిన గుఱ్ఱానికి మంసాన్ని పెట్టవచ్చు. ఏ జబ్బూ లేకపోయినా అశ్వానికి శిశిర, గ్రీష్మఋతువులలో రోజూ అయిదు పళంల గుడూచి చూర్ణాన్ని వెన్నతో కలిపి తినిపిస్తే దానికి జవసత్వాలినుమడిస్తాయి.

ఇక గజాయుర్వేదాన్ని విన్నవిస్తాను. పైన చెప్పిన మందులూ, కషాయాలూ, ఏనుగుకి కూడా పనిచేస్తాయి.(ఎటొచ్చీ) పరిమాణాన్ని నాలుగింతలకి పెంచి ఇవ్వాలి. శాంతికర్మలు, బ్రాహ్మణ భోజనాలు, గోదానాలు, ★దేవపూజనాలే గజరక్షణలో పెద్దపాత్రను పోషిస్తాయి.

★కపిల గోవునే ఇవ్వాలి.

వైద్యుడు ఉపవాసముండి ఒక దండను, వచ, సిద్ధార్థక మందులచే సమపాళ్ళలో గుచ్చబడిన దానిని ఏనుగు దంతాలకు చుట్టి సూర్య, శివ, దుర్గ, లక్ష్మి, విష్ణుదేవతలను పూజించి భూతశాంతికి వాడిన నాల్గుకుండల నీటితో ఏనుగుకి స్నానం చేయిస్తే, మంత్రం చదువుతూ మేతపెడితే దానికిక ఏ సమస్యారాదు. ఒకవేళ పూజలో లోపం వల్ల వస్తే గుళ్ఘానికి వాడిన మందులనే ఇదివఱుకు చెప్పినట్లుగానే వాడాలి. ***(అధ్యాయం -201)***

***ఇక్కడితో భైరవ ప్రవచనం ఆగిపోతుంది.*** తరువాతి అధ్యాయం విష్ణువు శివాదులకిస్తున్న అనుగ్రహ భాషణమే.

# స్త్రీల వ్యాధులకు చికిత్స - కొన్ని ప్రత్యేక ఔషధాలు.

"పరమేశాదులారా! స్త్రీ జననేంద్రియ ద్వారంలోకి అప్పుడే కోసి తెచ్చిన పునర్నవ వేరుని గాని అపామార్గవేరుని గాని దూర్చి ఉంచితే అక్కడి బాధలు పురిటి నొప్పులతో సహా పూర్తిగా నశిస్తాయి. స్తనాలందలి నొప్పి ఇంద్రవారుణి వేళ్ళను ముద్దగా చేసి రాస్తే నిమ్మళిస్తుంది. మాతులుంగ మూలాలను గర్భవతి మొలచుట్టూ కడితే వేగంగానూ, సుఖంగానూ పురుడు వస్తుంది. కర్పూర, మదనఫల, మధుకల మిశ్రమంతో స్త్రీ జననేంద్రియ ద్వారాన్ని అడపాదడపా నింపుతూ వుంటే ముసలితనమనేది రానేరాదు.

బాలుర నుదుట గోరోచనాన్ని తిలకంగా అద్ది కుష్ఠ, పంచదారలను కలిపిన నీటిని త్రాగిస్తే ఇక వారికి ఏ దోషాలూ అంటవు. ఏ విషాలూ పనిచేయవు. శంఖనాభి, వచకుష్ఠ, ఇనుపరజనుల మిశ్రమాన్ని నిత్యం ధరించే పిల్లలకు ఏ రోగాలూ అంటవు. రావు.

పలాశ, విడంగ, ఆమలక మిశ్రమంలో తేనే ఆవు వెన్నా కలుపుకొని తినే పురుషునికి తెలివితేటలు వెంటనే పెరుగుతాయి. అలా ఒక నెలపాటు త్రాగితే ముసలితనాన్నెలాగూ జయిస్తాడు, మరణాన్ని కూడా జయించినా ఆశ్చర్య పోనక్కరలేదు. ఆమలక చూర్ణాన్ని తేనె, నూనె, వెన్నలతో కలుపుకొని రోజుకి మూడు మార్లు ఒక నెలపాటు నిరంతరాయంగా తినేవాడు నిత్యయవ్వనుడిగా నిలిచిపోవడమే కాక గొప్ప వక్త కూడా కాగలడు. (యవ్వనుడి తప్పనీ 'యౌవనుడి' అనే వ్రాయాలని పెద్దలంటారు)

శివ, ఆమలక చూర్ణాలను తేనెతో గాని నీటితో గాని కలుపుకొని రోజూ పొద్దున్నే తాగితే ముక్కు, దానితోడి అంగాలు అన్నీ ఎన్నేళ్ళొచ్చినా చెడవు. కుష్ఠ చూర్ణాన్ని వెన్నతో తేనెతో కలుపుకొని ప్రత్యుదయమూ తాగేవాని శరీరానికి సహజసుగంధమబ్బుతుంది. వేయి సంవత్సరాల వయసు వచ్చేదాకా జీవించగలడు. మాశ బీజాలను బద్దలు చేసి

ఊక లేకుండా చూసి వెన్నలో వేసి వేడి పాలతో కలిపి వుంచి రోజూ ఒకే సమయంలో తేనె, వెన్న, పాలతో కలుపుకొని ఒక వారం రోజులపాటు తింటే మదన కళావీరత్వం విపరీతంగా పెరిగి నూరుగురు మహిళలనైనా 'అందులో' సంతృప్తి పఱచగలిగే శక్తి వస్తుంది. పాదరసాన్ని గంధకంతో ఆముదంతో కలిపి తీసుకుంటే గొప్ప బలశాలులవుతారు. ఓ మహాదేవాదులారా! ఊకను జాగ్రత్తగా వేరు చేసిన మాశబీజాలను శింబి బీజాలతో కలిపి పాలలో ఉడికించి చల్లార్చి అపామార్గ తైలంతో కలుపుకొని తాగినా కూడా వందమంది వనితలను మదనకేళిలో సంతృప్తి పఱచగలిగే జవసత్త్వాలు కలుగుతాయి.

ఇక జంతు వైద్యంలో కొన్ని మెళకువలను చూద్దాం. ఆవు తన దూడపై తానే కోపం తెచ్చేసుకొని దాన్ని తన్నేస్తూ వుంటే, అటువంటి తెగులు పట్టిన ఆవుకి తన పాలలోనే ఉప్పు కలిపి తాగిస్తే ఆ తెగులు నశించి తన దూడను ఇదివఱకు కన్న నెక్కువగా ప్రేమిస్తుంది. కుక్క ఎముకను ఆవు మెడకు గాని గేదె మెడకు గాని కట్టి వుంచితే వాటిని పట్టిన క్రిములన్నీ జారిపోతాయి. వరుణ ఫలరసాన్ని ఏ చతుష్పాదికి పట్టించినా క్రిములన్నీ జారిపోతాయి. జయచూర్ణాన్ని గాయంలో వేస్తే అది మానిపోతుంది. గోవులచేత గజమూత్రాన్ని త్రాగిస్తే వాటి తెగుళ్ళన్నీ కట్టేస్తాయి. ఎద్దులకి మసూర, శాలి చూర్ణాలను పాలతో కలిపి పడితే ఏ జబ్బూ రాకుండా వర్ధిల్లుతాయి.

గుఱ్ఱాల జూలులో పుట్టే వరిస్ఫోటమనే రోగం శరపుంఖ పత్రాలను లవణంతో కలిపి వాడితే నశిస్తుంది. అశ్వాలకు తలభాగం (శిరోభాగం) లో పట్టే దురదలు ఘృతకుమారి ఆకులను లవణముతో కలిపి వాడితే పోతాయి.

పరమేశాదులారా! ఈ మందులను వాడడానికి ముందు వృద్ధులనూ, అనుభవజ్ఞులనూ సంప్రదించడం శ్రేయస్కరం. ***(అధ్యాయాలు 202, 203)***

# ఓషధులపేర్లు - పర్యాయపదాలు

*(ఓషధి అంటే మూలకం, మందు మొక్క లేదా ధాతువు. ఔషధమనగా వాటితో తయారైన మందు. ఈ మందు మొక్కల పేర్లను విరళంగా సంస్కృతంలో విభిన్న ప్రాంతాలలో వాడబడిన వాటిని, విష్ణువు శివునికీ, ధన్వంతరి శుశ్రుతునికీ, సూతుడు శౌనకాది మహామునులకూ ఉపదేశించడం జరిగింది. ఒకే ఓషధికి నాలుగైదు పేర్లుంటాయి. వారందరూ మహానుభావులే కాబట్టి వారికి తెలుసు. మనకి తెలియదు. కాబట్టి సూత మహర్షి మనకోసం ఈ పర్యాయపదాలను బోధించాడు. వీటిలో ఏ ఒక్కదానికి అర్థం తెలుసుకున్నా చాలు)*

1. స్థిర, విదారీగంధ, శాలపర్ణి, అంశుమతి
2. లాంగలి, కలిసి, క్రోష్టాపుచ్ఛ, గుహ
3. పునర్నవ, వర్షాభూ, కఠిల్య, కరుణ
4. ఉరువూక, ఆమ, వర్ధమానక, ఎరండ
5. ఝష, నాగబల
6. గోక్షుర, గోఖరు, శ్వదంష్ట్ర
7. శతావరి, వర, భీరు, పీవరి, ఇందీవరి, వరి
8. వ్యాఘ్రి, కృష్ణ, హంసపాది, మధుస్రవ, వృహతి.
9. కంటకారి, కటేరి, క్షుద్ర, సింహి, నిదిగ్ధిక
10. వృశ్చిక, త్ర్యమృత, విషఘ్ని, సర్పదంత, కాలి.
11. మర్కటి, ఆత్మగుప్త, ఆర్షేయి, కపికచ్ఛుక.
12. ముద్రపర్ణి, క్షుద్రసహ, మూంగ
13. మాషపర్ణి, మహాసహ, ఉడద
14. దండ్యోన్యంక, దండిని, త్యజ, పర, మహా
15. న్యగ్రోధ, వట, బరగద, అశ్వత్థ, కపిల, పిప్పలి.
16. ప్లక్ష, గర్దభాండ, పర్కటి, కపీతన
17. అర్జున, పార్థ, కకుభ, ధన్వి
18. నంది, ప్రరోహి, పుష్టికారి
19. వంజుల, వేతస
20. భల్లాతక, అరుష్కర, భిలావా
21. లోధ్ర, సారవక, ధృష్ట, తిరీట
22. బృహత్ఫల, మహాజంబు, బాలఫల
23. జలజంబు, నాదేయి
24. కణ, కృష్ణ, ఉపకుంచి, శౌండి, మాగధిక, పిప్పలి, గ్రంథిక
25. ఊషణ, మరిచ
26. విశ్వ, శుంఠి, వ్యోష, కటుత్రయ, త్ర్యూషణ
27. లాంగలి, హలిని, శేయసి, గజపిప్పలి.

28. త్రాయంతి, త్రాయమాణ, ఉత్స, సువహా
29. చిత్రక, శిఖి, వహ్ని, అగ్ని.
30. షడ్గ్రంథ, ఉగ్ర, శ్వేత, హైమవతి, వచ
31. కుటజ, శక్ర, వత్సక, గిరిమల్లిక
32. కుటజబీజాలే కలింగ, ఇంద్రయవ, అరిష్ట
33. ముస్తక, మేఘ, మోథ (తుంగ)
34. కౌంతి, హరేణుక
35. ఏల, బహుల (ఏలకులు) (పెద్దవి)
36. సూక్ష్మైల, త్రుటి (చిన్న ఏలకులు)
37. భారంగి, పద్మ, కాంజి, బ్రాహ్మణయష్టిక
38. మూర్వ, మధురస, తేజని, తిక్తవల్లిక
39. మహానింబ, బృహన్నింబ, దీప్యక, యవానిక, అజవాయిన్
40. విడంగ, క్రిమిశత్రు
41. హింగు, రామఠ
42. అజాజి, జీరక
43. ఉపకుంచిక, కారవి
44. కటుల, తిక్త, కటురోహిణి, కటుకి
45. తగర, నత, వక్ర
46. చోచ, త్వచ, వరాంగక, దారుచీని
47. ఉదీచ్య, బాలక, హ్రీబేర, అంబుబాలక (మరోరకం తుంగ)
48. పత్రక, దళ, తేజపత్ర
49. ఆరక, తస్కర
50. హేమాభ, నాగ, నాగకేశర
51. అసృక్, కాశ్మీరబాహ్లీక, కుంకుమ
52. పుర, కుటనట, మహిషాక్ష, పలంకష, గుగ్గలి.
53. కాశ్మీరీ, కట్ఫల, శ్రీపర్ణి
54. శల్లకి, గజభక్ష్య, పత్రి, సురభి, శ్రవ, గజారి

55. ఆమలకి, ధాత్రి, అక్ష, విభీతకి, బహేడ
56. పథ్య, అభయ, పూతన, హరీతకి
57. కరంజ, కంజ, ఉదకీర్య, దీర్ఘవృత్త
58. యష్టి, మధుక, మధుయష్టి, జ్యేష్ఠమధు
59. ధాతకి, తామ్రపర్ణి, సమంగ, కుంజర
60. సిత, మలయజ, శీత, గోశీర్ష, శ్వేతచందన
61. కాకోలి, వీర, వయస్య, అర్కపుష్పిక
62. శృంగి, కర్కటశృంగి, మహాఘోష
63. వంశలోచన, తుగాక్షీరి, శుభ, వంశి
64. ద్రాక్ష, మృద్వీక, గోస్తనిక
65. ఉశీర, ఖస, మృణాల, లామజ్జక
66. సార, గోపవల్లి, గోపి, భద్ర
67. దంతి, కటంకటేరి
68. దారు, నిశ, హరిద్ర, రజని, పీతిక, రాత్రి
69. వృక్షాదని, ఛిన్నరుహ, నీలవల్లి, అమృతరస, గుడూచి
70. వసుకోట, వాశిర, కాంపిల్ల
71. పాషాణ, భేదక, అరిష్ట, అశ్మభిత్, కుట్టభేదక
72. ఘంటాక, శుష్కక, సూచక, వచ
73. పీతశాల, సురస, బీజక
74. వజ్రవృక్ష, మహావృక్ష
75. స్నుహి, స్రుక్
76. తులసి, సురస, ఉపత్థ, కుఠేరక, అర్జునక, పర్ణి, ఉపస్థ, సౌగంధిపర్ణి
77. నీల, సింధువార
78. నిర్గుండకి, సుగంధిక
79. సుగంధిపర్ణి, వాసంతి, కులజ
80. కాలీయక, పీతకాష్ఠ, కతక
81. గాయత్రి, ఖదిర, కందర, కత్థా
82. నీలకమల, ఇందీవర, కువలయ, పద్మ.

83. కమల, సౌగంధిక, శతదళ, అబ్జ.
84. అజవర్ణ, ఊర్జ, వాజికర్ణ, అశ్వకర్ణ
85. శ్లేష్మాంతక, శేలు, బహువార
86. సునందక, కకుద్భద్ర, ఛత్రాకీ, ఛత్ర, రాస్నా
87. కబరి, కుంభక, ధృష్ట, క్షుద్విధ, ధనకృత్
88. కృష్ణార్జక, కరాల, కాలమాన, కామమాన
89. వరియార, ప్రాచి, బల, నదీక్రాంత
90. కాకజంఘు, వాయసి
91. మూషిక పర్ణి, భ్రమంతి, ఆఖుపర్ణి
92. విషముష్టి, ద్రావణ, కేశముష్టి
93. కింలిహి, కిణిహి, కటుకి
94. అంతక, అమ్లవేతస
95. అశ్వత్థ, బహుపత్ర, ఆమలకి
96. అరూష్కర, పత్రశూక
97. క్షీరి, రాజదాన
98. మహాపత్ర, దాడిమ, కరక
99. మసూరి, విదలి, శష్ప, కళింది
100. కటేరి, కంటక, మహాశ్యామ, వృక్షపాద
101. విద్య, కుంతి, త్రిభంగి, త్రిపుటి, త్రివృత
102. సప్తల, యవత్తిక, చర్మ, చర్మకస
103. అక్షిపీలు, శంఖిని, సుకుమారి, తిక్తాక్షి
104. అపరాజిత, గవాక్షి, అమృత, శ్వేత, గిరికర్ణి, గవాదిని
105. కాంపిల్ల, రక్తాంగ, గుండ, రోచనిక
106. హేమక్షీరి, స్వర్ణక్షీరి, పీత, గౌరి, కాలదుగ్ధిక
107. గంగోరుకి, నాగబాల, విశాల, ఇంద్రవారుణి, ఇంద్రాయణ
108. రసాంజన, తార్క్ష్య, శైల, నీలవర్ణ, అంజన
109. శాల్మలి, సేమరవృక్ష నిర్యాస, మోచరస
110. ప్రత్యక్పుష్పి, ఖరి

111. అపామార్గ, మయూరక
112. వనాంగూస, సింహాస్య, వృషవాసాక, ఆటరూష
113. జీవశాక, జీవిక
114. కర్బుర, శటి
115. అగ్నిగంధ, సుగంధిక
116. శతాంగ, శతపుష్ప
117. మిసి, మధురిక
118. పుష్కరమాల, పుష్కర, పుష్కరాహ్వాయ
119. యాస, ధన్వయాస, దుష్పర్శ, దురాలభ
120. వాకుచి, వకుచి, సోమరాజి, సోమవల్లి
121. భంగరైయా, మార్కవ, కేశరాజ, భృంగరాజ
122. ఎడగజ, చక్రమర్దక, చకవడ
123. కాకతుండి, సురంగి, తగర, స్నాయు, కలనాశ, వాయసి
124. మహాకాల, బేల (బేల్, బైల్ హిందీ) తండులీయ, ఘనస్తన
125. ఇక్ష్వాకు, తిక్తతుంబి, తిక్తలాపు
126. ధామార్గవ, ★ కోషాతకి, యామిని
127. దేవతాడక, జీమూతక, ఖుడ్డాక
128. గృధ్రాదన, గృధ్రనఖి, హింగు, కాకాదని
129. కరవీర, అశ్వారి, అశ్వమారక
130. సైంధవలవణం, సింధు, సింధూత్థ, మణిమంథ
131. యవక్షార, క్షార, యవాగ్రజ.
132. సజ్జి, ఛజ్జి, సర్జిక, సర్జికాక్షార
133. కాశీశ, పుష్ప కాశీశ, నేత్రభేషజ, ధాతు కాశీశ, కాశి
134. పంకపర్పటి, సౌరాష్ట్రి, ముక్తాక్షార, కాక్షి.
135. స్వర్ణమాక్షిక, తాప్య, తాప్యుత్థ, తాప్యసంభవ
136. మనశ్శిల, మైనసిల, శిల★

---

★*126. ఇందులో కృతభేద మనేది మరొకరకం.*
★*136. నేపాలీ మనశ్శిలను కులటీ అంటారు.*

137. హరితాల, ఆల, మనస్తాల
138. గంధక, గంధపాషాణ, రసపారద, పార
139. తామ్ర, ఔదుంబర, శుల్బ, మ్లేచ్ఛముఖ
140. లోహ, అద్రిసార, అయస్, తీక్ష్ణ.
141. మధు, మాక్షిక, క్షౌద్ర, పుష్పరస
142. కాంజి, సువీరక
143. శర్కర, సిత, సితోపల, మత్స్యాండి
144. ప్రియంగు, కంగుక, ఫలిని, శ్యామ, గౌరీకాంత
145. త్రిపుట, పుట, కలాప, లంగక
146. భద్రదారు, దేవదారుక, దేవకాష్ట
147. కుష్ఠ, ఆమయ, మాంసి, నాళదంశన
148. పుర, పలంకష, మహిషాక్ష, గుగ్గులు
149. కరంజ, నక్తమాల, పుటిక, చిరబిల్వక
150. శిగ్రు, శోభాంజన, జ్ఞానమాన
151. జయ, జయంతి, శరణి, నిర్గుండి, సింధువారక
152. మొరట, పీలుపర్ణి
153. తుండి, తుండికెరిక
154. మదన, గాలవ, బోధ, ఘోట, ఘోటి.
155. ఆరగ్వధ, రాజవృక్ష
156. రైవతదాష్టక, అతితిక్త, కంటకి, వికంకత.
157. నింబ, అరిష్ట
158. పటొల, కొలక
159. వయస్థ, విశ్వ, ఛిన్న, ఛిన్నరుహ, అమృత, వత్సాదని, గుడూచి
160. కిరాత తిక్తక, భూనింబ, కాండతిక్తక.

ఋషులారా! ఇక కొలతలను వివరిస్తాను.

పిచుక, పిత్తల, అక్ష, విడాలపాదక, కర్షసువర్ణ, కవలగ్రహ ఈ పదాలన్నీ బరువుని సూచించేవే. ఆ బరువు పదహారుమాశలు.

| | | |
|---|---|---|
| పలార్ధ, శుక్తి | - | అర్ధపళం |
| బిల్వ, ముష్టి | - | ఒక పళం |
| ప్రసృతి | - | రెండు పళాలు |
| అష్టమాన, మాన | - | ఎనిమిదిపళాలు |
| అంజలిని, అడ్డమాన, కుడమ | - | నాలుగుపళాలు |
| ప్రస్థ | - | నాలుగు కుడవలు |
| ఆఢక | - | నాలుగు ప్రస్థలు |
| కాంస్యపాత్ర, ద్రోణ | - | నాలుగు ఆఢకలు |
| తుల | - | వందపళాలు |
| భార | - | ఇరవైపళాలు |

ఇవన్నీ ఘనపదార్థాల ద్రవ్యరాశినే సూచిస్తాయి. ద్రవపదార్థాలకు ఈ కొలతలే రెట్టింపవుతాయి. శౌనకాది మహామునులారా! ఇక సంస్కృత వ్యాకరణాన్ని సంక్షిప్తంగా తెలియజేస్తాను. దీనినొకప్పుడు కార్తికేయుడు కాత్యాయనునికి బోధించాడు. ***(అధ్యాయం -204)***

(ప్రత్యేకానుబంధం)

# సంస్కృత వ్యాకరణం (ప్రవేశిక)

ఏ భాషలోనైనా పదాలు ప్రాతిపదికలనుండి సృష్టింపబడతాయి. పదాలు కర్మలనో కర్మేతరాలనో, క్రియలనో తెలపాలి కదా! సుబంతాలో తిజంతాలో అయి వుండాలి. సుప్ చివర వుండే పదాలు ఏడు విభక్తులను తెలియజేస్తాయి. సుఔ, జస్ అనే అంతాలు కర్తలుగానో కర్మలుగానో వచ్చే పదాలకుంటాయి.

ప్రాతిపదిక అంటే మూలం దీనికి ఏపదమూ, అక్షరమూ చేరకుండానే ఒక నిర్దిష్టమైన అర్థం వుండాలి.

నామవాచకం పూర్తిగా కర్మగా వాడబడినపుడు అం, ఔ, శస్, అనేవి పదం చివర చేరతాయి. కర్త, కర్మ, అనేవి సాధారణంగా నామవాచకాలో సర్వనామాలో అవుతాయి. సంస్కృతంలో ప్రతి పేరుకీ ఏడు విభక్తులలో మూడు వచనాలతో వెరసి ఇరువది యొక్క రూపాలుంటాయి.★

*★ మిగతా భాషలలో ఏకవచనం, బహువచనం అని రెండు వచనాలే కనిపిస్తాయి. కానీ సంస్కృతంలో వచనాలు ఏక, ద్వి, బహు, విధాలతో మూడుంటాయి. విభక్తులలో ప్రథమ-నుండి- సప్తమి వఱకు రకరకాల రూపాలుంటాయి. కాబట్టి సంస్కృత వ్యాకరణం నేర్చుకోవాలనుకునేవారు శబ్దమంజరిని బట్టీపట్టడం తప్పనిసరి.*

టా, భ్యాం, భిస్ – తృతీయ అనగా ఆయుధం లేదా పనిముట్టుకి వచనాన్ని బట్టి ఈ అక్షరాలను చేర్చాలి. దేని ద్వారా ఒక కార్యం సంపన్నమైందో దానిని 'కరణ'మనీ ఎవరైతే ఆ పనిని చేస్తారో వారిని (దానిని) 'కర్త' యనీ వ్యవహారము కదా! ఆ కరణానికి టా, భ్యాం, భిస్‌లను చేర్చాలి.

సంప్రదాన కారకానికి ఙే, భ్యాం, భాస్‌లనూ, అపాదాన కారకాలకి నసి, భ్యాం, భాస్‌లను చేర్చాలి. యొక్క అనే అర్థంలో నాస్, ఓస్, ఆం లనూ లోపల అనే అర్థంలో నీ, ఓస్, సుప్‌లను చేర్చాలి.

ఆధారమే అధికరణము. రక్షణనుద్దేశించినపుడు తృతీయా లేదా సప్తమీ విభక్తిని వాడాలి. కోరుకున్నదీ, ఇష్టపడనిదీ కూడా అపాదానకాలే అవుతాయి. వాటికీ తృతీయ, సప్తమీ విభక్తులతో నున్న క్రియలనే వాడాలి. పరి, అప, ఆన్, ఇతర, ర్తే అనేవి వచ్చినపుడు కూడా పై విభక్తులనే వాడాలి. ఇలా చాలా విషయాలను చెప్పిన తరువాత సంహితలను కూడా చెప్పాడు కార్తికేయుడు. ఇవి తెలుగు భాషలోని సంస్కృతసంధులు 'అనే శీర్షికలో కనిపించే సవర్ణదీర్ఘ' గుణాది సంధులే.

తరువాత సమాసాలలో కర్మధారయ, ద్విగు, తత్పురుష, బహువ్రీహి, అవ్యయీభావ, ద్వంద్వాలను తెలిపి కార్తికేయుడు త్రిలింగాదులను గూర్చిన జ్ఞానాన్ని ఉదాహరణలతో సహా ప్రవచించాడు ఇలా:

సంస్కృతంలో కూడా పుం, స్త్రీ, నపుంసక లింగాలే వున్నా వాటిలో కొన్ని అర్థాన్ని బట్టి కాక శబ్దాన్ని బట్టి ఏర్పరుపబడడం వల్ల, ముఖ్యంగా నపుంసకలింగ శబ్దాలతో, జాగరూకత అవసరం. ఎందుకంటే లింగాన్ని బట్టి విభక్తి రూపాలు కూడా మారిపోతుంటాయి కదా!

దేవ, అగ్ని, సఖి, పతి, అంశు, క్రోష్టు, స్వయంభూ, పితృ, నృ, ప్రశస్తృ –ఇవన్నీ పుల్లింగాలు. అలాగే సాధారణంగా హలంతాలు – అనగా పదం చివర హల్లు గలవి పుల్లింగాలవుతాయి. దీనిని బట్టి అసృక్, క్షమాభృత్, మృగావిధ్, రాజన్, యువన్, పతిన్, పూష(న్) బ్రహ్మ(న్) విద్, వేధస్, ఉశన్, అనద్వహ (హ్), మధులిత్, కాష్ఠటక్ష్ వంటి వన్నీ పుల్లింగాలే.

వన, వారి, అస్థి, వస్తు, జగత్, సామ(న్), కర్మ(న్) సర్పిస్, తేజస్ వంటి శబ్దాలు నపుంసక లింగానికి చెందుతాయి.

సాధారణంగా దీర్ఘాంతాలు స్త్రీ లింగాలవుతాయి. జయా, నదీ, శ్రీలక్ష్మీ, స్త్రీ, భూ, వధూ, భ్రూ, పునర్భూ, మాతృ, ధేను (దీర్ఘం లేకున్నా) చమూ మున్నగు శబ్దాలు స్త్రీ

లింగాలు కాగా, ఈ నియమానికి లోబడని వాక్, శ్రక్, స్రక్, దిక్, క్రుధ్, యువతి, కకుప్, ద్యౌ, ఉపావృత్, సుమనః, ఉష్ణిక మొదలగు శబ్దాలు కూడా స్త్రీలింగాలే. విశేషణాదులు కొన్ని అనగా శుక్ల, కీలాల, శుచిః, గ్రామణి, సుధీః వంటివి అన్ని లింగాలలోనూ వాడబడతాయి.

బాహు, కమలభూః, కర్తృ, స్వమాతృ, స్వనౌః, సత్య, దీర్ఘపాత్ పుల్లింగాలు.

సర్వ, విశ్వ, ఉభయ, ఉభ, అన్య అన్యతర (విభక్తులుగా డాతర, డాతమ) పూర్వ, అపర, అధర, యావత్, కిం, యుష్మత్, అస్మత్ ఇవన్నీ సర్వనామాలు, అలింగాలు. అన్ని లింగాలతోనూ వాడబడతాయి.

శ్రుణోతి, జుహోతి, జహాతి, దధాతి, దీవ్యతి, స్తూయతి, పుత్రీయతి, ధనాయతి, త్రుట్యతి, మ్రియతే, చిచీషతి, నినీషతి ఇవి క్రియలకి ఉదాహరణాలు. సుబంత శబ్ద రూపనిష్పత్తి, విశిష్ట శబ్దాలైన సర్వ, సర్వే, సర్వస్మై, సర్వస్మాత్, సర్వతః సర్వేషాం, సర్వస్మిన్... వంటి వాటిని శ్రద్ధగా చదవవలసి వుంటుంది. విశ్వ శబ్దాన్నుండి వివిధ విభక్తులతో వచ్చే మాటలను కూడా గమనించాలి. పూర్వశబ్దం నుండి ప్రత్యేక సందర్భాలలో పూర్వస్మాత్, పూర్వాత్, పూర్వే, పూర్వాః, పూర్వస్మిన్, పూర్వే మున్నగు శబ్దాలు నిష్పన్నమవుతాయి. ***(అధ్యాయాలు 205,206)***

***(మరిన్ని వివరాలు అనుబంధం- 14లో చూడండి)***

# సంస్కృత ఛందస్సు

ఇపుడు నేను వాసుదేవ, గురు, గణపతి, శంభు, సరస్వతీ దైవతములను తలచుకొని వారికి మనసానతులు నుతులు నొనర్చి అల్పబుద్ధులకు కూడా అనన్య బుద్ధి సంపద నీయగల, మాత్రావర్ణ భేద సమన్విత ఛందశ్శాస్త్రాన్ని సంక్షిప్తంగా విన్నవిస్తాను.

ఛందస్సు★కి మూలం మాత్ర; అనగా చిటికె వేయడానికి పట్టే కాలం. ఏమాత్రాక్షరం లఘువు (U) ద్విమాత్రాక్షరం గురువు (S) తెలుగులో గురువుని 'U' అనే చిహ్నంతో సూచిస్తారు. లఘువుకి చిహ్నం(।)

దీర్ఘాక్షరాలూ (ఉదా॥ కాకి లోకా) సున్నతోనున్నవీ (హంసలో హం) పొల్లు హల్లుతో నున్నవి (హసన్‌లో సన్) ద్విత్వానికి ముందున్నవీ (అమ్మలో అ) సంశ్లిష్టానికి ముందున్నవీ(లక్షలో ల) గురువులవుతాయి. సున్నకీ పొల్లు హల్లుకీ వేరే సంజ్ఞ వుండదు.

★*(ప్రాచీనకాలంలో ఛందస్సు అనే మాటలోని 'చ'కి ఒత్తు వుండేది కాదు. చందః అనే మాట వేదానికి పర్యాయంగానూ 'చాందసుడు' అనేమాట వేద పండితునికి బదులుగానూ వాడబడేవి)*

గురువులు కాని వన్నీ లఘువులే. అనగా సాధారణంగా హ్రస్వాక్షరాలు లఘువులు కావచ్చును.

ఈ గురు లఘువులు మూడేసి వచ్చే గణాలు ఎనిమిదున్నాయి.

| | | |
|---|---|---|
| ఆదిగురువు | (SII) | భ గణము |
| మధ్యగురువు | (ISI) | జ గణము |
| అంత్యగురువు | (IIS) | స గణము |
| సర్వగురువు | (SSS) | మ గణము |
| ఆదిలఘువు | (ISS) | య గణము |
| మధ్యలఘువు | (SIS) | ర గణము |
| అంత్యలఘువు | (SSI) | త గణము |
| సర్వలఘువు | (III) | న గణము |

సంస్కృతంలో ముందుగా చెప్పుకోదగినది ఆర్యాఛందము. దీనిలో ఎనిమిది గణాలుంటాయి. వీటిలో బేసి గణము 'జ' గణము కారాదు. ఆరవగణం లఘువుతో పూర్తికావాలి. ఏడవగణాదిని లఘువుండాలి. ఆర్య యొక్క రెండవభాగంలో అయిదవ గణంలో అన్నీ లఘువులే వుంటే దాని మొదటి అక్షరమే పద లేక పాదారంభానికి ముందుంటుంది. ఆర్యాఛందంలో మొదటి, రెండవ భాగాల్లో మూడేసి గణాల తరువాత విరామం (తొలిపాదానికి) వుంటే దాన్ని 'పథ్యా' అనే ఆర్యఛందంగా పరిగణిస్తారు. ఆర్యా యొక్క పూర్వార్ధంలో గాని ఉత్తరార్ధంలో గాని లేదా రెండింటిలో గాని మూడు గణాలపై పాదవిరామముంటే దానిని 'విపులా' అంటారు. దీనిలో మరల ఆది విపులా, అంత్యవిపులా, ఉభయవిపులాయని మూడు రకాలుంటాయి. రెండవ, నాలుగవ గణాలు జ గణాలై వుండి వాటికిరువైపులా గురువు (S) లుంటే ఆ ఆర్యని 'ముఖపూర్వాదిచపలా' అంటారు. రెండవ ఉత్తరార్ధంలో చపలాలక్షణమున్న ఆర్యని 'సజఘనా' అంటారు. పూర్వోత్తరార్ధాలు ఒకేలా వుండే ఆర్యను 'గీతి'అనీ తేడాగా వుంటే 'ఉద్గీతి' అనీ గీతిఛందంలో చివరి వర్ణం గురువైతే 'ఆర్యాగీతి' అనీ వ్యవహరిస్తారు.

విషమపాదాలలో (1,3) ఆరేసి సమపాదాలలో (2,4) ఎనిమిదేసి మాత్రలుండి, ప్రతిపాదంలో ఒక ర గణం, ఒక లఘువు, ఒక గురువు ఉంటే అది **వైతాలీయ** ఛందమనబడుతుంది. ఇందులోనే ప్రతి చరణంలోనూ ఒక్కొక్క గురువు అధికంగా కూర్పబడితే అది ***ఔపచ్ఛందసిక*** మవుతుంది.

పైన చెప్పబడిన వైతాలీయ ఛందంలో ర గణ, లఘు, గురువులకు బదులుగా భ గణమూ, రెండు గురువులూ ప్రతిపాదంలో కూర్చబడితే అది **ఆపాతలికాఛంద** మనబడుతుంది. ఇందులో ప్రతిపాదంలోనూ ద్వితీయ మాత్ర పరాశ్రితమైతే దానిని **దక్షిణాంతికా** ఛందమంటారు.

వైతాలీయ విషమ పాదాలలో ఉదీచ్య, సమపాదాలలో ప్రాచ్య వృత్తాలను ప్రయోగిస్తారు. సమపాదాలలో పంచమ మాత్రతో చతుర్థమాత్ర కలిసిపోతే దానిని ప్రాచ్యవృత్తమనీ, పాదసంయోగ కారణం వల్ల మొదటి, మూడవ పాదాలలో రెండవ మాత్ర, మూడవ మాత్రతో కలిసి పోతే దానిని ఉదీచ్య వృత్తమనీ అంటారు. ఇలాగే వైతలీయ ఛందంలో ప్రవృత్తక, చారుహాసినీ భేదాలు కూడా ఉన్నాయి.

మరొక ఛందోజాతి **వక్త్ర** జాతి. ఉదాహరణలూ ప్రయోగాలూ లేకుండా ఈ అధ్యాయాలు అర్థం కావు కాబట్టి ఛందోదర్పణం నుండి స్వీకరించడం జరిగింది.)

యమతరజభనస అనే గణాలు మాత్రమే ఇంతకుముందు చెప్పబడ్డాయి. ఆ తరువాత ఈక్రింది గణాలు కూడా కనిపిస్తున్నాయి.

*(గరుడపురాణంలోనూ ఛందోదర్పణంలోనూ కూడా చెప్పబడిన వాటినే అనువదించడం జరిగింది)*

ఇలాగే న, రలతో కూడా నవ,నలల రగ, తగ, నగ, నల, సల అనే గణాలేర్పడతాయి. న,హలు సూర్యగణములనీ, సగల, రల, నగల, తల, సలల, భల, నలల, లు చంద్రగణములనీ, మిగతావి ఇంద్రగణములనీ పెద్దల వ్యవహారము.

| | | | |
|---|---|---|---|
| SI | – హ | IISII | – సలల |
| IS | – వ | SIII | – భల |
| SS | – గగ | SIIS | – భగణగురువు |
| II | – లల | SSSI | – మగణలఘువు |
| IIII | – నల | IISIS | – సవ |
| IIIS | – నగ | IISSI | – సహ |
| IIIUI | – నహ | SSII | – తల |
| IISI | – సల | | |

**సమవృత్తములు**

ఒక్కొక్క పాదమున కొక్కొక్క గురువు మాత్రమే ఉండే దానిని శ్రీ వృత్తమంటారు.
**ఉదా॥** శ్రీ/ భా/ విం/తున్

| పేరు | లక్షణం | ఉదాహరణ |
|---|---|---|
| స్త్రీ(అత్యుక్త | రెండేసి గురువులు | స్త్రీరూ/పారున్; ఘోరా/ఘూరీ |
| వినయం(మధ్యా) | పాదానికొక సగణం | వినయం/ బొనరిం/ |
| | రెండవ అక్షరం మారరాదు | తునసం/ తునకున్ |
| బింబము(ప్రతిష్ఠా) | భగణగురువులు | శ్రీ కలితా స్తోకభగల్ |
| | | పైకొనుబింబాకృతికిన్ |
| సుకాంతి(అదే) | జగణగురువులు | అగున్సుకాం తిగూర్పగా |
| | | జగంబులన్ జగత్పతీ |
| అంబుజం | భలగలు | పంబిభలగా డంబరముగా |
| (సుప్రతిష్ఠా) | | నంబుజముచెల్వంబగుహరీ |
| పంక్తి(అదే) | భగగలు | ఒక్క భకారం బెక్కు గగంబుల్ |
| | | నెక్కొను పంక్తిం దక్కబ శౌరీ |
| తనుమధ్య | తయలు | గోపాలుని దేవే నాపాలికి |
| (గాయత్రి) | (తగణం యగణం) | నాగాబై పై తనుమధ్యన్ |
| | | బ్రాపించుదయంబుల్ |
| మధుమతి | న,న,గ | మధురిపుడనినన్ |
| (మదన విలసిత | | మధురపు ననగల్ |
| మని కూడా దీనినే | | మధురములగుచున్ |
| అంటారు | | మధుమతి నమరున్ |
| మదరేఖ | మ,స,గ | రూపింపన్మగణాద్యం |
| | | బై పెంపార సగంబుల్ |
| | | దీపించున్మద రేఖన్ |
| | | గోపస్త్రీ హృదయేశా |

పై వృత్తాలలో సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణికచ్ఛందాలున్నాయి.

## ఇక అనుష్టుప్ ఛందములు

ఇదివఱకులాగే ఛందంపేరు, లక్షణాలు, ఉదాహరణ ఇవ్వబడతాయి. మూడు రకాలు అనుష్టుప్ఛందాలకూ కూడా రెండవ అక్షరం ఒకటే అయివుండాలి. ఈ రెండవ అక్షరం నియమం తెలుగులో తప్పనిసరిగా పాటింపబడుతుంది. సంస్కృతం లో ఆ నియమం తప్పనిసరి కాదు.

| | | |
|---|---|---|
| విద్యున్మాల | మ,మ,గ,గ | ఉదాహరణలు :<br>మాద్యద్భక్తి న్మాగాయుక్తిన్ విద్యున్మాలా<br>వృత్తంబొప్పన్ చైద్యధ్వంసిన్ సంబోధింపన్<br>సద్యశ్శ్రేయోజాతం బయ్యేన్ |
| చిత్రపద | భభగగ | వారక భాగురు యుగ్మం బారక జిత్ర పదాఖ్యం<br>జేరిన వేడ్క గవీంద్రుల్ గోరినుతింతురు శౌరిన్ |
| ప్రమాణి | జ,ర,లగ | సరోజనాభుడచ్యుతుండరాతి భంజనుండనన్<br>జరేఫలన్ లగంబులన్ ధరం బ్రమాణియొప్పగన్ |

## తరువాతి బృహతీ ఛందము

| | | |
|---|---|---|
| హలముఖి<br>(బృహతి) | ర,న,స | **ఉదా :** చిత్తజాతుని గురునికై యెత్తుడంజలులనిన<br>చోసత్తుగా రనసము లొగిన్ బొత్తుగా హలముఖి<br>యగున్. ఇకవచ్చు పదక్షరాల ఛందాలను<br>పంక్తిచ్ఛందాలంటారు. |
| రుక్మవతి | భ,మ,సగ | **ఉదా॥** రూపిత రీతిన్ రుక్మవతీసం రూపభ<br>మంబుల్ రూఢి సగంబుల్ ప్రాపుగ భూత<br>వ్రాత యతుల్గా శ్రీపతి లీలన్ జెప్పగనొప్పున్<br>యతిస్థానము -6 |
| మత్త | మ,భ,స,గ | **ఉదా॥** మొత్తంబారున్ మభములు నిత్యోదాతం<br>బై సస్ఫురిత గకారా యత్తంబై షణ్మిత యతి<br>నొందున్ మత్తావృత్తంబగు మహిగృష్ణా<br>యతిస్థానం-7. |

| | | |
|---|---|---|
| ప్రణవ | మ,న,య,గ | యతి –6 ఆ రంగామనయగ సంయుక్తిన్ సారోదంచిత శరవిశ్రాంతిన్ శ్రీరాజుంబొరసిన నత్యంత స్థారంబై చను ప్రణవంబుర్విన్ |
| మయూరసారి | ర,జ,ర,గ | యతి–7,**ఉదా॥** చూతమాయశోద సూనునంచున్ వ్రేత పల్కుదర్క విశ్రమంబుల్ భాతిగా రజంబు పై రగంబుల్ జాతిగా మయూరసారి జెప్పున్ |
| శుద్ధవిరాటి | మ,స,జ,గ | యతి–6, **ఉదా॥**శ్రీమంతుడగు చిన్న కృష్ణునిన్ ధీమంతుల్ప్రణుతింప బాణవి శ్రామంబున్మస జంబుగంబునై రామాశుద్ధవిరాటియొప్పగున్ |
| మణిరంగము | ర,స,స,గ | యతి–6, **ఉదా॥** శ్రీమనస్సరసీరుహ మిత్రున్ ప్రేమమొప్పగ బేర్కొను చోటన్ రామ నస్త్ర విరా మరసాగల్ కోమలంబులగు న్మణిరంగన్. |
| తోదకం (త్రిష్టుప్ఛందం) | భభభగగ | యతి–7, **ఉదా॥** తోరపు వేడుక దోదక వృత్తా కారముగా ద్రిభకార గగంబుల్ నీరజనాభుని నెమ్మినుతింపన్జారు విరామముషణ్మితినొందున్ |
| ఇంద్రవజ్ర (త్రిష్టుప్) | తతజగగ | యతి–8, సామర్థ్య లీలన్ తతజద్విగంబుల్ భూమిధ్ర విశ్రాంతుల బొంది యొప్పున్ ప్రేమంబుతో నైందవబింబ వక్త్రున్ హేమాంబ రుంబాడుదురింద్ర వజ్రన్ |
| ఉపేంద్రవజ్ర (త్రిష్టుప్) | జతజగగ | యతి–8,**ఉదా॥** పురారిముఖ్యా మరుపూజ నీయున్ సరోజనాభున్ జతజద్విగోక్తిన్ దిరంబుగా నద్రియతిన్నుతింపన్ ఇరాసుతా ధీశునుపేంద్ర వజ్రన్ |

ఉపజాతి ...1,3 పాదములుపేంద్ర వజ్ర 2,4 పాదములింద్ర వజ్ర...

**ఉదా:** పినాకి, కోదండము బిట్టు ద్రుంచెన్ దానొప్ప గెల్చెన్ జమదగ్ని సూనున్ అనంత సత్త్వుండితడం చుమెచ్చున్ జానైన వృత్తంబు పజాతి యయ్యెన్

---

★ *దీనినే కాంత, కాంతి, కవితాంతనామములతో నితరలాక్షణికులు పేర్కొనిరి. డా॥ చిర్రావూరి శ్రీరామశర్మ ఛందోదర్పణము*

**రథోద్ధతము :** ర,న,ర,లగ యతి–7, దీనికి మరోపేరు పరాంతికము

**ఉదా:** నందగోపవరనందనున్ రమా నందు(బస్తుతి యొనర్చి షడ్యతిన్ అందమైరనర వాహ్వాయంబు లిం పొంద జెప్పిన రథోద్ధతంబగున్

**గీతాలంబనం:** త,జ,జ, లగ, యతి– 8,

**ఉదా:** నాళీక భవామరనాథులొగిన్ శ్రీ లోలుని గీర్తన సేయనొగిన్ బోలంగ దజానల బొందిన గీతాలంబన మైచను న(ద్రియతిన్

**స్వాగతము:** రనభగగ : యతి–7,

**ఉదా:** నారదాది ముని నాయక వంద్యున్ శౌరి జేరుదన స్వాగతమొప్పున్ సారమైన యతి షణ్మితి నొందన్ భూరి రేఫనభముల్ గగయుక్తిన్

**శాలిని :** మ,త,త,గగ, యతి–7,

**ఉదా:** చేతో రాగంబుల్ల సిల్లన్మతాగా ద్యోతంబై షడ్వర్ణయుక్తిన్ విరామం బేతేరంగా నిందిరేశ ప్రభావా న్వీతం బైనన్ శాలినీ వృత్తమయ్యెన్

**శ్యేని (త్రిష్టుప్):** ర,జ,ర,ల,గ యతి–7

**ఉదా:** ఆరమాధి నాథుడక్షయంబుగా జీరలిచ్చె యాజ్ఞసేని కంచు బెం పారజెప్ప శ్యేని యయెయషడ్యతిన్ స్ఫారమై రజంబుపై రవంబుగన్

**వాతోర్మి (త్రిష్టుప్):** మ,భ,త,లగ, యతి –7

**ఉదా:** దేవాధీశున్ హరి దేజో వనధిన్ భావింపగా ఋతుభాస్వద్వి రతిన్ ఈవాతోర్మిన్ మభలేపారుదకా రావాసంబై లగ మర్థిన్ గదియన్

**చంద్రిక (త్రిష్టుప్):** న,న,ర,లగ, యతి–7

**ఉదా:** నగణయుగమునన్ రవంబులన్ (బగుణ రస విరామ సంగతిన్ తగిలి హరికథా సమేతమై నెగడు గృతులనిండి చం(ద్రికన్

**భుజంగ ప్రయాతము: (జగతీఛందము) :** య, య, య,య. యతి : 8.

**ఉదా:** భుజంగేశ పర్యంక పూర్ణానురాగున్ భుజంగ ప్రభూ తాఖ్య బూరించునోటన్ నిజంబై ప్రభూతావనీ భృద్విరామం బజస్రంబుగా గూర్పయాద్వంద్వమొప్పున్.

**ద్రుతవిలంబితం (త్రిష్టుప్):** న,భ,భ,ర, యతి:– 7

**ఉదా:** (శుతి మతాంగ నిరూఢమహాయతిన్ యతి వర ప్రముఖార్య జనం బొగిన్ (ద్రుత విలంబిత తోషిత రీతులన్ క్షితి ధరున్ నుతిసేయు నభారలన్

**జలధరమాల (త్రిష్టుప్):** మ,భ,న,మ, యతి: 9

**ఉదా:** శ్రీతన్వీశుందగిలితి జిత్తంబారన్ మాతాయంచున్ జలధరమాలావృత్తం బేతేరంగా మభనమ లింపొందంగా బ్రీతిం బల్కన్ నిర్వతికరిన్ బ్రాపించున్.

**ప్రియంవద (అదే):** న,భ,జ,ర.. యతి: 8

**ఉదా:** త్రిబువనాభి నుతు దేవదేవునిన్ బ్రభు ముకుందు నిటు ప్రస్తుతింపగా నభజ రల్గదిసినన్ బ్రియంవదా విభవ మొప్పు గిరి విశ్రమంబులన్

**మత్త మయూరము (అతి జగతి) :** మ,త,య,స,గ, యతి: 8

**ఉదా:** భోజాధీశుండంచు బ్రభూతాత్మకుడంచున్ భ్రాజిష్ణుండంచున్యతిబాగౌ గిరి సంజ్ఞన్ ఓజస్స్వి తంబై మతయోపేత సగంబుల్ ఓజం బల్కన్మత్త మయూరం బలరారున్.

**జలదము :** భ,ర,న,భ,గ... యతి–10

**ఉదా:** మ్రొక్కులకెల్ల నెల్ల యగుమూర్తి గదా యక్కమలాక్షుడంచు జతురాస్యయతిన్ దక్కక ప్రస్తుతింప జలదంబగు ని ట్లొక్కటియై భరేఫ నభలొందు గురున్

**మంజుభాషిణి :** స,జ,స,జ,గ యతి–9

**ఉదా:** దివిజేంద్రుడాదియగు దేవ సంఘముల్ భువి మంజుభాషిణికి భోగి రాడ్యతిన్ సవరింపగా సజసజంబుగాంతమై భువనోదర స్తుతి యపూర్వమై చనున్.

**ప్రహర్షిణి:** మ,న,జ,ర,గ... యతి–8

**ఉదా:** ముక్తి శ్రీకరు భవమోచనున్ మురారిన్ భక్తిం బ్రోడజనులు ప్రస్తుతింప నొప్పున్ వ్యక్త గ్రావయతి బ్రహ్మర్షిణి సమాఖ్యన్ యుక్తంబై మసజరగోజ్జ్వలద్గణాప్తిన్

**ప్రభాతము:** న,జ,జ,ర,గ.... యతి–8

**ఉదా:** సరసి జనాభ భుజంగరాజ తల్పా శరణము నీవని సన్మతిందలంపన్ బెరయు నజారలు పేర్మినొప్పుగున్ గన్ జరగు బ్రభాతము శైల విశ్రమంబున్

**రుచిరము:** జ,భ, స,జ,గ... యతి:– 9

**ఉదా:** అనంగకోటి విలసదంగ వైభవున్ మనంబులో నిలిపిన మాను నా పదల్ అనన్ జభంబులు, సజగాను సంగతిన్ దనర్చు నీ రుచిరకు దంతిరాడ్యతిన్

**వసంతతిలకము (శక్వరీచ్ఛందము) :** *త,భ,జ,జ,గ,గ.. యతి–8

**ఉదా:** గౌరీనితాంత జపకారణ నామధేయున్ దూరీకృత ప్రణత దుష్కృతునంబు జాక్షున్ ధీరోత్తముల్గిరి యతిన్ తభజాగగ ల్పెంపారన్వసంత తిలకాఖ్య మొనర్తు రొప్పున్

**ప్రహరణ కలిత :** న,న,భ,న,ల,గ : యతి –8

**ఉదా:** వనరుహ సఖుడున్ వనరుహరి పుడున్ గనుగవయగు నాకరివరదు నకున్ ననభనలగము న్నుగ యతి బలుకన్ బనుపడు గృతులన్ బ్రహరణ కలితన్

**అపరాజిత :** న,న,ర,స,లగ , యతి: 9

**ఉదా:** మునిజనవినుతుండ మోఘుజయోన్నతుం డనితర సదృశుండ నంగ గురుండనం జనుననయుతమై రసంబులగంబులై తన రగనపరాజితం బహిరాద్యతిన్

**అసంబాధ :** మ,త,న,స,గగ : యతి–12

**ఉదా:** సౌమ్యంబై విష్ణుస్తుతులను నతిసేవ్యంబై రమ్య స్ఫూర్తిన్ రుద్రవిరమణము రమ్యంబై గమ్యాకారం బొప్పు మతనసగగ ప్రాప్తిన్ సమ్యగ్భావంబై పొలుపమరు నసంబాధన్

**మణిగణనికరం:** న,న,న,న,స : యతి– 9

**ఉదా:** కనకపు వలువలు గరకట కములున్ నునుపగుతుఱుమును నొసలితిలకమున్ దనరెడు హరిగని తగనననసల్ నినిచిన మణిగణనికర మిభయతిన్

**మాలిని :** న,న,మ,య,య : యతి–9

**ఉదా:** సకల నిగమవేద్యున్ సంస్కృతి వ్యాధి వైద్యున్ మకుట విమల మూర్తిన్మాలినీ వృత్తపూర్తిన్ నకలిత నమయోక్తి న్నాగవిశ్రాంతయుక్తిన్ సుకవులు వివరింపన్ సొంపగు న్విస్తరింపన్

**సుకేసర :** న,జ, భ,జ, ర : యతి –11

**ఉదా:** యతి యవతార సంఖ్యనిడియాదంబుతో నతిశయమై నజంబులు భజాంతరేఫలున్ వితతముగా నొనర్చియరవిందలో చనున్ క్షితి ధరు సంస్తుతించిన సుకేసరంబగున్ (ఇప్పటిదాకా శక్వరీచ్ఛందమే)

**శిఖరిణి (అత్యష్టిచ్ఛందము) :** య,మ,న,స,భ,లగ – యతి–13

**ఉదా:** గజేంద్రాపధ్వంసిన్ ముదిర సదృశున్ గంజనయనున్ భజింతున్ దాత్పర్యంబున ననినచో భాస్కర యతిన్ ప్రజాహ్లాదంబైనన్ యమనస భవప్రస్ఫురితమై ద్విజశ్రేష్ఠుల్మెచ్చున్ శిఖరిణి గడున్ విశ్రుతమగున్

---

***వసంత తిలకమే వృత్తరత్నాకరంలో సింహోన్నతయని వేరొకచో ఉద్ధర్షిణి లేదా ఉధర్షిణి యని పేర్కొనబడింది.**

**మందాక్రాంత :** మ,భ,న,త,త,గగ -యతి-11

**ఉదా:** చెందెంబాదాంబు రజముచే స్త్రీత్వ మారాతికింజే యందెం జాపం బిరుతునుకలై యద్భుతం బావహిల్లెన్ మ్రందెన్ మారొడ్డి దశముఖుడున్ రాముచే నంచు జెప్పన్ మందాక్రాంతన్ మభన తతగా మండితాశాయతుల్గాన్ ఇప్పటిదాకా అత్యష్టి ఛందాలే

**కుసుమితలతా వేల్లిత (ధృతిచ్ఛందము) :** మ,త,న,య,య,య, యతి -12

**ఉదా:** శ్రీనాథున్ బ్రహ్మాద్యమరవరసం సేవ్య పాదారవిందున్ దీనానాథ వ్రాత భరసుగుణో దీర్ణునిన్ బాడిరోలిన్ గానా రూఢాత్ముల్ మతన యయ యల్ కామజి ద్విశ్రమంబై వీనుల్ నిండారన్ కుసుమితలతా వేల్లితా వృత్తమొప్పన్

**మేఘ విస్ఫూర్జితం (అతి ధృతిచ్ఛందము) :** య,మ,న,స,ర,ర,గ, యతి:- 13

**ఉదా:** రమానాథున్ నాథున్ యదుకులశిరో రమ్య రత్నాయ మానున్ సముద్యత్తే జిష్ణున్ దనుజయువతి స్ఫార హారాపహారున్.....

**స్రగ్ధర (ప్రకృతిచ్ఛందం) :** మ,ర,భ,న,య,య,య. యతి- 8-15

**ఉదా:** తెల్లంబై శైల విశ్రాంతిని మునియతినిం దేజరిల్లున్ దృఢంబై చెల్లెంబెల్లె మకారాంచిన రభన యయల్ చెందమీదన్ యకారం బుల్లంబారన్ బుధారాధ్యు నురగ శయనున్ యోగివంద్యున్ గడున్ రం జిల్లం జేయగవీంద్రుల్ జితదనుజ గురం జెప్పుదుర్ స్రగ్ధరాఖ్యన్

**మహాస్రగ్ధర (ఆకృతి ఛందము) :-** స,త,త,న,స,ర,ర,గ. యతి-9-16

**ఉదా:** కొలిచెంబ్రోత్సాహవృత్తిం గుతల గగనముల్ గూడ రెండంఘ్రులందా బలిబాతాళంబు జేరన్ బనిచెగడమకై బాపురేవామనుండ స్థలితాటో పాద్యుడంచున్ గరిగిరి విరమాకారమారన్ సతానోజ్జ్వల సోద్య ద్రేఫయుగ్మా శ్రయ గురుల మహాస్రగ్ధరంజెప్ప నొప్పున్

**కవిరాజవిరాజితం(వికృతిచ్ఛందం) :-** న,జ,జ,జ,జ,జ,జ,లగ; యతి - 8-14-20

**ఉదా:** కమలదళంబుల కైవడిజెన్నగు కన్నులు జారు ముఖ ప్రభలున్ సమధిక వృత్త కుచంబులు నొప్పగశైల రసర్తు విశాల యతిన్ సముచిత నాన్విత షడ్జలగంబుల జానుగ బాడిరి చక్రధరున్ రమణులు సొంపలరం గవిరాజవి రాజితమున్ బహురాగములన్

**అశ్వలలితం :** న,జ,భ,జ,భ,జ,భ,వ; యతి- 13

**ఉదా:** ఇనవి రమంబునన్ నజభజంబు లింపుగ భజంబులున్ భవములై చనజన నొప్పునశ్వలలితంబు సత్కృతుల జెప్పగా విశదమై యనుపమ వైభవోజ్జ్వల హరీ సహస్ర కరదోర్విదారణ చణా నినుగొని యాడధన్యుడు గదయ్యా నీకరుణ దాననంతమగుటన్

**క్రౌంచపద (సంకృతి ఛందస్సు) :** భ,మ,స,భ,న,న,న, య; యతి-11-19

**ఉదా:** కాంచన భూషాసంచయ మొప్పన్ ఘనకుచభరమున గవున సియాడన్ జంచల నేత్రల్వంచనతోడన్ సముచిత గతి వెనుచని తనుగొల్వన్ అంచిత లీలన్ మించిన శౌరిన్ హరిదిభ పరిమిత యతులొనగూడన్ ముంచిరచింపం గ్రౌంచపదం బి మ్మొగి భమసభననముల నయలొందున్

**భుజంగ విజృంభిత (ఉత్కృతిచ్ఛందం) :** మ,మ,త,న,న,న,న,ర,స,లగ; యతి- 8-9

**ఉదా:** స్వారా జారిర్వాతా రాతీ శశి తపన సమనయన సర్వదా మునివందితా గౌరీశాద్యామర్త్య స్తుత్యా కమలభవ జనక మధుకైట భాసుర మర్దనా శ్రీరామా హృత్స్వామీ యంచున్ జెలగి మమత ననల జెంద రేఫసలున్‌లగన్ ఘోరాఘోషాభిద్వేషిన్ బేర్కొనగవసు దశయతియగున్ భుజంగ విజృంభితన్

**దండకం :** స,న,హ, గణాలను మొదట కూర్చి వాటిపై కావలసినన్ని 'త' గణాలను పెట్టుకుని చివర మాత్రం గురువు నుంచితే అది దండకం.

కొంతమంది మొదటినుండీ అన్నీ త గణాలనే కూర్చి చివర గురువు నుంచారు. అదీ దండకమే.

ఎంతవ్రాసినా ఒక పాదం క్రిందనే లెక్క. యతి ప్రాసనియమాల్లేవు.

**ఉదా:** 1) అమరంగ సనహంబులం దాదిగా నొండె గా దేని నాదిన్ 'త' కారంబు గా నొండెలో నందకారమ్ములిమ్మై గకారావసానంబుగా జెప్పినన్ దండకం బంద్రు దీనింగవుల్

**ఉదా:** 2) ఆదిన్ ద(త) కారంబు...నుండి కడదాకా

ఇది సులక్షణసారము (P73,74) నుండి గైకొనబడినది.

**మంగళమహాశ్రీ :** భ,జ,స,న,భ,జ,స,న,గగ; యతి- 1-17

**ఉదా:** చిత్తముల జూపులను జిత్తజుని తంత్రిపయి జెంది గజదంతి యతులొందన్ నృత్తములతోడ దరుణీమణులు గానరుచు లింపుగను మంగళ మహాశ్రీ వృత్తముల బాడిరి సవృత్త కుచ కుంభముల వింతజిగి యెంతయు దలిర్పన్ మత్తిలుచు నభ్భుజనంబు లిరుచోటులద నర్పగ దుదన్ గగ మెలర్పన్

**ఆర్య :** ఇది తెనుగున కంద పద్యమును బోలివుంటుంది. పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల భేదములతో సంస్కృతార్యలైదు విధములు.

**పథ్యార్య :** 1,3 పాదములలో మూడు గణాలతో పదవిచ్ఛేదనం కలిగి 2,4 పాదాలలో మిగిలిన ఆర్యాలక్షణాలుంటే అది పథ్యార్య అనబడుతుంది.

గా,భ,జ,స,నల గణాలు ఎన్ని మార్లయినా వాడబడుట, బేసిగణము జ గణము కాకుండుట, చివర గురువుండుటయను కందలక్షణములే ఆర్యాలక్షణములు కూడ,

1,3 పాదములలో మూడు గణములతో పదవిచ్ఛేదము కలిగి 2,4 పాదాలలో మిగిలిన ఆర్యాలక్షణములున్నచోనది పథ్యార్య.

**ఉదా:** బేసులు త్రిగణయుతములై యాసమపాదముల బొరసి యార్యయనగడున్

**విపులార్య :** సమపాదాలలో పదవిచ్ఛేదం కలుగకుండా మొదటి, మూడవ పాదాల చివరవుండే గణం తరువాతి పాదాలలోకి కూడ కొనసాగుట విపులార్య. ఇక్కడ సమపాదము అసంగతమనీ, అన్ని పాదాలలోనూ అనవచ్చుననీ, గణము కాకుండా 'పదము' తరువాతి పాదములలోకి కొనసాగుననీ వివరించి గిడుగు వారీ పద్యాన్ని లక్షణయుక్తంగా ఉదహరించారు.

ప్రకట సమపాదముల నిలు వక శబ్దము నవలజొచ్చి వచ్చినద క్కక విపులార్యయగును సే వక జన మందార ధీర వనజదళాక్షా.

**చపలార్య :** రెండవ, నాల్గవ గణములు జగణములు కావాలి. మిగిలిన లక్షణాలలాగే వుండాలి.

**ఉదా:** వరుసను ద్వితీయ మంత్యము స్ఫురణన్ మధ్యగజకారములను దగన్ రెం

**ముఖచపలార్య :** పూర్వార్ధం చపలార్య లక్షణాలుండి, ఉత్తరార్ధం అలా వుండక పోతే అది ముఖచపలార్య.

**ఉదా :** చపలాగణప్రకారం బపార కారుణ్య సాగరా ప్రథమా ర్ధపరంబగు చున్నది ముఖచపలార్య యనంగ జనుగృతులన్

**జఘునచపలార్య :** ఉత్తరార్ధంలో మాత్రం చపలార్య వుండాలి.

**ఉదా:** మొదలి సగము చపలార్యా స్పదగణలక్షణము సొరక చరమార్ధంబుదిత ప్రకార రేఖన్ గదాధరా చనుజఘున చపలన్

ఇక ప్రస్తార నిరూపణమును వినండి. ఏ ఛందంలో ఎన్ని భేదాలుండవచ్చో సామాన్య రూపంలో చెప్పే దానిని ప్రసారమంటారు. ఇందులో ఆరు ప్రణాళికలుంటాయి. అవి ప్రస్తార, నష్ట, ఉద్దిష్ట, ఏకద్వ్యాది లగక్రియ, సంఖ్య, అధ్వ యోగాలు. ***(అధ్యాయాలు -207-212)***

# సదాచార శౌచాచారాలు

శౌనకాదులారా! శ్రీహరి ద్వారా బ్రాహ్మణాది వర్ణాల వారి సదాచారాలనూ శౌచాచారాలనూ విన్న బ్రహ్మదేవుడు వ్యాసమహర్షికి వినిపించిన వివరాలివి.

మనిషి శ్రుతి (వేదం) స్మృతులను (ధర్మశాస్త్రాలు) లను బాగా అధ్యయనం చేసి వాటిలో ప్రతిపాదింపబడిన కర్మను ఆచరించాలి. నిజానికి, వేదమే సకల కర్మలకూ మూలము. అయితే, అందులో అర్థం కానివి చాలా వున్నాయని ఆనాటి మహర్షులు స్పష్టతకోసం ధర్మశాస్త్రాలను ప్రసాదించారు. కాలక్రమాన కొన్ని ధర్మసందేహాలు వాటిపై కూడా కలిగాయి. అప్పుడు పాలకులు, పండితులు సదా చారాన్నాశ్రయించి కొత్త సమస్యలను పరిష్కరించారు. అయితే ఈ సదాచారానికి కూడా శ్రుతి, స్మృతులే మూలము. కర్మ మార్గ దర్శనానికి కావలసిన రెండు కనులు ఈ శ్రుతి స్మృతులు.సనాతన ధర్మంలో శ్రుతి, స్మృతీ, శిష్టాచారమూ (అంటే సదాచారమే) ప్రధానపాత్రను వహిస్తాయి.

సత్యం, దానం, దయ, నిర్లోభత, విద్య, యజ్ఞం, పూజ, ఇంద్రియ దమనం – ఈ ఎనిమిదీ శిష్టాచారం యొక్క పవిత్ర లక్షణాలు. పూర్వకాలంలో మానవుల శరీరాలూ, ఇంద్రియాలూ కూడా సత్త్వగుణ ప్రధానాలై తేజోమయంగా వుండేవి. అందువల్ల నీటిలోనే నిరంతరం నివసిస్తూ నీటిబొట్టునొక దానిని కూడా తనపై నిలుపుకోని అంటని కమల పత్రం లాగా మానవులు పాపమంటని పవిత్ర జీవనులుగా వుండేవారు. సత్త్వగుణ వికాసానికై సనాతన ధర్మం (వర్ణాశ్రమ ధర్మం, సదాచారం కూడా) పాలింపబడాలి. దీనికి యుగవిశేషం, స్థానవిశేషం ముఖ్యం. అంటే యుగాన్ని బట్టి, దేశాన్ని బట్టి కూడా ధర్మాన్ని అన్వయించుకోవాలి.

సత్యం, యజ్ఞం, తపం, దానం – ఇవి ధర్మం యొక్క లక్షణాలు. దానం, అధ్యయనం, జపం, విద్య, ధనం, తపస్సు, పవిత్రత, నిరోగత, సంసారిక, బంధనాల నుండి విముక్తి, ఇతరుల ద్రవ్యాన్ని వారు పూర్తిగా ఇష్టపడి ఇస్తేనే స్వీకరించుట – వీటన్నిటికీ మూలం ధర్మాచరణమే. ధర్మం వల్ల సుఖమూ తత్త్వజ్ఞానమూ లభిస్తాయి. తత్త్వజ్ఞానం వల్లనే మోక్షం ప్రాప్తిస్తుంది. సామాన్య ధర్మాలు, ముఖ్యంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల వారి బాధ్యతలు, అవశ్య కర్మలు సనాతన కాలం నుండి వస్తున్న యజ్ఞ, అధ్యయన దానాలే. సదాచారాన్ననుసరించియే ఈ మూడు ధర్మాలూ పాటింపబడాలి. అవి విశుద్ధ, అధికృత వ్యక్తులనుండే స్వీకరింపబడాలి. వర్ణాలకు చెప్పబడిన ధర్మాలే జీవికకు పనికి వచ్చే వృత్తులయ్యాయి. ముఖ్యంగా యజ్ఞం చేయడం, అధ్యయనం, దానం బ్రాహ్మణ

వర్ణానికి ధర్మాలయినాయి. అలాగే శస్త్రోపజీవులై ప్రాణులను రక్షించుట క్షత్రియ ధర్మం కాగా పశుపాలన, కృషి కర్మ, వ్యాపారం వైశ్యవృత్తి ధర్మాలయినవి. ఎవరి మాట ఎవరు వినాలి, ఎవరి సలహాను పాటించాలి అనే విషయంలో ఋషులొక మాట చెప్పారు. క్షత్రియులు బ్రాహ్మణుల మాటనూ, వైశ్యులు బ్రాహ్మణ క్షత్రియుల సూచనలనూ శూద్రులు పై మూడు ద్విజవర్ణాలనూ గౌరవిస్తూ అనుసరిస్తూ జీవించాలి.

గురువుగారి ఆశ్రయంలో, ఆశ్రమంలో జీవించడం, అగ్నిహోత్రాది విధులను నిర్వర్తిస్తూ స్వాధ్యాయం కూడా చేసుకోవడం బ్రహ్మచారి యొక్క ధర్మాలు. అతడు త్రిసంధ్యల్లోనూ స్నానం చేసి సంధ్యావందన నియమాలను పాటించిన అనంతరం భిక్షాయాచనకు వెళ్ళాలి. హృదయపూర్వకంగా మొక్కవోని భక్తిశ్రద్ధలతో చిత్తశుద్ధితో గురువుగారిని సేవించుకోవాలి. నైష్ఠికుడైన బ్రహ్మచారి మూంజిని వడ్డాణంగా ధరిస్తాడు. జటనూ దండాన్నీ ధరిస్తాడు. ఆశ్రమంలోని ఆచారం ముండకేశమైతే అదేచేస్తాడు. ఎల్లప్పుడూ ఆశ్రమంలోనే వుంటాడు. గురువుగారు బయటికేదైనా పనిమీద పంపితే పోయి వేగంగా మరలివస్తాడు.

గృహస్థు అగ్నిహోత్ర ధర్మాన్ని నిర్వర్తిస్తూనే తన వర్ణ విహిత కార్యాల ద్వారా ధనార్జన చేస్తూ కుటుంబాన్నీ, అతిథులనూ పోషించుకుంటూ జీవించాలి. ధర్మపత్నీ సంగమం నుండి దేవతా, పితృకర్మలదాకా విధ్యుక్తంగా నిర్వహిస్తూ తనకీ సమాజానికీ పనికిరావాలి.

వానప్రస్థికి జటాధారణ, అగ్నిహోత్రపాలన, పృథ్వీశయనం, వననివాసం, కందమూలాలను, పాలను, నీవార ధాన్యాన్ని మాత్రమే భక్షించడం విధ్యుక్త ధర్మాలు. మూడు సందెలలో స్నానం, అతిథి, దేవపూజనం, బ్రహ్మచర్యవ్రతపాలనం కూడా వానప్రస్థికి తప్పనిసరి.

సన్యాసాశ్రమం మానవ జీవితంలో చివరిమెట్టు. సన్యాసి అన్నిటినీ త్యజించాలి. భిక్షాటన ద్వారా వచ్చినదే తినాలి. చెట్టు నీడలోనే నివసించాలి. ఎవరి నుండీ దేనినీ స్వీకరించరాదు. ఏ ప్రాణిపైననూ కోపించరాదు. హింసనిషిద్ధం. సర్వప్రాణులను తనతో సమానంగా ప్రేమించాలి. అప్రియులు లేనివాడు, సుఖదుఃఖాలకు అతీతుడే నిజమైన సన్యాసి. సన్యాసాశ్రమపాలకుడు లోనా, బయట కూడా శుద్ధిగానే వుండాలి. మాటలో సంయమనం, ఇంద్రియ నిగ్రహం, పరమాత్మ ధ్యానం, భావశుద్ధి సన్యాసాశ్రమంలో నున్న వాని ప్రధాన లక్షణాలు.

*అహింసా సూనృతావాణీ సత్యశౌచేక్షమాదయా।*
*వర్ణినాం లింగినాం చైవ సామాన్యోధర్మ ఉచ్యతే ॥* ***(ఆచార.. 213/22)***

అన్ని వర్ణాలవారికీ అన్ని ఆశ్రమాలలోనూ అహింస, ప్రియ మరియు సత్యవచనాలు, పవిత్రత, క్షమ, దయ అనేవి సామాన్యధర్మాలు, అవశ్యాచరణీయాలు. శాస్త్రవిహితంగా తమతమ వర్ణాలకు చెందిన ధర్మాలను పాటిస్తూ జీవించేవారు దేహాంతంలో మోక్షప్రాప్తి నొందుతారు.

శౌనకాదులారా! ఇపుడు ఉత్తమ గృహస్థ దినచర్యను వినండి. అతడు బ్రాహ్మీ ముహూర్తంలోనే నిద్రను త్యజించి ధర్మార్థాల విషయమై బాగా చింతించి, ఆరోజు పడవలసినపాటు, వేదోక్త కర్మ, దాని తాత్పర్య తత్త్వాదులను విచారించుకోవాలి. వెంటనే లేచి శౌచాదికాలను[1]ముగించుకొని స్నానమాచరించి నిరాలసభావంతో [2]సమాహిత చిత్తుడై సంధ్యోపాసన చేయాలి.

శౌచానంతరం మట్టితో కాలుసేతులను శుభ్రపఱచుకొనడానికి నీటినుండి గాని, దేవాలయ, స్మశాన, అగ్న్యాదులనుండి గాని మట్టిని ఉపయోగించరాదు. మూత్ర విసర్జనానంతరం లింగంపై నొకమారు, రెండుచేతులపై రెండేసిమార్లు మట్టిని పూసుకొని కడుక్కుంటే శుద్ధి అవుతుంది. మలవిసర్జన చేసినపుడు గుదమును రెండుమార్లూ, ఎడమచేతిని పదిపర్యాయములూ, కుడిచేతిని కూడా పదిసార్లూ, కాళ్ళను అయిదు విడతలూ మట్టితో నీటితో శుద్ధిచేసుకోవాలి. పగటివేళలోని శుద్ధికార్యంలోని అర్ధభాగం రాత్రివేళలో సరిపోతుంది. ఆరోగ్యకారణాల వల్ల కూర్చుని మలమూత్ర విసర్జన చేయలేని వారు కూడా శుద్ధికార్యంలో సగం చేసుకుంటే చాలు.

మనిషి శరీరంలో పన్నెండు మలాలు లేదా మాలిన్యాలుంటాయి. అవి: వస, శుక్ర, రక్త, మజ్జ (ఎముకగుజ్జు) లార (చొంగ), విష్ఠ, మూత్ర, కర్ణమల (గులిమి) కఫ, అశ్రు, నేత్రమల (పుసులు) స్వేదాలు.

బాహ్యమనీ ఆభ్యంతరికమనీ శుద్ధి రెండురకాలు. మట్టిలోనగు వానితో చేయబడునది బాహ్యమైతే భావనల ద్వారా జరిగేది ఆంతరికం. శుద్ధిలోని ప్రముఖ అంగం ఆచమనం. దీనిని మూడుమార్లు చేయాలి. తరువాత రెండుసార్లు మామూలు నీటితో ముఖం కడుక్కొని బొటన వేలి మూలంతో ముఖాన్ని తోముకొని అరచేతితో మూడు మార్లు ముఖాన్ని స్పృశించాలి. తరువాత బొటన, చూపుడు వేళ్ళతో ముక్కునీ, బొటన అనామికలతో కనులనీ

*[1]మలమూత్రాలను పగటివేళ ఉత్తరం వైపు తిరిగీ, రాత్రిపూట దక్షిణాభిముఖమై విసర్జించాలి. గోమయం, నివురుగప్పిన నిప్పు, చెదలు, పుట్టకన్నము, పచ్చటి పొలం, నీరు, పవిత్రస్థలాలు, రహదారి, పలుప్రాణులకాశ్రయమైన చెట్టునీడ వీటిలో మలమూత్ర విసర్జన చేయరాదు.*

*[2]నిరాలస లేదా నిరలస అనగా చురుకుదనం.*

చెవులనీ స్పృశించాలి. ఆపై బొటన, చిటికెన వేళ్ళతో బొడ్డును ముట్టుకొని మొత్తం అరచేతితో గుండెను నిమురుకోవాలి. తరువాత అన్ని వేళ్ళతో తలనీ వాటి కొనలతో రెండు భుజాలనూ తాకాలి.

ఈ స్పర్శల వలని ఫలమేమనగా ముమ్మారు నీటితో ఆచమనం చేయడం వల్ల ఋగ్యజుస్సామ వేదాలు ప్రసన్నమవుతాయి. ముఖ ప్రక్షాళనం ద్వారా అథర్వ వేదం, బ్రాహ్మణులు బృహస్పతీ ప్రసన్నులవుతారు. ముఖభాగాన్ని స్పృశించడం వల్ల ఆకాశం, ముక్కు ద్వారా వాయువు, నేత్రం ద్వారా సూర్యుడు, చెవుల స్పర్శ ద్వారా అన్ని దిక్కులూ సంతృప్తి చెందుతాయి. ముఖ, నాసికాదులను యథావిధి, స్పృశించడం వల్ల ఈ అంగాలలో ఇతిహాస, పురాణ, వేదాంగాలు (అనగా శిక్షా,కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛంద, జ్యోతిషాలు) ప్రతిష్ఠితాలవుతాయి. నాభిస్పర్శ ప్రాణగ్రంథినీ హృదయస్పర్శ బ్రహ్మదేవునీ ఆనందింప చేస్తాయి. మూర్ధస్పర్శరుద్రునీ శిఖాస్పర్శ ఋషులనీ దగ్గరచేస్తాయి. రెండు బాహువులనీ పూర్తిగా నిమరడం వల్ల యముడు, ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు, పృథ్వి, అగ్నిదేవతల సాన్నిధ్యం లభిస్తుంది. చరణ జలాభ్యుక్షణ విష్ణు భగవానునీ, ఇంద్రదేవునీ, హస్తజలప్రోక్షణ విష్ణువు యొక్క అంశలనీ దగ్గర చేస్తాయి.

ధార్మిక విధానంలో నేలను నీటితో తడపడం వల్ల వాసుకి మున్నగు నాగులు ప్రసన్నులౌతారు. నీటి బిందువులు పడడం వల్ల భూత సమూహం తృప్తి నొందుతుంది. అంగుళుల (వ్రేళ్ళ) పర్వాలపై అగ్ని, సూర్య, వాయు, చంద్రులూ, పర్వతసమూహాలూ నివాసం చేస్తారు. ద్విజుని హస్తరేఖలలో గంగాది పవిత్ర నదులుంటాయి. హస్తతలంపై సర్వతీర్థాలు సోమునితో బాటు ఉంటాయి. అందుచేతనే వారు చెయ్యెత్తి దీవించినా, తలపై చేతిని ఉంచి ఆశీర్వదించినా చాలమంచిది.

ఉషోదయానికే ద్విజుడు లేచి శౌచక్రియను మొదలుపెట్టి వేయాలి. దంతధావనం చేసుకొని స్నానం చేయాలి. పాచిముఖమంత అశుచి అపవిత్రమూ మరి లేవు. దంతధావనా చాలా ముఖ్యమే. అయినా అమావాస్య, షష్ఠి, నవమి, పాడ్యమి తిథుల్లోనూ, ఆదివారంనాడూ పుల్లలేకుండానే ఓషధీయుక్త జలాలను పన్నెండు (12) మార్లు పుక్కిలించి ఉమ్మివేయడం ద్వారా నోటిని శుభ్రపఱచుకోవాలి.

స్నానం వల్ల దృష్టాదృష్ట ఫలాలెన్నో వున్నాయి. శుద్ధాత్ముడైన వ్యక్తి తొలి సందెకల్లా స్నానం చేసి వేస్తే అతడు ఐహిక పారలౌకిక సుఖాలనిచ్చే అన్ని క్రియలనూ చేయడానికి అధికారి అవుతాడు. అన్ని జపాలకీ అర్హుడవుతాడు.

ఈ శరీరమత్యంత మాలిన్యభూయిష్టము. నవరంధ్రాలూ అలా ఎంతో కొంత మాలిన్యపఱుస్తునే వుంటాయి. ఈ దేహాన్ని - అది జీవించి ఉన్నంతకాలం అందుచేత

శరీరశుద్ధికీ మనఃప్రశాంతతకీ, రూపసౌభాగ్యాలకీ ప్రాతఃస్నానం అత్యంతావశ్యకం. పైగా ఇది శోక, దుఃఖవినాశకరం కూడ. కాబట్టి ప్రాతఃస్నానమెక్కడ చేసినా గంగాస్నానంతో సమానమే.

జ్యేష్ఠ శుక్లదశమి హస్తనక్షత్రయుక్తమైతే ఆ తిథికి దానికి దశవిధ పాపాలను పోగొట్టే శక్తి వుంటుంది. ఆ పాపాలేవనగా బాగా సొమ్ముతో బలసివుండీ దానం చేయకపోవడం, స్వధర్మాన్ని నిర్లక్ష్యం చేయడం, ఇతరుల భార్యలతో తప్పు చెయ్యడం, కటువుగా మాట్లాడడం, అబద్ధాలాడడం, చాడీలు చెప్పడం, అసంబద్ధ ప్రలాపం, పరద్రవ్యాపహరణం, మానవజాతిని మొత్తంగా మనసులో ద్వేషించే మంటమారి తనం. ఇటువంటి పనులను తెలియకగాని, పూర్వజన్మలో గాని చేసివుంటే ఆచర్యల వలని పాపము నశించుటకై స్నానం చేస్తున్నానని సంకల్పం చెప్పుకోవాలి. బ్రహ్మచారి *సకృత్ స్నానాన్ని చేయాలి. ఇతరులు కొంత తడయవచ్చును.

ఏ ద్విజుడైన ఆచమనం చేసి నీటిలోకి తీర్థాలను ఆవాహన గావించి, అవ్యయ భగవానుడైన మహావిష్ణువుని స్మరిస్తూ స్నానం చేయాలి. మందేహ నామకులైన రాక్షసులు మూడు కోట్ల మంది వున్నారు. ఆదురాత్ములు ఉదయిస్తున్న సూర్యుని మింగి వేయాలనుకుంటూ వుంటారు. మనము సందె వేళలో ఆ నలభై అయిదు నిమిషాలపాటు చేసే పూజాదికముల వల్ల పవిత్రీకరింపబడిన అర్ఘ్యపు జల్లులు అగ్నిజ్వాలలై ఆ మందేహులను దహించి వేస్తాయని శాస్త్రాల్లో చెప్పబడింది. ద్విజులు సంధ్యాకాలం పూర్తి కాగానే యథాధికారం హవనం చేయాలి లేదా చేయించాలి. అయితే ఒక్కటి మాత్రం నిజం, స్వయంగా హవనం చేయడం వల్ల వచ్చే ఫలమే ఎక్కువ. శాస్త్రాలు చెప్పిన దాని ప్రకారమైతే ఋత్విక్కు, పుత్రుడు, గురువు, సోదరుడు, మేనల్లుడు, అల్లుడు. వీరిలో ఎవరైనా ఒక వ్యక్తి తరుపున హవన కార్యాన్ని చేయవచ్చును. అది వ్యక్తి స్వయం హవనంతో సమానం. గార్హ పత్యాగ్ని బ్రహ్మ స్వరూపం. దక్షిణాగ్ని శివస్వరూపం. ఆ హవనీయాగ్ని విష్ణు మరియు కుమార *స్వరూపం. యథోచితంగా సమయానికి హవనం చేసి సూర్యజపం చేయాలి. తరువాత అదే ఏకాగ్రచిత్తతతో సావిత్రినీ ఓంకారాన్నీ జపించాలి. ప్రణవం, సప్తవ్యాహృతి, త్రిపద సావిత్రి మంత్రం – వీటిని నిరంతరం యథాసమయంగా,

---

* *సకృత్ స్నానో దండవత్! అనగా కర్రను నీటిలో ముంచి తీసినట్లుగా చెయ్యాలి. గురువుగారు చూపించిన నీటి చెలమ బాగుంది కదాని తన శతమర్కట లక్షణాన్ని చూపిస్తూ జలకాలాడరాదు. పరిశుభ్రంగా వుంటూనే వేగం స్నానాన్ని ముగించాలి. బ్రహ్మచారి రెండు సందెలలోనూ అగ్నిహోత్రకార్యాన్ని తప్పనిసరిగా నిర్వర్తించాలి కాబట్టి స్నానం తప్పనిసరి.* (మనుధర్మశాస్త్రం– *2/176*) కుల్లూక భట్టుని టీక

* *ఇక్కడ కుమారయనగా హవనకర్తయగు నైష్ఠిక బ్రహ్మచారి.*

నియతరూపంలో చేయువారు ఈ ప్రపంచంలో దేనికీ భయపడక్కరలేదు. ప్రాతఃకాలంలో నిత్యగాయత్రి జపాన్ని చేసే సాధకుడు పాపుల మధ్యనే జీవిస్తూ కూడ, నీటిలోనే వుంటూ అది అంటని కమలపత్రం వలె, అనఘుడై వుంటాడు.

దేవినుపాసించువారికి గాయత్రియే గాయత్రీ మాతగా దర్శనమిస్తుంది. ఇలా: ***శ్వేత వర్ణా సముద్దిష్టా కౌశేయవసనా తథా ।***

***అక్షసూత్ర ధరా దేవీ పద్మాసన గతా శుభా ॥*** ***(ఆచార..213/70)***

ఈ క్రింది యజుర్వేద మంత్రంతో గాయత్రి నావాహన చేసి ఉపాసించాలి.

***తేజో౽సి తేజోమయి ధేహి వీర్యమాసి***
***వీర్యం మయి ధేహి బలమసి బలం మయి***
***ధేహ్యో జో౽ స్యోజోమయి ధేహి మన్యురసి***
***మన్యుం మయి ధేహి సహో౽సి సహోమయి ధేహి॥*** ***(శుక్లయజు.. 19/9)***

దేవతలను కనులారా చూడాలనుకునే ఋషిగణం, మంత్రదర్శనం కోరి సాధకులు ప్రాచీనకాలంలో ఈ యజుర్వేద మంత్రాన్నే ప్రయోగించేవారు.

ఇక సాధకులు గాని ఇతరేతరాశ్రమవాసులు గాని పూర్వాహ్ణకాలంలో దేవతలను పూజించాలి. విద్వాంసుడైన వాడు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల మధ్య భేదాన్ని చూడడు. అందరినీ పూజిస్తాడు.

ఈ విశ్వంలో మంగళకరములు ఎనిమిదున్నాయి. అవి బ్రాహ్మణుడు, గోవు, అగ్ని, బంగారం, నెయ్యి, సూర్యుడు, నీరు, రాజు. వీటిని దర్శించి పూజించి వీలైనంతవఱకు వాటిని (వారిని) తన కుడివైపునే ఉండేలా చూసుకొని, చేసుకొని నడచిపోవాలి. బ్రాహ్మణుడు ముందుగా వేదాధ్యయనం చేసి, ఆపై దానినే చింతించి, అభ్యాసం, జపం చేసుకొని శిష్యులచేత వేదాన్ని అధ్యయనం చేయించాలి. ఇవి వేదాభ్యాస పంచవిధులు.

అవసరమైన నిధులనిస్తూ వేదార్థాన్నీ, యజ్ఞ కర్మ ప్రతిపాదక శాస్త్రాలనూ ధర్మశాస్త్రాలనూ పుస్తకరూపంలో తయారుచేయించిన వారికి వైదికలోకం ప్రాప్తిస్తుంది. ఇతిహాసాలనూ, పురాణాలనూ వ్రాయించి దానమిచ్చిన వారికి బ్రహ్మను గాని వేదాన్ని గాని దానం చేసిన దానికి రెట్టింపు పుణ్యం లభిస్తుంది. ఇక్కడ బ్రహ్మదానమనగా వేదదానం గాని బ్రహ్మజ్ఞానదానం గాని కావచ్చును.

బ్రాహ్మణుడు గాని ఇతర గృహస్థులు గాని దినంలో మూడవభాగాన్ని, తన పోష్యవర్గం అంటే మాతాపితలూ, గురువు, సోదరులు, ప్రజలు (సంతానం) దీనులు, దుఃఖితులు,

★అభ్యాగతులు, అతిథులు, అగ్నులు - వీరియొక్క పోషణ, ఆలన, పాలనలను చూసుకోవాలి. స్వర్గానికి దీనిని మించిన దగ్గరి దారిలేదు.

కాబట్టి ఎంత ప్రయత్నం చేసైనా మనిషి తన వారిని తాను పోషించుకోవాలి. అదీ న్యాయార్జితంతోనే చేయాలి. పోష్యవర్గాన్ని పోషించని వాడు బతికున్నా చచ్చినట్టే. తన పొట్టని తాను మాత్రమే అనగా తాను తన పొట్టని మాత్రమే పోషించుకొని బ్రతకడం గొప్పేం కాదు. ఊరకుక్క కూడా అలాగే బ్రతికెయ్యగలదు కదా!

*మాతాపితా గురుర్భ్రాతా ప్రజా దీనాః సమాశ్రితాః ॥*
*అభ్యాగతోఽ తిథిశ్చాగ్నిః పోష్య వర్గా ఉదాహృతాః*
*భరణం పోష్య వర్గస్య ప్రశస్తం స్వర్గ సాధనం ॥*
*భరణం పోష్య వర్గస్య తస్మాద్యత్నేన కారయేత్*
*సజీవతి వరశ్చైకో బహుభిర్యోప జీవ్యతి ॥*
*జీవంతో మృత కాస్త్వన్యే పురుషాః స్వోదరం భరాః ।*
*స్వకీయోదర పూర్తిశ్చ కుక్కుర స్యాపి విద్యతే ॥* *(ఆచార... 213/79-82)*

వ్యావహారిక జగత్తులో ధనానికి ప్రాముఖ్యమెక్కువ. అది లేనిదే మనుగడ లేదు. కాబట్టి దాన్ని సంపాదించాలి, పెంచాలి. దీనినే అర్థమన్నారు. అది మన కార్యాలను చాలావఱకు సంపన్నం చేయగల సంపద. దాని ఉపయోగం మనకు అనివార్యం. ఈ దృష్టితో చూస్తే భూమి, రత్నాలు, నిధులూ, ధాన్యమూ, పశువులూ, చివరికి స్త్రీ కూడా అర్థంలో భాగాలే. కాబట్టి కష్టపడి న్యాయంగా ధనాన్ని సంపాదించాలి.

డబ్బు మూడు విధాలు. శుక్ల, శబల, కృష్ణ (తెలుపు, కలగలుపు, నలుపు). ఇది కాక సంక్రమించే ధనం. పితృపితామహుల నుండి రావచ్చు. ఇతరులు ప్రేమకొద్దీ ఇచ్చేసి పోవచ్చు. ★స్త్రీ ద్వారా రావచ్చు. ఇవి కాక బ్రాహ్మణునికి ధనం వచ్చే ఆధారాలు మూడుంటాయి. అవి: యాజనం (యజ్ఞం వల్ల) అధ్యాపనం (పాఠం చెప్పడంవల్ల) విశుద్ధ ప్రతిగ్రహం (సత్పాత్రులు చేసే దానం వల్ల) క్షత్రియులకు కూడా ధన ప్రాప్తికి మూడు మార్గాలుంటాయి. పన్ను ద్వారా నొకటి, దండన ద్వారా నింకొకటి (ఇది అపరాధ

---

★ *అభ్యాగతులనగా భోజనాలవేళ అప్పటికప్పుడు ఊడిపడేవారు.*
*అతిథులనగా వారి రాక మనకు ముందే తెలుస్తుంది. వారు కూడా తిథి వార నక్షత్రాలు చూసుకొని రారు.*
*తిథి పర్వోత్సవాః సర్వేత్యక్తా యేనమహాత్మనా*
*సోఽ తిథిః సర్వభూతానాం శేషానభ్యాగ తాన్ విదుః (యమవచనము)*

★ *(అంటే వివాహం ద్వారా వచ్చేది మాత్రమే ధర్మబద్ధం)*

రుసుము వంటిది) విజయప్రాప్తి ద్వారా వేరొకటి. వైశ్యునికి పొలం ద్వారానూ, పశుపోషణలోనూ, వ్యాపారం వల్లనూ ధర్మబద్ధంగా ధనం సమకూడుతుంది. శూద్రులు వీరికి సాయపడడం ద్వారా ధనార్జనను చేయాలి.

అన్ని వర్ణాలవారూ వడ్డీ వ్యాపారం ద్వారా జీవితాన్ని గడపవచ్చునని ఋషులు నిర్ణయించారు. అయితే బ్రాహ్మణులు, క్షత్రియులు మాత్రం ఆపత్కాలంలోనే ఈ పద్ధతినాశ్రయించాలి. వారు కాలం కలిసిరానపుడు వ్యవసాయం కూడా చేయవచ్చును. విదేశాలకు పోయి ధనాన్ని సంపాదించుకునే అవకాశం వైశ్యులకి మాత్రమే ఈయబడింది.

శాస్త్ర సమ్మతంగా ఆర్జించిన సొమ్ములో కొంత అంశను (లాభాంశ అని దీనినే అంటారు. )వెచ్చించి ప్రతిమనిషీ పితృగణాలనూ,దేవగణాలనూ బ్రాహ్మణులనూ పూజించాలి. దానివల్ల తెలియక చేసిన పాపాలు నశించవచ్చు. వడ్డీ వ్యాపారం ద్వారా వచ్చే ధనంలో ఇరువదవ వంతునీ, పశుస్వర్ణాదుల ద్వారా వచ్చే దానిలో నూరవ వంతునీ రాజుకిచ్చేయాలి. మిగిలిన దానిలో నాల్గవవంతును పెట్టి నిత్యావసర వస్తువులను కొనుక్కొగా మిగిలిన దానిలో సగభాగాన్ని తన భరణ పోషణలకూ నిత్య నైమిత్తిక కార్యాలకు వినియోగించాలి.

విద్య, శిల్పం, వేతనం, సేవ, గోరక్ష, వ్యాపారం, వ్యవసాయం, (కృషి) వృత్తి, *భిక్ష, వడ్డీ అనే పదింటినీ జీవనయాపన సాధనాలుగా ఋషులు పేర్కొన్నారు.

బ్రాహ్మణులు శ్రేష్ఠమైన ధనంగా భావించవలసినది ప్రచుర జలరాశిచే పరి పూర్ణమైనదినీ, కూరలనూ, మట్టినీ, సమిధలనూ, కుశలనూ, పలాశదండన్నీ, అరిటాకునీ, అగ్నిదేవుని ఆరాధించడానికి వలసిన ఉపకరణాలనూ బ్రహ్మఘోష అనగా స్వాధ్యాయాన్ని, బ్రాహ్మణుడు అయాచిత ధనాన్ని కూడా స్వీకరించవచ్చును. దేవతలిటువంటి ధనాన్ని అమృత సమానమంటారు. ఎవరినుండైనా ధనాన్ని స్వీకరించవచ్చు. అది గురువు ధనాన్ని పెంచడానికో దేవతలనూ అతిథులనూ పూజించడానికే వాడబడే మాటైతే. అలాగే దొంగనుండీ శీలవిహీనుని నుండి కూడా దానాన్ని గ్రహించవచ్చు. అయితే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. రోజులోని నాలుగవ భాగంలో మట్టి, నువ్వులు, పువ్వులు, కుశాది సామగ్రిని తెచ్చి వాడుతూ ప్రకృతిసిద్ధమైన జలాలలో స్నానం చేస్తే ఈ దోషానికీ శుద్ధీ ప్రాయశ్చిత్తమూ అవుతాయి.

స్నానం ఎనిమిది ప్రకారాలుగా వుంటుంది. ఆ ప్రకారాలు నిత్య, నైమిత్తిక, కామ్య, క్రియాంగ, మలాపకర్షణ, మార్జన, ఆచమన, అవగాహనలు. స్నానం చేయనిదే జప,

---

*వృత్తి అనగా కొన్ని ప్రత్యేకార్హతలున్నవారు పనిచేసినా చేయకపోయినా ప్రభుత్వమిచ్చే నెలసరి దినుసులు.

అగ్ని, హవనాది కార్యాలకు అధికారం రాదు. ప్రాతః స్నానం పూజా పాఠాది ధార్మిక కార్యాలకోసం చేయాలి. దీనినే నిత్యస్నానమంటారు. చండాల, రజస్వల, విష్ట, శవాదులను స్పృశించినపుడు ఆ దోషం పోవడానికి చేసేది నైమిత్తిక స్నానము. జ్యోతిశ్శాస్త్రానుసారం పుష్యాది నక్షత్రాలలో చేసేది కామ్యస్నానం. ఏ కోరికా లేకుండా ఈ స్నానమును చేయరాదు. జప, హోమాది కృత్యాలను చేయడానికి సంకల్పించి గాని, దేవతలను, అతిథులను పూజించడం వంటి పవిత్ర కార్యాలను చేయాలనే ఇచ్ఛతోగాని వాటికి ముందు చేసే స్నానాన్ని క్రియాంగస్నానమంటారు. శారీరక మలాన్ని దూరం చేసుకోవడానికి సరోవరం, దేవకుండం, తీర్థం, నది వంటి చోట్ల కావించేది మలాపకర్షణ స్నానమనబడుతుంది. విశిష్టమంత్రాలతో చేసేది మార్జనం. జలాశయంలోకి దూకి వీలైనంతసేపు మంత్రం జపిస్తూ చేసే స్నానం అవగాహనం. ప్రాతఃస్నానం తరువాత అవసరమైనా సమయం కుదరనపుడు నీరు దొరకనపుడు ఆచమనం చేయవచ్చు.

భూమి నుండి ఉబికి వచ్చినది పవిత్రజలం. దాని కన్న సెలయేటి నీరు, దాని కన్న సరోవర జలం. దానికన్న నదీజలం, దాని కన్న పుణ్యతీర్థం లోని నీరు పవిత్రమైనవి. వీటన్నిటికన్న పవిత్రం గంగాజలం. ఇందులో స్నానం చేస్తే జీవితంలో చేసిన పాపాలన్నీ నశిస్తాయి. గయ, కురుక్షేత్ర తీర్థాలలోని జలం అతి పవిత్రమైతే కేవల కాశీగంగాజలము పరమ పవిత్రము, సర్వపుణ్యదాయకము.

*భూమిష్ఠాదుద్ధృతం పుణ్యం*
*తతః ప్రస్రవణోదకం ॥*
*తతోఽపి సారసం పుణ్యం*
*తస్మాన్నాదేయ ముచ్యతే*
*తీర్థతోయం తతః పుణ్యం*
*గాంగం పుణ్యంతు సర్వతః ॥*
*గాంగం పయంః పునాత్యాశు*
*పాపమామరణాం తికం ।*
*గయాయాంచ కురుక్షేత్రే*
*యత్తోయం సముపస్థితం ॥*
*తస్మాత్తు గాంగ మపరం*
*జానీయాత్తోయముత్తమం ।* *(ఆచార.. 213/116-119)*

రాత్రి స్నానం పుత్రజన్మ, విశిష్ట యోగాలు, మకరాది ఘనరాశుల్లో సూర్య సంక్రాంతి, చంద్ర, సూర్య గ్రహణాల వంటి ప్రత్యేక సందర్భాలలో చేయడమే ప్రశస్తం. ఉషః కాలంలోనూ, సూర్యోదయం తరువాతనూ, సాయం సంధ్యలోనూ చేసే స్నానాలు ప్రాజాపాత్య యజ్ఞంతో సమానంగా మహాపాతకాలను నశింపజేస్తాయి. శ్రద్ధాపూర్వకంగా ఒక ఏడాది పాటు ప్రాతఃకాల స్నానం చేస్తే పన్నెండేళ్ళు ప్రాజాపత్యం చేసిన ఫలం లభిస్తుంది.

మాఘ, ఫాల్గుణ మాసాల్లో నిత్య ప్రాతః కాల స్నానం చేసే వారికి సూర్య చంద్రులతో సమానమైన భోగ ప్రతిష్ఠలు లభిస్తాయి. మాఘమాసమంతా ప్రాతః స్నానం శ్రద్ధగా చేసి హవిష్యాన్నమును భుజించువాని యొక్క అతి ఘోర పాపాలన్నీ నశించిపోతాయి. ఏకాదశినాడు ఉసిరికను సమర్పిస్తే మహావిష్ణువు ప్రసన్నుడవుతాడు. అదే ఉసిరికను నీటిలో కలుపుకొని నిత్యస్నానంగావించే వారిని లక్ష్మీదేవి స్థిరంగా వుండి కాపాడుతుంది.

తైలంతో అభ్యంగన స్నానం చేస్తే గొప్ప ఫలాలు వస్తాయి. సోమవారం చేస్తే కీర్తి... అలాక్రమంగా మంగళాదివారాల్లో అల్పాయు నష్టం లేదా శాపవినాశం, ధనం, మృత్యు, భయనాశనం, ఆరోగ్యం, అభీష్టసిద్ధి కలుగుతాయి. వ్రతదినాల్లో తైలస్నానము చేయరాదు. స్నానానంతరం ప్రతిఒక్కరూ పిత్రు, దేవ, మానవగణాలకు తర్పణనివ్వాలి. బొడ్డు మునిగేదాకా నీటిలో నిలబడి ఏగాగ్ర చిత్తంతో ఈ విధంగా ఆయా గణాలను ఆవాహన చేయాలి.

***ఆగచ్ఛతు మేపితర ఇమం గృహ్ణం త్వపోఽజలిం.***

అప్పుడు ఆకాశంలోనూ దక్షిణ దిశలోనూ ఉన్న పితృగణాల వారికి మూడేసి జలాంజలులివ్వాలి. నీటిలో నిలబడలేని వారు తర్పణాలివ్వాలనుకుంటే పొడిధోవతిని ధరించి సమూలంగా కుశలపై కూర్చుని ఇవ్వవచ్చు. తర్పణలకే దశలోనూ పాత్రను వినియోగించరాదు.

ఈ కర్మకు రాక్షసులడ్డు పడకుండా తర్పణారంభంలోనే ఎడమచేతితో నీటిని తీసుకుని నైర్మృత్యకోణంలో వదిలేస్తూ ఈ మంత్రాన్ని చదవాలి.

***యదపాం క్రూర మాంసాత్తు***
***యదమేధ్యంతు కించన॥***
***అశాంతం మలినం యచ్చ***
***తత్సర్వ మపగచ్ఛతు ।*** ***(ఆచార... 213/131, 132)***

క్రూరమాంస, అపవిత్రత, తర్పణజలాల్లో అజ్ఞాన వశాన వుండే అశాంతి జనక తత్త్వ, మాలిన్యాల కారణాల వల్ల కలిగే ప్రతిబంధకాలన్నీ దూరమైపోవాలి గాక అని పై విధంగా దేవతలను ప్రార్థించి ఉపసంహారం చేయడానికి మూడు జలాంజలులను మంత్రానికొకటిగా ఈ క్రింది మంత్రాలను పఠిస్తూ సమర్పించాలి.

***నిషిద్ధ భక్షణాద్యత్తు పాపాద్యచ్చ ప్రతి గ్రహాత్।।***
***దుష్కృతం యచ్చమే కించి ద్వాంగ్మనః కాయకర్మభిః***
***పునాతు మేతదింద్రస్తు వరుణః సబృహస్పతిః ।।***
***సవితాచభగశ్చైవ మునయః సనకాదయః ।***
***ఆ బ్రహ్మాస్తంబ పర్యంతం జగత్ తృప్యత్వితి బ్రువన్ ।। (ఆచార..213/133-135)***

తినకూడనివి తినడం వల్ల, పాత పుట్టుకలలోని పాపాలవల్ల, దానగ్రహణం లోని లోపాలవల్ల, నోరు పారేసుకోవడం వల్ల, కర్మదోషాలవల్ల, ఇతరేతర నిషిద్ధ కర్మాచరణలవల్ల వాటినుండి పుట్టిన పాపాల ద్వారా నాలో పెరిగిన అపవిత్రతను బృహస్పతి, ఇంద్రుడు, వరుణుడు దూరం చేయాలి గాక! సూర్యయమాది దేవతలు, సనక సనందనాది ఋషులు, బ్రహ్మనుండి స్తంబం (కీటకాలు, సూక్ష్మజీవులు, గడ్డి) దాకా గల సమస్త జీవకోటి నా ఈ తర్పణాల వల్ల తృప్తి చెందాలిగాక!

ఈ ప్రకారంగా పితృతర్పణలనిచ్చి ఈర్ష్యాద్వేషరహితుడై, సంయమియై మనిషి త్రిమూర్త్యాది దేవతలను పూజించాలి. ఇష్టదేవతలను పూజించిన పిమ్మట బ్రాహ్మ, వైష్ణవ, రౌద్ర, సావిత్ర, మైత్రావరుణ మంత్రాలతో అందరు దేవతలకూ నమస్కరించాలి. వారందరికీ వేరు వేరుగా పుష్పాంజలు లివ్వాలి. మరల సర్వ దేవమయులైన విష్ణువునీ సూర్యునీ పూజించాలి. పురుషసూక్తం చదువుతూ విష్ణువునకు జల, పుష్పాంజలులను సమర్పించేవాడు సర్వవిశ్వాన్నీ పూజించినంత పుణ్యాన్ని పొందుతాడు. అన్యతాంత్రిక మంత్రాల ద్వారా కూడా ఈ కర్మను నిర్వహించవచ్చును. జనార్దనునికి అర్ఘ్యప్రదానం చేసి ఆయన విగ్రహానికి సుగంధానులేపనం చేసి పుష్పాదులతో మంత్ర సహితంగా పూజను చేయవచ్చును.

స్నానం తరువాత అంత ప్రముఖమైన పుణ్యకార్యంఅన్నదానం. బ్రాహ్మణునితో మొదలుపెట్టి ఆపై తన మిత్రులకూ అనంతరం గ్రామంలో అందరికీ అన్నం పెట్టేవానికి స్వర్గంలోకానికి వెళ్ళే అధికారం లభిస్తుంది. భోజనంలో మొదట తీపినీ, మధ్యలో ఉప్పన, పుల్లనవైన వాటిని, తరువాత చేదు, కారాలనూ, చివర వగరైన వాటిని అన్నంలో కలుపు

కొని తినాలి. భోజనం తరువాత పాలు త్రాగాలి. రాత్రి కందమూలాదులను తినరాదు.ఏదో ఒక రసాన్నే ప్రేమించి దానినిఎక్కువగా తినడం మంచిదికాదు.

తాంబూలం వేసుకోవచ్చు. (ఇది గృహస్థులే వేసుకోవాలని అన్యత్ర చెప్పబడింది) తాంబూలం లేదా తమలపాకు స్వీకరించిన తరువాత పురాణేతిహాసాలను ఏకాగ్ర చిత్తంతో వినాలి. దినంలో ఆరవ లేదా ఏడవ భాగాన్ని ఈ పుణ్య శ్రవణంలో గడపాలి. తరువాత సాయం సంధ్య వార్చాలి.

మునులారా! ఈ స్నానాదికములు మానవజాతికంతటికీ విధాయకములు. ఈ విధమైన కర్తవ్యపాలనం చేసి సదాచారాన్ని గూర్చి స్వయంగా చదివి గానీ పురోహితుని ద్వారా విని గాని ఆచరించాలి. ఈ సదాచారాన్ని తు.చ. తప్పకుండా పాటించేవాడు స్వర్గలోక నివాస ప్రాప్తి నొందుటయే కాక భూలోకంలో కేశవుని (విష్ణువు) వలె పూజలందగలడు. ***(అధ్యాయం - 213)***

# స్నాన, సంధ్యా తర్పణ విధి*

బ్రహ్మ ఇలా ఉపదేశించాడని సూతమహర్షి మహామునులకు చెప్పసాగాడు. అన్ని క్రియలూ స్నానమూలకాలే, స్నానం లేనిదే ఏ క్రియా సఫలం కాదు. స్నానం ద్వారా అర్హుడు కాదలచుకున్నవాడు ముందుగా మట్టి, గోమయం, నువ్వులు, కుశలు, సుగంధితపుష్పాలు. వీటిని ఒకచోట చేర్చుకోవాలి. గంధాది స్నానోపయుక్తాలైన పదార్థాలను జల సమీపంలో, స్వచ్ఛమైన నేలపై ఉంచుకోవాలి. తరువాత గోమయాన్నీ మట్టినీ మూడేసి భాగాలుగా విడగొట్టి ఒక భాగంతో జలప్రక్షాళన ద్వారా రెండు కాళ్ళనూ రెండు చేతులనూ శుద్ధిచేసుకోవాలి. జందెము నెడమ భుజంపై వేసుకొని పిలకను ముడివేసి మౌనముగా ఆచమనం చేయాలి.

*ఓం ఉరుం హి రాజా వరుణశ్చకార*
*సూర్యాయ పంథానమన్వేత వాఉ ।*
*ప్రతిధాతాచ వక్తార స్తా హృదయా విపశ్చిత్ ॥*
*నమో గ్యరుణాయా భిష్టుతో వరుణస్యపాశః ।*
*వరుణాయనమః॥* ***(ఆచార.214/6)***

---

★ *ఈ అధ్యాయంలో ఏదో ప్రతీక మాత్రంగానే మంత్రాలివ్వబడ్డాయి. పూర్తి పాఠం కోసం 'మంత్రసంహిత' లను సంప్రదించాలి.*

ఇత్యాది మంత్రాలను చదువుతూ కుడి భుజంపై నీటిని స్థాపించుకోవాలి. ఈ క్రింది మంత్రంతో ఆ నీటిని అభిమంత్రితం చేయాలి.

***ఓం యేతే శతం వరుణయే***
***సహస్రం యజ్ఞియాః పాశావితతా మహాంతః***
***తేభిర్నో అద్య సవితోత విష్ణు ర్విశ్వే***
***ముంచతు మరుతః స్వర్కాః స్వాహా ॥*** ***(ఆచార.. 214/7)***

ఈ క్రింది మంత్రం చదువుతు దోసిలితో నీరు తీసుకొని తలపై పోసుకొని మిగిలిన నీటిని పారబోయాలి.

***ఓం సుమిత్రియాన ఆప ఓషధయః సంతు***
***దుర్మిత్రియాస్తస్మై సంతు***
***యోఽ స్మిన్ ద్వేష్టి యంచ వయం ద్విష్మః ॥*** ***(ఆచార.. 214/8)***

తరువాత కాళ్ళకు, జంఘులకు, కటికీ మూడేసి మార్లు మట్టిని పూసుకోవాలి. తరువాత చేతులు కడుక్కొని ఆచమనం చేసి నీటికి నమస్కారం చేసి ***ఓం ఇదం విష్ణుర్విచక్రమే...*** అనే మంత్రాన్ని చదివి ***ఓం భూః స్వాహా, ఓం భుంఃస్వాహా, ఓం స్వః స్వాహా*** ఇత్యాది మహావ్యాహృతి మంత్రాలతో ఆచమనాన్నీ ***ఓం ఇదం విష్ణు...*** మున్నగు మంత్రాలతో శరీరంపై మట్టితో మర్దనాన్నీ, మార్జనాన్నీ చేసుకోవాలి. పిమ్మట సూర్యునివైపు తిరిగి ***ఓం ఆపో అస్మాన్.... ఇత్యాది*** మంత్రాలను చదువుతూ నీటిలో మునకలు వేయాలి. శరీరాన్ని బాగా తోముకుని నీటిలో మునిగి తేలి మరల మట్టిని పట్టించి మరల మునిగి తేలాలి.

ఒడ్డుకి వచ్చి ***ఓం మానస్తోకే తనయే మాన....*** ఇత్యాది మంత్రాలను ముమ్మారు పఠిస్తూ గోమయాన్ని శరీరమంతటా పూసకోవాలి. తరువాత ***ఓం ఇమంమే వరుణ...*** అనే మంత్రంతో తలతో మొదలెట్టి క్రమంగా శరీరాన్ని నీటితో అభిషేకించుకోవాలి. ఈ పై మంత్రాలన్నిటినీ మరల చదువుతూ ఆత్మాభిషేకాన్ని గావించుకొని నీటినుండి బయటికి వచ్చి ఆచమనం చేసి ***ఓం ఆపోహిష్టా, ఓం ఇదం ఆపో హ విష్మతీ, ఓం దేవీరాప, ఓం ద్రుపదాదివ, ఓం శం నో దేవీ అనే*** అక్షరాలతో మొదలయ్యే పవమాన మంత్రాలను పూర్తిగా చదువుతూ ఒళ్ళు తుడుచు కోవాలి. స్నానం చేస్తూ ***ఓంహిరణ్యా వర్ణా, ఓం పవమాన సూక్తం, ఓం తరత్సామా, ఓం శుద్ధవత్యః*** మున్నగు పవిత్ర మంత్రాలనూ, మరిన్ని వరుణ మంత్రాలనూ కూడా, యథాశక్తి చదవడం మంచిది.

స్నానప్రారంభంలోనూ చివరా ఓంకార, వ్యాహృతి సమన్వితమైన గాయత్రి మంత్రాన్ని పఠించాలి. జలాశయ మధ్యంలో నిలబడి తోముకోవడం, తుడుచుకోవడం సంప్రదాయం. నీటమునిగి మూడు మార్లు అఘమర్షణ మంత్రాలను పఠించాలి.

అలాగే ***ఓం ద్రుపదా...*** మున్నగు మంత్రాలను కూడ ముమ్మారు చదవాలి. ***ఓం ఆయం గౌః.....*** మున్నగు మూడు ఋగ్వేదమంత్రాలను జపించాలి. తరువాత స్మృతులలో నిర్దేశింపబడిన స్నానాంగములను గానీ గాయత్రిని గానీ ఓంకార మాత్రమును గానీ విష్ణుస్మరణ గానీ చేయాలి. ***ఓం తద్ విష్ణోః పరమంపదం...*** అను దానిని పూర్తిగా మననం చేస్తూ వుండాలి. ఇది వైష్ణవ గాయత్రిగా ప్రసిద్ధి చెందింది. ***ఓం ఇద మాపః ప్రవహతః...*** ఇత్యాది పవిత్ర మంత్రాలను మననం చేస్తూ ఒంటిపై చేరిన మలాన్ని తుడిచి పారేస్తుంటే శరీరంతో బాటు మనస్సు కూడా నిర్మలమవుతుంది. ***ఓం తద్విష్ణోః పరమం పదం...*** ఇత్యాది మంత్రాలను కూడా పఠించాలి.

సంధ్య మరియు తర్పణ క్రియలకు స్నానవిధిని సంపన్నం చేసి బాగా ఉతికిన అఖండిత పవిత్ర వస్త్రాలను ధరించి మరల మట్టితో నీటితో కాలుసేతులను శుద్ధి చేసుకొని ఉపక్రమించాలి. (తరువాత భోజనానికి ముందు కూడా ఆచమనాలూ, మంత్ర జపాలూ చేయాలి.)

మరల ఆచమనం చేసి 'ద్రుపదాదివ' మంత్రాన్ని మూడు మార్లు పఠించి నెత్తిపై నీరు జల్లుకోవాలి. మెల్లగా ప్రాణాయామం చేసి సూర్యుని కర్ఘ్యమిచ్చి ఊర్ధ్వ బాహువై ***ఓం ఉదుత్యం... ఓం చిత్రం దేవానాం... ఓం తచ్చక్షుర్దేవహితం... ఓం హంస శుచిషద్*** మున్నగు మంత్రాలను పూర్తిగా పఠిస్తూ సూర్యదేవుని పూజించి యథాశక్తి గాయత్రి మంత్రాన్ని కూడా జపించాలి. ఆపై ***ఓం బిభ్రాట్...*** మున్నగు సూర్యమంత్రాలనూ, సర్వదేవతల ప్రసన్నతకై ఆయా దేవతల మంత్ర జపాలనూ ఈ జపాల సాంగోపాంగ పూర్ణతకై విధ్యుక్తంగా ఆధ్యాత్మ విద్యాజపాన్నొనరించాలి. ఇపుడు జందెమును సవ్యం చేసుకొని మూడుమార్లు ఆచమనం చేసి శ్రీ, మేధా, ధృతి, క్షితి, వాక్, వాగీశ్వరి, పుష్టి, తుష్టి, ఉమ, అరుంధతి, శచి, మాతృగణాలు, జయ, విజయ, సావిత్రి, శాంతి, స్వాహా, స్వధ, శ్రేష్ఠ అదితి, ఋషిపత్నులు, ఋషి కన్యలు, అన్య కామ్య దేవతలు – వీరందరికీ తర్పణలివ్వాలి. ఆ తరువాత సమాహిత చిత్తంతో అందరి మంగళాన్నీ కోరుతూ సర్వమంగళాదేవిని తృప్తిపఱచి ***"ఓం ఆబ్రహ్మ స్తంబ పర్యంతం జగత్ తృప్య త్వితి"*** అనే మంత్రంతో మూడు అంజలులిచ్చి తర్పణ క్రియను ముగించాలి. ***(అధ్యాయం -214)***

# తర్పణ విధి వర్ణన

*(గరుడ పురాణంలో తర్పణల యొక్క అవశ్యకర్తవ్యాలు మాత్రమే ఇవ్వబడ్డాయి. మరింత జ్ఞానం కోసం 'నిత్యకర్మ పూజా ప్రకాశ' మనే గ్రంథాన్ని సంప్రదించాలి)*

తర్పణలను ఈ క్రింది మంత్రాలతో ఇస్తే దేవగణాలూ పితృగణాలవారూ సంతోషిస్తారు. సర్వప్రథమంగా **ఓం మోదాస్తృప్యంతాం** తో మొదలుపెట్టి ఒక్కొక్క మంత్రానికి ఒక్కొక్క దోసిలితో జలాంజలులివ్వాలి. మొత్తం మంత్రాలివి.

*ఓం మోదాస్తృప్యంతాం ।*
*ఓం ప్రమోదాస్తృప్యంతాం ।*
*ఓం సుముఖా స్తృప్యంతాం ।*
*ఓం దుర్ముఖా స్తృప్యంతాం ।*
*ఓం విఘ్నా స్తృప్యంతాం ।*
*ఓం విఘ్న కర్తార స్తృప్యంతాం ।*
*ఓం ఛందాంసి తృప్యంతాం*
*ఓం వేదో స్తృప్యంతాం ।*
*ఓం ఓషధయ స్తృప్యంతాం ।*
*ఓం సనాతన స్తృప్యంతాం ।*
*ఓం ఇతరా చార్యా స్తృప్యంతాం ।*
*ఓం సంవత్సర స్సావయవ స్తృప్యంతాం ।*
*ఓం దేవా స్తృప్యంతాం ।*
*ఓం అప్సరస స్తృప్యంతాం ।*
*ఓం దేవాంధకాస్తృప్యంతాం ।*
*ఓం సాగరా స్తృప్యంతాం ।*
*ఓం నాగాస్తృప్యంతాం ।*
*ఓం పర్వతా స్తృప్యంతాం ।*
*ఓం సరిన్మనుష్యాయక్షా స్తృప్యంతాం ।*
*ఓం రక్షాంసి తృప్యంతాం ।*
*ఓం పిశాచా స్తృప్యంతాం ।*
*ఓం సుపర్ణా స్తృప్యంతాం ।*
*ఓం భూతాని తృప్యంతాం ।*
*ఓం భూతగ్రామాశ్చతుర్విధా స్తృప్యంతాం ।*
*ఓం దక్ష స్తృప్యతాం ।*
*ఓం ప్రచేతసా స్తృప్యంతాం ।*
*ఓం మరీచి స్తృప్యంతాం ।*
*ఓం అత్రి స్తృప్యతాం ।*
*ఓం అంగిరా స్తృప్యతాం ।*
*ఓం పులస్త్య స్తృప్యతాం ।*
*ఓం పులహా స్తృప్యతాం ।*
*ఓం క్రతు స్తృప్యతాం ।*
*ఓం నారద స్తృప్యతాం ।*
*ఓం భృగు స్తృప్యతాం ।*
*ఓం విశ్వామిత్ర స్తృప్యతాం ।*
*ఓం కశ్యప స్తృప్యతాం ।*
*ఓం జమదగ్ని స్తృప్యతాం ।*
*ఓం వసిష్ఠ స్తృప్యతాం ।*
*ఓం స్వాయంభువ స్తృప్యతాం ।*
*ఓం స్వారోచిష స్తృప్యతాం ।*
*ఓం తామస స్తృప్యతాం ।*
*ఓం రైవత స్తృప్యతాం ।*

ఓం చాక్షష స్తృప్యతాం ।
ఓం మహాతేజా స్తృప్యతాం ।
ఓం వైవస్వత స్తృప్యతాం ।
ఓం ధృవ స్తృప్యతాం ।
ఓం ధవ స్తృప్యతాం ।
ఓం అనిల స్తృప్యతాం ।
ఓం ప్రభాస స్తృప్యతాం ।

అనంతరం సాధకుడు నివీతియై అనగా జంధ్యమును మాలవలె ధరించి ఈ క్రింది మంత్రాలతో తర్పణలివ్వాలి.

ఓం సనక స్తృప్యతాం ।
ఓం సనాతన స్తృప్యతాం ।
ఓం కపిల స్తృప్యతాం ।
ఓం ఆసురి స్తృప్యతాం ।
ఓం వోఢు స్తృప్యతాం ।
ఓం పంచశిఖ స్తృప్యతాం ।
ఓం మనుష్యాణాం కవ్యవాహ స్తృప్యంతాం ।
ఓం అనల స్తృప్యతాం ।
ఓం సోమ స్తృప్యతాం ।
ఓం యమ స్తృప్యతాం ।
ఓం అర్యమా తృప్యతాం ।

తరువాత జందెమును ప్రాచీనావీతి దశలో అనగా కుడిభుజంపైకి వుంచి ఈ క్రింది మంత్రాలతో తర్పణలివ్వాలి.

ఓం అగ్నిష్వాత్తాః పితర స్తృప్యతాం ।
ఓం సోమపాః పితర స్తృప్యతాం ।
ఓం బర్హిషదః పితర స్తృప్యతాం ।
ఓం యమాయనమః । ఓం ధర్మరాజాయనమః ।
ఓం మృత్యువేనమః । ఓం అంతకాయనమః ।
ఓం వైవ స్వతాయనమః । ఓం కాలాయనమః ।
ఓం సర్వభూతక్షయాయ నమః ।
ఓం ఔదుంబరాయనమః ఓం దుధ్నాయనమః ।
ఓం నీలాయనమః । ఓం పరమేష్ఠి నే నమః।

*ఓం వృకోదరాయనమః । ఓం చిత్రాయనమః ।*

*ఓం చిత్ర గుప్తాయనమః । బ్రహ్మాది స్తంబ పర్యంతం జగత్తృప్యతు ।*

*ఓం పితృభ్యః స్వధా నమః ।*

*ఓం పితా మహేభ్యః స్వధా నమః ।*

*ఓం ప్రపితా మహీభ్యః స్వధానమః ।*

*ఓం మాతృభ్యః స్వధానమః ।*

*ఓం ప్రమాతా మహేభ్యః స్వధా నమః ।*

*ఓం వృద్ధ ప్రమాతా మహేభ్యః స్వధానమః॥ తృప్యతామితి ।*

*పితరులను ధ్యానిస్తూ ఈ క్రింది మంత్రాలను పఠించాలి.*

*ఓం ఉదీరతా మవర, ఓం అగ్ని రసోనః,*

*ఓం ఆయంతునః, ఓం ఊర్జ, ఓం పితృభ్య,*

*ఓం యే చేహ, ఓం మధువాతా, ఓం నమో వః పితరో...*

అనే మంత్రాలను పూర్తిగా చదివి, ధ్యానించి, ఈ క్రింది మంత్రాలతో మరల జలాంజలు లివ్వాలి.

*ఓం పితృభ్యః స్వధాయిభ్యః నమః ।*

*ఓం పితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ।*

*ఓం ప్రపితా మహేభ్యః స్వధాయిభ్యః స్వధానమః ।*

*ఓం మాతామహేభ్యః స్వధానమః ।*

*ఓం ప్రమాతా మహేభ్యః స్వధానమః ।*

*ఓం వృద్ధ ప్రమాతా మహేభ్యః స్వధానమః* మున్నగునవి.

చివరగా బట్టలు పిండిన నీళ్ళతో, వ్యక్తి యొక్క వంశంలోని, పుత్ర హీన జనుల కొఱకు ఈ క్రింది మంత్రంతో తర్పణలివ్వాలి.

*యేచాస్మాకం కులేజాతా*
*అపుత్రా గోత్రిణో మృతాః ।*
*తే తృప్యంతు మయాదత్తం*
*వస్త్ర నిష్పీడనోదకం ॥* *(అధ్యాయం - 215)*

# బలివైశ్వదేవ నిరూపణం

ఇపుడు వైశ్యదేవహోమవిధిని బోధిస్తాను. ముందు అగ్నిని రగిల్చి **ఓం కవ్యాదమగ్ని....** ఇత్యాది మంత్రాలతో హవ్యాంశాలను కొన్నిటిని అగ్నిలో వ్రేల్చాలి. తరువాత *ఓం పావకవైశ్వానర...* అనే మంత్రంతో అగ్నిని ఆవాహన చేసి ఈ క్రింది మంత్రాలతో ఆహుతులనివ్వాలి.

*ఓం ప్రజాపతయే స్వాహా ।*
*ఓం సోమాయ స్వాహా ।*
*ఓం బృహస్పతయే స్వాహా ।*
*ఓం అగ్నిషోమాభ్యాం స్వాహా ।*
*ఓం ఇంద్రాగ్ని భ్యాం స్వాహా ।*
*ఓం ద్యావా పృథివీభ్యాం స్వాహా ।*
*ఓం ఇంద్రాయ స్వాహా ।*
*ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా ।*
*ఓం బ్రహ్మణే స్వాహా ।*
*ఓం అద్భ్యః స్వాహా ।*
*ఓం ఓషధివనస్పతిభ్యః స్వాహా ।*
*ఓం గృహ్యాయ స్వాహా ।*
*ఓం దేవదేవతా భ్యః స్వాహా ।*
*ఓం ఇంద్రాయ స్వాహా ।*
*ఓం ఇంద్ర పురుషేభ్యః స్వాహా ।*
*ఓం యమాయ స్వాహా ।*
*ఓం యమపురుషాయ స్వాహా ।*
*ఓం సర్వేభ్యో భూతేభ్యో దివాచారిభ్యః స్వాహా ।*
*ఓం వసుధా పితృభ్యః స్వాహా ।*

తరువాత ఈ క్రింది మంత్రాన్ని చదువుతూ దాని ద్వారా బలి, పుష్టిలను కోరుతూ ప్రార్థించాలి.

*ఓం యే భూతాః ప్రచరంతి దీనాశ్చ*
*నిమిహంతో భువనస్య మధ్యే ।*
*తేభ్యో బలిం పుష్టి కామో*
*దదామిమయి పుష్టిం పుష్టి పతిర్దధాతు ॥* ***(ఆచార.. 216/2)***

చివరగా ఓం ఆచాండాల పతిత వాయ సేభ్యోనమః అనే మంత్రం ద్వారా కూడా కాకి మున్నగు వాటికి బలులివ్వాలి. ***(అధ్యాయం – 216)***

# సంక్షిప్త సంధ్యావిధి

ఇపుడు ద్విజులంతా చేయవలసిన సంధ్యావిధిని వినిపిస్తాను. ముందుగా ఈ క్రింది మంత్రం ద్వారా బాహ్య, ఆభ్యంతర శుద్ధిని చేసుకోవాలి.

***ఓం అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోఽపివా ।***
***యః స్మరేత్పుండరీ కాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః ॥***

పుండరీ కాక్షుడైన విష్ణుమూర్తిని ఈ విధంగా స్మరించి శుద్ధియైన ద్విజుడు తన ఉపనయన వేళ ఉపదేశంగా పొందిన గాయత్రి జపాన్నే సంధ్యోపాసనలో కూడా చేయాలి. అయితే గాయత్రి మంత్రానికి ముందు వినియోగ మంత్రాన్నిలా పఠించాలి.

***ఓం గాయత్రీఛందః, విశ్వామిత్ర ఋషిః, త్రిపాత్, సముద్రాః కుక్షిః, చంద్రా దిత్యౌలోచనౌ, అగ్నిర్ముఖం, విష్ణుహృదయం, బ్రహ్మరుద్రౌ శిరః, రుద్ర శిఖా, ఉపనయనే వినియోగః ।*** సంధ్యోపాసనలో గాయత్రి మంత్రాన్ని జపించడానికి ముందు ఇలా యీ శరీరభాగాలను న్యాసం చేయాలి.

***ఓం భూః - పాదాలు, ఓంభువః - జాను***
***ఓం స్వః - గుండె, ఓం మహః - తల***
***ఓం జనః- పిలక , ఓం తపః - గొంతు***
***ఓం సత్యం - నుదురు.***

ఆ తరువాత ఏయే అంగాలను ఆయా మంత్రాలతో ఇలా జపిస్తూ స్పృశించాలి.

***ఓం హృదయాయ నమః, ఓం భూః శిరసే స్వాహా,***
***ఓం భువః శిఖాయై వౌషట్, ఓం స్వః కవచాయహుం,***
***ఓం భూర్భువః స్వః అస్త్రాయ ఫట్ । (అస్త్ర అనగా చేతులు)***

అనంతరం ప్రణవ, భూర్భువాది సప్త వ్యాహృతులతో బాటు గాయత్రిపాదమైన

***ఓం ఆపోజ్యోతీ రసోఽమృతం భూర్భువః స్వరోం*** ను జపిస్తూ ప్రాణాయామం చేయాలి.

తదనంతరం ప్రాతస్సంధ్యలో ***ఓం సూర్యశ్చ ..*** అనే మంత్రాన్నీ, మధ్యాహ్న సంధ్యలో ***ఓం ఆపః పునంతు..*** అనే మంత్రాన్నీ సాయం సంధ్యలో ***ఓం అగ్నిశ్చ...*** అనే మంత్రాన్నీ జపిస్తూ ఆచమనం చేయాలి. తరువాత ఆవాహన పూర్వకంగా గాయత్రి మంత్రాన్ని జపించాలి. అపుడు ***ఓం ఆపోహిష్ఠా మయోభువః.... ఓం సుమిత్రి యా న ఆపః....***

***ఓం ద్రుపదాదివ.....*** అనే మంత్రాలను చదువుతూ శరీరాన్ని నీటితో తుడుచుకొని ***ఓం ఋతం చ సత్యం...*** అనే మంత్రం ద్వారా అఘమర్షణం చేసుకోవాలి. తరువాత ముందుగా గాయత్రి వినియోగాన్ని ఇలా పఠించాలి.

*ఓం గాయత్ర్యా విశ్వామిత్ర ఋషి*
*ర్గాయత్రీ ఛందః సవితా దేవతా*

జపే వినియోగః। ***ఓం ఉదుత్యం జాత వేదస... ఓం చిత్రం దేవానాం... ఓం తచ్చక్షుః...*** ఈ సూర్యోపస్థాన మంత్రాలను పఠించి వీలైనంత సేపు గాయత్రిని జపించాలి. అనంతరం ***ఓం విశ్వతశ్చక్షు.. ఓం దేవాగాతు... ఓం ఉత్తరేశిఖరే....*** అనే మంత్ర జప సమర్పణ పూర్వకంగా పూజను ముగించాలి. ***(అధ్యాయం.. 217)***

# పార్వణ శ్రాద్ధవిధి

*(సపాత్రకమనీ అపాత్రకమనీ శ్రాద్ధం రెండు విధాలు. విశ్వదేవ, పితర స్థానాల్లో మహానుభావులైన పవిత్ర బ్రాహ్మణులను కూర్చుండబెట్టి శ్రాద్ధకర్మను గావిస్తారు. దానికి సపాత్రక శ్రాద్ధమని పేరు. కలియుగంలో అంతటి భూదేవతలు దొరకటం కష్టం కాబట్టి ఆ స్థానాల్లో కుశదర్భలను పెట్టి శ్రాద్ధవిధిని నడిపిస్తున్నారు. దీనికి అపాత్రక శ్రాద్ధమని వ్యవహారము)*

బ్రహ్మదేవుడు వ్యాసమహర్షికి చెప్పిన గరుడపురాణ - ఆచార కాండను సూత మహర్షి కొందరు మహామునుల కీవిధంగా ప్రవచిస్తున్నాడు.

ఈ కార్యం వల్ల 'ఇక్కడ' భోగం 'అక్కడ' మోక్షం అబ్బుతాయి. శ్రాద్ధమును పెట్టువాడు (శ్రాద్ధకర్త) శ్రాద్ధాదినమునకొక రోజు ముందే స్వయంగా వెళ్ళి బ్రాహ్మణు లను ఆహ్వానించాలి. ముఖ్యంగా ఈ పనికి బ్రహ్మచారిని పెట్టుకుంటే విశేషఫల ముంటుంది. సవ్యంలో (అనగా జందెమును సవ్యముగా వుంచుకొని) విశ్వదేవులనూ, అపసవ్యంలో పితరులనూ, ఆవాహన చేయాలి. ***ఓంస్వాగతం భవద్భిః లేదా భవద్భిః స్వాగతం స్వీక్రియతాం*** అని విశ్వదేవులనూ ప్రతినిధులనూ ఆహ్వానిస్తే వారి ప్రతినిధులైన బ్రాహ్మణులు ప్రవేశిస్తారు. అప్పుడు శ్రాద్ధకర్త★

---

★ *ఇక్కడ సుస్వాగతం అనే మాట ఈయబడింది కాని ఆ మాట వ్యాకరణ బద్ధం కాదు. కాబట్టి చేర్చబడుట లేదు.*

***'ఓం విశ్వేభ్యోదేవేభ్య ఏతత్వా దోదకమర్ఘ్యం స్వాహా'*** అంటూ దేవతలకు బదులుగా నిలబడ్డ బ్రాహ్మణుల పాదాలను దేవతీర్థంతో కుశలతో కడగాలి. తరువాత జందెము నపసవ్యం చేసుకొని దక్షిణం వైపు తిరిగి తండ్రి తాతల గోత్ర నామాలను ఉచ్చరిస్తూ పితరులకు బదులుగా నిలబడ్డ బ్రాహ్మణుల చరణాలను ***ఓం ఏతత్వాదోదక మర్ఘ్యం*** స్వధా అనే మంత్రం ద్వారా నీటితో పూలతో కుశలతో కడగాలి. మాతా మహాదుల శ్రాద్ధ కర్మలో కూడా ఇలాగే చేయాలి. తరువాత ***ఓం ఏతదాచమనీయం స్వాహా*** అంటూ బ్రాహ్మణుల చేతికి నీటినీ ***ఓం ఏషవోఽర్ఘ్యం*** అంటూ ఆర్ఘ్యాన్నీ పూలనూ ఇవ్వాలి. ***'సిద్ధమిద మాసనం గృహ్యతాం'*** అంటూ వారిని ఆసనంపై గౌరవంతో కూర్చోబెట్టాలి. వారుకూడా ***'ఇహసిద్ధ మిద మాసనం'*** అని ప్రసన్నంగా చెప్పిన తరువాత ఓం భూః ఓం భువః ఇత్యాది సప్తవ్యాహృతులను పఠిస్తూ దేవ – బ్రాహ్మణులు తూర్పువైపూ పితర – బ్రాహ్మణులు ఉత్తరాభిముఖంగానూ కూర్చున్నారో లేదో చూసుకొని ఈ క్రింది మంత్రాన్ని మూడు మార్లు జపించాలి.

***ఓం దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ ।***
***నమః స్వధాయై స్వాహాయై నిత్యమేవ భవంతు తే ॥*** ***(ఆచార.. 218/6)***

తరువాత మాసం, పక్షం, తిథి, దేశం, పిత, పితామహుల నామగోత్రాలతో సంకల్పం చెప్పుకొని దానిని ***విశ్వేదేవ పూర్వకం శ్రాద్ధం కరిష్యే*** అని ముగించి, ***ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా*** మంత్రాన్నుచ్చరించాలి. పిమ్మట ***ఓం విశ్వేదేవానావాహయిష్యే*** అను మంత్రముతో ప్రార్థించి ఓం ఆవాహయ అని బ్రాహ్మణులాజ్ఞాపించగానే

***ఓం విశ్వేదేవా... ఓం ఓషధయః....***
***ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః ।***
***యే అత్ర విహితాః శ్రాద్ధే సావధానా భవంతుతే ॥*** ***(ఆచార.. 218/7)***

ఇత్యాది మంత్రాలతో శ్రాద్ధకర్త విశ్వేదేవుల నావాహన చేసి ***ఓం అపహతాసురా రక్షాం సి వేదిషదః*** అనే మంత్రాన్ని మూడు మార్లు చదివి యవలను జల్లాలి. ***ఓం పాత్రమహం కరిష్యే*** అని బ్రాహ్మణులవైపు చూసి వారి అనుజ్ఞను పొంది వారి చేత ***ఓం కురుష్వ*** అనిపించుకొని అగ్రభాగయుక్తాలైన రెండు కుశదర్భలను తీసుకోవాలి. వాటి పొడవు శ్రాద్ధకర్త బొటన వేలికీ చూపుడు వేలికీ మధ్య రెండూ బాగా సాగదీసినపుడున్నంత పొడవుండాలి. (ఈ పొడవునే శ్రాద్ధ పరిభాషలో 'ప్రదేశ'మంటారు) ***ఓం పవిత్రే స్థో వైష్ణవ్యౌ...*** ఇత్యాది మంత్రాలను చదువుతూ ఒక దర్భతో ఇంకో దర్భను ఛేదించాలి. ***ఓం విష్ణుర్మనసా పూతేస్థ*** అంటూ వాటిపై నీటిని చల్లి మరో దర్భను కలిపి వాటిని చుట్టి

అర్ఘ్య పాత్రలో వేసి వుంచాలి. ***ఓం శం నో దేవీ రభిష్టయ...*** అనే మంత్రాన్నుచ్చరిస్తూ ఆ పాత్రలో జలాన్ని పోసి ***ఓం యవోఽసి.....*** మంత్రంతో యవలనూ ***ఓం గంధద్వారాం దురాధర్షా........*** ఇత్యాది మంత్రంతో చందనాన్నీ వేయాలి. అపుడు ***ఓం యాదివ్యా ఆపః పయసా... ఓం ఏషోఽర్ఘ్యోనమః*** అనే మంత్రాలను చదువుతూ అర్ఘ్యపాత్రలోని నీటిని బ్రాహ్మణుల చేతిలో పోయాలి. కొంత జలాన్ని మిగిల్చి పవిత్రకాన్ని వేసి ఆ పాత్రను బ్రాహ్మణుల కుడి పక్కన పెట్టాలి. (ఊర్ధ్వముఖ కుశలపై పెట్టాలి)

తరువాత ***ఓం విశ్వేభ్యో దేవేభ్య ఏతాని గంధపుష్ప ధూప దీప వాసోయుగ్మ యజ్ఞోపవీతాని నమః*** అంటూ విశ్వేదేవులకు గంధాదులను సమర్పించి వాటి పూర్ణతను కోరుకుంటూ ***గంధాది దానమచ్ఛిద్రమస్తు*** అని ప్రార్థించాలి. అపుడు విశ్వేదేవుల ప్రతినిధులైన బ్రాహ్మణులు, తరువాత ఋత్విజుడైన బ్రాహ్మణుడు ***ఓం అస్తు*** అని, ప్రతినిధులు స్వీకరిస్తారు. అంతట శ్రాద్ధకర్త ***'పితృపితామహ ప్రపితా మహానాం మాతా మహ ప్రమాతా మహ వృద్ధ ప్రమాతా మహానాం సపత్నీకానాం శ్రాద్ధ మహం కరిష్యే'*** అంటూ శ్రాద్ధాన్ని పెట్టడాని కనుమతిని వేడగా బ్రాహ్మణులు **కురుష్వ** అని దానిని ప్రసాదించగా శ్రాద్ధకర్త ***ఓం దేవతాభ్యః పితృభ్యశ్చ.......*** అనే మంత్రాన్ని ముమ్మారు జపించాలి.

తరువాత పితరుల నామగోత్రాలనుల్లేఖిస్తూ ఇదమాసనం స్వధా అని చెప్పి ***ఓం పితౄన్ ఆవాహయిష్యే*** వాక్యం ద్వారా బ్రాహ్మణుల అనుజ్ఞను పొంది వారు ***ఓం ఆవాహయ అని చెప్పాక ఓం ఉశంతస్త్వా.....,*** ఆయాంతు ***నః పితరః ...*** ఇత్యాది మంత్రాలతో పితరులను ఆవాహన చేయాలి. ***ఓం అపహతాసురా రక్షా సి వేదిషదః*** అనే మంత్రాన్ని పఠిస్తూ తిలలను వికరణ★ చేయాలి. పూర్వం స్థాపించిన అర్ఘ్యపాత్రలో అదే క్రమంలో నీటినిపోసి ***ఓం తిలోఽసి సోమదేవత్యో...*** ఇత్యాది మంత్రాలతో తిలాదానం గావించాలి. తరువాత రెండు చేతులతోనూ గంధపుష్పాలను సమర్పించి పితృపాత్రను పైకి లేపి ***ఓం యా దివ్యా.....*** అనే మంత్రాన్ని పఠించి పిత్రాదుల గోత్ర నామాలను చెప్పి ఏష తే ర్ఘ్యః స్వధా, ***ఓం పితృభ్యః స్థానమసి*** అనే మంత్రాలతో పవిత్రీ సహితంగా అర్ఘ్య పాత్రను బోర్లించి పెట్టి ***ఓం శుంధంతాం లోకాః పితృసదనాః ...*** అనే మంత్రం చదువుతూ దానిని స్పృశించాలి.

అనంతరం పితృతీర్థంతో పిత్రాదుల ఆసనాలకు గంధ, పుష్ప, వస్త్రయుగ్మాదులనూ యజ్ఞోపవీతాదులనూ ధారవోసి గోత్రనామోచ్చారణ పూర్వకంగా సపత్నీకులైన

---

★*వికరణ = వెదజల్లుట*

పితృపితామహ ప్రపితామహులకు ***'ఏతాని గంధపుష్ప ధూపదీప వాసో యుగ్మసోత్తరీయ యజ్ఞోపవీతాని వః స్వధా'*** అనే మంత్ర వాక్యాన్ని చదివి పితృతీర్థం నుండి నీళ్ళు వదిలెయ్యాలి. ***గంధాది దానం అక్షయ్యం అస్తు*** అని శ్రాద్ధకర్త అనగానే బ్రాహ్మణులు ***సంకల్ప సిద్ధిరస్తు*** అని దీవిస్తారు. ఇలాగే మాతామహాదులకూ కూడా ఈ కర్మను చేసి ఈ దీవెనను పొందాలి. ***ఓం యా దివ్యా..*** అనే మంత్రంతో నేలను అలికి నేతిని కలిపిన అన్నాన్ని చేతబట్టుకొని సవ్యుడై శ్రాద్ధకర్త ***ఓం అగ్నౌ కరణమహాకరిష్యే*** అంటూ అనుమతికై బ్రాహ్మణుల వంక చూడాలి. పితర బ్రాహ్మణులు ***ఓం కురుష్వ*** అంటూ అనుజ్ఞ నివ్వగనే ***ఓం అగ్నయేక వ్యవాహనాయ స్వాహా*** అనే మంత్రంతో పితర ప్రతినిధి బ్రాహ్మణుల చేతుల్లో రెండేసి ఆహుతులను ఇవ్వాలి. మిగిలిన అన్నాన్ని పిండాలుగా చేసి ఒక సగాన్ని పితృపాత్రలోనూ మరొక సగాన్ని మాతృపాత్రలోనూ ఉంచాలి.

ఇందాక బోర్లించిన పాత్రపై ఇపుడు అన్నాన్ని వేస్తూ (అంతకుముందే ***ఓం పృథివీ*** తేపాత్రం .. తో నీళ్ళు జల్లాలి.) ***ఓం ఇదం విష్ణుర్విచక్రమే...*** అనే మంత్రాన్ని చదవాలి. అన్నం మధ్యలోకి బొటన వేలిని క్రిందికి పెట్టి ***విష్ణో హవ్యం రక్షస్వ*** అనాలి. ***ఓం అపహతాసురా రక్షాసి వేదిషదః*** మంత్రంతో మూడుమార్లు యవలనూ, ***ఓం నిహమ్మి సర్వం......*** అనే మంత్రంతో పసుపుపచ్చని ఆవాలనూ వికరణం చేయాలి. అపుడు ***ధూరిలోచన సంజ్ఞకే భ్యోదేవేభ్య ఏతదన్నం, సఘృతం సపానీయం సవ్యంజనంస్వాహా*** అనుచు విశ్వేదేవులకు అన్నాన్ని నివేదించి దానిపై సజల కుశపత్రాలనుంచి ***ఓం అన్నమిదం అక్షయ్యం అస్తు*** అని శ్రాద్ధకర్తా, ***ఓం సంకల్ప సిద్ధిరస్తు*** అని ప్రతినిధి బ్రాహ్మణులూ చెప్పాలి.

తరువాత జందెము నపసవ్యం చేసుకొని పిత్రాదిపాత్రలో నేతితో కలిపిన అన్నాన్ని వ్యంజన సహితంగా కలిపి దానిపై ఇంతకుముందు భూమిని శుభ్రపఱచి వుంచిన కుశలను వేయాలి. తరువాత పాత్రను స్పృశిస్తూ ***ఓం పృథివీతే పాత్రం...*** అనే మంత్రాన్నీ, బొటన వేలితో అన్నాన్ని ముట్టుకుంటూ ***ఓం ఇదం విష్ణుర్విచక్రమే...*** మరియు ***ఓం విష్ణోః కవ్యం రక్షస్వ*** అనే మంత్రాలనూ పఠించాలి. ***ఓం అపహతాసురా రక్షా సి వేదిషదః*** అనే మంత్రంతో అన్నంపై నువ్వులను జల్లి ఎడమ మోకాలిని నేలకి తగిలించి కూర్చుని ఈక్రింది మంత్రాన్నుచ్చరిస్తూ సపత్నీకులైన పితృపితామహాదుల నామగోత్రాలను శబ్దిస్తూ వారికి అన్నమును నివేదించాలి.

***అముక గోత్రేభ్యః అస్మత్ పితృపితామహేభ్యః సపత్నీకేభ్యః ఏతదన్నం సఘృతం సపానీయం సవ్యంజనం ప్రతిషిద్ధ వర్జితం స్వధా.***

తరువాత అన్నసంకల్పం చేసి ***ఓం ఊర్జం వహంతీ రమృతం..*** అనే మంత్రాన్నుచ్చరిస్తూ దక్షిణం వైపు తిరిగి నీటిని ధారపోయాలి. (అంటే అన్నాన్ని ధారపోసినట్టే) ***ఓం శ్రాద్ధమిదమచ్ఛిద్రమస్తు, ఓం సంకల్పసిద్ధిరస్తు*** అని శ్రాద్ధకర్తా, బ్రాహ్మణులూ ఘోషించాలి. అపుడు శ్రాద్ధకర్త ***ఓం భూర్భువఃస్వః ...*** అనే వ్యాహృతి మంత్రయుక్త గాయత్రిని ఉచ్చరించి దారాన్ని విసర్జించాలి. ఆ తరువాత ఓం ***మధువాతా...*** మంత్రాన్ని పఠించి ***మధు*** శబ్దాన్ని మూడుమార్లు ఉచ్ఛరించాలి. నేతిని కలిపిన అన్నంతో పిండాన్ని చేసి ***ఓం అముక గోత్ర అస్మత్పితః..*** ఇత్యాది వాక్యములతో కుశలపై పితరులకు పిండ ప్రదానం చేయాలి. పిండ సమీపంలో కొంత అన్నాన్ని జల్లి ***ఓం లేపభుజః పితరః ప్రీయంతాం*** అని చదువుతూ పిండాధారకుశలపై చేతితో నిమరాలి. ప్రక్షాళిత పిండజలంతో ***ఓం అముక గోత్ర అస్మత్పితః*** మున్నగు వాక్యాలతో పిండాలపై నీటిని చిలకరించాలి. పిండపాత్రను క్రిందికి వంచి దానికి చేతులు జోడించి నమస్కరిస్తూ ***ఓం పితరో మాదయ ధ్వం....*** అనే మంత్రాన్ని జపించాలి. తరువాత నీటిని పట్టుకొని ఎడమవైపు నుండి నీటిని గుండ్రంగా తిప్పుకొని జల్లుతూ ఉత్తరం వైపు తిరగాలి. మూడు మార్లు ఊపిరిని బలంగా పీల్చి ***ఓం షడ్భ్యఋతుభ్యోనమః*** అనే మంత్రాన్ని పఠించాలి.

తరువాత ఎడమవైపునుండి దక్షిణం వైపు గుండ్రంగా (వామావర్త) తిరుగుతూ భోజన పాత్రలో పూలనూ ***అక్షతంచారిష్టం చాస్తు........*** అనే మంత్రం చదువుతూ అక్షతలనూ వేయాలి. పైబట్టను తీసి చేతపట్టుకొని ***అమీమదంతః పితరో యథాభాగ మావృషాయిత*** అనే మంత్రం చదువుతూ చేతులు జోడించి ***ఓం నమోవః పితరోనమో వః ...*** అనే మంత్రాన్ని జపించాలి. నలువైపులా కలయజూసి గృహాన్నః పితరోదత్త అనాలి. ***సదావః పితరో ద్వేష్మః*** అని చెప్పాలి. ***ఏతద్వః పితరోవాస*** అని ప్రార్థించి ***అముక గోత్ర పితః ఏతత్తే వాసః స్వధా*** అనే వాక్యాన్ని చదువుతూ పిండంపై దారపు పోగునుంచాలి.

పిమ్మట నీటి పాత్రను ఎడమచేతిలోకి తీసుకొని ***ఊర్జం వహంతీ..*** అనే మంత్రంతో పిండంపై నీటిని పోయాలి. ఇదివఱకు పాత్రలో పెట్టిన పిండాలను కూడా తడపాలి. తరువాత పిండాలపై గంధాన్నీ కుశలనూ వేసి ***అక్షన్న మీమదంత...*** ఇత్యాది మంత్రాన్ని ముమ్మారు పఠించాలి. మాతామహాదుల ప్రతినిధి బ్రాహ్మణులచే ఆచమనం చేయించాలి. ***ఓం సుప్రోక్షిత మస్తు*** అంటూ శ్రాద్ధభూమిని బాగుగా కడిగి ***అపాం మధ్యే స్థితా దేవా సర్వమప్సు.......*** మరియు ***శివా ఆపః సంతు*** అని చెప్తూ బ్రాహ్మణుల చేతుల్లో నీళ్ళుపోయాలి. ***లక్ష్మీసరస్వతి...*** మున్నగు మంత్రాలను పఠించి ***ఓం సౌమనస్యమస్తు*** అనే మంత్రోచ్చాటనతో బ్రాహ్మణుల చేతులలో పూలనుంచాలి. తరువాత ***అక్షతం చాస్తు...***

ఇత్యాది మంత్రాలను పఠించి **అక్షతం చారిష్టం చాస్తు** అనే మంత్రోచ్చాటన చేస్తూ యవలనూ, నువ్వులనూ బ్రాహ్మణుల చేతుల్లో పెట్టాలి. ఆ పై ఈ క్రింది మంత్ర వాక్యంతో పిత్రాది బ్రాహ్మణులచేతులలో తిలలనూ నీటినీ పోయాలి. ***అముక [1]గోత్రాణా మస్మత్ పితృపితామహ ప్రపితా మహానాం సపత్నీకానా మిదమన్న పానాదిక మక్షయ్యమస్తు.*** బ్రాహ్మణులు వెంటనే అస్తు అని ఆశీర్వదిస్తారు. ఇలాగే మాతామహాదులకు కూడా చెయ్యాలి. తరువాత ***ఓం అఘోరాః పితరః సంతు, గోత్రం నో వర్ధతాం.... దాతారో నోఽభి వర్ధంతాం...*** ఇత్యాది మంత్రాలను పఠించాలి.

అనంతరం శ్రాద్ధకర్త బ్రాహ్మణుల అనుమతితో **2**అర్ఘ్య పాత్రలో పిండకాలకు బదులు పవిత్రకాలనుంచి, కుశనిర్మిత పవిత్రకాలతో పితర బ్రాహ్మణులను స్పృశిస్తూ **ఓం స్వధాం వాచయిష్యే** అని స్వధామంత్రాన్ని చదవడానికి అనుమతిని వేడి, పొంది ***ఓం పితృపితామహేభ్యోయథానామశర్మ భ్యః సపత్నీ కేభ్యః స్వధా ఉచ్యతాం*** అన్నపుడు బ్రాహ్మణులు **అస్తుస్వధా** అంటూ ఆమోదిస్తారు. అంతట ***శ్రాద్ధకర్త ఊర్జం వహంతీ రమృతం...*** అంటూ పిండంపై నీరు పోసి ***ఓం విశ్వేదేవా అస్మిన్ యజ్ఞే ప్రీయతాం.*** అంటూ దేవబ్రాహ్మణుల చేతులలో యవలనూ నీటినీ పోయాలి. వారు వెంటనే 'తృప్తి చెందాము' అనే భావాన్ని ***ఓం ప్రీయంతాం*** ద్వారా వ్యక్తం చేస్తారు. అపుడు కర్త ***ఓం దేవతాభ్యః ...*** అనే మంత్రాన్ని మూడుమార్లు జపించాలి.

శ్రాద్ధకర్త తన ముఖమును బాగా వంచి పిండ పాత్రను కుదిపి సవ్యుడై ఆచమనం చేసి తూర్పువైపుకి తిరిగి ***ఓం అముక గోత్రాయ అముక దేవ శర్మణే...*** ఇత్యాది మంత్రాల నుచ్చరిస్తూ దేవబ్రాహ్మణులకు దక్షిణలివ్వాలి. తరువాత పితృ బ్రాహ్మణుల అనుమతిని ★పొంది పిండాలపై పాలను పోయాలి. మరల పిండమును కదిపి తత్సమీపమందున్న అర్ఘ్యపాత్రను తిన్నగా పెట్టాలి. ***ఓం వాజే వాజే....*** అనే మంత్రంతో పిండాధిష్ఠాతలను విసర్జనం చేయాలి. **ఆమావాజస్య** మున్నగు మంత్రాలతో దేవబ్రాహ్మణులకూ **అభిరమ్యతాం** మంత్రంతో పితృ బ్రాహ్మణులకూ వీడ్కోలు చెప్పి, వారి అనుమతిని గైకొని పిండాలను ఆవులకూ ఇతరాలకూ ప్రదానం చెయ్యాలి. ఇది శ్రాద్ధవిధి.

దీనిని చదివినంత మాత్రాననే పాపాలు నశిస్తాయి. పితరులకు దీనివల్ల అక్షయ స్వర్గమూ, బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతాయి. ***(అధ్యాయం -218)***

---

*[1]ఈ అముక అనే మాట వున్నచోట గోత్రం పేరు చెప్పాలి. 'అముక' అనక్కర్లేదు.*

*★సౌమనస్యమస్తు, అస్తు అంటూ*

# నిత్య, వృద్ధి, ఏకోద్దిష్ట శ్రాద్ధాలు

నిత్య శ్రాద్ధ విధి ఇంతకుముందే చెప్పబడిన దానికి ఇంచుమించు సమానమే. ఇందులో విశ్వేదేవుల ప్రమేయముండదు. సంకల్పం ఇలా వుంటుంది.

*ఓం అముక గోత్రాణా మస్మత్పితృపితామ*
*హానాం అముక శర్మాణాం సపత్నీకానాం*
*శ్రాద్ధం సిద్ధాన్నేన యుష్మా స్వహం కరిష్యే*

ఇక వృద్ధి శ్రాద్ధవిధిని వినిపిస్తాను. ఈ వృద్ధి శ్రాద్ధాన్నే ఆభ్యుదయిక, మాంగలిక, నందీముఖ శ్రాద్ధమని కూడా వ్యవహరిస్తారు. ఇదివఅకు చెప్పినట్టుగానే కార్యక్రమం వుంటుంది. ఇందులోని ప్రత్యేకత యేమిటంటే పుత్రోదయమై ఆ పుత్రుని ముఖం చూడడానికి ముందే తండ్రి ఈ వృద్ధి శ్రాద్ధాన్ని పెట్టాలి. పూర్వాభిముఖంగా సవ్యంగా వుండి యవలు, బదరీఫలాలు, కుశదర్భలు వాడుతూ దీనిని చేయాలి. దేవతీర్థ, నమస్కార, దక్షిణాదులు పాత శ్రాద్ధాలలాగే వుంటాయి. యజమాని తన మోకాలిపై చేతిని వేసి ఆనందంగా చరుస్తూ విశ్వేదేవులను బ్రాహ్మణులపైకి ఆవాహన చేస్తూ వారితో 'దేవా! మా ఇంట పుత్రోదయమైన శుభసమయాన నా మాతృ, పితృపక్షాల పితరులకు శ్రాద్ధం పెట్టదలచుకొని, వసు, సత్య అనే పేళ్ళు గల విశ్వేదేవతలను మీపైకి ఆహ్వానిస్తున్నాను. అని ప్రార్థించి వారి అనుమతిని పొంది ***ఓం విశ్వేదేవా స ఆగత...*** అనే మంత్రాన్ని పూర్తిగా చదవాలి. అలాగే పితరులను కూడా పిలచి కూర్చోబెట్టాలి.

***ఓం వసు సత్యసంజ్ఞకేభ్యః...*** ఇత్యాదిగా దేవతలనూ, వారి వారి గోత్ర నామాలతో పితరులనూ కొలుచుకోవాలి. ఏకోద్దిష్ట శ్రాద్ధంలో విశేషమేమనగా ఈ క్రింది సంకల్పవాక్యాన్ని చదివి, బ్రాహ్మణుల అనుమతిని పొంది వారికి ఆసనాదిక మర్యాదలు చేయాలి.

*అద్య అముక గోత్రస్య మత్పితుర ముకదేవ*
*శర్మణః ప్రతిసాంవత్సరిక మేకోద్దిష్ట శ్రాద్ధం*
*సిద్ధాన్నేనయు ష్మాస్వహం కరిష్యే*

దీనిలోని మరొక ప్రత్యేక తరుచిరస్తవాదిక పఠనం. చివరగా దక్షిణం వైపు తిరిగి అపసవ్యమై మిగిలిన అన్నాన్ని ***అగ్నిదగ్ధాశ్చ......*** తో మొదలయ్యే మంత్రాన్ని చదువుతూ అగ్నికర్పించాలి. తరువాత ***అముక గోత్రమత్పితః....*** అని చెప్తూ మండలరేఖపై జలాన్ని కుమ్మరించాలి. ***(అధ్యాయం -219)***

---

★*ఓం పిండాః సంపన్నాః, ఓం సుసంపన్నాః*

# సపిండీకరణ శ్రాద్ధవిధి

మనిషి మృతి చెందిన ఏడాదికి అదేతిథినాడు ఈ శ్రాద్ధాన్ని పెట్టాలి. [1]దీనిని పద్ధతిగా సరైన సమయంలో చేస్తే ప్రేతానికి పితృలోక ప్రాప్తి కలుగుతుంది.

సపిండీకరణ శ్రాద్ధాన్ని అపరాహ్ణంలో పెట్టాలి. నియమాలు చాలావఱకు ఇతర శ్రాద్ధాలలాగే వుంటాయి. అవికాక అదనంగా వున్నవే ఇక్కడ చెప్పబడు తున్నాయి. పితామహాదుల ప్రతినిధి బ్రాహ్మణుల నాహ్వానించినపుడు

***ఓం పురూరవో మాద్రవ సంజ్ఞ కేభ్యో.......*** అనే మంత్రాన్నుచ్చరిస్తూ వారిని వామ పార్శ్వమందున్న ఆసనాలపై కూర్చుండబెట్టి పురూరవ మాద్రక[2] నామకులైన విశ్వేదేవులను ఆవాహన చేయాలి. ***పితామహ ప్రపితామహానాం...*** ఇత్యాది వాక్యాన్ని చదివి వారి ప్రతినిధి బ్రాహ్మణుల అనుజ్ఞను పొంది మూడు పాత్రలను స్థాపించాలి. వాటిపై కుశదర్భలనుంచి ఆ పాత్రలపైనను, చుట్టునూ వేరే పాత్రలనుంచాలి. అన్య శ్రాద్ధాలలాగే అచ్ఛిద్రావ ధారణ[3]దాకా చేయాలి. తరువాత దేవపాత్రాచ్ఛి ద్రావధారణ[4] చేయాలి. తరువాత యథావిధి క్రియను నడిపించి ఈ మూడు పాత్రలనూ పైకి తీసి ***ఓం యే సమానాః సమనసో.......*** ఇత్యాది మంత్రంతో పితృపాత్రలోని జలాన్ని పితామహ, ప్రపితామహపాత్రలలో పోయాలి. పవిత్రకాలతో సహా మిగతా ఇద్దరి పాత్రలలోని జలాలను పితృపాత్రలో పోయాలి. తరువాత పితృబ్రాహ్మణుని చేతిలో అర్ఘ్యపాత్రలోని పవిత్రకాన్ని తీసి వుంచి ఆయన తలపై, చేతులలో, పాదాలపై, ఆ పాత్రలోని పూలనే, సమర్పించాలి. తరువాత ఆయన చేతిలో నీటిని పోసి శ్రాద్ధకర్త తన రెండు చేతులతో అర్ఘ్యపాత్ర నెత్తి పట్టుకొని ఓం ***యాదివ్యా... అముక గోత్రమత్పితా మహ...*** ఇత్యాది మంత్ర వాక్యాలను పఠిస్తూ పితృపాత్రలోని కొంత అర్ఘ్యోదకాన్ని పితామహ ప్రతినిధి చేతులలోపోయాలి. పవిత్రక సహితంగా పరిశిష్ట జలాన్ని పాత్రలో నుండి తీసి వేరే పాత్రలో పోసి దానిని

---

*[1]దీనిని న్యాయంగా సాంవత్సరిక శ్రాద్ధమనాలి. గాని జనం సంవత్సరీకాలు అంటుంటారు.*

*[2]బనార్సీదాస్ ప్రచురణలో మాద్రకకి బదులు ఆద్రవ అనే పేరుంది.*

*[3]పితరులకుద్దేశింపబడిన కర్మకాండ వారికి తృప్తికరంగా చేయబడాలని అందరినీ ప్రార్థించుటనే 'అచ్ఛిద్రావధారణ' మంటారు.*

*[4]అర్ఘ్యపాత్రకు ఎక్కడా కన్నాలు గాని పగుళ్ళు గాని లేకుండా పలుమార్లు పరీక్షించుకొను క్రియనే 'దేవపాత్రాచ్ఛి ద్రావధారణ' మంటారు.*

ఇతర పాత్రల మధ్య దాచాలి. పితృబ్రాహ్మణుని వామపార్శ్వంలోని దక్షిణాగ్రకుశపై ఈ పాత్రను బోర్లించి పెట్టాలి.

తరువాత పితామహాదులను గంధాదులతో సత్కరించి అగ్నౌకరణ★ చేసి అవశిష్ట అన్నాన్ని పితరుల పాత్రలలో వేయాలి. ఇలా, ఆ తరువాత, ఇతర శ్రాద్ధ కర్మలనే అనుసరిస్తూ బ్రాహ్మణులకు ఆచమనాన్ని తాంబూలాన్నీ ఇవ్వాలి. అపుడు శ్రాద్ధకర్త ***'సుప్రోక్షితమస్తు, శివాఆపః సంతు'*** అనే రెండు మంత్రాలనుచ్చరిస్తూ వృద్ధప్రపితా మహాది క్రమంలో బ్రాహ్మణుల చేతులలో జలప్రదానం చేస్తూ పితృ బ్రాహ్మణుల చేతులలో ***గోత్రస్యాక్షయ్యమస్తు*** అనాలి. తరువాత వారి చేతులలో తిలలతో కూడిన జలాన్ని పోస్తూ ***ఉపతిష్ఠతాం*** అనాలి.

ఆ తరువాత ***అఘోరాః పితరః సంతు*** అనే వాక్యాన్ని శ్రాద్ధకర్త ఉచ్చరించగా ***అస్తు*** అని బ్రాహ్మణులు అంటారు. అలాగే ***స్వధాం వాచియిష్యే*** అనగానే వారు ***ఓం వాచ్యతాం*** అంటూ అనుజ్ఞనిస్తారు. కర్త ***'పితామహాదిభ్యః స్వధా ఉచ్యతాం'*** అనగానే వారు ***అస్తుస్వధా*** అని అంటారు. అలాగే ***పితృభ్యః స్వధా ఉచ్యతాం*** అన్నపుడు కూడా అనుజ్ఞనిస్తారు.

తరువాత శ్రాద్ధకర్త ***ఓం ఊర్జంవహంతీ..*** ఇత్యాది మంత్రంతో దక్షిణంవైపు తిరిగి జలధారనిచ్చి ***ఓం విశ్వేదేవా అస్మిన్ యజ్ఞేప్రీయంతాం*** అనే మంత్రాన్ని చదువుతూ దేవబ్రాహ్మణుల చేతులలో యవలనూ నీటిని అర్పించి ***ఓం దేవతాభ్య...*** అనే మంత్రాన్ని మూడుమార్లు పఠించాలి. పిండపాత్రలను కదిలించి ఆచమన పూర్వకంగా బ్రాహ్మణులకు పితామహాది క్రమంలో దక్షిణలివ్వాలి. ***ఆశిషోమే ప్రదీయం తాం*** అనే వచనంతో ఆశీర్వాదాన్నర్థించాలి. బ్రాహ్మణులంతట ***ప్రతి గృహ్యేతాం*** అంటారు. తరువాత ***దాతారోనోభి వర్ధంతాం..*** మున్నగు మంత్రాలను చదివి అర్ఘ్యపాత్రను పైకెత్తి పట్టుకొని ***వాజే వాజే*** ఇత్యాది మంత్రాలతో దేవబ్రాహ్మణులనీ, ***అభిరమ్యతాం*** అనే మంత్రంతో పితృబ్రాహ్మణులనీ విసర్జించాలి. (అంటే వీడ్కొల్పాలని అర్థం)

శ్రాద్ధము, శ్రాద్ధకర్త, శ్రాద్ధఫలం ఈ మూడూ విష్ణురూపాలే నని, బ్రహ్మదేవుడు వ్యాసమహర్షికి తెలిపాడు. ***(అధ్యాయం -220)***

---

★ *అగ్నౌకరణ ఒక విశిష్ట విధి. ఇందులో అపసవ్యమై నీటిలోకి రెండు ఆహుతులను మంత్రపూర్వకంగా ఇస్తారు.*

# ధర్మసారం

"ఇది బ్రహ్మశంకరునికి బోధించినది" అంటూ సూతుడు మహామునులకిలా చెప్పసాగాడు. "శంకరా! అన్ని పాపాలనూ అగ్నిలో తోసేదీ, 'ఇక్కడ' భోగాన్నీ, 'అక్కడ' మోక్షాన్నీ నరులకు కలిగించేదీ, చీకటి మనసును వెలిగించేదీ అగు అతిశయ సూక్ష్మమైన ధర్మసారాన్ని సంక్షిప్తంగా అందిస్తాను, వినండి.

శోకం మనిషికి అన్నిటికన్న పెద్ద శత్రువులలో నొకటి. అది శాస్త్రీయ జ్ఞానాన్నీ, ధర్మాన్నీ, బలాన్నీ, ధైర్యాన్నీ, సుఖాన్నీ, ఉత్సాహాన్నీ మంటగలిపేస్తుంది. కాబట్టి ఎంత కష్టం వచ్చినా ఏడువరాదు.

మనిషికి కర్మయే సర్వస్వము. అదే స్త్రీ, అదే లోకం, అదే బంధువు, అదే సుఖ, దుఃఖాలకు కారణము కాబట్టి ఉత్తమ కర్మలను మాత్రమే చేపట్టి సుఖించాలి.

ధర్మాలలో పరమధర్మం దానమే.

***దానమేవ పరో ధర్మో దానాత్సర్వమవాప్యతే***
***దానాత్ స్వర్గశ్చ రాజ్యంచ దద్యాద్దానం తతో నరః ॥*** ***(ఆచార.. 221/4)***

దానం వల్లనే మనిషికి అన్ని కోరికలూ తీరగలవు. దానమేస్వర్గాన్నీ రాజ్యాన్నీ కూడా ప్రదానం చేయగలదు. కావున ఎవరి పరిధిలో వారు, దానం మాత్రం చేస్తుండాలి. విధిపూర్వక ప్రశస్త దక్షిణగానిచ్చు దానము భయభీతుడైన వాని ప్రాణరక్షణము అ రెండూ సమానమే. విధ్యుక్తమైన తపస్సు, బ్రహ్మచర్యం, వివిధ యజ్ఞాలు, స్నానాలు – వీటివల్ల ఎంత పుణ్యం వస్తుందో భయభీతులైన వారి ప్రాణ రక్షణ వల్ల అంత పుణ్యం వస్తుంది. హోమ, జప, స్నాన, దేవతార్చనాది సత్కార్య తత్పరులై సత్య, క్షమ, దయాది సద్గుణాలతో జీవించేవారు స్వర్గప్రాప్తి నొందుతారు.

***యే చ హోమజప స్నానదేవతార్చన తత్పరాః ।***
***సత్యక్షమా దయాయుక్తా స్తేనరాః స్వర్గగా మినః ॥*** ***(ఆచార.. 221/7)***

మానవమాత్రులెవరూ మరొకరిని సుఖపెట్టడానికి గాని బాధపెట్టడానికి గాని శక్తి గలవారు కానేరరు. అలాగే ఇతరుల సుఖదుఃఖాలను తాము తీసుకుని తమ సుఖదుః ఖాలను వారికిచ్చుటకూ సమర్థులుకారు. ఎవరి కర్మను వారనుభవించడం లో భాగమే వారికి కలిగే సుఖదుఃఖాలు.

*నదాతా సుఖదుఃఖానాం నచ హర్తాస్తి కశ్చన ।*
*భుంజితే స్వకృంతాన్యేవ దుఃఖానిచ సుఖానిచ ॥* (ఆచార.. 221/8)

ధర్మరక్షణ కోసం తన జీవితాన్నే దానం చేసినవాడు అన్ని కష్టాలనూ దాటుకొని పోగలడు. ఎవని మనసైతే నిత్యసంతుష్టమై వుంటుందో అతడు ఫల, మూల, శాకాదులనే తింటూ కూడా సుఖానుభూతినొందగలడు.

*ధర్మార్థం జీవితం యేషాం దుర్గాణ్యతి తరంతి తే ।*
*సంతుష్టః కోన శక్నోతి ఫలమూలైశ్చ వర్తితుం॥* (ఆచార.. 221/9)

సుఖాన్ని కోరుకుంటూ దానికోసం లంపటం నెత్తికెక్కించుకొని సంకటంలో పడతారు సామాన్యజనం. ఇది లోభం పరిణామమే. ★ఈ లోభం ఒకసారి మనసులో దూరితే ఇక అంతే. మనిషి బతుకు జారుడు మెట్లమీద పడ్డట్లే. ఇక దాని నుండి క్రోధం హింసా ప్రవృత్తి, మోహం,మాయ, గీర, ఈసు, రాగద్వేషాలు, అసత్య భాషణం, మిథ్యాచరణం ఇవన్నీ పుట్టుకొస్తాయి. కాబట్టి లోభాన్ని వదలుకుంటే పాపాన్ని వదులుకున్నట్టే. లోభి కానివాడే దేహాంతంలో స్వర్గగామి కాగలడు.

హే మహాదేవా! ధార్మికులను దేవతలు, మునులు, నాగులు, గంధర్వులు, గుహ్యక గణాలూ కూడా గౌరవిస్తారు, పూజిస్తారు. ధనాఢ్యుడు, కాముకుడునగు వానిని నరులే పూజింపరు.

*దేవతామునయో నాగా గంధర్వా గుహ్యకా హర ।*
*ధార్మికం పూజయంతీ హ న ధనాఢ్యం న కామినం॥* (ఆచార..221/13)

ఎవరైనా (ఇతరులు) తమ అనంత బల వీర్య ప్రజ్ఞా పౌరుషాలను సాధనాలుగా ఆయుధాలనుగా వాడుకొని గొప్ప ఫలాన్ని పొందినపుడు ఎవరూ ఈర్ష్యపడరాదు. ఏడ్చుకోరాదు.

అన్ని ప్రాణుల పట్లా దయాభావమును పెంచుకొనుట, ఇంద్రియాలను అదుపులో నుంచుకొనుట, ఏదీ శాశ్వతం కాదనే ఊహని లోలోన పదిలించుకొనుట పరమ శ్రేయస్కరం. దుఃఖాన్ని వదిలించుకొనుటకిదే మార్గము. మృత్యువు తప్పదని తెలిసికూడా ఆశ, లోభం పెంచుకొని ధర్మాచరణకు పూనుకోని వాని బతుకు మేక మెడ చన్నువలె దండగే.

---

★ *లోభాత్ క్రోధః ప్రభవతి లోభాద్ ద్రోహః ప్రవర్తతే*
*లోభాన్ మోహశ్చ మాయాచ మానో మత్సర ఏవ చ ॥*
*రాగద్వేషానృత క్రోధ లోభ మోహ మదోజ్ఝితః*
*యః సశాంతః పరంలోకం యాతి పాప వివర్జితః॥* (ఆచార..221/11,12)

*సర్వసత్త్వ దయాలుత్వం సర్వేంద్రియ వినిగ్రహః ।*
*సర్వత్రా నిత్యబుద్ధిత్వం శ్రేయః పరమిదం స్మృతం ॥*

*పశ్యన్నివాగ్రతో మృత్యుం యో ధర్మనాచరేన్నరః ।*
*అజాగలస్తన స్యేవ తస్య జన్మనిరర్థకం ॥ (ఆచార... 221/15,16)*

అన్ని దానాల్లోకి అన్నదానం, గోదానం పరమశ్రేష్ఠాలు. న్యాయార్జిత ధనంతో గోవును కొని దానం చేసిన వానితో బాటు వాని కుటుంబమంతా తరిస్తారు. అన్నదాన ఫలానికిక సాటియే లేదు.

*నగోదానాత్పరం దానం కించి దస్తీతి మే మతిః ।*
*యా గౌర్ న్యాయార్జితా దత్తా కృత్స్నం తారయతే కులం ॥*

*నాత్ర దానాత్పరం దానం కించి దస్తి వృషధ్వజ ।*
*అన్నేన ధార్యతే సర్వం చరాచరమిదం జగత్ ॥*

నిజానికి పరమ పుణ్యప్రదాలైన దానాలు చాలానే వున్నాయి. కన్యాదానమనీ, వృషోత్సర్గమనీ, భూదానమనీ, సువర్ణదానమనీ, జపదానమనీ, గోదానమనీ కానీ అన్నదానపుణ్యం వీటికి పదహారు రెట్లు గొప్పది. ఎందుకంటే అన్నంలోంచే ప్రాణం, తేజం, వీర్యం, ధృతి, స్మృతి అన్నీ పుట్టుకొస్తాయి. మరొక గొప్పదానం వాపీ, కూప, తటాక, ఉపవనాలను నిర్మించి జీవుల సేదతీర్చడం. ఈ దానాల వల్ల ప్రాణులు సంతృప్తి చెందితే ఆ నిర్మాత లేదా దాత విష్ణు లోక ప్రాప్తి నొందుతాడు. అంతేకాక అతని ముందలి ఇరువది యొక్క తరాలవారు ఉద్ధరింపబడతారు.

*కూపవాపీత డాగాదీ నారామశ్చైవ కారయేత్ ।*
*త్రిసప్త కులముద్ధృత్య విష్ణులోకే మహీయతే ॥ (ఆచార.. 221/22)*

సాధుజనులను దర్శించినంత మాత్రముననే అతిశయపుణ్యం లభిస్తుంది.

*సాధూనాం దర్శనం పుణ్యం తీర్థాదపి విశిష్యతే ।*
*కాలేన తీర్థం ఫలతి సద్యః సాధు సమాగమః ॥ (ఆచార.. 221/23)*

సత్యం, దమం, తపస్సు, శౌచం, సంతోషం, క్షమ, సరళత, జ్ఞానం, శమం, దయ, దానం ఇవన్నీ కలిసి సనాతన ధర్మమేర్పడింది.

*సత్యం దమస్తపః శౌచం సంతోషశ్చక్షమార్జవం ।*
*జ్ఞానం శమో దయాదానం ఏషధర్మః సనాతనః (ఆచార 221/24)(అధ్యాయం -221)*

# ప్రాయశ్చిత్తం, చాంద్రాయణం, మరికొన్ని వ్రతాలు, పంచగవ్య విధానం

పాపాలకు ఫలితం నరకప్రాప్తే అయినా కొన్ని పాపాలకు పశ్చాత్తాపపడి ప్రాయశ్చిత్తం చేసుకొని ఇంకెన్నడూ ఏపాపమూ చేయకుండా వుంటే నరకవాసం తప్పవచ్చు. తగ్గవచ్చు. ఆ ప్రాయశ్చిత్తాలను చెప్తాను.

ఈగ, జలకణం, స్త్రీ, నేలనుండి ఊరుజలం, అగ్ని, పిల్లి, ముంగిస ఇవి ప్రాయశ్చిత్తానికి సంబంధించినంతవఱకూ పవిత్రంగా పరిగణింపబడతాయి.

ఉచ్ఛిష్టము అనగా నైవేద్యం పెట్టకుండా పాత్రలోని సిద్ధాన్నమును కొంత తొలగించగా మిగిలిన అన్నమును★ తిన్నవారు ఒక పగలు, ఒక రాత్రి ఉపవాసం చేసి పంచగవ్య ప్రాశ్నం చేస్తే శుద్ధులవుతారు. బ్రాహ్మణోచ్ఛిష్టమును వేరొక బ్రాహ్మణుడు తింటే అతడు స్నాన,జప, ఏకాహ ఉపవాసం చేయాలి. తలవెంద్రుక అశుద్ధి. అది లోనికి వెళితే వెంటనే వాంతి చేసుకోవాలి. ఒక చేతిలో ఏద్దైనా పదార్థాన్ని పెట్టుకొని రెండవ చేతితో తినుట, వేళ్ళను నాకుట అపవిత్ర కార్యములు. ఈ పని చేసిన వారు వెంటనే నీరుత్రాగి స్నానం చేయాలి. అలా చేయలేకపోతే ఒక పగలూ, ఒక రాత్రీ ఉపవాసముండి పోవాలి. ఒకరు త్రాగగా చిన్న పాత్రలో మిగిలిన నీటిని గాని ఎడమచేతిలో నున్న నీటిని గానీ త్రాగుట మదిరాపాన మంతటి మహాపాపము.

పగలు స్నానం చేయని వారే శూద్రులని అనుకున్నాము కదా! వీరు కాక రోజుల తరబడి స్నానం చేయని వారిని పంచములనే వారు. ఈ శూద్రులుగాని పంచములుగాని బ్రాహ్మణ గృహంలో ప్రవేశిస్తే ఆ గృహస్థు క్రమంగా ప్రాజాపత్య, చాంద్రాయణ వ్రతాలను చేయాలి. వారు పొరపాటున భోజనం కూడా చేస్తే ఆ గృహస్థు అర్ధకృచ్ఛ్రవ్రతాన్ని ఆచరించాలి. ఆనాడు భోజనం చేసిన ఇతర బ్రాహ్మణులు కృచ్ఛ్రవ్రతంలో చతుర్థాంశమును చేయాలి.(స్నానము చేయని మనిషి ఎవరైనా వారి శరీరంలో నుంచి వచ్చే సూక్ష్మక్రిమి వ్యాపకత్వం వల్ల అనారోగ్య కారకులవుతారు. కృచ్ఛ్రవ్రతం వల్ల ఆ క్రిములు నశిస్తాయి)

అజ్ఞాన వశాన చండాలుని (ఈ చండాలురనునది ఒక కులమో వర్ణమో కాదు. మృగాలను వేటాడి తినేవారు, కుక్కలనూ, మద్యమాంసాలనూ విక్రయించేవారిని పురాతన కాలంలో చండాలురనేవారు. వీరు సంఘబహిష్కృతులై పొలిమేరల్లోనో అడవుల్లోనో వుండేవారు. ఊరిలో కులవృత్తి చేయక న్యాయానికీ ధర్మానికీ తలవంచని ద్విజులను

---

★*ఈ పదానికి ఎంగిలి, శూద్రులు ముట్టిన అన్నము అనే అర్థం. తరువాత వచ్చింది. పగలంతా స్నానం చేయకుండా శ్రమించి సాయంత్రం మాత్రమే చేసేవారిని శూద్రులనేవారు. ఇది కులవాచకం కాదు. (అను)*

కూడా సంఘం బహిష్కరించగా వారు పోయి కొన్నాళ్ళకు చండాలురయే వారు. ఇది అప్పట్లో వర్ణమూ కాదు. తరువాత కులమూ కాదు.) చేత నీయబడిన అన్నమును తిన్న బ్రాహ్మణుడైతే సంపూర్ణ(ఐందవ) చాంద్రాయణ వ్రతాన్ని చేస్తే గాని శుద్ధుడు కానేరడు. క్షత్రియుడైతే ఆరురోజులూ, వైశ్యుడైతే రెండురోజులూ సాంతప వ్రతాన్ని చేసుకోవాలి.

మద్యాదులచే అశుద్ధమైన పాత్రలోని నీటిని త్రాగిన బ్రాహ్మణుడు కృచ్ఛ్రపాద వ్రతాన్ని గావించి శుద్ధుడు కాగలడు. పిడుగు, అగ్నిప్రమాదం, పెనుగాలి వంటి ఉపద్రవాల కారణంగా బ్రాహ్మణుడు అంత్యజునింటిలో నివసించవలసివస్తే ఆయన పరిస్థితులు చక్కబడగానే మూడు కృచ్ఛ్రాలనూ మూడు చాంద్రాయణ వ్రతాలను చేయాలి. శూద్ర, శ్వాన స్పర్శచే దూషితమైన అన్నమును భుజించినవారికి ప్రాయశ్చిత్తంగా ఏకదినరాత్రోపవాసమూ, పంచగవ్య ప్రాశ్నయూ విధించబడ్డాయి. వర్ణ బహిష్కృతుని బ్రాహ్మణుడు స్పృశిస్తే అతడు అయిదు రాత్రులుపవాసం చేయాలి. నిరంతరం పారే నీటినీ, బాలురను, గాలిచే నెగురగొట్టబడిన ధూళిని, స్త్రీలను, వృద్ధులను బ్రాహ్మణులు మడిలో నున్నపుడు తగిలినా దోషము లేదు. స్త్రీముఖము, పక్షులచే జారవిడువబడిన పండ్లు, కడుపుతో నున్న ఆవు నుండి బయటికి వస్తున్న దూడ, జంతువులను వేటాడుతున్న కుక్క నిత్య పవిత్రాలు. నీటిలో గాని నేల తవ్వకంలో గాని లభించిన వస్తువులు పవిత్రాలు. ధార్మిక కృత్యంలో నున్న బ్రాహ్మణునికి ఎవరి కాలైనా తగిలితే ఆ అశుద్ధి ఆచమనం ద్వారా నశిస్తుంది.

కంచుపాత్ర మద్యం కాని వస్తువు కారణంగా అపవిత్రమైతే పవిత్ర భస్మంతో తోమి కడిగితే పనుకొస్తుంది. మూత్రం, మద్యాలతో అపవిత్రమైన పాత్రను అగ్నిలో వేస్తేగాని పనికిరాదు. ఆవు, శూద్రులు, కుక్కలు ముట్టుకున్న పాత్రలను పవిత్ర భస్మంతో పదిమార్లు తోమి కడిగి మళ్ళా వాడుకోవచ్చు. శూద్రుడు వాడిన పాత్రలోని భోజనాన్ని బ్రాహ్మణుడు తింటే మూడు పగుళ్ళు ఉపవాసం చేసి పంచగవ్యాలను త్రాగాలి. ఉచ్ఛిష్టాన్నీ, స్నానం చేయనివానినీ, కుక్కనూ తాను మడిలో వుండగా తాకిన బ్రాహ్మణుడు కూడా మూడు పగళ్ళుపవసించి పంచగవ్యపానం చేయాలి. రజస్వలను ముట్టుకుంటే ఒక రాత్రి ఉపవసించి పంచగవ్యప్రాశ్నం చేయాలి. మజ్జిగతేట, పెరుగు, పాలు, గంజి, కృసరాన్నం వీటిని శూద్రుని నుండి కూడా గ్రహింపవచ్చును. తేనెను ఎవరినుండైనా తీసుకొనవచ్చును. మద్యపానం చేసే బ్రాహ్మణునికి నిష్కృతిలేదు. కొంతమంది అగ్నికంటె నెక్కువ వేడిమిని గలిగి సల సల కాగుతున్న మద్యాన్ని తాగితే శుద్ధి కలుగవచ్చని అంటారు. సూతక

గృహాలలో అనగా జననం లేదా మృతి కలిగి శుద్ధి కాని ఇంట్లో బ్రాహ్మణుడు భోజనం చేస్తే అయిదు వందలమార్లు, క్షత్రియుడు చేస్తే మూడువందల మార్లు గాయత్రిజపం చేయాలి. సూతక గృహం నుండి వచ్చిన పాత్రలో నీరు త్రాగినా ఇదే ప్రాయశ్చిత్తం. సూతక గృహాలలో శుద్ధి వర్ణక్రమంలో పది, పన్నెండు, పదిహేను, ముప్పది రోజుల తరువాత కలుగుతుంది. యుద్ధంలో రాజు,యజ్ఞదీక్షలో బ్రాహ్మణుడు పరదేశంలో సర్వవర్ణులు మరణించినట్లు తెలియగానే స్నానం చేస్తే వెంటనే శుద్ధి అవుతుంది. ఒకనెలలోపల మరణించిన శిశువు గలవారు స్నానం చేయగానే శుద్ధులైపోతారు. అవివాహిత కన్య, వడుగు ఇంకా కాని మగవాడు మూడేళ్ళ ఆడపిల్ల, పళ్ళూడి ఇంకారాని మగపిల్లాడు మృతిచెందితే ఆ ఇంట్లో మూడు రాత్రుల దాకా అశుచి వుంటుంది. గర్భస్రావానికీ అంతే అశుచి. బాలెంతలకు పదిరోజుల అశుచి వుంటుంది. దీక్షాకాలంలో, వివాహం నిశ్చయమైన ఇళ్ళలో ఏం జరిగినా సూతకముండదు. శుద్ధి అవసరం లేదు. సూతక గృహాల్లో కూడా అగ్నిహోత్రం (ఆవాహనం) వేదపఠన, పాఠనాలూ, వైశ్వదేవం, యజ్ఞాదిధార్మిక కృత్యాలు జరుగుతున్న భాగానికి అశుచి అంటదు.

అశుద్ధ గృహంలో భోజనం చేసిన బ్రాహ్మణుడు మూడు రాత్రులుపవసించిన శుద్ధుడు కాగలడు. ఏ వర్ణం వారైనా స్త్రీ రజస్వల యైనపుడు ఒకరినొకరు ముట్టు కోవలసివుంటుంది. అట్టి సందర్భాలలో బ్రాహ్మణి, మూడు రాత్రుల, రాణి రెండు రాత్రుల వైశ్యిని ఏకరాత్ర ఉపవాసాల తరువాత శుద్ధులవుతారు. శూద్ర స్త్రీ వెంటనే స్నానం చేసి శుద్ధురాలు కావచ్చు.

కుక్క, నక్క, కోతి నూతిలో పడిపోతే ఆ నీరు త్రాగిన అగ్రవర్ణాలవారు క్రమంగా మూడు, రెండు, ఒక దినాల ఉపవాసం తరువాతే శుద్ధులవుతారు. ఎముక, తోలు, ఎలుక లాటివి నూతితో పడివుంటే వాటినీ, వాటితోబాటు కొంత నీటినీ బయటికి తోడి పంచగవ్యాలను నూతిలో తగు మాత్రంగా పోసి శుద్ధిచేయాలి. తటాక, పుష్కరిణ్యాదుల జలాలు దూషితమైతే ఆ వస్తువును తొలగించి ఆరుకడవల నీటిని ఆ ప్రాంతం నుండి తీసి పారేసి, భస్మమును అంతటా జల్లి పంచగవ్యాలను పొయ్యాలి. రజస్వల విషయంలో ముప్పది కుండల నీటిని తోడి పారబోయాలి.

నిషిద్ధ స్త్రీ సంగమం, గోమాంస భక్షణం, మద్యసేవనం వంటి మహాపాతకము లను చేసి పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న చాతుర్వర్ణ్యులు క్రమంగా చాంద్రాయణ, ప్రాజాపత్య, సాంతపన, పంచదినోపవాస వ్రతాలు చేస్తే కొంత పాపశాంతి తరువాత గోదానం, అన్నదానం చేస్తే మరికొంత పాపదగ్ధము కలుగవచ్చు.

పశువును కట్టడి చేయడానికని దాని ముందరి కాళ్ళకు బంధం వేయడం మహాపాపం. ఇదేకాక ఇక ఏవిధమైన హింస వల్ల ఏ పశువు మరణించినా ఆ మనిషికి పాపం గట్టిగానే తగులుకుంటుంది. అతడు కృచ్ఛ్రపాదవ్రతం చేసి జీవితాంతమూ పశువులను ప్రాణప్రదంగా కాపాడుకుంటే ఆ పాపం దగ్ధమైపోతుంది. ఆవు ఎముకను గాని కొమ్మును గాని విరిచినా చర్మంపై రక్తం కారేటట్టు కొట్టినా, తోకను కోసినా అంటుకునే పాపం సామాన్యమైనది కాదు. అది పదిహేను రోజులపాటు 'యావాక' (బార్లీ) పానకమును మాత్రమే త్రాగుతూ బతికితేనే పోతుంది. ఇతర జంతువులను ఈ విధంగా హింసిస్తే దానికి ప్రాయశ్చిత్తం కృచ్ఛ్రవ్రతం.

తొలిరోజు ఏకభుక్తం, మలిరోజు నక్తవ్రతం, మరునాడు అయాచిత వ్రతం ఈ మూడిటినీ కలిపి పాదకృచ్ఛ్రవ్రతమంటారు. దీనికి రెట్టింపు ప్రాజాపత్యవ్రతమైతే, దానికొకరోజును కలిపి ఆనాడు కటిక ఉపవాసం చేయడం కృచ్ఛ్రవ్రతమవుతుంది. దీనిని మహాసాంతపనవ్రతమని కూడా అంటారు. మూడురోజుల పాటు వేడి నీటిని మాత్రమే తీసుకుంటూ, తరువాత మూడురోజులు వేడి పాలు మాత్రమే త్రావుతూ మరొక మూడురోజులు వేడి నేతిని మాత్రమే ప్రాశ్నిస్తూ చేసే ఉపవాస వ్రతానికి తప్తకృచ్ఛ్రవ్రతమని పేరు. ఇది సమస్త పాపాలనూ హరించగలదు. పన్నెండు రోజుల పాటు నీటిని మాత్రమే త్రాగుతూ చేస్తే ఉపవాసవ్రతం పరాకవ్రతం. ఇది సర్వపాప వినాశకరం. శుక్ల పాడ్యమి నాడు కొంచెం (గ్రాసం పరిమాణం) అన్నం తిని రోజుకొక గింజ పెంచుకుంటూ పోయి పున్నమి దాకా అలాగే చేసి మరునాటి నుండి ఒక్కొక్క గింజ తగ్గించుకుంటూ తిని అమావాస్య నాడు ఏమీ తినకుండా వుండడం చాంద్రాయణ వ్రతం. ఈ నెలరోజులలోనూ రోజులో ఒక్కమారే తినాలి.

ప్రశస్తమైన పంచగవ్యమెలా వస్తుందంటే బంగారు రంగున్న ఆవు యొక్క పాలు, తెల్లావు పేడ, రాగిరంగు ఆవు మూత్రం, నీలవర్ణ ధేనువు యొక్క నెయ్యి, నల్లావు పెరుగు లకు కుశోదకమును కలిపితే ప్రశస్తమైన పంచగవ్యం తయారవుతుంది. ఇందులో మూత్రం ఎనిమిది మాశలు, పేడ నాలుగు, పాలు పన్నెండు, పెరుగు పది, నెయ్యి అయిదు మాశల పరిమాణంలో వుండాలి. ఇది సర్వమల వినాశకం. ***(అధ్యాయం –222)***

# విష్ణు మహిమ, ధర్మం నాలుగు పాదాలు, పురాణ, ఉపపురాణ పదునెనిమిది విద్యల లెక్క, ప్రళయం నాలుగు యుగాల ధర్మాలు, కలియుగం - నామ సంకీర్తన

మహర్షీ! ఇప్పటిదాకా మీరు విన్న ధర్మాలూ, వ్రతాలూ విష్ణు ప్రీతికరాలు కూడ. సూర్యాదిదేవుల పూజ, పితృతర్పణలు, హోమాలు, సంధ్యావందనాలు, పురుషార్థ చతుష్టయ సిద్ధిని సమకూర్చే వ్రతాలు. వీటన్నిటినీ విష్ణుభగవానుడే స్వీకరించి మంచి ఫలితాలనిస్తాడు. విష్ణుదేవుడే ధర్మస్వరూపుడు. ఈ పూజలు, తర్పణలు, హవనాలు, సంధ్యావందనాలు, ధ్యాన ధారణాది సత్కర్మలన్నీ ఆయన రూపాలే". ఇంతవఱకు చెప్పి ఆగాడు సూతుడు.

కొంతసేపాగి "శౌనకాది మహామునులారా! ఇపుడిక నాలుగు యుగాలలో దీపించే ధర్మాన్ని వినిపిస్తాను. అంటూ సూతమహర్షి ఇలా ప్రవచింపసాగాడు.

నాలుగు వేల యుగాలొక కల్పం, అది బ్రహ్మకొక పగలు అనుకున్నాము కదా! కృత, త్రేత, ద్వాపర, కలి అనేవి యుగాల పేర్లు. కృతయుగంలో సత్యం, దానం, తపం, దయ అనే నాలుగు పాదాలతో ధర్మం నడుస్తుంది. ధర్మసంరక్షకుడు శ్రీహరియే. ఈ రహస్యాన్ని కనుగొన్న జనులందరూ సంతుష్టులై జ్ఞానులై వెలుగొందు తారు. సత్యయుగపు మానవుల ఆయుః ప్రమాణం నాలుగువేల సంవత్సరాలు. సత్యయుగాన్నే కృతయుగమని కూడా అంటారు. క్షత్రియులు ధర్మపాలన పైననే దృష్టిని కలిగివుంటారు. నాలుగు వర్ణాలవారూ సత్యసంధులై ధర్మపరులై వుంటారు. అయితే హానికారక ప్రవృత్తులైన రాక్షసులు కూడా వుంటారు. వారిని సర్వాధిక బలశాలియు, శూరుడునైన విష్ణుభగవానుడు సంహరిస్తాడు.

త్రేతాయుగంలో ధర్మం సత్యం, దానం, దయ అనే పాదాల మీద నడుస్తుంది. ఈ యుగంలోని ప్రజలు యజ్ఞపరాయణులై యుంటారు. లోకమంతా క్షత్రియుల వల్ల సురక్షితమై వుంటుంది. విష్ణు భగవానుడు రక్తవర్ణుడై ఈ యుగంలో మానవులచే పూజింపబడతాడు. వారి ఆయువు ఒక వేయి సంవత్సరాలుంటుంది. ఈ యుగంలో హరిని భీమరథుడంటారు. రాక్షసులను క్షత్రియులే సంహరిస్తారు.

ద్వాపరయుగంలో ధర్మం రెండు పాదాలపైనే నిలబడి వుంటుంది. విష్ణు భగవానుడు పీతవర్ణుడై వుంటాడు. మానవుని ఆయుఃప్రమాణము నాలుగు వందలేళ్ళు వుంటుంది. బ్రాహ్మణ- క్షత్రియ వర్ణముల వారు లోకమంతటా వ్యాపిస్తారు. లోకుల అల్పబుద్ధిని చూసి విష్ణువే వ్యాసునిగా పుట్టి వేదాలను విభజించి వైదిక ధర్మాన్ని వ్యాప్తిలోకి తెస్తాడు.

తన శిష్యులలో పైలునికి ఋగ్వేదాన్నీ, జైమినికి సామవేదాన్నీ, వైశం పాయనునికి యజుర్వేదాన్నీ సుమంతునికి అథర్వవేదాన్నీ ప్రసాదించి ప్రచారం చేయడానికి కనుజ్ఞనిస్తాడు. వేదాంగాలనూ, పురాణాలనూ సూతునికి అనుగ్రహిస్తాడు. అన్ని పురాణాలూ, వేదాలూ పూర్తిగా తెలిసినవాడు శ్రీహరి ఒక్కడే. పురాణం పంచలక్షణం అని చెప్పబడింది. సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరిత ములే ఆ అయిదు లక్షణాలు.

18 పురాణాల పేర్లను గుర్తుంచుకోవడానికి మన పెద్దలొక శ్లోకం చెప్పారు. ఇలా:
బ్రత్రయం భద్వయంచైవ

***మద్వయం వ చతుష్టయం***
***అనాపలింగ కూస్కాని***
***పురాణాని ప్రచక్షతః ॥***

*బ్ర అనే అక్షరంతో 3*
*భ అనే అక్షరంతో 2*
*మ అనే అక్షరంతో 2*
*వ అనే అక్షరంతో 4*
అ, నా, ప, లిం, గ, కూ, స్కాలతో ఒక్కొక్కటి.

ఈ పట్టికలో శివపురాణం లేదు. గరుడపురాణ పట్టికలో వామన పురాణం కానరాదు.

పురాణ విజ్ఞానం పదునెనిమిది రూపాలుగా విభక్తమైవుంది. అవేమనగా బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, భవిష్య, నారదీయ, స్కంద, లింగ, వరాహ, మార్కండేయ, అగ్ని, బ్రహ్మవైవర్త, కూర్మ, మత్స్య, గరుడ, వాయు, బ్రహ్మాండ పురాణాలు. మునులు పలు ఉపపురాణాల పేర్లు కూడా వినిపిస్తుంటారు. మొదటి ఉపపురాణం సనత్కుమారుడు చెప్పినది (ఇదే సనత్కుమార సంహితయా?) రెండవది భగవంతుడైన నృసింహునిచే ఉపదేశింపబడినది. మూడవది కుమారస్వామి చెప్పినది కాగా నాల్గవది నందీశ్వరుడు చెప్పిన శివధర్మ లేదా శివధర్మోత్తర పురాణం. ఆశ్చర్య లేదా అద్భుత పురాణం దుర్వాసకృతం. నారదుడు చెప్పినదొకటుంది. ఇలాగే కపిల, ఉశన మహర్షులు చెప్పిన ఉపపురాణాలున్నాయి. అంతేకాక వారుణ, కాలిక, మాహేశ్వర, సాంబ, పారాశర్య, మారీచ, భార్గవ నామక ఉపపురాణాలు కూడా ఉన్నాయి.

ఇక పదునెనిమిది విద్యలేవనగా పురాణం, ధర్మశాస్త్రం, నాలుగు వేదాలు, ఆరు వేదాంగాలు, న్యాయం, మీమాంస, ఆయుర్వేదం, అర్థశాస్త్రం, గాంధర్వశాస్త్రం, ధనుర్వేద శాస్త్రం.

*పురాణం ధర్మశాస్త్రంచ వేదాస్త్వంగాని యన్మునే ।*
*న్యాయంఃశౌనక మీమాంసా ఆయుర్వేదార్థశాస్త్రకం॥* *(ఆచార.. 223/21)*

ద్వాపర యుగాంతంలో భగవంతుడైన శ్రీహరి భూభారాన్ని తగ్గిస్తాడు.

కలియుగంలో ధర్మం ఒక పాదం మీదనే నడుస్తుంది. భగవానుడైన అచ్యుతుడు కృష్ణవర్ణుడై వుంటాడు. ఈ యుగంలో ప్రజలు సామాన్యంగా దురాచారులై నిర్దయులై వుంటారు. సత్త్వ రజ స్తమో గుణాలు ప్రస్ఫుటాలౌతాయి. ముఖ్యంగా చివరి రెండు నాలుగు యుగాలపై అవగాహన ఈ క్రింది శ్లోకాల ద్వారా కలుగుతుంది.

*ప్రభూతశ్చయదా సత్త్వం మనోబుద్ధీంద్రియాణిచ।*
*తదాకృత యుగం విద్యాత్ జ్ఞానే తపసియద్రతిః ॥*
*యదాకర్మసు కామ్యేషు శక్తిర్యశసే దేహినాం ।*
*తదా త్రేతా రజో భూతిః ఇది జా నీ హిశౌనక ॥*
*యథాలోభస్త్వసంతోషో మానో దంభశ్చ మత్సరః ।*
*కర్మణాం చాపి కామ్యానాం ద్వాపరం తద్రజస్తమః ।*
*యదా సదానృతం తంద్రా నిద్రా హింసాది సాధనం ।*
*శోక మోహౌ భయం దైన్యం స కలిస్తమసి స్మృతః ॥*

కలియుగం గడుస్తున్న కొద్దీ మానవులకు కామాసక్తి పెరుగుతుంది. కటువుగా మాటతీరుంటుంది. జనపదాలను దొంగలు, దోపిడీ దొంగలు ఆక్రమిస్తారు, వేదాలు పాఖండ దూషితాలవుతాయి, రాజులు ప్రజల సర్వస్వాన్ని హరిస్తారు. ప్రజలు మైథునానికీ, పొట్టపోషణకీ తప్ప ఇక దేనికీ ప్రయత్నించరు, బ్రహ్మచర్యమనే మాటే వినబడదు, గృహస్థులూ సన్యాసులూ కూడా లోభులైపోతారు. తపస్వులెక్కడో మారు మూలాల్లోకి వెళ్ళిపోతారు, దైవాన్ని కన్నా ధనాన్నే నమ్ముకొని ప్రజలు జీవిస్తుంటారు. లఘు శరీరులై వుండి కూడా అమిత భోజనులై నడివయస్సులోనే అనారోగ్యం పాలై చతికిలబడిపోతారు. ప్రజలెప్పుడైతే దొంగలను పట్టుకొచ్చి సాధువులను చేసి ఇతరులను నమ్మించి డబ్బు చేసుకుంటారో అపుడే కలియుగం పరకాష్ఠకు చేరుకుందని తెలుసుకోవాలి.

ఈ యుగానికి పట్టని జాడ్యాలు లేవు. ఈ మనుజులు పాల్పడని పాపాలుండవు. ఇంకా కొందరు సజ్జనులు మిగిలే వుంటారు. వారికి సుఖజీవనాన్ని ప్రసాదించే

సాధనమొక్కటే. అదే శ్రీకృష్ణ సంకీర్తనం. ఆ సంకీర్తనం ద్వారానే మనిషి సంసారమనే మహాబంధనంలో చిక్కుకోకుండా కర్మిష్ఠిగా జీవించగలడు, జనన మరణాల ఉచ్చునుండి తప్పించుకోగలడు. కృతయుగంలో ధ్యానం త్రేతా యుగంలో జపం,ద్వాపర యుగంలో (దేవునికి) సేవ, కలియుగంలో ఆయన గుణ, లీలా, నామసంకీర్తనం ముక్తిదాయకాలు.

*కలేర్ద్దోషనిధోర్విప్రా*
*అస్తి హ్యేకే మహాగుణః ॥*
*కీర్తనాదేవ కృష్ణస్య*
*మహాబంధం పరిత్యజేత్ ।*
*కృతే యద్ ధ్యాయతో విష్ణుం*
*త్రేతాయాం జపతః ఫలం ॥*
*ద్వాపరే పరిచర్యాయాం*
*కలౌతద్ధరి కీర్తనాత్ ।*
*తస్మాద్ ధ్యేయో హరిర్నిత్యం*
*గేయః పూజ్యశ్చ శౌనక ॥*

***(ఆచార.. 223/35-37)***

ప్రళయం నైమిత్తికమనీ ప్రాకృతికమనీ (రెండుగా) చెప్పబడింది. నాలుగు వేలయుగాల కొకమారు వచ్చే ప్రళయాన్ని బ్రహ్మ లయమనీ, నైమిత్తిక ప్రళయమనీ అంటారు.ఇది కాక కొన్ని కల్పాల కొకమారు వచ్చేది ప్రాకృతిక ప్రళయం బ్రహ్మలయం కలియుగాంతంలో వందేళ్ళపాటు అనావృష్టి ఏర్పడుతుంది. ఆకాశమండలంలో ప్రచండ రూపంతో అంతటినీ మండించే ఏడుగురు సూర్యులుదయిస్తారు. వారు ముల్లోకాలలోనూ గల జలాన్నీ ఇంకించి వేస్తారు.అపుడు విష్ణుభగవానుడే రుద్ర స్వరూపుడై భూ, భువః, స్వః, మహః,జన, పాతాళలోకాల్లోని సమస్త చరాచర సృష్టినీ దహించివేస్తాడు. తరువాత సంవర్తకములను పేరుగల మేఘాలను సృష్టిస్తాడు. అవి నూరేళ్ళపాటు భయంకర వృష్టిని అలా కురిపిస్తునే వుంటాయి. విష్ణు రూపుడైన వాయువు మిక్కిలి వేగంతో నూరేళ్ళపాటు వీస్తాడు. అపుడు ప్రపంచమంతా సముద్రమే అయిపోతుంది. ఆ సముద్రంలో అనంత శయ్యపై విష్ణువు శయనిస్తాడు. అలా ఒక వెయ్యేళ్ళు శయనించిన పిమ్మట లేచి ఆయనే మరల జగత్తును సృష్టిస్తాడు.

ఇపుడు ప్రాకృతిక ప్రళయాన్ని వర్ణిస్తాను. బ్రహ్మవర్షాలొక నూరు పూర్తికాగానే భగవంతుడైన శ్రీహరి తన యోగ బలంతో సమస్తసృష్టినీ బ్రహ్మతో సహా తనలో లీనం చేసుకుంటాడు. బ్రహ్మాండమైన వర్షాలు నూరు వర్షాల పాటు కురిసి బ్రహ్మాండ మంతా జలమయమైపోతుంది. బ్రహ్మ ఆయువు పూర్తయి మరొక బ్రహ్మ ఉదయించే కాలం దగ్గర పడగానే శ్రీహరి శయనం నూరేళ్ళు కూడా పూర్తికాగా అవ్యక్తాది క్రమం నుండి మరల వ్యక్తీభూతమైన చరాచర జగత్తు సృష్టించబడుతుంది. ***(అధ్యాయాలు -223, 224)***

# కర్మవిపాక కథనము

**జ**గత్‌సృష్టి, ప్రళయాదిక చక్రగతిని తెలుసుకున్న విద్వాంసులు ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములనే మూడు సాంసారికతాపాలను తెలుసుకుని జ్ఞాన వైరాగ్య మార్గాలను స్వీకరించి ఆత్యంతిక లయను అనగా మోక్షాన్ని ప్రాప్తించుకోగలుగుతారు. ఇపుడు సంసార చక్రాన్ని వర్ణిస్తాను. ఇది లేనిదే పురుషార్థి పరమాత్మలో లీనం కాలేడు.

మనిషి లేదా జీవి ఒక జన్మ ముగిసి వేరొక జన్మ ప్రారంభం కావడానికి ముందు పన్నెండు రోజులలో యమధర్మరాజు సమక్షానికి చేరుకోవలసి వుంటుంది. మార్గంలో తన కోసం తిలోదకాలనూ పిండప్రదానాలనూ చేసిన వారి దయవల్ల వాటినే తింటూ వుండాలి. త్రాగుతుండాలి. అక్కడి నుండి పుణ్యకర్ములు స్వర్గానికేగగా పాపకర్ములు నరకంలో పడిపోతారు. స్వర్గ నరకాల అనుభవం తరువాత ప్రాణి భూలోకానికి మరలి వచ్చి స్త్రీ గర్భంలో ప్రవేశించడం, రెండు బీజాకారాలను ధరించడం రక్తమాంస పుష్టిని పుంజుకొని అండాకారాన్ని ధరించడం జరుగుతుంది. అండము అలాగే భూమిపై పడి కొన్ని జీవులు పుట్టగా మనిషి మాత్రం (క్షీరదాలన్నిటివలెనే) లోపలే పూర్తి ఆకారాన్ని ధరించి సర్వాంగాలతో పుడమిపై పడడం జరుగుతుంది. మానవులు సాధారణంగా పూర్తిగా తొమ్మిది మాసాలూ జనని గర్భంలో వుంటారు. అంతవఱకూ అందరికీ పూర్వజన్మ గానీ జన్మలుగానీ గుర్తుంటాయి.పూర్వజన్మలో చేసిన తప్పులు, పొరపాట్లు ఇక చేయకూడదని అనుకుంటారు గానీ నేలపై బడగానే వైష్ణవ మాయ కమ్మేసి అన్నీ మఱచిపోతారు. సామన్యజీవికి బాల్య, కౌమార, యువ, వృద్ధ అనే అవస్థలు (దశలు) ఉంటాయి. మరల మృత్యువు కబళించడం, జనన మరణ చక్రం పరిభ్రమించడం జరుగుతాయి.

నరక భోగానంతరం (పుణ్యలేశమన్నది లేని) జీవి పాప యోనిలో జన్మిస్తాడు. పతితుని నుండి దానం పట్టిన విద్వాంసుడు కూడా, పాపుల వలెనే, అధోయోనిలో జనన మొందుతాడు. యాచకుడు, నరకం నుండి తిన్నగా క్రిమి యోనిలోనూ, గురుపత్నినీ గురుద్రవ్యాన్నీ ఆశించినవాడు కుక్క యోనిలోనూ, మిత్రుని అవమానాల పాలు చేసి అన్యాయం చేసినవాడు గాడిద కడుపునా, తల్లిదండ్రులను కష్టపెట్టినవాడు తాబేటి కడుపునా, స్వామి ద్రోహి కోతియోనిలోనూ పుడతారు. అలాగే పుట్టి, గిట్టి మరల నరకగాములే అవడం ఎక్కువగా జరుగుతుంది.

నమ్మి దాచుమని యిచ్చిన సొమ్మునపహరించినవాడు పరమ పాతకుడు. వాడు నరకానికి పోయి అన్ని శిక్షలనూ అనుభవించి తిరిగి భూమిపై పడ్డపుడు క్రిమి యోనిలో

పడతాడు. ఈర్ష్యాళువు కూడా ఆ నరకానికే పోతాడు.గానీ మరల భూమిపై పడ్డపుడు రాక్షసి గర్భంలో పడతాడు. విశ్వాసఘాతకుడు నరకము నుండి వచ్చి చేపకడుపున పుడతాడు. ఇలాగే ధాన్యపు దొంగలకూ, స్త్రీని అపహరించేవారికీ, అన్నదమ్ముల భార్యలతో సంభోగించిన వారికీ, గురు లేదా తత్సమానుల పత్నులతో పోయిన వారికీ, క్రమంగా నరకలోకం నుండి రాగానే, ఎలుక, తోడేలు, కోకిల, పందిజన్మలు వస్తాయి.

యజ్ఞ దాన వివాహాది పవిత్ర, శుభకార్యాలలో గోలచేసి అల్లరిపెట్టి అడ్డు పుల్లలు వేసి విఘ్నాలు కలిగించే పాపాత్ములు నరకం నుండి వచ్చి క్రిములౌతారు. దేవతలకు నివేదించకుండా పితరులకు అర్పించకుండా బ్రాహ్మణులకూ, అతిథికీ పెట్టకుండా ఆబగా అన్నం తినేసేవాడు నరకం నుండి వచ్చి కాకిగా పుడతాడు. పెద్దన్నను అవమానించినవాడు క్రౌంచపక్షిగా పుడతాడు. కృతఘ్నుడైన వ్యక్తి క్రిమిగానో, తేలుగానో పుడతాడు. అంటే ముందు క్రిమిగా పుట్టి గిట్టి అలాగే కీటకం, దీపపు పురుగు జన్మలెత్తి చివర తేలుగా పుట్టి చచ్చి నరకానికి మళ్ళీ పోతాడు. నిరాయుధుని చంపినవాడు గాడిదై పుడతాడు. స్త్రీలను, బాలురను చంపినవాడు క్రిమిగానూ అన్నం దొంగ పిల్లిగానూ, భోజనం దొంగ ఈగగానూ, నువ్వులదొంగ ఎలుకగానూ, నేతిదొంగ ముంగిసగానూ, మాంసం దొంగ కాకిగానూ తేనె దొంగ అడవియీగగానూ, అప్పాల దొంగ పురుగుగానూ, నీటిదొంగ కాకిగానూ, కఱ్ఱలదొంగ హరిలపిట్టగానూ, అగ్ని చోరుడు కొంగగానూ, కూరలదొంగ నెమలిగానూ, కుందేలుని దొంగిలించిన వాడు కుందేలుగానూ కళలదొంగ నపుంసకునిగానూ, పూలదొంగ దరిద్రునిగానూ జన్మిస్తారు. (వీరంతా దేహాంతంలో నరకానికి పోయి అక్కడ అన్ని పాపాలకూ అన్ని శిక్షలనూ అనుభవించి చివరగా ఈ పాపాలవల్ల ఈ యీ యోనుల్లో జన్మిస్తారు) ఇంటిని అపహరించినవాడు మహాభయానకాలైన రౌరవాది నరకాలలో పడిపోతాడు.

ప్రాణుల పట్ల దయనే చూపిస్తూ, చక్కగా చల్లగా మంచిగానే అందరితోనూ మాట్లాడుతూ, పరలోక దృష్టితోనైనా సాత్త్వికానుష్ఠాన, సత్కార్య నిష్పాదన, సత్యధర్మ పాలనలను గావిస్తూ, ఇతరుల హిత చింతననూ, ముక్తి సాధనేచ్ఛనూ, వేదప్రమాణ బుద్ధినీ కలిగియుండి, గురువులనూ పెద్దలనూ దేవర్షులనూ సిద్ధర్షులనూ సేవిస్తూ, సాధుజనులు చేసిన నియమాలను పాటిస్తూ జీవించినవారే స్వర్గానికేగగలరు. మరల భువికి మరలినపుడు ఉత్తమ జన్మనొందగలరు; పున్నెము పండి యోగ శాస్త్రం ద్వారా చెప్పబడిన యమ నియమాలను అష్టాంగ యోగాలను ఆలంబనగా చేసుకొని సద్ - జ్ఞానులై సమాజం కోసమే జీవించిన వారు దేహాంతంలో ఆత్యంతిక ఫలాన్ని - అనగా మోక్షాన్ని పొందగలరు. ***(అధ్యాయం -225)***

# అష్టాంగయోగం, ఏకాక్షర బ్రహ్మ, ప్రణవ జపమాహాత్మ్యం

ద్విజశ్రేష్ఠులారా! మానవులకు భోగ, మోక్ష ప్రదానానికి శ్రేష్ఠతమ సాధనమైన మహాయోగాన్ని సర్వాంగ సహితంగా వినిపిస్తాను. భక్తి పూర్వకంగా ఈ మహాయోగ విధిని చదివినంతమాత్రాననే మనుష్యుల సర్వపాపాలూ పటాపంచలౌతాయి.

ఒకప్పుడు మహామతియు భగవంతుడునైన దత్తాత్రేయుడు అలర్క మహారాజుకీ మహావిషయాన్ననుగ్రహించాడు. మమతయే దుఃఖాలకు మూలము. ఆ మమతను పరిత్యజించుటయే దుఃఖాలను దూరం చేసే గొప్ప ఉపాయము. అజ్ఞానరూపియైన మహావృక్షము. అహంకారంతోనే అంకురిస్తుంది. మమత ఆ చెట్టునకు బోదె వంటిది. ఇళ్ళూ, పొలాలూ ఆస్తులు దాని కొమ్మలు. పత్నిదాని చిగురుటాకైతే ధనధాన్యాలు పత్రాలు మరియు పాపమే దాని అత్యంత దుర్గమమైన మూలము. మానవులు తాము పొందుతున్నామనుకుంటున్న ఆపాతరమణీయమైన సుఖమూ శాంతీ ఈ పాపమూలకాలే కాబట్టి అశాశ్వతాలు. నిత్యానందకారకమైన పరబ్రహ్మలో లీనమైపోవాలని కోరుకునేవారు జ్ఞానమనే గొడ్డలి సహాయంతో ఈ మహా అజ్ఞాన మహావృక్షాన్ని నరికి పారెయ్యాలి. అప్పుడేవారు బ్రహ్మరసాన్ని నిష్కంటకంగా పానం చేసి ప్రాజ్ఞులై నిత్యసుఖాన్నీ పరమశాంతినీ పొందగలరు. ఈ సమస్త దృశ్య ప్రపంచమూ, ఇంద్రియాలూ కూడా అదే పరబ్రహ్మలోనే లీనమైపోతాయి. అక్కడ నువ్వు, నేను అనే భావన వుండదు. శబ్దాది తన్మాత్రలుండవు. అంతఃకరణే వుండదు.

జీవుడూ ఆత్మా ఐక్యమై వున్నా వేరు వేరు భావాలున్నాయని బోధపడుతుంది. ఇది జ్ఞానం తక్కువ కావడం వల్ల జరుగుతుంది. ఆత్మతో కలసి వుంటుందనుకున్న శరీరం, దానిలో ప్రచలితంగా వున్న 'నేను' అనే భావన ఆ శరీరంతోనే పోతాయి. శరీరమూ పోతుంది. కాబట్టి త్రిగుణాల మధ్య వున్న నేను అనేది ఆత్మ కాదు. ఆత్మ త్రిగుణాతీతం. దానిని తెలుసుకున్నవాడే యోగి.

ఎందులోనైతే నివసిస్తామో దానిని 'ఇల్లు' అంటారు.దేనినైతే తింటున్నామో దానిని 'ఆహారం' అంటాము. అలాగే మోక్షాన్ని గూర్చి ఏ విద్యను నేర్చుకుంటామో అదే యోగవిద్య. అజ్ఞానం మనకూ ఈ విద్యకూ మధ్య వుండే పొర.

అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అగ్రాహ్యం, అనేవి యమ నియమాలనబడతాయి. శౌచము బాహ్యమనీ ఆంతరమనీ రెండు విధాలు. దమ మనగా మనస్సు నదుపులో వుంచుకోవడం.

శరీరంలో ప్రవహించే వాయువుపై విజయాన్ని సాధించడానికే ప్రాణా యామం చేయాలి. ప్రతి ప్రాణాయామమాత్రలోనూ కుంభక, రేచక, పూరకాలని [1] మూడు భాగాలుంటాయి. పది మాత్రలపాటు చేసే ప్రాణాయామాన్ని లఘుప్రాణా యామమనీ, దీనికి రెట్టింపు మాత్రలను మధ్యమ ప్రాణాయామమనీ దీనికి మూడింతల మాత్రల పర్యంతము చేయగలిగితే దానిని ఉత్తమ ప్రాణాయామమనీ అంటారు. జప ధ్యాన సహిత ప్రాణాయామాన్ని 'సగర్భ' ప్రాణాయామ మంటారు.

ఇక ప్రణవం అనగా ఓంకారమే. యోగి పద్మాసనం వేసుకొని ప్రణవంలో చిత్తాన్ని ఏకాగ్రం చేసి ధ్యానం, జపం చేయాలి. ఈ స్థితిలో నతడు తన లింగాన్నీ వృషణాలతోనూ కాలి మడమలతో అదిమి పట్టి అన్ని వికారాలనూ అదుపులో వుంచుకోగలగాలి. తమోగుణాన్ని రజోగుణంచేతా, రజోగుణాన్ని సత్త్వగుణం చేతా అణచివేసి నిశ్చల వృత్తిని సాధించాలి. పంచేంద్రియాలనూ ప్రాపంచిక వాంఛలకు దూరం చేయాలి. వాయువును వీలైనంతసేపు ఆపి అదుపులోకి తెచ్చుకొని వదలి మనస్సును రాగద్వేషాలకతీతం చేసుకోవాలి. ప్రత్యాహారమను పేరు గల ఈ పద్ధతిని నిరంతరం అభ్యసిస్తూ ఆచరిస్తూ వుండాలి.

ఎనిమిది లేక పది ప్రాణాయామాలను తీసుకొనుటను ధారణ అంటారు. ఈ ధారణకు శరీరంలో పదిస్థానాలుంటాయి. అవి నాడి (నాభి) గుండె, గొంతు, నోరు, ముక్కుకొన, కనురెప్పల నడిమిభాగము తల – ఇక చివరగా ఆత్మ. ఈస్థానాలన్నీ వ్యక్తి అదుపులోకి వస్తే అతడు శాశ్వతుడవుతాడు.

అగ్ని అగ్నిలో కలిసినట్లుగా ఆత్మ పరమాత్మలో కలసిపోతుంది. ఓంకారమే పరబ్రహ్మకు సంకేతం. దానిని మనం నిద్రలో ఉన్నా శ్వాస ద్వారా జపించగలగడమే యోగసిద్ధి. అగ్నిలో వేసిన ఏ వస్తువైనా అగ్ని ఆకారాన్నే ధరించినట్లు పరమాత్మ ధ్యానంలోనే వుండిపోయే ఆత్మ పరమాత్మ ఆకారాన్నే ధరిస్తుంది. అప్పుడు సాధకుడు ఓంకారాన్ని మనసుతో శ్వాసతో జపిస్తాడు. అందులోని అ,ఉ.,మ కారాలే సత్త్వరజస్తమోగుణాలతో కలిసిపోయి తుదకు వాటిని జయించడంలో సాధకుని సార్థకుని చేస్తాయి. ఓమ్‌లో చివరి అర్ధమాత్ర నిర్గుణము. అది యోగుల ద్వారా తెలుపబడుతుంది. ఇందులో 'గ్' అనే ధ్వని కలిసి గాంధార స్వరం పలికి యోగమార్గంలో పరబ్రహ్మవైపు తీసుకువెళ్ళే యోగంగా స్వీకరింపబడింది. ఇపుడు సాధకుడు తనలో తాను తనతో తాను బ్రహ్మ భావనను నిశ్చితం చేసుకుంటూ ఇలా అనుకుంటాడు.

---

★*1) పూరక (గాలిని లోనికి పీల్చుట)*

*2) కుంభక (గాలినలాగే లోపలే వుంచుట)*

*3) రేచక (గాలిని బయటికి వదలుట)*

"నేను జ్యోతిర్మయ పరబ్రహ్మను. నాకు స్థూల దేహంలేదు. ఈ పృథ్విపై నున్న ఏ మలమూ అంటని జ్యోతిర్మయ పరబ్రహ్మను నేను. నేను వాయురాకాశర హితుడనైన జ్యోతిర్మయ పరబ్రహ్మను. నేను. *స్థానాస్థానరహితుడనైన జ్యోతిర్మయ పరబ్రహ్మనునేను. గంధతన్మాత్ర లేని జ్యోతిర్మయ పరబ్రహ్మను నేను. శ్రోత్రత్వచేంద్రియ రహితుడైన జ్యోతిర్మయ పరబ్రహ్మను నేను. ప్రాణాపాన వ్యానోదానవాయు రహిత జ్యోతిర్మయ పరబ్రహ్మను నేను. అజ్ఞాన రహితుడనైన జ్యోతిర్మయ పరబ్రహ్మను నేను. శరీర, ఇంద్రియ, మనఃబుద్ధి, ప్రాణ అహంకారములు వుండని తురీయావస్థలో ప్రకాశించు పరమపద స్వరూపం, జ్యోతిర్మయం ఐన పరబ్రహ్మను నేను. నిత్య శుద్ధ- బుద్ధ, ముక్త, ఆనందమయ, అద్వైత, జ్ఞాన స్వరూప, జ్యోతిర్మయ పరబ్రహ్మను నేను".

ఈ విధంగా పరబ్రహ్మను సాధించి పెట్టేది అష్టాంగయోగం. మాయా పాశబద్ధులై నిత్య- నైమిత్తిక కార్యాలను మాత్రమే చేసేవారు, ఆ చక్రంలోనే గిరగిర తిరుగుతూ జీవితాంతం ఉండిపోతారు. కాబట్టి వారికి పరమాత్మలో ఐక్యమయ్యే స్థాయిరాదు. వారు మరల మరల ఇదే పుడమిపై ఇలాగే పుడుతుంటారు, గిడుతుంటారు. అజ్ఞానంచే మోహితులై ఆ విషయాన్ని గ్రహించి అజ్ఞానాన్ని నశింపచేసుకొని జ్ఞానయోగ ప్రాప్తికై తపించి దానిని కైవసం చేసుకొని జీవన్ముక్తులైన వారూ ఉన్నారు.

జీవన్ముక్తుడైన యోగికి మరణం లేదు. దుఃఖముండదు, రోగమంటదు, సంసారంలోని ఏ బంధమూ వానిని బంధింప సమర్థం కాదు. పాపముక్తుడు కాబట్టి నరక దర్శనముండదు. గర్వముండదు. గర్భవాసక్లేశముండదు. అతడే స్వయంగా అవ్యయ నారాయణ స్వరూపుడవుతాడు.

ధ్యానం, పూజ, జపం, స్తోత్రం, వ్రతం, యజ్ఞం, దాన నియమపాలనం చేయడం వల్ల మనిషికి చిత్తశుద్ధి ఏర్పడుతుంది. దానివల్ల జ్ఞానం కలిగే అవకాశ ముంటుంది.

ప్రణవాది మంత్ర జపం చాలా గొప్పది. ఇంద్రుడు దానివల్లే దేవేంద్రుడైనాడు. గంధర్వులూ, అప్సరలు, దేవతలందరు కూడా ఆ జపం వల్లే అక్కడ నిలబడగలుగు తున్నారు. రాజుల రాజత్వానికాధారమూ మంత్రజపమే. ***(అధ్యాయం -226)***

---

*★ సర్వవ్యాపి పరబ్రహ్మ ఆయనకొక స్థానమంటూ వుండదు.*

# భగవద్భక్తి నిరూపణం- భక్తుల మహిమ

**సూ**తుడు శౌనకాది మహామునులకు విష్ణుభక్తిని ఈ విధంగా వర్ణించి చెప్పాడు.

"విష్ణుభగవానుడు భక్తి చేత వలె, ఇంక దేనిచేతా సంతుష్టినొందదు. మనిషి శ్రేయస్సుకి మూలం నిరంతర హరినామ స్మరణే.అదే పుణ్యోత్పత్తి సాధనం, అదే జీవన మధురఫలం.

**యథా భక్త్యా హరిస్తుష్యేత్**
**తథా నా న్యేన కేన చిత్ ॥**
**మహతః శ్రేయసో మూలం**
**ప్రసవః పుణ్యసంతతేః ।**
**జీవితస్య ఫలం స్వాదు**
**నియతం స్మరణం హరేః ॥** ***(ఆచార.. 227/1,2)***

ఈ కారణం చేతనే విద్వాంసులు విష్ణుసేవనే భక్తి యొక్క అత్యంత ప్రముఖ సాధనంగా పేర్కొంటారు. భగవంతుడు, త్రిలోకనాథుడూనైన విష్ణుదేవుని నామాలనూ ఆయన కర్మాది కీర్తననూ చేస్తూ అందులో తన్మయులైపోయి ఆనందబాష్పాలను రాలుస్తూ రోమాంచితులై గద్గద కంఠులయ్యే వారే ఆయన మహాభక్తులు.

***తే భక్తాలోకనాథస్య నామ కర్మాది కీర్తనే ॥***
***ముంచంత్య శ్రూణి సంహర్షాద్యే ప్రహృష్టతనూరుహాః॥*** ***(ఆచార..227/3,4)***

అందుచేత మనమంతా జగత్స్రష్టా, దేవదేవేశ్వరుడూనైన విష్ణు భగవానుని ఉపదేశాలను అనుసరించాలి.

నిజమైన వైష్ణవులుగా విష్ణువే గౌరవించేదెవరినంటే...

***ప్రణామ పూర్వకం భక్త్యా యో***
***వదేద్ వైష్ణవో హి సః ।***
***తద్భక్త జన వాత్సల్యం***
***పూజనం చానుమోదనం ॥***
***తత్కథా శ్రవణే ప్రీతిః***
***అశ్రునేత్రాంగ విక్రియాః ।***

*యేన సర్వాత్మనా విష్ణౌ*
*భక్త్యా భావో నివేశితః ॥*
*విప్రే భ్యశ్చ కృతాత్మత్వాన్*
*మహా భాగవతో హి సః ।*
*విశ్వోపకరణం నిత్యం*
*తదర్థం సంగవర్జనం ॥*
*స్వయమభ్యర్చనం చైవ*
*యో విష్ణుం చోపజీవతి ।* (ఆచార.. 227/6-8)

వేదశాస్త్రానుసారం నిత్యకర్మలను నిర్వహిస్తూనే విష్ణువుని స్మరించేవారు, భక్తి భావంలో లోకాన్ని తనకు భిన్నంగా భావించుకొని తాను విష్ణువువైపే మళ్ళుతున్నానని త్రికరణశుద్ధిగా తామరాకు మీది నీటిబొట్టువలె జీవిస్తూ, విష్ణునామ సంకీర్తననూ విష్ణులీలనూ మాత్రమే మనసుకి పట్టించుకుంటూ, బ్రహ్మజ్ఞానం గల సద్బ్రాహ్మణులలో విష్ణువునే దర్శిస్తూ తమ సమస్త జపతపాది సాధనాలన్నిటినీ విష్ణు పాదాలపైనే సమర్పిస్తూ ఆయననే ఏకమాత్రాశ్రయంగా కొలిచేవారు వైష్ణవులు★.

మహాభాగవతులు విష్ణుభక్తి ఎనిమిది ప్రకారాలని విశ్వసిస్తారు. అవి శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఈ భక్తిని మ్లేచ్ఛ వ్యక్తి కూడా పాటించవచ్చు. హరిభక్తిలో తన్మయుడై వుండే వాడే ఈలోకంలో శ్రేష్ఠ బ్రాహ్మణుడు, అతడే ముని, అతడే ఐశ్వర్య సంపన్నుడు, అతడే మోక్షార్హుడు. వానినే మనం గౌరవించాలి. వానికే దానమివ్వాలి. అతనినే హరిగా భావించుకోవాలి. అతని నెంతగా పూజిస్తే మనం అంతగా పవిత్రులమౌతాము. అతడు జన్మతః చండాలుడైనా విష్ణు భక్తి మహిమ వల్ల మనలను పవిత్రులను చేయగలడు.

*భక్తిరష్టవిధా హ్యేషా*
*యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే ।*
*స విప్రేంద్రో మునిః శ్రీమాన్*
*సయాతి పరమాం గతిం ॥*
*తస్మై దేయం తతో గ్రాహ్యం*
*సచ పూజ్యో యథా హరిః ।*

---

★ *శ్రీ వైష్ణవమనే పేరుతో వచ్చిన ఉద్యమానికీ ఇక్కడ చెప్పబడిన వైష్ణవానికీ సంబంధం లేదు.*

*స్మృతః సంభాషితో వాపి*
*పూజితో వా ద్విజోత్తమః ॥*
*పునాతి భగవద్భక్త*
*శ్చండాలోఽపియదృచ్ఛయా ।* (ఆచార...227 / 9,10)

హే దేవాధిదేవా! మీరు నాపై దయను కురిపించండి. నేను మిమ్మల్నే శరణు వేడుతున్నాను. అని ఏ ప్రాణి మనసా కోరినా శ్రీహరి సంపూర్ణ ప్రాణి లోకం నుండి అభయం ప్రసాదిస్తాడు. తను శరణిచ్చిన ప్రాణికి ఏ భయమూ లేకుండా చేయాలనేది ఆయన ప్రతిజ్ఞ.

*దయాంకురు ప్రపన్నాయ*
*తవాస్మీతి చయో వదేత్ ।*
*అభయం సర్వభూతేభ్యో*
*దద్యాదేతద్ వ్రతం హరేః ॥* (ఆచార.. 227/11)

మంత్రజపం చేసి జపకర్తలుగా ప్రసిద్ధి చెందినవారు వేయిమంది కంటె వేదాంత దర్శనాలలో శాస్త్రాలలో పారంగతుడైన విద్వాంసుడొక్కడు శ్రేష్ఠము. సర్వవేదాంత శాస్త్రనిష్ణాతులైన ఇలాటి వేయిమంది విద్వాంసులకంటె విష్ణుభక్తుడొక్కడు శ్రేష్ఠతరం. విష్ణు భక్తుడంటే మాటలు కాదు. అతడు హరిని తప్ప యెవరినీ యెరుగడు. అన్నపానములపై శ్రద్ధ వుండదతడికి, హరియే గుర్తు చేస్తే తప్ప తినడు, తాగడు. అలాటి భక్తుడే శ్రేష్ఠమానవుడు.

ఇటువంటి విష్ణుభక్తులే సశరీరంగా శ్రీ విష్ణు పరమపదమును ప్రాప్తించు కోవడంలో సఫలులవుతారు. ఇట్టి పరమభాగవతులు స్వయంగా విష్ణు స్వరూపులే కాగలరు. విష్ణువే వీరికి పరాయణుడు.[1] ఈ భక్తి అవ్యభిచారిణి అనగా నితాంత సుదృఢము.

యాజ్ఞికులు, అశ్వమేధరాజసూయాది అత్యున్నత యజ్ఞాలను చేసినవారు చేయించినవారు, వేదపారంగతులు, మునిసత్తములు, విద్యా సాగరులు అయినా కూడా విష్ణుభక్తి లేకుంటే సంసారాన్ని, నరకాన్ని తరించలేరు అనగా దాటుకుని పోలేరు. విష్ణుభక్తులకు ఈ సాంసారిక క్లేశాలంటవు. నరకముండదు. నిర్దయులూ, దుష్టాత్ములూ, దురాచారులూ కూడా పశ్చాత్తప్తులై విష్ణుభక్తిలో సంలగ్నులై శేషజీవితాన్ని గడిపితే వారికి పరమగతి ప్రాప్తిస్తుంది. మనిషి భక్తి భగవంతుడైన జనార్దనుని పట్ల అచలమై దృఢంగా నిలబడిపోతే వానికి స్వర్గము రుచించదు. ఆ భక్తియే వానికి ముక్తి. ఓయి శౌనకా! ఈ

[1] *పరాయణుడనగా సర్వథా అభిన్నుడని శాస్త్రార్థము.*

సంసారమనే దుర్గంలో దుర్గమ కర్మమార్గంలో పరిభ్రమించే మన మానవజాతికి విష్ణుభక్తి ఒక్కటే ఆలంబనం. అదే విష్ణుప్రీతికరం. విష్ణు మహిమలను విననివాడు చెవులున్న చెవిటివాడు. విష్ణు సంకీర్తన ద్వారా శరీరం గగుర్పొడవని వాడు జీవన్మృతుడే. వీరు ధర్మమార్గ బహిష్కృతులు.

ద్విజశ్రేష్ఠులారా! ఎవని అంతఃకరణలోనైతే విష్ణుభక్తి అనే విష్ణుచక్రం దేదీప్య మానంగా తిరుగుతుంటుందో వాడు ఈ సంసార ఆవాగమన చక్రం నుండి విముక్తుడవు తాడు. మనస్సులో హరి చింతనము మాత్రమే కలవానికి ముక్తి నిశ్చయము. ఎందు కంటే విష్ణువును పూజించడం మొదలుపెట్టగానే ఎవరైనా ధర్మాత్ములై పోతారు. చింతలూ వంతలూ లేని శాశ్వతసుఖం,ఈ లోకంలోనే వారికి చేకూరుతుంది. ధర్మార్థ కామాల ప్రభావం వారిపై వుండదు. ఎందుకంటే పరమసుఖ రూపమైన మోక్షమే వారి కరతలామలకమై[2] వుంటుంది.

త్రిగుణాత్మికమైన మాయ కూడా విష్ణువుదే. హరి భక్తులామాయను సులువుగా దాటిపోగా ఇతరులా మాయలో తలమునకలుగా పడికొట్టు మిట్టాడు తుంటారు. మనోబుద్ధిరింద్రియాలలో శ్రీహరి వెలుగుతున్న వానికి యజ్ఞారాధనతో పనిలేదు. భక్తి ద్వారానే నారాయణారాధన జరగాలి. మరోసాధనం, శ్రీహరిని చేర్చగలిగేది, లేదు. విభిన్న ప్రకారాల దానాలు, పుష్పసమర్పణలు, దివ్యానులేపనాలు విష్ణు ప్రసన్నతను కలిగిస్తాయి. కాని వీటన్నిటి కంటె భక్తికే ఆయన సంతుష్టుడౌతాడు.

***సంసార విషవృక్షస్య ద్వేఫలే హ్యమృతోపమే ।***

***కదాచిత్కేశవే భక్తి స్తద్భక్తై ర్వాసమాగమః ॥ (ఆచార...227/32)***

సంసార అనగా జగత్తు అనే విషవృక్షానికి అమృత సమానఫలాలు రెండే పండుతాయి. విష్ణుభక్తి ఒకటి కాగా రెండవది విష్ణుభక్తులతోడి సత్సాంగత్యము.★

తమ వంశంలో విష్ణుభక్తుడొకడు ప్రసిద్ధి గాంచగనే వాని పితరులు ఆ లోకంలో పాటలు పాడుతూ ఆనందనృత్యాలు సలుపుతారు. దుర్యోధనుడు, శిశుపాలుడు వంటి దుర్మార్గులే కృష్ణుని స్పృశించి ఆయనతో కలిసి జీవించడం వల్ల నిష్పాపులయ్యా రంటే ఇక ఆయన భక్తులుగానే జీవించిన భీష్మ విదురాదుల సంగతి చెప్పనేల?

---

*[2]కరతలామలకమనగా అరచేతిలో ఉసిరికాయ*

*★ఇదేభావం చిన్నయసూరి మిత్రలాభంలో కూడ కనిపిస్తుంది.*

***అజ్ఞానినః సురవరే సమాధిక్షిపంతో***
***యత్పాపినో౽ పి శిశుపాల సుయోధనాద్యాః ।***
***ముక్తింగతాః స్మరణ మాత్ర విధూత పాపాః***
***కః సంశయః పరమభక్తి మతాం జనానాం ॥*** **(ఆచార.. 227/35)**

ఫల, పుష్ప, పత్ర, జలబిందువుల్లో ఏ ఒక్కదానినైనా పండబారిన నిండు భక్తితో సమర్పించి సనాతన పురుషుడైన ఆ దేవదేవుని సులువుగా పొందవచ్చు. ధ్యానయోగమంటే ఏమిటో తెలియని వారు కూడా అప్రయత్నంగా ఆయనను ధ్యానించి ముక్తినందగలిగారు.

'హే మాధవా! నా ఈ గుఱ్ఱంలాంటి మనస్సు అనేక ఇంద్రియచ్ఛిద్రాల నుండి సోకిన విషయవాసనలను చూసి చూసి మతిపోయి ఎటుపోవాలో తెలియక కష్టాల దారిలో పరుగులు పెడుతోంది. దీనిని నీవు ఆపాలి.నీ చరణాలవైపు మళ్ళించు కోవాలి. అపుడు నా మనసు వాటిని వదలి కదలలేదు. నేను ముక్తివైపు కదలిపోగలను' అని ఆ మహావిష్ణువుని మనం ప్రార్థించాలి.

***భవోద్భవ క్లేశ శతైర్హత స్తథా***
***పరిభ్ర మన్నింద్రియ రంధ్ర కైర్హయైః ।***
***నియమ్యతాం మాధవ మే మనోహయ***
***స్త్వదంఘ్రి శంకౌ దృఢభక్తి బంధనే ॥★*** **(ఆచార....227/37)**

విష్ణువే పరబ్రహ్మ. ఆయనే మూడు విభిన్న రూపాలను ధరిస్తాడని వేద – శాస్త్రాదులలో ప్రతిపాదింపబడింది. ఈ తథ్యాన్ని (మాయను గెలిచి) అర్థం చేసుకొన్న వారికి అంతా విష్ణుమయం. ఈ జగమంతా విష్ణుమయం. **(అధ్యాయం –227)**

---

*★కాశీలో ప్రసిద్ధులైన పరమాస్తికులు ప్రౌఢ విద్వాంసులు శ్రీ రామయశజీత్రిపాఠీ (మహాశయజీ) ఈ క్రింది శ్లోకాన్ని ప్రతి ఉదయవేళా పఠించేవారు. పరంపరగా వస్తున్న ఈ శ్లోకం గరుడ పురాణంలోనిదేనని ఆయన అంటుండేవారు. అందులో స్వల్పభేదాలున్నాయి.*

*భవోద్భవ క్లేశ కశాహతా హతః*
*పరిభ్రమన్నైంద్రియ కాపథాంతరే ।*
*నిగృహ్యతాం మాధవ మే మనోహయ*
*స్త్వదంఘ్రి శంకౌ ధృఢభక్తి బంధనైః ॥*

*దీని భావమేనగా 'హేమాధవా! నా మనస్సనెడి గుఱ్ఱము సంసార జనితములైన క్లేశరూపములోని కొరడాలచే కొట్టబడి ఇంద్రియ సంబంధితాలైన అనేక కుత్సిత మార్గాలలో ఏ దారితోచక తెగ తిరిగి పోతోంది. నీవు నాపై దయచూపి నీ పట్ల భక్తి అనెడి గట్టి త్రాళ్ళతో దానిని లాగి అదుపులో పెట్టి నీ చరణాలనే కట్టుకొయ్యకు కట్టి పడవేయాలని నా ప్రార్థన)*

# నామసంకీర్తన మహిమ

ముక్తికి కారణభూతుడు, అనాది, అనంతుడు, అజుడు, నిత్యుడు, అవ్యయుడు, అక్షయుడునగు శ్రీ మహావిష్ణువు నామ సంకీర్తననే నిత్యం చేసేవానికి ఈ లోకమే నమస్కరిస్తుంది. నేను (అనగా సూతుడు, బ్రహ్మ మొదలగువారు) ఆనందస్వరూపుడు, అద్వైతుడు, విజ్ఞానమయుడు, సర్వవ్యాపకుడు, సకల జన హృదయ వాసుదేవుడు నగు విష్ణుభగవానునికి భక్తిభావంతో, ఏకాగ్ర మనస్కుడనై ఎల్లపుడూ  నమస్కరిస్తు న్నాను. ఈశ్వరుడై ఐశ్వర్యాన్ని పంచుతూ అందరి అంతఃకరణలలో నిత్యనివాసం చేస్తూ అందరి శుభాశుభ కర్మలనూ వీక్షించే సర్వసాక్షియు పరమేశ్వరుడునైన శ్రీ మహా విష్ణువునకు నా నమస్కారములు.

శరీరంలో తగినంత శక్తి వుండీ కూడా భగవంతుడైన చక్రపాణికి నమస్కారం చేయని వానికంటే గాలికి కదలాడే తుచ్ఛమైన గడ్డి పరకమేలు. దీనికన్నా అదే ఉద్విగ్నంగా వుంటుంది. నవనీల మేఘశ్యాముడు, లోకనాథుడు, పరమపురుషుడు, అప్రమేయుడునైన శ్రీకృష్ణభగవానునికి భక్తి పరవశుడై ఒక్కమారు సర్వస్వాన్నీ అర్పించుకుంటూ నమస్కారం చేస్తున్న శ్వపచుడు (చండాలుడు) కులీనుల కంటెనుత్త ముడై ఉత్తమ గతులు పొందుట కర్హుడవుతాడు. వంద యజ్ఞాలు చేసినా దక్కని ఫలం నేలపై బడి శ్రీకృష్ణునికి భక్త్యశ్రువులు పొంగుతుండగా సాక్షాద్దండ ప్రణామం ఒక్కసారి చేస్తేనే దక్కుతుంది. ఈ సాష్టాంగ ప్రణామమే సంసార ప్రళయ జలాల్లో మునగని నావలాగా నిలబడి కృష్ణభక్తుని కాపాడుతుంది. ముక్తిని ప్రసాదిస్తుంది.

***నమో నారాయణాయ***

మంత్ర స్మరణమెంతో సులభం. దానినలా ఏ పనిచేస్తున్నా, ఏపని చేయకున్నా, శ్వాసతో బాటుగా స్మరిస్తే చాలు 'ఇక్కడ' అన్ని సుఖాలూ 'అక్కడ' స్వర్గసుఖాలూ లభిస్తాయి. అయినా ప్రజలు మూర్ఖులై  ఈ మంత్రాన్ని విస్మరించి నరకానికి పోతున్నారు.

విష్ణు మహిమను గానం చెయ్యాలంటే వెయ్యి ముఖాలైనా చాలవు. రెండువేల నాలుకలున్న శేషుడే ఎంత గానం చేసినా స్వామి మహిమలో సహస్రాంశను కూడా చెప్పలేకపోయాడు. వ్యాసాది మహానుభావులే ఆయన లీలలను అనితర సాధ్యంగా చెప్పి కూడా పూర్తిగా చెప్పలేకపోతున్నారు. కాబట్టి ఆయన దయ ఎంత గొప్పదంటే తనను ఒక్కమారు ఆర్తిగా భక్తితో పిలచినా వచ్చి రక్షిస్తాడు. పులిపంజాలో చిక్కుకోబోతూ, చివరిక్షణంలో ఆ పులి శరాఘాతం వల్ల కూలిపోతే రక్షింపబడ్డ లేడి వలె కోరికల వెంట

పరుగుతీసి, అలసి, అజ్ఞానపు తెరలు తొలగి, చివరిక్షణంలో కృష్ణుని శరణు కోరినవాడు రక్షింపబడతాడు. తననూ తన పరివారాన్నీ కూడా మోక్షం వైపు నడిపింపగలుగుతాడు.

కలలో కూడా శ్రీకృష్ణనామస్మరణను చేస్తూనే వుండే మనుష్యుని పూర్వ అక్షయ పాపరాశి అంతా వినష్టమైపోతుంది. హేకృష్ణా! హే అచ్యుతా! హే అనంతా! హే వాసుదేవా! నీకు నమస్కారము 'అని ఆయనను ఎలుగెత్తి పిలిచి నమస్కారం చేసే వాడు యమపురికి పోనక్కరలేదు. పాశములచేత బట్టి పనికి బయల్దేరుతున్న తన కింకరులతో యముడిలా అంటాడట. 'దూతలారా! మీరు మధుసూదనుడైన మహావిష్ణుని భక్తులజోలికి పోకండి. నేను అన్యజీవుల పాపుల గుంపుకే స్వామిని. వారినే శిక్షింపగలను. మీరు వారినే గొని రాగలరు. విష్ణు భక్తులకు స్వామి విష్ణువే. వారి మరణానంతర జీవనాన్ని ఆయనే చూసుకుంటాడు.

నామసంకీర్తన వల్ల కలిగే సుఖం ముందు స్వర్గ సుఖం తుచ్ఛంగా కనిపిస్తుంది. పైగా అది అనిత్యం, క్షయశీలం, శ్రీకృష్ణధామం దాకా గల మార్గంలో కృష్ణదేవలగ్న చిత్తుడైన వానికేకైక పాథేయం (అనుపమ అవలంబనం) శ్రీ కృష్ణనామసంకీర్తనమే. సంసారరూప సర్పదంశ (పాముకాటు) కు ఏకమాత్ర ఔషధం 'శ్రీకృష్ణ'నామమే. ఈ క్రింది వైష్ణవ మంత్రాన్ని జపించిన వారికి ముక్తి సులభసాధ్యము.

*పాథేయం పుండరీకాక్ష*
*నామ సంకీర్తనం హరేః ।*
*సంసార సర్ప సందష్టవిష చేష్టైక భేషజం ॥* **(ఆచార.. 228/17)**

కృతయుగంలో హరినే ధ్యానిస్తూ త్రేతాయుగంలో ఆయన మంత్రాలను జపిస్తూ ద్వాపరంలో ఆయనను పూజిస్తూ, ఏ ఫలాలనైతే ప్రాణులు పొందాయో అవే ఫలాలను కలియుగంలో, కేశవ నామస్మరణ, సంకీర్తన మాత్రమున పొందగలవు.

*ధ్యాయన్ కృతే జపన్ మంత్రై*
*స్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్ ।*
*యదాప్నోతి తదాప్నోతి*
*కలౌ సంస్మృత్య కేశవం ॥* **(ఆచార.. 228/18)**

జిహ్వాగ్రాన హరియను రెండక్షరములుగల వ్యక్తి సంసారసాగరాన్ని అనాయాసంగా దాటి మోక్షమునందగలడు.

*జిహ్వాగ్రే వర్తతేయస్య హరిరిత్యక్షర ద్వయం ।*
*సంసార సాగరం తీర్త్వాస గచ్ఛేద్వైష్ణవంపదం ॥* **(ఆచార.. 228/19)**

అనేక పాపాలను తెలిసో తెలియకో చేసిన వారు వాటినుండి ముక్తులై పరిశుద్ధులు కావాలంటే హరినామస్మరణమే మార్గము. నారాయణ స్తవనము, గుణ కీర్తనలచే నిండిన కథలను వినడంలో నిమగ్నుడైన వ్యక్తిని ఈ సంసారంలో ఏదీ బాధించలేదు. కలలో కూడ అతడీ లోకాన్ని వరించడు.

*విజ్ఞాత దుష్కృతి సహస్రమావృతోఽపి*
*శ్రేయః పరంతు పరిశుద్ధమ భీప్సమావః ।*
*స్వప్నాంతరే నహి పునశ్చ భవం సపశ్యే*
*న్నారాయణ స్తుతి కథా పరమో మనుష్యః ॥* **(ఆచార.. 228/20) (అధ్యాయం. ..228)**

# విష్ణుపూజలో శ్రద్ధాభక్తుల మహిమ

శౌనకాది మహామునులారా! జీవన సారం సర్వలోక స్వామియైన శ్రీహరి ఆరాధన మాత్రమే. పురుషసూక్తం★ ద్వారా ఎవరైతే పుష్పజలాదులను ఆ పరాత్పరునికి ఆ శ్రీమహా విష్ణువుకి సమర్పిస్తారో వారు సర్వదేవతలనూ సర్వజగత్తుతో సహా పూజించిన పుణ్యాన్ని పొందుతారు. విష్ణు పూజ చేయని వానిని బ్రహ్మఘాతిని చూసినట్లే చూడాలి. సమస్త ప్రాణుల ఉత్పత్తి ఎవని నుండి జరిగిందో, సమస్త చరాచర జగత్తంతటా వ్యాపించిన భగవంతుడెవరో అట్టి విష్ణు దేవుని పూజించని మానవుడు పేడపురుగుతో సమానుడు. నరకంలో నోటితో చెప్పరాని బాధలు పడుతున్న వారిని యమ ధర్మరాజు ఇలా ప్రశ్నిస్తాడు. 'ఏమయ్యా, ఏమమ్మా? మీరు కష్టవినాశకుడైన విష్ణుదేవుని అస్సలు పూజించనే లేదా? ఎందుచేత? స్తోమతులేకనా? ఆయనతో ఆ సమస్యే ఉత్పన్నం కాదే! ఒక నీటి చుక్కను ఆయనకు సమర్పించి నమస్కారం చేస్తే ప్రసన్నుడైపోయి తన లోకాన్నే మీకిచ్చివేసే కరుణామయుడు కదా ఆయన! విష్ణుపూజను చేయక ఈ నరకంలో పడ్డారు. ఏల చేసిరి కాదో?'

శ్రద్ధగా మనిషి చేసే పూజలకి సంతుష్టుడై ఆ మహావిష్ణువతనికి చేసే ఉపకారాన్ని వాని తల్లిగాని తండ్రిగాని సోదరుడు గాని, వేయేల, మరే దేవతలు గాని చేయలేరు. అలాగే మనస్సు పెట్టి చేసే పూజ తప్ప ఆయనకెవరూ ఏమీ సంతుష్టిగా పెట్టనూ లేరు. దానాలు గాని స్వర్ణం గాని ఖరీదైన సుగంధాలు గాని అనులేపనాలు గాని భక్తివలె ఆయనను తృప్తిపఱచలేవు. నీ సంపత్తి, ఐశ్వర్యం, బలం, పుత్రపౌత్రా దులు, మాహాత్మ్యము ఇవేమీ ఆయనకవసరం లేదు. ఆయనకి కావలసింది భక్తి ఒక్కటే. **(అధ్యాయం - 229)**

---

★*సహస్ర శీర్షాపురుషః మున్నగు పదహారు మంత్రాలు పురుష సూక్త నామంతో ప్రసిద్ధాలు. ఈ మంత్రాలన్ని దేవతా సంహితలలోనూ వుంటాయి.*

# విష్ణుభక్తి మాహాత్మ్యం

అన్ని శాస్త్రాలనూ అవలోకించి మరల మరల విచారించి చూస్తే తేలే పరమవిజ్ఞాన పూర్ణమైన నిష్కర్ష ఒక్కటే. అదేమనగా మనుష్యులు ఎల్లవేళలా శ్రీమన్నారాయణునే ధ్యానించాలి.

**ఆలోక్య సర్వశాస్త్రాణి**
**విచార్య చ పునః పునః ।**
**ఇద మేకం సునిష్పన్నం**
**ధ్యేయో నారాయణః సదా ॥** ***(ఆచార.. 230/1)***

తదేక నిష్ఠతో నిత్యం నారాయణ ధ్యానం చేసేవానికి దానాలు,విభిన్న తీర్థ పరిభ్రమణం, తపస్సు, యజ్ఞాలు చేయడం వంటివి ఎందుకు? ఏం ప్రయోజనం? అనగా శ్రీమన్నారాయణ ధ్యానమే సర్వోత్కృష్టదానం, తీర్థం, యజ్ఞం. సమస్త ప్రాయశ్చిత్తాలూ, తప-కర్మలు విష్ణువు వైపు నడిపించేవే. వీటన్నిటిలో సర్వశ్రేష్ఠతపం ఆయన ధ్యానమే. ఎన్ని పాపాలు చేసిన వాడైనా పశ్చాత్తాపపడి మనసా హరిని ధ్యానిస్తూ శేషజీవితం గడిపితే చాలు. ప్రాయశ్చిత్తం అవసరమే లేదు.

ఒక ముహూర్తం పాటు అన్నీమఱచి ఆయననుధ్యానిస్తేనే స్వర్గం ప్రాప్తిస్తుంది. అటువంటప్పుడు అనన్య పరాయణ భక్తి గలవాని విషయము చెప్పనేల?

**ముహూర్తమపియోధ్యాయే**
**న్నారాయణ మతంద్రితః ।**
**సో ఽపి స్వర్గతి మాప్నోతి**
**కిం పునస్తత్పరాయణః ।**

యోగ పరాయణులు, యోగసిద్ధులు కలలోనూ ఇలలోనూ కూడా, చివరికి సుషుప్త్యవస్థలోనూ భగవానుడైన అచ్యుతునే మనసా ఆశ్రయించి వుంటారు. సామాన్యులైనా లేస్తూ, పడుతూ, రోదిస్తూ, తింటూ, కూర్చుంటూ, నిద్రిస్తూ మేలుకొంటూ గోవిందా మాధవా నారాయణా అంటూ స్మరిస్తుండాలి. ఎవరి కర్మలను వారు నిర్వర్తిస్తూనే చిత్తాన్ని హరిపై లగ్నం చేయాలి. ఆయన పట్లనే అనురక్తులై వుండాలని శాస్త్రాల కథనం.

**స్వే స్వే కర్మణ్యభిరతః**
**కుర్యా చ్చిత్తం జనార్దనే ।**

*ఏషా శాస్త్రాను సారోక్తిః*
*కిమన్యైర్బహు భాషితైః ॥* **(ఆచార.. 230 /9)**

ధ్యానమే పరమధర్మము. ధ్యానమే పరమ తపము. ధ్యానమే పరమశుద్ధి. కాబట్టి మానవులు భగవద్ధ్యాన పరాయణులై వుండాలి. విష్ణుధ్యానమును మించిన ధ్యానము లేదు, ఉపవాసాన్ని మించిన తపస్సు లేదు, కాబట్టి వాసుదేవచింతనమే మన ప్రధాన కర్మ కావాలి. ఈ లోకంలో గాని పరలోకంలో గాని ఏవైతే అత్యంత దుర్లభాలో, కనీసం ఆలోచనకు కూడ అందవో అలాటి వాటినన్నిటినీ మధుసూదనుడు మనం అడగకుండానే ఇస్తాడు. యజ్ఞాదులలో పొరపాట్లను కూడా ఆయన పూరిస్తాడు.

*ప్రమాదాత్ కుర్వతాం కర్మ*
*ప్రచ్యవేతా ధ్వరేషుయత్ ।*
*స్మరణాదేవ తద్విష్ణోః*
*సంపూర్ణం స్యాదితి శ్రుతిః ॥* **(ఆచార.. 230/13)**

పాపకర్ములను శుద్ధిపరచాలంటే హరి ధ్యానమును మించిన సాధనం లేదు. పునర్జన్మను తెచ్చే కారణాలను దహించి భస్మం చేసే యోగాగ్ని హరిధ్యానం. సమాధి (ధ్యానయోగ) సంపన్నుడైన యోగి. యోగాగ్నిలో తను తెలిసీ తెలియక చేసిన కర్మఫలాలన్నిటినీ భస్మము చేసి పూర్వకర్మఫలం కూడా లేకుండా చూసుకొని ఈ జన్మలోనే ముక్తిని పొందుతాడు. వాయువుకు అగ్నితోడైనట్లు ధ్యానయోగికి విష్ణు కృపతోడై వాని కర్మఫలాలను దహించి వేస్తుంది.స్వర్ణంలోగల మలం అగ్నిలో పడితే మటుమాయమైనట్లు మనిషిలోని మాలిన్యం విష్ణుధ్యాసలోపడితే పటాపంచలైపోతుంది.

మంచికోసం ఎదురుచూడకుండా హరి వైపు మళ్ళిపోవాలి. హరిధ్యానము చేసే రోజే మంచిరోజు, తిథే మంచి తిథి, తారే (నక్షత్రమే) సంపత్తార.

ఎవని హృదయంలోనైతే గోవిందుడుంటాడో వానికి కలియుగం కూడా సత్య (కృత) యుగమైపోతుంది. సుఖంగా వుంటాడు ఏమీ లేకపోయినా అదే హరి హృదయమందు లేనివానికి సత్యయుగమే కలియుగమై పోతుంది.ఏమీ సుఖముండదు. అన్నీ సమకూడియున్నా.

*కలౌ కృత యుగం తస్య*
*కలిస్త స్య కృతయుగే ।*
*హృదయే యస్య గోవిందో*

*యస్య చేతసి నాచ్యుతః ॥*
*యస్యాగ్రత స్తథా పృష్ఠే*
*గచ్ఛతస్తిష్ఠతోఽపివా ।*
*గోవిందే నియతం చేతః*
*కృత కృత్య సదైవ సః ॥* **(ఆచార.. 230/23,24)**

శ్రీ కేశవదేవుని చరణాలపై తన మనసునూ జీవితాన్నీ సంపూర్ణంగా అర్పించిన మహాభక్తుడు గృహస్థాశ్రమాన్ని పరిత్యజించకపోయినా, మహాతపశ్చర్యలో మగ్నుడు కాకపోయినా మాయను ఛేదింపగలడు శ్రీమహావిష్ణువు ఎవని హృదయంలో కొలువై వుంటాడో అతడు క్రోధులను క్షమతోనూ మూర్ఖులను దయతోనూ మార్చగలడు. ధర్మాత్ములపై ప్రసన్నతను కురిపించగలడు.

*క్షమాంకుర్వంతి కృద్ధేషు*
*దయాం మూర్ఖేషు మానవాః ।*
*ముదంచ ధర్మ శీలేషు*
*గోవిందే హృదయ స్థితే ॥* **(ఆచార... 230 /27)**

స్నానదానాది సత్కర్మలను చేస్తున్నపుడూ, దుష్కర్మలకి ప్రాయశ్చిత్తాన్ని చేసుకుంటున్నపుడూ శ్రీహరిని ధ్యానిస్తూ చేస్తే అవి మరింత గొప్ప ఫలాన్నిస్తాయి.

నీలకమల సమాన కాంతిమంతుడూ, సుందర శ్యామవర్ణుడూనైన శ్రీమహా విష్ణువు ప్రకాశించే హృదయం కలవాడు. సర్వవిజయుడౌతాడు. పరాభవప్రసక్తే లేదు.

*లాభస్తేషాం జయస్తేషాం*
*కుతస్తేషాం పరాభవః ।*
*యేషా మిందీవర శ్యామో*
*హృదయ స్థోజనార్దనః ॥* **(ఆచార.. 230/29)**

పూర్వపుణ్యం కొద్దీ కీటకాలూ, ఈగలూ, పక్షులూ మున్నగు జంతువులే హరిని చిత్తంలో స్మరిస్తే ఉత్తమగతుల నొందుతాయి. ఇక జ్ఞాన సంపన్నులైన మానవుల సంగతి వేరే చెప్పాలా?

*కీటపక్షి గణానాంచ*
*హరౌ సంన్యస్త చేతసాం ।*
*ఊర్ధ్వా హ్యేవ గతిశ్చాస్తి*
*కిం పునర్జ్ఞానినాం నృణాం ॥* **(ఆచార... 230/30)**

భగవంతుడైన వాసుదేవుడను మహావృక్షము యొక్క నీడలో నివసించగలిగిన వారికి ఎముకలు కొరికే చలిగాని గుండెను మండించే వేడిగాని వుండవు. ఈ నీడయే మనను నరకం నుండి రక్షిస్తుంది.

***వాసుదేవ తరుచ్ఛాయా***
***నాతి శీతా తితా పదా ।***
***నరక ద్వార శమనీ సా***
***కిమర్థంచ న సేవ్యతే ॥*** ***(ఆచార.. 230 /31)***

మిత్రులారా! మధుసూదన భగవానుని తన మనసులో నివసింప చేసుకో గలిగిన వానినీ, అహర్నిశలూ ఆయననే ధ్యానించే వానినీ, మహాక్రోధి దుర్వాసుని శాపం కూడా నశింపచేయలేదు. ఇంద్రుని శాసనమైనా వానినిబాధింపసమర్థం కాదు.

***నచ దుర్వాస సః శాపో***
***రాజ్యం చాపి శచీపతేః ।***
***హంతుం సమర్థం హి సఖే***
***హృత్ కృతే మధుసూదనే ॥*** ***(ఆచార. 230/32)***

ఎవరితోనో మాట్లాడుతూ, ఆపుతూ, ఇచ్ఛానుసారం అన్యకార్యాలు చేస్తూ కూడా మనసులో నిరంతరం భగవద్విషయక చింతన చేయగలిగితే ధారణ అనే మహాసిద్ధి కైవసమైనట్లే. ఈ ధారణే, అనగా ధ్యేయంపై చిత్తస్థిరతయే విష్ణులోక ప్రాప్తిదం.

***వదతస్తిష్ఠతోఽన్యద్వా***
***స్వేచ్ఛయా కర్మ కుర్వతః ।***
***నాపయాతి యదా చింతా***
***సిద్ధాం మన్యేత ధారణాం ॥*** ***(ఆచార.. 230/33)***

సూర్యమండల మధ్యంలో స్థిర ప్రకాశంతో వెలుగొందువాడు, కమలాసనంపై కొలువు తీరేవాడు, కేయూర, మకరాకృత కుండలుడు, దివ్యహారయుక్తుడు, మనోహారిణియైన స్వర్ణసుందర కాంతితో విరాజిల్లు శరీర శోభాయుక్తుడు, శంఖచక్రధరుడునగు విష్ణుభగవానుని అన్ని ప్రాణులూ ధ్యానించాలి.

***ధ్యేయః సదా సవితృ మండల మధ్యవర్తీ***
***నారాయణః సరసిజాసన సంనివిష్టః ।***
***కేయూరవాన్ మకరకుండల వాన్ కిరీటీ***
***హారీ హిరణ్మయవపుర్ధృత శంఖ చక్రః ॥*** ***(ఆచార.. 230/34)***

భగవద్ధ్యానాన్ని మించిన పవిత్ర కార్యం ఈ విశ్వంలోనే లేదు. విష్ణు ధ్యానపరుడు చండాలుడు భక్తితో పెట్టిన అన్నాన్ని తిన్నా అపవిత్రుడు కానేరడు. ఎందుకంటే విష్ణుభక్తుడే స్వయంగా భగవన్మయుడు. ప్రాణుల చిత్తం విషయ వాసనలలో తగుల్కొని చిక్కుకుపోవడం ఇరుక్కుపోవడం చూస్తూనే వుంటాం. కాని అదే అనురక్తిని ఈ ప్రాణులు భగవంతునివైపు మళ్ళిస్తే ఎందులోనూ చిక్కుకోక, ఇరుక్కోక జీవన్ముక్తులే కాగలరు కదా!

*సదాచిత్తం సమాసక్తం*
*జంతోర్విషయ గోచరే ।*
*యది నారాయణే ౭ ప్యేయం*
*కోన ముచ్యేత బంధనాత్ ॥* **(ఆచార.. 230/36)**

శ్రీ మహావిష్ణువుని చిత్తంలో నిలుపుకున్నవాడు ప్రతిక్షణం ఆయనకే నమస్కరిస్తుంటాడు, అదీ మనసుతో కాబట్టి అతడు పాప సముద్రాన్నెప్పుడో దాటిపోయి వుంటాడు.

గోవిందుని గూర్చి తెలిపే జ్ఞానమే జ్ఞానము. కేశవ లీలలను తెలిపే కథలే కథలు. ఆ ప్రభువు నిమిత్తం చేయబడే కర్మయే కర్మ. హరి స్తుతిని చేయు జిహ్వాయే జిహ్వా. విష్ణు సమర్పితమైన చిత్తమే చిత్తము. కమలాక్షు నర్చించు కరములే కరములు.

*(తెలుగు వారికి చిరపరిచితమైన ఈ భావం భాగవతం కన్న ముందే గరుడ పురాణంలో ఇలా చెప్పబడింది)*

*తదజ్ఞానం యత్రగోవిందః*
*సా కథా యత్ర కేశవః ।*
*తత్కర్మ యత్ తదర్థాయ*
*కిమ న్యైర్బహుభాషితైః ॥*
*సా జిహ్వాయా హరిం స్తౌతి*
*తచ్చిత్తం యత్ తదర్పితం ।*
*తావేవ కేవలౌ శ్లాఘ్యౌ*
*యౌతత్పూజా కరౌ కరౌ ॥* **(ఆచార.. 230/37-39)**

మస్తకమున్నందుకు ఫలమేమి? భగవానుని పాదాలపై పెట్టి నమస్కరించే సత్కర్మను చేయగలుగుట. చేతులెందుకు? దేవుని పూజించుటకే. మనస్సెందుకు? శ్రీహరి గుణ, కర్మలపై నిత్య చింతనను నిర్వహించుటకే. నోరున్నది కేవలం శ్రీహరి గుణకీర్తనం చేయుటకే.

*ప్రణామ మీశస్య శిరః ఫలం విదు*
*స్త దర్చనం పాణిఫలం దివౌకసః ।*
*మనఃఫలం తద్గుణ కర్మచింతనం*
*వచస్తు గోవింద గుణస్తుతిః ఫలం ॥* **(ఆచార.. 230/40)**

సుమేరు పర్వతమంత, మందరాచలమంత కుప్పలుగా పాపాలు రాశిపోసు కున్న, ఆర్జించిన దుర్జనుడైనా పరివర్తనమొంది, పశ్చాత్తపించి ఒక్కమారు కేశవుని స్మరించినా ఆ పాపరాశి అంతా దగ్ధమై భస్మమై ఎగిరిపోతుంది.

*మేరు మందర మాత్రోఽపి*
*రాశిః పాపస్య కర్మణః ।*
*కేశవ స్మరణాదేవ*
*తస్య సర్వం వినశ్యతి ॥* **(ఆచార.. 230/41)**

ఎవనిపై మనసును లగ్నం చేసిన ప్రాణి నరకంవైపే పోనక్కర్లేదో, ఎవని చింతన సుఖానికి ముందు స్వర్గసుఖాలే దిగదుడుపో, ఎవనిని అర్థం చేసుకున్న జ్ఞానులు బ్రహ్మలోక ప్రాప్తిని పట్టించుకోరో, ఏ భగవానుడు అవ్యయుడై జడబుద్ధులైన మానవుల మనస్సుల్లో నిలచి వారిని ముక్తికి అర్హులను చేస్తాడో అట్టి శ్రీమహావిష్ణువుని నిరంతరం జీవితాంతం సంకీర్తనం చేసేవారు ఆయనలోనే కలసి పోవడంలో ఆశ్చర్యమేముంది?

*యస్మిన్ న్యస్తమతిర్నయాతి నరకం స్వర్గోప్రి యచ్చింతనే విఘ్నోయత్ర*
*నవా విశేత్ కథమపి బ్రహ్మోఽపిలోకోఽల్పకః ।*
*ముక్తించేతసి సంస్థితో జడధియాం పుంసాం దదాత్యవ్యయః*
*కిం చిత్రం యదయం ప్రయాతి విలయం తత్రాచ్యుతే కీర్తితే ॥*

**(ఆచార .. 230/44)**

దుఃఖసాగరాన్ని దాటాలనుకొనేవారు వారి వారి స్తోమతును బట్టి యజ్ఞ, జప, స్నానాదులను చేస్తూ వాటితో బాటు శ్రీమన్నారాయణ సంకీర్తను కూడా చెయ్యాలి. ఏ స్తోమతూ లేని వారు సంకీర్తనమొక్కటి చేస్తే చాలు. రాజ్యానికి రాజు, బాలకులకు తల్లిదండ్రులు, సమస్త ప్రాణులకూ ధర్మమూ ఆశ్రయాలైతే ఆ ధర్మమే అన్నిటితో బాటు శ్రీహరి నాశ్రయించు కొనివుంటుంది.

*రాష్ట్రస్యశరణం రాజా పితరోబాల కస్యచ*
*ధర్మశ్చ సర్వమర్త్యానాం సర్వస్య శరణం హరిః ॥* **(ఆచార..230/46)**

జగత్కారణ స్వరూపుడు, సనాతనుడునైన వాసుదేవుని పూజించు వాని దర్శనమే ఒక తీర్థయాత్రంత పుణ్యాన్నిస్తుంది. నిరాలస్యుడై (బద్ధకం లేనివాడై) గోవింద ధ్యానం చేస్తూ నరుడు తన స్వాధ్యాయాది కర్మలను కూడా ఆయనకే సమర్పిస్తూ నిర్వహించాలి. శూద్రుడైనా నిషాదుడైనా, చండాలుడైనా శ్రీమహావిష్ణువు యొక్క మహాభక్తుడైతే వాని కులశీలములతో పనిలేకుండా వానిని గౌరవించి నమస్కరించు వారి గౌరవ నమస్కారములను స్వయంగా విష్ణువే స్వీకరించి వారికి నరక బాధ లేకుండా చేస్తాడు. ధనప్రాప్తి కోసం ఒక ధనవంతుని చేరి వానినే స్తుతిస్తూ గడిపే వానికి ధనప్రాప్తి కలుగుతుందో లేదో కాని మోక్షమును కోరి విష్ణునామస్మరణ సంకీర్తనాదులను చేయువారికి ముక్తి తప్పక ప్రాప్తిస్తుంది.

అడవిలో రేగిన అగ్నికీలలు కర్రనూ ఇతర ఇంధనాలనూ దహించునట్లు యోగి హృదయస్థితుడైన విష్ణువు వారి సమస్త పాపాలనూ భస్మీపటలం చేస్తాడు. విష్ణువు పట్ల మనకెంత విశ్వాసముంటుందో అంత సిద్ధి మనకి కలుగుతుంది.

*విద్వేషాదపి గోవిందం*
*దమ ఘోషాత్మజః స్మరన్*
*శిశుపాలో గత స్తత్వం*
*కింపునస్తత్పరాయణః ॥* **(ఆచార.. 230/54)**

శ్రీకృష్ణభగవానుని పుట్టిన దగ్గర్నుండీ ద్వేషిస్తూ బతికి ఆయననే ఎదిరించి ఆయన చేతిలోనే పోయిన శిశుపాలుని వంటి దుష్టుడే, ఆయనను ఎలాగో ఒకలాగ, నిత్యం స్మరించిన పుణ్యం వల్ల ఆయనలో లీనమై పోయాడంటే ఇక భక్తి భావంతో శ్రీవిష్ణుపరాయణులై నిత్యమూ ఆయనను స్మరించు వారి సంగతి వేరే చెప్పాలా?

**(అధ్యాయం -230)**

# నృసింహస్తోత్రం - తన్మహిమ

**శౌ**నక మహామునీ! ఇపుడు మీకు సాక్షాత్తు పరమశివునిచే చెప్పబడిన నారసింహస్తుతి (నృసింహస్తోత్రము) ని మీకు వినిపిస్తాను.

ప్రాచీన కాలంలో ఒకప్పుడు మాతృగణాలవారంతా కలిసి కూడబలుక్కొని శంకరుని వద్దకేగి 'స్వామీ! మేమంతా మీరు దయతో అవునంటే ఈ విశ్వంలోని దేవ, అసుర, మనుష్యాది ప్రాణులన్నిటినీ తినేస్తాము. అనుజ్ఞనివ్వండి' అన్నారు.

పరమశివుడు వెంటనే 'హే మాతృకలారా! మీరంతా ప్రజలని రక్షించటానికి సృష్టింపబడ్డారు. మీద్వారా రక్షణయే గాని భక్షణ జరుగరాదు. మీరు వెంటనే ఈ భయంకర పాపపుటాలోచనను మీమీ మనసులనుండి తొలగించండి' అని ఆజ్ఞాపించాడు. అయినా ఆయన మాటలను సరకు చేయకుండా ఆ మాతృగణాలు త్రైలోక్యభక్షణను ప్రారంభించాయి. అంతట శివుడు నృసింహరూపుడైన విష్ణుదేవుని ఇలా ధ్యానించాడు.

'ఆద్యంత రహితుడు, సమస్త చరాచరజగత్ సృష్టికే కారణమైనవాడు, విద్యుత్స మానమై మెరుపులనీను నాలుక గలవాడు, మహాభయంకరములైన దంతములున్నవాడు, దేదీప్యమానములైన కేసరముల (జూలు) చే సుశోభితమైన గ్రీవము కలవాడు, రత్నజటిత అంగదాలచే కిరీటముచే శోభిల్లువాడు, స్వర్ణకాంతులీను జటలతో మిఱుమిట్లు గొలుపు శిరోభాగవిరాజితుడు, స్వర్ణమేఖలచే అలంకరింపబడిన నడుముగల వాడు, నీలకమల శ్యామవర్ణశోభితుడు, రత్నఖచితములైన అందెలు గలవాడు, సంపూర్ణ బ్రహ్మాండవ్యాపితమైన తేజస్సు గలవాడు, వర్తులాకార రోమాలంకృతుడు, దేవశ్రేష్ఠతమ పుష్పహారాభి శోభితుడు, విశాలనేత్రుడునగు నృసింహస్వామిని నేను ధ్యానిస్తున్నాను.

శివుడిలా ప్రార్థించగానే నారాయణుడాయన వేడిన నృసింహరూపంలోనే సాక్షాత్కరించాడు. ఈ రూపము దేవతలకే దుర్నిరీక్ష్యముకాని శివునికి కాదు.

శంకరుడు నృసింహస్వామికి ప్రణామం చేసి ఆయన దర్శనమైన ఆనందంలోని అతిరేకతతో ఇలా స్తుతించాడు.

*నమస్తేఽస్తు జగన్నాథ నరసింహ వపుర్ధర ।*
*దైత్యేశ్వరేంద్ర సంహారి నఖశుక్తి విరాజిత ॥*
*నఖమండల సంభిన్న హేమ పింగళ విగ్రహ ।*
*నమోఽస్తు పద్మనాభాయ శోభనాయ జగద్గురో ।*
*కల్పాంతాం భోద నిర్ఘోష సూర్యకోటి సమప్రభ ॥*
*సహస్ర యమ సంత్రాస సహస్రేంద్ర పరాక్రమ ।*
*సహస్ర ధనదస్ఫీత సహస్ర చరణాత్మక ॥*
*సహస్ర చంద్ర ప్రతిమ సహస్రాంశు హరిక్రమ ।*
*సహస్ర రుద్ర తేజస్క సహస్ర బ్రహ్మ సంస్తుత ॥*
*సహస్ర రుద్ర సంజప్త సహస్రాక్ష నిరీక్షణ ।*
*సహస్ర జన్మమథన సహస్ర బంధమోచన ॥*
*సహస్ర వాయువేగాక్ష సహస్రాజ్ఞ కృపాకర ।* ***(ఆచార.. 231/12-16)***

ఈ విధంగా స్తుతించి వినమ్రతాపూర్వకంగా శివుడు నృసింహస్వామికిలా విన్నవించాడు. 'భగవన్! అంధకాసురుని చంపడం కోసం అవసరమౌతారని నేను కొందరు మాతృకలను సృష్టించాను. ఇపుడా మాతృకలు హింసాప్రవృత్తికాకరాలై నా మాటను జవదాటి విశ్వంలోని వివిధ ప్రాణుల్ని తినేస్తున్నారు. అందుచేత వారిని సృష్టించిన నేనే మరో దారిలేక వారి సంహారానికై మిమ్ము వేడుకొంటున్నాను.

వెంటనే నృసింహమూర్తి జిహ్వాగ్రభాగమునుండి సహస్ర సంఖ్యలో దేవీ స్వరూపములతో మహాశక్తులుద్భవించి ఆ మాతృకలన్నిటినీ భస్మం చేసి పారేశాయి. ఈ విధంగా నృసింహస్వామిలోకకల్యాణ కారకుడైనాడు.

ఈ నారసింహస్తోత్రాన్ని నియమపూర్వకంగా పఠించేవారి సమస్త మనోరథాలనూ శ్రీహరి నెరవేరుస్తాడు. కనులు మూసుకొని నృసింహదేవుని ఈ క్రింది రూపాన్ని ధ్యానించి చూడగలిగినవారు దైవసమానులే కాగలరు.

***ధ్యాయే నృసింహంతరుణార్క నేత్రం***
***సితాంబుజాతం జ్వలితాగ్ని వక్త్రం ।***
***అనాది మధ్యాంతమజం పురాణం***
***పరాత్పరేశం జగతాం నిధానం ॥*** ***(ఆచార.. 231/23)***

మంచుపొరలనూ,పొగమంచునూ సూర్యుడు నాశనం చేసినట్టు ఈ స్తోత్రాన్ని భక్తిగా నియమంగా పఠించే మానవుల కష్టాలనూ పాపాలనూ నృసింహస్వామి పటాపంచలు చేస్తాడు.

కల్యాణకారిణియైన మాతృవర్గయుక్తమైన, నృసింహదేవుని మూర్తిని నిర్మించి దానిని పూజించినవారి వెంట ఆ స్వామి నిత్యమూ నిలచి రక్షిస్తాడు. ***(అధ్యాయం – 231)***

# కులామృతస్తోత్రం

మహామునులారా! కులామృతమను శ్రేష్ఠమైన స్తోత్రాన్ని మీకిప్పుడు వినిపిస్తాను. ఒకప్పుడు దేవర్షినారదుడు పరమేశ్వరుని ఇలా ప్రార్థించాడు.

హే భగవాన్! మనుష్యులందరూ పుట్టిననాటినుండీ మంచివారుగా వుండడం జరుగదు కదా! వారిలో కొందరు దుర్మతులుంటారు. పరిస్థితుల ప్రభావం కొందరిని దుష్టులనుగా మారుస్తుంది. వారు కామ– క్రోధ, శుభాశుభద్వంద్వాలలో పడికొట్టు మిట్టాడుతూ శబ్దాది విషయ బంధాలచే కట్టువడి బ్రతుకుతూ ఎప్పటికో మేల్కొని

పశ్చాత్తాపపడి భగవద్ధ్యానంలోనే శేషజీవితాన్ని గడపాలనుకుంటారు గానీ దానికి సమయం లేదని మథనపడుతుంటారు. అలాటి వారి నుద్ధరించడం ఎలా?

లోక కల్యాణ కర్తలూ, జగదానంద కారకులూ శివకేశవులే అయినా ఆ కల్యాణాన్నీ ఆనందాన్నీ లోకులదాకా తీసికెళ్ళి పంచేవాడు నారదుడు. శివుడతనిని ప్రసన్నంగా చూసి ఇలా బోధించాడు.

'ఓ ఋషి శ్రేష్ఠా! భవబంధాలను తొలగించేదీ సర్వదుఃఖాలనూ నశింపజేసేదీ అగు పరమరహస్యమైన విషయమొకటుంది విను. గడ్డిపరకనుండి బ్రహ్మ దాకా గల ఈ సృష్టిలో విష్ణుమాయలోపడి చరాచరములన్నీ ఒక రకమైన నిద్రలో చేరి జోగుతుంటాయి. ఆ నిద్ర నుండి విష్ణుభగవానుని దయవల్ల ఎవరు మేలుకోగలరో వారే ఈ భవబంధాలను తొలగించుకోగలరు. భవసాగరాన్ని దాటిపోగలరు. ఈ మాయ జగము దేవతలను కూడా భ్రమింపచేసి వ్యామోహంలో పడవేయగలదు. అడవి నుండి సముద్రస్నానానికి వచ్చిన ముసలి ఏనుగుల్లాగా వ్యామోహంలో పడ్డ జనులు బయటికి రాలేరు. హరి కీర్తనను చేయనివారు నూతిలో కప్పలవలె ఈ భవ సాగరంలోనే అలాగే వుండిపోతారు. కాబట్టి ప్రసన్నచిత్తులై పశ్చాత్తప్తులై ఈ సంసారమును కాదనుకొని ఈ క్రింది స్తోత్రాన్ని పఠించేవారు ముక్తులౌతారు.

*యస్తు విశ్వమనాద్యంత*
*మజ మాత్మని సంస్థితాం ।*
*సర్వజ్ఞ మచలం విష్ణుం*
*సదా ధ్యాయేత్ సముచ్యతే ।*
*దేవం గర్భోచితం విష్ణుం*
*సదాధ్యానన్ విముచ్యతే ।*
*అశరీరం విధాతారం*
*సర్వజ్ఞాన మనోరతిం ॥*
*అచలం సర్వగం విష్ణుం*
*సదాధ్యాయన్ విముచ్యతే*
*నిర్వికల్పం నిరాభాసం*
*నిష్ప్రపంచం నిరామయం*
*వాసుదేవం గురుం విష్ణుం*
*సదా ధ్యాయన్ విముచ్యతే ।*
*సర్వాత్మకం చవైయావత్*
*ఆత్మచైతన్య రూపకం ।*
*శుభమే కాక్షరం విష్ణుం*
*సదాధ్యాయన్ విముచ్యతే ॥*
*వాక్యాతీతం త్రికాలజ్ఞం*
*విశ్వేశం లోక సాక్షిణం ।*
*సర్వ స్మాదుత్తమం విష్ణుం*
*సదాధ్యాయన్ విముచ్యతే ॥*

*బ్రహ్మాది దేవ గంధర్వై*
*ర్మునిభిః సిద్ధచారణైః ।*
*యోగిభిః సేవితం విష్ణుం*
*సదా ధ్యాయన్ విముచ్యతే ॥*
*సంసార బంధనాన్ముక్తిం*
*ఇచ్ఛల్లోకో హ్యశేషతః ।*
*స్తుత్వైవం వరదం విష్ణుం*
*సదాధ్యాయన్ విముచ్యతే ॥*
*సంసార బంధనాత్ కోఽపి*
*ముక్తి మిచ్ఛన్ సమాహితః ।*
*అనంత మవ్యయం దేవం*
*విష్ణుం విశ్వ ప్రతిష్ఠితం ॥*
*విశ్వేశ్వర మజం విష్ణుం*
*సదా ధ్యాయన్ విముచ్యతే ॥*

***(ఆచార.. 232/11-18)***

మహర్షులారా! శివుడు సెలవిచ్చినది ప్రత్యక్షర సత్యము. నిరంతరము ఆ అక్షయుడు, నిష్కలుడు, సనాతనుడు, అవ్యయుడు, బ్రహ్మస్వరూపుడునగు విష్ణువును ధ్యానించేవారు నిస్సందేహంగా ఆయన శాశ్వతపదాన్ని పొందగలరు. వేలకొద్దీ అశ్వమేధాలూ, మరింతగా వాజపేయాలు చేయగా వచ్చే పుణ్యం తదేక చిత్తంతో సర్వం మఱచి విష్ణుధ్యానం ఒక్కనిముషం చేస్తే వచ్చే పుణ్యంలో పదహారవవంతు కూడా వుండదు.

మహాదేవుడే ఉపదేశించిన ఈ స్తోత్రం దివ్యం. దీనిని నిత్యం పఠించేవారు గత వేయి జన్మాల పాప ఫలాన్నీ దగ్ధం చేసుకోగలరు. అమృతత్త్వస్థాయి అనగా వైష్ణవ పరమపదాన్ని ఈ శ్లోకసంహిత ద్వారా మానవులందుకోగలరు. ***(అధ్యాయం -232)***

# మృత్యునివారకాష్టక స్తోత్రం

శౌనకాదులారా! ఇపుడొక మృత్యు నివారకాష్టకమును అనగా ఎనిమిది శ్లోకాల స్తోత్రమును వినిపిస్తాను. ఇది మార్కండేయ కృతం.

*దామోదరం ప్రపన్నోఽస్మికిన్నో మృత్యుః కరిష్యతి ॥*
*శంఖచక్రధరం దేవం వ్యక్త రూపిణ మవ్యయం ।*
*అధోక్షజం ప్రపన్నోఽస్మి కిన్నో మృత్యుః కరిష్యతి ॥*
*వారాహం వామనం విష్ణుం నారసింహం జనార్దనం ।*
*మాధవంచ ప్రపన్నోఽస్మి కిన్నోమృత్యుః కరిష్యతి ।*
*పురుషం పుష్కర క్షేత్ర బీజం పుణ్యం జగత్పతిం ।*

*లోకనాథం ప్రపన్నోఽస్మి కిన్నోమృత్యుః కరిష్యతి ॥*
*సహస్రశిరసం దేవం వ్యక్తా వ్యక్తం సనాతనం ।*
*మహాయోగం ప్రపన్నోఽస్మి కిన్నో మృత్యుః కరిష్యతి ।*
*భూతాత్మానం మహాత్మానం యజ్ఞ యోని మయోనిజం ॥*
*విశ్వరూపం ప్రపన్నోఽస్మి కిన్నో మృత్యుః కరిష్యతి ॥*
*ఇత్యుదీరిత మాకర్ణ్య స్తోత్రం తస్య మహాత్మనః ।*
*అపయాతస్తతో మృత్యు ర్విష్ణు దూతైః ప్రపీడితః ॥*
*ఇతితేన జితో మృత్యుర్మార్కండేయేన ధీమతా ।*
*ప్రసన్నే పుండరీకాక్షే నృసింహే నాస్తి దుర్లభం ॥* ***(ఆచార...233/1-8)***

ఈ మృత్యుష్టక స్తోత్రం మహా పుణ్యశాలి, మృత్యు వినాశకారి, మంగళదాయకము. భగవంతుడైన శ్రీ మహావిష్ణువే దీనిని మార్కండేయ మహామునికుపదేశించాడు. పవిత్రుడై, త్రికాలాల్లో, భక్తిగా నియమపూర్వకంగా ఈ స్తుతిని చేసిన విష్ణుభక్తునికి అకాల మృత్యువుండదు. తన హృదయకమలంలో ఆ పురాణపురుషుడు సనాతనుడు, అప్రమేయుడు, సూర్యాధిక తేజస్వీయగు శ్రీమన్నారాయణుని ప్రతిష్టించుకొని ఈ స్తోత్రం ద్వారా ధ్యానించుయోగి మృత్యువుపై కూడావిజయాన్ని సాధించగలడు. ***(అధ్యాయం- 233)***

# అచ్యుత స్తోత్రం

శౌనకాదులారా! ఇపుడు సర్వప్రాణి గణాలకూ సర్వమునూ సమకూర్చే అచ్యుత స్తోత్రాన్ని వినిపిస్తాను. ఇది కూడా లోక కల్యాణవారధియైన నారద మహాముని తెచ్చి మనకిచ్చినదే. ఒకనాడాయన బ్రహ్మ వద్దకు పోయి 'హే దేవదేవేశా! నేను పూజా సమయంలో అక్షయుడు, అవ్యయుడు, వరప్రదాతయగు విష్ణు భగవానుని స్తుతించాలి. ఎందుకంటే ఆ అచ్యుత భగవానుని నిత్యం స్తుతించే ప్రాణులే ధన్యులు, వారి జన్మలే సఫలములు, వారే అన్నిటినీ పొందగలరు, ఆ సజ్జనుల జీవనములే సార్థకాలు. అటువంటి స్తోత్రాన్ని నాకుపదేశించండి' అని ప్రార్థించాడు.

బ్రహ్మ ఇలా చెప్పాడు, 'నాయనా! ప్రాణులకు సుఖమునూ, మోక్షమునూ ఇచ్చేదీ నారాయణుని ప్రసన్నుని చేసేదీ, ప్రతి ఒక్కరూ పూజావేళలో పఠించవలసినదీనగు అచ్యుత స్తోత్రాన్ని అవధరించు :

ఓం నమో భగవతే వాసుదేవాయ
నమః సర్వాఘహారిణే ।
నమో విశుద్ధదేహాయ
నమో జ్ఞాన స్వరూపిణే ॥
నమః సర్వ సురేశాయ
నమః శ్రీ వత్సధారిణే ।
నమశ్చర్మాసి హస్తాయ
నమః పంకజ మాలినే ॥
నమో విశ్వ ప్రతిష్ఠాయ
నమః పీతాంబరాయచ ।
నమో నృసింహరూపాయ
వైకుంఠాయ నమో నమః ।
నమః పంకజనాభాయ
నమః క్షీరోదశాయినే ॥

నమః సహస్ర శీర్షాయ
నమో నాగాంగ శాయినే ॥
నమః పరశుహస్తాయ
నమః క్షత్రాంత కారిణే ।
నమః సత్యప్రతిజ్ఞాయ
హ్యజితాయ నమో నమః
నమః స్త్రైలోక్య నాథాయ
నమశ్చక్రధరాయచ ।
నమః శివాయ సూక్ష్మాయ
పురాణాయ నమోనమః ॥
నమో వామనరూపాయ
బలిరాజ్యాపహారిణే ।
నమో యజ్ఞ వరాహాయ
గోవిందాయ నమో నమః ॥

నమస్తే పరమానంద నమస్తే పరమాక్షర ।
నమస్తే జ్ఞానసద్భావ నమస్తే జ్ఞానదాయక ॥
నమస్తే పరమాద్వైత నమస్తే పురుషోత్తమ ।
నమస్తే విశ్వకృద్దేవ నమస్తే విశ్వభావన ॥
నమస్తే స్తాద్విశ్వనాథ నమస్తే విశ్వకారణ ।
నమస్తే మధు దైత్యఘ్న నమస్తే రావణాంతక ॥
నమస్తే కంసకేశిఘ్న నమస్తే కైటభార్దన ।
నమస్తే శతపత్రాక్ష నమస్తే గరుడధ్వజ ॥
నమస్తే కాలనేమిఘ్న నమస్తే వృష్ణి నందన ।
నమస్తే దేవకీపుత్ర నమస్తే గరుడాసన ॥
నమస్తే రుక్మిణీకాంత నమస్తే ఉదితినందన ।
నమస్తే గోకులావాస నమస్తే గోకులప్రియ ॥
జయగోపవపుఃకృష్ణ జయగోపీ జనప్రియ ।

జయగోవర్ధనాధార జయగోకులవర్ధన ॥
జయ రావణ వీరఘ్న జయచాణూర నాశన ।
జయవృష్ణి కులోద్యోత జయకాలీయ మర్దన ॥
జయ సత్య జగత్సాక్షిన్ జయసర్వార్థ సాధక ।
జయ వేదాంత విద్వేద్య జయ సర్వద మాధవ ॥
జయ సర్వాశ్రయావ్యక్త జయసర్వగమాధవ ।
జయ సూక్ష్మ చిదానంద జయచిత్త నిరంజన ॥
జయస్తేఽ స్తు నిరాలంబ జయశాంత సనాతన ।
జయనాథ జగత్పుష్ట జయవిష్ణో నమోఽస్తుతే ॥
త్వం గురుస్త్వం హరే శిష్య స్త్వం దీక్షామంత్రమండలం ।
త్వం న్యాసముద్రాసమయాస్త్వం చ పుష్పాది సాధనం ॥
త్వమా ధారస్త్వం హ్యనంత స్త్వం కూర్మస్త్వంధరాంబుజం ।
ధర్మజ్ఞా నాదయస్త్వంహి వేది మండల శక్తయః ॥
త్వం ప్రభో ఛలభృద్రామస్త్వం పునః స ఖరాంతకః ।
త్వం బ్రహ్మర్షిశ్చ దేవస్త్వం విష్ణుః సత్యపరాక్రమః ॥
త్వం నృసింహః పరానందో వరాహస్త్వం ధరాధరః ।
త్వం సుపర్ణస్తథా చక్రం త్వం గదాశంఖ ఏవ చ ॥
త్వం శ్రీః ప్రభోత్వం పుష్టిస్త్వం మాలాదేవశాశ్వతీ ।
శ్రీ వత్సః కౌస్తుభ స్త్వం హి శారంగీత్వం చతథేషుధిః ॥
త్వం ఖడ్గ చర్మణా సార్ధం త్వం దిక్పాలాస్తథా ప్రభో ।
త్వం వేధాస్త్వం విధాతా చత్వం యమస్త్వం హుతాశనః ॥
త్వంధనేశస్త్వ మీశానస్త్వ మింద్ర స్త్వ మపాంపతిః ।
త్వం రక్షోఽధిపతిః సాధ్యస్త్వం వాయుస్త్వం నిశాకరః ॥
ఆదిత్యావ సవోరుద్రా అశ్వినౌత్వం మరుద్గణాః ।
త్వం దైత్యా దానవా నాగాస్త్వం యక్షారాక్షసాఖగః ॥
గంధర్వాప్సరసః సిద్ధాః పితరస్త్వం మహామరాః ।
భూతాని విషయస్త్వం హి త్వమవ్యక్తేంద్రియాణి చ ॥

మనోబుద్ధిరహంకారః క్షేత్రజ్ఞస్త్వం హృదీశ్వరః ।
త్వం యజ్ఞస్త్వం వషట్కార స్త్వమోంకారః సమిత్కుశాః ॥
త్వ వేదీత్వం హరే దీక్షాత్వం యూపస్త్వం హుతాశనః ।
త్వం పత్నీ త్వంపురోడాశ స్త్వంశాలాస్రుక్చత్వం స్రువః ॥
గ్రావాణః సకలంత్వం హి సదస్యస్త్వం సదక్షిణః ।
త్వం శూర్పాదిస్త్వంచ బ్రహ్మోముసలోలూఖలేధ్రువం ॥
త్వం హోతాయజమానస్త్వం త్వంధాన్యం పశుయాజకః ।
త్వమధ్వర్యుస్త్వముద్గాతా త్వం యజ్ఞః పురుషోత్తమః ॥
దిక్పాతాల మహివ్యోమ ద్యౌస్త్వం నక్షత్రకారకః ।
దేవ తిర్యగ్ మనుష్యేషు జగదేతచ్చరాచరం ॥
యత్కించిద్ దృశ్యతే దేవ బ్రహ్మాండ మఖిలం జగత్ ॥
తవరూప మిదం సర్వం సృష్ట్యర్థం సంప్రకాశితం ॥
నాథయం తే పరంబ్రహ్మ దేవైరపి దురాసదం ।
కస్త్వాం జానాతి విమలం యోగ గమ్యమతీంద్రియం ॥
అక్షయం పురుషం నిత్యమవ్యక్త మజమవ్యయం ।
ప్రలయోత్పత్తి రహితం సర్వవ్యాపిన మీశ్వరం ॥
సర్వజ్ఞం నిర్గుణం శుద్ధ మానందమజరం పరం ।
బోధరూపం ధ్రువం శాంతం పూర్ణమద్వైతమక్షరం ॥
అవతారేషుయామూర్తి ర్విదూరేదేవ దృశ్యతే ।
పరంభావమజానంతస్త్వాం భజంతి దివౌకసః ॥
కథం త్వామీ దృశం సూక్ష్మం శక్నోమి పురుషోత్తమ ।
ఆరాధయితు మీశాన మనో ఽ గమ్య మగోచరం ॥
ఇహయన్మండలే నాథ పూజ్యతే విధివత్క్రమైః ।
పుష్పధూపాది భిర్యత్ర తత్ర సర్వావిభూతయః ॥
సంకర్షణాది భేదేన తవయత్పూజితం మయా ।
క్షంతు మర్హసి తత్సర్వం యత్కృతం నకృతం మయా ॥
నశక్నోమివిభో సమ్యక్ కర్తృం పూజాం యథోదితాం ।
యత్కృతం జపహోమాది అసాధ్యం పురుషోత్తమ ॥

*వినిష్పాదయితుం భక్త్యా అతస్త్వాం క్షమయామ్యహం ।*
*దివారాత్రౌచ సంధ్యాయాం సర్వావస్థాసు చేష్టతః ॥*
*అచలా తుహరేర్భక్తిస్త వాంఘ్రియుగలే మమ ।*
*శరీరేన (ణ) తథాప్రీతిర్నచ ధర్మాది కేషు చ ॥*
*యథాత్వయి జగన్నాథ ప్రీతిరాత్యంతికీ మమ ।*
*కిం తేన కృతం కర్మ స్వర్గమోక్షాది సాధనం ॥*
*యస్య విష్ణౌ దృఢాభక్తిః సర్వకామ ఫలప్రదే ।*
*పూజాం కర్తుం తథా స్తోత్రం కః శక్నోతి తవాచ్యుత ॥*
*స్తుతంచ పూజితం మేఽ ద్యతత్ క్షమస్వనమోఽస్తుతే । (ఆచార...234 /5-49)*

మునులారా! పరమ వైష్ణవ పదమును పొందదలచుకున్న వారెవరైనా ఆ చక్రధరుని, ఆయచ్యుతుని ఈ స్తోత్రం ద్వారా ప్రార్థించాలి, పూజించాలి. రోజూ పూజ వేళ ఈ స్తోత్రాన్ని పఠించేవారు అనాయాసంగా జీవించి మోక్ష ప్రాప్తినందగలరు. వైష్ణవులే కాక అన్యులు కూడా ఇరుసందెలలో పవిత్రులై భజన రూపంలో ఈ స్తోత్రాన్ని పాడితే సమస్తాభీష్టసిద్ధి నొందగలరు. ఈ స్తోత్ర పాఠాన్ని చేసినవారు ఏది కోరుకుంటే అది శీఘ్రమే లభిస్తుంది. కొడుకు పుట్టాలని కోరేవారికి కొడుకు పుడతాడు; డబ్బు కావాలనుకొనేవారు ధనవంతుల వుతారు; విద్యార్థి విద్యావంతుడవుతాడు. జాతిస్మరత్వం (పూర్వజన్మ జ్ఞానం) కోరుకున్న వారికది కూడా లభిస్తుంది.

విష్ణు పూజ లేని పండితుడి గృహమైనా సరే పశువుల కొట్టం వంటిదే. విష్ణువుని పూజించే మనిషే మనిషి, అతడే జ్ఞాని, బుద్ధిమంతుడు, సత్కర్మ కర్త, పవిత్రుడు, దాత, సాధువు. అచ్యుతునిపై అచల భక్తి లేనివాడు సదాత్ముడు, శుద్ధ వచనుడు కాలేడు. పురుషోత్తముడు, భగవానుడునైన విష్ణువు తనను విధ్యుక్తంగా భక్తితో పూజించేవానిని అవసరమైతే మంచివానిగా మార్చి అన్ని సుఖాలనూ అమరుస్తాడు.

ప్రతి భక్తుడూ ఇలా మనసా, వాచా, కర్మణా విష్ణుదేవుని భావిస్తూ జీవించాలి.

*సకలమునిభిరాద్యశ్చింత్యతే యోహి శుద్ధో*
*నిఖిల హృది నివిష్టో వేత్తియః సర్వసాక్షీ ।*
*తమజమమృత మీశం వాసుదేవం నతోఽ స్మి*
*భయమరణ విహీనం నిత్యమానంద రూపం ॥*

*నిఖిల భువన నాథం శాశ్వతం సుప్రసన్నం*
*త్వతి విమల విశుద్ధం నిర్గుణం భావపుష్పైః ।*
*సుఖ ముదిత సమస్తం పూజయా మ్యాత్మభావం*
*విశతు హృదయ పద్మే సర్వసాక్షీ చిదాత్మా ॥* ***(ఆచార... 234/60,61)***

ఈ విధంగా ఆద్యంతరహితుడూ, పరాత్పర, బ్రహ్మ స్వరూపుడూనైన విష్ణువు వర్ణింపబడ్డాడు. కనుక, మోక్షమందిచ్ఛ గలవారు ఆయన చింతనమునే చేయాలి. ఈ విశ్వంలోని యోగులందరూ ఆ బోధగమ్య పురాణపురుషుడు, సూర్యసమాన తేజస్వి, విమలుడు, విశుద్ధాత్మ, శ్రేష్ఠుడూ, అద్వితీయుడూనగు మహావిష్ణువు చింతనలోనే జీవించి దేహాంతంలో ఆయనలోనే కలిసిపోయారు. పైన చెప్పబడిన స్తుతిని జీవితాంతము పఠించువాడు ఆ మహావిష్ణువులాగే ప్రశాంతచిత్తుడూ, పాపరహితుడూ కాగలడు. అలాగే ధర్మార్థకామాలను ఆయన కోసమే చేసి ఆయన కోసమే వదిలేసి సన్యాసియై ఈ లోకాన్ని విడిచినవాడు తిన్నగా విష్ణుని యొద్దకే పోవుచున్నాడు.

*విభుం ప్రభుం విశ్వధరం విశుద్ధ*
*మశేష సంసార వినాశ హేతుం ।*
*యో వాసుదేవం విమలం ప్రపన్నః*
*సమోక్ష మాప్నోతి విముక్త సంగః ॥* ***(ఆచార...234/66)***

విశ్వవిభుడు, ప్రాణిస్వామి, విశ్వాన్నే ధరించువాడు, విశుద్ధాత్మ, సమస్త సంసార వినాశహేతువు, విమలుడు, భగవానుడునైనా భక్త సులభుడైన వాసుదేవుని అనాసక్త భావంతో శరణు గోరువాడు మోక్షము నొందగలడు. ***(అధ్యాయం-234)***

# బ్రహ్మజ్ఞాన నిరూపణం - షడంగ యోగం

శౌనకాదులారా! ఇపుడు నేను వేదాంత, సాంఖ్య సిద్ధాంతానుసారం వివరింపబడిన బ్రహ్మజ్ఞానాన్ని వర్ణిస్తాను.

'నేను జ్యోతిర్మయ పరబ్రహ్మ స్వరూపుడైన విష్ణువును' అని మనసులో స్థిరీకరించుకొని ఆలోచిస్తూ 'సూర్యునిలోనూ, అగ్నిలోనూ, నా హృదయాకాశంలోనూ ఒకే జ్యోతి త్రిస్వరూప ధరమై వున్నది' అని నిశ్చయించుకోవాలి.

ఆవులోనే నెయ్యి వుంటుంది. అయినా దాని వల్ల ఆవుకి బలం రాదు. కాని అదే నెయ్యి నొక పద్ధతి ప్రకారం బయటికి తీసి అదే ఆవుకి పెడితే మహాబలప్రదమవుతుంది.

అలాగే భగవంతుడు ప్రతి మనసులోనూ వెలుగుతుంటాడు. కానీ ఆయనను పద్ధతి ప్రకారం పూజిస్తేనే పలుకుతాడు. యోగమనెడి వృక్షాన్నెక్కదలచుకొన్న వాడికి కర్మజ్ఞానం అవసరం కాని యోగవృక్షారూఢునికి వైరాగ్యం తప్ప ఇంకేదీ అక్కర్లేదు కదా!

యోగమోక్షాలను గూర్చి కాకుండా శబ్ద, విషయాదికముల గూర్చియే తెలుసు కోవాలనుకొనే వానిలో రాగ, ద్వేషాలుత్పత్తి అవుతాయి. లోభ, మోహ, క్రోధాలకు వశీభూతుడై పాపాచారుడవుతాడు. సుసంయతంగా చేతులనూ ఉపస్థయనగా, మూత్రేంద్రియము ఉపస్థనీ, ఉదరాన్నీ, వాక్యాన్నీ ఉంచుకోగలిగినవాడే విప్రుడని బుద్ధిమంతులు వక్కాణిస్తారు. ఎవరి చేతులైతే పరద్రవ్యాన్నపహరించవో, హింస చేయవో, జూదమాడవో వారి చేతులే సుసంయత హస్తాలనబడతాయి. పరస్త్రీపై కామమును సర్వదా పరిహరించునదే సంయత ఉపస్థ. అలాగే లోభరహితంగానూ పరిమితంగానూ భోజనము చేయువానిదే సుసంయత ఉదరము హిత పరిమిత, సత్య వాక్కులతో నుండునదే సుసంయత వాక్యము. సంయత హస్తాలు కూడా తపస్సు, యజ్ఞాదులనాచరిస్తేనే సఫలహస్తాలవుతాయి.

ఇక ధ్యానమనగా మనో బుద్ధిరింద్రియా ఆత్యంతిక ఐక్యత. అనగా మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు - ఇవన్నీ ధ్యేయతత్వంపై సంపూర్ణంగా సంలగ్నమైయుండుట. సబీజమనీ నిర్బీజమనీ ధ్యానం రెండు విధాలు. అవిద్యాది క్లేశాలను బీజమంటారు. వాటిని అనుభవిస్తూ కూడా వాటిని మఱచి చేసేది సబీజ ధ్యానం. విద్య బాగా వుండి ఏ క్లేశమూ అనుభవంలోకి రానిది నిర్బీజ ధ్యానం.

చింతనకి మూలాధారమైన బుద్ధి మన భ్రూమధ్యంలో వుంటుంది. విషయాసక్తుడైన వానికి అది ప్రాపంచిక వస్తువులనూ అశాశ్వతానందాన్నీ కోరుకుంటూ సంసార సాగరంలోనే మునిగి వుంటుంది. కనులు సగం మూసి విషయాలను విడచి శాశ్వతానంద సంధాయకుడైన భగవంతుని చింతనలో మునిగినవాడు ఆ కనుబొమల మధ్యనే జ్యోతిశ్చక్రాన్నీ ఆ చక్రంలో తన ఆరాధ్య దైవాన్నీ చూడగలడు. ఇదే నిజమైన బుద్ధి. ఆ బుద్ధిని గలవాడే జితేంద్రియుడూ, తంద్రామోహాలకతీతుడూనగు జ్ఞాని.

అతడు ముందు చూడగలిగే వెలుగు అతని ఆత్మయే. అది స్వప్రకాశవంతుడైన పరమాత్మను చూపిస్తుంది. జీవికి అంతిమ లక్ష్యం ముక్తియే. అది జీవికి పుర్యష్టకమూ, త్రిగుణాత్మకమూనగు ప్రకృతిని పరిత్యజించిన తరువాతనే లభిస్తుంది.

ఈ పుర్యష్టకం, నిజానికి, కమలరూపంలో వుంటుంది. సంసారం చేస్తున్న జీవుడు దీని కర్ణము. (అనగా కర్ణికలో వుంటాడు). సత్త్వ రజస్తమోగుణాలే ఈ కమల ప్రకృతి.

ఈ మాయావృత కమలానికి ఎనిమిది దళాలుంటాయి. అవి ఏవనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, సత్త్వ, రజ తమాలు. ఈ వేదాంత, ప్రతీకాత్మక బోధనం వల్ల తేలేదేమిటంటే ముక్తి ప్రాప్తి కోసం సాధన చేసే సాధకుడు ఈ కమలాన్ని – అనగా మాయనీ, ఇంద్రియాలనీ పూర్తిగా మరచి, ఈ కర్ణిక ఇచ్చే సుఖ, భోగ, పదవి, సాంసారిక భోగాదుల నుండి దిగిపోయి భగవచ్చింతన చేయాలి. షడంగ యోగం వైపు మళ్ళాలి. ప్రాణాయామ, జప, ప్రత్యాహార, ధారణ, సమాధి, ధ్యానములు యోగం యొక్క ఆరు సాధనలు.

ఇంద్రియ నిగ్రహము వల్ల పాపక్షయమూ, పాపక్షయం వల్ల దేవప్రీతీ సులభమౌతాయి. దేవప్రీతి ముక్తిమార్గమునకు తలుపు తెరుస్తుంది. అప్పుడు మొదటి సాధనం ప్రాణాయామంతో పని పడుతుంది. ఇది అనివార్య సాధనం కూడ. గర్భమనీ అగర్భమనీ ఇది రెండు విధములు. జప, ధ్యాన యుక్తమగు ప్రాణాయామమును గర్భప్రాణాయామమని వ్యవహరిస్తారు. రెండవ రకంలో జపధ్యానాలుండవు. ముప్పదియారు మాత్రల పాటు చేసే ప్రాణాయామముత్తమనిపించుకుంటుంది. ఇరవై నాలుగైతే మధ్యమమనీ పన్నెండైతే నిమ్నమనీ పెద్దలు చెప్తారు. ఓం కారాన్ని జపిస్తూనే ప్రాణాయామం చేయాలి. ఈ బ్రహ్మవాచక ఓం కారం బ్రహ్మని ప్రసన్నుని చేస్తుంది.

ఆరక్షరాల ***ఓం నమో విష్ణవే*** అనే మంత్రాన్నీ, పన్నెండక్షరాల గాయత్రి మంత్రాన్నీ జపించాలి. అన్ని ఇంద్రియాల ప్రవృత్తీ సాంసారిక విషయ వాంఛలవైపే మళ్ళుతూ వుంటుంది. ఈ ప్రవృత్తిని నివృత్తి చేయడమే – అనగా ఇంద్రియాలను నిగ్రహించి విషయ వాసనలను సంహరించి కోరికలు లేకుండా చేసుకోవడమే – ప్రత్యాహారం అని చెప్పబడింది. మనస్సును బుద్ధితోపాటు ఈ ప్రత్యాహారంలో స్థిరంగావుంచి పన్నెండుమార్లు ప్రాణాయామం చేసి అలా చేయడానికి పట్టినంత కాలం పాటు బ్రహ్మలో మనసును (బ్రహ్మపై అని ఉద్దేశము) నిలిపి వుంచుటను ద్వాదశ ధారణాత్మక ధ్యానమంటారని బ్రహ్మోపదేశము. నియత రూపంలో (ద్వారా) బ్రహ్మాకార వృత్తిలో సాధకుడనుభవించే సంతుష్టిని సమాధి అంటారు. ధ్యానం చేస్తున్నంతసేపూ మనసును చంచలం కాకుండా అనుకున్న పని అయ్యేదాకా నిలుపగలిగే శక్తికి ధారణయని పేరు. మనస్సు ధ్యేయతత్త్వం పైననే ఆసక్తిని కలిగియుండి మిగతా సంసారంపై నిరాసక్తతను పెంచుకొనుటయే ధ్యానం.

ధ్యానపరాయణులైన సాధకులు, ముఖ్యంగా మునిగణము, ధ్యేయ పదార్థ చింతనను అవిశ్రాంతంగా గావిస్తూ అందులోనే నిశ్చలంగా నిలిచిపోతే దానినే పరమధ్యానమంటారు. సాధకునికి కనులు తెరచినా మూసినా ధ్యేయ దైవతమే కనిపిస్తూ వుంటే, తనకీ దైవానికీ

తేడా లేదనే పరిస్థితి ఏర్పడితే, శరీరంపై పాములు పాకుతున్నా, పుట్టలు మొలుస్తున్నా తెలియని దశ ఏర్పడితే దానిని 'సమాధి' అంటారు.

ఎవరి మనసైతే సంకల్పరహితమై పోతుందో, ఎవరి ఇంద్రియాలు విషయ చింతన నుండి సంపూర్ణంగా విరతాలై పోతాయో వారు సమాధి స్థితులుగా చూడబడతారు. వారే బ్రహ్మలో లీనమై వుంటారు. వారు మరల వెనుకకు వచ్చి మానవలోకంలో మామూలుగా జీవించడం ఎక్కడో జరుగుతుంది.

యోగులను కూడా చెడగొట్టే దోషాలు కొన్ని వుంటాయి. చిత్తము యొక్క అస్థిరత, భ్రాంతి, దౌర్మనస్యం, ప్రమాదం వంటివి. మనస్సును స్థిరంగా వుంచుకోవడం కోసం సాధకుడు ముందుగా స్థూల స్వరూపాన్ని చింతించాలి. తరువాత నిశ్చలుడై తన కనుబొమల మధ్యలో జ్యోతి స్వరూపుడైన పరమాత్మనూహిస్తూ ఆ చర్యపై అనురక్తుడై స్థిరత్వాన్ని సాధించాలి. ఈ విశ్వంలో పరమాత్మయే తప్ప వేరేదియు లేదు, ఆ పరమాత్మయే విశ్వ రూపము' అనే నిశ్చయానికి వచ్చి పరమాత్మ కాని పదార్థాలన్నీ అసత్తులే (అనిత్యాలే) అనే జ్ఞానాన్ని పొంది ఆ వస్తువులన్నిటినీ పరిత్యజించాలి. తన హృదయపద్మంలోనే ఓంకార రూపంలో వ్యాపించియున్న పరబ్రహ్మను ధ్యానించాలి. క్షేత్రంగాని క్షేత్రజ్ఞుడు గాని ఇంకా ప్రవేశించని త్రిమాత్రలతో యుక్తమైన ఓంకారాన్ని జపించాలి. తరువాత ఓంకార స్వరూపుడైన ప్రధాన పురుషుని కూడా ధ్యానించాలి. అనంతరం ఆ పద్మంపై కృష్ణ, రక్త, శ్వేత వర్ణాలలో నుండు తమ, రజ, సత్త్వ గుణాల మూడు మండలాలనూ ధ్యానించాలి. వాటిలో నున్న జీవాత్మయగు పురుషుని ధ్యానించాలి. అనంతరం ఐశ్వర్యాది ఎనిమిది గుణాలనూ (ధ్యానించాలి) భావించుకోవాలి.

ఇదివఱకు చెప్పినదానికి భిన్నమైన కమలం ఈ దశలో సాధకుని హృదయంలో వికసిస్తుంది. ఈ కమలానికి కర్ణిక జ్ఞానం, కేసరాలు విజ్ఞానం, నాళం వైరాగ్యం, కందం వైష్ణవ ధర్మం. ముక్తి సాధకుడు ఈ హృత్పద్మం కర్ణికలో నున్న ప్రణవ రూప బ్రహ్మ యొక్క ధ్యానాన్ని చేతన, నిశ్చల వ్యాపక రూపాల్లో చేయాలి. ఇలా ఓంకార స్వరూపబ్రహ్మను ధ్యానిస్తూనే ప్రాణాలను పరిత్యజించిన వారికి బ్రహ్మసాయుజ్యం ప్రాప్తిస్తుంది.

యోగి తన దేహగత పద్మంపై హరిని కూర్చుండబెట్టుకొని సడలని భక్తి భావంతో ఆయనను ధ్యానించాలి. కొందరు మహా సాధకులు తమ జ్ఞాన రూప చక్షువులతో ఆత్మ ద్వారా పరమాత్మని చూడగలరు. సాంఖ్య దర్శనవేత్తలు ప్రకృతి పురుష వివేకం ద్వారానూ, యోగవేత్తలు యోగప్రభావం చేతనూ ఆత్మద్వారా ఆత్మదర్శనం (పరమాత్మను

చూడగలుగుట) చేయగలరు. ఆత్మ జ్ఞానరూపమే. నిజానికీ మాహాత్మ్యమంతా జ్ఞానానిదే. అదే బ్రహ్మ ప్రకాశకం, భవబంధాల పాలిటి ఖడ్గం. ఈ జ్ఞానం ఏకాగ్రచిత్తత అనే ప్రధాన యోగం ద్వారా స్వంతమవుతుంది. ఏకాగ్రచిత్తతకు ముక్తి ప్రదాయక స్థాయి వుంది. అది యోగికి ఆత్మ దర్శనాన్ని కలిగించడంలో సమర్థమవుతుంది.

ఎవరైతే ఇంద్రియాలను జయించి జ్ఞానంతో ప్రదీప్తుడవుతాడో అతడే యోగి. అతడే పరమాత్మలో ప్రవేశించి ముక్తుడనబడతాడు. ఆసనం, స్థానం వంటి విధులు యోగ సాధనాలు కావు, పైగా, అవి యోగసిద్ధిని ఆలస్యం చేసే విలంబకాలవుతాయి. శిశుపాలుడే యోగసిద్ధిని పొందాడో అది కేవలం స్మరణ మాత్రాననే సిద్ధించింది. అయిదే దానికి పూర్వ జన్మ సుకృతం తోడైంది. యోగుల తీరు వేరు. వారు ఆత్మతోనే ఆత్మను చూస్తారు; అన్ని ప్రాణులపై కరుణను కురిపించగలరు; విషయాసక్తి ఏ కోశానా లేనివారు; శిశ్నం తోడి పనినిగాని, నాలుక గోలనుగాని పరిత్యజించినవారు. వీరే దేహాంతమందు ముక్తిని పొందగలరు. యోగి ఇంద్రియాలతో చేయవలసిన ఏ పనినీ చేయకుండా, కట్టె వలె సుఖదుఃఖానుభూతులకు అతీతుడై బ్రహ్మములో కలిసిపోతాడు. అదే ముక్తి.

మేధావియైన సాధకుడు అన్ని ప్రకారాల వర్ణ భేదాలనూ, ఐశ్వర్య భేదాలనూ, శుభాశుభాలనూ, పాపాలనూ ధ్యానాగ్నిలో పూర్తిగా భస్మం చేసి పరమగతిని పొందుతాడు. కట్టెను కట్టెకు రాపిడి చేస్తే అగ్ని దర్శనమైనట్టు యోగికి బ్రహ్మజ్ఞానంతో ధ్యానాన్ని అనుసంధానం చేయగా శ్రీహరి దర్శనమవుతుంది. ఆ దర్శనమే యోగోత్కర్ష. దానిని మించిన పరమావధి లేదు. ఏ ఒక్క బాహ్యమైన ఉపాయం ద్వారానూ ముక్తి ప్రాప్తించదు. అది పూర్తిగా ఆభ్యంతరిక యమనియమాది ఉపాయాల ద్వారానే సాధ్యమవుతుంది. సాంఖ్యజ్ఞానం, యోగాభ్యాసం, వేదాంతాది శ్రవణాల వల్ల ఏ ఆత్మ సాక్షాత్కారమైతే సాధింపబడుతుందో అదే 'ముక్తి' అనబడుతుంది. ఈ ముక్తిని పొందిన వానికి, లేదా సాధించిన యోగికి అనాత్మలోనే ఆత్మ అసత్పదార్థంలోనే సత్తత్త్వం దర్శనమిస్తాయి.

***(అధ్యాయం - 235)***

***(తరువాతి అధ్యాయంలో నారదుడు భగవంతుని ద్వారా వింటున్నట్లుగా చెప్పబడింది. నారదుని ద్వారా వ్యాసుడు, ఆయన నుండి సూత మహర్షి ఆ మహావిషయాన్ని తెలుసుకున్నారనుకోవాలి)***

# ఆత్మజ్ఞాన నిరూపణం

ఇపుడు ఆత్మ జ్ఞానము యొక్క తాత్త్వికవర్ణనను వినిపిస్తాను.

అద్వైత తత్త్వమే సాంఖ్యము, దానిలో ఏక చిత్తతయే యోగము. అద్వైత తత్త్వయోగ సంపన్నుడైనవాడు ముక్తిని పొందగలడు. అద్వైత తత్త్వమేదో తెలిసి రాగానే అతీత, వర్తమాన, భవిష్య కర్మలన్నీ నష్టమై పోతాయి. జ్ఞానియైన వ్యక్తి సద్విచారమను గొడ్డలితో సంసారమనెడి వృక్షాన్ని నఱకివేసి వైరాగ్యమను తీర్థం ద్వారా వైష్ణవ పదాన్ని పొందుతాడు.

ఈ సంసారానికి మూలం మన మనస్సు యొక్క జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలే. ఇవి మాయ యొక్క రూపాలు. సత్యమేదో అవగతమయేదాకా ఈ మాయ యొక్క రూపాలు అచంచలంగా అలాగే పాతుకుపోయి వుంటాయి. నిజం చెప్పాలంటే శాశ్వత అద్వైత తత్త్వంలోనే ఇవన్నీ ప్రవేశించి వుంటాయి. అద్వైతతత్త్వమే పరబ్రహ్మం. దీనికి నామ, రూప, క్రియలుండవు. ఈ బ్రహ్మమే జగత్తును సృష్టించి తాను అందులో ప్రవేశిస్తాడు.

'మాయాతీతుడైన చిత్పురుషుని తెలుసుకోగలిగాను. నేను కూడ ఆత్మస్వరూపుడనే' అనే జ్ఞానమే ముక్తికి మార్గం.

***వేదోహమేతం పురుషం చిద్రూపం తమసః పరం ।***
***సోఽహమస్మీతి మోక్షాయ నాన్యః పంథా విముక్తయే ॥*** ***(ఆచార...236/6)***

ముక్తి దాన, ధ్యానాదుల వల్ల వస్తుందని కొందరి మతం కాగా పూజాది కర్మల వల్ల ప్రాప్తిస్తుందని కొందరి అభిప్రాయం. కర్మను ఆచరించు, కర్మను త్యజించు అనే రెండు వచనాలూ వేదాలలో వినిపిస్తాయి. నిష్కామభావనతో యజ్ఞాది కర్మలను ముక్తి కోసం చేయాలి. ఎందుకంటే నిష్కామభావంతో అనుష్ఠింపబడిన యజ్ఞాది కర్మలు శుద్ధికి సాధనంగా చెప్పబడ్డాయి. జ్ఞానం ప్రాప్తించిన పిమ్మట ఒక్క జన్మకే ముక్తి లభిస్తుంది. భేదభావమున్న వారికది దొరకనే దొరకదు. కుయోగి ముక్తిని పొందలేడు. ఏ కారణంగానో యోగభ్రష్టుడైన వాడు మరుజన్మలో యోగ సాధన జరిగే గృహంలో జన్మిస్తాడు. తనంతట తానుగా శ్రమించి ముక్తిని పొందుటకు, ఆ జన్మలో, అవకాశముంటుంది.

కర్మల ద్వారాజ్ఞానాన్ని సంపాదించిన వాడు సంబంధాలను త్యజించి మోక్షమంద వచ్చు. దానికి ఆత్మజ్ఞానాన్నాశ్రయించాలి. ఆత్మజ్ఞానానికి భిన్నమైన జ్ఞానం అజ్ఞానం కిందే లెక్క. హృదయంలో చెలరేగే కోరికలన్నీ సమాప్తమై పోతే, ఇక కోరికలే లేని స్థాయికి జీవి చేరుకోగలిగితే ఆ వ్యక్తికి అప్పటి జన్మాంతంలోనే నిస్సంశయంగా ముక్తి లభిస్తుంది.

*యదాసర్వే విముచ్యంతే కామాయే ఽ స్యహృదిస్థితాః ।*
*తదాఽ మృతత్వ మాప్నోతి జీవన్నేవన సంశయః ॥* **(ఆచార...236/12)**

పరబ్రహ్మమెక్కడుంది? దేవుడెక్కడికి పోతాడు? ముక్తి పొందినవాడు ఏ దేశంలో ప్రవేశిస్తాడు? ఇలాంటి ప్రశ్నలకవకాశమే లేదు. అనంతుడగు పరబ్రహ్మకొక దేశమనీ, రూపమనీ, గతియనీ ఉండవు కదా! ఆయన అద్వయుడు; కాబట్టి ఆయన కానిదేదీ లేదు. ఆయనే జ్ఞాన స్వరూపుడైనపుడిక జడుని వలె ఒకే చోట ఎందుకుంటాడు? జ్ఞానమే చైతన్యం. ఆయన ఆకాశమే అయినపుడు ఆయనకు గతి, అగతి, స్థితి లాంటి వాటిని ఆరోపించుట అవివేకం కదా! జాగ్రత్, స్వప్న, సుషుప్త్యాది అవస్థలు మాయ ద్వారా కల్పితాలు.

వస్తుమాత్రసారం పరబ్రహ్మయే. తేజోరూపుడైన బ్రహ్మ ఒక అఖండ పుణ్య రూపమని అర్థం చేసుకోవాలి. జీవికి తన ఆత్మ ప్రియమైనపుడు పరమాత్మ కూడా అంత ఇష్టమైనదే కావాలి, ఎందుకంటే బ్రహ్మయే ఆత్మ, ఆత్మయే బ్రహ్మ. తత్త్వజ్ఞులంతా జ్ఞానమే సర్వోచ్చమని అంగీకరిస్తారు. చిత్తమున కాలంబము బోధ స్వరూపమైన ఆత్మయే. ఇది ఆత్మ విజ్ఞానము. ఇది పూర్ణము, శాశ్వతము. మూడు అవస్థలలోనూ జీవికి కలిగే సుఖం, నిజానికి, పూర్ణ సుఖ స్వరూపుడైన బ్రహ్మ నుండి ఆత్మ పొందగలిగే దానిలో పరమ క్షుద్రాంశ మాత్రమే.

మరి ఈ స్మరణ ఏమిటి? అంటారు కొంతమంది. గుండెలో నిండుగా నిత్యమూ కొలువై వుండేవాడు స్మృతిలోనే వుంటాడు కదా! విస్మరిస్తే కదా స్మరించాలి. అని వారి ఆందోళన. కాని, ఇక్కడ స్మరించడం అంటే దేవుని తలచుకోవడం. అయనమనలోనే వున్నాడని తెలిసీ తలచుకోవడం అనగా ఆ సమయంలో తుచ్ఛ సుఖాలను తలచుకోకుండా వుండడం. చిత్తంలో స్థిరంగా వుండే చేతన తత్త్వాన్ని, ఆత్మ, బ్రహ్మ, పరమాత్మాది రూపాలలో మనం స్వీకరించిన దానిని తలచుకుంటున్న కొద్దీ అజ్ఞానం దూరమౌతుంటుంది.

మనం చేసే అన్ని పనులూ, ఆలోచనలూ మనలోనే సాక్షీభూతుడై వున్న పరమాత్మకు పూర్తిగా తెలుస్తాయి, ఆయన పరమశక్తిమంతుడు కూడా, కాబట్టే మన శుభాశుభకర్మల ఫలితాలు, ఆయన ద్వారా అందవలసిన సమయంలో మనకి అందుతుంటాయి. ఈ బ్రహ్మతత్త్వమే సత్యం, జ్ఞానం, ఆనందరూపం, అనంతం. సత్యం జ్ఞానం నుండి వేరు కాదు. అనంతతత్వం నుండి ఆనందమూ వేరు కాదు. "నేను బ్రహ్మను' అని జీవి తెలుసుకున్ననాడు ఆ జీవియే అనంతము, సత్యము, ఆనందస్వరూపము.

హేమమణి ఇనుమును బంగారం చేసినట్లు పరబ్రహ్మ సామాన్యాత్మను పరమాత్మను చేయగలడు. చీకట్లో తాడును చూసి పామనుకొని భయపడేవాడు ఆ ప్రదేశంలోకి వెలుగు

ప్రసరించాక ఇక భయపడడు. ఈ భయమే అజ్ఞానం. వ్యామోహాల మధ్య జీవించే మనిషి అవే నిత్యమనీ సత్యమనీ అనుకుంటాడు. అవి అందవేమోనని భయపడతాడు కూడ. వాని చీకటి గుండెలో జ్ఞానమనే పరమాత్మ వెలుగులు ప్రవేశించగానే ముందాభయం పోతుంది. అవి ఎంత నిర్వీర్యాలో నిస్తేజాలో తెలుస్తుంది. ఒక పాపానికి తప్ప దేనికీ భయపడడు.

ద్విజుడు గ్రహావిష్టుడై (మామూలు భాషలో దెయ్యం పడితే) నేను శూద్రుడను అంటూ కేకలు వేస్తే తన వర్ణధర్మాన్ని పాటించకుండా చిందులేసినా, ఏ బ్రాహ్మణ లేదా మంత్రవేత్త దయ వల్లనో ఆగ్రహం (దెయ్యం) వదిలేయగానే తాను ద్విజుడనే స్పృహ వచ్చి తన వర్ణాశ్రమధర్మాన్ని ఎప్పటిలాగానే పాటిస్తాడు. అలాగే స్వచ్ఛ, నిర్మలహృదయుడై పుట్టిన మానవుడు మాయ కమ్మినపుడు 'నేను నేనే. అంతా నాదే' అనుకుంటాడు. తపోధ్యానాల వల్ల ఆ మాయ తెరలు కరగిపోగానే "నేను బ్రహ్మను. అంతా ఆయనదే' అని తెలుసుకుంటాడు.

సంసారచక్రంలాగే దానికి మూలమైన భగవానుని మాయ కూడా అనాదియైనదే. ఈ మాయకూ సత్, అసత్ రూపాలుంటాయి. వ్యవహార కాలంలో సత్తుగా వుండే మాయ పరమార్థతః అసత్తవుతుంది. మాయ వల్లనే పరమాత్మ కూడా తానే జగత్తుగానూ అందులోని వ్యక్తిగానూ మారవలసి వస్తుంది. మూడు గుణాలతో ఇరవై యెనిమిది తత్త్వముల రూపములో మాయ ద్వారానే విశ్వసృష్టి జరుగుతుంది. నామ, రూప, క్రియాదులు మధ్యలో వస్తాయి. మొదట్లో వుండవు, చివరా వుండవు. ఆ వున్నపుడు కూడా ఒక చోటే వుంటాయి. ఇవి ఇటు వున్నవి అటు లేవు; అటు వున్నవి ఇటు లేవు.

సత్తా అనగా ఏ బలమూ శాశ్వతం కాదు. కలలో కనిపించే నీ స్వంతమైనట్లనిపించే రథాలూ, రాజ్యాలూ, సిరులూ కల కరగగానే విరిగిపోతాయి. ఇలలో కూడా అంతే. అక్కడ ఒక గంట అయితే ఇక్కడ కొన్నేళ్ళు. అంతే. కలలోనూ ఇలలోనూ కూడా శాశ్వతంగా నిలచేది పరమాత్మ ఒక్కడే. 'సుఖము దుఃఖము నెఱుగని సుషుప్తిలోన' ఏదీ వుండదు. ఒక రకమైన నిశ్చేష్టత మాత్రముంటుంది. దీనినే అచల లేదా అద్వైత పదమంటారు. అదే బ్రహ్మ స్వరూపం.

మాయ భగవంతుని కన్న గొప్పదేమీ కాదు. ఆయనతో సమానమైనదీ కాదు. ఆయన చేసిన ఒక కల్పన, ఆయన ఆడుకొనే ఒక బొమ్మ ఈ మాయ అంతే.

ఓయి నారదా! నేను అనంతుడను. నా జ్ఞానం అనంతం. నాలో నేను పూర్ణుడను. ఆత్మ ద్వారా అనుభూతమయే అంతస్సుఖం నేను. త్రిగుణాలకతీతంగా వుంటాను. నేను శుద్ధుడను. నేను అశుద్ధము నుండి పుట్టను. అమృత స్వరూపుడైన బ్రహ్మను నేనే. ప్రాణుల గుండెలలో వెలిగే దీపాన్ని నేనే. చీకటి గుండెను వెలిగించే చిరుదివ్వె నుండి లోకాలన్నిటినీ తేజోమంతం చేసే సూర్యుని దాకా గల వెలుగంతా నేనే. ఆత్మజ్ఞాని కూడా ఇలాగే చెప్పగలిగివుంటాడు. ***(అధ్యాయం - 236)***

# గీతాసారం

నారదా! ఒకప్పుడు నేను అర్జుననికి 'గీత' నుపదేశించాను. దాని సారంలో కొంత నీకిపుడు వినిపిస్తాను.

అష్టాంగంయోగయుక్తుడూ వేదపారంగతుడూ నగు వ్యక్తికి ఆత్మ-కల్యాణం సంభవం. అనగా అట్టివాడు ఆత్మ సాక్షాత్కారాన్నీ, తద్వారా ఆనందాన్నీ పొంది లోకానికి సుఖాన్ని కలిగించే అవకాశముంది.

ఆత్మకి దేహం లేదు. ఇంద్రియాలు లేవు. నేను ఆత్మను. నన్నీ సంసార బంధాలు దుఃఖపఱచలేవు, కట్టి పడెయ్యనూ లేవు. ధూమరహితమై ప్రజ్వలించు అగ్ని శిఖలాగా ఆత్మ స్వయంప్రకాశయుక్తమై శోభిల్లుతుంటుంది. ఆకాశం విద్యుత్తు చేత అగ్ని చేత ప్రకాశించునట్లే యోగి హృదయం, ఆత్మస్వయంప్రదీప్తాలవుతుంటాయి. మనమెంతో గొప్పగా ప్రేమించే, గొప్పగా చెప్పుకొనే ఈ జ్ఞానేంద్రియాలకి జ్ఞానం వుండదు. అవి వాటినే చూసుకోలేవు. కాని సర్వజ్ఞం, సర్వదర్శి, క్షేత్రజ్ఞం అయిన ఆత్మయే ఇంద్రియాలను దర్శించి వాటి చేత పని చేయించుకుంటుంది. ఆత్మ ఉజ్జ్వల ప్రదీపం వలె హృదయపటలంపై ప్రకాశించడం ప్రారంభించగానే పురుషుల (స్త్రీల) పాపకర్మం నష్టమైపోయి జ్ఞానం ఉత్పన్నమవుతుంది.

అద్దంలోకి చూస్తే తన రూపం తనకు కనబడినట్లే ఆత్మలోకి చూడగలిగితే ఇంద్రియాలూ, విషయాలూ (వాటి అనిత్యత్వమూ) పంచమహాభూతాలూ- అన్నీ కనిపిస్తాయి. మనస్సు, బుద్ధి, అహంకారం, అవ్యక్త పురుషుడు ఈ అన్నిటి జ్ఞానం ద్వారా సంసారం నుండి ముక్తులు కావచ్చు, కావాలి కూడా. అది తప్పదు. అన్ని ఇంద్రియాలనూన మనస్సుతో అదుపులోకి తెచ్చుకొని అహంకారాన్నందులో స్థాపించి తరువాత దానిని బుద్ధిలోనూ, బుద్ధిని ప్రకృతిలోనూ, ప్రకృతిని పురుషునిలోనూ, పురుషుని పరబ్రహ్మలోనూ

విలీనం చెయ్యాలి. అప్పుడు జీవి 'అహంబ్రహ్మాస్మి' అనే జ్ఞానజ్యోతిని పొందుతాడు. నవద్వారాలతో, మూడు గుణాలతో, ఆకాశాది పంచభూతాత్మికమై ఆత్మచే అధిష్ఠితమైన ఈ శరీరాన్ని ఎవడైతే పూర్తిగా తెలుసుకొని ముక్తికి సాధనంగా దానిని వాడుకోగలడో వాడే జ్ఞాని. అట్టివాడే క్రాంతదర్శి, సర్వశ్రేష్ఠుడు. వంద అశ్వమేధాలూ, వేలకొద్దీ రాజసూయాలు కూడా ఈ జ్ఞాన యజ్ఞమిచ్చు ఫలంలో పదహారవ వంతైనా ఇవ్వలేవు.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి- ఇవి అష్టాంగ యోగ సాధనాలు. ఇవి అష్టాంగ యోగసాధనాలు. (ఇవన్నీ కలిసి అష్టాంగ యోగమవుతుంది) ఇది ముక్తిని సంపాదించిపెడుతుంది. మనస్సు, శరీరం, మాట- ఇవి ఎల్లప్పుడూ హింసకు దూరంగానే వుండాలి. అహింసయే పరమధర్మము కదా!

*కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా ॥*
*హింసా విరామ కోధర్మో హ్యహింసా పరమం సుఖం ।* ***(ఆచార...238/2,3)***

ఎల్లవేళలా సత్యాన్నే పలకాలి. మనిషికి కష్టం కలిగించే సత్యాన్ని తప్పనిసరి కాకపోతే పలుకరాదు. ప్రియాన్నే పలకాలి. అలాగని అబద్ధాలాడరాదు.

*సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాన్న బ్రూయాత్ సత్యమప్రియం ।*
*ప్రియంచనా నృతం బ్రూయాదేష ధర్మః సనాతనః* ***(ఆచార...238/4)***

దొంగతనంగానో దౌర్జన్యంగానో పరుల ధనాన్ని అపహరించడాన్ని స్తేయమంటారు కదా! దీనికి వ్యతిరేకం అస్తేయం. అది ధర్మసాధనం.

*యచ్చద్రవ్యాపహరణం చౌర్యాద్వాథ బలేన వా ।*
*స్తేయం తస్యానాచరణ మస్తేయం ధర్మ సాధనం ॥* ***(ఆచార...238/5)***

ముక్తిని కోరువాడు మనసా, వాచా, కర్మణా మైథునాన్ని పరిత్యజించాలి. బ్రహ్మచర్యం ముక్తికి సోపానం. అపరిగ్రాహ్యం మరొక ధర్మసాధనం. ఎంతటి ఆపద ఎదురైనా ఎవరి నుండీ ద్రవ్యాన్ని గ్రహించకుండా వుండడమే అపరిగ్రాహ్యం.

బాహ్యమనీ ఆభ్యంతరమనీ శౌచం రెండు ప్రకారాలు. మట్టితో జలంతో తోమి కడిగితే బాహ్యశౌచం, భావశుద్ధి ద్వారా ఆభ్యంతర శౌచం కలుగుతాయి. ఇక సంతోషమనగా అనాయాస ప్రాప్తి వల్ల కలిగే సుఖం. మనస్సు, ఇంద్రియాలూ ఏకాగ్రం చేయడమే తపస్సు. కృచ్ఛ్ర, చాంద్రాయణాది వ్రతాల ద్వారా శరీరాన్ని శుష్కింపచేయడం కూడా తపస్సులో భాగమే. సత్త్వశుద్ధికై వేదాంతాన్నీ శతరుద్రీయాన్నీ పఠించడం, ఓంకారాదిక జపం చేయడం - ఇదే స్వాధ్యాయమని పండితజనమంటారు.

మనోవాక్కాయ కర్మలతో హరిస్తుతి, నామస్మరణ, పూజాదికార్యాలు, అనిశ్చలభక్తి – వీటిని నిర్వహించుటయే ఈశ్వర చింతన అనబడుతుంది. ఇంద్రియాలు సహజంగా అసద్విషయాలవైపే పరిగెడుతుంటాయి. వాటిని వెనక్కి లాగి హరిచింతనపై కేంద్రీకరించాలి. తేజోమండలంలో శంఖ చక్ర గదా పద్మధరుడై, వన మాలాలంకృతుడై, కౌస్తుభచిహ్న విభూషితుడై కొలువు తీరిన వాయు స్వరూపుడైన 'ఆ బ్రహ్మను నేనే' అని త్రికరణశుద్ధిగా విశ్వసించడమే ధారణ. ఈ తాదాత్మ్య రూపమే సమాధి.

*(అధ్యాయాలు– 237, 238)*

# బ్రహ్మగీతాసారం

శౌనకాదులారా! ఒకప్పుడు నారదుని కోరికపై బ్రహ్మదేవుడు సంసార విముక్తి కరమైన బ్రహ్మగీతనుపదేశించాడు. దానిని మీకు వినిపిస్తాను. 'నేను బ్రహ్మను (అహం బ్రహ్మాస్మి)' అనే వాక్యార్థాన్ని ప్రయోగపూర్వకంగా తెలుసుకోగలిగినవారు ముక్తులౌతారు. నేను, బ్రహ్మ అనే ఈ రెండు పదాలనూ అర్థం చేసుకోవాలి. విద్వాంసులు వాచ్య, లక్ష్య రూపాలు రెండింటిలోనూ వీటికి అర్థాలు స్వీకరించారు. ఏ పదానికైనా లక్ష్య వాచ్యార్థాలను చూసు కోవాలి. అదే శుద్ధ వాక్యార్థమవుతుంది. అహం శబ్దానికి ప్రాణ పిండాత్మకమనీ ప్రత్యగ్ రూపాత్మ అనీ వేదంలో అర్థాలు కనిపిస్తాయి. బ్రహ్మ పదానికి కూడా అంతే. ప్రపిండాత్మ కతతో బాటు నిష్ఠ, పరోక్షతాది గుణాలు వాచ్యార్థంలో చెప్పబడగా అద్వయానంద చైతన్యం లక్ష్యార్థంలో ద్యోతకమైంది. 'నేనే బ్రహ్మను' అని గాని 'బ్రహ్మయే నేను' అని గాని భావించుకొని సాధించుకొనే స్థితికి ప్రాణిని గొని వచ్చు ఐక్యజ్ఞానం, నిశ్చితంగా, వేదాల ద్వారా పొందబడుతుంది. జ్ఞానం వల్ల అజ్ఞానం నుండి 'విడుదల' లభిస్తుంది కదా! ఈ విడుదల తరువాతి నిచ్చెన మెట్టు ప్రాణి యొక్క చిత్త లక్ష్యమై పొందబడిన ఐక్యస్థితి. ఆ ఐక్యస్థితియే ముక్తి.

పరమాత్మ నిజము, నిత్యము కదా! ఆ పరమాత్మ నుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథ్వి ఉత్పత్తి అయినాయి. ఈ పృథ్వియే ధాత్రి, జగత్తుకీ ప్రపంచానికీ జన్మదాత్రి.

తరువాత పదిహేడు తత్త్వాలు జనించాయి. మాట* కాళ్ళు, చేతులు, పాయు, ఉపస్థ– ఇవి అయిదూ కర్మేంద్రియాలు. చెవులు, చర్మం, కనులు, నాలుక ముక్కు – ఇవి జ్ఞానేంద్రియాలు. ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదాన–ఇవి వాయువులు. ఈ పదిహేనూ

* *మాట అనగా నాలుక తప్ప మిగిలిన ముఖంలోని అంగాలు. సంస్కృతంలో 'వాక్' అన్నారు.*

మనస్సు, బుద్ధిలతో కలిసి పదిహేడు తత్త్వాలవుతాయి. భగవానుడు హిరణ్యగర్భ రూపంలో ఆత్మగా బుద్ధి రూపమైన అంతఃకరణలో వుంటాడు, చాలా సూక్ష్మంగానే వుంటాడు. దానినే జీవాత్మ అంటారు. ఈ విధంగా ప్రపంచానికావలనున్న మహాప్రాణ పరమాత్మ ద్వారా పంచమహాభూతాలతో శరీరం ఉత్పత్తి చేయబడింది. అవే పంచీకృత పంచమహా భూతాలచే బ్రహ్మాండమూ నిర్మితమైంది.

కాలు సేతులాదిగా గల స్థూలశరీరం అందరికీ తెలిసిందే, పైగా కనిపిస్తుంది కూడా. తరువాత, దానిలో పంచభూత తత్త్వాలూ వాటి అనేక కార్యాలూ గల స్థితిని స్థూల శరీర పూర్వ శరీరమనుకోవచ్చు. దాని నుండి ఉత్పన్నమయ్యేది కూడా స్థూల శరీరమే. విద్వాంసులు (దీనినే ఉదాహరణగా చూపిస్తూ) పరమాత్మ స్థితమైన శరీరం మూడు ప్రకారాలని వర్ణిస్తారు. స్వతత్త్వ భేదాన్ని తెలిపే వాక్యం **అహం బ్రహ్మాస్మి** ప్రకారం ఆ రెండు పూర్వ స్థూల, స్థూల శరీరాల్లో ఆ బ్రహ్మయే ప్రవేశించి వుంటాడు. నీటిలో సూర్యుని ప్రతిబింబము లాగా, రేగుపండులాగా ఆ సమయంలో ఆయన ఆకృతి వుంటుంది. జీవస్వరూపుడైన బ్రహ్మ దానిలో ప్రాణాది ఈ శరీర తత్త్వాలను ధరిస్తాడు. జాగ్రత్, స్వప్న, సుషుప్తి – ఈ మూడు అవస్థలలోనూ చేయబడు కార్యాలకు సాక్షిగా వుండేదే 'జీవుడ'నబడుతుంది. ఆ మూడు అవస్థలకీ ఆవల బ్రహ్మము నిర్గుణ స్వభావంతోనే వుంటుంది. ఈ శరీరంతో కలివిడిగా నున్నా విడివిడిగా వున్నా బ్రహ్మ నిత్య శుద్ధ స్వభావుడే. ఆయనలో నెటువంటి వంటి వికృతీ వుండదు. ఈ మూడు అవస్థలలోనూ మూడు ప్రకారాలుగా ఆయన వుంటాడని పెద్దలంటారు. మన అంతఃకరణలోనే స్థితుడై వున్న ఆయనను ఆ ప్రకారాలలో మనమే భావించుకుంటాం.

ఇక ఫలయుక్త క్రియను వినండి. అవస్థల వర్ణన కూడా శ్రీకృష్ణునిచే చేయబడింది. ఇంద్రియాల ద్వారా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే తన్మాత్రలను తెలుసుకొనే దశ మానవులకు జాగ్రదవస్థ. ఈ దశలో అన్ని కోరికలనూ, ఆశయ సాధనాలనూ ఎవని సంస్కారంతో వాడు దర్శిస్తాడు. మిగతా రెండు దశలలో శరీరంతో కాకుండా బుద్ధితో అదే సంస్కారం మనసుని చింతల పాలు చేస్తుంటుంది. కాబట్టి ఈ మూడు దశలలోనూ కొట్టుమిట్టాడుతున్న జీవాత్మను యమ నియమాది అష్టాంగమార్గాల ద్వారా యథాక్రమంగా దాటుకుంటూ గొనిపోయి సమాధి సాధనకు పూర్వమే పరమాత్మ అను గమ్యం వైపు మహాయోగి నిలబెట్టుకుంటాడు. అప్పుడిక జీవాత్మను ఏ అవస్థలూ (ఈ పదానికున్న అన్ని అర్థాలలోనూ) ఇబ్బంది పెట్టలేవు.

తరువాత ముముక్షువు (అనగా మోక్షాన్ని కోరేవాడు) అంతఃకరణం కైవల్యావస్థలోకి ప్రవేశిస్తుంది. ఇది పరమాత్మ సాక్షాత్కారావస్థ. ఇక్కడ మోక్షార్థి తన పాంచభౌతిక శరీరంలో చిక్కుకున్న క్షేత్రజ్ఞ జీవాత్మ తన శరీరం నుండి వేరుగా వుండాలనే చింతనను చేస్తాడు. ఎందుకంటే 'ఆత్మతత్త్వం శరీరం నుండి వేరు' అనే భావం మనస్సులో స్థిరం కాకపోతే బ్రహ్మతత్వాన్ని సాక్షాత్కారం చేసుకోవడంలో ఇబ్బంది కలుగుతుంది. కాబట్టి క్షేత్రంలో అనగా శరీరంలో విషయవాసనలతో ఇంద్రియ వీర విహారం మధ్య ఇరుక్కుపోయిన ఆత్మను ఆ ఊబిలో నుండి బయటికి లాగాలి. ముందుగా ఈ క్షేత్రాన్ని శూన్యం చేసుకుంటే అందుండి ఉత్పన్నములగు వాంఛలూ, వాసనలూ అన్నీ నశిస్తే ఆత్మ క్షేత్రజ్ఞ రూపంలో స్వచ్ఛ ప్రకాశాన్ని వెలారుస్తూ పరమాత్మను చేరే అర్హతను సంపాదించుకుంటుంది.

ఈ పాంచభౌతికమైన శరీరంకుండలాంటిదే. కుండలోని రిక్తతను ఘటాకాశ మంటారు. ఆ ఖాళీని అధిగమించి జ్ఞాననేత్రాలతో చూస్తే శరీర సమగ్రరూపమూ, సాధారణ నేత్రాలకే కుండలోని విషయమూ తెలుస్తాయి. కాబట్టి ఈ ఆకాశమనేది భ్రమ. కుండలోని మట్టిలాగే మనిషిలో జీవాత్మ వున్నా కుండ నుండి మన్నుని వేరుగా చూడగలిగే శక్తి వున్నట్టే శరీరం నుండి జీవాత్మను భిన్నం చేసి చూడగలిగే శక్తి కూడా వుంటుంది. కుండ పగిలితే గాని మన్ను రూపం ధరించదు. కోరికలు నశిస్తే గాని ఆత్మతత్త్వం బోధపడదు. శరీరంలో వున్నది పంచీకృత అనగా పంచభూత సంబంధితత్త్వం. ఈ పంచీకృత భౌతిక తత్త్వం అపంచీకృత మహాభూతుడైన పరమాత్మచే ఉత్పత్తి చేయబడింది. కార్యము శరీర నిర్మాణమైతే కరణము పరమాత్మయైనపుడు కార్యము నుండి కారణం వేరు కానట్టే శరీరం నుండి పరమాత్మా వేరు కాదు. అయితే, ★పాల నుండి వెన్నను తీసినట్లుగా శరీరం నుండి పరమాత్మను తీసి చూడగలగాలి. పాలనో మజ్జిగనో తాగాలనే కోరికను వదిలేస్తేనే వెన్న లభించినట్లు ఇంద్రియ క్రియా వ్యతిరేకత ద్వారానే సూక్ష్మ శరీరుడైన పరమాత్మవైపు వెళ్ళగలము. విద్వజ్జనులు దీనినే 'సూక్ష్మ శరీరావధారణ' మన్నారు.

ఈ చిన్న శరీరం దాని సృష్టికర్త మరియు పెద్ద శరీర కర్తయగు అపంచీకృత స్వామి కంటె భిన్నము కాదు. నేల లేనిదే ఏ మనిషీ నిలబడలేనట్లే ఈ నేల కూడా ఆ స్వామి లేనిదే నిలబడలేదు. అనగా మానవులకూ, వారికి ఆధారమైన పృథ్వికీ కూడా పరమాత్మయే ఆధారము. పంచభూతాలలో దేనికేది ఆధారమో ఇదివఱకు చెప్పబడింది. బాహ్యదృష్టికి అన్నిటికీ ఆధారంగా గోచరించే ఆకాశానికి కూడా ఆ మాయా ఛిన్న బ్రహ్మమే ఆధారం.

---

★ *ఇక్కడ చెప్పబడిన పాలు, వెన్న ఉదాహరణ గరుడపురాణంలో లేదు. అది వివేకానంద స్వామి ఒక రాజుగారి కొలువులో చూపి చెప్పినది.*

అయితే మాయారహితుడైన ఆ శుద్ధ బ్రహ్మ ఆకాశాన్ని ప్రకాశింపజేసి తాను అందులో ప్రవేశించి లోకులను భ్రమింపజేస్తాడు. ధ్యానికి ఈ ఆకాశం ముందుగా తెలిసి వస్తుంది. అక్కడి మాయను కూడా తొలగించగలిగిననాడు, వెలుగుల మధ్య, పరమాత్మ దర్శనమవుతుంది. అపుడు వాని హృదయం సంపూర్ణంగా శుద్ధమై జాగ్రదాది అవస్థలను జయిస్తుంది.

బ్రహ్మము నిత్య శుద్ధ, బుద్ధ, సత్య, అద్వైత భావనమని చెప్పబడింది. ఇది రెండు విశిష్ట పదాల మధ్య వుండే తత్త్వమనీ చెప్పబడింది. బ్రహ్మ వాచక పదం లేదా శబ్దం ఓంకారం. ఇందులో రెండు స్వరాలూ (అ,ఉ) ఒక అనునాసిక వ్యంజనమూ (మ్) ఉన్నాయి కదా! ఈ శబ్ద సమ్మేళనం సామాన్యమైనది కాదు. దానంతట అదే ఒక గొప్ప మహా మంత్రము.

ఈ ఆత్మ తత్త్వం పరమజ్యోతిస్స్వరూపం. ఇది చిదానంద రూపం. ఇదే సత్యజ్ఞానం, అనంతం. ఇదే "తత్త్వమసి'కి నిలయం. ఇది వేద ప్రవచనం. 'అహం బ్రహ్మోస్మి' అనగా సాంసారిక విషయాలకి అందనంత దూరంలో వున్న నిర్లిప్త దేవుడను నేను. సర్వత్ర గామియైన పరమాత్మను నేను. ఆదిత్య స్వరూపుడైన దేవదేవుని నేనే. అనాది దేవ దేవేశ్వరుడైన పరబ్రహ్మను నేను. నా ఆదిని గాని అంతాన్నిగాని కనుగొనగలిగేవారు లేరు. ఎందుకంటే అవి లేవు కాబట్టి.

ఇదే గీతాసారం. దీనిని విని బాగా తనలో ఇవతళించుకొన్నవాడు పరబ్రహ్మలో లీనమైపోతాడు అనగా జీవన్ముక్తుడవుతాడు." ***(అధ్యాయాలు - 239, 240)***

**గరుడ పురాణాంతర్గత ఆచార కాండ సమాప్తం**

***ధర్మదృఢ బద్ధమూలో వేదస్కంధః పురాణ శాఖాఢ్యః ।***
***క్రతుకుసుమో మోక్షఫలో మధుసూదన పాదపోజయతి ॥***

శ్రీ మహావిష్ణువు నొక మహావృక్షంగా భావించి వ్యాసమహర్షి ఈ విధంగా స్తుతిస్తున్నాడు. ధర్మమనే గట్టి మాను కలిగి వేదములనే స్కంధములు (కొమ్మలు కట్టి విడిపోయే భాగాలు) పురాణములు అనే కొమ్మలు కలిగిన, క్రతువులు అనే పుష్పములు కలిగి, మోక్షమనే ఫలము(లు) కల– మధుసూదనుడైన శ్రీమహావిష్ణువనే వృక్షము విరాజిల్లు తున్నది. దానికి జయమగు గాక.

❖ ❖ ❖

శ్రీ

# గరుడ పురాణం

## ధర్మకాండ - ప్రేతకల్పం

శ్రీకృష్ణచంద్ర పరబ్రహ్మణేనమః

### వైకుంఠ వర్ణన, మరణకాలంలోనూ తరువాత విభిన్న విహిత కర్తవ్యాలపై గరుత్మంతుని ప్రశ్నలు, ప్రేతకల్ప ఉపక్రమం

నైమిషారణ్యంలో సుఖాసీనుడై వున్న సూతమహర్షిని శౌనకాది మహామునులిలా ప్రార్థించారు – "శ్రీ సూతభగవాన్! జీవుడు ఒక శరీరం తరువాత ఇంకొక శరీరాన్ని ఆశ్రయిస్తాడని కొందరంటుండగా విన్నాము. మరికొందరు విద్వాంసులు ప్రాణి మృత్యువు తనను కబళించగనే యమధర్మరాజు వద్దకు పోయి రకరకాల యాతనలకు గురైన తరువాతనే మరొక శరీరాన్ని పొందుతుందని చెప్పగా కూడా విన్నాము. మరి ఏది సంపూర్ణ సత్యమో మీవంటి జ్ఞానియే తేల్చి చెప్పగలరు. దయచేసి మా సందేహ నివృత్తిని గావించండి".

సూతుడు సంతుష్టాంతరంగుడై ఇలా చెప్పసాగాడు, "మహామునులారా! మహా మేధావులైన మీరు మీ స్థాయికి తగిన ప్రశ్ననే వేశారు. ఒకప్పుడిదే ప్రశ్నను భాగవతోత్త ముడైన గరుత్మంతుడు పురుషోత్తముడైన మహావిష్ణువునడిగాడు. ఆ మహనీయుల సంవాద రూపమై గరుడ పురాణానికి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించి పెట్టబోయే ధర్మకాండ– ప్రేతకర్మ అనే మహావిషయాన్ని వినిపిస్తాను. మీ సందేహాలన్నీ తీరిపోతాయి.

బ్రహ్మాండమైన భవసాగరాన్ని ఏదో చిన్న కాలువను దాటేసినంతన సులువుగా తరింపజేయు శ్రీ కృష్ణ భగవానునికి తొలుతగా నమస్కరించి ప్రారంభిస్తున్నాను.

మునులారా! ఒకప్పుడు వినతాపుత్రుడైన బ్రహ్మాండనాయకుడు గరుత్మంతునికి ఈ బ్రహ్మాండంలోని అన్ని లోకాలనూ ఒకసారి చూడాలనిపించింది. హరి నామాన్నుచ్చరిస్తూ లోకాలను చూడసాగాడు. చివరగా స్వర్గ, పాతాళ, భూలోకాలను చూశాడు. ముఖ్యంగా పృథ్విపై గల దుఃఖాలను చూసి తానే దుఃఖితుడై పోయి అశాంత చిత్తంతో అలమటిస్తూ వైకుంఠానికి మరలాడు.

విష్ణులోకంలో రజోగుణ ప్రవృత్తీ లేదు. తమో గుణ ప్రవృత్తీ లేదు. కనీసం సత్త్వగుణంతో కలిసియైనా లేవు. ఇక్కడ కేవలం శుద్ధ సత్త్వ గుణమే ఎల్లెడలా కనిపిస్తుంది. ఇక్కడ మాయ కూడా లేదు. ఎవరికీ వినాశమూ లేదు; రాగద్వేషాదిషడ్వికారాలూ లేవు. ఈ లోకంలో దేవాసుర వర్గాల ద్వారా పూజింపబడు విష్ణువు యొక్క పార్షదులు (సభ్యులు, దగ్గరివారు) దర్శనమిస్తుంటారు. వారు కూడా స్వామి వలెనే నీలమేఘశ్యాములు, పీతాంబర ధరులు, మణియుక్త స్వర్ణాలంకృతులు, చతుర్భుజులు కూడ.వారి చెవులకి గల కుండలాలూ, తలపై నున్న కిరీటాలూ రత్నమిశ్రిత స్వర్ణకాంతుల్ని వెదజల్లుతున్నాయి. వారి వక్షస్థలాలు సుందరములైన పుష్పమాలలచే సుశోభితాలై వున్నాయి. కనిపించగానే తనువును పులకింపజేసి మనసును మరిపింపజేసే అప్సరసలున్నారు. మహాత్ములను గొని వస్తున్న విమానాలు ఆకాశం నుండి సూర్యుడు దిగి వస్తున్న భ్రాంతిని కలిగిస్తాయి. అక్కడి జనం అన్ని ప్రకారాల వైభవాలతో లక్ష్మీప్రసన్నతను కలిగి శోభిల్లుతున్నా, నిరంతరం శ్రీహరి చరణాలను పూజిస్తూనే వుంటారు.

గరుత్మంతునికి శ్రీ మహావిష్ణువు ఒక తూగుటుయ్యాలపై సుఖాసీనుడై దర్శనమిచ్చాడు. లక్ష్మీదేవి తన చెలికత్తెలతో సహస్వామి పాదార్చనతో నిమగ్నయై వుంది. సువిశాల నేత్రయుక్తమైన ప్రసన్న ముఖంతో ఆ దేవాధిపతి, జగత్పతి, శ్రీపతి, యజ్ఞపతి అగు శ్రీ మహావిష్ణువు తన ప్రధాన పార్షదులైన నంద సునందాదుల వినతులను వింటున్నాడు. ఆ సమయంలో ఆయన తన అన్యాన్య సర్వశక్తుల చేత పరివేష్టితుడై వున్నాడు. హరి దర్శనం కాగానే వినతాసుతుని హృదయం ఆనందం తట్టుకోలేక ద్రవించింది, శరీరం గగుర్పొడిచింది, నేత్రాలు అశ్రుపూరితాలయినాయి. ఆనందమగ్నుడై అతడు తన స్వామికి ప్రణమిల్లాడు.

తన వాహనమైన పక్షిరాజును కటాక్షించిన మహావిష్ణువు 'పక్షిరాజా! సుఖంగా సాగింది కదా నీ ప్రయాణం' అంటూ కుశల ప్రశ్నలు వేసి 'ఏయే దేశాలు, లోకాలు తిరిగావు? అని కూడా అడిగాడు.

వినమ్రంగా ఇలా విన్నవించుకోసాగాడు వినతాసుతుడు, "భగవన్! మీ కృప వల్ల నేను అన్ని లోకాలనూ చూడగలిగాను. వాటిలో నెలకొన్న సమస్త స్థావర, జంగమ

ప్రాణులనూ చూశాను. హేప్రభో! అన్ని లోకాల్లో కన్నా భూర్లోకంలో ప్రాణి సమూహ మెక్కువగా నున్నది. అన్ని యోనులలోకీ మానవ యోనియే భోగాలకూ మోక్షానికీ శుభా శ్రయంగా వెలుగుతోంది. మంచి పనులకు భూలోకాన్ని మించిన తావు లేదు. దేవతలు భూలోకం – అందులో భరతఖండం ఉత్తమమని ఇలా ప్రశంసిస్తుండగా నేను విన్నాను. ఎవరైతే భరతభూమిలో జన్మించి నివసిస్తారో వారు ధన్యులు.

*గాయంతి దేవాః కిల గీతకాని*
*ధన్యాస్తు యే భారత భూమి భాగే ।*
*స్వర్గాపవర్గస్య ఫలార్జనాయ*
*భవంతి భూయః పురుషాః సురత్వాత్ ॥* (ధర్మ... 1/27)

భూలోకంలో మృతి చెందిన ప్రేతం మరల భూమిపైననే పడవేయబడుతోంది. దాని నోటిలో *పంచరత్నాలను వేస్తున్నారు. శవాన్ని దర్భలపై ఉంచడం జరుగుతోంది. దాని రెండు పాదాలనూ దక్షిణ దిశవైపే తిప్పి పెడుతున్నారు. మరణ మాసన్నమైన వారి ముందు పుత్రులు, మనుమలు నిలబడి వుంటున్నారు. రకరకాల దానాలు చేస్తున్నారు. మిత్రులూ శత్రువులూ కూడా బంధు బాంధవులతో సహా క్షమాయాచన చేస్తున్నారు. నువ్వులు, ఇనుము, బంగారం, పత్తి, ఉప్పు, *సప్తధాన్యాలు– వీటిని కూడా దానం చేస్తున్నారు. ఎందుకిలా చేస్తున్నారో నాకావంతైనా అర్థం కావటం లేదు.

హే జ్ఞాన సాగరా! ప్రాణులెలా మరణిస్తారు? ఆ తరువాతెక్కడికి పోతారు? ఆ సమయంలో *ఆతివాహిక శరీరాన్ని ఎలా పొందుతారు? అగ్ని సంస్కారానికి ముందు మానవ శరీరాన్ని కొడుకులు, మనుమలు భుజంపై పెట్టుకొని ఎందుకు మోసుకెళ్తారు? శవంపై నెయ్యి పోస్తారెందుకని? ఆ సమయంలో ఒక ఆహుతినిచ్చే సంప్రదాయమెక్కడి నుండి వచ్చింది? శవానికి భూస్పర్శనెందుకు చేయించాలి? స్త్రీలు ఆ మృతవ్యక్తికై ఎందుకు రోదిస్తారు? శవానికి ఉత్తరం వైపు కూర్చుని 'యమసూక్తా'న్నెందుకు పఠిస్తారు? మృతులైన వారికి నీళ్ళివ్వడానికి ఏకవస్త్రులే కావాలని ఎందుకంటారు? ఆ సమయంలో సూర్య బింబం కోసం చూడడం, రాతిపై యవలనూ, ఆవాలనూ, దూర్వనూ, వేపాకులనూ పోసి వాటినెందుకు స్పృశిస్తారు? ఆ సమయంలో ఆడా మగా కూడా ఒంటికి కిందా పైనా ఒకే బట్టనెందుకు ధరించాలి? మృతుల పుత్రులు పదిరోజుల పాటు పిండప్రదానమెందుకు

---

**పంచరత్నాలు – స్వర్ణ, గగన, మర్త్య, నాగ, పాతాళ రత్నాలు*
**సప్తధాన్యాలు – వ్రీహి, యవ, గోధుమ, పెస, మినుము, కొఱ్ఱ, శనగ*
**నిరాధార రూపంలో ఆత్మను ధరించు శరీరం*

చేస్తారు? వేడి చేసిన మట్టి పాత్రను అరుగుపై నుంచి అందులో పాలెందుకు పోస్తారు? మూడు కఱ్ఱలను తాళ్ళతో కట్టి దానిని కూడలిలో నుంచి దానిపై ఏడాదిపాటు దీపమెందుకు వెలిగించి ఉంచుతారు? శవానికి దహన సంస్కారమే ఎందుకు చెయ్యాలి, అప్పుడా ప్రాణి ఎలాగూ ఆత్మరూపంలో ఎగిరి పోతుందంటారు కదా మరప్పుడు దానికి తొమ్మిది రోజుల పిండ ప్రదానం వల్ల ప్రయోజనమేమి? ఈ ప్రదానానికి పద్ధతి వేరేగా వుంటుందా?

స్వామీ! ఈ కర్మకాండ మనిషి మృతి చెందిన వెంటనే చేసి వేయబడుతోంది కదా, మరి వేరే మరల మరల పిండప్రదానమేల? పూర్వ పిండదానమని, పునః పిండదానమని, ఇతరేతర అపర కర్మలని చేయమంటారు కదా, వీటి ఆవశ్యకత ఏమి? దహన సంస్కారం తరువాత అస్థిసంచయ విధానమెలా వచ్చింది? (ముందో వెనకో) నీటికుండను పగులగొడతారెందుకని? రెండవ, నాల్గవ రోజుల్లో సాగ్నిక ద్విజస్నానమెందుకు చేస్తారు? పదవ రోజున పరిజనులందరితో బాటు శుద్ధి స్నానము చేస్తారు, మరి ఈ శుద్ధి అంటే ఏమిటి? పదవ రోజు నూనె రాసుకొని అభ్యంగన (తలంటి) పోసుకుంటారెందుకని? అది కూడా ఒక విశాల జలాశయతటంపైనే ఎందుకు చేయాలి? పదకొండవరోజు వృషోత్సర్గాది సహితంగా పిండదానం చేయడం వల్ల ప్రయోజనమేమి? పాత్ర, పాదుక, ఛత్ర, వస్త్ర, అంగులీయకాది దానాలిప్పుడెందుకు చేస్తారు? పదమూడవ రోజు కూడా దాన కార్యక్రమమెందుకుంటుంది? ఏడాది కాలంలో పదహారు శ్రాద్ధాలనెందుకు పెట్టాలి? మూడువందల అరవై అన్నం నీరు కుండల నెందుకు దానం చేస్తారు? రోజూ చేస్తారెందుకని, కొందరు, ఒక కుండైనా?

జ్ఞానానికి సముద్రం వంటి ఓ దేవదేవా! నీవు తప్ప నాకు దిక్కు లేదు, వేరు గురువూ లేరు. అందుకే ఇన్ని ప్రశ్నలనూ నీ వైపే మరలిస్తున్నాను. మహాప్రభో! ప్రాణులెన్నో పాపాలు చేస్తారు, కొన్ని పుణ్యాలూ చేస్తారు, దానాలిస్తారు, ఈ నానాప్రకార కర్మఫలాలన్నీ శరీరం దహనమైపోయినా, ఆ వ్యక్తి వెంట ఎలా వెళతాయి? మనిషి అనిత్యుడని వినడమైతే విన్నాను గానీ వాని ఆత్మ బయటికి శరీరాన్ని ఛేదించుకొని ఎక్కడికన్నం నుండి వస్తుందో నాకు తెలియరాలేదు. అలాగే పంచభూతాలూ, లోభ, మోహ, తృష్ణ, కామాహంకారములను అయిదుగురు దొంగలూ ఎక్కడ కన్నం వేసి పారిపోతారు?

ఇక, మృతి నొందిన వారికై సాంవత్సరికం (సపిండీకరణ) మెందుకు చేస్తారు? ఆ ప్రేత కృత్యంలో ప్రేతపిండ మెవరితో ఎలా కలపబడుతుంది?

హే జగద్గురూ! మూర్ఛలో వుండి గాని పతనం వల్ల గాని మృతి చెందిన వారికి అంత్యక్రియలు దహనం ద్వారానే చేయాలా? అగ్ని సంస్కారం లేని ఆత్మలేమవుతాయి? పాపి, దురాచారి లేదా హతబుద్ధి యైన వానికి మరణానంతరం ఎట్టి స్థితి ప్రాప్తిస్తుంది? అలాగే ఆత్మఘాతి, బ్రహ్మ హంతకుడు, స్వర్ణచోరుడు, మిత్రద్రోహి, విశ్వాసఘాతకుడు - ఇలాటి వారికి ఎలాటి గతులు పడతాయి? శూద్రుని బ్రాహ్మణ స్త్రీ పొంది వుండిపోతే, ఇద్దరూ వివాహితులే అయితే, అంతకంటే పాపముండదేమో కదా, వారికెట్టి గతి రాసి పెట్టి వుంది?

విశ్వాత్మవై విలసిల్లు విష్ణుదేవా! నాపై దయ వుంచి మరొక విషయం కూడా మీరే చెప్పాలి. సంపూర్ణ జగత్తునే చుట్టి వచ్చానని విన్నవించాను కదా! లోకులు కష్టగ్రస్తులై, దుఃఖ పీడితులై కనబడుతున్నారు. నా మనస్సు వీరి బాధలను చూసి మిక్కిలి అశాంతికి లోనైంది. స్వర్గంలో దైత్యుల వలని భయం, పుడమిపై మృత్యు, రోగ భయాలు, పాతాళంలో నేనంటే భయం, సర్వ ప్రాణులకూ అభీష్ట వస్తు వియోగ భయం పట్టి పీడిస్తున్నాయి. జగదీశ్వరా! ఈ విష్ణు లోకంలో తప్ప ఇంకెక్కడా సంపూర్ణ సుఖంగాని నిర్భయతగాని నాకు కనిపించలేదు. కాలవశీభూతమై కష్టాలతో కాపురం చేస్తూ అన్ని రకాల భయాలనూ అనుభవిస్తూ కూడా కర్మభూమిగా పేరొందిన భరతఖండం రాగ, ద్వేష, మోహాదులచే సృష్టింపబడిన బురదలో పీకలదాకా కూరుకు పోయి వుంది. రోగులూ, వికలాంగులూ కనిపించారు. విధిపూర్వకంగా వార్షిక కర్మలు జరగని వారికి దుర్గతి పడుతుందని ఋషుల ద్వారా విన్నాను. నేను చూసిన బాధలకు ఇది కూడా ఒక కారణమా?

కాబట్టి ఓ విజ్ఞానజ్యోతి స్వరూపా! మరణించిన మనిషికి కూడా శుభాన్ని కలిగించే ప్రక్రియ వుంటే నాకు బోధించండి. దానాలివ్వాలా, ఏ మేరకు? దహన సంస్కారమెలా చెయ్యాలి? స్మశానికి మృతులు చేరుకొనేలోగా చేయవలసిన కర్మలుంటాయా? దుష్టులు మృతి చెందినపుడు వారి పాపాలకు ప్రాయశ్చిత్తాలను వారి సంతానం చేస్తే ప్రయోజనముంటుందా? పంచకశాంతినెలా చేపట్టాలి? మరణాసన్న వ్యక్తి, మృతి చెందిన వ్యక్తి, దహనమై పోయి పంచభూతాలలో కలిసిపోయిన వ్యక్తి ఈ మూడు రకాల వారికీ కర్మల ద్వారా శుభాన్ని కలిగించే మార్గాలుంటే, నాపై ఈ లోకంపై దయ వుంచి నాకుపదేశించండి".

***(అధ్యాయం -1)***

# మరణాసన్న, మృత్యు పూర్వ సమయాల్లో చేయవలసిన కర్మలు

సూతమహర్షి ఇలా ప్రవచించసాగాడు. "మునులారా! నిర్మల మనస్కుడై లోక కల్యాణం కోసం ఆరాటపడుతూ అన్ని ప్రశ్నలను సంధించిన గరుత్మంతుని ఆంతర్యాన్ని గ్రహించిన పరమాత్మ వెంటనే ఇలా ఉపదేశించసాగాడు –

★వత్సా! వైనతేయా! మానవ హితం కోరి ఒక మహా విషయానికి ప్రపంచంలో ప్రాచుర్యం కలిగించబోతున్న నీ ధన్యత కోసమైనా ఈ రహస్య విషయాన్ని చెప్పాలి. అస్తు. అవధరించు. వీటిని ఔర్ధ్వ దైహిక ★క్రియలంటారు.

సమ్య గ్రూపం వల్ల భేదరహితమై, శ్రుతి స్మృతి – అను పవిత్ర గ్రంథాలలో మాత్రమే పేర్కొనబడి, ఇంద్రాది దేవతలూ, యోగులూ కూడా నేర్వని గుహ్యాతి గుహ్యమైన ఈ మహాతత్త్వజనకమైన విషయాన్ని నువ్వు నా మహాభక్తుడివి కాబట్టి నీ ద్వారా బహిర్గతపఱుస్తున్నాను.

పక్షీంద్రా! ఈ ప్రపంచంలో పుత్రహీనులకు సద్గతులుండవు. కాబట్టి ప్రతి వ్యక్తీ శాస్త్రానుసారం, యోగానుసారం పుత్రుని ఉత్పన్నం చేయడం తప్పని సరి. ఎందుకంటే పుత్ర పౌత్రులే ఆ వ్యక్తి ఆత్మని పరలోకంలో మోస్తారు. అందుకు సంకేతంగానే ఇహలోకంలో వ్యక్తి మృత దేహాన్ని పుత్రపౌత్రులు భుజాలపై మోస్తారు.

మృతదేహాన్ని దహనమే చేయాలి. శవాన్ని తిలలు, దర్భలపై నేల మీద పడుకోబెట్టాలి. ఈ తిలల వల్ల దర్భల వల్ల భూమి ఋతుమతియైన స్త్రీతో సమానమవుతుంది. మృతుల నోటిలో వేయు పంచరత్నాలు బీజావాపంతో సమానం. అవి ఆ జీవి శుభగతిని నిశ్చయించగలవు. ఆత్మ శుభయోనిలో ప్రవేశించడానికి దారిని సుగమం చేయగలవు.

అన్నిటికన్న ముందు నేలను పేడతో అలకాలి. తరువాత దానిపై తిలలనూ కుశలనూ పరవాలి. మరణాసన్నవేళలో సదరు వ్యక్తిని వాటిపై పడుకోబెట్టాలి. ఇలా చెయ్యడం వల్ల ఆ మనిషి ప్రాణం పోయేలోగా కొన్ని పాపాలు దగ్ధమవుతాయి. దర్భలకు ఆ వ్యక్తిని స్వర్గానికి గొనిపోయే శక్తి వుంటుంది. మలమూత్రాదులు గాని ఆ ప్రదేశంలో వుంటే తొలగించి గోమయంతో శుద్ధి చేయాలి. ఆవు పేడతో అలకకుండా భూమిపై నుంచబడిన మరణాసన్న వ్యక్తి పైకి యక్ష, పిశాచ, రాక్షస గణాలు క్రిముల రూపంలో దాడి చేస్తాయి.

---

*★ఈ పిలుపులో, సంబోధనలోనే స్వామికి, గరుడునిపై గల వాత్సల్యం, బయటపడుతోంది. అందుకేనేమో దేవతలలో నేనెంతో పురాణాలలో గరుడ పురాణం అంత' అని కూడా ప్రవచించాడు.*

*★ఊర్ధ్వ, దేహ అనే రెండు పదాలకీ సంస్కృత వ్యాకరణం ప్రకారం ఆదివృద్ధి వచ్చి ఈ పదమేర్పడింది. పైకి లేచిన శరీరానికి సంబంధించిన కర్మలు అని భావము.*

భూమిపై ★జలంతో ఒక మండలాన్నేర్పాటు చేసి దానిపై ఆ వ్యక్తిని పడుకోబెట్టాలి. ఇది ముక్తిదాయకం. నిత్య హోమం, శ్రాద్ధం, పాదప్రక్షాళనం, బ్రాహ్మణులనర్చించుట, భూమండలీకరణ - వీటిని ముక్తిహేతువులుగా పరిగణిస్తారు. ఈ మండలంలో బ్రహ్మ, విష్ణు, రుద్ర, లక్ష్మి, అగ్ని- మున్నగు దేవతలు ప్రకాశిస్తుంటారు. మండల జలంలో మరణించని వారికి మంచి యోని దొరకదు. వారి జీవాత్మలు బహుకాలం పాటు గాలిలో దిక్కుతోచక తిరుగుతూనే వుండి పోతాయి. వారికి శ్రాద్ధాలలో నిచ్చు ఏ తర్పణలూ అందవు.

గరుత్మంతా! తిలలు నా చెమట నుండి పుట్టినవి కావడంతో పరమ పవిత్రాలయినవి. తిలలను ప్రయోగిస్తే అసుర, దానవ, దైత్యగణాలు పారిపోతాయి. తిలలు తెల్లగానూ నల్లగానూ గోమూత్రపు రంగులోనూ వుంటాయి. ప్రతివ్యక్తీ వీటిని వాడుతూ 'ఇవి నా శరీరం ద్వారా చేయబడినట్టి సమస్త పాపములనూ నశింపజేయాలి గాక' అని భావించు కుంటుండాలి. తిల దానం స్వర్ణదానం వలె పుణ్యశాలిని. తర్పణాలలో, దానాలలో, హోమా లలో చేయబడు తిలదానానికి అక్షయ ఫలాలుంటాయి.

కుశదర్భలు నా శరీరం మీది రోమాల నుండి పుట్టినవి. అందుకే వాటిని వాడిన చోట దేవతలు తృప్తి చెందుతారు. తిలలు పితరులను తృప్తి పరుస్తాయి. దేవతలూ పితరులూ విశ్వరక్షకులు కాబట్టి కుశలూ తిలలూ విశ్వకల్యాణ కారకాలవుతున్నాయి. అపసవ్యాది శ్రాద్ధాలకు చెప్పబడిన విధి విధానాలను పాటిస్తే బ్రహ్మ, దేవదేవేశ్వరుడు, పితృజనులు సంతోషిస్తారు.

*మమస్వేద సముద్భూతా స్తిలా స్తార్క్ష్య పవిత్రకాః ।*
*అసురాదానవాదైత్యా విద్రవంతి తిలైస్తథా ॥*
*తిలాశ్వేత స్తిలా కృష్ణా స్తిలా గోమూత్ర సన్నిభాః ।*
*దహంతు తే మే పాపినా శరీరేణ కృతాని వై ॥*
*ఏక ఏవ తిలోదత్తో హేమద్రోణ తిలైః సమః ।*
*తర్పణే దాన హోమేషు దత్తోభవతి చాక్షయః ॥*
*దర్భారోమ సముద్భూతాః తిలాః స్వేదేషు నాన్యథా ।*
*దేవతా దానవా స్తృప్తాః శ్రాద్ధేన పితర స్తథా ॥*
*ప్రయోగ విధి నా బ్రహ్మే విశ్వంచాప్యుప జీవనాత్ ।*
*అపసవ్యాదితో బ్రహ్మే పితరో దేవ దేవతాః ॥*
*తేనతే పితరస్తృప్తా అపసవ్యే కృతే సతి ।* *(ధర్మ...2/16-21)*

★జలమండలమనగా నీరు తడి, నేల పై గోళాకారంలో మండలం కొలతతో రేఖను గీసి పవిత్రీకరించుట

కుశదర్భ మూలాన్ని బ్రహ్మగానూ, మధ్య భాగాన్ని విష్ణువుగానూ, అగ్రాన్ని శివునిగాను తెలుసుకోవాలి. ఈ త్రిదేవులూ కుశలో ప్రతిష్ఠితులు. బ్రాహ్మణుడు, మంత్రం, అగ్ని, తులసి, కుశ - వీటికి అపవిత్రత లేదు. ఎన్నిమార్లైనను ప్రయోగించవచ్చును, ఉపయోగించుకోవచ్చును. అవి నిర్మాల్యములు కానేరవు. అలాగే తులసి, బ్రాహ్మణుడు, విష్ణువు, గోవు, ఏకాదశి వ్రతం- ఇవి అయిదూ సంసార సాగరంలో మునిగిపోతున్న వారిని రక్షించు నౌకలు. విష్ణువు, ఏకాదశి వ్రతం, గీత, తులసి, బ్రాహ్మణుడు, గోవు -ఈ ఆరూ అసారసంసారంలో పడి వున్న జీవులకు ముక్తినిచ్చు 'షట్పది' సాధనాలు.

*దర్భమూలే స్థితో బ్రహ్మ మధ్యే దేవో జనార్దనః ॥*
*దర్భాగ్రే శంకరం విద్యాత్ త్రయోదేవాః కుశేస్మృతాః ।*
*విప్రమంత్రాః కుశా వహ్ని స్తులసీ చ ఖగేశ్వర ॥*
*నైతే నిర్మాల్యతాం యాంతి క్రియమాణాః పునః పునః ।*
*తులసీ బ్రాహ్మణాగావో విష్ణురేకాదశీ ఖగ ॥*
*పంచప్రవహణాన్యేవ భవాబ్ధౌ మజ్జతాం నృణాం ।*
*విష్ణురే కాదశీ గీతా తులసీ విప్రధేనవః ॥*
*అసారే దుర్గ సంసారే షట్పదీ ముక్తిదాయినీ ।* ***(ధర్మ...2/12-15)***

మరణాసన్న వ్యక్తికి దుర్గతి కలుగకుండా తిల, కుశ, తులసి కాపాడుతాయి.

*తిలాః పవిత్రమతులం దర్భాస్యా పితుల స్యథ ॥*
*నివారయంతి చైతాని దుర్గతిం యాంత మాతురం॥* ***(ధర్మ...2/25,26)***

రెండు చేతులతోనూ కుశలను చీల్చి నేలపై వుంచి వాటిపై నీటిని జల్లి మరల పైకి తీసి మరణాసన్న వ్యక్తి రెండు చేతులలోనూ ఉంచాలి. అపుడా వ్యక్తి మంత్రహీనకర్ముడైనా విష్ణు లోకాన్ని పొందగలడు. దర్భపై శయనం, మృతి, పేడచే అలకబడిన నేలపై మృతి, అగ్నిలో దహనం ఆ వ్యక్తి చేసిన పాపాలను దగ్ధం చేస్తాయి.

లవణం, దాని రసం దివ్యలోక ప్రాపకాలు. అవి ప్రాణుల సమస్త కామనలనూ సిద్ధింపజేయగలవు. లవణం లేని భోజనానికి అర్థం లేదు. అందుచేతనే లవణరసమంటే పితరులకు మిక్కిలి ప్రీతి. అది స్వర్గానికి దారులు తీయగలదు. ఈ లవణ రసం విష్ణు భగవానుని శరీరం నుండి ఉత్పన్నమైంది. ఈ విషయాన్ని తెలిసిన యోగులు దానంతో పాటు లవణాన్నీ అడిగి పుచ్చుకుంటారు. నేలపై ఏ వర్ణపు మరణాసన్న వ్యక్తికైనా మరణం రాక వేదన దుర్భరంగా వుంటే లవణ రసాన్ని దానం చేస్తే వారి కొఱకై స్వర్గద్వారాలు తెఱచుకుంటాయి. లవణ దానాన్ని ఆ వ్యక్తి పేర ఇచ్చినా అదే ఫలం.

గరుత్మాన్! ఇక మృత్యు స్వరూపాన్ని విస్తార పూర్వకంగా విను. మృత్యువే కాలం. ఆ సమయం రాగానే దేహం నుండీ ప్రాణం నుండీ జీవాత్మ విడివడిపోతుంది. తను రావలసిన వేళకే మృత్యువు, ఎట్టి పరిస్థితుల్లోనూ వస్తుంది. ఈ మృత్యు కష్ట ప్రభావం వల్ల ప్రాణి తాను చేసిన కర్మలన్నిటినీ ఒక్కసారిగా మరచిపోతుంది. మేఘం వాయువు వశంలోనున్నట్లుగా ప్రాణి కాలవశంలో వుంటాడు. సాత్త్విక, రాజసిక, తామసిక భావాలన్నీ కాలం చెప్పుచేతల్లోనే వుంటాయి. ప్రాణులలో అవి కాలనియోగం వల్లనే విస్తరిస్తూ పోతాయి. సూర్య, చంద్ర, శివ, వాయు, ఇంద్ర, అగ్ని, ఆకాశ, పృథ్వి, మిత్ర, ఔషధ, అష్టవసు, నది, సాగర, భావ, అభావాది మహా విషయాలన్నీ వాటి వాటి సమయాల్లో కాలానుసారము కాలంలోనుద్భవిస్తూ, పెరుగుతూ, కనుమరుగవుతుంటాయి.

మృత్యువు సాధారణ వ్యక్తులకెలా వస్తుందో చూడు. దానికి ముందే దైవయోగం వల్ల రోగమొస్తుంది. ఇంద్రియాలు వికలమై పోయి బలము, ఓజస్సు, వేగము శిథిలమైపోతాయి. కోటి తేళ్ళు ఒకేసారి కుట్టినంత బాధ కలుగుతుంది. మెల్లగా చైతన్యం తగ్గుతుంటే జడత్వం పెరుగుతుంటుంది. యమదూతలు మృతి చెందుతున్న వ్యక్తికే కనిపిస్తారు. వచ్చి పక్కనే నిలబడతారు. శరీరంలో ప్రాణం ఎక్కడ దాక్కుందో వారికి సులువుగా తెలిసిపోతుంది. వారు దానిని గేలంతో లాగడం మొదలెడతారు. అప్పుడు ప్రాణం, అతిబలవంతం మీద కంఠం దాకా వచ్చి మొరాయిస్తుంది. ఈ పెనుగులాటలో మనిషి ముఖం వికృతంగా తయారవుతుంది. నోటినుండి నురగ వెలువడుతుంది. ముక్కు నుండి ద్రవం కారుతుంది. తరువాత ప్రాణం హాహాకారం చేస్తూ అహంకార మమకారాల నింకా వదులుకోలేక యమదూతల బలానికి లొంగి బయటికి పోతుంది. అలా పోతూ పోతూ కూడా తన ఇంటివైపు తన ఆలుబిడ్డల వైపు ఆర్తిగా, కనుమరుగయ్యేదాకా (నిజానికి ఇక్కడ పని చేసేది కనులు కాకపోయినా) మనసుతోనే చూస్తూ పోతుంది.

మృత్యు సమయంలో ప్రాణి శరీరంలోని వాయువు ప్రకుపితమై తీవ్రగతితో ప్రవహించి అగ్నితత్త్వాన్ని పెచ్చురిల్ల జేయడంతో ఇంధనం లేకుండానే అగ్ని ప్రజ్వరిల్లిపోయి ప్రాణి యొక్క మర్మస్థానాలను విరిచి అత్యంత కష్టానుభూతిని కలిగిస్తుంది. అదే భక్తజనులకూ, భోగాలపై ఆసక్తి లేనివారికీ ఆ వాయువు ప్రశాంతంగా పైకి ప్రవహించి నిర్గమిస్తుంది.

అబద్ధమాడని వారికీ, విశ్వాసాన్ని వమ్ము చేయనివారికీ, ఆస్తికులకూ, పూజాదులపై శ్రద్ధాళువులకు మృత్యువు సుఖపూర్వకంగా వుంటుంది. కామానికి లొంగకుండా, ఈర్ష్యాద్వేషాలను పెంచకుండా త్రుంచుటలో విజయులై, స్వధర్మాన్ని జీవిత పర్యంతమూ

నిర్వహించి, సదాచారులుగా సౌమ్యులుగా జీవించిన వారిని మృత్యువే మాత్రమూ బాధింపకుండా మృదువుగా సుఖంగా గొనిపోతుంది.

మోహంలో అజ్ఞానంలో దేశాన్ని గిరవాటేసి తాము బాగుపడిపోవడం కోసం కొందరు ఆ మోహ, అజ్ఞానాలనే జనాలకుపదేశిస్తారు. అలాటి వారు మృత్యుసమయంలో భయంకరమైన చిక్కటి కనులు పొడుచుకున్నా ఏమీ కనబడని చీకటి గుయ్యారంలో పడి కొట్టుకుంటున్న అనుభూతిని పొందుతారు. అబద్ధపు సాక్ష్యాలనిచ్చువారూ, అసత్య వాదులూ, విశ్వాసఘాతకులూ, వేద నిందకులూ మూర్ఛ రూపంలో మృత్యువు నొందుతారు. వారికి యమదూతలు లాటీ, సమ్మెట, ఇనుపగదలను ధరించి వాటిని ఝళిపిస్తూ దర్శనమిస్తారు. వారు దుర్గంధాన్ని వెదజల్లుతూ పరమభయంకరంగా వుంటారు. వారిని చూడగానే మూర్ఛ తేలిపోయి విపరీతమైన భయం వేసి ఒళ్ళంతా వణికిపోతుండగా ఈ ప్రాణులు తమ రక్షణకై రమ్మని ఆక్రందిస్తూ తల్లిదండ్రులనో పుత్రులనో అఱచి అఱచి పిలుస్తారు. కాని గొంతు పెగలదు. ఎంత గింజుకు చచ్చినా శబ్దం రాదు. ఇతరులకు వీరు మూర్ఛితులుగానే కనిపిస్తుంటారు. తటాలున కనులు తెఱచుకుంటాయి; అవి గుండ్రగా భయంకరంగా వికృతంగా కదులుతాయి; ఎగవూపిరి వస్తుంది; ముఖం పొడి పొడిగా అయిపోయి భరింపరాని వేదనపడుతూ మృతులవుతారు. వారి శరీరాన్ని చూడడానికి కూడా, ఆత్మీయులే ఇష్టపడరు.

ఇక నీ రెండవ ప్రశ్నకు సమాధానం విను. భూలోకంలోని జీవాలన్నీ పూర్వజన్మలలోని కర్మఫలాలను భోగిస్తూ భ్రమిస్తుంటాయి. దేవ, అసుర, యక్షాది యోనులలో సుఖాలను భోగించడానికే పుడతారు. మనుష్య, పశు, పక్ష్యాది యోనులలో పుట్టక దుఃఖమయ జీవనానికి ప్రారంభం. ఓ ఖగేశ్వరా! ముందలి జన్మలన్నీ వెనుకటి జన్మలతో బంధితాలయి వుంటాయి. అప్పట్లో చేసిన పాపపుణ్యాల ఫలాలలో తారతమ్యాలే ఇప్పట్లో వీరనుభవించే కష్టసుఖాలు. దీనినే కర్మవిపాకమనవచ్చును.

ఒక జన్మలోని మహాపాపాలకి నరకంలో శిక్షననుభవించి కూడా మరుజన్మలో ఆ పాపానికి తగిన యోనిలో జన్మిస్తారు. ఈ జన్మంలో పుణ్యం చేస్తే కథ మారవచ్చు.

ఏ పాపానికి ఏ జన్మ వస్తుందో విను.

| పాపం | జన్మ |
|---|---|
| బ్రాహ్మణుని గాయపఱచుట | క్రిమి, కీటక, పురుగు |
| బ్రహ్మహత్య (ఒకే జన్మలో) | చండాల, క్షయరోగి |
| గో హత్య (ఒకే జన్మలో) | చండాల, మరుగుజ్జు |
| కన్యాహత్య (ఒకే జన్మలో) | చండాల, కుష్ఠరోగి |
| స్త్రీహత్య, గర్భపాతం (ఒకే జన్మలో) | భిల్ల, నిత్యరోగి |
| స్వగోత్రస్త్రీ సంపర్కం | నపుంసక |
| గురుపత్నీ గమనం (క్రమంగా) | దీపం పురుగు, క్రిమి, గడ్డి, లత, దుబ్బు |
| బ్రాహ్మణుడై మాంసభక్షణ | అతిరక్ష అనే కుష్ఠ |
| బ్రాహ్మణుడై మద్యపానం | వక్ర, అసితదంత |
| ఇతరులకు పెట్టకుండా మధుర పదార్థాలను తినుట | గలగండ రోగి |
| బ్రాహ్మణుడై అభక్ష్య భక్షణం | మహోదరజాడ్యం |
| శ్రాద్ధంలో అశుచి ఆహారం పెట్టుట | చిత్రకుష్ఠువు అనే రోగి |
| అబద్ధపు సాక్ష్యం | మూగ |
| పంక్తిలో వలపక్ష భోజనం | ఒంటికన్ను |
| పెళ్ళిని చెడగొట్టుట | నిరోష్ఠుడు |
| పుస్తకచౌర్యం | గుడ్డి |
| గోబ్రాహ్మణులను కాలితో తన్నుట | కుంటి |
| అబద్ధాలు చెప్పుట | నత్తి, నంగి |
| అబద్ధాలను చెప్పించి, వినుట | చెవిటి |
| శివధనాపహరణ, నిర్మాల్యం వాడకం | శిశ్నం నొప్పి |
| విషం పెట్టుట | జడ, ఉన్మత్త |
| ఇళ్ళు తగలబెట్టుట | పుట్టుక నుండే బట్టతల |

| పాపం | జన్మ |
|---|---|
| మాంసం అమ్ముట | కురూపి |
| రత్నాల దొంగతనం | హీనత్వం |
| బంగారం దొంగతనం | పుప్పిగోళ్ళు |
| లోహాది చౌర్యం | నిర్ధనుడు |
| అన్నం దొంగతనం | ఎలుక |
| ధాన్యం దొంగతనం | మిడత |
| నీళ్ళు దొంగతనం | చాతకపక్షి |
| కూరల, ఆకుల అపహరణ | నెమలి |
| పరిమళద్రవ్యాల అపహరణ | చుంచు |
| మాంసం దొంగతనం | గ్రద్ద |
| తేనె దొంగతనం | దోమ |
| ఉప్పు దొంగతనం | చీమ |
| ఫలపుష్ప పత్రచౌర్యం | అడవికోతి |
| చెప్పులు, గడ్డి దూది అపహరణ | మేక |
| దారి దోపిడీ/వేట | కటిక ఇంటి మేక |
| విషం ద్వారా ఆత్మహత్య | కొండ నల్లత్రాచు |
| వ్యభిచారం | అడవి ఏనుగు |
| గాయత్రి జపం, సంధ్యోపాసనమానుట | కొంగ |
| ఎవరూ పిలువకనే భోజనానికి వచ్చుట | కాకి |
| గురువును అవమానించుట | నిర్జలాటవిలో బ్రహ్మరాక్షసి |
| బ్రాహ్మణులను పిలిచి దానమివ్వకపోవుట | అడవి నక్క |
| మిత్రద్రోహి | పర్వతంపై గ్రద్ద |
| అమ్మకాలలో మాయ | గుడ్లగూబ |

| పాపం | జన్మ |
|---|---|
| ఆచార నిరసన | అడవిపావురం |
| స్వకుటుంబద్వేషి | పిండదశలోనే బహుమృతులు |
| ప్రతిరోజూ కలహించే స్త్రీ | జలగ |
| తాపస స్త్రీపై కామ వికారం | పిశాచ |
| పర పురుషునిపై కోరిక | బల్లి |
| (ఆ కోరికలో) భర్తను కాదనుట | రెండు తలల పాము |
| ఈడేరని బాలికతో కామక్రీడ | అడవిలో కొండచిలువ |
| గురుపత్నిపై కోరిక | తొండ |
| రాజపత్ని, మిత్రుని భార్యపై కోరిక | గాడిద |
| *దేవలకుడు | కోడి |
| అతికాముకుడు | గుఱ్ఱం |
| శీలవతియైన భార్యను త్యజించుట | దరిద్రుడు |
| ఇతర బ్రాహ్మణ పత్నితో అక్రమం | నక్క |
| శయ్యను దొంగిలించుట | దరిద్ర |
| వస్త్రహరణం | దీపం పురుగు |
| మాత్సర్యంతో బాధించుట | జన్మాంధ |
| దీపాలదొంగ | కపాలి |
| పితృనింద | క్షయరోగి |
| వివాహ విఘ్నకర్తృత్వం | మొసలి |
| కూడలిలో మలాది విసర్జన | అపశూద్ర |
| కన్యపై అపవాదు | నపుంసక |

* దేవాలయాలలో పనిచేసి జీతం పుచ్చుకొనేవాడు

| పాపం | జన్మ |
|---|---|
| వేదాన్ని అమ్మి అన్యాయం చేత | **పులి** |
| అయాజ్యయజ్ఞం | **ఆడుపంది** |
| అడవులను తగలబెట్టుట | **మిణుగురు** |
| దాతకిష్టం లేకున్నా ఒత్తిడితో ఇప్పించుట | **ఎద్దు** |
| ఎవరికీ పెట్టకుండా భుజించుట | **సంతానహీనత** |
| గృహాదులకు నిప్పు పెట్టుట | **కుష్టురోగి** |
| పాల దొంగతనం | **కొంగ** |
| బ్రాహ్మణునికి పాసిపోయిన అన్నం పెట్టుట | **గూని** |
| ★ఆరూఢ పాతిత్యం | **పిశాచ** |
| అసత్యంగా నిందలేయుట | **తాబేలు** |
| బ్రాహ్మణుడైయుండి శూద్రను పెండ్లాడుట | **తోడేలు** |
| జలప్రవాహాన్ని పాడు చేయుట | **చేప** |
| హరికథనూ, కథకునీ నిరాదరించుట | **కర్ణరోగి** |
| నోటికాడి కూటిని లాగివేయుట | **మందబుద్ధి** |
| దంభాలు చెప్పుకొనుట | **గజచర్మరోగి** |

ఈ పాపాలను చేసే స్త్రీలు వచ్చే జన్మలో పురుష జన్మ నెత్తకపోతే ఈ పాపులకే పత్నులుగా జన్మిస్తారు. ఓయి ఖగపతీ! మిగిలిన పాపాలకు నరకాన్ననుభవించి మరల పుడమిపై పడినపుడు పైన చెప్పిన జన్మలెత్తుతారని తెలుసుకోవాలి. ఈ జగత్తులో ఎన్ని ద్రవ్య రూపాలున్నాయో అన్ని విభిన్న ప్రాణ జాతులూ వున్నాయి. కాబట్టి పాపానికి దూరంగా పోతూ వీలైనన్ని పుణ్యకార్యాలనే చేస్తూ బ్రతికే మనిషే 'ఇక్కడా', 'అక్కడా' సుఖపడడం జరుగుతుంది. ***(అధ్యాయం - 2)***

★సన్యాసం పుచ్చుకొని వదిలేసి మరల స్త్రీని కూడుట

# నరకస్వరూపం, అక్కడి వివిధ యాతనలు, అందులో పడే జీవుల గతి

నరకాలు చాలానే వున్నాయి గానీ కొన్నిటిని మాత్రం వర్ణిస్తాను. 'రౌరవ' మను పేరు గల నరకం ప్రధానమైనది. అబద్ధాలు చెప్పి, అబద్ధ సాక్ష్యాలిచ్చి ప్రజల హింసలకు కారకులైన వారిని ఈ నరకంలో శిక్షిస్తారు. దీని వైశాల్యం రెండు వేల యోజనాలు. దీని చుట్టూ దుస్తరమై తొడల దాకా వచ్చు కందకముంది. అది అగ్నిమయం. ★(మధ్య మధ్యలో పాపులను అందులో పడేసి మరల తీస్తుంటారు. నరకానికి రాగానే ప్రతి ఆత్మకూ ఒక శరీరాన్నిస్తారు. అది కాలుతుంది, చురుకుతుంది, తీవ్రమైన బాధ తెలుస్తూనే వుంటుంది. కాని ఆ శరీరం భస్మం కాదు. మృతి చెందదు). అందులో పడ్డ పాపులు ఆ వేడిని తట్టుకోలేక అటూ ఇటూ పరుగెడతారు. కాళ్ళు బొబ్బలెక్కి కన్నాలు పడిపోతాయి. వ్యక్తి చేసిన పాపాన్ని బట్టి అగ్ని తీవ్రత ఉంటుంది. అలా ఒక వేయి యోజనాల దూరం పరుగు పెట్టాక ఆ పాపి ఆత్మ మరో నరకంలోకి త్రోసివేయబడుతుంది. ఇక మహారౌరవ నరకముంది.

ఈ నరకం అయిదువేల యోజనాల విస్తీర్ణంలో పఱచుకొని వుంది. అక్కడ నేల రాగిరేకు వలె వుంటుంది. దాని క్రింద అగ్ని నిత్యం రగులుతుంటుంది. ఆ భూమి విద్యుత్ ప్రభాసమాన కాంతులీనుతుంటుంది. అది పాపులకి అతి భయంకరంగా దర్శనమిస్తుంది. యమదూతలు పాపుల కాలుసేతులను గట్టిగా కట్టి వైచి ఆ నేలపై దొర్లిస్తారు. పాపి అలా దొర్లుతూనే వుండగా మార్గంలో కాకులు, కొంగలు, తోడేళ్ళు, గుడ్లగూబలు, మొసళ్ళు, తేళ్ళు వచ్చి పొడుస్తూ, చీల్చుతూ, కరుస్తూ, కుడుతూ అందినంతమేరకు నమిలి తింటూ వుంటాయి. పాపి కనుల ముందే వాని శరీరం ముక్కలు చేయబడి తినబడుతుంటుంది. పాపులు అరుస్తారు, ఏడుస్తారు, కేకలేస్తారు, అయినా దొర్లించబడుతూనే వుంటారు. వారి శిక్షా కాలం పూర్తి అయ్యేదాకా తినబడడానికే అన్నట్టు ఆ నారకీయ శరీరం అలా మిగులుతూనే వుంటుంది. పాప తీవ్రతను బట్టి శిక్షాకాలం వుంటుంది. అది పూర్తికాగానే తెలివి తప్పుతుంది. తెలివి వచ్చేసరికి మరో నరకంలోనో, మరో యోనిలోనో.... ఎక్కడో.

గరుడా! అతి శీతమను పేరు గల మరో నరకముంది. ఇక్కడ అత్యంత శీతలం బాధపెడుతుంది. దీని పొడవు వెడల్పులు మహా రౌరవంతో సమానంగానే వుంటాయి. చిక్కటి చీకటి అంతటా నిండి వుంటుంది. సహింపరాని కష్టాన్ని కలిగించడం కోసం

---

★*ఈ విషయమిక్కడ కనుపింపదు కాని అన్యత్ర చెప్పబడింది. అందుకే బ్రాకెట్స్‌లో వుంచడం జరిగింది.*

యమదూతలు పాపులను ఆ చీకటి కూపంలాటి లోకంలోకి విసిరేస్తారు. పాపులకు దిక్కు తోచదు. గుడ్డితనం వచ్చేసిందేమోనని భయమేస్తుంది. తట్టుకోలేనంత వణకుతో శరీరం తల్లడిల్లిపోతుంటుంది. పళ్ళు టపటపా కొట్టుకొని విరిగిపోతుంటాయి. ఇతర పాపులు తగులుతుంటారు. ఆలింగనం చేసుకుంటారు. కాని, వారు తమ లాటి వారో పిశాచాలో రక్కసులో తెలియదుగా! పీక్కు తింటారేమో అనే భయంతో విడివడిపోతుంటారు. అక్కడ దాహం, ఆకలీ చాలా ఎక్కువగా వుంటాయి. ఎంత తడిమినా తినడానికీ తాగడానికీ ఏమీ తగలవు. ఇంతేకాక మంచుగడ్డల్ని మరింత గడ్డకట్టించేటంత అతి భీకర శీతలవాయువులు అక్కడ వీస్తుంటాయి. ఆ గాలుల తాకిడికి ఎముకలు పుటుక్కున విరిగిపోతుంటాయి. శిక్షాకాలం అయిపోగానే ఈ తమసావృత నరకం నుండి ఆత్మ వెలుగులోకి వచ్చిపడుతుంది.

ఖగరాజా! అసంఖ్యాకంగా పాపాలు చేసినవారు ఇందాక అనుకున్నట్లు వెలుగులో పడరు. 'నికృంతన' మను పేరిట ప్రసిద్ధమైన మరోనరకంలో పడతారు. ఇక్కడ కుమ్మరి చక్రాల్లాటి చక్రాలుంటాయి. నిజానికవి దర్జీ చక్రాలు. వాటి క్రిందని సూదులుంటాయి. చక్రం కదలగానే అవి పాపి కాలి నుండి శిరస్సు దాకా ప్రయాణిస్తాయి. యమదూతలు పాపులను ఆ చక్రాలపై నిలబెట్టి వాటిని తిప్పుతారు. అవి అలా తిరుగుతూనే వుంటాయి. పాపి శరీరం అరికాలి నుండి శిరస్సు దాకా పోయి తాలువులోంచి పైకి వచ్చి మరల అదే అరికాలిలో మరొక కన్నం చేసుకొని ప్రవేశించే పొడవాటి సూదులతో కుట్టబడుతూనే వుంటుంది.

అరుణానుజా! అప్రతిష్ఠమను పేరు గల ఇంకో నరకముంది. అక్కడ పడే పాపులు అసహ్యదుఃఖాలననుభవిస్తారు. వీరు దారుణ దుఃఖం పాలగుటకు కారణం ఇక్కడి చక్రం, దాని పైనుండు గిలక. పాపులను ఈ చక్రంపై కట్టి పడేస్తారు. ఆ చక్రం తిరిగినపుడల్లా పై నుండి బల్లెములు అసంఖ్యాకంగా వచ్చి గుచ్చుకుంటూ వుంటాయి. ఆ చక్రం చాలా వేగంగా తిరుగుతుంటుంది. పాపుల అన్ని రంధ్రాల నుండీ రక్తం కారుతూనే వుంటుంది.

ఖగేంద్రా! అసిపత్రవనమనే పేరు గల వేరొక నరకాన్ని వర్ణిస్తాను. ఇదొక వేయి యోజనాల మేరపఱచుకొని వుంటుంది. ఇక్కడి నేల నిరంతరం అగ్నిజ్వాలల్లో మండుతూ వుంటుంది. ఈ భయంకర నరకంలో పదునాల్గురు సూర్యులు నిత్యం తిరుగుతూ ఎండలో ఆ వాతావరణాన్ని కాలుస్తుంటారు. అక్కడి పాపులు నిత్యం హాహాకారాలు చేస్తూ తగలబడుతుంటారు. కాని శరీరాలూ అలాగే వుంటాయి. ఒంటిమంటలూ అలాగే ఉంటాయి. ఈ నరకంలోనే నాలుగవ భాగంలో 'శీతస్నిగ్ధపత్ర' మనువనమున్నది. ఇక్కడ

పండ్లూ ఆకులూ నేలపై కుప్పలుగా పడివుంటాయి కాని అక్కడే ఘోర మాంసాహారులూ పులుల కన్న శక్తిమంతాలూనగు వేటకుక్కలు కూడా వుంటాయి. వాటి వదనాలు మరీ పెద్దవిగానూ వాటిలోనూ దంతాలు పరమ బలిష్టంగానూ పారల వలె పైకీ గునపాల వలె క్రిందికీ వుంటాయి. చల్లగా నీడలు పఱచుకొని వున్న ఆ వనాన్ని చూసి ఆకలీ దాహమూ తీర్చుకుందామనే ఆత్రంతో ప్రాణులటువైపు వెళతారుగానీ అక్కడ అతి శీతల వాయువులు కత్తుల కన్నా క్రూరంగా బాధాకరంగా శరీరంలోకి గుచ్చుకుంటాయి. ఇవి ఇలా వుండగా అగ్గిలో పడి బొబ్బలెక్కిన వారి కాయాలపై పైనుండి ఆకులు రాలి పడతాయి. అవి మామూలు ఆకులు కావు. చురకత్తులు. అవి ఏటవాలుగా పడి శరీరాన్ని ముక్కలు చేసి వేస్తాయి. అదే సమయంలో అక్కడున్న వేటకుక్కలు పాపులపై దాడి చేస్తాయి. అవి వారిని ముక్కలు ముక్కలుగా కొరికి తింటాయి. వీరికి శిక్షాకాలం ముగిసేదాకా తెలివి తప్పదు.

'తప్తకుంభ' మని మరొక నరకముంది. ఇందులో ఎక్కడ చూస్తే అక్కడ పెద్ద పెద్ద బానలుంటాయి. వీటిలో నూనె, ఇనుపరజనూ వుండి వీటి కింద పెద్ద పొయ్యిలలో బ్రహ్మాండమైన అగ్ని ప్రజ్వరిల్లుతుంటుంది. ఒక్కొక్క బానలో పది మంది మనుషులు సులువుగా పట్టే వీలుంటుంది. యమభటులు పాపులను అందులో పడవేస్తారు. పదునునైన ఆయుధాలతో వీరిని అక్కడక్కడ పొడుస్తూ వేయిస్తుంటారు. ఈ లోగా క్రూరమై గునపాలంతేసి ముక్కులున్న గ్రద్దలు, మానవులు సరదాగా చేపలు పట్టినట్లు, ఈ బానలలోకి ముక్కులను పెట్టి పాపుల మాంసమును ముక్కుతో పట్టి లాగుతుంటాయి. యమదూతలు వేపుడు కూరను మాడ్చి పారేసినట్లు ఈ పాపులను ఆ బానల్లో అలా వేయిస్తూనే వుంటారు. ఇదీ తప్తకుంభ నరకం. ఇప్పటిదాకా వర్ణింపబడిన ఏడూ ప్రధాన నరకాలు. ఇంకా కొన్ని నరకాలున్నాయి. వాటి పేర్లను పాపాలతో కలిపి వచిస్తాను.

| పాపకర్మ | నరకం |
|---|---|
| గోహత్య, భ్రూణహత్య, ఇంటికి నిప్పు | **రోధ** |
| బ్రహ్మఘాతం, మద్యపానం, స్వర్ణచౌర్యం | **సూకర** |
| క్షత్రియునిగాని వైశ్యునిగాని హత్య | **తాల** |
| బ్రహ్మహత్య, గురుపత్నీ లేదా సోదరీగమనం | **తప్తకుంభ** |
| రాజపురుషుడై వుండి అబద్ధమాడుట | **తప్తకుంభ** |

| పాపకర్మ | నరకం |
| --- | --- |
| నిషిద్ధ పదార్థ విక్రయం, మదిరతోడి వ్యాపారం, స్వామి భక్తులను త్యజించుట | తప్తలౌహ |
| వేదనింద, వేద విక్రయం, కన్యతో సంభోగం పుత్ర వధువుతో చీకటి తప్పు | మహాజ్వాల |
| స్త్రీతో అగమ్యగమనం, గురువునవమానించుట,వాగ్బాణాలతో హింసించుట | శబల |
| వీరుడై శౌర్య ప్రదర్శనలో అమర్యాద ప్రవర్తన | విమోహన |
| అందరికీ అనిష్టమే చేయుట | కృమిభక్ష |
| దేవబ్రాహ్మణ ద్వేషము (లోన,బైట) | లాలాభక్ష |
| తోటలను తగలెట్టుట, ఇతరుల ఇళ్ళలో అధికారమునాక్రమించుట | విషంజన |
| నక్షత్రాలతో జీవికోపార్జన,అసత్‌పాత్రకు దానం, అయాజ్య యాజకం, అర్హత లేకున్నా పోయి దానం స్వీకరించుట | అధఃశిర |
| మద్య మాంసాది పదార్థాల విక్రయం (కోడి, పిల్లి, పక్షి, పంది, లేడి, తోడేళ్ళను బంధించినా అదే నరకం) | పూయవహ |
| గృహదహనం, విషమిచ్చుట, కుండాశం, సోమవిక్రయం, మద్యమాంస సేవనం(అనగా వినియోగం) పశువులను చంపుట | రుధిరాంధ |
| సహపంక్తిలోనున్న వానికి విషం పెట్టుట | వింభుజ |
| తేనెను తీయుట, తేనెను తీసి అమ్ముట | వైతరణి |
| క్రోధం, మంచి సుఖాన్ని కోపించి చెడగొట్టుట | మూత్రసంజ్ఞక |
| అపవిత్రత, క్రోధం | అసిపత్రవనం |
| మృగాలను చంపుట, తినుట | అగ్నిజ్వాల |
| దీక్షను పొంది నియమాలను పాటించకుండుట | సందంశ |
| సన్యాసి, బ్రహ్మచారి స్వప్న స్ఖలనం | అభోజన |

ఇంకా చాలా పాపాలెలాగైతే వున్నాయో నరకాలూ చాలానే వున్నాయి. ఏ నరకంలోకి వెళ్ళినా పాపిని అగ్నిలో కాల్చడం, నూనెలో ఉడికించడం, పిండి పిండి చెయ్యడం, కషాయం వలె ముద్ద చెయ్యడం, గాలితో శిక్షించడం వంటి వేలకొద్దీ శిక్షలు అమలు జరుగుతుంటాయి. అక్కడి ఒక్కరోజే నూరురోజుల బాధలను అనుభవంలోకి తెస్తుంది.

ఎక్కడో, ఎంతో పుణ్యం చేసుకొన్న మానవులకు తప్ప, సామాన్యంగా ఏ మనిషీ పోయిన వెంటనే నరకానికీ, స్వర్గానికీ వెళ్ళి వచ్చి వెంటనే మనిషిగా పుట్టెయ్యడం జరుగదు. మహాపాపులు నరకం నుండి వచ్చి మొక్కగానో, చెట్టుగానో పుడతారు. తరువాత క్రిమి, కీటక, దీపక షట్పాది జన్మలూ, తరువాత గోళ్ళున్న గాడిద (ఇక్కడ గోళ్ళంటే గిట్టలు) వంటి జంతువుల నుండి అడవి ఏనుగుదాకా తన పాపానికి తగిన యోనిలో జన్మిస్తారు. పిమ్మట ఇంకా చాలా పాపఫలాలు మిగిలివారు గూని, మరుగుజ్జు, వామన, చండాల, పుల్కశ మున్నగు మానవజన్మలెత్తి, అపుడు సంపూర్ణ మానవ జన్మను పొందవచ్చును. అందుకే అంటారు పెద్దలు 'నరజన్మ బహు దుర్లభ'మని. ఈ మానవులలోనే కొందరు బహు పుణ్యప్రదులు దేవతలు కావచ్చు, ఇంద్రులూ కావచ్చు.

పుణ్యాత్ములను స్వర్గానికి పంపించేది యమధర్మరాజే. ఆయన అనుమతిని పొందిన పుణ్యాత్ములను దేవదూతలు వచ్చి సుందరనూపురాది నానాభరాలనూ పెట్టి, సుమధుర గీతాలను పాడుతూ వాటికి తగిన అందమైన నృత్యాలను చేస్తూ, చందనాది దివ్య సుగంధాలను పూసి, మరింత హృద్య సుగంధాలను వెదజల్లే పూలమాలలతో అలంకరించి దివ్యకాంతులు వెదజల్లు విమానాలలో కూర్చుండ బెట్టి స్వర్గానికి గొనిపోతారు. పుణ్య సమాప్తి తరువాత వారు మరల పుడమిపై పుట్టవలసి వచ్చినపుడు సుక్షత్రియులుగానో మహాత్ములుగానో – అట్టి వారింటనే పుట్టి పెరిగి – పరిఢవిల్లుతారు. వీరికి ఈ జన్మలో బ్రహ్మాండమైన భోగభాగ్యాలబ్బుతాయి. వాటిని వదలి భగవంతుని పనినే చేస్తూ జన్మను చాలించి మోక్షాన్ని పొందే అవకాశమూ వుంటుంది.

భూలోకంలో జన్మించినపుడు మరణం తప్పదు. ఆత్మ శరీరాన్ని వీడిపోయాక జీవి శరీరంలోని పృథ్వీతత్త్వం పృథ్విలోనూ, జలతత్త్వం నీటిలోనూ, తేజ తత్త్వం తేజంలోనూ, వాయు తత్త్వం గాలిలోనూ, ఆకాశ తత్త్వం నింగిలోనూ సర్వవ్యాపియైన మనస్సు చంద్రునిలోనూ విలీనమైపోతాయి. గరుత్మంతా! శరీరంలో గల పంచేంద్రియాల కోరికలూ, కామక్రోధాదులూ చోరులతో పోల్చబడినవి. *వాటి బారి నుండి జ్ఞానరత్నాన్ని కాపాడు

---

* *కామక్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః।*
*జ్ఞాన రత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత ॥*
*ఈ శ్లోకం గరుడ పురాణంలోది కాదు. ఇదొక చాటువు. శంకరాచార్యుల వారిదని ప్రతీతి.*

కోవాలి. ఇంకా కామక్రోధాహంకార నామక వికారాలు కూడా వుంటాయి. వాటికి నాయకత్వం వహించేది మనస్సు. ఈ శరీరానికి సంహార పత్రాన్ని రాసేది కాలం. ఉన్న ఇల్లు కాలిపోతే మనిషి వేరొక ఇంటిలోకి వెళ్ళినట్లు ఒక శరీరంలో నుండి వేరొక దానిలోకి ఆత్మ ప్రవేశిస్తుంది.

ఓ తార్క్ష్యా! మానవశరీరం నాడులతో నవద్వారయుక్తమై వుంటుంది. ఈ సాంసారిక విషయ వాసనలచే ప్రభావితములైన కామక్రోధాది వికార సమన్విత్వమై వుంటుంది. రాగద్వేష పరిపూర్ణమై తృష్ణతో నిండి వుంటుంది. లోభమనెడి వలలో మోహమనెడి బట్ట ముసుగులో వుంటుంది. మాయచే గట్టిగా కట్టబడి లోభానికే కట్టుబడి వుంటుంది. అన్ని శరీరాలూ ఇంతే. అయినా కొందరు అదే శరీరంలో వుండే ఆత్మను తెలుసుకొని దాని ద్వారా జపతపాది ఆయుధాలతో మాయను సంహరించి పరమాత్మను చేరుకోగలరు. ఆత్మజ్ఞానం లేనివారు పశు సమానులై జీవించి అలాగే పోతారు.

ఈ సృష్టిలో ఎనుబది నాలుగు లక్షల యోనులున్నాయి. అవి ఉద్భిజ్జ (నేలలో మొలుచునవి) స్వేదజ (చెమట నుండి పుట్టునవి) అండజ, జరాయుజ (మనిషి మొదలగునవి) ములతో విభక్తములై యున్నవి. *(అధ్యాయం -3)*

## ఆసన్న మృత్యు ప్రాయశ్చిత్తాలు - దశ విధ దానాలు-మృత్యు అనంతర కర్మలు - ఆరు పిండదానాలు - దహన సంస్కారం ముందూ వెనకా - అస్థిసంచయనం - అనంతరం గృహంలో కర్మలు - దుర్మృత్యుగతి - నారాయణ బలి - పుత్తల దాహ విధి - పంచక మృత్యుకృత్యాలు

గరుత్మంతా! మనిషి తనకు తెలిసిగానీ తెలియక గానీ చేసే పాపాల నుండి శుద్ధి నొందడానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. విద్వాంసులు ముందుగానే పవిత్ర భస్మాది పది స్నానాలనూ చేసి శాస్త్రోక్త విధిననుసరించి కృచ్ఛ్రాది వ్రతాలనూ, వాటికి ప్రాతినిధ్యం వహించే గోదానాది క్రియలను ఏవి కుదురితే అవి చేస్తారు. కొంతమంది పూర్తి ప్రాయశ్చిత్తాన్ని చేసుకోలేనివారు తమ గుర్వాజ్ఞ మేరకు అందులో సగాన్ని గాని పావును గానీ శ్రద్ధగా చేసిననూ శుద్ధి కలుగుతుంది. ప్రాయశ్చిత్తం మాత్రం తప్పనిసరి. ఆ తరువాత దశ దానాలనిచ్చి పునీతులు కావచ్చు. ఇవి కూడా శక్తి కలిగినంత మేరకివ్వవచ్చు.

*గోభూమి తిలహిరణ్యాజ్య వాసోధాన్య గుడాస్తథా ।*
*రజతం లవణంచైవ దానాని దశవై విదుః ॥* *(ధర్మ... 4/4)*

యమద్వారంవైపు వెళ్లే దారి అత్యంత దుర్గంధదాయకమై రక్తమాంసాలతో, చీము వంటి అసహ్యకర ద్రవ్యాలతో నిండి వుంటుంది. ఆ మార్గంలో నున్న వైతరణిని సులువుగా దాటాలంటే వైతరణి అను వర్గానికి చెందిన గోవునివ్వాలి. ఈ గోవు యొక్క అంగాలన్నీ పొదుగుతో సహా నల్లగా వుంటాయి.

*నదీవైతరణీతర్తుం*
*దద్యాద్వైతరణీం చగాం ।*
*కృష్ణస్తనీ సకృష్ణాంగీ*
*సావై వైతరణీ స్మృతా ॥* *(ధర్మ... 4/6)*

నువ్వులు, ఇనుము, బంగారం, పత్తి, ఉప్పు, సప్తధాన్యాలు, భూమి, గోవు – ఇవి తొలిదానికంటె మలి దానంగా అదే క్రమంలో పరమ పవిత్రమైనవి. వీటిని మహా దానాలంటారు. వీటినందుకొనుటకు ఉత్తమ ప్రకృతి గల విప్రులే అర్హులు.

*తిలాలోహం హిరణ్యంచ కర్పాసం లవణం తథా ॥*
*సప్తధాన్యం క్షితిర్గావా ఏకైకం పావనం స్మృతం ॥*
*ఏతాన్య ష్టౌ మహాదానాన్యుత్తమాయ ద్విజాతయే ।* *(ధర్మ... 4/8)*

గొడుగు, చెప్పులు, బట్టలు, ఉంగరం, కమండలువు, ఆసనం, పాత్ర, తినుబడి పదార్థం – వీటిదానాన్ని అష్టపద దానమంటారు.

*ఛత్రోపానహ వస్త్రాణి ముద్రికా చ కమండలుః ।*
*ఆసనం భాజనం భోజ్యం పదం చాష్టవిధం స్మృతం ॥* *(ధర్మ... 4/9)*

ఇవేకాక పాత్రలను వాటిలో నుంచు ఇష్టమైన వస్తువులను ఎవరికైనా దానమీయ వచ్చును. గానీ అశ్వాలనూ రథాలనూ బ్రాహ్మణులకే ఇవ్వాలి.

ప్రాయశ్చిత్తం, దానం సర్వవిధాలా చేసినవానికి ఇక ఏ పాపమూ చేయకుండా శేష జీవితాన్ని లోకకల్యాణం కోసమే గడిపితే మోక్షమే.

*ప్రాయశ్చిత్తం కృతం యేన దశదానాన్యపిక్షితౌ ॥*
*దానం గోర్వైతరణ్యాశ్చ దానన్యష్టౌ తథాపి వా ।*
*తిలపాత్రం సర్పిః పాత్రం శయ్యాదానం తథైవ చ ।*

*పద దానం చ విధివన్నా సౌ నిరయ గర్భగః ।* *(ధర్మ... 4/12-14)*

పండితులు ఏ ప్రాయశ్చిత్తంతోనూ పని లేకుండా స్వతంత్రంగా కూడా లవణ దానం చేస్తుంటారు. ఎందుకంటే అది విష్ణువు శరీరం నుండి పుట్టింది. ముఖ్యంగా

మరణాసన్న వ్యక్తి చేత లవణదానం గాని లవణరస దానంగాని (అతని లేదా ఆమె) చేతిమీదుగా చేయిస్తే వారికి స్వర్గద్వారాలు తెఱచుకుంటాయి. ఏ మనిషి ఎప్పుడే దానం చేసినా అది ఆ మనిషితో బాటే పరలోకానికి పోతుంది. అతని లేదా ఆమెకంటే ముందే పోయి యమధర్మరాజు వద్ద నిలబడుతుంది. ప్రాయశ్చిత్తం, దానం చేసే మేలు ఊహాతీతం.

ఓయి వైనతేయా! ఆవు పాలు అమృతమే! అందువల్ల పాలిచ్చే ఆవును దానం చేసే వారికి అమృతత్త్వం ప్రాప్తిస్తుంది. తిలాదిక అష్టదానాన్ని చేసినవారికి గంధర్వలోక నివాసం కలుగుతుంది. యమలోక మార్గం అత్యధిక భీషణతాపయుక్తం. ఛత్ర దానం చేసినవారిని ఆ పుణ్యం అక్కడ రక్షిస్తుంది. చెప్పులను దానమిచ్చిన వాడొకవేళ అసిపత్రవనంలో పడినా వానికోసం అక్కడ గుఱ్ఱం సిద్ధంగా వుండి తనపై నెక్కించుకొని ఆ వనమును దాటిస్తుంది. ఇలాగే భోజన, ఆసన, జలపూర్ణ కమండలు దానాలు నరకంలో అక్కరకు రావచ్చును.

యమదూతలు క్రోధాగ్నులను వెలిగ్రక్కుతూ మహాభయంకరంగా వుంటారు. కొందరు నల్లగా కొందరు పచ్చగా వుంటారు. వారు కనబడగానే సగం ప్రాణాలు పోతాయి. అయితే, ఉదారంగా వస్త్ర, ఆభూషణాదులను విరివిగా దానం చేసినవారు ఏవో కొన్ని పాపాలు చేసిననూ యమదూతలు వారికి పెద్దగా కష్టాన్ని కలిగించరు.

తిలలతో నింపిన పాత్రను బ్రాహ్మణునికి దానం చేసినవారి మనోవాణి కాయాలతో చేసిన పాపాలన్నీ నశిస్తాయి. ఘృతపాత్రను దానం చేసినవారు దేహాంతంలో రుద్రలోకాన్ని చేరుకుంటారు. సర్వసాధనయుక్తమైన శయ్యను బ్రాహ్మణునికి దానం చేసినవారు స్వర్గలోకంలో అప్సరసలతో అమరావతి నగరంలో అరవై వేల సంవత్సరాల పాటు వివిధ సుఖాలనిచ్చు విమానాలలో విహరిస్తూ సుఖంగా నివసిస్తారు. తరువాత భూమిపై మహారాజుగా జన్మిస్తారు. చక్కని, నిర్దుష్టమూ, మిక్కిలి బలిష్టమూనగు గుఱ్ఱాన్ని బ్రాహ్మణునికి దానం చేసిన వారికి స్వర్గలోకప్రాప్తి వుంటుంది. ఆ గుఱ్ఱానికెన్ని రోమాలుంటాయో అన్నేళ్ళపాటు ఆ దాత స్వర్గంలో నివసిస్తాడు. నాలుగు గుఱ్ఱాలు పూన్చిన రథాన్ని మొత్తంగా బ్రాహ్మణునికి దానమిచ్చిన వారికి రాజసూయ యజ్ఞం చేసిన పుణ్యం దక్కుతుంది. బ్రాహ్మణునికి సర్వభోజన సామగ్రితో కూడిన ఇంటిని దానం చేసిన వాని వంశం ఎన్ని వేల యేళ్ళైనా నిలబడే వుంటుంది అదీ ఐశ్వర్యాది సుఖాలతో. మృత్యువాసన్నమైనపుడు యథావిధిగా సన్యాసమును స్వీకరించిన వానికి పునర్జన్మ వుండదు. మృత్యువాసన్నమైన వానిని వాని కుటుంబ సభ్యులేదైనా పవిత్ర తీర్థానికో పుణ్యక్షేత్రానికో తీసుకు వెళ్ళగలిగితే వాని ప్రాణమక్కడ పోతే వానికి ముక్తి లభిస్తుంది. ఒకవేళ

మార్గమధ్యంలోనే అతడు (ఆమె) మరణించినా ఆ వ్యక్తికి ముక్తి లభిస్తుంది. అతని కుటుంబ సభ్యులు ఆ ప్రయత్నంలో ఎన్ని చోట్ల ఆగుతారో అన్ని యజ్ఞాలు చేసిన ఫలం లభిస్తుంది.

*ఆసన్నమరణో మర్త్యశ్చే తీర్థం ప్రతినీయతే ।*
*తీర్థప్రాప్తౌ భవేన్ముక్తిర్ మ్రియత్ యది మార్గగః ॥*
*పదే పదే క్రతు సమంభవేత్తస్య న సంశయః ।* *(ధర్మ...4/37,38)*

మృత్యువాసన్నమైనవాడు యథావిధిగా ఉపవాసం చేసినా మరుజన్మ వుండదు. ఇక మృత్యువుకీ దహనానికీ మధ్య మనుష్య కర్తవ్యాలను విను.

వ్యక్తి మరణించినట్లు తెలియగానే వాని (ఆమె) పుత్రులూ బంధువులూ ఆ మృత దేహానికి శుద్ధ జలంతో స్నానం చేయించి కొత్త బట్టని కట్టాలి. తరువాత దానికి చందనాది సుగంధిత పదార్థాలను పూయాలి. అనంతరం ఆ వ్యక్తి మృతి చెందిన చోటనే ఏకోద్దిష్ట శ్రాద్ధాన్ని పెట్టాలి. ఇందులో ఆసన, ప్రోక్షణ క్రియలనే చేయాలి గాని ఆవాహన, అర్చన, పాత్రాలంభన, అవగాహన క్రియలను చేయరాదు. పిండదానం తప్పనిసరిగా చేసి అన్నదానానికి సంకల్పం చెప్పుకోవాలి. అక్షయ్యోదక దానాన్నివ్వాలి. స్వధావాచన, ఆశీర్వాద, తిలక క్రియలను చేయరాదు. చిక్కుడు గింజలతో నింపిన పాత్రను, ఇనుప వస్తువును బ్రాహ్మణునికి దానమివ్వాలి. పిండాన్ని అప్పుడు కదపాలి. ఆచ్ఛాదన, విసర్జన, స్వస్తి వాచన ఇప్పుడు చేయకూడదు. మరణస్థానం, ద్వారం, అరుగు, విశ్రామ స్థానం, కాష్ఠచయనం, అస్థిసంచయన స్థానం – ఈ ఆరూ పిండ దానానికి పనికివచ్చు స్థానాలు.

ప్రాణి మరణించిన చోట ఇచ్చే పిండాన్ని శవపిండమంటారు. దీనివల్ల భూదేవి తృప్తినొందుతుంది. మిగిలిన స్థానాల్లో ఇలా :

| | | | | |
|---|---|---|---|---|
| ద్వారం | – | పాంథపిండం | – | వాస్తుదేవత |
| అరుగు | – | ఖేచర | – | భూతాలు, దేవగణాలు (ఆకాశ) |
| విశ్రామ స్థానం | – | భూత | – | పది దిక్కులు |
| కాష్ఠచయనం | – | సాధక | – | రుద్రుడు |
| అస్థి సంచయం | – | ప్రేత | – | ప్రేతాలు |

శవయాత్రా సమయంలో పుత్రాది బంధువులు తిలలు, కుశలు, ఘృతం, ఇంధనం తీసుకెళుతూ 'యమగాథ'లను గాని వేదంలోని 'యమసూక్తాన్ని' గాని గానం చేస్తూ శ్మశానం వైపు కదలాలి.

***అహరహర్నీయమానో గామక్షం పురుషం వృషం ।***
***వైవస్వతో నతృప్యేత సురయాత్వివ దుర్మతిః ॥***

ఇలాంటివే యమగాథలంటే *(ధర్మ... 4/53)*

***ఓం అపేతేతి...*** ఇత్యాదిగా యజుర్వేదం అ–35–లో నున్న మంత్రాలను యమసూక్తమంటారు. శవాన్ని తీసికెళుతూ మార్గంలో ఇందాక చెప్పినలాటివే రెండు శ్రాద్ధాలు పెట్టాలి. శ్మశాన భూమిని చేరగానే శవాన్ని మెల్లగా నేలపై దించుతున్నపుడే దాని తల దక్షిణం వైపుండేలా చూసి దించాలి. ఆ తరువాత చితాభూమిలో మరొక మారు ఇందాకటి శ్రాద్ధాన్నే పెట్టాలి. శవదహనానికి మృతుల బంధువులే స్వయంగా గడ్డి, కట్ట, నువ్వులు, నెయ్యి పట్టుకొని వెళ్ళాలి. లోపల చేయు అన్ని పనులనూ దక్షిణం వైపే తిరిగి, జందెమునపసవ్యం చేసుకొని చేయాలి. శాస్త్రసమ్మతంగా అక్కడొక వేదిని నిర్మించి ప్రేతవస్త్రాన్ని రెండు భాగాలుగా, చించి సగాన్ని దానిపై కప్పి రెండవ సగాన్ని శ్మశాన జీవుల కోసం అక్కడే భూమిపై వదిలేయాలి. తరువాత శవం చేతిలో పిండదానం చేసి మొత్తం శవానికి నేతిని పూయాలి.

పిండదాన విధిని విను. మృత స్థానాదులలో పెట్టబడిన అయిదు పిండాల వల్లా శవానికి అగ్ని దాహయోగ్యత లభిస్తుంది. ఇది చేయకపోతే ఆ మృతులను రాక్షసులు తినేస్తారు. కాబట్టి రుద్రభూమిలోనే స్వచ్ఛమైన భూమిలో వేదిని నిల్పి దానిని మార్జన, ఉపలేపనాల ద్వారా శుద్ధి చేసి అప్పుడందులో యథావిధిగా అగ్నిని స్థాపించాలి. పుష్ప, అక్షతాదులతో క్రవ్యాది నామాలతో అగ్నిదేవుని పూజించి (పాపాత్ముని ఇంటినుండి అగ్నిని తేరాదు). ఈ క్రింది మంత్రంతో ఆయనను ప్రార్థించాలి.

***త్వం భూత కృజ్జగద్యోనిస్త్వం లోకపరిపాలకః ॥***
***ఉపసంహార తస్మాత్త్వమేనం స్వర్గం నయామృతం ।*** *(ధర్మ... 4/64,65)*

ఇలా క్రవ్యాది దేవుని శాస్త్రోక్తంగా పూజించి శవాన్ని చితిలో కాల్చడం మొదలు పెట్టాలి. శవంలో సగభాగం అగ్నికి ఆహుతి అయినాక కర్మ చేయువాడు ఈ క్రింది మంత్రాన్నుచ్చరించాలి :

***అస్మాత్త్వమధిజాతోఽ సి త్వదయంజాయతాం పునః***
***అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా...*** ★

అంటూ తిల, నేయిలతో ఒక ఆహుతిని శవంపై నున్న అగ్నికి ఇవ్వాలి. తరువాత మాత్రమే రోదించాలి. అంతవఱకు రోదన ధ్వనులను అదుముకోవాలి.

దహనానంతరం అస్థి సంచయనక్రియ వుంటుంది. దాహశాంతికై ప్రేత-పిండ ప్రదానం కూడా వుంటుంది. తరువాత అక్కడికి వెళ్ళిన వారంతా చితికి ప్రదక్షిణ చేసి సూక్తం చదువుతూ జలాశయానికి వెళ్ళాలి. అక్కడ తమ వస్త్రాలను జాడించి, పిడిచి, తమ స్నానానంతరం వాటినే మరల కట్టుకొని చనిపోయిన వ్యక్తిని ధ్యానించి జల దానం చేస్తామని ప్రతిజ్ఞ చేయాలి. ఆ వ్యక్తి తేజో రూపంలో వచ్చి (ఇక్కడ ప్రేత రూపమే) ఆజ్ఞ ఇవ్వడం జరిగిందని భావించుకొని మరల జలాశయానికి మౌనంగా ఏకవస్త్రులై, జందెమునపసవ్యం చేసి, పిలక ముడిని విప్పి స్నానం చేయాలి. బంధువులంతా దక్షిణం వైపు తిరిగి ***'అపనఃశోశుచదధం'*** అనే యజుర్వేద (35/6) మంత్రాన్నుచ్చరిస్తూ ఈ స్నానాన్ని చేయాలి. పిలకను ముడి వేసుకొని, సామాన్య కుశను దక్షిణాగ్రంగా పెట్టి చేత బట్టుకొని దోసిట్లో తిలయుక్త జలాన్ని పితృతీర్థానికి దక్షిణ దిశలో నొక మారు, మూడు లేదా పదిమార్లు నేలపైగాని రాతి పైగాని దోసిళ్ళతో పోయాలి. ఈ తిలాంజలులిస్తున్నపుడిలా అనాలి : ***అద్యోహాముక గోత్రాముక ప్రేతచితాదాహ జనిత తాపతృషోపశమాయ ఏష తిలకుశతో యాంజలిర్మదత్త స్తవోపతిష్ఠతాం.***

బయటికి వచ్చి పొడిబట్టలు కట్టుకొని స్నానం చేసిన వస్త్రాన్ని తడిపి పిడిచి పవిత్రమైన నేలపై ఆరవేయాలి. తాము కూడా పవిత్ర భూమిపై కూర్చోవాలి. పోయినవారిని తలచుకొనవచ్చును గాని కంట తడిపెట్టరాదు. ఇపుడు ఏడ్చినా ముక్కు చీదినా అవి మృతి చెందిన వారి నోటిలోకి పోతాయి. వారిలో, అనగా ఆ శ్మశానానికి వచ్చినవారిలో కెల్ల వృద్ధుడుగాని, పురాణజ్ఞుడుగాని మిగతావారికి ఇలా చెప్పి ఓదార్చాలి – 'అసలీ మానవశరీరమే అంత. అరటిచెట్టులా ఎంత ఏపుగా పెరిగినా కూలిపోక తప్పదు. బుడగలాగా ఒక క్షణం వుంటుంది, మరుక్షణమే చితికిపోతుంది. ఇందులో శాశ్వతత్వాన్నీ, జీవసారాన్నీ వెదకడం, దొరికాయని భ్రమించడం మహామూర్ఖులు చేసే పని. నేల, నీరు, నిప్పు, నింగి, గాలి అనే ఈ పంచతత్త్వాలచే నిర్మింపబడిన ఈ శరీరం తన కర్మానుసారం జీవించి మరల అవే తత్త్వాలలో కలసిపోతుంది. దానికోసం కన్నీరెందుకు కార్చాలి?

---

★*ఈ శ్లోకార్థంలో తొలి పంక్తి గరుడపురాణం ధర్మకాండ (4-66) లో వుంది. మలి పంక్తి పూర్తిగా యజుర్వేదం (35/22)లో వుంది.*

రోదన లేల ధ్వనించాలి? నేల, సముద్రం, దేవలోకాలవంటి మహా విషయాలే మిగలవు. వాటి కాలం రాగానే అవీ భస్మమైపోతాయి. అలాటిది నీటి మీది నురగలాంటి మనమనగా ఎంత, మన బతుకనగా నెంత?' ఈ మాటలు విని తాత్కాలికంగా ఊరట చెంది అంతా ఇళ్ళకు మళ్ళాలి. తమ ఇంటిద్వారం వద్ద వేపాకులను నమలి ఆచమనం చేసి అగ్ని, జలం, పేడ, తెల్లావాలు, దూర్వా, పగడము, ఎద్దు మున్నగు మాంగలిక వస్తువులను చేతితోనూ, ఱాతిని కాలితోనూ స్పృశించి మెల్లగా ఇంటిలోనికి వెళ్ళాలి.

విద్వాంసులైన వారు తమ అగ్నిహోత్రులైన పరిజనులు మరణిస్తే వారి దహన సంస్కారాన్ని శ్రౌతాగ్నితోనే యథావిధిగా చేయాలి. రెండేళ్ళ లోపు వయసున్న పిల్లలు మృతి చెందితే, వారిని శ్మశాన భూమిలోనే గొయ్యి తవ్వి పాతిపెట్టాలి. ఇంకేమి వినగోరెదవు వైనతేయా?"

'హే జగదాధార! అసహజ, ఆకస్మిక మృతుల విషయంలో అపరకర్మనెలా చేయాలి? ఎముకలే దొరకని వారికి సంస్కారమెలా కుదురుతుంది?'

"నారాయణ బలి అను పేరు గల సంస్కారం ద్వారా కుదురుతుంది. ఇదొక శుద్ధికర్మ. గరుడా! దీనిని చేస్తే అపుడు ఆ ప్రేతానికి అపరకర్మలకు అర్హత కలుగుతుంది. నారాయణ బలి అనెడి శుద్ధీకరణను తీర్థాలలో చేయాలి. బ్రాహ్మణుల ద్వారా శ్రీ కృష్ణదేవుని సమక్షంలో ఇది జరగాలి. పురాణ, వేదజ్ఞాతయైన బ్రాహ్మణుని చేత తొలి తర్పణాన్నిప్పించాలి. అన్ని ప్రకారాల ఔషధాలనూ, అక్షతలనూ నీటిలో కలిపి పురుష సూక్తాన్నిగాని వైష్ణవ సూక్తాన్ని గాని ఉచ్ఛరిస్తూ విష్ణువు నుద్దేశించి ఆ నీటితో తర్పణాలివ్వాలి. తరువాత దక్షిణంవైపు తిరిగి విష్ణువునీ ప్రేతాన్నీ ఇలా స్మరించాలి :

***అనాదినిధనో దేవః శంఖ చక్రగదాధరః ॥***
***అక్షయంః పుండరీకాక్ష ప్రేతమోక్ష ప్రదోభవ ।*** ***(ధర్మ... 4/118, 119)***

వారసులు మనస్సు నదుపులో నుంచుకొని శుచిష్మంతులై అక్కడే భక్తి పూర్వకంగా పదకొండు శ్రాద్ధాలను పెట్టాలి. తరువాత మిక్కిలి జాగరూకతతో రెండు రకాల దానాలివ్వాలి. మొదటి రకం నీరు, అక్షతలు, యవలు, గోధుములు, కంకణము కాగా రెండవది శుభకరమైన హవిష్యాన్నం, అందముగా తయారు చేయించబడిన బంగారు ఉంగరం, గొడుగు, పాగా. తరువాత పాలు, తేనెలను కలిపిన అన్ని రకాల అన్నాలనూ పెట్టాలి. మంచివారై, అర్హత గలిగినవారికి వస్త్ర, పాదుకాది ఎనిమిది రకాల పద దానాలను చేయాలి. పిండదానం చేశాకనే మంత్రోచ్చార సహితంగా గంధ, పుష్ప, అక్షతాదులతో బ్రాహ్మణులను

పూజించి వారికి ఈ దానాలనివ్వాలి. శంఖం, తామ్రపత్రాలతో వేరు వేరుగా తర్పణాలివ్వాలి. తరువాత మోకాళ్ళపై నిలబడి ధ్యాన-ధారణ సంయుక్తంగా ఉద్దేశించబడిన దేవతలకు వేరువేరుగా అర్ఘ్య ప్రదానం చేయాలి. పంచరత్నయుక్తాలైన అయిదు కుండలలో బ్రహ్మ, విష్ణు, రుద్ర, యమ, ప్రేత - ఈ అయిదు దైవీశక్తులను కుండ కొకటిగా స్థాపించి వుంచాలి. వీటినే కాక వస్త్రాన్నీ, జందెమునూ, పెసలనూ, పదదానాన్నీ వేర్వేరుగా స్థాపించాలి. బ్రహ్మాది అయిదుగురు దేవతలకూ శ్రాద్ధ పూజలను యథావిధిగా చేసి, శంఖం లేదా రాగిపాత్ర లేదా మట్టికుండలో అన్ని ఓషధులతో యుక్తమైన తిలోదకాన్ని తీసుకొని ప్రతిపిండంపై జలధారలనివ్వాలి. తిలలు నింపిన తామ్రపాత్రను దక్షిణతో బంగారంతో పదదానంతో ముఖ్య బ్రాహ్మణులకిచ్చి వేయాలి. యముని కొఱకై దక్షిణాసహిత తిల, లోహదానాన్ని వేరొక బ్రాహ్మణునికివ్వాలి. విష్ణుదేవునుద్దేశించి ఈ విధంగా, యథాశక్తి, విధిపూర్వకంగా దానమివ్వడం వల్ల బలి ఇవ్వడం వల్ల మృతవ్యక్తి స్వర్గానికి చేరుకోవచ్చును.

**పాముకాటు కర్మ అనుబంధంలోచూడండి**

తరువాత పరమాత్మ గరుడుని ప్రార్థనపై కృచ్ఛ్, తప్త కృచ్ఛ్, సాంతపనములను ప్రాయశ్చిత్త వ్రత లక్షణాలను ఇలా ఉపదేశించాడు :

***త్ర్యహంప్రాతస్ త్ర్యహం సాయం***
***త్ర్యహ మద్యాదయా చితం ।***
***ఉపవాసస్ త్ర్య హం చైవ***
***ఏషకృచ్ఛ్ర ఉదాహృతః ॥*** ***(ధర్మ...4/163)***

మూడు రోజులు ప్రాతఃకాలంలోనూ, మూడు రోజులు సాయంకాలాల్లోనూ, మూడు రోజులు అయాచిత హవిష్యాన్నాన్నీ మాత్రమే తిని, మూడు రోజులు పూర్తిగా ఉపవాసము క్రమంగా ఏ వ్రతంలో చేయబడుతుందో దానిని కృచ్ఛ్రవ్రతమంటారు.

***తప్త క్షీరఘృతాంబూనా మేకైకం ప్రత్యహం పిబేత్ ।***
***ఏకరాత్రో పవాసశ్చ తప్తకృచ్ఛ్ర ఉదాహృతః ॥*** ***(ధర్మ...4/164)***

క్రమంగా ఒకరోజు వేడిపాలు, మరునాడు వేడి నేయి, మూడవరోజు వేడి నీరు మాత్రమే స్వీకరించి నాలుగవ రోజు రాత్రంతా ఉపవాసం చేస్తే అది తప్త కృచ్ఛ్రవ్రతమవుతుంది.

***గోమూత్రం గోమయం క్షీరం దధిసర్పిః కుశోదకం ।***
***జగ్ధ్వాపరేఽ హ్న్యుపవసే త్కృచ్ఛ్రం సాంతపనం చరన్ ।*** ***(ధర్మ...4/165)***

గోమూత్ర, గోమయ, గోదధి, గోదుగ్ధ, కుశోదకాలను క్రమంగా రోజుకొకటిగా అది మాత్రమే స్వీకరించి ఉండిపోయి ఆరవ రోజు నుండి కృచ్ఛ్రవ్రతాన్ని చేయడాన్ని సాంతపనవ్రతమంటారు.

ధనిష్ఠా పంచకాలలో మృతి చెందినవారికి ఎలా దహన సంస్కారం చేయాలో చెప్తాను విను. ధనిష్ఠ నుండి రేవతి దాకా గల అయిదు నక్షత్రాల కాలాన్నీ పంచకకాలమంటారు. ఇది దోషపూర్ణమైన, అశుభకాలంగా భావింపబడుతుంది. ఈ కాలంలో మరణించినవారిని అలాగే వుంచేసి ఈ కాలం దాటిని తరువాతనే దహనం చేయాలి. మృతుల సద్గతికై తిల, గో, సువర్ణ, ఘృత దానాలు చేయాలి. బ్రాహ్మణులకు అదనంగా భోజనాలను పెట్టి వస్త్రపాదుకా, ఛత్ర, స్వర్ణముద్రలను దానం చేయాలి. దక్షిణలను కూడా ఇవ్వాలి. వారు మనఃపూర్వకంగా కర్మకాండను చేయిస్తే ఈ చెడు కాలంలో పోయిన వారి పాపాలు నశించి ఉత్తమ గతులు లభించే అవకాశముంటుంది. ***(అధ్యాయం-4)***

## అశౌచం, దశగాత్రవిధి, ప్రథమ షోడశి ఇతర షోడశుల విధానాలు, నవశ్రాద్ధాలు, వార్షిక కృత్యం, జీవుని యమమార్గ నిదానం, షోడశ నగరాల్లో యాతన, పాపులకూ పుణ్యులకూ స్థాయిని బట్టి యమదర్శనం

గరుత్మంతా! మృత వ్యక్తికి దహనసంస్కారం చేసిన తరువాత స్నానాలనూ తిలోదకాలనూ గావించి ముందుగా స్త్రీలూ, వారి వెనుకగా పురుషులూ మెల్లగా నడుస్తూ ఇల్లు చేరుకోవాలి. ద్వారం దగ్గరకొచ్చాక వేపాకు నమలి, ఒక రాతిపై నిలబడి ఆచమనం చెయ్యాలి. ఇప్పుడిక పొంగుకు వచ్చే దుఃఖాన్నాపనవసరము లేదు.

ఇప్పటి నుండి పుత్రులకూ పౌత్రులకూ సగోత్రులకూ పదిరాత్రుల దాకా అశౌచముంటుంది. దానికి సంబంధించిన కర్మలన్నిటినీ అందరూ చేయాలి. ఈ కాలంలో భోజన పదార్థాలను బయటి నుండి తెచ్చుకొని తినాలి. భార్యాభర్తలు రాత్రులందు వేర్వేరు గదుల్లో శయనించాలి. చప్పిడి కూడే తినాలి. బ్రహ్మచర్య వ్రతం, కేవల శాకభక్షణం, పృథ్వీశయనం తప్పనిసరి. శరీరస్పర్శ కూడా తప్పే. దానాలకూ, అధ్యయనకర్మలకూ దూరంగా వుండాలి. అంగమర్దనమూ, తలంటీ కూడదు. ఈ అశౌచ అవిధి కాలంగా చెప్పబడుతున్న కాలంలో మట్టిపాత్రలలో భోజనం చేయాలి. శక్తిని బట్టి మూడు రోజులు ఉపవసించాలి.”

గరుడడిగిన మీదట అశౌచ సమయాన్నీ, లక్షణాదులనూ ఇలా చెప్పాడు స్వామి.

'ఈ అశౌచం శీఘ్రమే ముగియాలి. ఎందుకంటే ఈ కాలంలో మానవులు దాన, అధ్యయనాది పుణ్యకార్యాలకు దూరమై పోతారు.

సపిండులలో మరణ శౌచం పది దినాల పాటు వుంటుంది. పుత్రాదిక జన్మవేళల్లో కూడా ఇన్నాళ్ళ అశౌచమే వుంటుంది. (మిగతా వివరాలన్నీ ఇదే పురాణంలో ఆచారకాండ 106, 107వ అధ్యాయాలలో చెప్పబడ్డాయి)

ప్రేతజన్య అశౌచమున్నన్నాళ్ళూ మృతవ్యక్తికిచ్చు జలదానపు దోసిళ్ళను రోజురోజుకూ పెంచుకుంటూ పోవాలి. మూడు రోజుల అశౌచంలో పది జలాంజలు లివ్వాలి. తొలిరోజు మూడు, మలిరోజు నాలుగు, తుది రోజు మూడు ఇవ్వాలి. శతాంజలి జల దానక్రియ కూడా లేకపోలేదు. ఆ పద్ధతిలో ముప్పది, నలువది, ముప్పది ఇస్తారు.

పితృక్రియలన్నిటికీ ముఖ్యఅధికారి పుత్రుడే. ఈ ప్రేతశ్రాద్ధంలో పాలను గాని నీళ్ళనుగాని పిండంపై చిలకరించుట, పుష్పధూపాదులతో దానిని పూజించుటయను పనులను మంత్రాలు లేకుండానే చేయాలి. పదవరోజు కేశ, శ్మశ్రు, నఖ, వస్త్రాలను పరిత్యజించి ఊరి వెలుపల స్నానం చేయాలి. వర్ణాలవారీగా క్రమంగా జలం, వాహనం, కొరడా, కర్రలను స్పృశించి పవిత్రులు కావాలి. మృతునికన్న చిన్నవారు, సపిండులు శిరోముండనం చేయించుకోవాలి.★

ఆరు, ఆపై పిండ దానాలు చేసి షోడశీ కర్మను ముగించాలి. దీనిని మలిన షోడశీ కర్మ అంటారు. దీనిని మృతి పిమ్మటి పది దినాలలోనే ముగించాలి. పుత్రాదులు ఈ పదిరోజులూ ఇచ్చే పిండదానాలను నాలుగేసి భాగాలుగా విభజించి తొలి రెండు భాగాలనూ ఆతివాహిక శరీరానికీ, మూడవదానిని యమదూతలకూ, నాల్గవ భాగాన్ని మృతకునికీ ఇచ్చి వారిని తృప్తి పఱచాలి.

తొమ్మిది దినాలూ తొమ్మిది రాత్రులూ గడిచేసరికి మృతిచెందిన వ్యక్తికి అన్ని అంగాలూ మరల నేర్పడి ఆకలి దప్పులు కలుగుతాయి. ఇలా :

*అహోరాత్రైస్తు నవభిర్దేహో నిష్పత్తి మాప్నుతాత్ ।*
*శిరస్త్వాద్యేన పిండేన ప్రేతస్య క్రియతే తథా ॥*

---

★ *అంత్యకర్మ దీపకగ్రంథం (పేజి 40) టిప్పణిలో మృతులకన్న చిన్నవారే తల గొరిగించుకోవాలని చెప్పబడింది. కాని భారతదేశంలో పలు గ్రామాలలో మరణం వల్ల దుఃఖితులైన పురుషులందరూ, వృద్ధులతో సహా, శిరోముండనం చేయించుకొనే సంప్రదాయముంది.*

*ద్వితీయేనతు కర్ణాక్షి నాసికం తు సమాసతః ।*
*గలాం సభుజ వక్షశ్చ తృతీయేన తథా క్రమాత్ ॥*
*చతుర్థేన చ పిండేన నాభి లింగగుదం తథా ।*
*జానుజంఘం తథా పాదౌ పంచమేనతు సర్వదా ॥*
*సర్వమర్మాణి షష్ఠేన సప్తమేన తునాడయః ।*
*దంతలో మాన్యష్టమేన వీర్యంతు నవమేన చ ॥*
*దశమేన తు పూర్ణత్వం తృప్తతా క్షుద్విపర్యయః ॥ (ధర్మ... 5/33-37)*

కశ్యపాత్మజా! ఇక మధ్యమ షోడశీ విధిని వర్ణిస్తాను, విను. విష్ణువును దృష్టిలో పెట్టుకొని పదకొండు శ్రాద్ధాలనూ, అయిదు దేవశ్రాద్ధాలనూ పెట్టాలి. వీటికే మధ్యమషోడశియని పేరు. ప్రేత మంగళం కోసం నారాయణ బలి చేసిన సందర్భంలోనే పదకొండవరోజు షోడశినిచ్చి వృషోత్సర్గము చేయాలి. వృషోత్సర్గం (దూడను గాని ఎద్దును గాని దానమిచ్చుట లేదా వదలివేయుట) ఏ జీవి కొఱకై చేయబడదో ఆ జీవికి ప్రేతత్వం నుండి ముక్తి లభింపదు. తరువాత ఏం చేసినా లాభం లేదు.

*ఏకాదశాహే ప్రేతస్య యస్యోత్సృజ్యతే నో వృషః ।*
*ప్రేతత్వం సుస్థిరం తస్య దత్తైః శ్రాద్ధ శతైరపి ॥*
*అకృత్వాయద్ వృషోత్సర్గం కృతం వై పిండ పాతనం ।*
*నిష్ఫలం సకలం విద్యాత్రప్రమీతాయ న తద్భవేత్ ॥ (ధర్మ...5/40-42)*

ఏ సందర్భంలోనైనా ఈ పృథ్విపై ప్రేతకల్యాణ సామర్థ్యం వృషోత్సర్గానికున్నంత ఇక దేనికీ లేదు. కాబట్టి మృతుల తరపున ఎవరో ఒకరు ఈ పనిని చేయాలి. పదకొండవ రోజు మృతులు జీవించి యుండిన కాలంలో నెక్కువగా ఇష్టపడిన పదార్థాలను చేసి శ్రాద్ధకర్మను చేయడం మంచిది. అలాగే మృతులనుద్దేశించి శయ్యనూ గోవునీ దానం చెయ్యాలి. బ్రాహ్మణులకి భోజనాలు పెట్టి మంచి నీళ్ళిస్తే మృతునికి ఆకలీ దాహమూ దూరమౌతాయి.

ఇక తృతీయ లేదా ఉత్తమ షోడశి శ్రాద్ధాలను పన్నెండు మాసాలలో పన్నెండు పిండాలుగా, ఊనమాసిక, త్రిపాక్షిక, ఊనషాణ్మాసిక, ఊనాబ్దిక సమయాలలో పెట్టాలి.

పన్నెండవ రోజు, మూడు పక్షాలు, ఆరు నెలలు లేదా సంవత్సరాంతమునాడు మృతులనుద్దేశించి సపిండీకరణ చేయాలి. మృతులకు పదకొండవ లేదా పన్నెండవ తిథినాడు ఆద్యశ్రాద్ధమును పెట్టాలి. ప్రతి మాసమున శ్రాద్ధము ఆ మాసపు మృత తిథిలో

పెట్టాలి. మాస, ఆరవ మాస, సాంవత్సరికాలను రెండు మూడు రోజుల ముందే పెట్టాలి. (అవే ఊన, షాణ్, ఆబ్ధికాలు) సపిండీకరణాన్ని ఏడాది పూర్తయినాక లేదా ఆరునెలలైనాక చేయాలి. వివాహాది మంగళకార్యాలు ఆయా తిథుల్లో పడితే సపిండీకరణాన్ని త్రిపక్షం రోజులు అనగా నలుబదియైదు రోజులకుగాని పన్నెండు రోజులకు గాని చేయవచ్చును. అన్నిటికన్న పన్నెండురోజుల నాడు చేయడమే ఉత్తమం.

సపిండీకరణ శ్రాద్ధాన్ని ఏకోద్దిష్ట విధానాన్ననుసరించి చేయాలి. నాలుగు కుండలను తీసుకొని తిలలు, గంధము, నీరు (అన్నిటిలో) పోసి నింపి, ఒక పాత్రను ప్రేతానికీ, మూడిటిని పితృగణాలకీ కేటాయించాలి. ప్రేతపాత్రలోని జలాన్ని పితృపాత్రలపై చిలకరించాలి. నాలుగు పిండాలను పెట్టి ఒక పిండాన్ని మృతునికి లేదా మృతురాలికి అని అంకితం చేసి దానిని మూడు భాగాలుగా చేసి వాటిని పితృపిండాలు మూడింటితో కలిపేయాలి. అప్పటి నుండి ఆ ప్రేతం పితృగణ రూపాన్నిధరించి పితరులలో కలిసి పోతుంది. ఇక పితృకార్యాలన్నిటికీ పితృ పితామహులతో సహా ఈ మృతవ్యక్తిని కూడా పూజించాలి. ఆలుమగలొకేరోజు మరణిస్తే ఆ స్త్రీకి సపిండీకరణమవసరము లేదు. ఇతర శ్రాద్ధకార్యాలను మాత్రం చేయాలి.

ఇక నవశ్రాద్ధాలెప్పుడెప్పుడు పెట్టాలంటే మృత్యుదినం నాడు మృతస్థానంలో మొదటి శ్రాద్ధాన్ని పెట్టాలి. శ్మశానానికి తీసుకెళ్తూ దారిలో నొకచోట ఆగుట, శవాన్ని దింపుట జరుగుతాయి కదా అచ్చోట రెండవశ్రాద్ధాన్ని పెట్టాలి. మూడవదాన్ని అస్థి సంచయన స్థానంలో పెట్టాలి. తరువాత అయిదవ, ఏడవ నుండి వరుసగా పదకొండవరోజుల్లో శ్రాద్ధాలు పెట్టాలి. ఇవి మొత్తం తొమ్మిది కాబట్టి వీటిని నవశ్రాద్ధాలంటారు. వీటినే తృతీయాషోడశీ అని కూడా అంటారు. వీటిని ఏకోద్దిష్ట శ్రాద్ధ పద్ధతిలోనే పెట్టాలి. నిజానికి బేసిరోజుల్లో మొదటి నుండి పదకొండవ రోజుదాకా పెట్టే ఆరు శ్రాద్ధాలనే నవ శ్రాద్ధాలంటారు. పదహారు సంఖ్య, నవ సంఖ్య వాటిలో అదనంగా చేయు కర్మల వల్ల సాధింపబడుతుంది. ఈ విషయంలో ఋషులలో మత భేదాలున్నాయి. ఎవరి సంప్రదాయాన్ని వారు అనుసరించాలి. మొదటి, రెండవ శ్రాద్ధాలకు ఒకే పవిత్రకాన్నివ్వాలి. బ్రాహ్మణులు భోజనం చేసిన తరువాత పిండదానాన్నివ్వడం ఉచితం. ఇది సపాక్షిక శ్రాద్ధ విధిలో కనుపిస్తుంది. యజమానుడు బ్రాహ్మణుని మీరు 'ప్రసన్నులైనారు కదా' అని అడగాలి. ఆయన మనఃపూర్వకంగా మేము నీ సేవలపట్ల ప్రసన్నులైనాము. మీ మృత స్వజనులకు అక్షయ లోకాలు ప్రాప్తించాలి' అని వక్కాణిస్తేనే శ్రాద్ధం సఫలమైనట్లు అనుకోవాలి.

ఇక ఏడాది పర్యంతం జరగవలసిన ఏకోద్దిష్ట శ్రాద్ధాలెలా వుండాలో విను. సపిండీకరణం తరువాత జరుగు పదహారు శ్రాద్ధాలనూ ఏకోద్దిష్ట విధానంలోనే పెట్టాలి. అయితే, పార్వణ శ్రాద్ధంలో ఆ నియమం మారుతుంది. ప్రత్యబ్ద (సాంవత్సరిక) శ్రాద్ధాలెలా చేస్తారో ఆ పదహారిటినీ కూడా అలాగే చేయాలి. పదకొండవ, పన్నెండవ దినాల్లో పెట్టే శ్రాద్ధాలకు ప్రేతమే స్వయంగా వచ్చి భోంచేయడం జరుగుతుంది. కాబట్టి మృతవ్యక్తి పేరునుచ్చరిస్తూ 'ఇది వారికే' అంటూ పిండం పెడతారు. సపిండీకరణ తరువాత ప్రేతశబ్ద ప్రయోగముండదు. అంతవఱకిచ్చు ధూప దీపాన్న వస్త్ర జలాదులకు ఇతర వస్తు దానాలకూ ప్రేత శబ్దాన్ని వాడతారు.

ఓయి అరుణానుజా! ఇపుడు జీవులు యమరాజును చేరు మార్గవర్ణనను విను. పదమూడవ నాటి శ్రాద్ధ కృత్యం, (గరుడ) పురాణ శ్రవణం తరువాత జీవుడు యమదూతల వెంట పాములవాడికి దొరికిన పాములాగ, గారడీవాడు పట్టుకొన్న కోతిలాగ ఒంటరిగా విచారంగా బయల్దేరతాడు. తరువాత వాయు ప్రేరితుడై రెండవ శరీరంలో ప్రవేశిస్తాడు. ఈ శరీరం అపరకర్మను అంతవఱకూ చేసిన వాని శ్రద్ధను బట్టీ జీవి చేసిన కర్మను బట్టీ వుంటుంది. మర్త్యలోకం నుండి యమలోకం ఎనుబదియారువేల యోజనాల దూరంలో వుంది. జీవి రోజుకి రెండు వందల నలుబది యేడు యోజనాలు, అర్ధ కోసు దూరం ప్రయాణించాలి. ఇలా ఈ యాత్ర మూడువందల నలభై ఎనిమిది రోజులపాటు సాగుతుంది. ఈ యాత్ర అందరు జీవులకీ ఒకేలా జరగదు. జీవితమంతా పాపాలే చేస్తూ బతికేసిన వారి యాత్ర ఎలా వుంటుందో చూడు :

మృత్యువు కబళించిన పదమూడవ రోజు జీవుడు (ముఖ్యంగా పాపి) యమదూతల కఠోర పాశములచే కట్టబడతాడు. వారు అతనిని అంకుశం చేత బట్టి పరమక్రోధులై కొట్టుకుంటూ గోనిపోతారు. దక్షిణ దిశలో నున్న తమ లోకంవైపు ఈడ్చుకుంటూ పోతారు. దారిలో పిచ్చిమొక్కలు, తీగెలు, ముళ్లు, వెదుళ్ళు, మేకులు, గూటాలు (వీటి మొనలు భూమిపైకి వచ్చేలా పాతబడి వుంటాయి). సూదిగా మొనదేలియున్న రాళ్ళు అదేదో సర్వాంతర్యామిలాగా వుండి అడుగు కొక్కటిగా కాళ్ళకు కన్నాలు పెడుతుంటాయి. అక్కడక్కడ ఆ దారిలో అగ్ని జ్వలిస్తుంటుంది. అక్కడక్కడ నేల పెనుబీటలతో దాట శక్యం కాకుండా వుంటుంది. యమదూతలనివేవీ బాధించవు. అందుచేత వారు ఈ పాపిని వీటన్నిటి మధ్య నుండి ఈడ్చుకుంటూ పోతునే వుంటారు. సూర్యుడు కిరణాలకు బదులు వీరిపై చంద్రనిప్పులు కురిపిస్తున్నట్లు మండుతుంటాడు. ఇంత వేడిలో కూడా ఈగలంతేసి దోమలు పాపి శరీరంపై సందు లేకుండా కుడుతుంటాయి. అతడు (ఆమె) నక్క ఏడుస్తున్న

శబ్దాలు చేస్తూ వారి చేత నీడ్వబడుతూ బీభత్సంగా అరుస్తూ పోతుండాలి. ఒక పక్క శరీరం కాలి బొబ్బలెక్కి పోతుంటే, మరొక వంక వెదుళ్ళ బారినపడి ఒళ్ళు చీరుకుపోతుంటే, వేరొకవైపు కాళ్ళ (అరికాళ్ళ) లో దిగిన ముళ్ళూ మేకులూ, గునపాలూ తొడల దాకా దూసుకుపోతుంటే కనీసం ఆగి, తనశరీరానికే మేరకు నష్టం వాటిల్లిందో చూసుకొనే 'వార' కూడా ఈయకుండా యమదూత లీడ్చుకుపోతుంటే ఆ పాపి గోల అక్షరాలా అరణ్యరోదనే అవుతుంది. ఘోరమైన పాపాలను చేసిన వాని శరీరాన్ని తోడేళ్ళు అక్కడక్కడ రుచి చూస్తుంటాయి. అయినా శరీరం తగ్గదు. తెలివి తప్పదు, ప్రాణమెలాగూ పోదు.

యమలోకానికెళ్ళే దారిలో పదహారు పురాలుంటాయి. వాటి పేళ్ళు యామ్య, సౌరిపురి, నగేంద్రభవన, గంధర్వపుర, శైలాగమ, క్రౌంచ, క్రూరపుర, విచిత్ర భవన, బహ్వాపద, దుఃఖద, నానాక్రందపుర, సుతప్తభవన, రౌద్ర, పయోవర్షణ, శీతాఢ్య, బహుభీతి. ఇవన్నీ పరమ భయంకరాలై దుర్దర్శనాలుగా వుంటాయి. యామ్యపురమార్గంలో జీవి 'నా పుత్రా, నాయనా, నన్ను రక్షించు' అని ఆక్రందిస్తూ తాను చేసిన పాపాలను మరీ మరీ తలచుకొని అంగలారుస్తూ పదునెనిమిదవ రోజున యమరాజ యామ్యపురిని చేరుకుంటాడు. అక్కడ అందమైన మఱ్ఱిచెట్లుంటాయి. జీవికి వాటి క్రింద కూర్చోవాలనుంటుంది. కాని యమదూతలంగీకరించరు. ఒక్క అవకాశం మాత్రం ఇస్తారు. ప్రాణికి పుత్రులా ద్వారానో అన్యుల ద్వారానో కృపాపూర్వకంగానో స్నేహపూర్వకంగానో పృథ్విపై చేయబడిన పిండదానాలు అంది వుంటే వాటిని తిననిస్తారు. తరువాత సౌరిపురి వైపు వెళ్ళాలి. అక్కడికి చేరేదాకా పాపిని యమదూతలు ముద్గరాలతో కొడుతూనే వుంటారు. ఆ దెబ్బలు తింటూ పాపి ఇలా విలపిస్తాడు :

***జలాశయోనైవ కృతో మయా తదా***
***మనుష్య తృప్త్యై పశుపక్షితృప్తయే ।***
***గోతృప్తి హేతోర్నచ గోచరః కృతః***
***శరీర హే నిస్తర యత్ త్వయా కృతం ॥*** ***(ధర్మ...5/100)***

అయ్యో! మనుష్యులను గాని కనీసం జంతువులను గాని ఏనాడూ తృప్తి పఱచనైతిని. అధమపక్షం ఒక జలాశయాన్ని తవ్వించి కొందరి దాహార్తిని తీర్చినా నాకీ బాధ వుండేది కాదు. గోవుల ఆకలి తీర్చే గోచర భూమి నేర్పాటు చేసినా ఈ బాధ తప్పేది కదా! అవకాశముండీ ఈయీ పుణ్యకార్యాలు చేయని ఓ నా శరీరమా! చేసుకున్నవారికి చేసుకున్నంత అనుభవించు – అని భావం)

ఆ సౌరిపుర రాజు కామరూపుడు, ఇచ్ఛానుసారం ఉండేవాడు, గతిశీలుడు. అతనిని చూస్తేనే జీవికి భయంతో ఒళ్ళంతా వణకుతుంది. అయినా ఎలాగో గుండె చిక్కబట్టుకొని పృథ్వి నుండి వచ్చిన పిండాన్ని తిని జలాన్ని తాగి బయల్దేరతారు పాపులు. అక్కడి నుండి వెళ్ళే దారి పొడవునా యమదూతలు వారిని కత్తులతో కొంచెంగా నరుకుతూ, లోతుగాకుండా పొడుస్తూ హింసిస్తూంటారు. అప్పటి జీవి ఆక్రోశమిలా వుంటుంది :

*న నిత్యదానం న గవాహ్నికం కృతం*
*పుస్తంచ దత్తం న హివేదశాస్త్రయోః ।*
*పురాణ దృష్టోన హి సేవితో ౬ ధ్వా*
*శరీర హే నిస్తర యత్ త్వయా కృతం ॥* *(ధర్మ... 5/103)*

ఓ శరీరమా! నేనెప్పుడూ ఎవరికీ కనీసం నీటిచుక్కైనా దానం చేశానుగాను. ఆవుకి గడ్డినైనా మేపాను గాను. పోనీ వేదశాస్త్ర సంబంధి పుస్తకాలైనా దానం చేశానా అంటే అదీ లేదు. పురాణాలలో చెప్పబడిన తీర్థయాత్రాది సత్కర్మలను చేయలేదు. కాబట్టి ఈ బాధలన్నీ పడుతున్నాను అని భావము.

తరువాతి మజిలీ నగేంద్రనగరం. అక్కడ జీవికి తన బంధుబాంధవులు రెండవ మాసంలో పెట్టిన ఆహారం లభిస్తుంది. మరల బయలు దేరిన పాపులను యమదూతలు కత్తిపిడులతో పొడుస్తూ తోలుకు పోతుంటారు. ఆ సమయంలో జీవి ఇలా ఆక్రందిస్తాడు:

*పరాధీన మభూత్ సర్వం మమ మూర్ఖ శిరోమణేః ॥*
*మహతా పుణ్యయోగేన మానుష్యం లబ్ధవానహం ।*

ఎన్నో జన్మల ఎన్నో పుణ్యాల ఫలం మానవజన్మ. ఆ జన్మలో కూడా పుణ్యాలు చేసినా కనీసం పాపాలు చేయకున్నా నా యమమార్గయాత్ర ఇంత దారుణంగా వుండేది కాదు కదా – అని భావం.

ఇలా విలపిస్తూ జీవి మూడవ నెల పూర్తయ్యేసరికి గంధర్వ నగరాన్ని చేరుకుంటాడు. అక్కడ తన వారు పెట్టిన మూడవ మాసిక పిండాన్ని తిని మరల బయల్దేరతాడు. మార్గంలో యమ దూతలీ పాపులను కత్తి మొనలతో పొడుస్తూ తోలుకెళతారు. క్రింద ముళ్ళూ, రాళ్ళూ, మధ్యలో కత్తి మొనా, పై నుండి ప్రచండ భానుని పెనువేడి కిరణాల సూదులూ గుచ్చుకుంటూ వుంటే చేసిన పాపాలు గుర్తుకొస్తుంటే, చేయని పుణ్యాలను తలచుకుంటూ పాపులిలా ఎలుగెత్తి రోదిస్తారు.

*మయాన దత్తం న హుతం హుతాశనే*
*తపో న తప్తం హిమశైల గహ్వరే ।*
*న సేవితం గాంగమహో మహాజలం*
*శరీర హే నిస్తర యత్ త్వయా కృతం ॥* *(ధర్మ...5/108)*

ఓ శరీరమా! మనకీ బాధలెందుకు తప్పడం లేదు, కనీసం తగ్గడం లేదూ అంటే నేనేనాడూ ఎవరికీ ఏ దానమూ చేయలేదు. పోనీ అగ్నిలో పూజలో భాగంగా ఆహుతులైనా వ్రేల్చలేదు. ఏ హిమాలయ గుహలలోకో పోయి తపస్సైనా చేసేనా అంటే అదీ లేదు. కనీసం గంగాజల సేవనమైనా చేయలేదు. ఇంకెన్ని పన్నములున్నవో యేమో?

మృతి చెందాక అయిదవ మాసానికి కొద్ది రోజుల ముందు ప్రాణి (ఆత్మ) క్రౌంచపురం చేరుకొని అక్కడ తన పుత్రాదులచే భూలోకంలో పెట్టబడిన ఊనషాణ్మాసిక శ్రాద్ధపిండాన్ని తిని నీటిని త్రాగి విశ్రమిస్తుంది.

గరుడా! పాపి ఆరవమాసంలో క్రూరపురి వైపు తీసుకుపోబడతాడు. ఈ మార్గంలో పాత బాధలలాగే వుండగా యమదూతలు పట్టిసాలతో కొట్టి తోలుతుంటే ఇలా అరుస్తాడు:

***హా మాతర్హా పితర్ భ్రాతః***
***సుతా హా హా మమస్త్రియ ః ॥***
***యుష్మాభిర్నో పదిష్టే ఽహ -***
***మవస్థాం ప్రాప్త ఈ దృశీం ।*** *(ధర్మ...5/123,124)*

'ఓ మాతా పితలారా! బంధు బాంధవులారా! మీరు నాకెందుకు చెప్పలేదు, మంచి పనులే చేయాలని? మీరు చెప్పినా, నా చేత నయానో భయానో దానాది పుణ్యకార్యాలను చేయించినా నాకిప్పుడీ దురవస్థ తప్పేది కదా!' అని భావం.

అపుడు యమదూతలిలా అంటారు, 'ఓ మూర్ఖజీవుడా! ఇంకెక్కడి తల్లి? ఎవరా తండ్రి? ఏరా పుత్ర మిత్ర బాంధవ స్త్రీలు? నీవొక్కడివే నీవు చేసిన పాపాల ఫలాన్ననుభవిస్తూ వస్తున్నావు. ఏ శక్తీ ఈ మార్గంలో వస్తున్నవారిని కాపాడలేదు. ఎవరినో ఎలుగెత్తి పిలుస్తూ ఏడ్వడం దండగ. పరలోకంలో జీవించేవారికి పరాశ్రయమంటూ వుండదు. నీ స్వకర్మార్జిత పాపపుణ్యాలే నిన్నిక్కడ నడిపిస్తాయి. ఇక్కడ నీ అధికారం పనిచేయదు, క్రయ విక్రయాలు గాని పలుకుబడులు గాని ఇక్కడ సుఖసాధకాలు కావు' ఇలా అదిలిస్తూ, శూలాలతో పొడుస్తూ 'విచిత్ర నగరం' వైపు గొని పోబడుతున్నపుడు జీవి ఇలా గోలెడతాడు :

*కుత్రయామి నహిగామి జీవితం*
*హా మృతస్య మరణం పునర్నవై ।* *(ధర్మ... 5/119)*

అయ్యో! ఈ నా బాధలు భరించలేకున్నాను. చచ్చాననుకున్నాను గాని బతికే వుంటాననీ ఈ బతుక్కి చావే లేదని ఇపుడు తెలుస్తోంది.

ఇలా విలపిస్తూనే వారు విచిత్రనగరంలోకి వెళతారు. అక్కడ విచిత్రుడను పేరు గల రాజుంటాడు. జీవులు షాణ్మాసిక పిండాల నారగించి మరో నగరి వైపు లాక్కుపోబడతారు. దారిలో యమదూతల చేతి దెబ్బలను తింటూ, విపరీతంగా భయపడి పోయి అతి కష్టం మీద ముందుకి పోతూ ఇలా విలపిస్తారు :

*మాతాభ్రాతా పితాపుత్రః కోఽపి మేవర్తతే నవా ।*
*యో మాముద్ధరతే పాపం పతంతం దుఃఖసాగరే ॥* *(ధర్మ... 5/122)*

'అమ్మనాన్నలారా, అన్నదమ్ములారా, పుత్రులారా నన్నీ దుఃఖసాగరం నుండి ఎవరూ ఉద్ధరించలేరా' అని ఏడుస్తూ ఆ జీవి అలా సాగుతునే వుంటుంది. ఇక్కడ 'వైతరణి' అనుపేరు గల ఒక నది తగులుతుంది. దాని వెడల్పు నూరు యోజనాలు. అది చీముతో రక్తంతో నిండి వుంటుంది. వీరక్కడికి చేరగానే అక్కడి నౌకాధిపతియైన నావికుడు ప్రతి జీవినీ 'నీవు వైతరణీ నామక గోవును దానం చేశావా? అలాగైతే వచ్చి కూర్చో. నావలో ఆసీనుడవై సుఖంగా ఈ నదిని దాటి పోదువుగాని' అని అడిగి, చెప్పి, ఎక్కించుకుంటాడు. ఆ దానం చేయనివారిని పడవెక్కనివ్వడు. అలాగని తీరానా వుండనివ్వడు. వారి చేతులను పట్టుకొని తాను నావలో నుండే ఈడ్చుకుపోతాడు. ఆ నదిలో నీడ్వబడుతున్న వారిని సూది ముక్కులున్న, పరమ బలిష్టములైన కాకులూ, కొంగలూ అందిన చోటల్లా పొడుచుకు తింటూంటాయి. గుడ్లగూబలు కూడా అందిన కాడికి నమలుతుంటాయి. అన్ని బాధల నడుమా ఆ జీవి పాపిష్ఠి ప్రయాణం అలా కొనసాగుతునే వుంటుంది. ఇక వైతరణి గోవును దానం చేసి తత్ఫలితంగా పడవనెక్కినవారికి నరకాని కెళ్ళే బాధ తప్పుతుంది. విష్ణు దూతలు నావలోకే వచ్చి వారిని విమానమెక్కించి తమ లోకానికి గొనిపోతారు.

*మనుజానాం హితం దానమంతే వైతరణీ ఖగ ।*
*దత్తా పాపం దహేత్ సర్వం మమలోకం తు సా నయేత్ ॥* *(ధర్మ...5/126,127)*

ఏడవమాసం వచ్చేసరికి జీవి 'బహ్వాపద' అనే పురంలో ప్రవేశిస్తాడు. భూలోకంలో పెట్టబడే సప్తమాసిక పిండాన్నీ నీటినీ సేవించి మరల బయలుదేరతాడు. యమదూతలు పెద్ద పెద్ద పరిఘలను పెట్టి కొడుతూ తోలుకుపోతుంటే ఇలా అంగలారుస్తాడు.

*న దత్తం న హుతం తప్తం నస్నాతం నకుతం హితం ।*
*యాదృశం చరితం కర్మమూఢాత్మన్ భుంక్ష్వతాదృశం ॥ (ధర్మ... 5/129)*

ఓ శరీరమా! నేనేనాడూ దాన, ఆహుతి, తప, తీర్థస్నాన, పరోపకారాది సత్కార్యాలలో నొకటీ చేయలేదు. మూర్ఖుని వలె బతికేశాను. ఇప్పుడనుభవిస్తున్నాను.

గరుడా! తదనంతరం ఆ జీవి ఎనిమిదివ మాసంలో 'దుఃఖదపురా'న్ని చేరుకుంటాడు. ఇక్కడ తన స్వజనులు పెట్టిన అష్టమాసిక పిండజలాలను పుచ్చుకొని 'నానక్రంద'మనే పురానికి బయల్దేరతాడు. మార్గంలో యమదూతల ముసలాఘాతాల పాలబడి ఇలా పలవిస్తాడు.

**క్వజాయాచటులైశ్చాటు పటు భిర్వచ నైర్మమ ॥**
**భోజనం వల్ల భల్లభల్లీ భిర్ముసలైశ్చ క్వమారణం । (ధర్మ... 5/131,132)**

హా హతవిధీ! ఒకప్పుడూ కదిలే కన్నులతోనే కథలు చెప్తూ నన్ను కీర్తిస్తూ చక్కని మాటలాడుతూ నా భార్య పెట్టే భోజనాన్ని తినేవాడిని. ఇప్పుడు యమదూతలు కటువైన మాటలాడుతూ పెట్టే బల్లెపు పోటులను తింటున్నాను. ముసలాల దెబ్బలనూ తింటున్నాను. అయ్యో! అని భావం.

ఇలా విలపిస్తూనే జీవి తొమ్మిదవ నెలలో 'నానాక్రందపురా'న్ని చేరుకుంటాడు. తరువాత పుత్రుని ద్వారా పెట్టబడిన మాసిక పిండాన్ని తిని నానావిధాల ఆక్రందనలనూ వినిపిస్తూనే 'సుప్తభవన'మనే చోటికి పదవమాసంలో చేరుకుంటాడు. అక్కడి దెబ్బలకు ఇలా విలపిస్తాడు :

*క్వ సూను పేశలకరైః పాద సంవాహనం మమ ॥*
*క్వ దూత వజ్రప్రతిమ కరైర్మృత్పద కర్షణం । (ధర్మ...5/134,135)*

అకటా! పుత్రులు తమ చేతులతో మృదువుగా నా కాళ్ళు పడుతుంటే అలసటను మఱచి నిద్రలోకి జారుకొనేవాడను. ఇక్కడ వజ్రకఠినములైన చేతులతో నన్ను లాక్కుపోతుంటే ఈడ్వబడుతున్నాను. ఆ బతుకేడ? ఈ చావేడ?

పదవ నెలలో అక్కడే పిండజలాలను సేవించి ప్రయాణిస్తూ పదకొండవనెలలో జీవి 'రౌద్రపురా'న్ని చేరుకుంటాడు. యమదూతలు విసుగూ విరామం లేకుండా వీపుపై బాదుతునే వుంటారు. అప్పుడిలా ఏడుస్తూ పెడబొబ్బలు పెడతాడు :

*క్వాహం సతూలీశయనే పరివర్తన్ క్షణే క్షణే ।*
*భటహస్త భ్రష్ట యష్టి కృష్టపృష్ఠః క్వవాపునః ॥* **(ధర్మ...5/137)**

ఒకనాడు పట్టు పరుపులు పరుపబడిన అత్యంత కోమలమైన గద్దెపై ఒత్తిగిలుతూ, దిశ మారుస్తూ ఆనందించేవాడిని. ఈనాడు ఈ దెబ్బలు పడలేక ఒత్తిగిలవలసి వస్తోంది. అయ్యో ఆ బతుకేడ? ఈ చావేడ?

పక్షీంద్రా! తరువాత జీవిని మరల పిండోదకాలు పుచ్చుకోనిచ్చి యమదూతలు 'పయోవర్షణ'మను నగరి వైపు ఈడ్చుకుపోతారు. దారిలో పాపిని చిన్న చిన్న గొడ్డళ్ళతో నెత్తిపై మోదుతుంటారు. అపుడు జీవి తన పాత సుఖజీవనంతో ఈ బాధామయ జీవనాన్ని మరొకసారి పోల్చుకొని ఇలా దురపిల్లుతాడు :

*క్వ భృత్య కోమల కరైర్గంధ తైలావసేచనం ॥*
*క్వ కీనాశానుగైః క్రోధాత్కుఠారై శిరసి వ్యథా ।* **(ధర్మ...5/139,140)**

అయ్యో నా ఖర్మమా! ఒకప్పుడీ తలపై తీయని తలపుల ఊరించే చిరునవ్వుల జల్లుల మధ్య కోమలాంగులైన పరిచారికలు సుగంధాలను వెదజల్లే తైలాలతో మర్దన చేసేవారు. అటువంటి తలపై నేడీ కఠోర మనస్కులైన యమదూతలు వికటాట్టహాసాలు చేస్తూ గొడ్డళ్ళతో మోదుతున్నారు. ఆ బతుకెక్కడ? ఈ చావెక్కడ?

ఈ పయోవర్షకాన్నుండి, ఊనాబ్దిక శ్రాద్ధాన్ని తిన్నాక, ఏడాది గడుస్తున్నదనగా మృతులు 'శీతాఢ్య' నామకనగరి వైపు ఈడ్చుకుపోబడతారు. దారిలో యమదూతలు పాపాత్ముని నాలుకను కత్తులతో కొద్ది కొద్దిగా నరుకుతుంటారు. అప్పుడా పాపి ఇలా గోలపెడతాడు.

*ప్రియాలాపైః క్వచ రసమధురత్వస్య వర్ణనం ।*
*ఉక్తమాత్రే ఽసి పత్రాది జిహ్వోచ్ఛేదః క్వ చైవహి ॥* **(ధర్మ...5/142)**

అయ్యయ్యో! ఒకనాడు నా చక్కని, చల్లని కబుర్లు విని ఈ నాలుక రసాభ్యుచిత బంధమని లోకులు ప్రశంసించేవారు. నేడదే షడ్రసాలను రుచులను మాటతేటలను అనుభవించిన నాలుక నీ ముష్కరులు తెగగోస్తున్నారు కదా! అట్టి బతుకేడ? ఇట్టి చావేడ? ఒకటి మాత్రం నిజం. ఆ బతుకక్కడ. ఈ చావిక్కడ.

అనంతరం అదే నగరంలో ఆ మృతకులు వార్షిక పిండోదకాలనూ శ్రాద్ధంలో పెట్టబడిన అన్య పదార్థాలనూ సేవించి తమ శరీరాలు మారి పిండజ శరీరంలో ప్రవేశించి

'బహుభీతి' అనే నగరాన్ని చేరుకుంటారు. ఆ మార్గంలో పాపి తన పాపాలన్నీ గుర్తుకు రాగా తనను తానే నిందించుకుంటాడు. కొద్దికాలంలోనే యమపురిని చేరుకుంటాడు.

ఈ యమలోక విస్తృతి నలుబది నాలుగు యోజనాలు. అక్కడ 'శ్రవణ' నామకులైన పదముగ్గురు ప్రతీహారులుంటారు. వీరికి శ్రవణ కర్మ అంటే ఇష్టం. దానిని చేస్తే సంతోషిస్తారు. చేయకపోతే క్రుద్ధులైపోతారు. ఆ లోకంలోకి చేరుకున్న (లోనికి పోయిన) పాపులు మృత్యుకాలం, అంతకుల మధ్య, కొండంత ఆకారంతో, అలవిమాలిన క్రోధం వల్ల ఎఱ్ఱబడ్డ కన్నులతో భయంకరంగా నున్న యమరాజును దర్శిస్తారు. ఆయన ముఖమండలం విశాలదంతయుక్తమై మరింత భయం గొలుపుతూ వుంటుంది. ఆయన ముడివడిన దట్టమైన కనుబొమలింకా జడిపిస్తాయి. ఆయనను నలువైపులా పరివేష్టించి సేవిస్తూ వికృత ముఖాకృతులతో రూపు కట్టిన వేలాది వ్యాధులుంటాయి. యమధర్మరాజు ఒక చేత దండాన్నీ మరొక చేత భైరవ పాశాన్నీ ధరించి వుంటాడు.★

యమలోకానికి చేరుకున్న ప్రతి జీవీ యముని ద్వారా ఆదేశింపబడిన శుభాశుభగతులలోకి పోవలసి వుంటుంది. పాపాత్ముల గతులనిదివఱకే విన్నావు కదా! వారు యముని న్యాయము (నేటి భాషలో తీర్పు) వెలువడగానే అక్కడి నుండి తొలగింపబడతారు. వెంటనే యముని ఆకృతి మారిపోతుంది. అక్కడ మిగిలిన పుణ్యాత్ములకు, ఛత్ర, పాదుకా, గృహాది దానాలు చేసినవారికి (వీరు మరో దారిలో పూల బాటలపై వచ్చి అక్కడ చేరతారనుకోవచ్చు) సౌమ్యస్వరూపుడై, కర్ణకుండలాలతో స్వర్ణ కిరీటంతో ఇతరేతర దేవోచితాలంకారాలతో చిరునవ్వునూ కనులలో కరుణనూ కనబరుస్తూ యమధర్మరాజు దర్శనమిస్తాడు. శోభాసంపన్నుడై వారితో మాట్లాడతాడు. వారి వారి పుణ్యాలను బట్టి స్వర్గానికో, ఇంకా ఉత్తమ జన్మలకో పంపిస్తాడు. కాబట్టి గరుడా! పాపకర్మలనే చేయువాడు, పుణ్యకర్మాల వూసే పట్టనివాడు (ఆడవారు కూడా) పుణ్యం చేసినా దానికి కొన్ని రెట్లు పాపం చేసినవాడు సుఖపడరు. వత్సా! ఇంకేమి వినగోరెదవు?'

***(అధ్యాయం - 5)***

---

★ *యముని వద్ద శ్రవణులనే వారుంటారు. వీరు బ్రహ్మపుత్రులు. త్రిలోకాలలో ఎక్కడైనా ఏ ఆటంకమూ లేకుండా సంచరించగలరు, దూరశ్రవణ, దూరదర్శనాది విద్యలున్నవారు. వారి భార్యలూ అలాటి వారే. వారిని శ్రవణీలాంటారు. వారీ ముల్లోకాలలో గల స్త్రీల చేష్టలను గ్రహించగలరు. ఈ శ్రవణీ శ్రవణులు ప్రత్యక్షంగా, పరోక్షంగా ఎవరే పాపాలు చేశారో చిత్రగుప్తునికి చెప్తారు.*

# వృషోత్సర్గ మహిమ, వీరవాహన మహారాజు కథ, నారదుని పూర్వ జన్మ వృత్తాంతం

'హే జగన్నాయకా! జ్ఞానసాగరా! వృషోత్సర్గం చేయకపోతే పరలోకంలో సద్గతి ప్రాప్తించదని విన్నాను. అందువల్ల దానిని గూర్చి తమ నుండి వివరంగా వినాలనే కోరిక కలిగినందున వినిపించుమని తమకు విన్నవించుకుంటున్నాను' అని ఖగేంద్రుడు పేంద్రునడుగగా ఆయన సంతోషించి ఇలా ఉపదేశించసాగాడని సూతమహర్షి శౌనకాది మహామునులకు చెప్పుచున్నాడు.

'వైనతేయా దీనికి సంబంధించి ఒక ఇతిహాసమున్నది వినుము. దీనినొకప్పుడు బ్రహ్మపుత్రుడైన వసిష్ఠుడు వీరవాహనుడను రాజుకి చెప్పాడు.

ప్రాచీన కాలంలో విరాధ నగరాన్ని వీరవాహనుడనే మహారాజు పరిపాలిస్తుండేవాడు. ఆయన గొప్ప దానశీలి, ధర్మాత్ముడు, సత్యవాది. ఒకనాడాయన వేటకై వనానికి వెళ్ళి అక్కడికి దగ్గరలోనే వసిష్ఠ మహర్షి ఆశ్రమ ముండటంతో ఆయన దర్శనం చేసుకొని ఏవో నాలుగు మంచి మాటలు విందామని అక్కడకు పోయాడు. మునులచే, జ్ఞానులచే పరివేష్టింపబడియున్న మహర్షిని గాంచి పులకిత శరీరుడై ఆయనకు పాదాభివందనం గావించి సన్నిధిలో కూర్చుని ఇలా అర్థించాడు :

"మునీంద్రా! నేను యథాశక్తి ప్రయత్నపూర్వకంగా, ఎన్నో ధార్మిక కృత్యాలు చేశాను. అయినా నాకింకా నారకీయ భయం తగ్గలేదు. యమధర్మరాజెటువంటి తీర్పు చెపుతాడోనని ఆందోళనగా వుంది. యమధర్మరాజునీ నరకాన్ని చూడకుండాగాని మరొక విధంగా నరకబాధలు లేకుండా గాని, నా మరణానంతర జీవనం గడిపే అవకాశం వుందా?'

'మహారాజా! మనది శాస్త్రసుసంపన్నమైన జాతి. శాస్త్రవేత్తలెన్నో ప్రకారాల ధర్మాలను వర్ణిస్తూనే వున్నారు గాని కర్మమార్గ విమోహితులైన జనులు వారినీ, వాటినీ పెద్దగా పట్టించుకోరు. దానం, తీర్థం, తపస్సు, యజ్ఞం, సన్యాసం, పితృక్రియాది ధర్మాలలో వృషోత్సర్గం చివరి ధర్మంలో భాగంగా గొప్ప మాహాత్మ్యాన్ని కలిగి వుంటుంది. పురుషుడు అనేకులైన పుత్రులను కనాలి. వారిలో నొక్కడు గయాతీర్థానికి పోయి కర్మ చేసినా, అశ్వమేధం చేసినా, నల్ల ఆబోతు లేదా ఎద్దును యథావిధి వదిలినా అతనికీ, అతని తండ్రికీ తెలిసి గాని తెలియకగాని చేసిన బ్రహ్మహత్య వంటి పాపాలు కూడా నశిస్తాయి. వృషోత్సర్గాన్ని పదకొండవరోజున అపరకర్మలో భాగంగా పుత్రులుగాని ఇతరులు గాని

చేయకపోతే ఆ మృతవ్యక్తి ఎప్పటికీ ప్రేతంగానే మిగిలిపోతాడు. ఇక ఎన్ని శ్రాద్ధాలు పెట్టి ఏమి లాభము? ఏదో ఒక విధంగా ఎంత బాధపడైనా సరే, ఒక ఆబోతును నగరంలోనో, తీర్థంలోనో అవశ్యం వదలాలి.'

ఖగేశా! దీనిని వృష-యజ్ఞమని కూడా అంటారు. ప్రేతత్వం నుండి ముక్తిని ప్రాప్తింపజేయు సాధనం మరేదీ లేదు. దీనినెలా చేయాలంటే అన్ని శుభలక్షణాలూ కలిగి నల్లని కంఠమూ, గంగడోలూ గల వృషభాన్ని రెండు లేదా ఒక దూడ(ల) కిచ్చి పెండ్లి చేయాలి. తరువాత మాంగలిక ద్రవ్యాలతో మంత్రాలతో వాటిని గోచార భూమిలోగాని మరొక మైదానంలో గాని ఆవులెక్కువగా తిరుగాడు చోట వదలివేయాలి. ఈ క్రింది యజుర్వేద మంత్రాలను పఠిస్తూ అగ్నిదేవునికి ఆహుతులనివ్వాలి :

*ఓం ఇహరతిః స్వాహా ఇదమగ్నయే ।*
*ఓం ఇహరమధ్వం స్వాహా ఇదమగ్నయే ।*
*ఓం ఇహద ధృతిః స్వాహా ఇదమగ్నయే ।*
*ఓం ఇహస్వధృతిః స్వాహా ఇదమగ్నయే ।*
*ఓం ఉపసృజన్ ధరుణం మాత్రే ధరుణోమాతరం ధ్యన్ స్వాహా ఇదమగ్నయే ।*
*ఓం రాయ స్పోష మస్మాసు దీధరత్ స్వాహా ఇదమగ్నయే ।* *(యజు...8/51)*

మృతక సందర్భంలోనే కాక ఇతర కల్యాణ ఘడియలలో కూడా వృషోత్సర్జనము చేయవచ్చు. కార్తిక, మాఘ, వైశాఖ పూర్ణిమలలో, సంక్రాంతి, వ్యతిపాత దినాల్లో, తీర్థాలలో, పితృదేవుని క్షయతిథినాడు చేయబడు వృషోత్సర్గం విశేష రూపంలో ప్రశస్తంగా భావింపబడుతుంది. నీలవృషభమనగా నల్లని ఎద్దే కానక్కర లేదు. ఎఱ్ఱరంగులో వుండి మూతి, తోక తెల్లగా నుండి, గిట్టలు, కొమ్ములు పచ్చగా వున్న ఎద్దునూ నీలవృషభమంటారు.

*లోహితో యస్తు వర్ణేన ముఖే పుచ్ఛే చ పాండురః ॥*
*పీతః ఖుర విషాణేషు స నీలో వృష ఉచ్యతే ।* *(ధర్మ... 6/19,20)*

తెల్లయెద్దును బ్రాహ్మణ యెద్దనీ, ఎఱ్ఱ, పచ్చ, నల్ల వాటిని క్రమంగా క్షత్రియ, వైశ్య, శూద్ర వృషాలనీ అంటారు. ఏ వర్ణం వారు ఆ వర్ణపుటెద్దుని వదలడం మంచిది. ఎఱ్ఱటి ఎద్దుని ఏ వర్ణం వారైనా ఉత్సర్జనం చేయవచ్చును. పితరులు ఈ వృషోత్సర్గాన్ని ఆనందంగా తిలకిస్తుంటారు. కర్మ చేయువారు వృషాన్ని ధర్మస్వరూపంగా భావించి దాని ద్వారా ధర్మాన్ని ఇలా ప్రార్థించాలి.

*ధర్మస్త్వం వృషరూపేణ జగదానందదాయకః ॥*
*అష్టమూర్తే రధిష్ఠానమతః శాంతిం ప్రయచ్ఛమే ।*
*గంగాయమున యోః పేయమంతర్వేది తృణం చర ॥*
*ధర్మరాజస్యపురతో వాచ్యం మే సుకృతం వృష ।* *(ధర్మ...23-25)*

ఇలా యమధర్మరాజుకి తన పుణ్యకర్మలను విన్నవించుమని ధర్మదేవతకు నివేదించిన పిమ్మట దాత ఆ ఎద్దు యొక్క కుడిభుజంపై త్రిశూల చిహ్నాన్నీ, ఎడమ ఊరుభాగంపై చక్రాంకిత చిహ్నాన్నీ వేయించి గంధ, పుష్పాక్షతాదులతో దానిని దూడతో సహా కట్లువిప్పి వదిలెయ్యాలి.

వసిష్ఠుడింకా ఇలా అన్నాడు. 'మహారాజా! మీరు కూడా పద్ధతి ప్రకారం ఎద్దును వదలండి. లేకుంటే అన్య సాధనాలన్నీ సంపన్నం చేసినా కూడా సద్గతి కలగకపోవచ్చు. ఒకప్పుడు త్రేతాయుగంలో విదేహ నగరంలో ధర్మవత్సుడని ఒక బ్రాహ్మణుడుండేవాడు. ఆయన తన వర్ణానుసారం చేయవలసిన కర్మలన్నీ అవసరమైతే కూర్చుని అహర్నిశలూ గావించేవాడు; గొప్ప విద్వాంసుడు, విష్ణు భక్తుడు, అత్యంత తేజస్వి, లోభికాకుండా వచ్చినదానితోనే సంతుష్టి చెందేవాడు. ఒకమారు ఆయన పితృకార్యానికై కుశల కోసం పలాశపత్రాల కోసం వనంలోకి వెళ్ళి అటూ ఇటూ తిరుగుతూ వాటిని సిద్ధం చేసుకో సాగాడు. ఉన్నట్టుండి నలుగురు సుందరులైన పురుషులు ఆకాశం నుండి ఊడిపడి ఈ బ్రాహ్మణుని పట్టుకొని ఆకాశమార్గాన సాగిపోయి ఆ దీన, వ్యథిత బ్రాహ్మణుని దట్టమైన అడవులూ, పర్వతదుర్గాలూ దాటించి ఒక విశాల వన మధ్యంలో గల ఒక నగరంలో దింపారు. ఆ నగరం బ్రహ్మాండమైన ముఖ్యద్వారంతో, ఎత్తయిన ప్రాసాదాలతోనూ శోభిల్లుతున్నది. అరుగులు, బజార్లు, వస్తు బాహుళ్యమూ, సర్వాలంకృతులై సంభ్రమంగా సంబరంగా తిరుగుతున్న స్త్రీ పురుషులూ, తూర్యారావాలూ ఇతర వాద్యాల (వీణ, నగారాల) ధ్వనులూ – వీటన్నిటితో గొప్ప ధనికంగా, సుఖాల నిలయంలా కన్పట్టుతున్న ఆ నగరిలోనే రెండు విభిన్న రకాల మనుష్యలాతనికి కనిపించారు.

కొందరు ఆకలిబాధతో రోదిస్తూ, దీనులై, హీనులై, పురుషార్థరహితులై, చిరిగిన మాసిన బట్టలు కట్టుకొని ఎందుకు బతికున్నాముర దేముడా అన్నట్లుండగా మరికొందరు హృష్ట, పుష్ట మనశ్శరీరులై స్వర్ణ భూషణాలంకృతులై సుందర వస్త్రాలను ధరించి నవ్వుతూ తుళ్ళుతూ ఎంత మంచి బతుకిచ్చావు దేవుడా అన్నట్లున్నారు. వారి రూపురేఖలూ అలంకారాలూ కూడా దైవత్వం తొణికిసలాడుతున్నట్లుండడం చూసి అతడు ఆశ్చర్య చకితుడైనాడు. 'నేనేమైనా కలగంటున్నానా, లేక ఇదేదో మాయాజాలమా, కాక నా చిత్త

భ్రమయా' అనుకోసాగాడు. ఈలోగా ఆ నలుగురు పురుషులూ ఆ బ్రాహ్మణుని రాజు వద్దకు గొనిపోయారు. స్వర్ణజటితమైన రాజ ప్రాసాదంలో నొక మహా దివ్యసింహాసనంపై విరాజిల్లుతున్న ఆ మహా రాజు వైభవం చూసి అతనికి మతిపోయినంత పనైంది. ఆ రాజుగారివైపే అలా కన్నార్పకుండా చూస్తుండిపోయాడు. ఛత్ర చామరాలు, స్వర్ణ నిర్మిత ముకుటం, వందీజన గుణగానాలు– అతనిని అవాక్కు పఱచాయి.

అంత గొప్ప మహారాజూ ఈ బ్రాహ్మణుని చూడగానే గౌరవసూచకంగా లేచి నిలబడి, అతనిని ఆసనంలో కూర్చోబెట్టి మధుపర్కాలతో కప్పాడు. అత్యంత ప్రసన్నచిత్తుడై ఆ విప్రవరునితో ఇలా అన్నాడు, 'ప్రభో! మీవంటి ధర్మపరాయణుని, విష్ణుభక్తుని చూసినందుకు నేడు నా జన్మ సఫలమైంది. నా వంశము పవిత్రమైంది.' అంటూ ప్రణమిల్లి మరిన్ని మంచి మాటలతో చేతల ద్వారా అతనిని సంతుష్టుని చేసి తన వారితో 'ఓ దూతలారా! ఈ బ్రాహ్మణదేవుని ఆయనను మీరు దర్శించిన చోట చేర్చిరండి" అన్నాడు.

బ్రాహ్మణుడప్పటికి పూర్తిగా తేఱుకొని ఆ రాజుతో ఇలా అన్నాడు, 'మహారాజా! ఇది ఏ దేశము? ఒకేచోట ఉత్తమ, మధ్యమ, అధమ జీవనులెలా కనబడుతున్నారు? మీరు దేవేంద్ర వైభవంతో ఏ పుణ్యవశాన ఇలా రాజిల్లుతున్నారు? నన్నిక్కడికెందుకు తీసుకొచ్చారు? మరల వెంటనే ఎందుకు పంపించి వేస్తున్నారు? ఇదంతా ఏదో కల లాగుంది గాని కల కాదని మాత్రం తెలుస్తోంది. దయచేసి నా అజ్ఞానాన్ని దూరం చెయ్యండి.

'ఓ విప్రదేవా! తమవలె ధర్మాన్ని సక్రమంగా పాలిస్తూ నిత్యమూ విష్ణుభక్తి పరాయణులై జీవిస్తూ, ఇంద్రియ నిగ్రహాన్ని కలిగియుండి, విషయవాంఛల కతీతులుగా జీవించు మహానుభావులని ఇక్కడికి గొని వచ్చి పూజించి సత్కరించి పంపడాన్ని కర్తవ్యంగా భావించే భక్తుడను నేను. తీర్థయాత్రాసక్తులై, వృషోత్సర్గమాహాత్మ్య జ్ఞానాన్ని కలిగినవారై, సత్యవ్రతులై, దానరతులై మెలగువారు నాకు పూజ్యులు. దేవతలు కూడా వారికి ప్రణామం చేస్తారు. పరంతపులు, పూజార్హులునగు మీ దర్శనభాగ్యాన్ని నాతోబాటు నా వారందరికీ కలిగింపజేయడానికే మిమ్మల్నిక్కడికి రప్పించాను. హే భూదేవా! మీరు నా పట్ల ప్రసన్నులై నా ఈ సాహసాన్ని మన్నించి నన్ను క్షమించాలి. నా సంపూర్ణ చరిత్రను తమకు వర్ణించి చెప్పే సామర్థ్యంగాని అర్హతగాని నాకు లేవు. ఈ వృత్తాంతాన్ని విపశ్చిన్నామధారులైన మా మంత్రిగారే మీకు విన్నవించగలరు' అని మౌనం వహించాడా మహారాజు.

అపుడు సర్వవేదవిదుడు, సకల విద్యాపారంగతుడునగు మహామంత్రి విపశ్చిత్తు తన రాజుగారి మనసులోని మాటను గ్రహించినవాడై ఇలా చెప్పసాగాడు : 'విప్రోత్తమా!

మా మహారాజుగారు పూర్వజన్మలో ద్విజులూ దేవతలూ ఇష్టపడి నివసించే విరాధనగరిలో వైశ్యునిగా జన్మించారు. అప్పట్లో ఆయన పేరు విశ్వంభరుడు. వైశ్యవృత్తితో జీవనాన్ని గడుపుతూ తన పరివారాన్ని పోషించుకుంటుండేవారు. నిత్యమూ గోవులను సేవించుకుంటూ బ్రాహ్మణులను పూజిస్తూ ఉండేవారు. సత్పాత్రదానము, అతిథి సేవ, అగ్నిహోత్ర నిర్వహణ ఆయన నిత్యధర్మాలై వుండేవి. ధర్మపత్నియగు సత్యమేధాదేవి సహకారంతో గృహస్థాశ్రమాన్ని సవ్యంగా నిర్వహించారు. స్మార్తకర్మానుష్ఠానం, శ్రౌతకర్మల ద్వారా ఆయన లోకాలనూ, దేవతలనూ కూడా మానసికంగా గెలుచుకోగలిగారు.

ఒకప్పుడాయన సోదరసమేతుడై పెద్దయెత్తున తీర్థయాత్రలను చేసుకొని ఇంటికి మరలి వస్తుండగా దారిలో ఆయనకు లోమశ మహర్షి దర్శనమైనది. వెంటనే విశ్వంభరుడాయనకు సాష్టాంగ దండ ప్రణామం చేసి లేచి వినయంగా చేతులు జోడించి నిలబడగా లోమశమహర్షి కరుణాసాగరుడై 'ఎక్కడి నుండి రాక ఇటకు' అంటూ కుశల ప్రశ్నలు వేశాడు.

'మునివరా! మీ వంటి పెద్దల ద్వారా ఈ శరీరం నశ్వరమనీ మృత్యువు మనకెదురుగనే నిలబడి వుంటుందనీ తెలుసుకున్నాను. అందుకే పుణ్యసముపార్జనకై సమయం మించి పోరాదని ధర్మపరాయణయైన నా పత్నితోనూ, ఆత్మబంధువులతోనూ కలసి తీర్థములను విధివత్తుగా దర్శించి ధనాది దానాలతో వీలైనంతమందిని తృప్తిపఱచి యాత్రను ముగించి ఇంటికి మరలి వస్తున్నాను. యాత్రల పుణ్యఫలం వెంటనే కనిపించింది. మీరు దర్శనమిచ్చారు' అన్నారు విశ్వంభరులు.

'ఓయి భద్రపురుషా! ఈ భారతవర్షం అనే పుణ్యభూమిలో ఎన్నో పావన తీర్థాలు న్నాయి. నీవేమి చూశావో చెప్పి నన్నానందింపజేయి"

'మునీశ్వరా! ఇలా మీతో మాట్లాడగలగడమే నా పూర్వజన్మ సుకృతమనుకుంటాను. ఎక్కడైతే గంగాయమునా సరస్వతీ నామక పరమపవిత్ర నదీమతల్లులు సంగమిస్తాయో, ఎక్కడ బ్రహ్మ ఇంద్రుడూ దశాశ్వమేధ యజ్ఞాలను గావించారో, ఆ ప్రయాగయను తీర్థరాజాన్నీ, కరుణా నిధానమూ, దేవదేవేశ్వరుడూనైన శివుడు ఏ క్షేత్రంలో నైతే ప్రాణుల చెవులలో తారకమంత్రాన్నుపదేశిస్తాడో ఆ మోక్షదాయిని కాశీక్షేత్రాన్నీ, పులహాశ్రమాన్నీ, ఫల్గుతీర్థ, గండకి, చక్రతీర్థ, నైమిషారణ్య, శివతీర్థ, అనంతక, గోప్రతారక, నాగేశ్వర, విందు సరోవర, మోక్షదాయకుడూ రాజీవలోచనుడూ కరుణాపయోనిధీయైన శ్రీరాముని పుట్టుకచే సుశోభితమైన అయోధ్య, అగ్ని, వాయు, కుబేర, కుమార తీర్థాలనూ, సూకర క్షేత్రం, శ్రీకృష్ణుని జన్మచే పవిత్రమైన మథుర, పుష్కర, సత్యతీర్థం, జ్వాలా, దినేశ్వర, ఇంద్రతీర్థాలూ, పశ్చిమవాహినియైన సరస్వతీ, కురుక్షేత్రాలను దర్శించాను.

తరువాత తాప్తీ, పయోష్ణీ, నిర్వింధ్యా, మలయ, కృష్ణవేణీ, గోదావరీ, దండకవన, తామ్రచూడ, సదోదక, ద్యావాభూమీశ్వర తీర్థాలను దర్శించి పర్వతరాజమైన శ్రీశైలాన్ని చేరుకున్నాను. ఆపై మహాతేజస్వియైన విష్ణుభగవానుడు శ్రీరంగ నామమును ధరించి వెలసిన మహాక్షేత్రాన్నీ, మహిషాసురమర్దిని దుర్గమ్మ వేంకటి అను పేర వెలసిన వేంకటాచలాన్నీ దర్శించాను. అనంతరం చంద్రతీర్థ, భద్రవట, కావేరీ, కుటిలాచల, అవటోదా, తామ్రపర్ణీ, త్రికూట, కోల్లకగిరి, వసిష్ఠతీర్థ, బ్రహ్మతీర్థ, జ్ఞానతీర్థ, మహోదధి, హృషీకేశ, విరాజ, విశాల, నీలాద్రి (జగన్నాథపురి), భీమకూట, శ్వేతగిరి, రుద్రతీర్థ, పార్వతమ్మ తపస్సు చేసి శివయ్యను పొందిన ఉమావనాదులను చూశాను. అలాగే వరుణ, సూర్య, హంస, తీర్థాలనూ మహోదధినీ చూశాను. వీటిలో స్నానం చేసే అడవి కాకి కూడా వచ్చే జన్మలో హంసగా పుడుతుందంటారు. అక్కడొక రాక్షసుడు స్నానం చేసి దేవత్వాన్ని పొందాడని వినికిడి. తరువాత విశ్వరూప, వంది, తీర్థ, రత్నేశ, కుహకాచల తీర్థాలకు వెళ్ళాను. అక్కడి శ్రీమన్నారాయణుని దర్శించిన వారికి కోటిపాపాలు దగ్ధమవుతాయి. వృషద్వతి, యమున అనే నదులు మానవ కల్యాణకారకాలు. వాటిలో స్నానం చేసి అక్కడి పుణ్యక్షేత్రాలను దర్శించాను. మహాకాళ, నీలకంఠ, అమరకంటక, చంద్రభాగ, వేత్రవతి, వీరభద్ర, గణేశ్వర, గోకర్ణ, బిల్వ, కర్మకుండ, సతారక తీర్థాలలో స్నానం చేసి ఈ స్నానాల వల్ల మనిషి కర్మబంధనాల నుండి ముక్తుడవుతాడని విని సంతోషించాను. మునీంద్రా! మీ దయ వల్ల ఈ యాత్రలను చేసి ఇలా వెనుకకు వెళుతున్నాను. సాధుజనుల కృప ప్రాణులలో కల్యాణకారిణియైన బుద్ధికి జన్మనిస్తుంది. ఒకవైపు తీర్థాలూ, మరొకవైపు మీవంటి సత్పురుషులూ లోకకల్యాణానికి పరమోపకారులు.

*ఉత్పద్యతే శుభాబుద్ధిః సాధూనాం యదనుగ్రహః*
*ఏకతః సర్వతీర్థాని కరుణాః సాధవోఽ న్యతః ॥*
*అనుగ్రహాయ భూతానాం చరంతి చరితవ్రతాః ।* *(ధర్మ...6/77,78)*

మహర్షి పుంగవా! మీరు అన్ని వర్ణముల వారికీ గురుదేవులు. విద్యలోనూ వయసు లోనూ శ్రేష్టులు. కాబట్టి చిరంతన కాలంనుండీ వస్తున్న ఒక విషయం గూర్చి ఇంకెవరి నడగను? మిమ్మల్నే అర్థిస్తున్నానను. నా మనస్సు అత్యంత చంచలమై పోవుచున్నది. అది బ్రహ్మ విషయం అర్థం కాక వ్యాకులపడుతున్నది. కాబట్టి నాకు జ్ఞాన సంపన్న వ్యక్తి వద్ద వుండే శాంతినీ, వివేకవంతుడైన శ్రేష్ఠ మనుష్యునికి అంతర్బాహ్య స్థితులు రెండిటా ఒకేలా వుండే శుద్ధతనీ సంపాదించి పెట్టే సాధనను 'తెలపండి' అని ప్రార్థించాడు విశ్వంభర వైశ్యుడు. సహజంగా బుద్ధిమంతుడు, విద్యావేత్త. పైగా అన్ని యాత్రలు చేసినవాడు కాబట్టి

అతనికి ఏం కావాలో తెలిసింది. ఎవరి నడగాలో కూడా తెలిసింది. ఈ విషయం లోమశ మహర్షికి కూడా తెలిసింది. కాబట్టి ఆయన ప్రసన్న దృక్కుల నా వైశ్యశిఖామణిపై ప్రసరిస్తూ ఇలా ప్రవచింపసాగాడు.

'హే వైశ్యవర్య! ఈ మనస్సత్యంత బలీయం. దీనికి వికారయుక్తతే నిత్య స్వభావం. మిక్కిలి బలము గల ఏనుగు పీలగా బక్కగా నుండే మావటికి లొంగిపోయి నడచుకొనే విధంగా, ఇంత బలమైన మనస్సూ కూడా మన చెప్పుచేతల్లో వుండాలంటే, సత్సంగతి, ఆలస్యరహితమైన సాధన, తీవ్రభక్తివియోగం, సద్విచారం అనే వాటి ద్వారా దానిని స్వాధీనం చేసుకోవాలి. ఈ సందర్భంలో నారదమహర్షి పూర్వజన్మ వృత్తాంతం మంచి జ్ఞానాన్నిస్తుంది. ఆయనే నాతో ఇలా చెప్పారు.

'ఓ మునీ! ప్రాచీన కాలంలో నేనొక శ్రేష్ఠ బ్రాహ్మణుని దాసీపుత్రుడను. ఆ బ్రాహ్మణ గృహంలోనే నాకు (అనగా నారదునికి) ఎందరో మహానుభావులతో పుణ్యాత్ములతో సత్సంగతి లభించింది. ఒకమారు వర్షకాలంలో కొందరు సాధుజనులు ఆ యింట నుండుల తటస్థించింది. నేను వారికి మనఃపూర్తిగా వినమ్రంగా సకల సేవలూ చేయడంతో వారు అత్యంత సంతుష్టులై నాకొక మంత్రోపదేశం చేస్తూ ఇలా అన్నారు. 'వత్సా! ఈ మంత్రోపదేశ ప్రభావం వల్ల నీ బుద్ధి అత్యంత నిర్మలమై లోక కల్యాణకారి అయిపోతుంది. అప్పుడు నీకు నీలోనూ ఇతరులలోనూ కూడా మహావిష్ణువే కనిపిస్తాడు. ఈ లోకంలోనూ పరలోకంలోనూ కూడా అనంతమైన ఆనందం ప్రాప్తిస్తుంది. ఈ విశ్వంలో అనేక ప్రకారాల దేవతా, పక్షి, మనుష్యాది జన్మలున్నాయి కదా! అవి కర్మ చేత బంధింపబడి వుంటాయి. కర్మపాశబద్ధులై జన్మించినా మరల వేరు వేరు కర్మలను ఎవరికి వారుగా చేసి ఆ కర్మఫలములను భోగిస్తూ సత్త్వగుణం వల్ల దేవతాయోనిలోనూ, రజోగుణం వల్ల మనుష్య యోనిలోనూ, తమోగుణం వల్ల ఇతరేతర యోనుల్లోనూ జన్మిస్తుంటారు. విషయవాంఛలచే, వాసనలచే చివరికంటా కట్టబడి వాటికే కట్టుబడి జీవించిన ప్రాణి దేహాంతంలో మరల జన్మించడం, మరల మృతి చెందడం జరుగుతుంటుంది. ఈ జన్మల్లో ఎక్కడో ఎప్పుడోచేసిన పుణ్యం దైవయోగం కలియడం వల్ల మనుష్యజన్మ ప్రాప్తిస్తుంది. ఈ జన్మ ఆ ప్రాణికి భగవంతుడిచ్చిన గొప్ప అవకాశం. ఆ అవకాశాన్నంది పుచ్చుకొని మహాత్ములను సేవించి వారి కృప వల్ల భగవానుడైన హరిని తెలుసుకోవాలి. అప్పుడు తాను అపార భవసాగరానికి రోగమనే, మోహమనే త్రాళ్ళతో కట్టబడియున్నట్టు తెలుస్తుంది. ఆ పాశాలను ఛేదించుకొని ముక్తి ఎలా పొందాలో కూడా తెలుస్తుంది. ఈ భవసాగరా న్నుండి బయట పడదలచుకొన్న వారికి భగవన్నామస్మరణను మించిన సాధనం మాకు కనబడలేదు. పాలను చిలకడం

వల్ల నవనీతమూ, చెక్కను ఊపిడి చేయడం వల్ల అగ్నీ పుట్టినట్లే మనసును మథనం చేస్తే అందులోనే దేవుడు పుడతాడు. అక్కడే ఆ ప్రాణిలోనే వుండిపోతాడు. ఇలా పరమాత్మను చూసినవాడే సుఖి.

ఈ ఆత్మ నిత్యము, అవ్యయము, సర్వగామి, సర్వప్రాణి నివాసి. ఇది అప్రమేయం. ఇది స్వయంగానే జ్యోతిస్వరూపమై ప్రతి మనసులో వెలుగుతుంటుంది. కానీ ఆ మనసుకీ దాని చేతికీ దొరకదు. దీనికి నాశనం లేదు. పంచభూతాలలాగే ప్రపంచమంతటా వుంటుంది. వాటితో కలసి ప్రాణిలోనూ వుంటుంది. అన్ని ప్రాణుల కన్న ఒక మెట్టు పైనే వున్న ఆత్మకన్నా ఎన్నో మెట్లుపైన వుంటాడు పరమాత్మ. అయినా ఆయన సాధుజనాన్ని రక్షించడానికి దిగి వస్తుంటాడు అనగా అవతరితుడవుతుంటాడు. స్వతః నిర్గుణుడైనా అజ్ఞానులకు త్రిగుణాత్మికునిగా కనిపిస్తాడు. ఎవరైతే భక్తి యోగం ద్వారా పరమాత్మను సంతుష్టపఱుపగలరో వారికాయన దర్శనమిస్తాడు. అప్పుడా భక్తులు కృతార్థులవుతారు. ఆ పిమ్మట సర్వదా, సర్వత్ర నిష్కామభావంతోనే జీవిస్తారు. బంధన యుక్తమైన ఈ శరీరంతోనే వుంటూ అహంకారమును పరిత్యజించి, స్వప్నప్రాయమైన ఈ జీవితంపై అప్పటిదాకా పెంచుకొన్న మమతాసక్తులను పూర్తిగా తెగగొట్టుకొనే శక్తి వారికి లభిస్తుంది. ఓయి వత్సా! కలలో కొచ్చే సంపద కాని ధైర్యం కాని స్థిరంగా వుంటుందా? ఇంద్రజాలంలో నిజమెంత, శరత్కాల మేఘంలో సత్యమెంత, శరీరంలో నిత్యత ఎంత? ఈ దృశ్యమాన సమస్త చరాచర జగత్తూ అవిద్యాకర్మజనితమే. ఇది తెలిసికొని నీవు మహా యోగివి కావలసియున్నది. నీవు సిద్ధిని పొందగలవు.

అవి నావంటి దీన హీన ప్రాణిపై వాత్సల్యం కురిపించి ఆ సాధువులు వెళ్ళిపోయారు. ఆ తరువాత నేను (నారదుడు) వారు చెప్పిన మార్గంలో ప్రతిదినమూ సాధన చేశాను. అచిరకాలంలోనే నేను నా అంతఃకరణలోనే ఒక ఆశ్చర్యజనక దృశ్యాన్ని (మనో నయనాలతో) చూడగలిగాను. శరత్కాలీన చంద్రుని వలె నిర్మలంగా, ప్రతి క్షణమూ ఆనందాన్ని ప్రసాదించు ప్రకాశ పుంజంగా, చల్లగానుండి కూడా ప్రజ్వలితమగుతున్నట్లుగానున్న ఒక మహాతేజం నాకు కనిపించి వెంటనే ఆకాశంలోని మెరుపులాగ మాయమైపోయింది. అప్పటి నుండి నేనా జ్యోతిపుంజాన్నే ధ్యానించడం, అది అలాగే కనబడుతుండడం, నేను వేరే ధ్యాస లేకుండా ఆ ధ్యాన, దర్శనాలతోనే జీవించడం జరిగాయి. నా భూలోకవాసం పూర్తి కాగానే ఆ శరీరాన్ని విడచి విష్ణులోకాన్ని చేరుకున్నాను.

ఓ లోమశ బ్రాహ్మణోత్తమా! ఆ మహా ప్రభువు సంకల్పం మేరకే నా జన్మము బ్రహ్మ ద్వారా తటస్థించింది. ఆ దేవాధిదేవుని కృప వల్లనే నేనీనాడు లోకకల్యాణాసక్తి

తప్ప ఇతరత్ర అనాసక్తుడనై మూడు లోకాలలో మాటిమాటికీ వీణ వాయించుకుంటూ పాటలు పాడుకుంటూ తిరగగలుగుతున్నాను. నా స్వామి చేయించే పనులకొక సాధనంగా మనగలుగుతున్నాను.'

అని తన అనుభవాన్ని మాకందించి దేవర్షి నారదుడు మమ్ము కృతార్థులను చేశాడు. ఆహా ఇదా సత్సంగతి వల్ల లాభము, సత్సాంగత్య ఫలము అని నేను (లోమశ మహర్షి) ఆశ్చర్యపోయాను. ఓ వైశ్య సత్తమా! నీ మనసిప్పటికే విశుద్ధమై, నిర్మలమై, శాంత స్వభావయుక్తమై వుంది. ఇక నీకు కావలసినది సత్సంగతి, అచంచలమైన భక్తి. ఓయి ధర్మజ్ఞా! సాధు సంగతి వల్ల అనేక జన్మలలో చేసిన పాపాలు, శరత్కాలం రాగానే వర్షాలు కడముట్టినట్లు, ఇంకిపోతాయి.

*అతస్తే సాధు సంగత్యా భక్త్యాచ పరమాత్మనః ॥*
*విశుద్ధం నిర్మలం శాంతం మనో నిర్వృతి మేష్యతి ॥*
*అనేక జన్మజనితం పాతకం సాధు సంగమే ॥*
*క్షిప్రం నశ్యతి ధర్మజ్ఞ జలానాం శరదో యథా ।* (ధర్మ...6/111-113)

అపుడా వైశ్య శిఖామణికి లోమశ మహర్షి వృషోత్సర్గం చేయనిదే ధర్మార్థ కామాలలో ఏ పురుషార్థమూ రాణించదనీ, మంచుబిందువులు గాని వడగళ్ళుగాని నేలపై బడి దండగై పోయినట్లు వృషోత్సర్గ సహితం కాని కర్మలన్నీ వ్యర్థమై పోతాయనీ, వృషోత్సర్గం అశ్వమేధయాగంతో సమానమైన పుణ్యాన్నిస్తుందనీ, నిజానికి వృషోత్సర్గం వంటి హితకారి వేరొకటి లేనేలేదని, ఇంద్రదేవుని సాన్నిధ్యాన్ని కూడా అది సంపాదించి పెట్టగలదనీ చెప్పాడు. వెంటనే పుష్కర తీర్థానికి పోయి వృషోత్సర్గ కర్మను సంపన్నం చేసి ఆ తరువాతే ఇంటికి వెళ్ళుమని ఆదేశించాడు.

విపశ్చిత్తు తన రాజుగారి కథను ఇంకా ఇలా చెప్పసాగాడు. తరువాత ఆ వైశ్యోత్తముడు అన్ని యజ్ఞాలనూ సంపూర్ణం చేయు వరాహస్వామి వెలసిన పుష్కర క్షేత్రానికి పోయి అక్కడ సలక్షణంగా వృషోత్సర్గ- కర్మ సంపన్నం చేశాడు. తదనంతరం లోమశ మహర్షి ఆదేశం మేరకు, ఆయన సాంగత్యంలోనే మరిన్ని తీర్థాలను దర్శించాడు. నీలవృషభానికి వివాహం చేశాడు. ఇలా ఎంతో పుణ్యాన్నార్జించి దేహాంతంలో శ్రేష్ఠ విమానాన్నెక్కి దివ్యలోకాలలో పెద్ద కాలం పాటు అన్ని భోగాలూ అనుభవించి మరల పుడమిపై పుట్టవలసి వచ్చినపుడు వీరసేన రాజవంశంలో జన్మించి మాకందరికీ మహారాజైనాడు. మంత్రిగారి ప్రసంగాన్ని విని బ్రాహ్మణుడాశ్చర్య చకితుడైనాడు. ఆ తరువాత రాజుని మనసారా దీవించి రాజసేవకులు వెంటరాగా తన ఇంటికి వెళ్ళాడు.'

ఇంతవఱకు వీరవాహన మహారాజుకి వినిపించిన వసిష్ఠ ప్రజాపతి ఇంకా ఇలా ఉపదేశించాడు. 'ఓ రాజా! అన్ని కర్మలలోకీ శ్రేష్ఠ కర్మ, (శ్రేష్ఠతమ కర్మ) వృషోత్సర్గ కర్మయే. ఈ కర్మను చేసిన వారు యమరాజుకి భయపడనవసరము లేదు. అలాగే స్వర్గప్రాప్తికి కూడా వృషోత్సర్గమే చక్కటి మార్గము.

*వృషోత్సర్గ సమంకించిత్*
*సాధనం నదివః పరం ।* *(ధర్మ...6/130)*

ఒక్క అపవాదం మాత్రం వుంది. పుత్రుడు, భర్త అంతా వుండగా మరణించిన స్త్రీకి కర్మ చేసినపుడు వృషోత్సర్గం చేయరాదు. పాలిచ్చే ఆవుని దానమివ్వాలి.

గరుడా! వసిష్ఠుని వచనాలను విని వీరవాహనుడు మథురకు మరలి వచ్చి వృషోత్సర్గాన్ని చేశాడు. ఆతడు మరణించాక యమదూతలు వచ్చి కాలపురివైపు సగౌరవంగా గొనిపోతున్నపుడతడు 'ఇక్కడేదో శ్రాద్ధ దేవ నగరముంటుందని విన్నాను, ఎక్కడా కనిపించదేం?' అని వారినే అడిగాడు. వారు వెంటనే అది పాపాత్ములను పాపశుద్ధి కోసం గొనిపోయే చోటనీ, ధర్మాధర్మ వివేచన చేసి, యమధర్మరాజు, శిక్షలు వేసే ప్రదేశమదేననీ, కానీ, వీరవాహనుని వంటి పుణ్యాత్ముల కానగరంతో పని వుండదు కాబట్టి అది కనబడదనీ, అసలా దారిలో తగలదనీ వినమ్రంగా బదులిచ్చారు. మరు క్షణంలో దేవ, గంధర్వ పరివేష్టితుడై దివ్యరూపధారియై ప్రశాంతకాంతులను వెదజల్లుతూ యమధర్మరాజే అతనికి దర్శనమిచ్చాడు. వెంటనే ఆ రాజు చేతులు జోడించి ప్రణామం చేసి ఆయనను అనేక విధాల కీర్తించి సంతుష్టపఱచాడు. యమధర్మరాజు కూడా రాజుతో మర్యాదగా మాట్లాడి తన దూతలతో ఆ రాజును సర్వభోగాలూ సుఖాలూ సులభంగా లభించే దేవలోకానికి గొనిపొమ్మని ఆదేశించాడు.

వీరవాహన మహారాజు మరింత వినమ్రుడై 'ఓ దేవా! మీ దర్శనాన్నీ విధంగా పొందడానికీ ఆపై స్వర్లోక సౌఖ్యాల నందడానికీ నేనేయే పుణ్యకార్యాలనాచరించి అర్హతను సంపాదించానో నాకు తెలియరావటం లేదు' అన్నాడు.

యమధర్మరాజు కూడా మరింత ప్రసన్నుడై 'ఓ రాజా! నువ్వు దాన యజ్ఞాద్యనేక పుణ్యకార్యాలను శ్రద్ధాభక్తులతో నిర్వర్తించడమే కాక వసిష్ఠ దేవుని దయ వల్ల మథురలో పెద్ద యెత్తున వృషోత్సర్గం కూడా చేశావు. మహారాజా! మానవులు ఏ పాపమూ చేయకుండా కాసింత ధర్మాన్ని సమ్యగ్రూపంతో పాలించినా బ్రాహ్మణుల, దేవతల కృప వల్ల ఆ పుణ్యం అధికాధికమై పోతుంది.

*ధర్మః స్వల్పో ఽపి నృపతే యది సమ్యగుపాసితః -*
*ద్విజదేవ ప్రసాదేన సయాతి బహువిస్తరం ॥* *(ధర్మ...6/142)*

'నువ్వు బహు పుణ్యకార్యాలే చేశావు. నీకు నా ఆశీస్సులు' అంటూ యమధర్మరాజు అంతర్ధానం చెందాడు. వీరవాహనుడు స్వర్గలోకానికి గొనిపోబడ్డాడు.

పక్షిరాజా! వృషోత్సర్గ నామకయజ్ఞ మాహాత్మ్యాన్ని విస్తారపూర్వకంగా విన్నావు కదా! 'ప్రాణుల పాపకర్మలను సమాప్తం చేసే ఈ ఆఖ్యానాన్ని చదివినవారు విన్నవారు పాపముక్తులవుతారు' అని శ్రీహరి గరుత్మంతునికుపదేశించాడని సూతుడు శౌనకాది మహామునులకు చెప్పసాగాడు. *(అధ్యాయం - 6)*

## సంతప్తక బ్రాహ్మణుడు - పంచ ప్రేతాల కథ

విష్ణు మహిమ విస్తారంగా కనిపించే కథను వినాలనుందని వినతానందుడు వేడగా ఆతనిననుగ్రహించి చెప్పసాగాడు విరూపాక్షాది దేవవందితుడైన విశ్వవ్యాపి ఇలా :

'గరుత్మాన్ ! పూర్వకాలంలో సంతప్తకుడని తపోధనుడైన బ్రాహ్మణుడొకాయన వుండేవాడు. ఆయన తన తపోబలం వల్ల పాపరహితుడైనాడు. ఈ సంసారం పేరులోనే గాని తత్త్వంలో సారం లేనిదేనని తెలుసుకున్నవాడై అడవులలోకి పోయి వైఖానస మునుల వృత్తినే తానూ పాలిస్తూ అరణ్యంలోనే చరిస్తుండేవాడు. బాహ్య చిత్తవృత్తులను అదుపులో పెట్టుకొని తద్వారా ఇంద్రియాలపై విజయం సాధించే ఉద్దేశ్యంతో తీర్థయాత్రలకు బయలుదేరాడు. కాని, దారిలో దారి తప్పి ఒక చీమలు దూరని, కాకులు కూడా దారి తప్పితే ఇక పట్టుకోలేని మహారణ్యంలోనికి వెళ్ళిపోయాడు. అతనికి నలువైపులా బ్రహ్మాండంగా పెరిగిన చెట్లూ, లతలూ పొదలూ ఇక దారీ తెన్నూ తోచనివ్వలేదు. సాధు, క్రూర జంతువులూ, పక్షులూ, రాక్షస పిశాచగణాలూ మాత్రమే అక్కడున్నాయి. నరసంచారం లేదు.

సంతప్తునికి భయమనిపించలేదు. గానీ దిక్కు తోచలేదు. కానున్నది కాక మానదు కదా, ఏదో ఒకటి జరుగుతుందిలే అనుకుంటూ ఒకవైపు సూటిగా సాగిపోయాడు. కొంతసేపటికి కీచురాళ్ళ అరుపులు కర్ణకఠోరంగానూ, గూడ్లగూబల ధూత్కారాలు భయంకరంగానూ వినిపించసాగాయి. అయినా ఆగలేదు కాని ఒక చోట నొక జుగుప్సాకర దృశ్యాన్ని చూసి నిలబడిపోయాడు. అడుగు ముందుకు పడలేదు.

అక్కడొక మఱ్ఱిచెట్టుకి కట్టబడి వేలాడుతూ ఒక శవం వుంది. దానిని అయిదు ప్రేతాత్మలు పీక్కు తింటున్నాయి. ప్రతి ప్రేతమూ చూడడానికి చాలా భయంకరంగా

వుంది. ముఖం మీద తప్ప ఇంకెక్కడా మాంసం లేదు. చేతులు, కాళ్ళు, అన్ని అంగాలూ ఎముకల మీద చర్మం కప్పినట్టున్నాయి. ముఖంలో కళ్ళు లేవు; వాటికి బదులు రెండు గోతులున్నాయి. ఆ గోతులలోకి జారిపోయిందో, జారిపోతానని భయపడి పారిపోయిందో గాని ముక్కు అసలే లేదు. నెత్తిపై జుట్టు లేదు. అలాగని కోతిలా చూడగానే నవ్వు పుట్టించేలా కాకుండా భయంతో గుండెలవిసిపోయేలాగున్నాయవి. బ్రాహ్మణుడు వాటిని చూసి భయంతో బ్రాన్పడి పోగా అవి మాత్రం ఆయనను చూడగానే పిచ్చి ఆనందంతో గెంతులేస్తూ 'వీడిని నేను తింటా'నంటే 'నేను తింటా'నంటూ ఆయన వైపు పరుగు దీసి కాళ్ళను రెండు ప్రేతాలూ చేతులను రెండు ప్రేతాలూ పట్టుకోగా అయిదవది ఆయన తలను పట్టుకుంది. అవన్నీ భయంకరంగా అరుస్తూ అలా పట్టుకొనే గాలిలోకి లేచాయి. అంతవఱకూ తింటున్న శవంలో ఇంకా మాంసం వుండిపోవడంతో దానినలా దండగ పెట్టడం ఇష్టం లేక కిందికి వచ్చి దానిని కాళ్ళలో ఇరికించుకొని మళ్ళా పైకి లేచాయి.

అపుడా భయార్తుడైన సంతప్త బ్రాహ్మణుడు విష్ణుదేవునిలా ప్రార్థిస్తూ తన రక్షణకై పిలువనారంభించాడు. 'ఆపద్రక్షకా! జగన్నాయకా! నాకు నీవే శరణు. నన్ను కాపాడు. దేవాధిదేవా, చిన్మయా, సుదర్శన చక్రధారీ, హరీ! నన్ను కాపాడు.

ఖగరాజారూఢుడై మొసలి నోట చిక్కిన ఏనుగును తన చక్రం ద్వారా రక్షించిన సామజవరగమనుడు నా కర్మ పాశాలను కూడా ఆ మొసలి తలను వలెనే ఖండించి నన్ను ముక్తుని చేయాలి గాక! రమారమి వందమంది నిర్దోషులైన రాజకుమారులను కారాగారంలో బంధించి బలిచ్చుటకు సిద్ధపడిన కర్కోటక లోకకంటక జరాసంధుని ధర్మజ రాజసూయ మిషచే చంపించి లోకకల్యాణాన్ని గావించిన శ్రీకృష్ణపరమాత్మ ఆ రాకుమారులకు వలెనే నాకునూ విడుదలను ప్రసాదించాలి గాక!' అంటూ మరెన్నో విధాల నా అవతారతత్త్వాన్ని కీర్తిస్తూ ఆర్తితో అరుస్తూ నన్నే రమ్మని పిలచిన ఆ తపస్సంపన్నునిపై ప్రేమతో కూడిన జాలి కలుగగా నేను స్వయంగా బయలుదేరాను. నేనా దరిదాపులకు చేరగానే అతనిలోని ఏ తపశ్శక్తి ఆ విషయాన్నతనికి చేరవేసిందో యేమోగాని అతడు భయాన్ని వదిలేసి ఆ ప్రేతాల మూపులపై పల్లకీలో రాజులాగా సుఖంగా నిద్రిస్తున్నట్లయినాడు. నేనా గుంపు వెనకే కాసేపు వెళ్ళగా అక్కడ మణిభద్రుడను యక్షరాజు కనిపించాడు. నేనతనికి 'ఈ ప్రేతాల సంగతేదో చూడు'మని కనుసైగ చేశాను. వెంటనే అతడా భయంకర ప్రేతాలకే దుఃఖాన్నీ, భయాన్నీ కలిగించే ప్రేతరూపాన్ని ధరించి వాటి కనులు కలవరపడేలా, గుండె గుభిల్లుమనేలా పెద్ద భుజాలతో, బుసలు కొడుతున్న తాచు పామంత నాలుకతో, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను అవి భయంతో కంపించేలా తీసుకుంటూ

ముందు వాటి యెదుట నిశ్చలంగా నిలబడ్డాడు. వారు (అవి) భయం నుండి తేరుకొనేలోగానే రెండింటిని చేతులతో రెండింటిని కాళ్ళతో ఒక ప్రేతాన్ని నోటితో ఒడిసి పట్టి భయంకరమైన పిడిగుద్దులతో వాటి (వారి) ఒళ్ళు హూనం చేసేశాడు. వారి చేతుల నుండి బ్రాహ్మణుని విడిపించి, శవాన్ని పట్టుకొని ఆ మణిభద్ర యక్షుడు మాయమైపోయాడు. మణిభద్రుని శిక్షతో నా (విష్ణువు యొక్క) దయతో వారి (ప్రేతాల) పాపాలు నశించి బ్రాహ్మణునికి ఎదురుగా మోకరిల్లి ఇలా అన్నారు. 'హే విప్రదేవా! మమ్మల్ని క్షమించండి' ఆయనకు చేతులు జోడించి ప్రదక్షిణ చేసి మరల క్షమింపుమని కోరారు. దీనికి కారణం బ్రాహ్మణ దర్శనం, శ్రీహరి కరుణ, యక్షస్పర్శల వల్ల వారికి పూర్వ స్మృతి కలగడమే. వారి దీనవదనాలనూ, మరింత దీనాలాపనలను చూసి మనసు కరిగిన బ్రాహ్మణుడు వారినిలా అడిగాడు :

'బాబూ! మీరెవరు? ఇదంతా ఏమిటి? ఏదైనా మాయయా లేక నా చిత్త భ్రమా?'

'స్వామీ! ఇది మాయా కాదు భ్రమా కాదు. మేం ప్రేతాలం. మా పూర్వ జన్మ దుష్కృతాల వల్ల ఇలా మాకు ప్రేత యోని ప్రాప్తించింది.'

'ప్రేతములారా! మీ పేర్లేమిటి? మీరేం చేస్తుంటారు? మీకీ దుర్దశ ఎలా ప్రాప్తించింది? నా పట్ల మీ ప్రవర్తనకి, అందులోని మార్పుకి కారణమేమి?'

'ద్విజోత్తమా! మీ ప్రశ్నలన్నిటికీ ప్రత్యుత్తరాలిస్తాము. మా పేళ్ళు పర్యుషిత, సూచీముఖ, శీఘ్రగ, రోధక, లేఖకులు. సామాన్య మానవులే అనుకొని మిమ్మల్ని పట్టుకున్నాం. మీరు యోగిరాజని విష్ణుభక్తులని తెలిశాక పూజిస్తున్నాము. మీ స్పర్శ మాత్రాననే మా పాపాలన్నీ ఎగిరిపోయాయి'

'మీ నామధేయాలు విచిత్రంగా వినిపిస్తున్నాయి. ఇవి అర్థం లేనివని నాకనిపించడం లేదు. మీరు నాకు విస్తారంగా మీ గూర్చి వివరించండి'

అని బ్రాహ్మణుడాదేశించగానే ఆ ప్రేతాలొకటొకటిగా ఇలా చెప్పసాగారు.

'బ్రాహ్మణోత్తమా! ఒకమారు నేను శ్రాద్ధం పెట్టవలసి వచ్చినపుడొక బ్రాహ్మణుని నియమించుకున్నాను. ఆ వృద్ధ బ్రాహ్మణుడు నడవలేక నడుస్తూ బాగా ఆలస్యంగా వచ్చాడు. నేను ఆకలికి తాళలేక శ్రాద్ధ కర్మ చేయకుండానే ఆ శాకపాకాలను తినేశాను. బ్రాహ్మణునికి పర్యుషిత (పాసిపోయిన) అన్నాన్ని ఎక్కడి నుండో తెప్పించి మరీ, పెట్టాను. నేనిలా దుష్టప్రేతాన్ని కావడానికీ నా పేరు పర్యుషితుడు కావడానికి కూడా అదే కారణం.'

'బ్రాహ్మణ దేవతా! నా పేరు సూచీముఖుడు. ఒకనాడొక బ్రాహ్మణి తీర్థస్నానానికయి భద్రవట తీర్థానికి వచ్చింది. ఆమెతో ఆమె అయిదేళ్ళ కొడుకున్నాడు. ఆమె అతనిని చూసుకొనే జీవిస్తున్నట్లుంది. నేనప్పుడు క్షత్రియ యువకునిగా జన్మించియున్నాను. అలవి మీరిన ఒళ్ళు పొగరు, క్రూరత్వాలతో ప్రజలను హింసిస్తుండేవాడిని. నేనా బ్రాహ్మణీ, పుత్రుల దారికాచి అతని తలపై పిడికిలితో బాది వారి సామాన్లన్నిటినీ లాగేసుకున్నాను. ఆ పసివాడు దాహం దాహమని ఏడుస్తుంటే తల్లి అతనికొక చిన్న పాత్రతో నీళ్ళిచ్చింది. నేను పాత్రను దౌర్జన్యంగా లాగేసుకొని ఖాళీ చేసేశాను. భయసంత్రస్తుడై, దాహవ్యాకులుడై ఆ పిల్లవాడు అక్కడే అప్పుడే మరణించాడు. అతని తల్లి ఆ గర్భశోకాన్ని తట్టుకోలేక అక్కడే వున్న నూతిలో దూకి అసువులు బాసింది. ఈ మహా పాపం వల్ల నాకీ ప్రేతయోని ప్రాప్తించింది.

పర్వతాకార శరీరుడనే కాని నాకు నోరు లేదు. కొంగలాగ సూది ముక్కుంది. నాకు ఆహారం దొరికినా దానిని తినడానికి చాలాసేపు కష్టపడవలసి వస్తుంది. నేనా రోజు బ్రాహ్మణ బాలకుని నీరు తాగనివ్వకుండా చేసినందుకు ఇలా అనుభవిస్తున్నాను. నా ఈ నోరు కలిసిన ముక్కు నా పేరుని సూచీముఖుడుగా చేసింది.

'భూ సురేంద్రా! నా పేరు శీఘ్రగుడు. నేనొకప్పుడొక ధనవంతుడనైన వైశ్యుడను. ఆ జన్మలో నా మిత్రుడొకనితో కలసి ఇతర దేశాలకు వ్యాపార నిమిత్తమై వెళ్ళాను. నేను కటిక పేదవానిని కాకపోయినా నా మిత్రుని వద్ద అశేష ధనరాశులుండడంతో నాలో లోభం, దాని వల్ల క్రౌర్యం పెరిగాయి. మేమిద్దరం వ్యాపారం చేసి వెనుకకు మరలి వస్తున్నపుడు దారిలో తగిలిన ఒక నదిని పడవ సహాయాన దాటుతుండగా సూర్యుడస్త మించాడు. మసక చీకటిలో ప్రయాణీకులంతా ఎవరి గోలలో వారున్నారు. చాలామంది అలసట కారణంగా కునుకు పాట్లు పడుతున్నారు. వారిలో నా మిత్రుడు కూడా వున్నాడు. అతడు నా తొడ మీదే తలపెట్టి నిశ్చింతగా నిద్ర పోసాగాడు. నేనతనిని ప్రవాహంలోకి తోసేశాను. చీకటిలో నెవరూ చూడలేదు. అతని వద్దనున్న బహుమూల్య ప్రదాలైన రత్న జటిత స్వర్ణాభరణాలూ, ముత్యాలూ, బంగారు కాసులూ అన్నీ పట్టుకొని మా వూరొచ్చేశాను. నా మిత్రుని పత్నితో దారిదోపిడీ దొంగలు మాపై దాడి చేయగా ఆమె భర్త దొరికిపోయాడనీ, వారతని సొత్తంతా దోచుకొని అతనిని చంపేశారని చెప్పేశాను. నేను మరోదారంటా, తుప్పల వెంటా, నా సొమ్ముని పట్టుకొని పరుగెత్తి ఏదో చావు తప్పి కన్నులొట్టబోయిన చందాన ఇల్లు చేరానని చెప్పాను. నా జీవితాన్నంతటినీ ఆ పాపపు సొమ్ముతోనే గడిపాను.

శీఘ్రంగా డబ్బు సంపాదనలో ముందుకెళ్ళానని నన్ను 'శీఘ్రగు' డన్నారు కానీ ఆ పాపానికి, నాకిలా ప్రేతయోనిలో పుట్టుక వస్తుందని ఎవరూ ఎరుగరు కదా!'

'విప్రోత్తమా! నా పేరు రోధకుడు. నేను శూద్రజాతికి చెందినవాడను. రాజభవనం నుండి నాకు పెద్ద పెద్ద గ్రామాలొక వందపై అధికారం ఇవ్వబడింది. నా కుటుంబంలో వృద్ధులైన తల్లిదండ్రులు ఒక తమ్ముడు మాత్రమే ఉండేవారము. అయినా లోభం కొద్దీ నా తమ్ముడిని వేరే కాపురం పెట్టుకొమ్మని తగిలేశాను. వాడికేమీ లేదు. అన్నవస్త్రాలు లేక అవస్థపడుతున్నాడని తెలిసి నా తల్లిదండ్రులు రహస్యంగా నా గృహం నుండి అన్ని వస్తువులనూ పంపిస్తుండేవారు. నేనిది విని అగ్గిరాముడినై పోయి నా తల్లిదండ్రులను సంకెళ్ళతో బంధించి ఒక గదిలో పడేశాను. వారు అతి కష్టం మీద విడిపించుకొని ఆత్మాభిమానం దెబ్బతిన్నదనే బాధతో విషం మింగి మరణించారు. నా తమ్ముడు ఏమీ లేక ఎక్కడెక్కడో తిరుగుతూ ఏమైపోయాడో తెలియలేదు. వృద్ధులను బంధాలతో 'రుద్ధం' చేశాను కాబట్టి రోధకుడనే పేరు వచ్చి నిలిచింది. ఈ మహాపాపాల వల్ల నేనిలా ప్రేత యోనిలో పడి వున్నాను'.

'హే విప్రదేవా! నన్ను లేఖకుడంటారు. పూర్వం ఉజ్జయినీ నగరంలో బ్రాహ్మణునిగా జనించాను. మారాజుగారు నన్నొక బ్రహ్మాండమైన కోవెలకు పూజారిగా నియమించారు. ఆ గుడిలో విభిన్న నామాలతో ఎన్నో విగ్రహాలున్నాయి. స్వర్ణ నిర్మితములైన ఆ విగ్రహాలలో అవసరమైన చోట పలు విలువైన రత్నాలు తాపడం చేయబడి వున్నాయి. వాటిని రోజూ పూజిస్తూ పుణ్యాన్ని వెనకేసుకోవలసిన నేను లోభమోహాలచే రాకాసి మనసు గలవాడినై డబ్బు వెనకేసుకోవాలనే వాంఛ పుట్టి మహాపాపినై పోయాను. బుద్ధి పాపాసక్తమై పోతే బ్రాహ్మణుడైనా, పూజాధికారైనా ఒకటే, రాక్షసుడైనా పిశాచమైన ఒకటే. నేనొక సూదిగా వాడిగా నున్న ఇనుప ఆయుధాన్ని చేపట్టి ఆ విగ్రహాలకున్న బంగారాన్నీ రత్నాలనూ పెకలించివేసి దాచేసుకున్నాను. మరునాడు ఎప్పటిలాగే కోవెల తెఱచి గోల గోల పెట్టేశాను, ఏమీ తెలియనివాడిలాగ. రాజుగారా రూపుమాసిన విగ్రహాలను చూసి ప్రజ్వలితాగ్ని వలె క్రోధంతో రగిలిపోయారు. 'ఈ పని చేసిన దొంగను, దైవద్రోహిని, వాడు బ్రాహ్మణుడైనా సరే, పట్టుకొని నేరాన్ని నిరూపించి వానిని నా చేతులతోనే చిత్రవధ చేసి చంపేస్తాను' అని దేవునియెదట ప్రతిజ్ఞ చేశారు.

ఆయన 'బ్రాహ్మణుడైనా సరే' అనడంతో అనుమానమేదైనా నా మీద కలిగిందేమో అనే అనుమానం నాకు కలిగి రాత్రికి రాత్రే రాజమందిరంలో ప్రవేశించి ప్రశాంతంగా

నిద్రిస్తున్న రాజును చంపేసి అట్నుంచటే రత్నాలనూ బంగారాన్నీ పట్టుకొని పారిపోయాను. దాంతో భూదేవికి కూడా నా మీద అసహ్యం కలిగిందేమో అలా పారిపోతూ దారి తప్పి ఘోరారణ్యంలో దిగబడి అక్కడొక ఆకొన్న పులివాత పడి చనిపోయాను. కలం వంటి సాధనంతో మహా పాపం చేశాను కాబట్టి నన్ను నరకంలో లేఖకుడని పిలిచారు. అక్కడ ఎనలేని బాధలూ అనుభవించి ఇలా ప్రేతయోనిలో పడ్డాను.'

ఇలా అయిదు ప్రేతాలూ వినయంతో తమ పన్నాలను వినిపించగా బ్రాహ్మణుడు జాలిపడి వారి ప్రస్తుత పరిస్థితిని గూర్చి అడుగగా వారిలా చెప్పుకొని విలపించారు.

'ఓ ద్విజేంద్రా! ఎక్కడ వేదమార్గం అనుసరింపబడుతుందో, ఎక్కడ లజ్జ, ధర్మం, దమం, క్షమ, ధృతి, జ్ఞానం వుంటాయో అక్కడ మేము ప్రవేశించలేము. శ్రాద్ధ, తర్పణ కర్మలు చేయబడని గృహాల్లో మేము దూరగలము. అక్కడి మనుషుల రక్తమాంసాలను వారికి తెలియకుండానే అపహరించి ఆరగిస్తాము. వారు ఏ జబ్బూ లేకుండానే నీరసించి పోతుంటారు. మా ఆహారం పరమ అసహ్యకరం. మలం దగ్గర్నుండి శవం దాకా అన్నీ తింటాం. మాకే సిగ్గనిపిస్తుంది – అయినా తప్పదు. మేము అజ్ఞానులం, తామసులం, మందబుద్ధులం, ఏ మాత్రం దైవశక్తి అలికిడి విన్నా భయంతో పారిపోయే పిరికిజనాలం. మాకీ ప్రేతజన్మ ఎప్పుడు పూర్తవుతుందా అని చూస్తుంటాం.'

బ్రాహ్మణుడు వారి బాధలను వింటుండగనే నేను (అనగా గరుడునికిదంతా చెప్తున్న విష్ణువు) అతనికి దర్శనమిచ్చాను. హృదయంలో నివసించే అంతర్యామి పురుష స్వరూపంలో సాక్షాత్కరించిన నన్ను చూడగనే ఆ విప్రుడు నేలపై సాష్టాంగపడిపోయి నమస్కరించి స్తుతులతో నన్ను సంతుష్టపరిచాడు. అతని దయ వల్ల ఆ ప్రేతాలు కూడా నన్ను చూడగలిగాయి.

'అన్ని రకాల ప్రాణులనూ కేవలం నీ దయతోనే, వారికే అర్హతా లేకపోయినా, నీవు ఉద్ధరించగలవు. మహాప్రభో! నీకు నమస్కారము' అని పలుకుతున్న ఆ బ్రాహ్మణుని మనసులోని కోరికనర్థం చేసుకొని నేను వారందరికీ ఉత్తమలోకాలను ప్రసాదించాను.

నా ఇచ్ఛ మేరకు అత్యంత తేజము గల, శ్రేష్ఠ ఆకాశగమనం చేయగల, గంధర్వ, అప్సర యుక్తములైన ఆరు విమానాలక్కడికి వచ్చి ఆ బ్రాహ్మణునీ పంచప్రేతాలనూ ఎక్కించుకొని నా లోకానికి తీసుకొని పోయాయి' అని చెప్పాడు శ్రీ మహా విష్ణువు.

***(అధ్యాయం – 7)***

# అపరకర్మలకు అధికారి - జీవిత శ్రాద్ధ సంక్షిప్త విధి

క్షీరసాగరంపై శయనించే జ్ఞానసాగరుని ఆకాశంలో వాహనమై విహరింపజేసే గరుడుడు మరింత జ్ఞానం కోసం ఇలా ప్రార్థించాడు.

'ప్రభూ! ఈ ఔర్ధ్వదైహిక కార్యాన్ని సంపూర్ణంగా సంపన్నం చేసే అధికారం ఎవరికి వుంటుంది? ఈ క్రియ ఎన్ని ప్రకారాలుగా వుంది?' 'ఓ ఖగేశా! మరణించిన వ్యక్తికి నీ వడిగిన కార్యాన్ని చేసే అధికారం క్రమంగా పుత్రులకు, పౌత్రులకు, అన్నదమ్ములకు, వారి పుత్రులకు, సపిండులకు, స్వజాతీయులకు వుంటుంది. మృతునికి పిండం పెట్టడానికి మాతృపితృ వంశాలలో పురుషులెవరూ మిగలక పోతే స్త్రీలు ఈ కార్యాన్ని చెయ్యవచ్చు. తనవారిందరితో తెగతెంపులు చేసుకొని పోయిన వానికి ఈ కార్యాన్ని రాజు చేయాలి.

పూర్వ, మధ్యమ, ఉత్తర క్రియలని ఇది మూడు రకాలుగా వుంది. ఈ క్రియను ప్రతి సంవత్సరం ఏకోద్దిష్ట విధానంలో చేయాలి. (దీనిని 'తద్దినం' అంటారు). ఈ శ్రాద్ధ క్రియను చేస్తే ఎటువంటి సత్ఫలితాలుంటాయో విను.

బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడు, అశ్వినీ పుత్రులు, సూర్యుడు, అగ్ని, వసువులు, మరుద్గణాలు, విశ్వేదేవులు, పితృగణాలు, పక్షులు, మనుష్యులు, పశువులు, సరీసృపాలు, ఇతరేతర ప్రాణులు – వీటన్నిటినీ, వీరందరినీ శ్రద్ధాపూర్వకంగా చేసే శ్రాద్ధక్రియ ద్వారా, మనిషి, తనకు ప్రసన్నులనుగా చేసుకొనవచ్చును. ఈ తద్దినం వల్ల సంపూర్ణ జగత్తే సంతుష్టమవుతుంది. తమను సంతోషపెట్టిన శ్రాద్ధ కర్తను, ముఖ్యంగా పితృదేవతలు, పుత్ర, స్త్రీ, ధనాదికముల ద్వారా సంతోషపెడతారు.

ఎవరిమట్టుకు వారు తమ జీవితకాలంలోనే తమకు తామే శ్రాద్ధం పెట్టుకొనే వెసులుబాటు కూడా వుంది. దీనిని జీవితశ్రాద్ధమంటారు. స్నానం చేసి ఉపవాసముండి శ్రీ కృష్ణభగవానుని పైనే మనసు లగ్నం చేసి, అంటే ఆయన లీలలనే ఆలోచిస్తూ, ఏ మనిషైనా సరే, తనకు తానే ఈ క్రియను మొదలు పెట్టవచ్చును. ముందుగా ఏకాగ్రచిత్తంతో అన్నిటికీ కర్తా, భోక్తాయైన సర్వేశ్వరుడు విష్ణు దేవుని పూజించి తన పితృగణాల పేరిట తిలలనూ, దక్షిణతో బాటు మూడు జలధేనువులనూ (అనగా కృత్రిమ ధేనువులను) **ఓం పితృభ్యఃస్వధా** అంటూ కుల పురోహితునికి నివేదించాలి. ఆ సమయంలోనే **ఓం అగ్నయే కవ్య వాహ నాయ స్వధా నమః, ఓం సోమాయ త్వా పితృమతే స్వధానమః** అనే మంత్రాలను చదవాలి. చదువుతూనే దక్షిణం వైపు తిరిగి ఇందాక నివేదించిన వాటిని దానమిచ్చి

మూడవ ధేనువును దానమిస్తున్నపుడు **యమాయాంగిరసే స్వధానమః** అనే మంత్రాన్ని వీలైనన్ని మార్లు స్మరించాలి. విష్ణు భగవానుని పూజ (యజ్ఞం), జలధేను దానాల మధ్య కాలంలోనే బ్రాహ్మణుల నావాహన చేసి వారికి భోజనాలు పెట్టాలి.

మొదటి జలధేనువు నుత్తరదిశలోనూ, రెండవ దానిని దక్షిణంలోనూ పెట్టాలి. ఆ రెంటి మధ్యా, మూడవ జలధేనువు నుంచి ఆవాహనాది శ్రాద్ధ సంబంధింత కార్యాలను చేయాలి. అన్నింటికన్నా ముందు విశ్వేదేవుల ప్రతినిధి బ్రాహ్మణులను బాగా పూజించి ఇలా వారిని ఆవాహన చేయాలి :

***వసుభ్యస్త్వా మహం విప్ర రుద్రేభ్య స్త్వామహంతతః ।***
***సూర్యేభ్య స్త్వా మహం విప్ర భోజయామీతి తాన్వదేత్ ॥*** ***(ధర్మ...8/17)***

తరువాతి ఆవాహనాదిక శేషకార్యాలను పితృ శేషకార్యంలో చేసినట్లే చేయాలి. తరువాత వసువులనుద్దేశించి ఒక బ్రాహ్మణునికి మంచి ఆవును దానం చేయాలి. ఆగ్నేయంలో రుద్రదేవునికీ దక్షిణ దిశలో సూర్యభగవానునికీ ప్రతినిధులుగా కూర్చో బెట్టబడిన బ్రాహ్మణులకూ చెరియొక గోవునూ దానమివ్వాలి. విశ్వేదేవుల నిమిత్తం తిలపూర్ణ పాత్రనివ్వాలి. బ్రాహ్మణుల కపుడు అక్షయోదక దానాన్నిస్తే వారు ***'ఓం స్వస్తి'*** అనే ప్రతి వచనం ద్వారా ఈ శ్రాద్ధ కృత్య సంపూర్ణత సంపన్నం కావాలని దీవిస్తారు. అపుడు అష్టాక్షర మంత్రంతో విష్ణుభగవానుని స్మరిస్తూ దేవతలందరినీ (బ్రాహ్మణులను) వినయపూర్వకంగా వీడ్కొల్పాలి.

తరువాత మనస్సును అదుపులో పెట్టుకొని తన కులదేవతనూ, పార్వతీదేవినీ, శివకేశవులనూ స్మరించుకోవాలి. తరువాత ఆ పక్షంలో వచ్చే చతుర్దశినాడు దగ్గరలో నున్న శ్రేష్ఠనదీ తీర్థానికి పోయి స్నానం చేసి వస్త్రాలనూ ఇనుపకడ్డీలనూ దానం చేయాలి. పిమ్మట దక్షిణం వైపు కూర్చొని ***'ఓం జితంతే'*** అనే మంత్రాన్ని జపిస్తూ అగ్నిని ప్రజ్వరిల్లజేయాలి. తరువాత యాభై కుశలతో ఒక బొమ్మను తనకు ప్రతీకగా (దీనినే బ్రాహ్మీప్రతికృతి అంటారు) తయారు చేసి దానినగ్ని కాహుతి చేయాలి. తరువాత శ్మశానంలో చేయవలసిన హోమాన్ని ఇక్కడే చేసి పూర్ణాహుతి నిచ్చివేయాలి. నిరగ్ని భూమినీ, యమునీ, రుద్రునీ స్మరిస్తూ హవనం చేసి ప్రధానస్థానంలో యమరుద్రుల నావాహన చేయాలి. తదనంతరం ఆ అగ్నిలో పెసల తోడి చరు (అనగా హవిష్యాన్నము)నూ, తిలతండుల మిశ్రిత చరునూ వండాలి.

***ఓం పృథివ్యై నమస్తుభ్యం...*** అనే మంత్రంతో మొదటి 'చరు' నీ ***ఓం యమా యనమశ్చ...*** అనే మంత్రంతో రెండవ 'చరు' నీ నివేదించాలి. ఓం నమశ్చాథ రుద్రాయ

శ్మశాన పతయే నమః అనే మంత్రంతో రుద్రదేవునికి (దేనినైనా)★ నివేదించాలి. తరువాత శ్రాద్ధకర్త సప్తనామయుతుడైన ధర్మరాజుకి నిమ్నమంత్రాలతో ఏడుజలాంజలు లివ్వాలి. ***ఓం యమాయ స్వధాత స్మైనమః, ఓం ధర్మరాజాయ స్వధా తస్మై నమః, ఓం మృత్యవే స్వధా తస్మై నమః, ఓం అంతకాయ స్వధా తస్మైనమః, ఓం వైవస్వతాయ స్వధా తస్మై నమః, ఓం కాలాయ స్వధా తస్మై నమః, ఓం సర్వప్రాణ హరాయ స్వధా తస్మై నమః ।***

తరువాత శ్రాద్ధకర్త పది పిండాలను గోత్రనామాలతో సహా దానం చేసి అర్ఘ్యమునూ పుష్పాలనూ వాటిపై వేయాలి. తరువాత వాటికి ధూప, దీప, బలి, గంధ, అక్షయ జల ప్రదానాలను గావించాలి. అలా పది పిండాలను దానమిచ్చాక (అయిదు నిముషాల పాటు) కనులు మూసుకొని విష్ణుభగవానుని సుందర, సుభగవదనాన్ని ధ్యానించాలి.

ఈ కృత్యాన్ని నెరవేర్చిన తరువాత ప్రతి మాసమూ, మాసిక శ్రాద్ధమునూ సపిండీకరణనూ చేస్తూనే వుండాలి. శక్తి, ఆరోగ్యం, ధనం, ఆయువు- ఈ నాలుగూ అస్థిరాలు. ఈ జ్ఞానాన్ని కలిగి వుండి శ్రాద్ధకర్మను చేయువాడు సర్వత్ర సుఖపడతాడు' అని ఆగాడు విష్ణువు. ***(అధ్యాయం - 8)***

# బభ్రువాహన మహారాజు కథ ఔర్ధ్వ దైహిక క్రియ-వృషోత్సర్గాల ద్వారా ప్రేతోద్ధరణ

'భగవన్! ఈ క్రియలను 'తన వారితో తెగతెంపులు చేసుకొని వచ్చేసిన వానికి', ఎవరూ లేని వారికి రాజే చేయాలని ఆదేశించారు కదా, అలా చేసిన రాజెవరైనా కలరా?' అని గరుడుడడుగగా స్వామి ఇలా ప్రవచించాడు.

'సుపర్ణా! లేకేం? కృతయుగంలో వంగదేశంలో బభ్రువాహనుడని ఒక రాజుండేవాడు. అతడు సాగరమే నలువైపులా హద్దుగా గల తన రాజ్యాన్ని సామర్థ్యంతో రక్షించుకుంటూ ధర్మానుసారం రాజ్య పరిపాలనను చేస్తుండేవాడు. ఆయన తన జీవనకాలంలో భూమి నంతటినీ భోగించి రక్షించాడు. ఓటమి పాలు తానూ కాలేదు; ఆపదల పాలు రాజ్యాన్నీ చేయలేదు. అతని ప్రజలేనాడూ చోర భయాన్నిగాని దుష్టజనుల ద్వారా కలుగు ఉపద్రవాన్ని గాని రుచి చూడలేదు. అతని రాజ్యంలో పాపులు లేరు. రోగాలు లేవు, రోగ భయాలూ లేవు, ఆ ప్రజలందరికీ తమ ధర్మంపై భక్తిశ్రద్ధలే కాక అనురక్తి కూడా వుండేది. (ఆదర్శ రాజ్యంలో ప్రతి పౌరుడూ తన వృత్తిని ప్రేమిస్తాడు, గౌరవిస్తాడు, ఆరాధిస్తాడు. ఈ మూడు

★దేనినో ఇక్కడ చెప్పబడలేదు.

లక్షణాలూ పౌరులలో లేనపుడు వారికి తగిన రాజే తయారౌతాడు. వారికి తగ్గ రాజ్యమే వస్తుంది) తేజస్సులో సూర్యునీ, స్థిరమనస్కత, స్థితప్రజ్ఞత్వాలలో పర్వతాన్నీ, సహిష్ణుతలో పృథ్వినీ తలపించే ఆ బభ్రువాహన మహారాజు ఒక వందమంది అశ్వారూఢులైన మిత్రులతో సైనికులతో కలిసి తన పంచకల్యాణిపై వేటకు బయలు దేరాడు. వారంతా ఒక దట్టమైన అడవిలో ప్రవేశించారు. యోధుల సింహనాదాలతో, శంఖధ్వనులతో, దుందుభుల చప్పుళ్ళతో అడివంతా మార్మోగసాగింది. సైనికులకు అవి నలువైపుల నుండీ తమ రాజు కీర్తిని గానం చేస్తున్నట్లు వినిపించి మరింత ఉత్సాహంగా ఉల్లాసంగా ముందుకి పోసాగారు. అది చాలా పెద్ద అడవి. జనమంటే లేరు గానీ అన్ని రకాల చెట్లూ, చేమలూ, లతలూ, దుబ్బులూ, అలాగే అన్ని రకాల హింస్రక, సాధు జంతు సమూహాలూ అందులో వున్నాయి. అన్ని రకాల జంతువులనూ వేటాడుతూ, వేటుకొక జంతువును కూల్చివేస్తూ ఆ నరశార్దూలడొక లేడిపై బాణం వేశాడు.ఆ లేడి దెబ్బతిని కూడా, దైవవశాన, శరవేగంతో పరుగిడసాగింది.

రాజు అన్నీ మఱచి వేట తమకంలో పడి దానిని వెంటాడుతూ వాయు వేగంతో పయనించాడు. పరివారానికి దూరమైపోయాడు. అలా ఒంటరిగా అత్యధిక దూరం పోయి ఆ అడవిని దాటి మరొక ఘోరాటవిలో ప్రవేశించాడు. లేడి చిక్కాకగానీ ఆయనకి పరివారమూ, ఆకలి దప్పులూ గుర్తు రాలేదు. పరివారం బాధ పెద్దగా ఆ అసహాయ శూరుడికి లేదుగానీ, అలవి మీరిన ఆకలి, తట్టుకోలేనంత దప్పిక ఆయనను మిక్కుటంగా బాధించసాగాయి. వేటాడడం నీటి కోసం మొదలైంది. భగవంతుని దయ వల్ల ఆయనకు అచిరకాలంలోనే హంసల, సారస పక్షుల సవ్వడి వినిపించింది. చురుకైనవాడు కాబట్టి వెంటనే ఆ దిశలో కదిలి ఒక దివ్యమైన సరోవరాన్ని కనుగొని ముందు హాయిగా స్నానం చేసి తరువాత నీల కమలాల, ఎఱ్ఱ కలువల పుప్పొడులతో సుగంధితమై, సురుచికరమైన శీతల పానీయాన్ని సేవించగానే దాహంతో బాటు ఆకలి కూడా మాయమైపోయింది. ఇక ఏ దారీ పట్టకుండా అక్కడే వున్న ఒక పెద్ద చెట్టు నీడలో కూర్చుని తన పరివారం కోసం ఎదురు చూడసాగాడు. గుఱ్ఱం కూడా దాహం తీర్చుకొని ఆయన వెనుకనే నిలబడి పచ్చిక మేయసాగింది. రాజుగారు ఆస్తరణాన్ని పఱచుకొని డాలుని తలక్రింద నిడుకొని విశ్రమించారు.

రాజుగారి కనులింకా పూర్తిగా మూతబడకముందే వందప్రేతాలతో కలసి అడవిని కలయదిరుగుతున్న ప్రేతవాహనుడను పేరు గల ప్రేతమొకడక్కడికి వచ్చాడు. వారంతా

నడుస్తున్న ఎముకల ప్రోగుల్లాగా వున్నారు. ఎముకలపై బిగుతుగా దుప్పటి కప్పినట్టు చర్మమే వుంది. మాంసం లేదు. వారు వచ్చిన అలికిడికి రాజు కనులు తెఱచి చూసి ఇంతవఱకెన్నడూ తాను చూసి యెఱుగని భయానక దృశ్యాన్ని చూసినప్పటికీ ధైర్యాన్ని కోల్పోక చివ్వున లేచి ధనుర్బాణములందుకొని వింటికి బాణాన్ని మెరుపు వేగంతో సంధించి ప్రేత వాహనునికి గురిపెట్టి నిలబడ్డాడు. అయినా ఆయనకి వారిని చంపే ఉద్దేశ్యం లేదు కాబట్టి సౌమ్యంగానే ఇలా అడిగాడు : 'ఎవరు మీరు? ఎక్కడి నుండి వచ్చారు? మీకు ఈ వికృత శరీరాలెలా ప్రాప్తించాయి?'

'ప్రభో! మీ దర్శన, సాంగత్యమాత్రము చేత నాలో ప్రేతభావం నశించింది. ఇపుడు నాకు పరమగతి ప్రాప్తించబోతోంది. ధన్యుడనైతిని మహాబాహో! నాకంటే ధన్యులిక లేరు' అంటున్న ప్రేత నాయకుని విని, శాంతించి విల్లమ్ములను దించి ఇలా అన్నాడు బభ్రువాహనుడు.

'ప్రేతమా! నాకేమీ అర్థం కావడం లేదు. ఈ వనం చూస్తే చాలా భయంకరంగా వుంది. ఇక్కడేదో దివ్య సరోవరం లాగ కనిపించి ఇక్కడ విశ్రమిస్తే ఉరుముల, పిడుగుల ధ్వనులు వినిపిస్తున్నాయి. మెరుపులు కనిపిస్తున్నాయి. నానా ప్రకారాల హింస్రక, సౌమ్య జంతువుల కూతలు వినిపిస్తున్నాయి. కాని ఒక్కటీ కనబడడం లేదు. ఇదంతా మీ ప్రభావం కావచ్చు. ఇంతకీ మీకీ అవస్థ ఎలా దాపురించింది?'

'మహారాజా! ప్రేతాలన్నీ ఒకప్పటి నరులే. మేము చేసుకున్న పాపం వల్లే మాకీ దురవస్థ ప్రాప్తించింది. ఏ ప్రాణులకైతే (నరులనే అనుకోవాలి) అగ్ని సంస్కారం, శ్రాద్ధం, తర్పణం, షట్పిండాలూ, దశగాత్రాలూ, సపిండీకరణమూ జరగవో అవి (వారు) ప్రేతాలై తిరగవలసిందే. అంతేకాక, వీరే కాక విశ్వాసఘాతకులూ, తాగుబోతులూ, బంగారం దొంగలూ, అపమృత్యు వాతపడినవారూ, ఈర్ష్యాళువులూ, పాపాలకు తెలిసి తెలిసీ ప్రాయశ్చిత్తం చేసుకోనివారూ, గురుపత్నీ గమనులు – ఇలాటి పరమపాపాత్ములంతా ప్రేత రూపాలను ధరించి ఇక్కడ నివసిస్తున్నారు(ము).

మాకు తిండీ, నీరూ బహు దుర్లభం. అత్యధిక పీడితులీ విశ్వంలో ఎవరయ్యా అంటే మేమే. అందుకే ఓ మహారాజా! నేనెలాగూ బతికిపోయాను గానీ మీరు వీరందరికీ ఔర్ధ్వదైహిక సంస్కారాలు గావించండి. ఎవరూ లేనివారు పోయినపుడు వారి అపరక్రియలను రాజే నిర్వహించడం శాస్త్ర సమ్మతం. దీని వల్ల గొప్ప పుణ్యం వస్తుంది. మీకూ పరలోకంలో

సుఖస్థానమేర్పడుతుంది. ఈ ప్రేతాలకూ ప్రస్తుత దుఃఖ వినాశనమవుతుంది. రాజుకి ఈ పుణ్యం వల్ల ఈ లోకంలోని కష్టాలు కూడా తొలగిపోతాయి.

మహారాజా! ఈ లోకంలో ఎందరో వున్నారనుకుంటాం కానీ ఎవరికి యెవరు? చివరికి ఎవరు? పుత్రులు, భార్య – ఎవరైనా మన స్వార్థం కొద్దీ మన చేత రావింపబడతారు. కాబట్టి వారి స్వార్థం నెరవేరినంతకాలమే మనం గౌరవింపబడతాం. ఎవరి కర్మను వారే అనుభవించాలి. మనిషి పోయాక ధనం ఇంటి దగ్గరే వీడ్కొలిచ్చేస్తుంది, బంధువులు శ్మశానం వద్ద వీడ్కొలుపుతారు, శరీరం కాష్ఠంలో వీడ్కోలు సలుపుతుంది. వీడిపోకుండా పరలోకంలోకి వచ్చేవి పాపపుణ్యాలే.'

*గృహేష్వర్థా ని వర్తంతే శ్మశానే చైవ బాంధవాః ॥*
*శరీరం కాష్ఠ మాదత్తే పాపం పుణ్యం సహవ్రజేత్ ।* *(ధర్మ...9/36-37)*

మహారాజు జ్ఞాన సముపార్జనార్థమై ప్రేతనాయకుని ఆత్మ కథనడుగగా అతడిలా చెప్పసాగాడు.

'నృపశ్రేష్ఠా! ప్రేతాన్ని కాక ముందు నేనొక సంపన్న వైశ్యుడిని. నా పేరు దేవగుప్తుడు★. మాది సర్వసంపదలకూ, సుఖాలకూ, ధర్మాలకూ కూడా నెలవైన విదిశా నగరం. నేను ధర్మకార్యాలన్నిటినీ మిక్కిలి శ్రద్ధగా సంపన్నం చేస్తుండేవాడిని. నాచే నొసగబడిన 'హవ్యా'లతో దేవతలూ, 'కవ్యా'లతో పితరులూ సంతుష్టినొందారు. నానా ప్రకారాల దానాలతో నేను బ్రాహ్మణులను బాగా సంతృప్తిపరచాను. నా ఆహార–విహారాలు చక్కని క్రమశిక్షణతో సునిశ్చితంగా వుండేవి. దీన, హీన, అనాథ బృందాలకూ సత్పాత్రులకూ అనేక ప్రకారాల సహాయాన్నందించాను. కాని, దైవయోగమున అవన్నీ ఇప్పటి దాకా నిష్ఫలములైనాయి. నాకు సంతానంగానీ బంధుబాంధవులు గానీ, మంచి మిత్రులుగానీ లేకపోయారు. కాబట్టి నాకు ఔర్ధ్వ దైహిక కర్మలు జరగలేదు. అందువల్లనే ఇలా ప్రేతరూపినై ఉండిపోయాను.

మహారాజా! ఏకాదశాహాలూ, త్రిపాక్షికాలూ, షాణ్మాసికాలూ, మాసిక శ్రాద్ధాలూ, వార్షికమూ ఇలా మొత్తం శ్రాద్ధాల సంఖ్య పదహారు. ఏ మృతకునికైతే ఇవి చేయబడవో అతడు (ఆమె) మిగిలిన కార్యక్రమాలూ శ్రాద్ధాలూ ఎన్ని చేసినా ప్రేతరూపంలోనే ఉండి పోవలసి వస్తుంది. కాబట్టి ఓ మహాత్మా! ఈ లోకంలో రాజు అన్ని వర్ణాల వారికీ బంధువౌతాడని శాస్త్రాలు చెప్తుండడం చేత మీరు శ్రాద్ధాల ద్వారా మమ్ముద్ధరించగలరు.'

---

★*ఈ వైశ్యుని పేరు సుదేవుడనీ, ప్రేతఖండంలో దేవగుప్తుడనీ వుంది.*

ఇంతవఱకు చెప్పి ప్రేతవాహనుడొక గొప్ప మణిని తీసి రాజు కివ్వబోతూ 'ఓ రాజా! ఇది బహుమూల్యము గల మణిరత్నము. మీరు నాపై దయతో దీనిని గ్రహించి...' అంటుండగానే రాజు అతనినాపి :

'మహాశయా! నేను క్షత్రియుడను. మహారాజును. నా చేయి క్రిందవరాదు. దానమును గ్రహించను. అయినా నీ పని చేసి పెడతాను. నీకేం కావాలో చెప్పు' అన్నాడు.

అప్పుడు ప్రేతవాహనుడు, 'మహారాజా! నాకు శ్రాద్ధకర్మలు జరగలేదు. నా పేర వృషోత్సర్గం కూడా జరగలేదు' అన్నాడు.

'అవన్నీ నేను చేస్తాను గానీ, నాకిది చెప్పు. మా వాళ్ళలో ఎవరైనా ప్రేతదశలోనే వుండిపోయారనే విషయం నాకెలా తెలుస్తుంది? ప్రేతాలకు ముక్తి కలగాలంటే ఏం చేయాలి?'

'క్షత్రియకులావతంసా! ప్రేతాలుగా అష్టకష్టాలూ అనుభవిస్తున్న వారి ఆస్తులను గానీ కనీసం వంశనామాంకిత ప్రతిష్టనుగాని అనుభవిస్తున్న వారికి సరైన కారణం లేకుండానే కొన్ని కష్టాలు వచ్చిపడతాయి. బుద్ధిమంతులైన పురుషులను కూడా లైంగిక పీడలు బాధిస్తుంటాయి. శాస్త్రోక్తంగా ఋతుకాలంలో సంభోగించినా సంతానం కలుగదు. స్త్రీలలో నెల పొడవునా ఋతుక్రమబాధలు కనిపిస్తుంటాయి. నడివయస్సులోనే బంధువులూ, యవ్వనంలోనే పరిజనులు మృత్యువాత పడుతుంటారు. అకస్మాత్తుగా ఆదాయం పడిపోతుంది. అకారణంగా ప్రతిష్ఠ మసకబారుతుంది. ఉన్నట్టుండి ఇల్లు తగలబడిపోతుంది. గృహంలో నిత్య కలహాలూ, మిథ్యాపవాదాలూ, రాజయక్ష్మం వంటి రోగాలూ నిండుగా కొలువు తీరతాయి. వ్యాపారం సలక్షణంగానే జరుగుతూ వున్నా లాభాలు కనబడవు. వర్షాలు సకాలంలోనే పడినా పంటలు పండవు. ఉన్నట్టుండి సహధర్మచారిణి తిరగ బడుతుంది. ఇలాటి బాధలను బట్టి ప్రేతాత్మ ఉనికిని పోల్చుకోవచ్చును. వెంటనే వృద్ధులతో చర్చించి గతించిన వారి పేర దానాలను చేయించి వృషోత్సర్గం చేయిస్తే అచిరకాలంలోనే పరిస్థితిలో మార్పు కనబడుతుంది.'

'సరే! ఇపుడు నేనేం చేయాలి?'

'రాజేంద్రా! మీకెలాగూ అధికారముంది కాబట్టి మీరే మాకందరికీ శ్రాద్ధాలను, ఔర్ధ్వ దైహిక క్రియలను చేయవచ్చు. లేదా కొంతమందికి అయ్యధికారాన్ని ధారాదత్తం చేసి చేయించవచ్చు. చివర్లో వృషోత్సర్గం చేయగానే మా ప్రేతరూపాలు నశించి మాకుత్తమ గతులు ప్రాప్తిస్తాయి. నా సంస్కారాన్ని కార్తిక పూర్ణిమ లేదా ఆశ్వయుజ మధ్యం, రేవతీ

నక్షత్రయుక్త తిథులలో చేయండి. శ్రేష్ఠులైన బ్రాహ్మణులనాహ్వానించి విధ్యుక్తంగా అగ్నిస్థాపన చేయించి వేదమంత్రాలతో యథావిధానంగా హోమం చేయాలి. వీలైనంత గొప్ప సంఖ్యలో బ్రాహ్మణు లనాహ్వానించి వారికి భోజనాలను పెట్టాలి. మహారాజా! దీనికయ్యే ఖర్చుని నీ ప్రజలపై గాని, నీపై గాని రుద్దడం ధర్మసమ్మతం కాదు. పైగా నాకీరత్నంతో ఇక ఏ అవసరమూ వుండదు' అంటూ రాజుగారి పాదాలకు తలను ఆన్చి నమస్కరించి ఆ మణి రత్నాన్ని కూడా ఆయన పాదాల వద్దనే వుంచి తన అనుచరులతో సహా అదృశ్యమయ్యాడు ప్రేతవాహనుడు.

వైనతేయా! రాజు ఆ ధనం ద్వారానే ఆ ప్రేతాలన్నిటికీ అపరకార్యాలను నిర్వర్తించాడు. ఆ సంస్కారం సంపూర్ణం కాగానే ప్రేతాలన్నీ సువర్ణ దేహ సుశోభితులై రాజుకి దర్శనమిచ్చి ప్రణామం చేసి దేవదూతలతో కలసి నిష్క్రమించాయి. గరుడా! ఇదీ వృషోత్సర్గ మాహాత్మ్యం'

*(అధ్యాయం-9)*

# శ్రాద్ధాన్నమును పితరులకు చేర్చుట - సీతాదేవి ప్రసక్తి-మృత్యువనంతరం మరో దేహం- సత్కర్మ మహిమ - పిండదానంతో శరీర నిర్మాణం

**'హే** ప్రభో! సపిండీకరణ, వార్షిక శ్రాద్ధాల తరువాత మృతవ్యక్తికి తన స్వకర్మాను సారం దేవత్వమో, మనుష్యత్వమో ఇతరేరతత్వమో ప్రాప్తిస్తుంది కదా, ఆహారపు అలవాట్లు అందరివీ ఒకలాగుండవు కదా మరి బ్రాహ్మణ భోజనాల వల్ల గాని శ్రాద్ధ హోమాల వల్లగాని అందరూ తృప్తిపడడమెలా సాధ్యం? ప్రేత రూపంలో నున్న వారి నుద్ధరించడానికి బ్రాహ్మణులకు పెట్టే భోజనం వారినెలా కడుపు నింపి ఆనందింప జేయగలదు? శ్రాద్ధాలను అమావాస్యనాడే పెట్టాలంటారు నిజమేనా? దయచేసి నా యీ విషయక అజ్ఞానాన్ని దూరం చేయండి' అని విష్ణుదేవుని ప్రార్థించాడు వినతాసుతుడు.

'గరుత్మంతా! మనిషి తన కర్మానుసారం దేవతల్లో కలిసిపోతే శ్రాద్ధాన్నం (ఇక్కడ మనం పెట్టే అన్నం) అమృతంగా మారి వాని చేతికందుతుంది. అదే అన్నం గంధర్వయోనిలో పడ్డవానికి భోగరూపంలోనూ పశుయోనిలో పడినవానికి గడ్డిరూపంలోనూ అందుతుంది. అలాగే నాగయోని వారికి వాయురూపంలోనూ, పక్షికి ఫలంగానూ, రాక్షసునికి మాంసం

గానూ, ప్రేతానికి రక్తంగానూ, మనుష్యునికి అన్నపానాదులుగాను అందుతుంది' అని చెప్పాడు విష్ణువు ఇలా :

> *'దేవోయదపి జాతో ఽ యం*
> *మనుష్యః కర్మ యోగతః ॥*
> *తస్యాన్నమమృతం భూత్వా దేవత్వేఽ ప్యనుయాతిచ ।*
> *గాంధర్వే భోగరూపేణ పశుత్వే చ తృణం భవేత్ ।*
> *శ్రాద్ధం వాయు రూపేణ నాగత్వే ఽ ప్యనుగచ్ఛతి ॥*
> *ఫలం భవతి పక్షిత్వే రాక్షసేషు తథామిషం ॥*
> *దానవత్వే తథా మాంసం ప్రేతత్వే రుధిరంతథా ।*
> *మనుష్యత్వేఽ న్న పానాది బాల్యే భోగరసోభవేత్ ॥'* *(ధర్మ... 10/4-7)*

'పరంధామా! ఈ లోకంలో (అంటే మృత్యు లోకమైన భూలోకమనే ఉద్దేశ్యం) మనుష్యుల ద్వారా ఈయబడిన హవ్య-కవ్య పదార్థాలుపై లోకాలకెలా వెళతాయి? వాటిని పొందేదెవరు? ఈ శ్రాద్ధాలు మృతుల కడుపు నింపడమంటే, ఆరిపోయిన దీపంలో తైలం పోస్తే వెలుగులు విరజిమ్ముతాయన్నట్లుంది. చనిపోయినవాడు, పోవలసిన చోటికి, వాని కర్మఫలాన్ని బట్టిపోనే పోతాడు కదా, వాని పుత్రుని ద్వారా ఈయబడ్డ పుణ్యకార్యఫలాన్నెలా అందుకుంటాడు?' అడిగాడు గరుడుడు.

చెరగని చిరునవ్వు ద్వారా వాత్సల్యాన్ని కురిపిస్తూ ఇలా అన్నాడు భగవానుడు, 'వత్సా! ప్రత్యక్షంగా కనిపించేది ప్రమాణమే.కాని దానికన్న గొప్ప ప్రమాణం, బలమైనది శ్రుతి వాక్యం. దాని నుండి వచ్చిన జ్ఞానం అమృతాదులతో సమానం. శ్రాద్ధకర్మలోను చ్ఛరింపడిన గోత్రనామాలే ఆయా 'పితరాదులకు హవ్య-కవ్యాలనందించే ప్రాపకాలు. ఓ సుపర్ణా! ఈ మంత్రాలచేతనాలనుకోకు. వాటికున్న చైతన్యం మరి వేటికీ ఉండదు. సంశయము వలదు. అగ్నిష్వాత్తాది పితృగణాలు ఆ పితరుల రాజ పదవులలో నియమింప బడతారు. వారి వద్దకు ఈ పితృపాత్రలలో, విధివత్తుగా ప్రతిపాదింపబడిన అన్నాది అభీష్ట పదార్థాలు చేరతాయి. ఆ జీవులెక్కడుంటే అక్కడికి ఈ అగ్నిష్వాత్తాది పితృదేవతలే అన్నాదులను తీసుకొని వెళతారు. గోత్ర నామాలూ, మంత్రాలే ఇక్కడి శక్తిప్రదాయకాలు. ఇదంతా ఊహకందనంత వేగంగా జరిగిపోతుంటుంది. ఎక్కడ మృతులకు నామ గోత్ర మంత్ర సహితంగా శ్రాద్ధం పెట్టబడుతున్నా ఆ మృతి చెందాడనుకుంటున్న జీవి మరెక్కడ

ఏ యోనిలో వున్నా ఈ మంత్రం చదవగానే ఆ జీవికి కడుపు నిండి, తృప్తి కలుగుతుంది. సంస్కారం చేస్తున్న వ్యక్తి కుశాచ్ఛాదితమైన పృథ్విపై, దంజెమును కుడి భుజంపై పెట్టుకొని, మూడు పిండములను పెట్టి మంత్రం ద్వారా తన పితరులను తృప్తులను చేయగలడు.

'ఇక్కడ' ఇతడు అన్నమునే పెట్టవచ్చు కానీ మంత్ర బలం వల్ల 'అక్కడ' ఏ యోనిలో నున్న పితరునికి ఆ యోని జాతి తినే పదార్థమే లభిస్తుంది. ఆవులన్నీ ఒకచోటే వున్నా దూడ తన తల్లిని పోల్చుకొని దాని దగ్గరకే పరుగెత్తినట్లు జీవి ఏ యోనిలో వున్నా, ఆ పితరుల నిమిత్తమై బ్రాహ్మణులచే చేయబడిన శ్రాద్ధాన్నం గురి తప్పకుండా ఆ పితరులనే చేరుతుంది.

*యదాహారా భవం త్యేతే పితరోయత్ర యోనిషు ।*
*తాసు తాసు తదాహారః శ్రాద్ధాన్నేనోపతిష్ఠతి ॥*
*యథా గోషుప్రనష్టాసు వత్సో విందతి మాతరం ।*
*తథాన్నం నయతే విప్రో జంతుర్యత్రా వతిష్ఠతే ॥* **(ధర్మ...10/19,20)**

పితృగణాలు విశ్వేదేవులతో కలసి శ్రాద్ధాన్నమును గ్రహిస్తాయి. వసు, రుద్ర, దేవత, పితర, విశ్వేదేవులీ కర్మకి ప్రసన్నులైతే పితృదేవతలు ప్రసన్నులవుతారు.

*ఆత్మానం గుర్వీణీ గర్భమపి ప్రీణాతి వై యథా।*
*దోహదేన తథా దేవాః శ్రాద్ధైః స్వాంచ పితౄన్ నృణాం ॥* **(ధర్మ...10/23)**

మంచి కుటుంబాల నుండి వచ్చిన పితరులు 'శ్రాద్ధ సమయం వస్తోంది' అని తెలుసుకోగానే ప్రసన్నులౌతారు. తమలో తాము చర్చించుకొని వాయు మనో వేగాలతో శ్రాద్ధకర్మ జరిగే చోటికి చేరుకొని ఆకాశంలోనే కూర్చుని బ్రాహ్మణుడితో బాటే భోజనం చేయగలరు. (ఇది అంతరిక్షగాములైన పితరులకే సాధ్యం). వారు వాయురూపంలో వచ్చి భోజనం చేసి పరమగతిని పొందుతారు. కొందరు బ్రాహ్మణుల శరీరాలలో ప్రవేశించి భుజించి తమ లోకాలకు వెళతారు :

*నియంత్రితాస్తు యే విప్రాః శ్రాద్ధ పూర్వదినేఖగ ।*
*ప్రవిశ్య పితరస్తేషు భుక్త్వాయాంతి స్వమాలయం ॥* **(ధర్మ...10/26)**

కారణవశాన శ్రాద్ధకర్త శ్రాద్ధకర్మలో ఒక్క బ్రాహ్మణునే కూర్చుండబెడితే, ఆయన ఉదరభాగంలో శ్రాద్ధకర్త తండ్రీ, దక్షిణం వైపు తాతా, వెనుకభాగంలో పిండభక్షక పితరులూ వుంటారు. శ్రాద్ధకాలంలో యమధర్మరాజు తన వద్దనున్న ప్రేతాలనూ, పితరులనూ వదిలేస్తాడు. నరకలోకంలో శిక్షలను అనుభవిస్తున్నవారు ఆకలి, దప్పులతో అలమటిస్తూ

తమ పుత్రపౌత్రులు తేనె కలిపిన పాయసాన్ని శ్రాద్ధంలో పెడితే ఆకలి దప్పుల నుండి విముక్తి కలుగుతుందని భావిస్తారు. శ్రాద్ధకర్తకు తన వారెక్కడున్నారో తెలియదు కాబట్టి అందరూ అందరికీ మధుమిశ్రిత పాయసాన్ని పెట్టడం మేలు'

'స్వామీ! ఆ లోకం నుండి భూలోకానికి వచ్చి శ్రాద్ధంలో భోజనం చేస్తున్న పితరులను చూసిన వారెవరైనా ఉన్నారా?'

'ఉన్నారు పక్షిరాజా! సీతాదేవి చూసింది. ఈమె ఒక ఉదాహరణ మాత్రమే.

శ్రీరాముడు వనవాసం చేస్తున్న సమయంలో నొకప్పుడు పుష్కర తీర్థానికి వెళ్ళాడు. అక్కడ తన పితరులకు శ్రాద్ధకర్మను చేయ సంకల్పించగా సీతమ్మ పక్వానికి వచ్చిన పండ్లను సిద్ధం చేసింది. రామయ్య ఆజ్ఞ మేరకు ఆయనతో బాటు ఆమెకూడా దీక్షను స్వీకరించి తన ధర్మాన్ని పాలించింది. సూర్యుడు నింగి నడినెత్తిన చేరాడు. కుతుప ముహూర్తం (రోజులో ఎనిమిదవది) వచ్చింది. శ్రీరాముడు ఆహ్వానించిన ఋషులందరూ విచ్చేశారు. శ్రీరాముడు తల ఊపగానే ఆమె 'తద్దినం' బ్రాహ్మణులకు అన్నం పెట్టడానికి వచ్చింది. కానీ బ్రాహ్మణుల మధ్య నిలబడి వారి వైపు చూడగానే నమస్కరించి సంభ్రమంగా దూరంగా పోయి చెట్టుచాటున తీగల మధ్య నిలబడిపోయింది.

'సీతాదేవి ఏకాంతంలోకి పోయిందేమిటీ? బ్రాహ్మణులకు వనవాసయుక్తమైన భోజనాన్ని వడ్డించడానికి సిగ్గు పడిందేమో. సరిలే' అనుకుంటూ రాముడే బ్రాహ్మణుల చేత భోజనాలను చేయించి వారు సెలవు గైకొని వెడలిపోయిన తరువాత సీతను అన్వేషించి కనుగొని చిరునవ్వు నవ్వాడు.

ఆ నవ్వు చాటు ప్రశ్ననర్థం చేసుకున్న సీత ఇలా సమాధానం చెప్పింది. 'ఆర్యపుత్రా! నేనిక్కడొక గొప్ప ఆశ్చర్యం కలిగించిన విషయాన్ని చూశాను. ఈ శ్రాద్ధంలో పాల్గొన్న బ్రాహ్మణుల అగ్రభాగాన నేను దశరథ మహారాజుగారిని చూశాను. ఆయన నిండుకొలువులో నున్నట్లే సర్వాలంకార భూషితులై, దరహాసభాసురవదనారవిందులై నాకు దర్శనమిచ్చారు. వారితోబాటు మీ పితామహ ప్రపితామహులు కూడా దర్శనమిచ్చారు. ఈ నారచీరలతో మహారాజుగారి సమక్షంలో నిలబడడానికి సిగ్గుపడి నేను చెట్టు చాటుకి వెళ్ళిపోయాను. ఆ మహారాజుగారికి, ఆయన దాసానుదాసులు కూడా వేలెత్తి ముట్టని అతిసామాన్యాహారాన్ని వడ్డించలేక తప్పుకున్నాను. తృణపాత్రలో అన్నాన్ని వేసి పట్టుకొని అంతటి దేవేంద్ర సన్నిభుడైన రఘుకులాన్వయ భూషణుని ఎదుటకెట్లు పోగలను? అందుకే ఆ మహాభాగులకు నమస్కరించి నిష్క్రమించాను.'

విష్ణు వింకా ఇలా వినిపించసాగాడు. 'గరుడా! శ్రీరాముడాశ్చర్యపోయాడు. తన తండ్రి దర్శనభాగ్యం తన జీవనసహచరికైనా దక్కినందుకు సంతోషించాడు. ఇక శ్రాద్ధ మాహాత్మ్యాన్ని సంక్షిప్తంగా వివరిస్తాను విను. అమావాస్య దినాల్లో పితృగణాలు తమ వారింటి గుమ్మాల వద్ద వాయు రూపంలో దిగి వుండి శ్రాద్ధాల నభిలషిస్తారు. సూర్యాస్తమయం దాకా వారలాగే వుంటారు. సూర్యుడస్తమించినా శ్రాద్ధ భోజనం లభించకపోతే నిరాశాపూర్తి నిశ్వాసాలను బరువుగా వెలారుస్తూ వెడలిపోతారుగాని తమ స్వజనాలను నిందింపరు, దూషించరు, శపించరు. అయినా వారి దీవెనలు లభించి, మనిషికి ఇహపరాలలో పరమసుఖం కావాలంటే ఏదో తద్దినం ఏడాదికొకమారు ముక్తసరిగా పెట్టేసి వూరుకోకుండా ప్రతి అమావాస్యనాడూ పితరులనుద్దేశించి శ్రాద్ధం పెట్టాలి. వారి ఆకలి దప్పులను తీర్చాలి. శాస్త్రం చెప్పిన విధంగా, పితృజనులకు, వారి పుత్రులు, బంధుబాంధవులూ కూడా శ్రాద్ధకర్మలను సాంగోపాంగంగా నిర్వర్తించి, గయా తీర్థానికొక మారైనా పోయి పిండప్రదానము చేస్తే పితరులతో బాటు వారు కూడా బ్రహ్మలోక నివాసానికధికారులవుతారు. 'ఇక్కడ' గానీ 'అక్కడ' గానీ వారికి ఆకలిదప్పులు తీరకపోవడం వుండదు. విద్వాంసులెన్నడూ ఈ శ్రాద్ధాలను విస్మరించరాదు. వారూ చేయాలి ఇతరుల చేతా చేయించాలి. సమయానుసారం శ్రాద్ధకర్మలు జరిగే ఇంటిలోకి ఏ దుఃఖమూ, అశాంతీ ప్రవేశింపజాలవు. పితరులను పూజించటం వల్ల, సంతృప్తి పఱచుట వల్ల మనుష్యులకు ఆయు, పుత్ర, యశ, స్వర్గ, కీర్తి, పుష్టి, బల, శ్రీ, పశు, సుఖ, ధన, ధాన్యాలన్నీ లభిస్తాయి. దేవకార్యానికన్నా పితృకార్యానికే మహత్వమెక్కువ. దేవతల కంటే ముందే పితరులను ప్రసన్నం చేసుకోవాలి.

*కుర్వీత సమయే శ్రాద్ధం కులేకశ్చిన్న సీదతి ।*
*ఆయుః పుత్రాన్ యశః స్వర్గం కీర్తిం పుష్టిం బలం శ్రియం ।*
*పశూన్ సౌఖ్యం ధనం ధాన్యం ప్రాప్ను యాత్ పితృపూజనాత్ ।*
*దేవకార్యాదపి సదా పితృకార్యం విశిష్యతే ॥*
*దేవతాభ్యః పితౄణాం హి పూర్వమాప్యాయనం శుభం । (ధర్మ... 10/57-59)*

తమ తమ పితృగణాలనూ, దేవగణలనూ, బ్రాహ్మణులనూ, అగ్నినీ పూజించేవారు నన్ను పూజిస్తున్నట్లే. వీటన్నిటిలో నేను పూజలందుకుంటాను. శ్రాద్ధాల ద్వారా పిపీలకం నుండి బ్రహ్మదాకా అన్నిటినీ అందరినీ ప్రసన్నం చేసుకోవచ్చు.

గరుడా! ఈ శ్రాద్ధకర్మ ఎంతమందినెలా సంతోషపెడుతుందో ఆలోచిస్తే ఆశ్చర్యమనిపిస్తుంది. మనుష్యుల ద్వారా పెట్టబడిన శ్రాద్ధంలో నేలపై రాలిన అన్నపు

మెతుకుల వల్ల పిశాచ యోనిలో నున్న పితరుల ఆకలి తీరుతుంది. శ్రాద్ధస్నానంలో తడిసిన వస్త్రాల నుండి నేలకి జారిన నీటిబిందువులతో వృక్షయోనిలో పడివున్న పితరుల కడుపు నిండుతుంది. ఆ కార్య వేళ నేలపైబడిన గంధ జలాలు దేవత్వయోని ప్రాప్తినొందిన పితరులను సుఖపెడతాయి. శ్రాద్ధానంతరం బ్రాహ్మణులు చేతులు కడుగుకున్నపుడు నేల వ్రాలిన జలాన్నాలతో కులబహిష్కృతులై శ్రాద్ధకర్మకు గాని ఏ సంస్కారానికి గాని నోచుకొనక అలమటించు పితరులకు క్షుద్బాధ తరుగుతుంది.

ఈ లోకంలో శ్రాద్ధ నిమిత్తం ఇతరులకీయబడిన అన్నం, ధనం, ఇతరం ఏమైనా సరే, పితరులకి చేరుతుంది. ఆడంబరంతో పని లేదు. సామాన్యమైన ఆకు కూరలు, కూరగాయలు – మున్నగు వాటితో, యథాశక్తి, ఎవరు శ్రాద్ధం పెట్టినా వారి పితరులకు సంపూర్ణ తృప్తి కలుగుతుంది. 'శ్రద్ధ' నుండే 'శ్రాద్ధం' వచ్చింది కదా!

మృత్యువు తరువాత ప్రాణికి మరొక శరీరం రావడానికెంత కాలం పడుతుందో తెలుసుకొనగోరావు కదా! ఇది అంతమందికీ ఒకేలాగుండదు. ధూమరహితమైన దీపం లాగా మనిషిలో వెలిగే ప్రధాన పురుషుడైన జీవాత్మ ఆ మనిషి పోగానే వాయవీయ శరీరాన్ని ధరిస్తాడు. ఒక మెట్టుమీద కాలుంచి మరొక మెట్టు మీద రెండవకాలు పెట్టాక మొదటి మెట్టుని వదిలేసినట్లు శరీరి పూర్వ శరీరాన్ని వదిలేసి మరొక శరీరాన్నశ్రయిస్తాడు. ఆ మధ్య కాలంలో ఆత్మ గాలిలో వుంటుంది కాబట్టి దానినే వాయవీయ శరీరధారణ మంటారు. ఒక శరీరంలోని ఇంద్రియాలన్నీ నిశ్చేష్టితాలై పోగానే జీవి ఆ శరీరాన్ని వదిలేస్తాడు. ఆ తరువాత ఆశ్రయించిన శరీరాన్ని కూడా వదిలెయ్యవలసినదే. అనగా ఏ జీవికీ ఏ శరీరమూ శాశ్వతం కాదు. అమ్మ కడుపులో పడిన జీవి ఆమె నుండి అన్నాదిక ములను గ్రహించి బలపడి దానిని వదలి ఒక శరీరాన్ని ధరించి బయటికి వచ్చినపుడు గర్భమనే ఆశ్రయాన్ని పరిత్యజించినట్లే, ఈ శరీరం బలహీనమైనపుడు దీనినీ త్యజించి వేస్తాడు. రెండు శరీరాల మధ్య వుండే శరీరాన్ని ఆతివాహిక వాయవీయ శరీరమని విద్వాంసులు వ్యవహరిస్తారు. భూతప్రేతాది శరీరాలు, మనిషి పిండజ శరీరం స్థాయి ఒకటే.

*పుత్రాదుల ద్వారా దశగాత్ర పిండదానాలీయబడిన వారి పిండజ శరీరం వాయవీయ శరీరంతో ఏకాకారమై పోతుంది. పిండజశరీరము కలవకపోతే వాయజ శరీరం కష్టాల పాలవుతుంది. (భగవద్గీత భావమే – అనగా శరీరాన్ని వస్త్రంతో పోల్చుట, ఆత్మ నిప్పులో కాలదనుట, నీటిలో తడవదనుట – గరుడపురాణంలో కూడా ఇలా చెప్పబడింది)*

*దేహినోఽ స్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।*
*తథా దేహాంతర ప్రాప్తిః పక్షీంద్రేత్యవధారయ ॥*
*వాసాంసి జీర్ణాని యథావిహాయ*
*నవాని గృహ్ణాతి నరోఽ పరాణి ।*
*తథా శరీరాణి విహాయ జీర్ణా -*
*న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥*
*నైనంఛిందంతి శస్త్రాణి నైనందహతి పావకః ।*
*న చైనం క్లేదయం త్యాపోన శోషయతి మారుతః ॥* **(ధర్మ...10/83-85)**

ఇక ఆలస్యంగా శరీరధారణ చేసే జీవాల సంగతి చూడు. కొందరు జీవాత్మలకు పిండజ శరీరం రావడానికి సమయం పడుతుంది. మృతి చెందగనే వారు తమ కర్మల వల్ల నరకానికి వెళతారు. చిత్రగుప్తుని మాట మేరకు వారి కాలం అక్కడ గడుస్తుంది. అక్కడి యాతనలను తమ కర్మం కొద్దీ అనుభవించిన తరువాత పశు-పక్షియోనులలో వారు పుడతారు. శరీరం మీద మోహం మానవులకే ఎక్కువగా వుంటుంది. శుభా శుభకర్మలను ఇతర లోకాలలో భోగించాక అది పోతుంది'.

'ఓ దేవాధిదేవా! పాపిష్టిపనులను మిక్కిలిగా చేశాక కూడా కొందరు మీ సన్నిధానాన్ని పొందారని విన్నాను. అదెలా సాధ్యం? మనిషికి మరల దుఃఖ సంసర్గం వుండకుండాలంటే ఏం చెయ్యాలో ఆదేశించండి.'

'పక్షిరాజా! మనిషి తన కర్మలను తాను చేస్తూనే సిద్ధిని పొందగలడు. సిద్ధి పొందిన వాని పాపాలన్నీ శుద్ధి అయిపోతాయి.

*స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।*
*స్వకర్మ నిరతః సిద్ధిం యథా విందతి తృచ్ఛృణు ॥* **(ధర్మ...10/92)**

గరుడా! పాపాలను సత్కర్మలచే దగ్ధం చేసుకొని, వాసుదేవ నిరంతర చింతనచే విశుద్ధమైన బుద్ధిని పొందినవారై, ధైర్యంగా నియమాలను పెట్టుకొని స్థిరంగా వాటిని పాటించి, శబ్దాది విషయాలను పరిత్యజించి, రాగద్వేషాలను పూర్తిగా వదులుకొని, దొరికిన దానినే విరక్తభావంతో భుజిస్తూ మనస్సునీ మాటనీ శరీరాన్నీ సంయమితం చేసుకొని, వైరాగ్యధారణతో నిత్యం యోగ, ధ్యాన, ధ్యానయోగ తత్పరులై వుంటూ, ఆరు రకాల వికారాలనూ - అనగా- అహంకారం, బలం, దర్పం, కామం, క్రోధం, పరిగ్రహంలనూ పరిత్యజించి నిర్భయులై శాంతులై చివరి ఊపిరిదాకా ఉండగలిగేవారు బ్రహ్మస్వరూపులే అవుతారు. వారికిక చేయదగినదేమీ వుండదు - నాలో వుండడం తప్ప.

*కర్మవిభ్రష్ట కాలుష్యో వాసుదేవాను చింతయా ।*
*బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్యచ ॥*
*శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వారాగ ద్వేషా వ్యుదస్యచ ।*
*విరక్త సేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః ॥*
*ధ్యానయోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ।*
*అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం ॥*
*విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ।*
*అతః పరం నృణాన్ కృత్యం నాస్తి కశ్యపనందన ॥* ***(ధర్మ...10/93-96)***

***(అధ్యాయం - 10)***

# జీవుని ఊర్ధ్వ అధోగతుల వర్ణన

'పరాత్మరా! మనిషిగా పుట్టాలంటే ఏం చెయ్యాలి? మనిషికి మృత్యువెలా ప్రాప్తిస్తుంది? శరీరాన్నాశ్రయించి మరణించేదెవరు? ఇంద్రియాలు కాదు కదా! మరి అవి ఏమైపోతాయి? మనిషి అస్పృశ్యుడెలా అవుతాడు? ఇక్కడ చేయబడిన కర్మకు ఫలాన్ని ఎక్కడెలా అనుభవిస్తాడు? అసలు ఎక్కడికెలా వెళ్తాడు? యమలోకానికీ విష్ణులోకానికీ ఏయే మార్గాల్లో వెళతాడు? ప్రభో! నా పట్ల ప్రసన్నులై దయ చేశారు కాబట్టి నా ఆత్రాన్ని మన్నించి నా అజ్ఞానాన్ని దూరం చేయండి' అడిగాడు గరుడుడు.

'ఓయి వినతానందనా! పరస్త్రీనిగానీ, బ్రాహ్మణుని ధనాన్నిగానీ అపహరించినవాడు నిర్జనప్రదేశంలోగానీ మహారణ్యంలోగానీ బ్రహ్మ రాక్షసిగా పుడతాడు. రత్నాల దొంగ నీచయోనిలో పడతాడు. కొన్ని జన్మలు ఆ జీవులు మృత్యు సమయంలో పెట్టుకున్న ఆశలకూ, కోరికలకూ అనుగుణంగా కూడా వస్తాయి. నవరంధ్రముల కాయం మానవ శరీరమను మాట విని యున్నావు కదా! సత్కర్మలు చేసిన పుణ్యాత్ముని ప్రాణం నాభి నుండి పైవఱకూ గల ఊర్ధ్వ ఛిద్రాల నుండి బయటకు పోతుంది. శరీరం ద్వారా చేసే పనులను శరీరంతోనే అనుభవించాలి. ఒక్కటి మాత్రం బాగా గుర్తు పెట్టుకోవాలి. అనాసక్త భావంతో అన్నీ సత్కర్మలే చేసేవాడు అన్ని చోట్లా సుఖాన్నే అనుభవిస్తాడు. అతడు సాంసారిక మాయాజాలంలో చిక్కుకోడు. మాయ వలలో పడి వికర్మలనే చేసేవాడు పాశబద్ధుడై కష్టాల పాలవుతాడు. ***(అధ్యాయం -11)***

# ఎనభై నాలుగు లక్షల యోనుల్లో మనుష్య జన్మ శ్రేష్ఠత - మనిషి ఏకమాత్ర కర్తవ్యం - ధర్మం

మనిషికి అన్ని చోట్లా హితాన్ని కలిగించేవీ ప్రేతత్వం నుండి ముక్తిని కలిగించేవీ ఏవేవో తెలిసింది కదా! గరుత్మంతా! ఈ సృష్టిలో ఎనుబది నాలుగు లక్షల యోనులున్నాయి. వీటిని నాలుగు రకాల జీవాలుగా విభజించవచ్చును. అండజ, స్వేదజ, ఉద్భిజ, జరాయుజ అనే ఈ రకాలలో మరల నొక్కొక్కటి ఇరవై యొక్క లక్షల జీవాలతో నున్నది. మనుష్యాది యోనులను జరాయుజాలంటారు. వీటిలో మనుష్యజన్మ పరమ దుర్లభం.

మనుష్య లేదా మానవజాతి సర్వ శ్రేష్ఠం. ఈ పంచేంద్రియ యుక్త యోని ప్రాణికి ఎంతో పుణ్యం చేసుకుంటే గాని లభింపదు. ఈ జాతిలో ప్రముఖమైన వర్ణాలు నాలుగు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర నామకములైన ఈ వర్ణాలు వృత్తుల ఆధారంగానేర్పడ్డాయి. వీరేకాక మానవులలో భిల్లులనీ, తుంబులనీ, మ్లేచ్ఛులనీ మరెన్నో ప్రకారాల జాతులున్నాయి. జీవులలో వేల సంఖ్యలో రకాలున్నా ఆహారం, మైథునం, నిద్ర, భయం, క్రోధం అన్నిటికీ వుంటాయి కాని వివేకం కొందరికే వుంటుంది. శారీరక సంరచన కూడా అన్నిటికీ ఒకేలా వుండదు. ఒకే పాదం నుండి ఎనిమిది పాదాలున్న ప్రాణులు కూడా వుంటాయి. రెండు పాదాలున్నది మానవజాతి.

కృష్ణ సారమను పేరు గల మృగం నివసించే ప్రదేశాన్ని ధర్మ దేశమంటారు. బ్రహ్మాది దేవతలంతా అక్కడే నివసిస్తారు. పంచమహా భూతాలలో ప్రాణీ, ప్రాణులలో బుద్ధి జీవీ, బుద్ధి జీవులలో మనిషీ, మనుష్యులలో బ్రాహ్మణ వర్ణులూ, శ్రేష్ఠులు. స్వర్గాన్ని గాని మోక్షాన్నిగాని సాధించుకొనే అవకాశం మానవ శరీరానికే వుంది. అటువంటి మానవ శరీరం (జన్మ) లభించి కూడా దానిని సత్కర్మలకూ మోక్షసాధనకూ వాడనివారు తమని తామే మోసగించుకుంటున్నట్లు లెక్క. వందకాసులున్నవాడు వేయి కాసుల కోసం, వేయి గలవాడు లక్ష కోసం ప్రయత్నిస్తాడు. లక్షకాసులున్నవాడు రాజ్యం కావాలంటాడు. రాజుకి వాడికున్న రాజ్యం చాలదు. మొత్తం పృథ్వినే శాసించేయాలనుకుంటాడు. అలా పృథ్వీ శాసకుడైన చక్రవర్తి దేవేంద్ర పదవినధిష్ఠించాలనుకుంటాడు. ఆ ఇంద్రుడైనా తృప్తిగా సుఖంగా విశ్రాంతిగా జీవిస్తాడా అంటే అదీ లేదు. ఇలా మొత్తం మానవజాతిని ఒకే మనసూ, ఆ మనసుని ఒకే ఒక తృష్ణా శాసిస్తున్నాయి. ఈ తృష్ణ వల్ల దానికి బానిసయైన మనిషికి నరకానికి పోతాడు. తృష్ణను జయించినవానికి తృప్తి లభిస్తుంది. ఆ మనిషి ఆ తృప్తి వల్ల ఉత్తమ లోకాలను పొందుతాడు.

*ఇచ్ఛతి శతీ సహస్రం సహస్రీ లక్ష మీహతే కర్తుం ।*
*లక్షాధిపతీ రాజ్యం రాజాపి సకలాంధరాం లబ్ధుం ॥*
*చక్రధరోఽ పి సురత్వం సురభావే సకలసురపతిర్భవితుం*
*సురపతి రూర్ధ్వ గతిత్వం తథాపి ననివర్తతే తృష్ణా ॥*
*తృష్ణాయా చాభిభూతస్తు నరకం ప్రతిపద్యతే ।*
*తృష్ణా ముక్తాసు యేకేచిత్ స్వర్గవాసం లభంతితే ॥* **(ధర్మ...12/13-15)**

ఈ విశ్వంలో ఆత్మాధీనులైన వ్యక్తులే సుఖపడతారు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ- అనే అయిదూ విషయాలు. ఈ విషయాలను కోరేవే విషయవాంఛలు. అవి జీవిని సుఖంగా బతకనివ్వవు. లేడి, ఏనుగు, దీపం పురుగు, తేనెటీగ, చేప - ఈ అయిదు ప్రాణులూ క్రమంగా శబ్ద, స్పర్శ, రూప, గంధ, రస- అనే ఒక్కొక్క విషయ వాంఛతోనే నశిస్తాయి. అలాటపుడు అన్ని విషయ వాంఛల కోసమూ ఆరాటపడే మనిషి గతి వేరే చెప్పాలా? మానవ సంఘానికి కొన్ని కట్టుబాట్లుంటాయి. వాటిని గౌరవించి పాటించినంతకాలమే ఆ సంఘానికి సుఖశాంతులుంటాయి. కాని, మనిషి పుత్ర, కళత్రాది బంధాలలో చిక్కుకున్నంతకాలం ముక్తి మార్గం కనుపింపదు.

ఎంత గొప్ప మనిషైనా మృత్యువును జయించలేడు. ఈ లోకంలోకి ఒంటరిగా వస్తాడు. ఈ లోకం నుండి ఒంటరిగానే పోతాడు. ఏడుస్తూ వస్తాడు. ఏడుస్తూనే పోతాడు. ఏడుస్తూనే వచ్చినా నవ్వుతూ పోగలిగినవాడే యోగి, ఋషి, ధన్యాత్ముడు. ఒంటరిగా మరణించే మానవుడు తన పాప పుణ్యాల ఫలాలను కూడా ఒంటరిగానే అనుభవించవలసి వుంటుంది.

మనిషి బతికినంత కాలం తానెంతగానో ప్రేమించిన బంధు బాంధవులు ఆ మనిషి మరణించగానే వాని శరీరాన్ని కట్టెల సవారీకెక్కించి ఎప్పుడికో దూరంగా మట్టిబస్తాను వలె మోసుకెళ్ళి నిప్పుల్లో పడేసి ముఖం తిప్పుకొని వెళ్ళిపోతారు. ధర్మమొక్కటే వానిననుసరించి పోతుంది. ప్రాణి యొక్క ధనమూ వైభవమూ వాని ఇంటి దగ్గరే వుండిపోతుంది. ఆ బంధం అక్కడే తెగిపోతుంది. మిత్రులూ బంధు బాంధవులూ శ్మశానందాకా వెళతారు. వీరి బంధం ఇక్కడతో తెగిపోతుంది. ఇక పుట్టినకాడి నుంచి చావు దాకా పెంచి పోషించి ఇది నాదనుకొని విఱ్ఱవీగిన శరీరం అగ్నిలో పడి బూడిదై పోతుంది. దాని బంధం అక్కడితో సరి.

ఇక వీడని బంధమై విడువని మిత్రమై, జోడువిడని సైదోడై జీవాత్మతో మిగిలేది పాపపుణ్యాలే.

*మృతం శరీర ముత్సృజ్య కాష్ఠలోష్ట సమం క్షితౌ ॥*
*బాంధవా విముఖా యాంతి ధర్మస్తమనుగచ్ఛతి ।*
*గృహేష్వర్థానివర్తంతే శ్మశానా న్మిత్ర బాంధవాః ॥*
*శరీరం వహ్నిరాదత్తే సుకృతం దుష్కృతం వ్రజేత్ ।*
*శరీరం వహ్నినా దగ్ధం పుణ్యం పాపం సహస్థితం ॥* (ధర్మ...12/24-26)

పక్షిరాజా! ధనవంతుడు ఈ రోజు సూర్యుడస్తమించేలోగా ఎవరికీ ఏమీ దానం చేయలేదనుకో రేపు తెల్లవారాక, ఈ లోగానే వాడి బతుకు తెల్లారిపోతే, ఆ డబ్బంతా ఎవరి వశమై పోతుందో ఎవరికి తెలుసు? ఏదో పూర్వజన్మ సుకృతం వల్ల ఎంతో మంది దగ్గర ఎంతో కొంత ధనం వుండే తీరుతుంది కదా! దానిని పరోపకార నిమిత్తమో, శ్రేష్ఠద్విజుల దానార్థమో వాడకుండా అంతా తానూ తన పుత్రులే వాడేసుకోవాలనుకుంటే ఆ ధనమే ఒక రూపాన్ని ధరించివాడు పోయే ముందు అడుగుతుంది. 'నన్నెలాగూ తీసుకుపోలేవు. కనీసం దానమైనా చేసి వుంటే ఆ పుణ్యాన్నయినా పట్టుకు పోగలిగివుండే వాడివి కదా' అని. ఇలా ఆలోచించి రేపు ఏమవుతామో అనుకొని ఇవాళే సత్కర్మలనా చరించాలి. మనిషి శ్రద్ధాపూర్వకంగా, పవిత్రుడై, శుద్ధమనస్కుడై ఇచ్చే ధనం ధర్మాన్ని నిలబెడితే ఆ మనిషికి నరకమే వుండదు. ఈ ధర్మమే మళ్ళా అతని అర్థ కామ సముపార్జనలలో అక్కరకు వస్తుందనేది ధర్మసూక్ష్మం. శ్రద్ధాపూర్వకం కాని ధర్మం ఏ లోకంలోనూ అక్కరకు రాదు. ప్రచుర ధనరాశి వల్ల ధర్మం సిద్ధించదు. ధర్మ సిద్ధి శ్రద్ధా మూలకం. అట్టి ధర్మమే ఆ వ్యక్తికి మోక్ష ప్రదాయకం.

*శుభం వాయదివా పాపం భుంక్తే సర్వత్ర మానవః ।*
*యదనస్తమితే సూర్యే న దత్తం ధన మర్థినాం ॥*
*నజానే తస్య తద్విత్తం ప్రాతః కస్య భవిష్యతి ।*
*రారటీతి ధనం తస్య కోమే భర్తా భవిష్యతి ॥*
*నదత్తం ద్విజముఖ్యే భ్యః పరోపకృతయే తథా ।*
*పూర్వజన్మ కృతాత్ పుణ్యాద్యల్లబ్ధం బహుచాల్పకం ॥*
*తదీ దృశం పరిజ్ఞాయ ధర్మార్థే దీయతే ధనం ।*
*ధనేన ధార్యతే ధర్మః శ్రద్ధా పూతేన చేతసా ॥*
*శ్రద్ధా విరహితో ధర్మో నేహాముత్ర చ తత్ఫలం ।*
*ధర్మాచ్చ జాయతే హ్యర్థో ధర్మాత్ కామోపి ఉ జాయతే ॥*

*ధర్మ ఏవాప వర్గాయ తస్మాద్ధర్మం సమాచరేత్ ।*
*శ్రద్ధయా సాధ్యతే ధర్మో బహుభిర్నార్థరాశిభిః ॥*
*అకించనా హి మునయః శ్రద్ధావంతో దివం గతాః ।*
*అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చయత్ ॥*
*అసదిత్యుచ్యతే పక్షిన్ ప్రేత్య చేహన తత్ఫలం ।* *(ధర్మ...12/27-33)*

తరువాతి అధ్యాయాలైన 13,14లలో విష్ణువు వృషోత్సర్గ, గోదాన మహిమలను గూర్చి గరుడునికి వివరించినట్లు చెప్పబడింది. ఈ రెండు విషయాలూ ఇంతకు ముందే ఇదే పురాణంలో విస్తృతంగా చర్చింపబడ్డాయి.

## మృత్యువేళ, ఆ తరువాత(తి) కర్మలు, యమదర్శనం, యాతనల స్వరూపం, ఆరు పిండాల ప్రయోజనం, శవదాహవిధి, 11 నుండి 13 దాకా కృత్యాలు *

'హే భగవన్! మృత్యు వాసన్నమైనపుడూ, వ్యక్తి మరణించిన వెంటనే చేయవలసిన కర్మలను వివరంగా వినాలని వుంది. కరుణించండి' అని ప్రార్థించిన గరుడునితో విష్ణువిలా అన్నాడు :

జీవాత్మ తన కర్మ భోగకారణవశాన తన వర్తమాన శరీరాన్ని వీడిపోతున్నపుడు ఆ వ్యక్తిని పేడతో బాగా అలికిన భూమిపై తిలలనూ కుశాసనాన్నీ పఱచి దానిపై పరుండ బెట్టాలి. నోటిలో బంగారాన్ని పెట్టి సమీపంలో తులసి మొక్కనూ శాలగ్రామ శిలనూ తెచ్చిపెట్టాలి. ఆ వ్యక్తి మృత్యువును వీలైనంతవఱకూ ముక్తి దాయకం చేయడానికి ఒక పద్ధతిలో సూక్తాలను పఠించాలి. తరువాత చిన్న చిన్న బంగారు రేకులను మరణించిన ప్రాణి ముఖంపై, ముక్కు ఇరుకన్నాలలో, కన్నులపై, చెవులపై లింగంపై అంటించాలి. రెండు చేతులలోనూ, కంఠభాగంపైనా తులసి దళాల నుంచాలి. శవాన్ని రెండు వస్త్రాలలో చుట్టి కుంకుమతో అక్షతలతో పూజించాలి. తరువాత పూలమాలతో అలంకరించాలి. అపుడు పుత్రులు, బంధుబాంధవులు అంతా కలిసి ఆ శవాన్ని పుత్రులు భుజంపై పెట్టుకొని మోస్తుండగా పురజనులతో కలసి రెండవ ద్వారం గుండా బయటకు గొని వచ్చి శ్మశానం వైపు సాగిపోవాలి.

---

*యమలోకానికి వెళ్ళే దారిలో నున్న పదహారు నగరాలూ, ప్రేత విలాపం ఇక్కడ మరల చెప్పబడ్డాయి

అక్కడ పుత్రులే తూర్పు వైపుగాని ఉత్తరాభిముఖంగా గాని చితిని నిర్మించి అందులో చందన, తులసి, పలాశాది కర్రలను వేయాలి.

మరణాసన్న వ్యక్తి ఇంద్రియాలన్నీ వ్యాకులమైపోయి, చైతన్యం పోయి, శరీరం జడమైపోతుండగా ప్రాణం (ఆత్మ) యమదూతలతో కలసి వెళ్ళిపోతుంది. అప్పుడు మృతునికి దివ్యదృష్టి ప్రాప్తిస్తుంది. దాని ద్వారా అతడు ప్రపంచాన్నంతటినీ చూడ గలుగుతాడు. దీనికి ముందు ప్రాణం పోవడం అనేది అందరికీ ఒకేలాగ జరుగదు. కొందరికది గొంతుదాకా వచ్చి చిక్కుకుపోయి నానాబాధలూ పెడుతుంది. శరీరం బీభత్సంగా ముఖం వికృతంగా కదులుతాయి. కొందరికి నోటి నుండి నురగ కారుతుంది. వీరంతా పాపాత్ములు. కాబట్టి వీరిని యమదూతలు పాశంతో కొడతారు. అప్పుడా పాశానికి ప్రాణం తగులుకుంటుంది. పుణ్యాత్ముల విషయంలో ఇవేవీ జరుగవు. మృతుడు నిద్రిస్తున్నట్టే వుంటాడు. ముఖంలో ఒకరకమైన ప్రశాంతతా, వెలుగూ కనిపిస్తుంటాయి. ఆ ప్రాణి దృష్టికి యమదూతలు దేవదూతల వలెనూ, యమధర్మరాజు విష్ణురూపునిగానూ కనిపిస్తారు. అదే యమధర్మరాజు పాపులకు కాటుక కొండవలె ఎలా కనిపిస్తాడో ఇది వఱకే విన్నావు కదా!

మరణం తరువాత మానవశరీరం అస్పృశ్యమై పోతుంది. వెగటును కూడా కలిగిస్తుంది. పుణ్యాత్ముని శవం కూడా కొంతసేపటికి దుర్గంధయుక్తమై పోతుంది. ఈ అందమైన శరీరంపై ఇతరులకుండే భ్రమలు కూడా తాత్కాలికంగా తొలగిపోతాయి. గరుడా! ఈ అసత్ శరీరం ద్వారా జరిగే విత్త దానం, ఆదరపూర్వక వాణి, ధర్మం, కీర్తి, పరోపకారం లాటివే అందంగా వుండి లోకానికానందాన్ని కలిగిస్తాయి. మానవ జీవితానికి సారభూతం ఆ పుణ్యమే.

దుష్టులను తోలుకుపోతున్న యమదూతలు వారిని అడుగడుగునా అన్ని విధాల హింసిస్తుంటారు. ఓరి దుష్టాత్మా! పద నిన్ను కుంభీపాకంలో పడేస్తాం. అదెలాగుంటుందో తెలుసా' అంటూ దానినతి భయంకరంగా వర్ణిస్తారు. గరుడా! పదకొండవ రోజున సముచితమైన స్థలంలో శ్రాద్ధం పెట్టాలి. ప్రాణం పోయినప్పటి నుండి ఇప్పటిదాకా క్రమంగా ఆరు పిండదానాలు చేయాలి – మృతస్థానం, ద్వారం, నలుబాటల కూడలి, విశ్రామ స్థలం, చితి, అస్థిచయన స్థానం – అనే స్థలాల్లో వాటిని పెట్టాలి.

వీటినెందుకు పెట్టాలంటే, మనిషి పోయిన చోట (ఇంటిలో) పెట్టేదానికి 'శవ' పిండమని పేరు. దీనివల్ల ఆ గృహ వాస్తు దేవతలు ప్రసన్నులౌతారు; భూదేవీ, ఆమె కొలువులో నుండు దేవతలూ కూడా ప్రసన్నులౌతారు. రెండవ పిండాన్ని ద్వారంపై పెట్టాలన్నాను కదా! దానికి 'పాంథ' అని పేరు. దాని వల్ల ద్వారస్థ గృహదేవతలు

ప్రసన్నులవుతారు. కూడలిలో పెట్టబడు 'ఖేచర' నామక పిండం వల్ల భూతాది దేవయోనులు శాంతిస్తాయి. విశ్రామ స్థలంలో చేయు 'భూత' పేరిటి పిండదానం వల్ల పిశాచ, రాక్షస, యక్షాది గణాలూ, అన్య దిగ్వాసి దేవతలూ దహనంలో సహకరిస్తాయి. చితాస్థలంపై ఆ పేరుతోనే చేసే పిండదానం, ప్రేతత్వాన్నుత్పత్తి చేస్తుంది. దీని తరువాత 'ప్రేత' నామంతో చేసే పిండదానం వల్ల శవం అగ్నికి ఆహుతయ్యే యోగ్యతను పొందుతుంది.

మరొక మూడు పిండదానాలను – ప్రాణం పోయినచోట, శ్మశానానికి సగం దూరం లోనూ, చిత(చితి) మీదా చెయ్యాలి. వీటి వల్ల క్రమంగా విధాతా, గరుడధ్వజుడూ, యమదూతలూ ప్రసన్నులవుతారు. మూడవ పిండ దానం ముగుస్తుండగానే మృతవ్యక్తి శారీరక దోషాల నుండి ముక్తుడవుతాడు.

తరువాత చితను ప్రజ్వలింపజేయడానికి ఒక వేదిని నిర్మించి దానికి ఉల్లేఖన, ఉద్ధరణ, అభ్యుక్షణాదులను చేసి విధి పూర్వకంగా అగ్నిని స్థాపించి పుష్ప, అక్షతాదులతో క్రవ్యాది నామాలతో అగ్నిదేవుని పూజించి ఇలా ప్రార్థించాలి.

***త్వం భూత కృజ్జగద్యోనే త్వం లోక పరిపాలకః ॥***
***ఉపసంహారకస్త స్మాదేనం స్వర్గం మృతం నయ ॥*** ***(ధర్మ...15/44,45)***

ఇలా అగ్నిని పూజించి శవానికి నిప్పంటించాలి. మృతుని శరీరం సగం కాలాక నేతిని ఆహుతి చేయాలి. ***లోమభ్యః స్వాహా...*** అనే మంత్రంతో యథావిధి హోమం చేయాలి. యమ, అంతక, మృత్యు, బ్రహ్మ, జాతవేదనామాలతో ఆహుతులిచ్చి ఒక ఆహుతిని ప్రేత ముఖంపై ఇవ్వాలి. ముందుగా అగ్నిని పై భాగంలో జ్వలింపజేసి, దానిని తెచ్చి చితియొక్క తూర్పుభాగాన్ని మండించాలి. క్రింది మంత్రాలచే నభిమంత్రితమైన తిలమిశ్రిత ఆజ్యాహుతులను చితిపై వేస్తునే వుండాలి.

***అస్మాత్త్వ మధిజాతో ఽ సి త్వదయం జాయతాంః పునః ।***
***అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా జ్వలిత పావకః ॥*** ***(ధర్మ...15/49)***

ఈ విధంగా తిల మిశ్రిత సమంత్రక ఆజ్యాహుతి నిచ్చి మృతకుని పుత్రుడే శవదహనం చేయాలి. ఈ సమయంలో మాత్రమే అతడులోని దుఃఖమంతా పోయేలాగ వెక్కి వెక్కి యేడవాలి. ఆ దృశ్యం ప్రేతానికి సుఖాన్ని కలిగిస్తుంది. శవం పూర్తిగా కాలి పోయాక ఆ స్థలంలోనే అస్థి–సంచయనం చేయాలి. తరువాత ప్రేతానికి దాహజన్య క్లేశశాంతికై పిండదానమివ్వాలి.

దహన సంస్కారానంతరం పుత్రులు వస్త్రసహితంగా స్నానం (సచేల స్నానం) చేసి నామ గోత్రోచ్చార సహితంగా తిలోదకాలివ్వాలి. అంతట అక్కడున్న ఆ గ్రామ ప్రజలందరూ గట్టిగా చప్పట్లు చరుస్తూ విష్ణునామ సంకీర్తనాన్ని కొంత తడవుగావించి తరువాత మృతకుని గుణగణాలను చర్చించుకుంటూ అతని (ఆమె) ఇంటికి వచ్చి ద్వారపు దక్షిణ భాగంల గోమయాన్నీ తెల్లావాలనూ ఉంచాలి. మనస్సులో వరుణ దేవుని ధ్యానించుకుంటూ వేపాకులను నమలి నేతి చుక్కను నోట్లో వేసుకొని ఎవరింటికి వారు పోవాలి.

సూర్యాస్తమయమైనాక మృతుని పుత్రుడు ఇంటి బయటగాని, ఏకాంత ప్రదేశంలో గాని, మృతుడు రోజూ చూసిన నలుదారుల కూడలిలోగాని మట్టిపాత్రలతో పాలు, నీరు పెట్టాలి. ఇలా మూడు రోజులు చేయాలి. కొన్ని మూఢ హృదయ జీవాత్మలు ఆ మూడుచోట్లా తిరుగుతుంటాయి. పదవరోజు దాకా ప్రతిరోజూ ప్రేతానికి పిండదానాన్నీ, జలాంజలినీ ఇస్తూనే వుండాలి. పదవరోజుదాకా రోజుకి కొంతగా పెంచుతుండాలి.

ఈ ఔర్ధ్వదైహిక సంస్కారాన్ని పుత్రుడు చెయ్యాలి; లేని పక్షంలో భార్య (భర్త) చెయ్యాలి; లేకుంటే శిష్యుడు కాకుంటే సోదరుడు చెయ్యాలి. పిండదానాన్ని శ్మశానంలో గాని అన్య తీర్థంలో గాని చేయవచ్చు. పిండప్రదానంలో కూర, ఉప్మా, తీపిముద్ద- అన్నంతో బాటు ఏదైనా పెట్టవచ్చు గాని తొలిరోజు పెట్టిన పదార్థాలనే పదవరోజు దాకా రోజూ పెట్టాలి.

ఈ పిండం నాలు భాగాలుగా విడిపోతుంది. రెండు భాగాలు మృతుడి శరీరం నిర్మాణానికీ ఒక భాగం యమదూతలకీ పోగా మిగిలినదే మృతుని నోటికందుతుంది. తొమ్మిది పగళ్ళూ రాత్రులూ గడిచేసరికి మృతుడికొక శరీరం ఏర్పడుతుంది. అది పదవరోజు మహాకలితో ఆవురావురుమంటుంటుంది.

పదవరోజు పార్వణాది శ్రాద్ధాలలో నిర్దేశింపబడిన పిండ విధి, మంత్ర, స్వధా, ఆవాహన ఆశీర్వాద ప్రయోగాలేవీ వుండవు. ఆనాటి కర్మ కేవలం మృతుని నామ గోత్రోచ్చారపూర్వకంగా చేయబడుతుంది. ఇంతవఱకు పెట్టిన పిండాల వల్ల రోజుకొక అంగంగా, క్రమంగా, తల, మెడ, భుజాలు, గుండె, వీపు, నాభి, కటి, గుహ్యాం, తొడలు, కాళ్ళు- ఏర్పడతాయి. పదవరోజు చేసే పిండదానం పెద్ద యెత్తున వుండాలి. ఆ రోజు మృతకునికి ఆకలి అతని అలవి మీరినదై వుంటుంది. ఆతడు బతికున్నపుడిష్టంగా తిన్న పదార్థాలన్నిటినీ వండించాలి, పెట్టాలి.

ప్రేతాలు బాగా భోజనం చేసేది పదకొండవ పన్నెండవ రోజులలోనే. ఆ రోజులలో ప్రేత శబ్దాన్ని స్త్రీ పురుషులిద్దరికీ వాడాలి. ఇక నామ గోత్రాలకి బదులుగా మంత్రాలతో బాటు ప్రేత శబ్దాన్నే వాడుతుండాలి.

*దీపమన్నం జలం వస్త్రం యత్కించి ద్వస్తుదీయతే ।*
*ప్రేతశబ్దేన తద్దేయం మృతస్యానంద దాయకం ॥*

పదమూడవ రోజు ప్రేత నరకయానం ప్రారంభమవుతుంది. అది ఎవరికెలా జరుగుతుందో, ఎన్ని నగరాలను ఎలా విలపింపజేస్తూ దాటిస్తుందో వినియున్నావు కదా!'

***(అధ్యాయాలు -15,16)***

# బ్రహ్మపుత్ర శ్రవణదేవుల స్వరూపం

'**జ్ఞా**నసాగరా! మహావిష్ణూ! యమలోకంలో శ్రవణులనే వారుంటారని విన్నాను. వారు సర్వజ్ఞులని కూడా విన్నాను. వారిని గూర్చి తెలుసుకోవాలని కుతూహల పడుతున్నాను'.

'గరుత్మాన్! ప్రాచీన కాలంలో సమస్త స్థావర జంగమాత్మకమైన సృష్టి ఏకాకారం చెందినపుడు నేను దాని నాత్మ లీనం చేసుకొని పాల సముద్రంలో శయనించాను. అపుడు నా నాభికమలం నుండి బ్రహ్మపుట్టి కొన్ని వందల సంవత్సరాలు తపస్సు చేసి శక్తిమంతుడై ఏకాకారం చెందిన సృష్టిలోని ప్రాణులను నాలుగు ప్రకారాలుగా విడగొట్టాడు. తరువాత బ్రహ్మగావించిన సృష్టిని పాలించే బాధ్యతను నేను స్వీకరించాను. తరువాత సంహారమూర్తి రుద్రుడుదయించాడు. అనంతరం సమస్త చరాచర జగత్తులోనూ ప్రాణాధారమై ప్రవహించే వాయువూ, అత్యంత తేజస్వి సూర్యదేవుడూ, చిత్రగుప్త సహితుడై యమధర్మరాజూ ప్రకటితులైనారు.

మరల బ్రహ్మ తపస్సు చేశాడు. కొన్ని వందలేళ్ళు ఆయన అలాగే నాభి కమలంలో తపస్సమాధిలోనే ఉండిపోయాడు. సృష్టిని మాత్రం ఇలాగే కొనసాగించాలని లోపలి నుండే ఆదేశించాడు. అపుడు బ్రహ్మతో విష్ణు రుద్రాదులు తమకు లోక వ్యవహారమెలా నడుస్తోందో ఎవరే పాప పుణ్యాలు చేస్తున్నారో తెలియదనీ దానికి సంబంధించిన ఏర్పాటేదో బ్రహ్మయే చేయాలనీ విన్నవించారు.

తన మంత్రాన్ని చిరకాలం పాటు ఏకాగ్రతతో సర్వశక్తులను కేంద్రీకరించి జపించాలనే సంకల్పాన్ని బ్రహ్మ వారందరికీ కలిగించాడు. వారంతా అలా చాలాకాలం పాటు చేసిన తరువాత బ్రహ్మ తన పుత్రులుగా పన్నెండుగురు అమిత తేజస్వులూ, విశాల నేత్రులూనగు దేవతలను సృష్టించాడు. వారికి ఈ లోకంలో ఎక్కడేది జరిగినా, ఎవరేమన్నా, ఎవరేమి చేసినా వినే శక్తినిచ్చాడు. ఈ విశేషజ్ఞానం వల్ల ఈ బ్రహ్మపుత్రులను 'శ్రవణ

లన్నారు. వీరి నివాసం ఆకాశం. అక్కడి నుండే అందరినీ చూస్తూ వింటూ అవసరమైనపుడు యమధర్మరాజు, లేదా చిత్రగుప్తుల వద్దకు వచ్చి ఆయనకు కావలసిన వివరాలనందిస్తారు. ఆ సమయంలో వారి ద్వారా ప్రాణుల ధర్మ, అర్థ, కామ, మోక్షాలకు సంబంధించిన సర్వకర్మలసారమూ వివేచన సహితంగా ధర్మరాజుకి సమర్పింపబడుతుంది. ఓయి వైనతేయా! సంసారానికి చెందిన ప్రాణుల ముందుండే మార్గాలు నాలుగే. అవే ధర్మార్థ కామ మోక్షాలు. ఉత్తమ ప్రకృతి గల ప్రాణి ధర్మ మార్గంలో వెళతాడు. ధనధాన్యాలను సంపాదించినా దానానికే వినియోగించినవారు విమానంలో పరలోకాలకు పోతారు. మోక్షాకాంక్షతోనే జీవితంలో ప్రతి పనినీ చేసిన వారు తమ దేహాంతంలో హంసల విమానం పైనెక్కి పరలోకానికి వెళతారు. ఉన్నదానితోనే బతుకుతూ అప్పుడప్పుడైనా యాచకులను సంతోషపెట్టినవారిని దేవదూతలు గుఱ్ఱాలపై గొనిపోతారు. ఏ పుణ్యమూ ధర్మమూ చేయకుండానే బతికేసిన వారిని, ఇది వఱకు నువ్వు విన్నట్టుగా, యమదూతలు నడిపించుకుంటూ ఏ అసిపత్రవనానికో గొనిపోతారు. శ్రవణులను భక్తి మీరగా పక్వాన్నం, వర్ధని, జలపాత్రల ద్వారా పూజించినవారికి నేను స్వయంగా ప్రసన్నుడనై ఏ దేవతలూ ఇవ్వలేనన్ని వరాలను కురిపిస్తాను. ***(అధ్యాయం - 17)***

# దానాది కర్మాల ఫలాలు ప్రేతాల కందుట- పదదాన మాహాత్మ్యము, అనంతర దేహప్రాప్తి

పక్షీంద్రా! ఈ శ్రవణులు చెప్పినదంతా విన్న తరువాత చిత్రగుప్తుడు కొన్ని క్షణాలపాటు ధ్యానమగ్నుడై మగిడి వచ్చి ఆ మనిషి రాత్రింబవళ్ళు గావించిన పాపపుణ్యాల ఫలాన్ని యమధర్మరాజుకి విన్నవిస్తాడు.

గరుడా! మనిషి మాట, తనువు, మనసులతో చేసే ప్రతి కర్మకీ ఫలాన్ని అనుభవించవలసినదే. నీవు విన్న దానిని రేపు ప్రపంచమంతా వింటుంది. అన్నదానం, దీప దానం, తెలిసి చేసేవారు కూడా 'మహామార్గం'లో సుఖపూర్వకంగా పయనించగలరు★.

కార్తిక కృష్ణ చతుర్దశినాడు రాత్రి చేయు దీపాదానం సర్వసుఖకారి, ఇప్పుడొక్కసారి సంక్షిప్తంగా దాన ఫలాలను చెప్తాను. వృషోత్సర్గ పుణ్యం వల్ల మనిషి పితృలోకానికి వెళతాడు. జలపూర్ణఘటదానం వల్ల యమదూతలు సంతోషిస్తారు. పదకొండవ రోజున శయ్యాదానం చేయడం వల్ల మనిషి విమానమెక్కి స్వర్గలోకానికి చేరతాడు. విశేషించి,

★*ప్రేత మార్గమే మహా మార్గం.*

పన్నెండవరోజు అన్ని ప్రకారాల దానాలనూ చేయాలి. పదమూడు పద దానాలనూ చేసినవారు (పితరులూ, పుత్రులూ కూడా) వాటి సాయంతో మహామార్గాన్ని సుఖంగా దాటి వెళ్ళగలరు. ఎవని భాగ్యమెలా వున్నదో వాని మార్గసుఖమును బట్టి తెలిపోతుంది. తన కొడుకు తాను పోయినపుడెలాగూ 'చేస్తాడుగా' అనుకోకుండా తానే తన జీవిత కాలంలోనే స్వస్థచిత్తుడై అన్ని రకాల దానాలనూ చేసినవాడు సర్వత్ర సుఖపడతాడు'.

'భగవన్! పదమూడు పదదానాలంటే ఏమిటి?'

'ఛత్రం, పాదుక, వస్త్రం, ముద్రిక, కమండలువు, ఆసనం, భోజన పాత్ర, మరొక ఆసనం, జలపాత్ర, అన్నం, భోజన సామగ్రి, నెయ్యి, యజ్ఞోపవీతం– ఈ పదమూటినీ పదదానాలన్నారు. ఇవన్నీ మృతుని నారకీయ మార్గంలో ఉపయోగపడి ప్రేతానికి సుఖాన్నిస్తాయి. అంతేకాకుండా దానమిచ్చిన వానికి కూడా గొప్ప పుణ్యాన్ని కలుగజేస్తాయి.

*గృహ్ణాతి వరుణో దానం మమహస్తే ప్రయచ్ఛతి ।*
*అహంచ భాస్కరే దేవో భాస్కరాత్ సో ఒశ్నుతే సుఖం ॥* **(18/27)**

మృతుని బంధువు అతని ఇంటి వద్ద చేసిన దానాన్ని వరుణుడు స్వీకరించి విష్ణువు చేతిలో పెట్టగా దానిని భాస్కరుడు సేకరించి ప్రేతం సుఖించేలా చూస్తాడు.

*(అధ్యాయం – 18)*

# జీవుడు యమపురిలో ప్రవేశించుట, శుభాశుభ కర్మ ఫలభోగం - కర్మానుసారం అన్యదేహప్రాప్తి ధర్మాచరణమే మనిషి ముఖ్య కర్తవ్యం

ఇదివఱకే చెప్పబడిన పదహారు పురాలనూ దాటి యమునికి దగ్గరగా నున్న బహుభీతికర నామక పురంలో అంతవఱకు హస్తం పరిమాణంలో వున్న శరీరం చిటికెన వేలంత అయిపోగా, జీవుడు గాలిలో ఎగురుతూ అక్కడక్కడ శమీపత్రాలపై కూర్చుంటూ యముని వద్దకూ ఆ తరువాత ఆయనతో కలసి చిత్రగుప్తపురీ చేరుకుంటాడు.

ఈ పురి ఇరవై యోజనాలలో పఱచుకొని వుంటుంది. ఇక్కడుండే కాయస్థులనే దేవయోని జనితులు అన్ని రకాల ప్రాణుల పాప–పుణ్యాలనూ పూర్తిగా గ్రహించి వుంటారు. ఇదివఱకు నేను నుడివినట్లుగానే యమధర్మరాజు పాపులకొకలాక కనిపిస్తే పుణ్యులకు మరొక విధంగా దర్శనమిస్తాడు. దానములు చేసిన వారిని ఆ యమధర్మరాజే లేచి నిలబడి గౌరవిస్తాడు.

*ప్రాప్తం సుకృతినంధృష్ట్వా స్థానాచ్చలతి సూర్యజః ।*
*ఏషమే మండలం భిత్త్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి ॥* *(ధర్మ...19/9)*

పుణ్యాత్ములాయన మండలాన్ని భేదించుకొని స్వర్గానికి వెళతారు. దానం వల్ల ధర్మం లభిస్తుంది. ధర్మం వల్ల నరకానికి పోయే దారి కూడా సుఖావహమవుతుంది. ఈ మార్గంలో పాపులు పడే కష్టాలనిదివఅకే చెప్పడం జరిగింది. పాపులే కాకుండా సరిగ్గా అపరకర్మలు జరపనివారూ, జరగనివారూ కూడా పాపులే కాబట్టి అన్ని కష్టాలూ పడతారు. కాబట్టి దానం చెయ్యాలి. అలాచెయ్యనివానిని ఆ యమదూతలు పశువు మెడలో తాడుకట్టి లాగి నట్లు ఈ నిర్దానులను లాగుతారు. ధర్మాన్ని పాలించినవారు అమరత్వం చెందుతారు, ఇలా :

*యథా యథా కృతం కర్మ తాంతాం యోనిం వ్రజేన్నరః ।*
*తత్తథైవ చ భుంజానో విచరేత్ సర్వలోకగః ॥*
*అశాశ్వతం పరిజ్ఞాయ సర్వలోకోత్తరం సుఖం ।*
*యదాభవతి మానుష్యం తదాధర్మం సమాచరేత్ ॥*
*కృమయో భస్మ విష్టావా దేహానం ప్రకృతిః సదా ।*
*అంధ కూపే మహారౌద్రే దీపహస్తః పతేత్తు వై ॥*
*మహాపుణ్య ప్రభావేణ మానుష్యం జన్మలభ్యతే ॥*
*యస్తత్ ప్రాప్య చరేద్ధర్మం సగచ్ఛేత్ పరమాంగతిం ॥*
*అపిజానన్ వృథాధర్మం దుఃఖ మాయాతి యాతిచ॥*
*జాతీశతేన లభతే కిల మానుషత్వం*
*తత్రాపి దుర్లభతరంఖగ భోద్విజత్వం ।*
*యస్తత్ర పాలయతి లాలయతి వ్రతాని*
*తస్యామృతం భవతి హస్తగతం ప్రసాదాత్ ॥* *(అధ్యాయం - 19/16-21)*

## ప్రేతబాధల స్వరూపం - వాటి నుండి విముక్తి

గరుడా! ఇక ప్రేతాల గూర్చి అడిగావు కదా, విను. కపటం, మోసం వీటికి మూలం. ఇతరుల ధనాన్నీ స్త్రీలనూ ద్రోహబుద్ధితో అపహరించే వారు రాక్షసాది నిశాచర యోనుల్లో పుడతారు. పుత్ర మోహం కొద్దీ వారి సుఖం కోసం అన్ని రకాల మోసాలూ, దౌర్జన్యాలూ చేసి కూడబెట్టి చచ్చినవారు శరీర రహితులై ఆకలి దప్పులతో అలమటిస్తూ గాలిలో ధూళిలో తిరుగుతుంటారు. వీరు, దొంగల వలె, పితరుల కోసం అక్కడక్కడ

పెట్టిన జలాన్నపహరిస్తుంటారు. ఈ పాపం వల్ల వారి ప్రేత జీవనం మరింత కాలం పెరిగిపోతుంది. వారే జ్వరాలుగా రోగాలుగా పీడలుగా మారి స్వంత ఇంటిలోనే చేరి తమ వారినే పట్టి పీడిస్తుంటారు. తలనొప్పులూ, విషూచులు– ఇలాటి అనేక రోగాలు కారణం లేకుండానే, నియమబద్ధంగా ఆహారం తీసుకొనేవారికి కూడా తగలడం ఈ ప్రేతాల చలవే.

బతికున్నంతకాలం తామెంతగానో ప్రేమించినవారినే చచ్చి ప్రేతాలైన వీరు బాధిస్తారు. తమ ఇంటి సమీపంలో నున్న ఇతరులను కూడా, వారు అధర్మం చేస్తేనే, బాధించగలరు. ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. ప్రేత బంధువులైనా ఇతరులైనా శ్రీ రుద్రభగవానుని మంత్రాన్ని జపిస్తూ, ధర్మానురక్తులై, దేవతలనూ అతిథులనూ పూజిస్తూ, సత్య, ప్రియ వచనాలనే పలుకుతూ వున్నంతకాలం ఏ ప్రేతమూ వారి ఇంటి చాయలకైనా వెళ్ళలేదు. ప్రేతాలు నాస్తికులనూ ఇతరత్ర పాపులనే ముట్టుకోగలవు.

*రౌద్రజాపీ ధర్మరతో దేవతాతిథి పూజకః ।*
*సత్యవాక్ ప్రియవాదీ చ న ప్రేతైః స హి పీడ్యతే ॥*
*సర్వక్రియా పరిభ్రష్టో నాస్తికో ధర్మనిందకః ।*
*అసత్య వాద నిరతో నరః ప్రేతైః స పీడ్యతే ॥* *(ధర్మ... 20/16-17)*

గరుడా! కలికాలంలో అపవిత్ర క్రియలను గావించేవారు ప్రేతయోనిలో పడతారు. లోకంలో ఒకే తల్లిదండ్రులకు పుట్టిన పిల్లలలో నొకడు సుఖపడవచ్చు, మరొకడు పాపకర్మలను చేయడానికే ఇష్టపడవచ్చు, వేరొకడు ప్రేతాలచే పీడితుడు కావచ్చు, ఇంకొకడు ధనధాన్యాలతో సంపన్నుడుగా నుండవచ్చును. వీరిలోనే సంతానవంతుడొకడైతే ఉన్న ఒక్క కొడుకూ వేరొకనికి దక్కకపోవచ్చు. కొడుకులే ఒకడికి పుడితే మరొకడికి కూతుళ్ళే కలగవచ్చు. కాబట్టి ఎవని కర్మఫలం వానిదే. దానికి పుట్టుకతో సంబంధం లేదు. అలాగే ప్రేతాలు పట్టుకున్నపుడు కర్మయే కారణమవుతుంది కాని వంశ ప్రతిష్ఠ కాదు.

ప్రేత దోషం కూడ అందరికీ ఒకలాగే వుండదు. ప్రేతగ్రస్తులలో నొకడికి అనుకోకుండా అందరు బంధువులతోనూ విరోధం వస్తుంది. మరొకడు సంతానహీనునిగా మిగిలిపోవచ్చు. కొందరికా సంతానం మిగలదు. కొందరు పశుహీనులూ బంధుహీనులూ ధనహీనులూ అయిపోతారు. కొన్ని ప్రాంతాల్లో ప్రేత ప్రమేయం వల్ల ప్రకృతి పరివర్తనం చెందడం కూడా వుంది. మాతాపితలను ఎవడైనా హత్య చేశాడంటే వాడిని ప్రేతం పట్టుకొందని నిశ్చయించుకోవచ్చు. నాస్తికత కూడా ప్రేతప్రభావమే. నిత్యకర్మలపై ఆసక్తి

పోయి జపహోమాలను మాని వేయాలనే బుద్ధి పుట్టడం ప్రేత ప్రేరణం. అలాటి వానిలో పరధనాపహరణాలోచన కూడా ప్రేత నిర్ణయమే. ఇలా మనిషికి జరిగే ప్రతి కీడు వెనుకా ప్రేత ప్రమేయముంటుంది. పాపపుటాలోచనలున్న వారినే ప్రేతం ఆవహించి బాధించగలదు. *(అధ్యాయం - 20)*

## ప్రేతాలకు ముందే వచ్చే స్వప్నాలు ప్రేత - స్వప్న నివారణ - నారాయణ బలి

ప్రేతాల నుండి విడుదల వుంది. దానికి ముందది ఎలాటి ప్రేతమో, ఇదెలాటి తాపమో తెలియాలి. దానికి జ్యోతిర్విద్వాంసుల సహకారం అవసరం. ప్రేతగ్రస్త ప్రాణికి కొన్ని అద్భుతమైన కలలొస్తుంటాయి. తీర్థయాత్రలకి వెళ్ళాలనీ, నదీస్నానాలు చెయ్యాలనీ, ధర్మకార్యాలను అనుష్ఠించాలని గట్టిగా నిశ్చయించుకుని ముహూర్తం కూడా చూసుకున్నాక, ఎందుకో అత్యంత నిరాసక్తత ఏర్పడుతుంది. ఎక్కడికీ వెళ్ళబుద్ధెయ్యదు. చెడ్డ పనులవైపు మనసు పోతుంది. వెంటనే ఇది ప్రేత నిర్వాకమే అని పోల్చి ఆ జ్యోతిర్విద్వాంసుల నాశ్రయించినవాడు బాగుపడతాడు. వారిని సంప్రదించవలసినవసరము లేకుండా దానాలు చేసినా ప్రేతబాధలు వదిలిపోతాయి. కలలో కనిపించిన ప్రేతాన్నుద్దేశించి మంత్రసహితంగా దానం చేయడం వల్ల ఆ ప్రేతానికీ ఈ మనిషికీ కూడా తృప్తి కలుగుతుంది. ప్రేతాలు వాటిలో అవి కూడబలుక్కొని దానమిచ్చిన వానికి సుఖాలనిస్తాయి. వారి బంధుబాంధవులకు కూడ ధనధాన్యాల నిస్తాయి.

*నభవేత్ తేన ముక్తస్తు దత్తం శ్రేయస్కరం పరం ।*
*స్వయం తృప్యతి భోః పక్షిన్ యస్యోద్దేశ్యేన దీయతే ॥*
*శ్రుణు సత్యమిదం తార్క్ష్య యద్దదాతి భునక్తి స ః ।*
*ఆత్మానం శ్రేయసా యుంజ్యాత్ ప్రేతస్తృప్తిం చిరం వ్రజేత్ ॥*
*తే తృప్తాఃశుభమిచ్ఛంతి నిజబంధుషు సర్వదా ।*
*అజ్ఞాతయస్తుయే దుష్టాః పీడయంతి స్వవంశజాన్ ॥*
*నివారయంతి తృప్తాస్తే జాయ మానాను కంపకాః ॥*
*పశ్చాత్ తే ముక్తి మాయాంతి కాలేప్రాప్తే స్వపుత్రతః ॥* (ధర్మ... 21/12-15)

స్వప్నాలలో ప్రేతాలు కనిపించిన పిమ్మట కూడా, వాటి మాటలు, చేష్టలు, పీడలను చూసి కూడా శ్రాద్ధాదుల ద్వారా వాటి నుండి ముక్తికై ప్రయత్నించనివారు ఆ ప్రేతాలు పెట్టే శాపాలకు లోనై దుఃఖసాగరంలోనే మునిగి వుంటారు. ఇక తేలరు. కొంతమంది మరుజన్మలో కూడా నిస్సంతులు, పశుహీనులు, దరిద్రులు, రోగులుగానే వుండిపోతారు.

కొన్ని సందర్భాల్లో ప్రేతాల నామ గోత్రాలు స్వప్నాల వల్ల తెలుస్తాయి. కొందరిని, కలలు రాకున్నా, ప్రేతాలు పట్టి పీడిస్తాయి. అలాటి సందర్భాలలో కులపురోహితుని మాటనే పూర్తిగా విశ్వసించి ఆయన ఆదేశం మేరకు భక్తిభావ పూర్వకంగా పితృభక్తినిష్ఠులై పురశ్చరణ పూర్వకంగా నారాయణ బలి కార్యాన్ని నిర్వహించి జప, హోమ, దానముల ద్వారా దేహశోధనను చేసుకోగానే సమస్త విఘ్నాలూ సమసిపోతాయి. ఇవన్నీ చేయగానే, అంతవఱకూ భూత ప్రేత పిశాచాదులచే పీడింపబడుతున్న ప్రాణి బాధలన్నీ దూదిపింజల వలె ఎగిరిపోతాయి. ఒక్కటి మాత్రం గుర్తుంచుకో కశ్యపనందనా! పితృభక్తి ఉండాలి. లేకుంటే సుఖం లేదు. అన్ని ప్రయత్నాలలోనూ విజయం కావాలంటే తండ్రిపోయిన తొమ్మిదవ లేదా పదవ సంవత్సరంలో పదివేల గాయత్రి జపం చేసి, దశాంశ హోమం కూడా చేసి 'ఇది మా పితరుల నిమిత్తం' అని చెప్పుకోవాలి. దీని ఫలితంగా ఉపద్రవాలింక దరిచేరవు. తల్లిదండ్రులను మించిన దైవాలు లేరు.

*పితృమాతృ సమం లోకేనాస్త్య న్య ద్దైవతం పరం ।*
*తస్మాత్ సర్వప్రయత్నేన పూజయేత్ పితరౌ సదా ॥*
*హితానాము పదేష్టా హి ప్రత్యక్షం దైవతం పితా ।*
*అన్యాయా దేవతాలోకే న దేహ ప్రభవో హి తాః ॥* *(ధర్మ...21/28,29)*

ప్రాణులకు స్వర్గానికిగానీ మోక్షానికి గానీ ఏకమాత్ర సాధనం శరీరమే. అటువంటి శరీరం దేని ద్వారా అయితే వచ్చిందో, దానికన్న పూజ్యమేది? కాబట్టి దానమిచ్చిన వాడికి దక్కే ఫలమే గొప్పది.

పుత్రుడు పుట్టుటయే భాగ్యము. వాడు మంచివాడై అన్ని పితృకార్యములనూ చేయుటయే గొప్ప పుణ్యఫలము. వాడు పుట్టగానే తండ్రికి 'పుత్' అనే నరకబాధ తప్పిపోతుంది.

*పున్నామ నరకాద్యస్మాత్ పితరం త్రాయతే సుతః ॥*
*తస్మాత్ పుత్ర ఇతి ప్రోక్త ఇహచాపి పరత్ర చ ॥* *(ధర్మ...21/32)*

ఓయి ఖగరాజా! ఎవరికైనా మాతాపితరులిరువురూ అకాల మృత్యువు పాలైతే వారొక యేడాదిపాటు ఆ తల్లిదండ్రులకు పుణ్యలోకాలను ప్రాప్తింపజేసే ప్రయత్నంలోనే వుండాలి. ఆ యేడు వ్రతాలనూ, తీర్థయాత్రలనూ, వివాహాది మంగళకార్యాలనూ తలపెట్టరాదు.

***(అధ్యాయం - 21)***

# ప్రేతయోనిలో పడవేయు నిందిత కర్మలు మొదలగునవి

'భగవన్! ఈ ప్రేతాల ఉత్పత్తి ఎలా జరుగుతుంది? అవి ఎలా తిరుగుతాయి? వాటి రూపురేఖలు భోజనాదులు ఎలావుంటాయి? అవెక్కడుంటాయి? వాటిని ప్రసన్నం చేసుకోవడం ఎలా? ప్రసన్నచిత్తుడవై నాకీ జ్ఞానాన్ని ప్రసాదించు' అని కోరాడు అండజ కుల మండనుడు.

చెప్పసాగాడిలా బ్రహ్మాండాధి నాయకుడు :

'కశ్యపాత్మజా! పూర్వ పాపఫలం వల్ల మరికొన్ని పాపాలు చేయాలనే కోరిక పుట్టి దానినణచుకోకుండా అదుపు లేని చిత్తవృత్తితో వర్తించి మానవజన్మను తగలబెట్టుకొనే పాపాత్ములు ప్రేతాలవుతారు. ఇలా :

***పాపకర్మరతా యేవై పూర్వ కర్మవశానుగాః ॥***
***జాయంతే తే మృతాః ప్రేతా స్తాంఛృణుష్వవదామ్యహం ॥***
***వాపీకూప తడాగాం శ్చ ఆరామం సురమందిరం ।***
***ప్రపాం సద్మ సువృక్షాంశ్చ తథాభోజన శాలికాః ॥***
***పితృపైతా మహం ధర్మం విక్రీణాతి సపాపభాక్ ।***
***మృతః ప్రేతత్వ మాప్నోతి యావదాభూత సంప్లవం ।***
***గోచరం గ్రామ సీమాంచ తడాగారా మగహ్వరం ।***
***కర్షయంతి చయే లోభాత్ ప్రేతాస్తే వైభవంతి హి ॥*** ***(ధర్మ...22/3-6)***

పాపాత్ముల మృతి సాధారణంగా చండాలాయుధం, పాముకాటు, నీటమునక, అగ్ని, పంటి కాటు, బ్రాహ్మణశాపం, పశువు దాడి, విద్యుత్తు వంటి వాటి వల్ల జరుగుతుంది. అలాగే, పై మృతులతో బాటు ఆత్మహత్య చేసుకున్నవారు, ఉరిశిక్ష విషప్రయోగం, విషూచిక, శస్త్రపు దెబ్బలవల్ల పోయినవారు, దొంగల చేతిలో చనిపోయిన వారు, అపర కర్మ జరుపబడనివారు, వృషోత్సర్గ మాసిక పిండాదులందనివారు, ఆకాశంలో మరణించినవారు, కొండ మీది నుండి జారిపడి పోయినవారు, విష్ణువుని స్మరించకుండా మృతి చెందినవారు,

కుక్క కాటు వల్ల దుర్మరణం పాలైనవారు – వీరంతా ప్రేతాలై పోతారు. ప్రమాదాల పాలై మృతి చెందినవారు ప్రేతాలై శ్మశానంలోనే తిరుగుతుంటారు. ఏ స్త్రీనైనా దోషం లేకుండా శిక్షించువాడు, హింసించువాడు, త్యజించువాడు అలాగే మహాపాతకులు ప్రేతాలవుతారు. పండిత గృహాలలో జన్మించి కూడా విద్య నేర్వక, సదాచార హీనుడై తండ్రిని బాధించువాడు ప్రేత యోనిలో పడతాడు. ఇంకా...

*మాతరం భగినీం భార్యాం స్నుషాందుహితరం తథా ।*
*అదృష్ట దోషాం త్యజతి స ప్రేతో జాయతే ధ్రువం ॥*
*భ్రాతృధృగ్ బ్రహ్మ హా గోఘ్నః సురాపోగురుతల్పగః ।*
*హేమ క్షౌమ హరస్తార్ క్ష్య సవై ప్రేతత్వ మాప్నుయాత్ ॥*
*న్యాసాపహర్తా మిత్ర ధ్రుక్ పరదార రతస్తథా ।*
*విశ్వాస ఘాతీ క్రూరస్తు స ప్రేతో జాయతే ధ్రువం ॥*
*కులమార్గాం శ్చ సంత్యజ్య పరధర్మ రతస్తథా ।*
*విద్యావృత్త విహీనశ్చ సప్రేతో జాయతే ధ్రువం ॥* ***(ధర్మ...22/14-17)***

ఒకప్పుడు యుధిష్ఠిరుడు భీష్మపితామహుని ఇలా అడిగాడు, 'తాతగారూ! ప్రాణి ఏ కర్మ ఫలం వల్ల ప్రేతమై పోతాడు? వానికి ముక్తి ఎలా లభిస్తుంది?'

భీష్ముడిలా చెప్పసాగాడు :

'ధర్మజా! నీవిదివఱకే విన్న సంతప్తక బ్రాహ్మణుని కథలోనే వీటి వివరాలున్నాయి. ఇది పంచప్రేతోపాఖ్యానమను పేరిట సుప్రసిద్ధం. శుభప్రదం. ఈ కథలో ప్రేతయోనిలో పడకుండా వుండాలంటే నరుడేం చేయాలో ఇలా చెప్పబడింది :

*ఉపవాస పరోనిత్యం కృచ్ఛ్ర చాంద్రాయణే రతః ।*
*వ్రతైశ్చ వివిధైః పూతో న ప్రేతో జాయతే నరః ॥*
*ఏకాదశ్యాం వ్రతం కుర్వం జాగరణే సమన్వితం ।*
*అపరైః సుకృతైః పూతో న ప్రేతో జాయతే నరః ।*
*ఇష్ట్వావై వాశ్వమేధాదీన్ దద్యాద్ దానాని యోనరః ।*
*ఆరామోద్యానవాప్యాదేః ప్రపాయాశ్చైవ కారకః ।*
*కుమారీం బ్రాహ్మణానాంతు వివాహయతి శక్తితః ।*
*విద్యాఽదో భయదశ్చైవ న ప్రేతో జాయతే నరః ॥* ***(ధర్మ...22/64-68)***

గరుడా! మానవ జన్మనొందిన వారు దానిని సద్వినియోగం చేసుకుంటే ప్రేతజన్మే వుండదు '. ***(అధ్యాయం - 22)***

# ప్రేతాలు కల్పించే స్వప్నాలు, వాటికి ప్రాయశ్చిత్తాలు

ఎవరి కోసమని భ్రమిస్తూ ఇన్ని పాపాలు చేసి ఈ ప్రేత యోనిలో పడిపోయి బాధలు పడుతున్నామని ఈ ప్రేతాలు అనుకుంటాయో వారినే వచ్చి పట్టుకుంటాయి. తమ సతీసుతుల, బంధుమిత్రుల కలలలో భయంకరమైన అశ్వాలుగా, ఏనుగులుగా, ఎద్దులుగా, వికృతరూపులైన మానవులుగా కనిపించి బాధిస్తాయి. కొంతమంది నిద్రపోతుండగా వచ్చి వారి శయ్యలను అన్ని విధాలా అపభ్రంశం చేసి పడేస్తాయి. మనిషి తెల్లారి లేచి చూసుకొనేసరికి తానూ తన పక్కా చాలా అసహ్యకరంగా తయారౌతారు. కొందరికి తాము సంకెళ్ళచే బంధింపబడినట్లు కల వస్తే మరికొందరికి చనిపోయిన తమ వారు పరువు తక్కువ, నిందనీయ వేషాలలో తిరుగుతున్నట్టు కల వస్తుంది. తింటున్న వాని నుండి అన్నాన్ని తామే లాగుకొని పారిపోతున్నట్లు, దాహంతో ఆబగా నీరు త్రాగబోతున్న వాని నుండి ఆ నీటిని తామే లాక్కొని పారిపోతున్నట్లు కొందరికి కలలు వస్తాయి. ఇవన్నీ ప్రేతాల నిర్వాకాలే. ప్రేతాలలో ఒక రకమే పిశాచాలు. ఇవన్నీ వాటి విన్యాసాలు.

ఎద్దు మీద సవారీ చేస్తున్నట్లు, ఎద్దులతో కలసి ఎక్కడికో వెళుతున్నట్టు, ఆకాశంలో భయంగా పడిపోయేలా ఎగురుతున్నట్టు, ఆకలితో అలమటిస్తూ తీర్థంలో తిరుగుతున్నట్టూ, ఆవు, ఎద్దు, గుఱ్ఱం, పక్షులతో తన గొంతులోనే వాటి భాషను మాట్లాడుతూ గోష్ఠి సలుపుతున్నట్టూ, తన నుదుటిపై తనకే ఏనుగు, దేవతలు భూతప్రేత నిశాచరాదుల చిహ్నాలు కనిపిస్తే తనకి పిశాచజన్మే వస్తుందని అర్థం.

పక్షీంద్రా! ప్రేతయోని సంబంధితాలైన ఎన్నో చిహ్నాలు కలల్లో వచ్చి కంగారు పెట్టేవి ఉన్నాయి. తన అన్నదమ్ములు, భార్య, కొడుకు ఎవరైనా పోయినట్టు కల వస్తే అది ప్రేత దోషమే. మనిషికి ఆకలిదప్పులతో తాను ఆరాటపడుతున్నట్టూ 'వాటిని తీర్చండి మహాప్రభో' అని ఎవరినో యాచిస్తున్నట్టూ కల వస్తే ప్రేత దోషాన్ని వదలించుకోవాలని వెంటనే ఏదైనా తీర్థానికి పోయి తన పితరులందరికీ పిండదానం చేసి ప్రేతసంతృప్తిని సాధించాలి. పుత్ర, పితా, భ్రాత, పత్ని, పశు, పత్యాది ముఖ్యులు. ఇల్లు వదలి బయటికి పోతున్నట్టు కల వచ్చినా కూడా ప్రేత దోషముందని అర్థము.

ఇలాటి స్వప్న దోషాలకు ప్రాయశ్చిత్తమెలా చేయించుకోవాలో విను. వ్యక్తి ఇంట్లో గాని తీర్థంలోగాని స్నానం చేసి మారేడు మూలంలో జలతర్పణమివ్వాలి. వేద పారంగతులైన

బ్రాహ్మణులను బాగుగా పూజించి వారికి నల్లని ధాన్యాలను దానమివ్వాలి. తరువాత యథాశక్తి హవనం చేసిన పిమ్మట గరుడ పురాణ పారాయణ చేయించుకోవాలి. శ్రద్ధాపూర్వకంగా ఈ అధ్యాయాన్ని చదివినా, విన్నా వారికి ఏ ప్రేతదోషమూ అంటదు. అప్పటికే అంటివుంటే మంటిలో కలసి పోతుంది. *(అధ్యాయం -23)*

## అల్పాయువు - కారణాలు

గరుడా! మనిషి నూరేళ్ళూ బతకాలనే వేదం చెప్పింది కాని కలికాలంలో ఆ మాటకి అవాంతరం ఏర్పడింది. నిందిత కర్మలను నిరంతరాయంగా కావించువాడెక్కువ కాలముండడు. వానికి వేద జ్ఞానం కొరవడడం కారణంగా వంశంలో పరంపరగా వస్తున్న సదాచారములను పాటింపడు. బద్ధకస్తుడై చేయవలసిన సత్కర్మలను చేయకపోగా దుష్టకర్మాసక్తుడై, భోజనం కూడా ఎవరింటిలోనో చేసి వేస్తూ, స్వంతంగా కుటుంబాన్ని నెలకొల్పకుండా పరస్త్రీసంగుడై కాలక్షేపం చేసే వానికి ఆయువు క్షీణిస్తుంది. శ్రద్ధాహీనులు, అపవిత్రులు, నాస్తికులు, శుభకార్యాలను చేపట్టనివారు, పరద్రోహులు, అసత్యవాదులు అయిన బ్రాహ్మణులు ఎక్కువ కాలముండరు. ప్రజలను రక్షించవలసినవారే ఆ పని చేయకుండా, క్రూరులై, ఇటు ధర్మాచరణమూ చేయక, వ్యసనపరులై మూర్ఖులై, వేదానుశాసనాన్ని పట్టించుకోకుండా ప్రజా పీడన పరాయణులై ప్రవర్తించు క్షత్రియులను భూమాత భరించదు.

సామాన్య మానవులు కూడ కొన్ని నియమాలను తప్పనిసరిగా పాటించాలి. స్నానదానాదులు లేకుండా రోజును గడిపేవారు వ్యర్థులే.

***స్నానందానం జపోహోమో స్వాధ్యాయో దేవతార్చనం***
***యస్మిన్ దినే నసేవ్యంతే స వృథా దివసో నృణాం ।*** *(ధర్మ...24/18,19)*

పక్షీంద్రా! పుట్టినవాడు గిట్టక తప్పదు. మరణించినవాడు మరల పుట్టుట కూడా సహజమే కాని, దానిని తప్పించినవారున్నారు. మనిషి మరణం లేకుండా కోరుకోవడం అన్యాయమే. కాని మరల పుట్టుక వుండకూడదనుకోవడం అనగా జన్మరాహిత్యాన్ని వాంఛించడం మంచిది. ఆ కోరిక తీరాలంటే లెక్కలేనన్ని త్యాగాలు చేయాలి, అనంతంగా శ్రమా పడాలి. తనకెంతో ప్రియమైన వాటినన్నిటినీ దానం చేసి వేయాలి.

తిన్నది అరిగించుకొనే శక్తి, రతి శక్తి, దాన శక్తి– ఈ మూడూ దుర్లభశక్తులు. సరైన భోజనం, అనుకూలవతియైన స్త్రీ, ధర్మ న్యాయార్జిత ధనం – ఈ మూడు వస్తువులూ ఆ మూడు శక్తులు మనిషిని మోక్షం వైపు నడిపిస్తాయి.

*భోజ్యే భోజన శక్తిశ్చ రతిశక్తిర్వర స్త్రియః ॥*
*విభవే దానశక్తిశ్చనాల్పస్య తపసః ఫలం ।*
*దానాద్భోగా నవాప్నోతి సౌఖ్యం తీర్థస్య సేవనాత్ ॥*
*సుభాషణాన్ మృతోయస్తు స విద్వాన్ ధర్మ విత్తమః ॥*
*అదత్త దానాచ్చ భవేద్దరిద్రో*
*దరిద్రభావాచ్చ కరోతి పాపం ।*
*పాపప్రభావాన్నరకం ప్రయాతి*
*పునర్దరిద్రః పునరేవ పాపీ ॥* *(ధర్మ... 24/44-46)*

దానం చేయనివాడు దరిద్రుడై పుడతాడు. ధనసంపాదన కోసం పాపాలు చేస్తాడు. పాపాల వల్ల నరకానికి పోతాడు. మరల దరిద్రునిగానే పుడతాడు. ***(అధ్యాయం - 24)***

# సత్పుత్ర మహిమ - విలక్షణ, పుత్రకృత అన్త్యేష్ఠి ఫలం

గరుడా! మాతాపితలకు సర్వసుఖాలనూ ఏర్పాటు చేసే కొడుకే సత్పుత్రుడు. అతడే వారి ప్రేమాభివర్ధకుడు. ఒకే ఆకాశం, ఒకే సూర్యుడు, ఒకే చంద్రుడు నేలపై పెట్టబడిన నీటికుండలలో భిన్నానేకాకారాలతో కనిపించినట్లే ఒకే తండ్రి యొక్క ఆత్మ ఆయన పుత్రులందరిలోనూ కదులుతుంటుంది. ఒక కొడుకు తండ్రిలాగే ఉండవచ్చు. ఇంకొకడు తల్లిని పోలవచ్చు, మరొకడు మేనమామ పోలిక కావచ్చు, వేరొకడు వీరందరికీ భిన్నంగా ఉండవచ్చు. అయినా ఆ తండ్రి సంస్కారమే చిన్నతనంలో అందరికీ అలవడుతుంది. కొందరు పుత్రులు తండ్రుల కన్న అత్యధిక రూపవంతులు, గుణవంతులు, దాన పరాయణులు కావచ్చు కొందరు దీనికి విపరీతమూ కావచ్చు. ఒక్కటి మాత్రం నిజం - గుడ్డివాడికి గుడ్డివాడే పుట్టాలని లేదు. మూగవానికీ అంతే. ఏ వైకల్యమూ, తండ్రిది కొడుక్కి పుట్టుకతోనే రావాలని లేదు. పండితపుత్రుడు పండితుడైనా కావచ్చు, పరమశుంఠ కూడా కావచ్చు. ఎక్కడా అనురూపతా ఏకరూపతా లేనిదే భగవత్ సృష్టి'.

'ప్రభో! పరంధామా! ఔరస, క్షేత్రాది పదిరకాల పుత్రులుంటారు కదా! వీరిలో సంగృహీత (ఎక్కడి నుండో తెచ్చిన) పుత్రుని వల్లా, దాసీపుత్రుని వల్లా కలిగే ధార్మిక ప్రయోజనమేముంటుంది?

'గరుడా! అప్పుడే పుట్టిన కొడుకు ముఖం చూడగానే ఎవరికైనా పితౄణం నుండి ముక్తి లభిస్తుంది. మనుమని (పౌత్రుని) ముఖం చూడగానే త్రి (దేవ, పితృ, ఋషి)

ఋణాలూ తీరిపోతాయి. ప్రపౌత్రుని ముఖం చూసినారికి అనంత, స్వర్గలోకాల ప్రాప్తి వుంటుంది. (దశవిధ పుత్రులకూ ఇది వర్తిస్తుంది)

క్షేత్రజ పుత్రుడు తన తండ్రికి లౌకిక సుఖాన్ని మాత్రమే కలిగించగలడు. ఔరస పుత్రుడే తన తండ్రికి విధ్యుక్తంగా పార్వణశ్రాద్ధాన్ని పెట్టాలి. మిగతా పుత్రులంతా ఏకోద్దిష్ట శ్రాద్ధాన్నే పెట్టడానికధికారులౌతారు కాని పార్వణానికి కాదు. బ్రాహ్మ వివాహ నియమాల ప్రకారం పండిన దాంపత్యంలో పుట్టిన కొడుకు తండ్రిని స్వర్గానికి పంపించగలడు. సంగృహీత, దాసీ పుత్రులు తీర్థాలలో తమ తండ్రికి శ్రాద్ధకర్మను చేయవచ్చును. తండ్రి పేర బ్రాహ్మణులకు దానాలీయవచ్చును. ***(అధ్యాయం - 25)***

# సపిండీకరణ శ్రాద్ధము యొక్క గొప్పతనం ప్రతివర్ష విహిత మాసిక శ్రాద్ధ అనివార్యత

గరుడా! మనిషి మరణానంతరం ఒక యేడాది మహా-పథ యాత్రను చేస్తాడు కదా! అప్పుడు ఎవరికైతే పుత్రపౌత్రాదుల ద్వారా సపిండీకరణ శ్రాద్ధం జరుగుతుందో వారు పితృలోకానికి వెళతారు. కాబట్టి ఏడాది పూర్తి కాగానే తద్దినం పెడుతుండాలి. అలాగే వర్షాంతంలో ప్రేత పిండాన్ని కూడా జతపఅచాలి. దాని వల్ల ఏ కారణంగానైనా ప్రేతయోనిలో పడిన పితరులకు దాని నుండి విముక్తి లభిస్తుంది. అపుడు వారు పితృలోకవాసులవుతారు. (అక్కడ తపస్సు చేసి నరకాన్ని తప్పించుకొనే అవకాశం లభిస్తుందని ఇతరత్ర చెప్పబడింది- అను)

గృహస్థు ఇంటిలో ఎవరైనా మృతి చెందితే అపరకర్మలు ముగిసేదాకా ఆ గృహంలో శుభకార్యాలను చేయరాదు. సపిండీకరణ జరిగే దాకా భిక్షువులా ఇంటి భిక్షను స్వీకరింపరాదు. సాధారణంగా పదురెండవ దినాన్నే సపిండీకరణకు ప్రశస్తంగా భావిస్తారు. మృతవ్యక్తి అగ్నిహోత్రియైనా కాకున్నా పన్నెండవ రోజునే సపిండీకరణ చెయ్యాలి. కొందరు ఋషులు మాత్రం పన్నెండవరోజు, మూడవ పక్షం, ఆరవ మాసం, వర్షాంతంలలో ఏదో ఒక రోజు సపిండీకరణం చెయ్యవచ్చని అంగీకరించారు.

పుత్రవంతునికి సపిండీకరణ తరువాత ఎప్పుడూ కూడా ఏకోద్దిష్టాన్ని చేయరాదు. శ్రాద్ధములెన్ని పెట్టినా ఎక్కడ నిర్వహించినా ఏకోద్దిష్టం పనికి రాదు. పుత్రుడు శక్తి ఉన్నా లేకపోయినా తన తండ్రికి పార్వణ శ్రాద్ధం పెట్టవలసినదే. పుత్రరహితునికి సపిండీకరణ శ్రాద్ధం పెట్టరాదు.

బ్రాహ్మ (మరియు శాస్త్రోక్త) వివాహం ప్రకారం పెండ్లి జరిగిన (వృద్ధురాలై) మృతి చెందిన స్త్రీకి పతి గోత్రంతోనే కర్మ చేయాలి. ఆసురాది అశాస్త్రీయ వివాహితకు ఆమె తండ్రి గోత్రంతో ఆ కర్మను చేయాలి. మృతునికి అపరకర్మలు చేయడానికధికారి ఎవరనేది ఇదివరకే చెప్పబడింది కదా! అయితే ఈ విషయంలో మనువు ఇలా నిర్ణయించాడు :

*భ్రాతౄణా మేకజాతానా మేకశ్చేత్ పుత్రవాన్ భవేత్ ।*
*సర్వేతే తేన పుత్రేణ పుత్రిణో మనురబ్రవీత్ ॥* **(26/26)**

అన్నదమ్ములలో నొకడే పుత్రవంతుడైతే ఆ అన్నదమ్ములందరికీ పితృకార్యాలకు ఆ పుత్రుడే అధికారి అవుతాడు. చూడాకరణ – ఉపనయన సంస్కారాలు జరిగిన పుత్రుడు తన తండ్రి శ్రాద్ధకర్మను నిర్వహించవచ్చును. చూడాకరణం మాత్రమే జరిగిన పుత్రుడు కూడా కర్మనైతే చేయవచ్చును. కానీ స్వధామంత్రాలనే పలకాలి; వేదమంత్రాలను చదువరాదు.

స్త్రీకి సపిండీకరణం ఆమె పతి, మామ, మామగారి తండ్రిలతో కలిపి జరుపబడాలి.

గరుడా! సంవత్సర కాలంలో ప్రేత సంబంధి క్రియను దేనిని చేసినా విద్వాంసులు మృతుని నామ గోత్రాలనుచ్చరిస్తూనే చేయాలి. సపిండీకరణం చేసి భోజన, ఘటాదిక దానాలనూ, పద దానాలనూ, ఇతర దానాలనూ అన్నిటినీ మృతవ్యక్తినుద్దేశించే చేయాలి. ఏడాదికి సరిపడునట్లుగా లెక్కవేసి అన్నాన్నీ జలపూర్ణఘటాలనూ బ్రాహ్మణులకు దానమివ్వాలి. పిండదానం తరువాత, యథాశక్తి, సంవత్సర గ్రాసాన్ని బ్రాహ్మణుని కివ్వాలి. అలా చేస్తే మృతవ్యక్తి యముని వద్దకు దివ్య దేహధారియై విమానంలో సుఖంగా వెళ్ళగలడు.

*అన్నం పానీయ సహితం సంఖ్యాం కృత్వాబ్ది కస్యచ ।*
*దాతవ్యం బ్రాహ్మణే పక్షిం జల పూర్ణ ఘటాదికం ॥*
*పిండాంతే తస్య సకలా వర్షవృత్తిః స్వశక్తితః ।*
*దివ్యదేహో విమానస్థః సుఖం యాతి యమాలయం ॥* **(ధర్మ...26/35,36)**

తండ్రి ఉండగానే కొడుకు మరణిస్తే అతని సపిండీకరణలో తండ్రి పేరుండదు; తాత ముత్తాతలవే ఉంటాయి. అలాగే పతి ఉండగానే మరణించిన స్త్రీ సపిండీకరణలో ఆమె మామగారు, ఆయన తండ్రి గోత్రనామాలుంటాయి.★

---

★కొన్ని ప్రత్యేక పరిస్థితులెదురైనపుడు కర్మ చేయవలసిన పద్ధతి, సతి అగ్ని ప్రవేశంతో సహా, జిజ్ఞాసువుల కోసమే ఈ విషయాన్ని చెప్పడం జరిగింది.

ఖగరాజా! మృతప్రాణికి సుఖాన్ని కలిగించే కొన్ని విశేషకర్మలనిప్పుడు వినిపిస్తాను. మృతి తరువాత పన్నెండవ రోజు యథావిధిగా సపిండనాది సమస్త కార్యాలనూ నిర్వర్తించిన తరువాత ఆ ఏడాది పొడుగునా ప్రతి దినమూ నీటికుండలనూ అన్నాన్నీ దానం చేస్తూ మాసిక శ్రాద్ధాలను కూడా పెట్టాలి. ప్రేతకార్యమున్న రోజు ఇంకే కార్యాన్నీ చేపట్టరాదు. అలా చేస్తే నష్టం జరుగుతుంది. మృతునికై చేసే కార్యాలను అదే యేడాదిలో మరల మరల చేస్తుంటే ప్రేతానికి సుఖం కలుగుతుంది. నిజానికి అక్షయ సుఖాలే అబ్బవచ్చు. రోజూ చేసే దానానికి అదనంగా ప్రతి మాసంలోనూ మృతుడు పోయిన తిథినాడు అన్నోదక పూర్ణఘటాలను దానం చేయవచ్చును. వృద్ధి శ్రాద్ధ సపిండీకరణలో కూడా ప్రతి మాసంలో ఒక పిండాన్నీ, అన్నాన్నీ, జల పూర్ణ కుంభాలనూ దానం చేయవచ్చును.

*(అధ్యాయాలు - 26,27)*

***(బభ్రువాహన మహారాజు కథే మరల ఇక్కడ కనిపిస్తుంది. అయితే రెండు విషయాలు అదనంగా చేర్చబడ్డాయి. వాటిని అనుబంధంలో చూడవచ్చును)***

## ప్రేత ముక్తి - ఉపాయాలు

'హే జగదానందకారకా! ఏ దానం లేదా సత్కర్మ ద్వారా ప్రాణి ప్రేతయోనిలో పడినా విముక్తి చెందగలదు?'

'వత్సా! నీ లోక కల్యాణ వాంఛ బహు ప్రశంసనీయం. సమస్త అమంగళాలనూ నశింపజేయు దానాన్ని గూర్చి వినిపిస్తాను. విను. ప్రవచించు. ఒక బంగారు కుండను నిర్మింపజేసి దానిని బ్రహ్మ, విష్ణు, శివ, లోకపాలుర ప్రతిమల మధ్య పెట్టి ఆ దేవతలందరినీ యథావిధిగా పూజించి ఈ కుండపై కూడా ఆ పూజాద్రవ్యాలను వేస్తుండాలి. పూజానంతరం ఆ కుండను పాలతో నేతితో నింపి సుపాత్రుడైన బ్రాహ్మణునికి దానమిచ్చిన వ్యక్తి ప్రేతయోనిలో పడడు. దహనానికి ముందు చేయవలసిన పనులన్నీ ప్రేతముక్తికై ప్రయత్నాలే. వాటిని ఇప్పటికే వినియున్నావు కదా!

గరుడా! తిలలు నా (విష్ణు) స్వేదజనితాలు. అవి పరమపవిత్రాలు.

***మమ స్వేద సముద్భూతా***
***స్తిలాస్తార్క్ష్య పవిత్ర కాః ।*** *(ధర్మ...29-15)*

అలాగే కుశలు నా రోమాల నుండి ఉద్భవించాయి.

***దర్భామల్లోమ సంభూతాః ॥*** *(ధర్మ.... 29/17)*

కుశలలో బ్రహ్మ, నేనూ, శివుడూ ఉంటాము. బ్రాహ్మణుడు, మంత్రము, కుశ దర్భలు, అగ్ని, తులసి - వీటినెన్ని మార్లు ప్రయోగించినా పాసిపోవడం గాని, వన్నె తగ్గడం గాని జరుగదు.

*విప్రమంత్రాః కుశావహ్నిస్తుల సీచ ఖగేశ్వర ।*
*నైతే నిర్మాల్యతాం యాంతి క్రియమాణాః పునఃపునః ॥* **(ధర్మ...29/21)**

అలాగే విష్ణ్వాది ఆరు పుణ్యదాలు కూడా.

*విష్ణురేకాదశీ గీతా తులసీ విప్రధేనవః ।*
*అపారే దుర్గసంసారే షట్పదీ ముక్తి దాయనీ ।* **(ధర్మ...29/24)**

పైని చెప్పినవన్నీ ప్రేత ముక్తి దాయకాలే. ఇవే కాక లవణ దానం కూడా ముక్తిదాయకమే. లవణం నా దేహం నుండి పుట్టింది★. **(అధ్యాయాలు - 28,29)**

## దానధర్మాల మహిమ- ఆతుర కాల దాన వైశిష్ట్యం, వైతరణీ- గోదాన మహిమ

**తా**ర్క్ష్యా! చాలా మందికి తెలియదు గానీ పత్తి దానం ఉత్తమ దానం. పత్తి లేదా దూదిని దానం చేయడం వల్ల ***భూః, భువః, స్వః***- అనగా పృథ్వి, అంతరిక్షం, స్వర్గం - ఈ మూడూ ప్రసన్నమవుతాయి. బ్రహ్మాది దేవులంతా ఆనందిస్తారు. ప్రేతాన్ని ఉద్ధరించడానికీ దానం గొప్ప సహాయకారి. ఇట్టి మహాదానము నిచ్చిన దాత చిరకాలం పాటు రుద్ర లోకంలో నివసించి మరల పుడమిపై పుట్టాల్సి వచ్చినపుడు రూప సంపన్నుడు, సౌభాగ్యశాలి, వాక్చతురుడు, లక్ష్మీవంతుడు, అప్రతిహత పరాక్రమవంతుడునగు రాజుగా పుడతాడు. మరల తన సుకృతాల ద్వారా యమలోకాన్ని జయించి స్వర్గలోకనివాసి అవుతాడు.

బ్రాహ్మణునికి గోవునూ, నువ్వులనూ, భూమినీ, స్వర్ణాన్నీ దానం చేసి ఆ తరువాత పవిత్ర జీవితాన్ని గడిపినవారికి జన్మజన్మార్జిత పాపాలన్నీ దగ్ధమై పోతాయి. రుగ్ణావస్థలోనూ, సూర్య లేదా చంద్ర గ్రహణ సమయాల్లోనూ చేసే దానములకు విశేష ఫలాలుంటాయి. కుటుంబంలో, పోష్య వర్గములో నున్న రోగులకు స్వస్థతను కోరి దానాలిస్తే ఆ రోగాలు

---

★*ఇక్కడ సంక్షిప్తంగా చెప్పబడిన విషయాలన్నీ ఇదే కాండలో మొదటి రెండు అధ్యాయాల్లో విస్తృతంగా వర్ణింపబడ్డాయి.*

తగ్గడమే కాకుండా దానమిచ్చినవానికి కూడా పుణ్యలోక ప్రాప్తి వుంటుంది. పుత్రుడు తన తండ్రి సుఖ సంతోషాలను కోరుకుంటూ సత్పాత్రులైన సద్బ్రాహ్మణులకు చేసే దానాల వల్ల తండ్రీ కొడుకులిద్దరి జీవనాలూ సుఖమయాలవుతాయి. వికలేంద్రియాలూ బాగుపడాలని కోరుకొని ఇచ్చే దానాలూ కూడా ఫలిస్తాయి. తన తండ్రి జీవించియున్నంత కాలమూ ఆయన ఆరోగ్యం కోసం కొడుకు చేసే దానాలు ప్రశస్తమైనవి. అవి తండ్రీ కొడుకుల జీవితాలను సంతోషంతో నింపడమే కాకుండా ఆవాహిక ప్రేతాల భోగాలకు పోయి, పరలోకాన్నీ బాగు చేస్తాయి.

మృత్యువాసన్నమైన వాని పేర ప్రతి దశలోనూ కటిక దరిద్రులకూ వికలాంగులకూ దానాలిస్తుంటే ఆవాహిక శరీరానికి ప్రీతి కలుగుతుంది. మనిషి పోయిన తరువాత చేయవలసిన దానాలిది వఱకే చెప్పబడ్డాయి కదా!

నువ్వులు, ఇనుము, బంగారం, పత్తి, ఉప్పు, సప్తధాన్యాలు, భూమి, గోవు - ఇవి క్రమంగా ఒక దానిని మించి మరొకటి పవిత్రాలు. నువ్వులు అందరు దేవతలనూ, ఇనుము యమరాజును ప్రసన్నం చేయగలవు. అంటే వాటిని బ్రాహ్మణులకు దానమిస్తే ఆ దేవతలు ఈ దాత పట్ల ప్రసన్నులవుతారని అర్థము. లవణ దానం చేసేవారు యమునికి భయపడనవసరం లేదు. పత్తిని దానమిచ్చువారు భూతయోనికి భయపడనక్కరలేదు. గోదానం ఆ దాతను త్రివిధ పాపాల నుండి బయటపడేస్తుంది. స్వర్ణదానం వల్ల స్వర్గసుఖాలు లభిస్తాయి. భూమి దానమిచ్చినవాడు రాజు కాగలడు. సప్తధాన్యాలను దానమిచ్చిన వారికి యమదూతలు ప్రసన్నులు కాగలరు. వరాలను కూడా ఇస్తారు.

విష్ణుభగవానుని నామస్మరణ మాత్రాననే ప్రాణికి పరమగతి ప్రాప్తిస్తుంది. తండ్రి ఆదేశం మేరకు దానాలు చేసే తనయుని లోకాలన్నీ ప్రశంసిస్తాయి. మరణాసన్నమైన తండ్రి శరీరాన్ని నేలపై పరుండబెట్టి ఆయన ఎప్పుడో చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకొని ఆయన చివరి క్షణాల్లో ఆ ద్రవ్యాలను దానం చేసిన కొడుకు తన మొత్తం వంశాన్ను ద్ధరించగలడు. అతడిచ్చిన దానాలు గయలో పెట్టబడే శ్రాద్ధాల కన్న నెక్కువ పుణ్య ప్రదాయకాలు. మరణాసన్న సమయంలో తండ్రి వున్నపుడు ఆయన పేర చేసే దానాలు అన్ని ఆటంకాలనూ అధిగమించి, ఆయన, స్వర్గం చేరుకొనేలా చేయగలవు. ఈ దానమే అంత్యేష్టి అను పేర ప్రసిద్ధి చెందింది. అశ్వమేధయాగాలు పదహారైనా దీనికి సాటిరావు. దీనిని గావించే ధర్మాత్ముడైన పుత్రుని దేవతలు కూడా పూజిస్తారు.

ఇనుమును దానం చేసిన వానికి యమధర్మరాజు యొక్క భయంకర రూపం కనుపింపదు. ఆయన భయంకరములైన గొడ్డలి, ముసలం, దండం, ఖడ్గం, ఛురిక

వంటి ఆయుధాలను ధరించి వుంటాడు. ఇవన్నీ ఇనుపవే. అందుచేత ఇనుమును బ్రాహ్మణునికి దానం చేస్తే ఆయన సంతోషిస్తాడు. తండ్రి కోసమే కాక దీర్ఘరోగులైన బంధువుల కోసం కూడా దానాలను చేయాలి. గరుడా! ఇది ఎంత ముఖ్యమైనదంటే సామర్థ్యముండీ, విషయం తెలిసీ రోగికి ఉత్తమ గతిని కల్పించే దానాలను చేయని పుత్ర, పౌత్ర, బంధుబాంధవ, మిత్ర, సగోత్రికులు బ్రహ్మ హంతకులతో సమానులైన పాపులుగా పరిగణింపబడతారు. ఎందుకంటే రోగి స్వయంగా తాను ఏ పుణ్యకార్యమూ చేయలేదు కదా!

మృతి చెందినవారేమవుతారు అనేది మరొక్కసారి విను. ప్రాణి వెంటనే ఆవాహిక శరీరం గల ప్రేతంగా మారి ఒక యేడాది పూర్తియినాక తన పుణ్యాల లాభాన్ని అనుభవిస్తుంది. ఈ లోకంలో ముఖ్యమైనవి మూడేసి వుంటాయి కదూ! అగ్నులు, లోకాలు, వేదశక్తులు, దేవతలు, కాలాలు, సంధులు, మూలవర్ణాలు, ప్రధాన శక్తులు – అన్నీ త్రివిధాలే. అలాగే మనిషిలో నివసించే త్రిమూర్తులు కూడ. కాళ్ళ నుండి కటి దాకా బ్రహ్మ, నాభి నుండి గొంతు దాకా శ్రీహరి, గొంతు నుండి పై దాకా వ్యక్తావ్యక్త స్వరూపుడైన శివుడు ఉంటారు.

గరుడా! నేనే జరాయుజ, స్వేదజ, అండజ, ఉద్భిజ్జ శరీరాల్లో ప్రాణరూపుడనై నివసిస్తున్నాను. ధర్మ–అధర్మ, సుఖ–దుఃఖ, కృత–అకృత ద్వంద్వాలలో ప్రవర్తించే బుద్ధిని నేనే. ఆ బుద్ధిలో నేను కూర్చుని వాటి పూర్వ కర్మానుసారంగా వాటికి ఫలాన్ని తెప్పించే పనులను చేయిస్తుంటాను. నా వల్లనే ప్రాణి స్వర్గానికో, నరకానికో, మోక్షానికో పోవడం జరుగుతున్నది. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, శ్రీకృష్ణ, బుద్ధ, కల్కి – ఈ పది నామాలనూ రోజూ స్మరించేవారు మనీషులు. వీరు ఈ లోకంలోని స్మరణ వల్ల స్వర్గానికి పోయి అక్కడ కూడా ఈ నామాలను స్మరిస్తూ మరల ఈ మర్త్య లోకంలో పుట్టినప్పుడు ధన ధాన్య సంపన్నులై దయా దాక్షిణ్యాది సద్గుణ పరిపూర్ణులై, పుత్ర పౌత్రాభివృద్ధిని గాంచి ఆనందంగా నూరేళ్ళూ జీవిస్తారు. రోగం నుండి ఇక విముక్తి లేదని తెలిసినవారు దానాలు చేస్తూ చేయిస్తూ విష్ణు పూజలను జరుపుతూ జరిపిస్తూ అష్టాక్షరీ మంత్రాన్ని అసువులు బాసేదాకా జపిస్తూ వుంటే మోక్షమునందగలరు. ద్వాదశాక్షర మంత్రాన్ని జపించినా అదే ఫలాన్నందుకోగలరు.

సంపూర్ణ జగమే విష్ణుమయం. ఇలా :

***విష్ణుర్మాతా పితావిష్ణుర్విష్ణుః స్వజన బాంధవాః ।***
***యత్ర విష్ణుం న పశ్యామి తత్ర వాసేన కిం మమ ॥***

*జలే విష్ణుః స్థలే విష్ణుర్విష్ణుః పర్వత మస్తకే ।*
*జ్వాలా మాలాకులే విష్ణుః సర్వం విష్ణుమయం జగత్ ॥ (ధర్మ...30/41,42)*

బ్రాహ్మణులు, జలం, భూమి మున్నగు పదార్థాలన్నిటిలోనూ నేనున్నాను కాబట్టి ఓ గరుడా! మనిషి దేనిద్వారా తరింపదలచినా అది నా ద్వారానే జరుగుతుంది. జీవికి తరుణోపాయం నేనే.

మనిషి మరణించిన పిమ్మట వైతరణిని దాటవలసి వుంటుంది. నిజానికిది మంచివారికి హితకారిణి ఎక్కువ పుణ్యాలను చేసిన వారు తమ పాపలేశాన్ని ఇందులోనే కడిగేసుకొని శుద్ధులై విష్ణులోకానికి పోతారు.

గోదానాన్ని మించిన పుణ్యమే లేదు. కపిల గోవును దానమిస్తూ పరమాత్మనిలా ప్రార్థించాలి :

*గావో మమాగ్రతః సంతుపృష్ఠతః పార్శ్వతస్తథా ।*
*గావో మే హృదయే సంతు గవాం మధ్యేవసామ్యహం ॥*
*యా లక్ష్మీః సర్వభూతానాం యాచ దేవే వ్యవస్థితా ।*
*ధేను రూపేణ సాదేవీ మమ పాపం వ్యపోహతు ॥ (ధర్మ...30/52,53)*

*(అధ్యాయం - 30)*

# అపరకర్మలలో వివిధ దానాల ఫలాలు

గరుడా! పాపాచారంలోనే బతుకంతా గడిపేసినవాడు ఎలాగూ నరకానికి పోతాడు. అలా కాకుండా కొన్నైనా మంచి పనులు చేస్తే కొంతైనా మంచి జరగవచ్చు.

నన్ను సాక్షిగా వుంచుకొని మనిషి ద్వారానో, తనంత తానుగానో ప్రాణి చేసిన దానం విశేషఫలాన్నిస్తుంది. భూదానమిచ్చిన వాడు ఆ భూమిలో ఎన్ని రజకణాలున్నాయో అన్ని సంవత్సరాలు స్వర్గంలో నివసిస్తాడు. చెప్పులను దానమిచ్చిన వారు నారకీయ మార్గంలో నడువనవసరం లేకుండా గుఱ్ఱాలపై పోగలరు. గొడుగులను దానమిచ్చినవారు అదే మార్గంలో ఎండలో ఒళ్ళు కాలకుండా వెళ్ళగలరు. ఎవరిని ఉద్దేశించి అన్న దానం చేయబడుతుందో వారు కడుపు నిండగా సంతుష్టి చెందుతారు. యమలోక మహాపథంలో ఒకస్థానం వుంది. అక్కడ ఎప్పుడూ చిక్కటి చిమ్మచీకటి అలముకొని వుంటుంది. పాము బుసలూ, సింహాదిహింస్రక మృగాల గర్జనలూ వినిపిస్తుంటాయి. ఈ మర్త్య లోకంలో

దీపదానం చేసిన వారిని ఆ చీకటి బాధింపదు. మార్గం తేజోవంతమై కనిపిస్తుంది. మృతుని పేర మృతతిథినాడూ, అశ్వయుజ కార్తిక మాఘ చతుర్దశులలోనూ చేసే దానాలు సుఖకారకాలవుతాయి. దీపదానం చేసేవాడు స్వయంగా పుణ్యుడై ప్రకాశిస్తాడు.

దీపదానం లేదా దీపాదానం మిక్కిలి పుణ్యప్రదమైనది. ఏదో దీపం పెట్టేద్దామని కాకుండా శాస్త్రోక్తంగా సంకల్పపూర్వకంగా దేవాలయంలోనైతే తూర్పువైపూ, బ్రాహ్మణుల కోసమైతే ఉత్తరం వైపూ, ప్రేతం కోసమైతే దక్షిణం వైపూ నిలబడి దీపాన్ని వెలిగించి జలాన్ని తీసుకొని ధారపోయాలి. మృతవ్యక్తి కోసమిచ్చే పదమూడు పద దానాలూ ప్రేతాన్ని అన్ని విధాలా సుఖపెడతాయి.

మృతవ్యక్తి నుద్దేశించి గానీ, స్వంతానికి సంకల్పించి గానీ ఏ దానమిస్తే, ఆ సుఖం కలుగుతుంది. అశ్వము, నౌక, ఏనుగు మున్నగువాటిని దానమిస్తే మహాపథంలో వారు వాటిపై ప్రయాణిస్తారు. తాంబూలాలనూ పుష్పాలనూ బ్రాహ్మణులకు, మృతుని పేర, దానమిస్తే యమదూతలు సంతోషించి అనవసర బాధలను పెట్టకపోవచ్చు. మృతప్రాణి పేర నీటితో నిండిన మట్టికుండలను దానమిచ్చిన వారికి సహస్రఘటదాన ఫలం దక్కుతుంది. సాధారణంగా మహాపథంలో ఆకలి, శ్రమ, దాహాలతో అలమటించే మృతులకు, వారి పేర భూలోకంలో అన్నంతో, నీటితో నింపిన కుండలను పుత్రులు దానం చేస్తే, యమమార్గం శ్రమాదులు లేకుండానే ఉత్తరించబడుతుంది. ఇలాగే శయ్యా, విష్ణుప్రతిమా దానాలు  కూడ ఫలిస్తాయి

గరుడా! జీవాత్మ ఇలా నిష్క్రమిస్తుంది.

***జాతస్య మృత్యులోకే వై ప్రాణినో మరణం ధ్రువం***
***మృతిః కుర్యాత్ స్వధర్మేణ యాస్యతశ్చ పరంతప ॥***
***పూర్వకాలే మృతానాంచ ప్రాణినాంచ ఖగేశ్వర ।***
***సూక్ష్మో భూత్వాత్వసౌ వాయుర్నిర్గచ్ఛత్యా స్యమండలాత్***
***నవద్వారై రోమాభిశ్చ జనానాం తాలురంధ్రకే ।***
***పాపిష్ఠానామ పానేన జీవోనిష్క్రామతిధ్రువం ॥*** ***(ధర్మ...31/25-27)***

(దీని భావమిది వఱకే చెప్పబడింది)

ప్రాణవాయువెగిరి పోగానే మానవ శరీరం పిడుగుపాటుకి చెట్టులాగ కూలిపోతుంది. అంతట అందులోని పంచభూతాలూ పంచభూతాల్లో కలిసిపోతాయి. ఆత్మ (అలాగే వుండి

దాని) తత్త్వం మాత్రం శివునిలో కలిసిపోతుంది. సర్వవ్యాపియైన ఆత్మతత్త్వం సర్వ లయకారకుడైనవాడు కాబట్టి శివునిలో లీనమై పోతుంది.

ప్రతి మనిషిలోనూ జ్ఞానమనే రత్నముంటుంది. దాని నపహరించడానికి పంచేంద్రియాలూ కోరే విషయ వాంఛలూ కామక్రోధాలూ అనే దొంగలు కూడా ఆ మనిషిలోనే వుంటారు. వీరికి నాయకుడు మనసు. అహంకార, పుణ్య, పాప సంయుక్తమైన కాలము సంహారకమై మనిషిని కూల్చివేస్తుంది. అంతట మనిషి (ఆత్మ) తన కర్మల ప్రభావం వల్ల వేరొక శరీరంలోకి వెళ్ళవలసి వస్తుంది. పాత ఇల్లు కాలినా కూలినా వ్యక్తి కొత్త ఇంట్లోకి వెళ్ళినట్లు జీవుడు మరో శరీరాన్నాశ్రయిస్తాడు. శరీరంలో నుండే ధాతువులన్నీ మాతా పితల ప్రసాదాలే. త్వచ, రక్తం, మాంసం, కొవ్వు, మూలుగ, ఎముక అను ఆరు ధాతువులతో ఏర్పడి వుంటుంది కాబట్టి ఈ శరీరాన్ని 'షట్కౌశిక' మంటారు.

*(అధ్యాయం - 31)*

## జీవి ప్రాదుర్భావం - గర్భంలో దాని స్వరూపం - క్రమవృద్ధి - పంచతత్త్వాదుల ప్రవేశం- నేలపై బడగానే విష్ణుమాయ ★ఆతుర వ్యక్తికై క్రియమాణ కర్మ, దాని ఫలం - పిండ బ్రహ్మాండాల సమాన స్థితి

'ప్రభో! ఉద్భిజ, స్వేదజ, అండజ, జరాయుజ– ఈ నాలుగు ప్రకారాల ప్రాణులూ ఎలా పుడతాయి? త్వచ, రక్తం, మాంసం, మేద, మజ్జ, అస్థిలలోకి జీవం ఎలా వస్తుంది? రెండు కాళ్ళు, రెండు చేతులు, గుదము, నాలుక, వెంట్రుకలు, గోళ్ళు, తల, సంధిమార్గాలు, నానా ప్రకారాల రేఖలు - ఇవన్నీ ఎలా ఏర్పడతాయి? కామ, క్రోధ, భయ, లజ్జ, హర్ష, సుఖ, దుఃఖాది భావాలు మనసులోకి ఎలా వస్తాయి? ఈ శరీర చిత్రణ, ఛిద్రణ, వేష్టన ఎలా జరిగింది? హే హృషీకేశ ఇదంతా నాకేదో ఇంద్రజాలంలా కనిపిస్తోంది. ఇదంతా నాకు వివరంగా తెలియాలంటే మీరు తప్ప వేరే సాధనం నాకు లేదు. ఇంత అద్భుతమైన ప్రపంచానికి కర్త ఎవరు?' అడిగాడు గరుడుడు. చెప్పసాగాడు శ్రీ మహావిష్ణువు.

'వత్సా! దేనిని తెలుసుకుంటే వ్యక్తి సర్వజ్ఞుడవుతాడో దానినే చెప్తున్నాను విను.

స్త్రీలు ఋతుకాలంలో నెలకు నాలుగు రోజుల పాటు పరిత్యజింపబడతారు. ప్రాచీనకాలంలో బ్రహ్మ వృత్రాసురుని ఇంద్రుడు చంపినప్పటి బ్రహ్మహత్యా పాతకంలో

---

★*ఆతుర అనగా ఇక్కడ మరణాసన్నయని భావము.*

నాలుగవ భాగమును ఇంద్రుని శరీరం నుండి తీసి స్త్రీ జాతికి అంకితం చేశాడు. దాని వల్ల స్త్రీలు ఒక నాలుగు రోజుల పాటు అపవిత్రంగా వుండవలసిన అగత్యమేర్పడింది. ఆ పాపం వారి శరీరంలో నున్నంతకాలం పురుషుడు వారి ముఖం చూడరాదు. నాలుగవ రోజు శుద్ధి జరుగుతుంది. అప్పటి నుండి వారం రోజుల దాకా ఆమె దేవతలను, పితరులను పూజించడానికి యోగ్యతను కలిగియుంటుంది. ప్రథమ సప్తాహం మధ్యలో స్త్రీ గర్భం ఆగిపోతే దానిని మలిమ్లూచోత్పత్తి అంటారు. వీర్యస్థాపన సమయంలో తల్లిదండ్రుల ఆలోచనలు పవిత్రంగా వుంటేనే పవిత్రులు జనిస్తారు.

★యుగ్మతిథులున్న రాత్రులలో సంగమం జరిగితే కొడుకులూ, అయుగ్మరాత్రి సహవాసం వల్ల కూతుళ్ళూ పుడతారు. కాబట్టి కొడుకు పుట్టాలని కోరుకునేవారు ఋతుకాలంలో తొలివారాన్ని వదిలేసి రెండవ వారంలో యుగ్మతిథులున్న రాత్రులలో సంగమించాలి. సామాన్యంగా స్త్రీలలో ఋతుకాలం ఒక నెలలో పదహారు రాత్రుల పాటు కొనసాగుతుంది. పదునాలుగవ రాత్రి గర్భాదానక్రియ జరిగితే ఆ గర్భం నుండి గుణవంతుడూ, భాగ్యవంతుడూ, ధనవంతుడూ, ధర్మనిష్ఠుడూనగు కొడుకు పుడతాడు. ఋతుకాలంలో అయిదవ రోజున స్త్రీలు చేదు, ఘాటు, ఉప్పు, కారం, వేడి అధికంగా నున్న భోజనాన్ని చేయరాదు. మధుర భోజనాన్ని తినాలి. అలా చేస్తే ఆమె కడుపు ఔషధ పాత్రగానూ పురుష బీజం అమృతతుల్యంగానూ వుంటాయి. ఆ సమయంలో పురుషుడు క్రోధాన్ని త్యజించాలి. మధురభోజనం వల్ల స్త్రీ గర్భం మృదుస్వభావానికీ, శీతలతకీ, పన్నీటిజల్లు వంటి ప్రకృతికీ నెలవై వుంటుంది. ఆ రాత్రి పురుషుడు మధురమైన తాంబూలాన్ని సేవించి పూలమాలతో చందనచర్చతో సువాసితుడై స్వచ్ఛమైన సుందరమైన వస్త్రాలను ధరించి వుండాలి. తరువాత శుద్ధ మనస్కుడై మంచి ఆలోచనలతో శయ్యను చేరాలి. వీర్యం పడే సమయంలో ఎంత మంచి ఆలోచన (ఇద్దరికీ) వుంటే అంత మంచి స్వభావమున్న సంతానం కలుగుతారు. జీవం ప్రారంభంలో శుక్ర రక్త సంయోగం వల్ల

---

★*ఋతుకాలాభిగా మీస్యాత్ స్వదార నిరతః సదా ।*
*పర్వం వర్జం వ్రజే చ్ఛై నాం తద్వ్రతో రతి కామ్యయా ॥*
*ఋతుః స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః ।*
*చతుర్భిరితరైః సార్ధ మహోభిః సద్విగర్హితైః ॥*
*తాసామాద్యాశ్చతస్రస్తు నిందితై కాదశీ తథా ।*
*త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః ॥*
*యుగ్మాసు పుత్రాజాయంతే స్త్రియోఽ యుగ్మాసు రాత్రిషు ।*
*తస్మాద్ యుగ్మాసు పుత్రార్థీ సంవిశేదార్తవే స్త్రియం ॥*

పిండరూపంలో అస్తిత్వంలోకి వస్తుంది. ఆ పిండమే స్త్రీ గర్భమనెడి ఆకాశంలోశుక్ల పక్షచంద్రుని వలె దినదిన ప్రవర్ధమానమవుతుంది.

శుక్రంలో చైతన్యం బీజ రూపంలో వుంటుంది. చిత్తం కామావృతమై అది శుక్రంలో కదలి స్త్రీ గర్భాశయంలో ప్రవేశించి ఒక నిశ్చిత రూపాన్ని ధరించడానికి సిద్ధమవుతుంది. ఆ వేళలో రక్తం బలంగా వుంటే కూతురూ, శుక్రం (అంటే వీర్యమే) బలంగా వుంటే కొడుకూ పుడతారు. రెండూ బలంలో సమానం కాకూడదు. అలా వుంటే నపుంసకులు పుట్టే అవకాశముంది. శుక్రశోణి సంయోగం వల్ల నేర్పడిన పదార్థం ముందు కణ కేంద్రంగా కదిలి అయిదవ రోజుకల్లా ఒక బుడగంతయై పదునాల్గవ నాటికి మాంసపు ముద్దగా పరిణతి చెందుతుంది. తరువాత అది ఘనీభవిస్తూ క్రమంగా ఇరవైయవ రోజుకి పిండరూపాన్ని ధరిస్తుంది. మరొక అయిదు రోజులకు దానిలో శక్తీ, పుష్టతా కలిగి కదులుతుంటుంది. ఒక మాసం గడిచేసరికి దానిలో పంచతత్త్వాలు ప్రవేశిస్తాయి. రెండవ మాసంలో చర్మం, కొవ్వూ, మూడవ నెలలో మజ్జా, అస్థీ, నాలుగవ నెలలో కేశాలూ, వ్రేళ్ళూ, అయిదవ మాసంలో కన్నూ, ముక్కూ, వక్షస్థలం ఏర్పడతాయి. కంఠం, రంధ్రాలు, ఉదరం, ఆరవ మాసంలోనూ, గుహ్యాది భాగాలు ఏడవ నెలలోనూ నిర్మింపబడగా, ఎనిమిదవ మాసంలో ఆ ఒకనాటి పిండం సర్వాంగ ప్రత్యంగాలతో పరిపూర్ణ రూపాన్నొంది జనని గర్భంలోనే అటూ ఇటూ కదలుతుంటుంది. తొమ్మిదవ మాసంలో దానిలో ఓజోగుణమేర్పడి ఒక పరిపక్వత లభిస్తుంది. అప్పటి నుండి అది గర్భం నుండి బయటపడడానికి ప్రయత్నిస్తూనే వుంటుంది. చివరికి దేవుడు నిర్ణయించిన ముహూర్తంలో ఆడ శిశువుగానో మగబిడ్డగానో మూడవ ప్రకృతిగానో పృథ్విపై జన్మించడం జరుగుతుంది. అప్పటికి పదవ మాసం వచ్చి వుండవచ్చు. పదవ మాసంలోనే పాంచభౌతికమైన శరీర స్వరూపం అత్యంత స్పష్టమవుతుంది. (చాలమంది శిశువులు తొమ్మిదవ మాసంలోనే సంపూర్ణ స్పష్టత నొందియుంటారు) ప్రసవకాలీన వాయువులచే ఆకర్షింపబడి, తాత్కాలిక పీడచే వశము దప్పి, అప్పటికే తల్లి యొక్క సుషుమ్నా నాడి ద్వారా చేజిక్కిన శక్తి వల్ల బాగా బలపడి ఆ జీవి వీలైనంత వేగం బయటపడడానికి ప్రయాస పడుతుంటుంది. గర్భంలో పంచభూతాలు కావు, ఆరు భూతాలుంటాయి. పృథ్వి, జలం, హవి, భోక్త, వాయు, ఆకాశ– అనే ఈ ఆరు భూతాలూ గర్భస్థ శిశువును బయటికి పంపడానికి ప్రయత్నిస్తాయి. స్నాయుతంత్రికలచే బంధింపబడిన శిశువు వాటి ఒత్తిడి మధ్యనే కదులుతుంటుంది. విద్వాంసులు వీటినే మూలభూతతత్త్వాలుగా పేర్కొన్నారు. ఇవి శరీరమంతటా వ్యాపించిన సప్తనాడుల మధ్యలో వుంటాయి.

ఇక ఏ తత్త్వం కారణంగా ఏయే ద్రవ్యాలు, మనోవికారాలూ శరీరంలో చేరతాయో విను.

| | |
|---|---|
| **పృథ్వి** | చర్మం, ఎముక, నాడి, రోమం, మాంసం. |
| **జల** | లాల, మూత్రం, శుక్రం, మూలుగ, రక్తం |
| **తేజ** | ఆకలి, దప్పిక, నిద్ర, బద్ధకం, కాంతి |
| **వాయు** | రాగం, ద్వేషం, లజ్జ, భయం, మోహం |
| **ఆకాశ** | సత్యాసత్యవివేకం, శబ్దం, చింత, గాంభీర్యం, శ్రవణం |

అకుంచన, ధావన, లంఘన, ప్రసరణ, నిరోధములు కూడా వాయుతత్త్వ ప్రసాదాలే.

గరుడా! చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు – ఇవి జ్ఞానేంద్రియాలు. చేతులు, కాళ్ళు, మాట, గుద, గుహ్యేంద్రియాలు కర్మేంద్రియాలు. ఇడ, పింగళ, సుషుమ్న, గాంధారి, గజజిహ్వ, పూష, యశ, అలంబుష, కుహు, శంఖిని – ఈ పదీ దశనాడులు. నాడులు పిండమధ్యంలో వుంటాయి. ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ – అనే పదీ ప్రాణులలో నుండు వాయువులు. ప్రాణి తినే పదార్థమే దాని పుష్టికి కారణమవుతుంది. మానవులు తినే అన్నాన్ని ప్రాణవాయువే శరీరం లోపలికీ, దాని అన్ని సంధుల వద్దకూ చేరవేస్తుంది. భోజన రూపంలో గ్రహింపబడిన ఆహారం వాయువు ద్వారా రెండు భాగాలుగా విభజింపబడుతుంది. వాయువే అగ్నిని రగిల్చి అన్నాన్ని జీర్ణం చేసి శుష్క భాగాన్ని వేరు చేసి దానిని పన్నెండు మార్గాల ద్వారా (మలంగా) బయటికి పంపుతుంది. శరీరభాగాలైన చెవులు, కనులు, ముక్కు, నాలుక, పండ్లు, నాభి, గుద, గోళ్ళు – ఇవన్నీ – మలాశ్రయాలు. విష్ఠ, మూత్ర, శుక్ర, శోణిత రూపాలలో ఈ మలం అనేక రకాలుగా వుంటుంది.

కర్మానుసారమే మనిషికి సుఖ, దుఃఖాలూ, భయాలూ, శుభాలూ జరుగుతాయి, కలుగుతాయి. కర్మానుష్ఠానం జరిగేది శరీరం ద్వారానే కాబట్టి అది మనిషికి మిక్కిలి ముఖ్యమైనది. దీని ద్వారానే ఉత్తమగతులూ అధమగతులూ ప్రాప్తిస్తాయి. కాబట్టి శరీరోత్పత్తి ఎలా జరుగుతుందో తెలుసుకోవడం మంచిది. జీవిని గర్భం నుండి బయటకు వాయువు పంపించినపుడు దాని రెండు కాళ్ళూ పైకీ, ముఖం కిందికీ వుంటాయి. అప్పటికే అమ్మ దయ వల్ల దానికి ఎముకలతో సహా మొత్తం శరీరం కుదిరి వుంటుంది. దాని నాభి తల్లి యొక్క శక్తివర్ధని నాడితో కలుపబడి వుంటుంది. దీనిని 'ఆప్యాయని' అంటారు. స్త్రీ ఆంతఛిద్రానికది కూర్పబడి వుంటుంది. బయటికి రాకముందు ఆ శిశువుకి జ్ఞానం

ఎక్కువగానే వుంటుంది. విషయ స్మృతులన్నీ వుంటాయి. మరల మరొక జన్మనెత్త బోతున్నాననే విషయం తెలిసి దుఃఖం కూడా వుంటుంది. లోపల్లోపలే దెబ్బలూ తగులుతున్నా అవి బాధింపవుగాని ఏ పాపకర్మల వల్ల తాను ఎలాటి బాధలనుభవించిందో గుర్తుకొచ్చి పడే బాధ ఎక్కువగా వుంటుంది. తనకు తానుగా ఒక గట్టి నిశ్చయానికీ వస్తుంది. ఇలా 'ఈ జన్మలో నేను పాపమే చేయను. జన్మరాహిత్యానికే సర్వశక్తులనూ కేంద్రీకరించి ప్రయత్నిస్తాను' ఇలా ఎన్నో జన్మల పాపాలనో పుణ్యాలను కూడానో అనుభవించడానికి ప్రాజాపాత్య వాయు ప్రభావం వల్ల గర్భాశ్రయాన్ని వదలి తలో, కాళ్ళో ముందు పెట్టుకొని మర్త్యలోకంలో పడుతుంది జీవి.

అప్పుడు దానికి చాలా ఉక్రోషంగానూ దుఃఖంగానూ వుంటుంది. అందుకే గుక్క తిప్పుకోకుండా ఏడుస్తూ బయటికొస్తుంది. ఆ రావడంలోని శ్రమ వల్ల ఒక లిప్తకాలంబాటు తెలివి తప్పినట్లయినా వెంటనే బయటి వాయుస్పర్శ వల్ల చైతన్యము తిరిగి వస్తుంది. వాయు స్పర్శ దానికి సుఖానుభూతినిస్తుంది. అప్పుడు ఈ మొత్తం విశ్వాన్నే మోహితం చేసే విష్ణు మాయ దానిపై కూడా ప్రభావాన్ని చూపిస్తుంది. అది పూర్వజ్ఞానాన్ని కోల్పోతుంది.

నేలపై బడ్డ ప్రాణి పెరిగి పెద్దదై ముసలిదై మరణించడం సర్వసామాన్యం. దానికర్మ ఫలాల వల్ల నరకానికో స్వర్గానికో పోవడం జరుగుతుంది. అక్కడ కూడా పుణ్యపాపాలు పూర్తిగా తీరవు. వాటి కోసం మరల పృథ్విపైకి రావలసి వుంటుంది. ఈ మొత్తం జన్మల వ్యవహారంలో, జననమరణ చక్రంలో దుఃఖానిదే సింహభాగం కాబట్టి మనిషి ముక్తికై ప్రయత్నించాలి.

మృత్యువు బాగా దగ్గర పడిందని తెలిశాక ఆ వ్యక్తికి గోమూత్ర, గోమయ, తీర్థోదక, కుశోదకాలచే స్నానం చేయించాలి. తరువాత స్వచ్ఛ, పవిత్ర వస్త్రాన్ని కట్టి గోమయంతో అలికిన నేలపై కుశలనూ తిలలనూ పఱచి వాటిపై ఆ వ్యక్తిని పరుండబెట్టాలి. ఇక్కడ వాడేకుశలు దక్షిణాగ్రములై వుండాలి. వ్యక్తి తల తూర్పు వైపుగాని ఉత్తరం వైపు గాని వుండాలి. అతని (ఆమె) నోటిలో చిన్న బంగారం ముక్క నుంచాలి. తల వైపు దగ్గరగా భగవంతుని శాలగ్రామమూర్తినీ తులసి మొక్కనీ వుంచాలి. అనంతరం అక్కడే నేతి దీపాన్ని వెలిగించి పెట్టి ***ఓం నమో భగవతే వాసుదేవాయ*** అనే మంత్రాన్ని జపించాలి. హృషీకేశుడైన విష్ణుదేవుని బాగా పూజించాలి. వినయభావంతో స్తుతి పాఠాలను వల్లించాలి. బ్రాహ్మణులకు, దీనులకు మరణాసన్న వ్యక్తి పేరిట దానాలివ్వాలి. ప్రాణం పోతున్నపుడు వ్యక్తికి బాధ కలుగుతుంటుంది. అందుచేత పుత్రాది బంధుజనులంతా పురుష సూక్తాన్ని పెద్ద గొంతులతో పఠించాలి. దాని వల్ల ఆ వ్యక్తి బాధలు నశిస్తాయి.

ఈ సమస్త కర్మలకూ ఫలమేమిటో కూడా విను. స్నానం వల్ల శరీరం యొక్క అపవిత్రత దూరమవుతుంది. విష్ణు భగవన్నామస్మరణ వల్ల అన్ని ప్రకారాల ఉత్తమ ఫలాలూ కలుగుతాయి. కుశలూ, పత్రీ, ఆతుర వ్యక్తికి స్వర్గాన్నిప్పిస్తాయి. తిలలతో కుశలతో కలిపిన నీటి ద్వారా చేయించబడే 'ఆతుర స్నానం' అవభృథ స్నానమంత గొప్పది కాబట్టి ఆ వ్యక్తికి అంత పుణ్యమూ వస్తుంది. గోమయంతో అలికిన ఏ మండలంలోనైనా త్రిమూర్తులూ, లక్ష్మీదేవీ, అగ్నిదేవుడూ ముచ్చటపడి కూర్చుంటారు. వారీ కర్మకు ప్రసన్నులౌతారు. ఇక పంచరత్నాలు నోటిలో వేయడం నుండీ వచ్చే ఫలాలిలా వుంటాయి.

*పంచరత్నముఖే ముక్తే జీవే జ్ఞానం ప్రరోహతి ।*
*తులసీ బ్రాహ్మణాగావో విష్ణురేకాదశీ ఖగ ॥*
*పంచప్రవహణా న్యేవ భావాబ్ధౌ మజ్జతాం నృణాం ।*
*విష్ణురేకాదశీ గీతా తులసీ విప్రధేనవః ॥*
*అసారే దుర్గ సంసారే షట్పదీ భక్తిదాయినీ ।*
*నమో భగవతే వాసుదేవాయేతి జపేన్నరః ॥*

ఇవికాక పురుష సూక్త పఠనం వల్ల ఆతుర ప్రాణి మోహం నుండి విడివడి ముక్తివైపు కదలి వెళ్ళే మార్గం దొరుకుతుంది. బ్రాహ్మణులకూ, దీనులకూ, అనాథలకూ దానాలివ్వడం వల్ల ఆతుర ప్రాణి అనంతర దశల్లో ప్రసన్నుడౌతాడు.

గరుడా! నీకొక విషయం తెలుసా? ఈ బ్రహ్మాండంలో నున్న గుణాలన్నీ మానవ శరీరంలో వుంటాయి. ముందుగా లోకాలే తీసుకో. మనిషి పాదాలలో తల లోకం, పిక్కలలో వితల లోకం, మోకాళ్ళలో సుతల లోకం, సక్థిప్రదేశంలో మహాతలం, తొడల్లో తలాతలం, గుహ్యస్థానంలో రసాతలం, కటిలో పాతాళం, నాభి మధ్యంలో భూర్లోకం, దానికిపైన భువర్లోకం, గుండెలో స్వర్గలోకం, కంఠంలో మహర్లోకం, ముఖంలో జనలోకం, మస్తకంలో తపోలోకం, మహారంధ్రంలో సత్యలోకం వుంటాయి. మంచి మనిషిని సంతోషపెడితే ఇవన్నీ కూడా సంతోషిస్తాయి.

మనిషి శరీరంలోనే భారత జాతికి పరమ పవిత్రాలైన కులపర్వతాలూ మహాసాగరాలూ వున్నాయి. శరీర త్రికోణంలో మేరు, అధః కోణంలో మందర, దక్షిణంలో కైలాస, వామ భాగంలో హిమాలయ, దక్షిణ రేఖపై గంధమాదన, వామరేఖపై మలయ, ఊర్ధ్వ భాగంలో నిషధ పర్వతాలుండగా, అస్థిభాగంలో జంబూ, మజ్జలో శాక, మాంసంలో కుశ, శిరలలో క్రౌంచ, త్వచలోశాల్మలి, రోమసమూహంలో ప్లక్ష, గోళ్ళలో పుష్కర నామక

ద్వీపాలు నిలబడి వుంటాయి. మూత్రంలో క్షారోద, క్షారతత్త్వంలో క్షీర, శ్లేష్మంలో సురోదధి, మజ్జలో ఘృత, రసంలో రసోదధి, రక్తంలో దధి, కాకు మాంసలంలో స్వాదూదక సాగరాలు ప్రవహిస్తుంటాయి. శుక్రంలో గర్భోదక సాగరముంటుంది. ఇక గ్రహాలు కూడా వుంటాయి. నాదచక్రంలో సూర్యుడు, బిందు చక్రంలో చంద్రుడు, నేత్రాలలో మంగళుడు, గుండెలో బుధుడు, విష్ణు స్థానంలో గురుడు, శుక్రంలో శుక్రుడు, నాభి స్థానంలో శని, ముఖంలో రాహువు, పాయువులో కేతువు నెలకొని వుంటారు. కాబట్టి ఈ జన్మ దుర్లభం.

విశ్వరూపునిలో ఇవన్నీ ఉన్నాయి. దేవుడు మానవుని శరీరంలో వీటిని రేఖా మాత్రాలుగా ఉంచి మానవుడు మంచిగా బ్రతికి తనలోనే కలవాలని సూచించాడు. మనిషి తన పాపకర్మల కొద్దీ ఆయనకి దూరంగా పారిపోతుంటాడు. అతని పరుగు నరకంవైపే. జనన మరణ చక్రంలో గిరగిర తిరుగుతుండే ఈ సామాన్య మానవుల జీవిత విశేషాలూ, మృత్యువూ, మరుజన్మా ముందే నిశ్చితమై పోతూ వుంటాయి.

***ఆయుః కర్మచ విత్తంచ విద్యా నిధనమేవచ ॥***
***పంచైతాని హి సృజ్యంతే గర్భస్థస్యైవ దేహినః ॥*** ***(32/125,126)***

పక్షీంద్రా! ఉత్తమ ప్రకృతి గల వ్యక్తి తన సుకృతాల వల్ల మంచి భోగాలననుభవిస్తాడు. వాని జన్మం కూడా మంచి చోటనే కలుగుతుంది. కాని ఆ పాపకర్మలను చేస్తూ జన్మను దుర్వినియోగపఱచిననాడు అతడు మరుజన్మలో భగవంతునికీ సుఖానికీ కూడా దూరమై పోతాడు. మంచి జన్మ వచ్చినా సుఖ భోగాలకు దూరంగా భగవద్భక్తునిగా బతికినవాడు భగవంతునికి దగ్గరౌతూ క్రమంగా ఆయనలోనే కలసి పోతాడు.

***(అధ్యాయం -32)***

# యమరాజ చిత్రగుప్త భవనాల, స్వరూపాల వర్ణన

గరుడా! యమమార్గమెలా వుంటుందో విన్నావు కదా! దాని చివర దక్షిణ నైరృత దిశలో వివస్వత పుత్రుడైన యమరాజు పురి వుంటుంది. ఈ దివ్య నగరం సంపూర్ణ వజ్రమయం. దేవతలూ అసురులూ ఎవరూ దానిని భేదించలేరు. అనగా ఆయన ఆజ్ఞ లేనిదే ప్రవేశించలేరని భావము. చతురస్రాకారంలో నున్న ఆ నగరికి నాలుగు ద్వారాలూ, ఏడు ప్రాకారాలూ, తోరణాలూ ఉంటాయి. యమధర్మరాజు స్వయంగా తన దూతలతో అందులోనే నివసిస్తాడు. ఈ నగర విస్తారమొక వెయ్యి యోజనాలు. అన్ని ప్రకారాల రత్నాలతో పరివ్యాప్తమై, నిత్యం మెరుస్తుండే కాంచన కాంతులతో సూర్యసమాన కాంతులను

వెదజల్లే ఆ నగరిలో యమధర్మరాజు భవనం బంగారు కాంతులతో మెరసిపోతుంటుంది. అదొక అయిదు వందల యోజనాల్లో వ్యాపించి వుంది. వెయ్యి స్తంభాలపై నిలబెట్టబడిన ఆయన కొలువు వజ్రఖచిత, వైదూర్యసజ్జిత ఆసనాలతో అలంకరింపబడి వుంది. దాని గవాక్షమంతా ముత్యాల తాపడంతో అలరారుతుంటుంది. వందలకొద్దీ పతాకలు రెపరెపలాడుతూ వుంటాయి. వందల కొద్దీ ఘంటల ధ్వనులెల్ల వేళలా వినబడుతుంటాయి. తోరణ ద్వారాలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి. ఇంతేకాక అనేక అన్యాన్యా భూషణాలతో ఆ నగరం విలసిల్లుతుంటుంది. అందులో పది యోజనాల మేర నీల మేఘ సమాన శోభా సంపన్నమైన సమ, శుభ ఆసనంపై భగవంతుడైన యమధర్మరాజు స్థితుడై వుంటాడు. ఆయన ధర్మజ్ఞుడు, ధర్మశీలి, ధర్మయుక్తుడు, లోకకల్యాణకారి. ఆయన రూపము పాపులకు మాత్రమే భయంకరంగా వుంటుంది కాని ధర్మపరులకూ అక్కడి ఇతర జనులకూ చల్లగా అందంగా సుఖకరంగా వుంటుంది. అక్కడ శీతల మందవాయువు ప్రవహిస్తుంటుంది. అనేక రకాల ఉత్సవాలు జరుగుతుంటాయి. ధర్మసూక్ష్మాలకి సంబంధించి వ్యాఖ్యానాలు వినవస్తుంటాయి. మంగళకరంగా గంటలు మోగుతుంటాయి. ఇంతటి దివ్యమైన వాతావరణంలో నిత్యం ప్రాణుల మేలునే కోరుకొంటూ కొలువు దీరి వుంటాడు యమధర్మరాజు.

యమ నగరి మధ్యలో ఏబది యోజనాల విస్తీర్ణంలో చిత్రగుప్తుని భవనముంటుది. దాని యెత్తు పది యోజనాలు. దాని చుట్టూ ఇనుప పరిఖ నాలుగు వైపులా వుంటుంది. దాని మధ్య గొప్ప దివ్యభవనం ఆయన నివాసం. ఈ భవనానికి వందల సంఖ్యలో దారులున్నాయి. అవన్నీ పతాకలతో సుశోభితాలై వుంటాయి. కొన్ని వేల దీపాలు నిత్యం వెలుగుతుంటాయి– చిత్రగుప్తుని భవనంలో. ఈ సదనంలో నిత్యం గీతాల ఆలాపనలూ వాద్యయంత్రాల ధ్వనులూ, వాద్యయంత్రాల ఆలాపనలూ వినిపిస్తుంటాయి. ఈయన భవనంలో బ్రహ్మాండమైన అతిలోక రామణీయకంతో విలసిల్లే... చిత్రపటాలూ, కుడ్యచిత్రాలూ వుంటాయి. వీటి మధ్య ముత్యాలచే నిర్మితమై పరమ విస్మయకరమైన పనితనంతో చేయబడిన సింహాసనంపై ఆసీనుడై లోకబాంధవుడైన చిత్రగుప్తుడు మనుష్యుల, అన్య ప్రాణుల ఆయుగణనను చేస్తుంటాడు. ఆయనకు పుణ్యులపై మోహం కాని పాపులపై కోపం గాని వుండవు.

***(అధ్యాయం – 33)***

# శయ్యాదాన మహిమ

గరుడా! సత్యయుగంలో తపస్సూ, త్రేతాయుగంలో జ్ఞానార్జన, ద్వాపరంలో యజ్ఞాలూ, కలియుగంలో దానాలూ, జీవులకు తరుణోపాయాలని వినియున్నావు కదా! శ్రాద్ధకర్మకు సంబంధించి అన్ని దానాలపై నీకవగాహన వుంది. ఇపుడు శయ్యాదాన మహిమను వినిపిస్తాను.

శ్రేష్ఠ బ్రాహ్మణులు సర్వదా శయ్యా దానాన్ని ప్రశంసిస్తుంటారు. ఈ జీవితం అనిత్యం. మృత్యువు కబళించిన అనంతరం జీవనాన్ని గాని మరి దేనిని గాని ఎవరిస్తారు? మనిషి మరణించగానే వాని బంధుమిత్రాదులు బలవంతం మీద మనసును మళ్ళించుకుని వానికి అన్ని విధాల దూరమై పోతారు. కాబట్టి ఆత్మ ఒక్కటే మనిషికి నిత్యబంధువు. ఎందుకంటే ఒక జన్మలోని బంధువుల బంధాలన్నీ ఆ జన్మతోనే సరి. ఆత్మబంధం అలా కాదు కదా! కాబట్టి ఈ ఆత్మ సుఖపడాలంటే మనిషి తాను బతికుండగానే వీలైనంతమందికి చేయగలిగినన్ని దానాలు చెయ్యాలి. వాటిలో ముఖ్యమైనది శయ్యాదానము. మంచిదైన గట్టిదైన కర్రతో నొక సుందరమైన మంచాన్ని నిర్మించి స్తోమతు వుంటే ఏనుగుదంతాలతో బంగారు గొలుసులతో లేకుంటే ఇనుముతో దానినలంకరించి దానిపై లక్ష్మీసహితుడైన శ్రీ మహావిష్ణువు స్వర్ణప్రతిమను స్థాపించాలి. తరువాత ఆ శయ్యకు దగ్గరగా నేతితో నింపిన కలశనుంచాలి. ఆ కలశ మృతవ్యక్తినీ పుత్రునీ సుఖపెడుతుంది. విద్వాంసులు దీనినే 'నిద్రా కలశ' అన్నారు. తాంబూలం, కేసరి, కుంకం, కర్పూరం, అగరు, చందనం, దీపం, పాదుకలు గొడుగు, చామరం, ఆసనం, పాత్రలు, సప్తధాన్యాలు – వీటిని శయ్యకు దగ్గరలో నుంచాలి. వెండి లేదా బంగారపు కొమ్ము చెంబునూ, కమండలువునూ, అద్దాన్నీ, పంచరంగుల చాందనినీ శయ్యకు జతపఱచి బ్రాహ్మణునికి దానమివ్వాలి. ముందుగా ఆ బ్రాహ్మణ దంపతులను పూజించి, మంచి ఇంటిని వస్తువులతో సహా ఇచ్చి అప్పుడు శయ్యాదానం గావించాలి. చివరగా పంచరత్న, ఫల, అక్షత సమన్వితమైన అర్ఘ్యాన్ని ఆ బ్రాహ్మణుని కర్పించి ఇలా ప్రార్థించాలి :

*యథాన కృష్ణశయనం శూన్యం సాగర కన్యయా ।*
*శయ్యా మమాప్యశూన్యాస్తు తథాజన్మని జన్మని ॥* **(ధర్మ...34/81)**

తరువాత క్షమాపణ వేడుకొని ఆ బ్రాహ్మణ దంపతులను సాదరంగా వీడ్కొల్పాలి. ఇది ఏకాదశాహ సంస్కారంలో ముఖ్యమైన శయ్యాదానవిధి. గరుడా! బంధువు మృతి

చెందినపుడు అతని శయ్యని కూడా దానం చేసి వేయాలి. ఇది చాలా ముఖ్యమైన విషయం. దీనిని మృతశయ్య అంటారు. దానిపై విష్ణుదేవుని స్వర్ణ ప్రతిమనూ మృత వ్యక్తి మిక్కిలి ఇష్టంతో వాడుకున్న అన్ని వస్తువులనూ పెట్టి పైన చెప్పిన విధంగా ఇతర ద్రవ్యాలతో సహా విద్వాంసుడైన బ్రాహ్మణునికి దానం చెయ్యాలి.

ఈ శయ్యాదానం వల్ల కలిగే సుఖం యమరాజు, దేవేంద్రుల గృహాలకు ఆ మృతవ్యక్తి సాదరంగా ఆహ్వానింపబడినపుడు తెలుస్తుంది. యమదూతలుగాని యమధర్మరాజుగాని ఆ వ్యక్తికి భయంకరంగా కనిపించరు. పుణ్యపాపాలను లెక్కవేసినపుడు ఈ శయ్యాదానం పరిగణనలోకిని తీసుకొనబడుతుంది. పేదవాడు వెండి బంగారాల ప్రసక్తే లేకుండా వాని తండ్రి శయనించిన నులక మంచాన్ని దానం చేసినా సంపూర్ణ శయ్యాదాన ఫలం తండ్రీ కొడుకులిద్దరికీ దక్కుతుంది.

స్త్రీ మృతి చెందినపుడు శయ్యపై స్వర్ణ ప్రేత (ఆ స్త్రీ పోలికలతో) ప్రతిమనుంచాలి. ఆమె ధరించిన ఆభరణాలన్నింటిని దానిపై ఉంచాలి. వస్త్రాలను, ఆమె ఇష్టపడి వాడిన వస్తువులను కూడా ఉంచి, లోకపాలురను, ఇంద్రాది దేవగణాలనూ, సూర్యాది గ్రహాలను, గౌరీ దేవినీ, గణేశునీ పూజించాలి. తరువాత తెల్లబట్టలను కట్టుకొని గృహస్థుడైన ఆచార్య దేవునికి నమస్కరించి ఈ క్రింది మంత్ర శ్లోకాన్నుచ్చరించాలి :

*ప్రేతస్య ప్రతిమాహ్యేషా సర్వోపకరణైర్యుతా ।*
*సర్వరత్న సమాయుక్తా తవ విప్ర నివేదితా ॥*
*ఆత్మాశంభుః శివాగౌరీ శక్రః సురగణైః సహ ।*
*తస్మాచ్ఛయ్యా ప్రదానేన సైష ఆత్మా ప్రసీదతు ॥* *(ధర్మ...34/96,97)*

బ్రాహ్మణుడా దానాన్ని గ్రహిస్తూ **కో ఉదాత...** అనే మంత్రాన్ని చదవాలి. తరువాత దాత ఆయనకు ప్రదక్షిణ చేసి నమస్కరించి సాదరంగా వీడ్కొల్పాలి.

గరుడా! ఒక శయ్యను ఒక బ్రాహ్మణునికే దానం చేయాలి. గోవు, శయ్య, గృహం, స్త్రీ– ఒకదానినొక్కరికే దానం చేయాలి. అనేకులకు దానమీయడం పాపం.

శయ్యాదానం వల్ల గొప్పఫలితాలుంటాయి. దాతకి నూరు దివ్య వత్సరాల స్వర్గనివాస ప్రాప్తి లభిస్తుంది. వ్యతిపాత యోగ, కార్తిక పూర్ణిమ తిథులలో గాని, మకర, కర్కాటక సంక్రాంతి నాడుగాని, సూర్యచంద్ర గ్రహణాలందుగాని చేసే దానానికి మరింత అధిక ఫలముంటుంది. అలాగే ద్వారక, ప్రయాగ, గంగ, యమున, సింధు నదీ సాగర సంగమ

స్థలాలు, కురుక్షేత్ర, నైమిషారణ్య, అర్బుద పర్వతం వంటి పుణ్యస్థలాలలో చేసే దానాలకూ అద్భుత ఫలాలుంటాయి. స్వర్గలోక నివాసానంతరం పుడమిపై పుట్టినపుడా దాత తాను మృతి చెందిన చోటనే సుందరస్వరూపుడు, మహాధనికుడు, ధర్మజ్ఞుడు, సర్వశాస్త్రజ్ఞాతయునై జన్మిస్తాడు. ఈ జన్మాంతమున నాతనికి వైకుంఠ నివాసప్రాప్తి వుంటుంది. ఆ తరువాత పితృలోకంలో శాశ్వతంగా నివసిస్తాడు. *(అధ్యాయం -34)*

# సపిండీకరణ శ్రాద్ధంలో ప్రేతపిండాన్ని కలిపే పద్ధతి - పితర ప్రసన్నత - ఫలితం, పంచకమరణం - శాంతి విధానం, ప్రేత శ్రాద్ధంలో త్యజించవలసిన 18 పదార్థాలు, మూడు షోడశులు, శవయాత్ర

గరుడా! తల్లిపోయి ఆమె పైతరాల వారిద్దరూ బతికే వుంటే, అలాగే తండ్రి పోయి తాత, ముత్తాతలిద్దరూ వుంటే సపిండమెలా పెట్టాలి - అని అడిగావు కదా! విను. ఇట్టి (అ) సందర్భాలలో పుత్రుడు తన తల్లికి పెట్టే పిండాన్ని ఉమా, లక్ష్మీ, సరస్వతీ దేవులతో కలిపి పెట్టాలి. ఈ సంసారంలో ముగ్గురు పురుషులు పిండభోగులైతే ముగ్గురు త్యాజకులు, ముగ్గురు పిండాను లేపకులు, పదవవాడు పంక్తి సన్నిధుడు. యజమాని (అంటే యజ్ఞం చేసేవాడు లేదా శ్రాద్ధకర్మను చేయువాడు) తనకు ముందలి పదిమంది పురుషులనూ తన తరువాతి పది తరాల పురుషులనూ ఉద్ధరించగలడు. మొదట చెప్పబడిన ముగ్గురు పురుషులూ - అనగా తండ్రీ తాతా ముత్తాతా సపిండీకరణం చేయగానే సపిండులుగా భావింపబడతారు. ముత్తాత తండ్రిని వృద్ధప్రపితామహుడంటారు. ఆయనా ఆయన తండ్రి తాతలూ 'త్యాజక' రూపంలో స్వీకరింపబడతారు. ఆపై ముప్పురినీ లేపకులంటారు. ఆపై పంక్తి సన్నిధుడుంటాడు.

ఈ పితరులు ప్రసన్నులైతే ఏమివ్వగలరో చెప్తాను. విను. పుత్రుని శ్రాద్ధకర్మ ద్వారా ఆనందించిన తండ్రి వానికి సత్సంతానమును ప్రసాదిస్తాడు. వంశపరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. దానిని పితామహుడు చూసుకోగలడు. ★శ్రాద్ధకర్త యొక్క ప్రపితామహుడు స్వర్ణదాత కాగలడు. వృద్ధ ప్రపితామహుడు అన్నవృద్ధినందించగలడు.

ధనిష్ఠ నుండి రేవతి దాకా గల నక్షత్రాలకు అశుభ నక్షత్రాలుగా కొన్ని సందర్భాలలో పరిగణన వుంది. రేవతి దాటే దాకా దహనం చేయకూడదంటారు. కాని మృతశరీరాన్ని

---

★*ఆయన శ్రాద్ధకర్త యొక్క గో సంపదను వృద్ధి చేస్తాడని చెప్పబడింది.*

అన్నాళ్ళు సంరక్షించడం సామాన్యుల వల అయ్యే పని కాదు. కాబట్టి ఈ నక్షత్రకాలాలలో మృతి చెందినవారినుద్దేశించి కొంత శాంతి కార్యాన్ని చేసి అప్పుడు శవానికి దహనాది అంత్యక్రియలు నిర్వహించాలి.

ధనిష్ఠా పంచకాలలో మృతి చెందిన వారికి సద్గతి కలగాలన్నా కర్మ చేసిన వారికి అరిష్టం తొలగాలన్నా విప్రులకు మృతవ్యక్తి నుద్దేశించి నువ్వులు, గోవు, బంగారం, నెయ్యిలను యథాశక్తి దానం చెయ్యాలి. దీని వల్ల అన్ని ఉపద్రవాలూ తొలగిపోతాయి. అశౌచం సమాప్తం కాగానే మృతప్రాణికి సద్గతి లభిస్తుంది. పాత్ర, పాదుక, ఛత్ర, స్వర్ణ–ముద్ర, వస్త్ర, దక్షిణలను బ్రాహ్మణులకు ఈ సందర్భంలో దానం చేస్తే పైన తండ్రీ, క్రింద కొడుకులూ కూడా అన్ని విధాలా ఉద్ధరింపబడతారు. ఈ విధంగా ధనిష్ఠా పంచకాలకు శాంతి, ప్రాయశ్చిత్తాలను చేయకపోతే నష్టం జరుగుతుంది.

ప్రేతశ్రాద్ధంలో ఈ క్రింది పదునెనిమిదీ ఉండకూడదు. అవి ఆశీర్వాదం, ద్విగుణకుశ, అగ్నౌకరణ, ఓంకారం, ఒకటి కన్న నెక్కువ పిండాలు, ఉచ్ఛిష్ట శ్రాద్ధం, వైశ్వదేవర్చాన, వికిరదానం, స్వధా ఉచ్చారణ, పితృశబ్దోచ్చారణ, 'అను' శబ్ద ప్రయోగము, ఆవాహన, ఉల్ముఖం, ఆసీమాంతగమనం, విసర్జన, ప్రదక్షిణ, తిలహోమం, పూర్ణాహుతి, బలివైశ్వదేవం.

ఇక షోడశులు. ప్రథమ షోడశిని మలిన షోడశి అంటారు. దీనిని మృత్యు స్థానం, ద్వారం, సగందారి, చితి, శవం చేతిలో, ఆరవ శ్రాద్ధం అస్థి సంచయ కాలంలో జరగాలి. తరువాత పది రోజుల పాటు ఒక్కొక్క పిండంతో చేసేవి కూడ మలిన శ్రాద్ధాలే అవుతాయి.

ద్వితీయ షోడశి మధ్యమషోడశి అనబడుతుంది. ఇందులో మొదట పద్ధతిగా పదకొండు శ్రాద్ధాలను పెట్టాలి. తరువాత బ్రహ్మ, విష్ణు, శివ, యమ, తత్పురుషుల పేరిట అయిదు శ్రాద్ధాలను పెట్టాలి. వీటి తరువాత నెలకొక్కటి చొప్పున్న పన్నెండు, అవి కాక పదకొండవ మాసంలో ఊనాబ్దిక, త్రిపాక్షిక, ఊనమాసిక, ఊనషాణ్మాసిక శ్రాద్ధాలను పెట్టాలి. శవశోధన కోసం ఆద్యశ్రాద్ధాన్నీ అన్య త్రిషోడశ శ్రాద్ధకర్మలనూ చేసి వీటన్నిటినీ పితృపంక్తి విశుద్ధి కోసం చేసే యాభయ్యవ శ్రాద్ధంతో కలపాలి. అపుడే మృతులు పితృపంక్తిలో కలిసే యోగ్యతను పొందుతారు. ఇదే పంక్తి సన్నిధి.

శవయాత్ర ప్రారంభానికి ముందే తయారు చేయించిన పాడెకు శవం కాలు సేతులను కట్టి వెయ్యాలి. దానికి ముందే రెండు కాళ్ళ బొటన వ్రేళ్ళను కట్టి వుంచాలి. ఇలా చేయకపోతే వాటిని పిశాచాలు పట్టుకుంటాయి. శవాన్నెప్పుడూ ఒంటరిగా వుంచరాదు. అలా వుంచితే దుష్టయోని ప్రమాదముంటుంది. గ్రామమధ్యంలో

శవమున్నపుడు భోజనం చేయరాదు. అలా చేస్తే అన్న జలాలకు బదులు మాంసరక్తాలను తిన్న పాపం వస్తుంది. అలాగే శవయాత్ర గ్రామమధ్యంలోకి వచ్చియున్నపుడు తాంబూల సేవనం, దంత ధావనం, భోజనం, స్త్రీ సహవాసం, పిండదానం చేయరాదు. అలాగే ఆ సమయంలో స్నానం, దానం, జపం, హోమం, తర్పణం, దేవపూజనం చేసినా వ్యర్థాలై పోతాయి.

*(అధ్యాయం - 35)*

# తీర్థమరణ అనశనవ్రతాల మాహాత్మ్యము

'పరాత్పరా! అనశన వ్రతం చాలా గొప్పదని విన్నాను గాని అదేమో తెలియలేదు. అలాగే కొంతమంది తీర్థములలో మరణిద్దామనుకుంటారెందుకని? దయచేసి నాకివి చెప్పండి'

అడిగాడు గరుడుడు. చెప్పసాగాడు విష్ణువు. 'తార్క్ష్యా! మృత్యువు రోజుల్లో కొచ్చేసిందని అర్థం చేసుకున్న జ్ఞానులు కొందరు మూడు నాలుగు రోజులలో పోతామనగా అన్న జలాలను విసర్జించి దైవచింతనలోనే గడుపుతూ దైవంలో కలిసిపోతారు. ఇది ఆత్మహత్య ఏ మాత్రమూ కాదు. ఇదే అనశన వ్రతం. ఈ విధంగా ప్రాణత్యాగం చేసినవాడు మృత్యువు దరిజేరగనే వచ్చి నాతో సమానుడైపోతాడు. అతడెన్ని రోజులు అనశనవ్రతం చేస్తాడో అన్ని శ్రేష్ఠ యజ్ఞాలను సమగ్రంగా సంపూర్ణంగా సంపన్నం చేసిన ఫలాన్ని పొందుతాడు. సన్యాసధర్మాన్ని స్వీకరించి ఏ పుణ్యతీర్థంలోనో స్వగృహంలోనో ప్రాణత్యాగం చేస్తే ఇందాక చెప్పిన యజ్ఞఫలానికి రెట్టింపు పుణ్యాన్ని సంపాదించుకోగలడు. మహాభయంకర రోగంతో బాధపడుతూ మృత్యువిక రోజుల్లో వుందని తెలియగానే నన్నే ధ్యానిస్తూ అనశన వ్రతం ద్వారా ప్రాణత్యాగం చేసిన వానికి ఉత్తమ జన్మ ప్రాప్తిస్తుంది. ఇక ఆ జన్మలో ఏ రోగమూ అంటదు. దేవతుల్యుడై సుశోభితుడై జీవిస్తాడు. రోగగ్రస్తుడైనా సన్యాసాన్ని స్వీకరించి ఆ నియమాలన్నీ పాటిస్తూ అనశన వ్రతం చేసినవానికి పునర్జన్మ వుండదు. తాను అనశనవ్రతం చేస్తూ ప్రతి దినం సద్బ్రాహ్మణులకు భోజనాలు పెట్టి తిల-పాత్రలనూ దీపాలనూ దానం చేస్తూ దేవపూజన కర్మలను కూడా గావించిన వాడు మృతి చెందిన వెంటనే అన్ని లోకాలలోనూ మహర్షులు పొందిన గౌరవాన్ని పొందుతూ నివసిస్తూ చివరికి ముక్తినొందుతాడు. కాబట్టి అనశనవ్రతం వైకుంఠ ప్రదాయకమే.

పుత్ర, ధన, వైభవాది ఇహ లోక బంధాలన్నిటినీ త్యజించి తీర్థయాత్రలకై తిరుగులేని ప్రయాణం మొదలెట్టిన వానికి బ్రహ్మానందభరితులై బ్రహ్మాది దేవతలు తుష్టి పుష్టి ప్రదాయకులై పోతారు. యాత్రలో కూడా అనశనవ్రతం చేస్తూ దారిలోనే మృతి చెందినవారు సప్తర్షిమండలంలో శాశ్వత నివాసాన్ని పొందుతారు. అనశన వ్రతం చేస్తూ విష్ణు పాదోదకం మాత్రమే తాగిన వానికి పునర్జన్మ వుండదు. తీర్థయాత్రను చేయకుండానే మధ్యదారిలోనే మరణించిన అనశనవ్రతికి దగ్గరగా రావడానికి యమదూతలు ఇష్టపడరు. దూరంగా నిలబడి ఆ ప్రశాంతాత్మ రమ్మన్నాక వచ్చి తీసికెళతారు. అనశన వ్రతం చేయకుండా, కొంత వయసు పైబడ్డాక అన్నీ వదిలేసి తీర్థంలో నివసించి మృతి చెంది వారికి అద్భుత ఫలాలుంటాయని విన్నావు కదా! పుణ్య తీర్థ నివాసి ఏదైనా పనిమీద పక్క వూరెళ్ళి దారిలో చనిపోయినా అతనికి పుణ్యతీర్థ నివాస, మరణ పుణ్యాలు దక్కుతాయి. మరల పుడమిపై పుట్టినపుడు ఉత్తమ దేశంలో ధనమూ, విద్యా పుష్కలంగా నున్న బ్రాహ్మణ కుటుంబంలో జనించి గొప్ప విద్వాంసుడూ, వేదజ్ఞుడూనైన పండితుడవుతాడు. అనశన వ్రతమెన్నాళ్ళు చేసినా చావురానివారు క్షేత్ర తీర్థాలలోనే వుండిపోయి చాంద్రాయణ వ్రతం చేయవచ్చును.

వారు ఇంటికి మరలి వచ్చి బ్రాహ్మణుల ఆజ్ఞను పొంది ప్రాయశ్చిత్తమును చేసుకోవచ్చును. స్వర్ణ, గో, భూ, గజ, అశ్వ దానాలిచ్చి మామూలుగా జీవితాన్ని గడుప వచ్చును.

దాన మహిమను గూర్చి మరొక్క విశేషముంది. తండ్రినుద్దేశించి దానమిచ్చిన వానికి మామూలు దానానికి వందరెట్లు పుణ్యం వస్తుంది. అదే తల్లి, సోదరి, సోదరుడుల నిమిత్తం చేస్తే వేయి, పదివేలు, లక్ష రెట్ల పుణ్యం వస్తుంది. కష్టార్జితమే అయినా అత్యంత చంచలం కూడానైన ధనానికి ఏకైక పరమార్థం దానం.

ధర్మరక్షణ కోసం చేసే ప్రాణత్యాగం అన్నిటికన్న గొప్పది. ధర్మకోసం నీట మునిగి ప్రాణత్యాగం చేసినవాడు ఏడువేల సంవత్సరాల పాటు స్వర్గంలో నివసించగలడు. అదే అగ్నిలో, వాయు వేగంలో, యుద్ధభూమిలో ధర్మ రక్షణ కోసం ప్రాణత్యాగం చేసిన వారికి క్రమంగా పదకొండు, పదహారు, అరవై వేల సంవత్సరాల పాటు స్వర్గనివాస ప్రాప్తి వుంటుంది. గోరక్షకై ప్రాణాలర్పించిన వారికి ఎనభై వేల సంవత్సరాల పాటు స్వర్గలోక నివాసప్రాప్తి వుంటుంది. నిరాహారవ్రతమైతే అక్షయగతి. ***(అధ్యాయం - 36)***

# ఔర్ధ్వ దైహిక కర్మలో ఉదకుంభదాన మాహాత్మ్యము

గరుడా! అన్నంతో జలంతో నింపిన కుండలను ప్రేతాన్నుద్దేశించి దానం చెయ్యాలి. ఇది విశేషించి ప్రేతానికి ముక్తిదాయకం. పన్నెండవ రోజు, ఆరవ నెల, త్రిపక్ష, వార్షిక శ్రాద్ధ దినాల్లో, ముఖ్యంగా, జీవియొక్క యమమార్గ యానంలో సుఖాన్ని ప్రదానం చేయడానికి ఉదకుంభాన్నివ్వాలి. పేడతో బాగా అలికిన భూమి మీద ప్రతిరోజూ తిలలతో లేదా పక్వాన్నంతో, నీటితో నిండిన కుండల నుంచి దానం చెయ్యాలి. అదే స్థానంలో ప్రేతానికుద్దేశించిన పాత్రను కూడా పెట్టి దానం చెయ్యాలి. దీని వల్ల ప్రేతానికి ముక్తి కలిగి యమలోకానికి పోతుంది.

పన్నెండవ రోజు ప్రేతానికి సంస్కారం చేసేటపుడు గావించు జలకుంభదానం విశిష్టమైనది. యజమాని ఆ రోజు సంకల్ప పూర్వకంగా పన్నెండు నీటికుండలను దానం చెయ్యాలి. అదే రోజు పక్వాన్నం, ఫలాలతో నింపిన 'వర్ధని' అను ప్రత్యేక జలపాత్రను విష్ణుభగవానునికని సంకల్పించి సుయోగ్యుడు సచ్చరిత్రుడునగు బ్రాహ్మణునికి దానమివ్వాలి. తరువాత మరొక వర్ధనినీ, పక్వాన్నాన్నీ యమధర్మరాజుకి నివేదించాలి. ఆయన సంతుష్టుడై ప్రేతానికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. అదే వేళలో చిత్రగుప్తునికి కూడా ఒక వర్ధనిని దానమివ్వాలి.

యజమాని తన తండ్రి పరలోక సుఖాన్ని కాంక్షిస్తూ చిక్కుడు గింజలతో నీటితో నింపిన పదహారు కుండలను దానం చెయ్యాలి. దీని విధానమేంటంటే ఉత్క్రాంతి శ్రాద్ధం నుండి షోడశి దాకా పదహారుగురు బ్రాహ్మణులకు ఒక్కొక్కరికొక్కటి చొప్పున ఇవ్వాలి. మరొక ఉత్తమ ఘటాదానం కూడా వుంది. జలపూర్ణ పాత్రనూ పక్వాన్న పూర్ణమైన పెద్ద కుండనూ నిత్యం దానం చేస్తూ వాటి ప్రక్కనే ఒక కలశను పెట్టి దానిపై వెదురు పాత్రలో మృష్టాన్నము నుంచి పితృదేవతలను ఆహ్వానించి ఆ వర్ధనిని అగరు కుంకు మాదులతో పూజించాలి. తరువాత దానిపై తెల్లటి వస్త్రమును కప్పి మొత్తం వర్ధనిని విధ్యుక్తంగా వైదిక ధర్మాచరణపరుడైన పరమపుణ్యశీలియైన బ్రాహ్మణునికి రోజుకొకటిగా ఇవ్వాలి. ఆయన ఈ దాన ప్రభావం వల్ల తానూ ఉద్ధరింపబడతాడు. యజమానినీ ఉద్ధరింపగలడు.'

***(అధ్యాయం - 37)***

# తీర్థమరణం, తత్సమయ భగవన్నామ మహిమ, శాలగ్రామ, తులసుల సన్నిధిలో మరణఫలం ముక్తిదాయక, స్వర్గదాయక ప్రశస్త కర్మలు, ఇష్టాపూర్త, ప్రేత సంస్కార, కర్మల మాహాత్మ్యం

'హే జగన్నాథా! ఏ యే దానాల వల్లా తీర్థసేవనాల వల్లా మోక్షంగాని చిరకాల స్వర్గవాసం గాని లభిస్తాయి? సత్య, తేజో లోకాలే పుణ్యానికి ఫలాలు? ఎక్కడ మరణిస్తే ప్రాణికి స్వర్గం లేదా మోక్షం అబ్బుతుంది?' అని అడిగాడు గరుత్మంతుడు. దానికి మహా విష్ణువిలా చెప్పసాగాడు.

'గరుడా! భారతదేశంలో మానవయోని పదమూడు జాతులుగా వుంది. ఏ జాతివాడైనా మానవుడైతే చాలు, తీర్థయాత్ర చేయవచ్చు.

***అయోధ్యా మథురామాయా కాశీకాంచీ అవంతికా ॥***
***పురీ ద్వారవతీ జ్ఞేయా సప్తైతా మోక్షదాయికాః ।*** ***(ధర్మ...38/5,6)***

ఈ సప్తపురాలూ మోక్షదాయకాలే. అదికాక, మనిషి తాను పోతున్నానని తెలిసినప్పుడు తన ప్రాణం తన గొంతులోనే కొట్టాడుతున్నపుడు" నేను సర్వసంగపరిత్యాగం చేస్తున్నాను. నేను సన్యాసిని' అని గట్టిగా అనగలిగినా, అనుకున్నా... వెంటనే ప్రాణం పోతే, ఆ మనిషి విష్ణులోకానికి వెళతాడు. ఆతనికిక పునర్జన్మ వుండదు.

మృత్యువేళలో 'హరి' యను రెండక్షరాలను ఒక్కసారి పలికి నా మోక్షప్రాప్తి వుంటుంది. ప్రతి దినమూ 'కృష్ణ కృష్ణ కృష్ణ' అంటూ నన్ను తలచుకొనే వానిని నీటిలోంచి కమలాన్ని పైకి తీసినట్టు నేనే స్వయంగా నరకంలోంచి పైకి తీసుకొస్తాను. శాలగ్రామ శిలగాని ద్వారవతీ శిలగాని రెండూ కలిపిగాని వున్న చోట మోక్షప్రాప్తి కన్ని అవకాశాలూ వుంటాయి. శాలగ్రామ శిల గల చోట యజమాని ప్రాణం పోతే ఆయనకి మోక్షం వస్తుంది.

***మృతో విష్ణు పురంయాతి నపునర్జాయతే క్షితౌ ।***
***సకృదుచ్చరితం యేన హరి రిత్య క్షర ద్వయం ॥***
***బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ।***
***కృష్ణ కృష్ణేతి కృష్ణేతి యోమాం స్మరతి నిత్యశః ॥***
***జలం భిత్త్వా యథా పద్మం నరకాదుద్ధరామ్యహం ।***
***శాలగ్రామ శిలాయత్ర యత్ర ద్వారవతీ శిలా ॥***
***ఉభయోః సంగమోయత్ర ముక్తిస్తత్ర న సంశయః ।***

*శాలగ్రామ శిలా యత్ర పాపదోషక్షయావహా ॥*
*తత్సన్నిధాన మరణాన్ముక్తిర్జంతోః సునిశ్చితా ।* **(ధర్మ...38/7-11)**

గరుడా! తులసికున్న ప్రాశస్త్యం, పావిత్ర్యం మరే మొక్కకీ వుండవు. తులసి మొక్కను నాటి, దాని పాలన పోషణలను చూసి, నీటితో తడిపి, ధ్యానం స్పర్శ-గుణ గానాలను గావించే మనుష్యులకు పూర్వజన్మల సంచిత పాపాలన్నీ దగ్ధమైపోతాయి.

*రోపణాత్ పాలనాత్ సే కాద్ధ్యాన స్పర్శన కీర్తనాత్ ।*
*తులసీ దహతే పాపం నృణాం జన్మార్జితం ఖగ ॥* **(ధర్మ... 38/11)**

మానసతీర్థావగాహనం చేసిన వారికిక ఏ పాపాలూ అంటవు.

నిజానికి దేవతలు కఱ్ఱల్లోనో రాళ్ళలోనో వుంటారనుకుంటారు గానీ వారుండేది మనిషి మనసులో, భావనలో. మనిషి ఆ వస్తువును ఆ దేవునిగా భావించి పూజించినపుడా దేవుడా వస్తువులోకి వచ్చి పూజలందుకుంటాడు.

*జ్ఞానహ్రదే సత్యజలే రాగద్వేషమలాపహే ।*
*యః స్నాతో మానసే తీర్థేన స లిప్యేత పాతకైః ॥*
*న కాష్ఠే విద్యతే దేవో న శిలాయాం కదాచన ।*
*భావేహి విద్యతే దేవస్తస్మాద్భావం సమాచరేత్ ॥* **(ధర్మ...38/12,13)**

చేపలు పట్టేవాడు రోజూ పొద్దున్నే గంగా లేదా నర్మదా లేదా ఇతర పుణ్యనదీ దర్శనం చేస్తాడు. అంత మాత్రాన అతడు తీర్థసేవన ఫలాన్ని పొందలేడు. అతడు వెళ్ళేది భుక్తి కోసమే కాని భక్తితో కాదు. అలాగే తగాదాల్లో కొట్లాటల్లో మృతి చెందిన వానికి పుణ్యం రాదు. అదే దేశం కోసం యుద్ధంలో మరణిస్తే వీరస్వర్గం లభిస్తుంది. అలాగే బ్రాహ్మణ, గో, స్త్రీ, బాలక హత్యలను అడ్డుకోబోయి ఆ ప్రయత్నంలో ప్రాణాన్ని పోగొట్టు కున్నవానికి మోక్షం లభిస్తుంది.

*బ్రాహ్మణార్థే గవార్థేచ స్త్రీణాం బాల వధేషు చ ।*
*ప్రాణత్యాగ పరోయస్తు సవై మోక్షమవాప్నుయాత్ ॥* **(ధర్మ... 38/16)**

నిరాహార వ్రతం, బంధన ఛేదనం, బ్రాహ్మణులకి దానం, పైన చెప్పిన ఇతర మార్గాలూ మోక్షమార్గాలైనట్లే స్వర్గమార్గాలు కూడా వున్నాయి. గోశాలలో, దేశ విధ్వంసంలో, యుద్ధభూమిలో, తీర్థస్థలంలో మృత్యువు శ్రేయస్కరం. ప్రాణి అక్కడ శరీరాన్ని త్యజించిన వెంటనే స్వర్గం చేరుకొని అక్కడ చిరకాలం నివాస ప్రాప్తినొందుతాడు. పండితులు దీనిని బాగా బోధపఱచుకొని ప్రవర్తిస్తే వారి పాండిత్యం సార్థకమవుతుంది. హరిక్షేత్ర, కురుక్షేత్ర,

భృగుక్షేత్ర, ప్రభాస, శ్రీశైల, అర్బుద, త్రిపుష్కర, శివక్షేత్రాలలో మరణించిన వారు బ్రహ్మ యొక్క ఒక దినం పూర్తయ్యేదాకా స్వర్గంలో వుంటారు. తరువాత పుడమిపై పుడతారు. సచ్చరిత్రుడైన బ్రాహ్మణునికి ఒక సంవత్సరం జీవన నిర్వాహకానికి సరిపడా అన్నవస్త్రాదులను దానమిచ్చినవాడు తాను స్వర్గప్రాప్తి నొందడమే కాకుండా తన వంశాన్ని కూడా ఉద్ధరించగలడు.

తన కూతురిని వేదపారంగతుడైన బ్రాహ్మణునికిచ్చి వివాహం చేసినవాడు తన పరివారంతో సహా (కుటుంబం కూడా) ఇంద్రలోక నివాసం చేయగలడు. మహాదానాలకూ అట్టి ఫలమే దక్కుతుంది. వాపీ, కూప, తటాకాది జలాశయాలను నిర్మించిగాని పాడుపడిన వాటిని మరల బాగు చేయించి వినియోగంలోకి తెచ్చిగాని జాతికంకితం చేసిన వారికీ అదే ఫలం చెప్పబడింది. జీర్ణదేవాలయోద్ధరణ వల్ల పై జెప్పిన వాటికి రెట్టింపు పుణ్యం వస్తుంది. విద్వాంసుడైన బ్రాహ్మణుడు కుటుంబ సమేతంగా తలదాచుకోవడానికొక ఇంటిని దానమిచ్చినవాడు మూడున్నర కోట్ల సంవత్సరాలు స్వర్గంలో వుంటాడు. నిత్యమూ ఒక బ్రాహ్మణునికి దినగ్రాసము నిచ్చువాడు నాలుగు చామరాలతో వెలుగొందు దివ్య విమానంలో స్వర్గానికి వెళతాడు. పాపాత్ముడు పరివర్తన చెంది నరకానికి పోకుండా వుండాలనుకుంటే జప తప పూజాదులతో బాటు ఒక బ్రాహ్మణునికి దిన గ్రాసదానానికి పూనుకుని ఆ దానాన్ని కొన్నేళ్ళపాటు కొనసాగిస్తే అతని పాపాలన్నీ దగ్ధమైపోతాయి. పేద విప్రుని కన్యకు తానే పూనుకొని వేదాంతవేత్త కామెనిచ్చి అన్ని ఆచారాలను పాటించి వివాహం చేసే ఏ వర్ణునికైనా అన్ని రకాల పాపాలూ నశిస్తాయి.

అత్యవసరమైనచోట జలాశయ నిర్మాణం, నిర్ధనుని అవసరాన్ని గుర్తించి చేసే దానం చేయువాడు స్వర్గానికి పోయి అక్కడే నాయకుడవుతాడు. మనిషై పుట్టినవాడు వ్యర్థజీవనుడు కాకుండా వుండి పోవాలంటే దానం, దమం, దయ అనే మూడంశాలనూ పాటించాలి. ఇవే మానవ జీవన సారం.

*ఫల్గుకార్యం పరిత్యజ్య సతతం ధర్మవాన్ భవేత్ ।*
*దానం దమో దయా చేతిసారమే తత్త్రయం భువి ॥*
*దానం సాధోర్దరి ద్రస్య శూన్య లింగస్య పూజనం ।*
*అనాథ ప్రేత సంస్కారః కోటియజ్ఞ ఫలప్రదః ॥* *(ధర్మ... 38/39,40)*

దరిద్రునికి చేసే దానం, శూన్య జీర్ణ శివాలయోద్ధరణ, అనాథ ప్రేత సంస్కారం – వీటిలో ఏ ఒక్కటి చేసినా కోటి యజ్ఞాలు చేసిన పుణ్యఫలం లభిస్తుంది. ***(అధ్యాయం–38)****

---

**39వ అధ్యాయం అశౌచవ్యవస్థ ఇంతకు ముందే చెప్పబడింది.*

# దుర్మరణం పాలైనవారికి సద్గతిని ప్రసాదించే నారాయణ బలి విధానం

గరుడా! నారాయణ బలిని గూర్చి మరింత విపులంగా వినిపిస్తాను. వికృత మృత్యువు కారణంగా ప్రేతమై పోయిన వారికుత్తమ గతులు కలిగించే ప్రేతకర్మ మొకటుంది. ఇది రహస్యంగా వుంచబడింది. అయినా లోక కల్యాణం కోసం నువ్వడిగావు కాబట్టి దానిని వెల్లడిస్తున్నాను. దుర్మరణ మనగానేమో ఇదివఱకు చెప్పబడింది కదా! వీరే కాక కొన్ని ఘోర పాపాలను చేసి నరకానికి పోయి శిక్షలననుభవించి కూడా ప్రేత యోనిలో పడిపోయిన వారుంటారు. వీరందరికీ ఉత్తమగతులనందించే మార్గం నారాయణ బలి ఒక్కటే. దానిని వివరిస్తున్నాను. బ్రాహ్మణులు మృతి చెందిన ఆరు మాసాలలోపున, క్షత్రియ వైశ్యులకు క్రమంగా మూడు, ఒకటిన్నర మాసాలలోపున శూద్రులకు తత్కాల పుత్తల దాహానంతరము దీనిని చేయాలి. గంగాది పుణ్య తీర్థాల నుండి ఇంటిలో లేదా దేవాలయంలో దాకా ఎక్కడైనా విష్ణుదేవుని ఎదురుగా పెట్టుకొని ఈ కర్మను నిర్వహింపవచ్చును. పౌరాణిక, వైదిక మంత్రాలతో ప్రేతానికి తర్పణలివ్వాలి. తరువాత యజమాని సర్వౌషధయుక్తజలంతో అక్షతలతో విష్ణుదేవునికి కూడా తర్పణలివ్వాలి. దీనికి పురుష సూక్తాన్ని గాని వైష్ణవ మంత్రాలను గాని చదవాలి. అనంతరం దక్షిణం వైపు తిరిగి ప్రేతాన్ని విష్ణురూపంగా తలచి ఈ క్రింది మంత్రంతో విష్ణువుని ధ్యానించాలి.

*అనాది నిధనో దేవః శంఖ చక్రగదాధరః ॥*
*అవ్యయః పుండరీకాక్షః ప్రేత మోక్ష ప్రదోభవేత్ ।* *(ధర్మ...40/27,28)*

తర్పణ సమాప్తి కాగానే రాగముక్తుడై, ఈర్ష్యా ద్వేషరహితుడై, జితేంద్రియుడై, పవిత్రుడై, ధర్మపరాయణుడై, దానధర్మ సంలగ్నుడై, శాంతచిత్తుడై, ఏకాగ్రమనస్కుడై యజమాని విష్ణుదేవునికి సాష్టాంగ ప్రమాణం చేసి వాక్సంయమనాన్ని పాటిస్తూ తన బంధుబాంధవులతో సహా శుద్ధుడై భక్తిపూర్వకంగా పదకొండు శ్రాద్ధాలను పెట్టాలి. సమాహితుడై బ్రాహ్మణులకు జలము, వరిధాన్యము, యవలు, చెఱకు, గోధుమలు, చిన్న కంకణం, శుభహవిష్యాన్నం, ముద్ర, గొడుగు, పాగా, బట్టలు, పాలు, తేనె– వీటన్నిటినీ దానమివ్వాలి. అలాగే వస్త్ర పాదుకాది ఎనిమిది పద దానాలను కూడా పంక్తి భేదం లేకుండా అందరు బ్రాహ్మణులకూ ఇవ్వాలి.

నేలపై పిండదానం పూర్తయిన తరువాత శంఖపాత్రతో రాగి గిన్నెతో వేరు వేరుగా గంధ అక్షత, పుష్పయుక్త తర్పణలివ్వాలి. ధ్యానధారణలతో మనసును ఏకాగ్రం చేసి మోకాళ్ళపై నిలబడి వేద శాస్త్రానుసారం బ్రాహ్మణులకు దానాలివ్వాలి. ఏకోద్దిష్ట శ్రాద్ధాలలో ఋగ్వేద మంత్రాలను చదువుతూ విడివిడిగా పదకొండు పిండాలకు అర్ఘ్యాలివ్వాలి : ఇలా :

***ఆపోదేవీర్మధుమతీ*** .......................... మొదటి

***ఉపయామగృహీతోఽ  సి*** .................... రెండవ

***యేనాపావక చక్షుషా*** ......................... మూడవ

***యే దేవాసః*** ................................. నాలుగవ

***సముద్రం గచ్ఛ*** ............................... అయిదవ

***అగ్నిర్ జ్యోతి*** ................................ ఆరవ

***హిరణ్యగర్భ*** ................................. ఏడవ

***యమాయ*** .................................. ఎనిమిదవ

***యజ్ఞాగ్ర*** ..................................... తొమ్మిదవ

***యాఫలినీ*** ................................... పదవ

***భద్రం కర్ణేభిః*** ................................ పదకొండవ పిండము

ఒక్కొక్క మంత్రం పూర్తిగా చదువుతూ అర్ఘ్యమిచ్చి ఆ పిండాన్ని విసర్జించాలి.

ఇలా ఏకాదశ దైవత్య శ్రాద్ధాన్ని పెట్టిన మరునాడు శ్రాద్ధాన్ని ప్రారంభించాలి. నాలుగు వేదాలూ చదివినవారూ, విద్యాశీలురూ, సద్గుణ సంపన్నులూ, వర్ణాశ్రమ ధర్మపాలకులూ, శీలవంతులూ, శ్రేష్ఠులూ, సర్వాంగ సుశోభితులూ, ప్రశస్తులూనగు అయిదుగురు ఉత్తమ బ్రాహ్మణులనాహ్వానించాలి. బంగారంతో విష్ణునిదీ, రాగితో రుద్రునిదీ, వెండితో బ్రహ్మదీ, ఇనుముతో యమునిదీ, సీసంతో లేదా కుశలతో ప్రేతానిదీ ప్రతిమలను తయారు చేయించాలి. ***శన్నోదేవీ...*** మంత్రాన్ని పూర్తిగా చదువుతూ విష్ణు ప్రతిమను పడమటి దిక్కులోనూ ***అగ్ని ఆయాహి...*** అనే మంత్రంతో రుద్ర ప్రతిమనుత్తర దిశలోనూ, ***అగ్ని మీళే...*** మంత్రంతో బ్రహ్మ ప్రతిమను తూర్పు దెసలోనూ, ***ఇషేత్వోర్జేత్వా....***

మంత్రంతో యమ ప్రతిమను దక్షిణం వైపూ స్థాపించి వాటి మధ్యలో నొక మండలాన్నేర్పాటు చేసి కుశమయ (సీస) నరప్రతిమను దానిపైననూ స్థాపించాలి.

బ్రహ్మ, విష్ణు, రుద్ర, యమ, ప్రేతాలకై వేరు వేరుగా పంచరత్నయుక్త కుంభాలను సిద్ధం చేసి వుంచాలి. అలాగే విడివిడిగా వస్త్రాలనూ, యజ్ఞోపవీతాలనూ, ముద్రలనూ ప్రదానం చెయ్యాలి. దేవతల మంత్రాలను చదువుతూ వారిని పూజించాలి. జపం చేయాలి. తరువాత దేవతల నిమిత్తమై యథావిధిగా అయిదు శ్రాద్ధాలను పెట్టాలి. తరువాత శంఖ లేదా తామ్ర లేదా మట్టి పాత్రతో సర్వౌషధ సమన్విత తిలోదకాన్ని తీసుకొని అయిదు పీఠాల వద్ద ఉంచాలి. పక్షీంద్రా! ఆసనం, పాదుక, ఛత్రము, ఉంగరం, కమండలువు, పాత్ర, భోజన పదార్థాలు, వస్త్రము– ఈ ఎనిమిదింటినీ 'పదా'లంటారు. వీటి దానమే పద దానము. వీటితో బాటు బంగారంతో, దక్షిణ, తిలలతో నిండిన రాగిపాత్రను ముఖ్య బ్రాహ్మణునికి దానమివ్వాలి. ఋగ్వేద పారంగతుడైన బ్రాహ్మణునికి పచ్చటి పంటతో నున్న భూమినీ, యజుర్వేద నిష్ణాతుడైన విప్రునికి పాలిచ్చే ఆవునీ, సామవేద పారంగతుడైన, పాడగలిగిన బ్రాహ్మణునిలో శివుని ఊహించుకొని ఆయనకి స్వర్ణాన్నీ, యమునుద్దేశించి తిలలనూ, ఇనుమునూ, దక్షిణనూ ఇవ్వాలి.

సర్వౌషధి సమన్వితమైన కుశల ద్వారా నిర్మితమైన ప్రేత ప్రతిమను కృష్ణాజినం పఱచి దానిపై పెట్టి పలాశ దండం పుల్లలను మూడు వందల అరవై వృంతాలుగా ఎముకల వలె నిర్మించాలి. తల భాగంలో నలభై, మెడలో పది, ఎదపై ఇరవై, కడుపుకిరవై, భుజాలు, రెంటికీ వంద, కటికి ఇరవై, తొడలకు వంద, జంఘలకు ముప్పది, లింగానికి నాలుగు అండకోశాలకు ఆరు, కాలి వ్రేళ్ళకు పది వృంతాలను (కాడలను) కేటాయించి కల్పిత ప్రేతపురుషుని అస్థిపంజరాన్ని నిర్మించాలి. తరువాత దాని శిరోభాగంలో కొబ్బరికాయనీ, తాలు ప్రదేశంలో సొరకాయనూ నోటిలో పంచరత్నాలనూ, జిహ్వాభాగంపై అరటిపండునూ, ప్రేగుల వద్ద తామరకాడలనూ, ప్రాణభాగంలో ఇసుకనీ, కొవ్వు స్థానంలో మేదకమను పేరు గల స్ఫటికమునూ మూత్రస్థానంలో గోమూత్రాన్నీ, ధాతువులకు బదులుగా గంధకాన్నీ, వీర్యస్థానంలో పాదరసమునూ, మలస్థానంలో ఇత్తడినీ, సంపూర్ణ శరీరమంతటా మనశ్శిలనీ, సంధి భాగాల్లో నువ్వు పిండినీ, మాంస భాగంగా యవల పిండినీ, తేనెనూ, ముత్యాల పొడినీ, కేశరాశి స్థానంలో మర్రి ఊడలనూ, చర్మ భాగంలో మృగచర్మాన్నీ, కర్ణ ప్రదేశాల్లో తాళపత్రాలనూ, స్తనభాగాలలో గురివింద పండ్లనూ,

ముక్కుండే చోట కమల పత్రాలనూ, బొడ్డుచోట కమలపత్రాలనూ, అండకోశ స్థానంలో వంకాయలనూ, లింగ స్థానంలో ముల్లంగినీ అమర్చి నాభి కమలపత్రాలలో నేతిని పోయాలి. తరువాత కౌపీన స్థానంలో త్రపువునీ, రెండు స్తనాల వద్దా ముక్తాఫలాలనీ, తలపై కుంకుమ లేపనాన్నీ, కర్పూర, అగరు, ధూప, సుగంధిత పుష్పమాలల అలంకరణాన్నీ ఏర్పాటు చేయాలి. పరిధాన స్థానంలో పట్ట సూత్రాన్నీ, హృదయభాగంలో రజతపత్రాన్నీ అమర్చాలి. యజమాని బుద్ధి, వృద్ధి అను సిద్ధులను సంకల్పించి భుజాలను (ప్రేతానివి) స్పృశించి దాని కన్నులలో ఒక్కొక్క గవ్వనుంచాలి. తరువాత కనుకొలకులలో సింధూరాన్నుంచి దాని పక్కనే తాంబూలాది వివిధ ఉపహారాలను అందంగా అమర్చాలి.

ఈ ప్రకారంగా నానా వస్తువులచే నిర్మింపబడి అలంకరింపబడిన ప్రేతానికి సర్వౌషధి జల ప్రదానం చేసి శాస్త్రానుసారము పూజ చేయాలి. అది అగ్నిహోత్రి ప్రేతమైతే దానికి యథావిధి యజ్ఞపాత్రను కూడా ఇవ్వాలి. తరువాత ***శిరోమేశ్రీ..., పునంతువరుణ...*** అనే మంత్రాలతో, యజమాని, అభిమంత్రిత జలం ద్వారా శాలగ్రామ శిలను కడిగి దానితోనే ప్రేతాన్ని పవిత్రీకరించాలి. తరువాత విష్ణుభగవానునిని ప్రసన్నం చేసుకోవడానికి ఒక పాలిచ్చే సుశీలయైన గోవును దానం చెయ్యాలి. తిలలు, ఇనుము, బంగారం, పత్తి, ఉప్పు, సప్తధాన్యాలు, భూమి, గోవు – ఈ దానాలు ఈ క్రమంలో ఒకదానిని మించి మరొకటి పుణ్యదాయకాలు. యజమానికీ గోదానం తరువాత, తిలాదాన పద దాన మహాదానాలను కూడా చేయాలి. చివరగా సర్వాలంకార విభూషితమైన ఒక వైతరణీ ధేనువును కూడా దానం చేయాలి.

ఈ సందర్భంలో, ప్రేతముక్తి కోసం, దాని ఆత్మీయుడైన యజమాని విష్ణు భగవానుని నిమిత్తమై ఒక శ్రాద్ధాన్ని పెట్టాలి. తరువాత మనసులో విష్ణుదేవుని ధ్యానిస్తూ, ప్రేతమోక్షక కార్యాన్ని చేపట్టాలి. అంటే ***విష్ణురితి...*** అనే మంత్రం చదువుతూ ప్రేతాన్ని దహనం చేసి మూడురోజులపాటు సూతక దినాలను పాటించాలి. పదవరోజు కర్మ, దానికి ముందు పిండదానాలు, వార్షిక క్రియాదులను పద్ధతి ప్రకారం చేస్తుండాలి. ఇది ప్రేతానికి ముక్తిని కలిగించే మానవ ప్రయత్నం. ***(అధ్యాయం-40)****

---

* *41వ అధ్యాయమైన వృషోత్సర్గ సంక్షిప్త విధి నిదివఱకే విపులంగా చూడడం జరిగింది.*

# భూమ్యాది దాన మాహాత్మ్యము, బ్రహ్మస్వహరణ దోషం

గరుడా! ఎలాగైతే తన చుట్టూ వందగోవులున్ననూ దూడ తన తల్లి వద్దకే పోతుందో అలాగే అంతటి సంపూర్ణమైన గురి తప్పని వివేకంతోనూ పూర్వజన్మలో చేయబడిన కర్మలు వాటి కర్తను అనుసరించిపోతాయి.

*యథాధేను సహస్రేషు*
*వత్సో విందతి మాతరం ।*
*తథా పూర్వ కృతం కర్మ*
*కర్తార మను గచ్ఛతి ॥* (ధర్మ... 42/1)

భూమి దానం చేసిన వానిని సూర్య చంద్రులు, వరుణుడు, అగ్ని, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అభినందిస్తారు. ఈ లోకంలో భూదానంతో సమానమైన దానమే లేదు. అలాగే సత్యమంతటి గొప్పధర్మమూ, అసత్యమంత మహా పాపమూ లేవు.

*నాస్తిభూమి సమందానం*
*నాస్తి భూమి సమోనిధిః ।*
*నాస్తి సత్య సమోధర్మో*
*నానృతా త్పాతకం పరం ॥* (ధర్మ... 42/3)

బంగారాన్ని అగ్నిదేవుని పెద్ద కొడుకనీ, ఆవుని సూర్యుని కూతురనీ, భూమిని వైష్ణవి అనీ అంటారు. కాబట్టి ఈ మూడిటినీ దానమిచ్చిన వారికి ముల్లోకాలనూ దానమిచ్చిన ప్రతిష్ఠ యేర్పడుతుంది. గోవు, భూమి, విద్య – ఈ మూడిటి దానానికీ అతిదానమని పేరు. జప, పూజన, హోమ సహితంగా చేసే అతిదానం ఆ దాతను నరకం నుండి కాపాడగలదు. చాలా పాపాల నుండి శుద్ధి, విముక్తి భూదానం వల్ల లభిస్తాయి. ప్రాణం కంఠం నుండి వెలువడుతున్నపుడు కూడ నిషిద్ధ కర్మను చేయరాదు. కర్తవ్య (ధర్మ) కర్మను మానరాదు. ఎవరి జీవికకు భంగం కలిగించినా (కడుపు కొట్టినా) వందల గోవులను చంపినంత పాపం చుట్టుకొంటుంది. అదే ఎవరికైనా జీవనోపాధిని, ధర్మబద్ధంగా, ఏర్పాటు చేస్తే లక్షగోవులను దానమిచ్చిన ఫలం అబ్బుతుంది. గోవును రక్షించడం పరమధర్మం. దానిని మించిన పుణ్యకార్యమే లేదు.

*గావాంశతం సైకవృషం*
*యత్ర తిష్ఠ త్యయంత్రితం ।*

*తత్క్షేత్రం దశగుణితం*
*గోచర్మ పరికీర్తితం ॥* *(పరాశర స్మృతి - 12/43)*

గోచర్మ భూమిని దానమిచ్చిన వాని పాపాలన్నీ దగ్ధమైపోతాయి. ఇక పాపమన్నదే చేయకుండా వుంటే ఉత్తమ గతి లభిస్తుంది. ఎక్కడైతే వెయ్యి గోవులూ పది యెద్దులూ స్వేచ్ఛగా తిరగగలుగుతాయో ఆ భూభాగాన్ని 'గోచర్మ'మంటారు. ఇక్కడ గోచర్మమంటే ఆవు తోలుకాదు.

గోహంతకుల నుండి ఒక్క గోవును రక్షించినా వందగోవులను దానమిచ్చిన పుణ్యం దక్కుతుంది.

*వరమేకా ప్యపహృతా*
*నతు దత్తం గవాంశతం ।*
*ఏకాం హృత్వా శతం దత్త్వా*
*న తేన సమతా భవేత్ ॥* *(ధర్మ... 42/10)*

జీవనోపాధి లేని నిర్ధనుడైన బ్రాహ్మణునికి బతుకుతెరువుని కల్పిస్తే అశ్వమేధ యాగాన్నిచేసిన దాని కన్న నెక్కువ పుణ్యం దక్కుతుంది. దుర్బలుడు, ఆపదలో చిక్కుకున్నవాడునగు బ్రాహ్మణుని రక్షిస్తే వచ్చే పుణ్యం వేదాధ్యయనం, ప్రచుర దక్షిణతో యుక్తమైన మహాయజ్ఞం వల్ల వచ్చే పుణ్యానికి కొన్ని రెట్లు ఎక్కువ. బ్రాహ్మణుని ధనాన్ని బలవంతంగా లాగికొనువాని పుణ్యం, ఇతరేతర సర్వసంపదలూ ఇసుకతో కట్టిన వంతెన వలె కూలిపోతాయి. భూమిని దౌర్జన్యంగా అపహరించినవాడు అరవై వేల సంవత్సరాల పాటు పేడ పురుగుగా జన్మించి, పోయి, మరల పేడ పురుగుగానే జన్మించి పోతూ వుంటాడు. బ్రాహ్మణుని నమ్మించి మోసం చేసి వాని ధనాన్నపహరించిన వాడు తనతో బాటు తన ఏడుతరాల వారి పుణ్యాన్ని భస్మం చేసి పారేస్తాడు. బ్రాహ్మణధనాన్ని దొంగిలించిన వాడు ఆచంద్రతారార్కమూ తన, మరియు తన తరాల పుణ్యాలను భస్మం చేసి పారేస్తాడు. ఇనుపరజను నీ రాళ్ళనీ వండుకొని తిని అరిగించుకోగలవాడుంటాడేమో గాని బ్రాహ్మణుని సొమ్ముని తిని అరిగించుకోగలిగేవాడుండడు.

దైవద్రవ్యాన్ని నాశనం చేసినా, బ్రాహ్మణ ధనాన్నపహరించినా, బ్రాహ్మణుని అవమానపఱచినా ఆదుష్కర్త వంశనాశనం తప్పనిసరి. బ్రాహ్మణుడై యుండీ ఏ విద్యనూ నేర్చుకోకుండానే ఆచార్యత్వాది పదవుల నాశించు వానిని మాత్రం ఆదరించి పదవిని కట్టబెట్టకూడదు. యజ్ఞాన్ని అగ్నితో చేయగలం కానీ బూడిదతో చేయలేం కదా!

సంక్రాంతి కాలంలో దానాలు, హవ్య కవ్యాలూ చేసిన వానికి సూర్యునే దానమిచ్చిన ఫలం దక్కుతుంది. వానికి ఏడు కల్పాల దాకా తిరుగుండదు. ప్రతి గ్రహం (దానం పుచ్చుకొనుట) అధ్యాపనం, యజ్ఞం చేయించుట – ఈ మూడు పనులకూ తగిన వానినే చూసుకోవాలి. ఆ పనులు అప్పుడే పవిత్రాలౌతాయి. యజ్ఞం జపతపాలు గల వాని చేతనే పవిత్రమవుతుంది గాని వేదమాత్రం వల్ల కాదు.

గరుడా! కొందరు నీటికో, నిప్పుకో, మరి దేనికో భయపడి ధర్మమార్గం వీడి పోతుంటారు. వారికా భయాన్ని పోగొట్టి శుద్ధి చేసి మరల మార్గంలోకి తేవాలి. ఇన్నాళ్ళూ ధర్మపథ విచలితులైనందుకు ఆవునూ ఎద్దునూ వారి చేత దానం చేయించి చాంద్రాయణ వ్రతాన్ని కూడా చేయించి శుద్ధులుగా చేయాలి. సన్యాసం స్వీకరించి దాని నుండి చ్యుతులైన వారికి కూడా ఇదే శుద్ధి మార్గము నాలుగు నుండి పన్నెండేళ్ళ మధ్య వయసులోని బాలకుడేదైనా అపరాధం చేస్తే, పాపం చేస్తే వాని తల్లిదండ్రులే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఆ వయసు వారికి రాజదండనా వుండదు. రజస్వల రోగగ్రస్తయైతే ఆమెను తప్పనిసరి పరిస్థితుల్లో చూడవలసిన వారు వైద్యం చేయవలసినవారు పదిమార్లు స్నాన, జపాలను చేస్తే శుద్ధులవుతారు. ***(అధ్యాయాలకు 42, 43)***

# సర్పదంశ మృతులకు విహిత కర్మ విధానం

ఇతర దుర్మరణాల పాలైన వారికి అపరకర్మ ఎలా చేయాలో ఇదివఱకే విన్నావు కదా! పాము కాటుకి గురియై మృతి చెందిన వారికుత్తమ గతులు కలగాలంటే ప్రతిమాసంలో రెండు పంచమితిథులలోనూ నాగదేవతను పూజించాలి.

భూమిపై శాలిచూర్ణంతో నాగదేవత ఆకారాన్ని చిత్రించాలి. తెల్లపూలు, సుగంధద్రవ్యములు, ధూపం, దీపం, తెల్లని అక్షతలతో దానిని పూజించి బాగా ముద్దగా వండబడిన అన్నాన్ని పాలతో బాగా ముద్దగా కలిపి నైవేద్యం పెట్టాలి. తరువాత అక్కడ ద్రవ్యాలనూ వస్త్రానూ ఉంచి లేస్తూ 'నాగరాజు ప్రసన్నుడు కావాలి గాక' అని అనాలి.

అదేరోజు శ్రాద్ధాన్ని శాస్త్రోక్తంగా పెట్టి మధురమైన భోజనాన్ని చేయాలి. తరువాత, యథాశక్తి బ్రాహ్మణులకు బంగారు నాగ ప్రతిమలను దానం చేయాలి. గురుదేవునికి గోదానం కూడా చేసి ***నాగరాజ ప్రీయతాం*** అని చెప్పాలి. అపుడు ఇతర శ్రాద్ధకర్మలను చేయాలి. ***(అధ్యాయం – 44)***

# నిత్య, దేవ, వృద్ధి శ్రాద్ధాలు

గరుడా! అన్ని రకాల శ్రాద్ధాలను గూర్చి నీకు చెప్పడం జరిగింది. అయితే, నిత్య శ్రాద్ధంలో ఆహూతులైన బ్రాహ్మణులకు కూడా పితరులతో బాటు, భక్తిపూర్వకంగా, అర్ఘ్య పాద్య గంధాదులతో పూజ చేయాలి. తరువాత పితరులనుద్దేశించి వారికి భోజనాలు పెట్టాలి. నిత్యకర్మలో చేయకూడని వేవనగా - ఆవాహన, స్వధాకారం, పిండదానం, అగ్నౌకరణం, బ్రహ్మచర్యాది నియమాలు, విశ్వేదేవ కృత్యాలు. నిత్య శ్రాద్ధంలో కూడా బ్రాహ్మణులను భోజనాలచే తృప్తులను చేసి దక్షిణ లిచ్చి సాదరంగా వారిని వీడ్కొల్పాలి.

విశ్వేదేవులను, ఇతర దేవతలను ఉద్దేశించి బ్రాహ్మణులకు నిత్యశ్రాద్ధ పద్ధతిలోనే భోజనాలను పెట్టిస్తే అది దేవశ్రాద్ధమనబడుతుంది.'

(వృద్ధి శ్రాద్ధం ఇదివఅకే వచ్చింది) *(అధ్యాయం - 45)*

# సత్కర్మ మహిమ - కర్మ విపాక ఫలం

'జగజ్జేతా జ్ఞానప్రదాతా! మానవులకు స్వర్గం, నానాప్రకారాల భోగాలు, సుఖం, రూపం, బలం, బుద్ధి, పరాక్రమం వంటి వన్నీ పుణ్య ప్రభావం వల్లనే సమకూడుతాయని విన్నాను. ఎలాగైతే విష్ణువే విజయుడవుతాడు. అసురులు కారో, అలాగే ధర్మమే గెలుస్తుంది - అధర్మం కాదు, సత్యమే నిలుస్తుంది - అసత్యం కాదు, క్షమయే సుఖాన్నిస్తుంది, దేవునికి దగ్గర చేస్తుంది. క్రోధం కాదు అని కూడ పెద్దల ద్వారా విన్నాను.

*ధర్మోజయతి నా ధర్మః*
*సత్యం జయతి నా నృతం ।*
*క్షమాజయతి నక్రోధో*
*విష్ణుర్జయతి నాసురః ॥* *(ధర్మ... 46/3)*

సుకృతం వల్ల శుభం కలుగుతుందటారు. స్వామీ! ఈ కర్మఫలాల వల్ల వచ్చే జన్మల గూర్చి ఇంకా తెలుసుకోవాలని వుంది' అన్నాడు కశ్యపాత్మజుడు. చెప్పసాగాడు మహావిష్ణువు.

'ఓయి పక్షీంద్రా! ఈ లోకంలో ఆత్మజ్ఞానులకు శాసకుడు గురువు. దురాత్ములకు శాసకుడు రాజు. గుప్తరూపంలో పాపాలు చేసేవారికి శాసకుడు యమధర్మరాజు.

*గురురాత్మ వతాం శాస్తా*
*రాజా శాస్తా దురాత్మనాం ।*

*ఇహ ప్రచ్ఛన్న పాపానాం*
*శాస్తా వైవస్వతో యమః ॥*

పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోకుండా గాని, చేసుకొని మరల పాపాలను చేసి గాని మరణిస్తే ఆ జీవికి అనేక ప్రకారాల నరకములలో పడవలసి వుంటుంది. అక్కడి యాతనల నుండి విముక్తి పొందినా మరల పుడమిపై పుట్టవలసీ వుంటుంది. ఏ పాపం చేసిన వాడికెటువంటి జన్మ వస్తుందో ఇది వఱకే విన్నావు కదా! తన ధర్మము తాను పాలిస్తూ మంచిగా వుండేవాడు ఊర్ధ్వలోకాలకు వెళతాడు. ధర్మాన్ని పాలించకపోయినా చెడ్డపనులు చేసినా ఆ జీవి అధోగతి పాలవుతాడు. ***(అధ్యాయం - 46)***

# వైతరణి వర్ణన విష్ణు, గంగ, బ్రాహ్మణ మహిమ

గరుడా! దానమహిమను గూర్చి వైతరణిని గురించీ అడిగావు కదా! విను. యమలోక మార్గంలో వైతరణియను మహానది వుంది. అది అగాధమై, దుస్తరమై పాపులకు మహాభయ భీతికరంగా వుంటుంది. అందులో సామాన్య జలాలకు బదులుగా ఈ పాపులకు చీమూ నెత్తురూ కనిపిస్తాయి. మాంసపు బురద దాని తటానికి వచ్చి నిలిచే పాపులకు కనిపించి' మీ మాంసమూ ఇలాగే బురదగావచ్చు' అని హెచ్చరిస్తున్నట్లుగా వుంటుంది. అది నిముషానికొక భయంకరాకారాన్ని ధరించి పాపుల గుండెల్లో గుబులు రేపుతుంటుంది. పాత్ర మధ్యలో నెయ్యి మరుగుతున్నట్లు ఈ నది అక్కడక్కడ సలసలకాగుతున్నట్లు కనిపిస్తుంది. దానిని దాటుకొని మనం వెళ్లాలి అనే విషయం స్ఫురణకు రాగానే పాపుల గుండెలవిసిపోతాయి. ఆ నీటిలో విషపు కాటు వేయడానికి సిద్ధంగా వున్న కీటకాలు తేలుకొండి వంటి వజ్రసదృశమైన తొండాలతో 'రండి మీ పని పడతాం' అన్నట్లుగా ఈ పాపుల వైపు చూస్తుంటాయి. మొసళ్ళవంటి పరమహింస్రక జలజంతువులా వైతరణి నిండా వుంటాయి. ప్రళయంలో పన్నిద్దరు సూర్యులొకేమారు నింగి నడినెత్తిన చేరి మొత్తం విశ్వాన్ని మండించేస్తారని విన్నావు కదా! ఈ వైతరణిలో కూడ అంతటి వేడి పాపులను వేపుతుంటుంది. వారు ఈ వేడిని తట్టుకోలేక వైతరణి లోకి దూకుతారు. గోదానం చేసి యున్నవారు సామాన్య జలాలలో పడ్డట్టే వుంటారు, వారికోసం నావ కూడా వస్తుంది. ఇతరులు మాత్రం ఆ చీము నెత్తుటేరులో మునుగుతూ తేలుతూ కర్మఫలం కడముట్టేదాకా అందులోనే వుంటారు.

ఎలాంటి పాపాలు చేసిన వారు వైతరణిలోనే ఉండిపోతారో విను. నన్నూ, ఆచార్యునీ, మాతా పితలనూ, వృద్ధ జనులనూ దూషించి అవమానించిన వారూ, తన పతివ్రతా, సుశీలా, ధర్మ పరాయణాయైన పత్నిని వదిలేసిన వాడూ, తనను నమ్మి నిద్రలోకి జారుకున్నవారిని హత్య చేసిన వాడూ, శాంతుడు, క్షుధాతురుడూనగు బ్రాహ్మణుని జీవికకు భంగం కలిగించిన వాడూ, దానమిస్తానని చెప్పి బ్రాహ్మణుని ఇంటికి పిలిపించుకొని తీరా ఆయన వచ్చాక 'లేదు పో'మ్మని కసిరికొట్టిన వాడూ, ఇతరుని పత్నిని ఆకర్షించి లోబఱచుకొనేవాడూ, పొలాలను పాడు చేయువారూ, వంతెనను విరగ్గొట్టువారూ, మాంసాన్ని తినే బ్రాహ్మణుడూ, గర్భపాతం చేయువాడూ కనీసం ప్రళయందాకానైనా వైతరణిలోనే, పైన చెప్పిన ప్రాణులన్నిటి చేతా హింసింపబడుతూ, తీవ్రవేదనను అనుభవిస్తూ ఉండిపోతారు. ఈ వైతరణీ నివాసాన్ని తప్పించుకోవాలంటే ఒకటే మార్గం. ఎంత మహాపాపియైనా పశ్చాత్తాపపడి మహాదానం (అనగా తనకున్నదంతా ఇచ్చేయడం) చేసి చెట్టుకింద బతికి శేషజీవితమంతా భగవన్నామ స్మరణం చేయాలి. అపుడు వైతరణి కరుణిస్తుంది కాని యముడు తన పని తాను చేసుకుపోవచ్చు.

మహాదాన ప్రసక్తి వచ్చింది, కాబట్టి చెబుతున్నాను. శరీరం అనిత్యం. ధనమూ అంతే. కాబట్టి ఆ రెంటిమీదా మోహం పెంచుకోకుండా నిత్యం సమీపంలోనే వుండే మృత్యువుని నిర్లక్ష్యం చేయకుండా వీలైనంత వేగం ధర్మసంగ్రహం చేయడం తెలివైన పని.

***అనిత్యాని శరీరాణి***
***విభవో నైవ శాశ్వతః ॥***
***నిత్యం సంనిహితో మృత్యుః***
***కర్తవ్యో ధర్మ సంగ్రహః ।*** ***(ధర్మ... 47/24,25)***

నల్లని లేదా ఎఱ్ఱని, శుభలక్షణాలున్న, వైతరణీ గోవుని బంగారంతో కొమ్ములనూ, వెండితో గిట్టలనూ అలంకరించి, రెండు నల్లని వస్త్రాలను కప్పి, పాలు పితకడానికి రాగి పాత్రను సప్తధాన్యాలతో నింపి బ్రాహ్మణునికి దానం చేయాలి. పత్తితో చేసిన ద్రోణాచలం శిఖరంపై రాగిపాత్రలో ఇనుప దండాన్ని పట్టుకొని కూర్చున్నట్లున్న యమధర్మరాజు ప్రతిమను స్థాపించాలి. చెఱకు గడలతో, గట్టి బంధనాలతోనొక నౌకను తయారుచేసి గోవును సూర్యపుత్రిగా సంభావించి ఆ నౌకలో నిలబెట్టాలి. తరువాత గొడుగు, పాదుకలు, ఉంగరం, వస్త్రాదులతో పూజ్య శ్రేష్ఠ బ్రాహ్మణు నొకని సంతుష్టపఱచి జలాన్నీ కుశలనూ చేతబట్టుకొని ఈ క్రింది మంత్ర శ్లోకాలను చదువుతూ ఆ వైతరణీ గోవును ఆ బ్రాహ్మణోత్తమునికి దానం చేయాలి.

*యమద్వారే మహాఘోరే*
*శ్రుత్వా వైతరణీ నదీం ।*
*తర్తుకామో దదామ్యేనాం*
*తుభ్యం వైతరణీం నమః ॥*
*గావో మే అగ్రతః సంతు*
*గావో మే సంతు పార్శ్వతః ।*
*గావో మే హృదయే సంతు*
*గవాం మధ్యే వసామ్యహం ॥*
*విష్ణురూప ద్విజ శ్రేష్ఠ*
*మాముద్ధర మహీసుర ।*
*సదక్షిణా మయాదత్తా*
*తుభ్యం వైతరణీ నమః ॥*

***(ధర్మ... 47/30-32)***

తరువాత సర్వులకూ స్వామియైన యమధర్మరాజు ప్రతిమను ఆ బ్రాహ్మణునికి దానం చేసి గోవుకి ప్రదక్షిణ చేసి దాని నాయన వెంట పంపిస్తూ దానితోకను చేతితో పట్టుకొని ఇలా అనాలి :

*ధేనుకేత్వం ప్రతీక్ష స్వ*
*యమద్వారే మహాభయే ॥*
*ఉత్తారణాయ దేవేశి*
*వైతరణ్యై నమో ఽ స్తుతే ।* ***(ధర్మ.... 47/34,35)***

తరువాత ఆ బ్రాహ్మణునీ ఈ గోవునీ ఆయన ఇంటిదాకా దిగబెట్టాలి. ఇలా చేసిన వాడు దేహాంతంలో వైతరణిని సుఖంగా దాటగలడు. ఈ భూమిపై గోదానం చేసినవాడు సమస్తాభీష్టసిద్ధి నొందగలడు.

సమస్తవేళల్లోనూ మనిషి మంచిపనులే చేయాలి, మంచిగానే ఆలోచించాలి. ఇదే సుకర్మ. ఈ సుకర్మ వల్ల ప్రాణికి ఐహిక- అంటే 'ఇక్కడ', పారలౌకిక అంటే అక్కడ, అన్ని సుఖాలూ లభిస్తాయి. ఒక మనిషిచేసే దానమే వాని పుణ్యంగా లెక్కింపబడుతుంది. పనిచేయడం శ్రమదానమవుతుంది. 'నా పుత్రులు నా పేర ఎలాగూ దానం చేస్తారులే' అనుకొని ఊరుకోకూడదు. తన చేతితో తానిచ్చే దానం ఉత్తమం. మనిషి పోయాక ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? అశాశ్వతమైన శరీరంతో శాశ్వతమైన పనిని చేయించడం తెలివైన పని కదా! ఈ శరీరంలో ఈ ప్రాణం అతిథిలాగే వుంటుంది. ఇవాళ వున్నది, రేపు పోనున్నది ప్రాణం.'

ఇంతవఱకు చెప్పి సూతమహర్షి తనదైన వ్యాఖ్యానాన్ని నైమిషారణ్యంలోని ఋషులకిలా వినిపించసాగాడు.

"విప్రవరులారా! పరమతేజస్వియైన మహా విష్ణువు ద్వారా ప్రేతచరితను విన్న గరుడుడత్యంత సంతుష్టుడైనాడు. జీవ జంతువుల జన్మాదిక విధానాలింతే. ఇవే జనన,

మరణ, ప్రేతత్వ, ఔర్ధ్వ దైహిక కృత్యాల నియమాలు. మోక్షానికి కారకాలు, కారణాలు కూడా ఇవే.

ఎవరి హృదయంలోనైతే నీలకమల సమాన శ్యామవర్ణుడైన భగవానుడు జనార్దనుడు తేజఃపుంజంగా వెలుగుతుంటాడో వారికే అన్ని లాభాలూ విజయాలూ సమకూడుతాయి. అట్టి మహాత్ముల కపజయమెక్కడిది? విష్ణువే మాత విష్ణువే పిత విష్ణువే స్వజన బాంధవుడు. ఎవని బుద్ధిలో ఈ విషయం స్థిరంగా నిలబడి వుంటుందో వానికెట్టి దుర్గతీ వుండదు. విష్ణుభగవానుడే సర్వమంగళుడు. ఆయనే గంగ, ఆయనే బ్రాహ్మణశక్తి. ఆయనే ఈ త్రిలోకసారం.

*మయాప్రోక్తం వైతే ముక్త్యై*
*నిదానం చైవ సర్వశః ॥*
*లాభస్తే షాం జయస్తే షాం*
*కుతస్తే షాం పరాజయః ।*
*యేషా మిందీ వరశ్యామో*
*హృదయస్థో జనార్దనః ॥*
*ధర్మో జయతి నాధర్మః*
*సత్యం జయతి నానృతం ।*
*క్షమాజయతి నక్రోధో*
*విష్ణుర్జయతి నాసురాః ॥*
*విష్ణుర్మాతా పితావిష్ణుః*
*విష్ణుః స్వజన బాంధవాః ।*
*యేషామేవ స్థిరాబుద్ధిః*
*న తేషాం దుర్గతిర్భవేత్ ॥*
*మంగళం భగవాన్ విష్ణు*
*ర్మంగళం గరుడధ్వజః ।*
*మంగళం పుండరీకాక్షో*
*మంగళాయతనం హరిః ॥*
*హరిర్భాగీరథీ విప్రా*
*విప్రా భాగీరథీ హరిః ।*
*భాగీరథీ హరిర్విప్రాః*
*సారమేతజ్జగత్త్రయే ॥"*

**(ధర్మ.... 47/45-49)**

అమృతోపమానములైన హరిప్రవచనాలనూ, సూతమహర్షి నుడులనూ, వింటున్న శౌనకాది మహామునులత్యంత ప్రసన్నులైనారు. ప్రాణి పవిత్రుడైనా కాకున్నా, ఏ దశలో వున్నా, ఏ దిశలో వెళుతున్నా హరిస్మరణ చేస్తుంటే లోపలా బయటా కూడా పవిత్రుడవుతాడు.

**(అధ్యాయం - 47)**

# విష్ణుదేవుని ద్వారా గరుడుని కీయబడిన మహత్త్వ పూర్ణోపదేశము మానవ శరీరధారుల కర్తవ్యము ఈశ్వర నిత్యతా వర్ణనము వివేక జ్ఞానం తత్త్వజ్ఞానం సత్సంగం

సూతమహర్షి మరల గరుడుడు విష్ణువు నడిగిన అంశాలను ఇలా విప్రవరులకు వీనులవిందుగా చెప్పసాగాడు.

'దయాసాగరా! జీవుని పుట్టుకకు మూల కారణం అజ్ఞానమేనని బోధపడుతోంది. మోక్షానికి అనగా జన్మరాహిత్యానికి గల సనాతనమైన ఉపాయాన్ని వినగోరుతున్నాను. ఓ దేవ దేవేశా, శరణాగతవత్సలా! దయచేసి వినిపించండి'

మహావిష్ణువిలా చెప్పాడు.

'గరుడా! నువ్వడిగిన ప్రశ్నకు ప్రత్యుత్తరం చాలా గొప్పది. దానిని శ్రద్ధగా విన్నంత మాత్రాననే మనిషి ఈ సంసారావాగమన చక్రం నుండి ముక్తుడు కాగలడు.

ఈ జగత్తుకి అతీతుడై పరబ్రహ్మస్వరూపుడు, నిరవయవుడూ, సర్వజ్ఞుడూ, సర్వకర్తా, సర్వేశుడూ, నిర్మలుడూ, అద్వయతత్త్వమూ, స్వయంప్రకాశుడూ, ఆద్యంత రహితుడూ, వికారశూన్యుడూ, పరాత్పరుడూ, నిర్గుణుడూ, సచ్చిదానందుడూనగు శివుడొకడున్నాడు. ఆయన అంశయే ఈ జీవుడు. అగ్నిలో నిప్పుకణాలున్నట్టే అవిద్యచే కప్పబడిన జీవిలో కూడా ఆయనుంటాడు. అనాది కర్మలచే ప్రాప్తించిన శరీరాది నానా ఉపాధులలో నుండు ఆ పరమాత్మకే ఆయా జీవులు చేసే పాప, పుణ్య కర్మలపై నియంత్రణ వుంటుంది. ఆ కర్మానుసారమే జీవికొక జన్మా, దానికి జాతి, దేహం, ఆయువు, భోగాదులు ప్రాప్తిస్తాయి. సూక్ష్మ లేదా లింగ శరీరం ఒక ఆత్మచుట్టూ ఏర్పాటవుతున్నంత కాలం అది (ఆత్మ) మరల మరల పుట్టి చస్తూ పుడుతూనే వుంటుంది. ఇదొక విషవలయం.

స్థావరాలూ, క్రిములూ, పక్షులూ, పశువులూ, మనుష్యులూ వారిలో ధార్మికులూ, చివరికి దేవతలూ కూడా యథాప్రకారంగా, యథాక్రమంగా నాలుగు రకాల శరీరాలను ధరించి ఏ వెయ్యిమార్లో వాటిని త్యజించడం జరుగుతుంది. ఏ పుణ్యకర్మ ప్రభావం వల్లనో ఒక ఆత్మ మానవయోనిలో పడుతుంది. ఎనుబది నాలుగు లక్షల యోనుల్లో ఒక్క మానవయోనిలో పడిన జీవాత్మకే తత్త్వజ్ఞానం లభించే అవకాశముంటుంది. ఇది మోక్షానికి సోపానం.

***సోపాన భూతం మోక్షస్య***
***మానుష్యం ప్రాప్య దుర్లభం ।***

ఈ దుర్లభ యోనిలో జనించి కూడా తనను తానుద్ధరించుకోలేని జీవుని కన్న ఈ జగత్తులో మూర్ఖుడెవడుంటాడు?

***యస్తారయతి నాత్మానం***
***తస్మాత్ పాపతరో ౽ త్ర కః ॥*** ***(ధర్మ... 49/25)***

అన్యయోనులకు భిన్నంగా సుందరములైన ఇంద్రియాలతో, ఆకారంతో బుద్ధితో వచ్చిన మానవజన్మను సద్వినియోగం చేసుకొని ఆత్మహితజ్ఞానాన్ని పొందనివాడు తనను సృష్టించిన బ్రహ్మకే ద్రోహం చేసినవాడవుతాడు. ఈ శరీరం లేకుండా ఏ పురుషార్థమూ సంభవం కాదు కదా! కాబట్టి దానినన్ని విధాలా, ఎల్లవేళలా సంరక్షించుకోవడం పురుషుని మొట్టమొదటి బాధ్యత. (ప్రాచీనులు నిర్దేశించిన ఉపవాసం కూడా దేహరక్షణలో భాగమే – అను) శరీరంతో బాటు ఆత్మ కూడా రక్షింపబడుతుంది. ఆజీవన పర్యంతమూ ఆత్మను రక్షించుకోగలిగినవాడు తన జీవితకాలంలోనే సర్వమంగళాలనూ చూడగలుగు తాడు. మనుష్యునికి మాటిమాటికీ దొరకనివి గ్రామం, క్షేత్రం, ధనం, గృహం, శుభం, శరీరం. అరుదైన ఈ అవయవ సముదాయాన్ని అనవరతమూ ఆరోగ్యంగా వుండేలా చూసు కొనేవాడే భగవచ్చింతన చేయగలడు. శరీర రక్ష ధర్మానికీ, ధర్మ రక్ష జ్ఞానానికీ, జ్ఞాన రక్ష ధ్యాన యోగానికీ, అది ముక్తి ప్రాప్తికీ బాటలు వేస్తాయి. ఇంద్రియలోలత్వం వల్ల, మోహ లోభాల వల్ల ఆత్మ చెడిపోయి అహితకార్యాలకు దూరంగా పోలేక చిక్కుకుపోతే ఇక ఆ మనిషి నెవరూ బాగుచేయలేరు.

ఔషధాలు దొరికేది ఇహలోకంలోనే. ఇక్కడే శరీరాన్నీ ఆత్మనూ బాగు చేసుకోలేనివాడు ఔషధరహితమైన పరలోకంలో ఎలా సుఖపడగలడు? కాబట్టి శరీరారోగ్యాన్ని కాపాడుకుంటూ అది బాగున్నపుడే తత్త్వజ్ఞానం కోసం ప్రయత్నం చెయ్యాలి. కొంతమంది 'పదవి నుండి విశ్రాంతి లభించాక' దేవుని గూర్చి 'ఆలోచిద్దాం లే' అంటారు. అపుడిక చేసేదేముంది? శరీరం శిథిలమైపోయేవేళ వచ్చిందనే కదా పదవి నుండి పంపించివేస్తారు. అప్పుడిక ఆధ్యాత్మిక చింతన మొదలు పెడదామనుకుంటే కోశాగారం తగలబడిపోతుంటే నుయ్యి తవ్వడం మొదలుపెట్టినట్లే.

***ఇహైవ నరకవ్యాధో***
***శ్చికిత్సాం న కరోతియః ।***
***గత్వాని రౌషధం దేశం***
***వ్యాధిస్థః కిం కరిష్యతి ॥***
***వాఙ్ర్ఘీవ్యాస్తే జరాచాయు***
***ర్యాతి భిన్న ఘటాంబువత్ ।***

*నిఘ్నంతి రిపువద్రోగా*
*స్తస్మా చ్ఛ్రేయః సమభ్యసేత్ ॥*
*యావన్నాశ్రయతే దుఃఖం*
*యావన్నాయాంతి చాపదః ।*
*యావన్నేంద్రియ వైకల్యం*
*తావచ్ఛ్రేయః సమభ్యసేత్ ॥*
*యావతి తిష్ఠతి దేహోఽయం*
*తావత్ తత్త్వం సమభ్యసేత్ ।*
*సందీప్త కోశభవనే*
*కూపం ఖనతి దుర్మతిః ॥*

**(ధర్మ... 49/23-26)**

ఎన్నో పనులతో, తాపత్రయాలతో, శారీరక మానసిక గ్లానిలో పడి అలసటలో కూడా విసిగి బతికే సంసారికి కాలం ఎలా గడిచిపోతుందో తెలియకుండానే జీవితమే ముగిసిపోతుంది. సుఖదుఃఖాలు ఆత్మహితం ఇత్యాదుల గూర్చి ఆలోచించే లోగానే సామాన్యుని జీవిత కాలం కరిగిపోతుంది. పుడుతున్న వాళ్ళనూ, రోగులనూ, పూర్వకర్మాన్ను నుభవిస్తూ దుఃఖిస్తున్నవాళ్ళనూ, ఆపదలలో ఇరుక్కున్న వాళ్ళనూ, చివరికి మృతి చెందుతున్న వాళ్ళనూ కూడా చూస్తూనే వుంటాడు, వారు అనుభవిస్తున్నదంతా ఒకప్పటి పాపఫలమేనని వింటూనే వుంటాడు - అయినా ఈ మనిషి మోహమనే మదిర మత్తులోపడి దేనికీ భయపడడు. భగవంతుని శరణు వేడడం మాట దేవుడెరుగు, కనీసం ఆయనను, తన ఒంట్లో ఓపికున్నంత కాలం, అసలు స్మరింపనే స్మరింపడు.

గరుడా! ధనం కలలోని సిరి వంటిది. దానిని చూసుకొని సంబరపడడం మూర్ఖత్వం. యౌవనం పువ్వులాటిది. ఎప్పుడు వాడిపోతుందో తెలియదు. దానిని చూసుకొని మిడిసిపడడం అవివేకం. నిజానికి నూరేళ్ళ ఆయువు నిజమైన సాధకునికి అత్యల్పకాలం. ఇందులో సగభాగం నిద్రకే సరిపోతుంది. బాల్యంలో, రోగమెచ్చాక, వృద్ధాప్యం పైబడ్డాక ఏమీ చేయలేడు కదా! ఇక మిగిలిన కాలమెంత? అందులో అంతా కుటుంబ పోషణకూ, తన సరదాలకూ, సరసాలకే అయిపోతే వాడి జన్మ వ్యర్థమే కదా!

*కాలో నజ్ఞాయతే నానా*
*కార్యైః సంసార సంభవైః ।*
*మూర్ఖం దుఃఖం జనోహంత*
*నవేత్తి హిత మాత్మనః ॥*
*జాతా నార్తాన్ మృతానాపద్*
*భ్రష్టాన్ దృష్ట్వా చ దుఃఖితాన్ ।*
*లోకో మోహ సురాన్ పీత్వా*
*న బిభేతి కదా చన ॥*
*సంపదః స్వప్న సంకాశా*
*యౌవనం కుసుమోపమం ।*
*తడిచ్చ పల మానుష్యం*
*కస్య స్యా జ్ఞానతో ధృతిః ॥*
*శతం జీవిత మత్యల్పం*
*నిద్రాలస్యైస్త దర్ధకం ।*
*బాల్యరోగా జరాదుఃఖై*
*రల్పం తదపి నిష్ఫలం ॥*

**(ధర్మ... 49/27-30)**

వెంటనే ప్రారంభించవలసిన పని మొదలుపెట్టకుండా, మెలకువగా వుండవలసిన వేళ మొద్దు నిదురపోతూ, భయపడవలసిన చోట మొండిధైర్యాన్ని ప్రదర్శిస్తూ దానం, దైవం లేకుండా బతికేసిన వానిని ఏ మనిషి బాగు చేయగలడు? ఏ దేవుడు రక్షింపగలడు? రెండు కనులూ తెఱచుకొని నడుస్తూ పడిపోయేవానిని (అనగా దేవుని సృష్టిని చూస్తూ దేవుడు లేడనే వానిని) వింటూ కూడా వినిపించుకోని వానిని, సద్గ్రంథాలను వృత్తిరీత్యా చదివి బోధిస్తూ కూడా తన కర్తవ్యాన్ని అర్థం చేసుకోలేని వానిని ఏ మనిషీ బాగు చేయలేడు, ఏ దేవుడూ రక్షింపడు.

*ప్రారబ్ధయే నిరుద్యోగే*
*జాగర్తవ్యే ప్రసుప్తకః ।*
*విశ్వస్తశ్చ భయస్థానే*
*హా నరః కో న హన్యతే ॥*
*తోయఫేన సమేదేహే*
*జీవే నాక్రమ్య సంస్థితే ।*
*అనిత్య ప్రియ సంవాసే*
*కథం తిష్ఠతి నిర్భయః ।*

*అహితే హిత సంజ్ఞః స్యా*
*దధ్రువే ధ్రువ సంజ్ఞకః ।*
*అనర్థే చార్థ విజ్ఞానః*
*స్వమర్థం యోన వేత్తి సః ॥*
*పశ్యన్న పి ప్రస్ఖలతి*
*శ్రుణ్వన్నపి నబుధ్యతి ।*
*పఠన్నపి న జానాతి*
*దేవమాయా విమోహితః ॥*

***(ధర్మ... 49/31-34)***

కాలమనే ఈ లోతైన మహాసాగరంలో జగత్తంతా మునుగుతూ తేలుతూ వుంటుంది. మృత్యువు, రోగము, ముసలితనము అనే మొసళ్ళ చేత ఎంత బంధింపబడినా ఎవరికీ ★గ్రాహవిముక్తిని పొందాలనే జ్ఞానం కలుగదు. ప్రతి మనిషీ భయంలోనే బతికేస్తుంటాడు. మరో పక్క నుండి వానికి కాలమిచ్చిన గడువు కరగిపోతుంటుంది. అయినా పచ్చికుండ నీటిలో పడి కరిగిపోతున్నా కనబడనట్లు ఈ మనిషి క్రమంగా కూలిపోతున్నా అలా కనబడడు. తనను తానూ చూసుకోడు, తెలుసుకోడు. గాలిని బంధించి వుంచవచ్చునేమో గాని, ఆకాశాన్ని ముక్కలు చేసి పెట్టవచ్చునేమో గాని, కడలి కెరటాలను వెనుకకు మళ్ళించ★వలంతులున్నారేమోగాని, కాలమునాపి ఆయువును పెంచగలవారు మాత్రం లేరు. ప్రళయం వస్తే నేల బీటలు వారుతుంది, సుమేరు పర్వతమే పొడి పొడియై పోతుంది, సముద్రమంతటి జలాశయమే ఎండిపోతుంది. అలాటిది మనిషి బతుక్కి ప్రళయం లాంటి చావు వచ్చినపుడు ఏ శరీరం మిగిలి వుంటుంది.

---

**★గ్రాహ = మొసలి**
**★వలంతులు = సమర్థులు**

*తన్నిమజ్జ జ్జగదిదం*
*గంభీరే కాల సాగరే ।*
*మృత్యు రోగ జరాగ్రాహై*
*ర్న కశ్చిదపి బుధ్యతే ॥*
*ప్రతిక్షణ భయంకాలః*
*క్షీయ మాణో న లక్ష్యతే*
*ఆమకుంభ ఇవాంభః స్థో*
*విశీర్ణో న విభావ్యతే ॥*
*యుజ్యతే వేష్టనం వాయో*
*రాకాశస్య చ ఖండనం ।*
*గ్రథనంచ తరంగాణా*
*మాస్థానాయుషి యుజ్యతే ॥*
*పృథివీ దహ్యతే యేన*
*మేరుశ్చాపి విశీర్యతే ।*
*శుష్యతే సాగరజలం*
*శరీర స్యచ కా కథా ॥*
*అపత్యం మే కళత్రం మే**
*ధనం మే బాంధవాశ్చమే ।*
*జల్పంతమితి మర్త్యా జం*
*హంతి కాలవృకో బలాత్ ॥*

**(ధర్మ... 49/35-39)**

రేపు చేద్దామనుకున్న మంచి పనిని ఇవాళే చేసెయ్యాలి. ఎందుకంటే ఆ పని అయ్యేదాకా మృత్యువాగదు. మనిషి యొక్క శత్రుసేన బలిష్టమైనది, భయంకరమైనది. దానికి పథప్రదర్శకులు మనిషి వృద్ధావస్థ; రోగాలు సైనికులు, సేనాని పాపము, శత్రురాజు మృత్యువు. ఈ భయంకర యుద్ధంలో అపజయ, మృత్యుగహ్వరాల నుండి రక్షించగలవాడు, విష్ణువొక్కడే. ఊహ తెలిసిననాటి నుండీ విష్ణువునే స్మరిస్తున్న వాడీ యుద్ధాన్నే చేయనక్కరలేదు. వానిని దేహాంతంలో దేవదూతలు వచ్చి విమానంలో గొనిపోతారు. ఇల్లు, ఇల్లాలు, పిల్లలు - ఇలాంటి బంధాలకు కట్టుబడకుండా బాధ్యతగా మాత్రమే వాటితో ప్రసక్తాన్ని పెట్టుకొని మృత్యువు కోసం దేవుని కోసం ఎదురు చూసేవాడు సుఖి.

*ఇదం కృత మిదం కార్య*
*మిదమన్య త్కృతాకృతం ।*
*ఏవమీహా సమాయుక్తం*
*కృతాంతః కురుతే వశం ॥*
*శ్వః కార్యమద్య కుర్వీత*
*పూర్వాహ్ణే చాపరాహ్ణికం ।*
*న హి మృత్యుః ప్రతీక్షతే*
*కృతం వాప్యథ వా ఽ కృతం ॥*
*జరాదర్శిత పంథానం*
*ప్రచండ వ్యాధి సైనికం ।*
*అధిష్ఠితో మృత్యు శత్రుం*
*త్రాతారం కిం న పశ్యతి ॥*
*తృష్ణా సూచీ వినిర్భిన్నాం*
*సిక్తం విషయ సర్పిషా ।*

* సంస్కృతంలో 'మే' అంటే 'నా యొక్క' అని అర్థము ఈ మనిషి నా భార్య, నా కొడుకు, నా ధనము, నా వాళ్ళు అని మేకలాగ విఱ్ఱవీగుతూ అరుస్తునేవుంటాడు. కాలమనే తోడేలు వచ్చి కబళించే దాకా ఆ మే కారం సాగుతుంది. అక్కడితో సరి.

*రాగ ద్వేషానలే పక్వం*
*మృత్యు రశ్నాతి మానవం ॥*
*బాలాంశ్చ యౌవన స్థాంశ్చ*
*వృద్ధాన్ గర్భ గతానపి ।*
*సర్వానా విశితే మృత్యు*
*రేవం భూత మిదం జగత్ ॥*
*స్వదేహ మపి జీవోఽ యం*
*ముక్త్వాయాతి యమాలయం ।*
*స్త్రీ మాతృ పితృ పుత్రాది*
*సంబంధః కేన హేతునా ॥*
*దుఃఖ మూలం హి సంసారః*
*సయస్యాస్తి స దుఃఖితః ।*
*తస్య త్యాగః కృతోయేన*
*స సుఖీ నాపరః క్వచిత్ ॥*

*(ధర్మ... 49/40-46)*

అన్ని రకాల దుఃఖాలకీ జనకమూ, సమస్తా పదలకూ పుట్టినిల్లూ, అన్ని ప్రకారాల పాపాలకూ ఆశ్రయమూ ఈ ప్రపంచము. కాబట్టి నరులు ఏ క్షణంలోనైనా దీనిని త్యజించడానికి సిద్ధంగా వుండాలి. ఇనుప వలలో కఱ్ఱ పెట్టెలో ఇరుక్కుని చిక్కుకున్న వాడైనా తప్పించుకోగలడేమోగాని స్త్రీ, పుత్రులు అనే మోహజాలంలో చిక్కుకున్నవాడిక విడుదల కాలేడు. మనిషి మనసుకి నచ్చిన పదార్థాల సంఖ్యను పెంచుకుంటూ పోతున్న కొద్దీ వాని మనసులో శోకాగ్ని కీలలు కూడా పెరుగుతూనే వుంటాయి. ఇంద్రియాలనెడు దొంగలు ప్రపంచాన్నే దొంగిలించి మూటకట్టి నరకం వైపు మోసుకుపోతాయి. ఆ మూటలో తాను ఉండకూడదనే ప్రతి మనిషీ కోరుకోవాలి. కాని మాంసపు ఎఱను మాత్రమే చూసి వెదురు ముల్లును పట్టించుకోకుండా ఆశ రేపిన దారిలోకి శీఘ్రం పయనించి గాలంలో చిక్కుకున్న చేపలాగా సుఖలాలస కొద్దీ ఇరుక్కున్న మనిషి యముని పట్టించుకోకుండా బతికేసి చచ్చాక ఏడుస్తాడు.

*ప్రభవం సర్వ దుఃఖానా*
*మాలయం సకలాపదాం ।*
*ఆశ్రయం సర్వపాపానం*
*సంసారం వర్జయేత్ క్షణాత్ ॥*
*లోహదారుమయైః పాశైః*
*పుమాన్ బద్ధో విముచ్యతే ।*
*పుత్రదార మయైః పాశై*
*ర్ముచ్యతే న కదాచన ॥*
*యావతః కురుతే జంతుః*
*సంబంధాన్ మనసః ప్రియాన్ ।*
*తావంతోఽ స్య నిఖన్యంతే*
*హృదయేశోక శంకవః ॥*
*వంచితాశేషవిత్తై స్తై*
*ర్నిత్యం లోకో వినాశితః ।*
*హా హంత విషయాహారై*
*ర్దే హస్థేంద్రియ తస్కరైః ॥*
*మాంసలుబ్ధో యథా మత్స్యో*
*లోహశంకుం నపశ్యతి ।*
*సుఖలుబ్ధ స్తథా దేహీ*
*యమబాధాంనపశ్యతి ॥*

*(ధర్మ..... 49/ 47-51)*

గరుడా! తనకి హితమైనదేదో అహితమైనదేదో తెలుసుకోకుండా నిత్య కుపథగామియై అంటే బతుకంతా చెడ్డ మార్గంలో దుష్కర్మలనే గావిస్తూ, తన పొట్ట నింపుకోడం గురించే ఆలోచిస్తూ గడిపేసేవాడు నారకీయ ప్రాణి అయిపోతాడు. అంటే భూలోకంలో లేనికాలమంతా నరకంలోనే వుంటాడు. ఆహార నిద్రా భయమైథునాలు అన్ని జంతువులకీ సమానమే అయినా భగవద్ జ్ఞానంకల వారు మాత్రమే మానవులు కాగా మిగతావన్నీ, కొన్ని నరరూపంలో వున్నా, జంతువులే. పొద్దున్నే మల మూత్రాలను గూర్చీ, మధ్యాహ్నం, రాత్రీ భోజనాన్ని గూర్చి, రాత్రి మైథునాన్ని గూర్చి మాత్రమే ఆలోచిస్తూ అవి అయిపోగానే నిద్రపోయేవారు మూర్ఖులు. మానవజాతి విషయంలోనన్నుకూడా బాధించే దేమిటంటే వీరిలో అధిక శాతం అజ్ఞానం వల్ల మోహితులైపోయి తమ శరీరం, తమ స్త్రీ, తమ ధనం మున్నగు వాటి గూర్చే ఆలోచిస్తూ వాటి కోసమే జీవిస్తూ ఆ కోరికలూ, ఋణాలూ తీరక మరల వాటి కోసమే జన్మనెత్తుతున్నారు, మరణిస్తున్నారు. ఇది పద్ధతి కాదు. మనిషి తన ఆసక్తిని త్యజించాలి. బాధ్యతను మాత్రమే నిర్వర్తించాలి. నా వైపు మళ్ళాలి. ఆధ్యాత్మిక జ్ఞానం పై ఆసక్తిని పెంచుకోవాలి. ఇదీ పద్ధతి.

*హితాహితం న జానంతో*
*నిత్యమున్మార్గగామినః ।*
*కుక్షి పూరణ నిష్ఠాయే*
*తే నరా నారకాః ఖగ ॥*
*నిద్రాభీమైథునాహారాః*
*సర్వేషాం ప్రాణినాం సమాః ।*
*జ్ఞానవాన్ మానవః ప్రోక్తో*
*జ్ఞానహీనః పశుః స్మృతః ॥*
*ప్రభాతే మలమూత్రాభ్యాం*
*క్షుత్తృంభ్యాం మధ్యగేరవౌ।*

*రాత్రౌ మదన నిద్రాభ్యాం*
*బాధ్యంతే మూఢమానవాః ॥*
*స్వదేహధనదారాది*
*నిరతాః సర్వజంతవః ।*
*జాయంతే చ మ్రియంతే చ*
*హా హంతాజ్ఞాన మోహితాః ॥*
*తస్మాత్ సంగః సదాత్యాజ్యః*
*సచేత్ త్యక్తుం నశక్యతే ।*
*మహద్భిః సహ కర్తవ్య ః*
*సంతః సంగస్య భేషజం ॥*

*(ధర్మ.... 49/52-56)*

సత్సంగం, వివేకం – ఈ రెండూ మానవుని మలరహిత, ఆరోగ్యకరములైన రెండు నేత్రాలు. ఈ రెండూ లేని వాడు అంధుడికిందే లెక్క.

*సత్సంగశ్చ వివేకశ్చ*
*నిర్మలం నయనద్వయం ।*

*యస్యనాస్తినరః సోఽంధః*
*కథం న స్యాద మార్గగః ॥* *(ధర్మ.... 49 / 57)*

ఏకభుక్తాలూ, ఉపవాసాలూ చేసి వూరుకుంటే చాలదు. అంతమాత్రాననే అజ్ఞానులైన జనులకు ముక్తి వచ్చెయ్యదు. పాపమూ నశించిపోదు. ఒక చిన్న కర్రపుల్లతో కొట్టినంత మాత్రాన మహాభుజంగం మరణిస్తుందా?

పెద్దపెద్ద జటలు పెంచుకొని, మృగచర్మాన్ని ధరించి వేషానికి మాత్రమే ఋషులై దాంభిక జ్ఞానాన్ని ప్రదర్శించే వారి అసలు రూపాన్ని తెలుసుకోవడానికి వివేకం కావాలి. అలాటి వారిని దూరం నుండే త్యజించాలి. వారే ఘోరనరకంలో పడబోతున్నారు. ఇకనన్నేమి రక్షిస్తారు? అనుకోవాలి. కొంతమంది సర్వసంగ పరిత్యాగులమని చెప్పుకొని దిగంబరులై సిగ్గులేకుండా తిరుగుతుంటారు. వారి పట్ల కూడా వివేకాన్ని వినియోగించాలి.

మట్టినీ భస్మాన్నీ ఒంటినిండా పులుముకొని తిరుగుతూ కొందరు తమకు ముక్తి తథ్యమని చెప్పుకుంటుంటారు. ఊరకుక్కలూ అలాగే తిరుగుతాయిగా, మంటిలో బూడిదలో పొర్లుతూ?

నిజమైన జ్ఞాని, వనవాసి అడవిలోకి మనం వెళ్ళినా ఒకంతట దొరకడు. అతడు తాపసియై గడ్డి, ఆకులు, పుల్లలు, నీరు మాత్రమే ఆహారంగా తీసుకుంటాడు. అడవిలో చాల జంతువులు (మాంసం దొరకనపుడు నక్కతో సహా) అలాగే బతికేస్తుంటాయి. వాటన్నిటి యెదుటా మోకరిల్ల లేముకదా! అలాంటి, నక్కలవంటి తాపసులు మనుష్యులలో కూడా వుంటారు. వారిని పోల్చుకోవడానికి వివేకం కావాలి. గంగలో రోజూ మునకేసినంత మాత్రాన ఎవడూ మహాయోగికాలేడు. నిత్యం గంగలోనే వుంటాయిగా కప్పలూ, చేపలూనూ కొంతమంది నిత్యవ్రతులమని చెప్పుకుంటూ నిలవ నీటిని తాగరు. అంత మాత్రాన పావురం, శిలాహారం, చకోరం ముక్తులై పోతాయనగలమా? గరుడా! ఈ వ్రతాలూ, తపాలూ, ఉపవాసాలూ, నిరాహారాలూ వ్యర్థం కావు. అనవసరమూ కావు. ఇవన్నీ ముక్తికి మార్గాలే, కాని తత్త్వజ్ఞాన సహితములైనపుడే వాటికి గొప్ప విలువవుంటుంది. (ఒకటి అంకె పక్కన సున్నాలలాగ. – అను)

వేదాలనూ శాస్త్రాలనూ చదవగానే సరికాదు. బట్టీపట్టి ఒప్పజెప్పినంత మాత్రాన కూడా దైవ, మానవసేవకాబోదు. వాటి సారాన్ని గ్రహించి, ఆచరించి, అనుభవించి కనీసం భావస్వప్నంలోనైనా భగవంతుని చూడగలిగి అప్పుడు ప్రజలకు దానిని బోధించిన వాడు జనంలో జనార్దనుడవుతాడు. మానవ సేవా మాధవ సేవా కూడా చేసిన వాడవుతాడు. దీపం అనే మాటను పలకగానే ఎలాగైతే చీకటి దూరం కాదో అలాగే శబ్దజ్ఞానమును

సంపాదించినంత మాత్రాన వ్యక్తిలోని అజ్ఞానం సమసిపోదు. బుద్ధిలేని వాని చేతిలోని చదువు అంధుని చేతిలోని అద్దంలాంటిదే. శాస్త్రాలన్నీ చదివెయ్యాలని కొందరు బయల్దేరతారు కాని అలా చేయగలగడం అసాధ్యం. హంసపాలను పీల్చినట్లు శాస్త్రసారాన్ని గ్రహించడం వివేకి లక్షణం.

***అనేకాని చశాస్త్రాణి***

***స్వల్పాయుర్విఘ్నకోటయః ।***

***తస్మాత్ సారం విజానీయాత్***

***క్షీరం హంస ఇవాంభసి ॥*** ***(ధర్మ..... 49/84)***

వేదశాస్త్ర విద్వాంసునికి పరమతత్త్వానికి సంబంధించిన జ్ఞానం ప్రాప్తించిన తరువాత ఇక దేనితోనూ పని వుండదు. అమృతం త్రాగిన వానికిక అన్నంతో అవసరమేముంటుంది?

వేదాధ్యయనంవల్ల గానీ శాస్త్రపాండిత్యం వల్లగానీ మోక్షం రావాలని లేదు. కైవల్యం జ్ఞానం వల్లనే తప్ప మరో విధంగా రాదు. ఆశ్రమాలూ, దర్శనాలూ కూడా ముక్తి సాధనాలు కావు. ఏ కర్మ ద్వారానైనా ముక్తి కోసం ప్రయత్నించవచ్చునేది సరికాదు. జ్ఞాన మొక్కటే ముక్తి నిస్తుంది. వెయ్యిశాస్త్రాలను నెత్తిపై కెక్కించుకొని చదివినా రాని అద్వైత శివతత్త్వం గురూపదేశం ద్వారా, ఆయన చెప్పిన సాధన ద్వారా సాధ్యం.

జ్ఞానం రెండు ప్రకారాలని పెద్దలంటారు. ఒకటి శాస్త్రకథిత జ్ఞానము కాగా రెండవది వివేకం వల్ల ప్రాప్తించేది. శబ్దమే బ్రహ్మమని ఆగమశాస్త్రమంటుంది. పరమతత్త్వమే బ్రహ్మయని వివేకులంటారు. కొంతమంది అద్వైతాన్నీ కొంత మంది ద్వైత సిద్ధాంతాన్నీ బలపరుస్తారు. కాని, వీళ్ళలో ఎవరికీ తెలియని దేమిటంటే పరమాత్మ సమభావనగలవాడు. ద్వైతా ద్వైత రహితుడు.

బంధనానికి, మోక్షానికీ రెండక్షరాలే తేడా, 'ఇది నాది' అనేది బంధనం. 'ఏదీ నాది కాదు' అనే జ్ఞానమే ముక్తి.

***ద్వేపదే బంధ మోక్షాయ***

***నమమేతి మమేతిచ ।***

***మమేతి బధ్యతే జంతు***

***ర్నమమేతి ప్రముచ్యతే ।*** ***(ధర్మ.... 49/93)***

ఏ కర్మయితే ఈ జీవాత్మను బంధనంలోకి గొనిపోదో అదే సత్కర్మం. ప్రాణికి ముక్తిని ప్రదానం చేయగల సామర్థ్యమున్నదే విద్య. ఈ ప్రాణిలో సత్కర్మకాని దానివైపు ఆకర్షణ వున్నంత కాలం, సాంసారిక వాసనలు మిగిలిపోయి వున్నంతకాలం, ఇంద్రియాలలో చాపల్యం వున్నంతకాలం ఆ ప్రాణికి పరమతత్త్వ జ్ఞానం కలుగదు.

***తత్కర్మయన్నబద్ధాయ***
***సావిద్యాయా విముక్తిదా ।***
***ఆయాసాయాపరం కర్మ***
***విద్యాన్యా శిల్ప నైపుణం ॥***
***యావత్ కర్మాణి దీప్యంతే***
***యావత్ సంసార వాసనా ।***
***యావదింద్రియ చాపల్యం***
***తావత్ తత్త్వ కథా కుతః ॥*** ***(ధర్మ... 49/94,95)***

తన శరీరంపై ప్రేమ, దాన్ని చూసుకొని గర్వం, అన్నీ తానే చేయగలననుకొనే అహంకారం, ప్రయత్నం మాత్రమేతాను చేయగలననే వివేకం లేకపోవడం, శాస్త్రచింతనలేమి, మనస్సులో అస్థిరత – ఇవన్నీ గాని ఏ ఒక్కటిగాని ఉన్నా గురువుకి వానిపై దయకలుగదు. గురువుకే దయ కలగకపోతే పరమగురువైన పరమాత్మకి మాత్రం ఎందుకు కలగాలి?

ఓయి కాశ్యపా! తపాలూ, వ్రతాలూ, తీర్థాలూ, జపాలూ, హోమాదికములూ, వేదశాస్త్ర పఠన పాఠనాలూ – ఇవన్నీ పుణ్యం కలిగిస్తాయి, పరమాత్మవైపు నడిపిస్తాయి. పరమార్థ తత్త్వం తెలుసుకున్న వానికి ఆపై వీటి అవసరముండదు. మోక్షాన్ని కోరుకొనే వాడు అన్ని దశలలోనూ అవస్థలలోనూ పరమనిష్ఠతో దాని గూర్చే జీవించాలి. గురు ముఖంగా ప్రాప్తించిన విద్యను కూడా దానికే వినియోగించాలి. ఆత్మ తత్త్వ జ్ఞానాన్ని ఆ విధంగా పొందినవాడే ఈ దుర్ధర్ష సంసారబంధనాలనుండి సుఖంగా విడివడి పోగలడు.

***తావత్తపో వ్రతం తీర్థం***
***జపహోమార్చనాదికం ।***
***వేదశాస్త్రాగమ కథా***
***యావత్ తత్త్వం నవిందతి ॥***

*తస్మాత్ సర్వ ప్రయత్నేన*
*సర్వావస్థాసు సర్వదా ।*
*తత్త్వ నిష్ఠోభవేత్ తార్క్ష్య*
*యదీచ్ఛేన్మోక్ష మాత్మనః ॥*
*ధర్మజ్ఞాన ప్రసూనస్య*
*స్వర్గ మోక్ష ఫలస్య చ ।*
*తాపత్రయాదిసంతప్త*
*శ్ఛాయాం మోక్షతరోః శ్రయేత్ ॥*
*తస్మాద్ జ్ఞానే నాత్మతత్త్వం*
*విజ్ఞేయంశ్రీ గురోర్ముఖాత్ ।*
*సుఖేన ముచ్యతే జంతు*
*ర్ఘోర సంసారబంధనాత్ ॥* *(ధర్మ.... 49/98-101)*

గరుడా! తత్త్వజ్ఞుని అంతిమకృత్యాలు చెప్తాను విను. వీటి ద్వారానే బ్రహ్మపద, నిర్వాణమను పేర్లుగల మోక్షం ప్రాప్తిస్తుంది.

మరణాసన్నవేళ తత్త్వజ్ఞుడు తన దేహాది ఆసక్తులన్నిటినీ శాస్త్రంలో చెప్పబడిన అసంగరూప ఖడ్గంతో తెగగోసుకోవాలి. తన ఇంట్లోనే వుంటూ సన్యాసాశ్రమాన్ని స్వీకరించి తీర్థస్నానం చేసి వస్తుండాలి. ఆ పవిత్ర తీర్థంలోనే ఏకాంత, శుద్ధ, స్వచ్ఛ ప్రదేశంలో విధ్యుక్తంగా ఆసనగ్రహణం చేసి ఏకాగ్రచిత్తుడై గాయత్రిమంత్రం ద్వారా ఆ పరమశుద్ధ బ్రహ్మాక్షరాన్ని ధ్యానించాలి. బ్రహ్మము యొక్క బీజమంత్రాన్ని మననం చేస్తూనే శ్వాసను ఆపి మనస్సును వశం చేసుకోవాలి. మనస్సనే గుఱ్ఱాన్ని బుద్ధియనెడి సారథిద్వారా సాంసారిక విషయాలవైపు పోకుండా నియంత్రించుకోవాలి. బుద్ధి ద్వారానే దానిని శుభకర్మలవైపు మళ్ళించుకోవాలి.

'నేనే బ్రహ్మను, నేనే పరమధామమును, నేనే పరమపదమును' అని సమీక్షించు కుంటూ ఏదో ఒక రోజు తన ఆత్మను నిష్కల ఆత్మలో ప్రవేశపెట్టాలి. 'ఓం' అనే ఏకాక్షర బ్రహ్మ జపాన్ని అవసాన వేళలో చేసేవాడు శరీరాన్ని త్యజించి పరమపదాన్ని పొందగలడు.

*ఓమిత్యేకాక్షరం బ్రహ్మ*
*వ్యాహరన్మా మనుస్మరన్ ।*
*యఃప్రయాతి త్యజన్ దేహం*
*సయాతి పరమాం గతిం ॥* *(ధర్మ.... 49/108)*

సుధీజనులనగా మంచి మేధస్సు గలిగి పరమాత్మవైపు వెళ్ళేవారు. అహంకారులూ, జ్ఞానవైరాగ్యరహితులూనగు సామాన్యులు చేరుకోలేని పదాన్ని వారందుకుంటారు. వారికి మాన – మోహాలుండవు; ఆసక్తి దోషానికి వారు అతీతులు. నిత్య అధ్యాత్మచింతనలో దత్తచిత్తులు; సాంసారిక సమస్తకామనలకూ బహుదూరులు; సుఖ – దుఃఖనామకద్వంద్వం నుండి ముక్తులు. అట్టి జ్ఞానులైన సుధీజనులు అవ్యయపదప్రాప్తి నందగలరు.

*నిర్మానమోహా జితసంగదోషా*
*అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।*
*ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞై*
*గచ్ఛంత్యమూఢాః పదమవ్యయంతత్ ॥* (ధర్మ.... 49 / 110)

ప్రౌఢ వైరాగ్యంలో వుంటూ అనన్యభావంతో నా భజనను చేసే వారికి ముక్తి లభిస్తుంది.

*ప్రౌఢవైరాగ్యమాస్థాయ*
*భజతే మామనన్యభాక్ ।*
*పూర్ణ దృష్టిః ప్రసన్నాత్మా*
*సవై మోక్షమవాప్నుయాత్ ॥* (ధర్మ.... 49 / 112)

అయోధ్య, మథుర, మాయ, కాశి, కంచి, అవంతిక, ద్వారక అనే సప్తపురాలూ మోక్ష ప్రదాలు. మరణాసన్నవేళ ఇంటిని విడిచి ఇక్కడికొచ్చి మృతిచెందిన వారికి మోక్షం లభిస్తుంది.

*త్యక్త్వా గృహంచయస్తీర్థే*
*నివసేన్మరణోత్సుకః ।*
*ముక్తి క్షేత్రేషు మ్రియతే*
*సవైమోక్ష మవాప్నుయాత్ ॥*
*అయోధ్యా మథురా మాయా*
*కాశీ కాంచీ అవంతికా ।*
*పురీ ద్వారవతీ జ్ఞేయాః*
*సప్తైతా మోక్ష దాయికాః ॥* (ధర్మ.... 49 / 113, 114)

ఓయి తార్క్ష్యా! జ్ఞాన వైరాగ్యయుక్తమైన మోక్షధర్మాన్ని సాంతమూ విన్నావు కదా! దీనినికనీనుండి ఎవరు విన్నా వారిద్వారా మరెందరు విన్నా వారందరికీ మోక్షం లభిస్తుంది.

తత్త్వజ్ఞులకి మోక్షం ప్రాప్తిస్తుంది. ధర్మనిష్ఠులు స్వర్గానికి వెళతారు. పాపులు నరకానికి పోతారు.

*మోక్షం గచ్ఛంతి తత్త్వజ్ఞా*
*ధార్మికాః; స్వర్గతిం నరాః ।*
*పాపినో దుర్గతిం యాంతి*
*సం సరంతి ఖగాదయః ॥* **(ధర్మ.....49 / 116)**

అని విష్ణువు తనకు కావలసిన దానిని చెప్పడంతో సంతుష్టుడైనాడు గరుడుడు. ధన్యుడు కూడా అయినాడు. అతని ద్వారా అతని పేరిటనే ఒక అద్భుతమైన పురాణం లోకానికి ప్రసాదించబడింది." అని అంటూ విష్ణువుకీ గరుడునికీ నమస్కరించి మరల ఇలా చెప్పాడు సూతమహర్షి.

"విప్రోత్తములారా! తన ప్రశ్నలకు సమాధానంగా ఒక మహాపురాణాన్నే ప్రసాదించిన స్వామికి నమస్కరించి అశ్రుపూరితనయనుడై మిక్కిలి ప్రసన్నుడై గరుత్మంతుడిలా అన్నాడు 'ప్రభో! తమ ఈ ఆహ్లాదకర వచనాలను విని గహనాతి గహనమైన విషయాలను అర్థం చేసుకున్నాను. ఇలాటి గంభీర విషయాన్ని ఇంత ఆహ్లాదకరంగా చెప్పగలవారు లేరు. అయినా మీ దయ వల్ల ప్రయత్నిస్తాం'. ఇలా చెప్పి సాష్టాంగ నమస్కారం చేసి గరుత్మంతుడు కశ్యపాశ్రమానికి వెళ్ళాడు".

తరువాత శౌనకమహర్షి ఇలా అన్నాడు 'పరమపవిత్రము పుణ్యదాయకమునగు ఈ పురాణం విన్నవారికి సకలపాపనాశకము, సమస్తకామనలపూరకము."★

**(అధ్యాయం - 49)**

**ధర్మకాండ - ప్రేతకల్పం సమాప్తం**

---

★ ***గరుడపురాణ మాహాత్మ్యంలో రాదగిన శ్లోకాలివి :***
*పురాణం గారుడం పుణ్యం పవిత్రం పాపనాశనం ।*
*శృణ్వతాం కామనాపూరం శ్రోతవ్యం సర్వదైవహి ॥* **(ధర్మ.... 49 / 132)**
*యశ్చేదం శృణుయామర్త్యో*
*యశ్చాపి పరికీర్తయేత్ ।*
*విహాయ యాతనాం ఘోరాం*
*ధూతపాపోదివం వ్రజేత్ ॥* **(ధర్మ.....49 / 136)**



ప్రేతజీవిపై మమకారంచే దుఃఖిస్తున్న భర్త, పుత్రులు, బంధువులు



నఖ కుండంలో రాతి ముక్కులతో పాపులను పొడుస్తున్న గద్దలు


భోజనం దొంగలించిన పాపికి నరకబాధ, వారు ఎలుకగా జన్మించుట



నీకై నీవారు చేసిన పుణ్యంగాని దానంగాని ఏమైనా ఉందా? అని ఆరాతీస్తున్న యమభటులు



పాపుల పాపాలను యమునికి వివరిస్తూ చిత్రగుప్తుడు, యమభటులు



మృతి చెందినవాని నిమిత్తం 'ఉదకుంభదానం' చేయుట



వివిధ పాపములకు వివిధ జంతువులచే హింస కలిగిస్తున్న యమభటులు

శ్రీ

# గరుడ పురాణం

## బ్రహ్మకాండ*

## శ్రీహరి మహిమ - సర్వేశ్వరత్వం

### భాగవత, విష్ణు, గరుడ పురాణాలపై స్వామిప్రేమ - నిరూపణం

విశ్వానికి జ్ఞాన నేత్ర స్వరూపుడైన పరబ్రహ్మ శ్రీహరి స్తవనాన్నే నిత్యం చేస్తూ వుండే సర్వశాస్త్ర తత్త్వజ్ఞుడూ, మానవకల్యాణం కోసం సహస్రాబ్దాలపాటు సత్రయాగాన్ని చేసి లోకరక్షక మునిపుంగవునిగా పేరు గాంచినవాడూనగు శౌనకమహర్షి ఇతర బ్రహ్మవాదులైన మహామునులతో బాటు రెండు యాగాల మధ్య విశ్రాంతి కాలంలో *నైమిషారణ్యంలో తపస్సులో మునిగియున్నాడు. ఆయన చాలాకాలానికి కనులు తెరిచే సరికి నైమిషంలోని ఇతర మహర్షులంతా వినయంగా నిలబడి వేచియున్నారు. వారంతా జితేంద్రియులు, ఆకలి దప్పులను కూడా గెలువగలిగినవారు, సత్యపరాయణులు, సంతులు, సంసారానికి సమస్త జ్ఞానాన్నీ ప్రసాదించే విష్ణు భగవానునే నిరంతరం ధ్యానిస్తూ పూజిస్తూ జీవిస్తున్న పుణ్య పురుషులు. వారిలో కొందరు యజ్ఞం ద్వారా యజ్ఞపతి యొక్క తత్త్వాన్నీ, ఇంకొందరు జ్ఞానం ద్వారా జ్ఞానాత్మక పరబ్రహ్మతత్త్వాన్నీ,మరికొందరు పరమభక్తి ద్వారా నారాయణ తత్త్వాన్నీ అంది పుచ్చుకున్నారు.

---

*దీనికి మోక్ష కాండ అనే పేరు కూడా వున్నట్టు చెప్పబడుతుంది. గరుడ పురాణ సంస్కరణల్లో చాలా చోట్ల ఈ కాండల పేర్లు కనిపించవు. పూర్వార్థ, ఉత్తరార్థ అని మాత్రమే వుంటాయి.

* నైమిషారణ్యం అనే మాట నిమిష అనే మాటకు ఆదివృద్ధి రావడం వల్ల నేర్పడింది. ఈ అరణ్యంలో ప్రతి నిమిషమూ ఏవో యాగాలూ శాస్త్ర చర్చలూ పురాణ శ్రవణాలూ జరుగుతుంటాయి. అక్కడి ప్రతి నిమిషమూ విలువైనదే, పవిత్రమైనదే కాబట్టిఅది నైమి'షా'రణ్య మైంది.
కాలచక్ర నిమి ఇక్కడ తిరగదు. కాబట్టి అది నైమిషారణ్యమైంది.
గౌరముఖుడనే ముని ఒకనిమిషంలోనే వందలమంది అసురులను భస్మంచేసిందిక్కడే కాబట్టి అది నైమిషారణ్యం.

వారిలో సద్గోష్ఠిలో ప్రసక్తంగా ధర్మార్థకామ మోక్షాలను పొందడం అనే మాట వచ్చింది. ఆ ఉపాయాన్ని తెలుసుకోడానికి, చెప్పి జాతినుద్ధరించడానికీ ఒక చోట చేరారు. ఆ మునులొక అరవైవేలమంది వుంటారు. వారంతా రాగద్వేషముక్తులే. సామాన్య జీవులపై అనుగ్రహం కలవారే. లోకులకు విష్ణువు పై అచంచలభక్తి కుదరాలంటే ఏం చేయాలి, ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక సంపూర్ణకర్మల సిద్ధి సామాన్య ప్రజలకెలా సాధ్య మౌతుంది? ఇలాంటి ఎన్నో ప్రశ్నలకు సమాధానం కోసం ఆ మహాతేజస్వులంతా శౌనక మహర్షికభిముఖులై నిలబడ్డారు.

ఆ మహాత్ముడు వీరి జిజ్ఞాసను తెలుసుకొని వారికి తానే లేచి నిలబడి నమస్కరించి ఇలా అన్నాడు – "మహాత్ములారా! మనందరి, ఇంతటి ఉత్తమ, ఉన్నత జిజ్ఞాసను తీర్చగలవాడు సూతమహర్షి. వేదవ్యాసునిప్రియ శిష్యుడైన ఆ పౌరాణికోత్తముడు ప్రస్తుతం సిద్ధాశ్రమంలో విరాజమానుడై యున్నాడు. పదండి ఆ మహామహుని వద్దకు పోదాం. అని బయలు దేరాడు.

సూతమహర్షి వీరినాదరించి ఆసనాలు చూపించి సత్కరించిన పిమ్మట ఆతని ఆనతి మేరకు శౌనక మహర్షి ఆయన నిలా ప్రార్థించాడు.

"సూతభగవన్! మే మొక జిజ్ఞాస తీరుటకై మిమ్మాశ్రయించాం. ఋషిశ్రేష్ఠా! ఏ ఉపాయం ద్వారా విష్ణు భగవానుని ప్రసన్నుని చేసుకోవచ్చు? ఆయన నెలా పూజించాలి? ముక్తికి సాధన భూతమైన తత్త్వమేది?"

ప్రసన్నదృక్కులను వారివైపు ప్రసరింపజేస్తూ ప్రశాంతంగా ప్రవచింపసాగాడు సూత మహర్షి – ఇలా :

"ఋషి శ్రేష్ఠులారా! విష్ణు దేవునికీ, లక్ష్మీమాతకూ, సరస్వతీదేవికీ, వాయుదేవునికీ, ఆదిశేషునికీ, గురుశ్రేష్ఠులైన కృష్ణద్వైపాయన వ్యాసభగవానులకీ నమస్కరించి వారిచ్చిన జ్ఞానం సాయంతో నాకు వచ్చిన దేదో మీకు విన్నవిస్తాను. శ్రేష్ఠతత్త్వ స్వరూపుడైన విష్ణు భగవానునితో సమానులు లేరు, ఉండరు, ఉండబోరు.

*నాస్తి నారాయణ సమం*
*న భూతం న భవిష్యతి ।* *(బ్రహ్మ.... 1 / 18)*

ఈ సత్యవాక్యం ద్వారా మీ కార్యసిద్ధికి నేను ప్రయత్నిస్తాను.

"ఋషిశ్రేష్ఠా! మొట్టమొదట విష్ణు భగవానునికే ఎందుకు నమస్కరించాలి? దయచేసి చెప్పండి" అన్నాడు శౌనకుడు.

"హే శౌనకా! అన్ని వేదాలద్వారా వేద్యుడు – అనగా తెలుసుకొనబడేవాడు. వేదశాస్త్ర పురాణేతిహాసాలలో సర్వత్ర కీర్తింపబడుతున్న ఏకైక దైవతము మహావిష్ణువే కాబట్టి ఆయనే ప్రథమ వందనీయుడు. ఆయనే అందరిలోనూ జ్ఞానరూపంలో ప్రకాశిస్తుంటాడు. కాబట్టే ప్రథమ ప్రణామయోగ్యుడు. అందరిలోనూ ప్రధానుడు అందరికంటే అన్ని విధాలా అధికుడు విష్ణువే కాబట్టి ఆయనే ప్రప్రథమ, సర్వ ప్రథమ ప్రణామయోగ్యుడు.

విష్ణు సమానుడైన దేవుడుగాని వాయుసమానుడైన గురువుగానిలేరు. విష్ణుపది సమానమైన తీర్థంలేదు. విష్ణుభక్తులతో సమానులైన భక్తులు లేరు.

కలియుగంలో ఎన్నో పురాణాలు ప్రాచుర్యంలోకి వస్తాయి. అన్నీ పరమ పవిత్రాలూ ముక్తి దాయకాలే అయినా మహా విష్ణువుకి ప్రత్యేక ప్రీతికరములైనవి మూడు. భగద్భక్తుల ప్రసక్తి ఎక్కువగానున్నదీ, కలికాలంలో మనిషికి విన్నంతమాత్రాన కల్యాణకారిగా వుండేదీ, సృష్టిని మొదటిసారిగా విష్ణు రూపంగా చెప్పేదీ, ఆయన నుండే బ్రహ్మ, మహేశాదుల సృష్టి జరిగిందని వెల్లడించేదీ, ఎన్నో అర్థాలనూ తత్త్వాలనూ అనితర సాధ్యమైన తత్త్వజ్ఞానాన్నీ ప్రతిపాదించేదీ అయిన **శ్రీ భాగవతమహాపురాణం** మొదటిది. విష్ణుభక్తినీ ఆయనను కట్టిపడేసే మంత్ర సహిత శ్లోకాలనూ, భక్తిని పెంచే కథలనూ ప్రపంచానికి ప్రసాదించిన **విష్ణుపురాణం** రెండవది. ఇక అన్నిటికన్న మిన్నగా ఆయనే చెప్పి తన భక్తుడైన గరుడుని పేర మానవజాతికిచ్చిన **గరుడపురాణం**★ మూడవది.

*గారుడాఖ్య పురాణేతు ప్రతిపాద్యో హరిః స్మృతః ।*
*అతోహరిర్నమస్కార్యోగమ్యోయోగ్యో హరిఃస్మృతః ॥* *(బ్రహ్మ.... 1/74)*

*(అధ్యాయం – 1)*

# గరుడునికి శ్రీకృష్ణుడు చెప్పిన విష్ణుమహిమ – ప్రళయాంతంలో శేషశయనుని స్తుతి – మేలుకొలుపులు

గరుత్మంతుడొక మారు భూలోకంలో దర్శనమిచ్చిన శ్రీ కృష్ణుని విశ్వసృష్టి విషయమై ప్రశ్నించాడు. ఆ గీతాచార్యుడు సుప్రసన్నుడై ఇలా చెప్పసాగాడు.

'ఓ పక్షీంద్రా! ఈ సృష్టికి మూలకారణం అవ్యయ పురుషుడైన శ్రీ మహావిష్ణువు. ఆయన సర్వవ్యాపకుడు, విశ్వమంతటా నిండి వుంటాడు. పూర్ణుడైన కారణాన ఆయనే అన్ని అవతారాలనూ ఎత్తగలడు. అనేక రూపాలతో నున్న ఈ దృశ్యజగత్తుని ఏకరూపంగా

★*గరుడ పురాణ మాహాత్మ్యం గూర్చి ఈ గ్రంథంలో అనేక సందర్భాలలో చెప్పబడింది. వాటన్నిటినీ కలిపి ఈ గ్రంథం చివరలో వ్రాయడం జరిగింది.*

చేసి ప్రళయకాలంలో తనలో లీనం చేసుకుంటాడు. ఆయన గుణాల్లో, రూపాల్లో, అవతారాల్లో, అవయవాలలో, వైభవాది ఐశ్వర్యాలలో భేదరూపం (భిన్నరూపాలు) కనిపిస్తున్నా ఆయననొక అభేదరూపంగానే మనం దర్శించాలి. అప్పుడే అజ్ఞానాంధకారం నుండి వెలుగులోకి వెళ్ళగలము.

ప్రళయకాలీన సముద్రమంతటా తానే వ్యాపకుడై శ్రీమహావిష్ణువు అన్ని జీవరాశులనూ తన ఉదరంలో కలిపి వేసుకొని శయనిస్తాడు. బ్రహ్మాది దేవతలు కూడా ఆయనలో కలిసిపోయి బయటికి కనబడరు. సృష్టి మొత్తం మీద విష్ణుమూర్తి, లక్ష్మీదేవిమాత్రమే మిగిలి వుంటారు. విష్ణుమూర్తి అలాగే ఒక కల్పం – అనగా బ్రహ్మదినం, వెయ్యియుగాలు, పదునాలుగు మన్వంతరాలు, మానవులకైతే నలుబది మూడుకోట్ల ఇరవైలక్షలయేళ్ళు పాటు శయనిస్తాడు. లక్ష్మీదేవి ఆయనను స్తుతిస్తుంది. పర్యంకరూపంలో, వాసరూపంలో మరెన్నో రూపాలలో ఆమె విష్ణువును సేవిస్తుంది.

శౌనకా! శ్రీకృష్ణుడే స్వయంగా తన మూలరూపమైన మహావిష్ణువును ఇలా స్తుతించాడు (గరుడుడు వింటున్నాడు) హే! విష్ణూ నీవు అందరికన్న అన్నిటికన్న ఉత్కృష్టుడవు. అందరు దేవతలలోకి ఉత్తముడవు కావున నీవు ఉత్కృష్టుడవు. నీతో సమానుడు గాని నీకంటె అధికుడుగాని సృష్టిలోనే లేరు. నీవే ఏక మాత్ర అద్వితీయ బ్రహ్మవు. బ్రహ్మ శబ్దానికి ప్రయోగం నీవే. ముఖ్య బ్రహ్మవునీవే. నీ తరువాత బ్రహ్మ రుద్రాదులు బ్రహ్మములగుచున్నారు. అనంతగుణ పరిపూర్ణుడవు కావున శ్రీహరివైన నిన్నే బ్రహ్మము అని కూడా అంటాము. గుణాదుల పూర్ణత లేకుండుట వల్ల ఇతర దేవతలు పరబ్రహ్మము కాలేరు. నీ గుణాలు అనంతాలు. నీవే అనంతుడవు. నిన్ను నేనే కాదు బ్రహ్మ రుద్రులు కూడా పూర్తిగా తెలుసుకోవడం సాధ్యం కాలేదు. ఇంద్రాగ్ని యమాది వేల్పులు కూడ నీ గుణాలను పూర్తిగా చూడలేరు, గానం చేయలేరు. నీ పూర్ణ రూపాన్ని దేవర్షి నారదుడు, సప్తర్షులు, గంధర్వులూ – ఇంకెవ్వరూ పూర్తిగా దర్శించ సమర్థులు కారు. ఇక సామాన్యులమాట చెప్పేదేముంది? నీ నుండియే దేవతల సృష్టి జరిగింది. నీ శక్తియే బ్రహ్మలో చేరి సృష్టి కార్యాన్ని నిర్వహిస్తోంది. బ్రాహ్మణులు చేసే వేదాది అధ్యయనమంతా 'హరి' నామకమే. వారు నీ కత్యంత ప్రియులు. నాకు (అంటే శ్రీకృష్ణునికి) కూడా మీరే స్వామి. ఈ విషయాన్ని ముందు తెలుసుకొని వేదం చదివే వాడు ద్విజోత్తముడు. నిన్ను కాదనుకొనేవాడు వేదవాదికాడు, వేదావాది. నిన్ను పూజిస్తూ వేదం చదివే వాడే వేదపాఠి. (వేదవాది అనే మాట కూడా మంచి అర్థంలో లేదు)

గరుడా! లోకాల్లో అజ్ఞానులైన జీవుల ద్వారా కోట్ల సంఖ్యలో అపరాధాలూ, మహాపచారాలూ జరుగుతునేవుంటాయి. అయినా పరమదయాళువైన శ్రీహరి పశ్చాత్తప్త హృదయులు మూడుమార్లు తన నామాన్నుచ్చరిస్తే చాలు; క్షమిస్తాడు.

***మహాపరాధాస్సంతి లోకే మహాత్మన్***
***సహస్రశః శతశః కోటిశశ్చ ।***
***హరిశ్చతాన్ క్షమతే సర్వదైవ***
***నామత్రయ స్మరణాద్వై కృపాలుః ॥*** ***(బ్రహ్మ... 2 / 60)***

కల్పాంతంలో విష్ణువు మేల్కొనవలసిన వేళ దేవతలంతా ఆయనను ఇలా స్తుతించారు – 'హే ప్రభో వేదాల ద్వారా తెలియదగినవాడవు, యజ్ఞస్వరూపుడవునైన గోవిందా! నీవు వేగ మా పట్ల ప్రసన్నుడవై వెంటనే మేల్కొనవలసియున్నది. జగత్తుని రక్షించి ఉద్ధరించ వలసియున్నది. ఇక నీవు యోగనిద్రను పరిత్యజించి ఆనంద స్వరూపుడవై అరుదెంచాలి. ఈ జగత్తుకి సృష్టీ, ప్రళయమూ కూడా నీ సంకల్పమే.

బ్రహ్మను సృష్టించి నీవే ఆయనచే జగత్తును సృష్టింపజేయవలసిన సమయం ఆసన్నమైంది. రుద్రుని సంహారకునిగా నిలుపవలసినది కూడా నీవే. హరీ! ఓ మురారీ! కల్పాదినీ కల్పాంతాన్నీ చేయడానికి నీవు మేల్కొనిరావాలి. ఓ మహాత్మా! జగత్తంతటా అలముకొనియున్న దుఃఖస్వరూపాంధకారాన్ని దూరం చేయాలి. ఓ దేవదేవా! భక్తుల దుఃఖాన్ని చూస్తే నీవు కూడా దుఃఖితుడవైపోయేటంత కరుణా సముద్రుడవు. లేచి మమ్ముకాచు.

నారాయణ! వాసుదేవ! కృష్ణ! అచ్యుత! మాధవ! దయామూర్తీ! లక్ష్మీపతీ! నీకు శతకోటి నమస్కారములు.

సరస్వతీశ! రుద్రేశ ! అంబికేశ ! చంద్రేశ ! శచీపతీ! నీవు బ్రాహ్మణులకూ గోవులకూ స్వామివి. నీ పేరే శాస్త్రప్రియుడు. ఋగ్వేదయజుర్వేద ప్రియా! మేలుకో! నిదానమూర్తీ! మమ్మేలుకో. హే సామాథర్వప్రియా, మురారీ! పురాణ మూర్తివి, స్తుతిప్రియుడవునగు విచిత్ర మూర్తీ! మేలుకో.

ఈ స్తుతికి బద్ధుడై భగవంతుడైన మహా విష్ణువు యోగ నిద్రను త్యజిస్తాడు.

***(అధ్యాయం – 2)***

# నారాయణుని నుండి సృష్టి యొక్క ప్రాదుర్భావం తత్త్వాభిమానులైన దేవతల ప్రాకట్యం

హే గరుత్మాన్! యోగనిద్రనుండి మేల్కొన్నాక విష్ణు భగవానునిలో సృష్టి చేయాలనే కోరిక కదిలింది. ఆయనలోని ఇచ్ఛాశక్తి అనంతమైనా లౌకిక స్వరూపాన్ని ధరించి తన శరీరకాంతుల ద్వారా ముందుగా ప్రళయకాలంలో విశ్వానికి పట్టిన చీకటిని చెదరగొట్టాడు.

సంపూర్ణ స్వరూపుడైన విష్ణుభగవానుని నుండి వచ్చిన రూపాలన్నీ సంపూర్ణాలే అయినవి. పూర్ణం నుండే పూర్ణం ఉద్భవిస్తుందికదా! విష్ణువునకు పరత్వమూ అపరత్వమూ వ్యక్తిగా వచ్చినపుడు మాత్రమే కల్పించబడుతున్నాయి గాని ఆయన అన్నిటికీ అతీతుడు. వీర్య స్వరూపుడైన పరబ్రహ్మమే అన్ని దేశాల్లో అన్ని కాలాల్లో వ్యాప్తి చెందుతూ జగత్తంతటా నిండి వుంటాడు కాబట్టి ఆయననే ఈశ్వరుడని కూడా అంటారు. పూర్ణం నుండి పూర్ణాన్ని వేరు చేసిగొని పోతే మరల పూర్ణమే మిగిలినట్లు (ఒకదీపం నుండి మరొక దీపాన్ని వెలిగిస్తే రెండూ సంపూర్ణంగానే వెలుగుతున్నట్లు – అను) పాల మున్నీటా వైకుంఠంలోనూ, జగత్తులోనూ కూడా ఒకే సమయంలో విష్ణువొకలాగే సంపూర్ణంగా వెలుగుతుంటాడు. జీవుల హృదయాలలో కూడ కదులుతుంటాడు. అందుకే ఆయనను వాసుదేవుడన్నారు. పృథ్వియొక్క భారాన్నీ, ఆ భారమెక్కువైపోతే దానినుండి పృథ్వినీ రక్షించే కార్యం ఆయన తనపైనే వేసుకొన్న లౌకిక బాధ్యత. విశ్వమంతటా తన మాయనే వ్యాపింపజేసిన విష్ణువు ఆ మాయలోనే సర్వబీజములనూ సృష్టించి ప్రవేశపెడతాడు. ఈ బీజానికి మూలమైన విష్ణు వీర్యం రెండు ప్రకారాలుగా వుంటుంది.

ఒకటి అచింత్యవీర్యము. ఇది స్త్రీ రూపాన్ని ధరిస్తుంది. రెండవది చింత్యవీర్యం. ఇది పురుషరూపాన్ని ధరిస్తుంది.

లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువు నుండి ఏనాడూ విడివడదు. ఆమె ఆయన నిత్యసేవానురక్త. నారాయణ నామంచే ప్రసిద్ధుడైన శ్రీహరి సంపూర్ణుడూ, సర్వస్వతంత్రుడే గాని మహాలక్ష్మి లేకుంటే అంతటి వాడూ ఒంటరి వాడైపోతాడు. ముకుందుని పదారవిందాలను సేవిస్తూ ఆ తల్లి నిత్యం ఆయన కొలువులో నొక ఉత్తమస్థానంలో వుంటుంది. ఆమె కూడా అన్ని దేశాల్లో అన్ని కాలాల్లో విశ్వమంతటా ఒకే తీరున వుంటుంది.

ప్రకృతిలో మూడు ప్రముఖగుణాలను సృష్టించిన స్వామిలక్ష్మీ దేవికూడా త్రిగుణాత్మిక కావలెనని అభిలషించాడు. శ్రీ, భూ, దుర్గాదేవీ స్వరూపాలుగా ఆయమ విడిపోయింది.

శ్రీ దేవిని సత్త్వగుణాభిమానియగు రూపంగానూ, భూదేవిని రజోగుణాభిమానియగు రూపంగానూ, దుర్గాదేవిని తమోగుణాభిమాని రూపంగానూ భావించి పూజిస్తారు. అలాగనీ ఈ మూడు రూపాలకూ మధ్య తేడాలుంటాయనుకొనరాదు. హరి కూడా మూడు తత్త్వాలుగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపాలను ధరించాడు.

లోకాలను పాలించడానికి హరియే స్వయంగా సత్త్వగుణంతో విష్ణురూపాన్ని ధరించాడు; సృష్టిని చేయడానికై రజోగుణాధిక్యంతో బ్రహ్మలో ప్రవేశించాడు; సంహారం చేయడానికి తమోగుణ సంపన్నుడై శివరూపుడైనాడు. అవ్యయుడైన హరి ఈ మూడు గుణాలతో మరల మరల మహత్తత్త్వరూపాలతో ప్రకటితమయ్యాడు. రజఃప్రధానగుణుడై వాయువుగా నిలిచాడు. ఆ వాయువే అన్ని ప్రాణులనూ బ్రతికించు మూలసాధనం. ఈ రకమైన సృష్టికి 'గుణ వైషమ్య సృష్టి' యనిపేరు.

తరువాత లక్ష్మీ దేవితో కలసి శ్రీమహావిష్ణువు జ్ఞాన – ద్రవ్య – క్రియాత్మకమైన అహం తత్త్వాన్నుత్పత్తి చేశాడు.

ఈ అహం తత్త్వం నుండి ఆదిశేషుడూ, గరుత్మంతుడూ, హరుడూ పుట్టారు. ఈ అహం తత్త్వంలో మరల హరియే స్వయంగా ప్రవేశించి దానిని సంక్షుభితం చేయడంతో మరిన్ని తత్త్వాలు వచ్చాయి. వైకారిక, తామస, తైజసములను మూడు ప్రకారాలుగా అహంతత్త్వం విడిపోయింది. రుద్రునిలో కూడ వైకారిక, తామస, తైజసరూపాలేర్పడ్డాయి. వీటినుండి లక్ష్మీతో కలిసి హరి దశప్రకారాల (కర్మ, జ్ఞాన) ఇంద్రియాలను సృష్టించాడు. అవే క్షేత్ర, చక్షు, స్పర్శ, రసన, ఘ్రాణ, వాక్, పాద, పాణి, పాయు, ఉపస్థలు. వైకారిక అహంతత్త్వాన్ని మథించి హరి ఏకాదశ ఇంద్రియాలనూ (మనసుతో కలిపి) ఏకాదశ అభిమాన దేవతలనూ సృష్టించాడు. వారిలో ప్రముఖులు ఇంద్రుడు, మన్మథుడు, వసువులు మొ॥ వారు. మూలరుద్రుడైన భవుని నుండి పదిమంది రుద్రులు ప్రకటితులైనారు. తరువాత ద్వాదశాదిత్యులూ, యాభై మరుద్గణాలూ, పదిమంది విశ్వేదేవులూ ఇంద్రియాల ద్వారా హరిచే సృష్టింపబడినారు.

అయిదు వాయువులూ స్పర్శరూపాది అయిదుతత్త్వాలనుండి వచ్చాయి. భృగు మహర్షి చ్యవనుని పుత్రుడు కాగా ఉతథ్థ మహర్షి బృహస్పతి నందనుడు. మనువులు, పితరులు (ఏడుగణాలలో) వరుణదేవుడు, గంగాదులు ఆవిర్భవించారు. మొత్తం సృష్టిని మిక్కిలి సంక్షేపంగా వివరించాను. ఒకటి మాత్రం సత్యం. పరమాత్మయైన శ్రీహరియే యోగనిద్ర నుండి మేల్కొని సృష్టినేర్పరచి తాను లక్ష్మీ దేవితో సహా అందు ప్రవేశించాడు.

***(అధ్యాయాలు – 3,4)***

# దేవతలు గావించిన నారాయణ స్తుతి

శ్రీ కృష్ణుడు గరుడునికి అత్యంతోత్తమ విష్ణు స్తుతుల భావాన్ని చెప్పసాగాడు. 'విష్ణువు దయవల్ల పుట్టిన దేవతలంతా ఒక్కొక్కరుగా ఆయన నిలా స్తుతించారు. ఖగేశ్వరా! ముందుగా లక్ష్మీదేవి ఆయన గుణాలన్నిటినీ స్తుతించేటంత మహాద్భుతశక్తి తనకి లేదని సిగ్గుపడుతూ చెప్పింది. పిమ్మట ఇలా అంది.

'హే నాథా! నేను మీ పాదారవిందాల వద్ద నతమస్తకనై ★జీవిస్తాను. మీ చరణాలను తప్ప వేరేమీ ఎఱుగను. ఓ దేవదేవా! ఓ ఈశ్వరా! మీలో అనంత గుణాలున్నాయి. హే దామోదరా! మీరు నాకు తమ శరీరంలోనే స్థానమిచ్చి నన్ను రక్షించండి. మీరు తప్ప వందనీయులు వేరొకరు నాకు కనబడుటలేదు;

బ్రహ్మ ఇలా స్తుతించాడు; 'హే లక్ష్మీపతే! జగదాధార స్వరూప విశ్వమూర్తీ! మీరుజ్ఞాన మహాసాగరము. నేను అజ్ఞానిని. మీరు శక్తిలో అసీములు. నేను అల్పజ్ఞుడిని అల్పశక్తుడిని. మిమ్మల్ని సేవించుకొనే భాగ్యాన్ని నాకు శాశ్వతంగా ప్రసాదించండి. దానికి, ముఖ్యంగా నాలోని అహంకార మమకారాలను నశింపజేయండి. ఓ రమేశా! అసన్మార్గం వైపు చూసే నా ఇంద్రియాలచూపును మళ్ళించి మీ చరణ కమలాలపై నిత్యానురక్తంగా నా మనసు నిలిచేలా దయ చేయండి. మిమ్మల్ని సంపూర్ణంగా స్తుతించే సామర్థ్యం నాకు లేదు. అయినా మీరు నా పట్ల ప్రసన్నులు కండి.

వాయుదేవుడిలా వినుతించాడు. 'హే ప్రభో! దేవతలంతా మీ సేవకులమే. మీ చరణారవింద సాన్నిధ్యం పరమదుర్లభం. రమేశా! జగన్నాథా! లోకంలో మీ భక్తి పట్ల విముఖులు, పాప కర్ములు, అత్యంత దుఃఖితులునగు ప్రాణులను అనుగ్రహించుటకే మీరు అవతరిస్తారు. ఓ వాసుదేవా! మీరీ అవతారాలలో గో, బ్రాహ్మణ దేవతాదుల క్షేమ కల్యాణాలకై ఎన్నోరకాల లీలలను వెలయించారు. దేవదేవా! మీ చరితా మృతాన్నెంతగా ఆస్వాదించినా మీ గుణగానాన్నెంతగా చేసినా నాకు తనివి తీరడంలేదు. కావున నోముకుందా! ఒక అవిచల భక్తునితో సమానమైన భక్తిని మీ పట్ల నాకు ప్రసాదించండి. దాని ద్వారా నా మనసు మీ చరణాలపైనే లగ్నమై వుండేలా అనుగ్రహించండి నా నిద్ర నీ వందన రూపాన్ని ధరించాలి. ★నా సంపూర్ణ ఆచరణ నీకు ప్రదక్షిణగా మారాలి, నా వ్యవహారమేదైనా నీ స్తుతి రూపమే అయివుండాలి – అని తలచుకుంటూ నీ పాదాలపై

---

*★నతమస్తక అనగా తలవంచుకొని*

*★నేను నిద్రలో కూడా నీకే వందనం చేస్తూండాలి గాక అని అర్థము.*

నన్ను నేను స్వయంగా సమర్పించుకుంటున్నాను. నేను దేనిని చూసినా అది నాకు హరి ప్రతిమగానే కనిపించాలి. ఏది మాట్లాడినా అది హరిభజనమే కావాలి – ఇలా చేయగలిగేలా నన్ను అనుగ్రహించండి – అంటూ మహాత్ముడైన వాయు దేవుడు విష్ణువు ఎదుట నిలబడి పోయాడు.

చదువులతల్లి సరస్వతీ దేవి శ్రీ హరితో నిట్లన్నది. 'హే మురారీ, హరీ, భగవన్! నిన్ను స్తుతించి తన పదజాలంతో సంతృప్తులైపోవు రసజ్ఞులుండరు. భాషకందని, కవితలో ఇమడని మహత్త్వం నీది. నిన్ను పూర్తిగా ప్రశంసించడానికి ఏ ఒక్కరి బుద్ధీ చాలదు. స్వామీ నిజమైన భక్తులు నీ గుణానువాద కీర్తనము తమ చెవులకు సోకగానే దేహానురక్తి, ఇల్లు, ఇల్లాలు, పిల్లలతో సహా అన్నీ మఱచిపోతారు. అంత గొప్ప భక్తి తత్త్వం భవత్ప్రసాదం. హే జగన్నాథా, అనంతమహిమా సనాథా! వేదప్రతిపాదితమైన నీ స్వరూపము లక్ష్మికైనా, వాయుదేవునికైనా, చతుర్ముఖ బ్రహ్మకైనా కొంతే తెలుసుగాని అంతా అవగతం కాలేదు. అలాటిది నేనగా నెంత? నా స్తుతి అనగా నెంత? కావున నో స్వామి! నన్ను రక్షించి నా జ్ఞానాన్ని పెంచండి. అప్పుడు నేను స్తుతించగలనేమో.

'పరబ్రహ్మ, లక్ష్మీశా, హరీ, మురారీ! నీ గుణాలలోనే నిత్య శ్రద్ధాళులై, ఆ గుణ గానాన్నే గావిస్తూ జీవించే వారు సాంసారిక అసద్విషయాల అయోమయంలో చిక్కుకున్న తమ బుద్ధిని విరక్తి వైపు మళ్ళించుకొని సంసారం నుండి విరాగులై నీ భక్తి వైపు సరాగులై ఆ భక్తి బలంతో నీ ప్రసన్నతకు పాత్రులు కాగలరు. అపుడు వారికి నీ ప్రత్యక్ష దర్శనమవుతుంది. కాబట్టి హే జగదానందకారకా! నీ గుణ కీర్తనంలోనిమగ్నురాలనై నన్ను నేనే మరచిపోయేటంత భక్తి భావాన్ని నాకనుగ్రహించు.

పక్షీంద్రా! సరస్వతీ దేవి ఇలా పలికి మౌనం వహించగానే ఆదిశేషువు చేతులు జోడించి ఇలా అన్నాడు ; 'హే ప్రభో! వాసుదేవా! నీ చరణ కమల మహిమను బ్రహ్మ రుద్రులు, గరుత్మంతుడే పూర్తిగా కనుగొనలేకపోయారు. ఇక నేననగానెంత? నేను బహున్యూనుడను. కాబట్టి నన్ను రక్షించు.'

అంతట రుద్రుడిలా ప్రార్థించాడు 'హే భూమన్, హే భగవన్! మిమ్మల్ని ఎలా స్తుతించాలో కూడా తెలియనంత అజ్ఞానిని నేను. మీ కళ్యాణకరములయిన చరణ కమలాలపై నా భక్తి స్థిరంగా వుండేలా కరుణించండి. మీలోనే నాకు స్థానమిచ్చి నన్ను రక్షించండి.

ఇంద్రుడిలా స్తుతించాడు 'ఓ దేవ దేవా! మిమ్మల్ని స్తుతించుట ఎవరివల్లా అయ్యే పనికాదు. ఎందుకంటే మీ స్వరూపాన్ని మేము చూస్తున్నామనుకుంటున్నాం, మీ గుణ

మహిమలు మాకు తెలుసనుకుంటున్నాం. ఈ కనిపించే దానికీ, అనిపించే దానికి వందలవేల రెట్లు ఎక్కువయైన మీ నిజస్వరూపం మాకు తెలీదు. మీరు చూపినా అర్థం కాదు. అయినా మేమెందుకు స్తుతిస్తామంటే అందులో మీ నామోచ్చారణ వుంటుందిగా. మీ పేరు తలచినా చాలు. మదిలో పొంగుతాయి శతకోటి భక్తి తరంగాలు. అవి పుణ్యప్రదాలు. బ్రహ్మరుద్రుల స్థాయిలో కాకపోయినా అందరమూ నీ నామాన్నే జపిస్తాం. అనుగ్రహించు.

పిమ్మట శచీదేవి ఇట్లన్నది 'హే జగదానంద సంధాయకా! వజ్ర, అంకుశ, ధ్వజ, కమల చిహ్నితములైన మీ పాద పద్మాలపైనే నా చింతన నిత్యం జరుగుతుంటుంది. ఈశా! మీ చరణరజాన్నే, నేనెపుడూ స్మరిస్తుంటాను. హే కృపాళో! భక్తవత్సలా! మీరే నన్ను రక్షించాలి.

అంతట రతీ దేవి ఇలా ప్రార్థించింది. 'నరరూపాన్ని ధరించి లోకాలను కాపాడే అవతారమూర్తీ! ప్రస్తుతం నీవు నీ సేవకులపై దయను కురిపించడానికే అట్టి మాకు దర్శనమిచ్చావు. నీ ముఖారవిందాన్ని కనులార గాంచిన నేను ఇక దానినే ధ్యానిస్తుంటాను. కుంచితకేశరాశీసుశోభితము, బ్రహ్మ, లక్ష్మి, రుద్రాదిదేవ సంస్తుత్యము, శ్రీనికేతన సదృశమునగు నీనగుమోమునే మనసులో పెట్టుకొని నిత్యమూస్మరిస్తుంటాను. నీ భక్తురాలినగు నన్ను రక్షించు.'

దక్ష ప్రజాపతి ఇలా స్తుతించాడు. 'భగవన్! మీ చరణోదకరూపమగు పవిత్ర తీర్థాన్ని నేను నిత్యం స్మరిస్తుంటాను. అది బ్రహ్మ సేవితం కూడ. బ్రహ్మాది దేవతలందరూ దానికి నమస్కరిస్తారు. ఆ తమ పవిత్ర తమ పాదోదకమే గంగానదిగా రూపొంది శ్రేష్ఠ తీర్థమైనది. తమ పవిత్ర పాద ధూలితో కలిసిన గంగ అశివాన్ని కూడా శివము చేయగలదు. అందుకేనేమో పరమేశ్వరుడు ప్రేమగా గంగను నెత్తిన ధరించి తాను గంగాధరుడనని సగర్వంగా చెప్పుకుంటాడు. హే కరుణేశ! ఈ మీ కృపావతారాన్ని వీక్షించే భాగ్యమిచ్చిన నాకు దానిని స్తుతించి తృప్తి నొందేశక్తి లేదు. దయచేసి నా కాశక్తిని ప్రసాదించి రక్షించండి'.

బృహస్పతి ఇలా కోరాడు.

'ప్రభో! మీ సుందరవదనారవిందమే నా మనసులో నిత్యము కొలువుంటుంది. ఇక సాంసారిక విషయాలపై నాకు విరక్తి కలిగేలా చేయండి. పుత్ర, మిత్ర, స్త్రీ, పశు, ధనాదులన్నీ నశించిపోతాయి, నశింపజేస్తాయి కూడ. కాబట్టి మీరు నాకు వీటిపై గల ఆసక్తిని నశింపజేయండి. దేవా ఈ సంసార చక్ర భ్రమణం నాకు నేర్పిన అనుభవమేమనగా 'ఈ

ప్రపంచం దుఃఖంతోనే పరివ్యాప్తమైవున్నదని'. దీని నుండి ముక్తిని పొందుటకే నేను మిమ్ము శరణు వేడుతున్నాను. రక్షించండి.'

అనిరుద్ధుడిలా స్తుతించాడు 'హే హరే! రసమయమైన నీ గుణగానకథయందు కాక స్త్రీ పై మనసులగ్నము చేయువాడు మందబుద్ధి, సూకరసమానుడు. హే ప్రభో! మజ్జ, అస్థి, పిత్త, కఫ, రక్త, మలాదులచే పరివ్యాపితమై చర్మంచే ఆవేష్టితమైన స్త్రీ ముఖాన్ని మాత్రమే మనసులో పెట్టుకొని నిన్ను తలవని వాని పతనం తథ్యం. నా వంటి సామాన్యునికీ, పాపమతికీ నీమాయయే బలము. స్వామీ! దుఃఖం మాత్రమే ఉండి, సుఖం లేశ మాత్రమూ లేని ఈ జననమరణ చక్రం నుండి నన్ను తప్పించి శాశ్వతంగా నీ చరణ కమలాలనే స్తుతిస్తుండేలా అనుగ్రహించు.

స్వాయంభువమనువిలా ప్రార్థించాడు. 'హే దేవా! మిమ్మల్ని స్తుతించడానికి ప్రయత్నిస్తే చాలు; ఇక గర్భదుఃఖం – అనగా పునర్జన్మ వుండదు. మీ యొక్క ఈ కృప వల్లనే నాకు పరమ పూజ్యపదవి ప్రాప్తించింది. నా కర్తవ్య నిర్వహణలో నన్ను కాపాడండి.'

వరుణదేవుడిలా వచించాడు.

'హే ప్రభో! మీ ఇచ్ఛవల్ల రచింపబడిన దేహమనే ఇంట్లో దిగి పుత్ర, స్త్రీ, ధన, ద్రవ్యాలపై మోహం పెంచుకొని 'ఇవి నావి' అనీ 'నేను వీరివాడను' అనే అల్పబుద్ధి జన్యమైన అహంకార మమకారాలతో ప్రాణి దుఃఖంలో మునిగిపోతుంది. నాకటువంటి దుర్గతి పట్టకుండా కాపాడండి. మీ చరణాల దాస్యాన్ని నాకు దానం చెయ్యండి'.

దేవర్షి నారదుడు హరినిలా ప్రార్థించాడు. 'విష్ణుదేవా! నాకు నీ నామ శ్రవణ కీర్తనలు తప్ప మరేవీ రుచింపవు. నిజానికి నాకు వేరేలోకంగానీ జీవనంగానీ లేవు. అలాగే వుండే పవిత్రతను నాకందించు. నా జిహ్వాగ్రంపై సర్వదా నీ నామమే వుండేలా అనుగ్రహించు. నీ స్వరూపమే నా మూసిన కనులకు కూడా కనిపించాలి. అదే నా హృదయమంతటా నిండి వుండాలి.'

భృగుమహర్షి ఇలా స్తుతించాడు. 'హే గరుడుని వంటి అత్యుత్తమాసనానికి అధికారివైన దేవదేవా! మీరు గ్రహించే ఏదైనా సర్వేసర్వత్ర ఉత్తమమై అలరారుతుంది. కౌస్తుభమణిని మించిన గొప్పమణిగానీ, లక్ష్మికి సాటివచ్చు పత్నిగానీ, సరస్వతీ దేవికెనయైన ఆత్మబంధువుగానీ విశ్వంలోనే లేరు. అలాగే మీ భక్తకోటిలో మమ్ము నిత్యులుగా అనుగ్రహించి చరిత్రలో మా కొక విశిష్ట స్థానాన్నిచ్చిన మీకు శతకోటి నమస్కారములు.'

అగ్ని దేవుడిలా అన్నాడు, 'మూలవిరాటము నీవే. నీ తేజాంశవల్ల నేను తేజస్వినైనాను. నీవిచ్చిన ఆజ్యసిక్త హవ్యంతో హవ్యవహునిగా పవిత్ర స్థానాన్ని పొందాను. నీ అంశతో

జఠరాగ్నిగా మారి మానవోదరస్థితుడనై వారి జీవరక్షకుడనగుచున్నాను. నీ అనుగ్రహం లేకుంటే ఈ అగ్నియేలేడు. నిన్నెంత స్తుతించినా నాకు తృప్తి గలుగదు.'

ప్రసూతి ఇలా చెప్పాడు, 'ప్రభూ! నీ నామముయొక్క అర్థాన్ని కనుగొనుట అనేదే మోహం వలె పరిణమించి అందులో మునిగి పోయివుండే మహర్షులకు నీ దర్శనమే జీవిత పరమావధి. నీ దయవల్ల నేనా దశకు చేరుకున్నాను. దేవతలు కూడా భయగౌరవ సంభ్రమాలతో పూజించే మాంధాత, ధ్రువుడు నారదుడు, భృగుమహర్షి, వైవస్వతమనువు మున్నగు మహనీయులే నిన్ను స్తుతించి సంతృప్తి చెందలేకపోయారనగా నిన్ను స్తుతింప నేనే పాటివాడను.'

బ్రహ్మపుత్రుడైన వసిష్ఠ ప్రజాపతి ఇలా స్తుతించాడు. 'విధాత పురుషునకు వందనము. అసత్ స్వరూపాన్ని అంతమొందించే దేవునికి నమస్కారము. నాథా! నేను నీ చరణ కమలాలపై నిత్యం నా మస్తకాన్ని వంచి జీవించదలచుకుంటాను. ఓ వాసుదేవ భగవన్! నన్ను సదా రక్షించు.'

బ్రహ్మ మరొకపుత్రుడైన మరీచి ఇలాగే విన్నవించగా అత్రికూడా అలాగే స్తుతించి నారాయణ ప్రసన్నతను పొందాడు.

అంతట అంగిరామహర్షి ఇలా స్తవనం చేశాడు. 'హే నాథా! మీ అనంత బాహు, అనంతచక్షు, అనంత మస్తక సంపన్నమైన రూపాన్ని చూడడానికే నేను అసమర్థుడనగు చున్నాను. వేల ముకుటాలతో అలంకరింపబడి, బహు మూల్యములైన అనేకానేక అలంకారాలతో సుశోభితమైయున్న మీ అనంత జ్యోతిర్మయ దివ్య స్వరూపాన్ని స్తుతించు టకు నా సామర్థ్యం చాలదు. రక్షించండి.'

పులస్త్యబ్రహ్మ ఇలా స్తుతించాడు: 'హేభగవన్! మీ ఉపాసకులకోసం ఏ దివ్య మంగళ స్వరూపాన్ని ధరిస్తారో ఆ భువనమంగళకారియగు రూపంతోనే నాకు దర్శనమివ్వండి. ఈ రూపియగు మీకు నమస్కారము. నరకం నుండి నాలాటి వారిని మీరే రక్షింపగలరు. మీ స్తుతి మంగళదాయకము. నేను యథాశక్తిగా, మాత్రమే చేయగలను. నన్ను రక్షించండి.'

పులహమహర్షి ఇలా స్తుతించాడు : 'సగుణోపాసనలో భగవంతునికి స్నాన, ఉత్తమవస్త్ర, క్షీర, ఫల, పుష్ప, భోజ్య పదార్థాదులను ఆరాధన పూర్వకంగా సమర్పించుకుంటారు. నిర్గుణోపాసకుడనైన నేను నిష్కామబుద్ధితో నా జీవన జ్యోతినే నీ నిష్కామరూపరహిత భావానికి సమర్పించుకుంటున్నాను.'

మహాముని క్రతువు ఇలా అన్నాడు. 'హే భగవన్! శరీరం నుండి ప్రాణం విడివడి బయటికి పోతున్నపుడు మీ పేరును స్మరించడమే దుఃఖనివారణకు మార్గము. అది అనేక జన్మలలో చేసిన పాపాలన్నిటినీ నశింపజేయగలదు; ముక్తిని ప్రసాదించగలదు. నేను ఆ నామశక్తినే శరణుకోరుతున్నాను. మీ భక్తి గాని అసలు భక్తి అంటే ఏమిటో గాని తెలియక పోయినా మీ నామస్మరణను ఎక్కడో విని చేసినా ముక్తిని ప్రసాదించే దయాళు మీరు.'

*యే భక్త్యావివశోవిష్ణో నామ మాత్రైకజల్పకాః ।*
*తేఽపి ముక్తిం ప్రయాంత్యాశు కిముత ధ్యాయినః సదా॥ (బ్రహ్మ.... 7/64)*

అప్పుడు విశ్వామిత్రుడు విష్ణువు నిలా స్తుతించాడు: 'భగవన్! నీ చరణకమలాలను ధ్యానించకపోయినా, నిత్యమూ సంధ్యా వందనము చేయకపోయినా, జ్ఞానమనెడు ద్వారానికి తలుపువంటి ధర్మ, కర్మములను పాటింపకపోయినా, నిత్యము నీ కథలనే వింటూ పరవశం కాకపోయినా అనాథలనూ ఏమిలేనివారినీ కరుణించే వరప్రదాతవు నీవు. నన్నూ రక్షించు.

*నధ్యాతే చరణాంబుజే భగవతో*
*సంధ్యాపి నానుష్ఠితా*
*జ్ఞాన ద్వార కపాట పాటన పటు*
*ర్ధర్మోఽపి నో పార్జితః ।*
*అంతర్వ్యాప్తమలాభిఘాతకరణే*
*పట్వీశ్రుతా తే కథా*
*నోదేవ శ్రవణేన పాహిభగవన్*
*మామత్రితుల్యం సదా॥ (బ్రహ్మ... 7 / 71)*

మిత్రుడను వైదిక దేవత ఇలా స్తుతించాడు: 'దేవా! సంసారబంధనాలను త్రెంచి ప్రాణులకు ముక్తి నొసగు పరమాత్ముడవు నీవు. కల్యాణనిధానము, జ్ఞానసాగరమునగు నీకు అజ్ఞానినగు నేను ప్రణమిల్లుతున్నాను. అగ్ని, బ్రహ్మ, రుద్రాదులకే అగమ్యము, మహా తేజస్వులగు తపస్వులకు కూడా అగోచరమునగు నీ స్వరూపము నాకూ తెలియనిదే. కావున భగవన్! వాసుదేవునిగా పేరొందిన నీవొక్కడివే సర్వజ్ఞుడవు. నీవే నన్ను నిత్యము రక్షింపగలవు.'

తార ఇట్లన్నది : విష్ణుదేవా! అనన్య భావంతో నీ పట్ల దృఢ భక్తి గలవారు, నీ కోసం అన్ని కర్మలనూ త్యాగం చేసేవారు, నిన్ను చేరగోరి స్వజనులనూ బంధుబాంధవులనూ కూడా పరిత్యజించేవారు, నీ కథలను వింటూ, ఇతరులకు వినిపిస్తూ జీవించే

వారు – ఇటువంటి సాధుజనులకు నీవు తప్ప వేరే ఆసక్తి ఏదీ వుండదు. ప్రభో! వారి నెంత ప్రేమతో చూసి సంరక్షిస్తావో నీచరణదాసినగు నన్నుకూడా అంతగానే రక్షించు'.

నిర్ఋతి ఇలా అన్నాడు : 'యోగపూర్వకంగా నీకు సమర్పితులైన వారు భక్తి ద్వారా పరమగతిని పొందుతారు. భక్తి శ్రద్ధలతో నిన్ను సేవించడం ద్వారా, సాంసారిక విషయాలపై అనాసక్తిని సాధించడం ద్వారా, చిత్తాన్ని నిగ్రహించడం ద్వారా జనులు విష్ణు పరమ పదమును పొందుతారు. ప్రభూ! నన్ను నీ పరమ పదానికి చేర్చుకో. ఇదేనా వేడికోలు.'

విష్వక్సేనుడు వైకుంఠ ద్వారము వద్దవుండే దళపతి. ఆయన విష్ణువునెపుడూ దర్శిస్తూనే వుంటాడు. అయినా విష్ణువుయొక్క ఆశీర్వాదం కోసం ఇలా ప్రార్థించాడు. 'స్వామీ! పూర్ణానంద స్వరూపుడైన శ్రీకృష్ణపరమాత్మ మీ ప్రతి రూపమై మోక్ష ప్రదాతయగుచున్నాడు. నేను మీ కృప వల్ల అపరోక్షసాధనారూపమైన పరమభక్తిని సాధించాను. గురువుతో మొదలు పెట్టి బ్రహ్మాండమందున్న సాధువులందరినీ మీరు ప్రసాదించిన బుద్ధి వల్ల సేవించుకున్నాను. వారిపట్ల నాది నిష్కపటభక్తి. అలాగే మిమ్మల్ని చేర్చగలిగే తులసిపై అఖండ ప్రీతినాది. భగవన్! నాకు మీ ఆశీర్వాదమొక్కటి చాలు.'

భగవంతుడైన విష్ణువు వీరందరికీ తన శరీరంలో ఆశ్రయం కల్పించాడు" అని వసుదేవనందనుడు వినతాసుతునికి బోధించాడు. ***(అధ్యాయాలు - 6 -9)***

## నారాయణకృత ప్రాకృత, వైకృత సృష్టి

"ప్రభో శ్రీకృష్ణచంద్రా! ఈ విధంగా దేవతలకు ఆశ్రయమిచ్చిన భగవానుడు స్వయంగా వారిలోనే తానెలా ప్రవేశించాడు? సృష్టి ఏ విధంగా జరిగింది? దయచేసి ఉపదేశించండి"

వచింపసాగాడు వసుదేవనందనుడు.

"పక్షీంద్రా! ఒక దానికొకటి సంబంధింపని అన్ని తత్త్వాలలో భగవంతుడైన విష్ణుభగవానుడు ముఖ్య కేంద్రరూపంలో ప్రవేశించడంతో అన్ని తత్త్వాలలో తీవ్రమైన కదలిక లేర్పడ్డాయి. అప్పుడాయన సర్వప్రథమంగా కనకంవలెకనిపించిన బ్రహ్మాండము (గుడ్డు) ను సృష్టించాడు. అది యాభై కోట్ల యోజనాలలో విస్తరించింది. దానిపైనొక బంగరు వలయాన్ని, అంతే విస్తీర్ణంలో సృష్టించాడు. దానిపై అదే వైశాల్యంతో అదే ఆకారంలో భూమిని సృష్టించాడు. మొత్తంగా ఆ బ్రహ్మాండం వందకోట్ల యోజనాల మేరదాటింది. ఈ బ్రహ్మాండం ఏడు వృత్తాలుగా విభాజితమైంది. తొలి భాగం పదివేలకోట్ల

యోజనాల్లో నీరు, రెండవ భాగం నిప్పు, మూడవపరిధి శివునిది, నాలుగవ ఆవరణం ఆకాశం, అయిదవది అహంకారానిది కాగా ఆరవది మహత్తత్వాత్మకం, ఏడవది త్రిగుణాత్మకం.

ఈ అండంచుట్టూ వున్నది కూడా ఆకాశమే. దాని మధ్యంలో విరజానది సృష్టింపబడింది. దీని పరిధి అయిదు యోజనాలు. ఇది అతిశయపుణ్యవతియైన నది. దీనిలో స్నానంచేస్తే హరిపాదసన్నిధి లభిస్తుంది. ప్రారబ్ధకర్మలన్నీ క్షయమైపోయినవారికే ఈ నదిలో స్నానంచేసే అదృష్టంపడుతుంది. ఖగేశ్వరా! మరొకమాట. ప్రళయంలో కూడా ఈ నది లయమునొందదు. లోకులయొక్క శరీరమును త్యజింపజేసేది కాబట్టి దీనిని లక్ష్మీ స్వరూప అంటారు. విరజానది తరువాత వ్యాకృతమైన (కనిపించు) హద్దులేని ఆకాశంలో లక్ష్మీదేవి కిష్టమైన ప్రాంతముంది. దీనికి అభిమానినీ దేవత ఆ పద్మాసనయే. సృష్టి సమయంలో బ్రహ్మాండాని కభిమానిదేవత బ్రహ్మ. ఆ సమయంలో ఆయనను 'విరాట్' అనే నామంతో పూజిస్తారు. అవ్యయాత్మయగు భగవానుడు శ్రీహరి ఈ రకంగా సృష్టించిన జగతిలో క్రిందా పైనా లోనా బయటా అంతటా వ్యాప్తుడై నిత్యస్థితుడై వుంటాడు. పక్షీంద్రా! దీనిని ప్రాకృత సృష్టిగా సంభావించారు. అవ్యక్తాదులతో సహా ఈ అండరూపం గల జగతిలో బ్రహ్మ రూపంలో పుట్టినవన్నీ ప్రాకృత సృష్టములు కాగా బ్రహ్మాండ, బ్రహ్మాండాం తర్వర్తియగు సృష్టి వైకృతమనబడింది.

ఓ అండజకులమండనా! ప్రకృతి పురుషులలో పురుషుడని చెప్పబడిన ఆ విష్ణుదేవుడు సాక్షాత్తూ పురుషోత్తముడే. ఆయన ఆ సువర్ణాండ మధ్యంలో నున్న జలరాశిలో వేయి సంవత్సరాలు శయనించాడు. అప్పుడు లక్ష్మి జలరూపంలో, విద్యాదేవి శయ్యారూపంలో, వాయుదేవుడు తరంగ రూపంలో వున్నారు. తమస్సంతా నిద్రారూపాన్ని ధరించింది. వీరుగాక వేరెవ్వరూలేరు. అపుడా శయనమూర్తిని లక్ష్మి స్తుతించింది. ప్రకృతి అప్పుడు శ్రీ, భూదేవీమతల్లులరూపంలోనూ, శేషుడు వేదరూపాన్ని ధరించీ హరిని స్తుతించారు. స్తుతివల్ల సంతుష్టుడై ప్రబుద్ధుడై శ్రీమహావిష్ణువు మేల్కొని చైతన్య స్వరూపుడైనాడు. నిజానికాయన నిత్యప్రబుద్ధుడే. (ఈ నిద్రా, దాని పరిత్యాగమూ ఆయనకు లీల, మనకు మాయ – అను). అపుడాయన నాభినుండి హిరణ్మయపద్మముద్భవించింది. దీనిని ప్రాకృత సృష్టిగానే భావించాలి. ఇది భూదేవి అభిమానినిగా కలది. ఆ పద్మం అసంఖ్యాక సూర్యులతో సమాన కాంతిని కలిగి వుంది. చిదానందమయుడైన విష్ణువీ ప్రాకృత సృష్టికి భిన్నుడు. ఇదాయన అలంకారాలలో నొకటిగా భావింపబడింది. హరి అలంకారాలలో కిరీటాదులు

స్వరూపభూతాలనీ స్వరూపభిన్నాలనీ రెండు ప్రకారాలు. ఆ హిరణ్మయపద్మం నుండి చతుర్ముఖ బ్రహ్మ ప్రాదుర్భవించాడు. 'నన్ను సృష్టించిన ప్రభువెవ్వరో' అనే జిజ్ఞాసతో నలువంకలాచూసి ఆ పద్మనాళంలో ప్రవేశించాడు. అక్కడిక దిక్కుతోచలేదు, జిజ్ఞాస తీరలేదు కాని 'తపముచేయి – తపముచేయి' అనే శబ్దాలు వినిపించాయి. వెంటనే బ్రహ్మకు తన కర్తవ్యం బోధపడి నిష్ఠగా వేయి దివ్య సంవత్సరాలపాటు 'హరి ప్రీతి ప్రాప్తీచ్ఛతో' కఠిన తపస్సుచేశాడు. అంతట ఆయన అమోఘ తపస్సును మెచ్చి శ్రీహరి తన భక్త శ్రేష్ఠుడైన బ్రహ్మకు దివ్యవరాలను ప్రదానం చేయడానికి సాక్షాత్కరించాడు.

ఆయన నారాయణుడనీ ఆయనను స్తుతించాలనీ బ్రహ్మజ్ఞానియైన బ్రహ్మకు వెంటనే తెలియడంతో ఇలా స్తుతించాడు. 'చతుర్భుజుడవై అనేక నేత్ర కమలుడవై, వక్షఃస్థలంపై శ్రీవత్స చిహ్నంతో సుశోభితుడవై, కంఠమందు కౌస్తుభమణి మాలాలంకృతుడవై, అత్యంత ప్రసన్నముద్రతో, కరుణ తొణికిసలాడు నయనాలతో నాకు దర్శనమిచ్చిన నారాయణ దేవా నీకు నమస్కారము. భక్తులకెల్లవేళలా వశుడవై ఉండు పరమాత్మవు, అత్యంత దయాళుడవు, పరబ్రహ్మస్వరూపుడవు, జగదానంద కారకుడవు, శ్రీమన్నారాయణుడవు నీవే! నన్ను కరుణించు' అంటూ ఆయన చరణ కమలాలను కడిగి పూజించి ఆ నీటిని నెత్తిన జల్లుకున్నాడు బ్రహ్మ.

గరుడా! బ్రహ్మ స్తుతికి ప్రసన్నుడై భగవానుడు మేఘ గంభీర స్వరంలో ఇలా చెప్పాడు, 'ఓ బ్రహ్మదేవా! నా వరప్రసాదబలంతో దేవతలందరినీ ఇదివఅకు సృష్టించినట్లే ఇప్పుడు కూడా కావించు. దీనివల్ల నీకేమీ ప్రయోజనం సిద్ధించకపోవచ్చు కానీ నా ప్రసన్నత కోసం ఆచరించు,' హరి ఇలా ఆనతివ్వగానే మహత్త్వాత్మకుడైన బ్రహ్మముందుగా జీవకోటి కభిమానపాత్రుడైన వాయుదేవుని సృష్టించాడు. ఆయనయే సృష్టికి ప్రథమపురుషోత్ముడు. తరువాత బ్రహ్మ తనకుడి చేతినుండి బ్రహ్మాణీ, భారతీ అను పేళ్ళు గల దేవీ మణులను సృష్టించాడు. ఎడమచేతితో సత్యపుత్రుడైన అగ్నిని సృజించాడు. ఆ పై కుడిచేతితో అహంకారాత్మకుడగు హరుని సృష్టించాడు. తరువాత శేషనాగ, గాయత్రి,★ వారుణి, సౌపర్ణి, ఇంద్ర, చంద్ర, కామదేవులు, ఇంద్రియాభిమాన దేవతలు, మను – శతరూపా, దక్ష, వసిష్ఠాది ప్రజాపతులు, కశ్యప, అదితి, వశిష్ట మహాముని, అటువంటి బ్రహ్మజ్ఞానులే అయిన మరికొందరు ఋషులు, కుబేరుడు, విష్వక్సేన, పర్జన్యాది దేవతలు బ్రహ్మచే సృష్టింపబడ్డారు. గరుడా! నా కృపవల్ల పరమసమర్థుడైన బ్రహ్మ ఇంతటి సృష్టినీ అలవోకగా చేయగలిగాడు. ***(అధ్యాయాలు 10 – 13)***

---

★*ఈ గాయత్రి మన గాయత్రి మంత్ర దేవత కాదు. మంత్ర దేవత గాయత్రి పురుషశక్తి.*

# నారాయణ పూర్ణత - పదార్థాల సారాసారాలు

ఓ పక్షీంద్రా! మూలస్వరూపుడు, పూర్ణగుణ సంపన్నుడు, సర్వథా స్వతంత్రుడు, పురాతన పూర్ణ శరీరుడు, ఆనంద స్వరూపుడు, అనంతుడునగు విష్ణు భగవానునితో సమానులు లేరు. ఆయన చరణాది సర్వాంగములు దేనికదే సంపూర్ణము. ఆయన కున్నంత బలమే ఆయన ప్రతియొక్క రోమానికీ వుంటుంది. కాబట్టి ఆయన అన్ని విధాలా సంపూర్ణుడు. ఆయనే అన్నింటికీ అందరికీ కర్త, హర్త మరియు ఈ సృష్టిలోని ప్రతి సారాంశానికీ భోక్త. సారమైన అంశాలకే ఆయన భోక్త. సారహీన, అసార అంశాలనాయన గ్రహింపడు. సమస్త ద్రవ్యాల, ద్రవ్య పదార్థాల సారభాగమే ఆయన దవుతుంది.

ఆయన నిత్యము భక్తులపట్ల దయాళువై వుంటూ భక్తులహిత చింతననే చేస్తుంటాడు. భక్తుల ద్వారా తనకు నివేదింపబడిన భక్ష్య భోజ్యాది పదార్థాలనూ ఉపచారాలనూ అందుకుని వాటిలో సారభాగాన్ని ఎంతో ఆదరంగా స్వీకరిస్తాడు. కాలం వల్ల పాడైనవి, దూషితపదార్థాలు, భావదుష్ట పదార్థాలు ఆయన స్వీకరణకు నోచుకోవు. ద్రాక్ష వంటి పండ్లు కూడా బాగున్నవే ఆయనకుపెట్టాలి.

అందుకే దేవునికి పెట్టవలసిన సారాసార పరిజ్ఞానాన్ని కలిగివుండడం అవసరం.

నేరేడు వంటి ఫలాలు పండిన తరువాత నాలుగురోజులకి సారహీనమైపోతాయి. పనస పండు నెలరోజులవఱకు సారాన్ని కలిగి వుంటుంది. ఖర్జూరం ఆరుమాసాలకి పులుపెక్కిపోతుంది. పవిత్రమైన కొబ్బరికాయ పగులగొట్టిన తరువాత ఒక రోజే సారవంతంగా వుంటుంది. ఎండుకొబ్బరి, ఎండుఖర్జూరాలకైతే ఈ దోషముండదు.

వక్క ఒక ఏడాది వరకుంటుంది. గాని తాంబూలాన్ని ఒక ఘడియ (24 నిముషాల) లోపలే వాడెయ్యాలి. అన్నం, పప్పు వంటివి మూడు గంటలకే అసారమైపోతాయి. నూనెలో వండిన పదార్థాలు మూడు పక్షాల దాకా చెడవుగానీ నేతితో వండినవి మాత్రం పన్నెండు గంటలు దాటగానే అసారమైపోతాయి. తొమ్మిది గంటల లోపలేకోసిన కూరగాయలను వాడెయ్యాలి. శృంగవేరం, గజనిమ్మ, ఉసిరిక, కర్పూరం, మామిడి - ఒక యేడాది పాటు సారాన్ని నిలుపుకోగలవు.

తులసిలో సారం పోదు. ఏకాదశినాడు జలంతో కలిపి దేనినైనా వాడవచ్చును.

***తులసీ సర్వదా సారా ఏకాదశ్యామపి ద్విజ।***
***ఆర్ద్రావాప్యథవాశుష్కాసార్ద్రాసారవతీ స్మృతా ॥*** (బ్రహ్మ.... 14 / 29)

ఆజలం హరి పాద తీర్థమై వుండాలి.

గరుడా! ఆషాఢమాసంలో కూరలు, భాద్రపదంలో పెరుగు, ఆశ్వయుజంలో పాలు నిస్సారమైపోతాయి. అలాగే హరినామాన్ని పలుకని ముఖమూ, హరికి నైవేద్యం చేయబడని పదార్థమూ ఎలాగున్నా నిస్సారాలే.

***హరినామ విహీనంతు ముఖం నిఃసారముచ్యతే ।***
***హరినైవేద్యహీనస్తు పాకో నిఃసార ఉచ్యతే ॥*** ***(బ్రహ్మ....14 / 37)***

మూడు రోజులకి అలసీ పుష్పాలూ, ఒక జాముకే మల్లెలూ, అరజాముకే చమేలీజాతి మల్లెలూ సారమును కోల్పోతాయి. మూడేళ్ళ దాకా కేసరం, పదేళ్ళదాకా కస్తూరీ, ఏడాది పాటు కర్పూరం సారవంతాలు గానే వుంటాయి. చందనానికి సదా సారవంతమని పేరు.

***(అధ్యాయం - 14)***

## హరి అవతారాలు - లక్ష్మీ అవతారాలు

హే ఖగశ్రేష్ఠా! హరి పూర్ణానందస్వరూపుడు. ఆయనకు ఏ దేశంలోనూ ఏ కాలం లోనూ సమానులులేరు. ఆ శ్రీహరియే లోక కల్యాణం కోసం సంపూర్ణ సద్గుణ సాగరుడై ఎన్నో రూపాలను ధరించాడు. నేలపైకీ వచ్చాడు, నింగిపైనా మెరిశాడు, జలం లోనూ నిలిచాడు. ఆ రూపాలనే అవతారాలుగా సంభావించారు వేదవిదులు, విద్వాంసులు.★

ఆ మహావిష్ణువే అన్ని అవతారాలకూ మూలబీజము. ఆయననే వాసుదేవుడన్నారు. వాసుదేవుడే సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపాలలో ప్రకటితుడైనాడు. ఆయనే స్థూల దేహంనుండి బ్రహ్మాది దేవతలను సృష్టించాడు. ఆ వెన్నుడే సనత్కుమారాదిరూపాలను ధరించి జనులకు తపస్సు, బ్రహ్మచర్యం, ఇంద్రియనిగ్రహాలలో శిక్షణనిచ్చాడు; దైత్యరాజు హిరణ్యకశిపుని బారినుండి భూదేవిని రక్షించడానికై వరాహరూపాన్ని ధరించాడు; నారాయణరూపంలో బదరి కాశ్రమంలో వుండి తపస్వులకాదర్శమైనాడు; కపిలమునిగా అవతరించి కాలకవలిత ఇరువది నాలుగు తత్త్వాలుగల సాంఖ్యశాస్త్రాన్నుపదేశించాడు; అత్రిపత్ని అనసూయగర్భాన దత్తాత్రేయుడై జనించాడు; అలర్కరాజుకు ఆన్వీక్షకీ నామకతర్క విద్యను పదేశించాడు; ఆకూతి గర్భానజనించి సురాజ్య స్థాపన గావించాడు; అలాగే

★*భగవంతుని అవతారాలు నూటయెనిమిది పై మాటేననీ, వాటిలో మొట్టమొదటిది సనత్కుమారరూపమనీ ఈ రూపంలో ఆయన వేదాన్ని ప్రారంభించాడనీ చాలా గ్రంథాల్లో కనిపిస్తుంది. గరుడపురాణం ఈ విషయాన్ని లోతుగా చర్చింపలేదు.*

అగ్నీధ్ర పుత్రియైన మేరుదేవికీ నాభికీ అరుక్రమ నామంతో పుత్రునిగా జనించి లోకాలను కాచాడు. క్షీరసాగరమథన వేళ ఆ శ్రీమహావిష్ణువే మందర పర్వతం మునిగిపోకుండా ఆది కూర్మమైవచ్చి ఆదుకున్నాడు. వెనువెంటనే హరితమణి వలె ప్రకాశించు కాంతులు గల ధన్వంతరిగా అవతరించి దేవతలకు అమృతాన్నీ మానవులకు ఆయుర్వేదాన్నీ తీసుకొచ్చాడు. విష్ణువే దైత్యులను మోహితులను చేసి దేవతలకు అమృతాన్నివ్వడానికి మోహినీ రూపాన్ని ధరించాడు. హిరణ్యకశిపుని చంపి వాని బారినుండి ప్రహ్లాదునీ లోకాలనూ కాపాడడానికి శ్రీ హరి నృసింహావతారాన్ని దాల్చాడు. మహాభక్తుడు, మహాదాతయునగు బలిచక్రవర్తి దానవసహవాసంవల్ల అహంకారియు, లోక కంటకుడు కాబోవుచుండగా అతనినీ లోకాన్నీ కూడా కాపాడడానికి శ్రీహరి అదితి గర్భాన కశ్యపనందనునిగా వామనుడై అవతరించాడు. తరువాత ఆయన జమదగ్నికి పరశురాముడై పుట్టి దురహంకారులు, దుర్మార్గులునగు రాజులను మొత్తంగా సంహరించి భూమినీ, ప్రజలనూ, ముఖ్యంగా బ్రాహ్మణులనూ రక్షించాడు. తరువాత ఆ శ్రీహరియే రవికులశశియై రాఘవుడై, రాముడయి, గుణధాముడయి, కౌసల్యా దశరథులకు బిడ్డడై జన్మించాడు. శ్రీరామావతారం లోక విఖ్యాతం. కొన్ని వేల యేళ్ళపాటు, మళ్ళా కల్పమే మారినా, ప్రళయమే వచ్చినా ఆ కరుణాపయోనిధి దాశరథి చరితాన్ని కవులు పాడుతునే వుంటారు. ఈ అవతారంలో స్వామి రావణ కుంభకర్ణాది కొన్నివేలమంది రాక్షసులను సంహరించి మానవజాతిని కాపాడుటే గాక సంపూర్ణమానవజీవితాన్ని గడిపి ఆదర్శ మానవుడెలా వుండాలో ఆ జాతికి నేర్పాడు. తరువాత శ్రీమహావిష్ణువు ద్వాపర యుగంలో వ్యాసమహర్షిగా అవతరించి వేద సంహితను నాలుగు భాగాలుగా విభజించి సుమంతు, జైమిని, పైలాదిశిష్యులచేత వాటిని చదివించిలోకం నలుమూలలా వేద విజ్ఞానాన్ని విరియజేశాడు. అనంతరం ఆ శ్రీ హరియే శ్రీ కృష్ణ వాసుదేవునిగా జనించి స్వయంగానూ, భీమార్జునుల చేతనూ రాక్షసాంశలో పుట్టిన వారందరినీ మడియజేసి భూభారాన్ని తగ్గించాడు. గీతోపదేశాన్ని గావించి భారతజాతికి జగద్గురువై భాసిల్లాడు. తరువాత కీకటదేశంలో బుద్ధ నామంతో జనించి అసురులను మోహంలో ముంచి సుజనులకు వారి పీడను వదిలించాడు. కలియుగంలో విష్ణువు మరల అవతరిస్తాడు. దస్యుప్రియులైన పాలకులను కల్కి నామరూపాలతో వచ్చి సంహరించి ప్రజలను రక్షిస్తాడు. ఇంకా ఎన్ని అవతారాలెత్తాడో మరెన్ని మార్లు రాబోతున్నాడో స్వయంగా ఆయనకే తప్ప ఇంకెవరికీ తెలియదు. ★

---

★*అందుకే స్వామియే స్వయంగా ఇలా అన్నట్లు ఒక పద్య నాటకంలో చెప్పబడింది.*
*జంగమ స్థావరాత్మక జగతిలోన నేను వేయని వేషమే కానరాదు*
*భక్తజనరక్షణార్థము ఏ పనిని గాని సేతునే వేషమైన వేతు...*

కశ్యపాత్మజా! హరిప్రియలక్ష్మీ దేవి జ్ఞాన సంపన్న; జ్ఞానస్వరూప. ఆమె కూడ విభిన్నరూపాలలో అవతరించడం జరిగింది. ఆమె స్వామి చరణగ్రహణం మాత్రమే జీవితాశయంగా గల దేవత. పురుషపత్ని, ప్రకృతి అభిమానిని దేవత ఆ శ్రీ దేవియే. బ్రహ్మాండ సృజనేచ్ఛ శ్రీహరిలో కదలాడినపుడు గుణాలను సృష్టించడానికనువగు ప్రకృతిగా ఆమెయే ఉద్భవించింది. వాసుదేవపత్ని మాయ, సంకర్షణపత్ని జయ, అనిరుద్ధపత్ని శాంత, ప్రద్యుమ్నపత్ని కృతి– లక్ష్మీదేవి అవతారాలే. విష్ణుపత్ని సత్త్వరూపి శ్రీదేవి, తమో గుణాధిక దుర్గాదేవి, రజోగుణాభిమానినీ, వరాహ పత్నియగు భూదేవీ, భగవంతుడు వేదరూపాన్ని ధరించినపుడాయనతోడు అన్నపూర్ణ – లక్ష్మీ స్వరూపాలే. ఆ లక్ష్మీదేవియే యజ్ఞపత్ని దక్షిణగా,శ్రీ రామాంగన సీతగా, శ్రీకృష్ణుని పట్టమహిషులురుక్మిణీ సత్యభామాది మహాదేవులుగా (లక్ష్మియే) అవతరించింది. ద్రౌపదీ, శచీదేవీ లక్ష్మి అవతారాలే.

*(అధ్యాయాలు....25-27)*

## శేష - రుద్ర భగవానుల అవతారాలు

**అ**నంతనాయకుడైన ఆదిశేషుడు అనంత శక్తి సంపన్నుడు. ఆయన ఆవిర్భావం హరి, సిరిల శయనం కోసమే జరిగింది. యోగనిద్రకై విష్ణుభగవానుడు రమాసహితుడై శేషునిపైననే శయనిస్తాడు. గరుడుడు కూడా 'నేను సర్వదా నారాయణ దాస్యాన్నిచేస్తూ సదా ఆయనను పూజిస్తూనే వుంటాను' అంటూ ఆ పరమేచ్ఛతోనూ 'ప్రతిజన్మలోనూ ఆయనతోనే వుంటూ ఆయనకే నమస్కరిస్తూ వుంటాను' అనే శాశ్వతేచ్ఛతోనూ ఆ శయన స్థలం సమీపంలోనే ఆశ్రయాన్ని పొంది స్థితుడవుతాడు.

శేషుడు నారాయణ భక్తుడు. అతనిలో విష్ణు, వాయు, అనంతాంశలున్నాయి. శ్రీ స్వామి రామునిగా అవతరించినపుడు శేషుడాయన తమ్మునిగా లక్ష్మణునిగా జనించాడు. 'నిత్యం స్వామినే సేవిస్తాను' అనే ప్రతిజ్ఞను ఆ జన్మలో కూడ నిలబెట్టుకున్నాడు. తరువాతి జన్మలో బలరామునిగా పుట్టినపుడు కూడా స్వామి వెనువెంటనే నిలిచాడు.

కరుణామయుడైన పరమశివుని తత్త్వం రెండు విధాలుగా గోచరిస్తుంది. ఒకటి ఎల్లపుడూ భక్తులను గాచే దివ్యమంగళ స్వరూపం. సదాశివం. శివం అనగా శుభం, కల్యాణం, మంగళప్రదం. ఇంకొకటి రౌద్రరూపం. ఇది సంహారక వేషం. దుష్టులను శ్మశానంలో కలిపేసి తానూ అక్కడే తాండవం చేసే అవతారం. పుఱ్ఱెలను మెడలో వేసుకొని

కాటి బూడిదనొంటినిండా పూసుకొని చెడ్డవారిని భయపెట్టి మంచి వైపు పరుగు పెట్టించే రూపం. ఇదీ సదాశివమే కాని సదా – అశివం.

విష్ణుభక్తుడు, విష్ణుమిత్రుడునగు రుద్రుడు శివుడు. సదాశివుడు. ఆయనొకమారు రాక్షసులను దుర్భాషలాడి ఆ భాషా విషయక పాపం పోయేటందుకు ఉప్పు సముద్రంలో మునిగి పదేళ్లు అలాగే వుండి పోయి ప్రాయశ్చిత్త తపమొనరించాడు. ఆయనకు 'తాపసుడ'ను పేరు అప్పుడే వచ్చింది. మహా తపస్వుల కాయన ఆ రూపంలో దర్శన మిస్తాడు. అది తాపసావతారం. ఈ అవతారమే వ్యాసపుత్రుడైన శుకుని రూపాన్ని ధరించి భూలోకంలో జీవించింది. శ్రీ శుకమహర్షి శివుని అవతారమే. అశ్వత్థామ కూడ శివుని అంశయే. శివునికి కూడా కొన్ని కర్మఫలాలనుభవింప తప్పలేదు. వాటి కోసమూ శత్రుదుర్భేద్యులైన కొందరి సంహారం కోసం శివుడు ద్రోణపుత్రునిగా – అశ్వత్థామగా జన్మించవలసి వచ్చింది.

ఈశాన్యం వైపుండడం వల్ల శివుని వామదేవుడని కూడా అంటారు. వాయువు శివభక్తుడు. అందుకే అతనికి ఎడమ వైపు శివుడుంటాడు. ఎడమను 'వామ' అంటారు కదా! అలా కూడా శివుడు వామదేవుడు.

కాల, బల నామాలతో కూడ శివుడు సంచరిస్తుంటాడు. మహాకాలుడన్నా ఆయనే. త్రిపురాసురులను సంహరించడానికాయన ఘోర, భయంకర రూపాన్ని ధరించాడు. అది అఘోర రూపమే అయింది. భక్తులాయనను అఘోర స్వరూపంగానే కొలుచుకుంటారు. కొంతమంది తపోధనులైన దైత్యులను కాపాడి, వరములీయడానికి ఒక్క నిముషంలోనే నూతన వాటికను నిర్మింపజేసి అందులోతానొకదివ్యస్వరూపంతోజన్మించాడు. ఈ అవతారం పేరు సద్యోజాతుడు. ఊరువనే వాని పుత్రునిగా ఔర్వనామంతో శివుడవతరించాడు.

ఊర్వశబ్దానికి పెద్ద ధ్వనితో రోదించుటయని అర్థము. రోదన ద్వారా గుండె బరువును దించుకొనుట ఈ భక్తి శాఖ సంకల్పము. (ఇది ఈనాటికీ కొన్ని ఇతర మతాల్లో వుంది–అను) శివుడు ఊరుపుత్రునిగా జనించి ఔర్వుడను పేర ప్రసిద్ధుడై ఈ శాఖను ప్రచారం చేశాడు.

అలాగే ఈశానుడను తపస్సంపన్నుడు ఆయన ప్రశాంతావతారము కాగా దుర్వాసుడను మరొక తపస్సంపన్నుడూ మహర్షి పుంగవుడూ ఆయన ఆవేశావతారము. గరుడా! ఏ దేవుడైనా దేవియైనా లోక కల్యాణం కోసమే కారణ జన్ములై అవతరిస్తారు"

***(అధ్యాయం – 28)***

# శ్రీకృష్ణపత్ని నీల (నాగ్నజితి) కథ

"అగ్నిదేవునిపై నీకున్న కరుణ అనంతమనీ ఆయన భక్తి ఆదర్శప్రాయమనీ విన్నాను. వివరాలను వినగోరుతున్నాను" అని వేడుకొన్న వైనతేయునికి వాసుదేవుడిలా చెప్పాడు.

"అగ్నిదేవుని కూతురు నా ధర్మపత్ని కావడం నీవు విన్నదానికి మూలమై వుంటుంది. నా భార్య నాగ్నజితి పూర్వజన్మలో అగ్నిదేవుని రూపము, పితరులలో శ్రేష్ఠుడునగు కవ్యవాహుని పుత్రిక. ఆమె శ్రీ మహావిష్ణువునే పతిగా పొందాలనే అనన్య చింతనతో ఆయననే స్మరిస్తూ పూజిస్తూ జీవిస్తుండేది. ఆమెకు పెళ్ళీడు రాగానే ఆమె తండ్రి వివాహ ప్రయత్నాలను మొదలుపెట్టాడు. ఆమె నీలమేఘశ్యాముని తప్ప వేరొకరిని వరించబోనని చాలా గట్టిగా చెప్పింది. ఆయన మనకెలా దొరుకుతాడని మనసులో ఆవేదన చెందుతూనే అగ్నిదేవుడు 'పతిగా ఇంకెవరినీ ఊహించలేనని పట్టుపట్టుకొని కూర్చున్నావు. ఎందుకంత పట్టుదల నీకు?" అని అడిగాడు.

ఆమె ఇట్లన్నది – 'తండ్రీ! సర్వసద్గుణ సంపన్నుడగు హరి తప్ప వేరొకడు నా పతి దేవుడు కాలేడు. ఈ జన్మలో నా కోరిక నెరవేరకపోతే జన్మంతా ఇలాగే ఆయన కోసం తపిస్తూ వుండిపోతాను. అనాది, నిత్యుడు, సంపూర్ణుడు, విశ్వానికి ఏకమాత్ర సారస్వరూపుడు, పరమ సుందరుడు, మోక్షప్రదాత, సర్వేచ్ఛలనూ సంపూర్తి చేయగలవాడునగు శ్రీహరిని పెండ్లి చేసుకున్న స్త్రీయే సంపూర్ణ సౌభాగ్యవతి. ఏ స్త్రీల భర్తలు పరమ విష్ణుభక్తులో వారి జన్మలే సఫలము. ఎన్నో జన్మల సంచిత పుణ్యం వుంటేనే స్త్రీకి విష్ణుభక్తుడు భర్తగా లభిస్తాడు. రానున్న కలియుగంలో పరిస్థితులెలా వుంటాయో విష్ణుదయ మహిమ వల్ల నాకు తెలిసింది. చెప్తాను విను. కలియుగంలో విష్ణుభక్తులు, హరిభక్తి, భక్తుల సత్సాంగత్యం, శేషాచలంపై వెలసే హరి దర్శనం, విష్ణుపదియైన కాళిందీ తటంపై విరాజిల్లు రంగనాథుని దర్శనం, కంచి వరదరాజ స్వామిని చూడగలగడం, రామసేతు దర్శనం, భీమా, రేవా నదీతటాలపై నిలిచి విష్ణువుకి నమస్కరింపగలుగుట, గయా క్షేత్రంలో విష్ణుపాదాలకు శిరస్సును తగిలించుట – ఇవన్నీ దుర్లభాలై పోతాయి. ఆ కలియుగం రాకముందే నేను విష్ణుపత్నిగా మారి ఆయా ప్రదేశాల్లో విష్ణుభక్తుల దర్శనానికై వెలసి వుంటాను, వేచి వుంటాను. ఇక నేను నా స్వామికై తపస్సు చేయడానికి వెళుతున్నాను'

అని చెప్పి ఆమె శేషాచల పర్వతం వైపు సాగిపోయింది. అన్నీ తెలిసిన అగ్నిభట్టారకుడు నాకు నమస్కరించి ఏమీ తెలియని వాని వలె ఆమె రక్షణకేర్పాటు చేశాడు.

ఆమె ముందుగా కపిల తీర్థం చేరుకొని అక్కడున్న శ్రీనివాసుని దర్శించి ప్రణామం చేసింది. మూడు రోజులాయనను సేవించి అక్కడి నుండి పాప వినాశక తీర్థాన్ని చేరుకొని వివాహేచ్ఛను మనసులో పెట్టుకొని ఆ తీర్థరాజంలో మునకలిడి దాని కుత్తరదిశలో మూడు కోసుల విస్తీర్ణంలో వ్యాపించియున్న ఒక గుహ రూపంలో నున్న ఏకాంత స్థానానికి పోయి నారాయణ ధ్యానంచేస్తూ తపశ్చర్యలో స్థిరపడిన నాగ్నజితి ఆ స్వామినిలా స్తుతించింది. 'హే దేవా! మీరే నా తల్లి, తండ్రి, పతి, సఖుడు, పుత్రుడు, గురువు, శ్రేష్ఠ స్వజనం, మిత్రబృందం, ప్రాణవల్లభుడు. స్వామీ! ఈ సంసారంలో మాకుండే మిత్రబాంధవాదులు నిమిత్తమూలకంగా ఏర్పడతారు. కాని మీరు ఏ నిమిత్తమూ లేకుండానే ఏనాటినుండో నా సర్వస్వమైయున్నారు. కావుననో దేవా! నేను మిమ్మే పతిగా వరించాను. ఎన్ని జన్మలకైనా మీ భార్యగానే వుంటాను' ఈ విధంగా ఆమె చేసిన కఠిన తపశ్చర్యకు ప్రసన్నుడై శ్రీహరి ఆమెకు సాక్షాత్కరించి ఇలా అన్నాడు. 'ఓ కుమారికా! కృష్ణావతారంలో నేను నీ పతిని కాగలను. *శ్రీనివాస రూపంలో దర్శనమిచ్చిన స్వామి అంతర్ధానం చెందగానే ఆ కవ్యవాహక పుత్రియౌగిక రీతిలో ఆ శరీరాన్ని వదలి కుంభకుడను పుణ్యుని ఇంటిలో నీలయను పేరిట జన్మించింది.

ఆమె వివాహానికామె తండ్రి స్వయంవరాన్ని చాటించాడు. శివుని వరం వల్ల ఆయనకు సంక్రమించిన ఏడు వృషభాలను అదుపులోకి తెచ్చుకోగలిగిన మగధీరునికే ఆమెనిచ్చి వివాహం చేస్తానన్నాడు. భగవదంశ గలవాడూ శివుని ప్రసన్నం చేసుకున్నవాడు మాత్రమే వాటిని అధీనంలోకి తెచ్చుకోగలడని ఆయనకు తెలుసు. నేను శివుని ప్రసన్నుని చేసుకొని వాటిని అదుపులోకి తెచ్చుకున్నాను. అయినా నేను సామాన్య గోపబాలకుడినను కొని కొందరు క్షత్రియవీరులు నన్ను తప్పించి ఆమెను తీసుకుపోయే ప్రయత్నించారు. ఆమెను బందీగా గొనిపోయారు కూడ. నేను వారిని వెంబడించి వారందరినీ యుద్ధం చేసి గెలిచి నీలను వివాహం చేసుకున్నాను. భద్రామిత్ర విందా కూడా నా కోసం జపించి తపించి నన్ను చేపట్టారు"

***(అధ్యాయం - 19)***

---

***కలౌ వేంకట నాయకః** *అన్నంత మాత్రాన శ్రీనివాసుడు కలియుగంలోనే గాని అంతకు ముందు లేడనుకోనక్కర లేదు. కపిల తీర్థం, పాపనాశం శ్రీనివాసుడు త్రేతాయుగం నాటికే వున్నాయి.*

# భద్ర, మిత్రవింద కృష్ణపత్నులైన విధము

"అన్ని శుభలక్షణాలతో విష్ణుపత్నికి అవసరమైన అన్ని భద్రమైన గుణాలతో భద్రయను పేరు గల కన్య, పూర్వజన్మలో, నలుడను సామాన్యుని ఇంట దివ్యజ్ఞాన సంపన్నురాలై జన్మించింది. అందరు ఆడపిల్లల తండ్రులలాగే నలుడు కూడా తన కన్యకు వివాహం చేయ సంకల్పించాడు. దానికి ఉపోద్ఘాతంగా ఆమెతో ఇలా అన్నాడు– 'అమ్మా భద్రా! నీలో సామాన్య కన్యకల లక్షణాలు కనబడటం లేదు. ఎప్పుడూ ఏదో పూజలంటావు, నైవేద్యాలంటావు, ప్రదక్షిణలంటావు. మామూలు మాటలు, ఆటపాటలు, అమ్మలక్కలతో అనుబంధాలు, కనీసం పరిచయాలు వుంటే కదా నీ మంచి లక్షణాలు నలువైపులా పాకి నీకు మంచి సంబంధాలొచ్చేది? ఇంత శ్రమపడి, శరీరాన్ని శుష్కింపజేసుకొని పూజలు చేసే నీవు ఏ ఫలాన్ని ఆశిస్తున్నావో చెప్పగలవా?"

**భద్ర ఇట్లన్నది :** 'తండ్రీ! నా పితృదేవుడవైన నీకు నేనేమి చెప్పగలను? భగవంతుడికి నమస్కారాదిక్రియలు చేయడం వల్ల వచ్చే ఫలాన్ని ఎవరు చెప్పగలరు? అయినా నా విషయమై నా ప్రయత్నం నేను చేస్తాను. తండ్రీ! నా జీవితపు తొలినాళ్ళ నుండీ కూడా కరుణా నిధానమగు విష్ణు భగవానుడే నా స్వామి. నేను హరికి దాసిని. హరిదాసులకు దాసిని. అంబుజోదర దివ్య పాదారవిందాలకు నమస్కరించి "నన్ను రక్షించు మహాప్రభో" అని వేడుకుంటాను. ఇలా అంటూనే ఆమె భక్తి పరవశయై నేలపై సాష్టాంగపడి విష్ణువుకి నమస్కరించి లేచి మరల తండ్రితో మాట్లాడసాగింది. 'ఓ తండ్రీ ప్రతీ జీవీ నిత్యం, నిరంతరం విష్ణుభగవానునికి ప్రణామం చేస్తూనే వుండాలి. ఆయనకు వందనమే ఆనందనందనము. పూజదాకా పోనక్కరలేదు. నామస్మరణం, ప్రణామ నివేదనం, వందనం – ఈ మాత్రపు సేవకే ఆయన సంతుష్టి చెందిపోయి శుభం కలిగిస్తాడు. అందుకే ఆయనే కరుణాపయోనిధి.

నాన్నగారూ! విష్ణుదేవునికి దండం పెట్టని వారి శరీరం పెద్ద దండగ. దాన్ని పోషించడం వ్యర్థం. వారు నరకానికి పోకుండా ఆపగలిగేశక్తి మరల ఆ విష్ణుభగవానునికే ఉంటుంది. దేవశ్రేష్ఠులకు కూడా హరినామ స్మరణమే పరమోపాయము. ఏ నాలుకపైనైతే 'హరి''కృష్ణ' అనే పదాలుండవో అది, జ్ఞానేంద్రియం కాజాలదని జ్ఞానులు వక్కాణిస్తారు.

కాశీ నివాసం కన్న, ప్రయాగలో మరణం కన్న, యజ్ఞాదుల యాజమాన్యం కన్న, సర్వతీర్థాభిగమనం కన్న – ఇలాంటి, మనకు తెలిసిన ఎన్నో – కాదు, అన్ని – పుణ్య కార్యాల కన్న – హరినామస్మరణమే మిన్న.

*కాశీనివాసేన చ కిం ప్రయోజనం*
*కిం వా ప్రయాగే మరణేన తాత ॥*
*కిం వా రణాగ్రే మరణేన సౌఖ్యం*
*కింవా మఖాదేః సమనుష్ఠితేన ।*
*సమస్త తీర్థేష్వటనేన కిం కిమ*
*ధీత శాస్త్రేణ సుతీక్ష్ణబుద్ధ్యా ॥*
*యేషాంజిహ్వాగ్రే హరినామైవ నాస్తి*
*యేషాం గాత్రైర్నమనం నాపి విష్ణోః ।*
*యేషాం పద్భ్యాం నాస్తి హరేః ప్రదక్షిణం*
*తేషాం సర్వం వ్యర్థమా హుర్మహాంతః ॥* *(బ్రహ్మ ....20/10-12)*

కాబట్టి ఓ తండ్రీ! ప్రాణుల యొక్క ప్రథమ కర్తవ్యం సర్వకాల సర్వావస్థలందూ హరిని స్మరించడం, పూజించడం, ప్రదక్షిణించడం, జపించడం, స్తుతించడం. మానవ జన్మ దుర్లభమే. అయితే నశ్వరం కూడ. దగ్గితే ఊడిపోయే ముక్కులాటి ఈ శరీరంతో శాశ్వతమైన కీర్తినీ, స్థానాన్నీ సంపాదించుకోగలిగితే అది చాల గొప్ప విషయమే కదా! అలా సంపాదించి పెట్టేవాడు హరి. అందుకే నా జీవితం ఆయనకే అంకితం. తండ్రీ! మీరు కూడా జీవితాన్ని ఆయనకు నైవేద్యం చేయండి".

భద్ర ఇలా ప్రవచించగానే ఆమె తండ్రికి భద్రావిష్ణుల తత్త్వం అవగతమైంది. ఆయన కూడా హర్యుపాసనలో పడ్డాడు. వారిద్దరూ అలా హరిని ధ్యానిస్తూనే ఆ జన్మను గడిపేశారు. ధ్యానంలోనే మృతి చెందారు.

పక్షిరాజా! మరుజన్మలో ఆమె నా మేనత్త గారింట జనించింది. దైవికంగా ఆమెకు భద్ర అనే పేరే పెట్టబడింది. ఆమెకు కైకేయి అనే పేరు అనుకున్నారు. గానీ మునులు, పెద్దలు ఆమె భద్రమైన లక్షణాలను చూసి 'భద్ర' అనే అన్నారు. నేనామెను సలక్షణంగా వివాహం చేసుకున్నాను.

ఓ గరుడా! మిత్రవింద నా పత్నియగుట కూడా ఆమె కారణజన్మురాలగుట వల్లనే. పూర్వజన్మలో ఆమె హరిని మిత్రరూపంలో పొందాలనుకొనేది. సర్వకాల సర్వావస్థలలోనూ హరిని ఎలా పొందాలనే ఆలోచన తప్ప ఆమెకు మరొకటి వుండేది కాదు. ఆమెకెన్నో తెలుసు. చివరకు 'సాత్త్విక పురాణాలందు వర్ణితములైన భగవానుని కథలను శ్రవణము చేయుటయే సర్వసాధనాలలోకీ శ్రేష్ఠమైనది' అనే నిశ్చయానికి వచ్చింది. విష్ణు కథలు

వినని వారి జన్మ వ్యర్థమని నిర్ణయించుకుంది; గరుడా! ఆమె ఆలోచన ఎంత సముచితమో కదా! విష్ణు సంబంధిత కథారూపియగు మహానది ప్రవహించని చోట నారాయణ పదాంబుజాశ్రయం కానిచోట, ముఖం నుండి శ్రీహరి నామస్మరణం, కలువ నుండి తుమ్మెద ఝుంకారం వలె వెలువడని చోట, ఎంత తప్పనిసరైనా, ఒక్క క్షణం కూడా నిలువరాదు. భాగవత శాస్త్ర చర్చలు జరగని గ్రామంలో, భాగవత రసపిపాసులు లేని ఊరిలో, భగవద్గీతా ప్రవచనాలు గాని విష్ణు సహస్రపారాయణం గాని జరుగని జనావాసాల్లో, హరికథా గానం చెవికి సోకని ప్రదేశాల్లో బతుకు తెరువు కోసం ఉండిపోయినా, అట్టివారి జీవితం వ్యర్థమే.

*యస్మిన్ గ్రామే భాగవతం న శాస్త్రం*
*న వర్తతే భాగవతా రసజ్ఞాః ।*
*యస్మిన్ గృహే నాస్తి గీతార్థ సారో*
*యస్మిన్ గ్రామే నామ సహస్రకం వా ॥*
*తయో రసజ్ఞా యత్ర నసంతి తత్ర*
*న సంవసేత్ క్షణ మాత్రం కథంచిత్ ।*
*యస్మిన్ దినే దివ్య కథాచ విష్ణోర్నవాస్తి*
*జంతో స్తస్య చాయు ర్వృథైవ ॥* ***(బ్రహ్మ...20/29,30)***

'రసికుడైన విద్వాంసుడు తన చెవులకు బంగరు కుండలాల వల్ల సౌందర్యం వస్తుందనుకోడు. చెవులకు నిజమైన అందం వాటిలో నెల్లవేళలా హరిగాథలు 'రింగు రింగు'మనడమే! ఎవరైతే నిత్యమూ భాగవతార్థ తత్వాన్ని వింటూ దాని గురించే మాట్లాడుతూ వుంటారో, వారి జీవితమే సఫలము. ఈ విశ్వంలో సర్వత్ర వ్యాప్తి చెందియున్నవాడు శ్రీ మహావిష్ణువే. ఆయనే నిత్యుడు, అంతర్యామి. ఎవరైతే నిత్యమూ ఆయన భక్తులుగానే జీవిస్తారో వారి యోగక్షేమాలను ఆయనే స్వయంగా చూసుకుంటాడు. భక్తుల కశుభము కలుగదు. కాబట్టి నాన్నగారూ! నేను కూడా ఆయన సత్కథలను వింటూనే జీవిస్తాను. అలా వింటూనే తనువు చాలిస్తాను'– అని మిత్రవింద అలాగే చేసి మరుజన్మలో నా మేనత్త సుమిత్ర కూతురిగా జనించింది. స్వయంవరంలో ఎందరో క్షత్రియ వీరులను దాటుకొని నా మెడలో మాల వేసి నన్ను వరించింది. నేను ఆమె కోరికను మన్నించి ఆమెను అపహరింపదలచిన రాజుల నోడించి ద్వారకకు తీసుకువచ్చి శాస్త్ర విధిని వివాహమాడాను. ***(అధ్యాయం – 20)***

# సూర్యపుత్రి *కాళింది కథ

వివస్వంత రూపంలో నున్నపుడు సూర్యునికి జనించిన కాళింది నాపత్ని ఎట్లయినదో విను. ఈమెకు యమున, యమానుజ అనే పేళ్ళు కూడా వున్నాయి. ఆమె విష్ణు పత్నిని కావాలనే ఇచ్ఛతో విశిష్ట తపస్సును కావించింది. పూర్వజన్మలో చేసిన పాపాలను దగ్ధం చేయడానికి చేసే ప్రయత్నాన్నే తపస్సంటారు. దీనినే పాపానుతాపమనీ అంటారు.

పూర్వజన్మలో నెవరైతే ముకుందుని అసలు తలచుకోకుండానే బతికేశారో వారు జీవిత చరమాంకంలో చివరగా ఇలా దేవునికి విన్నవిస్తారు. 'హే ముకుందా! నేనీ పుత్ర, మిత్ర, కళత్రాది బంధాలతో నిండిన సంసారంతో అత్యంత సంతప్తుడనై వున్నాను. భగవన్! నేను నీ ముఖారంవిదాన్నెప్పుడు దర్శించగలను? నేనెన్నడూ నిన్ను సేవించలేదు, పూజించలేదు. నేనెలా ఉద్ధరింపబడగలను? స్వామీ! నావంటి మహాపాపి నిన్నెట్లు చూడగలడు? నేనిలాగే ఎన్నో జన్మలుగా సాంసారిక బంధాలలో చిక్కువడి నిన్ను తలచుకోక పోవడం వల్ల మరల మరల జన్మించి, గతించి వుంటాను. ఈ సంసార బంధాల వల్ల ఏ మాత్రమూ సుఖపడలేదు. నిన్ను సేవించుకోలేదు. సత్సంగతిలో సమయాన్నీ సద్వినియోగం చేసుకోలేదు. భక్తజనులతో కలసి భజనలైనా చేయలేదు. హే మురారీ! నా శరీరం కష్టాలలో పడి కాలిపోతోంది. ఇపుడు ఎవరిని శరణు వేడను, నీవు తప్ప నాకు దిక్కెవరు? – ఈ రకంగా పశ్చాత్తపించడాన్నే అనుతాపమంటారు. ఇపుడు చేసేదే తపము. పక్షిరాజా! కాళింది ఇలా తపస్సు చేయడానికి యమునా తీరానికి పోయి అక్కడ నా ధ్యానంలో నిమగ్నయై వుండిపోయింది.

గరుడా! ఇలా వుండగా నేనొక రోజు అర్జునునితో కలిసి యమునా తీరానికి విహారానికి వెళ్ళాను. అక్కడామెను చూసి వివరాలు కనుక్కొమ్మని అర్జునుని పంపాను. అర్జునుడామె కథనంతటినీ కనుక్కొని వచ్చి నాకు చెప్పాడు. తరువాత నేనొక శుభముహూర్తంలో ఆచార ప్రకారం అక్కడికి పోయి కాళిందీ పాణిగ్రహణం చేశాను. స్వయంగా సంపూర్ణానంద స్వరూపుడనైన నాకు ఏ సుఖాభిలాషా వుండదు. నా వివాహాలన్నీ భక్తానుగ్రహ దృష్టి వల్ల జరిగినవే. ***(అధ్యాయం – 21)***

---

***కాళింది అనే మాట తెలుగులోనే వ్రాయబడుతుంది. ఇతర భాషలలో కాలిందియే.**

# లక్షణా పరిణయం

ఓ ఖగపతీ! లక్షణ వివాహ వృత్తాంతాన్ని వినిపిస్తాను. ఈమె పూర్వజన్మలో సకల వేదపారంగతుడైన అగ్నిదేవుని పుత్రి. అన్ని ప్రకారాల శుభలక్షణాలతోనూ పుట్టడం వల్ల ఈమెకు సులక్షణ (సులక్ష్మణ) అను పేరు కలిగింది. అన్ని రకాల శుభ లక్షణాలూ సంపూర్ణంగా గల పురుషుడు మహావిష్ణువొక్కడే కదా! ఆయన ప్రతిరూపుడీ లోకమున శ్రీకృష్ణుడే కదా అని యెంచి ఆమె నన్ను పతిగా భావించి పూజలు చేయసాగింది. వివాహ ప్రసక్తిని దెచ్చిన తండ్రితో ఆమె ఇలా అంది 'నాన్నగారూ! ఆ శ్రీహరి సర్వత్ర వ్యాపించి, అందరిలోనూ వుండే సర్వాంతర్యామి. దానాది శుభకర్మలేవి చేసినా ఆయననే ఉద్దేశించి చేయాలి. ఆయనను భక్తిపూర్వకంగా వివిధోపచారాలను సమర్పిస్తూ మనసులో నిలుపుకొని ఆ దేవదేవుని సంతుష్టపఱచడానికి ప్రయత్నించాలి. భక్తిసహితంగా నివేదింపబడిన అన్నపానాది పదార్థాలను ఆ శ్రీమహావిష్ణువు నిస్సందేహంగా స్వీకరిస్తాడు.

గృహస్థు ఎప్పుడూ కూడా సర్వప్రథమంగా యోగ్య పదార్థాలనన్నిటినీ శ్రీహరికి సమర్పించిన తరువాతే తన పనులు చూసుకోవాలి. అట్టివారే ధన్యగృహస్థులు. ఎవరికి ఎట్టి దానమిచ్చినా మాధవుడే వచ్చి గ్రహిస్తున్నాడనుకొని దానగ్రహీతను ఆదరించి దానం చెయ్యాలి. ఈ రకంగా ఇతరులకు దానమిచ్చినా దానిని తానే గ్రహించి విష్ణువు సంతుష్టుడవుతాడు. ఆ వాసుదేవుడే వసించు దేవుడు. ఆయనే మన ఇంటిలోనూ ఒంటిలోనూ వెలిగే దీపం. నేనా మాధవుని భక్తురాలిని. ఇంకొకరిని నాథవునిగా ఊహించలేను'.

తరువాత కొంత కాలానికామె 'నాకు కృష్ణుడే పతిగా రావాలి గాక' అని కోరుకుంటూ ప్రాణ పరిత్యాగం చేసింది. మరుజన్మలో ఆమె మద్ర దేశాధీశుని పుత్రిగా జనించింది. మహావీరుడైన ఆమె తండ్రి మత్స్యయంత్రాన్ని ఛేదించగలవానికే పిల్లనిస్తానని స్వయంవరం ప్రకటించాడు. నేనామె గత జన్మనాటి కోరికను తీర్చడం కోసం మద్రదేశానికి పోయి ఆ యంత్రాన్ని ఛేదించి ఆమెను పెండ్లి చేసుకున్నాను.

***(అధ్యాయం - 22)***

# సోమపుత్రి జాంబవతి కథ

ప్రియుడైన శిష్యుని కెంత చెప్పినా గురువు తనివి తీరదు. గరుడా! నీకిపుడు నా ప్రియపత్ని జాంబవతి కథను వెల్లడిస్తాను విను. క్రిందటి జన్మలో ఆమె శ్రీ సోముని (చంద్రుని) పుత్రిక. ఆయన నిరంతరం విష్ణు సేవలనే చేస్తుండేవాడు. ఆయన పుత్రిక తండ్రిని అనుసరించేది. ఆమె నిత్యమూ పురాణాలు వినేది; ప్రతి క్షణం భగవత్ స్మరణ చేస్తుండేది; ఆయన చరణాలకు అవకాశమున్నపుడల్లా వందనాలు చేస్తుండేది; విష్ణుసేవ తోడిదే జీవితమన్నట్లుగా కాలం గడిపేది. మెల్లమెల్లగా క్రమక్రమంగా జాంబవతి మనసులో ఆధ్యాత్మిక జ్ఞానం గూడుకట్టుకోసాగింది. ఈ సంసారం శాశ్వతం కాదనీ, సుఖదుఃఖాలు మాయాకల్పిత విన్యాసాలేనని ఆమెకు అవగతమైంది. భగవత్ ప్రేమతోనే జీవిస్తూ ఆయనకు అంకితంగానే అన్ని పనులూ చేస్తుండడంలో వున్న ఆనందం మరెక్కడాలేదని ఆమెకు తెలిసి వచ్చింది. ఆమె మాటలో భగవంతుని నామమూ, గుణకథనమూ తప్ప వేరొకటి వినవచ్చేది కాదు. ఆమె కన్నులు నిత్యమూ ఆయననే అన్వేషిస్తూ ఆయన కోసమే వేచి చూస్తూ ఉండేవి. చెవులు విష్ణుదేవుని మాట వినడానికి సిద్ధంగా వుండేవి. ఆమె చేతులనిండా నిత్యమూ కృష్ణార్చనకు సంబంధించిన సంభారాలే ప్రకాశిస్తుండేవి. ఆమె పాదములు నిత్యమూ హరికి ప్రదక్షిణ చేయడానికే ప్రయత్నిస్తుండేవి. హృదయంలో ఆమె నింపుకున్న కోరిక ఒకటే. 'నేను శ్రీ స్వామి చరణ దాసిని కావలెను. అంతే' ఆమె కార్యములన్నీ శ్రీహరివైపే కదులుతుండేవి. ఆ పని పూర్తి కాగానే దాని నామె భగవంతునికే సమర్పిస్తుండేది. బ్రాహ్మణులను, సంతులనూ జాంబవతి హరి స్వరూపులనుగా భావించి నిత్యమూ పూజిస్తుండేది.

ఒకనాడామె తండ్రి శ్రీ సోముడు తీర్థయాత్రలకు బోవ సంకల్పించాడు. జాంబవతి ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. ఆమె ఎప్పటి నుండో భగవంతుడు వివిధ లీలలను ప్రదర్శించిన యాత్రా స్థలాలనూ, ఆయన అదృశ్యరూపంలో నెలకొని వుంటాడని ప్రతీతమైన క్షేత్రాలనూ సేవించాలని అనుకుంటుండేది. సోముడు శ్రీనివాసుని దర్శనానికి పోదామనుకుంటున్నాడని విని ఆమె ఆనందంతో పరవశించిపోయింది. శ్రీనివాసుని పట్ల మధురభక్తిని మదిలో పెంచి పోషించిన అరుదైన అతివ జాంబవతి. శేషాచలంపై తన ప్రియతముని కనుల నిండా నింపుకోగల నన్న భావమామెను నిలువనీయలేదు. ఆమె తండ్రి కూడా సంపూర్ణ భక్తితత్పరుడే. ఇరువురి ఉత్సుకతా అనిర్వచనీయమే. యాత్ర ప్రారంభమైంది.

తండ్రీకూతుళ్ళిద్దరిదీ భక్తి పారవశ్యమే. వారి పాదములు అప్రయత్నంగానే ముందుకి సాగిపోసాగినవి. వారి కులగురువు సద్గురు జైగీషవ్యమహర్షి ఆజ్ఞ మేరకు సోముడు కపిల తీర్థాన్ని చేరగానే శిరోముండనం చేయించుకొని స్నానం చేసి తీర్థ శ్రాద్ధాన్ని నిర్వహించాడు. వివిధ ప్రకారాల దానాలనూ ఇచ్చాడు. తరువాత గురువుగారు వారికి వేంకటాద్రి యొక్క మహత్త్వాన్ని వినిపించాడు. యాత్రికుల మనసులు శ్రద్ధాతిరేకములు కాగా వారు మిక్కిలి ప్రేమగా ఆ పవిత్ర పర్వతాన్నధిరోహించసాగారు. గురువుగారు వారికి నారద, ప్రహ్లాద, పరాశర పుండరీకాది మహా భాగవతోత్తముల పుణ్య కథలను వినిపిస్తూ వెళ్ళసాగారు. ఇవి కాక నామరసాస్వాదన వుండనే వుంది కదా! నిజం చెప్పాలంటే వారు నడవడం లేదు. ఆనందరసాబ్ధిలో దిగి నిలబడితే ఆ తరంగాలే వారిని ముందుకి గొనిపోతున్నాయి. జాంబవతి ఆనందానికి అంతేలేదు.

దారిలో వారికొక మనోరమమైన తీర్థం తగిలింది. జాంబవతి 'గురుదేవా! ఇది ఏ తీర్థము? ఇక్కడెవరో పరమభాగ్యశాలినే భగవంతుడు అనుగ్రహించినట్లనిపిస్తోంది. ఎవరు వారు? అని అడిగింది.

ప్రసన్నుడైన గురుదేవులిలా ప్రవచించారు. 'అమ్మా! దీని పేరు నారసింహ తీర్థము. భక్తరాజు ప్రహ్లాదుడు శ్రీనివాసుని దర్శించుటకై ఇక్కడికి విచ్చేశాడు. ఆతనితోబాటు కొందరు మిత్రులు కూడా వచ్చారు. వారు దైత్యులే అయినా భక్తులు. వారు ప్రహ్లాదునిలా అడిగారు. 'మిత్రమా! మనకందరికీ భగవానుని చూడాలనే ఉత్సుకత ఎక్కువగా నున్నది కదా. నృసింహరూపుడైన శ్రీనివాసుడిక్కడి ప్రతికణంలోనూ వ్యాపించి యున్నాడని చెప్పావు కదా! ఈ విశుద్ధ జలంలో ఆయన మాకెందుకు కనబడుట లేదు? మాకాయన దర్శనాన్ని చేయించు'.

దైత్యులు సహజంగా ఎలా మాట్లాడతారో తెలిసిన ప్రహ్లాదుడు వారి పట్ల ప్రసన్నుడై భగవంతుని ప్రార్థించగా ఆ మహాభక్తుని పట్ల నిత్యమూ ప్రసన్నంగా వుండే పరమాత్మ ఆ బృందానికంతటికీ ఆ నీటిలో దర్శనమిచ్చాడు. అంతేకాక ఇకపై ఆ జలాశయంలో స్నానం చేసినవారు జ్ఞానవంతులవుతారని వరం కూడా ఇచ్చారు. ప్రహ్లాదాది ఆ భక్త శిఖామణులు సామాన్యశరీరాలను త్యజించిన తరువాత అనంతాత్మరూపులై ఇక్కడే నివసించ సాగారు. ఇప్పటికీ వున్నారు. ఎప్పటికీ వుంటారు. మహాభాగవతోత్తములకు ఈనాటికీ ఇక్కడ మధ్యాహ్నం దాటాక నృసింహ నామమూ, జయజయధ్వనులూ వినిపిస్తుంటాయి.'

అందరికీ రోమాంచమునూ అశ్రుధారాపాతమునూ అవిరళభక్తి భావజనితములుగా కలిగించింది ఈ ఇతిహాసం. వారి భక్తికి ప్రసన్నుడై ముగ్ధుడై శ్రీనివాసుడు వారికి అక్కడే

దర్శనమిచ్చాడు. జాంబవతి మధురభావానికనుగుణంగా ఆ స్వామి కోటి మన్మథుల అందంతో కమనీయ రూపంలో దర్శనమిచ్చాడు. చూస్తుండగానే జాంబవతికి అంగాలన్నీ శిథిలమైనట్లయింది. రోమాంచం కలిగింది. కంటి నుండి ప్రేమాశ్రువులు ధారకట్టి జారగా ఆమె పాదాల వద్ద నొక మడుగు వంటి దేర్పడింది. ఎట్లో గొంతు పెగుల్చుకొని 'నాథా! నన్ను నీ చరణదాసిగా స్వీకరించు' అనగలిగింది జాంబవతి.

ఇంతవఱకు తన సౌందర్య సుధనే చవి చూపిన శ్రీనివాసుడిపుడామెకు తన వాక్సుధను కూడా సమర్పిస్తూ ఇలా అన్నాడు. ★'జాంబవతీ! నేను నీకు వేంకటేశ మంత్రాన్నుపదేశిస్తాను. నువ్విక్కడే వుండి దాన్ని జపిస్తూ తపము చెయ్యి' అని అనుగ్రహించాడు. జాంబవతికామాటకి తన చెవిలో అమృతం కురిసినట్లయింది. ఆనందంతో పరవశమైపోయింది. అప్పటిదాకా వున్న లజ్జ ఏమై పోయిందో, ఉన్నట్లుండి ఆనంద నృత్యం చేయసాగింది. ఆ నృత్యానికి బ్రహ్మాండమంతా పరవశమై పోయి నాట్యం చేస్తున్నట్లు ఊగింది. స్వర్గం నుండి అప్సరసలు దిగి వచ్చి ఆమె కిరువైపులా సర్దుకొని నర్తించసాగారు. దేవదుందుభులు మ్రోగుతుండగా దేవతలామెపై పుష్పవృష్టిని కురిపించారు.

ఇలాగే భగవంతుని ప్రేమచే ఆహ్లాదితయై జాంబవతి తీర్థయాత్రను కొనసాగించింది. గురువుగారామెకు శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యాన్ని వినిపించారు. శ్రీనివాసుడు సదాచరించే స్వామి పుష్కరిణి కథనీ చెప్పారు. ఇలా ఆ యాత్ర కొనసాగుతున్న ప్రతి నిముషమూ ఆమెకు శ్రీనివాసునిపై గల ప్రేమానురాగాలు పెరిగిపోసాగాయి. గురువుగారు వేంకటాద్రిపై చూపి చెప్పిన ప్రతి తీర్థాన్నీ జాంబవతి మనసారా సేవించింది. చివరగా ఋషితీర్థాన్ని చేరుకున్నపుడు సప్తర్షుల పాదముద్రలచే పవిత్రమైన ఆ నేలనామె కన్నుల కద్దుకొని ఆ ధూళిని నుదుటికి రాసుకొని అక్కడే ఉండిపోయింది. ఆ తీర్థంలోనే తపస్సుననుష్ఠించింది.

గరుడా! నేను అవతరించే దాకా ఆమె అలా తపస్సు చేస్తూనే వుంది. ఆమె శరీరం అత్యంత పవిత్రమై పోయింది. చివరికి నేను తన పతిని కావాలనే అభిలాషతో, యోగధారణ ద్వారా తన శరీరాన్ని త్యజించి వెంటనే భక్తశిఖామణియైన జాంబవంతుని ఇంటిలో మరల జన్మించింది. అక్కడ కూడా ఆమె పేరు మారలేదు. ఈ జన్మలో కూడ ఆమెది ఏక మాత్ర నిష్ఠయే – హరినిష్ఠ. ఆమె తండ్రి జాంబవంతుడు కూడా మహాభక్తుడు. ఆతడు తన పుత్రికను నాకు పత్ని రూపంలో సమర్పించి తన జన్మ ధన్యమైందని మురిసిపోయాడు.

గరుడా! నిజమైన భక్తిలో కోరికలుండవంటారు, నిజమే. కాని తనను తాను భగవంతునికి సమర్పించుకోవాలనే కోరిక మామూలు కోరిక కాదు. అది భక్తికి పరకాష్ఠ.

★*శ్రీనివాసుడే స్వయంగా ఉపదేశించిన వేంకటేశమంత్రం 'ఓం వేంకటేశాయ నమః ఓం'*

(పరాకాష్ఠ యనుట సరికాదు). జాంబవతి భక్తి సఫలమైంది. విశ్వనాథుడే విధివిహితంగా ఆమెను వివాహం చేసుకున్నాడు. ఆమె ఆనందానికి అంతుగాని ఉపమానం గాని లేవు'

శ్రీకృష్ణుడు గరుడునికి ఆ తరువాత శ్రీనివాస భక్తితత్త్వాన్ని బోధించాడు. ఆయన మాహాత్మ్యాన్ని కూడా వర్ణించి చెప్పి ఇలా ప్రవచించాడు. 'వత్సా! వైనతేయా! భగవంతుని ఎన్ని పనుల్లో వున్నా మానవులుగాని ఇతరులుగాని మరచిపోరాదు. నిరంతరం ఆయనను 'హరి' మున్నగు మంగళమయ నామాల ద్వారా తలచుకొంటూనే వుండాలి.

*హరిం హరిం ప్రవదేత్ సర్వదైవ ॥* **(బ్రహ్మ...29/64)**

శుభాన్ని కోరుకునేవారు తమ శాస్త్రవిహిత కర్మల నాచరిస్తూనే ప్రతి క్షణమూ లేదా వీలైనపుడు వాసుదేవ హరిస్మరణాన్ని చేస్తునే వుండాలి.

*పూర్తిర్య దాక్రియతే కర్మణాం చ*

*సమ్యగ్ స్మరేత్ వాసుదేవం హరించ ॥* **(బ్రహ్మ...29/68)**

ఇలా చేయడం వల్ల నారాయణుడు అత్యంత ప్రసన్నుడవుతాడు. ప్రాణులు భగవంతుడైన విష్ణుదేవునికి ప్రియకరములైన కార్యములందే అనురక్తిని పెంచుకోవాలి.

*హరిప్రీతి కరే ధర్మే*

*ప్రీతి యుక్తో భవేత్ సదా ॥* **(బ్రహ్మ...29/70)**

అని ముగించాడు సూత మహర్షి. **(అధ్యాయాలు -23-29)**

గరుడ పురాణ మాహాత్మ్యం ఈ గ్రంథంలో మూడు కాండలలోనూ చెప్పబడింది. అదంతా ఒక చోట చేర్చి అనువదింపబడింది.

# గరుడపురాణ మాహాత్మ్యం

గరుడ పురాణ సారాన్ని పూర్తిగా వివరించిన పిమ్మట ఖగవాహనుడు కాలకంఠునితో ఇలా చెప్పాడు. 'గరుడ పురాణం' రక్షిస్తుంది. ఈ పురాణం చదివినవారికి 'ఇక్కడ' భోగం 'అక్కడ' మోక్షం కలుగుతాయి. (ఇది మానవులకి). గరుడపురాణం ఎల్లరికీ విద్య, యశస్సు, సౌందర్యం, లక్ష్మి, విజయం, ఆరోగ్యం మున్నగువాటిని ప్రసాదిస్తుంది. దీనిని పఠించిన వానికీ విన్నవానికీ సంపూర్ణ జ్ఞానం కలుగుతుంది. అది స్వర్గానికి మనిషిని గొనిపోగలదు'.

తాను విష్ణుభగవానుని ద్వారా ఈ పురాణాన్ని విని తరించానని బ్రహ్మ వ్యాస మహర్షికి చెప్పగా ఆ మహర్షి నాతో ఇలా అన్నాడు.

'వత్సా! విష్ణు భగవానుని నుండి గరుడపురాణాన్ని బ్రహ్మదేవుడు దక్ష ప్రజాపతికీ, నారదునికీ, నాకూ బోధించాడు. నేను నీకు చెప్పాను. నువ్వు శౌనకాది మహామునులకు వివరించి చెప్పు. ఎందుకంటే దీనిని విన్నవ్యక్తి సర్వజ్ఞుడై అభీష్ట ప్రాప్తినీ బ్రహ్మ పదాన్నీ పొందే మార్గాన్ని తెలుసుకుంటాడు. విష్ణుదేవుడు గరుత్మంతునికి కూడా ఇదే పురాణాన్ని చెప్పి దానినా మహాభక్తుని పేర ప్రపంచానికి ప్రసాదించాలని ఆదేశించాడు. ఇది నిజమైన మహాసార తత్త్వం. ఇది ఏ ప్రాణికైనా ధర్మార్థ కామ మోక్షాల ఫలాలనీయగలదు.'

'శౌనకాది మహర్షులారా! ఈ శ్రేష్ఠతమమైన పురాణాన్ని మీరు నా నుండి విన్నారు కదా! దీనిని బ్రహ్మ నుండి విని మా గురువుగారైన వ్యాస భగవానులు బహుకాలం క్రిందటే నాకు బోధించారు. ఆ శ్రీహరియే వ్యాసరూపమున జనించి నాలుగు వేదాలనూ స్పష్టపఱచి, పదునెనిమిది పురాణాలనూ రచించాడు. ఇతర పురాణాలనన్నింటినీ మహానుభావుడైన శ్రీ శుకమహర్షి నాకు వినిపించాడు. ఈ మహాపురాణాన్ని నా నుండి మీరు విన్నారు కదా! మహావిష్ణువిచ్చిన వరాన్ని కూడా వినండి - ఈ పురాణాన్ని ఏకాగ్రచిత్తులై చదువుకున్నా, చదివినా, చదివించినా, విన్నా, వినిపించినా, వ్రాసినా, వ్రాయించినా, గ్రంథరూపంలో నిత్యం పూజించినా వారికి ధర్మార్థులైతే ధర్మము, అర్థాభిలాషులైతే, కోరికలుంటే అవి, మోక్షం కావాలంటే మోక్షము లభిస్తాయి. కోరికలు లభించుటయనగా తీరుటయని భావము. మనిషి ఏ వస్తువుని కోరుకొని గరుడ పురాణాన్ని శ్రద్ధగా పఠించినా ఆ మనిషికా వస్తువు తప్పకుండా లభిస్తుంది. పైగా సుఖజీవనమూ దేహాంతంలో మోక్షమూ లభిస్తాయి.

ఈ పురాణంలోని ఒక శ్లోకాన్ని రోజూ చదివినా మనిషి పాపరహితుడవుతాడు. ఏ గృహంలోనైతే సంపూర్ణ గరుడ పురాణం వుంటుందో ఆ ఇంటివారికి ఈ జన్మలోనే అన్ని ఆశయాలూ సిద్ధిస్తాయి, సర్వశుభాలూ సమకూడుతాయి. ఈ పురాణమే చేతిలో ఎక్కువ కాలం వుంటుందో ఆ హస్తం నీతికోశంతో సమానం. ధర్మార్థ కామ మోక్షాలతో బాటు, ఈ పురాణాన్ని నిత్యం పారాయణ చేసేవారికి, పుత్రుడు కావాలంటే పుత్రుడు, విద్యను కోరుకుంటే విద్య, తీరని కోరికలుంటే వాటి సాఫల్యం, పుణ్యం లభిస్తాయి. ఎంత పుణ్యం లభిస్తుందంటే దాని వల్ల బ్రహ్మహత్యా పాతకం కూడా శమించవచ్చు. ఈ పురాణ పారాయణగాని శ్రవణంగాని చేసే గొడ్రాలు సంతానాన్ని కోరుకుంటే తల్లి అవుతుంది. పిల్లలకు మంచి గుణాలు రావాలనుకుంటే వస్తాయి. కన్యకు మంచి పతి లభిస్తాడు. ఈ పురాణాన్ని వేడుకుంటే పిల్లలు విద్యావంతులవుతారు. కవి కాదలచుకున్నవాడు కవి అవుతాడు. అందుకే మళ్ళీ చెప్తున్నాను. ఈ పురాణమొక కల్పవృక్షం. దీనిని పఠించి గాని వినిపించి గాని, కనీసం విని గాని భోగం కోరుకుంటే భోగం, దానిననుభవిస్తూ కోరుకుంటే అనాయాస మరణం, దేహాంతంలో మోక్షం లభిస్తాయి.

పక్షిశ్రేష్ఠుడూ, భక్త శిఖామణీయగు గరుడుడు బోధించిన ఈ పురాణం ధన్యం. ఇది సకల లోక కల్యాణకరం. ఈ పురాణం పారాయణ చేసేవారికి అకాలమృత్యువుండదు. దుష్టశత్రుక్షయమై ఇక ఎవరి వల్లా భయముండదు.

***పురాణం గారుడం పుణ్యం పవిత్రం పాపనాశనం ।***
***శృణ్వత్వాం కామనాపూరం శ్రోతవ్యం సర్వదైవహి ॥*** ***(ధర్మ... 49/132)***

***యశ్చేదం శ్రుణు యా మర్త్యో***
***యశ్చాపి పరికీర్తయేత్ ।***
***విహాయ యాతనాం ఘోరాం***
***ధూతపాపో దివం వ్రజేత్ ॥*** ***(ధర్మ... 49-136)***

'అక్షరాలలో అకారాన్నీ, పక్షిగణాల్లో గరుత్మంతుడినీ, పురాణాల్లో గరుడపురాణాన్నీ నేనే' అని విష్ణు భగవానుడే స్వయంగా చెప్పి యున్నాడు. ఇదీ ఈ పురాణం రాజము యొక్క మాహాత్మ్యము.

**గరుడ పురాణం సంపూర్ణం...**

# అనుబంధము

## పరిశిష్ట గరుడ పురాణం

### అనుబంధం -1 (అధ్యాయాలు-19,20)(పేజి -65)

వైద్యునికి వద్దకు పోయే దూత కఱ్ఱతో గాని ఆయుధంతోగాని వెళ్ళకూడదు. అతడు చిన్నతరహా మందులు కలిపేవాడు కాకూడదు. నగ్నముని అసలే కాకూడదు. ఇట్టి దూతల వల్ల రోగికి మరణం తథ్యం.

### అనుబంధం - 2 (పేజి -71)

శివగాయత్రి మంత్రాని కర్థమేమనగా ప్రణవయుక్తుడై 'హాం' బీజశక్తి సంపన్నుడైన పరమశివుని తత్త్వాన్ని మేము చింతన చేస్తాం. మా వాణి పవిత్రం కావడం కోసం మేమాయనను ధ్యానిస్తాం. ఆ రుద్రుడు మమ్ము సన్మార్గంలో నడిపించాలి గాక. గాయత్రి అనునది ఇక్కడ ఒక ఛందస్సు పేరు.

### అనుబంధం - 3 (అధ్యాయం -23) (పేజి -75)

*శివస్వరూపం*

*బద్ధ పద్మాసనా సీనః*
*సితః షోడశ వార్షికః ॥*
*పంచవక్త్రః కరాగ్రైః స్వై*
*ర్దశ భిశ్చైవ ధారయన్ ।*
*అభయం ప్రసాదం శక్తిం*
*శూలం ఖట్వాంగ మీశ్వరః ॥*
*దక్షైః కరై ర్వామ కైశ్చ*
*భుజంగం చాక్ష సూత్రకః ॥*
*డమరుకం నీలోత్పలం*
*బీజ పూరక ముత్తమం ।* ***(I- 23/54-56)***

భగవంతుడైన పరమేశ్వరుని ధ్యాన స్వరూపం ఇలా వుంటుంది.- పద్మాసనంపై వుంటాడు. శరీర వర్ణం కాంతివంతమైన శుక్లం. పదహారేళ్ళ వయసులో వున్నట్లుంటాడు. పంచముఖుడు. పది చేతులలోనూ - దక్షిణ భాగం చేతిలో అభయముద్ర. దాని క్రింద

ప్రసాద ముద్ర, తరువాత క్రమంగా శక్తి, శూలం, ఖట్వాంగం వుంటాయి. వామభాగం వైపున్న హస్తాలలో క్రమంగా అక్షమాల, డమరుకం, నీలకమలం, శ్రేష్ఠ బీజ పూరకం వుంటాయి. ఇచ్ఛా, జ్ఞాన, క్రియా నామక శక్తులు ఆయన త్రినేత్రాలలో వుంటాయి. సర్వదా కల్యాణకారియైన చిరుదరహాసం తొణికిసలాడు మోము గలవాడాయాన. కావుననే ఆయనను సదాశివుడంటారు.' ఇది సాక్షాత్తూ విష్ణువు చేసిన వర్ణన.

## అనుబంధం - 4 (అధ్యాయం -32)

*ఓం ఆం హృదయాయ నమః*

*ఓం ఈం శిరసే నమః*

*ఓం ఊం శిఖాయై నమః*

*ఓం ఐం కవచాయ నమః*

*ఓం ఔం నేత్రత్రయాయ నమః*

*ఓం అః అస్త్రాయ ఫట్*

*ఓం సమస్త పరివారాయాచ్యుతాయ నమః*

*ఓం ధాత్రే నమః*

*ఓం విధాత్రే నమః*

*ఓం ఆధార శక్త్యై నమః*

*ఓం కూర్మాయ నమః*

*ఓం అనంతాయ నమః*

*ఓం పృథివ్యై నమః*

*ఓం ధర్మాయ నమః*

*ఓం జ్ఞానాయ నమః*

*ఓం వైరాగ్యాయ నమః*

*ఓం ఐశ్వర్యాయ నమః*

*ఓం అధర్మాయ నమః*

ఓం అజ్ఞానాయ నమః

ఓం అవైరాగ్యాయ నమః

ఓం అనైశ్వర్యాయ నమః

ఓం అం అర్కమండలాయ నమః

ఓం సోం సోమ మండలాయ నమః

ఓం వం వహ్ని మండలాయ నమః

ఓం వం వాసుదేవాయ పరబ్రహ్మణే శివాయ తేజో రూపాయ వ్యాపినే సర్వదేవాధిదేవా య నమః (ఇదంతా ఒకటే మంత్రం)

ఓం పాంచజన్యాయ నమః

ఓం సుదర్శనాయ నమః

ఓం గదాయై నమః

ఓం పద్మాయై నమః

ఓం శ్రియై నమః

ఓం హ్రియై నమః

ఓం పుష్ట్యై నమః

ఓం గీత్యై నమః

ఓం శక్త్యై నమః

ఓం ప్రీత్యై నమః

ఓం ఇంద్రాయ నమః

ఓం అగ్నయే నమః

ఓం యమాయ నమః

ఓం నిరృతయే నమః

ఓం వరుణాయ నమః

ఓం వాయవే నమః

ఓం సోమాయ నమః

ఓం ఈశానాయ నమః

ఓం అనంతాయ నమః

ఓం బ్రహ్మణే నమః

ఓం విష్వక్సేనాయ నమః

**అనుబంధం - 5** (అధ్యాయం - 34) (పేజి -90)

ఓం సౌం క్షౌం శిరసే నమః

ఓం క్షాం హృదయాయ నమః

ఓం క్షీం శిరసే స్వాహా

ఓం క్షూం శిఖాయై వషట్

ఓం క్షైం కవచాయ హుం

ఓం క్షౌం నేత్రత్రయాయ వౌషట్

ఓం హః అస్త్రాయ ఫట్.

**అనుబంధం - 6** (అధ్యాయాలు - 35,37) (పేజి -94)

సంధ్యావందనములో జపించవలసిన పూర్తి మంత్రాలు

సూర్యశ్చమా మన్యుశ్చమన్యుప తయశ్చ

మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షంతాం ।

యద్రాత్ర్యా పాపమకార్షం మనసా వాచా

హస్తాభ్యాం పద్భ్యా ముదరేణ శిశ్నారాత్రి

స్తదవలుంపతు ।

*యత్కించ దురితం మయి ఇదమహమాపో౽ మృత*

*యోనౌ సూర్యే జ్యోతిషి జుహోమిస్వాహా ।* (తై. ఆ.ప్ర. 10–అ–25)

*ఓం ఆపః పునంతు పృథివీం*

*పృథ్వీ పూతా పునాతు మాం ।*

*యదుచ్ఛిష్ట మభోజ్యంచ*

*యద్వా దుశ్చరితం మమ ।*

*సర్వం పునంతు మామాపో౽*

*సతాంచ ప్రతిగ్రహ స్వాహా ।* (తై. ఆ.ప్ర. 10–అ–25)

*అగ్నిశ్చ మా మన్యుశ్చ*

*మన్యుపతయశ్చ మన్యు కృతేభ్యః*

*పాపేభ్యో రక్షం తాం ।*

*యదహ్నా పాపమకార్షం మనసా వాచా*

*హస్తాభ్యాం పద్భ్యా ముదరేణ*

*శిశ్నా అహస్త దవలుంపతు ।*

*యత్కించ దురితం మయి ఇద మహ*

*మాపో౽ మృత యోనౌ సత్యే*

*జ్యోతిషి జుహోమి స్వాహా ।* (తై. ఆ.ప్ర. 10–అ–24)

*ఆపోహిష్ఠా మయోభువస్తాన ఊర్జే*

*దధాతన! మహేరణాయ చక్షసే ॥*

*యోవః శివతమోరసస్తస్య భాజయతే*

*హనః । ఉశతీరివ మాతరః ॥*

*తస్మా అరంగ మామ వోయస్య క్షయాయ*

*జిన్వథ । ఆపోజన యథాచనః ॥* (యజుర్వేదం – 11/50–52)

*ఓం ద్రుపదాదివ ముముచానః*

*స్విన్నః స్నాతో మలాదివ ।*

*పూతం పవిత్రేణే వాద్య*

*మాపః శుంధంతు మైనసః ॥* *(యజుర్వేదం 20/20)*

**అఘమర్షణ మంత్రం :**

*ఋతంచ సత్యం చాభీదాత్త*

*పసోఽధ్య జాయత ।*

*తతో రాత్ర్య జాయత ।*

*తతః సముద్రో అర్ణవః ।*

*సముద్రాదర్ణ వాదధి*

*సంవత్సరో అజాయత ।*

*అహోరాత్రాణి విదధ*

*ద్విశ్వస్య మిషతో వశీ ।*

*సూర్యచంద్ర మసౌధాతా*

*యథాపూర్వమకల్పయత్ ।*

*దివంచ పృథివీ చాంతరిక్ష మథోస్వః ।* *(ఋగ్వేదం -10/190/1)*

**అనుబంధం - 7** (అధ్యాయాలు 38-41) (పేజి -96)

'సూర్యపూజ' సమగ్రంగా ఇక్కడ వ్రాయడం జరిగింది.

విష్ణూపదేశం ఇలా కొనసాగింది. "హే రుద్రాది దేవతలారా! ఇపుడు సూర్యార్చన విధిని వినిపిస్తాను.

ఒక మండలాన్ని లేదా మండపాన్ని ఏర్పాటు చేసి దాని నాలుగు ద్వారాల వద్దా ఈ క్రింది మంత్రాలతో ఉచ్చైశ్రవ, అరుణ, దండి, పింగళ దేవతలను స్థాపించి పూజించాలి:

*ఓం ఉచ్చైశ్రవసే నమః*

*ఓం అరుణాయ నమః*

***ఓం దండినే నమః***

***ఓం పింగలా★య నమః***

మధ్యంలో ప్రభూతామాలుడను పేరు గల దేవతను ***ఓం అంభూతాయనమః*** అనే మంత్రంతో పూజించాలి. దక్షిణ, పూర్వ దిశలలో విమల, సార, ఆధార, పరమముఖ, విమలాది శక్తులను వారి వారి మంత్రాలకు ముందు ఓంకారాన్నీ 'అం' అనే బీజాక్షరాన్నీ పెట్టి జపిస్తూ పూజించాలి.

మండపం లోపలి భాగంలో పద్మనూ కర్ణికనూ కూడా అలాగే పూజించాలి. ఆ తరువాత పూర్వాది దిశలలో లోపలివైపు దీప్తాది శక్తులనూ, వాటి మధ్యలో సర్వతోముఖినీ ఇదే పద్ధతిలో పూజించాలి.

వారి మంత్రాలూ, బీజాక్షరాలూ ఇవి :

***ఓం వం దీప్తాయై నమః***

***ఓం విం సూక్ష్మాయై నమః***

***ఓం వుం భద్రాయై నమః***

***ఓం వైం జయాయై నమః***

***ఓం విం విభూతినే నమః***

***ఓం వం అఘోరాయ నమః***

***ఓం వం విద్యుతాయై నమః***

***ఓం వః విజయాయై నమః***

***ఓం సర్వతోముఖినే నమః***

తరువాత సూర్యదేవుని ప్రతిమనూ ఆసనాన్నీ పై విధంగానే 'ఓం హ్రాం' అనే బీజాక్షర ప్రణవాలతో మంత్రాలనుచ్చరిస్తూ మండల మధ్యంలో స్థాపించి పూజించాలి. ఈ స్థాపన పూజనాలలో సూర్యదేవుని హృణ్మంత్రాన్ని ఈ విధంగా వీలైనన్ని మార్లు జపించాలి.

**ఓం హం సంఖం ఖఖోల్కాయక్రాంక్రింసః స్వాహా**

---

★*'ళ' అనే అక్షరం సంస్కృతంలో లేదు.*

ఈ విధంగా ఆవాహన, స్థాపన, సన్నిధానకములను ముగించి మరల సన్నిరోధనను మంత్రాల సకలీకరణతో నిర్వహించాలి. సకలీకరణమనగా అన్నిటినీ కలిపి మరల చదువుట.

జగజ్జేగీయమానంగా ప్రకాశిస్తూ, కెంపు రంగులో కనిపిస్తూ, శ్వేతపద్మంలో ఆసీనుడై, ఏకచక్రరథారూఢుడై, ద్విభుజుడై, ఒక చేతిలో కలువను ధరించియున్న సూర్యదేవుని పూజిస్తూ ముద్రలను చూపించాలి. మరల మరల మూలమంత్రాన్ని, అనగా హృణ్మంత్రాన్నే, జపిస్తుండాలి. పద్మ ముద్రనీ, బింబముద్రనీ మూడేసిమార్లు చూపించాలి. న్యాసాన్ని ఈ మంత్రాలతో చేయాలి :

***ఓం ఆం హృదయాయ నమః***

***ఓం సూర్యాయ స్వాహా***

***ఓం శిరసే స్వాహా***

***ఓం అః భూర్భువః స్వః వషట్***

***ఓం హుం కవచాయ హం***

***ఓం భాం నేత్రద్వయాయ వౌషట్***

***ఓం వః ఆయుధాయ ఫట్***

హృదయాదులను నలుదిక్కుల మూలలలోనూ నేత్రాలను మధ్యలోనూ పూజించాలి. అలాగే దిక్కులలో ఆయుధాన్నీ చంద్రునీ, తూర్పు వైపున్న కమలదళంలో బంగారు కాంతులీనెడు బుధునీ, దక్షిణంలో పచ్చరంగులో మెరిసే గురువునీ, ఉత్తరంలో భూతేశునీ, తెల్లని కాంతులు వెలార్చే శుక్రునీ పూజించాలి.

ఆగ్నేయంలో ఎఱ్ఱగ మెరిసే అంగారకునీ, నైరృతిలో నల్లని కాంతులతో నిగనిగలాడే శని దేవునీ అర్చించాలి. వాయవ్యంలో నంద్యావర్త పుష్పకాంతులు గల రాహువునీ ఈశాన్యంలో పొగరంగులో నుండు కేతువునీ పూజించాలి.

ఈ గ్రహాలను ఈ మంత్రాలతో పూజించాలి.

***ఓం సొం సోమాయ నమః***

***ఓం బుం బుధాయ నమః***

***ఓం బృం బృహస్పతయే నమః***

***ఓం భం భార్గవాయ నమః***

***ఓం అం అంగారకాయ నమః***

***ఓం శం శనైశ్చరాయ నమః***

***ఓం రం రాహవే నమః***

***ఓం కం కేతవే నమః***

సూర్యునితో సహా ఈ గ్రహాలన్నిటికీ పాద్యాన్నిచ్చి నైవేద్యం సమర్పించి ధేనుముద్రను చూపించాలి.

తేజశ్చండుడనేదొక భావము. గ్రహాలన్నీ తేజశ్చండములే. పై మంత్రాలనొక్కొక్క దానిని ఎనిమిదేసిమార్లు చదువుతూ ఆ గ్రహాల తేజశ్చండాలను తలచుకోవాలి. చివరగా గ్రహాల తేజాలకు మూలమైన తేజశ్చండుని ఈ క్రింది మంత్రం ద్వారా పూజిస్తూ నిర్మాల్యం అంతటినీ ఆయనకి అంకితం చేసి అల్లం, బియ్యపు గింజలూ, ఎఱ్ఱ చందనమూ కలిపి, నూరి, ముద్ద చేసిన లేహ్యముతో ఆయనకి అర్ఘ్యమివ్వాలి. ఆ మంత్రం

***ఓం హం ఫట్ స్వధా స్వధా వౌషట్***

***తేజశ్చండాయ నమః***

సూర్య పూజాంతమందు హృణ్మంత్రంతో సూర్యునికి అర్ఘ్యమిచ్చి ***ఓం గం గణపతయే నమః*** అనే మంత్రం ద్వారా గణేశుని పూజించాలి.

ఈ విధంగా సూర్య పూజ నొనరించినవారు దేహాంతంలో విష్ణులోక ప్రాప్తి నొందుతారు.

**అనుబంధం - 8** (అధ్యాయం - 58) (పేజి -141)

| నెల | సూర్య రూపం | ఋషి | నాగదేవత | రాక్షసుడు | అప్సర | గంధర్వుడు | యక్షుడు |
|---|---|---|---|---|---|---|---|
| చైత్రం | ధాత | పులస్త్యుడు | కబ్రీరుడు | హేతి | క్రుతస్థల | తుంబురుడు | రథాంగుడు |
| వైశాఖం | అర్యమ | పులహుడు | తక్షకుడు | ప్రహేతి | పుంజికస్థల | నారదుడు | రథస్వనుడు |
| జ్యేష్ఠం | మిత్ర | అత్రి | – | | మేనక | హాహా | రథచిత్రుడు |
| ఆషాఢం | వరుణ | వసిష్ఠుడు | సర్పుడు | పౌరుషేయుడు | రంభ | హూహూ | – |
| శ్రావణ | ఇంద్ర | అంగిరుడు | శంఖపాలుడు | శుక్రుడు | ప్రంలోచ | విశ్వావసువు | స్రోత |
| భాద్రపద | వివస్వాన్ | భృగువు | – | ఏలపాత్రుడు | అనులోచ | ఉగ్రసేనుడు | అపూర్ణుడు |
| అశ్వయుజ | పూష | గౌతముడు | ధనంజయుడు | వ్యాఘ్రుడు | ఘృతాచి | – | – |
| కార్తిక | ప్రాజన్య | భరద్వాసుడు | ఐరావతుడు | సుషేణుడు | విశ్వాచి | విశ్వావసువు | సేనాజితుడు |
| మార్గశిర | అంశుమాన్ | కశ్యపుడు | తార్క్ష్య, మహాపాదులు | ఆపువు | ఊర్వశి | చిత్రసేనుడు | – |
| మాఘ | త్వష్ట | జమదగ్ని | కంబలుడు | విద్యుత్ | తిలోత్తమ | ధృతరాష్ట్రుడు | రిజ్జితుడు |
| పుష్య | భర్గ | క్రతువు | కర్కోటకుడు | బ్రహ్మపేత స్ఫూరజుడు | పూర్వచిత్తి | ఉనార్యుడు | అరిష్టనేమి |
| ఫాల్గున | విష్ణు | విశ్వామిత్రుడు | అశ్వతరుడు | యజ్ఞపేత | రంభ | సూర్యవర్చుడు | సత్యజితుడు |

**అనుబంధం - 9** (అధ్యాయం - 85) (పేజి -200)

అస్మత్కులే మృతాయేచ గతిర్యేషాం నవిద్యతే ।
ఆవాహయిష్యేతాన్ సర్వాన్ దర్భ పృష్ఠే తిలోదకై ॥
పితృవంశే మృతాయేచ మాతృవంశేచయేమృతాః ॥
తేషా ముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం ॥
మాతా మహకులే యేచ గతిర్యేషాం నవిద్యతే ।
తేషా ముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం ॥
అజాతదంతాయే చిద్యే చ గర్భే ప్రపీడితాః ।
తేషా ముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం ॥
బంధు వర్గాశ్చయే కేచిన్నామ గోత్ర వివర్జితాః ।
స్వగోత్రే పరగోత్రేవా గతిర్యేషాం నవిద్యతే ।
తేషా ముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం ॥
ఉద్బంధన మృతాయేచ విషశస్త్ర హతాయశ్చయే ।
ఆత్మోపఘాతినో యేచ తేభ్యః పిండం దదామ్యహం ॥
అగ్నిదాహేమృతాయేచ సింహవ్యాఘ్ర హతాశ్చయే ।
దంష్ట్రిభిః శృంగి భిర్వాపి తేషాం పిండం దదామ్యహం ॥
అగ్నిదగ్ధాశ్చయే కే చిన్నాగ్ని దగ్ధాస్తథా పరే ।
విద్యుచ్చోరహతాయే చ తేభ్యః పిండం దదామ్యహం ॥
రౌరవే చాంధతా మిస్రే కాలసూత్రే చయే గతాః ।
తేషా ముద్ధరణార్థాయ ఇమంపిండం దదామ్యహం ॥
అసిపత్ర వనేఘోరే కుంభీపాకే చ యేగతాః ।
తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామహ్యాం॥
అన్యేషాంయా తనా స్థానాం ప్రేతలోక నివాసినాం ।

తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం ॥

పశుయోనింగతాయేచ పక్షి కీటసరీసృపాః ।

అథవా వృక్షయోని స్థాస్తేభ్యః పిండం దదామ్యహం ॥

అసంఖ్య యాతనా సంస్థా యే నీతాయమ శాసనైః ।

తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహం ॥

జాత్యంతర సహస్రేషు భ్రమంతి స్వేనకర్మణా ।

మానుష్యం దుర్లభం యేషాంతే భ్యః పిండం దదామ్యహం ॥

★ యే బాంధవా బాంధవావాయేఽ న్య జన్మని బాంధవాః

తే సర్వేతృప్తి మాయాంతు పిండదానేన సర్వదా ॥

యేకే చిత్ ప్రేతరూపేణ వర్తంతే పితరోమమ ।

తే సర్వేతృప్తి మాయాంతు పిండదానేన సర్వదా ॥

యేమే పితృకులే జాతాః కులే మాతుస్తథైవచ ।

గురుశ్వసుర బంధూనాంయే చాన్యే బాంధవా మృతాః ॥

యేమే కులే లుప్తపిండాః పుత్రదార వివర్జితాః ।

క్రియాలోపహతాయే చ జాత్యంధాః పంగవస్తథా ॥

విరూపా ఆమగర్భా శ్చజ్ఞాతా జ్ఞాతాః కులేమమ ।

తేషాం పిండం మయా దత్తమ క్షయ్యముపతిష్ఠతాం ॥

సాక్షిణరి సంతుమే దేవా బ్రహ్మే శానాదయ స్తథా ।

మయాగయాం సమాసాద్య పితౄణాం నిష్కృతిః కృతా ॥

---

★ బాంధవా ఽ బాంధవా వా

యే ఽ న్య జన్మని

ఈ (ఽ) అనే గుర్తుని అవగ్రాహమంటారు. ఇది పెట్టబడిన చోట అకారముందని, కాని కనబడుట లేదని భావము. బాంధవా అబాంధవావా (బంధువులైనా కాకున్నా) యే అన్య జన్మని (మరో జన్మ ఎత్తేసినా)

*ఆగతో ఽ హంగయాందేవ పితృకార్యే గదాధర ।*

*తన్మేసాక్షీ భవత్వద్య అనృణోఽ హమృణ త్రయాత్ ॥* *(ఆచార - 85/2-22)*

**అనుబంధం - 10** (అధ్యాయాలు 89-90) (పేజి -215)

మానవజాతికి పితరులు చేసిన వాగ్దానానికి శ్లోకరూపం :

*స్తోత్రేణా నేన చనరో*
*యోఽ స్మాంతోష్యతి భక్తితః ।*
*తస్య తుష్టా వయం భోగా*
*నాత్మజం ధ్యాన ముత్తమం ॥*
*ఆయురారోగ్య మర్థం చ*
*పుత్ర పౌత్రాదికం తథా ।*
*వాంచద్భిః సతతం స్తవ్యాః*
*స్తోత్రేణా నేన వై యతః ।*
*శ్రాద్ధేషుయ ఇమం భక్త్యా*
*త్వస్మత్ ప్రీతి కరం స్తవం ।*
*పఠిష్యతి ద్విజా గ్ర్యాణాం*
*భుంజతాం పురతః స్థితః ॥*
*స్తోత్ర శ్రవణ సంప్రీత్యా*
*సన్నిధానే పరే కృతే ।*
*అస్మాభిరక్షయం శ్రాద్ధం*
*తద్భవిష్యత్య సంశయం ॥* *(ఆచార - 89/70-73)*

**అనుబంధం-11** (అధ్యాయాలు 139-140) (పేజి -333)

**అనుబంధం-12** (అధ్యాయం - 142) (పేజి -334)

**అనుబంధాలు-13** (అధ్యాయం - 143) (పేజి - 336)

**అనుబంధం - 14** (అధ్యాయాలు 205,206) (పేజి -473)

సంస్కృతంలో వృద్ధి సంధులు రెండు కనిపిస్తాయి. ఒకటి తెలుగులో నున్నదే కాగా రెండవది సంస్కృతానికే ప్రత్యేకం. ఊర్, అక్షాదులకి గుణసంధి అవకుండా వృద్ధి (ఐ,ఔ) రావడం విశిష్టత.

ప్రష్ఠ + ఊహ = ప్రష్ఠౌహ

అక్ష + ఊహిణి = అక్షౌహిణి

స్వ + ఈర = స్వైర = (ఇలాగే స్వైరి, స్వైరిణి)

ప్ర + ఊఢ = ప్రౌఢ

ఋణ + ఋణమ్ = ఋణార్ణమ్ మొదలగునవి

మరొకటి యాన్తాదేశ వాన్తాదేశ సంధి.

దీనిని బట్టి ఏ ఐ ఓ ఔలు అయ్ ఆయ్ అవ్ ఆవ్ లుగా మారతాయి.

హరే + ఏ = హరయే

విష్ణో + ఏ = విష్ణవే

నై + అకః = నాయకః

పౌ + అకః = పావకః

గో + యం = గవ్యం

నౌ + యం = నావ్యం

సంస్కృతంలో 'టి' భాగమని ఒకమాట వుంది. అచ్చులలో చివరి అచ్చు నుండి కల భాగమును 'టి' భాగమంటారు.

ఉదాహరణకి 'మనస్'లో అస్ శకంధ్వాదులలో ఈ 'టి' భాగం లోపిస్తుంది. అంటే శక, అంధు కలిసినపుడు సవర్ణదీర్ఘం రాదు. శకలో 'అ' లోపించి శక్ + అంధు శకంధు ఔతుంది.

శక + అంధు = శకంధు

సీమ + అంతః = సీమంతః

మనస్ + ఈషా = మనీషా

పతత్ + అంజలిః = పతంజలిః

సార + అంగః = సారంగః

మార్త + అండః = మార్తండః

సంస్కృతానికే ప్రత్యేకమైనది మరొకటి తుగాగమం. ('త్' అదనంగా వచ్చుట. ఇది శ్చుత్వ సంధి వల్ల చ్‌గా మారుతుంది)

స్వ + ఛాయా = స్వచ్ఛాయా

శివ + ఛాయా = శివచ్ఛాయా

ఆ + ఛాదయతి = ఆచ్ఛాదయతి

## సుబంత ప్రకరణమ్

సు,ఔ,జస్ నుండి ఙి, ఓస్, సుప్ వఱకు 21 ప్రత్యయాలు ప్రాతిపదికలపై చేరి విభక్తి పదాలు పుడతాయి. మొదటిదైన 'సు'ని చివరిదైన 'ప్'తో కలిపి, 'సుప్' అంటారు. (ఇదే ప్రత్యాహారమంటే) ఈ 'సుప్'లు అంత మందున్న పదాలు సుబంతాలు. ఇవే విభక్తి పదాలు.

| విభక్తులు | | | |
|---|---|---|---|
| | ఏక | ద్వి | బహు |
| ప్రథమా | సు | ఔ | జస్ |
| ద్వితీయా | అమ్ | ఔట్ | శస్ |
| తృతీయా | టా | భ్యాం | భిస్ |
| చతుర్థీ | ఙే | భ్యాం | భ్యస్ |
| పంచమీ | ఙసి | భ్యాం | భ్యస్ |
| షష్ఠీ | ఙస్ | ఓస్ | ఆమ్ |
| సప్తమీ | ఙి | ఓస్ | సుప్ |

### కారకాలు

అంటే క్రియకు ఇతర పదాలతోడి సంబంధాలనుకోవచ్చు. ఇవి ఆరు విధాలు.

కర్తృ కారకం – కర్తతో గల సంబంధం

కర్మ కారకం – కర్మతో గల సంబంధం

కరణ కారకం – క్రియకీ ఆయుధానికీ గల సంబంధం

*(ఇది తృతీయా విభక్తిలో వుంటుంది)*

సంప్రదాన కారక – క్రియకి, గ్రహించిన వానితో గల సంబంధం

*(చతుర్థీ విభక్తిలో వుంటుంది)*

అపాదాన కారకం – క్రియకు కర్మస్థానంతో గల సంబంధాన్ని తెలిపేది.

*(ఇది పంచమీ విభక్తిలో వుంటుంది.)*

అధికరణ కారకం – క్రియకు వస్తువు (దేశం) ఆధారంతో గల సంబంధం.

*(సప్తమీ విభక్తిలో వుంటుంది.)*

ప్రథమా, షష్ఠీ విభక్తులకి కారకంతో సంబంధముండదు.

# విశిష్టానుబంధం

## బ్రహ్మకాండలో 9వ అధ్యాయం

### దేవతలు - వారి స్థాయి

అజాన, అజానజ దేవతలు బ్రహ్మాంశ వివిధ భిన్నాలలో కలవారు. గంధర్వులు అజానులు. వారు అజానజులతో బంధాల విషయంలో, ముక్తి విషయంలో సమానులే. గంధర్వలోక వందమంది వున్నారు కానీ వారిలో ఉన్నత స్థాయి వారు విరాధ, చారు, దేష్ణ, చిత్ర రథ, ధృత రాష్ట్ర, కిశోర, హూహూ, హాహా, విద్యాధర, ఉగ్రసేన, విశ్వావసు, పరావసు, చిత్రసేన, గోపాల, బల నామధేయులు.

కర్మజ దేవతల కన్న తక్కువ స్థాయిలో యక్షులుంటారు. వారిలో ప్రముఖులు ఘృతాచి మేనక, రంభ, ఊర్వశి, తిలోత్తమ, సుకేతు, శబరి, మంజుఘోష, పింగళలు.

అజానజులతో సమానులైనా జన్మను బట్టి విశ్వామిత్ర, వసిష్ఠ, నారద, చ్యవన, ఉతథ్యులు కూడా కర్మజుల కంటె తక్కువే.

శతర్చి, పరాశర, పావమాన్య, ప్రగాథ, క్షుద్ర సూక్త, దేవల, గృత్సమద, ఆసురి, భరద్వాజ, ముద్గల, ఉద్దాలక, ఋష్యశృంగ, శంఖ, సత్యవ్రత, సుయజ్ఞబాభ్రవ్య, మాండూక్య భాష్కల, ధర్మాచార్య, అగస్త్య, దాల్భ్య, దార్ఢ్య, అచ్యుత, కవష, హరిత కణ్వ, విరూప, ముసల, విష్ణు వృద్ధ, ఆత్రేయ, శ్రీ వత్స్య, వత్సల, భార్గవ, ఆప్నవానమాండూకేయ, జాబాలి, వీతిహవ్య, శౌనక నామక ఋషులంతా అజానేయతుల్యులే. వీరి నామాలను స్మరించినంత మాత్రాన హరి ప్రసన్నుడవుతాడు.

గరుడా! నా (శ్రీకృష్ణుని) సంతాన మందరూ, అజానజులతో సమానమైన ప్రతిభావంతులు.

త్వష్ట్ర కూతురు కశేరు వీరి కన్న గొప్పది. పితృగణాలు వీరికన్న తక్కువ స్థాయివారు.

తరువాత జనించిన ఆనందులు గంధర్వుల కంటె శ్రేష్టులు. మానవులలో ఉత్తమ గణాల వారు వీరికంటే గొప్పవారు.

మళ్ళా మన కథలోకొస్తే శేషశయనుడైన శ్రీ మహావిష్ణువును బ్రహ్మ, లక్ష్మి మున్నగువారంతా నోరారా స్తుతించారు. ఈ స్తుతి విష్ణువునానంద పఱచింది. అందుకే అది పుణ్యదాయకమూ పాపనాశకమూ అయినది. అప్పుడు విష్ణుమూర్తి కనులు తెఱచి మరల విశ్వ సృష్టిని ప్రారంభించాడు.

**బ్రహ్మకాండలో 9వ అధ్యాయం అదనం**

## కలియుగంలో పుట్టబోయే కలి, రాక్షస -అంశలు

కలియే దుర్యోధనుడు. అంతము లేని బాధ యొక్క అవతారమైన ఈ కలి అంశ అందరినీ బాధించడానికే పుడతాడు కలి. భార్య అలక్ష్మి. మంథర బుద్ధులతో జనిస్తుంది. విప్రచిత్తి (కశ్యప–దనుకాంతల పుత్రుడు. ముప్పది ముగ్గురు పరమ క్రూరులైన రాక్షసులకు నాయకుడు), జరాసంధుడు, కాలనేమి (కంసుడు), మధుకైటభులు (వీరే హంస డిభకులు కూడ), భౌమాసురుడు (నరకాసురుడు) ఉంటారు.

హిరణ్యాక్ష హిరణ్యకశిపుల అంశలు, వృత్ర–దనాయుల పుత్రుడు మణిమానుడు, తారకాసురుడు. శంబరుడు, శిశుపాలుని మిత్రుడైన సాల్వుడు. హిడింబాసురుడు, బాణాసురుడు, కీచకుడు. నముచి (కశ్యప –దనుల పుత్రుడు ఇంద్రునిచే చంపబడినవాడు)

పాకుడు, ఇల్వలుడు, వాతాపి, ధేనుకుడు, కేశి, తారకాసుర పుత్రుడైన తృణావర్తుడు. వేనుడు, బాణాసురునిమంత్రి, చిత్రలేఖ తండ్రియైన కుంభాండకుడు, దుశ్శాసనుడు, కుంభకర్ణుడు. శతధన్వుడు (సత్రాజిత్తును చంపి శమంతకమణినపహరించి దానిని అక్రూరునివద్ద పెట్టి పారిపోయి కృష్ణుని చేతిలో మరణించినవాడు).

పైన చెప్పబడిన రాక్షసులు, దుర్మార్గులు అంతా కలియుగంలో మానవుల మనస్సులలో దూరి వాటిని కలుషితం చేస్తారు. వీరిని పారద్రోలగలశక్తి దేవునికే వుంది. అందుకే ఆయనను పూజించాలి.

## 17వ అధ్యాయంలో అదనం

కృతయుగంలో నొకనాడు రుద్రపత్ని పార్వతి, ఇంద్రాణి శచి, యముని భార్య శ్యామల, అశ్వినుల ఇల్లాలు ఉష – ఈ నలుగురూ కలిసి బ్రహ్మదేవుని దర్శించడానికి వెళ్ళారు. అక్కడ ఆయన ధ్యానంలో నుండగా వీరు శృంగార రసాధిదేవతలై ఆ రకమైన మాటలాడుకోసాగారు. బ్రహ్మ కనులు తెఱచి కోపించి మీ ఈ అతిశయ శృంగార వాసనలు దేవకాంతలకు తగినవి కావు. మర్యాద నుల్లంఘించి మాట్లాడిన మీరు మానవలోకంలో రెండు జన్మలు పొంది మానవులనే వరిస్తారు. అని శపించాడు.

ఆ నలుగురూ ఖిన్నులై బ్రహ్మకు నమస్కరించి వెనుకకు మరలి మేరు పర్వతంపై సమావేశమై సామాన్యమానవులతో కలిసి జీవించడం దురదృష్టకరమని భావించి సర్వవ్యాపియైన వాయు దేవునితో కలసి భూలోకంలో కాపురం చేసినా తమ దివ్యత్వం చెడదని నిశ్చయించుకొని భారతీదేవి కోసం తపస్సు చేశారు.

సరస్వతీదేవి, భారతీదేవి, శ్రీ వాణి – ఈ మూడూ బ్రహ్మ భార్యయొక్క స్వరూపాలే. వీరొక వేయి సంవత్సరాలు మేరు పర్వతశిఖరంపై తపించాక ఆమె దర్శనమిచ్చి ఇలా అంది.

"మొదటి జన్మలో మీరంతా శ్రీకృష్ణుని భార్యలుగా జన్మిస్తారు. ఆ జన్మలో మీరు ఆయన అనుమతితో తపస్వినులుగానే జీవిస్తారు.

రెండవ జన్మలో భర్తకు ద్రోహం చేసి పరపురుషుని సాంగత్యాన్ననుభవించినా మీ భర్తగానూ ఆ పరపురుషుని గానూ వాయు దేవుడే జన్మిస్తాడు. మీకు దోషమంటదు.

నేను విష్ణుదేవుని ప్రార్థించి ఆయన ద్వారా మీ శాపానికి విమోచనాన్ని తెలుసుకున్నాను." ఈ విధంగా వారు భూలోకంలో రెండు జన్మలెత్తి శాపకాలాంతంలో మరల వారి వారి లోకాలకు వెళ్ళారు.

## అధ్యాయం - 24 (అదనం)

జాంబవతి గురువైన జైగిషవ్యుడు ఇలా చెప్పసాగాడు, 'అమ్మాయీ! ఈ వేంకటాచలం పరమపవిత్రం. ఈ కొండ నెక్కుతున్న భక్తులు భగవద్గీతను చదువుతూ శ్రీనివాసునే స్మరిస్తూ వుంటే వారికి దేహంతంలో ముక్తి నిశ్చయమే. ఇహ లోకంలో గాని పరలోకంలో గాని వారి ఆనందానికి అంతమూ, అవధులూ వుండవు. శాలగ్రామాన్ని చేతబట్టుకొని ఈ (గరుడ) పురాణాన్ని వింటూ ఈ కొండనెక్కిన వారికి మొత్తం తీర్థయాత్రలన్నీ చేసిన పుణ్యఫలం లభిస్తుంది. ఈ కొండ నెక్కుతున్నపుడు ఆనందంగా దేవుని స్తుతిస్తూ నవ్వు మొగాలతో వుండాలి. అలసట కొద్దీ చిరాకుపడుతూ తనతోటి వారిని తిడుతూ కొండనెక్కరాదు.'

తరువాత గురుదేవులు జాంబవతి కోరగానే బ్రహ్మాదులకు శ్రీనివాసుడెలా దర్శనమిచ్చాడో చెప్పసాగాడు.

'ఒక అలౌకికమైన కాంతి పుంజము శ్రీనివాసుని శరీరము నావరించి యున్నట్లుగా వారు చూడగలిగారు. రుద్రదేవునికి శ్రీనివాసునిలో లక్షమంది సూర్యుల కాంతి కనిపించింది. ఆయనలో ఋషులకు సూర్య చంద్రులిద్దరూ గోచరించారు. తేజోమండలంగా సన్యాసులకు, పాలవలె లౌక్యులకు ఆయన కనిపించాడు. కలియుగంలో సామాన్య భక్తులకాయన దివ్య మంగళ విగ్రహం రాతితో చెక్కినట్లే కనిపిస్తుంది. ఎందుకంటే వారిలో రజస్తమోగుణాలే అధికంగా వుంటాయి. నిజమైన భక్తులు సత్త్వగుణ సంపన్నులై ఏ యుగంలోనైనా శ్రీనివాసుని ఈ కొండపై ప్రత్యక్షంగా దర్శించి తరించగలరు?

నిజమైన భక్తులను గూర్చి అడిగిన జాంబవతికి ఆయన ఇలా చెప్పాడు.

భక్తశిఖామణియైన ప్రహ్లాదునికీ దైవతము శ్రీనివాస నారసింహుడు. (అన్నమయ్యకి వేంకట నారసింహుడైనట్లుగానే.) ఆయన ఇక్కడే శ్రీనివాసుని సేవించి ప్రపంచాధిపత్యాన్నీ, ఆత్మజ్ఞానాన్ని పొందగలిగాడు.

పరాశరుడు శ్రీనివాసుని కొలిచి, విష్ణుదేవునే వ్యాసరూపమున కొడుకుగా పొంది ఆత్మజ్ఞానాన్ని ఆ విష్ణు స్వరూపుని ద్వారానే పొంది ఇక్కడే తపస్సు చేసి ముక్తి నొందాడు.

నారద మహర్షి శ్రీనివాసుని తన తల్లి గర్భంలో నున్నపుడే స్మరించనారంభించాడు. తరువాత బ్రహ్మనందనునిగా శాశ్వతలోక కల్యాణ కర్తగా చిరంజీవిగా ఇప్పటికీ సుజనుల నాల్కలపై వెలుగుతున్నాడు.

★అంబరిషుడు శ్రీనివాసభక్తుడు. దుర్వాసుని శిష్యుడై జ్ఞానసాగరుడై ఆ మహర్షి శాపాన్ని తన శరీరంలో ఆ సమయానికి ప్రవేశించి విష్ణువే భరించునట్లు చేయగలిగినంత మహా భక్తుడు. ఇతడు కూడా ఈ కొండపైనే ముక్తి నొందాడు.

ముచకుందుడను శ్రీనివాస భక్తుడు శ్రీరాముని పూర్వికుడు. ఆయన దేవదానవ యుద్ధంలో పాల్గొని, సన్యసించి విష్ణు తత్త్వాన్ని బాగా ఆకళింపుచేసుకొని ఈ కొండ గుహలోనే తపస్సు చేశాడు. శ్రీ కృష్ణుని తరుముకొస్తూ కాలయవనుడు ఇతనిని కాలితో తన్ని ఇతడు కనులు తెరువగానే తన పాపాగ్నిలో తానే కాలిపోయాడు. శ్రీ కృష్ణుడు ముచకుందునికి మోక్షమిచ్చాడు.

పుండరీకుడు తండ్రి ఆదేశం మేరకు ఇక్కడికి వచ్చి శ్రీనివాసుని పూజించి మోక్షాన్ని పొందాడు.

విశ్వామిత్ర, ఔర్వ, కుత్స, మరీచి, అత్రి, పులహ, క్రతు, శక్తి, వసిష్ఠ, గౌతమీయ, పులస్త్య, భరద్వాజ మహర్షులిక్కడికి వచ్చి శ్రీనివాసునికై తపమొనరించి ఆయన సాక్షాత్కారాన్ని పొందారు. చివరికి విష్ణుమూర్తి గుండెపై తన్ని, అహంకారనయనాన్ని పోగొట్టుకొని ఆయన శ్రీనివాసుడై ఇక్కడికి రావడానికి కారణమైన భృగు మహర్షి కూడా వేంకటాచలంపై తప మొనరించి స్వామి కరుణకు పాత్రుడైనాడు.

## అధ్యాయం - 26 (అదనం)

# శ్రీ వేంకటేశాగమనం

జాంబవతి ప్రార్థన మేరకు శ్రీ వేంకటేశాగమన విజ్ఞానాన్ని వచింపసాగాడు జైగిషవ్యుడు.

'హిరణ్యాక్షుని సంహరించి, భూదేవి నుద్ధరించిన పిమ్మట వరాహావతారంలో నున్న శ్రీ హరికి ఈ భూమిపై తాను భక్త సులభుడై నిలిచి అందరికీ దర్శన మివ్వాలనే ఇచ్ఛ కలిగింది. విష్ణు స్వరూపంగా కాకుండా మానవరూపంలోభక్తులకు దర్శనమివ్వాలనే సంకల్పం కలిగింది. వైకుంఠ నుండి మరల దిగివచ్చి గరుడునీ శేషునీ తోడుగా తెచ్చుకొని సువర్ణముఖరి నుండి శ్రీ కృష్ణవేణి దాకాపఱచుకొని యున్న మనోహర ప్రాంతంలో అవతరించాడా అత్యంత కృపాళువు.

★ అంబరీషుడు అని 'రి' కి దీర్ఘం పెట్టుట దోషము.

శేషుడూ, గరుడుడూ శేషాద్రిగానూ గరుడాద్రిగానూ స్వామి సంకల్పం మేరకు నిలచి నేటికీ పూజలందుకొంటున్నారు. కొండలకు ఒకచివర శ్రీశైలాన్నీ మధ్యలో అహోబలాన్ని ముఖద్వారం వద్ద శ్రీనివాసునీ మహా విష్ణువే స్థాపించాడు. కోరికలు తీర్చేటి కొంగు బంగారమై కొండలేడిటి నడుమ ఏనాడో కృతయుగంలోనే కొలువుతీరాడు శ్రీనివాస రూపంలో మహా విష్ణువు.

ఎవరేది కోరుకున్నా అతిసులభ తపస్సుకే ప్రసాదించే కొండకాబట్టి దీనికి చింతామణి అనే పేరు సార్థకమైంది.

ఈ పర్వతంలో చాలా సరస్సులున్నాయి. అందుకే దానిని పుష్కరాద్రి అని కూడా అంటారు. వైకుంఠం నుండి దిగిన ఈ కొండ బంగరు కాంతులను వెలార్చుతుంటుంది. కావుననే దీనిని కనకాద్రి అని కూడా అంటారు. వైకుంఠమనేపేరు కూడావుంది. అమృతంతో బాటు అన్ని సంపదలనూ ఇచ్చే కొండ కాబట్టి దీనిని వేంకటాద్రి అనీ అంటారు.

ఈ వేంకటాచలాన్ని వర్ణించడానికి గానీ దీని మాహాత్మ్యాన్ని కొనియాడడానికి గాని సామాన్యమానవులకెలాగూ సాధ్యం కాదు. ఆ చతుర్ముఖ బ్రహ్మకు కూడా అసాధ్యమే. ఈ కొండను రోజూ దర్శించే వారి కోరికలన్నీ తీరుతాయి. అంగవైకల్యాలన్నీ పోయి అంగాలు చక్కబడతాయి. ఈ కొండ అందాన్ని చూసి శ్రీ మన్నారాయణుడే మురిసిపోయి లక్ష్మీతో సహా వైకుంఠం నుండి దిగివచ్చి ఇక్కడ, ఈ స్వామి పుష్కరిణీ తీరాన నివసించాడు.

దీనికి వాయవ్య దిశలో వాయు తీర్థముంది. ఇక్కడికొచ్చే వారంతా ఇందులో స్నానం చేసి తమ భక్తిని విష్ణునికి తెలుపవలసినదిగా వాయుదేవుని ప్రార్థిస్తారు. ప్రతిరోజూ సూర్యోదయానికి ముందే ఇక్కడి మధ్వ తీర్థంలో రుద్రాది దేవతలు స్నానం చేసి వెళతారు. అందుకే ఆ సమయంలోనే ఇక్కడ స్నానం, పూజ గావించడం బహుపుణ్య ప్రదం. ఇక్కడ భాగవతం పుస్తకాన్ని దానం చేస్తే చాల మంచిది.

శ్రీనివాసుని కుత్తర దిశలో చంద్ర తీర్థమున్నది. దేవతల కోసం చంద్రుడిక్కడ నిత్యమూ వెలుగుతుంటాడు. ఇక్కడే సర్వమంగళాలను కోరి తూర్పువైపు తిరిగి శాలగ్రామాన్ని దానం చేస్తారు. అలాగే కలియుగంలో మిక్కిలి అరుదైన ★దధివామనదానాన్ని ఇక్కడే చెయ్యాలి. దీనిని మించిన దానం లేదు.

---

★*ఈ స్వామి గుడి ఈ నాటికీ కర్ణాటకలో వుంది. అక్కడ పెరుగునే నైవేద్యంగా పెడతారు. భాగవత స్తోత్రాలన్నీ వున్న 'హితోక్తి' గ్రంథంలో దధివామన స్తోత్రం కూడా వుంది.*

దధివామన దానాన్నెలా చెయ్యాలంటే బార్లిమొక్కంత పొడవున్న విగ్రహాన్ని త్రివిక్రమావతారం ఆకారంలో మలచి గుండ్రంగా, నీలంగా, చూడగానే ఆనందం కలిగించేలా తయారుచేసి దానిని రెండు చక్రాలపై అయిదుగోపురాల మధ్య పెట్టాలి. అడవి పూలతో అలంకరించాలి. దీనిని దానంచేస్తే లక్ష్మీనారాయణ విగ్రహాన్ని దానం చేసిన ఫలం దక్కుతుంది.

అలాగే ఈ తీర్థంలో మునకలిడి విష్ణు (వరాహ) విగ్రహాన్ని, భూవరాహ విగ్రహాన్నీ దానం చేస్తే గొప్ప భవిష్యత్తుంటుంది.

శ్రీనివాసునికి ఈశాన్యంలో ఒక పరమ పవిత్రమైన తీర్థమొకటుంది. దీనిపేరు రుద్రతీర్థం. పరమశివుడిక్కడికి వచ్చి శ్రీనివాసుని పూజిస్తుంటాడు. శ్రీనివాసుడక్కడికి వెళ్ళి స్నానం చేసి శివునికి నమస్కరించి మరలుతుంటాడు. ఇక్కడే లక్ష్మీ నృసింహస్వామి విగ్రహం కూడా వుంది. గండ (గండిక) శిలతో ఇటువంటి ప్రతిమను తయారు చేసి దానమిచ్చిన వారికి మంచి భవిష్యత్తుంటుంది.

ఈశాన్యానికీ తూర్పుకీ మధ్యలో బ్రహ్మతీర్థముంది. తూర్పువైపు ఇంద్రతీర్థముంది. ఇక్కడ స్నానంచేసి శాలగ్రామాన్ని బ్రాహ్మణునికి దానమిస్తే బ్రహ్మహత్యాపాతకం నశిస్తుంది. (పశ్చాత్తాపానంతరమే) ఇక్కడే సీతారామ విగ్రహముంది. దీనిని సేవించిన వారిని కలి ఏమీ చేయలేడు. స్వామికి ఆగ్నేయంలో వహ్నితీర్థముంది. అక్కడ వాసుదేవ విగ్రహాన్ని గాని శాలగ్రామాన్ని గాని దానమిచ్చిన వారి జోలికి కలిపోలేడు. ఇలా అన్ని దిక్కులలో మూలలలో పవిత్ర తీర్థాలున్నాయి. అక్కడి కాయాదిక్పాలకులు వచ్చి స్వామిని పూజిస్తారు.

స్వామి పుష్కరిణి పరమపవిత్రమైన తీర్థం. సాక్షాత్తు గంగమ్మతల్లే ఇక్కడికి వచ్చి శ్రీనివాసుని దర్శించి పుష్కరిణిని పవిత్రీకరించి వెళుతుంటుంది. ఈ తీర్థంలో స్నానంచేసి శ్రీనివాసుని దర్శించి కన్యాదాన సహితంగా కూతురి పెండ్లి చేసిన వారు సకుటుంబంగా సర్వసుఖాలనూ పొందగలరు. ఇక్కడ శాలగ్రామదానం చేసిన వారికి అక్షయ ఫలాలుంటాయి. స్వామిపుష్కరిణిలో మంత్ర సహితంగా స్నానం చేసి బ్రాహ్మణులకు శయ్యాదానం చేస్తే గొప్ప సత్ఫలితాలుంటాయి. ఇక్కడ కపిలధేనువును దానమిచ్చిన వారికి స్వర్గప్రాప్తి వుంటుంది. ఇక్కడ నివాసముండి ఈ పుష్కరిణిలో ఇరువది యొక్క రోజులపాటు ఇరు సందెలలో స్నానం చేసి పూజించిన వారికి శ్రీనివాసుని దర్శనమే లభిస్తుంది.'

జాంబవతికి తీర్థయాత్రలో ఒక నది కనిపించింది. గురువు గారి నడుగగా ఆయన ఇలా చెప్పారు.'అమ్మా! ఇది సర్వ పాపవినాశకరమైన నందానది. ఇందులోస్నానం చేసిన వారి పాపాలను కడిగేసి వారికనులముందే ఇది నల్లగా మారిపోతుంది. వెంటనే శ్రీనివాసుని

ప్రార్థించి మరల స్వచ్ఛత నొందుతుంది. దీనికి గొప్ప చరిత్రవుంది. గురుపత్నీ గమనం వల్ల కళంకితుడైన చంద్రుడూ, అహల్యను అన్యాయంగా అనుభవించి శప్తుడైన ఇంద్రుడూ, మద్యపాన దోషం వల్ల పాపియైన శుక్రుడూ, బ్రహ్మతలను నరికేసి బ్రహ్మహత్యా పాతకానికి గురియైన రుద్రుడూ, దానమిచ్చిన ద్రవ్యాన్ని మరల గ్రహించి తప్పు చేసిన నాగరాజూ, బంగారాన్నపహరించి కీర్తి చెడిన బలిచక్రవర్తీ, నైమిషారణ్యంలో పురాణం చెప్తున్న సూతమహర్షి తనకు లేచి నిలబడి నమస్కారం చెయ్యలేదని అలిగి ఆయన తలను నరికేసిన బలరాముడూ ఈ నందా తీర్థానికి వచ్చి స్నానం చేసి ప్రాయశ్చిత్తం చేసుకొని శ్రీనివాసుని పూజించి ఆయన కరుణించిన తరువాతనే మరల విష్ణుదర్శనానికి అర్హులయ్యారు.

(28వ అధ్యాయంలో ఇతర దేవతలంతా దండగ అన్నట్లుగా ఒక సంవాదం చెప్పబడింది. అనువాదంలో దానిని వదలివేయడం జరిగింది)★

## అధ్యాయం - 29 (అదనం)

'గరుడా! బ్రహ్మనుండి ధర్మముద్భవించగా ఆ ధర్మమే సూర్యునిలో ప్రవేశించి ఆతని పుత్రునిగా ఉదయించడం జరిగింది. ఆ పుత్రుడే యమధర్మరాజు. ఈయమధర్మరాజుకి నిజానికి రెండు పేర్లు. పాపులకు శిక్ష వేయునపుడాయన యమరాజు, పుణ్యులను ఊర్ధ్వలోకాలకు పంపించు నపుడాయన ధర్మరాజు.

హరిపాదాలనుండి పుట్టిన గంగ నాలుగు రూపాలలో ప్రసిద్ధి చెందింది. జనేంద్రుడను ప్రముఖ దేవ వైద్యునికి భార్యగా ఆమె అభిషేచని అనే పేరుతో జన్మించింది. సుషేణుడను వానర వీరునికి భార్యగా సుషేణ నామాన్ని ధరించింది. శంతనుని భార్యగా గంగయను పేరుతోనే నివసించింది. మండూకుని పత్నిగా మండూకిని అనే పేరుతో ప్రసిద్ధిగాంచింది.

చివరగా మనిషి ఏ సమయంలో ఏం చేస్తే హరి సంతోషిస్తాడో విను.

పొద్దున్నే మేల్కొన్నాలి. లేస్తూనే హరినారాయణా అనాలి. తరువాత తులసికి నమస్కరిస్తూ లక్ష్మీ విష్ణులనూ, అపానవాయువు పోయేవేళ కేశవనామాన్నీ, శరీరాన్ని

---

★*మన తిరుపతి స్వామి కథలా లేదుకదా! ఆ మాటే వాడబడలేదు. పైగా పద్మావతి వూసేలేదు. ఎందుచేతంటే 'తిరు' అనేది అరవమాట. శ్రీ కృష్ణుని కాలం నాటికి ఆ భాష స్వరూపమెలా వుండేదో తెలియదు. అలాగే శ్రీ కృష్ణుని కాలం నాటికింకా పద్మావతమ్మ, ఆకాశరాజు శ్రీనివాసుని జీవితంలో ప్రవేశించివుండరు.*

★*సూతమహర్షి చిరంజీవి కాబట్టి వెంటనే అశ్వనీ దేవతలు దిగివచ్చి ఆయన తలను అతికించారు. బలరాముని మాత్రమూ వృత్తిరీత్యా బ్రాహ్మణుడైన సూతమహర్షిని సంహరించినందుకు బ్రహ్మహత్యా పాతకం ముట్టుకుంది.*

★*ఈ సందర్భంలోనే రేణుక అనే దేవత పేరు రెండు మార్లు వచ్చింది. ఈమె జమదగ్నిభార్యకాదు. ఇప్పటికీ కొందరు కోయదొరల్లో రేణుకాదేవి ఉపాసకులున్నారు.*

నీటితో పరిశుభ్రం చేస్తూ త్రివిక్రమ నామాన్నీ, దంత ధావన వేళ హరి, చంద్రనామాలనూ, నోరు కడుక్కుంటూ మాధవనామాన్నీ, ఆవును నిమురుతూ గోవర్ధనగిరిధారి నామాన్నీ, పాలు పితుకుతూ గోపాల వల్లభనామాన్నీ, దూడపాలుతాగుతున్నపుడు బాలకృష్ణ నామాన్నీ, మజ్జిగ చిలుకుతున్నపుడు హరినామాన్నీ, సాయం సంధ్యలో రామనామాన్నీ, దైనిక శ్రాద్ధవేళలో అచ్యుత, అనంత, గోవింద నామాలనూ, ప్రాణాయామంలో అనిరుద్ధ నామాన్ని, నీటిని అగ్నికి సమర్పిస్తున్నపుడు వాసుదేవనామాన్నీ స్మరించాలి.

ఇలా ఈ పుష్కరిణీ ప్రసంగాన్నీ, హరినామస్మరణ వేళలనూ విన్నవారు ధర్మం వైపు ఆకర్షితులవుతారు.

శ్రీకృష్ణదేవునికి నమస్కరించి ఈ క్రింది శ్లోకాన్ని, తన పేరిటనున్న పురాణంలో ప్రముఖమైనదాన్ని చదువుతూ గరుడుడు వైకుంఠం వైపు సాగిపోయాడు.

అదే శ్లోకాన్ని పఠించి సూతమహర్షి శౌనకాదులనాశీర్వదించి తన మార్గంలో వెడలిపోయాడు.” ఆ శ్లోకం ఇది.

**అచ్యుతం కేశవం రామనారాయణం**
**కృష్ణదామోదరం వాసుదేవం హరిం ।**
**శ్రీధరం మాధవం గోపికావల్లభం**
**జానకీ నాయకం రామచంద్రం భజే ॥** **(II - 8 - 17)**

**సమగ్ర గరుడపురాణం సర్వం సంపూర్ణం......**

*సర్వేజనా సుఖినోభవన్తు....*